

# జెమిని వారి
# అపూర్వ సహోదరులు

(తెలుగు)

భావోద్రేకముతో కూడిన
మహోత్తర చిత్రము......

జనవరి **14** తేదీ నుంచి

ఆంధ్రదేశములో, హైదరాబాదు సంస్థానములో
అన్ని ముఖ్య కేంద్రములలో విడుదల....





డిసెంబర్ **29** మొదలు

ఆంధ్రదేశమంతటా విడుదల....

వాహినీ వారి

# గుణసుందరి

కథ.

అనుక్షణము ప్రేక్షకులను
కవ్వించి నవ్వించే
అపూర్వ జానపద చిత్రము..!

డైరెక్టర్
కె. వి. రెడ్డి, B.Sc (HONS)

అసోసియేట్ డైరెక్టర్
కె. కామేశ్వరరావు, B.A.

విజయవాడ... సరస్వతి
గుంటూరు.... సరస్వతి
తెనాలి........ రత్నా
ఏలూరు.... పాండురంగా
మచిలీపట్నం... మినర్వా
రాజమహేంద్రవరం.. జయ
కాకినాడ... క్రౌన్
విశాఖపట్నం... సరస్వతి
విజయనగరం... కృష్ణా
బళ్లారి..... రాయల్
కర్నూలు... గాంధీ
బెంగుళూర్... మూవీల్యాండ్ & శ్రీ
మైసూర్... చాముండేశ్వరి
షోలాపూర్... కరోడ్

# జీవిత భీమా

భర్త యొక్క కర్తవ్యము

భార్య యొక్క హక్కు

బిడ్డయొక్క స్వామ్యాధికారము

## మైసూరు జీవిత భీమా శాఖ

33 సంవత్సరములనుండి. మంచి నమ్మకమైన ఘన

సేవా సహాకారములను గర్వముతో చాటుచున్నది.



ఉచితమైన హామీకి—మిక్కిలి అనుకూలమైన ప్రీమియములను - తక్కువ వ్యయ
నిష్పత్తికి—శీఘ్ర పరిష్కారమునకు—సులభముగా ఋణమిచ్చు ఏర్పాటులను

మేము ఉత్తరవాదులము



భారతదేశములోనెల్లా అత్యధికమైన సంవత్సర బోనస్

1000 కి 18 రూపాయలు



సర్వజనీయమైన శాఖలో భీమాచేయుటకు ఈ దినమే నిర్ణయింపుడు

## మైసూరు ప్రభుత్వ భీమా శాఖ బెంగుళూరు

# మీ ఆరోగ్యానికి

# సేవించండి




ఆటగాళ్లకు, దుర్బలులకు కూడా,
బోర్న్‌వీటా ఎక్కువ మంచితనాన్ని,
ఎక్కువ పుష్టిని కలుగజేస్తుంది కాబట్టి,
ఎక్కువ శక్తినికూడా కలుగజేస్తుంది.
దీని చాకొలేట్ రుచిని పసిబిడ్డలు కోరు
తారు. ఒక కప్పుడో, గ్లాసుడో వేడి లేక చల్లని
పాలలో
రెండు టీస్పూ
నులు పొద్దున్న
సాయంకాలము
తీసుకోండి.




— ఆరోగ్యవృక్షం —




CFY I TEL

# కాడ్బరీస్ బోర్న్-వీటా

కాల్షియం మరియు వి, డి విటమినులతో నిండి ఉన్నది.

కాడ్బరీ - ఫ్రై (ఇండియా) లిమిటెడ్,

P. B. 1417, బొంబాయి - P. B. 251, కలకత్తా - P. B. 1795, మద్రాసు

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: జనవరి '50 :: సంచిక 9





సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి యల్.,

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 6 జనవరి 1950 సంచిక 9

# ప్రపంచ శాంతి

మూడు దశాబ్దముల అతిస్వల్ప పరిమితికాలములో, రెండు ప్రపంచ మహా సంగ్రామములు, కోటానుకోట్ల అమాయక ప్రజానీకాన్ని తమ మారణాస్త్ర భీషణాగ్నిజ్వాలల కాహుతి జేశాయి. ఈ మంటలవేడి ఇంకనూ పూర్తిగా చల్లారనైనా లేదు—అప్పుడే, మూడవ ప్రపంచ సంగ్రామ సూచనలు, కారు మబ్బులవలె, నలుదిక్కుల నావరించి, ప్రజాహృదయాలలో భీభత్స అంధకారాన్ని, అశాంతి ప్రళయాన్ని పొడచూపించుచున్నవి. దురాక్రమణ నిరోధన, శాంతిస్థాపన అనే విశిష్ఠ ఆదర్శ ప్రయోజన సిద్ధికై, యుగయుగాంతరముల పరిశోధనా ఫలమైన మానవుని అమూల్య విజ్ఞానాన్ని, విశేషవిత్తాన్ని, పాశవబల నిర్మాణానికి వినియోగిస్తూ, యుద్ధనిర్మూలన యనే పేరుతో, యుద్ధమార్గగామిను లయ్యేడి, విపరీత దురవస్థ వివిధదేశ ప్రభుత్వాలకు సంక్రమించింది. ప్రపంచ శాంతి, సామరస్యస్థాపనకై, ప్రథమ సంగ్రామానంతరము నేర్పడ్డ నానారాజ్య సమితి, ద్వితీయ సంగ్రామము నాపలేకపోయినది. ద్వితీయ సంగ్రామానంతరము అదే ఫలాపేక్షతో నేర్పడ్డ ఐక్యరాజ్యసమితి ప్రయోజకత్వము అంతమాత్రము లోనేయున్నది. వివిధరాజ్యాలవారు శాంతి మంత్రములు పఠించుచునే, స్వరక్షణయను నెపముతో సేనలను విపరీతముగ పెంచుచున్నారు. మహాత్ముని అద్వితీయ నాయకత్వము క్రింద అహింసా విధానములో స్వాతంత్ర్యమును సంపాదించిన భారతీయులమగు మనకుకూడ ఈ అస్త్రబలమును సమకూర్చుకోవలసిన దుర్గతి పట్టినదనియు, వర్తమాన ప్రపంచ వాతావరణలో దీనికి వేరు పరిష్కార మార్గము దృగ్గోచర మగుట లేదనియు, సేవాగ్రామ్‌లో, డిసెంబరు 25వ తేదీని ప్రపంచశాంతి మహాసభలో ఉపన్యసిస్తూ, తన అసహాయతకు వాపోయినాడు బాబురాజేంద్ర ప్రసాద్. పఠించు మంత్రానికి, అనుసరించు విధానానికి, ఆదర్శానికి, తత్పరిణామానికి, గల పరస్పర వైరుధ్యమునకు, మానవుని దృక్పథములో ఏదే నొక గొప్పలోపముండి యుండవచ్చుననే ఊహను వ్యక్తపరచింది రాజకుమారి అమృతకౌర్, శాంతినికేతనములో, ప్రపంచ సౌమనస్య సభ ఉపన్యాసములో.

ఈ విషమ పరిస్థితి ఎందుల కేర్పడినదంటే, మనకు ప్రవక్తలుగా, మార్గ దర్శకులుగా మనము కొలుచుచున్న బుద్ధదేవునియొక్కయు, ఏసుక్రీస్తుయొక్కయు, మన కండ్లముందు సత్య

# ప్రపంచ శాంతి

అహింసల విజయమును నిరూపించిన గాంధీ మహాత్ముని యొక్క యుపదేశవచనములను పూర్తిగా అవగాహనము జేసికొని, అసలు జరుగవలసిన మనః పరిపాకము మనకు కలుగించుకొననే పోవుటవలన. ఎంతవరకు, మన స్వార్థమున కడ్డుతగులు నేమోయని ఎదుటి వ్యక్తిని శంకించుచు, ఈ ఆస్తిను అస్త కొనుటకు బాహ్యపరికరములను సేకరించుటలో, ఇంతకన్న అనేక వేలరెట్లు మన అభ్యుదయము నరికట్టే అంతఃశ్శత్రువులైన అరిషడ్వర్గములను విస్మరించుచున్నాము. ఈ శత్రుసంరోధము ఆత్మశక్తివలననే కాక, ఇకయే ఇతర పాశవశక్తికిని సాధ్యమైనది కాదు. కేవలము ఆధ్యాత్మిక దృష్టి, భగవద్భక్తివలననే, పరాజయమును, పరాక్రమణ భయమును నెరుగని ఆత్మశక్తి లభించగలదు. ప్రతి వ్యక్తియు తన స్వయంకృషివల్ల నీ ఆత్మశక్తిని పొందినప్పుడే, సత్య అహింసల నిజస్వరూపము స్వానుభవ విదితమై, స్వార్థము నశించగలదు. అట్టి వ్యక్తులో మిగిలినదంతయు పరార్థమే గనుక, మనోవాక్కర్మలచే ప్రేమను, త్యాగమును, క్షమను, స్థైర్యమును వెదజల్లుచునూ, పరిపూర్ణమైన శాంతిని అనుభవించగలుగుతాడు. ప్రపంచ శాంతిని గోరుచున్నామనే ప్రభుత్వములలో ప్రాముఖ్యత గల వ్యక్తులు, ఇట్టి ఆత్మపరిశోధనచే సిద్ధిపొందిననాడుగాని, అస్త్రసన్యాసము, యుద్ధ నిర్మూలన సాధ్యముగావు. ఇంతవరకు గగన కుసుమముగా దోచెడి ప్రపంచ శాంతి, ఆనాడు మానవునికి హస్తగతము కాగలదు.



## అడయారులో,

## స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల,

డిసెంబరు 28-వ తేదీకి నిర్ణయించిన శంకుస్థాపన మహోత్సవము, కారణాంతరములచే జనవరి 7-వ తేదీ, శనివారం, 6 గంటలకు వాయిదా వేయబడ్డది. అనుకొన్న ప్రకారము, భారత వైద్యశాఖ మంత్రి శ్రీమతి రాజ కుమారి అమృతకౌరుగారు శంకుస్థాపన చేయుదురు. తామెల్లరు విచ్చేసి ఈ శుభకార్యమును జయప్రదముగా జరిపించ వలసినదిగా కోరుచున్నాము.

ప్రస్తుతంలో, యిట్టి సంస్థా నిర్మాణముయొక్క ఆవశ్యకతనుగూర్చి విజ్ఞులకు వేరు విన్నప మనావశ్యకము. నిర్మాణము బహుభారమైన కార్యమనికూడ విజ్ఞులెరుగకపోరు. అయితే, సహృదయుల సహకారముతో సాధ్యము కానిది లేదు గనుక, ధన విరాళరూపమైనట్టియు, క్రియారూపమైనట్టియు సహకారమునే మేము గోరునది.

ఇతః పూర్వము మేము కృతజ్ఞతతో స్వీకరించిన విరాళములను ప్రచురించియే యున్నాము. తాము కూడ తమ విరాళములతో మమ్ము ప్రోత్సహించవలెనని మనవి.

ఈ సందర్భములో, జనవరి 8-వ తేదీని, విక్టోరియా పబ్లిక్ హాలులో, మా సభ్యురాండ్రు, విద్యార్థినీ బృందము, ఒక చా చా ప్రదర్శనమును ఏర్పాటు చేయుచున్నారు. దానికి వసూలగు ధనము ఉచిత వైద్యశాలకు వినియోగింప బడును. ప్రదర్శనమునకు విచ్చేసి, మీ అభిమానమును ప్రకటించండి.

దుర్గాబాయి.

ఆంధ్ర మహిళా సభ.

# పిల్లల శిక్షణ :: స్తన్యమాన్పడం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

ఒక ఏడాదివరకూ బిడ్డకు స్తన్యమిచ్చుట ఎంత అవసరమో, ఏడాది నిండు నప్పటికి, పోతపాలకు, వేరు ఆహారమునకు అలవాటు చేయుటకూడ అంత అవసరమే. ఈ సందర్భములో తల్లి అవలంబించవలసిన పద్ధతులను రచయిత యిందు విపులీకరించినారు. సం॥

---

బిడ్డకు స్తన్యం మాన్పించుట అనేది ఒక గడ్డు సమస్య. అందులో, బిడ్డకు ఒక సంవత్సరంపాటో, లేదా, కనీసం ఎనిమిది తొమ్మిది నెలల వరకైనా పాలివ్వకుండ హఠాత్తుగా, ఒక్కమాటే మాన్పించటం అనేది చాల కష్టమైన కార్యం. చంచాతోనో, పాల శంఖుతోనో, పాల బుడ్డీతోనో పాలు త్రాగేలాగు అలవాటు చేసినప్పటికీ, బిడ్డ ఆకలి తీరుతుందిగాని తనివితీరదు. తల్లి అంకపాళిలో ఆప్యాయంగా పడుకొని స్తన్యపానం చేస్తూ, దానితో పాటు తల్లి ప్రేమను చూఱగొనే అవకాశం బిడ్డకు లభించదు. కాబట్టి, దానికి మానసికంగా సంతృప్తి కలుగదు. తల్లి ఒడిలో పడుకొన్నప్పుడు కలిగే సౌఖ్యం, తల్లి ముఖంలో వ్యక్తమయ్యే వాత్సల్యం, తన ఆటలవలన తల్లి ముఖంలో కనబడే చిఱునవ్వు, ఆమె వాత్సల్యపూరితమైన కంఠస్వరము, మున్నగు వానిని గ్రహించగల ఈడు వచ్చినపుడు బిడ్డకు స్తన్యపానం మాన్పించటం సులభసాధ్యం. కాని, ఇట్టి గ్రహణశక్తి అభివృద్ధి కాకముందు మాన్పించుట అతి కష్టమైన కార్యం. ఇందులో, తల్లి స్తన్యపానం సర్వ విధాల సౌఖ్యదాయకంగా గోచరించే కాలంలో తటాలున మాన్పించటం అనేది ఎంత క్రూర కార్యమో చెప్పటానికే అలవి గాదు. తల్లి బిడ్డకు పాలివ్వక పోవటం అనేది బిడ్డకు తన ప్రేమ నివ్వకపోవటం అన్నమాటే. తత్ఫలితంగా బిడ్డ మానసికంగా చాల బాధపడటమేగాక, దాని మానసిక ప్రవృత్తులలో మార్పుకూడ కలుగుతుంది. మానసికాభివృద్ధి అరికట్టబడుతుంది. కనుక, ఏ కారణంలేకనే, తల్లి తన బిడ్డకు పాలివ్వక పోవటంగాని, ఒకేమాటు మాన్పించటంగాని సంభవిస్తే, తల్లి తన బిడ్డకెంతో కీడు చేసినట్టు అవుతుంది. ఈ విషయాన్ని తల్లి గుర్తుంచుకోవాలి. అవసరమున్నంత కాలం, అనగా, కనీసం పదినెలల పాటైనా, బిడ్డకు పాలివ్వాలి. తరువాత, క్రమేణ, నెమ్మదిగా మాన్పించాలి. అనగా స్తన్యపానం మాన్పించటం అనేది క్రమేణ జరగాలి, కాని ఒక్కమాటే, తటాలున మాన్పించకూడదన్న మాట.

మొదటినుండే, అనగా ఒకటి రెండు నెలల ఈడులోనే, శిశువుకు అప్పుడప్పుడు చంచాతో నీళ్లు త్రాగించుతూ అలవాటు చేయాలి. బిడ్డ తల్లివద్ద పాలు త్రాగుతున్నప్పుడు

కూడ అప్పుడప్పుడు పాలను చంచాతోనో, పాల సీసాతోనో కొద్దిగా త్రాగేలాగు అలవాటు చేయాలి. అలాంటి సమయంలో తల్లి బిడ్డను తొడలమీద పడుకోబెట్టుకొని, వాత్సల్యాన్నీ, సంతోషాన్నీ వ్యక్తి పరచాలి. ఇలా అప్పుడప్పుడు పాల బుడ్డీతోనో, చంచాతోనో, పాలను త్రాగేలాగు చేస్తూ, క్రమక్రమంగా, నెమ్మదిగా స్తన్యపానాన్ని మాన్పించాలి. తల్లి తన పాలను పూర్తిగా మాన్పించి, పాల బుడ్డీతో మాత్రం త్రాగించేటప్పుడు బిడ్డ చెంతనే వుండి లాలన పాలనచేస్తూ తన వాత్సల్యాన్ని వెలిబుచ్చుట అవసరమనే విషయాన్ని మరవకూడదు. సాధారణంగా తొమ్మిది పది నెలల బిడ్డలకు స్తన్యపానం మాన్పించుట అంత కష్టమైన కార్యం కాదు. ఎందుకనగా, సుమారు తొమ్మిది పదినెలల కాలం బిడ్డ తల్లిపాలు త్రాగుటచేత దాని వాంఛ చాలవరకు తృప్తిచెంది వుంటుంది. ఈ మధ్య తల్లిప్రేమ కావలసినంత లభించి సంతృప్తి కలిగి వుంటుంది. ఇంతేగాదు, ఇతర సమయాల్లో సయితం తల్లి వెలిబుచ్చే ప్రేమను క్రమేణ గ్రహించే శక్తి అభివృద్ధి చెందుతూ వస్తుంది. తల్లి పాలను పూర్తిగా మానివేసినప్పటికీ తనకు తల్లి ప్రేమ సర్వదా లభిస్తుందనే గట్టి నమ్మకం, నిబ్బరం ఏర్పడుతవి.

అయితే, బిడ్డలందరూ ఒకే విధమైన స్వభావంగల వారుగా వుండరు. కొందరికి స్తన్యపానమును మాన్పించుట అంత కష్టముండదు. మరి కొందరికి నెమ్మదిగా, క్రమక్రమంగా మాన్పించుట అవసరం. అంటే, తల్లి తన బిడ్డ స్వభావాన్ని ఎఱిగి మెళకువతో మెలగాలన్న మాట. అలా చేయకపోతే, బిడ్డలు మానసికంగా బాధలుపడి వారి మానసికాభివృద్ధి కుంటుబడుతుంది. కొన్నివేళల్లో, వెంగవల్ల, శారీరకంగాకూడ బాధ కలుగవచ్చును. కనుక తల్లి కొన్ని ముఖ్య విషయాల్ని గుర్తుంచుకొనుట అత్యవసరం.

1. తనకు వ్యాధివల్లనో, నీరసంవల్లనో బిడ్డకు స్తన్యమివ్వకూడదని వైద్యులు నిరోధించిన సందర్భంలో తప్ప, తల్లి తప్పనిసరిగా తన బిడ్డకు స్తన్యమిచ్చుట అవసరం.

2. ఒకటి రెండు నెలల బిడ్డకే చంచాతో పాలను, నీళ్లను అప్పుడప్పుడు త్రాగించుతూ అలవాటు చేయాలి.

3. తటాలున స్తన్యపానం మాన్పించకూడదు. క్రమేణ, నెమ్మదిగా మాన్పించాలి. అనగా, కొన్ని పూటలు స్తన్యమిస్తు మరికొన్ని పర్యాయాలు పాల బుడ్డిలో లేక చంచాలో పాలు త్రాగించుతూ రావాలి. నాలుగైదు నెలలు ఈడు రాగానే, కొన్నిసార్లు అయినా పాల బుడ్డీతో త్రాగే అలవాటు చేయాలి. క్రమక్రమంగా ఎక్కువ పర్యాయాలు పాల బుడ్డీతో త్రాగించాలి.

4. కనీసం ఎనిమిది తొమ్మిది నెలల పర్యంతం బిడ్డకు తల్లిపాలు అత్యవసరం.

5. బిడ్డకు పాలబుడ్డీతో పాలను త్రాగించే సమయాల్లో, తల్లి బిడ్డను తన తొడమీద, లేదా, ప్రక్కన పడుకోబెట్టుకొని, వాత్సల్యాన్ని కనబరుచుతూ, లాలించుతూ త్రాగించాలి. కాని, పాల బుడ్డిని బిడ్డనోటికందించి, ఒంటరిగా విడిచి లేచి పోకూడదు. ఇది చాల క్రూరమైన కార్యమని చెప్పక తీరదు. అలా చేయటంవల్ల బిడ్డ మానసికంగా చాల బాధపడి పోతుంది. దాని అభివృద్ధి కుంటుబడుటేగాక కొన్ని లోట్లు కూడ ఏర్పడుతాయి.

6. బిడ్డలందరి స్వభావం ఒకే రీతిగ వుండదు. తల్లి పాలు మాన్పించటంలో కొందరు బిడ్డలకు మానసికంగా చాల బాధ కలుగుతుంది. కొందరు అంత బాధ పడరు. అంచేత తల్లి తన బిడ్డ స్వభావాన్ని ఎఱిగి మెళకువతో మెలగాలి. అనగా, క్రమ క్రమంగా, జాగ్రత్తగా మాన్పించాలి.

7. ఇక పాల బుడ్డినుండి పాలగిన్నెకు మార్పుటంకూడ నెమ్మదిగా, క్రమక్రమంగా జరగాలి. ఒక్కమాటే జరగకూడదు. బిడ్డ అలా గిన్నెతో త్రాగకపోతే కొందరు తల్లులు, పాలబుడ్డిని దాచి, పగిలిపోయిందని చెబుతూ గిన్నెలో త్రాగమని నిర్బంధించుతారు. మరికొందరు బిడ్డ ఎదుట పాలసీసాను పగలగొట్టి గిన్నెతో త్రాగమని బలాత్కారించుతారు. ఈ విధమైన తల్లి అజ్ఞానం, మోటుతనం వలన బిడ్డ చెప్పరాని బాధలను అనుభవించుతుంది.

అంతేగాదు బిడ్డ స్వభావంలో అనేక లోట్లు మానసిక వ్యాధులు ఏర్పడుతవి.

ఇంగ్లాండు మున్నగు పాశ్చాత్య దేశాల్లోని మానసిక వ్యాధులకు చికిత్సచేయు వైద్యశాలల్లో పరిశోధన చేయగా, అనేక మానసిక వ్యాధులు క్రమక్రమంగా గాక, తటాలున స్తన్యపానం మాన్పించినందుచేత, పాల సీసాను బిడ్డ నోటికందించి ఒంటరిగా విడిచి తల్లులు తమ తమ పనుల మీద వెళ్లిపోవుట చేత, అన్నిటికన్న పాల బుడ్డిని దాచివేసి, లేదా బిడ్డ ఎదుట పగలగొట్టి, గిన్నెతో పాలు త్రాగమని నిర్బంధించినందుచేత, ఏర్పడినవని తేలింది. కాబట్టి తల్లి ఈ విషయంలో ఎంతో విచక్షణ నుపయోగించి మెళకువతో ప్రవర్తించాలి అనే విషయం విదితమవుతుంది.

మరొక ముఖ్యవిషయం :—

కొందరు తల్లులు బిడ్డకు స్తన్యమిచ్చుట వలన తమకు ఆనందంగా వుంటుందనీ, బిడ్డ తమ పాలను త్రాగుతున్నంత కాలము తమకు తిరిగి గర్భంరాదనీ ఎంచి బిడ్డకు సంవత్సరం పైబడి రెండేళ్లు దాకకూడ స్తన్య మిచ్చుట కలదు. అది చాల పొరబాటు. బిడ్డకు తొమ్మిది పది నెలలవరకు స్తన్యమిస్తే చాలును. పైబడి ఇస్తే, ఒక ఏడాదిదాక ఇవ్వవచ్చునేగాని అంతకన్న ఎక్కువకాలం అనవసరం. అలా ఇచ్చిన యెడల మానసికాభివృద్ధికి మంచిదికాదు సరేగదా, శారీరకంగా కూడ అంత మంచిది కాదు. ఏలాగంటే, తల్లిపాలు త్రాగునంతకాలం బిడ్డ ఇతర ఆహారాన్ని పుచ్చుకోదు. తల్లిపాలయందుండు మక్కువ మరే పదార్థంమీద దాని కుండదు. ఒక సంవత్సరం నిండిపోయిన బిడ్డకు కేవలం తల్లిపాలు చాలవు. దాని శరీరపోషణ కవసరమైనంత పుష్టికర పదార్థాలు చాలవు. అంచేత, స్తన్యం మాన్పించి ఇతర ఆహార పదార్థాలు పెట్టాలన్నమాట. ఇక మానసిక జీవితం విషయంలో, బిడ్డ ఎప్పుడూ తల్లిమీద ఆధారపడుతుంది. స్వయంగా ఆడుకోటంగాని, స్వేచ్ఛగా తోటి పిల్లలతో కలసి మెలసి ఆడుకోటంగాని, చేయదు. తత్ఫలితంగా బిడ్డ మానసికాభివృద్ధి కుంటుబడుతుంది. ఒక సంవత్సరం, సంవత్సరం ఆరునెలలు వయస్సున్నప్పటికీ అది కొన్ని నెలలు శిశువులాగు ప్రవర్తిస్తుంది కూడాను.

బిడ్డల విషయంలో అతి సున్నితంగా ప్రవర్తించాలి :—

బిడ్డ నెత్తుకోవటం, పడుకో పెట్టటం మున్నగు విషయాల్లో తల్లి అతి సున్నితంగా ప్రవర్తించాలి. బిడ్డకు దుస్తులు వేయటంలో, తీయటంలో, బిడ్డ కెంతమాత్రం బాధ కలగకుండ అతి జాగ్రత్తగా ప్రవర్తించాలి. మోటుతనంగా చేస్తే, బిడ్డకు బాధ కలగటమేగాక, భయంకూడ కలుగుతుంది. దుస్తులు వదులుగా వుండాలి. అలా లేనిచో తొడిగేటప్పుడు తీసేటప్పుడు బిడ్డ శరీరం కందిపోతుంది. ఆలస్యంకూడ అవుతుంది. బిడ్డ బాధనేలాగు భరించజాలదో అదే విధంగా ఆలస్యాన్నికూడ ఓర్చుకోజాలదు. అసలు బట్టలే లేకుంటే స్వేచ్ఛగా ఆడుకోటానికి అనువుగా వుంటుంది. అలా వుండటం బిడ్డకు ఇష్టం కూడాను. అయితే శీతోష్ణస్థితులనుబట్టి తల్లి విచక్షణతో వర్తించాలి. సాధ్యమైనంతవరకు బిడ్డకు దుస్తులు తొడగకపోవటం ఉత్తమం. శారీరకంగానేగాక, మానసికంగాకూడ బంధింపబడినట్టు బిడ్డ బాధపడుతుంది. అవసరమున్నపుడు మాత్రం వదులుగా దుస్తుల నెమ్మదిగా, సున్నితంగా తొడగాలి. అవసరం లేనపుడు అసలు బట్టలే వేయటం మానివేస్తే బిడ్డ స్వేచ్ఛగా ఆడుకుంటుంది. ఆరోగ్యానికికూడ మంచిది.

(సశేషం.)



# స్వాతంత్ర్య గీతము

❋ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ ❋

జయ జయ భారత జయజననీ!
జయ జయ పావని! విశ్వమణీ!
ప్రాచ్య శిఖరిపై—ప్రభాత సూర్యుడు
స్వాతంత్ర్యోజ్జ్వల—జ్ఞానమహస్సుల
ఉదయమ్మాయె శుభోదయమూ!
మహోదయమూ! సర్వోదయమూ! జయ జయ.

లోక బాంధవుడు ఏకచక్రరథి
విను వీధులలో విజయపతాకల ఉదయం.
భారతవర్ష—ప్రజ్ఞాజ్యోతి
ఆశయఖండ—ఆశాజ్యోతి
ప్రాచీగోళ—బ్రహ్మజ్యోతి
వెలుగిడి ప్రోచెడి—విశ్వజ్యోతి
ఉదయంబాయె శుభోదయమూ!
మహోదయమూ! సర్వోదయమూ! జయ జయ.

గర్భగోళముల మాటునడాగే
కరాళహంతల నుక్కడగించే ఉదయం
ఆకటమాడే ఆపదలొట్టే
చీకటి దొంగల చెండాడించే ఉదయం
చీము నెత్తురు చిక్కగ పిండే
కృపణ స్వశంసుల గీటడగించే ఉదయం! జయ జయ

సర్వసమత్వం సౌభ్రాతృత్వం
ప్రభామాలికల ప్రబోధమిచ్చే ఉదయం.
కన్నుల వెలుగుల కరుణను గురిసే
తిన్నని బాహుల ప్రేమను మెరసే ఉదయం.
హిమాలయమ్ముల వింధ్యనగమ్ముల
రత్నాకరముల—ప్రోజ్జ్వల సుందరరూపం ఉదయం
జయ జయ.

జ్ఞానధనుల విజ్ఞాన ఖనుల ప్ర
జ్ఞానిధుల సుజ్ఞానపు బింబం ఉదయం.
ప్రభాత మంగళ జయ ఘోషమ్ముల
సుధాకలశముల తీర్థములిచ్చే—ఉదయం
జయ జయ.

శాంతిస్వేచ్ఛా సుఖాభ్యుదయముల
దీవనలిచ్చే—తేజోరూపం ఉదయం.
జయజయ భారత జయజయ భారత
జయ జననీ యని జండాయెత్తుడు! ఉదయం.
జయజయ భారత జయజయ జననీ
జయజయ జననీ-మాతా నమో నమో
వందే-వందే ఉదయం జయజయ.



# ఆత్మ విభూతియోగం: స్త్రీల ఆదర్శాలు.

* శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు *

[నేటి రాజ్యాంగంలో స్త్రీల సమస్యలు, సాంఘిక వ్యవస్థలు, అనేక పరిణామాలతో శాసన బద్ధములగుచున్నవి. యీ పరివర్తనంలో భారత నారీలోకం భగవద్గీతాధర్మంతో తమ సంస్కృతిని ఎట్లు పరిశీలించుకోవలెనో యీ వ్యాసం సూచిస్తుంది.]

"కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా"

ఇది భగవద్గీతలోని ఆత్మ విభూతి యోగంలో శ్రీ కృష్ణ భగవానుని వచనము. లోకంలో స్త్రీ, పురుషుడు, అనే విభేదాన్ని, మనం స్థూలంగా శారీరక భేదాన్ని బట్టి మాత్రమే నిర్వచనాన్నిస్తున్నాము. లోకం వ్యవహారంలో కూడ ఈ స్థూల దృష్టితప్ప మరియొక విధమైన దృష్టికి తావు కనుపించదు. కాని, స్థూలమున్నంత మాత్రముననే దాని వెనుక సూక్ష్మ ప్రకృతి, కారణప్రకృతి, తప్పని సరిగావుండి తీరాలని మనుష్య జ్ఞానంతో గోచరింపక పోదు. ఆ సూక్ష్మ కారణ తత్వములయొక్క పరిజ్ఞానం స్థూల వ్యక్తిత్వానికి ఉత్తమమైన వికాసాన్ని పోషిస్తుంది. కావుననే, భగవద్గీత మొదలైన తత్వగ్రంథాలు మనయందు తమ ప్రభావాన్ని చూప గలిగినవి. మనయందేగాదు, కౌరవ పాండవ సేనా మధ్యంలో, స్థూలదృశ్యాన్ని చూసి, పరివేదమును పొందిన భారత వీరుడైన అర్జునుడంతటి వాడికి కూడ మనశ్శాంతిని, తన కర్తవ్యమున విజ్ఞాన వికాసాన్ని, కార్యోత్సాహాన్ని రేకెత్తింపజేసినవి. కావున, సూక్ష్మ కారణ తత్వ పరిశీలనము, స్థూలవ్యవహారానికి ఒక అద్భుతమైన శక్తిని కలిగించి తీరుతుంది. అట్టి సూక్ష్మ కారణ తత్వాలకు, సంబంధించినవే ఈ పైనజెప్పిన ఏడు గుణములు. ఈ గుణములు ఈ గుణశక్తుల యొక్క పునాది బలంచేతనే, స్త్రీ వ్యక్తిత్వ మేర్పడినదని, అట్టి గుణశక్తులే తన ఆత్మకళలని భగవానుడు చెప్పినాడు.

ఈ శారికలోగల గుణములు మనస్సునకు భావనా మాత్రములు—అనగా, మన మనస్సుచేత భావించు కొనుటకు అనువైనవే గాని ఈ గుణములకు స్థూలంగా వ్యక్తిత్వము కనిపించదు. ఈ గుణాలు, గుణభావములనుండి సర్వాంగ సుందరమైన స్త్రీ వ్యక్తిత్వము ఏర్పడినదంటే, అది అలంకార ప్రాయంగాను, లేక పరిహాస ప్రాయంగా కూడ తోస్తుంది. కాని, ఈ స్థూల ప్రపంచం పూర్వం భావరూపమైయుండి, తరువాతనే స్థూలరూపమును పొందుతుందని పదార్థ విజ్ఞానముగల అందరికీ తెలిసిన విషయమే. అది ఎట్లంటే, ప్రపచంలో, ప్రతివస్తువునకు, వస్తుశక్తి అనే ధర్మము సూక్ష్మంగా దాగివుంటుంది. తయారైన వస్తువు మనకు గోచరిస్తుంది గాని, వస్తుశక్తి మాత్రము మనకు ఇంద్రియ గోచరం కాదు. గడ్డిపోచ మొదలుకొని బ్రహ్మవరకుగల చేతనాచేతన వస్తువులలో, ఈ శక్తి ఆ యా వస్తువుల స్థూలరూపాల ద్వారా మనకు కావలసిన ప్రయోజనాన్ని సమకూరుస్తూ వుంటుంది. మనం వాడుకలో కూడ నిస్సారమైన వస్తువును చెప్పునప్పుడు ఈ వస్తువు శక్తి విహీనమైనదని, యీ మనుష్యుడు శక్తి హీనుడైనాడని, చేతనాచేతన వస్తువులను నిరూపించ గలుగుచున్నాము. అప్పుడే స్థూలవస్తువు మన నిరాదరణకు పాత్రమగుచున్నది.

కావున చరాచరప్రపంచంలో శక్తి అని, శక్తికలది లేక కలవాడు అనే విభాగం స్వభావసిద్ధమై ఉన్నదన్న మాట. ఆశక్తి, రూపభేదానికి, నామభేదానికి, అతీతంగా వుండి, రూపనామాలతో కూడిన కేవల భౌతిక ప్రపంచానికి, సుఖ దుఃఖ అనుభవాన్ని, కళావిజ్ఞానాన్ని, తుదకు భగవంతుని స్వరూప తత్వాన్ని బోధించుచున్నది. ఇదే శక్తి మనస్సు ద్వారా, ఇంద్రియముల ద్వారా, శరీరంద్వారా, తన వ్యవహారాన్ని సాగించుచున్నప్పుడు స్త్రీగా ఉండి, ఈ వ్యవహా

మును శాంతించినప్పుడు పరమ పురుషుడైన భగవంతుడుగాను ఐక్యత పొందుచున్నది. అందువల్ల వ్యవహార కాలంలో, స్త్రీ పురుష భేదం ఉండి, వ్యవహార శాంతియందు, ఈ స్త్రీ పురుషులు ఏకరూపులై ఒక్కటే తత్వమై, ఈ లోకమునకు అతీతమైన ఆనంద స్వరూపులగుచున్నారు. వ్యవహార కాలమందును, పరమార్థ అనుభవమందును, ఈ భిన్న ప్రకృతుల యొక్క ఐక్యసమన్వయమే ఆనంద పర్యవసానమును మనకు కలిగించు చున్నది. ఈ భిన్న తత్వములనే పురాణములు, ఇతిహాసములు, పార్వతీ పరమేశ్వరులనీ, లక్ష్మీనారాయణులనీ, వాణీబ్రహ్మలనీ, త్రిమూర్తి స్వరూపముగా చిత్రించుటయే గాక, స్థూలంగా కూడ, ఆ అనాది దంపతులయొక్క ఐక్యతానుబంధాన్ని, మనకు బోధిస్తూ, విష్ణు వక్షస్థలమందు లక్ష్మిని, పరమ శివుని అర్ధాంగమందు పార్వతిని, బ్రహ్మ నాల్కయందు వాణినినీ, ఇమిడ్చి, ఒక అద్భుత చిత్రాన్ని, మనకు ప్రత్యక్షము చేయుచున్నవి. ఈ మూల సూత్రాన్ని మనం దివ్య దృష్టితో పరిశీలించి నప్పుడు ప్రపంచంలోగల భిన్న జాతులు, భిన్న వర్గాలు, భిన్న వర్ణ వ్యవస్థలు, భిన్న మతాలు, ఒక్క కుటుంబమునుండియే, వేరువేరురూపములలో సంతత ప్రవాహరూపంగా ఉన్నట్లు గోచరించగలవు.

ఇట్లు అనాది సిద్ధమైన స్త్రీ పురుష ప్రకృతులలో పై విచారణను బట్టి ప్రపంచమునకు వ్యవహార కాలంలో మిక్కిలి సన్నిహితంగా ఉన్నది శక్తియే గాని మరియొకటి గాదు. ఆ శక్తికి ప్రాతినిధ్యం వహించగల్గి నిర్మాణాత్మకంగా, సృష్టికి మిక్కిలి ప్రాధాన్యత వహించగలవారు స్త్రీలు. పురుషుడు ఈ శక్తితో కూడినప్పుడే తాను శక్తిగలవాడగునుగాని, శక్తి విహీనుడైనప్పుడు, వ్యవహారమునకు ఉపయోగించు నట్టి యోగ్యత అతనికిలేదు. దీనినే శ్రీ శంకర భగవత్పాదులు

"శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్"

[అనగా, శివుడు శక్తితో కూడిన వాడగుట వలననే సామర్థ్యము గలవాడగుచున్నాడు.] అని చెప్పియున్నారు. అట్టి శక్తి ప్రాధాన్యముగల స్త్రీలలో కీర్తి, శ్రీ, వాక్కు, స్మృతి, మేధా, ధృతి, క్షమ, అనెడి గుణములే ఆత్మ ధర్మము లనియు, ఈ ధర్మములే తనకు ఆత్మీయములైన కళలనియు, శ్రీకృష్ణ భగవానుడు తన ఉపదేశ వచనమున సెలవిచ్చినాడు. కావున, వేరు వేరు దృక్పథాలతో నిండివున్న విశాల ప్రపంచం, స్త్రీలయొక్క స్వరూప ధర్మాలైన యీ ఏడు గుణములవల్లనే తన వ్యక్తిత్వాన్ని నిల్పుకొనవలసి యున్నది. ఈ గుణములయొక్క ప్రాధాన్యము, బలము, ఇంతింత యని చెప్పుటకు అలవి కాకున్నది. ఈ గుణ విభాగములు ప్రపంచమునకు ఎట్లు రూపాన్ని తీర్చిదిద్దగలవో సూక్ష్మం పరిశీలించిన నాడు మానవసంఘంలో స్త్రీలయొక్క ప్రాధాన్యము, వారి శీల సౌభాగ్యలక్షణం, వారి మాతృతా స్వరూపం, వారి సాత్త్వికత్వం, సంఘంలో వారికిగల ఔన్నత్యం, యెంతగా ఉన్నవో మనకు తెలుస్తుంది.

లోకంలో ఈ పై చెప్పిన గుణాలకు వ్యాఖ్యానాలు, వాదములు, అర్థాంతరనిర్వచనాలు అనేకముఖంగా వున్నాయి. ఇందులో ఒక్కొక్క గుణమునుండి ఎవరి అభిరుచికి తగినట్లు వారు, ఎవరిక్రియా ఉత్సాహమునకు తగినట్లువారు, అర్థకల్పనము చేసికోవటానికి అవకాశాలు లేక పోలేదు. వీటినిగూర్చి మిక్కిలి ప్రాచీన కాలంబులో ఋషులు, స్మృతి కర్తలు, మధ్యయుగములోని సనాతనులమనే వర్గమువారు, నవీన యుగములోని సంస్కరణ వాదులమనే అధునాతనులు, తమ బుద్ధిబలముకొద్ది వివరణలు వ్రాసియున్నారు. ప్రతివిషయమునకు భిన్నార్థములు, భిన్న వాదములు, ఉండటం లోక సహజమే అయినప్పటికి, ఈ వాదములను ఏకీకృత సమన్వయముతో సంఘటిత పరచగల సిద్ధాంతమునకూడా యీ వాదాల లోనే యిమిడివుంటుంది. ఆ సిద్ధాంతాన్ని సౌమనస్యంతో, వ్యక్తీకరించటం, దానిని హృదయంలో అసలు జరుపుకోవడం, మనబుద్ధి శక్తులానికి నిదర్శనములు. అప్పుడే మానవత్వము సార్థకమౌతుంది. ఈ గుణములను క్రమముగా అర్థ నిర్వచనం సంప్రదాయకులు ఇట్లు సూచించారు.

అందు మొదటిదైన కీర్తియనగా, న్యాయాన్యాయముల యొక్క వివక్షణతో, ధర్మ కామంలో "నానా దిగ్దేశీయ లోకజ్ఞాన వినయతా సూచకాఖ్యాతిః" అనగా నానా దేశముల సంస్కృతులయొక్కయు, లోకాంతరము యొక్కయు జ్ఞానమును గుర్తెరిగి, దానిని అమలుజరుపుటచే కలిగిన ఖ్యాతి యని అర్థముల నిర్ణయం.

# ఆత్మ విభూతియోగం, స్త్రీల ఆదర్శాలు

శ్రీ యనగా, ధర్మము, అర్థము, కామము, శరీరశోభ, తేజస్సు, వీటి యొక్క సముదాయము అని అర్థము. లోకంలో, అర్థకామములకు, శరీరశోభకు, హెచ్చు ప్రాధాన్యమిచ్చి దీనినే సిరి, సంపదఅని మురిపెంతో గర్వాతిశయము పొందుట పరిపాటిగానున్నది. కాని, ఈ సంపదలను అనుభవించుటలో పదేపదే ధర్మము, నీతి, వివేకము గోచరించాలి. ఈ వినియోగం తెలిసిన వారే సౌభాగ్యవంతులని, శ్రీమంతులని, చెప్పబడుదురు.

వాక్కనగా ఒక్క మాటలో అనేక న్యాయ సూత్రములను ధ్వని ప్రధానంతో ఇముడ్చ గలిగిన, సంస్కారవంతమైన, సమస్యను, మాట్లాడ వలసి వచ్చినప్పుడు, దుర్బలమైన వాగాడంబరమువల్ల, ఆ సమస్యలోని పటుత్వము సడలిపోతుంది. కనుక బాధ్యతగల వ్యక్తి, తన మాటలో, గాంభీర్యము, ఔదార్యముతోగూడిన ఉదాత్తతను, పోషించినయడల, మంచి ఫలితాన్ని ఇవ్వగలుగుతుంది.

స్మృతి యనగా పూర్వాపరములయొక్క పర్యాలోచనా శక్తి. ఎప్పటికప్పుడు తమ ఎదుటగల నూతన సమస్యలకు, దాని పూర్వాపర సందర్భములయొక్క పరిశీలనంతో, సౌష్ఠవంచేకూర్చాలి. అట్లు చేయనిచో ఆ నూతన సమస్య దుర్బలమై వికృతి రూపాన్ని పొందుతుంది.

మేధా యనగా అనేక గ్రంథార్థములను ధారణము చేయగల జ్ఞాపకశక్తి. దీనినే బుద్ధి వికాసమని అంటాం. ఈ వికాసమువల్లనే భిన్నవాదనా విషయాలకు సమన్వయ రూపమైన సాహిత్యం కలుగుతుంది. ఆ సాహిత్యమే శాంతికి మూలమైనది.

ధృతియనగా ఎట్టి కష్టదశయందైననూ, తన శరీర ఇంద్రియములను నియమించుకోగల శక్తి. మరియు, ఇంద్రియ వృత్తులు, మనోభావములు, స్వేచ్ఛగా చెలరేగినప్పుడు, వాటి చాపల్యమునుండి మనస్సును మరలింప గలుగుట, యని యర్థము. ఈ విషయంలో సామాన్యులు పరాజయమును పొందుదురు.

క్షమ యనగా తనకు హర్షము కలిగినప్పుడును విషాదము కలిగినప్పుడును, చిత్త వికారమును పొందక, సహనము వహించి, తన సమ్మందులకు కలవరము కలిగించకుండుట. ఒక వ్యక్తియొక్క భాగ్యోదయమును జూచిగాని, విషాద సంఘటనజూచిగాని, లోకము కలవరపాటు జెందుతుంది. ఈ కల్లోలమును నివారించు కొఱకు, విశేష యత్నములు, జరుపుటలో, శాంతిభంగమై పోవును. రేయిం బవలులవలె, ఈ సుఖదుఃఖ సంఘటనలు నియతములు కావని భావించవలెను. అప్పుడే, మానవ సహజమైన శాంతిని ప్రజలుపొందగలరు.

ఈ గుణ విశేషములను స్త్రీలు తమ లాలిత్యంతో లోకమునకు ప్రసాదించ వలసినవారై యున్నారు. ఇచట లోకమనగా ఒక్కొక్క గృహిణికి తన కుటుంబము, తన పరిసరమందలి బంధుమిత్రవర్గములు, దాస దాసీ జనములు, ఇరుగు పొరుగువారు, తన గ్రామీణులైన వృత్తికారులు, తన గృహప్రాంగణమందలి పశు పక్షిగణములు, లతావృక్షములు, పెంపైన విశాలకూటమే. ఈ రీతిగా ఒక్క గృహిణీ ధర్మము, కొంతకొంత లోకము నాక్రమించుటచే, సాముదాయికంగా సర్వప్రపంచమునకు, స్త్రీలే పట్టభద్రులై రాణింతురు. వీరి ద్వారా ఈ లోకములకు కావలసిన అభ్యుదయములన్నీ కలుగును. భగవద్గీత ప్రారంభంలో అర్జునుడు

" అధర్మాభి భవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః । "
అని వాపోయినాడు.

కావున భారత నారీలోకము ఈ పవిత్రాశయములను మనస్సులో నుంచుకొని, నేటి ప్రజా స్వాతంత్ర్య రంగంలో సాంఘిక నైతిక, రాజకీయ, ధార్మిక విషయములలో తమ సముచితమైన స్థానగౌరవాన్ని ఇతోధికంగా పొందటానికి మార్గమును అన్వేషించాలి. ఆ యా మార్గముల విధానములను, పద్ధతులను, ఆదర్శములను, ముందు వ్యాసంలో సూచించగలను.



# ఆమె పతివ్రత

శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి

" మారాకారుడు, సద్గుణాన్వితుడు, సుంభద్వైభవోపేతుడున్
ధీరస్వాంతుడు, వీరుడున్, రసికుడున్, విద్వాంసుడున్" భర్త, "నే
నారీరత్నము ప్రేమమూర్తి యని విన్నాణంబు గీపింపగా
నారాధింపక యుండగల్గు? నయినన్ హర్షింప నౌనిద్దియున్
పారావార సమానసంస్కృతియు భిన్నవ్యక్తికంబౌట చే
వేరైనట్టి యభీష్టముల్ మిగుల వైవిధ్యంబు నొందెను, సం
సారంబందున కామ, మేగుణములో సంబాధమాయెంప, నే
పారున్ గ్రుడ్డిది యాచు నొక్కపురుష నన్యప్రాప్తికై కాన, నా
నారీరత్నము సాధుతాగరిమయున్ నంద్యంబుగాకుండునే?

' క్రూరాత్ముండు, విరక్తరాస్యుడు, దరిద్రుండైనన్ నిరుద్యోగియున్
జారుండున్మరి చోరుడౌ పతినితిరస్కారింప, దద్గేహపుం
ద్వారంబున్ విడిపోక యాతనినె దైవంబంచు ప్రేమవ్రతం
బారాధించెడి' భార్యయే తలపగా నాధర్మపత్నిత్వ స
ద్గారంధర్యము నందియుండు; నిది యత్యంతం బసహ్యంబు నా
చారం బైనది యన్నమాట నిజమే, సాధ్వీమణీత్వంబు సు
స్పారంబౌనటులుండ రాదుగనుకన్ సద్బుద్ధులా భర్తకే
గారామార జనింప జేయనగు ; సత్కారంబు గావించినన్
మారున్ గ్రూరుడు జారుడౌ నతడు సమ్మాన్యాకృతిన్ ; దానసీ
నారీరత్నము కీర్తియున్సుఖము నందంగల్గు నాదర్శమై ॥

' ఆరంభంబుననుండి జీవనమునం దవ్యాజమౌ ప్రేమసం
సారంబున్ గడుకొద్ది కాలమయినన్ సాగించి, లోకేశు వారల్
మారన్నేరక సత్ప్రియుండు మరణింపన్ దేవుడీ జన్మలో
నీరీతిన్ లిఖియించె నంచతనినే హృత్పద్మమందుంచి సం
సారంబున్ దలపోయనట్టి సతియే' సాధ్వీమతల్లీ ! యటం
చారాధింప గనర్హయౌ దలప నాయాసంబు గాదీ గతిన్
వైరాగ్యంబును బొందియుండుటయు నిర్వ్యాజంపు ప్రేమంబుదా
గారుణ్యాకృతి, గాంచు గాని యిక సౌఖ్యం బేమియుంగోర, దా
నారీరత్నము గాననీమెయును సానందంబుగానుండు ; నీ
తీరుల్ మూడిటిలోన రెండవదియే దివ్యంబు భావింప ; నా
నారీరత్నమె వీరిముగ్గురను ధన్యవ్యక్తియున్ శ్రేష్ఠయౌ॥

డిసెంబరు సంచికలోని ఎవరు పతివ్రత ? అను శీర్షికగల పద్యాలకు జవాబు

సీరియల్ నాటిక

# భక్తలీల

పి. శ్రీనివాసరావు

## రంగము ౧.

[ప్రవేశము: స్వర్ణ భద్రా నదీ తీరమందలి శ్రీపుర పట్టణమున కనతి దూరమున మధుసూదనుని కుటీరము.

ప్రవేశము: మధుసూదనుని భార్య శాంతాదేవి కుమారునితో]

శాంతాదేవి :

తే॥ గీ॥ ఏడువకు ఏడువకు తండ్రి! । ఏడ్వ వద్దు
గొంతు యార్చుక పోవును । గోల మాను;
వేడి కన్నీటి చుక్కలు । విడువ బోకు,
అందమౌ నీదు చెక్కిళ్లు । కందు నయ్య!

(అడ్డాలలో బిడ్డ నిడుకొని) నాయనా! నాయనా! మాయట్టి పేదవారి గర్భమునం దేల జన్మించితివి? ఏడువకు తండ్రి! ఏడువకు. (బిడ్డ డేడ్చును) ఊరుకో నాన్నా! ఊరుకో!

(ప్రవేశము మధుసూదనుడు)

మధు : శాంతం! శ్రీపురమంతయు గాకివలె దిరిగితిని. కాని ఈ మధుసూదనునకు గోకురడు పాల చుక్కలు లభించినవి కావు. అయ్యో! పిల్లవాని నెట్లు పోషించగలము, ఎట్లు కాపాడగలము?

తే॥ గీ॥ గూడు నిర్మించి పిల్లల । గూట బెట్టి
యొకటి గాచుచు నుల్లెడ । నొకటి తిరిగి
నోట యాహారమును దెచ్చి । నోట గుడిపి
రక్షణము సేయుచుండదే । పక్షి కులము.

అట్టి పక్షులకన్న హీనుల మైతిమే.

శాంత : మన కడుపున గనినందుకు మనము పోషించవలదా? అట్లు పోషింపకున్న శిశుహత్యా దోషము కలుగదా?

మధు : వెనుక గలుగునో మానునో! ఇప్పుడు కండ్లార పిల్లవాని కష్టముల జూచి భరించు టెట్లు?

శాంత : అయ్యో! కలుగక కలుగక సంతానము కలిగ నన్న సంతోషము లేక పోయినదే...(బిడ్డ డేడ్చును)— ఏమీ! నాయనా! ఆకలా! ఈ పాపిష్టి గర్భమునం దేల జన్మించితివి? దాహమా! దాహమా?— (భర్తతో) మీరు లోపలకు బోయి కొంచెము నీళ్ళనైనను దీసికొనిరండు. (మధుసూదనుడు వెళ్లును) అయ్యో! దైవమా! ఈ పసిపాప నెట్లు పోషించుట? రక్షింపవా! దయామయా! రక్షింపవా?—

ఉ॥ శ్రీ లలనా మణీ హృదయ ।
సీమ వసించి వినోద లీల స
త్పాలన సేయవే కడు శు ।
భంబుగ విశ్వము నెల్ల, భక్త హృ
ల్లోల! సురాదిలోల! ముని ।
లోల! దయాంచితపాల! సత్య సం
శీల! గజేంద్రపాల! గుణ ।
శీల! సుగాన వినోద సంచలా!

(ప్రవేశము మధుసూదనుడు నీళ్ళతో)

మధు : అప్పా! నిన్ను బోషించుటకు శక్తివంతుల ముగాము. నీకు తల్లి దండ్రులు లేరనుకొనుము నాన్నా!

బ్రతికియున్నను చచ్చిన వారితో సమానులమని భావించుము తండ్రీ!

చం॥ మల మల గగ్గ గోళమున।
మాడెడి యాకటి చిచ్చు జెంది, కో
యిలగతి కూయు కంఠమున।
నేడిచి, యాటల నాడకుండ, నీ
కల కల నవ్వుమోము గడు।
గాంతి విహీనము జేసి, దప్పిచే
నలసితివా కుమార! వెస।
అమ్మను అయ్యను దిట్ట బోకుమా!

(భార్యకు నీళ్లనొసంగ ఆమె బిడ్డనికి బోసి బిడ్డనితో)

శాంత: ఓహో! ఓహో! నవ్వుచుంటివా!

కం॥ జో! జో! బంగరు పాపా!
జో! జో! రత్నాల పాప! జో! జో! పాపా!
జో! జో! సుందర రూపా!
జో! జో! మా ముద్దుపాప! జోజో! జోజో!

(జోల బాడి బిడ్డను నిద్రపుచ్చి భర్తతో) బిడ్డను నేదదీరి నిదురించెను. మీరు మూడు దినములనుండి తిండిలేక చాల నీరసించి యున్నారు. కొంచెమాకలి బాధ దీర్చుకొనుటకు లెండు. అన్నములేదు సరేగదా ఫలములనైన దిని ప్రాణము నిలబెట్టు కొనుడు.

మధు: నాకు మూడు దినములనుండి తిండి లేకున్న నేమి! ఒకవారమునుండి నీకు తిండిలేదే?—ఆ పండ్ల నారగించి నీ ప్రాణముల నిలబెట్టుకొనుము. నేనీ యడవికి బోయి ఫలముల సంపాదించి పిమ్మట నా యాకలిదీర్చుకొందును. నీ ప్రాణములకన్న నా ప్రాణములు ఎక్కువేమి?— పిల్లవాని కుదయమునుండి గోకురెడు పాల చుక్కలు బట్టలేకుంటిమే! వాని కడుపున గొంచెము పాలంబోయ నిదే గ్రుక్కెడు నీటినైన ద్రాగుటకు మనస్సు పోవుట లేదు.

శాంత: అయ్యో! మీకూ పిల్లవానికి కలుగని యాకలి నాకే గలుగునా? మీరులేని నాకీ ప్రాణము లేల?

(ప్రవేశం రామిరెడ్డి)

రెడ్డి: మధుసూదనముగారూ! నమస్కారములు.

మధు: విజాయుగస్తు. దయచేయుడు రామిరెడ్డిగారు! దయ చేయుడు. శాంతా!

(శాంతమ్మ వైపునకు వచ్చి శాంతమ్మ దర్భాసనమును దెచ్చి వేసి)

శాంత: బాబూ! ఈ పేదవారి కుటీరమున కుర్చీలా! తివాసులా! దయచేసి కూర్చొనుడు.

(రెడ్డి కూర్చొని ఆశ్చర్యముగా)

రెడ్డి: మధుసూదనముగారూ! ఈ విడ మీ భార్యయా?

మధు: ఔను.

రెడ్డి: ఇటువంటి దాంపత్యమే దాంపత్యము.

మధు: రెడ్డిగారూ! ఎక్కడనుండి మీ రాక?

రెడ్డి: పాగుసూరుపోయి తిరిగి శ్రీపురమునకు వచ్చుచుండగా నా గుఱ్ఱము డెక్కలో ఇనుపగోల గ్రుచ్చుకొనినది. ఈ ప్రక్క చెట్టున గుఱ్ఱమును గట్టి ఈ యెండవేళను కొంత మిక్కుటాయాసము తీర్చుకొని పోవుటకు వచ్చితిని.

మధు: భాగ్యము.

శాంత: మీ రాకవలన ధన్యులము.

మధు: శాంత! ఫలములదెచ్చి రెడ్డిగారికిమ్ము.

(శాంత కుటీరములోనికి బోవును)

రెడ్డి: (తనలో) ఆహా! ఏమి సౌందర్యము! ఈమె కాలి గోటికయినా ప్రపంచములోని స్త్రీలు సరి యగుదురా! నేనీమె సౌఖ్యమును బొందలేకున్న నీ ప్రాణము లెందుకు?—ఎట్లయినను వీరితో స్నేహముచేసి నా కార్యము సాఫల్యము జేసికొనవలసియున్నది. ధన మూల మిదం జగత్తు—ఏమున్నది?—వీరికి ధనాశ జూపవలసి యున్నది.

(శాంత ఫలములతో ప్రవేశించి రెడ్డి కొసంగును)

శాంత: ఈ పండ్లనారగింపుడు. మీకు బట్టెడన్నము పెట్ట లేకుండిన దరిద్రులము. మీయట్టి జమీందారులు, ధనవం

తులు, మాయట్టి సాధుల కుటీరములకు వచ్చి ఏమి తృప్తి బొందగలరు ?

రెడ్డి : శాంతమైన మీ మనస్సుతో నిచ్చిన యీ ఫలములే పరమ సంతృప్తిని బొందించుచున్నవి.

శాంత : కొంచెము పాలనైనా యీయలేకుంటిమి. ఈ నీటిని త్రాగి దాహశాంతిని బొందుడు. (నీళ్ళ నొసగును)

మధు : రెడ్డిగారూ ! మా పిల్లవానికే పాలుబోసి పెంచలే కున్నాము. మీకు పాలనొసంగజాలని యభాగ్యు లము.

రెడ్డి : (నీళ్ళను త్రావును) ఇదియే చాల మాధుర్యముగ నున్నది. కాని మీ పిల్లవానికి పాలులేవని తెలుపు చున్నారు. ఒక పాడియావును బంపెదను లెండి ! దాని పాలుబోసి పెంచుడు. ఈ మాత్రము ప్రత్యుపకారము మీకు జేయలేనా ?

శాంత : మేము ధన్యులము.

మధు : మీ మేలునకు కృజ్ఞులము.

రెడ్డి : మీరు తిండిలేక ఇక్కడే యిడుములు గుడుచుచున్న ట్లున్నదే. శ్రీపురమునకు రాకూడదూ ?

మధు : రెడ్డిగారూ ! ఇక్కడ భగవంతుడు తాండవ మాడు చున్నంట్లుడును. ఈ స్వర్ణభద్రా నదీ రాజ మున్నూ, యిక్కడ ప్రకృతి శోభలున్నూ మాకు గలిగించిన లేమిని మరపించి మహా సంతోషమును కూర్చుచున్నవి.

రెడ్డి : నిజమే, ఈ కుటీరమే శాంత కుటీరము. మీ కుటీర మును విడిచి పెట్టుటకు నాకును మనస్సు పోవకున్నది.

మధు : చిత్తము, చిత్తము. దైవారాధనకు దగిన శాంతి యిచ్చుట నున్నది.

తే॥ గీ॥ నిశ్చలంబుగ దేవుని । నెమ్మనమున
నిడి సమారాధనము జేయ । నచటి సృష్టి
చిత్రములు బోధ గరపి వి । చిత్ర గతిని
పరమ ధామంబు గాంచెడి । పథము జూపు.

రెడ్డి : నిజమే, అది నాకును తెలియును. కాని యీ అడవి ప్రదేశమందు మీకేమి సౌకర్యములు లభించును ? శ్రీపుర మునకు వచ్చిన మిమ్ముల నాదరించలేనా ? మీకు మంచి పెంకుంటిల్లిత్తును. తిండికి వలసిన సామగ్రినిత్తును. నగల నున్నూ యిత్తును. ఏమీ జమీందారుడనగు నే నా మాత్రము నీయలేనా ? నాకు కొరతగలదా ?

శాంత : రెడ్డిగారూ ! మాకా మేడలు మిద్దెలకన్న నీ కుటీ రమే చాలా యానందమును గలిగించుచున్నది. ఇక్కడి పండ్లు, నీవార ధాన్యములగంజి తృప్తి గలిగించుచున్నవి. ఆ నగలకన్న నిక్కడి పూవులే శోభగానుండును.

రెడ్డి : నిశ్చయముగ మీ కోమలమైన శరీరమునకు యీ పూవులే అందముగానుండే నగలేల ? కాని మీ గర్భ కుహరములు ఆకలి జ్వాలలకు మలమలమాడి పరితపించు చున్నవి. చక్కగా యోచించుకొని శ్రీపురమునకు వచ్చు టకు ప్రయత్నము జేయుడు. వేళ మిగులు చున్నది. నేనిక బోయెదను. నేటి మధ్యాహ్నము నా భటులు ఆవును దెచ్చి మీకప్పగించి గుఱ్ఱమును దోలికొని పోవు దురు. నాకు సెలవీయుడు.

శాంత : మధు : చిత్తము, చిత్తము.

(రెడ్డి పోవుచు తనలో)

రెడ్డి : తే॥ గీ॥ పూరుషుల కొంప ముంచగా । బుడమి లోన
బ్రహ్మ పుట్టించె బంగారు । బొమ్మ యనగ
చక్కదనముల కుప్ప యీ । చంద్ర వదన
బొంద కెందరు మదిలోన । కుందు వారొ !

(తెర వ్రాలును)



ప్రాత క్రొత్తల

# మేలు కలయిక

"ఉష శ్రీ"

మహా కాలచక్ర పరిభ్రమణంలో విశాల విశ్వంలోని విభిన్న సమాజాలు వివిధ విధానాలలో పరిణామాన్ని పొందుతూంటై. శ్రావణ ప్రావేశికతో ప్రారంభించి వర్ష ఫలితంగా స్రవించే క్రొత్తనీరు నిలిచిపోయిన పాతనీటిని గెంటేసినట్లే, బూజుపట్టి, పాచిపోయిన సమాజ వ్యవస్థా పునాదుల్ని పెకలించి నూతన సామాజిక వ్యవస్థ నూత్న విధానాలపై వినిర్మితం కావటం సహజం—అవసరంకూడా. ఈ ప్రాకృతిక క్రమిక వికాసం కలగకపోతే శ్రేష్ఠ తన్నుకుపోయిన పాత, రోత, కంపు కొడుతుంది. దీని పర్యవసానం సమాజం అంధకారంలోకి అణగద్రొక్కబడడమే—

అయితే ప్రాతలోని మంచిని కూడా త్రోసి రాజనే నూతన వ్యవస్థకూడా ఒక దృక్పథంలోంచి హానికరమే. అందుచేత ప్రాతలోని మంచిని స్వీకరిస్తూ ప్రవేశించే నూతన వ్యవస్థనే మనం ఆశించాలి. అందుకే కృషి చేయాలికూడా. దీన్నే ప్రాత క్రొత్తల 'మేలు కలయిక' అని సంస్కర్తలు పేర్కొంటారు. ఏ సమాజం ఈ మేలుకలయిక కాలదన్నుతుందో, అందుకై ప్రయత్నించదో ఆ సమాజం అప్రయత్నంగా స్వీయపతనానికి దారితీసుకుని, తనకు తెలీకుండా తన సమాధిని తానే నిర్మించుకుంటోందన్నమాట.

ఇది జరుగుతూన్న చరిత్ర.

ఎరిగిన ప్రత్యక్ష సత్యం.

౨

అయినప్పటికీ కొందరు సంస్కార భావ హృదయ రహితులు ఈ మేలు కలయికకు కృషిచేయకపోవటం అలా వుండగా చేసేవారిని నిరోధిస్తూ శతవిధాల ఆటంకాలు కలిగించడానికి యత్నిస్తారుకూడా. ఒకానొక పరిభాషలో వీరినే "అభ్యుదయ నిరోధకులు" అంటారు. మరి కాస్త తీవ్రవాదులు వీరినే "సంఘ వినాశనానికి దాపురించిన చీడ పురుగులు" అని కూడా అంటారు. దేనికైనా బూజు పట్టినా దులుపుకోని వర్గీయులు వీరు. వీరికి ఒక్కటే భయం. ప్రాతని వదలి క్రొత్తని స్వీకరించటంవల్ల ఏం ప్రమాదమొస్తుందోనని! క్రొత్తదికూడా 'కొంత' ఉండటం సర్వ మానవ సహజ మనస్తత్వం అయితే వీరికి పాతమీద మోజు మాత్రమే కాక 'క్రొత్త' అంటే భయం కూడా. ఈ భయాన్ని వారు రోతగా భ్రమింపచేసేటట్లు నటిస్తారు. ధరణీ చక్రం తల్లక్రిందులయ్యే పరిస్థితులు సంక్రమించినాసరే వీరు 'పాత' పాతర్లలోనే ఊదాతొక్కుకు కూచుంటారు.

వర్తమాన భారతీయ సమాజిక వ్యవస్థయొక్క ప్రగతిని ఆటంకపరుస్తూ అడుగడుగునా బంధాలు వేసే వారిలో వీరికి అగ్రతాంబూలం ఈయక తప్పదు. తమరు ఏ దౌర్భాగ్య పరిస్థితులనూ ఆచారాలనూ దుర్భర దుస్సహాలలో పీడింపబడుతూ కూడా ఆచరించినారో తోటి సోదర జనతకూడా ఆయా బాధలచేత తాడింపబడాలనేదే! వారి ప్రధాన వ్యథ. ఈ వ్యాధి నిర్మూలనకే వారు తమ మందుల సంచిలోని బంధాలు మనకి మాత్రం కట్టివేస్తున్నారుగాను. ఆ బంధాల మాత్రలకి దూరంగా పోయేవారిని చూస్తే వీరికి కన్నెర్ర. వారిని "పాపం! ఎంతో బాగుపడతారనుకుంటే వృథాగా పాడైపోతున్నారు" అని ప్రచారం ప్రారంభిస్తారు. ఏడిచేవాడు ఏడిచేవాళ్ళనీ, దివాలాదారు యింకో దివాలాదారుని కోరటంలో వింతలేదు.

౩

ప్రాచీన భారత సాంప్రదాయాలు సాంఘికంగా నైతికంగా సంస్కారం పొందినవే కావొచ్చు—మహోన్నత మాదర్శాల శిలాన్యాసాల పునాది పైననే అవి నిర్మింపబడి యుండవచ్చు: అవి ఈనాడు అర్థరహితంగా, మూఢంగా—యింకాస్త హెచ్చు మోతాదులో చెప్పాలంటే—అసభ్యంగా కూడా అనుకున్న—సార్వకాలిక,

విశాల విశ్వ శ్రేయోభిలాషతో స్వార్థత్యాగులైన మహా మహులచేత శిలాన్యాసం చేయబడి, అద్వితీయ మేధానిధులైన కళాశిలలు స్వయం కృషిచే వినిర్మితమైన భారత సంస్కృతీ సౌధం వర్తమాన జనతకు అనర్థదాయకంగా పరిణమించుటకు గల అద్యతన హేతువేమిటి? అనే సమస్యకూడా సహృదయ భావుకునకు కలుగక మానదు. ఈ సమస్యను సంక్షిప్తంగా సమీక్షించి పరిష్కరిద్దాం.

"పాతబడటమే కారణం" అనే ఒక్క వాక్యంతో పరిష్కృతం చేయవచ్చు. కాని దానిని ప్రాజ్ఞ జనత అంగీకరించదు. ఏమంటే—ఇతిహాసికంగా అతి పురాతనమైన ఋగ్వేదం యీ నాడుకూడా అమూల్యస్థానంలో ఉన్నదే! శతాబ్దాలకు ప్రాచీనుడైన మహాకవి కాళిదాసుని సాహిత్య కన్నియ ఈ నాటికీ ఖండ ఖండాంతరాల వన్నె చిన్నెలతో అలంకరింపబడుతూ మన్ననలను స్వీకరిస్తోందే!

ప్రతీచీవాస వైజ్ఞానికులు యీనాడు అథర్వణ వేదానికి అంజలి ఘటిస్తున్నారే! గుహా రామ స్థూప దేవాలయాలలోని కల్పనా శిల్పానికి ధరణీ చక్రమంతా సాగిలబడుతున్నదే! ఇలా ఎన్నో—ఒకటియా! రెండా! ఇంతటి ఉత్తమోత్తమ గౌరవ ప్రతి పత్తులను సమకూర్చిన మన వైదిక సాహిత్యమేకదా మన సామాజిక వ్యవస్థకు శిలాన్యాసము. మహత్తర కళా, సాహిత్యాలను వినిర్మించిన మన పూర్వీకులు యింతటి అనర్థదాయకమైన సాంప్రదాయాలతో సాంఘిక వ్యవస్థను వినిర్మించారా? అనే విషయాన్ని సాలోచనతో సౌహార్దిక దృక్పథంతో సమాలోచిద్దాం— ప్రాస్తావికంగా మన దేశ వైవాహిక విషయాన్ని పరిశీలిద్దాం.

నాడు :—

ప్రాచీనకాలపు వివాహాలను గురించి చారిత్రకంగా ఏవిధమైన ఆధారాలూ లేవు. విశ్వసించి నట్లయితే పురాణాలే మనకు ప్రాచీనకాలపు చరిత్రలు. అంతకుమించి మరేమీ లభించనప్పుడు పౌరాణిక సాహిత్యాన్నే ఇతిహాసంగా స్వీకరించక తప్పదు. అదీకాక భారత, రామాయణాలను యితిహాసపు శీర్షిక క్రిందనే చేర్చారు. భారత, రామాయణాలలో వైవాహిక విశేషాలను గూర్చి తెలుసుకుందుకు మనకు అవసరమైనంత విషయమూ లభిస్తుంది.

రామాయణంలో సీతాకళ్యాణం—కాదు—స్వయంవరం; భారతంలో ద్రౌపదీ స్వయంవరం మొదలైనవి. స్వయంవరం అనే పదాన్ని బట్టి చూస్తే నేడు "వివాహ" రూపంలో ఉన్న పదమే ఆనాడు "స్వయంవరం"గా ఉండేదనిపించక మానదు. ఫలితాన్ని బట్టి స్వయంవరం—వివాహం పర్యాయపదాలుగా భావించుకోవొచ్చు. కాని విధానంలో మాత్రం వైరుధ్యం చాలా ఉంది. ఇది వైరుధ్యం కాక వైభిన్నం కనక అయితే అంతగా సమస్యే అయేది కాదు. దృక్పథాలలో విభిన్నత్వం ఉన్నా (ఉండడం సహజం) వస్తువుమాత్రం ఒకటే గోచరిస్తుంది. దృక్పథాల్లో వైరుధ్యం ఏర్పడితే ఏమాత్రమూ సమ్మేళనరాదు. (కాకిని 'హంస' అంటాడేకాని కోకిల అని కూడా అనడు, కనీసం రూపు రేఖలలో.) స్వయంవరం వివాహం అనేవి విరుద్ధ విధానాలలో ఉన్నై. ఎలా అంటే? స్వయంవరం అనే పదమే మనకు సులభగ్రాహ్యం: స్వయంగా వరాన్వేషణ చేయటం. ఒకవేళ అది ఏదో పారిభాషికపదంగా చెలామణీ అయింది అని అందామనుకుందుకు కూడా అవకాశాలు లేకుండా పౌరాణికులు సోపపత్తికంగా స్వయంవరాలు చాటింపులు వేయించి, పోటీలు పెట్టి వధువుచేత స్వీకరింప జేసేవారు. ఇవే కాకుండా దమయంతీ స్వయంవరం మరో విధానంగా నడిచింది. అంటే ఈ పోటీలు, సాము గరిడీలు లేకుండా నానాదేశాగత మహారాజన్య సమక్షంలో యిచ్చ వచ్చిన వానినే వరించింది. ఈ విధానం రాణీ సంయుక్త కూడా చేసింది అయితే ఈ విధానం ప్రత్యేకం క్షత్రియులకే ఉండేదేమో! అనే మీమాంసకుకూడా ఆస్కారం లేకపోలేదు. కాని చాతుర్వర్ణ్య వ్యవస్థను వినిర్మించిన పౌరాణికులు వివాహ విషయంలో క్షత్రియ వర్ణానినే నిరూపిస్తూ వచ్చారేం? మిగతావాని మాటేమిటి?

అయితే దీన్ని ఊహా పథంలోంచి చూస్తే బహుశః చాతుర్వర్ణాలకు కూడా ఈ విధానమే అమలు జరగటం వల్లనే దానినే సూచించి ఉండవచ్చు అనికూడా తెలుస్తుంది. బహుశా మిగిలిన వర్ణాలలో చాటింపులు, సాము

గరిడీలు ఉండక పోయినా వధువు యిష్టా యిష్టాల మీదనే జరుగుతూ ఉండిఉండాలనుకోక తప్పదు. (ఇంతకు మించిన మరేవిధానమైనా సోపపత్తికంగా ఎవరైనా తెలిపితే స్వీకరించవచ్చు.) సహేతుకంగా దొరికిన ఈ 'స్వయంవరం' మాత్రమే ఆ రోజులలో అమలులో ఉండేది అని నిశ్చయించుకోక తప్పదు.

వయస్సు విషయంలో కూడా సమ్యక్ నిర్ణయమే చేసారు. వర్ణ వ్యవస్థలాగే ఆశ్రమ నిబంధనలుకూడా చేసారు. ఎనిమిదవ ఏటనుండీ ప్రారంభమయ్యే బ్రహ్మచర్యాశ్రమము ఇరవై నాలుగు—ఇరవై అయిదు సంవత్సరాల మధ్య స్నాతకంతో సమాప్తమౌతుంది. స్నాతకం అయితేనేగాని వివాహార్హత కలగదు. స్నాతకం బ్రహ్మచర్యాశ్రమానికి భరతవాక్యం పాడుతూ గృహస్థాశ్రమానికి నాందీ పలుకుతుంది. అంటే ఇరవై అయిదు సంవత్సరాల యౌవన నవ వసంతోదయకాలమే పురుషుడికి వివాహ సమయం. అయితే యిక్కడే 'స్త్రీ' విషయంకూడా నిర్ణయించుకోవొచ్చు. కాబోయే దంపతుల వయోతారతమ్యం ఆరు సంవత్సరాలు. పురుషునికంటె స్త్రీ వయస్సు ఆరు సంవత్సరాలు మాత్రం తక్కువ ఉండాలి. ఈ సూత్రం ఆరోగ్య ధర్మంమీద వ్రాయబడింది. శుశ్రుతుడు, చరకుడు మొదలైన వైద్య శాస్త్రకారులంతా కూడా రజస్వలానంతరం ఒకటి రెండు సంవత్సరాలకు కాని స్త్రీకి సర్వాంగ వికాసం కలగదనీ, అప్పటికిగాని మానసిక ప్రకాశం ఏర్పడదనీ వక్కాణించారు. వివాహం అనేది స్త్రీ పురుషుల యావజ్జీవ సమైక్యత మాత్రమే కాకుండా జాత్యవాంఛా నివృత్తికమనీ, అందుచేత ఈ వైవాహిక విషయం ఆరోగ్య నియమాలమీద కూడా ఆధారపడి ఉండాలనీ ఉద్ఘోషిస్తూ పద్ధెనిమిది సంవత్సరాలు రానిదే స్త్రీకి వివాహం చేయరాదనీ తీర్మానించారు. బహుశః ఈ తీర్మానం జరిగిన రోజుల్లో వివాహం జరిగిన అల్పకాలంలోనే పునస్సంధానం జరుగుతూ ఉండి ఉండాలి. ఈ రెంటికీ అత్యల్పకాల వ్యవధిమాత్రమే ఉండి ఉంటుంది. అందువల్లనే రజస్వల వయస్సు పదహారు (ఆనాడు) తరువాత రెండేళ్ళు పూర్ణ వికాసంవరకూ గడువు పెట్టి తదుపరి ఆరు సంవత్సరాల మధ్యాంతరం గల యువకుడికి ఆమె అభీష్టం మీద వివాహం చేయమన్నారు.

నేటి పరిణయాలు :—

ఈనాటి వివాహాలనుగురించి వ్రాయడం చాలా అనవసరం. జరుగుతూన్న ఈ విషయం, అనేక సంఖ్యాకులకు అనుభవమో, స్వానుభవమో. ఈ విశేషం ప్రత్యేకంగా చిత్రించవలసినంత ఆవశ్యకత కనబడదు. ఏమైనా ఒక్క విషయంమాత్రం గుర్తించుకోవాలి: ఈ నాడు కొంతవరకూ సమాజంలో పరిణామం గోచరిస్తున్నది. సూత్రప్రాయమైన పురోగమనంలోనే మనం ఉన్నాం. అయినప్పటికీ ఎన్నో నవనవారుణయువ జీవితాలు మన వైవాహిక వ్యవస్థ నే రైలు చక్రాలక్రిందబడి పిప్పి, పిప్పి అయిపోతున్నై. లేగులాటి లెన్నో పెళ్ళిఅనే ఘుళ్ళకంచెలచే కప్పబడి ధూళిలో కలిసిపోతున్నై.

బొటన వ్రేలు నోట్లో పెట్టుకొని కుడుచుకొనే పసివాడికీ—బొడ్డుకోయని పసి పిల్లకూ ముళ్లు వేసేస్తున్నారు. మనం ఏ దృక్పథంతో చూసినా వారు తమ మంత్రాలకెంతో ప్రాముఖ్యత నిస్తారుగదా! ఈ వయస్సులో జరిగే పసిపాపల పరిణయాలకి వారు చదివే మంత్రాలు—వధూవరులచేత చేయించ వలసిన ప్రతిజ్ఞలు ఎలా సమగ్రమౌతున్నై? ఎవరికి తెలుస్తున్నై? ఈ విషయాన్ని గురించి వారి మెదళ్ళు ఊహించివయూ ఎప్పుడన్నా? లేదు—పోను పక్షంలో ఏనాడో ఈ వైవాహిక విధానమైనా మారి ఉండేది లేదా మాంత్రికయుగమన్నా రూపులేకుండాపోయి ఉండేది. అందుచేత వారు మూఢంగానే ఈ విధానాన్ని ప్రవేశపెట్టారు అని తీర్మానించుకోవచ్చు. కాని అంత కన్న శ్రేయస్కరంగా కనపడేదేమంటే; ఎప్పుడో? ఎక్కడో? ఎవరికో మనకర్థం కాని—కనీసం తెలీని—ప్రమాద మేమో సంభవించి ఉంటుంది. దానికి ప్రాయశ్చిత్తంగా ఈ వివాహం ఒకటి జరిగిఉంటుంది. దాన్నే బహుశః ఆచరణలోకి తీసుకువచ్చి ఉంటారు. ఏ హేతువు చూపకుండా చేసుకు రావటంవల్ల దీన్ని మూఢాచారాల శీర్షికలోకి త్రోయక తప్పింది కాదు—

## మే లు క ల యి క

**నాడు—నేడుల మధ్యయుగం :—**

నాటికీ నేటికీమధ్య ఎంతోకొంత వ్యత్యాసంఉండి తీరుతుంది. పగలుకీ—రాత్రికీ మధ్యగా సంధ్యా కాలం ఎలా వున్నదో అలానే స్వయంవర యుగానికి—పిల్ల పెళ్ళిళ్ల యుగానికీ మధ్యమరేదో ఉండిఉండక తప్పదు. దీన్ని మనం సౌకర్యంకోసం 'మధ్య యుగం'గా వ్యవహరిద్దాం. ప్రతి విషయానికి ఈ మాధ్యమత్వము అత్యవసరం. అవసరమైనా అనవసరమైనా మాధ్యత్వము ఉంటుంది కనుకనూ దాని మీదనే నాటి వవ్యస్థకు భరతవాక్యం నేటి వ్యవస్థకు నాందీ ఉంటాయి గనుక ఆ యుగంవైపుచూద్దాం—

మనం ప్రవేశించ బోయే ఈ మధ్య యుగానికి చాలా వరకూ చారిత్రకాధారాలున్నై. చాలా వరకూ నేకాదు! మొత్తానికే ఐతిహాసికాధారం ఉంది. అందుచేత యిక్కడ కొద్దిగా చరిత్రపుటలలోకి తొంగిచూడాలి—

నేటి చరిత్రనుంచి వెనక్కిపోయి, పోయి మన మధ్య యుగంవద్ద ఆగేటప్పటికి మొగలాయీ పరిపాలనా కాలం వస్తుంది.అంతవరకూ జరిగిన చరిత్రకీ ఈచరిత్రకీ బ్రహ్మాండభేదం ఉంది. అంతవరకూ మనదేశంమీదికి దాడిచేసిన విదేశీయు లంతా మన వెండి బంగారాలకోసం ఆశపడివచ్చిన, పెద్దతరహా బందిపోటుదొంగలు. వారిలో కొందరు మన దేశంలోనే స్థిర వాసాలు ఏర్పరచుకున్నా మన సాంప్రదాయాలను మన కట్టుబొట్లను అవలంబించి మనలోనే విలీనమౌతూవచ్చారు. ఈ విలీన విధానం మహమ్మదీయుల ఆక్రమణతో ఆగింది. అక్కడే యితిహాసకారుడు క్రొత్త ఘట్టాన్ని ఎత్తుకో వలసి వచ్చింది. మహమ్మదీయులు రావటంలో "దోపిడీ, దురాక్రమణ, మతప్రచారం"అనే మూడు ప్రధానాశయాలతో వచ్చారు. ఈ దోపిడీ, దురాక్రమణ విధానాలకి అప్పటికే మనం లోనయివున్నాం. కాని ఈ మత ఆచారమే తీవ్ర సంఘర్షణను రేపింది. మనదేశంలో స్థిరనివాసా లేర్పరుచుకొని మన ఉప్పుతిని, మన నెత్తినెక్కి తొక్కుతున్నా, అధిక సంఖ్యాకులం, హక్కుదారులం మనమే అయినా వారి సాంప్రదాయాలు వారిమతం మనమీద రుద్దనారంభించారు. చరిత్ర కందిన రోజులనుంచీ కూడా "ఐక మత్యం"లేని మనం తలలొగ్గ వలసిన దుస్థితి పట్టింది. సామాజికంగా ఆ విధానాలను ఎదిరించకపోయినా వ్యక్తిపరంగా మాత్రం ఎదిరించాలనే గాఢవాంఛ ఉండడంవల్లనూ, ఆస్తిక దృక్పథం అత్యధికంగా ఉండడంవల్లనూ మతాంతరులు కావటానికి మనవాళ్లు చాలా బాధపడ్డారు. ఇది ఆ నాటి చరిత్ర—

అయితే ఆ రోజుల్లోనే (మధ్య యుగం) అతి బాల్య వివాహాలు ఏర్పడినట్టుకూడా తెలుస్తుంది. ఆ రోజుల్లో ఆ వివాహిత కన్యలను తీసికొని పోయి మహమ్మదీయులు పెండ్లిడ్లు చేసికొనే వారు. బహుశః వారు వివాహితుల జోలికి పోయే వారో! కాదో! లేక వారిని పెండ్లి చేసుకుందుకి యిష్టపడే వారే కాదో! ఈ రెంటిలోనూ ఏదో ఒకటి జరగటంవల్లనే ఈ బాల్య వివాహాలు ఏర్పడ్డం, ప్రబలం కావటం జరిగినై. ఆ నాడు యిది క్రొత్తదిఅయినా "మతం"మీదవుండే అభిమానంకొద్ది ఈ సంస్కరణ చేసేవారు. అది జోరుగా అమలు జరుపబడింది కూడా! ఆ నాడు ఈ నూతన సంస్కరణని ప్రతిఘటించినవారు కూడా కనబడరు.

ఆ యీనిదర్శనాలను బట్టిచూస్తే అంత వరకూ భారతీయులు కాలానుగుణ్యంగా జాతీయ ఔన్నత్యాన్నీ దేశీయ ఉజ్జ్వల భవిష్యత్తునీ ఆశించి ఏసంస్కరణ చేయడానికైనా జంకేవారు కాదని తేలుతుంది. కాగా పోగా—అనంతరం వచ్చిన ఏ మహోపద్రవ పరిస్థితులవల్లనో మానసిక దౌర్బల్యం వల్లనో క్రొత్తమీద భయం బయల్దేరింది. ఇందు మూలంగా విశ్వమానవ కళ్యాణానికి హేతుభూతమైన దాంపత్య జీవితమును సమకూర్చు "వివాహం" విశ్వ వినాశనానికి బాట వేసింది. త్వరలో ఈ పధాన్నుంచి తప్పుకుని సక్రమ మార్గానుయాయులం కావడానికి ప్రయత్నించాలి.



# కామాంధుడా !

ప్రేమ ప్రవాహంలో
కామంపు వెల్లువలో
కొట్టుకపోయే
కామాంధుడా !
కనవోయ్ కనువిప్పి !
కూటికి లేకా
కొటుమిట్టాడే
కూలివారిని,
గుడ్డకుకరవై
సిగ్గుపడే సాటివారిని,
కాని డబ్బుకై
మానం అమ్మే
పేదరాలిని.

*  *  *

నీవేకాదా !
మానవకల్పిత
షామవిసాదిని
పేదవారిపై
ప్రయోగించుత ?
నీవే కాదా !
పేదవారికెక్కలేమిని
సాకుగచూచి
నీ కామపిశాచికి
స్వేచ్ఛనిస్తా ?
నీ మదాంధతను
అదుపు పెట్టి
దూరదృష్టితో
ఆకలికడుపులో
భగభగమండే
విప్లవశక్తుల
అఖండజ్వాలను
కనవోయ్ ! కనువిప్పి !

శ్రీ చల్లా సత్యేంద్ర శంకర్

# బాటసారి

రేడియోగీతం

ఎంతదూరమని నీవటు
పయనింతువు బాటసారీ !
పవలు రేయి ఒకతీరున
పయనింతువ బాటసారీ !
అంతులేని బాటలబడి
అగాధంపు టరణ్యముల
అలసి సొలసి పోవనేల....

చల్లని పానీయమ్ముల
సేదదీర్చుకొని పొమ్మటు

కలువ తేనె తోడనీకు
కమ్మసిరుచులాన జేతు
వదలిపోకు బాటసారి
కదలిపోకు బాటసారి

తరుగులేక పయనింతువ
చిరసుఖజీవన శోభకు ॥ఎం॥

శ్రీ ముళ్లపూడి నరసరాజు.



# సోము తెలివితక్కువ

రచన: చల్లా సత్యనారాయణశర్మ

సోము తనెంతో తెలివైన వాడి ననుకొనేవాడు! వాడికి అందరినీ, అందులో వాళ్ళ చెల్లెలు సరళని ఏడిపించడం అంటే ఎంతో సరదా! సోము, సరళ, ఆ వూరి మిడిల్ స్కూల్ లో చదివే వారు. వాళ్ళ నాన్నగారు వకీలు. ఒకసారి వాళ్ళ నాన్నగారు రెండు ఏపిల్ పండ్లను తీసు కొచ్చారు. వాటిని సోము చేతి కిచ్చి "చెల్లాయి, నువ్వు, తినండి" అన్నారు. అప్పుడు సోము సరళని పిలిచి యిలా అన్నాడు. "ఒసే సరళా ఈ పండ్లు రెండనుకుంటున్నావు కదూ? కాదు, ఇవి మూడుపండ్లు! అవునా?"

సరళ: "నేనునమ్మను, అవి రెండేపండ్లు!"

సోము: "నీవు చిన్నపిల్లవు, తెలివి తక్కువ దానవు కనుక నీకు రెండే పండ్లు కనుపించుచున్నవి! కాని, మూడుపండ్లు వున్నాయి! నీకు నేను మూడింటిని చూపిస్తా, చూడు! ఇదిగో ఒకటవ పండు, ఇక మిగిలినది రెండవది, మరి ఒకటి రెండు కలిపితే మూడు కాదూ?" ఇల్లా అని సోము సరళ కేసి తిరిగి నవ్వటం మొదలు పెట్టాడు. సోము నవ్వు చూసేసరికి సరళకి ఏడుపొచ్చింది. సరళ ఏడుపు విని వాళ్ళ నాన్నగారు అక్కడకువచ్చి "ఏం సరళా; ఎందు కేడుస్తున్నావ్?" అని అడిగారు. సరళ జరిగిన దంతా చెప్పింది. అదంతా విని ఆయన నవ్వుతూ సోము కేసి తిరిగి యిలా అన్నారు. "అవునురా సోమూ, నువ్వు చెప్పినట్లు పండ్లు మూడు వున్నాయి. ఈ మూడు పండ్లను మన ముగ్గురం తలొకటి తీసు కొందాం" ఇలా అని ఆయన సోము చేతిలోని రెండు పండ్లను తీసుకొని సరళ కొకటిచ్చి, తనొకటి తీసుకొని, సోముతో యిలా అన్నారు. "ఆ మిగిలిన మూడవపండును నువ్వు తిను!!" సోము వాళ్ళ నాన్నగారి యుక్తి విని ఎంతో సిగ్గు పడ్డాడు!



# కాలక్షేపం

"కనకం"

"ఏమిటే ఆ వితండ వాదన? పరీక్షలు దగ్గ రికొస్తున్నాయి. పాఠాలు చదువుకోరాదు?"

"వితండ వాదన కాదమ్మా అన్నయ్య, ఉద్యోగం పురుష లక్షణమేనని వాదిస్తున్నాడు. అలా అనకూడదంటున్నాను"

"ఏమో మీ వాదనలు నాకు తెలియ వమ్మా."

"అదికాదే అమ్మ చెల్లి ఏదో వంక పెట్టి నాతో వాదన వేసికుంటుందే. కూసే గాడిద వచ్చి మేసే గాడిదను చెరిపిందన్నట్లు అదిచదువు కోదు, నన్ను చదువుకోనియ్యదు"

"అది కూసేరకమే గనుక మేత మానేసింది. అసలు ఉద్యోగమంటే యేమిటో తెలుసా"?

"ఏమి టేమిటి? నాన్న జేసే వర్తకం ఉద్యోగం"

"అది కాదు లేగా అన్నయ్యా! ఉద్యోగ్యం అంటే ప్రయత్నం. ప్రయత్నం అనేది యే పని కైనా చెయ్యాలిగా. ఎవరయినా చెయ్యవల సిందే. ప్రయత్నం లేకుండా యే పని యెవ్వరి వశముగాదు. ధనార్జనకు పురుష ప్రయత్నమైతే దాన్ని దాచడానికి స్త్రీ ప్రయత్నం కావాలి. యేం, కావాలా? అక్కర్లేదా? మాట్లాడవేం? నాన్నగారు సంపాదించి తెచ్చిన డబ్బు అమ్మ దాచకపోతే ఏ మౌతుంది పురుష ప్రయత్నం?

"అసలు మేం తెస్తేగా చెల్లీ మీరు దాచ టానికి?"

"నిజమే అన్నయ్యా, [illegible] మీరు కూడా ఉద్యోగాలలో ప్రవేశిస్తున్నారు. [illegible] చేస్తారు? లేకుంటే [illegible]?"

"ఏమిట్రా "[illegible]" చెప్పను [illegible]?"

"నాన్న గారూ! అమ్మ [illegible]. 'ఉద్యోగం పురుష లక్షణం' అన్న పదం మార్చాలా వద్దాండి?"

"మార్చాలనుకున్న [illegible]. [illegible] ఏమని మారుస్తావో చెప్పండి చూదాం?"

నాన్నగారూ, ఉండు చెల్లి నే చెప్తాను.

"ఉద్యోగం పురుష లక్షణం, స్త్రీ లక్షణం కూడాను."

"నువ్వు బాగా చెప్పావులే. ఏదీ నువ్వు చెప్పవమ్మా"

"నాన్నగారూ? మరి నే చెప్పితే నా కేమి స్తారు?"

"నీకు కావలసిందిస్తానమ్మా"

"నే చదువుకున్నంత వరకు చదివిస్తారా?"

"తప్పకుండా చదివిస్తాను"

"మరినన్నో"

"ఊరుకోవోయి నువ్వు చెప్పుకోలేక పోయావుగా. నాన్నగారూ చెప్పేస్తున్నా"

"చెప్పమ్మా"

"ఉద్యోగం మానవ లక్షణమ్"



# అంతర్జాతీయ కృషి కేంద్రములు

✽ శ్రీమతి అ. చన్నఘంటమ్మగారు ✽

ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యములో, అనేకములైన అంతర్జాతీయ సాంకేతిక సంస్థలు నడుపబడుచున్నాయి. ప్రపంచ ఆహారసమితి, ప్రపంచ ఆరోగ్యసమితి, ఇంకా ఇలాగే, అంతర్జాతీయ విద్యా, శాస్త్రవిజ్ఞాన, సంస్కృతులసంస్థ యొకటి. దీనినే సామాన్యంగా యునెస్కో అని వాడుతున్నాము. United Nations Educational, Scientific and Cultural organisation అని దీని పూర్తి నామధేయము.

అంతర్జాతీయ కృషి కేంద్రములనేవి, యునెస్కో వారి కార్యక్రమములో ఒక విభాగమగుటచే, యునెస్కోయొక్క ఆదర్శ అభిప్రాయములేవని ముందుగా తెలిసికుందాం.

ఐక్యరాజ్య సమితి యొక్క ఆదర్శమే యునెస్కో యొక్క ఆదర్శముకూడ—విశ్వమానవ కల్యాణము, ప్రపంచ శాంతిస్థాపన. ఈ లక్ష్యసిద్ధికై, విద్యావ్యాప్తివలన, శాస్త్ర విజ్ఞాన వ్యాప్తివలన, భిన్నభిన్న సంస్కృతులుగల వివిధ జాతులవారిలో సామరస్యము, సౌభ్రాతృత్వము పెంపొందించుట యీ సమితియొక్క ప్రధానోపాయము.

ప్రస్తుతము వివిధదేశములలో విద్య, శాస్త్ర పరిజ్ఞానము ఏ స్థితిలో ఉన్నవో, వానివాని అభివృద్ధికి ఏఏ దేశములలో ఏఏ విధానములవలంబిస్తున్నారో, వీనిలో అభివృద్ధి గాంచిన దేశములవారెట్టి విధానము లవలంబించి యున్నారో, అనెడి వివరములను ముందు సేకరించి, వెనుకబడియున్న దేశములకు ధనవస్తు సాంకేతికుల రూపంగా సహాయపడుటయు, తాము సేకరించిన వివరములను, సమావేశముల ద్వారా, రేడియో, టెలివిషన్ల ద్వారా, మ్యూజియమ్, లైబ్రరీల నిర్మాణము ద్వారా, పత్రికల ద్వారా దేశదేశ ప్రజలకు అందించి, వారి అభివృద్ధికి తోడ్పడుటయు, యునెస్కో తలపైనున్న భారము.

అంతర్జాతీయ కృషి కేంద్రములు కూడ ఈ విద్యాసామరస్య వ్యాపక సాధనములలో నొకటి. ఈ కేంద్రములు కొంచమించుమించు స్వచ్ఛంద సేవకులతో నేర్పడ్డవని చెప్పవచ్చు. వివిధ పరిశ్రమలలో సాంకేతికులు, కృషికార్లు వీనిలో సభ్యులుగా ఉంటారు. ఇందలి యువకులు ఏదో ఒక ఉద్యోగములోనో వృత్తిలోనో ఇమిడివున్నప్పటికీ వారి సెలవు దినములలో, ఒకచోట సమావేశమై, ఏదేని ఒక నిర్మాణ కార్య క్రమములో చేతులు కలిపి కృషి జేస్తారు. వెనుకబడియున్న దేశములలోను, ముఖ్యంగా యుద్ధమువలన నష్టపడిన దేశములలోను, వీరి కృషియెంతయు అవసరమై యున్నది. వివిధ దేశముల యువకులు, వివిధ జాతులకు చెందినవారు, వివిధరాజకీయ వాతావరణలలో పెరిగినవారు, వివిధ ప్రకృతులు అభిరుచిగలవారు, వివిధ అనుభవములు శక్తి సామర్థ్యములు గలవారు, ఒక స్థలములో, ఒక కార్యములో, ఒక లక్ష్యముతో, ప్రవర్తిస్తారు. వారి ఊహాలన్నీ వారి చేతలన్నీ, యీఏకైక లక్ష్యసిద్ధిలో నిమగ్నమగుటచే, వారి కృషి మూలంగా, ఒక సన్నిహిత సంబంధం, ఒక బాంధవ్యం, ఒక సుహృద్భావము వారిలో పొడసూపుటయే గాక, తన్మూలంగా, ఒక జాతివారిని మరియొక జాతివారు, ఒక భాషవారిని మరియొక భాషవారు, ఒక సంస్కృతి వారిని మరియొక సంస్కృతివారు, పూర్తిగా, స్వానుభవము వలన, ముఖాముఖీ పరిచయమువలన, చక్కగా పరిశీలించుటకు, అర్థముచేసికొనుటకు మంచి అవకాశ మేర్పడుతుంది. సర్వమానవ సామరస్యమనే అపూర్వ లక్షణ మభివృద్ధి కెందటానికింతకన్న అవకాశమేమున్నది? ఇట్టి సంయుక్త కృషి వల్ల, తమతమ విద్యా, విజ్ఞానము కూడ అభివృద్ధి జెందటానికి వీలుకలుగును. భాషా భేదమువలన కొంతవరకు అరికట్టబడుచున్న అంతర్జాతీయ బాంధవ్యము, ఈ కృషిసామ్యమువలన చాలా భాగము సాధించవీలుగావచ్చు.

మనకు మిక్కిలి సన్నిహితమైన ఉదాహరణ చూడండి. ప్రస్తుతము ఆంధ్రదేశములోని తుపాను సంఘటనయే ఆలోచించండి. ఏంతయో నష్టము సంభవించినది. పునర్నిర్మాణ మెన్నియో విధముల జరుగవలసియున్నది. రైలుమార్గాలు, రోడ్లు బాగుచేయాలి. పొర్లి ప్రవహిస్తూన్న కాలువలకు,

# అంతర్జాతీయ కృషి కేంద్రములు

పొలాలకు చెలువులకు గట్లు వెయ్యాలి. నీట మునిగిన ధాన్యాని గాడవేర్చాలి. నిలచియున్న నీటిని పల్లపు ప్రదేశాలకు ప్రవహింపజేయాలి. ఇండ్లు కట్టాలి, పొలాలను బాగు చేయాలి, ఇంకా యెన్నెన్నో చేయాలి. నష్టమతి విశాలమగుటచే, పునర్నిర్మాణము త్వరలో సాధ్యపడదు. అక్కడ ఉన్న ప్రజలు, కర్షక కార్మికులు, యీ క్రియా తంత్రాన్ని సత్వరముగా నడిపించుటకు చాలరు. సందర్భమునుబట్టి అవసర వస్తువుల ధరలు పెరుగుటచే, కూలిధరయు పెరుగును. అందుచే నిర్మాణము మరింత కుంటుపడును. ఇట్టి సందర్భములో, భారతి దేశపు యితర ప్రాంతములనుండి వస్తు సరఫరాతో పాటు నేర్పరులు, కృషికారులు గూడ నష్టపడ్డ ఆ యా ప్రదేశములలో కేంద్రము లేర్పరచుకొని, స్థానికప్రజలతో చేయికలిపి నిర్మాణమునకు పూనుకొనినచో, రేపేపాటికి పునర్నిర్మాణము సాధ్యముకాదా! ఇట్టి సంయుక్త కృషివలన ఎంత చక్కటి సామరస్యము, ఎంత విలువైన సుహృద్భావము, ప్రజాసామాన్యములో కలిగే అవకాశమున్నది? ఈ అంతర్జాతీయ లక్ష్యముముందు, కుల మత ద్వేషములుగాని, రాజకీయవాదములుగాని, రాష్ట్రవిభేదములుగాని తలవాల్చ వలసినదేగదా!

ఇట్లా, ఎక్కడ ఏ అవసరమన్నా, ఎక్కడ ఏనిర్మాణము జరుగవలెనన్నా రెక్కలుగట్టుకు వ్రాలెడి స్వచ్ఛంద సేవకుల కేంద్రములే అంతర్జాతీయ కృషి కేంద్రములు.

ఒక 20 అంతర్జాతీయ సమితులు, ప్రస్తుతము 150 కృషి కేంద్రములను నిర్వహిస్తున్నారు. ఇందు 50000 మంది సభ్యులున్నారు. ఒక్కొక్క కేంద్రములో సమారమి 1000 మంది వరకూ పనిచేయుచుందురు. మరికొన్నింటిలో ఒక 30, 40 మంది మాత్రమే ఉందురు. కార్యముయొక్క అవసరమునుబట్టి యీ సంఖ్యమారుచుండును.

వీరి కృషికి ఒకస్థానం, ఒకవిషయం అని నిర్ణయములేదు. పొలాల్లో, ఇండ్లలో, అడవుల్లో, ఆటస్థలాల్లో, స్కూళ్లల్లో సమాజాల్లో, ఎక్కడైతే మనుష్య సహాయము కావాలో, అట్టిచోట్లన్నిటిలో వీరికేంద్రాలు ఏర్పాటు చేసికుంటారు.

ఈ కృషికేంద్రాలను నడపుచున్న అంతర్జాతీయ సంస్థలు ఒక్కొక్కమారు సమావేశమై తమ అనుభవాలను విచారించుకొని, ముందు కార్యక్రమాన్ని పర్యాలోచించుకుంటూ ఉంటాయి.

ఈ విధంగా వర్ణావర్ణము, అనేకమంది యువతీ యువకులు, యితర ప్రదేశముల వారితో కలసి మెలసి తిరిగి, ఒక కృషిలో సహకరించుటచే, ప్రపంచ ఐక్యతకు, శాంతికి తోడ్పడుచున్నారు.

యునెస్కో అవలంబించిన ఐక్యతాస్థాపన మార్గములలో నిది యొకటి. అన్ని దేశముల వారు తమ తమ ప్రజలలో యీ ప్రబోధమును కలిగించి, యీ కృషి కేంద్రములలో శక్తికొలది కృషికి పూనుకొనునట్లు చేసినచో, సుస్థిరమైన అంతర్జాతీయ భావము శీఘ్రముగా కలుగును.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో]



# సుశీల

## శ్రీమతి డి. యస్. రాజేశ్వరీ పట్నాయక్

జమాబందీ కాయితాలను చూచుకుంటున్న సుదర్శనానికి "యారోకోఓ ఆడదీ మొగోడు తమదరిసెనం కోసం వొచ్చేరు బాబయ్యా" అంటూ పాలికాపు వెంకాయ్ అతివినయంగా చెప్పేడు. "ఎవర్రా ఆ వచ్చేది? లోపలికి తీసుకురా" అన్నాడు సుదర్శనం. 'సిత్తం బాబూ' అని వెలుపలనున్న వ్యక్తులను యజమానివద్దవిడచి తన పనిమీద వెళ్ళిపోయాడు వెంకాయ్. అపరిచితులగు ఆ స్త్రీ పురుషులు దీనమైన ముఖాలతో వినయ పూర్వకముగా నమస్కరించారు. వారిని కూర్చుండ నియమించి వచ్చిన కారణం వినకుతూహలుడై ప్రశ్నార్థంగా చూచాడు సుదర్శనం.

"బాబూ మేము మిక్కిలి పరాధీనస్థితిలో నున్నాము. భోజనముచేసి నాలుగు రోజులైనది. ఆకలితో మలమల మాడి పోతున్నాం—మీకీర్తి విని చూడ చుట్టము మ్రొక్క దైవము మాకీ సమయమున మీరే" అని నమస్కరించి "కాశీతీర్థమున కేగివచ్చుచుండు దారిలో నా తల్లి గతించినది. భర్తచే విడువబడి అయిదు సంవత్సరాల నుండి నా దగ్గరే తలదాచుకొనుచున్న దీనిస్సహాయ నా సోదరి" అని తన వెనుక మోమువాల్చి నిలుచున్న రాధను చూపెను. వారి కష్టదశను విని సుదర్శనం దయార్ద్ర హృదయుడై "సరే కొన్నాళ్లు మా ఇంట్లోవుండండి ఆపైన భగవదాజ్ఞ" అని అభయమిచ్చాడు.

* * *

సుదర్శనం రాజపురానికి కరణం. చాల తెలివైనవాడు పిత్రార్జిత ధనంతో లేదన్న వారికి సహాయపడుతూ ఒడుదుడుకులంలేని జీవితాన్ని గడుపుతున్నాడు. భార్య, తల్లి, తనూ ముగ్గురే వారి కుటుంబ వ్యక్తులు. సుదర్శనం భార్య సుశీల, సద్గుణవతి. భారతనారీ జనసౌశీల్య మామెలో మూర్తీభవించి యున్నది. అత్తగారియందు భయ భక్తులుకలిగి భర్త అజ్ఞానువర్తినియై విచారభారములేక సంతోషాన్వితయైవుండేది. కార్యదక్షుడగు సుదర్శనమంటే ఆవూరి ప్రజలంతా వినయ విధేయతలు కలిగి అతనిమాట కెదురు చెప్పేవారుకారు.

* * *

కాలచక్రం గిఱ్ఱున వారాలు, నెలలు, సంవత్సరం తిప్పి వేసింది. కూటికి గుడ్డకు కరువై మార్గస్థులై వచ్చిన రాధా శ్యామలరావులు సుదర్శనం గృహంలో వారొసగిన ఆలన పాలనకు మిక్కిలి సంతృప్తులయ్యారు. పనిపాట్లులేక కుడిచి కూర్చొనుటయే పనిగల శ్యామలునకు లోలోన సిగ్గు కలుగుతూండేది. సుదర్శనరావు అతని అభిప్రాయమెరిగి ఒకవణిక్ ప్రముఖునివద్ద గుమస్తాగా 'కుంభకోణం'లో జేర్పించి సాగనంపేడు. తనకు ధనబలము బాగా కలిగేవరకు రాధను సుదర్శనరావుగారింటనే సుశీలాదేవికి గృహకృత్యాల్లో సాయం చేయుచు తలదాచుకునేందుకు రాజపురంలోనే వదలి వెళిపోయాడు. రాధ సుశీలకు చేదోడు వాదోడై అన్ని కార్య కృత్యాల్లోను సహాయంచేస్తూ తన వినయవిధేయతలచే అమాయికయగు ఆ గృహిణిని మెప్పించి నమ్మకస్తురాలైంది. సుశీల క్రమంగా గృహ కార్యాలుకూడ చక్కబెట్టుటకు రాధనే కోరేది. కాలక్రమాన రాధ ఆ గృహవ్యవహారాల్లో చనువు, స్వాతంత్ర్యత పొందింది. సుదర్శనానికికూడ ఆమెపై ఒక విధమైన అభిమానమేర్పడింది. అనాథయగు తనకాశ్రయమిచ్చి కాపాడుచున్న సుశీలా సుదర్శనులకు తన సపర్య సేవలతో కృతజ్ఞత వ్యక్తపరచేది రాధ. క్రమంగా సుశీల కొంగున కట్టుబడియుండే తాళపు చెవులగుత్తి రాధ కొంగున అమర్చబడింది.'

* * *

రాధ వినయ విధేయతలను, అద్వితీయమైన ఆమె గృహ నిర్వహణా నైపుణ్యాన్నిచూచి సుదర్శన్ చాల సంతోషించాడు. ఆమెపై నానాటికి అతని హృదయంలో ప్రేమ బీజాలు నాటుకున్నాయి. అమాయికయగు సుశీలకీ సంగతి తెలియదు. పురాణపఠనం, దైవపితృ తర్పణాలు ఉపవాస

వ్రతములు తప్ప యితర విషయ వ్యాసంగం ఆమెకు లేదు. సుదర్శన్ కేవలం శృంగార పురుషుడు, వ్రతోపవాసాల పేర్లువింటె విసుగుకొనేవాడు. భయభక్తులు కలవాడగుటవలన తన విసుగును బహిర్గత మొనర్చె వాడుకాడు. ఉపవాసాలతో కృసిస్తూన్న సుశీలను చూచే కన్నులతో నవయవ్వనముతో ప్రకాసిస్తున్న రాధ రూపసిరిని చూస్తూంటే అతను ఏదో తీరని కోర్కెలతో బాధపడుతూండే వాడు. రాధను లోబరచుకొనే ప్రయత్నాలు చేస్తూండేవాడు. తుదకు రాధ వంచితయైనది. రాధా సుదర్శనుల చెలిమి ఇంటా, బయటా గుసగుసలు పెనవేశాయి. ఒకొక్క సమయాన సుదర్శనాన్ని రాధ మందలించేది, తమ ప్రేమ లోకవిరుద్ధమని. ఏదో పుక్కిటి పురాణ గాథలను జెప్పి ఆమెను ఓదార్చెడువాడు సుదర్శనుడు. "పాపానికైనా జడియరా" అనేది రాధ పాపభీతి నాకుకలదు కాని నాచర్య నా పంచాంగంలో పాపభూయిష్టమని వ్రాయబడలేదు. ఈ ప్రపంచమంతా ప్రేమ పాలితం, ప్రేమమయం...యింకేం సందేహం నీకు? అనే వాడు సుదర్శన్. రాధ పూర్తిగ సుదర్శనానికి వశమై పోయింది.

* * *

సుశీలకు తనస్థానం తల్లక్రిందులైందని బోధపడింది. పతిని యెదురాడే శక్తి ఆమెకు లేదు. "సతికి పతియే దైవం! పతియే నిరసించిన సతిగతి ఏమికావాలి? పతి నిరసించిన సతి జీవితము బ్రతుకుచేటు గదా!" అని సుశీల ఏకాంతంగా విలపిస్తూ "ఓరిమి కనకతుల్య"మని ఒక "విధమైన అమృతత్వమంది మిడియున్నద"ని మా అమ్మ చెప్పుతుండేది నేనలా ఓర్పుతో సహన శక్తిని పురికొల్పి పతియొక్క నిర్దయా సుహారాన్ని శాలిమి అనే ఆతపకాంతిచే పటాపంచ లొనరించడమే నా కికర్తవ. పరమేశ్వరా నీవేశరణ్యాం," అని ప్రార్థించేది.

సుదర్శనం ప్రవర్తన యిప్పుడు పూర్తిగమారి పోయింది. ఇల్లూ వాకిలీ అనక అహర్నిశలు ప్రేమోపవిహారాల్లో ఆస్థి దుర్వ్యయమై చెదరిపోయింది. ప్రజలకు అభిమానం నశించింది. ఆప్తులవాళ్లు సుశీలను శ్రమపెడుతూండేవారు. సుశీలకేమీ తోచడంలేదు. వృద్ధాప్యముతో రోగగ్రస్తయగు అత్తగారి పాదాలపై విషణ్ణ వదనంతోపడి ఘోషించేది. పుత్రుని దుష్ప్రవర్తన విన్నకొద్ది ఆమె మనోవ్యాధి అస్వస్థ హృదయంలో అగ్నిగోళాలు బ్రద్దలైనట్లుండేది. సుస్కించిన హస్తాలతో సుశీలను హృదయానికి హత్తుకొని "విచారించకు తల్లీ, ఏనాటికైనా నీభర్తలో పరివర్తన కలుగక మానదు. యింతకన్నా ఏం చెప్పేది నీకు! విజ్ఞానవతివి నీకు తెలియనిదేమున్నది! అంతా పరమేశ్వరుని ఆజ్ఞ. నా మరణమాసన్నమవుతున్నది. కుమారుడవైనా కుమార్తెవైనా నీవే తల్లీ! నా పట్టెడి దేహాన్ని పిడికెడు బుగ్గిచేసి వ్యథతో వీడిన నా ఆత్మకు శాంతిచేకూర్చు" అనేది అత్తగారు. ఈ మాటలు వింటూన్న సుశీల కన్నీరు మున్నీరై పోయేది. అత్తగారి అంత్యావస్థ అనేమాట తలంపు కలిగితే తుఫాను మధ్య ఓడవలె తన స్థితినితలచి గడగడ వణకేది. తలిదండ్రుల కరువైన తన జీవితానికి ఆశ యెక్కడిది? ఆమె స్థితి నానాటికి దుర్భరమైపోవుచున్నది. గిన దినం శరీరం కృశించి పోవుచున్నది శిరోజాలు సంస్కారహీనమై జడలుకట్టి పోతున్నవి. అత్తగారి పరిచర్యలో నిద్రాహారాలు విసర్జించి ఆమె అంత్యదశలో విచారముతో మునిగియుండేది.

* * *

కలకత్తాలో దుర్గామహోత్సవాలు చూచుటకు రాధా సుదర్శనులు ప్రయాణ సన్నాహములో నున్నారు. తల్లి దశ మావస్థలో వున్నది. ఇంటిలో యిట్టి విషమావస్థ ఆవిర్భవించడం, పతి కలకత్తా ప్రయాణ సన్నాహం, చూచి సుశీల దీన వదనముతో భర్త పాదములపైబడి ప్రయాణ మాపమని ప్రార్థించెను. "ప్రయాణపువేళ నాకు బుద్ధులు గరపచూపుచున్నావా" యని పాదముల నంటియున్న సుశీలను పదాఘాతముచే త్రోసివేయ ఆమె అశక్తురాలై గజము దూరమున తృళ్లిపడి పోయినది. ప్రయాణాహ్లాదయైయున్న రాధ వచ్చి "పతికి సతిపై యెంతటి కారుణ్యాం"అని పరిహసించి హాసోన్ముఖియై బండివైపుకు నడచింది.

* * *

సుశీల అత్తగారు తనువుచాలించింది. శేషించినచేయూత కూడ నాటితో సుశీలకు చేజారిపోయింది. కలకత్తాకువెళ్లిన భర్త తిరిగి రాలేదు. సంవత్సరాలు గడిచి పోయినవి. అతని జాడలేదు ఆస్తిపాస్తుల నమ్మి ఋణముల తీర్చివేసి ఏకాంత

వాసియగు జీవనానికి సన్యాసాశ్రమం, తాపసజీవనం, ముక్తి పదమని నమ్మి మోక్షగామినియై విశ్వేశ్వరుని సేవింప కాశీ క్షేత్రమునకు బయలుదేరినది.

* * *

అది కార్తికమాసం. విశ్వేశ్వరుని దర్శనార్థమై జనుల రాకపోకలచే క్రిక్కిరిసియుండెను. జడలుకట్టిన కేశ కలాపంతో, కంఠాన ధరించిన రుద్రాక్షమాలలతో ఒడలంత విభూతికాంతులతో, తపస్వినియగు సుశీల స్వరూపము ఆ మహాజనరాశిలో గంపెడు రాళ్ళలో రత్నమువలె వెలుగుచుండెను. ఒక చేతిలో జపమాల యింకో చేతిలో పావన నదీ తోయాలు నిండిన పాత్ర పుష్పమాలలు మొదలైన పూజాద్రవ్యములతో పంచాక్షరీ మంత్రమును జపించుకొంటూ మూర్తీభవించిన భక్త్యావేశము ముఖముపై లాస్యమాడ ముందున్న వారు తమకు తామె తప్పుకొనగా సుశీల గర్భాలయములో ప్రవేసించి "నిరతము నిన్నే నమ్మియుంటిరా నీలకంఠ వరదా— అనాథలగు నాబోటి యువిదల కాశ్రయ మియ్యవె మదనహరా "అని ప్రణమిల్లి పుష్పమాలలతో నర్చించి, శ్రీ విశాలాక్షిని దర్శించి మిట్ట మధ్యాహ్నమైన వెనుక అభవునిగుడి వదలి నిజాశ్రమానికి జేరి ప్రసాదము స్వీకరింప బోవుచుండ "భజగోవిందం, భజగోవిందం గోవిందం భజ మూఢమతే" అనుశ్లోకం పాడుచూ అంధుడైన ఒక కాషాయ వస్త్రధారి కఱ్ఱసహాయంతో ఆశ్రమానికి జేరి పట్టెడన్నము పెట్టుడని యర్థించెను. సన్యాసి రోదనంవిని జాలిపడి భుజింప బోయే ఫలహారమును కొంతయిచ్చుటకై వచ్చిన సుశీలకు అంధ సన్యాసివదనం సుపరిచితమైనదిగా కనుపింప నిశ్చేష్టయైనది. గాని అతడేనా ?... అవునా... కాదా!... ఆలోచించుచున్న సుశీలకు... వేదనాభరంతో ఆ భిక్షుకసన్యాసి...

పన్నితి మాయోపాయములన్
పెట్టితి పతివ్రతను పలుబాములు
దేవా మోక్షమిక గలదె
నాకీ జగాన !

లొంగిపోతిని నీదు శిక్షాస్మృతికి
ఆరగించితి నాదుపాప ఫలముల
దేవా మోక్షమిక గలదె
నాకీ జగాన !

కటిక చీకటిలోన నెత్తుర్తి ఏడ్వనా
వాగులై ప్రవహించు పరితాపాశ్రులు
కదలింపవో నీదు పాషాణ హృదయమునను
నాబోటి వానికీ జగాన
మోక్షమికగలదె నాకీజగాన !

ఈ చీకటుల్ చెదటి కాంతులు క్రమ్మనా
ఏనెప్పటికైన వీక్షింతు నాచెలిని
దేవా మోక్షమిక గలదే-
నాకీజగాన !

అమృతవానలలో-గగనకాంతులలోన
విమలచరితలలోన-వికసించు నా సుశీల
దేవా మోక్షమికగలదె
నాకీ జగాన !

అని పాడుచు హృదయాగ్ని ప్రజ్వరిల్ల "నా ప్రాణములైగొమ్ము సుశీలా... శిక్షింపు మ"నుచు అరుగుపై తలను బాదుకొనుచుండ దిగ్భ్రాంతయై నిలుచున్న సుశీల సన్యాసి తన నామమె పలుసారులు పలుకుచుండుట, తన నాథుని పరిచయ కంఠం విని, "నాథా... సుశీల సర్వకాలములయందు మీ పదదాసియే! మన్నింపుడు సన్యాసి వేషమున మిమ్ము గుర్తింపలేక పోయితి" ననుచు పతిపాదములపై వ్రాలెను.

సన్యాసి ఆనందమునకు మేరలేదు. "నా సుశీల ... నా కాశ్రయ మిచ్చినదా ? నిజమా ! పరమేశ్వరా ! నా సుశీల దరికి నన్ను జేర్చితివా ?" యనుచు దిగ్భ్రమతో ఆనందాశ్రులు రాల్చెను—



# అలవాటు

❋ శ్రీ వై. యస్. రావు ❋

అలవాట్లు రెండురకాలు. మంచి అలవాట్లు, చెడ్డ అలవాట్లు. యివి రెండూ మనం పుట్టిన దగ్గరనుండి మన జీవిత పంథాల్లో ఎదుర్కొంటూాయి. మంచిఅలవాట్లు ఎన్నిరకాలు చెడ్డ అలవాట్లు ఎన్ని రకాలు, ఏదిమంచిది, ఏది మనకు అవసరము అనే వాటిని గురించి చర్చించడానికి నేను ఏమంత మేధావినిగాను. కానీ, నిత్య జీవితంలో మనలో ఎందరికీ అలవాటు అనే పదాన్ని ఉపయోగించవలసిన అగత్యమేర్పడుతుంది, అనే దాన్ని గురించి కొంచెం చూచాయగా మీకు చెప్పాలనివుంది.

"రావోయి రాముడూ, లోపలికిరా. బయటే నుంచున్నావేం" అంటే,

"పరవాలేదండి. కొత్తగా ఒకళ్ళ యింటికి నేను వెళ్ళను" అంటాడు.

పైన చెప్పింది ఒక రకం అలవాటు. సిగ్గు పడకుండా వుండలేక పోవడం ఒక అలవాటేమో.

"ఇదుగోనండి తమలపాకులు వేసుకోండి" అంటే

"అబ్బే నాకు అలవాటు లేదండి" అంటాడు.

యిక్కడ నిజంగానే అలవాటులేని వాళ్ళను సంధిస్తూ వుంటాం.

"ఏమండీ ఈ సిగరెట్టు కాల్చడం మానేయ లేరూ!" అని భార్య దీనంగా భర్తకళ్ళలోకి చూస్తూ అడుగుతే

"ఎంతో ప్రయత్నించేను, సరళా! కాని మాన లేక పోయాను. చాల చిన్నప్పట్నుండీ బాగా అలవాటు అయి పోయింద"ని జాలిగా అంటాడు. యిది నవ నాగరిక ప్రపంచములో మానలేనటువంటి జాలి చూపవలసి నటువంటి అలవాటు.

అమ్మలక్కలు మధ్యాహ్నపు ముచ్చట్లలో పిల్లాడుగాని వచ్చి గోలచేస్తే, రెండువడ్డించి "ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు గోల చేయవద్దని ఎన్నిసార్లు అన్నాను? ఎన్నితన్నినా ఈ అలవాటు, మానడమ్మా" అంటూ రాగం తీస్తుంది.

మరి నాలాంటి పిచ్చిరచయితలకు ఉన్నదిలేనిది కల్పించి ఏదో ఒకటి వ్రాయడం కూడఒక అలవాటే.

కొందరు ఆఫీసుకి సరిగ్గా టైముకు వెళ్ళాలనుకొంటూకూ ఆలస్యముగా వెళ్ళడం కూడ అలవాటులలో ఒక రకంలో చేరుతుంది. పైగా వారు అతన్ని చూచి "ఆ! రోజూ యితను యింతే" యని అనడం కూడ ఒక అలవాటే.

రేడియోలో ఒక్కొక్కప్పుడు గ్రామసంగీతం, రికార్డులు వినడంకూడ అలవాటే. బస్సుకి డబ్బులున్నా నడిచి ఆఫీసుకు వెళ్ళడం అలవాటు కొందరికి వుంటుంది. "నేను సామాన్యంగా బస్సుగాని, ట్రాముగాని ఎక్కను ఆ నాటే నడిచేండి" యని తనను గురించి అడిగే వారితో చెల్ల అనడంకూడ అలవాటే.

మనం తెలిసి చేయకలసిన కొన్ని చిన్న చిన్నంప తప్పులను, పొరపాటులను ఎవరైనా వివరిస్తేనా నొండి. సరే అలాగే అనేమాటల్లో పోనీక పైగా నాగా "ఆ! నాకు అలవాటు అయి పోయింది" అని అంటేస్తారు. కొందరు చేసిన తప్పులను మనం వారికి "అలవాటు మీరు అలా చేసారు కొప్పడకండి" అని అంటారు. అర్థం లేని అలవాటుగల వాళ్ళను చూస్తే లాగి లెంపకాయ యివ్వాలనీ అని అనిపిస్తుంది. కొందరు ఈ అలవాటు అనే పదాన్ని సంగతి, సందర్భం, లేకుండా ప్రతిదానికి అలవాటు, అలవాటు అని అంటూవుంటారు. అది ఎంతో పెద్ద వాళ్ళకు తెలియదేమో, అసలు అలవాటు అనేపదమే చాల చెడ్డది. దానిని ఉపయోగించడం తగ్గించుకోవాలి. చీటికి మాటికి అలవాటు అని అనడంకూడ చెడ్డఅలవాటే సుమండీ! (ఇక సెలవు)

---

## నిర్మలాదేవి గ్రంథాలయము

శ్రీయుత గాలి బాలసుందర రావుగారు, నిర్మలాదేవి గ్రంథాలయమునకు రూ. 20-0-0లు విరాళముగా పంపిరి. డిసెంబరు 28వ తేదీకి ఆమె స్వర్గస్థురాలై 4 సంటలు నిండినవి. ఈ సందర్భములో ఆమె గౌరవార్థము ఈయబడిన విరాళమిది. ఇందుకు మా కృతజ్ఞత.

ఆమెపేర స్థాపించిన గ్రంథాలయము పెక్కుమంది సోదరీమణుల కుపకరించుచున్నది. సహృదయులు ప్రత్యేక విరాళములచేత యీ గ్రంథాలయమును పోషించవలెనని కోరుచున్నాము.

కార్యదర్శిని



పులావ్ అనునది పారసీకపదం. అన్నముతో గూడ వేరుకాయ గూరలుచేర్చి వండిన పదార్థమని దీనిభావము. దీనినే మన ప్రాంతీయులు 'భాత్' అని అందురు. కొన్ని శాకములతో యీభాత్‌ను తయారు చేయువిధమును ఈదిగువ వివరింతును.

## టొమాటో భాత్

½ పడి సన్నని బియ్యం, 5 పలముల నెయ్యి ఉల్లిపాయలు, కొత్తిమిరి, కొద్దిగా అల్లం, వొక కొబ్బరికాయ, కొద్దిగా లవంగాలు, యాలక్కాయలు, దాల్చిణచెక్క మొదలైనవి సిద్ధముగా నుంచుకొనవలెను.

టొమాటోలు, ఉల్లిపాయలు తఱుగుకొని వుంచుకొనవలెను. అల్లం, వెల్లుల్లి వేరు వేరుగా నూరుకొని వుంచుకొనవలెను. కొబ్బరికోరు మెత్తగారుబ్బి, దానిపాలుతీసి, తయారుగా నుంచుకొనవలెను. తరువాత బియ్యము కడిగి, వుడుకుచున్న నీటిలోపోసి, వొక్కవుడుకు రాగానే, దింపి వార్చవలెను ఇంకొక పాత్ర పొయ్యి మీద పెట్టి, దానిలో నెయ్యిపోసి, అదిబాగుగా కాగిన తరువాత, వుల్లిపాయలు, వెల్లుల్లి వేసి, అవి కొద్దిగా వేగిన తరువాత, టొమాటో ముక్కలు, లవంగాలు, యాలక్కాయలు, దాల్చినచెక్క, పచ్చిమిరపకాయలువేసి, కొంచెం సేపు బాగుగా వుడకనివ్వవలెను. కొబ్బరి పాలలో అల్లం, వుప్పు కలిపి ఆ పాలు పొయ్యిమీది పాత్రలో పోసి పిదప అన్నము, కొత్తిమిరి వేసి మెత్తగా వుడకనిచ్చి దింపవలెను.

## వంకాయ అన్నము

½ ఔను మినపపప్పు, కొద్దిగా ధనియాలు, తగినన్ని మిరపకాయలు, కొద్దిగా మిరియాలు, జీలకర్ర, జాజికాయ, జాపత్రి, లవంగాలు నేతిలోవేయించి పొడికొట్టుకొనవలెను.

ఇవి బాగుగా నలిగిన తరువాత 1 చిప్ప కొబ్బరికోరు వుప్పు వేసి మరల కొంచెము దంచవలెను. ఈ పొడిని రెండు సమభాగములుగా చేసి, వానిలో వొక భాగమును కొంచెము చింతపండులో కలిపి వుంచుకొనవలెను.

పొయ్యిమీద వొక పెద్దబాణలి పెట్టి, దానిలో ½ వీశ నెయ్యిపోసి, మిరపకాయలు, సెనగపప్పు, మినపప్పు, ఆవాలు, జీలకఱ్ఱ తిరగమాతవేయవలెను. దానిలో ½ వీశ వంకాయలు ముక్కలుగా తఱిగివేసి, వానిలో చింతపండు గుజ్జుతో కలిపి వుంచుకున్న పొడినివేసి, కొద్దిగా నీరుచల్లి, సన్ననిసెగ మీద వుంచవలెను.

ప్రక్కన యింకొక పొయ్యి మీద, వొక పాత్రలో ½ పడి బియ్యపుఅన్నము కొంచెము బిరుసుగా వార్చవలెను. (ఇష్టమైనవారు దీనిలో పసుపుపొడికూడ వేసుకొనవచ్చును) ఈ అన్నము వుమ్మగిలిన తరువాత దానిలో 2½ పలం నెయ్యిపోసి కలిపి, వేరుగా నుంచిన సగము పొడిని అన్నములో వేసి కలిపి, ఆ పొడి బాగుగా కలిసిన తరువాత, వంకాయ కూరను అందులో వేసి, మరల గరిటె కాడతో (వంకాయ ముక్కలు నునిగి పోకుండ, జాగ్రత్తగా) కలిపి, మంటను తీసివేసి, నిప్పులమీద 5 నిమిషములపాటు వుండనిచ్చి దింపవలెను.

## మెంతికూర అన్నము

పైన చెప్పిన పొడులన్నియు తయారుగా నుంచుకొనవలెను. 6 కట్టల మెంతి కూరను బాగుగా కడిగి, నీటిలో

వుప్పువేసి వుడికించి, వడియకట్టి నీరు పిండుకొని వుంచుకొనవలెను. ½ పడి బియ్యపు అన్నము వండి, తరువాత పొయ్యిమీద వొక బాణలిపెట్టి, తిరగమాతవేసి, మెంతి కూరవేసి, అది కొంచము వేగిన తరువాత, అన్నమును వేసి, దంచి వుంచుకున్న పొడిచల్లి, బాగుగా కలిపి, ఆఖరున 2 పలముల నెయ్యిపోసి కలిపి దించుకొనవలెను.

## వాంగీభాత్

ఇదియు వంకాయఅన్నమే. దీనిని వుల్లిపాయలు, మసాల దినుసులు లేకుండ తయారుచేయు విధమిది.

కొద్దిగా ధనియాలు, ½ ఔన్సు సెనగపప్పు, ½ ఔన్సు మినపప్పు, ½ ఔన్సు కందిపప్పు. తగిన మిరపకాయలు, కొద్దిగా జీలకర్ర, కొద్దిగా యింగువ రెండుకొబ్బరి నేతిలో వేయించి దానికి తగినంత వుప్పువేసి, పొడిగొట్టుకొనవలెను.

½ పడి బియ్యపు అన్నము కొంచెము బిరుసుగా వార్చి వుంచుకొనవలెను.

15 పలముల లేత వంకాయలు సన్నని ముక్కలుగా తరిగి వుప్పు రాసి వుంచుకొనవలెను.

పొయ్యిమీద వొక పెద్ద బాణలి పెట్టి, 10 పలముల నెయ్యిపోసి, అది కాగిన తరువాత, వంకాయ ముక్కలను బాగా పిండి, ఆ నేతిలో వేసి అవి వేగిన తరువాత అన్నమును వేసి కలిపి, దంచి వుంచుకున్న పొడి చల్లి చక్కగా కలిపి పొయ్యిమీదనుంచి దింపి సన్నని నిప్పుమీద పెట్టి, అప్పుడప్పుడు కలుపుతూ 15 లేక 20 నిమిషములైన పిదప దించి మూతపెట్టవలెను.

దీనిని అన్నముతోనే కాక, గోధుమ రవతోకూడ చేయవచ్చును.

ఈ విధముగానే, వీటినే కాక మనము యితర కూరలతో కూడ, మన అభిరుచికి తగినట్లు, (వూహించుకొని) యెన్నియోరకములు తయారు చేసుకొనవచ్చును. కాని వీని కన్నిటికిని కొద్ది ఓపిక అవసరము. "కమల"



# శ్యామల, సుందరుడు

"శైవి"

సముద్ర తీరాన వున్నదా చిన్నపల్లె. ఆ పూరికంతా ప్రేం జేది వదే సంసారాలు. అంతా బీదవాళే. రెక్కాడితేనె డొక్కాడదు. రెక్కలు లేవాలి. గోపరాజు, రామరాజు యిరుగు పొరుగు వారు. చీకు చింతాలేని చిన్న సంసారులు. గోపరాజుగారి అబ్బాయి పేరు సుందరుడు. రామరాజుగారి అమ్మాయి శ్యామల. గోపరాజు రామరాజును తమ్ముడూ అనేవాడు. శ్యామల సుందరుని "అన్నయ్యా" అనేది. రామరాజు వ్యాపారి. గోపరాజు కర్షకుడు. బస్తీకి బోయినప్పుడు రామరాజు శ్యామలకు పూలు, రంగు రంగుల గాజులు తెచ్చే వాడు. సుందరుని దీసికొనిపోయి బస్తీతమాషలన్నీ జూపే వాడు. పంటలు వచ్చినపుడు రామరాజు శ్యామలకు రెండు కట్టల ధాన్యం బహుమాన మిచ్చేవాడు. ఆ ధాన్యము అమ్మిన డబ్బుతో బొమ్మల పెళ్ళి మహోత్సాహంగా జేసేది శ్యామల. శ్యామలా సుందరులు కలిసి బడికిపోయే వారు. పంతులు దండిస్తే యిద్దరు యేడ్చేవారు. వారికాపూరి పిల్ల లతో స్నేహములేదు. వారికి నేస్తాలు కొన్నిపిట్టలు, గులాబి, మల్లిపొదలు.

ఇంత చక్కని సంసారాలకు తిప్పలొచ్చాయి. విష జ్వరాలు పల్లెప్రజలను సర్వనాశము జేశాయి. శ్యామలతండ్రి చనిపోయాడు. గోపరాజు మంచమెక్కాడు. శ్యామల తల్లికి దూరదేశంలో అన్నగమ్ములున్నారు. చెల్లెలి దుస్థితి జూచి వారు ఆమెను తమ యింటికిరమ్మన్నారు. ఉన్న ఆ కాస్తడబ్బు వారిచేతికేయిస్తే బిడ్డను పెంచి పెద్దదాన్ని జేసి ఒకరిచేతుల్లో బెట్టేభూచి వారిమీదనే యుంటుందని గోప రాజుగారి సలహా వేడింది శ్యామల తల్లి. మంచి మాటే చన్నాడు గోపరాజు. వియోగబాధ ఆ రెండు సంసారాల నావరించింది కాని యెడబాటెరుగని ఆ పాపలకు భరించ రానిదైనది. శ్యామల వెళ్ళి పోతుందని సుందరుడు సుంద రుని విడిచి వెళ్ళాలని శ్యామల బెంగెట్టుకున్నారు.

ఇసుక తిన్నెమీద అంతా గూర్చొని శ్యామలాసుందరు [illegible] వచ్చాయి. "చెల్లీ [illegible]"

"[illegible] నాకేం తెలుసు అన్నయ్యా! ఒక్క పది రోజులుంది [illegible]"

"నిజమా?"

"[illegible] నాకు [illegible] కేం. నేను [illegible] నిన్ను [illegible] ఆడుకుంటూ. మరి నిన్ను [illegible] పోను. నీవు కూడ నన్ను జ్ఞాపకముంచు కొంటావా?"

"చెల్లీ నీవు లేక పోతే మన పిట్టలు చచ్చిపోతా యేమో నని భయమేస్తున్నది. గులాబి మొక్కలు, మల్లెలు నీవు లేక పోతే [illegible]? ఓన్ని వాళ్ళ అన్నలతో [illegible]. నీవు యిక్కడ నీ అన్నయ్యకద్దనే వుండిపోరాదు" శ్యామలకీమాట [illegible] నచ్చింది. అమ్మ వాళ్ళ అన్నయ్య లతో పోతే తనెందుకు బోవాలి?

ఒక్క పరుగులో యిల్లుజేరింది శ్యామల. తన వేదాంతం [illegible].

"సుందర అన్నయ్య యేడుస్తున్నాడే అమ్మా. నేను రాను. మీ అన్నలవూరు నీవుపోవే. నేను మా అన్నతోనే ఉంటాను. పిట్టలు యేడుస్తాయి. నేనురానే" అని చెప్పే కూతుర్నిజూచి యేడవాలో నవ్వాలో తెలియలా ఆమె తల్లికి.

"వెర్రి తల్లీ! నీవులేకుంటే నేనేమిగాను? నేను చచ్చి పోనూ! సుందరునికి నేను జెబుతాలే. త్వరలో మనము వచ్చి వేస్తాముగా, ఏడవకు మరి" అని నచ్చ చెప్పింది సీతమ్మ. అమ్మ మాటలు అర్థంజేసుకున్నది శ్యామల.

శ్యామల వెళ్ళి పోతున్నదని పిట్టలకంతా జెప్పేవాడు సుందరుడు. శ్యామల తనపెంపుడు మొక్కలకంతా నమ

స్కారాలు జెప్పింది. సుందరుడి దగ్గర సెలవు తీసికొని వచ్చింది శ్యామల.

“అన్నయ్యా నువ్వు చదువుకొని పెద్ద ఉద్యోగం జేస్తావని అమ్మ జెబుతుంది. నాకు కావలసినంత డబ్బు యిస్తావా? నాకు యేసహాయం గావల్సినా నిన్నే అడుగుతా, చేసి పెడతావా?”

“తప్పక జేస్తా చెల్లీ. నీ కొరకని పెద్ద చదువు చదివి డబ్బు సంపాదిస్తాను”

“మరి నువ్వు నాకోసం యేడ్వనని ఒట్టువేసుకో.”

“ఏడ్వను.”

“మరి నేను వెళ్ళిరానా అమ్మ పిలుస్తున్నది”

“చెల్లీ నన్ను నీవు మరచిపోకుండా నా చిన్నిబొమ్మను యిస్తాను. నీవు దీనిని పారేశావా నన్ను మరచి పోయినట్లే”

శ్యామల మేనమామలతో వెళ్ళిపోయింది. ఏమి తోచక సుందరుడు వాళ్ళమ్మదగ్గరే బిక్క ముఖంవేసి కూర్చున్నాడు పుట్టిననాటనుంచి యెనిమిది సంవత్సరములు ఒక్క రెమ్మకు బూచిన రెండు గులాబులవలె ఆడిపాడిన తననేస్తం ముక్కుముఖము తెలియని బస్తీకి వెళ్ళి పోయింది. పిట్టలకు మేత బెట్టుటకు యిసుక గుట్టవద్దకువచ్చి పిలిస్తే శ్యామల నేస్తాలైన పిట్టలు దగ్గరకు రాలేదు. శ్యామల బస్తీవెళ్ళి పోయిందని యిహా మీదట వాటికి గింజలు తనే వేయాలని వచ్చితినని పొమ్మని యెన్నివిధాల జెప్పినా అవి వినిపించుకో లేదు. పిట్టల యేడుపు విన్న సుందరుడు బావురు మన్నాడు. శ్యామల పెంచే మొక్కలకు నీళ్లు బోశాడు. మరునాడు శ్యామల పిట్టలు మేతదినలేదు. సుందరుడు యిన్ని రోజులు శ్యామలతో పిట్టలతో ఆడేవాడేగాని యితర బాలురతో స్నేహంలేదు. పిచ్చివాడిలా దిరిగేవాడు. కొడుకు దిగులు జూచి వాళ్ల అమ్మకుగూడ యెంతో బెంగగా వుండేది.

ఒకనాడు సుందరుడు అన్నయ్యవద్ద గూర్చొని మొదలెట్టాడు. “అమ్మా చెల్లాయి యీ వేళకు యేం జేస్తుంటుందే?”

“ఎప్పుడు చెల్లాయి మాటేనటరా? అన్నము దినడము లేదు, చదువు గోవడములేదు, దుస్తులు చూడు యెలా మాసి పోయాయో! నీవు యిలాగే యుంటే చెల్లాయికి వ్రాయిస్తాను నీవు యేడుస్తున్నావని”

“నేను యేడ్చానేమిటే అమ్మా? ఏడువనని చెల్లికి ఒట్టువేశాను అందువలననే యేడువలేదు. మరి అబద్ధాలు గూడ వ్రాస్తావా?”

“లేదు తండ్రీ, నీవు అనుచు పాడుచుంటే యేమి వ్రాయను. నీవు చదువుకొని పెద్దవుద్యోగివైతే చెల్లికి కావలసినన్ని చీరలు సారెలు బెట్టవచ్చు”

కొన్ని సంవత్సరాలు కాల గర్భంలో దొర్లి పోయినవి. శ్యామల యువతి. సుందరుడు యువకుడు. దూరదేశంలో నున్న శ్యామల తల్లి సుందరుని తల్లిదండ్రుల క్షేమ సమాచారాలు దెలుపుచుండెడిది. పెద్ద వుద్యోగస్థుడైతే కావలసినంత డబ్బు చెల్లాయికి సహాయపడవచ్చు. ఈ ధోరణిలో బడి సుందరుడు చదువుతో హతమతమై పోతున్నాడు.

కాలమొక విధముగా నడవదు. శ్యామల వెళ్ళినదేశంలో దుర్భరమైన కరువు వచ్చుటవలన తల్లీ బిడ్డల పోషణ పేదవారైన అన్నదమ్ములకు భారమనిపించింది. బంధుజనానికి దూరమైపోతే పిల్లకుమంచి సంబంధము దొరకదని సీతమ్మ శ్యామలను తన అక్కగారివద్ద విడిచి, తను సుందరుని ఊరు జేరింది. సుందరుని తండ్రి మరణించాడు. తల్లికితోడు పిన్నివచ్చినది గదాయని సంతోషించాడు సుందరుడు.

“శ్యామల రాలేదేమి పిన్నీ?”

“నేనే విడిచివచ్చాను నాయనా. శ్యామల నీవుజూచిన యెనిమిది సంవత్సరాల బాలికగా దిప్పుడు. నీలాగే పెరిగి పోయినది. పెళ్ళి కేయవలసిన రోజులుగదా. నాతో యీ దేశంవస్తే యిక్కడ మనమేమి తిప్పలు బడగలం? బరువు భారము మా అక్కయ్య మీదవేసి పిల్లనొకింటి దానిని జేయమని చెప్పివచ్చాను”

“చెల్లీ, శ్యామల సుందరుని జ్ఞాపకముంచుకొనియున్నదా? తన చదువేమో, శ్యామల కబుర్లేమో దప్ప ఒక్కవిషయము పట్టించుకోడు సుందరుడు చిన్ననాటి నేస్తాలను జూచాను గాని యింత పెఱ్ఱిబాగుల వానిని జూడలేదు” అన్నది సుందరుని తల్లి.

"అది పూర్వజన్మ ఋణానుబంధము దప్పమరేమిగాదు! 'ఆడపిల్లవమ్మా, ఎప్పుడు ఒక పురుషుని గురించి చెబుతుంటే యెవరైనా వింటే బాగుండదు. పెళ్ళిగావలసిన దానవు' అని శ్యామలతో నేను పలికితినా ఒక్క ముఖంవేసి అన్నయ్య దగ్గరనుంచి లాక్కొచ్చావు. ఈ కంపు ఊరిలో నన్ను ఖైదీని జేశావు. నన్ను అన్నయ్యను గురించి చెప్ప వద్దంటావేమే, అంటుంది

"మా బంగారు తల్లి బస్తీకి వెళ్ళనదన్న మాటేగాని దాని ప్రాణాలన్నీ యీ పల్లెలోనే యున్నవన్న మాట." అన్నది సుందరుని తల్లి.

"పిన్నీ శ్యామలకు యెప్పుడు పెళ్ళి?"

"పేదవారి పెళ్లి అంతత్వరగా అవుతుందా నాయనా?"

"బంగారు చిలుకవంటి నా తల్లికి సంబంధాలు రాక పోతే మరెవరికౌతుంది సీతమ్మా పెళ్లి! దానికేమి లోపమని నీవంతగా బెంగెట్టుకుంటావు?"

"నీకేమమ్మా, నిక్షేపంలా బంగారు తండ్రిని గన్నావు. మా అవస్థ నీకేలాగు దెలియును. పిల్ల చక్కనిదైతే సరి పోయిందా? కట్నంమాట వున్నదిగా!"

"మాయ దారి కట్నాలు. మరిదిబోతూ యిచ్చిపోయినది భుక్తికే సరిపోయి యుంటుంది. చెల్లెలిపెళ్లి సుందరుడే చేయాలి. ఏంత మిగిల్చావు చెల్లెలిపెళ్లికి?"

"కర్షకులేమి మిగిలిస్తారే? నాకున్న ఆస్థిలో చెల్లెలికి నాకు సమభాగాలు. మంచి సంబధం కుదిరితే మొత్తము మూడెకరాలు చెల్లికిచ్చి నేను బస్తీలో వుద్యోగం జేస్తాను"

"నీ బిడ్డలకు యేమి యిస్తావు?"

"పిన్నీ నాకు బిడ్డలువద్దు, పాపలు వద్దు. చెల్లి బిడ్డలకు గావలసిన విద్యా బుద్ధులు నేరేకుంటే సమంగా జరుగవు. వాళ్ళనుబెంచి పెద్దవారిని జేసేసరికి నేను ముసలివాడ నౌతును."

"ఇవేమి మాటలు సుందరా? బికారివై పోతానంటు న్నావు? ప్రశాంత జీవితాని కలవాటుబడ్డ నీవు ఆ పాడు బస్తీకిపోయి ఒకరి ముందు చేతులు జోడించుకొని నుంచుం టావా?"

"మరి శ్యామలకు పెళ్ళి కెలాగౌతుందే?"

"శ్యామల నెవరికో ఒకరికిచ్చి పెండ్లి చేస్తాను. బస్తీలలో పెద్ద పెద్ద సంబంధాలకు ప్రాకులాడితే చిన్నా నౌకరి జేయాల్సినదే. ఇక్కడే పదలాగే కూలినాలి చేసుకుంటే వానికిస్తే శ్యామల ప్రాణం లేచివస్తుంది. నీవు ఒంటరివాడవై స్వగ్రామం విడిచిపోవ వలసనములేదు."

"అది కాదు పిన్నీ"

"జవాబు చెప్పకు సుందరా. ఇప్పటికే ఒక పెద్ద తప్పు జేశాను నాయనా. అన్నా చెల్లెండ్రను వేరుజేసి దుఃఖ పెట్టాను. అది చాలదని చిన్న నౌకరిని జేయమంటావా? నీవు అలా ఉద్యోగాలకు పరపంచలు ప్రాకుచుంటే శ్యామల సుఖపడుతుందా? నీవు ఒకింటివాడవైతే రెండు సంసారాలు యిక్కడే హాయిగా వుండొచ్చు"

"నేను యెలాగు పెళ్లి జేసుకోను పిన్నీ. శ్యామల సంరక్షణ ఒకరు దీసుకొన్నా ఆమె బిడ్డల సంరక్షణ నేదీసు కోవాలి"

"చదువుకున్నవాడవు, నీకు నేను నచ్చ జెప్పగలనా? శ్యామలను రానీ. ఆమె యెలాగైనా నీ బుద్ధి మారుస్తుంది. ఆమెవద్దంటే అలాగే బ్రహ్మచారివై యుందువులే"

శ్యామల తల్లిలోని మాటకంతా మురిసి పోయారు. ఉత్తరం అంది శ్యామల బయలు దేరినది. ఒక చిన్న నావలో తనువస్తున్నట్లు మూడవరోజు పదిగంటలకు రేవులో పడవ చేరును గాబట్టి సుందరుని బంపమని జాబు వ్రాసింది.

మూడురోజులు మూడు యుగాలుగా గడిచాయి సుందరునికి. చిన్ననాటి స్నేహం తిరిగి వస్తున్నది. తెల్లవారక మునుపే లేచి సుందరుడు సముద్రతీరానికి జేరుకున్నాడు. ఎన్నో పుస్తకాలు జదివినాడు ఆమె లేని యీ యెనిమిది సంవత్సరాలలో. చెల్లికి చదువువచ్చు. ఇద్దరు హాయిగా సముద్రపు యిసుకలో కూర్చొని మరల అన్ని పుస్తకాలు చదువవచ్చు. చెల్లాయివస్తే మరల పిట్టలన్నీ వస్తాయేమో. సుందరుని మెదడులో ఊహాలు పరుగెత్తుచున్నవి. ఊహాలలో మునిగిన సుందరుని తలమీద చల్లనినీడ బడినది. తలెత్తి చూచాడు. ఒక్క మబ్బుతునక విలాసంగా ఆకాశ పథాన విహరిస్తున్నది. నీలాకాశాన అందాలు చిదిమే మేఘ కుమా

పని జూచి తన చెల్లెలుగూడ వడివడిగా యింటికి తేలివచ్చె స్తున్నదిగదా అని అనుకొంటున్నాడు సుందరుడు. ఇంతలో మబ్బుతునకలు ఒకటి, రెండు, మూడూ లెక్కకు మించి పెరిగిపోయాయి. నలుదిక్కుల నడ గొండలవలె వ్యాపించి ప్రళయగర్జన జేశాయి. సుందరుని మనస్సు ఝల్లుమన్నది. కారు మబ్బులకుదోడు వచ్చాడు వాయుదేవుడు. ఘోర మగు సముద్రము మీదనుంచి గాలి బయలు దేరడము జూచి సుందరుడు తల్లడిల్లి పోయాడు. "దేవ దేవా! దయా మయా! నా చెల్లెలిని భద్రంగా దరిజేర్చు. ఇంతవరకు ఆ మెజాడేలేదు. తుపానును నీ జటాజూటములో మరికొన్ని గంటలుదాచు. దీనబాంధవా రక్షించు" అని యేమేమో ప్రొక్కుచున్నాడు సుందరుడు.

ప్రొద్దునబోయిన బిడ్డను యిల్లుచేరలేదేమి చెప్పుమాయని యింటివద్ద తల్లులు యిరుగు పొరుగువారిని జేరబిలిచి సముద్ర తీరానికి బంపిరి. వారువచ్చి సుందరునిచూచి జాలి చూపు లతో సముద్రము వైపు జూచుచుండిరి. ఇంతలో సముద్రము మీద యేదోనల్లగా సుందరునికి గనుపించినది. పెద్ద పెద్ద చినుకులతో వర్షమారంభమై సముద్రములో భయంకర కెర టాలను రెచ్చగొట్టుచున్నది. వర్షము హెచ్చి సముద్రఘోష పెరిగి పోతున్నకొద్దీ ఆ చిన్న నల్లని వస్తువు, తెరచాపలు స్పష్టంగా కనుపించాయి. తన ప్రాణసమానమైన చెల్లెలిని దెచ్చేపడవ అదేనని నిర్ణయించుకున్నాడు సుందరుడు. కెరటాల తాకుడుకు పడవ ఆకులా అల్లలాడి పోతున్నది.

"అమ్మో, చెల్లీ జాగ్రత్త, భయపడకు, భగవంతుడు దయామయుడు" అంటూ పిచ్చికేకలువేస్తు తిరిగే సుందరుని అమాయిక ప్రేమనుజూచి అక్కడివారంతా అతనిని భయ పడవద్దని ధైర్యము జెప్పుచు దేవుని స్మరించుచూ నిల బడ్డారు.

పెనుగాలిహోరు హెచ్చిన కొలదీ తల్లుల మనస్సు లాగ లేదు. వారు సముద్రమునకేసి బయలుదేరిరి. కెరటాలకడకి తేలిపోతు పడవకొట్టుకొని వచ్చుచుండెను. ఇంకా ఒక్క మైలు గడచితే గాని పడవలోని వారు బయటబడరు. సరంగు గాని తెడ్లువేయువారుగాని యెవ్వరు గనుపించడము లేదు. [illegible] శ్రీమూర్తి వడి త్రోవలేక కెరటాల వూపులకు తేలి పోయే ఆపదలోనుంచి చేతులెత్తి రక్షించమని వేడుకోవడం జూచాడు సుందరుడు. శ్యామల రూపును పోల్చుకో లేక పోయినా ఆమె శ్యామలయై యుండవలెనని ఊహించాడు. జీరాడే చీరతో, ఎగిరి పోతున్న జుట్టుతో ఆ మూర్తి నిస్స హాయయై చేతులెత్తి ప్రొక్కుచున్నది. ఆ దృశ్యము జూచిన సుందరుని హృదయం ద్రవించి పోయింది. సోదర ప్రేమ ఒక్కమారు విజృంభించినది.

"తాతా నేనువెళ్లి చెల్లెలిని దీసికొనివస్తాను. పడవ మునిగి పోయేలాగున్నది"

"తొందరపడకు నాయనా. ఆ భయంకర సముద్రుడు నిన్ను భద్రముగా మరల రానిచ్చునా? కెరటాలు మహా భీభత్సంగా వున్నవి. భగవంతుడుదప్ప మరెవ్వరు ఆ బాలను రక్షించ లేరు. నామాట విను" అని ఓదారుస్తున్నాడు. సముద్రయానము జేసిన రామన్నకు పడవ తీరముజేరడ మసం భవమని తెలుసు. పడవ మునిగి పోతుందే. అయ్యో విధీ" అంటూ నాల్గువైపులనుంచి కేకలొక్కమారుగా ముట్టాయి.

"నన్ను యింకా పట్టుకుంటావేమి తాత! నీకేమైనా మతి బోయిందా? చెల్లి చచ్చిబోతుంది. చూడు చూడు పడవ మునిగిపోతున్నది నన్నువిడు" అంటూ ఉరికాడు సుందరుడు. తీరాన ప్రజలు హాహాకారాలు జేస్తున్నారు.

సుందరుడు పుట్టినది మొదలు సముద్రముతో చెలగా టములాడిన వాడు గాబట్టి చేపపిల్లలా సముద్రములోనికి జొచ్చుక పోయాడు. విధి విలాసాలు దుర్భ్యాములు గదా! ఇంకెంతో దూరములేదు. మునిగి బోయే పడవను జేరు చున్నాడు. భయపడవద్దని చేతులెత్తి చెల్లెలి కభయ మిస్తు న్నాడు. శ్యామల తన అన్నయ్యను గుర్తించింది. "అన్నా! వద్దు, వద్దు. నా కొరకు నీవు గూడ చావవద్దు. నిన్నుజూచా నురా యిక నాకు కోరికలు లేవు. నీవు ముందుకు రావద్దు" అంటూ పిచ్చిదానిలా కేకలువేసింది కాని సముద్రుడు ఆమె మాటలు సుందరునికి వినిపించ కూడదనే పట్టు బట్టినాడు. ప్రళయనినాదములో ప్రుంగిపోయింది నావ. సుందరుని ఆశలు నిరాశలై బోయినవి. తలపై పిడుగుబడినది.

(తరువాయి 40వ పేజీలో)

 వాహినీవారి 

‘కవ్వించి నవ్వించే’

జానపద చిత్రం

# గుణసుందరి

డైరెక్షన్ : కె. వి. రెడ్డి, బి.యస్.సి.

1949లో వెలువడ్డ తెలుగు చిత్రాల్లో అగ్రతాంబూలము నందుకునే అర్హతగలది, వాహినీవారి ‘గుణసుందరి’. పరమేశ్వరుని భక్తవాత్సల్యము, ఈశ్వర సంకల్పము ముందు మానవ సంకల్పముయొక్క నిష్ఫలత, ఆయువు పట్టుగా గుణసుందరీ దేవియొక్క పాతివ్రత్యము ప్రధానవస్తువుగా, భక్తి, కరుణ, అద్భుత, హాస్యరసములతో, ప్రేక్షకులకు మిక్కిలి వినోదమును కలిగించునట్టి, జానపద గాథ ఇది.

పుత్ర సంతానలేమి కించుకయు వగవక, తల్లిలేని తన ముగ్గురు కుమార్తెలను అతిగారాబముతో పెంచి వారికి తన రాజ్యమును పట్టముగట్ట వేచియున్న ఉగ్రసేన మహారాజునకు ఒక అవ్యక్త మూర్ఖ ఫలాపేక్ష—తన గారాబు పట్టిలు తనకంటె అధికముగ, నెవ్వరినీ ప్రేమించరాదని. ఈ మూర్ఖతచే, అవివేకులైన తనమేనల్లుండ్రను తన పెద్ద కుమార్తెలకు భర్తలుగా, ఇల్లరికపుటల్లుండ్రుగా నిశ్చయించి, మూడవ కుమార్తెయగు గుణసుందరికి వరుని వెదకుచుండెను. తన షష్ఠిపూర్తి మహాసభలో, తన యీ యాప్సితమును సభికుల కెరింగించి, తన కుమార్తెలకు తనయందుగల ప్రేమ గౌరవములను వివరింపమని కోరగా, ధన కాంక్షులగు పెద్దవారిరువురు, తమకు తండ్రిని మించిన దైవముగాని, ప్రేమ గౌరవ పాత్రుండు గాని వేరులేడని, కృత్రిమ వచనములను పల్కిరి. సత్యశీలయగు గుణసుందరి మాత్రము, తనకు అపారమైన పితృవాత్సల్యమున్నప్పటికీ, తన భర్తనే తండ్రికన్న ఎక్కువ ప్రేమించుట స్త్రీ ధర్మము గనుక, తాను ఆ ధర్మమునకే బద్ధురాలు కాగలదని చెప్పెను. ఇందులకు తండ్రి కుపితుండై, వృద్ధుండు, అనాకారి, వికలాంగుండు అయిన పతియైనచో, తాను తన తండ్రికన్న ఎక్కువగా ప్రేమించగలదాయని ప్రశ్నించెను. ధీరయైన గుణసుందరి “దేవుండే అట్టి పతిని నిర్ణయించిన తప్పక నట్లే ప్రేమింతును”ని బదులుచెప్పెను. అవివేకియైన తండ్రి ప్రశ్నకు, తిరిగి నిశ్చలమతితో, తనకు పతిని నిర్ణయించునది దేవుండేగాని తన తండ్రికాదని మారుపల్కెను. దురహంకారియైన నృపుండు, కోపపరవశుండై, సుగుణపుంజము, సురూప లావణ్య, అగర్భ శ్రీమంతురాలునగు తన గారాబుపట్టిను, కుంటి, గ్రుడ్డి, మూగవాడైన ఒక వృద్ధ దరిద్రునికికట్టబెట్టెను.

గుణసుందరీదేవి దీనినెట్లు భరించినది, తన పాతివ్రత్యాన్ని కాపాడుకుంటూ, కుపితుండైన తండ్రిచేత ఇంటినుండి తరిమివేయబడికూడా తనకు గల పితృవాత్సల్యము నెట్లు నిరూపించ గలిగినది, తన భక్తురాలికి పరమేశ్వరుండు నిర్ణయించిన భర్త, వికలాంగుడైన దైవాధీనమేనా, రాజు అజ్ఞానము, అహంకారము ఎట్లు తొలగిపోయినవి—ఇది కథయందలి మిగతా కలాపము.

దర్శకుండు వివిధ పాత్ర పోషణలో చక్కటి నేర్పును చూపెననుట అతిశయోక్తికాదు. గుణసుందరిగా శ్రీరంజని భక్తి, కరుణ రసము లొలికిస్తూ చక్కగా నటించినది. దైవాధీనం పాత్రలో శివరావు హాస్యము పట్టుపగ్గాలు లేకుండా ఉన్నప్పటికీ, దైవాధీనము పైకి కనపడుచున్న వికలాంగుండుగాక, ఎవరో మహావ్యక్తియనే సూచనలు మొదటినుండి కనపడుచుండుటచే, యీ హాస్యమును సంతోషముతోనే ప్రేక్షకులు భరిస్తారు. పెద్ద అల్లుండ్రైన హరమతి, కాలమతుల పిరికితనము మూర్ఖత్వము, చేతకామి, నవ్వు పుట్టిస్తుంది. అంజనము, మహేంద్రమణి అన్వేషణ, యక్షకన్యలు, బ్రహ్మరాక్షసి, ఎరుకల గూడెం, ఎలుకలు, ఎలుగుబంటి—కావలసినంత జానపద వాతావరణం—ఆ వాతావరణమునకు తగిన చక్కటి భావం, భాష, రాగం—అన్నీ అనువుగాగల గానం—దర్శకుడు,అతి నేర్పుతో, ప్రేక్షకులను, మూడుగంటల సేపు, యీరస పూరితమైన వాతావరణలో ముంచి తేలవెత్తగల చిత్రమును తీసెననుట అతిశయోక్తి కానేరదు.

★

"నీవు లేకుండా నేనుతీరము చేరగా గల్గె. నీవు ఎక్కడ-యున్నావో" అంటూ పడవ మునిగినవైపు యీదుచున్నాడు సుందరుడు. ప్రద్దలైన పడవకు జెందిన కఱ్ఱలు పలకలు స్వేచ్ఛగా తేలిపోతున్నాయి. ఒక పలక కంటిపెట్టుకొని యెవరో తేలిపోవుట చూచాడు. దగ్గరకు వెళ్ళి పరిశీలించి చూడ ఒక స్త్రీమూర్తి కొంగుతో పలకకు జుట్టుకొని తేలుచున్నది.

"దేవుడు దయామయుడు చెల్లీ. నా ప్రేమ ఫలించింది. నిన్ను పిన్నికియిచ్చే అవకాశం భగవంతు డిస్తాడనుకోలా" అంటూ క్షీణించిన స్వరముతో తీరానికేసి బయలు దేరాడు సుందరుడు. సముద్రుడు శాంతించాడు. పలకను లేని ఓపిక తెచ్చుకొని ముందుకు త్రోసుకొంటూ వచ్చుచున్న సుందరుని గుర్తించారు తీరానప్రజలు. బిడ్డలరాకను చూచారు తల్లులు. దయచూపిన ఒక అల వారిని తీరము జేర్చినది. పరుగు పరుగునజేరి పలకరించారు గాని యేమున్నది! పడవ మునిగినపుడే శ్యామల ప్రాణం అన్నయ్యకు జెప్పకుండా వెళ్ళిపోయింది. కళ్ళువిప్పి చూచాడు సుందరుడు. తానిచ్చిన చిన్న బొమ్మను మెడలోని గొలుసులో వేసుకొనియున్నది. ఆ బొమ్మను ఒక చేతితో పదిలముగా బట్టుకొని రెండవ చేతిని పలకమీద ఆనించి నిద్రబోవుచున్నది తనముద్దుచెల్లెలు. రెండశ్రుబిందువులు రాలాయి పాపము యువకుని కళ్ళనుండి. ఇంతలోనె "ఇంకేమి చెల్లాయిరా నాయనా" అన్న మాట లువినవచ్చాయి. "చెల్లాయి మనలను మోసము జేసి వెళ్ళిపోయిందిరా తండ్రీ" అన్నారు మరల.

"అమ్మో! చెల్లీ!" అంటూ సుందరుని ప్రాణం శ్యామ అను వెదుకుచూ బయలు దేరింది.

వారి అమరప్రేమనుచూచి లోకం నీరైపోయింది. భగ్న హృదయులైన ఆ తల్లులు వారికి సమాధులు గట్టించారు. శోకమూర్తులై వాటివద్దనె కాలక్షేపంజేసి ఒకనాటికి వారి ముద్దుబిడ్డలను జేరారు. వారుబోయారుగాని ఆ మధురప్రేమ చిహ్నంగా ఆ సమాధులే మిగిలాయి. క్రూర సముద్రుడు యిప్పుడు దుఃఖిస్తూ కెరటాల కన్నీటితో వారి పాదాల కభిషేకము జేయుచున్నాడు.



# జీవితోత్సాహము

* శ్రీమతి అ. గిరిజగారు *



లక్షణమైన కాపురానికి హాయిగా నడ్వగలగటం, పరస్పర సహానుభూతి అన్నవి దోహదము చేయగలవే కాని అసలు కాపురాన్ని నిలబెట్టేది, కాపురానికి ప్రాణమువంటిదీ జీవితోత్సాహమేనని చెప్పక తప్పదు. మానసిక వైకల్యం లేని ప్రతిజీవి ఆనందాన్ని అభిలషిస్తుంది. సర్వ సౌఖ్యాలకు సంతోషము ప్రధాన లక్షణము. జీవితంలో పొందగలిగినంత ఆనందాన్ని సాధించి అనుభవించటంకంటె కోరతగిన పరమావధి మరొకటి లేదు. కుమిలిపోయే వ్యక్తిని లోకం మరింత కుంగతీస్తుంది. ఆనందాన్ని వెదజల్లే వ్యక్తిని చూసి లోకం కూడ ఆనందిస్తుంది.

ఆనందానికి దారితీసేది ఆసక్తి, నిస్పృహకు దారితీసేది నిరుత్సాహం. శారీరకంగాను, మానసికంగాను, చైతన్యంకలగటానికి ఆసక్తి తోడు పడుతుంది. నిత్య జీవితాన్ని మార్పు లేని రోకంటి పాటగా తయారు కానీయకుండ, చేసే ప్రతి పనిలోను ఒక కొత్త లావణ్యాన్ని, ఒక చెప్పలేని వుత్సాహాన్ని ఆసక్తి వ్యక్తం చేస్తుంది. ఆసక్తి అడుగంటితే బ్రతుకే బరువవుతుంది. కష్టాలను ఇబ్బందులను ఎదుర్కొనే ధైర్యములేక జీవితం నీరు కారిపోతుంది.

కొందరు ఏ పనిచేస్తున్నా ఆడుకుంటున్నట్లే ఉంటుంది. ప్రతిదీ సులువుగా నెరవేరినట్లే కనపడుతుంది. మామూలు దినచర్యలో విసుగుకు బదులు వుత్సాహం కనిపిస్తుంది. పసిపిల్లలను పెంచటములో, గృహకృత్యాలు నెరవేర్చటములో ఇంటిని అలంకరించటములో, తమను అలంకరించుకోవటములో ఒక విధమైన శ్రద్ధ కనిపిస్తుంది. వీటన్నిటికి మూల కారణం జీవితములో ఉత్సాహమే. జీవితంలో ఆసక్తి ఉత్సాహము లేనివాళ్లు ఏ పనిచేసినా భారంగా కనిపిస్తుంది. ఏ పనిచేసినా నా కోసం కాదు లోకం కోసమే అన్నట్లు ఎబ్బెట్టుగా ఉంటుంది. వెంట కొంతమందివుంది అడుగడుగుకు శ్రద్ధ తీసుకుంటు వాళ్ళ సౌఖ్యం కలిగించు కోకపోతే ఎక్కడ వున్నావే గొంగడీ అంటే వేసిన చోటనే ఉన్నానన్నట్లు పడివుంటారు. అటువంటి జీవితం దుర్భరమనిపిస్తుంది. జీవితంలో ఆసక్తి మానవ జీవితాన్ని యిట్లా తారుమారు చేయగలదు.

జీవితోత్సాహం లేనివాళ్ళ జీవితాలు వ్యర్థం అయిపోతూ ఉంటయ్. వాళ్లు ఏ విషయం మీదా ఒక నిర్ణయం చేసుకోలేక Hamlet లాగా స్తరుగా భగ్న జీవులవుతారు. జీవితంలో వచ్చే సదవకాశాలను జారవిడుచుకుంటారు. గమనించే లోపలే అవకాశం దాటి పోగలదని గుర్తించలేరు. జీవితోత్సాహం లేనివాళ్లు ఒక అంటు వ్యాధివంటి వారు. తమకు జీవితంలో ఆసక్తిలేక జడత్వము వహించి ఒక చోట కూర్చోవటమే కాక కుటుంబములోని యితరుల వుత్సాహం మీద కూడ నీళ్ళుచల్లుతారు. అణచపడిన ఉత్సాహం వికృత రూపం తాలుస్తుంది. సహజ లావణ్యం పోయి ఆ జీవితాలే మొద్దుబారి వలసివస్తుంది. చివరకా సంసారంలో సహజ సంతోష సౌఖ్యాలు, మనసులకు తృప్తి అనేవి లేక అది యిల్లుగానే కనపడదు. సత్రానికీ, మఠానికీ మధ్యస్థానం వహిస్తుంది. అంతకంతకి సంసారంలో పరస్పర ముభావము విరక్తి ఎక్కువయి చివరకు పరస్పర అభిమానము ఆత్మీయత కూడ నశించిపోతయ్. అందువల్ల సంసారము ముచ్చటగా సలక్షణంగా వుండాలంటే కుటుంబములో వుండే ప్రతి ఒక్కరు జీవితోత్సాహం కలిగి ఉండాలి.

సంసారములో ఆనందము వుండాలంటే, ఇంట్లో ఒకరినొకరు చక్కగా అవగాహన చేసుకోగలిగి వుండాలి. ఒకరి తత్వ మొకరు సరిగా తెలుసు కోవాలని ప్రయత్నం చేస్తేనే ఒక్కొక్కప్పుడు అసాధ్యంగా కనిపిస్తుంది. అటువంటి పరిస్థితులలో ఎదటి వాళ్ళను ఏ విధమైన ఆత్మీయత, సహానుభూతి, విశ్వాసము లేకుండ చూశామంటే వాళ్ళ చర్యలు ఎంతో వింతగాను, విపరీతంగాను కనుపించుతయ్. కుటుంబములో తమను యితరులు సరిగా అర్థం చేసుకోవాలన్న ఆసక్తి, ఇతరులను తాము సరిగా అవగాహన చేసు

# జీవితోత్సాహము

కోవాలన్న శ్రద్ధలేకపోతే ఎవరు మిత్రులో ఎవరు శత్రువులో ఎవరు నిజంగా శ్రేయస్సును కోరేవాళ్ళో ఎవరు ఉపన్యాసప్రియాలు చెప్పేవాళ్ళో అంతు పట్టదు. జీవితములోవచ్చే సమస్యలన్నిటిని పరిష్కరించుకొని సుఖమయంగా చేసుకోవాలంటే వీలయినంత హాయిగా జీవించాలన్న ఇచ్ఛ—సంపూర్ణ జీవితోత్సాహం వుండాలి.

లక్షణాయుక్తమైన ముచ్చటైన కాపురములో సర్దుబాటుకు చాలా ముఖ్యతవున్నది. ఉమ్మడిగా వుండే మన హిందూ సంసారాలలో తలిదండ్రులు, కొడుకులు కోడళ్లు, కూతుళ్లు అల్లుళ్లు, మనుమలు మనుమరాళ్లు యింకా బంధువులు, ఎందరో వుంటారు. ఇంతమంది కలిసి వుండే చోట సర్దుబాటనేది ఎంత అవసరమో చెప్పనవసరము లేదు. సర్దుబాటు ఎంతవుంటే అంత శాంతము, ఐక్యత ఆ యింట్లో వుంటయ్. కాని యీ సర్దుబాటు కూడ జీవితోత్సాహానికి కూతురే. జీవితంలో ఆసక్తివుంటేనే తప్ప చిన్న చిన్న హెచ్చు తగ్గులను పొరపాట్లను సర్దుకు పోదాము, సరదాగా రోజులు గడుపుదాము అనే తలంపు కలుగదు. నిరుత్సాహంగా కాలము గడిపేవాళ్లు మనకేటు జరగబోయే మంచి, కలగబోయే ఆనందములేవు, ఇతరుల మనసుకు ఎట్లావుంటే యేమనే దురూహాతో నిరాశా ప్రేరితమైన స్వార్థంతో దురుసుగా వెటసుగా మాట్లాడుతూ, యితరులవాళ్ళను అనవసరంగా నొప్పిస్తారు. జీవితంలో వుత్సాహము, పరిపూర్ణమైన ఆసక్తి వున్నవాళ్ళే తాము ఆనందిచుచూ యితరులను ఆనంద పరచాలని చూస్తారు. ఇంటిని స్వర్గ తుల్యంగా చేస్తారు. ప్రతి వారితోను కలుపుగోలుతనంగా వ్యవహరిస్తారు. వితరణ, విచక్షత ఎక్కువగా వుంటాయ్. అందువల్ల ఇతరుల కష్టసుఖాలను తెలుసుకునే అవకాశం ఏర్పడి జాయలా పాయలాగా మసల గలుగుతారు. ఇదే క్రమంగా సంఘసేవకు దేశసేవకు దారితీసి కృతార్థులు కావటానికి వీలవుతుంది. జీవితాశక్తి లేక పోతే మనసు సంకుచిత మవుతుంది. చేయగల పరోపకారం లేక పోగా ఈర్ష్య, దుస్సహనం మొదలయినవి కూడ ప్రాప్తించుతయ్. ఆసక్తివుంటే ఆనందం అందుబాటులోకి వచ్చి తీరుతుంది. ఆ ఆసక్తే లేక పోతే ఇప్పుడు సౌఖ్యము వుండదు సరిగదా ముస్ముందు కూడ అటువంటి అవకాశం సంభవించదు. జీవితోత్సాహం లేని వాళ్ళకు యే ఉత్సుకత, ఆశ, ఆరాటము వుండవు. ఆశ అనేది ఒక జ్యోతివంటిది. ఆ జ్యోతే ఆరిపోతే జీవితమే అంధకారమవుతుంది. దీపమే లేని యింట్లో కాపురమెట్లా చక్కదిద్దుకొనగలం? ఒక యింట్లో నలుగురు వుండి ఆ నలుగురు జీవితోత్సాహంలేని వాళ్ళైఅయి, పరస్పర సహానుభూతితో ఒకరిని చూసి ఒకరు నీరు కారిపోయినా ఆ సంసారములో సుఖమువుండదు. చూడ ముచ్చటగావుండదు. లేదా వాళ్ళకు నిజంగానే మనసులో వుత్సాహము ఆసక్తి లేక పైపైకి నవ్వుతు మాట్లాడుతు కాలక్షేపము చేస్తున్నా అతుకుపెట్టినట్లు ఆ నడవడి అసహజంగా వుంటుందే కాని సహజమైన హార్దిక సుఖము ఆనందము వుండవు. జీవితోత్సాహం లేనివాళ్లు ఎప్పుడు వ్యాకులంగా చికాకుగావుంటాన వారి ఆరోగ్యముకూడ సరిగావుండదు. మనసుకు సరియైన వ్యాపకమువుండి మనసు సరియైన సహజ మార్గాన పనిచేస్తున్నప్పుడే శరీరంకూడ సరిఅయిన ఆరోగ్యస్థితిలో వుంటుంది. మానసికంగాను శారీరకంగాను తాము సుఖపడుతు, యితరులను సుఖపెడుతు తన సంసారాన్ని లక్షణా యుక్తమైన ముచ్చటైన కాపురంగా చేసుకోవాలంటే ప్రతి మానవుడికి కొంతయినా జీవితోత్సాహం, జీవితంలో ఆసక్తి, తప్పని సరిగా వుండి తీరాలి. గత్యంతరము లేదు.

[ఆలిండియా రేడియో సౌజన్యముతో]





# శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు

శ్రీ అమృతానంద గురుజయంతి సందర్భమున, తే 15-11-49 న, కాకినాడ పురవాసినియు, బహుగ్రంథకర్త్రియు, సావిత్రిపత్రికా సంపాదకురాలునగు, శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబ గారిని "కావ్య కళా విశారద" యను బిరుదము తోను రజతపాత్రముతోను, శ్రీ తిరుపతి త్రిలింగవిద్యా పీఠము వారు సన్మానించిరి.

* * *

వీరు ఆర్వేల నియోగి కుటుంబములో ప్రమాది నామ సంవత్సరమున జన్మించిరి. తండ్రి నీలాచలముగారు. తల్లి అగ్గ మాంబ. వీరికిరువురు తమ్ములును, ఇరువురు చెల్లెండ్రును గలరు. సంతానవతులు. ఒక కుమార్తెయు కుమారుడును గలరు. అందరు విద్యాభిరుచి నెఱిగిన వారే. "విమర్శ దర్శక" బిరుదము నందిన కీ. శే. నడకుదిటి వీరరాజు పంతులుగారు వీరి మేనమామగారు. వేంకట పార్వతీశ్వర కవులలో వేంకటకవిగారు వీరికి బుట్టినింటి కుటుంబము లోని వారు. వారు చిన్ననాటినుండియు, నాట పాటల లోను, విద్యాగోష్ఠియందును, వీరితో మెలగిన వారు. వీరి మాతామహులను ప్రపితామహులును అమూల్య గ్రంథ రచ యితలు. వీరి మాతా మహుల చరిత్రము వీరేశలింగము పంతులుగారి కవుల చరిత్రలో "నడకుదిటి రామనకవి" అను శీర్షికతో ప్రకటితమయ్యెను.

వీరి విద్యాసక్తికి గారణము పూర్వ జన్మ సంస్కారమే గాక, కుటుంబ పండితుల ప్రోత్సాహము కూడనై యుండెను. వీరి లోకమున జేసిన సేవకు వీరి భర్తగారి ప్రోత్సాహ మత్య ధికము. భర్తగారియొక్కయు, మేనమామగారి యొక్కయు శిక్షణా దోహదమే, వీరి విద్యాలతకు ప్రాకైనది. వీరి రచ నను గురించి చెప్పుకొనవలెననిన వీరికి గవితాధోరణి పది పదు నొకండు సంవత్సరముల ప్రాయములోనే లభించినది. ఆ చిన్నతనములో వీరు రచించిన చిన్నచిన్న రచనలు వీరికుటుం బములోని పెద్దలధికముగా మెచ్చుకొను చుండెడి వారు. ఆడువారిని జదివించు నభ్యాసమానాడు తక్కువ కావున వీరికి బాఠశాల శిక్షణ మేమాత్రమును లేదు కాని కుటుంబ పండితుల సహవాస మూలముననే విద్యాభివృద్ధి లభించినది. చిన్ననాటినుండియు వాఙ్మయ పరిశీలనము వీరి కలవాటు.

ఆ సమయమున నీమె పదునేడవ సంవత్సరమున ప్రబంధ శయ్యలో "మహిళా హితబోధిని" అను పద్య గ్రంథము నొక దానిని రచించిరి. అది యప్పటి యాంధ్ర పండితుల నడిఖి ప్రాయములను బొందినది. తరువాత వీరి రచనలలో నమూ ల్యములైనవి గద్యములలోనైన నేమి, పద్యములలోనైన నేమి, అనువాదములలోనైననేమి, నీతిపదములు, సతీ ధర్మ ములు, యోగేశ్వరి, అన్నపూర్ణ, జడభరతుడు, చైతన్య స్వామి, వామన పురాణము, సత్కథావల్లరీ, మంగళ హార తుల శతకము, స్త్రీ నీతిగీతములు మున్నగు పొత్తములు. వీరు వంగ భాషలోను హిందీ భాషలోను గూడ కృషి జేసిరి.

ఒక్క గ్రంథ రచయితయేగాక వీరు స్త్రీవిద్యా విషయ మున గొప్ప సంఘ సంస్కారిణియు గూడనై యుండిరి. ఆంధ్రదేశములో మొట్టమొదట స్త్రీ సమాజమును స్థాపించి నదీమెయే. కాకినాడలో వీరిచే స్థాపింపబడిన విద్యార్థినీ సమాజమే శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారి యాజమాన్య మున నేటివరకు స్త్రీ సంఘమున కమూల్యమగు సేవ జేయు చున్నది. ఆంధ్రదేశములో మొట్ట మొదట స్త్రీల పత్రికను (సావిత్రి) 1500 మంది చందాదారులతో అతి జయప్రద ముగా 1914 మొదలు 16 వరకు సాగించినది వీరు. అఖి లాంధ్రమహిళా సభయను గొప్ప స్త్రీసభను నెలకొల్పి, వేయిమంది స్త్రీలతో మూడు దినములు జయప్రదముగా సభను జరిపించిరి. ఆంధ్రదేశములోని దూరస్థలములగు ననేక ప్రదేశములనుండియు ననేక నారీరత్నములీసభకు సమావేశ మైరి. మన యాంధ్రదేశమున స్త్రీల గొప్ప సభలో మొట్ట మొదటి సభయిదియే. 1911 వ సం॥ ఏప్రిల్ మాసమున శ్రీమతి కళ్లేపల్లి వేంకటరమణమ్మగారి అగ్రాసనాధిపత్య మున నీ సభజరిగినది. ఈ సభగావించి దేశమంతటను వీరి

నామము ప్రతిధ్వనించునట్లు చేసికొనిరి. అప్పట్లో, హైదరాబాదులో, బందరులో, విజయనగరములో, గుంటూరులో, మద్రాసులో జరిగిన పెక్కు మహిళా సభలకు వీరు అగ్రాసనాధిపతి. కలకత్తాలో జరిగిన అఖిల భారత మహిళా సమావేశమున ఉపన్యాసకురాండ్రలో వీరొకరు. మధుపద్యాయము, అమూల్యము మున్నగు ఖండ కావ్యములు, అనేక విడిపద్యములు, పాటలు మున్నగునవి వీరు రచించిరి.

1926 వ సంవత్సరమున భర్తవియోగము వీరికి గలిగినది. నాటినుండియు వీరు నిరుత్సాహులై భాషాసేవయు, సంఘ సేవయు జేయగల సమర్థతను గోల్పోయిరి. తరువాత వీరు స్త్రీ సమాజములలో పని చేయుటయు, గ్రంథ రచనయు తగ్గించుకొని ఆధ్యాత్మిక విచారములో ప్రశాంత జీవనమును గడుపుచున్నారు.



# గ్రంథసమీక్ష



## మో. క. గాంధీశతకము

గ్రంథ కర్త: వోల్లేటి నృసింహ శర్మ కవి.

ప్రచురణాలయము: ప్రకాశ ముద్రాక్షరశాల, సూర్యాపేట, వెల—0-4-0.

ఇది పద్యరూపముగ, మో. క. గాంధీ జీవిత సంగ్రహము, అంతమయే వరకు శీర్షికల క్రింద వెలువడినది. ఈ శతకము కందపద్యములలో వ్రాయబడినది. శైలి లలితమై చమత్కృతి కొంతయు ఇంపుగను పుత్సాహముగను నున్నది. ఇందు కాంగ్రెస్ చరిత్రను సంగ్రహముగా వర్ణించుట, మన రాజకీయ చరిత్రయే వర్ణించబడి, గ్రంథాంతమున మహాత్ముని జీవితమునకు సంబంధించిన తారీఖులు, వివరాలు ప్రచురింపబడినవి. ఇందు పద్యములు ఒక దానినిమించి మరొకటి యున్నది. మచ్చునకు ఈ దిగువ పద్యము చూడుడు.

క. భారీధోవతి కట్టక
మూరెడు గోచియయె మేలు, ముసుగులుగాగన్,
జారిజితో భాషించిన
కారుణ్యాంబోధి! మో. క. గాంధి మహాత్మా!

*　　*　　*

## మనోహరం

మూలం: సీత అనువాదం: బి. విశ్వేశ్వరావు. బాబూ కార్యాలయం—కతిడ్రల్—మదరాసు 6. వెల 0-2-0

మనోహరం ఇది బాల బాలికల కోసం ప్రచురింప బడిన 30 పేజీల చిన్న పొత్తము. ముఖచిత్రం చక్కని రంగులలో నున్నది. ఇందలి కథ మంత్రియొక్క కుట్రతో రాజుని చంపి రాజకుమారుల ముగ్గురిని పరాయిదేశమునకు వెడల కొట్టుట, రాజకుమారులు వారిపంతము, పౌరుషముపై రాజ్యమును మరల సంపాదించుట. ఇందు అచ్చు తప్పు లెక్కువగ నున్నవి. —రా. లక్ష్మి.

*　　*　　*

## నిట్టూర్పు

రచయిత: డాక్టరు రాంబాబు ఏలూరు. వెల 0-12-0 అణాలు. ప్రచురణ: డాక్టరు రాంబాబు, ఏలూరు.

మానవులమై పుట్టిన పిదప జీవితంలో ప్రతివారు కష్టసుఖాలలో భాగం పంచుకోవలసిందే. కేవలం ఒక్క నిరుపేదల జీవితాలే కష్టతరమైనవని అనుకోకూడదు. నిరుపేదలు కష్టాలను అనుభవిస్తారంటే అది వారి ఆర్థిక పరిస్థితి లకున్న, వారికి సమాజంలో సమానత్వం లేక పోవుటవలన కాని గొప్ప మేధావులు, చక్రవర్తులు, రాజకీయవాదులు, మహాపురుషులు సహితం బాధలను అనుభవించారంటే దానిలో అర్థం మనకు బహిరంగంగా తెలియదు. పేదల విషయాల్లో అతి తేలికగా ప్రపంచానికి తెలుస్తుంది. కాని పైన ఉదహరించిన వారి విషయాల్లో ప్రపంచంలో స్థానము ఉండదు. కనుక ప్రతివ్యక్తి తన జీవితంలో విషాదాంత సంఘటనలు లేని జీవితం జీవించలేడు. విషాదాంతంలో ఉండే మహాశక్తి వలననే మేధావులు చక్రవర్తులు మహాపురుషులు అత్యున్నత స్థితికిరాకలిగినారు.

"నిట్టూర్పు" ఏడు విషాదాంత నాటికల సంపుటి. చక్కని భావాన్ని తెలియజేసే ముఖచిత్రంతో వెలువడినది. ఈ నిట్టూర్పునందు తాజమహాలు, పాలదొంగలు, అగ్నిగుండం, రక్తసముద్రం, దీపస్తంభం ఊగులాడుతోంది, ఒక పగలు+ఒక రాత్రి=అంధకారం, నిండుకుండ తొణికింది, మహాకవి జాన్‌కీట్సు, అనే ఏడువిషాదజీవిత ఘట్టాలను తీసుకొని రచయిత చక్కని భావాలు చక్కని భాష ఉపయోగించి వ్రాశారు. తాజమహాలు, అగ్నిగుండం, రక్తసముద్రం ఒక పగలు+ఒక రాత్రి = అంధకారం, మహాకవి = జాన్‌కీట్సు అనే నాటికలు చదువవలసినవి. తాజమహాలు నాటికలో విప్రయోగి భార్య వియోగజీవి, తన అత్యంత ప్రేమ స్మృతి చిహ్నంగా ఉండుటకుగాను బూడిదతో చక్కని మహాలు నిర్మిస్తాడు. ఆ మహాలు భార్యా వియోగిగ్రస్తుడైన షాజహాన్ చక్రవర్తిని ఆకర్షించుటచే యమునా తీరమున

పాలరాతిమహాలు నిర్మింపబడుతుంది. తాజమహాలు సృష్టి కర్త, నిర్మాతలు, ఇద్దరు సతీవియోగులే. విషాదాంతమైన జీవితాలను ఒకరు వస్తుపూర్వకముగా సృష్టించి మహా చక్ర వర్తికి దానంచేసి ప్రపంచ ప్రఖ్యాతి గాంచుటకు సహాయ పడినాడు.

మహాకవి జాన్‌కీట్సు జీవితంలో విషాద జీవితాన్ని అద్భుతంగా చిత్రించారు. కీట్సు మహాకవి మరణ శయ్యపై బాధపడుచున్న సోదరునిపైనున్న ప్రేమ తన్ను తృణీకరించిన తన ప్రేయసీ ఫేనీయందుండే ప్రేమలతో బాధ పడతాడు. సోదరుడు మరణిస్తాడు. కాని ప్రేయసి కీట్సు మనస్సు నకు శాంతి నివ్వలేదు. అతనిని ప్రేమించ లేననిచెప్పి అసలే గాయపడిన హృదయాన్ని రెచ్చగొట్టి వెళ్ళి పోతుంది. దానితో అతడు జీవితంలో తన అమ్మని ప్రమించిన క్షయ వ్యాధికి గురియై మరణిస్తాడు. అది కీట్సు విషాదాంత జీవితం.

"పాల దొంగలు" అనే నాటికలో అస్వాభావికత ఉన్నది. రచయిత ప్రతినాటికలోను భావాలను భావనకే కాకుండా ప్రేయసీ ప్రేమ, కళాసేవ, వేదాంతం, సోదర ప్రేమ, ధనికవర్గానికిలోనై పేదలుపడే బాధలు, కామానికి లొంగి విపత్తు తెచ్చుకున్న మానవుల జీవితం మొదలైన చక్కని సమస్యలను తీసికొని నాటికలను తయారు చేశారు. అచ్చు చక్కగా నున్నది. కాని అక్కడక్కడ అచ్చులో పొరపాట్లున్నవి. ని ట్లూప్ప ప్రతివారు చదువవలసిన గ్రంథం.

—జి. ప్రభ.





## కొవ్వూరు సంస్కృత
## బాలికా పాఠశాల

11-12-49 ఆదివారము సాయంకాలము 4 గం. 20 ని॥ లకు మదరాసు గవర్నరు సతిగారైన శ్రీ భావనగర్ మహారాణీవారు కొవ్వూరు "సంస్కృత బాలికా పాఠశాల"ను దర్శించిరి. ఆ సందర్భమున ఏర్పరచిన స్వాగత సభలో పాఠశాల ప్రధానోపాధ్యాయిని, వారికి పూల మాలను వేసి "స్వాగతపత్రము"ను సమర్పించిరి. పాఠశాల బాలికలు సంస్కృతములో "శాకుంతల" నాటకమందలి చతుర్థాంకమును ప్రదర్శించిరి.

నాటక ప్రదర్శనము చక్కగా నున్నదని, శ్రీ భవనగరు మహారాణీగారున్నూ, వారితో వచ్చిన శ్రీమతి అమ్మన్న రాజాగారూ, తదితరులున్నూ ప్రశంసిస్తూ, సంతోషించిరి.

జాతీయ గీతా గానములో సభ ముగిసినది.

—వేదవల్లితాయారమ్మ

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.

# ఆంధ్రమహిళ



FEBRUARY 1950 ANDHRA MAHILA ANNAS 6

ప్రేక్షకులను తండోపతండములుగ
తరలించుకు వస్తున్నది...
వాహినీ వారి

# గుణసుందరి
కథ...

ఇప్పుడు

విజయవాడ - సరస్వతి
గుంటూరు - సరస్వతి
తెనాలి - రత్నా
ఏలూరు - పాండురంగా
మచిలీపట్నం - మినర్వా
రాజమహేంద్రవరం - జయ
కాకినాడ - క్రౌన్
విశాఖపట్నం - సరస్వతి
విజయనగరం - కృష్ణా
బళ్లారి - రాయల్
కర్నూల్ - చాంద్
నెల్లూరు - శ్రీ వినాయక
భీమవరం - మారుతి
గుడివాడ - శ్రీనివాస్
బరంపురం - జ్యోతిలలో
చూపబడుతోంది



డైరెక్టర్
కె. వి. రెడ్డి, B.Sc (HONS)
అసోసియేట్.. కె. కామేశ్వరరావు, B.A.



స్టూడియో... వాహిని

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: ఫిబ్రవరి '50 :: సంచిక 10

ముఖచిత్రం : భారత రిపబ్లిక్ అధ్యక్షులు బాబు రాజేంద్రప్రసాద్



ఇంకా వ్యాసాలు, నాటికలూ, పద్యాలూ, బాలానందం, వనితా విజ్ఞానం, గ్రంథ సమీక్ష.

సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,

సహసంపాదకురాలు : శ్రీమతి చన్న ఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు



సంపుటి 6 ఫిబ్రవరి 1950 సంచిక 10

# ప్రజారాజ్య అవతరణ.

2½ సం॥ ల క్రితం, 1947 ఆగష్టు 15వ నాడు, బ్రిటిషువారు మన దేశమునందు తమ ప్రభుత్వమును చాలించి వెడలిననాడు, స్వాతంత్ర్య సిద్ధియైనదని మనమంతా యెలుగెత్తి స్వతంత్ర గీతికల నాలాపిస్తూ, విజయభేరులు మ్రోయిస్తూ స్వాతంత్ర్యపతాకను ప్రతిష్ఠించి, స్వతంత్ర భారతిలో మనకుకలుగబోవు సుఖసంపదలనుగూర్చి స్వతంత్ర కలలనుగంటూ, ఆకాశసౌధాలు నిర్మించుకొని, అట్టహాసంగా పండుగ జేసికొనినప్పుడు, మన స్వతంత్ర ప్రదాత బాపూజీ, ఉపవాస దీక్షనుబూని, ఆదినము దీక్షకు, వ్రతనిష్ఠకు, తపస్సుకు సమయమేగాని, ఉత్సవమునకు, ఉబలాటమునకు సమయమెంత మాత్రమూకాదని నొక్కి-చెప్పెను. ఈ వచనములందలి యాదార్థ్యమును, గత 2½ సం॥ ల సంఘటనలూ, మన కనులకు కట్టినట్లు నిరూపించియే యున్నవి. మన ప్రతినిధులతో గూర్చిన మన ప్రభుత్వమూ, మన ప్రజలముకూడ, స్వాతంత్ర్యమువలన కలిగే లాభాలను గూర్చి అంచనాలు వేశాము. ఫలాల ననుభవిద్దామని ఆతృతపడ్డాము. అంతేగాని, అందుతో గూడిన బాధ్యతలను పూర్తిగా విస్మరించాము. ప్రజానాయకుల అసమానత్యాగ ఫలమైన యీ స్వాతంత్ర్యము సుస్థిరంగా నిలవాలంటే, అంతకు మించిన అత్యధిక త్యాగము యిప్పటి ప్రజా ప్రతినిధులలోనూ, ప్రజలలోనూ విదితము కావాలి. అందులకు వ్యతిరేకంగా, స్వాతంత్ర్యసిద్ధి యనంతరము, ప్రజా ప్రతినిధులలో, ఇతః పూర్వముచేసిన త్యాగమునకు వేయిరెట్లధికమైన స్వార్థము పెరిగి పోవుటచే, ప్రజలకు ప్రభుత్వముపై అవిశ్వాసము ప్రబలి, ప్రస్తుతము తామనుభవిస్తున దుస్థితికంతయు యీ ప్రభుత్వమే కారణమని మిక్కిలి నిరుత్సాహము కలిగించుచున్నది. అందుచేత, సర్వాధికార ప్రజాప్రభుత్వమేర్పడ్డ యీ శుభసమయంలో, ప్రజాస్వామ్యసమయంలో, 2½ సం॥ల నాటి ఉత్సాహము శూన్యమగుట అతి సహజమే. గతమునకు దుఃఖిస్తూ, భావినిగూర్చి సంకోచిస్తూ, వర్తమానంలో కర్తవ్యతామూఢులమై నిరుత్సాహ పడవలెనని మా అభిప్రాయము కాదు. భారత చరిత్రలో యీ నూతన దశారంభ శుభసమయమున గతిమును స్మరించి, 33 కోట్ల ప్రజానీకము, వారి యోగ క్షేమముల పాలించుచున్న ప్రతినిధులుకూడ, తమలోనున్న ఏలోటుపాట్లవల్ల స్వాతంత్ర్య

ఫలము ప్రజాసామాన్యాని కందలేదో, వానిని సవరించుకొనవలసిన అగత్యమేర్పడినదని హెచ్చరించుటయే మా ఆశయము.

ప్రతినిధుల ప్రమాణస్వీకారము కేవలము ఉచ్చారణతో అంతరించక, ఆ ప్రమాణ ఆచరణకై తాము అనిమేషము కృషిజేస్తూ, అందు ప్రజలు తమకు సహకరించే దృఢ విశ్వాసమును ప్రజా హృదయంలో రేకెత్తించిననాడే, హస్తగతమైన స్వాతంత్ర్యమును చిరకాలము మన మనుభవించ గలుగుదుము. ఈ రక్షణ బాధ్యత ప్రజలపైన ప్రతినిధులపైన కూడ సమానముగ నున్నదని యిరువురు గ్రహించిననాడుగాని, కార్యము నెరవేరదు. అప్పుడుగాని పౌరులకు న్యాయము, స్వేచ్ఛ, సమతలభించి, భిన్న మత భాషా సంస్కృతులుగల ప్రజల నడుమ సౌభ్రాతృత్వము పెంపొంది, రాజకీయ స్వాతంత్ర్యముతోపాటు ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యములు లభింపవు. ఆ నాడు గాని సర్వ సస్యశ్యామలమైన భారతభూమి, కన్నబిడ్డలకు సుఖ సౌభాగ్యాలు చేకూర్చి, ప్రపంచ శాంతి స్థాపనలో యథోచిత స్థానమును వహించ నేరదు.

★

# అధ్యక్షుఁడు రాజేంద్రబాబు

సర్వ స్వతంత్ర ప్రజాస్వామ్య భారత ప్రజా ప్రభుత్వపు ప్రథమాధ్యక్షులు బాబు రాజేంద్ర ప్రసాదుకు జోహార్లు.

నిరాడంబర నమ్రజీవి, మేధావి, ధర్మనిరతుఁడు, సాధు స్వభావుఁడు, ఉత్తముఁడు, వయస్సు చేతను, అనుభవముచేతను, సేవచేతను వృద్ధుఁడు, శాంతిప్రియుఁడు, గాంధీజీశిష్యుఁడు, అనుచరుఁడు, అజాత శత్రువునైన, రాజేంద్ర బాబు, నేటి స్వతంత్ర భారత అధినేతగా మిక్కిలి అర్హత గలవాడు.

1917 నుండి, గాంధీజీ ఉద్యమాలలో మనస్ఫూర్తిగ కృషిజేయుచు, 1920 సం॥లో, అధిక ఆదాయకారియగు తన న్యాయవాది వృత్తిని విసర్జించి, సహాయ నిరాకరణమునకు గడంగెను. స్వరాజ్యసిద్ధి యగువరకు, తన అనారోగ్యమును కూడ లక్ష్యపెట్టక, స్వరాజ్య సమరములో, ధర్మ నిరతితో, పట్టుదలతో పోరి పలుమారు కారాగారవాసి యయ్యెను.

1917 చాంపురా సత్యాగ్రహము, 1934 బీహారు భూకంప పీడితులకై వీరు సల్పిన నిరుపమానసేవ, యీతనియందుగల ప్రజా విశ్వాసమునకు కారణములై, కాంగ్రెస్ అధ్యక్షులుగా ముమ్మారు ఎన్నుకొనబడి, రాజ్యాంగ పరిషత్ అధ్యక్షులుగా రాజ్యాంగమును తయారుచేసి, చివరకు స్వతంత్ర భారతికి ప్రథమాధ్యక్షులుగా గౌరవింపబడ్డారు.

విజ్ఞాన ధనుఁడు, న్యాయశాస్త్ర పరిజ్ఞాని, నిర్మాణ కార్యక్రమ మందపరిమిత ఉత్సాహము కలవాడు, ముఖ్యంగా శాంతి ప్రియుడు, ధర్మపరాయణుఁడునగు రాజేంద్ర ప్రసాద్ యొక్క సారథ్యములో, నవభారత రిపబ్లిక్ ఒక ఉచ్ఛస్థాయిని జేరగలదని ఆశించుచున్నాము.

★

## ఆంధ్రమహిళాసభలో

# రిపబ్లిక్ దినమహోత్సవము

26-1-1950, లక్ష్మీవారం ఆంధ్ర మహిళాసభ సభ్యురాండ్రు, విద్యార్థినులు, రిపబ్లిక్ దిన ఉత్సవమును అతివైభవముగా జరిపికొనిరి.

సాయంకాలము 4 గం॥ కల్లా సభ ఆవరణ యంతయు ముగ్గులతో, తోరణములతో అలంకరించబడినది. బాండ్ వాయిద్య మారంభమైనది.

4 గంటలకు శ్రీమతి లక్ష్మీబాయి మెహతా గారు పతాకమును ఆవిష్కరించిరి. ఝండా వందనాంతరము, సభికులకు గంధ పుష్పములు, పండ్లు మిఠాయిలు పంచబడ్డాయి.

తదనంతరము చక్కగా అలంకరింపబడిన సభ హాలులో భారత రిపబ్లిక్ ప్రథమాధ్యక్షులగు బాబు రాజేంద్రప్రసాదు గారి పటము పూలమాలాంకృతమై ఉంచబడెను.



రిపబ్లిక్ దిన ఉత్సవ పందర్భములో
శ్రీమతి లక్ష్మీబాయి మెహతాగారు పతాకమ నావిష్కరించుచున్న దృశ్యము.

సభాధ్యక్షులైన న్యాయపతి రాఘవ రావుగారు, సభ్యురాండ్ర నుద్దేశించి "పాకిస్థాన్ విభజనాంతరము మత వివయముచే కలిగిన కల్లోలముల కారణమున, మన దేశమును హిందూదేశ మనకుండా, భారత దేశమనుటయే గాక, మన రాజ్యాంగములో మతమునకెట్టి ప్రాముఖ్యతనీయక, సెక్యులర్ స్టేట్ గా చేయవలసివచ్చినది; అయితే, రషియా కమ్యూనిస్ట్ రాజ్యమువలె నాస్తిక రాజ్యము కావలెనని రాజ్యాంగ నిర్మాతల యుద్దేశమేమియూ కాదు ; ప్రజల నైతిక జీవనముపై మతమునకున్న ప్రాతినిధ్యమును వారు గమనించక పోనులేదు ; మతము పేర ప్రజ్వరిల్లిపోవుచున్న వైమనస్యములకు భయపడి, యిట్టివిధాన మవలంబించ వలసివచ్చినది ; ఈ పరిస్థితిలో మన హిందూ మతము, ప్రాచీన భారతీయ విజ్ఞానము నశించకుండ, ప్రజలదైనందిన జీవితములో ఆస్తికత అస్తమించకుండ చేయు బాధ్యత ప్రజలపై ద్విగుణీకృతమై యున్నది కాన, యీ బాధ్యతను గుర్తించి, తదనుగుణ్యంగా వ్యవహరించ వలసిన కర్తవ్యము ప్రజలది" అని సూచించిరి.

తరువాత, ఆచార్య వెంకట్రామన్ గారు ఆంగ్లమున, శ్రీయుత కొంపల్లి సీతారామ శాస్త్రిగారు ఆంధ్రమున భారత రాజ్యాంగముయొక్క ముఖ్యాంశములను గూర్చి ఉపన్యసించిరి.

[ఈ అంశములే వేరుచోట విపులీకరించుటచే, ఇక్కడ ఇంతకుమించి వ్రాయుటలేదు.]

అధ్యక్షు, ఉపన్యాసకులకు అభివందనములతో, జన గణ మన గానముతో సభ ముగిసినది.

సభాభవనములు 26, 27 తేదీలలో, విద్యుద్దీపములతో చక్కగా అలంకరింపబడినవి.



స్వతంత్ర భారత రిపబ్లిక్ అవతరణ

# నవభారత రాజ్యాంగం

❋ శ్రీమతి రామకృష్ణమ్మ బి.ఏ., బి.ఇడి. ❋

మన భారతదేశ చరిత్రలో 1950 జనవరి 26వ తారీఖు మహత్తరమైన దినము. ఈనాడు మన దేశమునందు సర్వాధికార ప్రజాస్వామ్య ప్రజాధిపత్య రాజ్యము నిర్మాణమైనది. ఏ ఆదర్శప్రాప్తికై మహాత్మా గాంధీ నాయకత్వమున దేశమంతా శాంతి సమరము జరిపినదో, ఏ ఉద్దేశ ప్రాప్తిలో మహాత్మా గాంధీ 2 సంవత్సరముల క్రితం, బలిదానమైనాడో ఆ మహత్తర ఆదర్శము యీనాడు పూర్తిగా ఫలించింది.

ఏ దేశ రాజ్యాంగములోనైనను, దేశ పౌరులకు స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము—ఈ మూడు లక్ష్యములుండవలెను. ఈ లక్ష్యత్రయము లేని రాజ్యాంగము రాజ్యాంగము కానేరదు. ఈ పవిత్ర లక్ష్యత్రయ సాధనకు ప్రపంచ ప్రజలు శతాబ్దములుగ అవిరామ పోరాటమును సాగించిరి. విశేష త్యాగములు జేసిరి. రక్తమును ధార పోసిరి. ప్రాణముల నర్పించిరి.

1946 డిశంబరులో భారత రాజ్యాంగ పరిషత్తు మొదట సమావేశమైనప్పుడు పరిస్థితులు చాల అగమ్య గోచరంగా నుండెను. నవభారత రాజ్యాంగ స్వరూపము ఎట్లుండునో యూహించడానికైనా సాధ్యము కాకుండెను. అయినా, తన లక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటించుకొని ఆ లక్ష్యసిద్ధికి ఉపకరించే రాజ్యాంగాన్ని తయారు చేయడానికి భారత రాజ్యాంగ పరిషత్తు ఉపక్రమించింది. 1947 జూన్ మాసంలో దేశ భవిష్యత్తు స్వరూపం నిర్ధారణ అయినది. స్వాతంత్ర్యాన్ని సంపాదించిన భారత జాతీయ కాంగ్రెసు లక్షించిన ఐక్య అఖండ భారతము అలభ్యమని స్పష్టమైంది. విభక్త భారతమును ఏకముచేసి దృఢమైన భారతమును నిర్మించడానికి పరిషత్తు పూనుకొనవలసి వచ్చింది. తదనుగుణ్యంగా లక్ష్య తీర్మానమును సవరించుకోవలసిన అవసరము ఏర్పడినది. భారత రాజ్యాంగ పరిషత్తు ఈ గురుతర బాధ్యతను ప్రశంసనీయంగా నిర్వహించింది. మూడు సంవత్సరముల నిరంతర కృషిఫలితమే నవభారత రాజ్యాంగము.

ఈ మహా పర్వదినమైన నేడు ప్రజలు ప్రజా ప్రతినిధులు ఈ "రాజ్యాంగమును మాకు మేమై వర్తింప జేసుకొని, శాసించుకొని, స్వీకరించుచు, సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా న్యాయమును, భావములో, ప్రకటనలో, విశ్వాసములో, మతములో, ఆరాధనలో స్వాతంత్ర్యమును, ప్రతిపత్తిలో, అవకాశములో సమత్వమును చేకూర్చుటకును జాతిరైక్యమత్యమునకు అభయ మొసంగుచు, సౌభ్రాతృత్వమును పెంపొందించుటకును "ప్రమాణము చేయుచుండిరి.

ఈ నవభారత రాజ్యాంగం శైశవ ప్రజా స్వామ్య రక్షణకు అన్ని విధాలా అతి ప్రశస్తమైనది. దీన్ని గురించి కొంచం విపులంగా గమనింతము.

నూతన రాజ్యాంగం భారతదేశాన్ని సర్వతంత్ర స్వతంత్రమైన సార్వభౌమతగల ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా ప్రకటించుచున్నది. ఈ సార్వభౌమత ప్రజలనుంచి ప్రభుత్వానికి లభిస్తున్నదని ప్రవేశికలో విస్పష్టంచేశారు. ప్రజలకుగల సహజమైన హక్కులన్నీ నిర్ధారణంగా విస్పష్టం చేశారు. భారత ప్రభుత్వాధ్యక్షుడు వారసరీత్యా వచ్చే చక్రవర్తి కాదు. అందుచేత భారతదేశాన్ని రిపబ్లిక్ అని పిలుస్తాం.

భారత దేశాన్ని "ఫెడరేషన్" అనటానికి బదులు "యూనియన్" అంటున్నాం. ముఖ్య విషయమేమంటే ఫెడరేషన్‌గా వుంటేనే రాష్ట్రాలన్నిటికి స్వాతంత్ర్యాధికారం వుంటుంది. అందుచేతనే ద్వంద్వ పౌర సత్వమంటూ లేదు. సివిల్ క్రిమినల్ మొదలైన న్యాయ శాసనాలన్నీ భారతదేశమంతకూ ఒకే రీతిగావుంటై. దేశమంతటను సాగవలసిన ఉద్యోగశాఖలన్నిటినీ ఒకే అధిపత్యం క్రింద నిర్వహించటం జరుగుతుంది. ఈ యూనియన్ నుండి విడిపోవటానికిగాని, తన రాజ్యాంగాన్ని వేరే తయారుచేసుకోవటా

నికిగాని యే రాష్ట్రానికి హక్కు లేదు. కేవలం శాసన రీత్యా యేర్పాట్లు జరగటం గాక న్యాయరీత్యా ఈ ఫెడరేషను నిర్వహణ జరుగుతుంది. అవసరమైన విధంగా మార్పులు చేసుకోటానికి 47 ప్రధాన విషయాలలో పార్లమెంటుకు స్వాతంత్ర్యం యివ్వబడు తున్నది. ఇంతే కాక సామాన్య శాంతి పరిస్థితులలో దేశం ఫెడరేషనుగా పని చేస్తూ వుంటుంది. యుద్ధాది జాతీయ విషమపరిస్థితు లేర్పడినపుడు ఒకే ఒక ప్రభుత్వం క్రింద పరిణామంచెంది బలవత్తరంగా వ్యవహరించటానికి అవకాశం కలిగివుంది.

భారత ప్రభుత్వ ప్రధానాధికారికి "అధ్యక్షుడు" అనే పేరువుందినా ఇది అమెరికాలోవలె అధ్యక్షప్రభుత్వంకాదు. భారత ప్రభుత్వ అధ్యక్షుడు వయోజన వోటింగువల్ల ఏర్పడ్డ మంత్రివర్గానికి బాధ్యుడు. వారి సలహా సంపత్తు లేకుండా యేకార్యాన్ని స్వతంత్రాధికారంతో నిర్వహించే అధికారం లేదు. అందుచేత సరాసరి ప్రజలకు బాధ్యుడై వున్నాడు, అంటే ఇది ప్రజలకోరకు ప్రజలు నిర్వహించుకునే ప్రజా ప్రభుత్వం.

భారత నూతన రాజ్యాంగంలో 395 సూత్రాలూ 8 అనుబంధాలు వున్నయ్. దేశస్థితి గతులను సరిగా అర్థం చేసుకోలేనివారికి ఇదంతా ఒక కంప తోడుగుగా వున్నట్లు తోచవచ్చు. కాని దేశంలోవున్న అనేక రకాల యీ ప్రజానీకాన్నీ, వీరందరికి కలుగవలసిన రక్షణలను అవగతం చేసుకుంటే ఇలాంటివి విస్తృతావధి రాజ్యాంగచట్టం రావలసిన అవసర మేమిటో తెలుస్తుంది. అంతేకాక దేశంలో వున్న వివిధ ప్రజాస్వామిక యంత్రాంగాలు సరిగా పనిచేయాలన్నా, శైశవదశలో యీ ప్రజా స్వామికానికి సరియైన రక్షణ ఏర్పాటు కావాలన్నా ఇలాంటి రాజ్యాంగం అమలు జరపటం అవసరం.

భారత దేశం స్వతంత్రరాష్ట్రాల సమాఖ్యగా వుంటుందని రాజ్యాంగ చట్టం ప్రకటిస్తున్నది. ఈ రాష్ట్రాలను మూడు వర్గాలుగా విభజించటం జరిగింది.

1. గవర్నర్ల రాష్ట్రాలు. 2. చీఫ్ కమీషనరు రాష్ట్రాలు. 3. సంస్థానాలు.

భారతదేశం నివాసంగా గల ప్రతి వొక్కరికీ, అతనుగాని, అతని తలిదండ్రులలో ఒక్కడుగాని, భారతదేశంలో జన్మించివున్నట్లయితే పౌరసత్వ హక్కు వుంటుంది. నూతన రాజ్యాంగం అమలులోకివచ్చే తేదికి 5 సంవత్సరాల పూర్వం నుంచి భారతదేశం వాసంగాగల ప్రతివారికి పౌరసత్వ హక్కు వుంటుంది. ప్రతి పౌరునకూ గల ప్రాథమిక హక్కులు యివి. 1. సర్వమానవసమానత్వం. 2. స్వాతంత్ర్యం. 3. ఆర్థికరక్షణ. 4. మత స్వాతంత్ర్యం. 5. విద్యా సాంస్కృతిక హక్కులు. అస్పృశ్యత కూడ పూర్తిగా నిర్మూలించబడ్డది. ఇటుపైని అస్పృశ్యతను ఎవరు పాటించినా అట్టివారిని అపరాధుల క్రింద శిక్షించటం జరుగుతుంది.

కేంద్రంగాని, రాష్ట్రాలుకాని శాసనాలు తయారు చేసేటప్పుడు ఈ దిగువ ప్రధాన సారథ్య సూత్రాలను దృష్టిలో వుంచుకొని వర్తించవలసి వుంటుంది.

1. ప్రజాక్షేమం. 2. ప్రజలకు సరియైన జీవనోపాధి కలిగించుట. 3. పనిచేసే హక్కును కాపాడుట. 4. విద్యావకాశములను కల్పించుట. 5. నిరుద్యోగస్థితిలోనూ, వార్ధక్యంలోనూ, జబ్బుస్థితిలోనూ ఇవ్వవలసిన ఆర్థికరక్షణ. 6. కార్మికులను అమానుష పరిస్థితిలోనికి తోసి వేయకుండ రక్షించుట. 7. 14 సం॥ల లోపు బాల బాలికలకు నిర్బంధ విద్యా సహాయం. 8. మత్తు పదార్థాల నిషేధం. 9. అంతర్జాతీయ శాంతి భద్రతల పరిరక్షణ.

భారతి దేశానికి ఒక అధ్యక్షుడు, ఎగువ దిగువ శాసన సభలుగాగల ఒక పార్లమెంటు వుంటుంది. ఎగువ శాసన సభలో 250 మంది సభ్యులుంటారు. వీరిలో 12 మంది అధ్యక్షునిచే నియమితులయిన వారు. మిగిలినవారు రాష్ట్ర సంస్థానాల ప్రతినిధులు. ఈ సభ సభ్యులను ప్రజా నిష్పత్తిపై నిర్ణయమైన సంఖ్యలో రాష్ట్ర, సంస్థాన శాసనసభలు ఎన్నుకొనవలసి వుంటుంది. ఇది శాశ్వత వ్యవస్థ. దిగువ శాసన సభలో 500 మంది సభ్యులుంటారు. వీరిని వయోజన వోటింగు పద్ధతిని ప్రత్యక్ష ఎన్నికల ద్వారా ప్రజలే ఎన్నుకొన వలసి వుంటుంది. 750 వేల మంది ప్రజలకు ఒక్కొక్క ప్రాతినిధ్యం వుంటుంది. పార్లమెంటు జీవితం 5 సంవత్సరాలు. యూనియన్ అధ్యక్షుని రాష్ట్ర సంస్థాన

శాసన సభలూ, కేంద్రశాసన సభాకలిసి ఎన్నుకుంటాయి. ఈ యెన్నిక జరిగేటప్పుడు రాష్ట్ర సంస్థానాల ఓటింగు బలం ఎంతవుంటుందో, కేంద్రశాసన సభకు అంత సమాన బలం వుంటుంది. ఒకసారి ఎన్నికయైన అధ్యక్షుడు 5 సంవత్సరాలు అధికారంలో వుంటారు. రాజ్యాంగానికి వ్యతిరేకంగా ప్రవర్తించే పక్షంలో ఆయనను తొలగించే అధికారంకూడా పార్లమెంటుకు వుంటుంది. దిగువ శాసనసభలు ఎన్నిక అవగానే ఆ సభలో మెజారిటీ పార్టీ నాయకుని మంత్రివర్గం తయారు చేయమని అధ్యక్షుడు కోరుతాడు. ఈ మంత్రివర్గం దిగువ శాసన సభకు బాధ్యులు. ఈ మంత్రుల సలహా సంపత్తిమీద అధ్యక్షుడు వ్యవహరించుతూ వుండాలి.

పార్లమెంటు సభల సమావేశాలను పిలిచే అధికారం అధ్యక్షుని చేతిలో వుంటుంది. దిగువ శాసన సభను రద్దు చేసే అధికారంకూడా అధ్యక్షునకు ఉంటుంది. పార్లమెంటు సంవత్సరానికి రెండుసారులైనా సమావేశమవాలి. శాసన సభ చేయు శాసనములను న్యాయముగా అమలులో జరుపుచున్నది లేనిది చూచుటకు స్వతంత్ర న్యాయ విచారణశాఖ కూడ రాజ్యాంగమునందు ఏర్పాటు చేయబడి యున్నది. దేశమంతటికి ఒక సుప్రీం కోర్టు, ప్రతి ప్రాంతమునకు సుప్రీం కోర్టు క్రింద ఒక హైకోర్టూ, హైకోర్టు క్రింది సబార్డినేటు కోర్టులు ఏర్పరుపబడియున్నవి. సుప్రీముకోర్టు హైకోర్టుల న్యాయ మూర్తులు అధ్యక్షునిచే నియమింప బడుదురు. హైకోర్టులనుండివచ్చు అప్పీళ్ళను సుప్రీంకోర్టు విచారణ చేయగలదు.

రాష్ట్రములకు, సంస్థానములకు ఒక్కొక్క గవర్నరు ఉండును. ఈ గవర్నర్లను అధ్యక్షుడే నియమించును. గవర్నరు 5 సం॥ల కాలము ఆ పదవిలో నుండును. రాష్ట్రములకు రెండు శాసన సభలుండును. ఎగువసభ కవున్సిలు దీనిని ఎత్తివేయుటకు ఇండియా పార్లమెంటునకు అధికారముకలదు. దిగువ సభకు అనగా ఎసంబ్లికి మెంబర్లను ప్రతిపాదిక ఓటర్లు ఎన్నుకొనెదరు. యుక్త వయస్సు వచ్చిన ప్రతివానికి వోటుకలదు. 75 వేల మందికి ఒక ప్రతినిధి చొప్పున అసెంబ్లికి ఎన్నుకొన బడుదురు. ఎసెంబ్లీలో 60 మందికన్న తక్కువగాని, 500 కన్న యెక్కువకాని ఉండరాదు.

కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాలు వేర్వేరు విషయాలలో శాసనాధికారం కలిగియున్నవి. దేశానికి ఏదైనా ప్రమాదావస్థ సంభవించినపుడు రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించిన అధికారాలను కూడా కేంద్రప్రభుత్వం చెలాయించ కలదు.

ఇండియా ప్రభుత్వానికి వచ్చే ఆదాయాన్ని చేసిన ఖర్చులను తనిఖీ చేయుటకు ఒక ఆడిటరు జనరలు, కంట్రోలరు నియమింపబడుదురు.

ఈ విధంగానే దేశ వాసులకు శాంతి సౌఖ్యాలను చేకూర్చటానికి ప్రపంచములోని అత్యంతాధునిక రాజ్యాంగ చట్టములలోని ఉత్తమాంశములను సేకరించి ఈ నూతన భారత రాజ్యాంగచట్టం తయారు చేయటం అయింది.







# పసిడి కిరణాలలో బాపూజీ!

అది ప్రజాసముద్రం. అఖండ భారతావనికి యేకైక నాయకుడు బాపూజీ రాకకోసం అర్రులుచాచే ప్రజానీకం లోని విప్లవతరంగాలు నాట్యం చేస్తూ సమరోత్సాహాన్ని రగుల్కొల్పుతున్నై. ఆ మైదానమంతా పవిత్ర భారతీయుల వీరరక్తంతో సలసల కాగుతుండే స్వాతంత్ర్య భావాలలో...పెల్లుబికి ప్రవహించే వుద్రేక శౌర్యాలతో... త్యాగసంపదను సత్యసంపదను తమ నెత్తుటి చుక్కలతో కాపాడే రుధిరస్రవంతు రక్తనాళాలతో నిండి పోయింది. ఆ మైదానం ఒకసమర భూమికి పయనించే అసహాయ యోధుల సమావేశ ప్రాంతం...

ఆ నాడు ఆదివారం...సంధ్యారుణ కాంతుల్లో...చల్లని వాయు తరంగ గమనంలో పచ్చని జాతీయ పతాకం స్వాతంత్ర్య లక్ష్మికి వింజామరలు వీస్తోంది...ప్రతి జీవి ముఖంలోను వెన్నెల పువ్వులు చిరునవ్వు దొంతరలు... హాయిగా ఆనందంతో నృత్యం చేస్తోన్నై...

ఏవైపుచూచినా పచ్చని తోరణాలు...నిత్యశోభలే... తెల్లటి ఖద్దరుచీరెతో...చిన్నారి నవ్వులు పెదవి మోసుల్లో మొలకలెత్తుతుండే జాతీయ పతాకాన్ని చేతితోపట్టుకుని... చురుగ్గా నడుస్తుండే భారత యోధాంగనల మూర్తులను తిలకిస్తుంటే ఆపాదమస్తకం విప్లవ రుధిరం పొంగి పోయింది... నా ప్రతి అణువులోనూ స్వాతంత్ర్య రక్తం ప్రజ్వరిల్లింది... ఎంత శౌర్యం...ఎంత ఉత్సాహం...ఆ ఉద్దీపన సమ్మిళిత విప్లవ రుధిర తరంగాల...సమరోత్తేజిత మెరుపుల తుఫానులో నా నిస్సార జీవితంపై నిరుత్సాహం పుట్టింది...ఆ నాడు నా హృదయంలో...వేడి రక్తంలో... ఒక మహత్తరమైన బలవత్తరమైన పునాది వేయబడింది. ప్రతి భారతీయుడి హృదయ సీమలోనూ స్వాతంత్ర్య భవన నిర్మాణానికి తొలిచర్య జరిగిందనుకుంటూన్నా...

ప్రకృతి బంగారు రంగులో మునిగి పోయింది. ఆ నాడు ప్రకృతి సయితం...రమణీయంగా ఆహ్లాదంగా పూలవానను కురిపించింది...ఆ మనోహర సౌందర్య దృశ్యం...యింకా నాకు గమనముంది...నాజీవితాంతం వరకు గమనముంటుంది.

వేదికకు పదిగజాల దూరంలో నేవున్నాను...హృదయం టపటపమంటు కొట్టు కొంటోంది...మనస్సు సంతోష కెరటాల నురగింతలలో పరుగులు తీస్తోంది...ఏ మహాత్ముడైతే ఈనాడు విశ్వమంతా వేలెత్తి చూపుతుందో...ఏ దరిద్ర నారాయణుడు దరిద్ర సంతతి కోసం...తన జీవితాన్ని ఫణంగాబెట్టి తపస్సు చేస్తున్నాడో...ఏ కళ్యాణ మూర్తి దయారసాన్ని విశ్వమానవ సంఘాలన్నీ సమంగా గ్రోలుతున్నయో...ఏ సత్యాగ్రహ వస్త్రధారుని ధాటికి ఎండ కాసే భూమండలాన్నంతా ఏకధాటిగా యెదురులేకుండా యేలుతుండే నిరంకుశ ప్రభుత్వం...దాసోహమని లొంగి పోయిందో...ఆ జగదేకమూర్తిని విశ్వపతుని, విప్లవవ్యక్తిని, స్వతంత్ర భానుని . సమర యోధుని . శాంత మూర్తిని... మహాత్ముని...అవతారమూర్తిని...చూచే అదృష్టం కలిగిందనే ఆనందం...ఆ ఉత్సాహం... ఆ ఆవేశం వర్ణించలేను...నా కలానికా శక్తిలేదు ...అది అమర దినం... అమృత ఘడియలు...వెలుగు క్షణాలు...

ఆ వేదికకు నైరుతిదిక్కులో ఒక చిన్న మేడ వుంది... ఆ మేడపైనుండి ప్రేక్షకులు మెల్లగా అదుగో నంటూ వేలెత్తి చూపారు...ఇంకా కనబడ్లేదు...హృదయావేగం...భరించలేకపోయాను ..

ఒక్క నిమిషం గడచింది...

స్వతంత్ర భానుడుదయించాడు.. ఆ పసిడి కిరణాలలో బాపూజీ నిండు ముఖాన్ని కాదు...ఆ మహనీయుని సౌందర్యగరిమను తిలకించాను...నిజంగానే ...వాస్తవంగానే... అతడే మహాత్ముడు...ఆ మహాత్ముడు ప్రజా సముద్రం వేపు కేలు మోడ్చి నిలబడ్డాడు...జోహార్లు సమర్పించాను... వ్రాస్తుంటే ఒళ్లు పులకరిస్తోంది...రక్తం జ్వలిస్తోంది... అందరూ ఆ మహనీయునికి ప్రణుతులర్పించారు...సన్నని మల్లెపూరేకులాంటి ఆ ఖద్దరు ఖండువా కప్పుకున్నాడు... మోకాలివరకు గాదు...ఇంకా పైగానే కట్టు బట్ట మను

తరువాయి 11వ పేజీలో

అనువాదం :
సి. మహాలక్ష్మి

# తల్లులారా!

మూలం :
మాగ్జింగోర్కీ. 1927.

"1927 నాటికన్న యీ సమస్య వేయిరెట్లధికతర క్లిష్టమైనది. పసితనమునుండియే యుద్ధవిముఖతను అలవరచనిచో, ప్రస్తుత వాతావరణలో యుద్ధనివారణ సాధ్యముకాదు. విద్యావతులగు మాతలు, పరిస్థితులను చక్కగా గమనించి, తమ బిడ్డలను శాంతిమార్గ ప్రవర్తకులుగా జేయునట్టి ఉత్కృష్ట బాధ్యత నవలింబింప వలసిన యావశ్యకత ఎంతయూ గలదు." ||సం||

"యుద్ధం, యూరోపియన్ సంస్కృతీ కేంద్రాలను నాశనం చేయనుంది. యుద్ధంలో చావడమో, వికలాంగులు కావడమో, లేక ఉన్మాదులవడమో జరగకుండా మిగిలిన మానవులను వన్యమృగాలుగా చేయనుంది ఇది జరగకూడదని అసమ్మతిని తెలిపే దెవరు? ఈ విపత్తు సంభవించకుండా ఆటంకపరచేవా రెవరు?

స్త్రీజాతిని, మాతృ మూర్తులను హెచ్చరిస్తున్నాను. 275000 మంది అమెరికన్ స్త్రీలనే కాదు. గత మారణహోమంలో తమ కన్న బిడ్డలను గోల్పోయిన లక్షలాది తల్లులనే కాదు. నేడో రేపో తమ తనయులను బలిచేయవలసి వచ్చే తల్లుల నుద్దేశించికూడా నేనీ మాటలు చెపుతున్నాను.

నవమాసాలు మోసిన మీరు, ఎందుకు మౌనంగా వుంటున్నారు? ప్రపంచం అంతట్నీ మళ్లీ విషపూరిత మేఘాలలో చుట్టబెట్టనున్న యుద్ధోన్మాదాన్ని ధిక్కరించి, మీ గంభీర స్వనం వినిపించరేం?

తల్లులైన మీరే, మృత్యు శిథిలమైన ప్రపంచంపై అమృతము కురిపించి జీవితాన్ని ప్రతిష్ఠిస్తున్నారు. మానవునోష్ఠ మృత్యువు వధిస్తున్న ప్రతి క్షణములోనూ, యీ వినాశశక్తిని అధిగమించి, స్త్రీ మూర్తి ప్రపంచానికి నవమానవుణి ప్రసాదిస్తోంది.

బిడ్డను సాకి పోషిస్తున్నారు మీరు, జీవితంలోనికి, చరిత్రలోనికి త్రోవ చూపుతున్నారు మీరు—ప్రపంచ సంపదల నభివృద్ధిచేసే కార్మికునిగా, వీరునిగా, మానవజాతి నాయకునిగా, యోగిగా, మహా మేధావిగా. అటువంటి మీ బిడ్డను వినాశం ఎదుర్కొంటుంటే, ఎలా ఊరుకో గలరు మీరు?

చరిత్రలోని వైభవం, సిరిసంపదలు, మీ బిడ్డలవల్లనే సృష్టియైనవి. మీ బిడ్డలు నవ్య సృష్టిచేసి జీవితానికి నూత్నాలంకరణ చేశారు. తమ శ్రమ సంపదతో జీవితంలో కొత్త వెలుగులు నింపినారు. పశుప్రాయమైన జీవితాన్ని మార్పు చేసినారు—ఇంతకంటె అద్భుతమైన దాన్ని ప్రపంచం ఎన్నడూ కనీ వినీ ఎరుగదు. మీరు పెంచి పోషించిన మానవుడు, మళ్లీ క్రూరుడుగా, వన్యమృగంగా, హంతకుడిగా తయారవుతోంటే, మీరు చూస్తూ ఎలా వూరుకోగలరు?

మీరంతా ఒక్కుమ్మడిగా ఉన్మాదులైన మీ బిడ్డలను హెచ్చరించండి!—

“మీ హత్యల నాపండి? మారణహోమం ఆపండి. జీవించడంకోసం, శ్రమించి సృష్టించడంకోసం, జీవితాన్ని సౌఖ్యమయం చేయడం కోసం, జీవితాన్ని న్యాయయుతం, బుద్ధివంతం, సౌందర్యమయం చేయడంకోసం, మేము మిమ్మల్ని లోకం లోనికి తీసుకవచ్చాము. ఇక చాలించండి మీ విమాన యుద్ధాలు, విషవాయు ప్రయోగాలు, ఒండొరులను నాశనం చేసుకోవడానికి కనిపెట్టిన పైశాచిక ఆయుధాలను,” అని హెచ్చరించండి.

తల్లులారా! భార్యలారా! మీకు హక్కుంది. న్యాయాన్ని ప్రతిష్ఠించే హక్కు. మీనుండే జీవితం సృష్టి అవుతోంది. ప్రపంచాన్ని మృత్యువునుండి కాపాడడానికి మీరే పూనుకోవాలి. మృత్యువుతో అవిరామంగా పోరాడి జయించే మహత్తర శక్తి మీకే.

ఈ ఘోర వినాశంనుండి, యీ ఉన్మత్త వాతావరణంనుండి, మీ పుత్రులను మీరేల రక్షించ బూనుకోలేదు? వినాశానికి, సర్వనాశనానికి దారితీసే వారికి వ్యతిరేకంగా, జీవిత రక్షణకోసం, మీరు మీ అమోఘ శక్తి నెందుకు వినియోగించడం లేదు?



---

9వ పేజి నుండి

మడందిచ్చిన గడియారాన్ని ములకు చెక్కుతున్నాడు... అబ్బా! ఏమనాలి ఆ దరిద్ర నారాయణ మూర్తిని... ఆ నిరాడంబర ... మూర్తిని ... ఆ బంగారు వెలుగుతో .. అతని ముఖవర్చస్సునుండి కొన్ని జ్యోతులు మావైపు కేంద్రీకరింప బడ్డాయి.

ఎడమ వైపుగా కొంచెం గోల...ఆ ఆజాను బాహుడు తన చేతివ్రేలిని ముక్కు కుసూటిగా పెట్టుకున్నాడు. నిశ్శబ్దం. ఎంత విచిత్రం...లక్షల కొద్ది కలకలాలతో నిండి పోయిన మైదానంలో...క్రమశిక్షణ...

ఆ మహాత్ముని ప్రార్థన...రానురాను సంకీర్తన...ఎంత మధురం...ప్రార్థనలపై నమ్మకంలేని నా హృదయం ఆ నిమిషంలో ఎదురు తిరిగింది...తాళం వేయకుండా ఉండలేక పోయాను...పాటనందుకున్నాను...ఎంత హాయి!

ఆ తాతయ్య బోసినోటినుండి వెలువడిన ముత్యాల తొలకరి మైదానమంతా కురిసింది...పదునైదు నిమిషాలుగడచిన్నై ఆ దివ్యజ్యోతి వేదికనుండి దిగిపోయాడు...

మైదానం మైదానమై పోయింది...ఆ లోక బాంధవుని దర్శనం యిక ఏనాటికో ... ఆ మహాత్ముని ఇంకో మారు చూడలేనిజీవితం ఎందుకు? ఉపదేశాన్ని పొందని హృదయం ఎందుకు?

కె. సభా
[సేవాసమితి]



### ఆంధ్ర మహిళా సభవారి సేవావృక్షంలో మరొకశాఖ

# స్త్రీ శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాలల నిర్మాణ ప్రయత్నం

## భారత ఆరోగ్యమంత్రి శ్రీమతి గౌ॥ రాజకుమారి అమృతకౌర్‌గారిచే జనవరి 7వ తేదీని శంకుస్థాపన.

### నర్సు మిడ్‌వైఫ శిక్షణ కేంద్రము కూడా స్థాపించు సూచనలు.

భారత దేశంలో, మాతాశిశుసంరక్షణశాలలు, వైద్యశాలలు తగినన్ని లేకపోవుటచేతను, వైద్యులు, నర్సులుగూడ, జనాభాకు తగినంత ఎక్కువమంది లేకుండుట చేతను, ప్రజలకు, అందునా ముఖ్యంగా, స్త్రీ, శిశువులకు, వలసిన చికిత్స పూర్తిగా అందుబాటులో లేదనుట అతిశయోక్తి కాదు. ఈ లోటును ప్రజా ప్రభుత్వము పూర్తిగా గ్రహించి కూడ, ఒక్కమారుగా దీనిని తీర్చగల సమర్థత లేకపోవుటచే, కొద్ది కొద్ది నిర్మాణములతో తృప్తి పడవలసి వస్తుంది. ప్రజలు, ప్రజాసంస్థలుకూడ, ప్రభుత్వముతో కలిసి, యీ నిర్మాణములలో సహాకరించిననాడే, అచిర కాలములో మనకుగల యీ లోటు క్రమంగా తీరగలదు.

ఈ ఉద్దేశముతోనే, ఆంధ్ర మహిళాసభ, యీ స్త్రీ శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాలల నిర్మాణమునకు పూనుకొనినది. వీరి సహాయమును గ్రహించిన రాష్ట్ర ప్రభుత్వము, అడయారులో 21 గ్రౌండ్ల స్థలమును యీ నిర్మాణమునకు విరాళ మొసంగిరని, కొంతమంది దాతలు దీనికై ధన విరాళములనిచ్చియున్నారని యిదివరలో ప్రకటించియున్నాము.

ఈ నిర్మాణములో గమనించవలసిన ముఖ్య విషయములు రెండు :—

మదరాసులో గల పెద్ద వైద్యశాలలలోనూ, పెద్ద వైద్యుల యొద్దను, వైద్యమును బడయుటకై ముఖ్యంగా



స్త్రీ శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాలలకు శంకుస్థాపన చేయుచున్న శ్రీమతి రాజకుమారి అమృతకౌర్‌గారు.

## స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాలల నిర్మాణ ప్రయత్నం

బయట ఊళ్లనుండి వచ్చిన సామాన్య రోగులకు, వైద్యశాలలో చోటు చిక్కకపోవచ్చు, పెద్ద డాక్టర్ల స్వంత నర్సింగ్ హోమ్సులోనుండి వైద్యమును పొందుటకు శక్తి లేకపోవచ్చు. అట్టివారికి నర్సింగ్‌హోమ్‌లో నివాసమిచ్చి, వ్యాధిని గూర్చిన నిపుణ వైద్యుని సలహాపై, వైద్యము జరిపించుట—సామాన్య రోగులకు సామాన్య చికిత్స కేవలము కలిగించుట, దీని ఒక ఆశయము.



శంకుస్థాపన చేయవచ్చిన శ్రీమతి అమృతకౌర్‌గారికి మహిళాసభ స్వాగతము.

భారత ప్రభుత్వపు నర్సు మిడ్‌వైఫ్ శిక్షణ ప్రణాళిక ననుసరించి, ప్రతి సంవత్సరము కొంతమంది నర్సు మిడ్‌వైఫ్‌లను తయారుచేయుట రెండవ ఆశయము.

## స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాలల నిర్మాణ ప్రయత్నం

ఈ కార్యక్రమమును కొనసాగించు నిమిత్తము, భవన నిర్మాణమునకు, జనవరి 7వ తేదీని, శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ గారు శంకుస్థాపన జేసిరి. ఆ సాయంకాలము 5 గం॥కు ప్రభుత్వమువారు మంజూరుచేసిన స్థలమంతయు, తోరణములతో అలంకరించబడినది. ప్రత్యేకముగ నలంకరింపబడిన మంటపముపై, రాజకుమారి గారితోపాటు, ఉత్సవమునకు విచ్చేసిన ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ భక్తవత్సలం, మద్య నిషేధ మంత్రి శ్రీ సంజీవరెడ్డి, తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కామరాజ నాడార్, హెల్తు సర్వీసుల డైరెక్టరు శ్రీ కె. సి. కె. రాజా, సర్జన్ జనరల్ కర్నలు భటియా, డాక్టర్ ముత్తులక్ష్మి రెడ్డి, బులుసు సాంబమూర్తి మొదలైన ప్రముఖులు ఆసీనులైరి.

ఆంధ్ర మహిళాసభ వ్యవస్థాపక కార్యదర్శిని అయిన శ్రీమతి దుర్గాబాయమ్మగారు, ఆంధ్ర మహిళాసభ ఆదినుండి, జాతి మత భాషా వివక్షతలేకయే స్త్రీ జనసేవ చేయుచున్నదనియు, ఇంతదనుక, ప్రభుత్వమునుండి ఏవిధమైన సహాయమును కోరకయే తన కార్యక్రమమును నెరవేర్చుకొనుచున్నదనియు, యీ సేవను పరికించియే, అడిగినంత మాత్రంలో యించుకయు సంకోచించక, ఆడయారు స్థలమును మదరాసు ప్రభుత్వము మంజూరు చేసినదనియు చెప్పుచూ, ప్రభుత్వముయొక్క సహకారమునకు కృతజ్ఞత తెలిపిరి. తిదుపరి, ఉపోద్ఘాతములో చెప్పినట్లు, యీ మాతా శిశు సంగక్షణాలయము, ఉచిగ వైద్యశాలల నిర్మించుటలో తమ యభిప్రాయము వెల్లడించిరి. ఇందుకు తోడ్పాటుగా విరాళములిచ్చిన పలువురు దాతలకు కృతజ్ఞత తెలిపిరి. అనంతరము, శ్రీమతి రాజకుమారిగారిని శంకుస్థాపన చేయవలసినదిగా కోరిరి.

శ్రీమతి అమృతకౌరుగారు, శ్రీ దుర్గాబాయిగారు ఆంధ్ర మహిళాసభ రూపేణ చేయుచున్న సేవ తమకు



శంకుస్థాపన మహోత్సవమును తిలకించవచ్చిన అతిథి మహిళలు.

చిరపరిచితమేననియు, మహిళాసభ భోజన గృహమునకు 4 సం॥ క్రితము తాము శంకుస్థాపన చేసిరనియు చెప్పి, ఇప్పటి భాషా రాష్ట్ర విభజన సమస్యలతో జోక్యము లేకుండా, సేవయే ప్రధానంగా, మదరాసులో, నిస్సంకోచంగా క్రొత్త క్రొత్త శాఖలు స్థాపించుచున్న ఆంధ్ర మహిళా సభను అభినందించిరి.

తరువాత, మనదేశంలో స్త్రీలు చాలవగా నర్సు వృత్తి నవలంబించకపోవుట శోచనీయమనియు, బాలింతల యొక్కయు, శిశువుల యొక్కయు మరణ సంఖ్య మన దేశంలో అత్యధికంగా ఉన్నది గనుక, ప్రవీణులైన వైద్యులు, మంత్రసానులు, నర్సులు, వైద్యశాలలు ఎక్కువగా కావాలనియు, అందు ముఖ్యంగా, డాక్టరు ఎంత ప్రవీణుడైనా, సరియైన నర్సులు లేనిచో, రోగికి సంరక్షణ సరియైన మార్గములో జరుగదు గనుక, వేనవేల నర్సులు, వీలైనంత తక్కువ కాలంలో, నర్సు విద్య నభ్యసించవలెనని భారత ప్రభుత్వము కోరుచూ, అఖిల భారత నర్సింగ్ కౌన్సిలు వారు దీనికి తగిన ప్రణాళికలను వేయుచున్నారనియు, యిది త్వరలోనే అమలులోకి రాగలదనియు, ఈ ప్రణాళిక ననుసరించి, ప్రస్తుతము మహిళా సభవారు కట్టబోవు సంస్థలో, నర్సుల శిక్షణకు కూడ ఏర్పాట్లు చేయనున్నారని వినుట సంతోషకర విషయమనియు, ప్రభుత్వ కార్యక్రమమునకు, ప్రజా సంస్థలు ఇట్లు తోడ్పడుట చాలా అభిలషణీయమనియు చెప్పిరి.

శంకుస్థాపన యనంతరము హెల్త్ సర్వీసెస్ జనరల్ డాక్టరు కె. సి. కె. రాజా ప్రసంగిస్తూ, భారత దేశంలో నర్సుల ఆవశ్యకత ఉన్నది, మన దేశంలో 43000 మందికి ఒక నర్సుచొప్పున ఉన్నారు, ఇది చాలా తక్కువ సంఖ్య. నాగరిక దేశములలో కనీసము 500 మందికి ఒక నర్సైనా ఉండి తీరాలి, ఇట్టి స్థితి రావాలంటే ప్రజలు చాలా సహకరించాలి, ఎక్కువ స్త్రీలు నర్సువృత్తి నవలంబించే మార్గాలాలోచించి, తక్కువ కాలంలో ఎక్కువమంది వచ్చేటట్లు ఏర్పాట్లు చేయాలి అని చెప్పారు.

కర్నల్ భాటియా ప్రసంగిస్తూ, ఇట్టి ప్రజా సంస్థలే కార్యక్రమాలవలన ఏంచుటకు ఎంతయో అవకాశము కలదనియు, ప్రజలంతా యిట్టి సంస్థలకు సాయశక్తుల తోడ్పడవలెనాడే, యీ కార్యక్రమము జయప్రదము కాగలదనియు నుడివిరి.

ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు మహిళాసభ 17 సంవత్సరములుగా, రాజకీయ, సాంఘిక, జాతి మత భాషా వైషమ్యాలు లేకుండా సంస్థను స్థాపించి, సాఫల్యతా యుతముగ చేయుచున్న సేవను, అందుకు కారకురాలునగు శ్రీమతి దుర్గాబాయమ్మగారిని ప్రశంసిస్తూ, సాధ్యమైనంత వరకు ప్రభుత్వము వారిట్టి నిర్మాణ కార్యక్రమానికి తప్పక తోడ్పడుదురుగాని, ప్రస్తుత ప్రభుత్వ ఆర్థిక పరిస్థితులలో యీ సహాయమంత ఎక్కువగానుండబోదు గనుక, ప్రజలే దీని భారము వహించవలసిన ఆవశ్యకత యున్నదని చెప్పిరి.

అనంతరము శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు ఉపన్యసిస్తూ, గ్రామాల్లో పనిచేయు నర్సులకు, పట్టణములలో వారికివలె అన్ని సదుపాయములు సమానజీతాలు ఇచ్చినచో, ఎక్కువ మంది గ్రామములలో పనిచేయుటకు కియ్యకొందురని చెప్పిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు మహిళాసభ తలచుకొన్న కార్యక్రమము జయప్రదముగా సాధించుటకు ప్రతివారు తోడ్పడవలెనని హెచ్చరిస్తూ, శ్రీమతి అమృతకౌరుగార్కి ఇతర ఉపన్యాసకులకు, మిగతా అతిథులకు వందనములు చెప్పిరి.

జనగణమన గానముతో సభముగిసినది.

రాత్రి 7-30 కు శ్రీమతి అమృతకౌర్ గారి గౌరవార్థము మహిళాసభలో విందుజరిగెను.

జి. ప్రభ.



## నర్సింగ్ హోమ్ సహాయార్థం ఆంధ్ర మహిళా సభవారిచే చౌచౌ ప్రదర్శనము

8-1-1950 ఆదివారం సాయంకాలము ఆంధ్రమహిళా సభ సభ్యురాండ్రు, విద్యార్థినులు కలిసి, మహిళాసభవారిచే నిర్మింపబడనున్న స్త్రీ, శిశువుల సంరక్షణశాల, వుచిత వైద్యశాలల సహాయార్థం, విక్టోరియా పబ్లిక్ హాలులో ఒక చౌ చౌ ప్రదర్శనమును గావించిరి. ఇండియా ఆరోగ్య మంత్రి గౌరవనీయులు శ్రీమతి రాజకుమారి అమృత కౌర్ గారు ప్రదర్శనమునకు విచ్చేసిరి. మహిళా సభ గానశాఖ వుపాధ్యాయిని శ్రీమతి.సుబ్బలక్ష్మమ్మగారు సభ్యురాండ్రె వాయిద్యగోష్ఠిని నిర్వహించిరి. శ్రీమతి కమలాచంద్ర బాబు గారు, శ్రీమతులు అనసూయ సీతగార్లు భావ గీతలను పాడిరి. శకుంతల నాటకమునుండి, కొన్ని దృశ్యములను శ్రీమతి కమలామణిగారు విద్యార్థినులచే ప్రదర్శింప జేసిరి. చండీదాస్ నృత్య గానమును సభ నృత్యశాఖ వుపాధ్యాయిని శ్రీమతి సామ్రాజ్యముగారున్నూ, విద్యార్థినులును, కలిసి ప్రదర్శించిరి.

ప్రదర్శనమును ప్రశంశించుచు నర్సింగ్ హోమ్ సహాయార్థం సభ్యురాండ్రు చేసిన కృషిని, శ్రీమతి అమృత కౌర్ గారు అభినందించిరి. శ్రీమతి దుర్గాబాయ్యమ్మ గారు ప్రదర్శనములో పాల్గొన్న ప్రతి వారికీ కృతజ్ఞత తెలుపుచూ దీనికి ప్రత్యేకముగ తోడ్పడిన, శ్రీ రజినీకాంతరావు సుభద్రగార్లకు, శ్రీ రమణరావు, గోపీచంద్, లింగమూర్తి, రామాచార్ల గార్లకు కృతజ్ఞత తెల్పిరి. అటు పిమ్మట టిక్కెట్ల అమ్మకములో అత్యంత కృషి చేసిన సభ్యురాండ్రందరకూ, టిక్కెట్లుకొని విరాళములిచ్చి ప్రదర్శనమునకు వచ్చిన ప్రేక్షకులకు, వరుసగా తమ కృతజ్ఞతను తెలిపిరి. ఆ నాటికి వసూలయిన మొత్తం 7000, ఏడువేల రూపాయ అని సభలో వెల్లడించిరి.

శ్రీ కోటా రంగనాయకులు చెట్టిగారు శకుంతల పాత్రను నటించిన కుమారి వసంతకు ఒక రజత పాత్రను బహుమానముగా నొసగిరి.

* * *

## చర్కామండలి, స్త్రీలశాఖ
### కేంద్రము : ఆంధ్రమహిళాసభ

27-1-'50. ఆంధ్రమహిళా సభలో, చర్కామండలి యొక్క స్త్రీలశాఖ ప్రారంభించబడినది. శ్రీమతి అచ్యుతుని గిరిజగారు ఈ శాఖయొక్క కార్యదర్శినిగా వ్యవహరింతురు. ప్రారంభ సభకు శ్రీమతి బులుసు రాజరాజేశ్వరమ్మగారు అధ్యక్షత వహించిరి. సమీపమునందలి స్త్రీలలో చర్కా ప్రచారము గావించుట దీని ముఖ్యోద్దేశము. మాసమునకొక నిర్ణీతదినమున, యీ మండలి సభ్యురాండ్రు మహిళాసభలో సమావేశమై, నూలు వడకుదురు. దీనిలో సభ్యత్వ రుసుము సంవత్సరమునకు 6 చిలపలు.

ఇందు ప్రస్తుతము 30 మంది సభ్యురాండ్రుగా జేరిరి. రాట్నములు కొను నిమిత్తము శ్రీ రాజేశ్వరమ్మగారు రూ. 25/- మండలికి విరాళముగా నొసగిరి.

* * *

## ఆంధ్ర మహిళా సభలో సర్వోదయ దినము

30-1-1950 సాయంకాలం, 4 గంటలనుండి 5 గంటల వరకు, సభ్యురాండ్రు, విద్యార్థినులు, సూత్రయజ్ఞము చేసిరి. 5 గం॥ నుండి వందేమాతరం, గీతలోని కొన్ని శ్లోకములు, ఇతర ప్రార్థన పాటలు పాడి, తదుపరి రామ్‌ధున్ పాడిరి. తరువాత, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు, మహాత్ముని మానవ సేవా తత్పరతను గూర్చి వివరించిరి. "మహాత్ముడు కష్టించి, ఉద్యమము లేవదీసి, సంపాదించిన ప్రజా సామ్య ప్రజారాజ్య మీనాటికి స్థాపించుకున్నాము. ఈ రాజ్యము నిలబెట్టుకోవాలంటే, ఆయన అనుచరులైన వారు, ఆయన ఆశయముల ప్రకారము వర్తించి, ఇందలి ఫలితములు ప్రజ అందరికీ సమముగా అందునట్లు కృషిచేయవలసి యున్నది. తన అనుచరులనెడి వారిలో ఏ కల్లకపటములు, వర్గ వైమనస్యములను చూచి ఆ మహాత్ముని మనసు క్షోభించిపోయునో అట్టి దుర్గుణములను వీడి, ప్రస్తుత ప్రజానాయకులు స్వార్థరహితముగ సేవాపరులైననాడే ఆ మహాత్ముని అపూర్వ సత్యాహింసా ఉద్యమము పరిపూర్ణత జెంది దేశమంతట శాంతి స్థాపనకు కారణము కాగలదు" అని వారు చెప్పిరి.

జన గణ మన గానముతో సభ ముగిసినది.

* * *

# విద్యాభ్యాస లక్ష్యములు
# పసిపిల్లల మానసిక ప్రవృత్తి

✻ శ్రీమతి అ. చన్న ఘంటమ్మ ✻



విద్యయొక్క లక్ష్యము ఉత్తమ పౌరసత్వము. ఉత్తమమైన ఆశయములు, ఉదాత్తమైన భావములు, పరిసరములలో తెలివి తేటలతో ప్రవర్తించుటకగు సామాన్యమైన లోకజ్ఞానము, ఉదరపోషణకో వృత్తి, ఇవి, విద్యాభ్యాసముయొక్క ప్రధాన లక్ష్యాలని చెప్పాలి. హక్కులను గుర్తించి సమర్థతతో అనుభవించుట, బాధ్యతలను గ్రహించి హృదయపూర్వకముగ నిర్వహించుట, ఇవి మానవునికి విద్యవలన కలుగవలసిన శక్తులు—అనగా మానసిక వికాసము.

ఈ శక్తులన్నీ మానవునిలో అకస్మాత్తుగా ఆవిర్భవించేవి గావు. ఈ లక్ష్యాలన్నీ ఒక శుభోదయమున తమంతట తాము సిద్ధించేవికావు. ఈ మానసిక వికాసము ఉన్నట్టుండి, ఒకమారు ఆకాశమునుండి మానవుని అరచేతిలోనికి జారి పడేదికాదు. బాల్యావస్థ అంతటిలో శిశువోనరించు, అవిరామమైన, అపరిమితమైన, స్వతస్సిద్ధమైన కృషిఫలితమే ఇది. నివురుగప్పిన నిప్పువలె పసివారల మనసులో దాగియున్న జ్యోతి, తమ వివిధ ప్రవృత్తుల సహాయముచే, క్రమముగా వికాసమునుపొంది, మానవునిలో పరిపూర్ణ వికాసమును పొందుతుంది. ఈ స్వేచ్ఛావతరణకు తోడ్పడునదియే విద్య.

అందుకేలోకోక్తి "Child is the father of the man" అని. పసితనములో జరిగిన పోషణ రక్షణ ఫలితంగా, మానవుని శరీరము బలిష్ఠమై, ఆరోగ్యవంతమై సుందరమైనది కావచ్చు; పోషణ రక్షణలు లోపించినట్లైతే, బలహీనంగా అనారోగ్యంగా, అందవిహీనంకావచ్చు. అట్లే, మానసిక విజ్ఞానము, సౌందర్యము కూడ—పసితనమునుండి, వారలయొక్క వివిధప్రవృత్తులు క్రమపద్ధతిలో పోషణను, శిక్షణను పొందినట్లైతే, వారికి చక్కని సంస్కారము కలుగుతుంది. వారి శక్తులు సక్రమమార్గములో విజృంభిస్తాయి. వారిలోనున్న ఆత్మ, జ్యోతిర్మయంగా వికసిస్తుంది. పోషణ శిక్షణలలో లోపము కలిగితే, ఆత్మ వికాసము సక్రమముగ నుండక వక్రగతినొందుతుంది. ఉత్తమమైన విద్యావిధానము శిశువుయొక్క సర్వతోముఖ వికాసానికి తోడ్పడు నదిగా ఉండాలి.

పిల్లల విద్యావిధానాన్ని గూర్చిన పూర్వపు అభిప్రాయాలన్నీ కూడా యిప్పుడు మారి పోతున్నాయి. ఎందువలన నంటే, ఇప్పుడు మనస్తత్వ శాస్త్రములో అనేకమైన పరిశోధనలు జరిగి, పసివారలయొక్క మానసిక ప్రవృత్తులను గూర్చిన కొన్ని నిశ్చితాభిప్రాయాలు మనకు తెలియచున్నాయి. ఈ విధమైన జ్ఞానమువల్ల, వారి వికాసమునకు అభివృద్ధికి తోడ్పడగల ఉత్తమ విధానాలను, మాంటుస్సోరి మొదలగు విద్యావేత్తలు, అర్ధశతాబ్దముగ పిల్లలతో వారికి గలిగిన స్వానుభవసహాయముతో, ఏర్పాటు చేసియున్నారు.

పూర్వకాలపు స్కూళ్లలో, ఉపాధ్యాయుడు ప్రధాన వ్యక్తి. 5 సంవత్సరములకు అక్షరాభ్యాసము అయ్యాక, స్కూలుకువచ్చిన పిల్లలకు, సకల విధమైన విజ్ఞానమూ నూరిపోయవలసిన ఉత్కృష్ట బాధ్యత ఉపాధ్యాయునిదనే అభిప్రాయము ఉండేది. అందువలన ఆ ప్రాముఖ్యత అంతా అతనిదే. పిల్లలందరూ తనచేతి యంత్రాలనీ, తను ఎప్పుడేమి ఏ విధంగా చేయమన్న ఆ విధంగా వారు చేయవలెననీ అతని యుద్దేశము. చేయని పిల్లలకు శిక్ష తప్పనిసరి. అందువల్ల, పాపము, పసివారలకు, బడిపేరుచెప్పితే దుఃఖము. బడిపంతులంటే వారికో బెబ్బులి. చదువంటేనే తలనొప్పి-పిల్లవాని చదువు తల్లిదండ్రులకో తీరని సమస్య.

ఆధునిక యుగంలో ఈ అభిప్రాయాలకు గొప్ప మార్పు కలిగింది. ప్రాధాన్యత ఉపాధ్యాయునినుండి పిల్లవానికి

మరలింది. శిశువులోనే కొన్ని మహత్తరమైన శక్తులు అంతర్గతమైయున్నవి. ఈ శక్తులవల్ల, అనుక్షణము అతనికి జ్ఞానోపదేశం జరుగుతూ ఉంది. మైనపుముద్దపైవలె అతని మనసున, అనుక్షణానుభవములు ముద్రింపబడుతున్నాయి. తదనుసారంగా అతని మనస్సు పరివర్తన నొందుతూ ఉంది. కనుక ప్రస్తుతపు ఉపాధ్యాయుడు, ఒక్కొక్క శిశువులో యీ పరివర్తన ఎట్లాకలుగుతుందో పరిశీలిస్తాడు. ఈ పరివర్తన సక్రమంగా కలిగే పరిసరాలను ఏర్పాటుచేస్తాడు. పిల్లవాని అంతర్గత శక్తులు ప్రకాశించుటకు అనువుగా తోడ్పడతాడు.

అయినా ఎంత ఆశ్చర్యమో చూడండి! పుట్టినప్పుడు ఏడ్పుతప్ప వేరువిధమైన శబ్దమును పలికించలేరుగదా పాపలు! 3 సంవత్సరములు నిండీనిండకముందే, భాషను ఎంతతుణ్ణంగా నేర్చుకుంటారో! పరిశుభ్రమైన, స్పష్టమైన, భాషా ప్రయోగాలన్నీ ఎంత చక్కగా అలవర్చుకుంటారో—పెద్దవారలమైయ్యాక, 20 సంవత్సరములు దీక్షతో కృషిచేసినాగాని అబ్బని ధ్వనులు, సుళువులు, ప్రయోగాలు, ధాటి, యీ మూడేండ్ల బిడ్డడు ఎట్లు నేర్చాడో! ఏ ఉపాధ్యాయుడు బోధించాడో! భాష నేర్చుటయేగాక, భాష యందలి ప్రత్యేక ధ్వనులను పలికించుటకై తన గాత్రమునందలి శబ్ద తంత్రులనుకూడ యీ పసివాడు తర్ఫీదు చేశాడన్న మాట.

దీనివలన, యిటీవలవరకు గుర్తింపబడని మరో సత్యము నిర్ధారణయగుతూ ఉంది. ఐదారేండ్లైన తరువాత విద్య ప్రారంభించుటయనేది హాస్యాస్పదమని—జన్మమాదిగా, పరిసరాలే ఒక పాఠశాలగా, శిశువులో అంతర్గతమైన శక్తులే ఉపాధ్యాయులుగా, నితాంతము విద్యాభ్యాసన జరుగుతూ ఉంటుంది. ఈలోగా శిశువునకు గలిగిన అనుభవాలపై భవిష్యత్తునందు శిశువులో కలిగే వికాస మాధారపడియుంటుంది. అందువల్ల, తల్లి దండ్రులు ఉపాధ్యాయులు కూడ యీ విషయాన్ని గుర్తించాలి.

ఇప్పుడు చూడండి—పిల్లలు పరిసరములను చక్కగా పరిశీలిస్తారు. గుర్తు పెట్టుకుంటారు. ఆ విధంగా ఎంతో జ్ఞానాన్ని సంపాదిస్తారు. అందువల్ల, విజ్ఞానాన్ని కలిగించే పరిసరాలను కల్పించటం మన బాధ్యత అవుతుంది. రంగు రంగుల వస్తువులు, ఎంత చిన్నవైనా, కదిలేవస్తువులు, వారు పట్టిచూచి, కదపగలిగి ఉపయోగించుటకు వీలైన వస్తువులు, మనము వారికి అందుబాటులో ఉంచాలి.

సామాన్యంగా స్పర్శమూలంగా వారు ఎన్నో సంగతులు నేర్చుకుంటారు. బీదవారల యిండ్లలో మట్టికుండలు తక్క వేరు సామానులుండవు. గొప్పవారి యిండ్లలోని ఖరీదైన సున్నిత వస్తువులను పిల్లలను తాకనివ్వరు. రెండు విధములా పిల్లలకు ఆశాభంగమే. అన్యాయమే. నిజంగా వారి ఎదుట నుండి తాకవలెనని ఆశకలిగిన తరువాత, తాకకుండా ఉండమంటే వారికెంత కష్టము. 'విరిగిపోతుందిరా, వెధవా—అక్కడ పెట్టెయి.' అని అరుస్తాము. పాపము వాని మనసు చివుక్కుమంటుంది. అప్పటికి భయంకొద్దీ అక్కడ దానిని వదిలివేసినా, మరోసారి మనము లేకుండా ఆ పని చేస్తాడు. ఈ విధంగా కపటము నేర్పిన వారమవుతాము. "అమ్మా, అది జాగ్రత్తగా చూచిపట్టుకో" అని చెప్పితే, వాడు మెల్లగానే చేస్తాడు. ఖర్మము చాలక జారిపడ్తే, వస్తువుచెడిన విషాదమువల్ల యికమీద జాగ్రత్త తనంతటదే వస్తుంది.

పెద్దవాళ్లుచేసిన పనులన్నీ చేయాలంటారు వాళ్లు—అనుసరణ వారిలో ప్రధానశక్తి. బొమ్మరిల్లుకట్టడము, గుజ్జనకూళ్లువండటం, యుద్ధాలుచేయటం, రైళ్లునడపటం, యివి, యీ అనుసరణకు ప్రత్యక్ష రూపాలు. చదువు నటించటం, కనపడ్డచోటెల్ల పిచ్చిగీతలు గీసిపెట్టటం, కూడా అంతే. చిన్నచిన్న పనిముట్లు కొనియిచ్చినచో వారి యీతృష్ణ తీరకలదు. లేకున్నచో పెద్దవారల బల్లలు, కుర్చీలు, చెంబులు, తపాళాలు, చీపుళ్లు, చాటలపైకి వారు దాడితీసి, అల్లరిపిల్లలనీ, సామానులు పాడుచేసి పెట్టారనీ పేరుసంపాదించుకుంటారు.

భాష నేర్వటానికి పసితనమే సమయం. ఎన్ని క్రొత్త మాటలైనా, ఎంత అర్థములేని మాటలైనా వారు ఉచ్చరించగలరు. జ్ఞప్తియందుంచుకో గలరు. దాది చంకలోని గొప్పవారి బిడ్డకు, చెట్టుక్రింద తిరుగుచున్న బీదవారి బిడ్డకు, నిత్యము సంభాషణ వినే అదృష్టముండదు. తల్లి దండ్రులు బిడ్డలకు కథలుచెప్పి, ఎక్కువగా వారితో ముచ్చటించుచున్నట్లైన, బిడ్డలకు భాష త్వరగా రాగలదు. అదిగాక,

వచ్చీరాని మాటలు వారు ఉచ్చరిస్తూఉంటే, వారికి మన మాటలర్థముకావనే వెఱ్ఱి అభిప్రాయంతో మనము వారి ననుసరించి మాట్లాడితే, వారికి సహాయము చేయక పోవుట యేగాక, ఆశాభంగముకూడ కలిగించిన వారమగుతున్నాము. ఒక్కొక్కప్పుడు వారికి కోపముకూడా కలుగుతుంది.

పిల్లలు పాపము ఎన్నిమైళ్లైనా నడవగలరు. అయితే నడకవల్ల దేహపరిశ్రమయని తెలిసి కాదు. దానివలన వారి అవయవాలను స్వాధీనపరచుకోటానికి, పరిసరాలను ఆస్వా పించటానికి. చంకనెత్తుకునో, పెరాంబులేటరులో కూర్చో పెట్టుకునో, వారిని త్రిప్పితే యీ రెండు వాంఛలకు భంగము కలుగుతుంది. నడుస్తూ ఉంటే, దారిలో ఉన్న ప్రతి యిసుక రేణువూ, ప్రతి ఆకూ, ప్రతిపువ్వూ, ప్రతిపిట్టా, బిడ్డల నాకర్షిస్తుంది. పరిశీలనలో వారు నిదానిస్తారు. వారితోపాటు ఉండటానికి మనకు కాలవ్యాపన, ఓపిక లేదు. వినుకు—మన కంటికగోచరమైన వస్తువులెన్నో వారినాకర్షి స్తాయి, వారికిపాఠాలు చెప్తాయి. మనము వారిని తొందర పెట్టుటచే, నడవకాళము నరికట్టుటయేగాక, వారికి దుఃఖము కలిగింతుము. పెంకివాడైన అల్లరి పెట్తాడు. మేధకుడైన అణగి ఆశాభంగానికి ఓర్చుకుంటాడు.

పసివారలకు ఆటవస్తువులెంత అవసరమో, తోటి వారల సహవాసము కూడా అంతకన్నా ఎక్కువ అవసరము. బొమ్మలతో ఊహించుకొని అనుభవించే ఆనందము కన్న తనతోటి వారలతో ఆటపాటలలో అనుభవించే ఆనందము, అలవర్చుకునే విజ్ఞానము ఎక్కువగాఉంటుంది. అందు కనే, నర్సరీస్కూల్సు, మాంటెసొర్రీ, కిండర్ గార్డన్ స్కూల్సు పసివారలకని విద్యావేత్తలు ఏర్పరచినది. స్కూలుయొక్క వాతావరణ, మిక్కిలి ప్రశాంతమైనదై, మనోవికాసము కలిగించే, ఆహ్లాదకరమైన, ఆకర్షణీయమైన పరిసరాలతో, పని ముట్లతో నిండియుంటుంది. ఇందు, స్కూలు భవనముతో సహా పిల్లల వయస్సునకు తగినట్టుగా ఉంటుంది. చిన్న చాపలు, చిన్న బల్లలు, చిన్న కుర్చీలు, చిన్న బోర్డులు, గార్డెనులో మొక్కలు, పువ్వులు, ఉయ్యాలలు, నిచ్చెనలు, వంతెనలు, మట్టి, నీరు, తోటిపిల్లలు—ఇంక వీటి కన్న వారికి కావలసినదేవి? పిల్లలందరకు, ఆటలూ, పాటలూ, విందులూ, వినోదాలు—అన్నింటిలో స్వేచ్ఛగా వారు పాల్గొంటారు. కాలనిర్ణయ ప్రకారము, వారి సహాయార్థము ఉన్న ఉపాధ్యాయుని, వివిధ కృత్యాలకు వారిని ఆకర్షిస్తుంది. ప్రమాదాలు జరుగకుండా కాపు కాస్తుంది. వలసినప్పుడు సహాయము చేస్తుంది. నిదానంగా, ప్రశాంతంగా, అందూ ముఖ్యముగా, పరిపూర్ణమైన స్వేచ్ఛతో, ఒకరు ఆజ్ఞాపించకుండానే, నిర్ణీతసమయములో విధాయకములను వారు సాధిస్తూ ఉంటారు.

ఇదే విధంగా, భాష, లెక్కలు, వ్రాయుట, చద వుట మొదలైనవికూడ పిల్లలు ఈ స్కూళ్లలో స్వేచ్ఛగా నేర్చుకొనే విధానా లున్నాయి—శిక్షితుడైన ఉపాధ్యాయుని, పిల్లల మనోప్రవృత్తిని పరిశీలించి, వారికి తగిన పరికరాలచే వారి మనస్సును ఆకర్షింపజేసి, భయ పెట్టకుండా, ఆజ్ఞాపించకుండా, విసికించకుండా, శ్రమపెట్టకుండా, వారికివ్రాయుట, చదువుట, లెక్కలు, వారి ప్రత్యేక ప్రవృత్తుల పైకి వచ్చుటకు సహాయ పడుతుంది. ఇట్లు విద్యాభ్యాసన ఒక స్వచ్ఛంద క్రియ, ఒక ఆకర్షణీయమైన సంఘటన, ఆనందమును, తృప్తినికలిగించు కార్యమవుతుంది.

ఈ విధంగా పసితనంలో సరియైన పునాది పడినచో, బడియందు పిల్లలకు అయిష్టము కలుగదు. తరువాత కూడ, మనస్తత్వశాస్త్రవేత్తల సలహాలతో, సూక్ష్మ విద్యా విధానాలను ఉపయోగిస్తూ, పిల్లలలో అణగియున్న శక్తులను పైకి తెచ్చుటయే తమ కర్తవ్యమని గుర్తెరిగిన ఉపాధ్యాయులు ఉంటే, పిల్లలు బడి దొంగలుకారు—పరిపూర్ణమైన స్వేచ్ఛ కలిగి, పరీక్షలవల్లగాని, శిక్షలవలనగాని భయములేని బాలురు అనువైన పరిసరములలో, క్రమమైన వికాసమును పొంద తారు.

అయితే యీస్వేచ్ఛయను శబ్దములో చాలా జాగ్రత్త అవసరము. బహిర్గత బలవంతము, నిర్బంధన లేకుండా, తమంత తాము, స్వచ్ఛందంగా ఏర్పాటుచేసికొనిన కట్టుదిట్టములకు, క్రమ శిక్షణకులోనై సంచరించునట్టి స్వేచ్ఛయే నిజమైన స్వేచ్ఛ—అట్టి స్వేచ్ఛయే ఉత్తమ పౌరులగా గలుగుటకు సరియైన పునాది.

# విద్యాభ్యాస లక్ష్యములు, పసిపిల్లల మానసిక ప్రవృత్తి

ప్రస్తుత ప్రభుత్వము యొక్కయు, వ్యక్తి యొక్కయు దారిద్ర్యమువలన, మన దేశములో తగినంతమంది శిక్షితులైన ఉపాధ్యాయులు, పాఠశాలలుగూడ లేనందువలన, యిట్టి ఆదర్శయుతమైన పాఠశాలలు, విద్యా విధానము విరివిగా మనభూమిలో జరిపించుట కనీసము యింకో అర్ధశతాబ్దము వరకు అసంభవమైన కార్యము. అందువలన పసివారల బాధ్యత కేవలము తల్లిదండ్రుల మీదకు, అందూ ముఖ్యముగా తల్లిమీదకు వరుగుతుంది. అందువల్ల, ప్రతి తల్లియు సాధ్యమైనంతవరకూ, పిల్లలయొక్క మన స్తత్వమును గూర్చి తెలిసికొని, ఎక్కువ సానుభూతితో, వారి జీవితములు ఆనందమయంగా జేసే ఉపాయాలు ఆలోచించి, జ్ఞానార్జనకు ముఖ్యమైన బాల్యావస్థలో, వారికి సరియైన శిక్షణ కలుగు అవకాశములను పెక్కులు, సులువైనవి కల్పించాలి.

వారివి సున్నితమైన మనస్సులు—కసరుట, కొట్టుట, తిట్టుటవలన మనము వారిని మంచిదారికి తేలేము సరిగదా, వారిని చిన్నపుచ్చిన వారమగుదుము. మనకు వారిపైనున్న అధికారమును దుర్వినియోగ పరచిన వారమగుదుము. అన్యాయము జరిగినదనివారు భావించి, వద్దన్న పనులను రహస్యముగా జేయుట, అబద్ధములుచెప్పుట, నిస్పృహ మొదలగు కూడని గుణములను వారిలో పుట్టించిన వారమగుదుము. భయములేని పిల్లలకు రహస్యములుండవు. వారు అబద్ధము పలుకరు—వారికి మనము అన్యాయము చేయమను నమ్మకము మనయందు వారికి కలిగినచో, మన సలహా ప్రకారము నడచుకొనుట నిర్బంధముగా వారు భావించరు.

ఈ విషయములను గుర్తించి, కథల రూపంగా, పాటల రూపంగా, చేతలరూపంగా, వారలకు చురుకుతనము, తమ పనులను తాముచేసుకొనుచు, యితరులకు సహాయము చేయునట్టి స్వభావము, దయ, దాక్షిణ్యము, పాపభీతి, సత్యవాక్కు మొదలగు ఉత్తమగుణములు నేర్పించవలసిన బాధ్యత తల్లిదండ్రులది, గురువులది అయియున్నది. మంచి మాటలతో మందైనా తినిపించవచ్చు, బలవంతము మీద పాలు త్రాగించలేమంటారు పెద్దలు. అలాగే, మృదువైన సంభాషణతో, ఆకర్షణీయమైన పద్ధతితో, పిల్లవానిని ఎంత క్రమశిక్షణకైనా లోనుజేసి, స్వేచ్ఛననుభవించుచున్న సంతోషమును కలిగించవచ్చు.

భౌతిక విజ్ఞానముపైకన్న నైతికమైన బోధనపై శ్రద్ధ వహించవలసిన రోజులివి. యుద్ధకాండలతో మారణహోమములతో, పరస్పర ద్వేష భూయిష్టమై, నాలుగు ప్రక్కల ప్రళయాగ్నులు దహించి వేయుచున్న ఈ ప్రస్తుత ప్రపంచములో, నైతికబోధన అత్యవసరము. దీనికి తగిన పునాది పసితనములోనే వేయవలసిన బాధ్యత పెద్దలది. ఈ నాటి బిడ్డ భవిష్యత్తు పౌరుడు. స్థిరమైన ప్రపంచ శాంతికి, మానవాభ్యుదయానికి, సరియైన పునాది మార్గంలో శిశువుయొక్క అంతర్గతశక్తులు వికసించిననాడే, కార్యము సిద్ధించగలదు.

[ఆలిండియా రేడియో సౌజన్యముతో]



# పిచ్చి పిల్ల ★ శ్రీ పామర్తి కనకయ్యగారు

తెల్లవారి '7' గంటలైనా కాఫీ కడుపులో పడక పోవడంవల్ల గంటనుంచి వ్రాస్తున్న కథను పూర్తి చేయ లేక పోయాడు 'విశ్వం'. రెండు మూడు సిగరెట్లు తగులడినా చురుకులేదు. వేడి వేడి కాఫీకి సాటి వస్తుందా సిగరెట్! కాగితం కలం బల్లమీదుంచి నెమ్మదిగా వంటింట్లోకి వచ్చి చూచాడు. పాలన్నీ పొంగి పొయ్యిలో పడిపోతున్నా గిన్నె దింపకుండా చూస్తూకూర్చుంది సీత. అతని కెక్కడ లేని కోపంవచ్చింది. ఏదో ఆమెను అందా మనుకొన్నాడు. అన్నాడు—కాని ఆ మాటలు అతని నోటినుంచి మాత్రం వెలువడ లేదు. "ఇంట్లో వంట చెఱుకుకు కూడా గతిలేదు" అంటూనే పాలగిన్నె క్రిందకుదింపి సణుగుకొంటూనే గదిలోకి వెళ్ళిపోయింది. ఆమెకు ఎప్పుడు కోపం వస్తుందో, ఎప్పుడు సంతోషంవ వస్తుందో అతనికి ఇప్పటికీ అర్థమవలేదు. ఏమీ తోచక ఇటూ అటూ పచారు చేశాడు పది నిమిషాల సేపు. "పెద్ద...రచయితలు—స్త్రీల విషయాలన్నీ బాగా తెలిసినవారు...ఈ మాత్రం తెలియక పోయిందే" అంది ఈసడిస్తూ—

ఆ వేళకి ఏదో రకంగా జరిగిపోయింది—

మర్నాడు—

విశ్వం మళ్ళీ కథ వ్రాస్తున్నాడు. మూడు రోజులై మొదలుపెట్టినా ఆ కథమాత్రం పూర్తవలేదు. దానిని ఎలాగైనా పూర్తిచేసి పోస్టు చేయాలని అతని వుద్దేశం. క్రితం రోజునే అతని అక్కగారు 'సరోజిని' వచ్చింది. ఇంట్లో 'ఇవి లేవు: అవిలేవు' అని అతన్ని చెప్పి వెళ్ళింది. అతను బి.ఎ., ప్యాసయినా తననూ తన భార్యను పోషించుకోవడం చాలా ఇబ్బందిగావుంది. "బి.ఎ. లూ, ఎమ్. ఏలూ., తిండి పెట్టవు" అని ఒకసారి తన తండ్రి ఏదో సందర్భంలో వాళ్ళమ్మతో అన్నట్లు జ్ఞాపకం వచ్చింది. జ్ఞాపకం రావడమేమిటి! అతనికి మాత్రం ఇప్పుడు తెలియటం లేదా! చచ్చిచెడి ప్యాసయిన బి. ఎ., అనే రెండక్షరాలూ తనకు చేసిన సహాయం లేదు కదా! ఉద్యోగంలేని అతనికి, ఏ కూలి పనికైనా వెళ్ళడానికి అడ్డువస్తున్నాయి. బి. ఎ., ప్యాసయి రెండుసంవత్సరాలైంది. 125 అప్లికేషన్లు తపాలా పెట్టెలో పడ్డాయి. ఆ 125 కూ ఒక్క సమాధానానికి కూడా, అతను నోచుకోలేదంటే మీరు నమ్మరు. మలమల మాడే ఆ పొట్టలోనూ, కారుమేఘాల్లాంటి ఆలోచన చేసే ఆ బుఱ్ఱలోనూ అతను కథా కారుడయ్యాడు. ఈ కథల కోసం అతను కాలేజిలో చదువుకుంటున్నప్పటి నుండీవుంది. అప్పుడు కాలక్షేపానికి, వినోదం కోసం వ్రాసే వాడు. ఇప్పుడు కడుపుమంటను చల్లార్చుకోవడంకోసం వ్రాసుకుంటున్నాడు. అతనికి ఆ గ్రామంలోనే రెండెకరాల మాగాణీ భూమివుంది. దానిమీద వచ్చే ధాన్యం అతనికి అతని భార్యకూ ఒక మోస్తరుగా ఏడాదికి సరిపోతవి. "దిక్కుమాలినపూరు, దిక్కుమాలిన కొంప అని నిత్యం అనే సీత మాటలకి 'విశ్వాని'కి ఉద్యోగం చేయాలనే ఉద్దేశం కలిగి 125 అప్లికేషన్లు పోస్టుచేశాడు. ఉద్యోగం విషయమే తెలిపి రాకపోతే, అతను ఏ పొలంగట్టునో, ఏ గోదావరి ఇసుక తిన్నెలమీదో కూర్చుని నిశ్చింతగా కథలు వ్రాసుకుంటాడు. —వ్రాస్తున కథలో లీనమైన అతని మస్తిష్కంలో గుఱ్ఱా లుపరువెత్తినట్లయింది, సీత చేసిన చప్పుడుకు—ఆమె వైపు అలా చూస్తున్నాడు— "కాగితం నలుపు చేయడం కంటె మీకు మరేవిషయం మీదైనా దృష్టిఅంటూ వుంటోందా?" అంది వ్యంగంగా—అతని రచనా వ్యాసంగం గురించి సీత అప్పుడప్పుడు హేళనగా అనే మాటలు అతనికెంతో కష్టమనిపించాయి—కాని ఏం చేస్తాడు! ఏం చేయడమేమిటి? భార్యకు తగిన బుద్ధి చెప్పక్కర్లే! దేహశుద్ధి చేయకూడదూ! అతను అలాచేయడానికి అతని మనస్సు ఇష్టపడదు. ఇష్టం కాని పని అతను చేయడు. చేయలేడు. "సీత"ను కొడితే మాత్రం అతనికి వొరిగిందేమిటి?

"ఏం చేస్తున్నావురా?" అంటూ, విశ్వం స్నేహితుడు జోళ్ళు టక్ టక్ మంటూ చప్పుడు చేస్తూవచ్చి ప్రక్కన కుర్చీలో చతికిల బడ్డాడు.

"ఎప్పుడు చూసినా ఏదోరాస్తూ కూర్చుంటావ్. గడ్డి కోసుకునైనా రోజూ బేడడబ్బులు సంపాదించవచ్చు కాని

కథలు వ్రాసేవానికి ఆమాత్రంలేదు. ఎందుకొచ్చిందీ గొడవ?" అన్నాడు వచ్చిన స్నేహితుడు తిన్నగా కూర్చోక— ఈ మాటలు విశ్వంవినక పోలేదు—అవతల గదిలో కూర్చుని సీత వింటూంది—అతనికి సమాధానంగా "సింహం ఆకలిగావున్నా గడ్డి తినదు—కళాకారుడు దరిద్రుడైనప్పటికీ తన కలాన్ని గంగలో విసిరి తప్పుగోల పుచ్చుకో లేడు. ఉత్తమ కథకులకు రెండుపూటలా తిండికి దిక్కు లేదంటే అది రోజుల మహాత్మ్యమూ, దేశ దౌర్భాగ్యమే" అంది సీత ఉద్రేకంతో—సీతకి కూడా విశ్వం కథలంటే ఇష్టమే. అతి సహజంగా వుంటాయని ఆమెకూ తెలుసు. అయినప్పటికి ఇంట్లో గడవడం ఎలా, అనే సమస్యపైనే ఆమెకు అతనిపై విసుగు—"ఏదో సరదాగా అన్నాను. ఆగ్రహించకండి వదినా" అన్నాడు వచ్చినస్నేహితుడు తానేదో పెద్ద తప్పు చేసేనేమో అని అభిప్రాయ పడుతూ—తన తండ్రిని కాదని, బీదవాడైనా విశ్వాన్నే ప్రేమించి పెండ్లి చేసుకుంది సీత. తాను విశ్వాన్నే పెండ్లాడి తీరుతానని, తండ్రి డబ్బున్న సంబంధాన్ని తీసుకురావడానికి ప్రయత్నించి నప్పుడు, పట్టుపట్టి, నాలుగు రోజులు అన్నంమాని ఏరికోరి విశ్వాన్నే పెండ్లిచేసుకుంది. అటువంటప్పుడు ఇంట్లో ఇదీ అదీ లేకపోతే సరిపెట్టుకోవాలి; ఆమెకూ తెలుసు. అయితే మాత్రం ఆమెకు నిగ్రహించే శక్తిలేక పోతోంది—పట్నవాసంనుంచి పల్లెటూరు రావడంతో ఆమెకా వాతావరణం 'చీదర'అనిపించింది. ఎప్పుడు పట్నాన్ని చూస్తానా అని ఆమె హృదయం తహ తహ లాడింది. పట్నానికి వెళ్ళినా పట్టుమని పదిరోజులైనా వుండకుండానే తిరిగి పుట్టింటి నుంచి వచ్చేసింది, భర్త ఎలా గడుపుతున్నాడో ఒంటరి తనాన్ని అని.

* * *

అంతకు క్రితంరోజునే తన కథలకు పారితోషికంగా పత్రికవాళ్ళు పంపిన 25 రూపాయలతో రెండుచీరలు తీసుకొచ్చాడు విశ్వం—సీత, విశ్వం తెచ్చిన చీరలను చూసి సంతోషం వెలిబుచ్చలేదు సరిగదా, "చాలా కష్టపడ్డారులెండి. ఇలాంటి చీరలు మా ఇంట్లో దాసీవాళ్లు కూడా కట్టుకోరు" అని కసురుకుంది. నాలుగు నెలల్నుంచి అటువంటి ముతక చీరలే కట్టుకుంటూంది. మరి ఇప్పుడో—అతని కథల్లో నిత్యమూ స్త్రీ పురుషులు వస్తూ పోతుంటారు. వారికి అతని భార్యకి మధ్య కొన్ని యోజనాల దూరం వుంటుంది—చేసేది లేక చీరలు కొట్టులో ఇచ్చేసి తిరిగి డబ్బుతెచ్చుకొని అప్పగారింట్లో భోజనంచేసి చాలా రాత్రయిన తరువాత ఇంటికి వచ్చాడు. అతని ఆలస్యానికి కారణమడగకుండానే, రెండు నెలల క్రితం తన మెడలోని 'లాకెట్'అమ్మేసి కొనుక్కున్న బట్టల మిషన్ దగ్గర కూర్చుంది—శరీరాన్ని పక్కమీద చేరవేసేటప్పటికి అతని మనస్సులోకి ఎన్నో ఆలోచనలు దట్టంగా చేరుకున్నై. ఉద్యోగం చేయాలని అతను నిశ్చయించు కున్నాడు. పచ్చని పైరుచేలు సన్నగాలికి కొట్టుకునే రెప రెపలకూ, గోదావరీ ఇసుక తిన్నెల సోయగానికి, అతను దూరం కావలసి వస్తుంది. గానుగ ఎద్దులా రోజంతా డ్రాఫ్ట్సు వ్రాయాల్సుంటుంది. కిటికీనుండివచ్చే చల్లగాలికి అతని ఆలోచనలు ఎగిరిపోయాయి. హాయిగా నిద్రపట్టింది.

* * *

మర్నాడే 126వ అప్లికేషన్ వ్రాసి పోస్టు చేశాడు. భవితవ్యం కళ్ళముందు సంచరిస్తున్నట్లయిం దతనికి. ఇంటికి ఆలోచనలతో కొట్టుకొచ్చాడు. దొడ్లో కూరగాయల్ని, పూల మొక్కల్ని పెంచుతూవుంది సీత—

"ఏదైనా ఉద్యోగం దొరికితే ఇవన్నీ వదలిపెట్టాలి. ఎందుకీ తలనొప్పి పని, ఊరుకుందూ!" అన్నాడు విశ్వం, సీత మొక్కలకు, ఒగుర్చుకుంటూ నీళ్ళు తోడుతున్నప్పుడు—

"ఏదో పెద్ద పల్లెటూరి వాడినని గర్విస్తున్నారు! మీ ప్రతి నాడియందు పట్నవాసపు ఉద్రేకాలే" అంది చేతులు కడుక్కొంటూ—ఆమెవైపే ఆశ్చర్యంగా చూస్తూ మాట్లాడలేక పోయాడు. సీత చీరమార్చుకొని వంట ప్రయత్నంలో నిమగ్నమైంది. నాలుగు రోజుల్లో అతని అప్లికేషన్ మీద అధికారి సంతకంపడి అతనికి తిరిగి జవాబు వచ్చింది. దగ్గర పట్నంలోనే కంపెనీలో టైపిస్టు ఉద్యోగం—నాలుగు రోజుల్లోనే స్వీకృత పత్రం పుచ్చుకొని సీతకు చూపించాలని

ఆతురత పడ్డాడు. పట్నంవెళ్లి ఆమెకు మంచిరకం చీరలూ తనకు సూట్లు తెచ్చుకున్నాడు.

"ఆ 'వేణి' కథ ఎప్పుడు పూర్తిచేస్తారు" అంది ఎక్కడికో వెడుతున్న విశ్వాన్ని వెనక్కిపిల్చి—

"కలం ఎంతఅరగదీసినా రెండు పుంజీలకన్న ఎక్కువ రాదు కదా! తీరికవుంటే చూస్తాన్లే" అన్నాడు నిశ్చింతగా—

"దరిద్ర భారతదేశపు రైతుకు పొదుపుగా కాలక్షేపం చేయడం శతాబ్దాలనుంచి వస్తోంది" అంది వ్యంగ్యంగా— ఎక్కడికో వెళ్ళేవాడు ఆగిపోయి తిరిగి కలం పుచ్చుకొని కూర్చున్నాడు.

"రోజూ పట్నం వెడుతున్నారు. కొత్త అత్తవారి నెవ్వరినైనా సంపాదించారేమిటి" అంది సీత మళ్ళీ —అతను మాట్లాడకుండా ఒకవైపున ఆమె మాటలు వింటూ, చిరునవ్వు నవ్వుకుంటూ, ఆమె కింతవరకూ కూడా తన ఉద్యోగం సంగతి చెప్పలేదు. పట్నంలో స్నేహితునితో చెప్పి ఇల్లు మాట్లాడాడు. మరునాడు స్వీకృతి పత్రం తీసుకొని సీతకు చూపిద్దామని వంటింట్లోకి వచ్చాడు—

"నిప్పంటించడానికి కిర్సనాయిలు లేదు మరి కాఫీ ఎలా త్రాగుదామని వచ్చారు?" అంది సీత— "ఇక అట్టే కాలం ఈ పొదుపుళ్ళో గడపక్కర్లేదులే" అన్నాడు. తన ఉద్యోగాన్ని గురించి చెప్పడానికి ఇదే మంచి తరుణమని—

"విడాకులిచ్చేయడానికి ఆలోచిస్తున్నారా ఏమిటి?" అంది నవ్వుతూ—

టైపుచేసిన స్వీకృతి పత్రం ఆమెచేతికందిస్తూ "పట్నంలో ఉద్యోగం..."అన్నాడు. అంతకు ముందు ఆమె ముఖంలో వ్యాపించిన ఆనంద రేఖలు అట్టే అదృశ్యమవడం అతను బాగా గమనించి విస్తుపోయాడు— "70 రూపాయలు జీతం" అన్నాడు బలవంతంగా నోరు తెర్చుకొని— "సాయంకాలానికి సామానుసర్దు"—

'వేణి' కథ పూర్తి చేయక పోవడానికి ఇదా కారణం? పదిరూపాయలు ఆదాయంలేక పోయినా రాత్రీపగలూ కలం అరగదీసేవారే—పాతిక రూపాయలు వస్తోందనీ ఉద్యోగానికి సిద్ధమయారా?" అంది కోపంతో. విశ్వం ఏమీమాట్లాడలేదు. "మీరు ఉద్యోగం చేయనక్కర్లేదు. కథలు రాస్తుంటే చాలు"అంటూ ఆర్డరు కాగితం ముక్కముక్కలు చేస్తూంటే విశ్వం చూడ లేక పోయాడు—ఎంతో ఆశ పెట్టుకొని బయలుదేరబోతున్న అతనిలో పెద్ద నిరాశ దేవతవచ్చి కూర్చున్నట్లయింది— "పిచ్చి పిల్ల—పిచ్చి పిల్ల..."అని ఏదో విసుగ్గా అంటూ అతను మళ్ళీ కథరాస్తున్నాడు—

(హిందీ ఆధారం)



రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులైన శ్రీ॥ రాజేంద్ర ప్రసాద్‌గారు జనవరి 4వ తేదీని ఆంధ్ర మహిళా సభను చూడవచ్చిరి. బాలికల - గౌరవ వందనానంతరము వారు ఇక్కడ సభ్యురాండ్ర కృషిని తిలకించి, వారి సేవాయుతమైన కార్య క్రమమును ప్రశంసించిరి. సభ్యురాండ్ర గానమును ప్రశంసించిరి. కార్యదర్శిని శ్రీమతి దుర్గాబాయమ్మగారు అధ్యక్షుని అవిరామమైన కార్యక్రమములో, యీ సేవా సంస్థను జూడవచ్చినందులకు కృతజ్ఞతను తెలిపిరి.

# ప్రబోధము

చుండూరి రమాదేవి

ఆంధ్రుడా! యీ భావ దాస్యపు
అంధకారములోనె తల్లి
చివికి జీర్ణించి పోయెదు
శీఘ్రముగ లేరా
ఆంధ్రా
దీక్ష గైకొనరా॥

ఆంధ్రరాష్ట్రపు కార్యదీక్షా
ఔత్తరాహుల చూపులందు
అణగి పోయెను, మేలుగాంచి
దీక్షగైకొనరా
ఆంధ్రా
మేలుకో గదరా॥

ప్రాచీన కాలపు వీరగాథల
ప్రాతవిభవము తలచిపొంగకు
కథల గాథల నవలనెట్టి
కర్మశూరుడవై
ఆంధ్రా
దీక్షగైకొనరా॥

తెలుగు జోదుల మేలుకొలిపి
తెలుగు వెలుగుల దిద్దనేర్పి
తెలుగు రాష్ట్రము తెచ్చుకొనగా
దీక్షగైకొనరా
ఆంధ్రా
మేలుకో గదరా॥



# అవాంతరాలు

✽ రచన : డి. వి. ల. ✽

[గమనిక : ఈ రచన, రచనలోవుండే పేర్లు కల్పితం—కేవలం వినోదార్థమే వ్రాయబడినదేగాని, ఏ వ్యక్తిని ఉద్దేశించి వ్రాయబడలేదు—డి.వి.ల.]

మానవ జీవితంలో ఎప్పుడూ ఏవో అవంతరాలు వస్తూండడం సహజమనే అందాం. కాని మనుష్యులు మాత్రం వాటిని తట్టుకోలేక తలక్రిందులై చివరకు ఒక నిట్టూర్పు విడవడం సాధారణంగా జరిగే విషయమే అనాలి. ఎప్పుడూ కాలం ఒక్కమాదిరిగా ఉండదు కనుక కాలానుగుణ్యంగా అనేక రకరకాల సంఘటనలు, మార్పులు తటస్థించడం కూడా ఒక్క తప్పనిసరే మరి. ఎంతచెప్పినా కాల ప్రవాహాన్ని ఎవరూ ఆపలేరు కనుక తదనుగుణ్యంగా వచ్చే మార్పులు తప్పనిసరే అనుకొని సమర్థించుకొంటె సరిపోతుందేమో. 'జీవితం అంతా అల్లకల్లోలం' అనే చిన్న వేదాంతవాక్యాలు నాలుగు వల్లించుకుంటూ ఉండడం చాల ఉత్తమమైన విషయం క్రింద గమనించుతే సరిపోతుంది.

ప్రతి సంవత్సరం ప్రారంభం దగ్గరనుంచి పూర్తి అయేవరకు ఏవేవో అవాంతరాలు వస్తూనే ఉంటాయి. ఈమధ్య వచ్చినవాటిలో తుఫాను ఒకటి చాలా చెప్పుకోతగ్గదే. మరి ఎంతమంది చచ్చిపోలేదూ? ఎంత నష్టం నిజంగాను—రైళ్లు నడవలేకపోవడం—ఒకటేమిటి నానారకాల అవస్థలు—కాలేజీలు, స్కూళ్లు మూసివెయ్యడం—పిల్లలు బడుద్ధాయిల్లా రోడ్లమ్మట తిరగడం ఇత్యాదులు. కాని యీ తుఫానుగాలికి ఆంధ్ర రాష్ట్రం కొట్టుకురావడం అనేది ఒక గొప్ప విషయమే. వెనకటికి క్వెట్టా భూకంపం రావడంవల్ల భూమిమీద అనేక మార్పులు వచ్చాయి. అల్లాగే తుఫాను తరువాత వచ్చిన మార్పులేవో మరి! యీ తుఫానే ఆంధ్ర రాష్ట్రం రావడానికి కారణం అన్నారు చాలామంది. కాని మద్రాసు వదులుకోవడంవల్ల మన పరోపకారబుద్ధిని, విశాలభావాల్ని, మెచ్చుకోబడుతున్నాయనే సంతృప్తి మనలో జీర్ణించడం, సదరు ఏ కారణంచేతనైనా మనకి మద్రాసులో స్థానం దొరికినా నిర్మొహమాటంగా నిరాకరించడానికి సంసిద్ధులై ఉన్నాం కనుక రాబోయే రాష్ట్రానికి ముఖ్యపట్టణం సంగతి ఒక పెద్ద సమస్యయై ఊరుకుంది. ఇలాగే ఒక సమస్య తరువాత ఇంకొకటి తోకలా ఉంటూనే ఉంటాయి.

ఈ గొడవతోపాటు ఇంకో గొడవ ఏమిటంటే హిందూ కోడు బిల్లు—విడాకుల చట్టం వగైరా—ఇది అందరికి సంబంధించింది కనుక పెద్ద అవాంతరమే అయింది. ప్రతి వ్యక్తి ఈ విషయం గురించిన చర్చ—ఎవడిమట్టుకు వాడికి లోపల చాలా దడగానే ఉంటోంది. ఈ బిల్లు ప్యాసు అయిన మర్నాడు తమ భార్యలంతా లేచిపోతారామో అన్న భయం చాలామందికి.

"స్త్రీలు యింక భర్తలయందు వినయ విధేయతలు చూపరు 'కార్యేషుదాసి' శ్లోకం అంతా తారుమారు అవుతోంది" అని విచారించాడు మా లంబోదరం.

"స్త్రీ సామ్రాజ్యం అంటె ఏవో పుస్తకాల్లో చదివాం కాని ఇప్పుడు నిజంగానే వస్తోంది. స్త్రీ ఆస్తి కలిగింది అవుతోంది కనుక స్వేచ్ఛ రాబోతోంది. అంచేత ఇప్పుడు భార్యని అర్ధాంగి అనడం అట్టే మంచి పనికాదు" అన్నాడు మాశబ్ద రత్నాకరంగారు.

"భార్య విలువ హెచ్చింపబడుతోంది అంటే రూపాయి విలువ తగ్గినట్లు భర్త విలువ తగ్గుతోందన్న మాట—ఇదంతా అర్ధాంగి పూర్ణాంగి అవడంవల్ల వచ్చేడి గందరగోళం" అన్నాడు ఓ సంసారి.

ఈ హిందూ కోడు బిల్లు ప్రవేశంవల్ల సనాతన ధర్మాల్లో మార్పులు చాలా తీసుకురావడం—అంచేత సంఘంలో అనేక సమస్యలు బయలుదేరి ప్రతి వ్యక్తికి దీనిపైన చర్చ అత్యావశ్యక మనుకొని తమ ఉద్దేశాలని వెలిబుచ్చడం జరుగుతోంది. [note: last phrase read as printed: "వెల్లడిచేయడం"?]

మగపిల్లలు ఎక్కువగా ఉన్నవాళ్లు బిల్లు కానివ్వండనే అంటున్నారు. కారణం?—కట్నాలకంటె ఆస్తి బాగా తెచ్చుకునే ఆడవాళ్లను సంపాదించడం ఎంత లాభం నిజంగాను? ఆడవాళ్లను పోషించవలసిన అవసరం ఇంక ఉండదుగా. అంచేత 'మా పెద్దాడికి ఎంత అలస్యమైనా బిల్లు

పాసు అవుతేనేగాని పెళ్లి చెయ్యను ' అంటున్నాడు మా దుర్గాశయ్యగారు.

ఇంకో ముఖ్య విషయ మేమంటె మా నరసింహులు గారిలో వచ్చిన మార్పు—నిత్యం భోజనం దగ్గర ఏ చారు లోనో చింతపండు తక్కువైందన్న కారణం ఆధారంగా చేసుకొని ఆయన దూర్వాస మహాముని అయిపోయి ఆవిడ వీపుమీద వెదురు బద్ద విరవడం—పాపం ఆ యిల్లాలు చేసేదేమీలేక షడ్జమస్థాయిలో స్వరం మొదలుపెట్టేసరికి ప్రక్కింటివాళ్లందరూ యీ నాటక ప్రదర్శనానికి, టిక్కెట్లు అవసరంలేదు కనుక, హాజరవడం జరుగుతూనే ఉండేది. కాని యీ విడాకుల బిల్లు సంగతి ఎవరో అంటోంటె విన్నాడుగాని మొదటుమాత్రం విడాకులు అంటె అడ్డాకులులాంటి ఇవోరకం విస్తరాకులు గావును అనుకొని చివరికి యదార్థం తెలిసి తనలో వచ్చిన వికారా లని అణచి యీ విషయం ఏమాత్రం తెలిసినా ఆవిడ లేచి పోతుందనే భయంతో యీ మధ్య చిలకా గోరింకల్లా చాలా అన్యోన్యంగా ఉండడం దేశంలో వచ్చిన పెద్ద మార్పుల్లో ఒకటి.

మరి మంగమ్మగారి సంసారంలో ఉన్న నిత్య తుపాను ఘట్టంలోని మార్పుకూడా చెప్పుకోతగ్గదే. ఆవిడ సుబ్బా రావుగారిమీద రాత్రి రెండు ఝాములదాకా దండకం చదివేస్తూ ఉండడం—ఒకవేళ ఆవిడ చేతిలో ఏ రోకలో ఉంటె సుబ్బారావుగారు వెంటనే వీధి గుమ్మంలోకి వెళ్లి అప్పుడు ఆవిడపై పంచాంగ శ్రవణం చెప్పడం, ఇతరులకు నిద్రాభంగం కలగడం జరుగుతూ ఉండేది. కాని యీ విడాకుల బిల్లు సంగతి ఆవిడకు తెలిసి తను అమాంతగా సావిత్రి అయిపోయి ఆయన్ని ఒక సత్యవంతుణ్ణి క్రింద జమ కట్టెయ్యడంవల్ల యిరుగుపొరుగు యీ యుద్ధకాండ వినవలసిన అగత్యం తప్పింది.

రాబోయే యీ అవాంతరపు బిల్లు గురించి ఎవరు మట్టుకు వాళ్లు తమ లాభనష్టాలని ఎంచుకోవడం మొదలు పెట్టారు. "విడాకులు బిల్లు ప్రవేశంవల్ల తగవుల ఎక్కువగా పెరిగిపోవచ్చు. కనుక దీనిని మనం ఏకగ్రీవంగా ఖండించాలి" అన్నారు చెట్టుక్రింద ప్లీడర్ల సంఘం అత్యవసర ఉపన్యాస ధోరణిలో.

'ఆడవాళ్లకి ఆస్తి వస్తోంది అన్నారు. జీతం వచ్చినప్పు డల్లా ఏ చీరో కొనవలసిన రివాజు తప్పుతుంది కనుక జీతం ఖర్చు అయిపోయిందని చెప్పి నమ్మించలేక చివరికి విరిగి పోయిన పాల కాఫీ త్రాగడం, ఉప్పులేని కూర తినడం వగైరా బాధలు ఉండవన్నాడు' ఒక ఉద్యోగి ఏదో పెద్ద అనుభవం ఉన్నవాడలా—

"ఐతే గృహకృత్యాల్లో ఖర్చు భార్యా భర్తలు ఇద్దరు సమానంగా భరించాలి. 'సంసారమంతా భర్తమీద ఆధార పడడం' అనే దానికి అర్థం మారింది అన్నాడు." ఒకా యన.

"కాని స్వంత ఖర్చులు మాత్రం ఒకరివి ఇంకొకరు భరించడం కష్టం. ఎందుకంటె ఒక చీర విలువకి అరడజను ఖండువాలో రెండు జతల పంచలో కొనడానికి వీలుంది. కాబట్టి అదనపు ఖర్చు భర్త భరించడం అసమంజసమే" అన్నాడు ఒక ఆర్థిక శాస్త్రజ్ఞుడు.

సనాతన దృష్టి ఉన్నవాళ్లలో మరీ కలవరం సంభవిం చింది. "ఆడ మగ విచక్షత లేకుండా చేయడం కేవలం ఎంతో పాపానికి ఒడికట్టుకు పోతేనేగాని జరగదు. అందుకనే పంచాంగంలో పాపం 19 పాళ్లో 20 పాళ్లో ఉంటే పుణ్యం 2 పాళ్లో 3 పాళ్లో కనబడుతోంది" అన్నారు మా సిద్ధాంతిగారు.

తమకి వచ్చి పడనున్న హక్కుల్నిబట్టి ఇంక ముందు ఎల్లా సంచరించాలా అనే చర్చ చాలా ఎక్కువైంది. కొందరి ఆడవాళ్లలో చేసిన తీర్మానం ఏమంటె ఇకముందు నుంచి యీమవన్నంది తమ భార్యల్ని ఏపనీ అథమాయించి చేయించుకోడానికి వీలులేదు. అంటె ముందు పంచ రత్నాలు చదవడమో లేక ఏ శ్రీనాథుడో వ్రాసిన నాలుగు శృంగార పద్యాలో చదివి ఆవిడను ఒక దేవతా స్త్రీ క్రింద చేసి ఒక నివేదికను సమర్పించడమే.

"బహు భార్యానిషేధంకూడా బిల్లులో చేర్చడంవల్ల ఇదికూడా కొన్ని సందేహాలకి గురిఐంది. పురుషులు సమాన సంఖ్యగా లేకపోతే మిగిలిన క్షేమం సంగతి ఏమిటున్నారు." ఓ లెక్కల మేస్టారు.

కాని ఆ మాత్రం క్షేమం మిగలకపోతే విధవ వివాహాలు జరగడం ఎల్లాగ మరి!

★



# ఉపాయంవుంటే దరిద్రం ఉండదు

నండూరి కాంతమ్మ

ఒక గ్రామమునకు ఒక మోళీవాడు వచ్చెను. వాడు విలువైన దుస్తులు ధరించెను. వ్రేళ్ళకు బంగారపు ఉంగరములు, చేతులకు ముసుగులు దండ కడియములు కలవు.

వాడు నడివీధిలో కూర్చుండి డోలు వాయించుచుండెను. ఆ చప్పుడుకు గ్రామములోని పిల్లలుచేరి రొద ప్రారంభించిరి. క్రమముగా గ్రామములోని మగవారు ఆడవారు చేరుకొనిరి. సభ కిటకిటలాడు చుండెను.

మోళీవాడు డోలు వాయించుట మాని సభికులకు వందన మాచరించి ఇట్లు గంభీరముగ పల్కెను "అయ్యా, నేను కండ్లు మూసుకొని చేసేపని మీలో ఎవరైనా కండ్లు తెరచుకొని చేయగలరా"?

ఆ మాటలకు సభికులు "ఓయి నీవు మూర్ఖునివలె నున్నావు. నీవు కండ్లు మూసుకొని చేసినపని మేము కండ్లు తెరచుకొని చేయలేమా" అని ఎగతాళి చేసిరి.

అందుపై మోళీవాడు రెండువందల రూపాయలు పందెము ఒడ్డెను. సభికులుకూడ వీరావేశముతో తోడనే రెండువందల రూపాయలు పెద్ద మనుష్యులవద్ద నుంచిరి. మోళీవాడు దండ కడియములు ఉంగరములు ఉంచెను. సభవారందరు ఆశ్చర్యముగ జూచుచుండిరి. ఇంతలో మోళీవాడు డోలుపై ఒక్క దెబ్బకొట్టి అయ్యా, ఇదిగో చూడుడని కండ్లు మూసుకొని ఇసుక మన్ను తీసికొనికండ్లపై పోసికొనెను. పిమ్మట ముఖమువంచి దుమ్ము దులుపుకొని "మీలో ఎవరైననూ కండ్లు తెరచుకొని యీ పని చేయవలయును" అని అరచెను. అతని యుక్తికి ప్రజలు చాల సంతోషించిరి. పందెము వైచిన సభికులు బిక్క మొగము వైచుకొని రెండు వందల రూపాయలు మోళీవానికిచ్చివేసిరి.

ఉపాయుండుంటే దరిద్రం ఉండదు.



# శివాజీ యుక్తి

శ్రీ చింతగుంట హనుమంతరావుగారు

## ప్రథమ దృశ్యము

(స్థలము ఆగ్రాలోని దుర్గ కారాగృహం; ఒక గదిలో శివాజీ మహారాజు పడుకొని బాధతో అరుస్తూవుంటాడు. సేవకుడొకడు పంకా లాగుతూంటాడు. అల్ప దూరంలో ఒక వైద్యుడో చాపమీద కూర్చుని ఔషధం సిద్ధ పరుస్తూ వుంటాడు. సమయము: సాయంకాల మయిదు గంటలు.)

శివాజి: (బాధసూచకంగా) అబ్బ! గుండెమీద చాలా నొప్పిగావుంది. బాధతాళలేను.

వైద్యుడు: మహా రాజా! భయ పడకండి. అత్యంత శీఘ్రంగా నొప్పి యిట్టే మటు మాయ మౌతుంది. నే నిప్పుడే మందు తయారు చేసిస్తాను.

శి: ఇక నేను జీవిస్తానని ఆశ లేదు. ప్రాణాలు లేచి పోయినట్లున్నై.

వై: రాజా, తమరిలా అధైర్య పడొద్దు. నేను చేస్తూన్న ఔషధం, హృదయశూల, కడుపు నొప్పి, తలనొప్పి, వాతము లాంటి యెన్ని రోగాలకో వాడబడుతుంది. అన్నిటికి రామ బాణంలా పనిచేస్తుంది. ఈ మందు ధన్వంతరి స్వయంగా సిద్ధపరచేడు.

శి: అయ్యో, చచ్చేను.

(ఒక వృద్ధవైద్యుడు ప్రవేశిస్తాడు. పొడుగాటి తెల్లని గడ్డము, దీర్ఘమైన వుత్తరీయము, ఒక చేతిలో జపమాల రెండో చేతిలో మందులపెట్టె)

వృద్ధ. వై: చెప్పండి రాజా, ఎలా వుంది తమ ఆరోగ్యం?

శి: (ఉలికిపడి) మీరెవరు?

వై: నేను గాచవైద్యుడ్ని. పాదుషా వారు మీ బాధకు చికిత్స చేయమని పంపేరు. (ప్రథమ వైద్యునితో) తాముసెలవు పుచ్చుకోవచ్చు. శివాజీ మహారాజులకు చికిత్స నేనుచేస్తాను. (వైద్యుడు సలాంచేసి నిష్క్రమిస్తాడు.)

శి: (స్వగతం) ఈ క్రొత్త ఆపద వచ్చి పడ్డది, ఎలాగ? (ప్రకాశంగా) పాదుషా వారికి నా మీద అపార కరుణ.

వై: నొప్పి యెక్కడో సెలవీయండి.

శి: కడుపులో. (వైద్యుడు పొట్ట మీద చెయ్యి పెట్టి చూస్తాడు.)

వై: కడుపులో యేమీ వున్నట్లనిపించ లేదు. కొన్నిమార్లు యెక్కువగా చింతించడంవల్ల కూడా యిలావుతుంది. మిమ్మల్నే విషయాన్నిగూర్చిన చింతైనా వేధిస్తోందా?

(శివాజీ ఆ విచిత్ర వైద్యుడ్ని తదేకదృష్టితో చూస్తాడు. అతడ్ని అంతకు క్రిత మెక్కడో, చూచినట్లు తోస్తుంది.)

శి: అవును. పైకేమీ కనిపించదు, కాని లోపల భరింపరాని బాధ. ఇదెలాటి నొప్పో తెలీడం లేదు. మృత్యువు సమీపానికి వచ్చినట్లుంది.

వై : మంచిది. నేనిప్పుడే ఔషధం సిద్ధంచేస్తాను. దాన్ని తాగ్రటమే తరువాయి, మీకు వ్యాధి నిమ్మళిస్తుంది.

శి : రోగం సరిగా నిర్ణయించ కుండా మందు తయారు చేసేం ప్రయోజనం ?

వై : నేనెపుడు రుగ్మత తెలుసుకోకుండా మంది వ్వను. మా యొక్క గొప్ప వైద్యులు వెయ్యి జబ్బులకుపైగా చికిత్స తెలియ జేసి వున్నారు. పనినుండి తప్పించుకుం దుకు రోగమని సాకు చెప్పేవారికి మరణమే చికిత్సని సెల విచ్చారు. తన రోగాన్ని కప్పి పుచ్చేందుకు యత్నించేరోగికి యిలాటి బాధ కలుగుతుందని చెప్పి ఒక మందు వాడమని తెలియ జేశారు. ఆ మందే తమ కిస్తాను. కన్నులు మూసుకొని త్రాగండి.

(అంటూ ఒక గ్లాసులో మందుపోసియివ్వగా శివాజీ చేతులోకి తీసుకొని విసిరి కొడ్తాడు. వైద్యుని ముఖంలో యేలేశ క్రోధమూ అవుపించదు.)

వై : (శాంతంగా) మహారాజా, యీ పనులన్నీ రుగ్మతకు నిరూపణలు కావు. నామాటలో యే మాత్రము పొరపాటు లేదు. మీ యీ బాధ వట్టి నటన.

(శివాజీకి కోపం కలుగుతుంది. అతడు వైద్యుని గడ్డం పట్టుకొని గట్టిగా ఆడించగా, అంటించు కొన్నదవడం వల్ల వూడి వస్తుంది. శివాజీ బాల్య మిత్రుడు నారాజీ యెదుట ప్రత్యక్షం.

శి : ఓహో ! తమరా ! చాలా బాగా వేషం వేసుకున్నారే !

నా : అందుకే లోనికి రాగలిగాను. బైటి వ్యక్తి లోనికి అడుగు పెట్టేందుకైనా వీలులేని కఠినమైన పహరా వుందామెను.

శి : ఏర్పాట్లన్నీ నెరవేరాయా ?

నా : ఆ, అన్నీ నెరవేరాయ్, మహారాజా.

శి : మంచిది. అలాయితే మీరు సెలవు తీసుకో వచ్చు. రేపే నేను స్వస్థత పొందినట్లు ఉత్సవము జరుపబడుతుంది.

నా : మంచిది మహారాజా సెలవు.

(నారాజీ మళ్ళీ తన గడ్డాన్ని అతికించుకొని నిష్క్రమిస్తాడు.)

## ద్వితీయ దృశ్యము.

(స్థలము : కారాగృహ సమక్షం వాకిలి వద్ద అయిదారుగురు సిపాయీలు ఆయుధ పాణులై కూర్చుని వుంటారు. ఇద్దరు వాకిలి కిరు ప్రక్కల నిలబడి వుంటారు. ఒక వైపు మిఠాయిలతో నిండిన అనేకమైన బుట్టలుంచబడి వుంటాయి. సిపాయీలు వాటిలోని మిఠాయిలను ఒక్కొక్కటి తీసుకొని తింటూవుంటారు. సమయము : రెండు ఝాములు.

మొదటి సిపాయి : వహ్వా, ఎంత రుచికరంగా వున్నాయి మిఠాయిలు !

రెండవ సిపాయి : వాహ్ ! చెప్పడాని కేముందీ సోదరా ! ఇంత ఆహ్లాదజనకమైన లడ్లను నా జీవితంలో యింతవరకు యెన్నడూ తిని యెరుగను.

మూడవ సి : ఒకేవి లేమన్నా వట్టి నెయ్యితో తినహారు చేయవలసివున్నాయి.

నాల్గవ సి : నేడింతమంచి వస్తువులను తినగలుగుతున్నామంటే లేవడంతో యెవరి ముఖం చూచిన ఫలితమో !

(సుభానుడు ప్రవేశిస్తాడు)

సు : సలామ్, సాదర హమీద్.

హా : సలామ్, సలామ్, ఎక్కడనుంచి వస్తున్నావు, ఏమిటి ?

సు : నువ్వేమన్నా లడ్లుకాజేస్తు, ఎక్కడి నుంచి రాక అని నన్నడుగుతావా ?

హా : (లడ్డుతీసి సుభాన్‌కిస్తూ) కోపగించుకోకు, ఇందా తీసుకుతిను.

సు : (తింటూ) ఓ హో హో, ఇది చాలా రుచిగా వుందే ? ఇలాటి మంచి రకం మిఠాయిలు మీా కెక్కడ దొరికాయి ? (ఆశ్చర్యంగా) ఇక్కడేమిటి, మిఠాయిల కుప్పలు పోసివున్నాయ్ ? ఇవన్నీ యీా వేళ యెక్కడివి ?

హా : నువ్వవట్టి అజ్ఞానంలో పడివున్నావే ?

(అంతా నవ్వుతారు)

సు : విషయమర్థమయ్యేట్లు చెప్పరేం ?

హా : ఇంత గొప్పసంగతి నీకు తెలీక పోవడమేంటి ? చాలా బాగుంది.

సు : ఏ సంగతి ?

హా : ఆ పాదుషావారి ప్రాణ శతృవు....

సు : ఎవరు, శివాజీ ? ఏమయ్యాడు, పరారయ్యాడా ?

హా : పరారవుతే తినడానికి మిఠాయిలు దొరికేవేమిటి ? పైనుండి కాలి దెబ్బలు, చెప్పు దెబ్బలు తింటుండే వాళ్ళం.

సు : అయితే యేమయింది ?

హా : అనారోగ్యంగా వుంటూ వచ్చిన శివాజీకి స్వస్థత చేకూరింది. ఆ కారణంగా మిఠాయిలు పంచి పెడుతున్నారు.

సు : శివాజీ మంచివాడల్లె అవుపిస్తున్నాడు.

రహీమ్ : నీకీ విషయం తెలీదా ? అతడుపాదుషా వారిక్కూడా మిఠాయిలు పంపాడట, కాని, వారు వాటి నన్నిటిని కుక్కలకు వేయించారురా ! మన పాదుషావారు ఎంత పిచ్చివారు ?

హా : (సుభానుని చెంపమీాద ఓ లెంప కాయ వేసి) చుప్, మన పాదుషా వారిని పిచ్చివారంటావా ? మిఠాయిలలో శివాజీ విషం కలిపేడేమోనని ఔరంగజేబు వారికిభయం. (లోపల్నుండి పనివారు పెద్ద పెద్ద బుట్టలను తలపై వుంచుకొని వస్తారు)

హా : ఏయ్, యీా బుట్టలోయేముంది ?

పనివాడు : మిఠాయిలు.

సు : ఇంత పెద్ద బుట్టలో మిఠాయిలె ! ఇదెవరింటికి పోతుంది ?

ప : జయసింహ్ మహారాజుల వారింటికి.

సు : ఇన్ని తాయిలాలు వారింటికి పోతున్నాయంటే ఆయనదెంత పెద్దపొట్టోమరి !

హా : బుట్ట ఏమో చాలా భారంగా అగుపిస్తోంది. దాంట్లో యేమేమున్నై ?

ప : లడ్లు, జిలేబీలు మొదలైన పాకాలే.

హా : బుట్టలో వేరేయేం లేదుకదా ?

ప : లేదు సిపాయిగారు, ఇంకేముంటుంది ?

సు : కొంత భాగం మాకిచ్చిపోరాదు ?

ప : మొదట మీా యెదుటివన్నీ తినేయండి. తింటూ తింటూ కడుపు బద్దలవుతే యేం కాను ?

(అందరూ నవ్వుతూండగా బుట్టలతో పని వారు నిష్క్రమిస్తారు)

## తృతీయ దృశ్యము

(ఒక రమ్యమైన వుద్యానవనం. సాయంకాల మూరుగంటలు. చక్రవర్తి ఔరంగజేబ్ యిటూ అటూ యోచిస్తూ పచార్లు చేస్తూంటాడు. ఒక ప్రక్కనుండి మొగల్ సేనానాయకుడు దిలేర్ ఖాన్ ప్రవేశిస్తాడు)

ది : (వంగి) జహాంపనా, సలామ్.

ఔ : విషయమేమిటీ దిలేర్ ఖాన్ ?

ది : వలలోపడ్డ పక్షి తప్పించుకుంది, జహాం పనా !

ఔ : ఆ యేమన్నావ్ ? ఎవరు పారిపోయింది ?

ది : ఎవడినయితే యింత యత్నం చేసి ఖైదు చేశారో....

ఔ : (భయంతో) ఆ శివాజీ కాదు కదా ? శివాజీ తప్పించుకుని పరారయాడా ? ఎలా సాధ్యమైంది ?

ది : అతడు చాలా జబ్బుగా వుంటూ వచ్చాడని విన్నాను. తాము రోజ వైద్యుణ్ణి చికిత్స కోసం పంపేరట. వారి మందువల్ల శివాజీకి ఆరోగ్యం కలిగింది. ఆ సంతోషంతో నగర మంతా మిఠాయిలు పంచి పెట్ట నారంభిం చాడు. ఏదో ఒక మిఠాయిల బుట్టలో దాగుండి తప్పించుకున్నాడల్లె వుంది.

ఔ : (క్రోధవశుడై) ఆ పహారా వాళ్ళెక్కడ తగలపడ్డారు ?

ది : వారు బైట మిఠాయిలు ఆరగిస్తున్నారు. ఏం జరిగిందో కూడా యెరుగరు. తామే మిఠాయిలు పంచిపెట్టమని అనుజ్ఞ యిప్పించి నట్లు తెలియవస్తోంది.

ఔ : (విచారంగా) అవును.........నేనే అనుజ్ఞ యిచ్చాను.

ది : తమ కన్నుల్లో కూడా శివాజీ దుమ్ముకొట్ట గలడని దీనివల్ల నిర్ధాంతమైంది.

ఔ : నోరు ముయ్యవోయ్ దిలేర్. ఏమిటి వదరు తున్నావ్.

ది : ఈ సింహాన్ని పంజరంలో బంధించి వుంచ డము అసాధ్యమని మొదటే అన్నాను.

ఔ : దిలేర్, నాతల తిరిగిపోతోంది. ఇక నువ్వు వెళ్లు. అయ్యో చేసిన ప్రయత్న మంతా బూడిదలో పోసిన పన్నీరైందే ?

(ఔరంగజేబ్ అక్కడేదో ఆసనం మీాద, తల చేత్తో పట్టుకుని కూర్చుంటాడు. దిలేర్ ఖాన్ నిష్క్రమిస్తాడు.) (తెర)

('హిందీ 'నుండి)



# ఆంధ్రమహిళాసభ సర్వసభ్య సమావేశం

ఆంధ్రమహిళాసభ సర్వసభ్య సమావేశము 10-1-50 మధ్యాహ్నం సాయంకాలం 4½ గంటలకు శ్రీమతి వేనిగండ్ల లక్ష్మీపార్వతిగారి అధ్యక్షత క్రింద జరుపబడెను. ఈ సమావేశమునకు 50 మంది సభ్యురాండ్రు హాజరైరి.

ప్రార్థనానంతరము కీర్తి శేషురాలైన శ్రీమతి సరోజినీ నాయుడు, శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు గార్లయు యావజ్జీవ సభ్యురాండ్రయిన శ్రీమతి పత్తిపాటి రత్నమాంబ, శ్రీమతి దేశాయి లక్ష్మీనరసమ్మగార్ల యొక్కయు మరణమును గూర్చి సానుభూతి తెల్పుచూ అధ్యక్షురాలు తీర్మానములను ప్రతిపాదించెను.

అనంతరం కాశీవిద్యాశాఖ, పారిశ్రామికశాఖ, హిందీశాఖ, కళాశాఖ, ఆంధ్రమహిళ, గ్రంధాలయ, క్రీడా, సారస్వత శాఖల నివేదికలను కార్యదర్శిని చదివెను. 1948 సం॥ జూన్ నెలనుండి 1949 మే నెల వరకు సభ యొక్క ఆదాయ వ్యయముల పట్టి, సభ అన్ని శాఖల యొక్కయు, ఆడిట్ చేయబడిన జమా ఖర్చుల పట్టియు కార్యదర్శిని చదువగా సభ్యురాండ్రు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

ఎన్నికలలో శ్రీమతి జమునాబాయి గారు ట్రస్టు బోర్డులో సభ్యురాండ్ర ప్రతినిధిగా ఎన్నుకొనబడిరి.

శ్రీమతి జమునాబాయిగారు, శ్రీమతి చిన్న ఘంటమ్మ గారు, సంయుక్త కార్యదర్శినులుగా తిరిగి నియోగింపబడిరి. శ్రీమతి గౌరీ సుబ్బయ్య నాయుడు గారు, శ్రీమతి కస్తూరి రుక్మిణమ్మగారు, శ్రీమతి మంత్రిప్రగడ రంగనాయకమ్మగారు శ్రీమతి సి. రత్నావళిగారు, శ్రీమతి ఆర్. కమలా బాయి గార్లు వరుసగా క్లబ్బు, గ్రంధాలయ, సారస్వత, క్రీడా, కళాశాఖలకు నిర్వాహకురాండ్రుగా ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి.

శ్రీమతులు చీలంకూరి వెంకుబాయమ్మ, గో. కమలామణి, కర్రా కమల, పి. శకుంతలమ్మ, టి. అహల్య, లక్ష్మీరఘురామ్, సంపూర్ణమ్మ, స్వర్ణమ్మగార్లు, సబ్ కమిటీ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి.

నర్సింగ్ హోమ్ కమిటీకి శ్రీమతులు జమునాబాయి, గిరిజగార్లు సంయుక్త కార్యదర్శినులుగా ఎన్నుకొనబడిరి. శ్రీ డాక్టరు దొరస్వామి, డాక్టరు అవధాని, శ్రీమతులు దుర్గాబాయమ్మ, వేనిగండ్ల లక్ష్మీపార్వతి, పుగం అన్నపూర్ణమ్మ, అ. చన్న ఘంటమ్మ, పి. శకుంతలమ్మ, డి. స్వర్ణమ్మ, డి. సంపూర్ణమ్మ, ఆచంట శారద, నిడమర్తి లక్ష్మీనరసమ్మగార్లు నర్సింగ్ హోమ్ సలహా సంఘ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి.



ఆంధ్ర మహిళా సభ కార్యనిర్వాహక వర్గం.

# ఆకలికి బలి

"శంకర్"

ఊరికి వెలుపల ఒక బయలులో ఊడలు బారుకొని ఉందా మఱ్ఱిచెట్టు. దాని క్రిందే ఉందొక పూరి గుడిసె. గోడలన్నీ పడి పోయ్యాయి. కప్పుమీది గడ్డి అంతా గాలికి లేచి పోయింది. పేరుకది గుడిసే కాని దానిలో కూర్చుంటే ఆ చెట్టుక్రింద కూర్చున్నంత సుఖంగా కూడ ఉండదంటే సంశయము జనిస్తుంది. ఆ ఊడిపోయిన కప్పు ఇప్పుడో అప్పుడో పడిపోయే దానిలాగు భయముగొలుపుతూ యుంటుంది. రాత్రిళ్లు ఆ బూరుగుచెట్టు క్రింద ఏ పాములో తేళ్లో వుంటాయనే భీతి జనిస్తుంది.

అయితే ఆ గుడిసె నిర్మానుష్య మనటానికి వీలు లేదు. దాంట్లో పార్వతి, ఈశ్వరయ్య అనే దంపతు లుంటారు. వారి సుఖదుఃఖాశ్రయము, ఆనంద విశ్రామము అదే! వారి మేడ, భవనము అదే! అనుకుంటే అదేవారి స్వర్గ ధామం. వారిరువురు ప్రేమ సామ్రాజ్యంలో తేలియాడే యువతీయువకులనటానికి మాత్రం సందేహం లేదు. దినమంతా కూలికి పోయి వచ్చే ఆ గింజలతో కొంత గంజి కాచుకొని త్రాగుతూ యుంటారు. ప్రతిదినము ఉదయాస్తమానము దరిద్ర దేవతతో యుద్ధము చేయుటమే వారిపని. వారిద్దరు నిత్యంగా సుఖజీవనం చేస్తూ యుంటారంటే ఆశ్చర్యమే! వారి నిక్కుల … , వారి కష్టములే వారికటు చేసాయి. వారు మాత్రం దారిద్ర్య సముద్రంలో మునిగి తేలుచున్నారు. కాని! వసంతికవనాల శోభాయమానమైన ఈ విశాల ప్రపంచంలో, నిరంతరము సుఖములనే ఆనంద డోలికలలో తేలియాడే ఈ ధనికవర్గంలో, బొజ్జల పెంచుకొని బీదల పొట్టకొట్టి వారి కష్టార్జితంతో సంతోషించే ఈ వర్తక సమూహాల్లో వారినిచూచి జాలిపడేవారు సుంతైన కూడ లేరు.

ఈశ్వరయ్య యెలాగున్నా పార్వతిమాత్రం మంచి అందగత్తె. ఆమెకు సుమారు ఇరవై సంవత్సరాలకంటే ఎక్కువ ఉండవు. యౌవనంలో మిస మిసలాడే ఆ శరీరములోని బిగువు, ముడిపెట్టిన ఆమె నల్ల వెంట్రుకలు, ఆ కళ్ళలోని కలువు, ఆ యంగసౌష్టవము ప్రతిమానవుని రంజిల్ల జేయగలవు.



పొలాల్లో ఆమె పనిచేస్తూంటే తోటి వారికి, కడకు ఆ యజమానికి ఆమెపైనే దృష్టి. అన్నిటికిముందు ఆమె అప్పుస్తాం మంచిది. వారిద్దరికీ కొద్దిపాటి చదువుకూడ వచ్చు.

పంటలకాలం దాటిపోయింది. అప్పుడు నిండువేసవికాలం ఎక్కడా పనులుండవు. ఈశ్వరయ్య మాత్రము పురుషుడు కాబట్టి ఏలో అక్కడా ఇక్కడా కూలిపనిచేసి జీవనానికి బత్తెము తెస్తూ యుంటాడు. దురదృష్టవశాత్తు ఆతడిప్పుడు జబ్బుపడ్డాడు పాపము రెండు రోజులయింది. అన్నములేదు. కడకు త్రాగుటకు గంజయినా లేదు. అతడు మాటాడటానికి హీన స్థితిలో యున్నాడు. ఆతనికిప్పు డన్నం కావాలి. అయితే గింజలెక్కడ తీసుక రావాలి అనేది పార్వతికప్పుడొక పెద్ద సమస్య అయింది. పనికి వెళ్దామాఅంటే పనులు లేవు. బాకీగా తెస్తామాఅంటే తన కెవ్వరూ వెయ్యరు. అప్పుడేం చేయాలి? అలాగే పస్తుపడి చావాలా? తానంటే సరే— తన భర్తో—అతన్నికూడ అలాచేసి చంపవలసిందేనా? తన ప్రేమమూర్తిని రక్షించుకొనుటకు త్రోవలేమా! ఈ ప్రశ్న లన్నీ పార్వతి మనస్సులో మెదల్తున్నాయి.

ఉదయించిన సూర్యుని బంగారు కిరణములు ఆ పూరి పాకలో దూరి ఆ పాడుగోడలపైబడి అరుణ కాంతి నాపా దిస్తున్నాయి. ఈశ్వరయ్య జ్వరబాధతోను, ఆకలి బాధ తోను మూల్గుతూ ఒకప్రక్క పడుకున్నాడు. పార్వతి ఆత నికి చేతనైన సపర్యలుచేస్తూ అక్కడే కూర్చుంది. మఱ్ఱిచెట్టు చల్లగా గాలి వీస్తుంది.

“పార్వతీ” అని పిలచి కళ్లు మూశాడీశ్వరయ్య.

“ఏమండీ! ఆయాసంగా ఉందా!” పొచ్చరించింది పార్వతి.

“కొద్ది గంజయినా కాచివ్వు” పార్వతి ముఖం వెల వెల బోయింది. ఆమె కళ్లలోనుండి వేడి కన్నీళ్లు కారి ఈశ్వ రయ్య పాదాలు తడిపాయి. “గింజలు లేవా” ఆమెభావ మగ్రహించుకొని కళ్లుమూసాడు ఈశ్వరయ్య. పార్వతికేమీ [illegible] కావటంలేదు. ఎట్లయినా ఆ దినం తన భర్తకు పిడి కెడు గింజలయినా కాచివ్వాలని [illegible]పట్టింది. తన కడుపు కక్కుర్తికోసం తన భర్త ప్రాణంకోసం ఆత్మాభిమానాన్ని బలిపెట్టుకోక తప్పిందికాదు. ఊళ్లోన్రైతుల దగ్గరకి వెళ్లింది. అందరినీ యాచించింది. కాని లాభంలేదు. ఆమెకుఎక్కడా ఎవ్వరూ ఒకపట్టెడు ధాన్యము వెయ్యలా! ఒక పెద్దఇంటికి వెళ్ళింది. ఆ యింటి యిల్లాలు బయటనే నిలుచునియుంది.

“అమ్మా! ఒక పది గింజలు బాకీ వేస్తారా! పని చేసి తీరుస్తా! నా భర్త ఆకలిచే అలమటించి పోతున్నాడు. గింజ లులేకపోతే ఆయన బ్రతకడు—దయ యుంచి కొంచెము ధాన్యము వెయ్యండి.” అంటూ జాలిగా బ్రతిమిలాడింది.

“నీకు మగడుకూడాఉన్నాడా! నీవేం, యిక్కడ దాచి పెట్టావా ఏం!” అంటూ కసరిందామె, తనలాటి స్త్రీయని కనికరమైనాలేకుండా! ఆ మాటలు పార్వతి హృదయంలో శూలాల్లా గ్రుచ్చుకున్నాయి. ఆమె తలకు గోతులు త్రవ్వి నరాలకు నీళ్లుపోసాయి. అవమానంతో క్రుంగి పోయింది. ఆమెకు ఆత్మ, హృదయమూ, మనస్సూ ఉండవూ! బీదరా లయినంతమాత్రాన ప్రేమ, గౌరవము, మర్యాద అనునవి ఉండవా!

“నాకు పిడికెడు గింజలు వేయలేక కసరిపంపే ఈ పాడు ప్రపంచానికి నన్ను అవమానపరచటానికి దూషించ టానికి అధికార మెవ్వరిచ్చారు? నేను బీదరాల నయినంత మాత్రాన నాకు పతి, పతిభక్తి అనునవుండకూడదూ! నేను లోకంలో సాధారణ యువతినికానూ” అంటూ అనుకుంటూంది. ఆమె హృదయములో ఎంత బాధ ఉందో! ఎవరికి తెలుసు?

ఇక ఆమె నడవలేకపోయింది. చేయిచాపి దేహీ యని యాచించటానిక్కూ ఆమెకు బుద్ధి పుట్టలేదు. సుఖంలో మైమఱచి కన్నుమిన్ను గానని ఈ ధనికవర్గం ఆమెను దయ దలచదని తెలుసు. కాళ్లు ముందుకు సాగడంలేదు. కంఠం ఎండుకుపోయింది. హృదయములో దడపుట్టింది. పాపము ఒకచోట కూలబడింది పార్వతి.

ఆమె ఎట్లో ఆకలికి తాళగల్గుతుంది. ఆమె ప్రాణాలు పోయినా ఆమెకు సమ్మతమే? అయితే ఆమె భర్త! అన్నంలేక చావవలసిందేనా? తానెప్పటికిని తన అనురాగ

మూర్తిని పోషించలేదా? ఆమె మనస్సు తిరిగిపోయింది. ఇక ఆ ఊర్లో వీరారెడ్డి అనే ఇల్లు ఒక్కటే మిగిలియుంది. అన్నిచోట్ల పెదవి చప్పరింపులూ, తిట్లూ, దీవనలూ అందుకుంది. అతని గృహానికి వెళ్లక తప్పిందికాదు. అతడు దుర్మార్గుడనే వినికిడి. అయినంతమాత్రాన ఆమె నేమి చేయగలుగుతాడు? ఒకవేళ పోకపోతే తన భర్తకు అన్న మెట్లా? అనే విషయాలు ఆమె మనస్సులో మెదలుతూ యున్నాయి. కాళ్లీడ్చుకుంటూ ఆ యింటికి పోయింది.

వీరారెడ్డి మంచివాడే! అయితే స్త్రీలోలుడు. అది ఒక్కటే అతనిలోని మచ్చ. పార్వతి అతని దగ్గరకుపోయి గింజలడిగింది. పార్వతిని వీరారెడ్డి మోహించాడు. ఆమెలోని అందం అతన్ని ఆకర్షించింది. ఆ బిగి యౌవనంలోని సొంపు అతని మనస్సునుయ్యాలలూగించింది. ఆమెను తన కౌగిలి చేతుల్లో కటకట నలపటానికతని మనస్సెంతో యుబలాటపడుతూంది. ఎన్నో రోజులనుంచి ఆశతో కాచుకున్న సమయం ఆదినం చేకూరింది. తన కామతృష్ణ చల్లార్చుకోటానికి అదే మంచి అదను. అతని హృదయం ఆనందంలో పరవశమౌతూంది. ఎదురుగ్గా పార్వతి నిలుచుంది. తదేకదృష్టితో పార్వతిని చూస్తూ నిలబడ్డాడు. అతని భావమెఱింగిన పార్వతి తలవంచుకొని ఇంటిదారి పెట్టింది.

"పార్వతీ" పిలచాడు వీరారెడ్డి. ఆమె నిలబడింది. "గింజలు కావాలన్నావుగదూ! తిరిగి పోతావేం" పార్వతికి ఆనందం కలిగింది. వీరారెడ్డి ఆమెను తన ధాన్యశాలకు తీసుకెళ్లాడు. ధాన్యం కుప్పతెప్పలుగా బస్తాలకు, గాదెలకు పోసియుంది. వీరారెడ్డి నిలబడ్డాడు. పార్వతికూడా అతని వెనుకనే నిలుచుంది.

"పార్వతీ! నీకు తిండికి కష్టం లేకుండా ధాన్యమిస్తా!"

"మా కెందుకండీ ఏదో ఒక మానెడు ధాన్యం వేస్తే తిరిగి తీర్చివేస్తా!"

"తిరిగి ఇవ్వవలసిన అవసరంలేదు మాకు!"

"వద్దుబాబూ! నీ ఋణం మా కెందుకు [illegible]? తీర్చివేస్తా."

"పిచ్చిదానా! నే చెప్పేది వినవేటంటే! నీవు పని చేయవలసిన అవసరం లేదు. ఇక్కడే యుండు నా దగ్గరే!"

"నా భర్తగారో"

"భర్తా...భర్త" అంటూ విరగబడి నవ్వాడతను. "నే చెప్పినట్టు చేసి నీ జీవితం సుఖప్రదంచేసుకో!" ఆ మాటల్లో ఎంతో వెటకారం గోచరిస్తూవుంది. పార్వతికి మనసులో గుచ్చినట్లయింది.

"నా భర్తను విడిచా..."

"నీ భర్త ..భర్త" విదారించి పలికేటంలో హాస్యము ఎగతాళి అగపడుతున్నాయి. "ఆలోచించుకో! నాలోచ్చే తీర్మానంటె చాలు' నీ జీవిత పర్యంతం సేవ చేస్తుంటాను. నీ జీవితం సుఖప్రదం చేసుకో! ఊరికే ఆ పిచ్చిపుల్లయ్యగాడితో భర్త, భర్త అని ఎందుకు దేవులాడతావు? నీ దరిద్రదేవతను మాయం జేస్తా" వీరారెడ్డి ఇంకా చెబుతున్నాడు. ఆ నిర్మల ప్రేమమయికి ఇవన్నీ సహించలేదు. తల వంచింది.

"వప్పుకున్నట్లేనా? రా! పద" అంటూనే వీరారెడ్డి ఆమెచేయి విడిచి పట్టుకున్నాడు. ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. శరీరము జలదరించింది. ఒడలంతా చెమ్మటలు కారాయి. అతడిలా పాపపుకోర్కె కోరుతాడని కలలో కూడ తలచలేదు. బలవంతంగా చేయి విడిపించుకుంది. ఇక అక్కడ నిలువక పరుగులీసింది.

"బాగా ఆలోచించుకో! నానుండి తప్పించుకోలేవు. నీ జీవితం సుఖప్రదంచేసుకో. పో. నీ భర్తను బ్రతికించుకో" అంటూ వీరారెడ్డి కడసారిగా ఆమెకు చెబుతూ ఇంటికి వచ్చాడు.

"పాడు ప్రపంచం, పాడు లోకం, కామాంధకారంలో కన్నూ మిన్నూ గానని ఈ తుచ్ఛ మానవ సమూహంలో నాలాటి దరిద్ర యువతులకు తావులేదు. వీరి కళ్లకు

ఆనందంగా ఆనుభవిస్తే చాలు మోహించడమే. వీరి తుచ్ఛ పశువాంఛ కొంకలు తమ నిర్మల ప్రేమను బలి పెట్టుకుం టున్నారో! అబ్బ! వీరి కెంతులేనేలేదూ! నాబోటి స్త్రీలకు భర్త లుండకూడదనేనా వీరి అభిప్రాయము. నాలాటి తిండి కట్టు కుడ్డ లేని దరిద్ర యువతులందరూ వ్యభిచారులనే వీరి యుద్దేశం! వారి ధాన్యాన్ని అశించి వారి శ్వస్య చల్లార్చుకొనేనా వీరి ఆశయం! నీచ మానవ సమూహం. నీచ ప్రపంచం!" అనుకుంటూ పార్వతి లో నుండి కుమిలి కుమిలివచ్చే దుఃఖము దిగమింగుకుంటూ కడు పొక చేత్తో పట్టుకొని పరుగెత్తుతూ యుంది.

సాయంత్రం కావస్తుంది. ప్రొద్దు పడమర పూర్తిగా వాలింది. పూరి గుడిసెలో ఈశ్వరయ్య "అబ్బా! ఆకలి ...కొట్టి" అని మూల్గుతున్నాడు. పార్వతి అతని ప్రక్కనే అతనికి పాదసేవ చేస్తూ కూర్చుంది. ఆహారం లేకుంటే ఈశ్వరయ్య బ్రతికేట్టుగా కనిపించటం లేదు. ఆమె దుఃఖ హిమ వన్నగమునుంచి దుమికే భాష్పగంగకు, సింహాద్రి నుంచి ప్రవహించే కన్నీటి కావేరికి అంతులేదు. ఆ వేడి భాష్పాలన్నీ ఈశ్వరయ్య పాదాలు తడిపాయి.

"పార్వతీ...గంజీ..." నీరసంగా, సన్నగా విన వచ్చాయి. ఆ మాటల్లో ఎంతో బలహీనత, ఎంతో వేదన తాండవిస్తూంది. పార్వతికి మనస్సు చలించింది. గింజలెట్లా తేవాలనేది ఒక పెద్ద సమస్యయింది. ఆమె చకిత హృద యంలో, గాయపడ్డ ఆ బిడలేత గుండెలోనుండి ఎన్నో భావాలు ఎన్నో ఆశాభూరిత యుద్దేశాలు దారి తీస్తున్నాయి. ఆమె మనస్సు కలత జెందింది. భర్త—ప్రేమమూర్తి— నిర్మల ప్రేమ—అనురాగ దాంపత్యం—త్యాగం" అన్నవి ఆమె మనసులో కదల్తూన్నాయి.

"నీ ప్రేమమయుడు, అనురాగ రక్తుడు ఆకలికి అలమ టిస్తున్నాడు. అతనికోసమైన జీవితాన్ని త్యాగం చేయ వలసిందే—నీ సుఖాన్ని వదలాల్సిందే! నీ వనోలావ ణ్యాన్ని, నీ విలాస మధుమాధాన్ని, పండువంటి నీ యౌవ్వన మును, కడకు నీ ప్రాణములను ధారపోయవలసిందే" అని మెదడులో ఒకప్రక్క చెప్పినట్లయింది.

"భర్తకొరకయితే మాత్రం నీ శరీరాన్ని అమ్ముకొం టావా? నీ యౌవనము, లావణ్యము నీచ పశువు వృత్తికి బానిస కావాలా?" అని మరియొకరు చెప్పినట్లయినది.

"శాస్త్రద్రూష్యమా! అవన్నీ స్వార్థపరుల వచనాలు! అయినంత మాత్రాన మనము వాటి ననుసరించాలా! మొదట్లో నీ భర్త ప్రాణాలు నీ ప్రాణాలు పోతూవుంటే ఏ సంబంధములేని శాస్త్రాలుపట్టుకొని ఊగులాడేవా! కానీ, నీ ప్రణయ సామ్రాట్టును నీవు బ్రతికించుకోవాలి! అతనికి భార్యవై నీవాతని ప్రేమఫలానికర్పించేదేమిటి-మీ నిర్మల ప్రేమకన్నీ త్యాగం చేయవలసిందే! బలి పెట్టవలసిందే! గత్యంతరంలేదు, అప్పుడే ఆనందం-సుఖం-ప్రపంచం." ఒక భావము గోచరించింది.

"ఛీ పాడుపని! అది లోకంలో నీచం కాదు! ప్రజ అంతా నిన్ను వ్యభిచారియని దూషించరూ! నీకూ, హీనమైన వేశ్యకూ భేదమేముంది? నీవింక లోకంలో తక్కువైపోవూ! అది అవమానంచేకూర్చదూ" ఇంకొకభావం పొడసూపింది.

"కానీ! ఈ లోకంతో నీకేమి పని? పిచ్చి లోకం! మూర్ఖప్రపంచం-నీవు బ్రతికేది వారికి ఓర్పు లేదు. లోకాన్ని అనుసరిస్తే జీవనము గడువవద్దూ-పోనీ నీ భర్తను బ్రతికించుకో పో. నీవు వేశ్య వెలాగవుతావు నీ హృదయము పవిత్రమైతే చాలు. నీ పచ్చిమాంసాన్నే కదూ అతడు వాంఛించేది! నీ హృదయములేని శరీరాన్నేకదూ అతడు కోరేది. ఆత్మలేని నీ కళేబరాన్నేకదూ అతడు కావాలనింది. మనసులేని శవ ముపైనేకదూ అతనికి మమకారం. తప్పులేదు పో! నీ జీవి తాన్ని సుఖప్రదం చేసుకో! నీ భర్త ప్రాణాలు కాపా డుకో! మీ అనురాగ దాంపత్యంలో ప్రేమజ్యోతులు వెలి గించు" అంటూ ఒక దివ్యస్వరం చెబుతూన్నట్లనిపించింది. ఈ భావానికామె తలఒగ్గింది. ఒక అచంచల స్థిరత్వం ఆమె ముఖంలో ప్రస్ఫుటించింది. ఇస్సుమంచు కూలబడింది. సూర్యుడు పశ్చిమాంగన చేరబోతూ తన కనక వస్త్రాన్ని గాలికి లేవదీశాడు. ఆ యిల్లు ఆ మఱ్ఱిచెట్టు తళతళా పసిమి కాంతుల్లో మిలమిలలాడుతున్నాయి.

ఆకలికి తాళలేక ఈశ్వరయ్య నీరసంగా మూల్గు తున్నాడు. అతన్ని చూడటంతోటే ఆమె హృదయం

ప్రయ్యలయింది. ఇక తాళలేక ఏమయినా సరేనని లేచి త్రోవపట్టింది. వీరారెడ్డి ఇల్లు చేరినది. నిర్జీవ ప్రతిమవలె వీరారెడ్డికి స్వాధీనమయినది.

వీరారెడ్డి కామతృష్ణ చల్లారింది. పార్వతి ఆతురతో ఇంటిదారి పట్టింది. లోపల తన భర్త ఏమయ్యాడో అనే దిగులు ఆమెను కలతపెట్టుతూ ఉంది. ఆమె వెనువెంట ఇద్దరు మనుష్యులు ఒక ధాన్యపుబస్తా భుజాలపై వేసుకొని త్రోవపట్టారు. పార్వతి ఇల్లుచేరింది. వెంట వచ్చిన ఇద్దరు మనుష్యులు బస్తా అక్కడవేసి ఇంటికి వెళ్లారు ఆశ్చర్య పడుతూ!

పార్వతి ఈశ్వరయ్య పాదాలకడ కూర్చుంది. పున్నమ జాబిలి తనతెల్లటి కిరణాలను ఆ పూరి పాకలో ప్రవహింప జేశాడు. ఆ శరత్కాంతిలో వారి ముఖంలోని విషాదచ్ఛాయలు స్పష్టమౌతున్నాయి. కళ్లు తెరచి చూచాడు ఈశ్వరయ్య. అతని నోటవెంట మాట రావటం లేదు. నీరసపడి పోయ్యాడు. గంజి కొఱకు నోటితో సంజ్ఞచేసాడు. వడివడిగా పార్వతి గంజికాచి తీసుక వచ్చింది. అప్పటికే ఈశ్వరయ్యలో బలహీనత ఎక్కువయింది.

"ఇదిగో! గంజి త్రాగండి, తీసుక వచ్చాను" అంటూ పార్వతి పిలచింది. ఈశ్వరయ్య కళ్లుతెరచి చూచాడు. అతనిలో ఆనందము మెరుపులా మెరిసింది. కాని ఎంతకాలం? తలపైన శనిదేవుడు శివతాండవం చేస్తూంటే ఆనందమెలా గుంటుంది? బలహీన స్థితిలో లేవలేకపోయ్యాడు ఈశ్వరయ్య. మెల్లగా పార్వతి అతనిని లేవదీసి గంజిముంత నోటికద్ద పెట్టింది. చేతితో పట్టుకొని త్రాగబోతూ త్రాగలేక నీరస స్థితిలో క్రింద పారవేశాడు. పార్వతి ఆపలేక పోయింది. ముంత క్రిందపడి గంజంతా చిందిపోయింది. 'అమ్మా' అని మూల్గాడీశ్వరయ్య. "పా...ర్వ...తీ" పూర్తిగా పలుక లేక పోయ్యాడు. అదే అతని కడసారిమాటలు. నీరసస్థితిలో క్రిందపడి పోయ్యాడు. అంతే—అతని శరీరములో రక్త ప్రవాహం నిలచి పోయింది. అవయవాలన్నీ బిగుసుకు పోయ్యాయి. గుడ్లుతేలవేశాడు. అంతా చూస్తూన్న పార్వతి ఒక్కసారిగా కెవ్వుమని కేకవేసి అతనిపై పడి పోయింది. ఆమె నిర్మించుకున్న ఆశలను భగ్నం గలుగుటు చేతనో ఏమో ఆమెలోని దుఃఖము పొంగి పొర్లి గుండె నిలచి పోయింది. అంతే! వారిద్దరి శవాలు ఒకదానిపైనొకటి పడి యున్నాయి. వారి ఆత్మలు అనంత వాయువులో కరగి పరమాణువులై లీనమైపోయ్యాయి. ఒక తీతువు పిట్ట తీ, తీ యని మఱ్ఱిచెట్టుమీదనుంచి కూసింది.

ఈ స్వార్థ ప్రపంచంలో ఆమె కులటా!!



# కలవు రాతిరి కన్నెకు కనులు వేయి

బోర్డిల్లాన్

కలవు రాతిరి కన్నెకు కనులు వేయి
కాని దినరాజు కొక్కటే కన్ను చూడ
వెలుగు లోకాలలో వెలుగు వెలుగులన్ని
అస్తమించును దినకరు డస్తమింప.

కలవు మనసను మగువకు కనులు వేయి
కాని ఎడదను చూడగా కన్నొకండె
దీర్ఘ జీవిత కాలపు దివ్యతేజ
మస్తమించును ప్రేమతాన స్తమింప.

శ్రీ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి



# స్త్రీ

మూలం : శ్రీ సురేశచంద్ర చక్రవర్తి "త్రివేణి"   అనువాదం : వె. శ్రీ. వెంకటరామయ్య

ఒకానొకప్పుడు మానవుడు పరమ మూర్ఖుడుగ, అహంభావపూరితుడుగ నుండెడివాడు. కాబట్టి స్త్రీని తన బానిసగ భావించుకొన్నాడు. ఆ విధంగానే ఆమెను యేలుతున్నాడుకూడా. ఆమె సుకుమారములగు పాదముల కినుప సంకెళ్ళు తగిల్చినాడు—తన్ను వదలి పారి పోకుండుటకు గాను. అయితే, తన గృహకృత్యాలు నిర్వర్తించేందుకు కావలసినంత స్వేచ్ఛ—కలిగేలాగున ఆ యినుప సంకెళ్ళను అమర్చినాడు. అబ్బా! ఎంత స్వార్థం!

స్త్రీకూడా ఆ శృంఖలాలకు కట్టుబడి, బానిసలాగే వుండడానికి నిశ్చయించుకోక తప్పింది కాదు. పాపం! తనలో తానే యేమని అనుకుందో! ఎవరి కెరుక? అణకువతో ప్రవర్తించి, పురుషునకు అడుగులకు మడుగులొత్తుతూ యింటి పనులన్నీ చక్కబెట్టుకొను చుండెడిది. గృహమును పరిశుభ్రముగ, అందముగ అమర్చెడిది. సంసారానికి, ఆపదలు, లోటుపాట్లు రాకుండా రక్షింపమని భగవంతుని ప్రార్థించెడిది. భర్తకు ఆహారం, స్నానానికి నీరు, పూజకు పుష్పాలు సకాలంలో సమకూర్చి యుంచెడిది.

పురుషుడు తన అహంభావ ప్రభావంచేత, యివన్నీ సహజంగా స్త్రీల కర్తవ్యమే అనుకొని కన్నుగానక మెలగినాడు. ఇవన్నీ ఆడుది చేయడానికి కారణం, తనులేకున్న ఆమె జీవింపజాలదని భావించి పుబ్బి తబ్బిబ్బైనాడు పురుషుని మానసిక స్థితిని పురుషోత్తముడు గ్రహించినాడు. చిరునవ్వు నవ్వుకొని "ఒక తమాషా చేస్తాను" అని నిశ్చయించుకొన్నాడు. ఒకనాడు పురుషుడు యింటలేని సమయం చూచి స్త్రీని, పురుషునికి తెలియనిచోట దాచేసినాడు. ఆ నాడు పురుషుడు అలసి, ఆకొని యింటికి వచ్చినాడు. స్నానానికి నీరులేదు. పూజకు పూలులేవు. తిన తిండిలేదు. అన్ని సమకూర్చే ఆడుది అంతకన్నా లేదు! కోపం ముంచుకు వచ్చింది. చిన్నపిల్లవానివలె చిందులు త్రొక్కినాడు. పిలిచినాడు; పలుకలేదు. అరచినాడు; అంతకన్నా నిశ్శబ్దం! ఆడుదాని ఆచూకీ తెలియక ఆందోళన చెందినాడు.

వీని అరుపులువిని భగవంతుడు ప్రత్యక్షమై యేమీ తెలియనట్లు "ఏమయ్యా కబుర్లు?" అని అడిగినాడు.

"కబుర్లా? ఆ పాపిష్టి స్త్రీ యెక్కడ? ఆమెనే నాకు సకల విధములగు సపర్యలు చేసెడిది. ఇప్పుడా పనుపాయములు లేవు. ఆమె యేదీ!" అని గొంతు చించుకున్నాడు పురుషుడు. "ఇంతేనా" అన్నాడు నారాయణుడు.

"అంతే" అన్నాడు నరుడు. "అయితే నీకు అన్ని సపర్యలూ జరుగగలవులే" అంటూ భగవంతుడు అంతర్ధానమై పోయినాడు.

నాటినుండీ కంటికగుపడని యేదో శక్తిచే, పురుషునికి కావలసినవన్నీ సిద్ధంగా వుంచబడుచుండెడివి. స్నానపానాలకు నీరు, పూజాద్రవ్యములు, ఆహార తయ్యారు పనుపాయములు—అన్నీ ఆయా సమయానికి సిద్ధమయ్యేవి, అనుకొన్న సమయానికి ఆలస్యంలేకుండా—స్త్రీమినహాయించి. కాని, యేదో కొఱతగా కనిపించు చుండెడిది వీనిలో. ముఖ్యమైనదేదో, చెప్పడానికి అలవికానిదేదో, అందులో లోపించినట్లు, కనబడక పోయినట్లు తోచెడిది. ఇప్పుడు నీరువుత్త నీరే. ఆహారం వుత్త ఆహారమే. పూలు వుత్త పూలే. ఆ నీళ్ళలో చల్లదనం లేదు. ఆహారంలో రుచి లేదు. పూలల్లో వాసనలేదు. ఏదో యక్షిణి యివన్నీ తయారు చేసి తన్ను హేళన చేసినట్లు తోచింది పురుషునికి. హృదయం లేని యంత్రమేదో గడియారపు క్రమంతో సమయానికి సరిగ్గా గంటకొట్టినట్లు యివన్నీ సిద్ధపరచి తన్ను తబ్బిబ్బులు గావించునట్లు స్ఫురించినది. సహింపరాని వేదన కలిగింది. ఏదో ఓటుమికల్గినట్లు హృదయం కల్లోలపడింది. ఇట్లే దినాలు గడచుచుండినవి. ఒకనాడింటికి వచ్చేసరికి అన్నీ ఆయా చోట్లల్లో, ఆయా సమయానికి తమంతట సిద్ధమై మౌనంగా తన్ను చూచి నవ్వినట్లు తోచింది. హృదయాగ్నిస్థానం గట్టు తెగింది. ఒక విధమైన ఆవేశం కలిగింది. కోపంతో కళ్ళవెంట నీరుకారింది. వెర్రి పుట్టింది. అజ్ఞానిని తన్ని



తోసివేసాడు. సాహిత్యాన్ని పాతిపెట్టివేసాడు. పుష్పాలను త్రొక్కి చిందర వందరచేసి, పిశాచం లాగు నృత్యం చేసి నాడు. రాక్షసునిలాగు అరచినాడు. ఉరుములాగు గర్జించి నాడు.

మళ్ళీ భగవంతుడు కనబడి "ఏమయ్యా కబుర్లు" అని సావకాశంగా ప్రశ్నించాడు.

"కబుర్లా? హృదయమున్నది అణుమాత్రమైనా లేని యిన్ని వస్తువులు నాకెందుకు? నీ వస్తువులు నీవుతీసుకో. నా స్త్రీని నాకిచ్చేయి" అని ప్రాధేయ పడినాడు.

చిరునవ్వు నవ్వుకొని భగవంతుడు స్త్రీని పురుషుని కిచ్చినాడు.

ఆనాడే పురుషుడు స్త్రీ కాళ్ళలోని సంకెళ్ళు తీసి వేసినాడు. అందుకు బదులు ఆమె కాళ్ళకు కడియాలు, చేతులకు బంగారు గాజులు తొడిగినాడు. ఆమె కంఠ సీమను రత్నాల హారాలచే అలంకరించినాడు. ఆమెను హృదయానికి చేర్చుకొని గద్గద స్వరంతో "నీవు బానిసవు కావు. ప్రపంచంలోని శూన్యతను పోగొట్టడానికి వచ్చిన దైవీకమైన శక్తివి" అన్నాడు.



# ఉత్తేజితాంధ్ర ముక్తావళి

* శ్రీమతి ఆ. సత్యవతమ్మ గారు *

అగర్భశ్రీమంతు రాలనన్ వెలసిన
  ఆంధ్రమాతగన్న అనుజులార!
పల్నాటివీరుల ప్రాభవోన్నతశౌర్య
  వెలమ బొబ్బిలి పులుల్ విక్రమంబు
శ్రీకృష్ణరాయల శ్రీకంఠవచసూక్తి
  రత్నావళియనంగ రమ్యమంది
ఆంధ్రభాషామృతం బందించుకవితల
  అష్టదిగ్గజకవుల్ అమరినట్టి
నీకునీవేయగు నిమ్నోన్నతాజంత
  శిల్పవిద్యలమేటి చేతివిద్య
ఆనందమొందించి అమృతంబుచిలికించు
  అమరగానంబున కలవియైన
సంగీతమాధుర్య సారస్యసౌరభం
  వెదజల్లగల్గిన విమలభావ
చిత్రలేఖాక్రమకళా విఖ్యాతులాంధ్రులన్
  ప్రథమకీర్తిదిగన్న ప్రాభవంబు
ఖండనాఖండనోద్దండచండికరుద్ర
  మాంబాది రమణీ విజృంభణనిలయ

గేయపోతన చిన్నయసూర్యాది
  తిక్కన శ్రీనాథ తెలుగువెలుగు
లలితచిత్రకళల లావణ్యప్రౌఢిమం
  బందినజననియే ఆంధ్రమాత!
గండపెండేరములు ఖ్యాతిగాగొన్నట్టి
  పెద్దనాదికుమార్ల ప్రేమజనని
వీరసుతులనెగాక విజ్ఞానవైరాగ్య
  భక్తవరులనుగన్న భవ్యమాత!
పెద్దలకాలాన పేరుకీర్తులు జెంది
  ప్రస్తుతావళిచేత భంగమొంది
దీనాతిదీనయై దిక్కుమొక్కును లేక
  అడుగంటిపోయిన ఆంధ్రమాత

ఖ్యాతిబోగొట్టి మనమపఖ్యాతినొందు
నిందకంటెనుబొందికి నింద్యమేది?
గానయికనైన మేల్కొని కనులువిప్పి
ఉడుకుచున్నట్టి రక్తపు యుడుకుపొంది
ఆంధ్రదీప్తికి పూర్వపు యశముగూర్చి
ఆంధ్రమాతకు పూర్వపు అందమొసగి
పూర్వపౌన్నత్యమున్ గూర్పుడార్యులార!



# లోహములు - ఉపయోగములు

## బంగారము

* శ్రీ వసంతరావు వెంకటరావుగారు *

లోహాలన్నిటిలో బంగారమొక్కటే ఆదినుండి మానవుని ఆకర్షించినట్లు కనిపిస్తుంది. సహవాసం చేస్తూండిన ప్రాచీన మానవులు కూడా బంగారాన్ని ఎరుగుదురు అనడానికి నిదర్శనాలున్నాయి. బంగారు కోసం మనుష్యులు పడరాని పాట్లుపడతారు. ఇదివరకు దేశ దేశాలు పరుగెత్తేరు. పరిశోధనా గారాలలో అహోరాత్రులు కష్టించేరు. తుదకు ప్రాణత్యాగం చేసేరు. ఆవెర్రి ఎంత ముదిరినదంటే "మర్త్యులచే నీ వెట్టికృత్యాలు చేయించవో సువర్ణాశాపిశాచమా!" అని ఒక కవి వాపోయేరు కాని బంగారుకై మానవులొనరిస్తూన్న నిరంతర అన్వేషణమే నాగరికతా వ్యాప్తికి మూలకారణమైంది. ఆస్ట్రేలియా, అలాస్కా, దక్షిణ ఆఫ్రికాల అభ్యుదయం ఆయా దేశాలలో బంగారు గనులను కనుకొన్నప్పటినుండి ప్రారంభమైంది.

బంగారుని మానవుడెప్పుడు కనిపెట్టినది నిశ్చయంగా తెలియదు. కాని, క్రీ. పూ. నాలుగువేల సంవత్సరాలనాటి ఈజిప్టు రాతి చిత్రాలలో బంగారాన్ని మన్నులోనుండి తీస్తూన్న బొమ్మలున్నాయి. క్రీ. పూ. మూడువేల ఐదు వందల సంవత్సర ప్రాంతాలలో చేయబడ్డ బంగారు పాత్రలు దొరికేయి. అతి పలుచని రేకులుగా బంగారాన్ని సాగగొట్టు నేర్పు ప్రాచీనపు ఈజిప్టు దేశీయులకుండేది. ఒక్క అంగుళంలో కొన్నిలక్షల రేకులను బొత్తిగా పెట్టగల కౌశలం వారల్లో సంపాదించేరు. ప్రాచీన వస్తువులను చూస్తే, అప్పటికి కొన్ని శతాబ్దాల క్రిందనే అద్భుత కళారాధకులుండేవారను అభిప్రాయం కలుగుతుంది.

స్త్రీ పురుష విభేదంలేకుండా, చిన్న పెద్ద అను తారతమ్యం లేకుండా మానవులంతా బంగారంకోసం ప్రాకులాడతారు. బంగారుదొరికే ప్రదేశాలకు వలసపోయే నిమిత్తం పలుసార్లు అనేకులు ప్రాణాలు కోల్పోయేరు. ఎక్కడో బంగారు దొరుకుతుందని వినగానే తండోపతండాలుగా జనులచ్చటికి ప్రయాణమయే వారు. కాలిఫోర్నియాలో బంగారముందని 1849 వ సంవత్సరములో తెలియ వచ్చింది. ఈ వార్త దేశదేశాలు ప్రాకిపోయింది. అతికొద్దికాలంలో ఎచ్చట నెప్పుడున్నవారు వారి పనులను విడిచిపెట్టి, కిల్లాడి, కేలిఫోర్నియాకు ప్రయాణమైనారు. కొందరు ప్రదేశాలను దాటిపోలేక చాలమంది త్రోవలోనే చనిపోయేరు. ఆ వూరు చేరుకొన్న వారిలో చాలమంది బాగుపడ్డారు.

సామాన్య పదార్థాలను బంగారంగా మార్చాలనే తీవ్ర కాంక్షకులోబడి మధ్యయుగాలలో విజ్ఞానులు చేసిన కృషివల్ల "ఆల్కెమి" అను శాస్త్రభాగ మొకటి జనించింది. వారి కృషి ఫలించనప్పటికీ, దానిమూలంగా విజ్ఞానం బహుముఖాల విస్తరిల్లడానికి అవకాశ మేర్పడింది. రాసాయనికంగా బంగారాన్ని తయారుచేయాలని రసవాదుల ఆశయం. వారి కలలు కొంతవరకు ఫలించేయని చెప్పవచ్చును. సముద్రపు నీటినుండి నేటి విజ్ఞానులు బంగారాన్ని సేకరిస్తున్నారు రాసాయనికంగా కాకపోయినప్పటికి భౌతిక విధానాల వల్ల కొన్ని పదార్థాలను బంగారంగా మార్చడానికి అవకాశం కలిగింది. అయితే, స్వప్నప్రాయంగానున్న భావం సిద్ధించిందని చెప్పవలసిందేకాని, ఆయా విధులవల్ల పుష్కలంగా బంగారు తయారు చేయడానికి వీలులేదు.

అయితే, బంగారుమీద ఎందుకింత మోజు? అంటే, అలంకారాలకు బంగారం కావాలి. ఆభరణాలకు కావాలి. ఔషధాలలోనికి కావాలి. నగిషీలకు కావాలి. దేశ దేశాలలో నాణేలకు కావాలి. అవును దాని సహజ లక్షణాలు సామాన్యమైనవా?

ఆ పసిమివన్నె నిగారింపు ఎల్లప్పుడూ ఒకే విధంగా నుంటుంది. నైట్రిక హైడ్రోక్లోరిక ఆమ్లాల మిశ్రమైన

నీళ్ళకిగాని గాలికిగాని ఏ విధమైన ఆమ్లంలోను బంగారం కరగదు. ఆమ్లానికిగాని, క్షారానికిగాని పరిశక్తియుతం. గాలికి గాని, తేమకుగాని, కల్మషించదు. సంకోచనులకు అనుకూలమైన మెత్తనిలోహం బంగారం. పలచని పత్రాలుగా సాగగొట్టడానికి శక్యమైనది. మూడు లక్షల పత్రాలు పొత్తిపెట్టగా ఒక్క అంగుళం మందం ఉండేటంత పలుచగా సాగుతుంది. అట్టి బంగారు పత్రాలను అక్షరాలపై వేయడానికి, అలం కారానికి, ఫిల్మ్‌ల సంబంధమైన ప్రయోగాలకి ఎక్కువగా ఉపయోగిస్తారు. సన్నసన్నని తీగలుగా లాగడానికి అతి మృదువైన పదార్థం బంగారం. ఒక్క తులం బంగారాన్ని ఎనిమిదివందల గజాల పొడవుగల తీగగా సాగదీయవచ్చును. పలచని బంగారు పత్రాలను లోహపు రేకులపై పరచి, వాటిని బలవత్తరం గా కొట్టి, రోల్డుగోల్డు తయారు చేస్తారు. ఫోటోగ్రాఫుల రంగుమార్చడానికై బంగారు క్లోరైడును ఫోటోగ్రాఫర్లు ఉపయోగిస్తారు. టిన్ క్లోరైడుతో కలిసిన బంగారు క్లోరైడు చక్కని ధూమ్రవర్ణాన్ని ఇస్తుంది. దానిని పర్‌పుల్ ఆఫ్ కాసియస్ (purpule of cassius) అంటారు. కుండగాజు ఇనేమిలు మొదలగు వాటితో చేయ బడిన వస్తువులకు గాఢమైన రంగులు వేయడానికి అది ఉప యోగిస్తుంది.

ఇంత ప్రశస్తమైన లోహం అనేక దేశాలలో దొరుకు తుంది. వాటి ప్రాముఖ్యాన్నిబట్టి చెప్పవలసివస్తే బంగారు దొరికే దేశాలు : ఆఫ్రికా, కనడా, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియా, కొరియా, ఇండియా. ప్రపంచ మంతటికి పెద్దబంగారుగని దక్షిణాఫ్రికాలోని విట్‌వాటర్స్ రాండ్ (wit-waters rand) అనేది. ప్రపంచంలో సగం బంగారం విట్ వాటర్స్ రాండ్‌నుంచే వస్తుంది. మన దేశ ములో మైసూరులోని కోలార్‌గని చాల ప్రసిద్ధమైంది.

అసలీ బంగారం ఎట్లేర్పడుతుందో విజ్ఞానులూహించేరు. ద్రవరూపంలోను వాయురూపంలోను సలసల మరుగుతూన్న పదార్థాలు భూగర్భంలో నున్నాయి. అవి పైకుబకడానికి ప్రయత్నిస్తాయి. భూతలం అక్కడక్కడ పగుళ్ళు వారి ఉంటుంది. అట్టి పగుళ్ళద్వారా వేడి పదార్థం పైకుబికే సందర్భంలో వాటియందు బంగారం ఏర్పడుతుంది. వాటిని ధాతురేఖలు (veins) అంటారు. భూమిలో చాలలోతుగా నున్నవి రేఖా నిక్షేపాలు (vein deposits). కాని, వర్ష జలానికందిన పగుళ్ళలో బంగారం జలప్రవాహంలో కొట్టు కొనిపోయి ముక్కముక్కలుగా నదీ శయ్యలలో నుంటుంది. వాటిని ప్లేసరు నిక్షేపాలు (placer deposit) అంటారు. ఇందులో రెండువిధాలు : రేఖానిక్షేపానికి దగ్గరగానున్నది. ఎల్యూవియల్ నిక్షేపాలు, దూరంగాను, నదీ శయ్యలలో ఉన్నవి అల్లూవియల్ నిక్షేపాలు. వీటిలోని బంగారు ముక్కల పరిమాణం సూక్ష్మకణంనుండి ఎంతైనా ఉండ వచ్చును. సుమారు 150 పౌనులు, అంటే 50 వీశెల బరువు గల బంగారుముక్క ఒకప్పుడు దొరికింది. దానిని "వెల్ కమ్ స్ట్రేంజర్" అన్నారు.

నదులన్నిటికి సంగమస్థానమైన సముద్రంలోకూడ బంగా రముంది. దానిని తీయడానికి ప్రయత్నిస్తే మాత్రం తగిన ప్రతిఫలం ఉండదు. ఏమంటే, ప్రతిటన్ను బరువుగల సము ద్రపు నీటిలో సుమారు రెండణాలవిలువగల బంగారం దొర కవచ్చును.

ప్రకృతియందు సహజస్థితిలో లభించే లోహాలలో బంగా రమొకటి. అంటే, కేవలం విశుద్ధంగా దొరుకుతుందని కాదు. వెండితో కలిసి సహజ మిశ్రంగా సిద్ధిస్తుంది. ఆ ఎల్లాయి (alloy) ని ఎలక్ట్రిమ్ అంటారు. టెల్లూరియం, సీసం, రాగి, నాగం మొదలగు లోహాలతో కలిసి ఉంటుంది. వాటిని శుద్ధిచేసినప్పుడు వాటితోపాటు బంగారు సైతం కొద్ది కొద్దిగా లభిస్తుంది.

భూమినుండి బంగారాన్ని సంపాదించాలంటే రెండు పనులు చేయాలి : బంగారు ధాతువును పైకితీయడం మొద టిది. దానినుండి శుద్ధమైన బంగారు విడదీయడం రెండవది. ప్లేసరు నిక్షేపాల సందర్భంలోనైతే ఈ రెండు క్రియలు వాటి పరిసరాలలోనే చేయబడతాయి. రేఖానిక్షేప విష యంలో బంగారు ధాతువుని గనులలోనుండి పెల్లగించి శుద్ధిచేయడానికై మిల్లులకు పంపుతారు. నదీ శయ్యలలో దొరకడంచేత కాబోలు, ప్రప్రథమంలో, ప్లేసరు ఖనిజం నుండి చేతితోనే బంగారు సేకరించారు. నదీగర్భంలోనున్న మన్ను త్రవ్వి, తొట్టెలకెక్కించి, బాగా కుదిపి, బరువుచే

ప్రవాహంలోని బంగారాన్ని చేతులతో తాసి విడదీసే వారు. కాని, ఇది చాల మందమైన పద్ధతి. కడపడిగా నదీ గర్భం లోని మట్టినితీయడానికి బాల్చీలమూగల డ్రెడ్జి అనే యంత్రాన్ని ఉపయోగిస్తారు. ఈ విధానంవల్ల నదీ గర్భాలు నాశనాలాయని, దీనిని అట్టే విరివిగా వాడరు. బంగారు ముక్కలతో కూడిన మట్టిని పెద్ద పెద్ద యంత్ర ఖనిత్రాల (power shovels) తో పైకితీసి ఖనిజాన్ని సంపాదిస్తారు.

ఇక రేఖానిక్షేపాలను లోతుగా త్రవ్వి డైనమైటుచే ఖనిజాన్ని ముక్కలుచేసి పెకలిస్తారు. మన కోలారు గని. సుమారు ఆరువేల అడుగులలోతుంది. అతి గంభీరమైన గని విట్ వాటర్స్రాండ్ లోనిది, దాని లోతు సుమారు ఎనిమిది వేల అడుగులు.

బంగారు ఖనిజాన్ని శుద్ధిచేయు విధానాలు మూడున్నాయి. వాటిలో తేలుడు విధానం ఒకటి. చిన్న చిన్న బంగారు తునకలు నీటిలో తేలిపోయేటట్లు చేస్తారు. కొన్ని నూనెలు రసాయనాలు కలపబడ్డ నీటిలో బాగా చూర్ణం చేసిన ఖనిజాన్ని వేస్తారు. ఒక రసాయనంవల్ల నీరు నురుగ దేరుతుంది. అందుచేత ఆ కణాలు గాలి బుడగలకు అంటుకొని పైకితేలిపోతాయి. ఇతర లోహాలపై యిట్టి పొరలు ఏర్పడకుండా చేసే రసాయనాలుకొన్ని. ఖనిజాన్ని నీటిలో పడేసిన పిమ్మట అందులోనికి గట్టిగా గాలి నూదుతారు. గాలి బుడగల కంటుకొన్న బంగారు కణాలు నురగలుగా పైకి తేలిపోతాయి. నురగనుండి వాటిని సంగ్రహిస్తారు.

పాదరసంతో కలిసి లోహ మిశ్రమం ఏర్పడు ఆసక్తి బంగారానికున్న సహజ లక్షణం. ఆ లక్షణాన్ని ఉపయోగించే విధానం రెండవది. బంగారు ఖనిజాన్ని చూర్ణీకరించి నీటిలోకలిపి ముద్ద తయారుచేస్తారు. దానిని కొన్ని కూటాల ద్వారా పంపినప్పుడు అందున్న లోహాలన్నీ వాటి బరువు ప్రకారం ఏర్పబడతాయి. పాదరసం పూయబడిన రాగిరేకులపై తుదకీ ముద్దని పంపగా అందున్న బంగారు శేషాన్ని పాదరసం ఆకర్షిస్తుంది. అవక్షిప్తమైన మిశ్రమాన్ని వేడిచేయగా పాదరసం బాష్పీకరించి శుద్ధమైన బంగారం లభిస్తుంది.

మూడవది సైనైడు విధానం. సైనైడ్ ద్రావణంలో ఖనిజాన్ని పోయగా, అందలి జింక్ సమక్షంలో బంగారం యావత్తు ప్రెసిపిటేట్ అవుతుంది. దానిని కరగించి శుద్ధ సువర్ణాన్ని తీస్తారు.

బంగారం మెత్తని వశ్యమైన లోహమని గమనించేరు. ఆభరణాలకు దాని గట్టితనం చాలదు. అందుచేత వెండి తోనో రాగితోనో కలిపి గట్టి పరుస్తారు. బంగారుయొక్క శుద్ధతను కారెట్లలో వ్యవహరిస్తారు. విశుద్ధ బంగారం 24 కారెట్లు గలది. ఇరవై నాలుగుపాళ్ళలో ఎన్ని పాళ్ళు విశుద్ధ బంగారముంటే ఆ మిశ్రమం అన్ని కారెట్ల బంగారమంటారు. పద్దెనిమిది పాళ్ళు బంగారం ఆరు పాళ్ళురాగి కలిసిన మిశ్రమాన్ని పద్ధెనిమిది కారెట్ల బంగార మంటారు.

ప్రపంచంలోనున్న బంగారంలో సుమారు సగం నాణేలుగానో లేక కరెన్సీనోట్లకు బరోసాగానో ప్రభుత్వపు బొక్కసాలలో భద్రంగా నుంది. ఒక దేశం యొక్క పలుకుబడి ఆ దేశంయొక్క బంగారు నిల్వనుబట్టి ఉంటుంది.

మన దేశంలో బంగారు సొమ్ములు లేని స్త్రీ కనిపించదు. పాశ్చాత్య దేశంలో వలె గాక మన దేశంలో ఆభరణాలపై మోజు ఎక్కువ. కాని, ఆర్థికంగా అది మంచిదనే చెప్పాలి. స్త్రీలు ధరించే నగలరూపంలోను, దేవుళ్ళకు ఆభరణాద్యలంకార రూపంలోను చాల బంగారం మన దేశంలోనుంది. ధనవంతుల ఆర్థిక బలానికి గౌరవ సంపదకు ఒకప్పుడు బంగారం కొలబద్దగా నుండేది. అంతేగాక, ఉంగరం, మురుగులు, మొలత్రాడు, చెవిపోగులు, మొదలైన రూపాలలో మొగవారుకూడ బంగారాన్ని ధరించడం మనకు సంప్రదాయ సిద్ధమైనది. బంగారం మీదనున్న వ్యామోహం తప్పైనా ఒప్పైనా కాని, దాని మూలంగానే మన భరత వర్షం కొంత బంగారానికైనా ఉనికిపట్టుగా నేటికిని ఉంది.

మదరాసు ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.



సీరియల్ నాటిక

# భక్తిలీల

శ్రీ లాకా శ్రీనివాసరావు

రంగము ౨.

ప్రదేశము : వైకుంఠము.

[ప్రవేశము : బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఇష్టాగోష్ఠి సలుపుచుందురు]

బ్రహ్మ : తే. గీ॥ సృష్టి సృజయించు బ్రహ్మను । కష్ట మనక
విష్ణు : స్థితిని గూర్చెడి విష్ణుడ । యతులితముగ
ఈశ్వ : లయముఘటియించు శివుడను । భయములేక
విష్ణు : సరిగ త్రైనాథ లీలల । నెరుగ నగునె ?

(నారదుడు దూరమున వీణాగానము సలుప)

విష్ణు : బ్రహ్మ మానసపుత్రు డరుదెంచు చున్నట్లున్న దే !

బ్రహ్మ : ఏమి పుత్రుడు ? ఏదో యొక కలహమును గల్పించుచునే యుండును.

ఈశ్వ : సర్వలోకముల కుపకార కరమగు కలహములు మీ అబ్బాయి కెంత మాత్రమును గళంకమును దీసికొనిరావు.

(ప్రవేశము నారదుడు)

నారద : తే॥ గీ॥ ఆదిమధ్యాంత మూర్తుల । నమల గుణుల
లోక కల్యాణ లోలుర । లోక హితుల
బ్రహ్మ విష్ణు మహేశ్వర । ప్రభుల ఘనుల
శ్రీ త్రినాథుల మ్రొక్కెద । చిత్తమలర !

విష్ణు : నారదా ! రమ్ము. విశేషము లేమైన గలవా ?

నార : దేవా ! లేకుండుటేమి ? వలసినన్ని గలవు.

బ్రహ్మ : అదిగో ! అప్పుడే ఏదోయొకటి గల్పించెను.

ఈశ్వ : బిడ్డా ! ఎప్పటనుండి నీ రాక ?

నార : ఓ త్రినాథులారా ! భూలోకమునుండి వచ్చుచున్నాను.

ఈశ్వ : తే॥ గీ॥ నారదా ! భూమిలోగల । నరుల వార్త
లెల్ల దెల్పగ మాతోడ । నెరుక బరుపు
వినగ వేడుక జనియించె । ప్రేమ మాదు
భజనలను సల్పి సుఖముల । బడయు వారె ?

నార : భూలోకమందు నీ కలియుగమున మానవులు భగవంతుని బూజింపలేక అధోగతి పాలగుచున్నారు. మానవులు తరించుటకు మార్గము లేదా ?

విష్ణు : వారు మమ్ములను భజించి ముక్తిబొందుట కెన్నో మార్గములుండ మార్గము లేదాయని ప్రశ్నించు చుంటివేమి ?

తే॥ గీ॥ భక్తి ప్రాధాన్యమని యెంచి । భజన సలిపి
మాదు పూజల మరువక । మమ్ము దలచి
మంచి నడవడి జరియించు । మానవులకు
మోక్ష సామ్రాజ్య పదవిని । బొంద నగును.

ఈశ్వ: అబ్బాయి సందేశమునందు విశేషము లేకుండుటలేదు. మానవజన్మ ముత్తమంబైనను మానవులు జ్ఞానశూన్యులై మూఢ విశ్వాసముల పాలై పాడు బడుచున్నారు.

విష్ణు : ఎట్లో వారు మనస్ఫూర్తిగా భజించుటే కర్తవ్యము.

బ్రహ్మ : భగవంతుని నామస్మరణ మొక్కటి చేయుట వలననే మానవులు తరించుటకు మార్గము గలదు. కనుక, వారు ధన్యులు. కడుం గడు ధన్యులు.

నార : మానవులలో సంఘీభావము మిక్కిలి తక్కువ. ఎందరో మతకర్తలున్నారు. ఎన్నోరకముల దేవాలయ

యున్నవి. వారికి ఒక క్షేత్రముగాదు. ఒక జాతిగాదు, ఒక సమయముగాదు, ఒక క్రమముగాదు.

బ్రహ్మ: కాని, ఏవో విధమున మమ్ములను భజించుచే మాకు తృప్తిగా నుండెను!

నార: మతకర్తలు, మఱియు శాస్త్ర పురాణాది వేత్తలు నున్నారు వారలు భూలోకమున నెన్నెని కఠిన శాసనములు జేసియున్నారు.

ఈశ్వ: నారదా! వారి శాసనము లెట్టివి?

నార: బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనియు మాల మాదిగాది పంచములనియు, యింకెన్నెన్నో పేర్లతో నెన్నెన్నో జాతులను గల్పించి కలహముల గల్పించి ఘోరముగ నెన్నో హత్యలు సలుపుచున్నారు.

బ్రహ్మ: సరే, జాతులతో నేమి ప్రసక్తిగలదు.

నార: వేదములు ఎవరుబడితే వారు చదువ రాదట, దేవాలయములకు ఎవరు బడితేవారు వెళ్లరాదట, దేవతా విగ్రహములను ఎవరుబడితే వారు ముట్టరాదట. ఏమీ! దేవుని భజించుటకు గాని, దేవుని చరిత్రలు చదువుటకు గాని తెలిసికొనుటకుగాని సర్వ మానవులకు సమమైన హక్కు లేదా?

బ్రహ్మ: ఇంకేమి జరుగుచున్నది.

నార: ఇంకెట్టి వింతలు జరుగుచున్నవి?

నార: ఉపవాస క్లేశముల ననుభవించ వలెనట. ఎందరో బ్రాహ్మణులకు భోజనాది సంతర్పణములుజేసి సంభావన లిచ్చి సంతృప్తి గలిగించవలెనట. ఎన్నినాళ్లో హోమాది కర్మలు చేయవలెనట. అట్లయిన భూలోకమునందెన్నో కోట్ల ప్రజలున్నారే? వారందరూ యిట్టి కఠినమైన నియమములను పాటించి మీ సాన్నిధ్యమును బొంద గలరా?—అందరికి ధనమున్నదా? వారందరికి గతియే లేదా?—దేవుడు లేడా?—వారందరూ తపో నిష్ఠా గరిష్ఠులై యజ్ఞ యాగాది కర్మలు చేయ గలరా?—ఓ త్రినాథులారా! మీరిట్లూరక మౌనము దాల్చి యున్నా రేమి? ఇందుకు తగిన మార్గము లాలోచించి కాపాడుటకు కరుణ గలుగదా?—కర్తవ్య మూహింపుడు. మానవుల రక్షింపుడు.

ఈశ్వ: నారదా! నీవు చెప్పినదెల్ల విచారింప వలసి యున్నది.

నార: దేవా చెప్ప మరచితిని. కొందరు మద్యము, మాంసము భగవదార్పణము చేయుచున్నారు. కొందరు బలుల నొసంగి జీవహింస గావించుచున్నారు.

బ్రహ్మ: ఆశ్చర్య మాశ్చర్యము.

తే. గీ. మానవులె తప్పులను జేసి, మంద బుద్ధి
నేరములు నెన్నో దేవుని నెత్తి నుంచి
నింద చేయుచు నుందురు, నిశ్చయముగ
శక్తి విడనాడ వారికి ముక్తి గలదె?

నార: అట్లయిన వారి గతి ఏమి గావలెను?

విష్ణు: దుష్ట కృత్యములు జేయువారు తత్ఫలమును తప్పక భూలోకమందే యనుభవించగలరు. ఎవరు నిశ్చలంబుగ భక్తితో మమ్ముల భజింతురో వారికి మోక్ష మొసగుదుము.

నార: అయిన భక్తి కుదురుటకుగాను ఈ కలియుగమునకు దగిన వ్రతమొకటి కల్పించి కఠినమైన నియమములు లేకుండా సూక్ష్మమున మోక్షమును పొందుటకు తగినట్లుగా నియమించి, విశ్వాస మొదవుటకుగాను కొన్ని యద్భుత మహత్తులను చూపెట్టి భూలోకమును బాగు పరుప యత్నింపుడు.

విష్ణు: నారదా! నీవు వచించునట్లు త్రిమూర్తులము గలిసి తగిన వ్రతమొకటి కల్పింతుము.

ఈశ్వ: అవశ్యమట్లే గావింతుము.

బ్రహ్మ: అతి శీఘ్రకాలముననే కర్తవ్య మాలోచింతుము.

విష్ణు: నారదా! నీవును మాకు సహాయభూతుడవై మా కార్యములయందు పాల్గొనవలయును జుమా!

నార: ధన్యోస్మి, ధన్యోస్మి. శ్రీ శ్రీ శ్రీ త్రినాథ స్వాముల సేవకుండనై వలయు కార్యముల యందప్రమత్తుడనై సంచరించెద. ఇంక నే బోయెద సెలవొసంగుడు.

విష్ణు: నారదా! ఇంక బొమ్ము.

నార: జాయ్! త్రినాథులకు జాయ్!

(తెర వ్రాలును)



రా జ యో గి

# శ్రీమతి పుష్పలూరి సత్యవతమ్మగారు

యీమె 1899 సం : అనగా హేవిళంబినామ సంవత్సర భాద్రపద శుద్ధపంచమినాడు కిర్లంపూడివద్ద పత్తిపాడు ధర్మవరములో జన్మించెను. యీమె రాళ్లపల్లి శ్యామలగారి కొమార్తె. తల్లి మహాలక్ష్మమ్మగారు, యీమెకు నలుగురు అన్నదమ్ములు, ముగ్గురక్కచెల్లెండ్రు కలరు. యీమె నామ



ధేయము తల్లిదండ్రులు చేసినది కాదు. అన్నవరం నారాయణమూర్తి కరుణవలన పెట్టిన పేరు. యిక్కడ చిన్నకథ వ్రాయవలసియున్నది. యీమె, మూడు మాసముల పిల్లప్పుడు తల్లిదండ్రులు యీమెను తీసుకుని, అన్నవరం వెళ్ళిరట. అప్పటికి యీమెకు, నామకరణము లేదట. యీ పసిబిడ్డను, సత్రములో పరుండబెట్టి, పని మనిషిని కావలి వుంచి వారు దేవదర్శనమునకు వెళ్లిరట. తిరిగివచ్చు సరికి యీమెను పరుండబెట్టిన గది తలుపులు మూసుకొనినవట. పనిమనిషి నిద్రపోతున్నదట. చంటిబిడ్డ కంకబెట్టి ఏడ్చుచున్నదట. ఎంతమందివచ్చి తలుపులు తెరచుటకు ప్రయత్నము చేసినను, తలుపులు విడలేదట. గదిలోనున్న పని మనిషికి తెలివి రాలేదట. అంతట యీమె తల్లి దండ్రులు, భగవంతుని మహిమగాని వేరొకటికాదని గ్రహించి, తలుపులువిడి, బిడ్డబ్రతికిన సత్యనారాయణమూర్తి పేరు పెట్టెదమని మ్రొక్కుకొనిరట. అంత వెంటనే తలుపులు తెరవ బడ్డవట. ఆ కారణమువలన యీమెకు సత్యవతమ్మ అను నామధేయము కలిగినది.

యీమెకు 1910 సం॥ వివాహము జరిగినది. విశాఖపట్నంజిల్లా, ఏటికొప్పాక కాపురస్తులు, పుష్పలూరి గురవప్పగారి కొమారుడు వీరరాఘవులుగారి కిచ్చి రాజమహేంద్రవరములో వివాహము చేసిరట. యీమె తండ్రి తాసిల్దారు, అత్తవారు ధనవంతులు. యీమె అత్తవారియింట పుట్టినింటా అల్లారుముద్దుగా పెరిగిరి. పదునైదు సంవత్సరములు వచ్చుసరికి కష్టములు ప్రారంభమైనవి. ఐదుగురు మఱదులు, పదినెలల ఆడబిడ్డను, మామగారిని వదలి, యీమె అత్తగారు స్వర్గస్థులైరి. అప్పటినుండియు సంసార బాధ్యత అంతయు యీమె తలపైపడినది. యీమె అత్తగారికి పెద్దకోడలు. మఱదులు, ఆడబిడ్డ ఒకయింటివా రగువరకు యీమెయే పెంచినది. యీమె భర్తగారు మున సబుకోర్టునాదరు. యీమెకు చిన్నతనములోనే ఆరుగురు బిడ్డలుపుట్టి చనిపోయిరి. వేమనయోగివలె, యీమె యెల్లప్పుడు బిడ్డలు లేరని విచారించుచుండెడి రోజులలలో వీరి యింటికి భగవంతునివలె ఒక వృద్ధయోగివచ్చి వీరియింటిలో మూడు రోజులువుండి, ఆ మూడు రోజులలో యీమె భక్తి విశ్వాసములు వినయ విధేయతలు పతిభక్తి చూచి, యీమె విచారము గ్రహించి, యీమెకు రాజరాజేశ్వరీ మంత్రోపదేశముచేసి, వెడలిపోయిరట. ఆనాటి నుండియు యీమె ఆ మంత్రమే జపిస్తు కొద్ది కాలము జరిపిరట. తరువాత, యీమెకు సంతానలోపము లేకుండ భర్తగారి సోదరుని కొమారుని వరప్రసాదమువలె పెంచుచుండిరి. బిడ్డలు లేని లోపముతీరినది, కాని, భగవంతుని తెలుసుకొనవలెనను

క్షోరిక తీవ్రమైనది. అహోరాత్రులు జపించినను, నిశ్చలమైన పరమాత్మ గోచరము కాలేదు. సగుణోపాసనవలన యిహ సౌఖ్యము పునర్జన్మమే గాని, మోక్షములేదని గ్రహించి, నిర్గుణోపాసనే మోక్షమార్గమని, నామములు వేరుగాని దైవము యొక్కడేఅని, అఖండ పరిపూర్ణమైన దేవుడు ఒక్కడని, ఒక నిశ్చయమునకు వచ్చి, నామరూప రహితమైన దేవుని ధ్యానించే వారట. ఎన్నాళ్లు ధ్యానము చేసినను నిశ్చలమైన పరమాత్మ గోచరముకాలేదు. నిశ్చలముగా ధ్యానించుటకు సంసారములో, అనేక చికాకుల నుండి అవకాశములేక పోయిందట. అయినప్పటికి ప్రయత్నము మానుటకు వీలులేదు. ఆ సందిగ్ధావస్థలో యీమె చాల బాధపడి, ఆఖరుకు భావిలో పడుటకు భావివద్దకు వెళ్లి "నాకు సంసారమందుగాని, ప్రాణమునందుగాని ఆశ లేదని" నిశ్చలమైన భక్తితో ప్రాణ త్యాగము చేయుటకు సిద్ధమగునప్పటికి భగవంతునకు దయకలిగి,

కం|| లోకంబులు లోకేశులు,
లోకస్థులు, దెగిన తుదిన లోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకా కృతి వెలుగు నతని నే సేవింతున్||

అని గజేంద్రుడు చెప్పినట్లు ఆ భావిలో గొప్పదైనటువంటి వెలుగు కనుపించినదట. ఆ వెలుగువలననే యీమెకు నిశ్చల జ్ఞానోదయమైనదట. ఆ దినమునుండియు ధనములోను విలువైన వస్త్రములలోను సారములేదని గ్రహించి అవి అన్ని విసర్జించి, జీనురుబట్టలు అనగా, కాషాయ చీరలు ధరించిరట. జ్ఞానోదయమే కానప్పటి సంసారము బాధగాను, భారముగాను తోచెడిదట. జ్ఞానోదయమైనప్పటినుండియు, సంసారము దూది పోచవలె తేలిక అయినదట. యీమె 23-2-1940 సంవత్సరమున యోగినిగా మారినది. యోగినిగా మారి గృహస్థాశ్రమమున వుండుటచేతనే, యీమెకు రాజయోగియని నామము కలిగినది. తామరాకు మీద నీరు మాదిరిగా సంసారమునకు అంటకుండా, భూతదయతో ప్రజలకు జ్ఞానోపదేశము మానవసేవచేసి తరించే సాధ్వీమణి.

యీమె 1948 సం|| లో నూటయెనిమిది ప్రశ్నోత్తరములకు వుపనిషత్సారమని గ్రంథము వ్రాసెను. ప్రజలకు సద్గ్రంథములు చదివిచెప్పుట, జ్ఞానోపదేశముచేయుట నిత్యకృత్యములు. యీమెకు చాలామంది శిష్యులుకలరు. పది సంవత్సరముల లోపు పిల్లలుకూడ యీమెవద్ద వుపదేశము తీసుకొని వెడలి పోదురు. యీమెకు పసుపు కుంకుమ పుష్పముతో గురు దక్షిణ. ఆమె సర్వసంగ పరిత్యాగి. యీమెకు ముల్లోకము లలోను కొరతగిన దేదియులేదు. అధ్యాత్మిక 108 పట్టాభిషేకములు అయినవి. భగవంతుని లీలలు అత్యద్భుతములు కదా. రామచంద్రమూర్తి ఏదోవొక జీవితకాలవడము, పాలు క్షీరాన్నములు మొదలగు పదార్థములు అక్షయములు. దేవీ నవరాత్రులలో కుంకుమ మొదలైన పూజా ద్రవ్యములు అక్షయమగుట నామరూపములు ఎంత బంధించినను ఏదో విధముగా దేవీ ప్రసన్నము, బ్రహ్మానందమే.

సోదరీ మణులారా, స్త్రీలలోకూడ ఇట్టి సాధ్వీమ తల్లులూ యోగాభ్యాసకులు కలరని తెలియచేయుటే నా వుద్దేశము. అయితే బ్రహ్మజ్ఞానము సద్వినియోగము చేయక మంత్రోపదేశమునకు 500 లని, నూట పదహారులని పుచ్చుకొనిగాని కొంతమంది మంత్రోపదేశము చేయరు. యివికాక పాదపూజలని బీదవారివద్ద సహితము డబ్బు వసూలుచేయుదురు. అహంకార మమకారములు చంపుకొనకుండగానే యోగినులై ఎవరేదడిగినను విసిగికొనుచు, డబ్బిచ్చువారికి సహితము జ్ఞానోపదేశము ఏ విధముగా చేసితే బోధపడునో తెలియక వారేతత్తర పడుచుందురు.

సోదరీ మణులారా! యీమె అట్లు కాక, మూర్ఖుని కూడ, జ్ఞానమార్గమునకు త్రిప్పు ప్రజ్ఞశాలి. ఏ రాత్రిగాని పగలుగాని ఎవరువచ్చి ఏది అడిగినను అతి దయతో శాంతముతో బోధచేయు సాధ్వీమణి. యీమె వుపదేశము రహస్యమైనదికాదు. డబ్బుఅక్కరలేదు. కాబట్టి స్త్రీలలోకూడా రాజయోగినివంటి ఆదర్శప్రాయులు, భక్త శిరోమణులైన గృహిణులు వున్నారని తెలియ జేయుటకే యీ చరిత్ర వ్రాయడమైనది.



# బ్లాస్ ఫిస్

సరస్వతి మంచి వాకచక్యము గల మనిషి. అందులో చెప్పదలచినది, వెంటనే చెప్పక చుట్టుత్రిప్పి చెప్పగల నేర్పు అపారము.

ఒకరోజు "మీ స్నేహితుడు, మనలను భోజనానికి పిలిచి విందు చేశాడే ఆయన "యని మాట నిక్షేపించింది.

"విందా! ఎప్పుడు, ఏ స్నేహితుడు? ఎందుకు పిలిచాడు?" ఇవి ఆలోచించుటకు అధమం అయిదు నిమిషాలు అయినా పట్టవచ్చును.

అయితే సరస్వతి భర్తకు మాత్రం ఆ కష్టములేదు. ఎందుకంటే ఆయన ఇవన్నీ ఆలోచించడు.

"ఇదిగో, సరసూ, ఈ కాగితాలు నా బల్లమీద పెట్టు. కాఫీ ఏమన్నా వేడిగావుందా? వుంటే పట్రా. ఇదిగో ఈ పుస్తకం కూడా, ఆ బల్లమీదో, షెల్ఫులోనో పడేయి. టిఫిన్ ఏమైనా చేశావా, కారమా, తీపాయని ప్రశ్నల వర్షం కురిపిస్తాడు" సరస్వతి భర్త.

భర్త ఆజ్ఞలు నెరవేరుస్తూనే అవన్నీ సరే, ముఖం కడుక్కొని, తలదువ్వుకోండి. వోణీయా, కోటా? ఏది తెమ్మంటారు? కాఫీ, టిఫిన్ పుచ్చుకొని త్వరగా తెమలండి అన్నది సరస్వతి.

మగవాడు ఇంట్లో అడుగు పెట్టగానే "మనకు విందు పెట్టాడే ఆ స్నేహితుడు" అని ఆడది ప్రారంభిస్తే ఆ మగవానికెలా వుంటుందో ఆలోచించండి.

ఆవిడేమో జోరుగా శృంగారించుకుంది. నడిమి పాపట (ఇప్పుడు ప్రక్కపాపిడి ఫాషన్ కాదుగా), వాలుజడ, జడకుప్పెలతో ప్రత్యక్షమైంది.

"త్వరగా కానీండి, కాఫీ చల్లారి పోతుంది." (ఇది మినహ)

"ఏమిటి షాపింగా లేక సినిమాయా?"

"అబ్బా, మగవాళ్లంతా ఇంతేనా, లేక మీరేనా! బజారు అంటే పాముపుట్టమీద నడిచేటట్టు అట్లా హడలిపోతారేమండీ! నాకేమక్కరలేదు. నేనేమి కొనుక్కోను కాని "యన్నది.

"నీకేమక్కరలేదు కాని బజారు కెళ్లాలి? ప్రపంచములోని వింతలంటారే, దానికిది శిఖరంవంటిదన్నాడు భర్త.

"మీ స్నేహితుడు "అంది భార్య.

"మళ్లా స్నేహితుడంటావ్, ఎవరతను?"

"ఇప్పుడు పెళ్లైంది కాదండీ! పోయిన నెలలో"

"సరే, నా స్నేహితులకు దౌర్భాగ్యమండికి పోయిన నెలలో కారాగారవాసం ప్రాప్తించింది. ఇది సర్కార్ వారి శిక్షలాగా అయిదు సంవత్సరములు ఆరు సంవత్సరములు కాదు. యావజ్జీవము, ద్వీపాంతరవాస శిక్ష అయినా కొంత మేలే. ఉరి శిక్షకూడా నయమేననిపిస్తుంది. ఏమంటే ఒకేసారి ప్రాణాలు వదిలేస్తాడు ఉరికంబము మీద మానవుడు. ఇది దినదినము చావేగా!"

"ఏమి మాటలండీ కల్యాణమంటే కారాగారవాసమా? మీ డిక్షనరీలో కల్యాణానికి అదే అర్థము కాబోలు."

"అవును ఇదిగోవిను సంసారమనే చెరసాలకు, పిల్లలనే ఇనుప కట్టెల మూలమున, భార్యయనే జెయిలర్, భర్తయనే ఖైదీని, బంధించి, అందము వాక చక్యము, ఏడుపు, లాలనయను ఆయుధములతో భయపెడుతుంటుంది. వీటికి భయపడ్డట్టు, తుపాకికికూడా భయపడడు మానవుడు"

"చాలు మీ వుపన్యాసాలు. ఉపమానాలు బాగానే వున్నాయి. నా మాటకాస్త వినండి. ఆ పోలీస్ కమీషనర్ వీధిలో వున్నాడే మీ స్నేహితుడు"

"మళ్ళా, స్నేహితుడంటావు పేరు చెప్పరాదూ. రామారావా, సత్యనారాయణా, ఊగులాడే బసవన్నా?"

"మాటలతోనే ప్రొద్దుపోతున్నది. ఇంక షాపింగ్ కు ఏమి వెళతాం?"

"నే చెప్పడం ఊర్మిళ మగడండీ"

"ఊర్మిళ మగడా, ఏ వూర్మిళ?"

"ఏమిటండీ, అలా చేస్తారు? ఎప్పుడైనా, కాటుకకళ్లు పెట్టుకున్నా. అన్నా ఇంకా తెలియలేదా? నాలుగు జతల చేతికి గాజులు వేసుకుంటుంటే"

"గాజులే వేసుకుంటుందో, గొలుసులే వేసుకుంటుందో నాకేమి తెలుసు? నీ ఆనవాళ్లు ఏది నాకు జ్ఞాపకానికి రాలేదు. నీ మాటలబట్టి మాత్రే నీవు చెప్పడం నవ్వుం చేసింపాన్న, నీ కళ్ళ నీ కాలు నవ్వుం పిలుస్తాడు..."

"అవును మీ ఆనవాళ్లు మాత్రం ఏమంత సబబుగా వున్నవి. నవ్వమే పిలుస్తాడో, చుట్టే కాలుస్తాడో, ఎవరు ఎంత పొడిచేసేది నాకేమి తెలుసు. వాళ్లను మన యింటికి భోజనానికి పిలవొద్దా?"

"సంతోషంగా పిలూ, నాకు పప్పు అన్నం దొరకుతుంది. నీవు ఎవరిని భోజనానికి పిలిచినా నేవద్దనను."

"ఊత్తిని పిలవడం కాదండీ. వారికేదైనా ప్రెజెంటివ్వొద్దా?"

"ప్రెజెంటూ, తప్పతప్పు. ఈ రోజులలో అవన్నీ పెట్టి నా ప్రాణాలు తీయకు"

"అయ్యయ్యో, అలా అంటారేమండీ? వారు మనకిచ్చినపుడు మనము వారికియ్యొద్దా?

"ఏమిచ్చారు వారు మనకు"

"ఇదిగో, తొడుక్కున్నానే, ఈ పట్టు జాకీటు. వాళ్ళిచ్చినదే కాదూ! మనలను భోజనానికి పిలిచి ఇవ్వలేదూ"

జాకెట్టును ఎగాదిగా చూచాడు సరస్వతి భర్త.

"బాగానే వుంది. ఇలాంటిదే వొకటికొని, వాళ్ళ మొహాన పారేసి, ఆ వడ్డీలేని అప్పును తీర్చేయి"

"ఇలాంటిదేనా" యని నవ్వింది సరస్వతి.

"ఇలాంటిదికాక ఇంతకన్నా మంచిదివ్వాలా దీనికేమ" న్నాడు విగ్రహముతో.

"ఇది ఒక్కొక్కరికు బాగుండదండీ. ఇది కూడా తెలియదే" [illegible] నవ్వింది.

"సరే, ఏది కావాలో, అదే కొను. నీ కెంత బట్టయిచ్చినది? గజమా, క్షీ గజమా. ఆవిడ కెంత కొనాలి? గజమా, గజ్జన్నరా?"

"ఏమిటండీ, మీ మాటలు నాకేమర్థమవుటలేదు."

"అర్థమవుట లేదు! అయితే వివరంగా చెప్తా విను. నీ కిచ్చిన బట్ట ఖరీదెంతో, అంత ఖరీదులో ఆమెకెంత బట్ట అవసరమో, అంతా కొని అర్పించూ"యని "సరేనా, ఇదిగో ఈ 10 రూపాయల నోటు పుచ్చుకో. ఈ వీధి చివర ఒక బట్టల దుకాణమున్నది. అక్కడికెళ్లి కొనుక్కో"

"ఊహు నేకొనుక్కోను. మీరు నాతో రావాలి. అది కాక మీరు చెప్పేది పటాటోపం అండ్ గ్రాండుసమ్స అన్న అంగడేనా? ఆ అంగట్లో అడుగు పెట్టలేము మనము. ఒకటే గుంపు. అల్లరి. ఇక వెలలా! దగ్గరకేపోలేము. యుద్ధము ముగిసినా ఇంకా ఆ వెలలే అక్కడ. ఆ అంగడి వొద్దండి" అన్నది.

"అన్ని అంగళ్లు అంతే. యుద్ధము ముగిసినా ఆ వెలలే యన్నావు. అది నయమేకాదూ. ఆ రోజులలో అమ్మిన వెలలకన్నా ఎక్కువ వెలలేకదూ ఇప్పుడు నీకు తెలియదూ?

"ఏమన్నా చెప్పండీ, ఈ అంగడివద్దండీ. మనం టౌన్కే పోదామండీ.

"సరే, నీకు షికారు పోవలెనని వున్నది. బయలుదేరు." అన్నాడు సరస్వతి భర్త

తలవూపింది సరస్వతి.

"ఈ అంగడొద్దంటావ్ ఏమంత వెలలుంటాయి? ఇక్కడికన్నా అక్కడ అర్థో, పావలాయో తక్కువ వుంటుంది. ఈ బస్సు చార్జి నీకు నాకు ముప్పావులా కాదూ! అది మనకెంత లాభం?"

"లాభమా, జార్జిటౌన్, చైనాబజారు వొకసారి చూచి వస్తాము. ఆ అంగళ్లు కలకల లాడుతు ఎంత బాగుంటాయండీ. ఈ వేళంతావున్నా ఇంకా అక్కడే వుండాలని వుంటుంది. అంగడి వదిలిపెట్టి రావాలెనని వుండనే వుండదు."

"అప్పుడు మరి, మీబోటి వాళ్లంటే సరా, వాళ్ళకు వ్యాపారం! ఆ అద్దాలు ఆ దీపాలు వాడి అలంకరిస్తూ వుంటారు. పదిమందిపోతే ఒకరైనా కొనరా? అదే చాలు వాళ్ళకి"

"పదిమంది కొనరా! అందరూ కొంటారు. ఎక్కడనో నాబోటివాళ్లు ఒకరిద్దరుతప్ప"

"సరే, అసంతృప్తి బయలుదేరింది. ఇక ఆలస్యం పనికి రాదు. పద త్వరగా, "యని తొందరపెట్టాడు భర్త.

ఇద్దరూ బయలుదేరారు గడపదిగుతూ "అర్థరూపాయ కోసం అంతదూరం పోవాలా యన్నాడు"

"ఆ అర్థరూపాయైనా ఎందుకివ్వాలి?" యని ఆర్థిక మంత్రి పన్నులు విధించేటప్పుడు చూపే ఉత్సాహంతో యన్నది.

ఈ ఎనిమిదణాలకోసం వాద ప్రతివాదములైనవి. కడ పట సరస్వతే గెలిచినది. అర్థ రూపాయ మిగులుతుందా మని దానికే బయలుదేరారు. అయినా అక్కడికీ ఇక్కడికి ఎంత తేడావుంటుందో తెల్సుకోవాలెనని యిద్దరికి బుద్ధి పుట్టినది ఎందుకో?

కనుక ముందు పటాటోపం వారికొట్లో దూరారు. దాని లోనే వున్నది వారి అంగడి. కొట్లో ప్రవేశించగానే సరస్వతి, తనకు నచ్చిన సిల్కు ఒకటితీసినది. Fixed Price 9 14-9 Per yard అన్న కాగితపు చీటి కట్టియున్నది. Fixed Price అంటే బేరంలేదు. పేచీపెట్టకూడదు. ఖరారు వెల యనేగా. ఈ దంపతులు బట్టకొనలేదు. కాని వెల మాత్రం మనసులో పదిల పరచుకొని బయటికి వచ్చారు. అంగట్లో వారు "ఏమండీ, ఏమి కొనలేదే"యంటే "మళ్లా వస్తాము. రేపో, ఎల్లుండో "యన్నారు ఇద్దరు ఏక గ్రీవముగా.

ఇంట్లోనరకాని గడప దాటిన వెనుక మగవారు వాళ్ళ పొదుపు చూపిస్తే (పొదుపంటే మాటలతో నేలెండి) వాళ్ళ పరువుపోతుంది. ఇంట్లోలాగ మాట, పైమాట వస్తే ఇంకే మంది. అనకూడదు కాని ఆడదానికి మగవానికన్న గొంతుక పెద్దది. కనుక పిండివారం ఎక్కువలేని వ్రాయాయని చూసు కొను జనం. అప్రతిష్ట రాదారు.

ఇవన్నీ తెలిసిన మనుషులే కనుక సూక్ష్మరీత్యా "గోప్య కొంత నడచు గోప్యం" అన్న నడకలవారు.

ఇద్దరూ బస్ స్టాండ్ చేరుకున్నారు. బస్ లేదు. ఒక సైకిలు రిక్షా క్యూ నిలిచియున్నది. ఆ క్యూ చూస్తే గుండె దడ దడ లాడింది. ఒక్క ఒక టాంగావాడ్ని పిలిచి చేసుకొని కొనుడు వచ్చి కూర్చున్నారు.

బండిలింపాగా నడుస్తూవుంటే ఊర్మిళ గాసంతాపు ఒక భోజనానికి పిస్తే, పంతులు, ఇంటి వంటలు ఏమేమి చెయ్యాలో ఇంకా ఎవరెవరైనా పిలవాలో వాళ్లను ఎలా మెప్పించాలో, ఇట్టం చేసుకుంటూ వస్తారు భార్యా భర్తలు.

"పాయసమా, బాదాంఖీరా, ఉర్లగడ్డలా, క్యాబేజా?" యంటూ పోయింది ధోరణి.

అది బాగానేవుంటుంది సుమండీ! పాఠకులకు తెలియ దేమిటి?

తిన్నగా చేరుకుచేరారు. బండి కుదుపులతో ఒళ్లుబాగా నలిగినది. అలసటైంది. కనుక కాఫీ హోటలుకు వెళ్లారు. ఇద్దరు హోటలునుండి బయటికివచ్చేసరికి పర్సులో 2-14-0 తగ్గినది. అంగడి అంగడికి వెళ్ళి ఊర్మిళకు తగ్గ ప్లాస్ పీస్ చూచారు. దాని మీద వెల చూస్తే 9-2-9 అని అంటించి వున్నది.

సరస్వతి భర్త ముఖము చూచినది. "చూచారా 12 అణాలు మిగులేకదా "అన్న భావంతోవున్నదా ముఖం.

ఆ బట్ట ఒకగజం చింపించి పుచ్చుకొన్నారు. అంతటితో పూరుకోక సరస్వతి 'మీ అంగడి కన్న మైలాపూర్‌లో వున్న పటాటోపం వారి కొట్లో ముప్పావులా ఎక్కువ చెప్పారండి"

బట్టలషాప్ప ఆయన "అవునమ్మా అందరికొట్లు కన్న మా కొట్లో వెల ఎప్పుడు సరసమే. మాకు మనుష్యులు మర్యాద

కావాలికాని, డబ్బు ప్రధానం కాదు. ఫలానా వారింగడని వచ్చినవారు పనిమంచికి చెప్పి పంపేటట్టు వుండాలి. కనుకనే, ఈ వూళ్ళో పెద్దమనుష్యులందరు మా కొట్టుకే వస్తుంటారు"యని ఒక లెక్చరిచ్చి సరస్వతినికూడ ఇకముందు తమ కొట్టు తప్ప రెండవది కన్నెత్తి చూడకూడదని ఆర్డర్ ప్యాస్ చేశాడు.

ఆ బట్టకొనుక్కొని ఇంటి ముఖం పట్టాం మళ్ళా బస్ స్టాండ్ కొచ్చాం. ఒకే జన సముద్రం. చోటు దొరుకునో లేదో, యని సందేహిస్తూవుంటే స్నేహితుడు, సుబ్బారావు కారు, వారి ప్రక్కనవచ్చి ఆగింది.

"ఏమి బ్రదర్ ఇక్కడున్నావ్. ఇంటికేనా, ఎక్కు" అని కారు తలుపు తీశాడు.

సరస్వతి బస్ చార్జి మిగులేకాక, దొసుదర్జాగా కారులో వెళ్ళడం ఇంటి ముందర కారునుండి దిగితే తన స్నేహితులు ఇరుగు పొరుగు వారు చూచి ఆశ్చర్య పోవడం, ఒకవేళ చూడకపోతే, వస్త్రాలు చిన్నెలు కల్పించి, తన గొప్ప చెప్పుకొనుటకు కవకాశము కలుగకదాయన్న తలంపుతో భర్తవైపు చూచినది. భర్తవద్దని సైగచేశాడు.

ఇదికనిపెట్టి సుబ్బారావ్ "ఏమి ఇంటికికాదా, సినిమా షో ఏమన్నా వుందా"యన్నాడు.

సరస్వతి భర్తకు గుండెలో రాయిపడ్డది. ఇపుడితను సినిమాకు తీసుకెళ్ళమంటా డేమోయని "ఆ, సినిమా లేదు, మన్నులేదు, సినిమాకు వెళ్ళడంలేదు. ఇంటికి కాదు ఇంకొక చోటికి వెళ్ళాలి. నీవు వెళ్ళి నీ పనిమాచుకో, మేము వెళ్తాం"అన్నాడు. భర్తను వెనుకనుండి గిల్లినది సరస్వతి. "అయ్యో, డబ్బుకూడ పెట్టుకోవడం తెలియదు కదా" యన్న భావాన్ని సూచించింది ఆ గిల్లడం.

"మా ఇంటిమీదే పోతున్నాను. చీకటైంది కూడా. ఇంకెక్కడికి వెళ్తారు? బస్సులో చోటు దొరకడం కూడా కష్టమే, కనుక ఎక్కండి"అన్నాడు సుబ్బారావు.

సరస్వతి మాత్రం కాదనేక, మొదట వచ్చు సాధింపులకు [illegible] సరస్వతి భర్త సమ్మతించాడు. కారులో కూర్చున్నారు దంపతులు. బండి కదిలినది. తుర్రుమని కొంతదూరం పోయి, పెట్రోల్ బంక్ దగ్గిర ఆగింది. పెట్రోల్ పోయగానే సుబ్బారావ్, జేబులు తడువుకొని, పర్సు తీశాడు. పర్సు అంతా పరికించి, తెల్లమొహం వేసి "బ్రదర్, ఒక 10 రూ చేబదులియ్యి. డబ్బు చూచుకోకుండా పెట్రోల్ పోయించా నన్నాడు.

ఏమిటి చేయడం? బజారు కెళ్ళడం అంటే, ఎప్పుడు కొంత డబ్బు అధికంగానే తీసుకెళ్ళడం సరస్వతి భర్తకు అలవాటే. ఏమంటే ఒకటికొనబోయి పదికొనడం సరస్వతి కలవాటు కాదనలేడు భర్త. కనుక ఇప్పుడు చేతిలో డబ్బున్నది. కారులో ఇంటికి వెళ్ళడానికి ఇచ్చుకొన్న అద్దెలాగ పది రూపాయ లర్పించాడు.

"ఒకే, రేపు ప్రొద్దున, పది గంటలలోపల నీ డబ్బు పంపించేస్తా"నని, చిల్లర తనచేబులో వేసుకొన్నాడు.

సరస్వతి, భర్త జోరుగా వారింటి ముందర దిగారు. ఎవరైనా, ఒకరిద్దరన్నా చూడరాయని కొంత ఆలస్యంచేసే దిగినది సరస్వతి. వందనములు చెప్పారు. బండి తుర్రుమని పోయినది.

రోజులు గడిచిపోయినవి. సుబ్బారావ్ డబ్బుపంపలేదు. ఆ డబ్బుకోసమే తన్నంత బలవంతపరచి కారులో తీసుకొచ్చాడేమొ యని యనుకోక పోలేదు సరస్వతి భర్త.

ఊర్మిళా, నరసింహారావులను ఆహ్వానించి, విందుచేసి, రవికల గుడ్డపెట్టి తాంబూలంఇచ్చి పంపారు. ఆ బట్టచూచి ఊర్మిళ సరస్వతిని. "ఇది పటాటోపం వారి కొట్లో కొన్నారా"యన్నది.

"లేదు. ఇక్కడే అన్యాయపు వెలలు టౌనులోకొన్నాను ఇక్కడికన్నా 12 అణాలు చౌక. నే నిక్కడ కొనలేదని మా వారికి గుర్రే"యన్నది.

12 అణాలకోసం పట్నం వెళ్ళాలా యని వాదించాడు. ఈ మాటలు సరస్వతి భర్త వినలేదు. వినివుంటే ప్రెజంట్ ఇచ్చిన బట్టవెల వ్యాఖ్యానము చేస్తారాయని, ఆ రోజు

# బ్లౌస్ పీస్

ఈ బట్టవల్ల తనకెంత నష్టం కలిగినది జ్ఞప్తికివచ్చి కోపం వచ్చేదే.

కాని ఊర్మిళ, సరస్వతిని మెచ్చుకొని, “అయి నా మీకేమి ఓపికండీ” యని కొంతపొగడి, ఆవిడ భర్తకు అంత మాత్రం తెలియక పోయెనే యని కొంత వేళా కోళం చేసింది.

ఆడవాళ్లకున్న తెలివి, పొదుపు, మగవాళ్ల కుండదని, అయితే ఆడది అన్నీకొని, డబ్బుపాడు చేస్తుందని మగవాడాడి పోస్తాడని ఒక రిజల్యూషన్ ప్యాస్‌చేశారు ఇద్దరు.

తమాషా, ఏమంటే వాళ్ళ లెక్క ప్రకారం, సరస్వతి భర్త 12 అణాలు వృధా ఖర్చు చేయపోతే సరస్వతి తప్పించిందని. అయితే అయిన వ్యయ మెంత? అది ఎవరి వలన అయినది. ఒక్క నిమిషమాలోచించండి.

లెక్క చెప్తాను చూడండి.

| | |
|---|---|
| టౌనుకు పంపే ఖర్చు | 0-14-0 |
| హోటేలు ఖర్చు | 2-14-0 |
| ఖిళ్లీలు | 0- 1 -0 |
| పూలు | 0- 3 -0 |
| మళ్లీ ఇంటికిరాగ స్నేహితుని కల్పించినది. | 10-0-0 |
| మొత్తం | 14-0-0 |

ఒక గజం (రవిక గుడ్డకు) ప్లాస్టిక్‌కు పెట్టుకాక అధిక వ్యయం 14 రూపాయలు.

ఇది కూడికంటారా? కాదూ,

కాదంటే సరస్వతి ఒప్పుకోదే! ఏమి చేయమంటారు. 12 అణాలు కూడికే యంటుంది, ఎన్నిమార్లు ఎన్ని విధాల బోధించినా!

“ అక్క ”





ఆంధ్ర మహిళాసభ స్త్రీ, శిశువుల సంరక్షణశాలకు శంకుస్థాపన చేయవచ్చుచున్న గౌ॥ రాజకుమారి అమృతకౌర్‌గారిని, ఆహ్వానించుచున్న శ్రీ దుర్గాబాయమ్మగారు.

# ఏం న్యాయం? ఏం ధర్మం?

* శ్రీమతి ఎ. లక్ష్మి *

కుడువ కూడులేదు
తొడుగ వలువలేదు
నిలువ నీడలేదు
ఇదిఏమి ధర్మం?
ఇదిఏమి న్యాయం?

* *

చుక్కపొడచిన దాది
ఒక్క ఎద్దులతోన
ఒక్క రెక్కమీద
దుక్కి దున్నుతాము.
వాన లొచ్చినా
వరద లొచ్చినా
వడగాలు వేసినా
సుడిగాలి తిరిగినా
ఎండనక, వాననక
పగలనక, రేయనక
చెట్టనక, పుట్టనక
ఒళ్ళేమి దాచకుండ
ఓపికంతా మూటకట్టి
అశువులన్ని ధారపోసినా
కూడులేదు, నీడలేదు
ఇది ఏమి ధర్మం?
ఇది ఏమి న్యాయం?
తెల్లవారక మునుపే

* *

మిల్లుకూత వినగానే
పిల్లజెల్ల విడిచి
ఇల్లు వాకిలి వదలి
కూతంత లేటువు తేను
కూకలేస్తాడు సేటంచు
పరుగు పరుగుపోయి
ఇనుప రక్కసి కడుపులో
ఇట్టెదూరి పోతాము.
చక్రాల పళ్ళమధ్యను
సందెచీకటి వరకు
చావనక బ్రతుకనక
చాకిరంతాను చేస్తాము.
ఇంతంత చేసినాగాని
కూతంత కరుణజూపడు
కుడువ కూడులేదు
తొడుగ వలువలేదు
నిలువ నీడలేదు.
లేదా మరియిల న్యాయం
కడతేర్చగ మాభేదం?
ఇది ఏమిధర్మం?
ఇది ఏమిన్యాయం?
ఆరుగంటల కేను

* *

పరుగు పరుగుబోయి
పదిగంటల దాక
బడిలోని పిల్లలకు
గొంతుకంతా చించి
ఎంతేని నేర్పినా
కడుపు నిండాబోదు
వడి కప్పగాలేము
ఇది ఏమి ధర్మం?

* *

# ఏం న్యాయం? ఏం ధర్మం?

ఇది ఏమి న్యాయం?
కాగితం మీద
కలము పెట్టి
సంతకమేమొ, చీ
మంత బరికితే
వేలకు వేశావో

కలికి చూస్తావు
కూడులేదు, నీడలేదు
లేదా మరి కలన్యాయం
ఇది ఏమి ధర్మం?
ఇది ఏమి న్యాయం?

* *

★

# ఆమె పతివ్రత

డిసెంబరునెల ఆంధ్ర మహిళలో "పేరాల విజయలక్ష్మి" రచించిన "ఏది పతివ్రత" యను పద్య రూపక ప్రశ్నకు జవాబు.

ఆ ముప్వురును పతివ్రతలే యనందగు. అందులో పరలోకగతుడైన పతిన్ హృత్పథంబున నిల్పి యేకంబుగ బోక స్మరించు సతీలలామయే ముప్వురలోను అగ్రస్థానము వహించినది. ఈ భావమును ఈ క్రింది పద్యములు విశదీకరించును.

నారీరత్న మొకర్తె "ఆంధ్ర మహిళా" విజ్ఞాన సత్పత్రికన్
సారస్ఫూర్తిఁ బతివ్రతెద్ది యని వాచాధారతన్ జూపె వే
సారుల్ నా యభివందనంబులు సమర్పింతున్ గదే నాతి భా
షారక్తిన్ గనిగడు మెచ్చుకొంచు కడునుత్సాహంబు పెంపొందనే
నీరీతిన్ మదిఁ దోచినట్టుల జవాబీయంగ నూహింతు నా
మూరాకారుని సాధ్వి, క్రూరుసతి, హృన్మార్న్యున్ గతాత్మున్ కడున్
గారాబంపుప్రియున్ దలంచి కడుశోకంబందు తన్వంగియున్
ధీరాగ్రేశరులౌపతివ్రతలు, పాతివ్రత్యముంజూడగా
నారీసంతతి భర్తలేమిఁ గనలేకన్ చిత్తచాంచల్యతన్
జారత్వంబును బోక నుంటకడుదుస్సాధ్యంబు; దుంఖించితాఁ
శేరంజాలక తద్దయత్మాత్ముని, మనఃసీమన్ విచారించు, నా
కారంబున్, వహియించు తథ్యముగ నగ్రస్థానమున్ ముప్వురిన్.

ఇ. రామకృష్ణ రాజా,

★

# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి వరిని సుభద్రమ్మ

## X

## అలవాట్లు

మల మూత్ర విసర్జన: మల మూత్ర విసర్జన విషయంలో శిశువుకు శిక్షణ అవసరం కాని అతి సున్నితంగా, నెమ్మదిగా ఇవ్వాలి. తనకేదో పని ఉందనీ, ఆలస్యమవుతుందనీ, తల్లి శిశువును ఆతురపెట్టకూడదు. సామాన్యంగా శిశువులు స్తన్యపానం చేసిన వెంటనే, లేక కొంత సేపటికో మలమూత్ర విసర్జనము చేస్తారు. మొదటినుంచే అనగా కొన్ని నెలల శిశువుకు సంతృప్తిగా స్తన్యపానం చేసిన తరువాత ప్రతి పర్యాయము ఒక నిర్దిష్టమైన స్థలంలో కాని, 'కమోడ్' మీద కాని (ఇది ఒక కుర్చీలాగుండి, మధ్య ఒక పింగాణి పాత్ర వుంటుంది.) కూర్చో పెట్టాలి. ఈ విధంగా చేయుటవల్ల, క్రమేణ, నిర్దిష్టకాలంలో నిర్దిష్ట స్థానంలో, మల విసర్జన చేయుట బిడ్డకు అలవడుతుంది. కూర్చో పెట్టిన వెంటనే బిడ్డ దొడ్డికి పోనిరొడల తల్లి విసుకు చూపెట్టరాదు. కొంత సేపు వేచివుండుట అవసరం. అయితే, చాలసేపు దాక అలాగే కూర్చోపెట్టరాదు. శిశువులను పదియేళ్ల పిల్లవాళ్లలాగు ప్రవర్తించాలని నిరీక్షించుట అవివేకం. మొగ్గను బలవంతంగా విచ్చులాగు చేసినట్లు అవుతుంది.

సామాన్యంగా, కొందరు పిల్లలు దొడ్డిని నిర్ణయించిన చోటుకు తీసుక వెళ్ళగానే తల్లి సూచనను గ్రహించి మల విసర్జన చేస్తారు. కొందరు అలా చేయరు. అలాంటి శిశువును నిర్బంధించి చేయించుట పొరబాటు. ప్రతి విషయంలోను ఈ విధంగా నిర్బంధపెట్టి బిడ్డలను పెద్ద వారిలాగు ప్రవర్తించేలాగు చేసినచో, వారు చిన్నప్పుడెంత పరిశుభ్రత, క్రమము, మొదలైన అలవాట్లు నేర్చుకొన్నప్పటికీ, పెద్దవారైన తరువాత కూడ ప్రతియొక్క విషయంలోను నిర్బంధం అవసరమవుతుంది. అనగా, ప్రతి చిన్న విషయంలో పరి తం చెప్పవారి సలహా ప్రకారం [illegible] స్వయంగా ఏ కార్యమూ చేయలేకున్నారు.

కనుక తల్లి శిశువు యొక్క వయస్సును బట్టి తెలివి తేటలతో శిక్షణ ఇవ్వాలి. శిశు మానసిక వృద్ధికి ఎంతకాలం అవసరమో అంతకాలం మిచ్చి, తల్లి తొందరపడక గాని, ఏ విషయంలోను తను చెప్పినట్లు తూ, చా తప్పకుండా బిడ్డ వినయ విధేయతలతో నడుచుకోవాలని నిరీక్షించటం చాల పొరపాటు. భయపెట్టి, నిర్బంధించి బిడ్డ విధేయతతో నడుచుకొనేలాగు చేస్తే, బిడ్డలో స్వశక్తి స్వప్రయత్నం, మున్నగునవి పెరగవు. శక్తిహీనతకు దారి తీస్తుందన్న మాట.

మొదటు మొదట, శిశువు తల్లిచేసే సూచనల్ని గ్రహించుతూ మలవిసర్జన చేసినను, రాను రాను పెరిగి నడిచే కాలంలో, అంటే రెండు మూడేళ్ళ వయస్సులో తల్లి మాట వినరు. నిర్ణీతకాలంలో దొడ్డికి వెళ్లుటకు నిరాకరిస్తారు. ఇలా నిరాకరించటానికి అనేక కారణాలుంటాయి. పట్టుదల, నిరాకరించు స్వభావం, భయం, కోపం, తమ్ముని మీదనో, చెల్లాయి మీదనో అలుక, అసూయ, ఆశాభంగం మున్నగు మానసిక ప్రవృత్తులవలన నిర్ణీతకాలంలో మల విసర్జన చేయలేక పోతారు. అనగా, శరీరానికి మానసిక తత్వానికి ఎంత అవినాభావ సంబంధమున్నదనే విషయం విదిత మవుతుంది. కాబట్టి, బిడ్డకు కలిగే కష్టాలను, ప్రతిబంధకాలను తల్లిఎంతో ఓర్పుతో తొలగించ ప్రయత్నపడాలి. విసుగు, కోపం, చూపెట్టరాదు. అలా వీలుకానప్పుడు, సూచించి, స్వేచ్ఛగా విడిచిపెట్టుట ఉత్తమంగాని బిడ్డను నిర్బంధించరాదు. క్రమేణ బిడ్డకు తల్లియందు ప్రేమ విశ్వాసాలు పెరిగిన కొలది, తల్లి సూచనల్ని గ్రహించటం, నేర్చుకోటం మున్నగు గుణాలు పట్టుబడుతాయి.

వ్రేలు చీకే అలవాటు: కొందరు శిశువులు పుట్టిన కొన్ని రోజులలోనో, నెలల్లోనో బొటన వ్రేలును చీకి సాగుచేయడం మొదలుపెడతారు. మరి కొందరికి ఈ అలవాటే పట్టదు. అయితే ముఖ్యంగా మన దేశంలో, తల్లులు కొందరు అజ్ఞానంవల్ల తమ పనులకు అంతరాయం కలగకుండ వుండటానికి పిల్లలు ఏడవకుండ బిడ్డ నోటిలో వ్రేలు వేసుకొని చీకే అలవాటు చేయించుటకూడ కలదు. పెద్ద పెరిగిన తరువాత కూడ వ్రంకి పోతుందని కాని, బిడ్డ వ్రేలు వుండుపడి పోతుందని సన్నగిలిపోతుందని కాని, నోటి ఆకారం చెడిపోతుందని కాని వారెరుగరు. ఇక బిడ్డయొక్క మానసికాభివృద్ధి కుంటుబడుతుందనే విషయం అసలే ఎరుగరు. విద్యా విజ్ఞానాలున్న తల్లులేమో ఈ అలవాటును తామే చేయరు కాని, కొందరుబిడ్డలే స్వయంగా ఈ అలవాటును చేసుకొని వుంటే అలజడిపడి పోతారు. పైగా ఈ అలవాటు గడ్డు సమస్యగా ఎంచుతారు. కాబట్టి వీరు శిశువునకీ అలవాటును తప్పించుటకోసం మోటుతనంతో ప్రయత్నిస్తూ బాధించుతారు. ఇది వీరనుకొన్నంత గడ్డు సమస్యకాదు; పరిష్కరించరానిది కాదు.

సాధారణంగా బిడ్డ తనకు ఆకలి అయినప్పుడు, స్తన్యం జ్ఞాపకమొచ్చినప్పుడు లేదా, నిద్ర వచ్చినపుడు తన వ్రేలును చీకుతుంది. సంతృప్తిగా స్తన్యపానం చేయని సందర్భాలలో, తనవాంఛ తీరని సమయాల్లో, లేక చీకాకు కలిగి నప్పుడు, వ్రేలును చీక నారంభిస్తుంది. తల్లి కారణాల్ని కనుక్కొని అదినుంచే ఆపకపోతే అది అలవాటు పడిపోతుంది. కనుక, 'ఈ అలవాటు ఏ కారణం చేత అలవడింది'? ఆరంభ దశలో ఉన్నదా, ముదిరి పోయిందా? ఏ విధంగా తప్పించాలి అనే విషయాల్ని తల్లి చక్కగా ఆలోచించి' బిడ్డకు సహాయపడాలి. కాని కొట్టటం, బెదిరించటం మున్నగు మోటుతనం పనికిరాదు. పైగా హానికరం కూడాను. ఈ అలవాటు కొందరికేగాని అందరికీ అలవడదు. ఈ కొందరికైనా చాలకాలం ఉండదు. అలా ఉన్నదంటే ఏవో బలమైన కారణాలుండాలి. వానిని తొలగించితే, ఈ అలవాటు తనంతటనే అంత మొందుతుంది.

శిశువు పుట్టిన కొన్ని రోజుల్లోనో, కొన్ని నెలల్లోనో తన బొటన వ్రేలిని నోటపెట్టుకొన నారంభించితే, తల్లి వెంటనే శిశువు చేతులు నోటి కందకుండ నదుపాయాలు సున్నితంగా చేయాలి. ఈలా చేయటంలో శిశువు కెంతమాత్రం బాధ, చీకాకు కలగకుండ మెళకువతో చేయాలి.

బిడ్డలందరికి ఒకే విధమైన స్వభావముండదు. వాళ్ల చేతుల్ని పట్టుకొంటేకాని, ఏ మాత్రం బంధించినట్టు కనిపించితేగాని, కొందరు వెంటనే ఎదిరించుతారు. ఏడుస్తారు. అలాంటి శిశువుల్ని లొంగదీయ చూడటం పొరబాటు. బిడ్డ చైతన్యంలేని యంత్రంకాదు. మనలాగు దానికీ మానసిక జీవితమనేది ఉన్నదనే విషయాన్ని పెద్దవాళ్లు విస్మరించ కూడదు. ఈ అలవాటును తప్పించటానికని శిశువు చేతుల్ని ఏదో విధంగా కట్టిపెట్టితే, ముఖ్యంగా ఎదిరించే బిడ్డల విషయంలో, వ్రేలుచీకు అలవాటువల్ల శారీరకంగా కలిగే హాని కన్న, ఎక్కువ హాని మానసిక జీవితానికి కలుగుతుంది. ఏలాగంటే, ఎట్టి అలవాట్లుగాని, నడతగాని కేవలం శారీరకమేగాదు. మానసిక తత్వానికి సహితం సంబంధించి వుంటాయి అనే విషయం ఎరగాలి. కనుక, అలా మన ఇష్ట ప్రకారం బిడ్డలు నడుచుకోవాలి అని వారిని నిర్బంధించి, బాధించి లొంగదీసిన యడల వారి మానసికాభివృద్ధి కుంటు పడుతుంది. అంతేగాదు కోపోద్రేకము అధికమవుతూ నర ములకు సంబంధించిన వ్యాధులు సంభవించ వచ్చును. కాబట్టి తల్లి శిశువువ్రేలు చీకు అలవాటును విచక్షణ నుపయోగించి మెలకువతో తప్పించాలి.

శిశువు ఆకలికి అలమటించి పోకుండ జాగ్రత్తగా మెలగాలి అంటే శిశువు ఆకలికి ఏడ్చిన వెంటనే తల్లి స్తన్యమివ్వాలి. ఆకలితీరి సంతృప్తి కలిగేదాక ఇవ్వాలి. అప్పుడే బిడ్డ కడుపునిండ పాలుత్రాగి, ఆకలి తీర్చుకొంటూ, తల్లి ప్రేమనుగ్రోలి, తన ప్రేమతృష్ణను తృప్తి పరచు కొంటుంది. ఈ విషయాన్ని తల్లి పదిలంగా మనస్సున ఉంచుకొని బిడ్డకు తనతో ఆడుకొనే వాంఛ తనివిదీరువాక, బిడ్డ వెంత వుండి ఆడుకోనివ్వాలి.

బిడ్డ నిద్రించబోయ్యే సమయంలో, మేల్కొనే తరుణంలో తల్లి చెంతనేవుండి అలన పాలన చేస్తూ ఆడించాలి. ఈ విధంగా తల్లి మొదటినుంచి మెలకువతో మెలగినట్లైతే

అసలు ఈ అలవాటు అలవడదు. అలవడినా అతి సులభంగా తప్పించవచ్చును.

బిడ్డకు సంవత్సరన్నర, రెండేళ్లు అయిన తరువాత కూడ ఈ అలవాటు వుండిన యెడల తల్లి, బిడ్డ ఆరోగ్యానికి హాని చేయని మిరాయిని చీకటానికి చేతబెట్టి ఈ అలవాటును తప్పించాలి. కాని, నిద్రించేటప్పుడుగాని, కునుకుపట్టేటప్పుడుగాని ఇవ్వకూడదు. పూర్తిగా మేల్కొన్న సమయంలోనే ఇవ్వాలన్న మాట.

బిడ్డకు తనచుట్టునున్న పరిసరాలయందు, ఆట పాటల యందు ఆసక్తి అధికమైన కొలది, ఈ అలవాటు క్రమక్రమంగా తొలగి పోతుంది.

కాబట్టి బిడ్డ నిద్రనుండి మేల్కొనే సమయంలో తల్లి బిడ్డ దగ్గరనేవుండి లాలించుతూ ఆడుకోవాలి. లేదా, తోటి పిల్లల్ని తీసుకవచ్చి వాళ్ళతో ఆడుకొనేలాగు చేయాలి. ఎగిరే పక్షులు, గాలికి అల్లలాడే చెట్లఆకులు మున్నగు వాటివైపు బిడ్డ దృష్టిని మరలించేలాగు ప్రయత్నించాలి. రంగు రంగుల కాగితాలలో చేయబడిన ఆటవస్తువుల్ని ఎగర వేయుటమో, ఆటవస్తువులను బిడ్డ ముందుపడవేసి బిడ్డతోపాటు తనుకూడ ఆడుకోటమో చేయాలి. పాటపాడటం, చప్పుడు చేసే ఆటవస్తువులను క్రిందపడ వేయటం మున్నగు వాటిని చేయాలి. ఈ రీతిగ ఆటపాటలతో బిడ్డ గమనాన్ని మరలించటానికి ప్రయత్నించాలి.

వ్రేలును చీకు అలవాటుగల బిడ్డ నిద్రనుండి మేల్కొంటుండగానే వ్రేలును నోటిలో పెట్టుకొంటుంది అనే విషయం జ్ఞాపకముంచుకొని తప్పని సరిగ, తల్లి బిడ్డ చెంత వుండి, అనేక విధములయిన ఆటపాటలవైపు బిడ్డ గమనాన్ని మరలించి అలవాటును తప్పించాలి. అయితే వ్రేలును నోటపెట్టుకొన్న తరువాత సయితం, నిర్బంధంగా నివారించక, బిడ్డగమనాన్ని సూక్ష్మంగా ఆట పాటల వైపుకు మరలించటానికి యత్నించాలి.



# ఏది విచిత్ర వివాహం?

డి. వి. ఆర్. భాస్కరశాస్త్రి గారు

అతను 'సృష్టి' ఐదు సంవత్సరాల వవుతుంది. మనిషి గాలేస్తే ఎగిరిపోయేలాగ ఉంటాడు. తల్లి ఒకసారి అతన్ని ప్రక్క యింటికి తీసికొని వెళ్తుంది. ఆ ఇంటి చుట్టూ ఫల వృక్షాలు పూల మొక్కలు ఎన్నో ఉంటాయి. "ఆడు కొంటా" నంటూ అతను పూలమొక్కల్లోకి పరుగెత్తుతాడు. పూలను చూస్తే శరీరం గగుర్పాటు పొందుతుంది! అంత సంతోషం దేనికో! విస్తుపోయి, దిగ్భ్రమతో పూలకేసి చూస్తున్నాడు. తల్లి కేక వేస్తున్నా వినబడటంలేదు. ఏమి తలుస్తున్నాడో లోపల! తన్మయత్వము పొంది, సూర్య రశ్మిలో, పూలమధ్యనున్న 'అతని' వద్దకు పరుగెత్తుకుంటూ తల్లివస్తుంది, చూచింది, నిర్ఘాంతపోతుంది...కొడుకుప్రక్కన బాలిక నీడ!...గొను తొడుక్కొని చిన్న జడతో... తల్లి కొడుకేక్కేసి చూస్తుంది...అతని వంటిమీద లాగూ, చొక్కా, తలమీద క్రాపు...ఏమీ అర్థం కాదామెకు... వెంటనే కొడుకు నెత్తికొని తండ్రి దగ్గరికి 'రివ్యూ' మంది...

తండ్రి ఇట్లా అన్నాడు. "ఇక మీద కుర్రాణ్ణి బైటకు పగలు రానివ్వకు. వాడికి పది పదహారేళ్లు వచ్చాక మ్యూజియం వాళ్ళకిద్దాము. మన కూడు గుడ్డలకు లోటుండదు."

ఒకనాడు 'అతను' మ్యూజియం యజమానితో ఇట్లా మాట్లాడాడు. "నేను ప్రేమించినాను."

నీ నీడను కాదుకదా?"

"కాదు"

"మరెవర్ని?"

"రోజా, సంగీతం నేర్చుకోడానికి వెడుతుందే, ఆ పిల్లని. నాకు సంగీతమంటే చాలా యిష్టము."

"సరే నీ యిష్టము"

'అతనా' పిల్లని కలిసి కొంటాడు. తన నీడనుగూర్చి మాత్రంచెప్పడు...మాట్లాడుతాడు...ఆమె అంగీకరిస్తుంది.

"నా తండ్రి నడుగు"...

అనుజ్ఞయింది...వివాహమయింది.

అతను యువకుడు కాగానే, అతని నీడ యువతయింది. అంచేత పగలు బైటకు రాక, భార్యకు కనపడకుండా, గదిలో కూర్చొని "పని"లో ఉండేవాడు. రాత్రి మాత్రం భార్యను కలసికొనేవాడు. అతని నడతచూస్తే, అర్థంకాక, భార్యకు మనోవ్యాధి బయలుదేరింది...ఆమె కృశిస్తుంది... నశిస్తుంది...

"నేను మళ్ళీ వివాహ మాడుతా" నంటూ అతను గది లోంచి, బైటకు వెడతాడు. తపన బాణాలనుండి తన్ని రక్షించుకోడానికి భూదేవి అతన్ని డాలుగా పట్టింది... 'అతను' నీడతో, తన స్త్రీ నీడతో, ఇట్లా అన్నాడు. "నీవూ నేనూ పుట్టి నప్పటినుండి కలసి ఉన్నాము. మన మిద్దరం వివాహమాడదా" మన్నాడు. వివాహ మవుతుంది. 'ఇద్దరూ' ఊరువిడచి, నిర్జన ప్రదేశానికి, పర్వతాలమీదికి జలప్రదేశాలకి, నదీగర్భంలోకి, ఆకాశంమీదికి, ప్రకృతిలోకి వెళ్లతారు. ప్రసవవేదన 'అతను' నుభవిస్తాడు. తేజోవంతు లైన, ముముక్షువుల అతనిలాంటి బిడ్డలు ప్రపంచమంతా వ్యాపిస్తారు...అతను మృతుడైనా, బిడ్డలమరులౌతారు!

ఆ 'అతనే' కవి. ఆ స్త్రీ నీడే, అతనిలో ఉన్న స్త్రీ భావాలు, గుణాలమూర్తి. ఆ బిడ్డలే కావ్యాలు. స్త్రీ పురుషులు లేనిదే వాఙ్మయమేది?

(ఆంగ్లమునుండి)



# గ్రంథసమీక్ష



## మహేంద్ర జాలం

అనువాదం : బి. విశ్వేశ్వర రావు. ప్రతులకు 'బాబు' కార్యాలయం, కెతిడ్రల్, మదరాసు 6.

మన దేశంలో పిల్లలకు రకరకాల పేర్లతో ఎన్నో పుస్తకాలు వెలువడుతున్నవి. వాటిలో పిల్లలకు కావలసిన విజ్ఞానం లభిస్తుంది. పిల్లలకు ఎక్కువగా కథలు వినడం అలవాటు. ప్రతి ఇంటిలోను పిల్లలు భోజనం చేసేటప్పుడు నిద్రపోయే ముందు తల్లిని కథలు చెప్పమని వేధిస్తారు. కథలు చెప్పితేగాని భోజనము చేయమని మారాం చేస్తారు. అది వాళ్లకు సహజం. పిల్లలకు కథలంటే ప్రీతి కనుక మనం వాళ్ల మనస్తత్వాలకు సరిపోయేటట్లు రకరకాల కథలు వ్రాసి ప్రచురింప జేయాలి. అవి విజ్ఞానంతో కూడినవై యుండాలి. కేవలం తమాషాగా ఉండకుండా వాటిలో దేశభక్తి, రాజభక్తి, నీతి, ధర్మం మొదలయిన చక్కని ఉద్దేశాలతో కూడినవై ఉండాలి. పిల్లలు చిన్నవాటినుండే "దేశభక్తి" అనే విషయాన్ని తెలిసికొని ఉండాలి. పిల్లలకు ప్రథమ గురువు తల్లి. ఆటు పిదప గురువు ఉపాధ్యాయుడు. విజ్ఞానం కలుగజేసేవి పుస్తకాలు. కనుక పిల్లల విజ్ఞానాన్ని అభివృద్ధి చేయాలని అనుకుంటే చక్కని పుస్తకాలు అవసరం. చక్కని కథలతో వాళ్లకు మనం ఎంతో విజ్ఞానాన్ని బోధించగలం.

మా కార్యాలయానికి పిల్లల పత్రికలు ఎన్నో వస్తవి. ముఖ్యంగా బాబు కార్యాలయం వారు విమర్శనార్థం మా కార్యాలయానికి మహేంద్రజాలం అనే చిన్న పుస్తకాన్ని పంపారు. కథలోని ముఖ్యాంశాలు : విజయపురి రాజయిన వీరవర్మ మూర్ఖుడు. కాని మంత్రి అయిన మహేంద్రుడు విజ్ఞాని. అతడు తన రాజు మనస్సు మార్చి ఆదర్శ వ్యక్తిగా చేయాలని. తన తెలివి తేటలచేతను, సేనాధిపతి అయిన మార్తాండుని సహాయముచేతను తమరాజు మాళవ దేశంలో బంధింపబడినట్లు తెలిసికొని, మాళవ దేశం రాజైన మాధవ వర్మ తమ దేశంపైకి దండెత్తగా అతి సాహసముతో ఎదుర్కొని జయించి, మాధవవర్మకు తమ రాజైన వీరవర్మ మాళవ దేశంలోనే బందిగా ఉన్నాడని చెప్పి అవతలికి పోయి రాజును కలిసికొని రాజులో పరివర్తన కలిగించినాడు. ఇది కథ. మంత్రి అయిన మహేంద్రుని యుక్తిచేత రాజులో పరివర్తన కలిగినది. కనుక మహేంద్ర జాలమని కథకు పేరుపెట్టారు.

## నవజీవన వారపత్రిక.

సంపాదకుడు : శ్రీ. పి. ఎన్. మూర్తి. నవజీవన ప్రెస్. 13 వాల్టాక్స్ రోడ్డు, జి. టి. మద్రాసు. 96 పేజీలు వెల 0-12-0.

నవజీవన సంక్రాంతిసంచిక మా కార్యాలయానికి చేరినది మూడురంగుల ముద్రణలో బాలగోపాల ముఖ చిత్రముతో వెలువడినది. ప్రముఖ రచయితల వ్యాసాలు, ఏకాంకికలు, కథలు గేయాలతో, నెహ్రూగారొక్క చిత్ర పటములతో, సినిమా, మొదలగు, ఎక్కువ ప్రకటనలతో నిండి వున్నది. ఈ సంచిక మొత్తంమీద చదువుటకు ఎక్కువ వుత్సాహకరముగనున్నది.

## సచిత్ర ఆంధ్ర వారపత్రిక.

సచిత్ర ఆంధ్రవార సంక్రాంతి సంచిక మాకు చేరినది. ముఖచిత్రము మూడు రంగులలో తల్లి బిడ్డలు, సంక్రాంతి ముగ్గులతో వెలువడినది. మంచి మంచి వ్యాసములు, కథలు, నాటికలు, పాటలు, రాజకీయ వృత్తాంతములు గలిగి, డా॥ రాజేంద్రప్రసాద్, సంక్రాంతి దృశ్యాలు, బాలానందము, మొదలగు చిత్రములతో వెలువడినది.

## ఉష సినిమా పత్రిక.

సంక్రాంతి జన్మ దిన సంచిక, సంపాదకుడు : రాము. కార్యస్థానం ఏలూరు. వెల విడిప్రతి అ. 0-8-0

ఉష సంక్రాంతి జన్మదిన సంచిక మాకు చేరినది. ముఖ చిత్రం తాజ్‌మహాల్ పిక్చర్స్ వారి "చాంద్ సితార"లో నసీమ్. ఇది సినిమా పత్రికయగుటచే ఇందు ఎక్కుడుగ సినిమా విషయములే వున్నవి.

—లక్ష్మి.



# శుభ్రమైన చలువ...



నా
ది
నా
ది
నా
ది




# అమృతాంజనము

గాని,

“ యథాయథా.... .... .... ....కాళీధవళత్వ శంకయా.”

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్లఁజేయు పూనికతో పెరుఁగు చున్నట్లెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.

# ఆంధ్రమహిళాసభ

మైలాపూరు - మద్రాసు

---

[illegible] విద్యాలయము — హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్ మీడియెట్ పరీక్షలు, నృత్యము, గానము

పారిశ్రామిక విద్యాలయము:- కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ బీద విద్యార్థినులకు ఉచితము
(గవర్నమెంటు వారిచే రికగ్నైజ్ చేయబడినది)

మెడికల్ ఇన్‌స్టిట్యూట్ .— స్త్రీలకు వైద్యము, మంత్రసానిపని - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ

మహిళా మందిరము .— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము

ఆంధ్రమహిళ .— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక

నిర్మలాదేవి గ్రంథాలయము :- సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా చేరి, యీ జాతీయ సంస్థను పోషించండి

సినిమా జగతిలో ప్రగతిని జూపించి
స్త్రీలనూ, పురుషులనూ అభ్యుదయమార్గాన
నడిపిస్తున్న



# గుణసుందరి

కథ...

ఆంధ్రదేశమంతటా
నిరంతర జోహార్లనందుకొంటున్నది..
నేడే చూడండి..



దర్శకం.. కె.వి.రెడ్డి, B.Sc (HONS.)
స్టూడియో.. వాహిని

# ఆంధ్రమహిళ జన్మదిన సంచిక

మే 1950 నాటికి ఆంధ్రమహిళకు ఆరు సంవత్సరములు సమాప్తమగును. ఈ 6 సంవత్సరములు, వనితలలో విద్యా సంస్కృతుల వ్యాప్తికై, ఆంధ్రమహిళ యొనరించుచున్న సేవ విజ్ఞులకు సుపరిచితమే. జన్మదిన సంచికలో ప్రకటించుటకు, అభిప్రాయములూ, ఆశీస్సులూ, స్త్రీ సమస్యలకూ, ఆధునిక రాజకీయములకూ సంబంధించినవియూ, భాష, కళలను గూర్చినవియూ, ఇతర సాంఘిక సమస్యలను గూర్చినవియునగు, వ్యాసములు కావాలి. ఇంకా చిన్న కథలూ, నాటికలూ కావాలి.

తమ చక్కటి రచనలను త్వరలోనే పంపండి.

కృతజ్ఞతతో,
సంపాదకురాలు.




విజయ వారి...

# షావుకారు

[ఇరుగు పొరుగుల కథ]

నిర్వాహకులు – నాగిరెడ్డి :: చక్రపాణి... దర్శకుడు – ప్రసాద్...

# ఆంధ్ర మహిళ

సంపుటి 6 :: మార్చి '50 :: సంచిక 11

ముఖచిత్రం : వధూవరులు



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,

సహసంపాదకురాలు : శ్రీమతి చన్న ఘంటమ్మ, యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




డిస్ట్రిబ్యూటర్సు :

ఆంధ్ర, రాయలసీమ :—చమరియా. మైసూరు, నైజాము :—కర్ణాటక ఫిలింస్.



సంపుటి 6 | మార్చి 1950 | సంచిక 11

# హైడ్రోజన్ బాంబు

భస్మాసురుడు, దీర్ఘకాలము, తీవ్రతపమాచరించగా, ప్రసన్నుడయిన శివుడు ప్రత్యక్షమై, తోచిన వరము కోరుమని సెలవిచ్చెను. అంత మహత్తరవకాశమును పురస్కరించుకొని కోరదగిన వరము లెన్ని లేవు — మోక్షం, త్రిలోకాధిపత్యం, ఇంద్రపదవి, ఇంకా ఎన్నో ఇట్టివి వేలాధికము లయినవి ఉండగా కోరక, కేవలము అసురప్రవృత్తి విజృంభించిన భస్మాసురుడు తన హస్తము నెవరి శిరమున నుంచిన వారు భస్మీపటలమగునట్టి వరమును కోరెను. ఈ మూర్ఖత చాలక, వరప్రదాత పైననే ప్రప్రథమమున వరప్రయోగమునకు గడంగి, తానే నశించెను.

అమెరికా రష్యా రాజ్యాల నడుమ జరుగుచున్న అణ్వస్త్రనిర్మాణపు పోటీ, ఇంతకన్న ఎక్కువైన అజ్ఞానమును, అసురప్రవృత్తిని, వృథాప్రయాసను, స్వవినాశనమును విశద పరచుచున్నవి. శతాబ్దముల తరబడి, అనేక ధీమంతుల ఆ జన్మాంత తీవ్ర పరిశోధనల ఫలితము మానవ విజ్ఞానము. ఈ విజ్ఞాన సాధనంతో ప్రకృతిని ప్రసన్నురాలినిగా జేసికున్నాము. సృష్టి రహస్యములను పెక్కింటిని అవగాహన చేసికున్నాము. పంచభూతములలో నిమిడియున్న శక్తులను కైవశము చేసికున్నాము. ఈ విజ్ఞానాన్ని, యీ ప్రకృతి శక్తులను, సద్వినియోగం చేసికుంటే, మానవుడు చేయగల నిర్మాణము అమోఘమైనది. పొందగల శ్రేయస్సు అతిమూల్యమైనది. కాని, మనలోని అసురప్రవృత్తిని జయించలేక పోవుటవలన, యీ విజ్ఞానాన్ని, మారణాస్త్ర నిర్మాణానికి వెచ్చిస్తూ, సమూలంగా, సృష్టిలోని సకలజీవరాశిని తృటిలో నిర్మూలం చేయటానికి సిద్ధపడుతున్నాము.

ఏటంబాంబును గూర్చియే సర్వ ప్రపంచము గడగడవణకుచూ వుంది. అణుశక్తి కంట్రోల్ విషయములో అమెరికా రష్యాల మధ్య ఏ విధమైన ఒడంబడికయు జరుగు సూచనలు బొత్తిగా పొడసూపుట లేదు. ఐక్యరాజ్య సమితి ఇందు ఏ విధమైన చర్యయు విజయవంతముగా కొనసాగించలేక పోవుచున్నది. 'శాంతి శాంతి' అని సర్వలోక ప్రజ కలవరపడుతూనే ఉన్నారు. బ్రిటన్ [illegible]కలలో సహా, శాంతి స్థాపన ఒక అత్యవసర కార్యక్రమముగా ప్రయత్నిస్తామని, వివిధవర్గాల

వారు ప్రజలకు తమ ప్రణాళికలలో, ఉపన్యాసాలలో, ప్రకటనలలో, సూచించారు; ఎలుగెత్తి చాటిచారు. ఈ పరిస్థితులలో, అమెరికా హైడ్రోజన్ బాంబు నిర్మాణానికి పూనుకొనుట, ఒక భూకంపమువలె ప్రజా హృదయాలను, వణికించివేయుచున్నది.

హైడ్రోజన్ బాంబు ప్రయోగమువల్ల, న్యూయార్కు, మాస్కోలవంటి గొప్పపట్టణాలు ఒక్క క్షణములో, భస్మమగుటయేగాక, అక్కడ పుట్టిన రేడియో విషవాయు తాకిడివల్ల, సకల జీవకోటి నశింపగలదని, ఐన్‌స్టీన్ సిద్ధాంతి నొక్కి చెప్పుచున్నాడు. ఇంక క్రిమి బాంబుల వలని కలుగు నాశనము వూహించుటకే వీలులేనిది. రష్యా అమెరికాలు స్వయంగాగాని, ఐక్యరాజ సమితి పరిముఖంగాగాని, ఏ విధమైన ఒడంబడికకూ రాక, యీ అస్త్రనిర్మాణపు పోటీ సాగించుటవలన ప్రపంచశాంతికి భంగము కలుగుచున్నది. అమెరికా ప్రజగాని, రష్యా ప్రజగాని, యీ బీభత్సాని కియ్యకొనరు. అందువలన, రెండు ప్రభుత్వముల ప్రతినిధులు సమావేశమై శాంతి మార్గముల నాలోచించవలసిన ఆవశ్యకత ఎంతయూ కలదు. వీరిరువురి నడుమ స్నేహ సంబంధములు కలుగునట్లు ప్రయత్నించుట, ఇతర రాజ్యముల యొక్కయు, ఐక్యరాజ సమితి యొక్కయు ప్రధాన కర్తవ్యమైయున్నది.



## శ్రీ. శే. శరత్‌చంద్ర బోస్

జననం 7-9 1889. మరణం 20-2-1950.

జాతీయ స్వరాజ్య సమరంలో, దీక్షతో పోరు సల్పిన యోధుడు. దేశబంధు చిత్తరంజన్‌దాస్ శిష్యుడు. నేతాజీ సుభాస్ చంద్ర బోస్ సోదరుడు వంగదేశపు ప్రజా నాయకుడు. సహాయ నిరాకరణోద్యమములో పాల్గొని, అత్యంత త్యాగముజేసి, పలుమారు కారాగారవాసము ననుభవించినవాడు. స్వతంత్ర సిద్ధ్యనంతరం అభిప్రాయభేదములచే కాంగ్రెసునుండి విడినప్పటికీ, జాతీయ సమరంలో ఈయన సేవ మరువతగినదికాదు. అట్టి యీ భారతయోధుని స్మృతికి బాష్పాంజలి సమర్పిస్తూ, ఆయన భార్యా పుత్రులకు, యితర బంధు మిత్రులకు మా హృదయ పూర్వక సానుభూతిని తెలియజేయుచున్నాము. భగవంతుడాయన ఆత్మకు శాంతిని గూర్చుగాక.

ఆంధ్రమహిళ.



కాశ్మీర్, జమ్మూ ప్రధాని,
షేక్ అబ్దుల్లా గారికి
మహిళాసభవారి స్వాగతం.

# ఆంధ్రమహిళా సభలో

## కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లాకు స్వాగతము

13-2-'50. సాయంకాలం ఉదయం షేక్ అబ్దుల్లా ఆంధ్ర మహిళా సంస్థకు వాడ వచ్చిరి. తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ. కామరాజు నాడారుగారు శ్రీ. చెంగల్వ రాయన్‌గారు అబ్దుల్లాగారితో వచ్చిరి.

బాలికల గౌరవవందనానంతరం అతిథులు మహిళాసభ విద్యాలయము, పారిశ్రామికశాఖ మున్నగునవి తిలకించిరి. తరువాత జరిగిన సభ్యురాండ్ర సమావేశములో కార్యదర్శిని షేక్ అబ్దుల్లాగారికి స్వాగతమిస్తూ "స్వాతంత్ర్యానంతరం దేశమును విచ్ఛిన్నముచేసి వేనవేలు అమాయక ప్రజను పొట్టబెట్టుకొని మతవైషమ్యమును బోగొట్టి సామరస్యము నెలకొల్ప తీవ్ర కృషిచేయుచున్న మీకు మా అభివందనములు. సర్వజన సామరస్యమే పరమావధిగా స్త్రీలలో విద్యా సంస్కృతుల అభివృద్ధికై ఈ సంస్థలో యింతవరకు కృషి చేయుచున్న మేము మీవంటి నాయకులు చూపు త్రోవనే అనుసరించుచున్నాము," అని చెప్పిరి.

షేక్ అబ్దుల్లాగారు ప్రసంగిస్తూ "ఉత్తరదేశంలో యీ మతకలహములకు గురియై వేన వేలమంది స్త్రీలు పడుచున్న బాధలు మీకు దురూహ్యములు. క్షేమకు, శాంతికి, సామరస్యమునకు దూతలుగ స్త్రీలైన మీరే మిక్కిలి తగియున్నారు. ఈ ఫలసిద్ధికై కృషి చేయుచున్న మీ సంస్థకు అభినందనములు "అని చెప్పిరి. ఇంతటితో సభ ముగిసినది.

—లక్ష్మి.

## హిందూ ధర్మశాస్త్రము—సవరణ

ఆంధ్రమహిళా సభలో 15-2-50 న. శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు పై విషయమును గూర్చి ప్రసంగిస్తూ, హిందూ ధర్మశాస్త్రము, అతిపురాతనమయినది, సాంప్రదాయకమైనది. కనుక దానిని సవరించుట సాంప్రదాయ వ్యతిరిక్తమగునని కొందరిభయము, కాని సాంప్రదాయమును భంగపరచకుండ కాలానుగుణముగ మార్పులు తెచ్చుటలో తప్పులేదనియు చెప్పిరి. స్త్రీలయొక్క ఆస్థి హక్కులు, విడాకుల హక్కులు యిందు ముఖ్యముగా చేయవలెనన్న సవరణలు. కుమార్తెలకు కొడుకులతోపాటు ఆస్థియిచ్చుటవలన స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యము వచ్చును గనుక కుటుంబములో అత్తకోడండ్రు ఆడబిడ్డల, అన్నచెల్లెండ్ర మధ్య కలహములుపోయి సౌమనస్యత ఏర్పడును. అందువలన గృహ శాంతి ఏర్పడి, దేశ శాంతికి కారణమగును.

విడాకుల చట్టము వలన వివాహ విచ్ఛేదము సులభమని అభిప్రాయ పడుట చాలా పొరబాటు. విచ్ఛేదమునకు పూర్వము జరుగవలసిన దీర్ఘకార్యక్రమమే విచ్ఛేదన బహు కష్టమైన కార్యమగునట్లు చేయుచున్నది. కాని అత్యవసరమయినపట్ల ఈ విడాకుల చట్టము సహాకరింపగలదు.

ఇవిగాక ఇంకను కొన్ని ముఖ్య సవరణలు సూచించబడినవి. స్త్రీ పురుషు లిరువురకు సర్వ విధముల సంఘములో సమాన హక్కులు కలుగునట్లు చేయుటయే యీ సవరణ యొక్క ముఖ్యోద్దేశము అని వారు చెప్పిరి.

మం॥ రం॥

## కృతజ్ఞత

చెన్నపురి ప్రొవిన్షియల్ కోఆపరేటివ్ బ్యాంకువారు, పారిశ్రామిక విద్యాలయపు బాలికల భోజన నిమిత్తము రు. 250/- విరాళముగా నిచ్చియున్నారు. ఇప్పటికి నాల్గు సంవత్సరములుగా విరాళమిచ్చుచు, సంస్థయందు ఆదరము జూపుచున్న వీరికి మా కృతజ్ఞత.

శ్రీమతులు ఎర్లగడ్డ భవానీదేవిగారు, గోరా సుశీలమ్మగారు, వారణాశి యశోదాదేవిగార్లు రు. 100/- విరాళముగానిచ్చి, సభకు యావజ్జీవ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి. వీరికి మా అభినందనములు.

జి. జమునాబాయి  ఆ. చన్నమంటమ్మ

# ఆస్థానకవి అస్తమయం

అవనిన్ తిరుపతి వేంకట
కవివరు లమితాంధ్ర గ్రంథకర్తలు, విజయో
త్సవములు బొలుపొందగ త
త్కవిత సుధాధార రుచిని తగచాటింపన్
తిరిగిరాంధ్ర దేశంబంత దివ్యముగను
బడసి రెన్నెన్ని యో ఘనబహుమతులను
తృణముగ శతావధానముల్ తీర్చినారు
గణన చేయంగ విఖ్యాత కావ్యఘనులు.

సంతత సంస్కృతాంధ్ర పదజాల
విజృంభిత కావ్యశ్రేణి న
త్యంత ప్రసిద్ధిగా గలిపి
యాంధ్రకవిత్వపు నవ్యశోభ వృ
త్తాంతము చాటి పద్యగమనా
తిశయంబున పేరుగాంచి సా
మంతవరేణ్య భూపతుల మన్ననలన్
చెలువొంది నారొకో.

మున్నె తిరుపతి కవీంద్రుడు
చెన్నొందగ నేగ స్వర్గసీమక్ శాంతిన్
చెన్నపురి రాష్ట్రమున సం
పన్నత నాస్థానకవిగ ప్రబలిన వాడై,
కటకట దాపరించె కడుకష్టపు
కాలము చెళ్ళపిళ్ళ వేం
కటకవి శిష్యవ్రాతముల
కంట జలంబు జనింప జేసి తా
నట సురలోకమందు సుఖ
మందెడి యాప్తుని జూడనేగగా
నిట కలికాలమందు వసియింపగ
దుర్భరమంచు నెంచుచున్.
సంస్కృతాంధ్రంబు లందుప్రసక్తి గాంచి
ఆంధ్రభాషా విభూషణులై చరించి
అలసి విశ్రాంతినొంద, తానరిగినట్టి
ధీరవరునకు శాంతి చేకూరు గాక!

—ఇందుకూరి రామకృష్ణరాజు.

ఆస్థానకవి, కళాప్రపూర్ణ, శతావధాని, బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు, మహా శివ రాత్రి పర్వ దినమున, 80 సం॥ పూర్ణ వయస్సున, శివ సాయుజ్యమును పొందినారు.

ఆయన పూర్వజన్మ సుకృతమున, కవిగా జన్మించి, 60 ఏండ్లు వాఙ్మయసేవగావించి, కవిగా జీవించారు. వారి రచనలయందు వారి శిష్య ప్రశిష్య కోటులందు, ఆధునిక ఆంధ్ర సాహిత్యమునందు వారి ప్రభావము ప్రకాశింప చేశారు. వారు రచించిన కావ్యములు, నాటకములు, పురాణములు, వ్యాసములు మిక్కిలి జనరంజకములైనవి. వారి ఆశుకవితా ప్రదర్శనము పండిత పామరజనుల కుల్లాసమును కలిగించెడివి

జన సామాన్యమునకు సారస్వతాసక్తి రుచిని కలిగించి ఆంధ్రదేశ శతావధాన పర్యటనలలో పెక్కులకు కవితోత్సాహమును కలిగించి, సహస్ర సంఖ్యాకులగు శిష్యులకు విద్యాప్రబోధము గావించిన వారు తిరుపతి వేంకట కవులు. ఆంధ్ర దేశమున వీరు అలంకరించిన సభలు, అందుకున్న గౌరవములు, అసమానములు, అసంఖ్యాకములును. కవి రాజ పూజితులగు శ్రీనాథ, తిక్కనలతో పోల్చదగినట్టియు వీరు, స్వతంత్ర భారతోర్విలో, రాజపూజితులై, ప్రథమ ఆస్థాన కవులుగా నియమింపబడుట వారికేగాక, నియమించిన ప్రభుత్వమునకు కూడ అత్యంత గౌరవదాయకమని చెప్పుట అతిశయోక్తి కాజాలదు.

ఆంధ్రవాఙ్మయాకాశమునందు అర్ధ దశాబ్దముల కాలము నూత్న కాంతులను విరజిమ్ముచూ, సార్వభౌమసంచారము చేసి, అధునాతన, సనాతన వాఙ్మయ పక్కీలలో మేలు కలయికను సూచిస్తూ, వాఙ్మయచరిత్రలో ఒక నూతన శకమును సృష్టించిన, యీ కవి సార్వభౌముని మృతి వలన, వాఙ్మయ ప్రపంచంలో శూన్యత ఏర్పడిన దనుట వాస్తవము. ఈ శూన్యతను పూరించి, వారు పెట్టిన సాహిత్య భిక్షను అక్షయమొనరించుట వారి శిష్యకోటి బాధ్యతయని హెచ్చరిస్తూ, వారి యాత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ, వారి బంధు మిత్రులకు, శిష్య వర్గమునకు మా హృదయపూర్వక సానుభూతినందచేయుచున్నాము.

—జి. ప్రభ.



# జోన్ ఆఫ్ ఆర్క్

✻ శ్రీ హెచ్. రామశేషగిరిరావు ✻

కాలచక్రం తిరుగుతూంది. పదునైదవ శతాబ్దపు తొలి కష్టదినములు. ఆంగ్లేయులు ఫ్రెంచివారిపై దండెత్తినారు. ఫ్రాంసుదేశపు పలుచోట్ల శాసకులు వారిదాడి తాగలేక వీగి పోయిన దినములవి. వారి దాడులు నిర్నిరోధముగా పెక్కు కష్టములను తెచ్చినవి. ప్రజలలో మహానాయకుడని చెప్ప దగ్గవాడొక్కడైనను కన్పడడు. నాయకుడు లేని సైన్యమేమి చేయగలదు? ఫ్రాంసు ఆంగ్ల రాజ్యమున కలియునేమో యను భీతి పొడమినది.

ఈ విషమ పరిస్థితిని తొలగించుటకు భగవానుడొక మహా శక్తిని జయచేసినాడు. ఆమెయే జోన్ ఆఫ్ ఆర్క్. పుట్టుకచే సబలయైనను యీశ్వర సందేశముచే ఖడ్గము ధరించినది. గొర్రెలను గాసిన బుద్ధిచేతనే తన జాతిని రక్షించినది. క్రీ. శ. 1411 వ సం॥న డొంగ్రేమే గ్రామమున జన్మించినది. ఆమె శక్తి అనేక మహానాయకుల శక్తివలెనే బాల్యమున ప్రకాశింపలేదు. పదునెనిమిదవ వత్సరమున అత్యల్ప సైనిక సహాయమున ఫ్రెంచి రాజు ఛార్లసును ధర్శించి దేశముక్తికై యుద్ధము జేయుటకు అనుజ్ఞను, సైన్యమును ప్రసాదింపుమని వేడినది. పంచ సహస్ర సైన్యమునకో యువతి నాయకురాలై ఖడ్గకవచముల ధరించి యశ్వారోహణ మొనర్చెను.

ఇది వకసారి కూడ యుద్ధమును జూడని, యుద్ధానుభవము లేని కన్యనాయకురాలు. పరాజయములను బొందుట నేర్చిన ఫ్రెంచి సైన్యము ఆమె సైనికులు. వారు జయింపవలసినది విజయపరంపరచే తాడుబారిన ఆంగ్లసైన్యమును. సంకల్ప బలమునకును సాధనా బలమునకును పోరు ఘటిల్లినది. అందు సంకల్పబలమునకే విజయము గల్గినది. 1429వ సం॥న జోన్ ఆంగ్లేయులను జయించి 'ముఖ్య నగరమైన ఆర్లీన్స్ పట్టణమున ప్రవేశించెను. దీనితో ఫ్రెంచివారి హృదయము లుప్పొంగినవి. ఆంగ్లేయుల యుత్సాహ మడుగంటజొచ్చెను. ఆర్క్ 'కన్య విజృంభించినది ఆమె పెట్టిన తొలి విజయ సోపానమే. ఆవత్సరమే జూలై నెలలో ఛార్లెస్ పట్టాభిషేకము. ఆ సమయమున ఆమె ఛార్లెస్ పార్శ్వమున నిలువబడెను.

ఛార్లెస్ ఆమె ప్రజ్ఞకు మెచ్చి "వీరాంగనా ఈ శుభము నీ మూలమున గల్గినది. వరమడుగుమ"నెను. అంత నామె తన గ్రామమగు డొంగ్రేమే సర్వమాన్యంబాల గ్రామముగా జేయ బడవలయునని పలికెను.

ఎంతటి కోరిక! సర్వదేశమును తాను జయించి వచ్చినది. ఎట్టికోరిక కోరినను రాజీయకనజాలడు. కాని ఆమెకు విషయవాంఛలేదు తన గ్రామము నంతగా ప్రేమింప గలిగెను. ఆ స్వల్పపు కోరిక నెరవేర్పబడెను. నేటికిని ఫ్రాంసు దేశపు పన్నుల పుస్తకమున డొంగ్రేమే గ్రామమున కెదురుగా "పన్ను ఏమియులేదు. ఆర్క్ కన్య జ్ఞాపక చిహ్నము" అను అక్కరములుండును.

రాజు పట్టాభిషేకము జరిగెను. వారప్రమత్తులై యుండిరి. చివరిభాగ మింకను ఆంగ్ల సైనికుల వశమందే యుండెను. శత్రుశేషమును మిగుల్చరాదని ఆర్క్ వాదించెను. రాజు వినలేదు. జరిగిన పట్టాభిషేకమున వారు ఆమెను మరచిరి. ఆమెయే కార్యరంగమున దూకెను. వెనుక పెన్నుచురుపు లేకపోయెను. 1430 మే నెలలో ఆమె ఆంగ్లేయుల చేజిక్కెను. ఫ్రాన్సు దేశమున తమ పరాజయ కారణ భూతురాలగు నామె మాంత్రికురాలని వారు నిర్ణయించిరి. తమకింత మేలుజేసిన యామెను మాయా మాంత్రికురాలుగా నెంచి విచారణ జేయుడుమని వాగ్దానమిచ్చి ఫ్రెంచివా రామెను తీసుకొనివచ్చిరి. 1431 జనవరి 9 నుండి విచారణ జేసి అధ్యక్షుడు మే 24న తీర్పుజెప్పెను. ఆమెను పెడరెక్కలు విరిచికట్టి లావు దూలములకుగట్టి తైలవసనములజుట్టి మరణించువరకు గాల్చి చంపిరి.

జాతీయోద్యమముల నడిపిన వీరవనితలలో ఆర్క్ కన్య యొకతె. తన దేశభక్తిని జాతీయతను గ్రహింపనివారి మధ్య నీమె జన్మించెను. ఇతరులను జంపి తనవారికి శాంతి గూర్చెను. తనవారిచే జంపబడి పరులకు నైతము విషాదమును గూర్చినది. తదుపరి నాలుగున్నర శతాబ్దముల కామె మహర్షుల (Saints) లో చేర్చబడినది.



ప్రేమ పీడలేక బిడ్డలకెట్లో పెంచుతుందో కాని లోలోన రామవియోగం క్రుంగదీసి వేస్తుంది. ఆ విషాదాన్ని "పుట పాక ప్రతీ కాశ"మని ఉడుకుచున్న లోహ ద్రవంతో పోల్చాడు మహాకవి.

ఆ ఘట్టంలో భవభూతి మహాకవి సీతపాత్రను చిత్రించడంలో అమరత్వాన్ని పొందాడు. "యతో భావ స్తతో రసః" అన్నట్లు, ప్రతివాక్యము కరుణరసాన్ని చిందుతుంది. గోదావరీ తీరంలో పంచవటిని చూడగానే సీతకు ఆర్యపుత్రుడు జ్ఞాపకానికి వస్తాడు. ఆ సమయంలోనే రాముడు కూడా శంబూకుడనే శూద్ర మునిని సంహరించడానికని పంచవటికి వస్తాడు. అప్పుడు సీతా రాము లొకరి నొకరు కలుసుకోకుండా తమస, మురళ అనే నదీ దేవతల ద్వారా కొంత సంభాషణ సాగిస్తారు. రాముడు సీతా వియోగం సహించియున్నప్పటికి అతని నిజసౌమ్య గంభీర భావంగోచరించగానే సీత "ఆర్య పుత్ర యేవ తమనే ధారయమాం" అని మూర్ఛబోతుంది. కొంతవడికి మూర్ఛదేరి రాముని చూచి తానింతవరకు బొందుచున్న విచారాన్నంతా ఒక్కసారిగా మరచిపోయి ఆర్యపుత్రుని గురించే జాలిపడుతుంది. తన వియోగాన్ని రాముడెలా సహిస్తున్నాడా అని బాధపడుతుందా సాధ్వి. ఆర్యపుత్రుని జూడగా తన దుఃఖం పరిముషితమైంది అంటుంది. రాముడు పంచవటిని చూడగానే సీత జ్ఞాపకానికివచ్చి "హాహాదేవి! హృదయము బ్రద్దలగుచున్నది. మందభాగ్యుడనైన నా యంతరాత్మ అంధకార బంధురములో మునిగి పోతూన్నద"ని మూర్ఛపోతాడు. అప్పుడు తమస "సీపాణిస్పర్శనమే రామునకు సంజీవనోపాయము" అని చెప్పగా సీత రాముని స్పృశిస్తుంది. ఆమె యమృత హస్తం తగులగానే రాముడు మూర్ఛదేరి ఆమె కంటి కగబడనందున "జానకి వచ్చిందా"అని వాసంతి నడుగుతాడు. "అకరుణే, వైదేహీ" అని ప్రలాపిస్తాడు. కాని నియమబద్ధురాలైన జానకి రాముని కంటబడకుండా, "నిజముగానే కరుణలేని దాననే. ఇట్టి నిన్ను చూస్తూ కూడా జీవించియున్నాన"ని అంటుంది. ఆ సమయంలో రాముడు ప్రజాను రంజనానికై సీతను పరిత్యజించిన విషయమే మరచిపోయి ఉన్మత్తునివలెనై తాను సీతకై ఆ కివరలో చేసిన సుగ్రీవస్నేహము, హనుమంతుని లంకకు పంపించుట, వాలిని సేతుబంధనము, మొదలయిన ఘనకార్యాలన్నీ వ్యర్థమేనని విలపిస్తాడు. రాముని నోటినుండి యీ యమృత వాక్కులు వినగానే తన జీవితము ధన్యమైనదని యామె సంతోషిస్తుంది. అశనిపాతంలో మెరుపు చూచినట్లవుతుంది. పతిప్రాణయైన జానకి దుస్సహ రామ వియోగం అనుభవిస్తూనే రామాజ్ఞను పాలిస్తూ ఉడుకుచున్న లోహరసంవలె యావిచారాన్ని తనలోనే యిముడ్చుకుంటుంది. ఈ పాత్ర చిత్రణములో భవభూతి మహాకవి కరుణరసాన్ని పరమావధిపొందించి తుదకు "ఏకోరసః కరుణఏవ"అని అనడానికి కూడా సాహసించాడు. దీనిని మహాకవి కాళిదాసు "ఉత్తరేరామచరితే! భవభూతిర్విశిష్యతే"అని వర్ణించాడు.

## ఊర్మిళ

సీతారాములు వనవాసానికి వెళ్ళేటప్పుడు, లక్ష్మణుడు కూడా అన్న వెంట బయలుదేరుతాడు. అతని భార్య ఊర్మిళను తనవెంట రావద్దంటాడు. ఆసాధ్వి పతి మాటకెదురాడక యింటిలోనే యుంటుంది. కాని దుర్భరవియోగాన్ని భరించలేకపోతుంది. అక్కడ సౌమిత్రి రాత్రింబగళ్లు సీతారాముల సేవచేయడంలో నిద్రాదేవి అతన్ని కొంత ఆటంకపరుస్తుంది. అప్పుడతడు తన వనవాస దీక్ష 14 ఏండ్లు తీరే వరకు నిద్రను తనవద్దకు రావద్దని

"మా యన్న రఘుపతికి మా వదినకూను।
ఈ పర్ణశాలకే తాను కాపానూ।
తన్ను బాసినయట్టి సతియుండతగదూ।
రాత్రియును పగలూను లేవకుండాను।
వనువిడిచి పొందుమీ ధవళాక్షి నిద్రా।
పొమ్ము అయోధ్యకు పొలంపుగ నిద్రా"

అని తననిద్రను భార్యవద్దకు పంపిస్తాడు. అంత ఊర్మిళ భర్తృ వియోగ కాలమంతా, బాహ్య ప్రపంచంతో జోక్యంలేకుండా నిద్రలోనే గడిపేస్తుంది.

శ్రీరామ పట్టాభిషేకం జరుగుచుండగా సభలో అందరూ ఉండి తన ప్రియమైన మరది లక్ష్మణుని భార్యలేక పోవడం చూచి సీత

"ముందు మన మదవులకునూ వెళ్ళగా !
ముద్దు మరి వెంటనూ !
పయన మాయెను ఊర్మిళా !
వద్దు నీ వుండుమనుచూ !
సౌమిత్రి మనల సేవింప వచ్చె !
నాడు మొదలుగ శయ్యపై !
కనుమూసి నాతి పవళించుచున్నదీ !
ఇకనయిన యానతిచ్చి !
తమ్ముని ఇందుముఖి కడకంపుడీ"

అని భర్తను ప్రార్థిస్తుంది. అంత లక్ష్మణుండు భార్యను లేపడానికి అంతఃపురానికి వెళతాడు. అక్కడామె 14 ఏండ్ల నుండి బాహ్య ప్రపంచజ్ఞానం లేకుండా కేవల నిర్వికల్ప సమాధిలోనున్న యోగీశ్వరునివలె భర్తృ పాదారవింద ధ్యానంలో మునిగి యుంటుంది. ప్రత్యక్షంగా భర్త తన యెదుట కన్పించినా గుర్తించలేక

అయ్యో మీరెవ్వరయ్యా మీరింత ఆగడంబున కొత్తకీ
ఎవ్వరూలేనివేళా మీరిపుడు ఏకాంతముల కొస్తిరా!"

అని పరపురుషునితోవలె భాషిస్తుంది. ఎన్నో నీతులు చెబుతుంది. ఒకడి ఆలిని కోరిన వానికి వచ్చేంత హానమైందని అంటుంది. ఇదంతావిని సౌమిత్రి "నేను శ్రీరాముని తమ్ముణ్ణి. నీ భర్తను" అనిచెప్పి "నినుబాసినదిమొదలు ప్రాణసఖి నిద్రహారములెరుగనే!" అని వరనుండి కత్తితీసి మెడమీద వేసుకోబోగా, ఊర్మిళ దద్దరిల్లి పూర్వ చరిత్రనంతా జ్ఞాపకానికి తెచ్చుకుంటుంది. ఈ కథ రామాయణాలలో యెక్కడా కనుపించదు. కాని గేయవాఙ్మయంలో యెక్కువ ప్రచారంగావుంది. భర్తృవియోగాన్ని భరించలేని పతివ్రతాహృదయము ఎట్లుంటుందో యీ గేయవాఙ్మయ కర్త చాలా చక్కగా రచించాడు.

## ద్రౌపది

ఈమె దేవయజన సంభవ. స్వర్గ లక్ష్మి కళతో ద్రుపదునింట అవతరించింది. పాండవ ధర్మపత్ని. కుంతీమహాదేవి కోడండ్రందరిలో గొప్పదనం పొందింది. రాజసూయాధ్వరంలో భూసురులందరినీ తృప్తిపరచి వారి దీవెనలు పొందిన పవిత్రురాలు. ధర్మజుడు కపటద్యూతమున తమసంపదనంతా గోల్పోయి పన్నెండేండ్లు వనవాసంచేసి యేట్లో అజ్ఞాతవాసం కూడా గడిపి యింక మన కష్టాలు గట్టెక్కినవి గదా యని అనుకుంటే, కౌరవులు రాజ్యలోభంచేత భూమిపుల్లంత రాజ్యభాగమైనా యివ్వమన్నారు. అంత శ్రీకృష్ణ భగవానులు తాను వెళ్ళి అడిగితే కౌరవులేమైనా దారికి వస్తారేమో నని ప్రయాణమయ్యాడు. పాండవులైదుగురి అభిప్రాయములు తీసుకున్నాడు. నీ యభిప్రాయం కూడా చెప్పమని ద్రౌపది నడిగాడు.

ఆమెకు ధర్మనందనుని పలుకులు మరింత హృదయతాపాన్ని కలిగింపగా, గద్గదికతో కృష్ణునితో తన అభిప్రాయం చెబుతుంది. అప్పుడామె మాటల్లో, ఆమె హృదయంలో ఇన్నాళ్ళనుండి అంతర్గతంగా పొగరాజుతూన్న సంతాపాన్ని ఒక్కసారిగా పైకి విజృంభించి వస్తుంటుంది. ఆ సమయంలో ఆ పాంచాలి పల్కిన ప్రతివాక్యం పాఠకుల్ని పులకాంకితులను చేస్తుంది. ఈ పాత్ర చిత్రణములో కవి ప్రదర్శించిన శిల్పచాతుర్యం నిరుపమానము.

"అంతలు సేసిపోవవచ్చి; అక్కట! సంజయుచేత చెప్పి పుత్తెంతురె! ఇట్టి యోగ్యత మదిం ప్రియమంది యుధిష్ఠిరుండు, దానంతన యోగ్యత లేవురకు వైదు సుయోధను డిచ్చునొక్కొ" అని పూర్వోత్తర సందర్భమంతా ఒక్కమాటలో చెబుతుంది. తన మనుబడ్డ బన్నములన్నింటినీ ఒక్కమారు జ్ఞాపకానికి తెచ్చుకొంటుంది. ధర్మజుడు ప్రతిదానికి ధర్మం, ధర్మం, అని కౌరవులు చేసిన అన్యాయాలన్నిటినీ సహించి దానికి ప్రతిక్రియ చేయకపోతే "చాలరె రి పేరునరొక్కా! నానలేమి యని యాడరె లోకమువారు కేకవా" అని "లోకులు పాండవులసమర్థులై యూరకున్నారు. సిగ్గులేని వారనరా!" అని సున్నితంగా యెత్తి పొడిచింది. ఇంకా పాండవులకు క్షేమం కలిగించడానికి

"పుట్టుకయొకింతయుసయు సుయోధను చిత్తమునందులేదు;
నీ మాటలపోవునే యుదధి మానము యెక్కుడు రూపుగాగ ;
అచ్చోటున సంగరంబులగు చొప్పులు పుట్టినవైన పాండవుల్ ;
పోటునకిచ్చగింతురొకో ; పోదుగోవనంనుండ నమ్మకా"

అని ఆక్రోశా పడింది. పాండవులకు యుద్ధం చేయడానికంటె అడవులలో వుండటమే యిష్టమన్నట్లు సూచించింది. ఆమె పసిమూపేండ్లనుండి పడిన కష్టాలన్నీ "చిన్నాడికట్టినట్లు" సక్కావశాల్మితో సహించింది. కాని ఆ సహనం కూడా నశించి పర్యావసానం ఇక సహించ లేకపోయింది. "పగన్ పగ తీరవలె"నేగాని రెండో దారిలేదనే నిశ్చయానికి వచ్చింది. ఆ విషాద వాతావరణంలో నామె హృదయం చింతాకందరై వివేకాన్ని కూడా పోగొట్టుకుంది. ఏవయిట్టి దానికా యింత శైచ్య జీవనమని తనపూర్వపు సౌన్దర్యాన్నొకమారు సింహావలోకనం చేసుకుని,

"శరమున బుట్టితిన్ భరతవంశము సొచ్చితి; నందు పాండుభూ
వరునకు కోడలైతి। జనవంద్యుల బొందితి, నీతివిక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్। సహజన్ముల ప్రాపు గాంచితిన్,
సరసిజనాభ! యిన్నిటను ప్రసిద్ధికెక్కిన దాననెంతయున్"

అని తన జీవిత సంగ్రహాన్నొకమారు పాఠకుల యెదుట పెట్టింది. ఇంతే కాకుండా శ్రీ కృష్ణునివంటి ప్రేమగల సోదరుడుండగా, తనకిట్టి భంగపాటు కలిగిందని

"నీవునుభద్రకంటె గడు నెయ్యము గౌరవముం దలిర్ప సం
భావనసేయుదు; ఇట్టినను పంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై తనుపొందిన వేణిబట్టి। యీ
యేవురు చూడగా సభకు నీడ్చె। కులాంగన నిట్లొనర్తురే"

అని తన గొప్పదనాన్ని కౌరవులు చేసిన అవమానాన్ని చెబుతూ "అవిరళచ్ఛవి పొల్చు మహాభుజంగమో" అన్నట్లున్న తన నీలంపు కురులు చూపించింది. అప్పటి సభలో కౌరవులు తనమానభంగము చేయడానికి చూపిన దౌష్ట్యమ్మంతా తలచుకొని మనసులో పొంగుతూన్న విషాదరోషాల నణచుకోలేక, కన్నీరు విడుస్తూ తన యైదుగురు భర్తలు చూస్తూండగానే తనకింత అవమానం సిద్ధించిందని విలపిస్తుంది. ఎప్పటికి కౌరవులుచేసిన దుష్కృత్యాలకు ప్రతిక్రియ నేదా ఘని గట్టిగా ఒక్కరూ మాట్లాడక పోవడంచూచి, యిక పాండవులకు పౌరుషం కలుగదేమోనని శంకించి, "యీ వెంట్రుకలబట్టి యీడ్చిన వాని చేతులు యుద్ధంలో ముక్కలు ముక్కలుగానిదే నా కడుపుమంట చల్లారదని శపిస్తుంది. స్త్రీ సహజ స్వభావమంతా ఆమె పలికే ప్రతి మాటలో ప్రతిబింబిస్తుంది. అటువంటి వీరాంగనకు కూడా చివర ఉడుకుమోతుతనం వచ్చి, ధర్మనందనుడు తాను రాజ రాజుకు నుంగ కన్నారచూడక పోయినట్లయితే "క్షత్త్ర విక్రమంబు గాల్పనే"అని అర్జున పరాక్రమాన్ని నిందిస్తుంది.

ఈ ఘట్టం సంస్కృత భారతంలోకంటె తిక్కనచేతిలో మెఱుగులు దిద్దింది. ఈ భాగం చదివినంత సేపూ ద్రౌపది శ్రీ కృష్ణుడు పాండవులేవురు మన యెదుట కొలువు దీరి యున్నట్లు, ద్రౌపది తనజుట్టు చేతబట్టుకొని శ్రీ కృష్ణునికి చూపుతూ కౌరవులు పెట్టిన కష్టపరంపరలన్నీ ఒకటొకటిగా యేకరువు పెడుతూ గద్గదస్వరంతో మాట్లాడుతున్నట్లు పాఠకులకు ప్రత్యక్షమౌతుంది. భావ గాంభీర్యమైన చిన్న చిన్న పదములతోనే తిక్కన తన కవితా చమత్కృతిని చూపుతాడు. కావుననే యితడు తెలుగువారికి కవి బ్రహ్మ అయినాడు.

పై చెప్పిన సీత, ఊర్మిళ, ద్రౌపది, వీరు ముగ్గురు విషాదనాయికలే. వీరిలో ఊర్మిళా సీతలు దుర్భర భర్తృ వియోగాన్ని అనుభవించారు. ఊర్మిళ ఆవియోగాన్నంతా అజ్ఞాతంగా నిద్రలో గడిపింది. కాని సీతామహాదేవి, విముక్తిలేని వియోగాన్ని అనుభవించవలసి వస్తుంది. వారు వైకుంఠ వాసులనీ దేవకార్య నిర్వహణం కొరకు అవతరించిన దేవతా మూర్తులనీ అనుకుంటే తప్ప కావ్య జగత్తులో చెప్పాలంటే కరుణరసం పరమావధి పొందింది. ఎంత రాతి గుండైనా కరిగించేస్తుంది.

ద్రౌపది విషాదంలో వీరత్వం చూపుతుంది. కన్నీటి కెరటాల్లో నెన్నెల జల్లుతుంది. వీరాధి వీరులైన పాండవుల కంటెకూడా కౌరవులుచేసిన దుర్నయాలకు తప్పక శిక్షవిధించాలని యుద్బోధిస్తుంది. కాన నీ ముగ్గురు నాయికల విషయములో కవులుచూపిన శృంగార వీర కరుణ రసములు పాఠకుల నానంద వీచికల నోలలాడించుచున్నవి.

[విజయవాడ ఆలిండియా రేడియో, సౌజన్యముతో]



# వరకట్నాలను నిషేధించండి

జి. యస్. రాజేశ్వరీ పట్నాయక్ గారు

శతాబ్దాల తరబడి మన నెత్తియెక్కి తొక్కుతున్నాయి, ఎన్నో సమస్యలు. వాటి శక్తి యెంతటి బలవత్తరమైనదోగాని వాటిని సృష్టించిన వారు మనకు తగిల్చిన బానిస శృంఖలాలను మనం ధరించే స్వర్ణాలంకారము లనిపించునట్లు చేయగలిగారు. అవిద్యచే అజ్ఞానాంధకారమున మన నారీ జీవితాన్ని ధన వ్యామోహానికి దత్తత జేసి ఆత్మనే మరపించి మురిపించి వ్యక్తిత్వాన్నే మంట గలిపారు ఈనాడు మనసమస్యలు తీరని కోరికలై మైలురాళ్ళవలె స్థంభించి పోతున్నాయి. వాటిలో జీవిత నాశనానికి గుఱియైన వరకట్న దురాచారం మరీ మితిమీరి ఆడబిడ్డలగన్న తలిదండ్రులను పీల్చి పిప్పి చేస్తున్నదనుట అందరికీ తెలిసిన విషయమే గాని ఈ సమస్యకు కారకు లెవరు? అనేది మనం ఆలోచించ వలసిన విషయం.

మన స్త్రీ జాతిలో ధన తృష్ణ బాగా మితిమీరి పోతోంది. ఇంతకూ చెప్పొచ్చే దేమంటె మాతృ మూర్తియగు ప్రతి స్త్రీ తన హృదయాన్ని ప్రశ్నించుకోవాలి. వెనుకటి తమ జీవితాల్ని (ముఖ్యంగా కొడుకులగన్న మాతృ దేవతలు) సింహావలోకనం చేయాలి. "మాతృదేవోభవ "అని గట్టిగా అన్నారా? మన పెద్దలు! స్త్రీ జాతిని పూజ్యస్థానంలో పేర్కొనడం అర్థం లేని మాటగా కాదు. భావి భాగ్యోదయానికి మార్గదర్శినులను, సంఘాన్ని వుద్ధరించే వీరులను వీర వనితలను, సక్రమ మార్గాల్లో తయారు చేసి లోకానికందజేసే మహావ్యక్తులం మనము. గనుకనే! మన అభ్యుదయానికి సోపానములుగా వున్నది పురుషులే అనీ. శతాబ్దాల తరబడి నియుగయుగాల తరబడిని స్త్రీలను దాస్య శృంఖలాలలో బంధించి అణచి వేసినది మగవారేనని ఎలుగెత్తి దూయబట్టిన రోజులు గతించాయి. మనము విద్యా, స్వాతంత్ర్యముల అవకాశాన్ని వినియోగించుకొనే ఈ రోజుల్లో బాలికల వివాహ సమస్య నాను నాను చాలా క్లిష్టంగా తయారైంది. శారదా చట్టం పుస్సమూ యని బాల్య వివాహాలు కొంతవర కంతరించినా బాలికల విద్యాభివృద్ధికి దారిచూపిందిగాని, కట్నాలో అధికమాసమన్నట్లు స్త్రీలోకానికి కొంకోవిపత్తు సంభవించింది. నేటి యువకులు శ్రీ ధారణతో కర్తవ్యతా మూఢులై, కట్నాల వాంఛతో మార్కెట్లలో వృత్సవ విగ్రహాలవలె వినోదిస్తున్నారు. వరుడు యెంతటి విద్యాధికుడైనన్నా ఏమి లాభం? కట్నమనే ఆయుధంతో స్త్రీ జాతిని అగౌరవపరచి అభ్యసించిన విద్యకు కళంకాన్నాపాదిస్తున్నారు. ఈ డిగ్రీదారులను జూచి బాలికల తలి దండ్రులు ఆకాశ హార్మ్యాలను నిర్మాణం చేస్తున్నారు. ఏమిటీ ఘూర్ఘూమారుతం? యెందుకీ వేలంవెఱ్ఱి? కన్యాదాతలే సంచులతో సమర్పిస్తామని పోటీ పడితే అందుకున్న వాడి కంతేమిటి? పూర్వపు రోజుల్లో సాలంకృత కన్యా దానం (కన్యకు యథా శక్తి అలంకారములతో) వివాహఘట్టం నిర్విఘ్నంగా సాగిపోయేది. మరి నేడో! ఈ పవిత్ర వాణి

ప్రహసనం చేసేలా పలికించే "ఏమైనా శ్రీమంతులకి పలుస్తారనుకోండి. వాళ్ళతో మాకు కళలు అరటిపళ్లు కాక మంచి గ్లాజులు, రిబ్బన్లు, పౌడర్లు ఇంకా దేవుడు మేలుచేస్తే అప్పటికి ఏం కోర్కెల వివాదమ మనసు విహరిస్తుందో అవన్నీ ఇస్తేనే వస్తాం" అన్నంత నిచాతి నీచమైన కోర్కెలవలె కనబడుతున్నాయి. వివాహమంటే తమ పవిత్ర జీవితాల్ని దాంపత్య జీవనానికి అంకితం చేసుకోవడ మన్నమాట. అంతేగాని వరులనోట్ల ధనం గుంజడంకాదు. ఉన్నదంతా తెగనమ్మి కొడుకుల విద్యాభివృద్ధికి ధారపోసి కట్నాలవల్ల రాబట్టు కొనుటలో అన్యాయమేమున్నదని కొందరు సోదరీమణుల వాదన. ఈ వాదన జూస్తే హాస్యాస్పదంగా కనుపిస్తోంది. పుత్రుల విద్యాభివృద్ధికి వెచ్చించిన ధనాన్ని పిల్లనిచ్చే వారి దగ్గర గుంజుకోవడం అవివేకం గదా ; ఏం ? శక్తికి మించిన పరుగులెందుకు ? ప్రతి బాల బాలికల విద్యాభివృద్ధికి సమానధాయిదా నిర్ణయించి యెవరికి వారు స్వతంత్రంగా జీవించే అవకాశమెందుకీయరాదు ? మీ ఆడబిడ్డల భావి జీవితాన్ని ఏ ఆశయంతో మీరు సక్రమమార్గాన సౌఖ్యాన్నభిలషిస్తారో, మీ యింటికి కోడలుగావచ్చే బిడ్డ జీవితానికా ఆశయాలెందుకు వర్తింప జేయరు ? మన అబ్బాయికి మాంచిడిగ్రీ ధారుడు పక్కా జిల్లా ఆఫీసరై కట్నం లేకుండా రావాలి! మన అబ్బాయికి మాత్రం (కాలేజి విద్య కాకపోయినా సరే) 3, 4 వేలకు తక్కువగాకుండా యింకా లాంఛనాలతో వస్త్రకానికి పెట్టుబడివలె డబ్బు హంగుతో కోడలు రావాలి! ఎంతటి సంకుచిత దృష్టి! ఈ పరిస్థితులకు తట్టుకోలేక యెన్ని జీవితాలు నరకప్రాయమౌతున్నాయి! ఎన్ని కోర్టు వ్యాపారాలతో, ఆత్మహత్యలతో భారతనారి సౌశీల్య జీవితాలు బజార్లకెక్కి పోతున్నాయి ఆలోచించారా? సోదరీమణులారా! మనము సంస్కార భావముల నలవరచుకొని ప్రతి స్త్రీ తనజాతి విషమ స్థితిని గ్రహించి ఈ వరకట్న దురంతాన్ని సమూలంగా నాశనంచేసి బిడ్డల భావిజీవితాల్ని శోభాయమాన మొనర్చుకోవాలి. మన సమస్యలు మనమే పరిష్కరించుకోవాలి. ఆనాడే సంఘంలో మన స్వాతంత్ర్య సిద్ధి.



వరకట్నమనేది, ముద్దు ముచ్చటకని, శక్తికొలది, ధన రూపకంగా అల్లుని గౌరవించుటకై ఏర్పడ్డ విధానము. క్రమేపీ, ఇది యొక శుల్కవిధానమై, పెద్ద దురాచారమై, ఆడబడుచుల కన్న తల్లిదండ్రులకు దుఃఖహేతువై, పిశాచమువలె భీతి గొల్పుచున్నది. దీనిని నిషేధమక్కరలేకయే నివారింపవలసినది స్త్రీలే ననుటలో సందేహములేదు. వరకట్నము కోరనట్లు తమ పుత్రులను ప్రోత్సహించుచూ, తమ పుత్రికలను కట్నముకోరని వరులకే యిచ్చి వివాహము చేయుటకు స్త్రీలు కృషి సల్పినచో కొన్ని దినములకు యీ దురాచారము నిషేధ మక్కరలేకయే అణగిపోగలదు.



# కథాసాహిత్యం - లక్షణాలు

❋ శ్రీ వాడ్రేవు శ్రీ జోగిపంతులు ❋

ఒకప్పుడు యశోద శ్రీ కృష్ణుని నిద్రపుచ్చడానికి వుయ్యాలలోవేసి ఊగిస్తూ "రాముడనే రాజుండేవాడురా కృష్ణా!" అంది. "ఊ" అన్నాడు కృష్ణుడు. "అతడికి సీత అనే భార్యవుంది!" "ఊ" అన్నాడు మరి కొంచెం శ్రద్ధగా. "ఆ రాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారం భార్యతో కూడ అడవికి పోయాడు!" "ఊ" అన్నాడు మరింత గట్టిగా. "ఆ అడవిలో వారుండగా రావణుడు సీత నెత్తుకు పోయాడు!" అంది. ఈ మాట ఊ కొట్టడానికి బదులు "లక్ష్మణా! బాణం తీసుకురా ఆ పాపాత్ముణ్ణి కొట్టేస్తా!" నన్నాడట చిన్ని కృష్ణయ్య. ఇందులోని అంతరార్థమేమిటో మనకి అక్కర్లేకపోతే—యశోదమ్మ పాడిముక్కలే చిన్ని కృష్ణయ్య మనస్సును కదలించ గలిగాయి. ఇది కథకుడికీ, పాఠకుడికీ వుండే సంబంధాన్ని, పాఠకుడి మీద గాని శ్రోతమీదగాని కథలకు గల ప్రభావాన్ని తెలియ జేస్తుంది. కథలు వినడం మనకు ఆదికాలంనుంచీ వచ్చే ఒక అలవాటు, ఆచారము అయింది. అమ్మమ్మా, నాయనమ్మా అలవాటు చేసింది కథలు చెప్పడం. ఏ ఒక్కరోజు నన్నా కథ వినకపోతే లంఖణం చేసినంత బాధపడే వాళ్ళం. నీతి, భక్తి మొదలైన గుణాలు అలవరచడానికి కథలు సాధనాలుగా గ్రహింపబడ్డాయి. అల్లరిచేస్తున్న పిల్లల్ని ఊరుకో పెట్టడానికి కథ అసలైన మాత్ర. పగలెల్లా కొట్టుకొని కొట్టుకొని వచ్చేవాడికి కాస్త మానసికానందం ఇచ్చేది కథే! వినోద రూపకంగా విజ్ఞానము నందియ్య గలగాలి. అందుచేతనే విష్ణుశర్మ కాకుల్ని, నక్కల్ని, గద్దల్ని పాత్రలుగా స్వీకరించి కథారూపంలో చక్కని నీతిని ప్రబోధించాడు; మన పూర్వీకులు కనిపెట్టిన అద్భుత భౌతిక విషయాలు కథల రూపంగా పురాణాలకీ, ఇతిహాసాలకీ యెక్కడానికికూడా యిదే కారణమయి వుంటుంది. అయితే— మన ప్రాచీన గ్రంథాలు కేవలం పద్యమయాలుగా వుండడమూ, పండితులకు కూడా అర్థంకాని పాషాణ శైలిలో వుండడముచేత, వాటిలో యెటువంటి అమూల్య విషయాలున్నా సముద్రం అడుగునవున్న రత్నాలాగా నిరుపయోగాలయి పోయాయి. "సహితస్య భావః సాహిత్యం" అనే సాహిత్య ప్రయోజనాన్ని విస్మరించి కవనం సాగించారు. మన కథలు ఛందో శృంఖలాబద్ధములు గాకడంచేత వారికృషి ఫలప్రదం కాలేదు—

పురాణాంధ్రీకరణ యుగం పోయింది. ప్రబంధ యుగం పటాపంచలయింది. అవధానాల యుగం అంతరించింది. తరుముకుంటూ ఖండకావ్య యుగం వచ్చింది. దానితో సమంగానో, కాస్త ఇంచు మించులోనో వచన వాఙ్మయానికికూడా స్థానం లభించింది సారస్వతంలో. నవలా యుగం నామమాత్రా వశిష్టం అయింది. నాటకాల యుగం నడచి పోయింది. ఇది కథల యుగం. ఏడేళ్ల కుర్రాడి దగ్గర్నుంచీ ఏనుబదులు దాటిన తాతయ్య దాకా కథలు చదవడానికి ఆరాటు పడటం మహా అలవాటయి పోయింది. కేవలం మన భాషలో నేగాక నేడు యావత్ప్రపంచ భాషలన్నింటిలోను కూడా కథలకి ఇంతటి సమున్నత స్థానమూ సంక్రమించింది. రష్యన్ భాషలో ఆంటన్ చెకోవ్, మాక్సింగోర్కీ, లియోటాల్ స్టాయిల్ కథలూ— ఫ్రెంచి భాషలో మపాసా, సోమర్సెట్ మాఘమ్, విక్టర్ హ్యూగోల కథలూ, ఇంగ్లీషు భాషలో ఎంబ్రోస్ బయర్స్, వుడ్ హౌస్ల కథలూ—బెంగాలీ భాషలో రవీంద్రనాథ టాగోర్, శరత్ బాబుల కథలూ—హిందీ భాషలో ప్రేమచంద్, సుదర్శన్, జకీర్ హుస్సేన్ల కథలూ—మన భాషలో చలం, కొడవటిగంటి, ధనికొండల, కథలూ బాగా ప్రచారంలోకి వచ్చాయి.

కొద్ది సంవత్సరాల క్రిందటికీ, నేటికీ కథల స్థానంలో ఎంతో మార్పు సుస్పష్టంగా గోచరించింది పత్రిక విప్పితే కథలెన్ని వున్నవో చూస్తాడే గాని—పాఠకుడు వ్యాసాల పట్లగాని, మరే విధమయిన రచనలపట్ల ఏ విధమయిన ఆసక్తినీ ప్రదర్శించడంలేదు. పత్రిక బాగులేదంటే - అందులో

మంచికథలు లేవన్నమాట. దీనికంతటికి కారణమేమిటని గనక ఆలోచిస్తే- నేటికథాకారులు వర్తమాన జీవితం, వర్తమాన మానవునిలోని సంఘర్షణములకు వ్యావహారిక భాషా రూపం కల్పించి పాఠకుడికి అందియ్యడం చేతగాని మనం తెలుసుకోగలుగుతాము.

ఈ విషయమై కథలు సృష్టించడానికి గురజాడ అప్పారాయకవి ప్రథముడే కావాలి. వాటి సంఘంలోని అవినీతిని మతాచారాన్ని బట్టబయలుచేస్తూ, వ్యావహారిక భాషలో వారు వ్రాసిన కథలు, ఆనాటినుంచి వచ్చే జాతకకథలు, కథా సరిత్సాగరం, విక్రమార్కకథలు మొదలైన గ్రాంథిక భాషాబద్ధములయిన కథలకు భరతవాక్యం చెప్పాయి. "మీ పేరేమిటి?" అనే కథానికలో అప్పారాయకవి మతం పేరిట మాధ్వాచార్య సంపన్నులైన గ్రామస్థుల్ని మోసంచేసే మత గురువుల్ని నిశితంగా విమర్శించారు. ఇంతటి అనల్పశిల్పచాతుర్యమూ, అపూర్వమైన కథావస్తువూ కలిగిన కథానిక నేటివరకు మన సాహిత్యంలో సృష్టింపబడలేదనొచ్చు. ఆధునికాంధ్ర కథాసాహిత్యానికి మూల పురుషుడు గురజాడకవి. ఆయన్ని ఆదర్శంగా పెట్టుకొని మన యువ రచయితలంతా కథలూ కథానికలూ వ్రాశారు; వ్రాస్తున్నారు- వ్రాస్తారుకూడా!

ఆనాటినుంచీ కథలు మానవుని మీద చూపే ప్రభావము విషయం ఆదిలోనే ప్రస్తావించాను. అక్షరాస్యులైన, అజ్ఞానులైన వేలాది ప్రజలకు విజ్ఞానాన్ని ప్రసాదించగలదు కథ. అయితే-కథగాని కథానికగాని రచించడం చెప్పేటంత తేలిక పనిగాదు! కథా రచనకు విశేష చాకచక్యం కావాలి. తీయని పలుకులలో పొదివి, చల్లని రసమునింపి భావసంపత్తితో ఏదో ఒక మానవ సంభావన సంఘటనను చిన్నచిన్న ఉదంతాలతో వాకొనడమే కథారచన. కథ వయోభేదం లేకుండా రుచి కలిగించాలి. "పాఠకునికి తాత్కాలిక హృదయ వికాసం కలిగించడం మాత్రమే కాకుండా, పై [illegible] పల్లవించాలి". ఇట్టి సందర్భ సన్నివేశాల్లో నేను కూడా ఇలాగే చేసివుంటానని పాఠకుడు ఊహించే అంతటి సహజంగా వుండాలి కథాగమనం. "చిన్న కథ ఒక అరగంటమొదలు రెండు గంటల లోపల ముగించ గలిగి వుండా" లన్నాడు, ఒక ఆంగ్లకవి. చిన్నకథకు అంత నిడివి కూడా తగదంటాను నేను.

కథావస్తువు అల్ప పరిమితిలో ఇమడాలి. విషయాలు పెంచి, చొప్పించి నట్టుండకుండా, "ఇంతకంటె యెక్కువయితే మరేం లాభంలేదు" అని భావించాలి పాఠకుడు. కథకు ప్రాణంపోసేది కథావస్తువు. కథావస్తువు అతి సహజమైనది సంగ్రహించి, సంభాషణలు సహజత్వం చెడకుండా శిల్పం అవీ జాగ్రత్తగా చూసుకొని నట్టయితే అటు పండితులూ, ఇటు సామాన్య పాఠకులూ కూడా హర్షిస్తారు.

కథ చదివేసరికి పాఠకుడు ఇదివరకున్న భావాలకి తిలోదకాలిచ్చి, బుజాలు తెంచుకొని నిప్పుతొక్కిన కోతిలాగ చిందులు తొక్కేలాగ వుండకూడదు. ఉత్తేజ పరచాలి; కాని అతిగామాత్రంకాదు. మనస్సుకు సంచలనం కలిగించి, లోపాల్ని తగురీతిని నచ్చచెప్పి పాఠకుల చేత సింహావలోకనం చేయించి తనలోనూ, తన మతంలోనూ, తనసమాజంలోనూ, తన ఆచార వ్యవహారాల్లోనూ ఉన్న తప్పుల్ని దిద్దించి, అన్నింటినీ సరియైన మార్గానికి తెచ్చే మాదిరి కథల్నే కథకులు రచించాలి. లోకాన్ని మరమ్మత్తు చేయడానికి నీతిప్రబోధం కన్న, అవినీతి ప్రదర్శన సులభ మార్గమని కొందరి అభిప్రాయం. బాహాటంగావుండే వాచ్యపద్ధతులే అనుసరించలేని ప్రజలు వ్యంగ్యాన్ని వెతుక్కుంటూపోయి దాన్ని పట్టి అమలు పరుస్తారనుకోవడం కేవలం వెర్రితనం.

కథకులు లోపాల్ని సరిదిద్దుకొని జనసామాన్యం హృదయానికి హత్తేటట్టుగా రచనలు సాగించిననాడు ఆంధ్ర వాఙ్మయోద్యానంలో కథా సాహిత్య వసంతశోభ వెల్లివిరుస్తుంది మరింతగా. లేనినాడు—కథలు, కథానికలు ఏరీతిగా ఇతర విధములైన రచనల్ని దిగద్రొక్కి ఈ నాడు ఇంతటి స్థానం ఆక్రమించగలిగినవో, అదే రీతిగ మరో విధమయిన రచన ఏదేనా కాలగర్భంనుండి వెలువడి కథల్ని వాటిస్థానం నుండి దిగద్రోయడానికి ప్రయత్నించి తీరుతుంది.

సెలవు.



# కనకాంబరాలు

శ్రీ గ్రిద్దలూరు గోపాలరావుగారు

“పూలో...పూలో”

పన్నీరులు—గన్నేరులు

చామంతులు—పూబంతులు

బొడ్డుమల్లెలు—గడ్డసంపెగ

సన్నజాజులు—విరజాజులు

కనకాంబర—గేదంగులు

ఎన్నో ఎన్నో...

రంగు రంగుల

పూలో—పూలో—

పూలబుట్ట చేతబట్టాడు కొన్ని పూలదండలు చేతిమీద వేసుకున్నాడు...గాలిలో గిర్రున తిరుగుతూ వేలాడుతున్నాయి పూల దండలు—వీధి పొలిమేరను తొలి కేక వేశాడు పూలతాత...పూల పరిమళంలో తాత నడిచి వస్తున్నాడు వీధివెంట...

యిదే ప్రథమ పర్యాయం ఆ వూరిలో పూలమ్మవచ్చాడు తాత...వీధి కొనవరకూ వెళ్ళాడు...ఒక్కరూ పిలిచి కానీ పూలుగూడా కొనలేదు...తాత నిరుత్సాహపడి పోయాడు. మరల ముదిమిగొంతు ఎత్తి అరిచాడు బిగ్గరగా...

‘పూలో, పూలో’—

‘ఓ పూలో! యిలారా’—ఒక లేత కంఠం ఎంతో మృదువుగా పిలిచింది...

పూల తాత ఆగి తలపైకెత్తి చూచాడు...

అతని ముడుతలుబడ్డ ముఖంలో ఎందుకో అంత ఉత్సాహం రేకెత్తింది...అకస్మికంగా ఎందుకో ముదిమి పెదిమలపై ముసిముసి నవ్వు తొలికింది...

ఆ మిద్దె మొదటి అంతస్థులో యినుప చువ్వలతో లేని కిటికీ తలుపులు తెరచుకొని ఓ లేత లేమ; పదు మూడేండ్ల వయస్సుంటుంది...యిప్పుడిప్పుడే యవ్వనం ఆమెలోచొచ్చుకుంటూవుంది—పూల తాతను పిలిచింది...ఆమె అలా ఆ కిటికీలోనుంచి తొంగి చూస్తూవుంటే—నీల వర్ణపు ఆకాశంలో, నల్లని మేఘచ్ఛాయను తొలగించుకొని తొంగి చూస్తూవున్న తెల్లని పూర్ణ చంద్ర బింబంలా కాన్పిస్తూ, హృదయాన్ని ఆహ్లాద పరుస్తూవుంది...

తాత చూస్తూనే వున్నాడు...

‘పూలో, అలా తిరిగి లోపలికిరా’—అన్నది మళ్ల ఆలేత నూనూగు కిన్నర కంఠము...

పూల తాత దర్వాజా తలుపులు తెరచుకొని లోపలికి వచ్చాడు...ఆ అమ్మాయి ఎదురైంది...

“ఏ పూవ్వులు కావాలమ్మా—తాత సంతోషంగాఅడిగాడు...అతనికి ఆమెను చూస్తే ఎందుకో అంత సంతోషము?

“కనకాంబరాలున్నాయా తాతా”—తాత చేతి మీద వ్రేలాడుతూన్న దండలను కదలిస్తూ అంది...

తాత విస్తుగా, ఆత్రుతతో ఆ అమ్మాయి ముఖంలోకి చూస్తూ నిలుచున్నాడు...జవాబు చెప్పలేదు...

‘ఏమిటి తాతా అలాగే చూస్తున్నావు’—

తాత ఉలిక్కి పడ్డాడు...

‘ఏమీ లేదమ్మా!...నీ వైపు చూస్తూ వుంటే యింకా చూడాలనిపిస్తూనే వుంది...బ్రహ్మ అందమైన వస్తువుల్లో సౌందర్యాన్నంతా నీకే యిచ్చాడు...నీవెంతో అదృష్టవంతురాలవమ్మా...

అదీగాక నిన్ను చూస్తూవుంటే పదిహేను సంవత్సరాల నాడు చచ్చి పోయిన నా చిట్టి మనుమరాలు జ్ఞప్తికి వస్తూవుంది...నా మనుమరాలే యిక్కడ పుట్టిందా అనిపిస్తూవుంది...అంతా ఆలాగే వున్నావు...నీకంటె ఆ అమ్మాయి కొంచము నలుపు...అంతే’—

ఆ అమ్మాయి నూనూగు సిగ్గుతో, చిరునవ్వుతో తల్లి ముఖంలోకి చూచింది...

'మనుజుని పోలిన మనుజులు లేకుండా వుంటారా తాతా...కనకాంబరాలుంటే యిచ్చిపో'అంటూ లోపలికి వెళ్ళిపోయింది అమ్మాయి తల్లి...

తాత అడుగుతున్న కనకాంబరాలు తీశాడు...నాలుగు దండలు మనస్ఫూర్తిగా అమ్మాయి చేతికందించినాడు...

'కనకాంబరాలంటే యిష్టమా అమ్మాయి—నీకు'

'అవును తాతా...కనకాంబరాలు తప్ప యింకేవీ పెట్టుకోను నేను...'

"నిజంగా నీవు నా మనుమరాలివే నమ్మా!...అంతా అవే గుణాలు...నా మనుమరాలు కూడా కనకాంబరాలు తప్ప ఏవీ పెట్టుకునేదికాదు...ఎక్కడ లేకున్నా, గాలించి వెదకి కొద్దిగానైనా ఆ అమ్మాయికి తీసుక పోయి యిచ్చేవాణ్ణి."

ఆ అమ్మాయి నవ్వుతూ "నీ మనుమరాలినే అనుకో తాతా...యిదిగో డబ్బులు తీసుకో"—అంటూ పావులా యివ్వబోయింది...

తాత మెల్లిగా నవ్వాడు. 'వద్దులే అమ్మాయి...నీవే వుంచుకో...నేను కనకాంబరాలు నా మనుమరాలి కిచ్చాను డబ్బులు తీసుకోను'—

"డబ్బులు తీసుకోకుంటే నీకు తిండెలా జరుగుతుంది తాతా!'—

'జరుగుతుందిలే అమ్మా! యిదివరకంతా కనకాంబరాలు నా మనుమరాలి కిస్తుండేవాణ్ణిగా...అదేమీలేదు యిప్పుడు... యీ రోజునుంచి ఆ కనకాంబరాలు నీ కిస్తున్నాను.

యీ రోజునుంచి ఆ కనకాంబరాలు నీ కిస్తున్నాను... యీ విధంగా నయినా, నా మనుమరాలి ఆత్మకు కొంత శాంతి కలుగుతుందమ్మా! ... ఏమీ సంకోచించకుండా తలలో పెట్టుకో!—'

ఆ అమ్మాయి తాత ముఖంలోకి ఒక విధంగా చూచింది. తాతకూడా ఆ అమ్మాయి ముఖంలోకి పరికించిచూచాడు... కనుకొలకులో ఆశ్చర్యమూ జాలీ కలిగింది—

'అమ్మాయి...'—

'ఏమిటి'—అన్నట్టు తాత ముఖంలోకి చూచింది...

'నీకు వివాహమైందా?'—

ఆ అమ్మాయికి సిగ్గూ కలవరమూ బయలుదేరింది. తటాలున తన మాంగల్యం సిల్కుపయ్యెద చాటున దాచేసింది...తల వాల్చి నిల్చుంది...

తాత ముఖంలో దీనత్వం ప్రస్ఫుటించింది... అనాఘ్రాణిత కుసుమానికి అప్పుడే తుమ్మెదను తగలాటం పెట్టడమేమిటి అన్నట్టు అతని లోతు నేత్రాలు మెల్లగా శూన్యంలోకి దూరాయి...

యింతలో పైనుంచి అమ్మాయి తల్లి పిలిచింది...

'వస్తాను తాతా'అన్నట్టు అతని ముఖంలోకిచూచి లేడి పిల్లలాఛంగు, ఛంగున ఎగురుతూ మేడ మెట్లెక్కి వెళ్ళిపోయింది...

పూల తాత అలాగే ఆనందంతో అమ్మాయి వైపు చూస్తూ నిట్టూర్చాడు...మెల్లిగా వీధిలోకి వచ్చాడు... కేక వేశాడు...

"పూలో...పూలో"—యిప్పుడు ఎంత ఉత్సాహం అతని ముసలి నరాలలో చెలరేగుతూవుంది...ఒక్క నిముషములో వూరంతా విడివడిగా తిరిగాడు...ఒక్కరూ పూలుకొన్న పాపానపోలేదు...కొనకున్నా పర్వా లేదు... పూలు వెలపోలేదని అతనిలో కించిత్తైనా ఖేదంలేదు...

అతని హృదయం ఆనందంతో ఉప్పొంగి పోతూవుంది. ఆ అమ్మాయి తన నేత్రాలలో మెదలుతూనేవుంది...

ఆ వూరిలో ఎవ్వరూ తనవద్ద పువ్వులు కొనే వాళ్ళు లేకున్నా...ప్రతి రోజూ ఆ అమ్మాయికి కనకాంబరాలు యిచ్చేందుకుగా పోయేవాడు...

ఆ అమ్మాయిని చూడందే తాత ఒక్క రోజు వుండలేడు...కనకాంబరాలు ఎంతో ముచ్చటగా, ప్రత్యేకంగా కట్టుకపోయి, ఆ అమ్మాయి కిచ్చేవాడు...

పూల తాత గొంతు వీధి పొలిమేరున వినగానే—ఆ అమ్మాయి కిటికీలోనుంచి తొంగి చూచేది... చిన్ని తన పెదవులపై చిలిపిగా చిరునవ్వు చిందించేది తాత తల పైకెత్తి మెల్లిగా నవ్వేవాడు...

"లోపలికిరా తాతా"—అని ఎంతో అనురాగంతో మార్దవంగా పిలిచేది, ఆ అమ్మాయి...తాత దర్వాజ నెట్టుకొని లోపలికి వచ్చి కనకాంబరాలు ఎంతో ఆనందంతో యిచ్చేవాడు...రోజు రోజుకూ ఆమె నవనీత తనూలతలో అలముకుంటూవున్న యవ్వనరేఖల అందాలరాణిని, సౌందర్యసోయగమును—పూల తాత తనివిదీరా చూచి తన్మయుడయ్యేవాడు. ఎంతసేపు చూచినా తనకు కొత్తగానే కనిపిస్తూ వుండేది...

కనకాంబరాలు బూయుకాలం దాటి పోయింది...వాటి అదును మీరిపోయింది...కనకాంబరాలు యిప్పుడు పూయుటములేదు...కనకాంబరాలు తప్ప ఆ అమ్మాయి యింకే పూలూ పెట్టుకోదు...పూల తాత రిక్త హస్తాలతో ఆ అమ్మాయి దగ్గరకు పోనంగీకరించక...ఆ వూరికి పోవటమే మానుకున్నాడు...యితను అక్కడకు వెళ్ళి ఆ అమ్మాయిని చూడకున్నా—ఆ అమ్మాయి అందాలదొంతర ప్రతిబింబము మాత్రము ముసలితాత మనోవీధిలో ఎప్పుడూ పొర్లుతూనే వుండేది... ఆ ముదిమి నేత్రాలలో ఎప్పుడూ మెదలుతూ వుండేది...

కనకాంబరాలు బూయు అదును వచ్చింది...కనకాంబరాలు తొలిపూత బూచాయి...ఆ కనకాంబరాలు ఎంతో కాంతితో వెలుగొందుతూ క్రొత్తదనాన్ని వెద జల్లుతున్నాయి...పూల తాత కనకాంబరాలు దండ గట్టాడు... ఆ దండ అందాన్ని జూచి తనే ఎంతో మురిసి పోయాడు... యిక ఆ అమ్మాయి...చాలా రోజులనుంచి కనకాంబరాల ముఖమే చూడని స్త్రీ—ఆ దండనుచూచి ఎంత ఆప్యాయంగా ఆనందంతో అందుకుంటుందో, అనుకున్నాడు తాత.

'ఆ అమ్మాయిని జూచి చాలా దినాలయినది—తన చేతితో కనకాంబరాల దండ అందించి చాలాకాలమైంది... యిది కనకాంబరాలుపూచే అదునని ఆ అమ్మాయికి తెలుసు. నేను తప్పకుండా యీ రోజు పూలు తెస్తానని నా కొరకు కిటికీలో నుంచి ఎదురు చూస్తూ వుంటుంది'—అనుకుంటూ పూలతాత ఆ వూరిలోకి వచ్చాడు...

'పూలో...పూలో'—

యీ దినం తాతగొంతు ఎందుకో బొంగురు బోయింది. వీధివెంట నడుస్తూవుంటే తనకేదో నిరుత్సాహంగావుంది... హృదయమెందుకో బరువు భారి పోతూవుంది...మనస్సెందుకో కలతజెందుతూ వుంది...'పూలో'—అంటూ యరిచేందుకు గొంతురావటములేదు...తాత ఎంత ఉత్సాహంగా బయలు దేరాడో అంత వుత్సాహం యిప్పుడు అతనిలో లేదు...దీనికంతా కారణమేమిటో తీవ్రంగా ఆలోచించాడు ఏమి గోచరం గాలేదు...

ఆ కిటికీ దగ్గరకు పోయి గొంతు సకలించి అరచాడు తాత.. గొంతు తడబడింది...మెల్లిగా తల పైకెత్తి లోతు నేత్రాలతో కిటికీలోకి చూచాడు...

యీ రోజు ఆ అమ్మాయి ఆ కిటికీలో నుంచి చూడలేదు...ఆ కిటికీలో శూన్యం గోచరించింది...

తాతకు ఏమీ గోచరంగా లేదు...ఊరికేమైనా వెళ్ళిందేమో—అనుకుంటూ దర్వాజా నెట్టుకొని లోపలికెళ్ళాడు తాత...

ఎవ్వరూ కనుపించలేదు...వేల మైళ్ళ లోతులో ఎక్కడో అనిర్వచనీయమైన చీకటి అగాధంలో—ఎప్పుడూ విషాద చ్ఛాయలు, నిశ్శబ్దత, మూగగా, మాంద్యంగా, దొంతరలుగా సంచరిస్తూవుండే దానిలో ప్రవేశించినట్టు తల చాచు తాత...నలువైపులా ఓక్కాగా చూస్తూ నిలుచున్నాడు తాత...

యింతలో ఆ అమ్మాయి అమ్మ లోపలినుంచి ఖిన్న వదనంతో ప్రవేశించింది...

'అమ్మాయి ఏది' మెల్లిగా ఆత్రుతతో అడిగాడు తాత...

'ఎందుకు తాత?'—కంపిత కంఠంతో, కారే కన్నీరు తుడుచుకుంటూ అడిగింది అమ్మాయి తల్లి...

తాత హృదయం జారిపోతూవుంది...పరితపించి పోతూ వుంది... డగ్గుత్తికతో అన్నాడు... 'కనకాంబరాలు... యిచ్చేందుకు'—

"కనకాంబరాలా!!... అమ్మాయి యిక పెట్టుకో కూడదు"... అక్కడలేదు..."ఆమె యిక అక్కడ నిల్చో లేక పోయింది... లోపలికెళ్ళిపోయింది...

తాత స్తంభించి నిలిచి పోయాడు... నేత్రాలు నిలువు చూపు చూస్తున్నాయి...

ఆ యింటినుంచి పొరుగింటమ్మ కామాను బైటకు వచ్చి నది...

'ఏమిటి'—అన్నట్టు ఆమె ముఖంలోకి చూచాడు...

"యింకా యెందుకయ్యా నిలుచున్నావు...పువ్వులు అక్కడ లేదు...అమ్మాయి పెట్టుకో కూడదు...భర్త చని పోయి విధవై మూల కూర్చుంది'—ఆమె యిక చెప్ప లేక పోయింది ..

తాత ముసలి నరాలలో పటుత్వం తగ్గింది...రక్తం చల్ల బడింది...ప్రాణంబుట్ట తెలియకుండానే క్రిందబడి పోయింది. హృదయం వ్యథతో కృంగింది... నేత్రాలనిండా నీరు క్రమా యి...ధారగా జారి ముడుతలుబడ్డ దౌడలనుంచి పొర్లి దుమ్ములో పడివున్న కనకాంబరాలమీద పడ్డాయి...

తాత మెల్లిగా బైటకునడిచాడు...తల పైకెత్తి కిటికీలో చూచాడు...యిది వరకున్న కాంతి గరిమలు అచ్చట కను పించలేదు...ఎంతో శూన్యత, ఎంతో విషాదం... ఎంతో నిశ్శబ్దత ఆ కిటికీలో పెనుగులాడుతు వున్నది...తాత అలా పరికించాడు...చూచాడు...ఎంతోసేపు చూచాడు...

కనురెప్పలు మెల్లగా బరువుతో వ్రాలాయి...మరల కన్నెత్తి కిటికీలోకి చూడలేకపోయాడు తాత—వీధి వెంట తన పాదాలు దారి తీస్తుంటే చైతన్యం లేకుండానే నడచి వెళ్ళాడు...ఆ ముదిమి హృదయం...ఆ ముదిమి తనువు ఎలాపోయిందో...ఎచ్చట ఖేదంతో రాలి పోయిందో... ఎచ్చట దాగేసిందో... తెలియనేలేదు...



# ఓయి సందేశహారీ!

మాతృక :—నికొలస్ రోరిక్

ఆర్. సోమసుందర్

సందేశహారీ!...

నవ్వె దెందుల కోయి
నిలచియే కిలాకిలా

నాకేమి తెచ్చితివో
తెలియ జేయుదు వోయి?

అవని గాయము లెల్ల
నశ్రు ధారల తోన

కడిగడిగి మాన్పంగ
వరము దెచ్చితి వోయి?

ఏడ నుండి తెత్తు
వింత కన్నీటినీ

ఏగాయముల మాన్ప
నెరుక పరచెద వోయి?

నవ్వె దెందుల కోయి
నిలచియే కిలకిలా

నవ్వుతోనే మాన్ప
నీ కాజ్ఞ లేదోయి?

సందేశహారీ!





# తెలివిగలకోతి

✻ శ్రీమతి డి. స్వర్ణకుమారిగారు ✻

మా యింటి కెదురుగా పెద్ద నిమ్మచెట్టు వున్నది. ఆ చెట్టుమీదయెన్నో కొండముచ్చులు (నల్లని ముఖాలు, పెద్దతోకలుగల కోతులు) నివసిస్తూండేవి. అవి ప్రతిదినం ఉదయం సాయంకాలం చుట్టు ప్రక్కల ఇళ్ళల్లో నానా అల్లరి చేసేవి. అందులో మా యింటి కెదురుగా వుండటంవల్ల మాకు మరీ చికాకు గలిగించేవి. పొరపాటున ఏ వస్తువులైనా వాటి కంట్లో మేము మరచి పోవడంవల్ల పడిందీ అంటేమాత్రం ఆ వస్తువు ఆ కోతి దగ్గరకు వెళ్లి పోయిందే అనుకోవాలి. అది అక్టోబర్ నెల. ఆ రోజుల్లో మా మామయ్య చూడటానికి మా ఇంటికివచ్చి యుండెను. ఒక రోజున మామయ్య స్నానం చేసి ఆరవేసిన బట్టలు కోతి నానా గమ్మత్తులు చేసి, చింపి పేలికలు చేసింది. క్రొత్త వాడు కాబట్టి మామయ్య ఆ రోజంతా చాలా విచారించేడు. ఆ కోతు లన్నింలో కన్నా మంచి టక్కరికోతి ఒకటుండేది. దాని దుష్టత్వమెంతో తెలివికూడా అంత వుండేది.

ఒక రోజు మామయ్య నాకోసం మంచి మిఠాయి పొట్లాం తెచ్చి మా చెల్లాయి లక్ష్మిని కేకవేసి దగ్గరవున్న బల్లపై ఆ పొట్లాన్నుంచి కాళ్లు చేతులు కడుక్కునేందుకు నూతి దగ్గరకు వెళ్ళేడు. మామయ్య కేక విని ఏడుస్తున్న చిట్టి తమ్ముణ్ణి యెత్తుకుని లక్ష్మి వచ్చేసరికి ఏముంది.... పొట్లం చేతితో పట్టుకుని చెట్టుమీద కోతి పండ్లు యికిలిస్తోంది. మా లక్ష్మి ఏడుస్తూ మిఠాయిపొట్లానికై అమ్మను కేకవేస్తోంది. కాళ్లు కడుక్కొని వచ్చిన మామయ్య నిశ్చేష్టుడయ్యాడు. పళ్లు, బియ్యం చూపి మా అమ్మ యెంత అదలించినా కోతికి లక్ష్యమా! భయమా! మంచి మిఠాయిలు తిందామన్న మా కోర్కె కోతికి లభించింది. మిఠాయి కోతిపాలయింది. మా చెల్లాయికి కోతిమీద బాగా యీర్ష్య కలిగి "మామయ్యా ఈ కోతిని వలలో యేదన్నా తినటానికి పెట్టి కట్టేస్తేనో" అన్నది. "పిచ్చిదానా, వల్లో చిక్కు-

తుంటా ఈ టక్కరికోతి' పుంటు ఒకే వుపాయం తట్టింది. రేపు దీని పని పడదాం" అని గబగబా పెరట్లోనికి వెళ్ళాడు.

ఆ మర్నాడు ప్రొద్దున్న మామయ్యా నేను కలిసి ఊరిబయటికి వెళ్ళాం. అక్కడ పాముల వాళ్ళు నివసిస్తూంటారు. వాళ్ళ దగ్గర ఎన్నో రకాల పాములున్నాయి. వాళ్లకు ఎక్కువ డబ్బాశ చూపి ఒక పామును ఇమ్మన్నాడు. ఎన్నోరకాల మిఠాయిలనుకొని పొట్లాం కట్టి పాముల వాడి కిచ్చాం. వాడు జాగ్రత్తగా వాటి మధ్యలో ఒక నల్ల త్రాచును బెట్టి గట్టిగా కట్టి పైన అరటియాకులు బాగాచుట్టి మామయ్య చేతికిచ్చాడు. పట్టుకోడానికే ఒళ్లు జలదరించే ఆ పొట్లాన్ని యెంతో భయంతో యింటికి తెచ్చి మామూలుగా బల్ల మీదనే పెట్టి లక్ష్మిని అందుకోమన్నట్టుగా కేకవేసి కనుసైగ చేసాడు లక్ష్మివైపు అదలింపుగా. లక్ష్మికూడా ఏదో పని ఉన్నట్టుగానే అందుకోకుండా పక్కకి తొలగి పోయింది.

మామయ్యా నేను పెరటి వైపు వెళ్ళామో లేదో కోతి గబగబావచ్చి పొట్లాన్ని గట్టిగా పట్టుకొని నిన్నటి రోజుకన్నా పై కొమ్మ మీద కెక్కిపోయి, బెదరించినా లాభం లేదు సుమా అనే మాదిరి మావైపొకసారి కొంటె చూపు చూచి పండ్లికిలించిది. మేమందరం గుండెలు దడదడలాడగా పైకిచూస్తున్నాం. ఈ వేళటితో - ఈ కోతి పని సమాప్తం అన్నాడు మామయ్య. కోతిచేతిగోళ్లతో పొట్లాన్ని చీల్చుతుంది. పాము పడగ బయటికివచ్చి ఘంఘం శబ్దం వినవస్తోంది. కోతి గుండె బేజారై పోతున్నదని మేమనుకున్నాం. గాని ఆ కోతి పొట్లాన్ని ఇరుకు గల కొమ్మల్లో యిరికించి బాగా నిదానించి పాము తల గట్టిగా పట్టేసింది. పొట్లాంలోనున్న శరీరమంతా బైటికి తీసుకొని పాము తోకతో కోతి చేతిని చుట్టేసింది. కోతి యింకా గట్టిగా పాము తలను బిగ పట్టేసింది. పాము అరుస్తూనే తోకతో దానిచేతిని మరీ బిగువుగా చుట్టేసింది ఏమి వుపాయం తట్టిందో! కోతి పాము తలను కొమ్మమీద అరగి దీయడం మొదలు పెట్టింది. రక్తం కారేవరకు ఆ పామును అలా నూరుతూనే యుంది. రాను రాను పాము అరిచే శబ్దం నీరసించి పోయింది. మధ్య మధ్య ఆ పట్టుకున్న పాము తలను శబ్దం చెవికి ఆనినంత దూరంలో చెవిదగ్గర విని మళ్లీ చెట్టు కొమ్మను నూరడం ....యిలా చాలాసార్లు చేసింది. ఈ బాధకు తట్టుకోలేక రక్తం బొటబొట కారి పాము కోతి చేతిలో ప్రాణం వదిలింది. క్రమేపి కోతి చేతిని చుట్టుకున్న పాముతోక వదులై జారి పోయింది. మళ్లీ అనుమానం వదలక పాము చితికిన తలను కొమ్మమీద గట్టిగ నూరి క్రింద పడవేసి మళ్లీ వస్తుందేమోఅన్న అనుమానంతో గంభీరంగా క్రిందికి చూస్తున్న కోతిని చూస్తే మా కందరికీ చాలా ఆశ్చర్యమై పోయింది. కోతులలో వున్న ఈ బుద్ధి మనుష్యుల్లో వుండదేమో అనిపించింది.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## XI

### పరిసరములు—వాతావరణము

శిశు శరీరపోషణకు, పెరుగుదలకు ఆహార విహారాలు, నిద్ర మున్నగునవి అవసరమైన రీతిగనే, శిశు మానసిక వికాసానికి తగిన పరిసరములు, వాతావరణ అవసరము. అనగా, శిశువుకు మొదటి సంవత్సరములో ఆరోగ్యకరమైన ఆహారం, శుభ్రమైనగాలి, పరిశుభ్రమైన ప్రదేశం, వెలుతురు, కావలసినంత నిద్ర ఎంత అవసరమో, దానికి తగిన పరిసరములు, స్వేచ్ఛగా ఆడుకొనటానికి అవకాశం, ఆట వస్తువులు, తల్లిదండ్రులు, బంధుజనములయొక్క ఆదరణ ప్రేమలు, సహవాసం అంత అవసరమన్న మాట.

బిడ్డకు సుమారు ఒక సంవత్సరం ఈడు వచ్చే టప్పటికి తోటి పిల్లల సహవాసం అవసరమవుతుంది. శిశువు ప్రారంభదశలో కొన్ని నెలలవరకు నిద్రలో ఎక్కువ కాలం గడిపినను, మేల్కొన్నప్పుడు పరిసరములను పరికించటం, వాటిని అకర్షించుకొని, లీనంచేసికోటం, వాటి సంసర్గం ద్వారా మానసిక నిర్మాణ కార్యక్రమం కొనసాగించటం చేసుకొంటూ వుంటుంది. దాదాపు అయిదారు నెలలకే, ఒంటరిగా పడుకొని, ఆనందంగా ఆకాశాన్ని, అల్లలాడే చెట్ల ఆకులను, దాపుననే ఎగిరే పక్షులను, తన చేతి, కాళ్ల వ్రేళ్ళను, వీక్షించుతూ, అటునిటు త్రిప్పుతూ, నోటితో వింత వింత శబ్దాలు చేస్తూ ఆడుకొంటుంది. తల్లి తనచెంత నుండాలన్న ఆశ అధికమవుతూ వస్తాంది. ఒక సంవత్సరం నిండేటప్పటికి చుట్టునున్న పరిసరములలో ఆసక్తి అధికమవుతుంది. అంతేగాదు, మానవ సహవాసం కోసం తీవ్రమైన వాంఛకలుగుతుంది. తల్లి దండ్రులు, బంధుజనములు, తోటి పిల్లలు మున్నగు వారియొక్క కంఠధ్వని, మాటలు, కేకలు, నవ్వులు ఆటపాటలు వినటానికెంతో సరదా. వాటిలో పాల్గొనడానికెంతో ఉత్సాహం సయితం కలుగుతుంది.

వైద్యశాస్త్ర రీత్యా, బిడ్డ ఆరోగ్యమునకు నిశ్శబ్దమైన వాతావరణం, ఎక్కువకాలం నిద్ర (శిశు ప్రారంభదశలో) అవసరమనే విషయం నిజమే, గాని, నవీన ఆరోగ్యశాస్త్ర ప్రకారం తూ, చా, తప్పకుండా అనుసరించాలని ఆశయంతో విద్యాధికులయిన కొందరు తల్లులు బిడ్డలను గంటల కొలది బిడ్డల కిష్టమున్ననూ లేకున్ననూ ఉయ్యాలలో నిద్రపుచ్చి, లేదా ఒంటరిగా విడిచిపెట్టి తమ పనులను చేసుకోటానికో, మరే కార్యంకోసమో వెళ్లిపోతారు. ఈలావిడిచి వెళ్ళిపోతే ఏడ్చి ఏడ్చి, చివరకు వాళ్ళే మరికొంత కాలం నిద్రపోతారని, తత్ఫలితంగా మరింత ఆరోగ్యం చేకూరుతుందని, తమ కార్యములు నిరాటంకంగా కొనసాగించుకోవచ్చునని అనుకుంటారు. అది పొరబాటు, శిశువే తనకవసరమున్నంత కాలం మాత్రం నిద్రించుతుంది. దాని నిద్రకు భంగం కలుగకుండ మాత్రం చూచుకోవాలి. కాని, బలాత్కారముగా నిద్రపుచ్చుట ఎంతో గొప్ప పొరపాటు. శిశు, శరీరంతోపాటు మానసికంగా కూడ వికాసం చెందాలి అన్న విషయం గుర్తించుకోవాలి. ఆరోగ్యంగా పెరగాలన్న ఆశయంతో బిడ్డ కవసరం లేకున్న సమయాల్లో నైతం అనేక గంటలకాలం నిద్రలో పుచ్చినయెడల, బిడ్డ సర్వతోముఖంగా అభివృద్ధి అయ్యే అవకాశం గోలుపోతుంది. శిశువు పుట్టిన కొంతకాలం వరకే, తల్లితో సన్నిహిత సంబంధం ఏర్పరచుకొనే కొన్ని అవకాశాలు తప్ప, తక్కిన అవకాశములు లేక పోతవి. అనగా, తల్లి బిడ్డ కప్పుడెప్పుడు స్తన్యమిచ్చుట, స్నానం చేయించుట, ఒడిలోనో, ఉయ్యాలలోనో పడుకోబెట్టి నిద్రపుచ్చుట తప్ప తక్కిన వేళలలో బిడ్డను నిద్రింపజేయుట వలన మానసిక వికాసమునకు అవసరమైన అనేక అవకాశాలను బిడ్డగోలుపోతుం దన్న మాట.

ఒక ఏడాది నిండేటప్పటికీ, తరువాత నుండీ, ఎన్నో విషయాలను నేర్చుకోటం, ఆట వస్తువులతో, తోటి చెలి

కాంద్రతో ఆడుకోటం, మాటలాడటానికీ, నడవటానికి నేర్చుకోటం, మున్నగునవి అవసరంకదా. అందులో ముఖ్యముగా, తోటి పిల్లల సహవాసం, పెద్దవాళ్ళతో సన్నిహిత సంబంధం— ఒక్కమాటలో సంఘజీవితం బిడ్డకెంత అత్యవసరం అను విషయాన్ని తల్లి ఒక క్షణంకూడ విస్మరించుట గొప్ప పొరబాటు.

సంఘ జీవితమునకు సిద్ధముగానున్న బిడ్డను అనగా, చుట్టు ప్రక్కలనున్న పిన్న పెద్దలతో పరిచయం, సన్నిహిత సంబంధం, సహవాసం ఏర్పరచుకొనుటకు స్వభావ సిద్ధంగా సిద్ధపడుతున్న తరుణములలో బిడ్డను నిద్ర పుచ్చుట అనేది బిడ్డభావి జీవితమునకే ఎంత హానికరము అను సత్యాన్ని తల్లులు కొందరు ఎరుగరు. అందువల్లనే, అట్టి తల్లులు, శతవిధాల ప్రయాసపడి బిడ్డను నిద్ర పుచ్చుట ప్రధాన కార్యంగా ఎంచుతారు, ఇట్టి వారు తమ బిడ్డల సర్వతో ముఖాభివృద్ధికి అవరోధం కలుగ జేయుటయే గాక, వారి భావిజీవితానికే ఎంతోహాని కలుగ జేస్తున్నారన్న విషయాన్ని గుర్తించుకోవాలి.

బిడ్డకు నిద్రరానపుడు బలత్కారంగా నిద్ర పుచ్చుటం, మేల్కొన్నప్పుడు ఒంటరిగా ఉయ్యాలలోనో పడక మీదనో పడవేసి పోవటంవలన, బిడ్డల మానసిక వికాసానికి, ఆనందదాయికమైన ఆటలు, ఆట చెలికాండ్రు చుట్టునున్న పిన్న పెద్దల పరిచయం, చెలిమి, వస్తుగ్రహణమునకు అవసరమైన అవకాశములు మున్నగునవి లేక పోతవి. తత్ఫలితంగా మానసిక వికాసము సక్రమంగా జరగటానికి భంగం కలుగుటేగాక బిడ్డకు కొన్ని దురలవాట్లు అలడుతాయి. బొటనవ్రేలు చీకటం, దేహాన్ని తఱుచుగా ఊగించుకోటం మున్నగు దురలవాట్లు పట్టుబడుతాయి. తోటి పిల్లలతో, పిన్న పెద్దలతో కలిసి మెలసిఉండు స్వభావంలో (సంఘ జీవితం) లోటు ఏర్పడుతుంది. తత్ఫలితంగా, బిడ్డకు, చీదరించుకోటం, భయపడటం అనవసరమైన సిగ్గు మొదలగు దుర్గుణాలు పట్టుపడుతాయి. బిడ్డ తన దేహాన్ని తరుచుగా ఊగించుకొనే అలవాటువల్ల మానసిక సంబంధ వ్యాధులు సంభవిస్తాయి. ఈ విషయాల్ని తల్లులు గ్రహించుకొని తమ బాధ్యతను తెలివి తేటలతో నిర్వహించుకోవాలి.

మరొక ప్రధాన విషయాన్ని మనం తెలిసికొనుట అత్యవసరం. అనేక ఏళ్లగా మనస్తత్వవేత్తలు శిశు మనస్తత్వ శాస్త్రములో అమోఘమైన పరిశోధనలు సల్పిన ఫలితంగా, మరికొన్ని విషయాల్ని ఇటీవలనే కనుక్కొన్నారు. శిశువుకు పుట్టినప్పటినుండియే మానసిక జీవితం అనేది బీజరూపముగా వున్నది. పుట్టిన కొన్ని ఘంటలనుండియే, శిశువు, తనలోనున్న ఒక విధమైన జ్ఞానతృష్ణ ప్రోద్బలంచే, అంతర్గతంగానున్న వివిధ ప్రవృత్తులు బాహ్య పరిసరముల సంసర్గ సంస్కారములచేత మానసిక నిర్మాణం, మానసిక వికాసం కోసం, అనుక్షణం అవిచ్ఛిన్నంగా, అవిరామంగా కృషి చేస్తువుంటుంది. ఈ విధమయిన శిశు మానసికవికాస చర్య క్రమములలో, శిశువుకు వివిధ సూక్ష్మ గ్రాహ్య దశలు (సూక్ష్మంగా గ్రహించుకొనే ఒక విధమైనజ్యోతి ఏర్పడి తద్వారా శక్తుల వికసింప చేసుకోటానికి అనువైన తరుణములు) ఏర్పడుతవి. వాటివాటి ధర్మం (ధైర్యం) నెరవేరిన వెంటనే అవి అదృశ్యమై బోతాయి. మరలరావు. అలాంటి మానసిక వికాస తరుణములలో బిడ్డను నిద్రింప జేయుట వల్లనూ మరేవిధమైన ఆటంకాలున్నచో రెంటిని తొలిగించటానికి యత్నించక పోవుటవల్లనూ, దాని సూక్ష్మ గ్రాహ్య దశలలో శిశువుసల్పు నిరంతర కృషికి అవరోధం కలిగించినట్టు అవుతుంది. ఆ దశలు గడిచిబోతవి. వాటికి సంబంధమైన తృష్ణ చల్లారి పోతుంది. సర్వతో ముఖమైన మానసిక వికాసం కలుగక, అనేకలోట్లు ఏర్పడతవి. తత్ఫలితంగానే, బిడ్డలో వయస్సుకు తగిన బుద్ధి వికాసం లోపించి పోతుంది. ఈ విషయాల్ని కొంత విపులంగా రాబోయే సంచికలో వ్రాయటానికి ప్రయత్నిస్తున్నాం.



సీరియల్ నాటిక

# భక్తిలీల

శ్రీ లాకి శ్రీనివాసరావు

రంగము ౩.

[ప్రదేశము : మధుసూదనుని కుటీరము.

[ప్రవేశము : మధుసూదనుడు వాకిట నిలిచి]

మధు : శాంతం! శాంతం!

శాంత : (ప్రవేశించి) ఏమీ?— ఆ వేదీ?—

మధు : ఆవు కనుపించుట లేదు. కట్టుత్రెంపి ఎచ్చటికో పోయినట్లున్నదే!

శాంత : కట్టుత్రెంపి పారిపోయినదా?

మధు : ఔను. ఈ పూట దూడకూ మన పిల్లవానికి పాలు లేనట్లే తోచుచున్నది.

శాంత : ఈ ప్రాంతమున నెక్కడేని ఉండగలదు. మీరు పోయి వెతకి తీసుకొని రండు.

మధు : పోవుచున్నాను. (పోవును.)

శాంత : ఆహా! దైవ సంఘటనము చాలా విచిత్రమైనది.

తే॥ గీ॥ దైవ ఘటనము దెలియగా। దరము గాదు
దైవమే గద జీవనా। ధార మిలను
జీవకోటుల సృజియించి। చిత్రలీల
జాతిలో గప్పకును తిండి। ప్రీతి నొసగు.

సర్వేశ్వరా! నేడు మా పసిపాపను ఆవు దూడను ఆహారం లేకుండా జేయుదువా! అట్లు జేయవు. నీవు దయామయుడవు. ఆవు త్వరలో దొరుకు నటుల జేయుదువు.

రామి : (ప్రవేశించి)—శాంతం!

శాంత : ఓహో! రెడ్డిగారా! దయచేయుడు.

[దర్భాసనము వేయ రామిరెడ్డి కూర్చొనును]

రెడ్డి : మధుసూదనముగారు లేరా?

శాంత : మీరు పంపిన యావు కట్టునీడి పారి పోయినది. దానిని వెదకుటకు వెళ్లియున్నారు.

రెడ్డి : (తనలో) ఆహా! మంచి యవకాశము నాకు లభించినది. ఆ యావు చాల పెంకిది. దాని యల్లరులను మేమే భరించలేనప్పుడు ఈ అమాయకపు బ్రాహ్మణులా భరించగలరు! అది దొరకుట చాల దుర్లభము. నా కార్యము నకిదే యదును. (ప్రకాశముగా) ఆవు, దూడను విడిచి ఎక్కడకు పోగలదు, త్వరలో రాగలదు.

శాంత : ఆ యావునిచ్చి మా పిల్లవాని ప్రాణములను కాపాడితిరి. మీ మేలు మరువలేము.

రెడ్డి : చేసిన మేలు మరచిన వారెందరో గలరు. కాని, నీవు మాత్రమట్టు మేలు మరువవని నాకు తెలియును.

శాంత : నా జీవితకాలము మరువను. ప్రాణములనైన అర్పించుటకు వెనుదీయను.

రెడ్డి : ఏమి మేలు! నీ పిల్లవానికి పాలకొరకు ఒక యావు నిచ్చినంత మాత్రమున మేలా? ఇంకా యెన్నో!

శాంత : అది చాలదా! చాలును బాబూ! చాలును.

రెడ్డి : నిజముగా మీతో స్నేహముగలిగినది మొదలు మిమ్ము జూడకుండా నొక క్షణమైన నుండ జాలను—శాంతం! నీవు మిక్కిలి ప్రేమ మానసవు. నూదంటు రాయివలె నన్నాకర్షించియున్నావు.

తే॥ గీ॥ వేద పారాయణము జేయు । విధముగాను
నీదు నామము నిత్యము । నే బఠింతు
నిన్ను జూడని నిముసము । లెన్నొ యుగము
లని దలంచెద నమ్ము మో । వనిత నిజము.

శాంత : మీకు మా యందనురాగము గలిగినందులకు ధన్యు లము.

రెడ్డి : శాంతం ! ఈ అడవిలో, ఈ నిర్జనమైన ప్రదేశమం దొక్కతివే వుండగలవా ?

శాంత : అన్నింటికి సర్వేశ్వరుడు లేడా ?

రెడ్డి : (నవ్వి) వెర్రి మొగమా ! ఏమి విశ్వాసము. సర్వేశ్వరుడు. అంత సత్యకాలమిది... నేను నీతో కొన్ని ముఖ్యమైన సంగతులు మాట్లాడ దలచు చున్నాను. ఏమందువు ?

శాంత : (తనలో) ఈతని యభిప్రాయమును జూడ నపాయము సూచించుచున్నది. అపాయమును దప్పించుకొను మార్గమాలోచింప వలసియున్నది. (యోజించి) సరే ! (ప్రకాశముగా) ఏమవి ?

రెడ్డి : మగవారు ఆడువారితో ముచ్చటింపవలసిన విషయము లేముండును ?

తే॥ గీ॥ అందముగ నిండు యౌవ్వన । మందునున్న
యాడు దానిని ఏకాంత । మందు గూడి
ముచ్చ టించెడి మురిపెంపు । ముచ్చటలను
ప్రొద్దు బుచ్చగ నీయాజ్ఞ । బొందుచుంటి.

శాంత : ఆహా ! మిమ్మనవలసిన బని యేమున్నది. మీ మానసమును జెరచిన దేవునే నిందించ వలసియున్నది.

రెడ్డి : ఆ దేవుడు నా మానసమును జెరచెనో, మానెనో కాని నీ సుందర సుకుమార రూపమే నా హృదయమును జూరగొనుచున్నది. రేయిం బవళ్లు నిద్రాహారములు లేవు. నన్ను రక్షించి ప్రణయ భిక్షబెట్టుము.

తే॥ గీ॥ మోహనాకార మగు నీదు । మోము జూచి
మరలు నిలుపగ జాలను । త్వరగ నేలు
మధుర మొకసారి గ్రోలగా । నాన తిమ్ము
ముదముగా నొక్క ముద్దిమ్ము । ముద్దుగుమ్మ !

శాంత : ఏమేమీ శ్రీపురమను నొక పట్టణమున కధికారులు. ఎందరో ప్రజల కష్ట సుఖములను గమనించ వలసిన మీ యట్టి ప్రభువులే నీతిదప్పిన ప్రజల గతి ఏమి గావలెను ? ఇట్టి చేతలు చేయుట మీయట్టి వారికి ధర్మమేనా ?

రెడ్డి : శాంతం ! నా మనస్సు నీవు హరించి యున్నావు. అందువలన నా శరీరము, మనస్సు యెంత క్లేశ పడు చున్నవో ! నీవు దయగలదానవు. గనుక మనస్ఫూర్తిగా గ్రహించగలవు. కాన నన్ను కౌగలించుకొని నా తాపమును దీర్చకున్న నా ప్రాణములను నీ పాదముల సన్నిధిని విడిచిపెట్టెదను. నాకు ప్రాణదానము చేయుదువా మానుదువా ?

శాంత : మీరు నా తండ్రివంటి వారు. మా ప్రభువులు. పర సతులను ప్రేమించుట మహా పాపము. పాప పుణ్యములను పరమేశ్వరుడు సర్వదా జూచుచుండును. మీ యట్టి బుద్ధిమంతులే యిట్టి అక్రమ కార్యములను జేయ వచ్చునా ? ఇంకనైన పశ్చాత్తాపమును జెంది పాపచింతలను విడిచి పెట్టుడు.

రెడ్డి :—ఓహో నీతులనా నేర్పుచుంటివి ?

సీ॥ కనరాని పరమందు । గల సౌఖ్యముల గోరి
ఇహ సుఖంబులు వీడ । నే మనుదును
పూర్వ గాధల విని । పుణ్య పాపములని
యెంచి సౌఖ్యము వీడ । నే మనుగును,
యముడు గిముడటంచు । భ్రమసి నిజంబని
యెంచి సౌఖ్యము వీడ । నే మనుదును,
పుట్టెడాస వహించి । ముక్తి గిక్తి యటంచు
నెంచి సౌఖ్యము వీడ । నే మనుదును

తే॥ గీ॥ నీతు లెన్నెని కోటులు । నేర్పవచ్చు
గాని, చేతలు జేయుట । గష్టమౌను
రతిని మించిన సౌఖ్య మీ । క్షితి తలమున
గలదె వగలాడి నీ విరుం । గనిదె చెపుమ !

నన్ను గరుణించుము : ఒక్క బాపనయ్య నీ ప్రేమనా తీర్చగలడు. కడుపునకు బట్టెడన్నమును బెట్టలేని వానితో నీవేమి గాపురమును చేయగలవు ?—నేను జమీందారుడను, అందము గలవాడను, కావలసినంత ధనముగలదు

—నీవు నన్ను జేపట్టినట్లయిన మహారాణివలె నుండ గలవు. ఆ బాపనయ్యతో నీ గాపురమున కేమి సుఖము?

శాంత : అయ్యా! పతి యెట్టివాడయినను సతికి దైవ సమానుడు. అక్రమపు మాటల నాడవలదు.

తే॥ గీ॥ సతికి పతిగాదె యిహపర । శాంతి యుతము
సతికి పతి సేవనమె గతి । సాధనమ్ము
పతిని నమ్మిన పడతియే । వెతలు లేని
సుమతి యని బుధులాడెడి । సూక్తి వినవె?

రెడ్డి : నా యట్టి జమీందారునే తిరస్కరించుచున్నావు. దూరమాలోచించుకొమ్ము నా యాజ్ఞ నెవ్వరూ ఉల్లంఘించలేరు. నేను తలపెట్టిన యెట్టి కార్యమును గాని సాధించగలనని తెలిసికొనుము.

శాంత : అయ్యా నేను నిస్సహాయముగ నుంటినని తలంచి మీ యిష్టమైన చేతలను జేయుదమన్న జడియు దానను గాను. నాకీ ప్రాణములతో సంబంధము లేదు. నా మాన మర్యాదలను గాపాడు కొనవలసిన దానను. భగవంతు డొకడున్నాడు. విద్యావంతులు గనుక నింత దూరము జెప్పితిని. ఇంక నిచ్చటినుండి వెడలిపొండు.

రెడ్డి : నీకు చెప్పవలసినంత దూరము జెప్పితిని. బ్రతిమాలవలసినంతవరకు బ్రతిమాలితిని. నిన్ను బలత్కారము జేసిన యిక్కడ నీకు దిక్కెవ్వడు?

శాంత : ఏమీ! నాకు దిక్కా!—దిక్కా!—దిక్కా?—ప్రహ్లాదాది భక్తుల గాపాడిన వాడు—ఆ సర్వేశ్వరుడు లేడా? లేడా?— దేవుడు లేడా?—దేవుడు—దేవుడు— లేడా దేవుడు?

రెడ్డి : లేడు.

శాంత : కనుగొనలేడా?

రెడ్డి : స్వరూపమే లేనివాడు కన్నులతో నెట్లు గాంచును?

శాంత : పాపముల చెండలేడా?

రెడ్డి : పాప పుణ్య విచక్షణమే యుండిన సముద్రమందు ప్రయాణము జేయుచున్న నావ మునుగు చున్నప్పుడు అందలి జనులందరు మునిగి చత్తురు. అందు పాపాత్ములు పుణ్యాత్ములు లేరా? భూకంపము గలుగు నప్పుడు కొంత ప్రదేశము పాప పుణ్యాత్ములతో నశించుటలేదా?

శాంత : బ్రోవన్ లేడా?

రెడ్డి : కొన్నినాళ్లాహార పానములు విడిచితివేని జచ్చెదవు. అప్పుడు దేవుడెట్లు బ్రోవన్ గలడో తెలిసికొన గలవు.

శాంత : దీన దయాళుడు లేడా?

రెడ్డి : ప్రపంచమున సురూపుల కురూపుల—శక్తి వంతుల శక్తిహీనుల—ధనవంతుల ధనహీనుల సృష్టించు వాడైన దయాళుత్వ మెట్లుండును?

శాంత : జగమేలు వాడు లేడా?—లేడా?

రెడ్డి : (నవ్వి) సర్వ సూన్యుడా జగమును భరించుట కల్ల. కల్ల.

శాంత : క॥ లేడా దేవుడు? కనుగొన
లేడా? పాపముల జెండ । లేడా? బ్రోవన్
లేడా? దీన దయాళుడు
లేడా? జగమేలు వాడు । లేడా? లేడా?

రెడ్డి : ఆ॥ వె॥ లేడు! లేడు! లేడు! లేడుగా దేవుడు
దేవుడున్న యపుడు । జీవులెల్ల
ఒక్క తీరు గాను । ఒక్క రీతిగ నుండి
వరలు చుండ వలదె । వసుధలోన.

శాంత : ఆహా! మీయట్టి నాస్తికులు అనుభవించునప్పుడే దైవతత్వమును దెలిసికొన గలరు.

రెడ్డి : ఏమి నీతులు?—ఇదిగో నీ దేవుడు—ఈ భూమిలో దేవుడు—దేవుడున్నాడు చూడు—వీడే నీ దే-వు-డు (బలాత్కారము జేయ బ్రయత్నించును.)

శాంత : హా! జగన్నాధా! ఈ అనాధను రక్షింపవా! (కుటీరమునుండి వెలుపటకు పరుగిడుచుండ రెడ్డి వెన్నాడి)

రెడ్డి : వీడే నీ నాధుడు, శాంతా! నిలు నిలు.

శాంత : (కర్తవ్య మూహించి—ఆశ్చర్య మభినయించి) ఆహా! దేవుడిటు వచ్చుచున్నాడు. రెడ్డీ! అడుగో అడుగో దేవుడు, చూడుము. రెడ్డీ! అట్లబ్బుర పోయెద వేమి?—చూడుము, కనుపించెనా? (రెడ్డి గడగడ వణకుచు అబ్బురమున నొక దిశను జూచుచుండ శాంత తప్పించుకొని పొదలలో దాగుటకు పరుగునబోయెను.)

రెడ్డి : ఏడీ! దేవుడు?—దేవుడు లేడు గీవుడు లేడు. శాంతం! బలే టక్కరివి. ఈ కలికాలమున దేవుడు గలడా?—(తిరిగిచూచి) ఏదీ శాంతం? ఏదీ! ఏదీ?— ఆహా! శాంతా! ఎంత మోసము చేసితివి? ఎటు బోయితివి?—సరే, ఎట్లు దప్పించుకొనియెదవో చూచెద. నిన్నే వెతకి పట్టుకొన లేకుందునా? (పోవును.)

(తెరవాలును.)

★

# జనవరి 26, 1950

# చారిత్రాత్మక దినము

శ్రీమతి ఎమ్. రంగనాయకిగారు ఎం. ఏ.,

ఈ దినము మన దేశ చరిత్రలో మహత్తరమయిన దినము. విదేశీయ పరిపాలనా విముక్తులమై, ప్రజాస్వామికముగ రాజ్యాంగమును క్రోడీకరించి మన దేశమున కొక రాజ్యాంగమును లిఖిత రూపముగ, శాసన రూపముగ స్థాపించిన దినము.

రాజ్యాంగ సిద్ధాంతములనుబట్టి రిపబ్లికు ప్రభుత్వము ప్రజాస్వామిక ప్రభుత్వముయొక్క శ్రేష్టతర రూపము. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, బ్రెజీల్, మెక్సికో రాజ్యములు రిపబ్లిక్కులే. దీనిలో ప్రజా ప్రతినిధులసభ, ఒక అధ్యక్షుడు, మంత్రులు ఉందురు. మనలో మేధావులను మనము ఎన్నుకొని, ప్రతినిధులుగపంపి వారిచే రాజ్యాంగమును వ్రాయించుకుంటిమి.

ప్రతి రాజ్యాంగములో మొదటిభాగము ఉపోద్ఘాతము—ప్రీమ్బుల్. ఈ రాజ్యాంగముఖ్యోద్దేశాన్ని తెలియ జేస్తోంది. "హిందూదేశపు ప్రజలమైన మేమందరము యీ దేశపు రాజ్యాంగమును సంపూర్ణ ప్రజాస్వామిక నిర్మాణము చేయుటకు త్రికరణ శుద్ధిగ పూనుకొంటిమి. ప్రజలమయిన మనము మనకు ఆర్థికముగ సాంఘికముగ రాజకీయముగ న్యాయము, స్వేచ్ఛ, ఉదారత్వము, సమానావకాశములను సర్వ భ్రాతృత్వము నెలకొల్పుకుందుము..." అని ప్రమాణము చేయబడినది. ప్రతిరాజ్యాంగమునందును యీ ప్రజోద్దేశమును దెల్పు భాగము చాలా ముఖ్యమైనది.

స్వతంత్రోత్సవము నాటికన్నను, యీ దినము విశేషమయినది. స్వతంత్రము ప్రాప్తించినది—కాని మనము మనలను పరిపాలించుకొను పద్ధతి నిర్మాణ మగుట—ఆ నిర్మాణమును అమలులో బెట్టి స్వతంత్ర భారతమున కిరీటము లేని ప్రజా సామ్రాట్ వెలయుట మొదలగునవి చారిత్రాత్మక సంఘటనలు. బాబూ రాజేంద్రప్రసాద్ మొట్ట మొదట యీ పదవి స్వీకరించుటలో యింకా విశేషమని చెప్పవచ్చును. ఇంతటి చారిత్రముగ విఖ్యాతమయిన తరుణమునకు ఎన్ని సంవత్సరముల కృషియో, ఎంతటి త్యాగమో, ఎంతమంది హృదయావేశమో, ఎంతటి తీవ్రమయిన సత్యాగ్రహ వ్రతమో—దారుణ శత్రుభయము రక్తపాతము—చివరకు అఖండ భారతమును చీల్చుకొనడమైనది. గాంధీ మహాత్ముని స్మరించనిదే యీ సంఘటనలు చారిత్రాత్మకములు కాలేవు.

స్వరాజ్య అవతరణ చరిత్రకు గాంధీ మహాత్ముడు—కాంగ్రెసు చేసిన సేవ, రెండు ముఖ్యాంగములు. అర్థ శతాబ్దము కాంగ్రెస్ విదేశీయ ప్రభుత్వముతో పోరాడినది. ఈ స్వరాజ్య పోరాటములో పాల్గొనిన వీరులనేకులు. 1885 సం॥ ముందే ఆంగ్ల ప్రభుత్వములో హిందూదేశపు ప్రజలతో పరిచయము కలిగి—వారితో పరిపాలనా విషయములలో సంప్రదించెడి పద్ధతిపైన యీ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ప్రారంభింపబడినది. ఇందులకు హ్యూమ్ దొరగారు బాధ్యులు.

కాంగ్రెసు చరిత్రలో స్త్రీలలో మొట్ట మొదట పాటు పడినవారిలో డా. అనీబిసెంటు గారు ఒక్కరే. దివ్యజ్ఞానమునుండి, రాజకీయములలోనికి దిగిరి. —హోమ్ రూల్—స్వరాజ్యోద్యమమును లేవదీశారు. ఆమె నిర్వహించిన వార్తాపత్రిక రచనలో ఈ ఉద్యమము ప్రబలినది. మతము రాజకీయమును కలిపి ప్రార్థన సమాజములను ఏర్పరచినది. కాంగ్రెస్ ఉద్యమములో చాలా పేరు పొందడమే కాకుండా, అధ్యక్ష పదవికూడ స్వీకరించినది. ఆమె తరువాత స్త్రీలలో చాలామంది దేశసేవకై నాన్ కో ఆపరేషన్ మూవ్‌మెంట్ రోజులలో గొప్ప త్యాగమును జూపిరి. కొన్ని కొన్ని ప్రసిద్ధికెక్కిన కుటుంబములు యీ వందేమాతరం మంత్రాన్ని ఉపాసించారు. కాంగ్రెస్ చరిత్రలో పేర్కొనవలసిన దేశసేవకులు అనే

కులు. ఆంధ్ర దేశములో స్త్రీలు చాలమంది యీ ఉద్యమములో దిగిరి. మొట్టమొదట సత్యాగ్రహము చేస్తామని పురుషులుకన్న ముందు మదరాసులో సత్యాగ్రహము ప్రారంభించిన వారిలో శ్రీమతి దుర్గాబాయమ్మగారు మొదలగువారు చాలామంది ఉన్నారు. సరే, శ్రీమతి సరోజినీ నాయుడు, విజయలక్ష్మి పండిట్, కస్తూరిబాయి గాంధీ మొదలగువారి కృషి లోక విదితమేకదా.

అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగ నిర్మాణము కూడ ప్రపంచ చరిత్రలో చాల యుత్కృష్టమయినది. మన రాజ్యాంగ నిర్మాణములో కొంతవరకు అమెరికా రాజ్యాంగమును అనుకరించితిమి. బ్రిటిషు రాజ్యాంగములో నిర్మాణ క్రమము వేరు. ఇక్కడ దేశనాయకులు, నిర్మాతలు సమావేశమయి అమెరికా ఇండియా మొదలగు దేశముల రాజ్యాంగములవలె నిర్మించి లిఖించి, శాసన రూపమును పొందలేదు. దేశ చరిత్రకును రాజకీయమునకును చాల సంబంధమున్నది. కాలానుసారముగ వచ్చు మార్పులు, ప్రళయములు, ప్రజా కల్లోలములు స్వతంత్ర యుద్ధములు, రక్తపాతములు, విదేశ రాజకీయ, మత, సాంఘిక ఆర్థిక, వ్యాపార కలహములువలన నిరంకుశ ప్రభుత్వము కొన్నాళ్లూ, అరాచకము కొన్నాళ్లూ ప్రజాస్వామికము కొన్నాళ్లూ వాడుకలోనికి వచ్చినవి. ఆయా కాలమునకు ఆయా ప్రజాభిప్రాయమును బట్టి రాజ్యాంగము మారి—ఇప్పటికి ఇంగ్లాండులో కాన్‌స్టిట్యూషన్ మొనార్కీగ స్థిరపడినది. అమెరికనులు మనవలెనే ఇంగ్లీషువారితో పోరి స్వతంత్రమును పొందిరి. 13 వలస రాజ్యములు అంతర్యుద్ధములు మాని దేశనాయకులపై వారి రాజ్యాంగ నిర్మాణ బాధ్యతను వదలిరి. ఫిలిడెల్ఫియా కన్వెన్షన్ 1787 లో అమెరికనులకు సంయుక్త రాజ్యాంగ నిర్మాణము చేసినది.

మనముకూడ అల్లాగే సంపాదించుకున్న స్వతంత్రతతో యీ రాజ్యాంగము నిర్మించుకున్నాము. ఈ (కాన్‌స్టిట్యూషన్) రాజ్యాంగము పీఠికతో కలిసి 22 భాగములు. అందులో ముఖ్యముగ యిప్పుడు తెలుసుకోవలసినది 5వ భాగము గురించే. ఐక్య భారత దేశమంతటికిని కేంద్ర ప్రభుత్వము ఢిల్లీలో నుండును. పరిపాలనాధికారము—ఎగ్జిక్యూటివ్ ఆఫ్ ది యూనియన్, ఒక అధిపతికి, అతని క్రింద ఒక ఉపాధ్యక్షునకు యియ్యబడినది. అమెరికన్ అధిపతి ట్రూమన్. మన దేశాధిపతిగా బాబూ రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడ్డారు. గవర్నర్ జనరల్ పదవికి స్వస్తి చెప్పడమయినది. ప్రెసిడెంటు, మంత్రివర్గ సభ—రెండు శాసన సభలు—యీ కేంద్ర ప్రభుత్వమును నడిపెదరు. ఇక్కడ మనకు అడ్వకేటు జనరల్ ప్రెసిడెంటుకి రాజకీయ న్యాయములలో సహాయపడును. ఎన్నికదారులచేత ప్రెసిడెంటు ఎన్నుకోబడతాడు. ఈ ఎన్నికలు 5 సంవత్సరముల కొకసారి జరుగును. ప్రెసిడెంటు 35 సంవత్సరముల వయస్సుకుపై నుండవలెను. సుప్రీమ్‌కోర్ట్ యీ రాజ్యాంగమును రక్షించుటయేగాక, అవుసరమయిన వ్యాఖ్యానముచేసి, వివరించును. అందువలన కాన్‌స్టిట్యూషన్ కట్టుబాటులో ఉండకలుగుతుంది. రాజ్యాంగములో కాలానుసారముగ తప్పనిసరియైన మార్పులు తేవలెనన్న అమెండ్‌మెంట్ ఆఫ్ ది కాన్‌స్టిట్యూషన్ ఒక పద్ధతిలో చేయునట్లుగా కాన్‌స్టిట్యూషన్‌లోనే విధింపబడి యున్నది.

మన ప్రతినిధికి అమెరికా, ఇంగ్లండు దేశాల ప్రతినిధులకన్న యెక్కువ అధికార మివ్వబడినది. ఇతని అధికారమును హద్దులో పెట్టు విధానములు చాల తక్కువ కలవు. విపరీత పరివర్తనలో విషమముగ ప్రవర్తించునప్పుడు ఇంపీచ్‌మెంట్ పద్ధతి—అనగా భగ్నపరచు పద్ధతి తప్ప—అడ్డంకులు లేవని చెప్పవచ్చును. దేశ రక్షణకు మూలమయిన సైనిక వ్యవస్థకు సర్వాధికారి యీ ప్రెసిడెంటు. అధికారము స్వీకరించునప్పుడు సుప్రీమ్ కోర్ట్ జడ్జ్ సమక్షములో విధియుక్తముగ ప్రమాణము తీసికొనవలెను. క్షమాపణ—శిక్షలను తగ్గించుట, ఉపసంహారించుట మొదలగు శ్రేష్ఠాధికారములు ప్రెసిడెంటుకి ఉన్నాయి. శాసన సభలకు ప్రత్యేక సందేశములను అధికార పూర్వకముగ పంపవచ్చును.

పాలక వర్గమునకు సహాయవర్గముగ మంత్రుల సభ. దీనినే కేబినెట్ అని అంటాము. వీరందరూ శాసన సభల ద్వారా వచ్చినవారే—వీరందరితో ప్రధానమంత్రి—ప్రైమ్ మినిష్టర్ ఉంటాడు. ఈ ప్రధానితో కూడిన మంత్రి

వర్గముతో ప్రెసిడెంటు భారతదేశ ప్రభుత్వమును నడుపుతాడు. ఈ పదవులు స్వీకరించిన తరువాత వారు శాసనసభల సభ్యత్వము వదులుకుంటారన్నమాట. కేంద్రములో వలెనే విభాగములలో కూడ పాలక వర్గము ఏర్పడుతుంది. స్టేట్స్ అన్న పదమును చాల జాగ్రత్తగా నిర్వచించి—4 భాగములక్రింద విభజించిరి. గవర్నర్ల ఏలుబడిలోనున్న రాష్ట్రములు. రాజప్రముఖుల ఏలుబడిలో ఉండు సంస్థానములు, కేంద్ర ప్రభుత్వము ఏలుబడిలోనున్న ప్రదేశములు. దేశాంతరమయిన అండమాను, నికోబారు ద్వీపములు చెందినవి వలస స్థానములు.

సంపూర్ణ ప్రజా స్వామికములో ఎన్నికల పద్ధతులలో కూడ మార్పు తేబడుచున్నది. వయోజన ఎన్నిక హక్కు ఇయ్యబడినది. ఈ గొప్ప నిర్మాణమునకు చాలమంది కారకులు. అందులో స్త్రీలు కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ మెంబర్స్‌గా ఉండి దేశ చరిత్రలో వన్నె కెక్కినారు.

సర్వేజనాస్సుఖినోభవంతు.

ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.



# ఉత్తేజితాంధ్రముక్తావళి

* శ్రీమతి ఆ. సత్యవతమ్మగారు *

పద్యమాలిక (జీవితశోభ)

పేరుకీర్తులుదెచ్చు పెద్దకొడుకుశోభ
మాతకెదురాడని మగువశోభ
దైవభక్తిగల్గు విభవంబుశోభించు
చల్లనిమాటాడు తల్లిశోభ
గర్వమందనియట్టి ఘనుడుశోభించును
వినయజ్ఞానానంద విద్యశోభ
పాతివ్రత్యముగల్గు నాతిశోభించును
సత్యవాక్కులె శోభ సర్వమునకు
పూబోండ్లతలలపై పూలగుత్తులుశోభ
చెవులుకప్పుడుజడల్ చెలులశోభ
సూట్సుబూట్సుహాట్సు స్టూడెంట్లకునుశోభ
పంచికోటుశోభ పంతులకును
లాంకోటుతలపాగ లాయర్లకునుశోభ
డాక్టరుశోభించు దర్పములచె
ప్రెంచికట్టింగుమీసాలు పేడిమూతి
బొట్టులేనిముఖంబుకు బూదిపూత
ప్రబలపాశ్చాత్యవిద్యార్థి బ్రతుకుశోభ
త్యాగభోగంబులేశోభ తెలిసిజూడ
త్యాగమారోగ్యభాగ్యంబు భక్తిశోభ!

# రవీంద్రుని సుభాషితాలు

కూర్పు : శ్రీ చల్లా సత్యనారాయణ శర్మగారు

1. ప్రశాంతమైన రాత్రి తల్లియొక్క అందాన్ని, శబ్దమయమైన పగలు బిడ్డయొక్క అందాన్ని కలిగియున్నాయి.

2. మృత్యువుయొక్క ముద్ర జీవితం అనే నాణానికి విలువనిస్తుంది.

3. సృష్టి రహస్యం రాత్రియొక్క చీకటిలాంటిది.

4. కనురెప్పలు కన్నులకెంత అవసరమో, విశ్రాంతి పరిశ్రమకంత అవసరం.

5. నీటిలోనిచేప నిశ్శబ్దంగా వుంటుంది; ఆకాశంలోని పక్షి పాడుతుంది. కాని, మానవుడు తనలో చేపయొక్క నిశ్శబ్దాన్ని, జంతువుయొక్క శబ్దాన్ని, పక్షియొక్క సంగీతాన్ని కలిగియున్నాడు!

6. నీవు ఆకలిలేనపుడు నీ ఆహారాన్ని నిందించకు!

7. భగవంతుని శక్తి మందమారుతంలోనే యిమిడివుంది కాని తుఫానుల్లో కాదు!

8. ఈ ప్రపంచాన్ని మనం ప్రేమించినపుడు మనం ఆనందంగా జీవించగలం.

9. ఓ స్త్రీ, నీవు నీ కన్నీళ్ళతో ప్రపంచ హృదయాన్ని ఆక్రమించావు (జయించావు); ఎల్లాగంటే సముద్రము భూమిని ఆక్రమించినట్లు!

10. అంధకారము వెలుగు వైపుకి పయనిస్తుంది; కాని అంధత్వము మృత్యువు వైపుకి పయనిస్తుంది!

మహిళాసభ
సీనియర్‌క్లాస్ విద్యార్థిని

# భారతీయ స్త్రీ

కుమారి
వి. వి. రత్నమాల

ఈ ప్రపంచమే స్త్రీ. స్త్రీ యనగా మహా లక్ష్మి. స్త్రీలోనే సర్వప్రపంచ మిమిడియున్నది. సర్వ శుభారంభ ములకు స్త్రీయే పట్టుకొమ్మ. అందుచేత ఏ పురుషుడూ తన దైనందిన జీవితములో స్త్రీని తలచని నిముషము లేదు. ఆధారపడని ఘడియలేదు. తాను భుజించు చున్నది స్త్రీ (అన్నపూర్ణా దేవి). తాను సంపాదించు చున్నది స్త్రీ (మహా లక్ష్మి). తాను చదువుచున్నది స్త్రీ (సరస్వతి). తాను నివ సించుచున్న ప్రదేశము స్త్రీ (భూదేవి). దీనింబట్టి జూడ స్త్రీ యెన్నింటికి నునికి పట్టైయున్నదో యెల్లరకును విదితమే.

మరియొకటి, దినము మనము పలుకు విశేష మేమనగా తల్లి దండ్రులు, భార్యా భర్తలు, అత్త మామలు, యని పిలుచుచుంటిమేగాని తండ్రి తల్లులనిగాని, మామ యత్తలని గాని వుచ్చరించుటలేదు.

ఒక్క మాటలో తెల్పవలెనన్న భగవంతుని సృష్టికి మూలసూత్రమే స్త్రీగదా! స్త్రీయే లేకున్న సృష్టి యెట్లు గల్గును?

పసుపు కుంకుమలచే పావనమైన స్త్రీ జన్మ యెంత ధన్య మైనది!

పూర్వము భారతీయ మహిళలకు అగ్రస్థాన మీయ బడి నది. సీత, సావిత్రి, ద్రౌపది, దమయంతి, చంద్రమతి, అనసూయ, బృంద, సుమతి, శైల కుమారి మొదలుగాగల స్త్రీలు నాథుని సేవచేసి తమ జన్మలను సార్ధకము చేసిరి. వారు వారి వారి శీల సంపదలచే, విజ్ఞానయుతమగు క్రమ ప్రవర్తనచే చాలయున్నత స్థానముల నలంకరించి నటులయీ మన పురాణగాథలు వేనోళ్ళ కొనియాడు చున్నవి. వారా యున్నత స్థానము లలంకరించుటకు వారి విజ్ఞాన యుతమగు శీల సంపదయే కార్ణమని వేరుగా చెప్పనవసరము లేదు.

వారు పావనమైన స్త్రీ జన్మనర్థము చేసుకొనిరి, లోక మునకు యర్థము తెల్పిరి. వారి కీర్తి చిర స్థాయిగా నుండు నటుల చేసుకొనిరి. సీతా మహా సాధ్వి, సమాన భావము, సావిత్రి మహా ధైర్యము, ద్రౌపది విశేష లోక జ్ఞానము, దమయంతి స్వేచ్ఛ, చంద్రమతి అనసూయ బృంద సుమ తుల శాంతియుత గంభీరభావములు మరుతమన్నను మరపు రావు గదా? వారి గుణ మహిమలు ఎంతని వర్ణింపనగు? వారి ధర్మనిష్ఠ యెంతని కొనియాడదగు! ఒక్క భారతీయ మహిళయగు సుమతి తన పాతివ్రత్య మహిమంబున గదా సూర్యోదయము కాకుండ చేసెను! ఇట్లే భారత నారీ మణులు తమ ధర్మ నిష్ఠలచే వారి వారి నామములను ఆ చంద్రార్కముగా నుండునట్లు చేసిరి.

పురాణకాలమునాటి భారతీయ మహిళల చరిత్ర సువరా క్షరములతో లిఖింపబడినది.

తరువాత క్రమేణకాలము మారిపోయినది. కాలము మాన వుల స్వాధీనము నందుండును. మనుజుల మనస్తత్వము నను సరించి కాలము నడచును. కాలమునకు మానవునకు పరస్పర సంబంధ మున్నది. కాల ప్రవాహమునకు గురియై మధ్య కాలపు భారతీయ మహిళలు వారి జీవిత పవిత్రతను పాడు చేసినవి. బాల్య వివాహము నిర్బంధ సహగమనములు, ఘోషాపద్ధతుల వలన వారిని యక్షర జ్ఞాన శూన్యులచేసి కష్ట ముల పాలుచేసినవి. స్త్రీలను మట్టి బొమ్మలుగా తయారు చేసిన కాలమిది. అది తలచుకొని సంతసే గుండెలు నీరగును.

ఆంగ్లేయ పరిపాలనలోకి భారత దేశము వచ్చినది. అప్పుడు కూడ భారతీయ మహిళలకు సరియైన మార్గమగు పించలేదు. అట్లగుటకు వారి నూతన సంస్కృతియు, విద్యా విధానమే కారణము. కాని కీడులో మేలువలె మధ్యకాలపు మూఢ విశ్వాసములు, అపనమ్మకములు అంతరించినవి. స్త్రీ విద్య నభ్యసించుటకు కొన్ని సదవకాశము లేర్పడినవి.

ప్రస్తుత భారతీయ యువిదలు నవ్యభారతిలో యున్నారు. స్వాతంత్ర్యము లభించుట తోడనే ఆంగ్లేయులు మన దేశ ము ను వీడి చనిరి. కాని వారి రెండువందల సంవత్సరముల

పరిపాలనచే వారి సంస్కృతియు, ఆచార వ్యవహారములు, వారి సాంప్రదాయములు భారతదేశము నిండా వెద జల్లబడి ఆనాటికానాడు పెరుగుచు మహా వృక్షములగు చున్నవి. ఆ వృక్ష ఛాయల ననుసరించి కొంతమంది భారత నారీమణులు చెడుత్రోవను బట్టుచున్నారు. వారికీయబడిన స్వేచ్ఛను మరొక విధముగా నుపయోగించుచున్నారు. స్త్రీ పురుషునితో సమాన హక్కులు కోరుచున్నదేగాని పూర్వపు స్త్రీలు యే హక్కులతో యెంత వున్నత పదవు లలంకరింప గల్గిరో గ్రహించుటలేదు. నాగరికతలో బడి వారి స్థానము నే మరచిరి.

డిగ్రీ చదువులు చదివి, బుద్ధి వికాసము కల్గియు తెలివి మాలిన వారై మెలంగు చున్నారు. చెడుత్రోవల సంకోచ మిసుమంతయు లేక పోవుచున్నారు. పూర్వపు నారీమణుల చరిత్రను పూర్తిగా మరచి పోయిరి. శీలయుక్తమగు స్వేచ్ఛ, విద్య, స్త్రీలకు వన్నె తెచ్చునను మాట మరచిరి. భక్తి, శ్రద్ధ, ఓర్పు మొదలగు గుణములన్నియు వారియందు తగ్గుచున్నవి. స్త్రీయను శుభ నామముయొక్క శోభ తగ్గు చున్నది. అట్లగుట భారత స్త్రీ లోకమునకే యపచారము చేసిన వారగుదురు. చిరకాలమునుండియు వచ్చుచుండిన వారి ప్రత్యేకత పాడు చేసుకొనిన వారగుదురు.

అట్లని విద్యకూడదని యర్థము గాదు. స్వేచ్ఛ యక్కర లేదని భావమునుగాదు. విద్యలేకున్న స్త్రీలు లోక జ్ఞాన శూన్యులగుదురు. అట్టి స్త్రీలకు కాలము అన నేమియో తెలి యదు. మంచి చెడ్డలు తెలుసుకొనలేరు. విద్యావిహీనయగు యువిద తన నిత్యజీవితమును సరిదిద్దుకొనజాలదు. ధైర్య సాహసములు చూపలేదు. కాబట్టి స్త్రీకి విద్య అత్యా వశ్యకము.

పూర్వము సావిత్రి మొదలుగాగల స్త్రీలు విజ్ఞానము చేతనే యంతపట్టుదల చూపగల్గిరి! కావున ప్రతి భారతీయ మహిళ విజ్ఞానమును సంపాదించాలి. ముఖ్యముగా స్త్రీకి గృహకృత్యములు చక్కగా నెరనేర్చుకొనుటకు తగిన విద్య యవసరము. అనగా శిశుపోషణ, గృహవైద్యము, చేతిపనులు నేర్వవలయు. ఆంగ్లేయులచే చిందర వందరగా చేయబడిన మన యీ భారతదేశమును మరల శోభాయమానముగా చేయుటకు స్త్రీలే సమర్థులు. స్త్రీలకే యీ హక్కు కలదు.

స్త్రీలు యప్పటియట్లు లక్ష్మీ స్వరూపులై సర్వ మంగళ దేవతలై వారి పావన స్త్రీ జన్మమును సార్థకము చేయవల యును. వారి శీలయుతమగు ప్రవర్తనమునకు సర్వకాల సర్వావస్థలయందును దేవతలు తోడ్పడుదురు గాక.

జయ భారతీ!



## మా రచయితలకు మనవి

మా పత్రికయందు ఎంతో అదరమును జూపుచూ, పెక్కులు పాత రచయితలు, ఎందఱో కొత్తరచయితలు కూడ అనేక రచనలను శ్రద్ధతో పంపుచున్నారు. ఇందులకు మా హృదయ పూర్వక కృతజ్ఞత.

అయితే, ఒక మనవి, కథలుగాని, వ్యాసములుగాని, పెద్దవిగానున్నచో, మేము వెంటనే ప్రచురించలేక పోవుటయేగాక, ఒక్కొక్కమారు ఆ రచనలను విభజించి రెండు మూడు సంచికలలో వేయడమో, మరికొన్ని రచనలను అసలు వేయకుండుటయో తట స్థించుచున్నది. అందువలన రచనలోని అందము పోవుటయేగాక, కొందఱు రచయితలకు నిరుత్సాహము కూడ కలుగుచున్నది. చిన్న రచనలను రెండు అచ్చు పేజీలకు మించనవిగా (ఇంకా చిన్నవైనను మరీమంచిది) పంపినచో మాకునిక్కమైన తోడ్పాటగును. సం॥

# హృదయ సౌందర్యం

శ్రీ గణపతి రాధాకృష్ణమూర్తి

"నిజంగా భోంచేశావా, బావా ?"

"ఊహు"

"మరి నాన్నకి ప్రొద్దున భోంచేశానని చెప్పడ మెందుకు"

"ఏమో మరి."

"చెప్పు బావా !"

"ఏకాలిది ?"

"అదికాదు బావా ! సరిగ్గా..."

"ఏదికాదు ?"

"పో బావా నీ వెప్పుడు యింతే"

"యిదుగో పోతూనే ఉన్నానుగా" పుస్తకములు సర్దుకొని కాలేజికెళ్ళాడు మోహన్.

కమల ప్రాణం చివుక్కుమన్నది. తను ఇంత ఆప్యాయంగా పలుకరించినా బావ మనసిచ్చి మాట్లాడడెందుకో అనుకుంది. తానంటే బావ కసహ్యమా ? ఎబ్బే. కాదు బావ స్వభావమే అంత. బావ చాల మంచివాడు. ఆ పచ్చటి పసిమి, నల్లటి నేత్రములు, పండిన పెదిమలు, ముద్దులు మూటకట్టే మోము, మెలితిరిగిన ముంగురులు, బూరెలులాగా ఉబికిన బుగ్గలు, అబ్బ, బావ ఎంత బాగుంటాడు. ఉదయం భోజనానికి రాకపోవటానికి కారణము నిన్న జరిగిన ఘటనేనా ? మా మామయ్య, అత్తయ్య తనకు రెండేళ్లు రాకముందే చనిపోయినా, నన్ను చూచినట్లే, ఏ కొరత కలుగకుండా తనకుకూడ మా నాన్నవాళ్ళు చూడటంలా ? ఆమాత్రము కృతజ్ఞతైన వారియందు కనపర్చకూడదు ? చిన్నప్పటినుండి మే మిద్దరం ఎంత కలసి మెలసి ఆడుకుంటుండేవాళ్ళం ! ఏదైనా బొమ్మల బొక్కు ఇయ్యి బావ అంటే తెల్లకాగితముల పుస్తక మిచ్చేవాడు గదూ ! వ్రాసుకోటానికి తెల్లకాగితముల పుస్తకమిమ్మంటే పెద్దబాలశిక్ష ఇచ్చేవాడుకదూ ! బావ చిన్నప్పటినుండి బహు కొంటె. ఎన్ని పర్యాయములు పెళ్ళిళ్ళాట ఆడుకున్నాం. ఎన్నిసార్లు నా మెడలో ఒట్టొట్టి మంగళసూత్రములు కట్టాడు. ఎన్నిసార్లు ప్రణయ కలహాలను అనుభవించాం ! అవి అన్ని ఇక మర్చిపోవలసిందేనా ? మా బావ కోసం ప్రాణమైనా ఇయ్యగలను. నరకమునుకూడ అనుభవించగలను. నేను కష్టపడుతూనైనా ఎల్లప్పుడు మా బావను సంతోష పెట్టగలను. కాని నా నలుపురంగును ఎరుపుగా మార్చులేనుగదా ? తన కాలేజీలో చదివే అందమైన యువతులను చూసి, నన్ను చూస్తుంటే బావకు అసహ్యమనిపిస్తుందేమో ! నిజమే ! కాలేజి యువతుల పౌడరు తళ తళలు, స్నో సువాసనలు, నూనె నిగనిగలు, నిలకడలేని నయనములు, ముసిముసి నవ్వులకు మిసమిసలాడే బుగ్గలు, ఆ బుగ్గలలో పడే సొట్టల సొంపులు, గులాబి పెదిమల వంపులు, వారిని వెంబడించే ఘుమఘుమలు, బయట కనబడే బాడీలు, జల్లెడలే నయమనిపించే జాకెట్లు, లోపల నుండే లంగాలు, జారీ జరీ చీరెలు మా బావ చూపులను దొంగిలించకుండా వుంటయ్యా ? నన్నుకూడ భగవంతుడు అందంగా ఎందుకు పుట్టించకూడదు" అని ఏమేమో అనుకుంటుంది కమల.

మోహనుని ముద్దుమాటలైన వినకముందే మాతాపితలు గతించారు. అప్పటినుంచి ఉదారుడైన మేనమామ పెంచుతున్నాడు. ఆ మేనమామ కూతురే ఈ కమల. 16 సంవత్సరాల వయస్సు. సౌష్టవంగానే వుంటుంది కాని కొద్దిగా నలుపు. పుష్పవతి ఐంది. తెలుగు బాగా చదివింది. మోహను స్థానిక కళాశాలలో బి. ఎ. రెండవ సంవత్సరము చదువుతున్నాడు. 20 సంవత్సరముల ప్రాయము. తొలిచి, తీర్చి దిద్దిన, ముచ్చటైన విగ్రహము. చలాకి, చతురుడు, చిలిపి, చమత్కారి. కమలను మోహానునికి ఇయ్యాలని మామైన ప్రకాశరావు పట్టుదల. మేనల్లుణ్ణి అల్లుణ్ణిగా చేసుకోవాలని అత్తైన ఆండాళ్ళమ్మ అభిలాష. మోహను బావనే చేసుకుతీరాలని కమల కాంక్ష. అందాలు చిందే సుందరాంగిని పొందాలని మోహనుని వాంఛ. పెండ్లి

విషయమై ప్రకాశరావు ఎన్ని పర్యాయములు మాట్లాడినా, చేసుకోనని నిర్మోహమాటంగా చెప్తున్నాడు మోహను. ఇక చేసుకోడనే భయం ఎక్కువౌతున్నకొద్దీ అత్త మామలు హడలిపోతున్నారు. కమల కుమిలిపోతున్నది.

బి. ఏ. పరీక్షలు అన్ని ఆ నాటితో ఐపోయినై, క్లాసు వచ్చి తీరుతుందనే ఉత్సాహంతో మోహను ఇంటికి వస్తున్నాడు. దారిలోనే మామగారెదురై "ఏరా మోహన్, క్లాసువస్తుందా" అన్నాడు. "తప్పక రావాలి మామయ్యా." అన్నాడు మోహను. గడప లెక్కుతుంటే నీళ్ళకు వెళ్తున్న ఆండాళ్ళమ్మ ఆపి "ఏమోయి బాగా వ్రాసావా"? అంది. "ఆ బాగానే వ్రాశానత్తయ్యా" అంటూ గదిలోకెళ్ళాడు మోహను డ్రస్సు మార్చుకోడానికి. కమల ఏదో చదువు కుంటుంది.

"ఏం బావా! బాగా వ్రాశావా అంది" చిరునవ్వుతో.

"ఏమిటి"

"పేపరు"

"ఏం పేపరు"

"పరీక్ష పేపరు"

"ఎప్పటి పరీక్ష పేపరు?"

"ఇవ్వాళది"

"ఎవరు"

"నీవే బావా"

"ఆ."

"అదేమిటి బావా అప్పుడే సమాధానము చెప్పావు? ఇంకా ప్రశ్నే వెయ్యక."

"ఇంకా వెయ్యమన్నావా?"

"వెయ్యి బావా"

"దగ్గరకు రా"

కమల దగ్గరకువొచ్చి నిల్చొంటుంది. వీపుమీద చిన్న శభాషీ వేస్తాడు మోహను. కమల గగుర్పాటుతోపాటు ఆనందాన్ని అనుభవించింది. "బావా! పరీక్షలుకూడా ఐపోయినైగా! కన్న తల్లి దండ్రులను మరిపించి పెంచి, పెద్దచేసిన మానాన్నవాళ్ళ కోరిక, ప్రాణాలన్నీ నీమీద పెట్టుకొన్న నా కోర్కె తీర్చవు బావా? నీకు నా జన్మాంతము దాసీలాగా శుశ్రూష చేస్తుంటాను—"

"ఛా! అదేమిటి కమలా! నిన్ను చేసుకొనే వాళ్ళే లేరా కమలా! నన్ను చేసుకొని దాసీలాగా వుండేదాని కన్నా, ఏ యువకుణ్ణి చేసుకొనో స్వర్గ సుఖములను అనుభవించవచ్చుగా! వివాహమంటే మనం చిన్నప్పుడు ఆడుకున్న బొమ్మలాటగాదు కమలా! ఇది ఆ జన్మాంతముండే ఒక అనుబంధము. అందుకనే ఇది ఏరి కోరి, ఆలోచించి చేసుకోవలసిన పవిత్రమైన కార్యము. నిజమే! నీ హృదయంలో సౌందర్యముంది. ఏం? ఇంకొకరిని వివాహము చేసుకొని మాత్రము నీ బావను ఆదరముతో అభిమానించ కూడదూ? మీరు నన్ను ఇన్నాళ్ళు ఆదరాభిమానాలతో సాకినందుకు నే నెల్లప్పుడు కృతజ్ఞుడ్నే. మీ కష్టకాలంలో నా సర్వస్వాన్ని సమర్పించి ఆదుకొంటాను. మీ అమ్మ నాన్న నీ కెంతో నాకుకూడ అంతే. క్షమించు కమలా! బావ కఠినంగా మాట్లాడేడని అనుకోకు" అంటూ రాకెట్ తీసుకొని క్లబ్బుకెళ్లాడు మోహన్.

పరీక్షా ఫలితాలు ప్రకటింపబడ్డవని కమల పేపరు చూచిందేకాని మోహను మన ప్రపంచంలో లేడు. విరిగిన కాలికి డాక్టరు కట్టు కడుతున్నాడు. రక్తము ఎగచిమ్ముతున్నది. ప్రకాశరావు, ఆండాళ్ళమ్మ ఆదుర్దా పడుతున్నారు. మా బావను బ్రతికించమని కమల కనుబడిన దేవుళ్ళందరికి మ్రొక్కుతున్నది. మోహను స్నేహితులంతా వచ్చి చూచిపోతున్నారు. 'కారు యాక్సిడెంట్' అని పోలీసువారు దర్యాప్తు చేస్తున్నారు—ఇది జరిగిన నెల రోజులకు మోహను క్రమంగా కోలుకున్నాడు. కమలకు వికసించింది. అత్త మామలు ఆనందభరితు లయ్యారు. కాని మోహను ఇప్పుడు వికలాంగుడు. తన అంగ విహీనతకు మోహను కుళ్ళిపోతున్నాడు. కాని అత్తమామలు, కమల తనను ఇదివరకుకన్న ఎంతో ప్రేమతో చూస్తున్నారు.

"బావ బి.ఏ. కు కాఫీ రెడీ" అంటూ కమల కాఫీ కప్పు మంచంమీద పడుకొన్న బావ కందిస్తుంది.

"కమలా! మీ ఋణం ఎలాగ ఎప్పటికి తీర్చుకుంటానో గదా! నిజంగా నీవు సుగుణాల కుప్పవు కమలా! నీవు కమలముకన్న కోమలమైన విదానివి కాని ఆ కమలములో కంటకములున్నై. ఈ కమలములో కుసుమరేణువులున్నై. నీ హృదయం అంతా మార్దవంతో నిండియున్నది. నీ పలుకులలో పనసతొనల మాధుర్యముంది. నీ చల్లని చూపులలో, చిగిర్చి విరజిమ్మిన విరజాజిపూల పందిరిలోని హాయి ఉంది. నీ హస్త స్పర్శ..."

"తగ్గండి బావా! నల్లపిల్లను ఇంత ఎగతాళి చేయకూడదు."

"క్షమించు కమలా! నీ హృదయ సౌందర్యమునకు ముగ్ధుడ్ని ఐపోయినాను. ఒకవేళ బావ కుంటివాడని నీవు అనుకుంటూ......"

"బావా, ఈనాటికి నేను కృతార్థులరానయ్యాను..."



# వసంతాగమనము

※ సుభద్ర ※

పండి పోయిన ఆకు
ఎండి రాలెను, మ్రాకు
మొండియై నిలిచాక
పిండివలె పొగమంచు
దండిగా కురిసిందీ
వెండిలా మెరిసిందీ॥

మంచిమామిడి తోపు
పూచె పుప్పొడితోడ;
పంచబాణుడు పొంచి
యంచ నంపించాడు
మంచు కరిగించాడూ
అంచు ఒరిగించాడూ॥

సన్న మామిడి గున్న
నున్న కోకిల కన్నె
మిన్నన్నయే తన్ను
చిన్న చూపులు చూచె
సన్నకూతలు కూసెనూ
ఉన్న మేతలు మేసెనూ॥

లేత చిగురుల మేత
చేత కోకిల కూత,
చూత పుప్పొడి ముంత
చెంత భృంగపువంత
కంతమే లేదెందుకో!
పంతగించే దెందుకో!



# కావ్యములలో నాటకం రమ్యము

✻ మద్వాచార్యుల శాంత ✻

యుగయుగాల నుంచి కూడా, భారత దేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో కావ్యాలూ, నాటకాలూ యివి రెండూ ఒకటిగా వస్తున్నాయి. అయితే, కవిత్వమంటే కొద్దిగానో గొప్పగానో అభిరుచి వుంటేగాని ఈకావ్యాలను అర్థం చేసుకోడానికి వీలుకాదు. ప్రాచీన కాలంనుంచీ, తెలుగు నాడు అందమై, మధురమై, ఆకర్షణీయమైన కావ్యాలకు ప్రసిద్ధి. ఇవన్నీ కూడా పేరుపొందిన కవులచేత రచించబడ్డవే. అసలు కవిత్వమంటే యేమిటో తెలియని వాళ్ళకి, యివి చాలా గందర గోళంగా వుంటాయి. అర్థమే అవవు. పెక్కుమంది మహారాష్ట్రకవులు, పారశీక, తమిళ కవులు కూడా ఈ కావ్యరచనకు పూనుకున్నారు. పారశీక కవులలో అబుల్ ఫజల్, అబుల్ ఫైజీ, బదావుని మొదలగు కవులెందరో కలరు. వీరి కావ్యాలన్నీ మధుర రసంతో నిండి, అక్బరు పాదుషావంటి చక్రవర్తులచే మెప్పొందాయి. ఇంత మంది ప్రాశస్త్య కవులు ఇతర దేశము లందున్నా, కావ్యరచనకు ఆంధ్రదేశమే మేటి అనిపించుకుంది. కావ్యాల్ని సులభావగాహనా శైలిలో, మధురమై, చెవికింపొనరించునట్లు రచించడంలో ఆంధ్రకవులకు ఆంధ్రకవులేసాటి. ఆంధ్ర కవులలో ముఖ్యులు తిమ్మన, అల్లసాని పెద్దన్న, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రగడ, తిరుపతి వెంకటేశ్వర కవులు మున్నగు వారు కావ్యరచనలో ప్రజాభిమానం సంపాదించారు. వీరిలో కొందరు భారత భాగవతాలు కూడా తెనిగించారు. ఆంధ్ర రాజులు వీరి రచనలను ఆదరించేవారు. మన ఆంధ్ర మహాకవులే కాక, చక్రవర్తులు కూడా కావ్య రచనకు పూనుకున్నట్లు తెలుస్తోంది. కృష్ణదేవరాయలు, మనుమ సింగ భూపాలుడు తదితర చక్రవర్తులు తెలుగు భాషలో శ్రావ్యమైన కావ్యాలు వ్రాసినారు.

తరతరాలనుంచి మనపూర్వులు కావ్యాలతోపాటు నాటకరచనకు కూడా ప్రాముఖ్యత నిచ్చుచుండే వారట. వారు కావ్యములను, నాటకములను సమానంగా ఆదరించి రెంటి సామరస్యం గ్రహించేవారు. కాని శతాబ్దములు గడచు కొలది, ప్రజలు నాగరికతలో కూడ మార్పు కనబడుతోంది. ప్రస్తుత దేశకాల పరిస్థితినిబట్టి కావ్యముల కన్న నాటకములే అధికంగా ఆదరింప బడుతున్నాయి. అందుకనే "కావ్యేషు, నాటకం రమ్యం" అంటారు. కాని నాటకానికే అధిక్యం యివ్వడానికి తగిన కారణం కూడా వుంది. కవి రచించింది కావ్యమనీ, నటించేది నాటకమనీ అంటారు. కావ్యాల్ని చదివి అవగాహన చేసుకోడానికి చాలినంత సంస్కృత భాషాజ్ఞానం, అనుభవం కావాలి. కాని నాటకాలను, వాటిభావాలిని కూడా నేర్పరితనంవల్ల అర్థం చేసుకోవచ్చు. కావ్యాలలో నిజంగా నాటకమే రమ్యంగా వుంటుంది. కావ్యాలలో కవియొక్క లోటు పాట్లు గ్రహింపవీలుకాదు. కాని నాటకాలలో, యే సన్నివేశమెట్లు కవి వర్ణించాడో, యే, యేపాత్రల నెట్లు కూర్చాడో గ్రహించి, కవి సామర్థ్యం కనుగొనవచ్చు. కొన్ని నాటకాలు చదివితే ఆ సంఘటనలు కన్నెదురుగా జరుగుతున్నాయా అనిపిస్తాయి. ఆంధ్రమున చిలకమర్తివారివి పానుగంటివారివి, అతి మధురంగా, హాస్యాస్పదంగా వుంటాయి. యింకా, శాకుంతల, నాగానందం, ఉత్తర రాఘవము, కన్యాశుల్కము మొదలైనవి గొప్పప్రజ్ఞతో వ్రాయబడ్డాయి. హిందూస్థానీ కవీశ్వరులలో "ప్రేమచంద్" నాటకములు వినోదంగాను, రమ్యంగానూ వుంటాయి. ఇంక ఆంగ్ల కవులలో గొప్ప, గొప్ప వారెందరున్నా, మనం ఎక్కువగా "షేక్స్పియర్" నాటకాలనే యిష్టపడతాము. దీనికి కారణం, నాటక రచనలో అతనిది అందె వేసిన చెయ్యి అవడమే.

ఈ నాటకాలు వ్రాయడంలో కవి, పాత్ర నిర్ణయము సరిగా నిర్ణయించాలి. ఈ నాటక రచన శాస్త్రం వంటిది కాదు. యిది లౌకిక, అలౌకిక ప్రకృతులకు సామరస్యం కలిగించి, మనుష్య స్వభావంతో స్నేహం చేసుకోడానికేర్పడింది. నాటక రచనకు కథావస్తువు ప్రధానమైనది. భాష రెండవది. సాధారణంగా ఈ కథను పురాణాల్లోంచో,

చరిత్రల్లోంచో, సంఘజీవనంల్లోంచో కవులు తీసుకుంటూరు. కాని ప్రజాభిరుచినిబట్టి తీసుకోవడం అవసరం. ఈ నాటక రచన అతి ఉత్కృష్టంగా వుండాలి. ఇది ఒక నాటితో అంతరించి పోయేదికాదు. కనుక నాటకాలు వ్రాయడంలో కలకాలము ఆదరింపబడి, వర్ధిల్లునట్లు వ్రాయవలెను.

మన నాటకములను రచించి, వాటినే ప్రదర్శించడానికి మొదట కూచిపూడివారు ఆరంభించారు. యిట్లా నాటకం ప్రదర్శిస్తేనే విమర్శనలకుగాని, అభినందనలకు కాని అవకాశ మేర్పడుతుంది. కాబట్టి నాటకాలాడుటలో నటకులు అప్రమత్తులై యుండాలి. నాటకాలలో నటించే వారికి సంపూర్ణంగా కాకపోయినా, కొంచెమైనా నాట్య, సంగీత కవిత్వాలలో ప్రవేశముండాలి. కొన్ని కొన్ని నాటకాలు చూస్తే, అది నిజంగా జరిగినట్లే వుంటుంది. దీనికికారణం నటకుని సామర్ధ్యమే. యింకో విషయమేమిటంటే, ప్రత్యక్షంగా నాటకా లాడడంవల్ల, ప్రజలలోను, సంఘంలోను కూడా అభివృద్ధి కలగవచ్చు. ఈ పైన వ్రాసిన కారాణా లన్నిటివల్ల కావ్యాలకంటే నాటకమే ఎన్నో విధాల ఉపయోగకరమైందీ, రమ్యమైందనీ స్పష్టమవుతుంది.



# "భగ్న జీవీ....!"

శ్రీ కోకా మాధవరావు

ఆశాసౌధాలెన్నో
ఆకాశవీధిలో
అమర శిల్పాలతో
అమరించినావోయి

నీ ఆశలన్నీ
నిరాశలై...
నిలిచావురా నీవు
నిర్జీవిగాను!

ఆశతోనే పుట్టి
ఆశతోనే పెరిగి
ఆశతోనే నీవు
అంత్యమన్నావు

ఓ...భగ్నజీవీ!
భుగభుగామండేటి
భావ జ్వాలల్లోన
బాధలే నోయి!

ఆదర్శాలకు
అడ్డులేదంటూనె
ఆడంబరముగ నీవు
ఆనోటికానోట
అందజేశావు

వెరపు గిగులును మాని
హృదిని ధృతి నందవో!
కాలగర్భములోన
భాగ్యమేమున్నదో!



2

బిడ్డల లివరు అండు స్లీప్లను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్లీప్లను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. నా వైద్యవృత్తియందును నా స్నేహితులలోను, బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిది వరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహదౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్ ఎన్. రామనాధన్‌గారు, L M P కావేరిపాకం.

వివరములకు:

**డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు & బ్రదర్స్.**

నెం. 11, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

| కుంభకోణం బ్రాంచి: | తిరుచినాపల్లి బ్రాంచి: |
| --- | --- |
| నెం 7, సారంగపాణి కోవిల్, | నెం 15, పుగళై పిళ్లై వీధి, |
| తూర్పువీధి. | తెప్పకొలం. |

అన్ని మందుల షాపులలోను దొరకును.

---

ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన

## మెహతావారి

## విశేష ఔషధములు

1. సుందరి ఎలిగ్జిర్ :—సమస్త ఋతు దోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపమ నివారిణి.
2. ఫాస్ఫరస్ ఆయిల్ :—బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానాపిల్సు :—సాధారణబలహీనత, కీళ్లనొప్పులు జ్వరములన్నిటికి అమోఘముగా పనిచేయును.
4. ద్రాక్షాసవము :—(బంగారము, మకరధ్వజము కలిసినది) రక్తమును శుద్ధిపరచునటువంటి, అజీర్ణము రూపుమాపునటువంటి బలవర్ధకౌషధము.

కెమిస్టులందరివద్ద దొరకును.

తయారు చేయువారు:

**K. S. MEHTA & CO.**

***250, China Bazar, Madras.***

---



FOR LOVELY LOOK & HEALTHY HAIR

use **KESRINE**

PRICE As 12 PER BOTTLE

VICTORIA DEPOT

NORTH MADA ST.

MYLAPORE, MADRA..

& AT MOST SHOPS

**కేశ్‌రీన్ హేర్‌టానిక్ 0-12-0**

కేశములు రాలుట మాన్పి సొగసుగాను, ఒత్తుగాను పుష్టిగాను, పెంపుజేయును.

**కేశ్‌రీన్ షాంపూ పౌడరు 0-12-0**

ఈ సువాసనగల పౌడరు వారమున కొకసారి కొంచెము నీటిలో కలుపుకుని తల స్నానమునకు యుపయోగించిన తలనుండు మురికి, జిడ్డు పోగొట్టును. జుట్టు నెదుగజేయుటలో సాయపడును

పోస్టేజి ప్రత్యేకము 10 అణాలగును

విక్టోరియా డిపో, మైలాపూరు, మద్రాసు 4.

# పాఠము 1.

## (वर्णमाला)

### स्वर

| అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ | ఏ | ఐ |
|---|---|---|---|---|---|---|---|---|
| अ | आ | इ | ई | उ | ऊ | ऋ | ए | ऐ |

| ఓ | ఔ | అం | అః |
|---|---|---|---|
| ओ | औ | अं | अः |

### व्यंजन

| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| क | ख | ग | घ | ङ | च | छ | ज | झ | ञ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ट | ठ | ड | ढ | ण | त | थ | द | ध | न |

| ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ |
|---|---|---|---|---|---|---|---|---|
| प | फ | ब | भ | म | य | र | ल | व |

| శ | ష | స | హ | క్ష | త్ర | జ్ఞ |
|---|---|---|---|---|---|---|
| श | ष | स | ह | क्ष | त्र | ज्ञ |

| జ(z) | డ | ఫ(f) |
|---|---|---|
| ज़ | ड़ | फ़ |

హిందీలో 'ఎ' 'ఒ' అనునవి లేవు.

# గుణింతము.

## (बारह खड़ी)

హల్లులతో గలియునప్పుడు అచ్చురూపము యిట్లుండును :—

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| अ | आ | इ | ई | उ | ऊ | ऋ | ए | ऐ | ओ | औ | अं | अः |
| | ा | ि | ी | ु | ू | ृ | े | ै | ो | ौ | ं | ः |
| క | కా | కి | కీ | కు | కూ | కృ | కే | కై | కో | కౌ | కం | కః |
| क | का | कि | की | कु | कू | कृ | के | कै | को | कौ | कं | कः |
| చ | చా | చి | చీ | చు | చూ | చృ | చే | చై | చో | చౌ | చం | చః |
| च | चा | चि | ची | चु | चू | चृ | चे | चै | चो | चौ | चं | चः |
| ర | రా | రి | రీ | రు | రూ | | రే | రై | రో | రౌ | రం | రః |
| र | रा | रि | री | रु | रू | - | रे | रै | रो | रौ | रं | रः |
| హ | హా | హి | హీ | హు | హూ | హృ | హే | హై | హో | హౌ | హం | హః |
| ह | हा | हि | ही | हु | हू | हृ | हे | है | हो | हौ | हं | हः |

ఇదే విధముగ యన్ని యక్షరములకును గుణింతము నేర్చుకొనవలెను.



(ప్రతి మాసము క్రమ పద్ధతిలో హిందీ పాఠములు ప్రచురింపబడును.)

# ఆదర్శ దాంపత్యము

## గాంధీ కస్తూర్బా దాంపత్య జీవితమును పురస్కరించుకొని

❋ శ్రీమతి ఆ. భాస్కరమ్మగారు ❋

దాంపత్యమనగా స్త్రీ పురుషుల మధ్యగల అన్యోన్య సంబంధము. అయినను సృష్టిలోని మానవ జాత్యాభివృద్ధి కొఱకు ఒక స్త్రీకి ఒక పురుషునకు శాస్త్రముల ననుసరించి న్యాయముగా సాంఘిక నిబంధనలకు లోబడియుండు సంబంధమే దాంపత్యమనబడును.

ఒక బాలికకు బాలునకు ఎప్పుడైతే అగ్నిసాక్షిగా, వేద మంత్రములతో శాస్త్రయుక్తముగా పలువుర సమక్షమున పరిణయము జరుగునో అప్పటినుండి వారిరువుర దంపతులన బడుదురు. వారిరువురి మధ్యాయేర్పడిన యీ బంధము జీవిత కాలంమంతా యుండ వలసినదే. వారిరువురకు ఒకే యుద్దేశములు, ఒకే ఆశయములు, విద్య వయస్సు మొదలగు వానిలో సమానత్వము మొదలగునవి నేవియు నుండనక్కరలేదు. ఒకరి నొకరు ప్రేమించుకొనుట గౌరవించుకొనుట తుదకు ఒకరి క్షేమము మరియొకరు చూచుకొనుట కూడ నవసరము లేదు. ఆ దాంపత్య జీవితములో సుఖము, సంతోషము అనునది లేక పోయినను, భార్యా భర్త లిరువురిలో నొకరితో నొకరికి పడక పోయినను, గృహమొక నరకముగా పరిణమించినను, ఒకరనిన మరియొకరి కెంత కిట్టక పోయినను, పెండ్లి బంధమునకు లోబడి ఒకరినొకరు విడచుటకు తగిన యవకాశములు లేక ఏదోవిధముగా జీవితము నీడ్చుచున్ననూ, వారిరువురు దంపతులే. వారి సంబంధమునకు దాంపత్యమనియే పేరు. అయితే ఇది దాంపత్య మనబడవచ్చునుగాని ఆదర్శ దాంపత్యమని మాత్ర మనబడదు.

దాంపత్యమునకు ఆదర్శ దాంపత్యమునకు చాల భేదము కలదు. మన దేవతలందరు అదర్శ దంపతులే. పార్వతి శివుని కొఱకు ఎంతో కాలము తపస్సు చేసి చేసి శివుని పొందినది. శివుడు పార్వతియొక్క రూపురేఖా విలాసములు, యోగ్యత, జ్ఞానము, తన యెడల నామెకు గల భక్తి, తనను బడయుటలో నామెకుగల పట్టుదల మొదలగు వానిని జూచి ముగ్ధుడై యామెను పెండ్లియాడెను. ఇరువురు సమాన శక్తి సమర్థతలు గలవారు. సమాన హక్కులు, అధికారములు, అన్యోన్య గౌరవ ప్రేమలు గలవారు. భర్తకు భార్య అర్ధాంగి, భార్యకు భర్త అర్ధ శరీరము అన్నందుకు తగినట్లుగా శివుడు అర్ధనారీశ్వరుడు. పార్వతీ పరమేశ్వరు లిరువురూ మనకుసమాన పూజనీయులే. ఇందొకరు ఎక్కువ ఒకరు తక్కువలేదు. వరములిచ్చుటలో నిరువురకూ సమాన శక్తి సమర్థతలు గలవు. లక్ష్మీ, విష్ణు మూర్తులు ఇట్టివారే. విష్ణుమూర్తి తన భార్యయైన లక్ష్మీ దేవిని వక్షస్థలమునందే ధరించెను. బ్రహ్మ సరస్వతీ ఈ విధముగా మన త్రిమూర్తులు ఆదర్శ దంపతులై యున్నారు.

వివాహములలో నూతన దంపతులకు అరుంధతియను నక్షత్రమును జూపుట మన హిందువులలో నొక యాచారమై యున్నది. అరుంధతి వశిష్ఠుని భార్య. ఆమె మాల కన్య. ఉత్తమ బ్రాహ్మణుడు, తపస్వి, సప్తమహా ఋషులలో నొక మహర్షియైన వశిష్ఠుడు ఆమె రూపురేఖలు, గుణ గణములు, నీతి నియమములు, తెలివితేటలు, జ్ఞానము మొదలగు సమస్త సలక్షణములను కలిగి యుండుట చూచి ఆమెయే తనకు దగిన భార్యయని ఆమెను వివాహ మయ్యెను. వారిరువురు జీవితకాలమంతయు నొకరి నొకరెడబాయక అన్యోన్యానురాగ గౌరవ ప్రేమలతో ఆదర్శ దాంపత్య జీవితమును గడుపుటయే గాక చనిపోయిన తరువాత గూడ నెడబాటులేని నక్షత్రములై వెలసి ఆకాశమున వెలుగుచున్నారు. ఈ దంపతుల నాదర్శముగా గొని వివాహమగుచున్న నూతన దంపతులు తాము కూడా నట్టి యాదర్శ దాంపత్య జీవితమును నడుప వలయునని సప్తర్షి మండలములో వశిష్ఠునకు దగ్గరగావున్న ఆ అరుంధతీ నక్షత్రమును జూపుదురు.

సీతారాములు, నల దమయంతులు, చంద్రమతీ హరిశ్చంద్రులు వీరందరూ ఆదర్శ దంపతులే. స్త్రీలందఱూ పతివ్రతలు, పురుషులందఱూ ఏక పత్నీవ్రతులు. స్త్రీ పురుష భేదములేకుండ అన్యోన్య గౌరవ ప్రేమలు గలవారు. వీరు శ్రీమంతులై, వైభవోపేతులై సమస్త సౌఖ్యములనుభవించు నప్పు డెట్లుండిరో ఐశ్వర్యము నంతయు గోల్పోయి, యడవులపాలై అష్టకష్టముల ననుభవించు నప్పుడు గూడ నొకరి నొకరెడబాయక కాలమును గడపిరి.

ప్రస్తుత కాలములో లోకమంతటి చేత నవతార పురుషుడనీ, ఆదర్శజీవియనీ, భగవంతుని దూతయని, యుద్ధములు, సామ్రాజ్య తత్వములు, అన్యోన్య వైరములు, కుల మత జాతిద్వేషములు, అధికార గర్వములు అమితముగా ప్రబలి మానవజాతి (నశించుచున్న) యీ కాలములో తన సత్య, అహింస శాంతి, ప్రేమ గౌరవ బోధలద్వారా ప్రపంచమును రక్షింప జన్మించిన మహానాయకుడని లోకమంతటి చేత నేకగ్రీవముగా గొనియాడబడుచున్న, పూజింపబడుచున్న, గాంధీ మహాత్మ కస్తూర్బాల దాంపత్యము కూడ ఆదర్శ దాంపత్యమనియే చెప్పవచ్చును.

మన సనాతన పద్ధతిలో వీరిద్దరకు చిన్న తనముననే వివాహమైనది. వారిరువురూ చిన్నప్పటినుండి భార్యా భర్తలై ఒకరినొకరు ప్రేమించుకొనుచు ఒకరియెడల నొకరు గౌరవ ప్రతిపత్తులు కలిగి మెలగుచుండిరి. గాంధీజీ యెంత విద్యావంతుడయిననూ, కొంత కాలము పాశ్చాత్య నాగరికతా వాతావరణములో మెలగినను, వంశసాంప్రదాయము, తలి దండ్రులచే నొసగబడిన చక్కని సుశిక్షణ ముఖ్యముగా తల్లియొక్క బోధలు ఆయన మనస్సుమీద బలీయమైన ప్రభావమును కలిగియుండెను. ఆయన తన స్వభావముచేతను, గౌరవనీయమైనట్టియు, మంచి మర్యాద గలట్టియు, స్త్రీలను నీచముగా చూడక గౌరవ మొసగునట్టియు, కుటుంబములో మెలగు చుండుట చేతను స్త్రీలయెడల నమిత గౌరవము గలవాడు. భార్య పురుషు నెలా ప్రేమిస్తుందో, గౌరవిస్తుందో అలాగే పురుషుడు స్త్రీయెడల గౌరవ ప్రేమలు చూపాలనే తత్వములోని వాడు. స్త్రీకి పాతివ్రత్యమెంత ముఖ్యమో పురుషునకేక పత్నీ వ్రతముగూడ నంత ముఖ్యమే అను న్యాయముగలవాడు.

కస్తూర్బా యక్కువ విద్యావతి కాక పోయినను జ్ఞానవంతురాలు, సుగుణవతి, ఆత్మ గౌరవము గలది. పసితనము నుండి భర్తయే దైవమను బోధలలో పెరిగిన బాలికయగుటచేత భర్తకు విధేయురాలై ఆయన ననుసన్నలలో మెలగుచుండెడిది. గాంధిగారే దేశమునకు వెళ్ళినను ఆమెను కూడ తీసికొని వెళ్లుచుండెడివారు. ఆయన సహాయ నిరాకరణోద్యమములో ప్రవేసించి తన ఉద్యోగమునుమాని ఆస్తి నంతయు దేశము కొఱకు దార పోయుచున్నప్పుడు మొదటి నుండియు అగర్భ శ్రీమంతురాలై వైభవముగా సౌఖ్యసంతోష సాగరములలో నోలలాడిన శ్రీమంతురాలు.బిడ్డలు తాను దరిద్ర మనుభవింపవలసి వచ్చినప్పుడు మాత్రము యిల్లాలి ఆత్మ చాలా దుఃఖించినది. భార్యా భర్త లిరువురిలో కొంచెమభిప్రాయ భేదము లేర్పడినవి. కాని ఉత్తమయిల్లాలగు కస్తూరిబాయి భర్తయొక్క ఉన్నతాశయములు బోధనలు వినుచుండుటవలన త్వరలోనే ఆయన తత్వము నర్థము చేసికొని ఆయనతో నేకీభవించి కష్టముల నన్నిటిని సంతోషముగా ననుభవించినది. జయిలుకు వెళ్ళినది. ఆయన చేసే అన్ని కార్యములలోను తోడు నీడయై ప్రవర్తించినది. గాంధీజీ కూడా తానెక్కడకు వెళ్లినను విద్యావతి కాదని ఆమెను నిరసించక, తక్కువగా చూడక తనతో కూడా తీసికొని వెళ్లుచు ఆమెకూడా తనతో సమానముగా గౌరవింపబడునట్లు చూశారు. ఆమెను ప్రజలు గాంధిగారితో సమానముగా గౌరవించుచుండెడి వారు. ఆమె భర్తతో సమాన భక్తి గౌరవములను పొందినది.

ఒకసారి గాంధిగారి కామెమీద కోపమువచ్చి యింట్లో నుండి పొమ్మన్నారట. అప్పుడామె ఆయనకిచ్చిన జవాబునకు మరియొక భర్త అయిన యెడల తనను ఎదిరించినందుకు పట్టుకు తన్నేవాడేమో! కాని, ఉత్తమోత్తమ పురుషుడగు మహాత్ముడు ఆమె ధైర్యమునకు, ఆత్మ గౌరవమునకు సమయోచిత బుద్ధికి తనకిచ్చిన జ్ఞానోపదేశమునకు మెచ్చుకొంటూ తన తప్పును గ్రహించుకొని మాట్లాడలేక పోయారు.

# ఆదర్శ దాంపత్యము

ఈ దంపతులు ఈ రీతిగా సమాన గౌరవ ప్రేమలు, హక్కు అధికారములు కలిగి మన ప్రాచీన దేవతలవలె చిర కాలము ఆదర్శ దాంపత్య జీవితమును గడిపి లోకమున కాదర్శ దంపతులయ్యారు. ఆదర్శ స్త్రీయైన కస్తూరిబాయి సాధారణముగా స్త్రీలు ముఖ్యముగా కోరుకొనే సుమంగళీ మృత్యువు నేపొంది భర్తనుండియు ప్రజలనుండియు నిందను నమితమైన గౌరవమును బడసెను. మహాత్ముడు ఆమె పేరు చిరస్థాయిగా లోకములో నిలచి పోవుటకు ఆమె పేరిట ననేక స్త్రీ సంస్థల నెలకొల్పి తన భర్తృ ధర్మమును నెర వేర్చుకొనెను. తక్కిన అన్ని విషయములతో బాటు గాంధీ మహాత్ముడు ఆదర్శ దాంపత్య మెట్లుండవలయునో అను విషయమును కూడ తన దాంపత్య జీవితముచే జూపెను.

నమస్తే



## శ్రీకాకుళ మహిళా సంఘము.

డి. సువర్ణాభాయి

26-1-50 ఉదయం 6 గం॥ నుండి 7 గం॥ వరకు బాల సంఘం మహిళా సంఘం కలిసి నగర సంకీర్తన గావించి 7-30 గం॥ మహిళాసంఘ ఆవరణయందు పతాకోత్సవము జరిపిరి. బాలికల జాతీయ గీతములతో ఉత్సవము ప్రారంభింపబడెను. శ్రీమతి రావిపాటి లక్ష్మీనరసాయమ్మగారు జాతీయజండా నెగురవైచి ఈ రోజుయొక్క ప్రాముఖ్యత గురించి, ఇక మన కర్తవ్యమును గురించి ముచ్చటించిరి.

సాయంత్రం 4 గం॥కు తిరిగి మహిళా సంఘ ఆవరణ యందు శ్రీమతి రా. లక్ష్మీనరసాయమ్మగారి అధ్యక్షతను స్త్రీల సభజరిగెను. సభకు సుమారు 500 మంది స్త్రీలు విచ్చేసిరి.

శ్రీయుత సరస్వతుల సుబ్రమణ్యశాస్త్రి బి. ఏ. బి. ఎల్ గారు 'నూతన రాజ్యాంగ చట్టము'నుగురించి విపులముగ నుపన్యసించిరి.

అనంతరము అధ్యక్షురాలు హిందూదేశ పూర్వ ఔన్నత్యము, మహాత్ముని కృషి, దేశ విషయములందు స్త్రీల బాధ్యతయు, రాజ్యాంగ చట్టమున, స్త్రీలకు లభించిన హక్కులు మొదలగు విషయముల గురించి ఉపన్యసించిరి. మరియు ఈ సంఘము స్త్రీల యభివృద్ధికి చేయుచున్న కృషిని, సంఘముచే ప్రకటించబడిన పత్రికను ప్రశంసించుచు సంఘమునందు స్త్రీలందరును చేరి సంఘాభివృద్ధికి తోడ్పడ మని హెచ్చరించిరి. ఉపన్యాసానంతరము బాలికలచే నాట్య నాటకములు జరిగెను.

'జన గణ మన' గీతముతో సభ ముగిసెను.

## గ్రామ సేవికా శిక్షణ కేంద్రము.

ఆంధ్రరాష్ట్ర కస్తూర్బా గాంధీ జాతీయ స్మారక నిధి అధ్వర్యమున రాష్ట్ర గ్రామ సేవికా శిక్షణ కేంద్రమునందు సీతానగరంలో 22-2-50 తేదీన కస్తూరిబా వర్ధంతి అతి వైభవముగా జరుపబడెను. శ్రీ పైడా వెంకటనారాయణ జమీందారుగారు సభకు అధ్యక్షత వహించిరి. శ్రీ సాహిత్యాలంకార బోయపాటి నాగేశ్వరరావుగారు కస్తూరిబా జీవిత ఆదర్శములను గురించి విపులముగా జెప్పిరి. శ్రీ మద్దూరు పాపారావు కవిగారు కస్తూరీబాను గురించిన తమ మధుర కవిత్వమును వినిపించిరి. నిధి సంగీతకురాలు శ్రీమతి రాచర్ల సామ్రాజ్యంగారు ఆంధ్రంలో నిధి తరపున జరుగు పనులను వివరించి చెప్పిరి. బీద విద్యార్థులకు బట్టలు ఈయబడెను. నవీన పాఠశాల విద్యార్థినులు జాతీయ ఏకాంకి నాటికను చక్కగా ప్రదర్శించిరి. వివిధ మహా వినోద ప్రదర్శనములు జరిగెను. అధ్యక్షులు తమ అంత్యోపన్యాసమునందు కస్తూరిబా జీవితమును ప్రస్తుతించుచూ ఆంధ్రదేశములో కస్తూరిబా ఆదర్శములను ప్రచారముచేయుచు గ్రామీనా స్త్రీ పిల్లల, అభివృద్ధికి అన్ని విధముల పాటుపడుచున్న కస్తూరిబా స్మారకనిధికి అందరూ తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి గావించిరి. నిధి కార్యదర్శిని శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారు ధన్యవాదములు సమర్పించిరి.

ది. బుచ్చికృష్ణమ్మ
కార్యదర్శిని



# [illegible] పసిబిడ్డలకు విటోఫెర్రిన్ అత్యవసరం

పసిపాపలకు విటో ఫెర్రిన్, యిచ్చి, వారి పెరుగుదలను [illegible]ండి. పెరుగుచుండు పాపాయిలకును, వ్యాధుల [illegible] చుండువారికిని, శరీరాభివృద్ధికి అత్యవ[illegible] విశేషాలు ఇందులో ఉన్నవి.






తయారుచేయువారు:
ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్,
మల్లేశ్వరం, బెంగుళూరు.

విక్రయ ప్రతినిధులు: బెస్ట్ & కంపెనీ, లిమిటెడ్,
పోస్ట్ బాక్సు నెం. 63, మదరాసు.

8225-T0

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

**RITA**
**HAIR TONIC**






# అమృతాంజనము

గాని,

“ యథాయథా...............కాళీధవళత్వ శంకయా.”

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుఁజేయు ఘనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమో యను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

ఆత్మబలిదానముతో అమరత్వమందిన
మహాపతివ్రత పవిత్రగాథ
వేలాదిగా విరగబడి చూచుటలో ఆశ్చర్యమేమి!

అంజలీదేవి
జి. వరలక్ష్మి
సూర్యప్రభ
శేషమాంబ
బాల సరస్వతి
రాజరత్నం
బేబి నారాయణి



నాగేశ్వరరావు
శివరావు
ప్రభాకర్
గాదేపల్లి
గౌరీపతిశాస్త్రి
కందికొండ
మాస్టర్ కుందు

# శ్రీ ప్రతిభా వారి లక్ష్మమ్మ కథ...

ప్రొడ్యూసర్ డైరెక్టర్... జి. బలరామయ్య



పూర్ణా రిలీజు

| మాటలు-పాటలు | ఫోటోగ్రఫీ | ఆర్టు | మ్యూజిక్ | నృత్యం |
|---|---|---|---|---|
| బలిజేపల్లి అండ్ గోపాలరాయశర్మ | శ్రీధర్ | యస్. వి. యస్. | సుబ్బరామన్ | రా...వయ్య |

ఆంధ్రమహిళ

# 6వ జన్మదిన ప్రత్యేక సంచిక

మేనెల మొదటివారంలో వెలువడుతుంది.

## 120 పేజీలు.

చక్కటి ముఖచిత్రంతో ఆర్టు కాగితపు అట్ట.

లోపల ప్రఖ్యాత చిత్రకారిణి, శ్రీమతి రత్నాల కమలాబాయిగారి,

'సంధ్యారుణ శివతాండవము' త్రివర్ణచిత్రము.

రాజకీయాలు, సంఘ వృత్తాంతాలు, స్త్రీ సమస్యలు, లలితకళలు

వీనినిగూర్చి ప్రఖ్యాత రచయితలు, ప్రసిద్ధ వ్యక్తులు వ్రాసిన వ్యాసములు.

చక్కటి నాటికలు, అందమైన చిన్నకథలు, పెద్దకథలు.

ఇంకా ఎన్నింటినిగూర్చో, కబుర్లూ, వ్యాసములూ, పద్యాలూ, గద్యాలూ.

బాలానందం, హిందీ పాఠం, గ్రంథసమీక్ష, చిత్ర విమర్శ.

వ్రాత చిత్రములూ, ఛాయా చిత్రములూ;

సర్వాంగసుందరంగా తయారగుచున్నది.

## వెల రూ. 1—0—0.

హిగ్గిన్‌బాదమ్స్ అన్ని బుక్కుస్టాల్సులోనూ దొరకును.

మీ మీ ఏజంట్లతో వెంటనే చెప్పి వుంచండి.

లేఖన్న

మేనేజరు, ఆంధ్రమహిళ, మైలాపూరు, మదరాసు-4.

అను చిరునామాకు వ్రాయండి.

మేనేజరు,

ఆంధ్రమహిళ.

# ఏప్రిల్ 7వ తేదిని ఆంధ్రదేశమంతటా విడుద








అంజలీదేవి.
నాగేశ్వరరావు
శివరావు నటించిన
అశ్విని పిక్చర్సు వారి

# "మాయలమారి"



డైరెక్షన్,
బి.ఎ. సుబ్బారావు
మాటలు, పాటలు.
తాపి.
స్టూడియో
శోభనాచల.

SARMA TVS

## మా ఏజెంట్లకు

ఆంధ్రమహిళ, ఆరవ జన్మదిన సంచిక, అతి రమణీయంగా, మే మొదటి వారంలో వెలువడుతూవుంది.

లోపల 'సంధ్యారుణ శివ తాండవనం' త్రివర్ణ చిత్రం.

ఇంకా మంచి రచనలు, చిత్రములు ఉంటాయి.

సంచిక వెల రూ. 1-0-0.

మా ఏజంట్లకు ఎప్పటివలె 25% తక్కువ ధర.

ఎన్నిప్రతులు కావలెనో ఏప్రిలు 15-వ తేదీ లోగా తెలియ చేయుచూ, ఖరీదు ముందుగా పంపినచో కాపీలు వారి కొరకై రిజర్వ్ చేయబడును.

మేనేజర్.
ఆంధ్రమహిళ.

# ఆంధ్రమహిళ

సంపుటి 6 :: ఏప్రిల్ '60 :: సంచిక 12

ముఖచిత్రం. 1300 సంవత్సరాలక్రితపు "అజంతా" చిత్రాలకు నకలు :
అజంతాలోని 6వ గుహాకుడ్యంలోనిది. బోధిసత్వుని సహచారిణి, కేసరములు ఎంతో సొంపుగా చిత్రించిన చిత్రం ఇది. అధునిక హైందవ మహిళ ఊహించలేని అందం అప్పటి సామాన్య మహిళ అలంకరించుకో కలిగేదో లేక చిత్రకారుని ఊహాయో చెప్పలేము.



ఇంకా పద్యాలూ, గద్యాలూ ఎన్నో.


సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి యం. యే., బి. యల్.,
సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.
ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు



# విజయము

## రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము

### ఆంధ్ర మహిళా సభ

విద్యార్థినుల కుట్టు, ఎంబ్రాయిడరి పరీక్షాఫలితములు అతి ఉత్సాహకరంగా నున్నవి. హయ్యర్ పరీక్ష వ్రాసిన 9-గురికి అంతా విజయమును గాంచిరి.

లోయర్ పరీక్షలు వ్రాసిన 15 గురిలో 11-గురు కృతార్థులైరి. కృతార్థులైన విద్యార్థినులకు అభినందనములు.

శిక్షణ బాధ్యతవహించి కర్తవ్యమును జయప్రదంగా నిర్వహించి, పాఠశాలకు పేరు కీర్తులు తెచ్చిన ఉపాధ్యాయినిలకు మా హృదయ పూర్వక అభివందనములు.

### హయ్యర్ గ్రేడ్

కుట్టుపని

1. ఎ. పద్మావతిబాయి.
2. వి. సరస్వతి.
3. జి. సత్యనారాయణమ్మ.
4. కె. సుగుణమ్మాళ్.
5. కె. ఈశ్వరీ కుమారి.
6. ఎమ్. సావిత్రి.

పరీక్ష వ్రాసిన 6 గురు విజయము గాంచిరి.

ఎంబ్రాయిడరీ : 1. కె. ఈశ్వరీకుమారి. 2. ఎమ్. జయలక్ష్మి. 3. జి. తిమ్మాబాయి.

పరీక్ష వ్రాసిన ముగ్గురు కృతార్థులైరి.

### లోయర్ గ్రేడ్

కుట్టుపని :

1. సి. పర్వతం.
2. డి. మహాలక్ష్మి.
3. జి. గంగాబాయి.
4. ఎమ్. కమలాబాయి.
5. వి. ఎస్. సరళ.
6. జి. తిమ్మాబాయి.
7. ఎస్. కె. జయలక్ష్మి.

పరీక్ష వ్రాసిన ఏనభయిండుగురిలో ఏడుగురు విజయము గాంచిరి.

ఎంబ్రాయిడరీ :

1. వి. ఎస్. సరళ.
2. కె. సీత.
3. ఏస్. చంద్రాబాయి.
4. బి. సత్యనారాయణమ్మ.

పరీక్ష వ్రాసిన 7 గురిలో, 4 గురు కృతార్థులైరి.

ఈ విద్యాలయము స్థాపించి నాలుగు సంవత్సరములు పూర్తియగును. ఇప్పటికి మూడు సంవత్సరములనుండి వరుసగా, హైయ్యర్‌క్లాస్సు పరీక్షలకు వెళ్లుచున్నారు. ప్రతి సంవత్సరము, ఫలితములు చాల ఉత్సాహకరముగానే ఉన్నవి. ఐదు నెలల తర్ఫీదుతో లోయర్ పరీక్షలు వ్రాసిన విద్యార్థినులు పెక్కుచుండిగలరు. ఇందు బోధన ఉచితము. వసతి సౌకర్యములుగలవు. బీదవారలకు ఉచితభోజన సదుపాయములునూ గలవు.

1950-నవంబరు పరీక్షలకు శిక్షణ జనవరినుండి ప్రారంభమైంది. చేరగోరువారు ఇంకనూ చేరవచ్చును.

అ. చన్నఘంటమ్మ.

కరెస్పాండెంటు.



సంపుటి 6 ఏప్రిల్ 1950 సంచిక 12

# జో జో స్వతంత్రదేశం

గ్రహకూటాలు అవిరామంగా పరిభ్రమణం సాగిస్తున్నవి. కాలం అతిసహజంగా పురోగమిస్తూ ఉన్నది. మనకు స్వాతంత్ర్యం సంప్రాప్తించిన కునంతరమే. సర్వజిత్తు, సర్వధారి, విరోధి ఈ మూడు సంవత్సరములు ఇట్టే జరిగిపోయినవి. ఇంక వికృతి ప్రవేశించింది. అదిమాత్రం జరుగదూ! మనం మాత్రం జరగటం లేదూ!

నడవండీ! నడవండీ!—వెనుకకు నడవండీ!!
ప్రపంచమంతా పురోగమనం!—స్వతంత్ర భారతి తిరోగమనం!!

అదేమని మనము వెఱ్ఱి ప్రశ్న వేస్తే,

నడకరాకనే ఉరకలువేస్తే, సవ్వారటరా పైవారూ!!
ఆకాశములో మేడలుకట్టే, ఆశాభంగము కాదటరా!!

అని మందలింతురు మన ప్రభుత్వం. భౌతిక గ్రహాలనైనా ఎదిరించి వెనుకంజవేయగలము గాని, మన పాలక గ్రహాల నెదిరించి బ్రతకగలం?

అయినా మనలో మనమాట:—

శాంతి మంత్రములతో భారతభూమిని ఖండించినామేగాని, నవఖాళీ హత్యాకాండల నాపుచేయలేక పోయినాము. శాంతి సమరంతో స్వరాజ్యాన్ని సాధించినామేకాని, రక్త ప్రవాహములలో మునకలువేస్తూ, స్వతంత్ర భారతికి అశ్రుధారలతో అభిషేకం చేస్తున్నాము. కాందిశీకుల కన్నీటి కాల్వల కడ్డువేయలేకున్నాము. కాశ్మీరు సమస్యలో కాలు కదుపలేకున్నాము. అస్వతంత్ర భారతి నంటిపెట్టుకొనియున్న సత్యాహింసా నీతులకు, స్వతంత్ర పతాక ప్రతిష్ఠతో స్వస్తి చెప్పినాము. అవినీతి, అధర్మం, ఆశ, అశాంతి, అసంతృప్తి, అతి విచ్చల విడిగా సంచరిస్తున్నాయి. 16 ఔన్సుల రేషన్, 10 ఔన్సులు చేసికున్నాము. గుడ్డల కరువంటూ

బిల్లులు మూస్తున్నాము. అవసర వస్తువుల కరువుకు, అవినీతి, నల్లమార్కెట్టు రెండు భుజము లగుటచే పదార్థములన్నీ కల్తీ. అయినా— మనసులో కల్తీ, మాటలో కల్తీ, నడకలో కల్తీ, నటనలో కల్తీ, ఇంతెందుకు ప్రజలలో కల్తీ, ప్రభుత్వమే కల్తీ!

ఇదే నా మనస్స్వతంత్ర ఫలితము! ఇదే నా మనస్స్వరాజ్య తంత్రము!

ఇంకా పైగా,

వారానికి 7 రోజులూ, రోజుకు 24 గంటలూ చాలవని, వారు ముందంజవేస్తూ, కాలాన్ని వెనుకంజవేయిద్దామని అభ్యుదయగాములు ఆరాటపడుతుంటే— మనం తప్పటడుగులు వేస్తూ, కునికిపాట్లుపడ్తూ, కాలాన్ని చోచోమని ముందుకు సాగిపొమ్మంటున్నాము. అభ్యుదయమనే పేరుతో, సామాన్యునికి సంతృప్తియనే ఎండమావును కల్పించి, వానికి గల కించ దవకాశములను పుణికివేసి, వాని ప్రాథమిక హక్కులపై దురాక్రమణ చేస్తున్నాము. వారానిక 7 రోజులు పర్య టించినా అవసర వస్తువులు నల్ల మార్కెట్టునుండి వెలుగుకు వచ్చి ప్రసన్నత చూపని రోజుల్లో, పరివారానిక్ పని తక్కువ కావాలని, ఒక రోజు పూర్తి మూత, మిగతా రోజుల్లో 8 గంటల కన్న తెఱచి యుంచరాదని, దుకాణాల వారిని శాశించాము.

తంతి తపాలాలు ఇప్పటికే ప్రజా సంతృప్తికరముగా లేవని తెలిసికూడ, ఆర్థిక నిరాస్యత అనే వంకతో, తపాలాఫీసును ఆదివారం పూర్తిగా మూతవేయుటకు నిర్ణయించాము. పై కార ణముచేతనే, వారమున కొకమారు రైళ్లు నడవవని నిర్ణయించటం అసంభవంకాదని కొందఱు అభిప్రాయపడుతున్నాం. ఆహారశాఖవారు, వారమున కొకమారు నిరాహారదీక్ష పూనినచో ఆహారసమస్య సులభముగా పరిష్కారము కాగలదని సలహా చెప్పినే యున్నారు. శాసనము చేయుట తరువాయిగా నున్నది. ఆరోగ్యశాఖవారు 'లంకణం పరమౌషధం' అని ఆహార శాఖ వారి సలహాను బలపరుస్తూ, ఏపని చేయకుండా ప్రజలంతా వారమున కొకదినము పూర్తిగా విశ్రాంతి తీసికుంటే మానసికంగా, శారీరకంగా కూడా చాలా ఆరోగ్యకరమని శాసనరీత్యా అమలు జరుపటానిక్ ప్రయత్నించవచ్చు. ఈ సదవకాశమును పురస్కరించుకొని సాంస్కృతిక శాఖవారు, యోగమునకు, ఆసనములకు, ప్రఖ్యాతిగాంచిన మన ఆర్యభూమిలో, ప్రాచీన సంస్కృతిని పునరుజ్జీవింప జేయటానికని శవాసనాలను శాసించవచ్చు.

ఒకవిధంగా, ప్రజల ప్రాథమిక హక్కులపై దురాక్రమణమైనా, ఇదే నిజమైన పురోగమన మని, ప్రజా శ్రేయస్సుకు ప్రస్తుత పరిస్థితులలో ఇంతకుమించిన విధానము లేదని ప్రభుత్వము నిరూపించగలదు.

దుకాణాల బిల్లు ఇంక కొంచెం గట్టిచేసి, పురుషుల ఆఫీసు సమయంలోనే అంగళ్లు తీసి పెట్టాలన్నారనుకొండి. పరివారానికి పని తక్కువ. ఆఫీసులో ఆర్జన నిమిత్తం శ్రమించిన పురుషు

నను అంగళ్లచుట్టూ తిరిగే శాధ్యత తనంతతానే వదలిపోతుంది. స్త్రీలకు హిందూకోడు సవరణ లేకుండానే ఆర్థిక స్వాతంత్ర్యం అట్టే వస్తుంది. అంగళ్లన్నీ చీరెలతో, గాజులతో, అలంకారాలతో ఆభరణాలతో కలకల్లాడుతూ గలగల్లాడుతుంటే, పురానికి శోభ, వ్యాపారానికి లాభం—ఒక్క దెబ్బలో ఇంతమందికిగల్గే లాభం అభ్యుదయం కాక మరేమనుకోవాలి!

ఇంక శనాసనాలే శాసనమైతే: 7 రోజులకు చాలని ఆర్జన, పురుషుండు 6 రోజులకు సర్ద వచ్చు. 7-వ నాడు ఆహార పదార్థాలు అప్పులుచేసి, అతుకులుపెట్టె అవస్థ గృహిణికి తప్పుతుంది.

అరాచకం ప్రబలిన యీ రోజుల్లో, బయటకు వెళ్లిన వ్యక్తి యింటికి వచ్చునా అనే భయం ఒకనాడైనా పూర్తిగా తప్పుతుంది. హత్యాకాండలు, దోపిళ్లు, కమ్యూనిష్టు దౌర్జన్యాలూ, మత కలహాలూ, రాజకీయ కుతంత్రాలూ—వీనిని గూర్చి ఒకనాడైనా వినకుండా ఉంటాం.

జాగ్రదావస్థలో, యీ కష్ట నిష్ఠురాలు అనుభవించకుండా, ప్రశాంతంగా ఉండగల్గే సుషుప్తిని భారత జాతి కోరుకుంటూ ఉంది. గట్టెక్కే మార్గం వేరు లేదు గనుక. ప్రభుత్వం కూడా దానినే సాధించాలని పాటుపడుతూ ఉంది. వికృతి తన వికృతాట్టహాసంతో ప్రవేశించింది. ఇంక వేగ నిద్రపోండు. నిద్రలోనే మన అభ్యుదయం.

జో జో స్వతంత్రదేశం! జో జో స్వతంత్రభూమి!

---

# పతివ్రత అంటే యేమిటి

(విమర్శ)

శ్రీమతి చోప్పలపూడి అనసూయగారు

[ఆంధ్రమహిళ, డిసెంబరు '49 సంచికలో 'ఎవరు పతివ్రత' అను శీర్షికతో శ్రీమతి పేరాల విజయలక్ష్మిగారి పద్యము ప్రచురింపబడినది. దానికి జోశ్యుల సూర్యనారాయణమూర్తిగారు ఇందుకూరి రామకృష్ణ రాజుగారు వ్రాసిన జవాబులు, జనవరి, ఫిబ్రవరి సంచికలలో ప్రచురింపబడ్డాయి ఆ రచనల నాధారము జేసి కొని రచయిత తమ విమర్శను వ్రాశారు.] సం॥

ఆంధ్రమహిళ డిసెంబరు సంచికలో శ్రీమతి పేరాల విజయలక్ష్మిగారు వ్రాసిన "యెవరు పతివ్రత" అను శీర్షిక గల పద్యాలు హృదయాన్ని కదిలించినై. ఆమె వాక్చాతుర్యము ప్రశంశార్హము.

సౌందర్యవంతుడు, సద్గుణాన్వితుడు, సంపన్నుడు, ధీరుడు, వీరుడు, విద్వాంసుడు, రసికుడు అగు పతి తన్ను సత్కరించుచుండ అతనిని దైవంబుగా ప్రేమతో నెప్పుడు ఆరాధించటం అసాధ్యంకాదు. అట్టి పతిని యే సాధ్వియైనా త్రికరణశుద్ధిగా ఆరాధించగలుగును.

ఆదర్శ ప్రేమతో సంసారమును కడుకొద్ది కాలము మాత్రము సాగించి విధి వ్రాత తప్పక ప్రియుండస్తమింప, సర్వేశ్వరుడు తనకీ జన్మయందింతవరకే ప్రసాదించెనని నిశ్చయించి, హృత్పద్మమం దాతని నే నిల్పి స్మరించుచూ, యేరంకునూ తలపున జేరనీయక జీవిత శేషమును గడుప గలుగుటయే పతివ్రతా లక్షణము. సాధ్వికిదియు నసాధ్యముకాదు కాని—

—క్రూరుడు, నిరక్షరాస్యుడు, దరిద్రుడు, నిరుద్యోగి, జారుడు, చోరుడునగు పతి తన్ను తిరస్కరించు చుండ ఆ యింటివాకిలి దాటిపోక అతనినే దైవంబుగా ప్రేమతో సతం బారాధించుట అసాధ్యం, ఇది సాధ్వికే అసాధ్యం.

ఉన్నతగుణములుగల లలనయే సాధ్వియగును. "పతి" అనే వాక్యంలో యేదో ఆధిక్యతార్థం స్ఫురిస్తుంది—హీనుని హీనగుణుని ఉన్నతగుణములుగల సతి పతిగా దైవముగా ప్రేమతో ఆరాధించటం అసంభవం. విచక్షణా దృష్టిలేని సంఘముచే కట్టుబడినసతి, సంఘభీతివల్లనో, సంఘ మర్యాదకొరకో, అట్టిహీనుని గడపదాటకుండ కొంతకాలము గడుపగలుగునేమోగాని, ప్రేమించి దైవముగా ఆరాధించలేదు. ప్రేమపరస్పర భావైక్యత లేనిచో నిల్వదు. తనకంటె ఆధిక్యత గోచరించనిదే భక్తిజనించదు. ప్రేమతో దైవంగా ఆరాధించుటకు భక్తి ప్రేమలు రెండూ ఉండాలి. సాధ్వీ గుణములకు కేవలం విరుద్ధ గుణములుగల వానియందు ప్రేమ జనించటంవల్ల, తనకంటె హీనగుణునియందు భక్తికుదరటం అంతకంటె కల్ల. త్రికరణములయందు మనస్సే ప్రధానమైనదికాన అంతఃకరణ శుద్ధిలేని బాహ్యసేవలు గణింపదగవు.

విజయలక్ష్మిగారు వర్ణించిన దుష్టగుణములుగల పతిని ప్రేమించి దైవంగా ఆరాధించుటకు అంతకంటె హీన గుణములుగల స్త్రీ కావాలి. అట్టి జడమతి సాధ్వీపదవికి అర్హురాలుకాదు.

ఒకని చెల్లెలి భర్త కడు దుండగీడట. వివాహమునకు పూర్వము వారు గుర్తించలేదట. తన చెల్లెలిని హింసించుచుండెననియూ, ఆమె కేది కర్తవ్యమనియూ, అతను గాంధీజీకి లేఖ వ్రాసెను. బాపూజీ జవాబులో ముఖ్య విషయాలు—ఆమె అన్నయూ బంధువులునూ ఆమెతో గూడి విలాసములు చేయుటమాని ఆమెకు పోషణ యేర్పాటు చేయవలయును. పాపియగు పతి కనుకూలముగ వర్తించుటయూ, వాని సన్నిదినే పడియుండుటయూ తనకు

విద్యుక్తధర్మముకాదని తెలిసికోగల విద్యను ఆమెకు నేర్ప వలయును. ఆమె భర్త తనభార్యగతి సేమాత్రము లక్ష్యము చేయువాడు కాదనుట తెల్లమగుచున్నది. కాబట్టి ఆమె పెండ్లి బంధమును తెగత్రెంచుకొనకుండగనే భర్త యిల్లు విడిచివేసి పెండ్లియేకాని కన్యకవలె జీవించవచ్చును.

ఇంకొక ప్రశ్న : భర్త మాంసభక్షకుడు. భార్య మాంసమును దినుట దోషమనితలంచును. భర్తకోరిక ప్రకారము మాంసమును వండి పెట్ట వలసిందేనా? అతను బలవంతపెడితే తానును తినవలసిందేనా?

బాపూజీ జవాబు! భర్తయొక్క దోష కార్యములందు భార్య సహకారము సలుపవలసిన విధిలేదు. ఆమె దేనినేని దోషముగా నిర్ణయించుకొనిన యడల తాను ధర్మమునే అనుసరించుటకు సాహసించవలయును.

ఇంకొక సందర్భములో బాపూజీ తన దృష్టిలో ఆదర్శ పతి రాముడు. ఆదర్శపత్ని సీత అని చెప్పెను.

రాముడు ఏకపత్నీ వ్రతాన్ని యెంతదృఢముగ పరిపాలించెనో సీతయూ పాతివ్రత్యాన్ని అంత దృఢముగ పరిపాలించినది. అందొకరికొకరు బానిసలై పడియుండలేదు.

దేవుని సృష్టిలో స్త్రీ పురుషులిర్వురూ సమానము. కార్య నిర్వహణమునందు భేదమున్ననూ ధర్మ నిర్వహణము నందు భేదముండరాదు. ధర్మమార్గావలంబియైన పతి ననుసరించుట సతీ ధర్మమగును కాని, అధర్మ మార్గావలంబియైన పతి ననుసరించుట యేమి న్యాయము? అది తెలివి తక్కువను సూచిస్తుంది.

ఆంధ్రమహిళ జనవరిసంచికలో "ఆమెపతివ్రత" అనే పేరుతో శ్రీ జోస్యుల సూర్యనారాయణ శాస్త్రిగారు ప్రకటించిన భావము నాకు చాలా ఆవేదన పుట్టించింది. ఆ ఆవేదనయే ఈ విమర్శకు కారణమయింది.

"క్రూరాత్ముండు, నిరక్షరాస్యుడు,
దరిద్రుండున్, నిరుద్యోగియున్
జారుండున్ మరి చోరుడౌ పతి
తిరస్కారింప, తద్గేహమున్
ద్వాటించు స్వపతి సౌఖ్య యోజనా
దైవంబంచు ప్రేమ ప్రా
రాధించెన్, భార్యలే పంపగా
నా జన్మ పత్నిత్వసా
ఫల్యంబౌ యాయిందు
నీ యత్నంబు బహుర్యాంబు నా
చారంబైనా యన్నమాట నిజమే,
సాధ్వీ మణీత్వంబు ని
స్సారంబౌనటు లుండరాదు
గనుకన్ సద్బుద్ధులా భర్తకే
గారామార జనింపజేయగా,
సత్కారంబు గావించినన్
మారున్ క్రూరుడు జారుడౌ పతియు
సమ్మోహ్య కృతిన్; దానని
నారీ రత్నము కీర్తియు సుఖము
నందం గల్గు నాదర్శమై!!"

నాగమల్లె పొదయందు మల్లెపూవులు పూయించిన తత్ సౌరభాన్ని అనుభవించుట యెంతి సులభమో, పై పద్యము నందు వర్ణింపబడిన దుష్టునిమార్చి యాతని ద్వారా సుఖించుటయూ అంత సులభము. ఇది సాధ్యమో అసాధ్యమో నే నూహింపజాలను. సాధ్యమగునను సూచన సూర్యనారా నారాయణగారు తెలిపారు గాబట్టి వారిని ప్రశ్నిస్తున్నాను.

సామాన్యరూపసి, క్రూర స్వభావ, దరిద్ర గృహజాత, ఏపనియూ చేతగానిది, జారిణి, దొంగ పనులు చేయునది, అగు స్త్రీ మీ సతియైయుండి మిమ్ము తిరస్కారిస్తుంటే, మీరు ప్రేమతో లాలించి బోధించి మార్పుచేసి ఆమె ద్వారా సుఖపడగలరా? అంతటి సహన శక్తి మీయందుంటేనే "ఆమె పతివ్రత" అనుట కర్హులగుదురు — లేకున్నచో స్త్రీయందు మీకు సమత్వ దృష్టిలేదను కొనవలయును.

"సాధ్వీమణీత్వంబు నిస్సారంబౌనటు లుండరాదు గనుకన్"—అన్నారు— యెట్టి దుర్మార్గుడైననూ భర్తను దైవముగా భావించి ఆరాధించకపోతే ఆమె సాధ్వీమణి కాదనే మీతలంపా!

(తరువాయి 14-వ పేజీలో)

# సంవత్సరాది సందేశము

శ్రీమతి వి. సుశీలా దేవిగారు

సంవత్సరాది పండుగనాడు ప్రతి గృహము కల కల లాడుతూ ఉంటుంది. తెల్లవారక మునుపే తలంటి స్నానములు ముగిస్తారు. పిన్నలు పెద్దలుకూడ క్రొత్త వస్త్రములను ధరిస్తారు. సంవత్సరాదినాడు సంవత్సరాది పచ్చడని చేస్తారు. క్రొత్త వేపపువ్వు క్రొత్తమామిడి పిందెలు, క్రొత్త చింతపండు, క్రొత్త బెల్లంకలిపి ఈ పచ్చడి చేస్తారు. చేయవలసిన ముఖ్య కార్యములలో ఈ పచ్చడిని ఆరగించుట ఒకటి. భారపు భోజనము చేయుట, క్రొత్త పంచాంగము వినుట, ఒక బ్రాహ్మణోత్తముని తగిన విధముగా సత్కరించుట, ఆచార ప్రసిద్ధమైయున్నది. అయితే ఈ పండుగనాడే పంచభక్ష్య పరమాన్నములతో భుజించేవారు. ఏదో తృప్తికరమైన ఒకే పిండివంటతో భుజించేవారు. అర్థాకలిచే బాధపడే వారు, సంపూర్ణమైన కడుపుచిచ్చుతో గోడలు పట్టుకొని వ్రేలాడే వారున్నారు. భారతదేశములో ప్రతి మనిషి కూడు గుడ్డలకు లోటు లేకుండా సంతృప్తికరముగ సంచరించిన నాడే ప్రజా రాజ్యావతరణ ఫలితము కన్పట్టును. రెండున్నర సంవత్సరముల క్రితము భారత ప్రజలకు సంప్రదించిన స్వాతంత్ర్య ఫలితము అవసర వస్తువుల లేమివలన ప్రజల కానంద దాయకముగా లేదు.

ఈ నూతన వత్సరారంభములో జరుగబోయే గొప్పసంఘటనలలో ఆంధ్ర రాష్ట్రావతరణ ఒకటిగా తలచాము. సంక్రాంతి పండుగకే ఈ కానుకను గూడ ఆంధ్రప్రజలందు కుందా మనుకున్నారు. కాని తానొకటి తలచిన దైవమొకటి తలచెను. ఆంధ్రరాష్ట్ర అవతరణ వాయిదా పడ్డది. ఆంధ్రరాష్ట్రము గూర్చి అనేక తర్జన భర్జనలు జరిగేయి. ఆంధ్రరాష్ట్రావతరణతోపాటు రామపాద సాగర ప్రాజక్టు సిద్ధిస్తుందని, దాని ఫలితంగా 10 లక్షల టన్నుల బియ్యము అధికముగా పండించ వచ్చునని ఉత్సాహ పడుచున్నాము. ఆంధ్రదేశము పాడిపంటలతో మహాలక్ష్మివలె కలకల లాడుతూఉంటుందని, ఆంధ్రులు ఢిల్లీభోగాలకు మించిన బంగారు తీగాలను పండించి దేశదారిద్ర్యమును పోగొట్టగలరని, కేవ. నాఫీసులు, రేషనుకార్డులు, దొంగవ్యాపారము, లంచాలు, పోయి, మన పూర్వ కవులు వ్రాసిన పద్య రచనలోవలె "కన్నయ్య పండింప, కామమ్మ వండింప, వేసిన విస్తళ్ళు లెక్క" లేకుండా అన్నదానములు జరుగగలవని ఆశలు కలుగుచున్నాయి. క్రొత్త సంవత్సరములో ప్రజలం అటువంటి సుభిక్షమయిన దినములకు సుజలాం, సుఫలాం, సస్యశామలాం—అని ఆలాపింపదగిన దేశమునకు ఆశించుచున్నాము.

ఈ క్రొత్త సంవత్సరములో మనము సాధించవలసిన విషయమింకొకటి యున్నది. అది మాతృ భాష. ప్రజా రాజ్యములో ప్రతినిధుల ద్వారా ప్రభుత్వాన్ని నడపాలంటే మాతృభాషకి ప్రధానస్థానము కావాలి. ప్రజలకు సుబోధకం కావాలంటే మాతృభాషలో పరిపాలనా కార్యకలాపము జరపాలి. ఈ సౌకర్యములేనిచో ప్రజా స్వామ్య సిద్ధాంత ప్రకటలన్ని నిష్ప్రయోజనములు.

మన పూర్వులందరు స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము పవిత్రములయిన ఈ మూడు లక్షణాల సాధన నిమిత్తము విశేష త్యాగములు చేసిరి. ప్రాణదానము కూడ చేసిరి. ప్రజలకు స్వాతంత్ర్యము, సమత్వమును ఈయనిది, సౌభ్రాతృత్వ సాధనకుపకరించనిది అయిన రాజ్యము రాజ్యము కానేరదు. దీనికంతకు ఇక మీదట ప్రజలే కారకులు. ప్రస్తుతము గతసాధన ఫలితములను తిలకించి ఆనందించుటలో తృప్తిచెందు సమయము కాదు. వర్తమాన కర్తవ్యమును, భవిష్యద్బాధ్యతను గ్రహించి వాటి నిర్వహణకు ఐక్యకృషి సలుపుటకు ప్రతివారు కంకణబద్ధులు కావలసి వున్నది. ఆ నాడే స్వాతంత్ర్య సమరమున ప్రాణములనర్పించిన వీరయోధులకు, ఆత్మశాంతిని చేకూర్చగలుగుదుము.

ఆర్థిక, రాజకీయరంగాలలోను, తదితర రంగాలలోను అందరికి సమమైన న్యాయము చేకూర్చగలరనీ, మతములోను, విశ్వాసములోను, ఆరాధనలోను, అందరికి స్వేచ్ఛనీయ గల

రన్నీ, అందరికి సమానహక్కు లివ్వగలరని, వ్యక్తివికాసానిక్నీ, జాతీయైక్యతకీ, సమాన అవకాశాలివ్వగలరని నూతన రాజ్యాంగము ప్రమాణము చేసింది. కాని ప్రమాణమును ప్రజాప్రతినిధులు నోటిమాటగ వదలివేయక, తాము ఎల్లప్పుడు తత్కృషిచేస్తూ, ప్రజానీకమంతయు తమకు సహకరించేలాగున వారి హృదయములను దొంగలించిననాడే భారతదేశమునకు పర్వదినము.

ఈ క్రొత్త సంవత్సరములో ప్రజలు అనేక క్రొత్త విషయములను గ్రహిస్తారు. తిలకిస్తారు కాని తమ కర్తవ్యమును ప్రతివారును స్మరించక, బాధ్యత అంతా ప్రతినిధులపై వదలరాదను విషయమును స్మరించుట యత్యావశ్యము. దేశమును సస్యశ్యామల మొనరించుటకు తమ కర్తవ్యమును స్మరించి సంచరించవలెనను విషయే క్రొత్త సంవత్సర సందేశముగా ప్రతివ్యక్తియు భావింతురు గాక.



(12-వ పేజి తరువాయి)

పురుష వ్యామోహమున కాసించనిదైన అవివాహిత, ధర్మమార్గావలంబనంతో జీవితమంతా గడపనిచ్చగించిన యామె సాధ్వీమణి కాదా? అట్లై పెండ్లాడిన భర్త దుర్మార్గుడై తన్ను తిరస్కరించుచుండ అచటేబడి క్రుమ్గుటకంటే బాలికవలె జీవితమును గడుపగోరుట శ్రేష్టమగును.

దుర్మార్గుడైన భర్తననుసరింపక అన్య పురుష వ్యామోహమునకు వశముకాక దైవము నారాధించు స్త్రీ హిందూ వివాహ ధర్మమునకు మచ్చకలుగ జేయదు.

దుర్మార్గురాలైన భార్యను వదలివేసి (స్త్రీ వ్యామోహమును త్యజించి) బ్రహ్మచర్యంతో గడపు పురుషుడెంత యుత్తముడో, అట్టి స్త్రీయూ నంత యుత్తమురాలే. యిరువురూ వివాహ ధర్మమును కాపాడిన వారే.

పురుషులు పెక్కు వివాహములాడ దగునను ధర్మము వంటి ధర్మములు కొన్ని పురుషజాతి స్వలాభము కొరకు పురుషులచేత సృష్టింపబడియున్నవి. అట్టివానిలో భర్తయెట్టివాడయిననూ అతనినే దైవంగా ఆరాధించవలెనను సూక్తియొకటి.

పతివ్రత అంటె సకల సద్గుణ సమన్విత లేక ధర్మమార్గావలంబిని అని భావించండి. భర్త దుర్మార్గుడై తన్ను తిరస్కరించుచుండ అతనినే దైవముగా ఆరాధించకపోతే సాధ్వీమణి కాదనే తలంపు సరియైనది కాదు. స్వార్థపరత పాదుకుబోయిన పురుష పక్షపాత దృష్టికి మాత్రమట్లు గోచరించునేమో.

## హెచ్చరిక

వికృతి, వికృతాకారంగా ప్రవేశించిందని విమర్శకులందరూ వేనోళ్ళ చెప్పుతున్నారు. కనుక వేరుగా చెప్ప నక్కర లేదు. విదేశ స్వదేశాలలో విప్లవాలు వెదజల్లిన రేచుక్కలలాగ రేగుతాయి అన్నారు. వివిధ మతాలలో వేరువేరు భావా లుత్పత్తి ఔతా యన్నారు. ఆర్థిక ఆహార సమస్యల పరిష్కారములను ఆశించనక్కరలేదన్నారు. అన్ని దేశాలకు అఖండ క్షామం వాటిల్లుతుందన్నారు. వికృతిగడపి ఖరను కళ్ళ చూస్తే కడుపు నిండిన అన్నమన్నారు. ఖర వరకూ కాయం నిలబెట్టుకోవాలంటే ఆబాలగోపాలం కష్టపడాలి. ఉచ్ఛ శ్రేణివారి స్వేచ్ఛానందాలకు లోటులేదు. నిమ్నతరగతులవారి నిర్ణీత వృత్తులకు లోటులేదు. యిక మాధ్యమిక జీవితాలు మడిసిబోతున్నాయి. వృత్తి విద్యలను ఉన్నతిలోనికి తీసుకురండి. కుటుంబభారం ఒక గృహయజమానికే వుండకూడదు. బాలబాలికలచే రాట్నాలను వడికించండి. పిడికి పది కానులు వస్తాయి. స్త్రీలు యిండ్లలో చేతి మిషనులు కుట్టుకోండి. చేతి ఖర్చుకు డబ్బువస్తుంది. చేతి అల్లికలచే చిన్న చిన్న ఖర్చులు కూడబడతాయి. పాతివ్రత్యానికి భంగం లేకుండా పొట్ట కూటికిలోటు లేకుండా ప్రొద్దు పుచ్చవచ్చు. చిలిపి పనులయందు చిత్తవృత్తులను పోనీయక, చంచల దృష్టులను చిన్ననాడు గురువు అభ్యసింప జేసిన విద్యయందు నిల్పుకొని విద్యను చిరస్థాయిగా చేసుకొండి. జీవితానికి కరువుండదు. దేవునికి దయకలుగుతుంది.

—దీ బదరీనారాయణమ్మ.



# గృహలక్ష్మి జయంత్యుత్సవము

5-3-1950 న, కేసరికుటీరంలో, గృహలక్ష్మి జయంత్యుత్సవము, స్వర్ణకంకణ ప్రదానోత్సవము, సలక్షణముగా, జరిగినవి. ఇటీవల అస్వస్థులుగానున్న శ్రీ కేసరిగారు భగవత్కృపవల్ల కొంచము స్వస్థులై, స్వయముగా కంకణ ప్రదానము చేసి ఉత్సవములో పాల్గొనగలిగినారు. పెక్కుమంది విదుషీమణులు యీ ఉత్సవమునకు విచ్చేసి, ప్రసంగించిరి. శ్రీమతి లక్ష్మి రఘురామ్, బి. ఏ., గారు. సభాధ్యక్షత వహించిరి. ఆశీస్సులతో, అభినందనాలతో, ఉపన్యాసాలతో సభ చక్కగా జరిగింది.



శ్రీమతి గంటి. కృష్ణవేణమ్మగారు.

## గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత

## శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

ఈమె శ్రీరామశర్మ సుబ్బలక్ష్మమ్మగార్ల పుత్రిక. అనంతపురంజిల్లా తాడిపత్రిలో 20-12-1910 న, జన్మించినది. 1921 మే 19 తే. శ్రోత్రియందారు గంటి సుబ్రమణ్యం గారి జ్యేష్ఠ కుమారుడు గంటి వెంకట సుబ్బయ్య బి. ఏ. గారితో వివాహమైనది. ఈమె తాతలు గవాన్ పేష్కార్లుగను, ప్లీడర్లుగను, ఆస్థాన పండితులుగను వుండిరి. తండ్రిగారికి పోలీసుశాఖలో వున్నతోద్యోగము.

చిన్నప్పటినుండి ఈమెకు తనమాతృ భాషయైన తెలుగునందు ఒక విధమైన చిన్నచూపుండేది. ఆంగ్ల భాష అంటే ఎక్కువ అభిరుచి ఉండేది. ఒకసారి ఆమె భర్తకు ఆంగ్లమున, తెలుగున కలిపి లేఖవ్రాసినారట. ఆమె భర్తగారు భాగవతము, భారతము, నైషధము, అప్పకవీయము, మనుచరిత్ర మొదలైనవి తెచ్చి వానినిచదవలేరని హేళనచేయగా, అప్పటినుండి ఈమె ఒక విధమైన అభిమానముకలదై తండ్రిని అడిగి ప్రత్యేకముగా ఉపాధ్యాయుని సహాయముచేత వసుచరిత్ర, మనుచరిత్ర, నైషధం, రాఘవ పాండవీయం మొదలైనవి నేర్చుకొనిరట. తాతగారి సహాయంచేత ఛందశ్శాస్త్రం నేర్చుకొనిరి. భర్త సహాయంతో నరస భూపాలీయము, అమరుక కావ్యము, పుష్పబాణవిలాసము చదివిరి. ఆమె ప్రథమమున 'తెనుగు లేఖిని' అను వ్యాసమును గృహలక్ష్మికి పంపినారట. అది ప్రచురింపబడినది. పిదప గిరిజా కల్యాణము, శ్రీజ్ఞానప్రసూనాంబిక, సైరంధ్రి మొదలయినవి రచించిరి. విద్యావతియగు నీమెను స్త్రీజనోద్ధరణ కాములగు శ్రీ కేసరిగారు యీ సంవత్సరము కంకణ ప్రదానముతో గౌరవించిరి.

గృహలక్ష్మి జయంత్యుత్సవము వర్షావర్షము నిరాఘాటంగా జరుగుచు, ఆ సందర్భములో విదుషీమణులకు స్వర్ణ కంకణ ప్రదానము అవిచ్ఛిన్నంగా జరుగునిమిత్తము శ్రీ కేసరిగారు రూ. 5000/- విలువగల జీవితభీమాను, ఈ ఉత్సవ శాశ్వతనిధిగా నేర్పరచెడి నిర్ణయమును ఈ ఉత్సవ సందర్భములో వెల్లడించిరి. ఇందులకు వారెంతయు అభినందనీయులు.

[బ్లాకులు గృహలక్ష్మి పత్రికకు కృతజ్ఞతతో.]



# సర్ థామస్ మోర్ చిత్రించిన రామరాజ్యం

※ శ్రీమతి అ. గిరిజగారు ※

మానవాభ్యుదయానికి తగిన జీవిత విధానాన్ని సూచించిన ప్రతిభాశాలురలో థామస్ మోర్ ఒకడు. మోర్ 1478 వ సంవత్సరమున ఇంగ్లండులో జన్మించినాడు. విద్య పూర్తి చేసి న్యాయవాది వృత్తి నవలంబించినాడు. 1510 లో లండన్ నగరానికి అండర్ షరీఫ్‌గా నియమించబడినాడు. 1529 లో వింత ప్రకృతికి పేరు మోగిన 8 వ హెన్రీ రాజుకు ప్రధాన మంత్రి అయినాడు. హెన్రీరాజుకు అవసరమయిన విడాకుల విషయమై చర్చికీ రాజుకు జరిగిన ఘర్షణల్లో మోర్ రాజు కోపానికి ఆహుతి అయినాడు. అయిదేళ్ల అమాత్యత్వము శిరచ్ఛేదనముతో అంతమయింది.

మోర్ గొప్ప విద్వాంసుడు, రచయిత. పికోచరిత్ర, 3వ రిచర్డు చరిత్ర, యుటోపియా ఆయన రచనలలో చెప్పుకోనవలసిన వాటిలో కొన్ని. 1516లో ఇంగ్లండుతో విదేశాల వర్తక విషయమై రాయబారము వెళ్లిన సమయములో లాటిన్ భాషలో మోర్ యుటోపియా వ్రాశాడు. యుటోపియా అంటే ఆదర్శప్రాయమైన శాంత జీవితమును గడపగల ప్రదేశము.

మోర్ కాలములో భూస్వాములు రైతాంగమును పొలాలనుంచి తొలగించి, వాటిని గొర్రెల మేతకు పచ్చిక బయళ్లుగా చేసే వాళ్లు. పొలాలలో పండే పంటల కన్న, పెంచిన గొర్రెల ఉన్నివల్ల ఎక్కువలాభం రావటమే దీనికి కారణము. సేద్యమునుంచి తొలగించబడిన పేదరైతులు జీవనాధారములేక బిచ్చగాళ్లుగాను, దొంగలుగాను, పొట్ట పోసుకోవలసి వచ్చింది. ఆ కాలాన నేటి యంత్ర సాధనాలు లేక పోవటాన వాళ్లకు వేరే తగిన జీవనోపాధి కలిగించేది కాదు. పోషించలేని ప్రభుత్వము యీ దౌర్భాగ్యులను అణగ దొక్కటానికి మాత్రం అనేక క్రూరశాసనాలు చేసింది. మోర్ హృదయము యీ దురాగతమును సహించలేక శాంతిమయ జీవన మార్గాన్ని అన్వేషించ మొదలు పెట్టింది. ఆ ఆలోచనల ఫలితముగా కొత్తరాజ్యాంగ విధానము, సమాజ పరిస్థితులు తగిన ఉపాయమని గ్రహించాడు. ఈ కొత్త పంథాను యుటోపియా అనే గ్రంథములో వివరించాడు.

యుటోపియా ప్రజాస్వామిక రాజ్యం. నాయకుడు ఒకడు ప్రతి సంస్థకు అవసరము కాబట్టి ప్రజలు మూడేళ్ల కొకసారి తమలో ఒకరిని నాయకుడుగా ఎన్నుకుంటారు. ఈ నాయకుని పేరేరాజు. తగిన అర్హత లేకపోతే రాజును తీసివేసి తిరిగి యింకొకరిని ఎన్నుకునే అధికారం ప్రజలకు వున్నది. ప్రజలందరు తినే భోజనము, కట్టేబట్టలే రాజుకు యిస్తారు. సర్వసమత లేక వర్గ బేధాలు వుండటమే అనర్థ హేతువని యుటోపియా ప్రజల సిద్ధాంతము. అందువల్ల వ్యక్తిగతమైన ఆస్తిపాస్తులువుండవు. అంతా వుమ్మడిగా వుంటుంది. రాజ్యములోని ప్రజలందరు సరి సమానముగ కష్టించి పని చేయక పోవటాన తగినంత ఉత్పత్తి లేక పోవటము, చివరకు తిండి సరిపోక కరువు రావటము జరుగుతుంది. అందువల్ల యుటోపియాలో స్త్రీ పురుషులందరు సేద్యము నేర్చుకుని, చేసి తీరాలి. ఇదికాక అందరు తమ తమ ఇష్టమయిన మరొక వృత్తిని నేర్చుకోవాలి. సంఘం తన అవసరాన్ని బట్టి ఎవరు యేవృత్తి అవలంబించ వలసి వున్నది నిర్ణయించుతుంది. తతిమా సమయాలలో యేవృత్తిలో వున్నా పంట కోత కాలానికి రాజు మొదలు తలారివరకు స్వయముగా కోతల్లో పాల్గొనాలి. తమ దేశములో పండినధాన్యాన్ని రెండు సంవత్సరాలవరకు తమకు సరిపడే అట్టి పెట్టుకుని మిగత ధాన్యముతో యితర దేశాలతో వర్తకముచేస్తారు. కావలసిన ఇతర పదార్థాలు వాటికి బదులుగా తెప్పించుకుంటారు. అరుదుగావుండే వస్తువులు పసిపిల్లలకు, రోగులకు వృద్ధులకు కావలసినన్ని యిచ్చి మిగతా వాటిని అందరు సమానముగ పంచుకుంటారు.

యుటోపియాలో వునికి సంగతి చూతాము. రాజ్యమంతట వీలయినంతవరకు ఒకే కొలత, ప్లానులతో వూళ్లు నిర్మిం

చుతారు. ప్రతివూరిలోను ఒకే విధమైన సరిసమానపు ఇండ్లు ఆరువేలు కట్టి ఆ యిళ్లకు కావలసిన సామానులు వృత్తి పని ముట్లు ప్రభుత్వమే అమర్చుతారు. ఇంత నిర్మాణము చేసి నప్పటికి కూలియిచ్చి పెట్టుకున్న కూలివాడు లేక పోవటాన ప్రభుత్వానికి ఖర్చే లేదు. ఆయా వృత్తులలో వుండే వాళ్లు ఆయా పనులకు పూనుకుంటారు. అధికారులు ప్రజలుఅంతా కలిసి యిళ్ళు కట్టుకున్నందుకు ఫలితముగా ప్రతి వ్యక్తి సుఖ ముగా యింట్లో నివసించ గలుగుతాడు. ఇప్పటి మోస్తరు చెట్లక్రింద బతకవలసిన అగత్యము వారికి వుండదు. ప్రతి వూరికి వెలుపల నాలుగు వైపులా విశాల ప్రదేశాలలో నాలుగు ధర్మ వైద్యశాలలు వుంటయ్. బట్ట, తిండి, యిల్లు, సమకూర్చితే దొంగతనానిక్కి, బిచ్చానికి ఎవరు వెళ్తారు? ఏకేశ్వరోపాసన జనసామాన్య మతము. కాని ఎవరికి నచ్చిన మతము వారు స్వీకరించ వచ్చును. భగవత్సేవ విషయము లలోకూడ అందరు సమానులే. జూదము, మద్యము పనికి రావు. యుటోపియా ప్రజల మానసిక వికాసానికి కూడ మోర్ అవకాశాలు కల్పించాడు. ప్రతి రోజు విషయజ్ఞుల చేత వుపన్యాసాలు యిప్పించుతారు. ఇది అందరు వినాలి. అంతగా యిష్టము లేక పోతే దేహ పరిశ్రమతో కూడిన ఆటలు ఆడుకోవచ్చు, సోమరితనము మటుకు పనికిరాదు. యథేచ్ఛగా యిష్టమున్నవారు గణితము, ఖగోళము, భూగో ళము మొదలయినవి అభ్యసించవచ్చును. ప్రతి ఒక్కరు పనిచేస్తూ వుంటాన ఎక్కువ కాలము వినియోగించ నవస రములేదు. అందరు రోజుకు అయిదుగంటలు మాత్రమే పని చేస్తారు. మిగతా కాలములో విజ్ఞానము పెంపొందించు కోవచ్చును.

యుటోపియాలో అహింసకు చాల ప్రాధాన్యతవున్నది. ఊరి వెలుపల కసాయివాళ్లు తప్ప వూరిలో కోడిని కూడ చంపకూడదు. ప్రజలలో కొంతమంది శాకాహారులు కూడ వుంటారు. పది వేటకుక్కలను ఒక కుందేలుపైకో, లేడి పైకో వుసికొల్పి చెండాడించటము యుటోపియా వాసులకు అమానుష కృత్యము. అందువల్ల వేట సరదా కాలక్షేపము కాక పోగా త్యాజ్యము. నిండు జీవిని వృధాగా చంపేకన్న బ్రతికించివుంచి సంఘానికి అవసరమైన పనిచేయించు కోవ టము మంచిదనే తలంపుతో యెంతటి నేరాని కయినా సాధారణముగా మరణదండన విధించరు. బానిసగా చేసు కుంటారు. అందరు తప్పనిసరిగా సైనిక శిక్షణ పొందినా చాల శాంతి ప్రియులుగా వుంటారు. ఆత్మరక్షణకు, మిత్ర రాజ్య రక్షణకు కేవలం తప్పనిసరి అయితేనే, సంఘము అనుమతి యిస్తేనే యుద్ధము ప్రకటించుతారు. రక్త పాతక మునకు యిష్టపడక శత్రుపక్షపు నాయకులు నలుగురైదుగు రుని బంధించి యుద్ధం ఆపు చేస్తారు. తమ రాజ్యములో కొంతకాలము వర్తకము చేయకుండ ఆపు చేయుటయే యుటోపియనులు శత్రురాజ్యాలకు వేసే పెద్దశిక్ష!

థామస్ మోర్ తన భావనా రాజ్యములో స్త్రీలకు ఉత్కృష్ట స్థానమునే కల్పించాడు. యుటోపియా స్త్రీ పురుషునితోపాటు సేద్యము, మరొకవృత్తి నేర్చుకుంటుంది. కాని శరీరబలము తక్కువకావటాన సంఘము ఆ మెకు వడక టము, నేయటమువంటి తేలిక పనులే నిర్ణయించుతుంది. తేరతిండి తింటు ఆత్మ గౌరవము గోల్పోవలసిన అవసరము యుటోపియా స్త్రీకిలేదు. వివాహామయేంతవరకు తలిదండ్రుల దగ్గర పెరుగుతుంది. తర్వాత భర్తయింటికి వెళ్తుంది. చదువు సంధ్యలలో ప్రత్యేకముగా యేమిలేదు. ఇష్టము వచ్చిన చదువు నేర్చుకోవచ్చును. ప్రతిరోజు వుదయాన యివ్వబడే వుపన్యాసాలకు హాజరుకావాలి. దీనితో విషయ జ్ఞానము, మాటపొందిక అలవడుతయ్. సమిష్టి భోజనశాలలు ప్రతి వూరిలోను వుండటాన ప్రత్యేకించి వంట కలాపమంటు వుండదు. ఆ సమయములో మరియే యితర పనులయిన చూసుకోవచ్చును. ప్రతి స్త్రీ యుద్ధ శిక్షణ పొందుతుంది. యుద్ధ సమయాన తన తండ్రి భర్త మొదలయిన ఆత్మీయు లకు అండగా నిలబడుతుంది. తగిన అర్హతవుంటే యుటో పియాలో వృద్ధవనితలను, వితంతువులను మతబోధకులుగా, గురువులుగాకూడ నియోగించుతారు. లలిత కళలలో, ముఖ్య ముగా సంగీతములో స్త్రీ ప్రావీణ్యత సంపాదించుకుంటుంది. సమిష్టి భోజనశాలలో భోజనవేళల చల్లని సంగీత కాలక్షే పము వారికి అలవాటు. పిల్లలు పెద్దలను అనుసరించుకు నే వుంటారు. స్త్రీలు పిల్లలతోపాటు పురుషులపంక్తినే భోజ నము చేస్తారు. పిల్లలకు చిన్నప్పటినుంచి చక్కని నడవడి

ఆదర్శాలు నేర్పుతారు. పచ్చనిచేలు, కమ్మనిగాలి పిల్లలకు సమృద్ధిగా వుంటయ్.

యుటోపియా స్త్రీ సహజ సౌందర్యానికే ప్రాముఖ్యత ఇస్తుంది. భగవంతుడు ఇచ్చిన రూపును ఆరోగ్యము, జవకళలతో ఇనుమడింప చేసుకుంటుంది. ఆరోగ్యము, తృప్తి, ఉత్సాహాలతో కళకళలాడే ముఖానికి పైపూతల అవసరము యేమి వుంటుంది? రంగులు, క్రీములు పూసుకుంటే లేని సౌందర్యాన్ని భ్రమింపచేసి సంఘాన్ని మోసము చేయుట యని వారి విశ్వాసము. ఇనుమైతే పనిముట్లు చేయటానికైనా వుపయోగించుతుంది. బంగారము అందుకు కూడ పనికిరాదని నిరసించుతారు. బానిసలకు బానిస చిహ్నముగా తొడిగే కడియాలవంటివి మాత్రమే బంగారముతో చేస్తారు. అందువల్ల యుటోపియా స్త్రీలు బంగారు సొమ్ములు ధరించరు. చివరకు ముత్యాలు వజ్రాలయినా ధరించరు. ఆకర్షణీయముగా వుండటానికి పసిపిల్లలకుమాత్రం ముత్యాలు వజ్రములు కూర్చిన ఆభరణాలు పెడతారు, కాని పిల్లలు వూహ తెలియగానే ఆ అపౌరుష చిహ్నాలను తీసిపారవేస్తారు.

థామస్‌మోర్ స్త్రీల వివాహాలు, విడాకులను గురించి విపులముగా చర్చించాడు. యువతీ యువకులు తమకునచ్చిన వారిని వివాహ మాడవచ్చును. బహు భార్యాత్వము, బహు భర్తృత్వము శాసన విరుద్ధం. వ్యభిచారము చాలా ఘోరమైన తప్పు. ఆ తప్పుకు వివాహయోగ్యత లేకుండ జేయటం, బానిసత్వము శిక్ష. అందువల్ల దేశములో వ్యభిచారము ప్రచారములో వుండదనే చెప్పాలి. వివాహితులైన వారు వ్యభిచరించితే వారి దాంపత్యము న్యాయరీత్యా విచ్ఛిన్నము చేసుకోవచ్చును. నేరము చేసిన స్త్రీ, పురుషుడు శిక్షితు లవుతారు. ఆ స్త్రీ భర్త, యీ పురుషుని భార్య యిష్టము వుంటే ఒకరినొకరు పెండ్లాడ వచ్చును. లేకపోయిన యిష్టమువచ్చిన మరెవరినైనా చేసుకొన వచ్చును. కాని నేరము చేసిన స్త్రీ భర్తగాని, నేరముచేసిన పురుషుని భార్యగాని పూర్వప్రేమ విడువలేక క్షమాపణవేడితే నేరస్థులతోపాటు బానిసత్వం స్వీకరించి దాంపత్య జీవితము గడప వచ్చును. అట్లాంటి దంపతులపై సంఘము దయదలచి ఒక్కొక్కసారి స్వాతంత్ర్యము కూడ ఇస్తుంది. పెండ్లినాటికి యే వ్యాధులు వైకల్యాలు లేకట్లయితే తర్వాత సంభవించే వ్యాధులు, వైకల్యాలే కారణముగా విడాకులు అసంభవము. పైగా దంపతులలో ఒకరు వ్యాధిగ్రస్థులయితే వారిసేవ చేయుటము రెండవవారి కర్తవ్యము. దంపతులలో అన్యోన్యానురాగము లేక కలతలు యేర్పడితే సంఘము ఒప్పందల మీద విడాకులు పుచ్చుకోవచ్చును. కాని వివాహ పవిత్రతే పరమ ఆశయం కావటాన వీలయినంత వరకు దాంపత్య విచ్ఛిన్నమునకు సంఘము ఒప్పుకోదు.

యుటోపియా స్త్రీ పురుషునితో బాటు తనకు సంభవించిన ఆపదను స్వయముగా సంఘము యెదుట వున్నదున్నట్లు వివరించి న్యాయమును పొందగలదు. యుటోపియా సంఘ వాతావరణము స్త్రీకి అన్ని విషయాలలోను పురుషునితో సరిసమానమైన ప్రతిపత్తిని, స్థానమును కలిగించింది.

థామస్‌మోర్ హిందూ సాంప్రదాయాను సారం శవాలకు అగ్ని సంస్కారము సూచించాడు. మద్యము జీవితావసరమని యెంచే పాశ్చాత్యదేశాన పుట్టి మద్యపాన నిషేధం మెచ్చాడు. కృత్రిమ సౌందర్యపోషణ, అంతులేని విడాకులను అసహించుకున్నాడు. ప్రధానామాత్య పదవి అలంకరించి ప్రజా రాజ్యాన్ని చిత్రించాడు. కుతంత్రులయిన న్యాయవాదులను, అధికార దుర్వినియోగ పరులయిన పోలీసులను మాత్రం థామస్‌మోర్ పొరపాటున కూడ పేర్కొనలేదు.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో]

---

## కృతజ్ఞత.

ఆంధ్రమహిళా సభకు ఈ దిగువ పేర్కొన్న విరాళములను కృతజ్ఞతతో స్వీకరిస్తున్నాము.

| | | |
|---|---|---|
| మదరాసు కార్పొరేషన్ | ... | 250—0—0 |
| శ్రీమతి చిం. పాపాయమ్మగారు | ... | 100—0—0 |
| శ్రీ రఘునాదయ్యర్ గారు | ... | 50—0—0 |

అ. చన్నఘంటమ్మ, జ. జమునాబాయి.

---

# మళయాళదేశము

శ్రీ వారణాశి వెంకటాచలంగారు

హిందూదేశంలో పశ్చిమ కనుమలకు అరేబియా సముద్రమునకు, ఉత్తరమున గోకర్ణమునకు దక్షిణమున కన్యాకుమారికి మధ్యనున్నటువంటి ప్రదేశము, బ్రిటిషువారు మన దేశమునకు రాక పూర్వము మళయాళ దేశమని పిలువబడుచుండెను. ప్రస్తుతము తిరువాన్కూరు కొచ్చిను సంస్థానములు ఒకేరాజ్యముగ మారినవి. ఇక ఐక్యకేరళరాష్ట్రమును మద్రాసు రాష్ట్రములోగల మలబారు జిల్లాను కూడ కలిపి భారత వర్షములో ప్రత్యేక రాష్ట్రముగ నిర్ణయించవలసినదిగ మళయాళదేశస్థులు ఆందోళన చేయుచున్నారు.

ఐక్య కేరళము ప్రత్యేక రాష్ట్రముగ నేడు కాకున్నను ముందునాటికైన వచ్చి తీర వలసినదే. ఏలయన తమిళులకు కేరళీయులకు ఏ విధముననను కలయిక కుదురదు. వీరిరువురు పరస్పర విరుద్ధమైన సాంప్రదాయములను గలిగి యున్నారు. తమిళభాషయందు సంస్కృతము శూన్యము, మళయాళమునందు సంస్కృతము మిక్కుటము. ఇక ఆచారముల బట్టి చూచిన మళయాళ దేశపు యాచారములు తదితర ప్రాంతముల వారి కర్థమగుట కష్టసాధ్యము.

ఆ దేశములో స్త్రీకి ప్రాముఖ్యత నిచ్చి యున్నారు. ఆస్తులయందు ముఖ్యముగ స్థిరాస్తులందు ప్రథమ హక్కు వారిదే. ఈ ప్రత్యేక హక్కు వారికెటుల సంక్రమించెనో చర్చనీయము. ఆ దేశంలోపల మరుమక్కతాయము గలదు. దాని కాధారము మనుశాస్త్రములో గూడగలదు.

కేరళదేశం పరశురాముని సృష్టియనియు, పరశురాముడు భారతవర్షంలో యితర క్షత్రియుల నందర నోడించి దక్షిణాపథముననున్న నీలగిరికివచ్చి, పశ్చిమ కనుమల కావలనున్న దేశమునందు తన పరశువును విసరి పాతాళంలోనున్న ప్రస్తుత కేరళభూమిని పైకి తెచ్చెనని పురాణ గాథ గలదు. ఈ గాథను నమ్మినను లేకున్నను, పరశురాముని కాలమునకు పూర్వము ఈ పశ్చిమ కనుమల కావలనున్న దేశము భారతావనిలో లేనట్లుగాని, తెలియక యున్నట్లుగాని యూహించ వలయును.

కేరళదేశమందు ఆదినుండి బ్రాహ్మణులదే అగ్రస్థానము. భూమియంతయు బ్రాహ్మణ జమీందారులకు సంక్రమించి యుండెను. ఈ జమీలన్నియు అవిభక్తములుగ నుండి, ఆస్తుల పంపకములు లేక, ప్రత్యేకమైన ఏకైక కుటుంబములు తరతరములుగ వృద్ధిచెంది యీనాటివరకు క్షీణింపని గొప్ప ఎస్టేటులుగ నున్నవి. వీనిని వేయిల్లము లందురు.

మళయాళ బ్రాహ్మణులు నంబూద్రులు. వీరిని లక్ష్మి సరస్వతులు సమానముగా అనుగ్రహించిరి. వీరు సంస్కృత పండితులు. ముఖ్యముగ జోతిషము, ఆయుర్వేదము, యిత్యాది శాస్త్రములందు ప్రవీణులు. దేవపూజలుచేసి మంత్రోపాసకులైరి. దేవాలయముల సృష్టించి, తద్దేవతారాధన వల్ల బ్రహ్మతేజస్సు గలవారైరి. ఇక దినచర్యయందు వారివైదిక కర్మనిష్టలు మానక, వేదములందుచెప్పిన విధముగ, ధనవంతులయ్యు బీద బ్రాహ్మణులవలె జీవితములు గడపుచుండిరి.

నంబూదిరి బ్రాహ్మణులు అనాదినుండి మళయాళ దేశమందుండిరి. వారిలో కుటుంబమునం దగ్రజుడు మాత్రమే వివాహము చేసికొనును. అతడు సమిష్టి కుటుంబమునందు యజమానియై వ్యవహారములన్నియు చక్కబెట్టు చుండును. అతని తమ్ములు వివాహము చేసికొనరు. ఈ ఆచారము సంబూదురి కుటుంబములు వృద్ధిచెందకుండుటకై యున్నట్లు తోచుచున్నది. మిగత సోదరులు క్షత్రియ కన్యలనుగాని, నాయరు స్త్రీలను సంబంధములను చేసికొందురు. ఈ సంబంధములుకూడ, ఆస్తులయందు హక్కు భుక్తములుతప్ప, అన్ని విధముల, యితర ప్రాంతములందుగల వైవాహికముగనే యుండును. కాని కర్మకాండ లేమియు లేవు. ఈ సంబంధములుగల భార్యాభర్తలు సకుటుంబీకులై సామాన్య భార్యాభర్తల వలెనే జీవనము గడుపుచుందురు.

మళయాళదేశంలో సంబూదిరు బ్రాహ్మణులకు తదితర క్షత్రియ నాయరు కుటుంబములకుగల సంబంధ బాంధవ్యములు ఇతర ప్రాంతీయుల కర్థమగుట కష్టము. అచ్చట శాస్త్రము ఆచారము నెక్కువగ అనుసరించి యుండును. కాని, యీ దేశాచారములు తెలియక వారికి వివాహాది కార్యములు లేవని గ్రహించుట సత్యదూరము. వారి సంబంధములలో మంగళ సూత్రధారణము లేనందునను, మంత్రయుక్తముగ వివాహ విధానము లేనందునను, వారియందు సకుటుంబీక వైవాహిక ధర్మములు నియమములు లేవని తలంపరాదు.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మగారు

[ఈ శీర్షిక క్రింద గత మే నెలనుండి, 11 వ్యాసములను. శ్రీమతి సుభద్రమ్మ గారు ఆంధ్రమహిళలో ప్రచురించినారు మనస్తత్వ శాస్త్ర ప్రాధాన్యము, గర్భిణీ స్త్రీలు వడవలసిన జాగ్రత్త, శిశువుయొక్క మానసిక, శారీరక పరిణామములు, అందు తల్లి చేయవలసిన సహకారము, కర్మేంద్రియ వికాసము, అలవాట్లు, ఆహారాది నియమములు, మాతాశిశువుల సంబంధం, యిత్యాది విషయములను గూర్చి వ్రాసిరి.

ఈ దిగువ వ్యాసము శిశు మనోవిజ్ఞానమును గూర్చిన ఉపోద్ఘాతము. దీనితో రెండవభాగ మారంభము. సం.]

## శిశు మనోవిజ్ఞానము

శిశువు జనించిన ఒక సంవత్సరం లోపల ఏ విధంగా క్రమాభి వృద్ధిచెందుతూ వచ్చిందనే విషయాన్ని కొంతవరకు తెలుసు కొన్నాము. అభివృద్ధి, పెరగటం అనేవి కేవలం శారీరకంగా ఒడ్డు, పొడుగు ఎదుగుట, బలం పెరుగుట అని కాదు! శారీరకంగానేగాక మానసికంగా కూడ సర్వతో ముఖాభివృద్ధి చెందినపుడే బిడ్డ వయస్సుకు తగిన అభివృద్ధి చెందినదన్నమాట. బిడ్డయొక్క ప్రతి ప్రవర్తనలో ఈ అభివృద్ధి పరిమాణం ప్రకటితమవుతుంది. శిశువు జ్ఞానేంద్రియముల ద్వారా, కాళ్లు చేతులు మున్నగు అవయవముల ద్వారా, ఆసక్తి, గ్రహణశక్తి, నైపుణ్యం మొదలగునవి వయస్సుకు తగినట్టు ప్రకటితమవుతవి అన్నమాట. ఈ అభివృద్ధి పరిమాణమునకు వయోనుగుణ ప్రమాణం అంటారు.

బిడ్డ పుట్టినప్పటి నుండి కూడ ఈ అభివృద్ధి పరిమాణం సక్రమంగా జరుగుతున్నదా, లేదా, అని ముఖ్యంగా తల్లి సమీక్షించుతూ రావాలి. వయస్సుకు తగినట్టుగా సక్రమంగా జరగని యెడల, ఆ లోటుకు కారణమేమి అని చక్కగ ఆలోచించి, అభివృద్ధి క్రమంలో అడ్డుతగులుతున్న ప్రతిబంధకాల్ని తొలగించుట అత్యవసరం. లేనిచో బిడ్డ భావి జీవితమునకే తీరని లోపము సంభవించ వచ్చును. అందుచేతనే తల్లికి శిశు మనోవిజ్ఞాన విషయంలో కొంత పరిచయము పరిజ్ఞానముండుట అవసరం, అంతమాత్రం చేత తల్లి క్రొత్తగ ఎన్నో ప్రమాణ గ్రంధాల్ని అధ్యయనం చేసి విజ్ఞానంపొందాలనికాదు. అల్లా చేయటం అతి ప్రయాసకరం, అసాధ్యం కూడాను. కాని బిడ్డ పుట్టిన క్షణంనుండీ దాని ప్రవర్తనను పరికించి పరిశీలించుట ద్వారా, దాని మానసిక ప్రవృత్తి, దాని పరిణామమును గురించి కొంత పరిజ్ఞానము పొంద వచ్చును. మనకీ పరిజ్ఞానమును ప్రసాదించునది మన బిడ్డయే. అందుచేత మన కడుపున పుట్టిన మన బిడ్డయే మనకు 'ప్రథమ గురువు' అను విషయాన్ని జ్ఞాపకముంచుకొనుట అవసరం. ఆటుతరువాతనే, శిశు మనోవిజ్ఞానమును గురించి అవలీలగా అర్థమగులాగున వ్రాయబడిన పుస్తకాలను చదవటం కూడ కొంత అవసరమేను.

### అభివృద్ధి క్రమంలో వివిధ దశలు :—

గసేల్, ఫ్రాన్సస్, బెనేట్, ఇసాకో మున్నగు మన స్తత్వ శాస్త్రజ్ఞులు, శిశువుజనించి నప్పటినుండియే వారి మానసిక పరిణామమును గురించి, పరిమాణమును గురించీ అనేక నూతన విషయాలను కనుగొన్నారు. మరి కొందరు

ఆధునిక మనస్తత్వవేత్తలు శిశువు జననకాలం నుండి 18 ఏళ్లు ఈడుదాక వారి మానసిక పరిణామమును గురించి ప్రశస్తమైన పరిశోధనలు సల్పిన ఫలితంగా మరికొన్ని ప్రధాన విషయములను కనిపెట్టారు. అవి ఏవనగా: మనుజుని జననకాలం నుండి 18 ఏళ్ళదాక జరుగుతున్న అభివృద్ధి క్రమములో విస్పష్టమైన వివిధ అవస్థలున్నాయి. వానిలో ముఖ్యమైనవి మూడు. ఈ ముఖ్యమైన మూడు దశలలో శారీరకంగానేగాక, మానసికంగా నయితేం, విస్పష్టమైన విభిన్నమైన పరిణామం, పరిమాణం గోచరిస్తాయి. మరి కొంత విపులీకరించటానికి ప్రయత్నిస్తాను.

మొట్టమొదటి దశ. శిశు జననకాలమునుండి 6 ఏండ్ల వరకు.
రెండవది ,, 6 నుండి 12 ఏండ్ల వరకు
మూడవది ,, 12 నుండి 18 ఏండ్ల వరకు.

శిశు జననకాలంనుండి 6 ఏళ్ళదాక దాని మానసిక స్థాయి ఇంచుమించు ఒక్కరీతిగ వుంటుంది అని వారి యభిప్రాయం, కాని ఆ విధంగాలేదు. విస్పష్టమైన వ్యత్యాసము కానరావున్నను, వస్తుతః, జననం నుండి 6 ఏండ్లు వరకున్న అవస్థలో, రెండు ఉపదశలున్నవి.

మొదటి ఉపదశ: బిడ్డ పుట్టినప్పటినుండి 3 యేండ్లదాక.
రెండవది: 3 నుండి 6 ఏండ్లదాక

ఈ రెండు ఉపదశలలో విభిన్నమైన మానసికస్థాయి ఉంటుంది. ఈ రెండు ఉపదశలలో బిడ్డలో మహత్తరమైన పరిణామం జరుగుతుంది. ఈ పరిణామం ఏ విధంగా జరుగుతుందను విషయాన్ని విపులంగా తరువాత ఆలోచించుకుందాం. అసలు మన కవసరమయినది ఈ ప్రధాన దశయే.

బిడ్డను పాఠశాలకు పంపుటకు అయిదారు ఏళ్ళ వయస్సు తగిన వయస్సు అంటారు కదా. కారణమేమంటే అప్పటికి బిడ్డబుద్ధి వికాసంపొంది వుంటుదన్నమాట.

రెండవ దశ: 6 నుండి 12 ఏండ్లవరకు

ఈ వయస్సులో బిడ్డ నెమ్మదిగా ప్రశాంతంగా, పెరుగుతుంది. ఈ దశలోనే ఆరోగ్యం, బలం మున్నగునవి చక్కగా చేకూరతాయి. 6 నుండి 12 ఏండ్ల వయస్సు లోపల శారీరకంగానేగాక, మానసికంగా కూడా కలుగుతున్న మార్పు చక్కగ కనబడుతుంది. (ఉదా: పాల పండ్లు క్రమంగా పడిపోయి క్రొత్తపండ్లు మొలుస్తూ వస్తాయి).

మూడవదశ: 12 నుండి 18 ఏండ్లుదాక

(1) దీనిలో కూడ రెండు ఉప దశలుగా విభజించుట అవసరం. 12 నుండి 15 ఏండ్లవరకు బిడ్డ మనస్థాయి ఒకే తీరున ఉంటుంది.

(2) 15 నుండి 18 ఏండ్లవరకు ఈ దశలోని మనస్థాయి ఒకే విధం.

ఈ రెండు ఉపదశలలో కలిగే మానసిక పరిణామం అద్భుతంగా వుంటుంది. మొట్టమొదట అవస్థలో జరిగినట్టే ఈ దశలోను అమోఘమైన పరిణామం కలుగుతుంది.

ఈ 18 ఏళ్ళ ఈడులోనే మనుజుని మానసిక జీవితము చక్కగ అభివృద్ధిచెంది, బుద్ధిపూర్తిగ వికసితమై యుంటుందనీ, తత్ఫలితంగానే మనుజుడు సర్వకళాశాల విజ్ఞానమును అవలీలగ పొందగలడనీ సకలగుణ సంపన్నుడగుట కిదియే తరుణమనీ ఆధునిక విజ్ఞానవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

కాని, నిశితంగా పరిశీలించితే, మనుజుని జననకాలం నుండి 6 ఏళ్ళు వరకున్న దశయే అత్యంత ప్రధానమైనది. సక్రమంగా, సర్వతోముఖంగా మనస్తత్వం నిర్మితమయ్యే దశ ఈ ప్రథమ దశయే. అలా నిర్మితమైన మనస్తత్వ పునాది మీదనే మనుజుని భావిజీవిత సౌధం నిర్మిత మవుతుంది. ఈ విషయాన్ని తల్లి జ్ఞాపక ముంచుకొనుట అత్యవసరం. ఈ విషయాన్ని విపులంగా, విస్పష్టంగా పరిశోధించి ప్రపంచానికి ప్రసాదించిన వారిలో సుప్రసిద్ధ శిశు మనస్తత్వ వేత్తయగు డాక్టర్ మాంటుసోరి ప్రథమురాలు.

(సశేషము)



కథానిక

# హృదయంలేని ఉక్కుదేహాలు

శ్రీ కాశీభొట్ల సూర్యనారాయణ శాస్త్రిగారు

ఆమెకు యీ ప్రపంచంలో అన్ని ఐశ్వర్యాలూ ఆ శిశువే. అన్ని ధనధాన్యాలూ ఆ శిశువే. ఆమె జీవితరాశిలో అన్ని సంతోష తరంగాలు ఆ శిశువే. తన భవిష్యత్తుకు ఆ బిడ్డే భారమని, తన ఆశయాలకు ఆ శిశువే ఆధారమని, ఆ పసి పాపడే అమూల్యమైన పసిడిమూట అని అత్యంత ప్రేమాతిశయాలతో, ఎక్కువ గారాబంతో, ఒళ్ళంతా కళ్లు చేసుకుని అతి శ్రద్ధగా పెంచుతోంది ఆ సుబ్బి. కాని, యీ ప్రపంచంలో ఆమె నిరాశ్రయజీవి—నిరుపేద.

"ఏడవకు బాబూ! ఏడవకు నా తండ్రి కాదూ! నా కానుల పేరుకాదూ! నీకు చాలా పుణ్యముంటుంది. ఇదిగో ఆడుకో. ఈ రేకుడబ్బాతో ఆడుకో. మనకు ఆట వస్తువా ఆహారానికి ఆధారవస్తువా యిదే. ఈ రోజు నీకు పట్టెడు కూటికి కరువైంది. ఏ జన్మంలోనో పెట్టి పుట్టనిరోజు. ఏం చేస్తాం! నాన్నకదూ; నా బాబుకదూ!" అంటూ దుఃఖ భారంతో పొంగి పొర్లి పొయే కన్నీటి బొట్లను చిరిగిన పమిట చెంగుతో అదిమి ఆ చంటికూనను చంకను వేసుకుంది పాపం సుబ్బి.

గోడుగావున్న తడికతో గుడిసె గుమ్మాన్ని మూసి, సీనా రేకు డబ్బాను చేతితో పుచ్చుకుని, ఎఱ్ఱని వేసవి ఎండలో పట్టపగలు పదిగంటలకు, అన్నమో రామచంద్రా, అని అల మటించే ఆ బాలున్ని ఓదారుస్తూ, ఓ కంట నీరుకారుస్తూ తడబడే అడుగులు వేస్తూ బయలు దేరింది బిచ్చానికి. ఆ బస్తీలో యీ బీదదానిపలుకు లాలకించే వారెవరూ? ఆ నిర్భాగ్యపు జీవితాన్ని నిండుచూపు చూసేదెవరు? ఆ దారిద్ర్యపు మానిసికి దానంచేసే దాత లెవరూ? ఆ దీనురాలి యిక్కట్టువిని ధర్మంచేసే దెవరూ?—

అట్లాగే తిరిగి తిరిగి భగ్గుమనే ఎండలో పాదాల్ని విద లించుకుని, ఆకలిమంటను అదిమి పెట్టి ఒక భాగ్యవంతుని యింటికి చేరుకుంది సుబ్బి. "అమ్మా! చంటి పిల్ల వాడికి పట్టెడు ముద్ద పెట్టరూ," అని అడిగింది ఆయాసంతో.

"నీకేం బుద్దిలేదూ. అందరు తిని కూర్చున్నారు. అంట్లగిన్నెలు ఖాళీగావున్నాయి. ఇప్పుడెక్కడ దొరుకుతుంది ముద్ద? పో! అట్లా పైకి పో!" అని గద్దించింది ఆ యింటి యిల్లాలు.

ఆ చింపిరి చెంగును బాలుని నెత్తిమీద కప్పుతూ అక్కడనుంచి వెళ్లిపోయింది నిరాశాహృదయంతో సుబ్బి.

ఆ ప్రక్కయింటి ఆయన భార్య కమ్మగా తిని, గుమ్మం వద్ద కూర్చుని తాంబూలం సేకరిస్తోంది. "తల్లీ! కొద్దిగా బువ్వ పెట్టరూ, అబ్బాయి గోల పెట్టి ఏడుస్తున్నాడు. కొద్దిగా కవళంపెట్టి పుణ్యం గట్టుకోండి అమ్మా!" అని అడిగింది సుబ్బి.

"ఆ! బువ్వకావాలీ బువ్వ! గువ్వలాగ కూర్చో మరిగి. రోజూ యిదో పరిపాటై పోయింది. ఏదైనా పనిచేసుకుని బ్రతకరాదూ. ఎవడు చెప్పాడూ నీకీవేషం" అని హుంకరించింది ఆ అవ్వ.

అట్లాగే సత్తువలేని కాళ్లతో సాగిపోతూ, పొత్తిళ్లలోని బిడ్డని వత్తిపెట్టుకుంటూ స్థితిమంతుడైన ఒక వర్తకు డింటికి వెళ్లింది.

"అయ్యా! పసికందు గోలపెట్టి ఏడుస్తున్నాడు. ముష్టి డాన్ని రెండుబియ్యపు గింజలు బిచ్చంపెడుదురూ! బాబూ! వున్నవారు మాబోటి పేదల్ని కరుణించరూ అయ్యా!" అని బ్రతిమాలుతూవున్న సుబ్బిని డబ్బులెక్క పెట్టుకుంటూ వున్న ఆ షావుకారు చూచి "అంత తిండిలేని దానవు యిక్కడికెట్లా రాగలిగావు. ఇక్కడికొచ్చే బదులు యింకో యింటికి పో పోయావ్? అంత నీరసంగావుంటే అడగటానికి నోరెల్లావచ్చింది. అతిగా మాట్లాడకు. నీతో మాట్లాడుతోంటే యివతల లెక్క మరచిపోతున్నా. నష్టమొస్తుంది. నీవే శనిఅమ్మోరు లావున్నావేం. పోతావా; పోవా?" అన్నాడు.

# హృదయంలేని ఉక్కు దేహాలు

ధనమే ప్రధానంగా తలచే ఆ ధనిక పాషాణ హృదయాలకి దయారసం ఎట్లా చిగురిస్తుంది? కడుపు నిండా తిని, కంటినిండా నిదురించే ఆ కఠిన జీవితాలకు పేదపిశాచఘోష యేం తెలుస్తుంది? మమకారశూన్యమైన ఆ మలిన దేహాలకి బీద ప్రజల రోదన ఏం వినిపిస్తుంది? ఆదరణాభిమానాలను ఆచరణలో పెట్టని ఆ ధనికవర్గానికి పేదల గోడు పదును కత్తుల పోటులు కాదూ!! సహకార సమానత్వ గుణాలు లేని యీ పాడులోకం వుంటేయేం, వూడితే యేం?

పాపం ఆట్లాగే కాళ్ళు కందిపోతూంటే ఆ పసి కందుని పమిటచెంగుతో మూసుకుని, కళ్ళంట కారే వేడి కన్నీటిని పాతపమిటతో అద్దుకుంటూ, ఆకలి బాధతో యెప్పటిలాగే నిరాశచెంగి మొండి హృదయంతో ముందుకుసాగింది.

ఎదురుగా వెడుతూన్న వుద్యోగిని చూచింది. భరించరాని ఆకలిబాధతో ' బాబూ, అయ్యా! మీకు తోచింది ఏదైనా ధర్మం చేయరూ; కుఱ్ఱాడు మారాం పెట్టి ఏడుస్తున్నాడు. ప్రొద్దుటినుంచి చల్దికూడైనా లేదు. బాబూ కనికరించరూ; రక్షించరూ " అంటూ విలపిస్తూ ఆ వుద్యోగస్థుని పాదాలముందు వుంచింది ఆ చంటికూనని.

" ఏయ్! నాన్సెన్స్, ఛా! ఏమిటి ఏడవటం వెధవగోలాను, అపశకునంలా యేడుస్తావేం? లే. తియ్యి పిల్లోణ్ణి" అన్నాడు కోపంతో గుడ్లు పెద్దవి చేస్తూను. " బాబూ! ఒక్క డబ్బు యియ్యరూ—పిల్లవాడికి కొని పెట్టి ఆకలి తీరుస్తా. మీ పేరు చెప్పుకుంటూ "నంటూ బ్రతిమాలింది సుబ్బి. " ఎన్ని సార్లు చెప్పాలి, డబ్బూ లేదు—ధర్మం లేదు! ముందు తీస్తావా తియ్యవా? ముష్టిముండ, నీకింత పట్టుదల దేనికి? వాళ్ళనీ వీళ్ళనీ బ్రతిమాలి ఎన్నాళ్లని బ్రతుకుతావు? దేనిలోనైనా పడి చావరాదూ!" అంటూ బిడ్డడు పొట్టమీద బూటుకాలితో తన్ని వెళ్లిపోయాడు దురుసుతనంగా.

ఆహా! ఉద్యోగమదం యెంతపని చేసిందో!!

ఆకలి దుఃఖానికితోడు ఆ దెబ్బ గూడా మరింత అధికమైంది వెక్కి వెక్కి యేడ్చి ఆ శిశువును తీసుకుని యెత్తుకుని, హృదయానికి హత్తుకుని మరింతగా యేడవటం మొదలుపెట్టింది ఆ సుబ్బి. ఆ ఆర్తాలాపాన్ని ఆలకించే దెవరూ?

ధూళిలో పొర్లాడిన పిల్లవాడిని చూసింది ఒక్కసారి. హృదయం రాయి చేసుకుంది. ఉన్మాదంతో ముంచెత్తిన ఆలోచనలేవో ఆమె బుఱ్ఱలో పరుగెడుతున్నాయ్. కోపావేశం అధికతరమైంది. జీవితంమీద రోతపుట్టింది. ప్రపంచం మీద ప్రీతితప్పింది. " చంటి కూనకు పట్టెడు ముద్ద సంపాదించలేని యీ పాడుజన్మ ఎందుకు? ప్రేమతో చారెడు మెతుకులు పెట్టని యీ ప్రపంచం దేనికి? అలో లక్ష్మణా అని గుడ్డే యీ పేద హృదయాలను ఆదరించే దిక్కెవ్వరూ! ముష్టి వెధవని, దరిద్ర దేవతని, యింకా యీ ప్రపంచంలో నాకు సంబంధం యేమిటీ-క-నికా-రం-లే-దు" అంటూ యేవో పెద్ద పెద్ద కేకలు వేస్తూ వాయు వేగంతో విరక్తిమార్గాన విసురుగా నడచి పోతూ అచ్చటికి దగ్గిరగా వున్న నదియొడ్డున వృక్షచ్ఛాయని ఆ బిడ్డనివుంచి ఒక్క గంతున చెంగని నదిలోమునిగి అసువులను బాసింది పాపం సుబ్బి.

ఆ ఘోరదృశ్యాన్ని తిలకిస్తున్నాడొక వ్యక్తి. అపారమైనదయతో ఆ శిశువు నెత్తుకున్నాడు. ఆమె నదిలోపడిన వయినం నలుగురితో చెప్పాడు. అందరూ కలిసి నదిలో నలుదెసలా వెదికారు. కాని ప్రయోజనం లేక పోయింది. ఇహలోకాన్ని విడిచిపోయింది సుబ్బి అనుకున్నా రందరును. అతనికి సంతతి లేక పోవటంవల్ల యీ బిడ్డను యీశ్వరుడు యీ రూపేణా ప్రసాదించాడని సంతోషించి ' ర మే శం' అని నామకరణం చేశాడు ఆ శిశువుకు.

రమేశాన్ని పెంచి పెద్దవాణ్ణి చేశారు. పెంపుడు తలిదండ్రులు. పాఠశాలలో ప్రవేశబెట్టి విద్యాభ్యాసం చేయించారు. శ్రద్ధా భక్తులతో విద్యనభ్యసించి ఉద్యోగంలో చేరాడు క్రమేపి రమేశం. ఇప్పుడు రమేశం అంటే ఆ బస్తీలో ఎంతో పేరు. ఏంతో గౌరవం. ఎంతో పలుకుబడీను. పెద్ద పెద్దల అడుగు జాడలలో సంచరించి, వారి గౌరవాభిమానాలకు గురియై అనేకమైన బిరుదులు, డిగ్రీలు అ చిర కాలంలోనే సంపాదించాడు రమేశం.

కాని ఏంలాభం! చిన్నతనంలో మిక్కిలి ప్రేమతో పెంచిన తల్లి యిప్పుడు కళ్ళారాచూస్తే ఎంత సంతోషించేది! ఎంత ఆనందించేది! ఆమెకు యీ ప్రపంచంలో అన్ని ఐశ్వర్యాలూ ఆ శిశువేగా!!





* అద్దేపల్లి లక్ష్మి *

అనగనగా ఒక ఊళ్లో 'సోము అనే కుర్ర వాడున్నాడు. ఆ సోముకు తల్లి దండ్రు లిరువురు వున్నారు. సోము తల్లి కడుపుతో వుంది. ఒక రోజు ఆవిడకు బాగా నొప్పులు వచ్చాయి. అందుకని ఆమెను వేరే ఒక గదిలో మంచము మీద పడుకోబెట్టి డాక్టరును తీసుకొని వచ్చారు. అప్పుడు సోము తల్లి దగ్గరకు వెడతా నన్నాడు. అంటే తండ్రి ఏం చెప్పాడో తెలుసా! "సోమూ! అమ్మకు జబ్బుగావుంది ఇప్పుడు వెళ్ల గూడదు" అని సోమును ఆపేసాడు. రెండు రోజులకు సోము అమ్మ చక్కని చెల్లాయిని కన్నది. ఆ చెల్లాయిని సోము ఎత్తుకుని తిరుగుతూ వుండేవాడు.

నాలుగు నెలలయిన తర్వాత సోము తండ్రికి కొంచెం జబ్బు చేసింది. అందుకని ఆయన ఒక గదిలో పడుకొని రగ్గుకప్పుకునేవాడు. సోము ఏం చేసాడో తెలుసా అప్పుడు. తనకు కనపడ్డ వాళ్లందరికి తనకు తమ్ముడు పుట్టాడు అనిచెప్పే వాడు. సోము తండ్రి స్నేహితులున్నారుగమా, వాళ్లు ఇది విన్నారు. వాళ్ళంతా వచ్చి సోము తండ్రిని "ఇదేమిటోయి నాలుగు నెలల క్రితమే గదా నీకు పిల్ల పుట్టింది. మీ అబ్బాయి మళ్ళీ యిప్పుడు పిల్లాడు పుట్టాడని అందరికీ చెపుతున్నాడు?"అని అడిగారు.

సోము పదిగంటలకు బళ్ళోంచి వచ్చినాక సోము తండ్రి అడిగాడు "ఏరా సోము, తమ్ముడు పుట్టాడని చెప్పుతున్నావట"అని. అప్పుడు సోము ఏం చెప్పాడంటే "అవును నాన్నా! అప్పుడు అమ్మకు జబ్బుగా వుంది అమ్మ దగ్గరకు వెళ్ల గూడదన్నావు. అమ్మకు జబ్బుగావుంటే చెల్లాయి పుట్టింది. మరి నాన్నకు జబ్బుగావుంటే తమ్ముడు పుట్టడా?" అని పరుగెత్తుకొని పోయినాడు. సోము చిలిపి మాటలకు అంతా నవ్వారు.



# ఏం తలచుకున్నా సరే!

ఏదైనా ఒక సంఖ్య తలచుకోండి.
తలచుకొన్న దానిని మూడురెట్లు చేయండి.
వచ్చిన లబ్ధానికి తొమ్మిది కలపండి.
కలిపిన మొత్తాన్ని పది పెట్టి గుణించండి.
ఆ వచ్చిన సంఖ్యనుండి తొంభై తీసివేయండి.
వచ్చిన శేషమును మీరు తలచుకొన్న సంఖ్యపెట్టి భాగించండి.
ఎంత వస్తుందో నేను చెప్పనా? ఉండండి చెప్తాను—
ముప్పై—కదూ?



# గాలి ఒత్తిడి

శ్రీ వసంతరావు వేంకటరావుగారు

విశాలకు వాళ్ల నాన్న చెప్పింది.

"'అ ఆ' అను గొట్టాన్ని భూమి మీద నిలువుగా నిలబెట్టే మనుకో. దానిలో గాలి ఉంటుంది. ఆకాశంలో ఎన్ని మైళ్ళఎత్తు వరకు గాలి ఉందో అంతవరకు ఈ గొట్టం చివరఉన్న దనుకో. అప్పుడు, దానిలోనున్న గాలిభూమిపై 'అ'వద్ద ఒత్తిడి కలిగిస్తుంది. ఘటోత్కచునివంటి రాక్షసుని సహాయంతో 'అ ఆ' లోనున్న గాలిని పూర్తిగా తీసివేసి ఆ గాలికి బరువు సమానమైన బరువున్న పాదరసం పోస్తే సుమారు 30 అంగుళాల ఎత్తుగల పాదరసం మాత్రమే కావలసి వస్తుంది."




చిత్రం 1

"గాలిని ఏ విధంగా తీసి వేస్తామండీ?"

"గాలిని తీసివేయ వలసిన అవసరం లేకుండా దానిని తీసినంత పనిచేసే చిన్న ఉపాయముంది. సుమారు 3½ అడుగులు పొడవుగల గాజు గొట్టం 'కగ' 'క' వైపు మూసి ఉంది. చిత్రం 2 లో చూపినట్లు, దానిని పూర్తిగా పాదరసంతో నింపేము. కుడిచేతి చూపుడు వ్రేలితో 'గ'ను మూసి, గొట్టాన్ని త్రిప్పి, పాదరసమున్న పాత్ర 'చ'లో వ్రేలితోనే గొట్టాన్ని ముంచి, వ్రేలు తీసివేసేము. అప్పుడు గొట్టంలో నిండా పాదరసముండాలి కదా?"

"ఆ హా"

"చూడు నే చెప్పినట్లు చేస్తున్నాను........ ఇప్పుడేమైంది? (చిత్రం 3)"

"ఇదేమిటి? కొంత పాదరసం పడిపోయిందే! అది 'జ'వరకు దిగి ఆగింది.... అయితే, పాదరసమంతా పడిపోకుండా గొట్టంలో కొంత వరకుపడి ఎట్లుండి పోయిందండీ?"




చిత్రం 2




చిత్రం 3

"తొందర పడకు. పాదరసానికి పైనున్న 'క జ' భాగంలో ఏమున్నదను కొంటావు ?"

"గాలి"

"కాదు. అందులో ఏమీ లేదు. గాలీ లేదు. ఏమీ లేకపోవడమే శూన్యం. 'క జ' శూన్య మంటారు."

"ఏమీ లేకుండా ఎట్లుందండి ? మన చుట్టు గాలి ఉందన్నారే ; ఆ గాలి అందులో మాత్రం లేదూ ?"

"లేదు. లేదని నీవే ఒప్పు కొంటావు. గొట్టాన్ని ప్రక్కగా వాలుస్తాను, ఏమౌతుందో చూడు."

"....పా ద ర సం గొ ట్టం లో ని కి ఎ క్కి పోతూంది !.... గొట్టం పూర్తిగా నిండిపోయింది! (చిత్రం 4)"



చిత్రం 4

"ఇందులో ఎక్కడైనా గాలికిచోటుందా ?"

"లేదు"

"తిరిగి నిలువుగా నిలబెట్టేను....ఏమైంది ?"

"ఇందాకట్లా పాదరసం జారింది"

"అయితే 'క జ' భాగంలో గాలిలేనట్టేనా?"

"లేదనక తప్పదు....కా ?. ఏమీ లేకుండా ఖాళీగా ఎట్లుందండి ?"

"ఘటోత్కచుడు చేసినట్లు మాయ చేసే మన్నమాట. 'క జ' కేవలంశూన్యం. అందులో ఏమీ లేదు. ప్రపంచంలో అట్టి శూన్య ప్రదేశం మన కెచ్చట తటస్థపడదు."

"ఓ హో....మరి, గొట్టంలో పాదరసం కొంతవరకైనా ఎందుకు నిల్చోవాలండీ ?"

"త్రాసు అక్కర లేకుండా గాలి బరువును తూచే మన్నమాట. ఈ పాత్రలోనున్న పాదరసంపై గాలి ఒత్తిడి కలిగిస్తుంది. ఆ ఒత్తిడిచేతనే గొట్టంలో పాదరసం నిలిచింది. గాలియొక్క ఒత్తిడి ఎక్కువైతే, గొట్టంలోనున్న పాదరసపు ఎత్తు కూడా ఎక్కువౌతుంది ; గాలి యొక్క ఒత్తిడి తగ్గినట్లైతే గొట్టంలోని పాదరసపు ఎత్తు తగ్గుతుంది. మొదటి చిత్రంలోని 'అ ఆ' గొట్ట మందలి గాలి ఎంత బరువుందో, అంత బరువే ఉంది 'గ జ' పొడవున్న పాదరసం యొక్క బరువని మనం గ్రహించాలి.

గాలి కన్న పాదరసం కొన్ని వేలరెట్లు బరువుంది.

కాబట్టి, వందలమైళ్ళ ఎత్తువరకున్న గాలి బరువుతో సుమారు 30 అంగుళాల ఎత్తున్న పాదరసం బరువు సరిపోయింది. ఇప్పుడు చూడు పాదరసాన్ని తీసివేసి గొట్టాన్ని నీటితోనింపి నీటిపాత్రలో, ఇదివరకు మాదిరిగా, నిలబెట్టేను ....ఇప్పుడేమైంది ?"

"గొట్టంనిండా నీరుండిపోయిందే! (చిత్రం5)"

"ఈ గొట్టమేకాదు. 11 గజాలు పొడవున్న గొట్టంలో ఈ ప్రయోగం చేసినప్పటికి దానిలో నిండా నీరుంటుంది. ఒక్క అంగుళమైనా క్రిందికి జారదు. ఏమంటే, నీటికన్న పాదరసం 13½ రెట్లు బరువు."




చిత్రం 5

"అంటే"

"ఒక గ్లాసునిండా ఉన్న నీరును తూచేము; దాని నిండా ఉన్న పాదరసాన్ని తూచేము. అప్పుడు నీటి బరువు కన్న ఆ పాదరసం యొక్క బరువు 13½ రెట్లు. అంటే గళాసుడు నీరు ఒక పౌను బరువుంటే, ఆ గళాసుడు పాదరసం 13½ పౌనుల బరువుంటుంది. అందుచేత, 'గజ' భాగములోనున్న పాదరసాన్ని తీసివేసి, అంతే బరువున్న నీటిని పోసినట్లైతే ఎక్కువ నీరు పట్టదూ?"

"ఆహా"

"ఈ పాదరసం 2½ అడుగుల ఎత్తుంది కదా! దీనికన్న 13½ రెట్లు తేలికైన నీరు ఇంత బరువుండాలి అంటే...."

"ఔనండి దీనికి 13½ రెట్లు ఎత్తుండాలి కదూ? అడుగులు 33¾."

"అదే సుమారుగా 33 అడుగుల ఎత్తునీరు నిలబడగలదు. ఈ విధంగా గాలి బరువు కనిపెట్టేము. కొన్ని వందల మైళ్లు ఎత్తువరకు వ్యాపించిన గాలి స్థానంలో పాదరసముంటే 2½ అడుగుల ఎత్తుంటుంది. నీరుంటే 33 అడుగులు లేక 11 గజాల ఎత్తుంటుంది. దీనిని బట్టి గాలియొక్క బరువు సులభంగా లెక్కకట్ట వచ్చును. ఏమంటే, ఒక చదరపు టంగుళం వైశాల్యంకలిగి 30 అంగుళాల ఎత్తున్న పాదరసంయొక్క బరువు లెక్కకట్టితే ఆ చదరపు టంగుళము మీద గాలియొక్క బరువు తెలిసిపోతుంది. అల్లు లెక్కకట్టగా వచ్చిన ఫలితమే సుమారు 15 పౌనులు 5 వీశెల భారమని. అందు చేతనే ప్రతి చదరపు టంగుళము 5 వీశెల బరువుని మోస్తుందంటారు. అంటే అరచేతితో బియ్యపు బస్తాను మోస్తున్నామని లెక్క తేలుతుంది. లెక్కకట్టి, అరచేతిలో గాలి బియ్యపుబస్తాఅంత బరువుందంటే నీవు నమ్మలేక పోయేవు"

"ఔనండి మీరా విషయం చెప్పినపుడు నమ్మడానికి మనసొప్పిందికాదు. ఇప్పుడు ఒప్పుకోక తప్పదు....ఇంత పీడిస్తూన్నా గాలి సంగతే మనకు తెలియకపోవడం ఆశ్చర్యం సుమండీ!"



బాల బాలికల కవలీలగా అర్థమయ్యే నాటికలు, కథలూ, వినోదమును గూర్చు కబుర్లూ, చిత్ర ప్రశ్నలూ, శాస్త్రమునకు, చరిత్రకూ సంబంధించిన రచనలూ, చిన్నవిగా పంపినచో, కృతజ్ఞతతో స్వీకరించి ఇందు ప్రచురిస్తాము.

చిన్న పిల్లలు వ్రాసిన కథలు, కూర్చిన కబుర్లూ, వారి వయస్సు పంపినచో, ఫోటోలతోసహా ప్రచురిస్తాము.

# "ఆడబ్రతుకే మధురమ్"

స్కెచ్

* శ్రీ చంద్రారెడ్డిగారు *

తారల ఎరుపులు తగ్గక మునుపే, తూరుపు రేఖలు తెల్ల బడక మునుపే ఆ రెండిళ్ళు కలిసివున్న ఆవరణలోని చిన్న యింట్లోంచి పాలుచిలికే ధ్వని వినపడుతుంది. లోపల ఆ యువతి పాలు చిలుకుతుంది. పిల్లవాడు (రెండేళ్ళు) లేచి ఏడుస్తాడు. పావుగంట సేపు వాణ్ణి సముదాయించి పాలిచ్చి నిద్రబుచ్చుతుంది. యింతలో భర్త లేస్తాడు.

" ఏయ్! యిదిగో కాళ్ళమీద కొంచెం చెయివెయి!"

మరి కొంతసేపామెకు భర్త కాళ్ళొత్తటంతో సరిపోతుంది. మరల పాలు చిలికేందుకు పోతుంది.

ఇంతలో తూర్పు రేఖలు తెల్లనవుతవి. చీకటి విడిపోతుంది. అత్తగారు నిద్రలేచి వస్తుంది.

" యింకా పాలు చిలకటమే కాలేదా! అయ్యో కర్మ! యింతపొద్దెక్కింది. యిక మిగిలినపనంతా చేసేదెప్పుడు!" అంటుంది. ఆమె జవాబు చెప్పదు. కారణ మేమిటంటే ఆమె చెప్పే జవాబెటూ అత్తగారు నమ్మరు. అప్పుడు కొరకొరలాడే అత్తగారి ముఖాన్నొకసారి చూసి ఆందోళనతో, తలవంచుకొని తనపని తాను చేసుకొంటుంటుంది. యింతలో పిల్లవాడు ఏడుస్తో లేస్తాడు. ఆమె యిది గమనించనట్లు పని చేసికొంటున్నా మనసులో ఆ పిల్లవాడి యేడుపు మెత్తగా కోస్తూఉంటుంది. మరీ భరించ లేనప్పుడు ఆ పిల్లవాడినే రెండు దెబ్బలువేసి తనపని చేసుకొంటుంది.

భర్తగారు బారెడు సూర్యుడు పైకొచ్చాక లేస్తాడు.

" ఏయ్, కాఫీకాగలేదా?" అంటాడు.

"నీళ్ళు కాగుతున్నవి, యిప్పుడే తయారు చేసిస్తాను. వీడితో ఆలస్యమైంది" అని జవాబిస్తుందామె.

" సరేలే ఏడిశావ్—అన్నట్టు వీడిదేం శని అరుపు! వెధవని! వెధవ!" అంటూ మొహంలో వివిధ అసహ్యరసాలన్నీ పోషిస్తూ పిల్లవాణ్ణంటాడు. "ఒరేయ్, నోరు మూసికో! కుంఖా!"

దాంతో పిల్లవాడు హెచ్చు స్థాయియందు కొంటాడు. ఆయన పనిమిగిలించుకు నిద్రలేచిన విసుగుతో యేడుపు కలిసేటప్పటికి భరాయించ లేక మంచంమీది నుంచి దూకి, "రాస్కెల్! నీ పని యిలా కాదు" అంటూ వాడి రెండు చెవులు పట్టుకొంటాడు. ఆ పిల్లవాడు నొప్పికి పెట్టిన వెర్రికేకలకు ఆమెవచ్చి భర్తచేతులు వదలిస్తుంది—

"అన్యాయంగా వాణ్ణి కొడతారెందుకండీ"

"కొట్టాల్నా, చంపాల్నా, వాణ్ణి! ఏడుపు మొహమూ వాడూను" అని ఆమె భర్త గర్జిస్తాడు. ఏమిటి! ఎందుకు! ఎవర్ని! అతనచేది అతనికీ తెలీదు. నీళ్ళు పుక్కిలించిబయట ఉమిసి మరల తన పడకకు చేరతాడు. ఆమె కాఫీ తెచ్చి యిస్తుంది. భర్తగారు చప్పరించి "యీ కాఫీ నీ మొహంమల్లే ఉన్నదిలే. అసలు నీకు కాఫీ కాయటం చాతయితే కదూ! యింకొంచెం చక్కెర వెయ్యి" అంటాడు. ఆమె చక్కెర తెచ్చి కాఫీలోవేసిన తర్వాత పెద్దలోటాడు కాఫీని గొంతులో పోసికొని బీడీ వెలిగించుకొంటూ ఆ ఆవరణలోంచి బయటకు వెళ్ళిపోతాడు.

దేవుడికి తన పవిత్రమైన హస్తాలతోకోసిన పూజాపుష్పాలను ఒక పళ్ళెంలో ఉంచుకొని అత్తగారొస్తుంది. చూసి అంటుంది "యింకా కాఫీలు తగలేసి కాస్తూ కూచుంటే గతుకెప్పుడు ఉడకేయటం?"

ఆమె మనసులో అంటుంది "మీ కొడుకునే అడగ కూడదు! ఆ సంగతి!" పైకి నిశ్శబ్దంగా ఊరుకొంటుంది.

అంతే! ప్రతినిమిషమూ ఆ విధంగానే నిర్నిమిత్తంగా ఢీకొంటూ ఉంది. మధ్యాహ్నం అత్తగారు పెసలెక్కడ ఎండ పోయాల్సిందో, ఎంత కందిపప్పు ఉడకేయాల్సిందో,

## "ఆడబ్రతుకే మధురం"

ఆమెకు చెప్పే నిద్రపోతుంది—ఆమె చూపు యే విధంగాను పైకి చూడలేదు. వంచబడిన మెడతో ఆనంద మయంగా ఆ సంసార ఆవరణలో రంగులరాట్నంవలె తిరుగుతూంటుంది.

రాత్రి తొమ్మిదవుతుంది. ముసలి మామ అన్నానికొస్తాడు. "అది బాగులేదు, ఇది బాగులేదు" అని కోడలిమీద విసుక్కొంటూ సగం తిని సగం గిన్నెచుట్టూ చల్లి రామనామం జపంచేసికొంటూ లేచిపోతాడు. తరువాత అత్తగారొస్తుంది భోజనానికి. కూర తన కొడుక్కుమాత్రం మిగిల్చి మిగతా భాగమంతా తనే వేసికొని తినేస్తుంది. యింతలో పిల్లవాడు లేచి ఏడుస్తాడు. అత్తగారి గిన్నె ఆమె కడిగేంత వరకు వాడు యేడుస్తూనే ఉంటాడు. తరువాత వాన్ని ఓదార్చబోతోంది. అత్తపోయి పండుకొని నిద్రపోతోంది. ఆమెకు కడుపులో ఆకలికూడా సమసి పోతోంది. పిల్లాడికి పాలిచ్చుకొంటూ అలాగే కళ్ళు మూసుకొని మగతలో పడిపోతుంది. నిద్రలో భయం గొలుపుతూ యేవేవో వింత ముఖాలు కనపడ్తాయి. పరిశ్రమ మితిమీరినందువల్ల నిద్రరాక వెంటనే లేస్తుంది. భయపడిన కలలన్నీ స్మృహలోకి తెచ్చుకొంటుంది.

భర్తవస్తాడు. ముందు భయపడి తర్వాత గుర్తించిలేస్తుంది. వేడినీళ్లు తోడిచ్చి తరువాత అన్నం పెడుతుంది. భర్తగారు ఏదో కొద్దిగా కెలికి "దీంట్లో పులుసు తక్కువ, దాంట్లో కారం లేదు. దరిద్రపు మొహానివి యేం చేసినా యింతే" అంటూలేచి పోతారు. కాని అతడు తినని కారణం కూరలు సరిలేక కాదనీ, వచ్చే ముందు పావలా యిచ్చికొని తిన్న దోశెలూ వగైరాలని, ఆమెకేం తెలుసు.—ఆ విస్తట్లో మిగిలిన భోజనం ముందు ఆమె కూచొని తినడాని కుపక్రమిస్తుంది. ఆకలిలేదు పదిన్నర గంటలయింది. సగం తిన్నాక పిల్లవాడు లేచి ఏడుస్తాడు. ఏదో కడుపులో కదిపినట్లయి లేచి విస్తరెత్తి చేయికడుక్కొని పిల్లవానివద్దకు వచ్చి పండుకొంటుంది.

మరల వేకువనే లేవటం యథాకార్య కలాపాల్లోలోటు లేకుండా చూడాలను కోవటం మామూలుగా సాగుతూ ఉంటుంది.

యీ విధంగా గిరగిర ఆ యింటిచుట్టు తిరుగుతూ కొన్ని రోజులకు జబ్బున పడుతుంది. మొదటి నాలుగు రోజులూ ఏదో మామూలు జబ్బని బలహీనంగా ఉన్నగాని తనపని చేసికుంటూనే వుంటుంది. తనకు జబ్బని చెప్పుకోదగ్గ వాళ్ళెవ్వరూలేరు యీ కుటుంబములో. అథవా భర్తనమ్మినా అత్తగారి భయంవల్ల ఆ నమ్మకం అపనమ్మక మవుతుందనే మహత్తర విషయాన్ని ఆమె తెలిసికొని ఉంది కాబట్టి జబ్బు సంగతి ఎవరికీ చెప్పలేదు. ఐదోరోజున జబ్బు జాస్తయి కదల కుండా పడిపోతుంది.

అత్తగారంటుంది "మూన్నాళ్ళకు ఒకసారి జబ్బునపడితే యిక్కడ చేసేవారెవరు?" జబ్బు కూడా ఆమె చేతిలోని విషయమేకదూ! మరి.

ఆమె యీ మాటలతో ఉద్రేకంగా లేచి ఏదో ఒక పని చేయ బోతుంది. ఆ కుండలలో ఏదో ఒకటి పగిలి పోతుంది. దాంతో అత్తగారొచ్చి అంటుంది. "—మహాతల్లీ! నా అమ్మా! నువ్వు యేమీ చెయ్యక్కర లేదులే! కుండలెందుకు పగుల గొడతావు?"

రోజు రోజుకు జబ్బు పెరుగుతూనే ఉంటుంది. మంగలి నారయ్యవచ్చి ఏదో మందిస్తుంటాడు, కాని తగ్గటం లేదు. చూడవచ్చిన పక్కింటి స్త్రీతో రహస్యంగా చెబుతుందామె—"ఎవరైనా మనిషిని మావూరంపి నేనుజబ్బులో ఉన్నాను, మానాన్నను రమ్మనమన్నాను అని చెప్పమనండి"—

సరే! రెండోరోజులకు ఆమె తండ్రి బండితోసహా వస్తాడు. అత్తచూసి గ్రహించి అంటుంది. "—మంగలి నారయ్య కూడా మందిచ్చాడు. యిక ఫర్వాలేదు రెండు రోజుల్లో నయమవుతుందని చెప్పాడు."

ఆమె తండ్రి అంటాడు "రెండు రోజులలో బాగయి వస్తుంది లెండి పంపండి."

మంగలి వైద్యుడి ఫీజయినా తగ్గుతుందని భర్తగారు తొందరగా పయనముచేసి భార్యను ఎంతో ప్రేమతో బండి వరకు చెయ్యి పట్టుకుని తీసుకొచ్చి బండిలో యెక్కించి పంపుతాడు.

(తరువాయి 32వ పేజీలో)

# భిన్నాభిప్రాయాలు

"దేవి"

కాలేజీ ప్రాంగణములో విద్యార్థుల కోలాహలము విపరీతంగా యున్నది. ఆ రోజు కాలేజీకి సెలవు లారంభము. కొన్ని సంవత్సరాలు కలసి మెలగిన సహపాఠకులు విడిపోయే కష్టసమయం. రామం, రఘుపతి, బి.ఏ., పరీక్షలు వ్రాశారు. పార్కులో చిన్న తిన్నె మీద కూర్చుని వారు ప్రొద్దుబోయ్యే దాకా ఆ కబురు, యీ కబురు చెప్పుకో మొదలెట్టారు.

"రఘూ, ఫస్టుక్లాసు నీకు తప్పదంటున్నారోయ్"

"అంటున్నానోయ్, అనరాదు...నీ స్నేహితుని గొప్పతనము జూడను అందరికి రంగద్దాలు లేవు రామూ. తృటిలో గడచి పోయినదోయి విద్యార్థి జీవితము."

"ముందు ప్లానేమిటో చెప్పినావుగావు"

"ఏ మున్నది? మనముందు కొన్ని తరాలు, మన వెనుక మరికొన్ని తరాలు కట్టాళ్ల ప్లానులులాగే. ఏ వుద్యోగము వెలగ బెడదామనో, సంఘసేవ జేద్దామనో, ఆదర్శ ప్రభుత్వము నెలకొల్పుదామనో అనుకుంటాము. సంసార బాధ్యత యిప్పుడిప్పుడే వద్దను కుంటాము కాని, మన పెద్ద వారున్నారుగా అన్ని వూహాలను తల క్రిందులు జేయను!"

"పెళ్లి జేసుకోబోతున్నా వన్న మాట! మన జీవితాలలో అదొక రొటీనేగా. మరి సంపాదన విషయ మేమిటి? సంబంధమేమైన నిశ్చయమైనదా?"

"సంపాదన విషయమై మా వారింకా యేమి తేల్చలేదు. సంబంధము మట్టుకు నిశ్చయించారు. ఇప్పుడు చూడడ మేమిటి. నేను పన్నిండేండ్ల వయస్సు వాడుగా నున్నప్పటి నుంచి వారు జూస్తూనే యున్నారు. ఇప్పటికి బేరము కుదిరింది. అంటే, నిశ్చయమైనది.

"ఎవరా బాలిక?"

"వేలు విడిచిన మేనమామ కూతురు. చూపులకు బాగానే యుంటుందట. ఇచ్చే కట్నం మా నాన్న, అమ్మలను ఒక సిస్టెంలో పెట్టి సరి తూచవచ్చు. మరి నీ విషయ మేమిటి?

"ఏమి లేదు"

"ఏమి లేదేమిటోయ్. మీవారు నీకే దివ్య సుందరిని జూచినారు?"

"మా అనే వారు లేరు గాబట్టి సుందరిని యెన్నుకునే భాగ్యం నాకే దక్కింది"

"ఇక నేం. ఏ చక్కని తారనో, ఏ కాలేజి బ్యూటీనో అన్వేషించు"

"బ్యూటియో గాదో చెప్పలేను గాని నా సహపాఠి తల్లి దండ్రులనే ఆమె నిమ్మని అడుగబోతున్నా"

"ఎవరు రామం?"

"సుభద్ర"

"మన సుభద్రే?"

"మన సుభద్రేమిటిరా నీ తలకాయ! మన క్లాసుమేటు సుభద్ర"

"అదే, అదేలే నాభావము గూడాను. కాని చూస్తూ, జూస్తూ నీ బ్రదుకులో యెందుకురా నీళ్లు బోసుకుంటావు?"

"ఒహో నీవు ఆ చాంధసపు స్కూలుకు జెందిన వాడవంటోయ్! ఇలా వాదించడము మనలో ఒక అలవాటై పోయినట్లున్నది. సుభద్రను జేసుకొని మీ అభిప్రాయాలెంత వరకు సత్యమో తేల్చుకోవాలి. మనపెద్దవారు జేసేది మాత్రం యింతకన్న హెచ్చేమిటో నాకు తెలియదు. పెళ్లి చూపులకు బోయే వరకు కాబోయే కోడలి ముక్కు, ముఖం అత్త మామలకు దెలియదు. వాళ్లు వీళ్లు జెప్పిన మాటలను బట్టి వంశ మర్యాద, తల్లిదండ్రుల పద్ధతులు దెలిసికొని, అట్టి వుత్తమ దంపతులకు జన్మించిన బిడ్డ అత్తవారింటి వారికలెనే సుగుణ సంపన్నురాలయి యుంటుందని తీర్మానించుతారు. ఇక ఆ అమ్మాయి గుణ గణములలో హెచ్చు

తక్కువలుంటే అది చేసుకోనివాడి అదృష్టమూ నాలుగు సంవత్సరాలనుంచి ఒకే కాలేజీలో చదివిన యువతిని సహచరిగా యేరుకోవడములో నేనే మనవారి కన్నా ఒక మెట్టు మెరుగనిపించుకుంటాను, ఏ మంటావ్ ?"

"ఏమనేది ? నీ ఖర్మ కాలిపోయి నీకాబుద్ధి బుట్టింది గాని! అంత పెద్ద చదువుల వారు కొంప కాచి పెట్టుకొని యుంటారటురా ? మీ నాన్న సంపాదించిన మూడెకరాలు డాబా వొక్క యేడాదిలో పూర్తి జేసుకుంటావు. నీ జీతపురాళ్లు ఆమె సరదాలకేమూలకు ?"

"సుభద్ర యేనాడూ అట్టహాసంగా డ్రస్సు జేసికోవడము గూడనే జూడలేదు. పెళ్లి జేసుకుంటానే సహజమైన ఆమె గుణాలు ఒక్కమారు మారిపోతాయని నేను నమ్మను."

"రామూ, మనసెట్టు మాబాగా కుదిరినదోయ్. నేనేమొ కట్నాల కన్నెను జేసుకుంటున్నా. నీవేమో విద్యాధికురాలి నిభుడనౌతావు. మోహన్ సునీతిని సెసుకుంటాడట. వాళ్లిద్దరు గలిసి సంఘాన్ని వుద్ధరిస్తారట"

"సునీతి యెవరోయ్"

"మధుసూదనరావుగారి యేకైక పుత్రిక. ఆ అమ్మాయి క్వీన్ మేరి కళాశాలలో బి. యస్. సి చదివినది. చూడాలి మన ముగ్గురి జీవితాల భవిష్యత్తు!"

రామం కలెక్టరాఫీసులో గుమస్తా, చీకటి బజారులో నేను వ్యాపారం జేయరాలేదు నాదంతా వెలుతురు బజారేనంటూ రఘూ, "యేదోయ్ నీ లెక్కలు జూపు" అంటూ మోహన్ ఒకే వూరిలో జీవించుచున్నారు. ఇల్లు దొరకని యీ రోజుల్లో ముగ్గురొకే చోట నివసించు చున్నారనుట వూహాతీతము. ఊరు మూడు చివరలా ముగ్గురున్నారు.

(సశేషం)

---

(30 వ పేజి తరువాయి)

కొద్ది రోజులకు ఆమెవల్లు నయమవుతుంది. భర్తవచ్చి తీసుకొని పోతాడు. నడుములు కదుములు కట్టేట్లు ఊగులాడుతూ పోతున్న బండిలో ప్రయాణంచేస్తూ ఆమె అనుకొంటుంది "యీ బండీ నా బతుకులాగా యీడ్చుకొంటు పోతుంది." పిల్లవాడికి పాలిస్తూ మగతగా తన చిన్న తనపు ఆనందజీవిత స్వప్నాలోకి కెడుతుంది. ఎంతో గొప్పవైన ఆ రోజులు ఆ ఆటనుంచి తన అత్తింటి కాపురమువరకు కళ్ళల్లో వరుసగా నీటితో తిరిగిపోతుంటువి. అత్త స్వప్నలోకొచ్చి ఆమె భయం కరమైవాన్ని మూచేటప్పటికి భయంతో తనకు తెలీకుండానే నోట్లోంచి చిన్న ఆక్రందన వెలువడుతుంది. దాంతోకూడా పిల్లవాడు కెవ్వుమంటాడు. భర్త అసహ్యంతో "ఏమిటిది! గొడ్డుమాదిరి" అని అంటాడు. ఆమె అవమానంతో తలవంచుకొంటుంది.

అస్తమానమయ్యే సరికి బండి అత్తవారింటికి చేరుకొంటుంది. ఆందోళన జాస్తిఅవుతుంది. మామగారి ఈసడింపు మాటలు అత్త తుపాను వర్షము......బండి వాకిట నిలుస్తుంది.

బండి దిగంగానే ఆమెకుకనిపించింది అత్తగారి ముఖము దాంటో మినుకు మినుకనే ప్రమిదలోని దీపాలవంటి కళ్ళు ఆమె జీవితంలో మరువలేదు.

అత్తగారంటుది—"యిన్ని రోజులు తిష్టవేశావే! చాల తొందరగా వచ్చావ్ మహా!"—

మరల ఆమె రణరంగం మధ్య కొచ్చింది. అయితే యీ రణరంగంలో నిస్సహాయురాలామె. ఆమెతో ప్రతి ఒక్కరు ఎందుకు యుద్ధానికి తలపడతారో ఆమెకు బోధపడం లేదు. రాజులకు తేళ్ళవేటంటే ఎంతమక్కువో వీళ్ళకు ఆమెతో కలపడటమంటే అంతయిష్టము.

యీ విధంగా భూదేవివలె తనచుట్టు తాను తిరుగుతూ, తన అత్త, మామ, భర్త, ఆ యిల్లు అనబడే ప్రపంచం చుట్టు తిరుగుతూ, "మానవ జీవి నూరేళ్ళు బ్రతుకాలి" అనే శాస్త్రకారుల వాక్యాన్ని దగ్ధంచేస్తూ తన పందొమ్మిదోసంవత్సరాన్నే తీరని వ్యాధులకుగురయి ఆ చీకటి గుహకు ఎరవుతుంది. తప్పదు.



సీరియల్ నాటిక

# భక్తిలీల

శ్రీ లాకి శ్రీనివాసరావు

### రంగము ౪.

[ప్రదేశము : వైకుంఠము.

ప్రవేశము : త్రిమూర్తులు ఇష్టాగోష్టి సలుపు చుందురు]

విష్ణు : శివ, విధాతలారా! మన కల్పిత త్రినాథ వ్రతమును రమా వాణీ భవాను లమితానందమున సలుప సామగ్రిని సమ కూర్చుచున్నారు.

ఈశ్వ : స్త్రీలకు వ్రతములం దభిమానము మెండు.

బ్రహ్మ : అందీ వ్రతమున నవీనత్వము గలదు. నూతన పోకడలతో సూక్ష్మముగాజేయ వీలగును. కాన లక్ష్మీ పార్వతీ సరస్వతులు శీఘ్రముగా నాచరించుట కాతురపడు చున్నారు.

నార : (ప్రవేసించి) ఓ త్రిమూర్తులారా! త్రినాథులారా!

విష్ణు : ఏమి నారదా! ఏల నీ యాతురము?

నార : వీక్షించితిరా! వీక్షింపుడు—వీక్షింపుడు. దివ్య దృష్టిని వీక్షింపుడు. భూలోకమున ఆ మధుసూదనుని భార్య శాంతాదేవి గతి ఎట్లున్నదో వీక్షింపుడు. ఆ మదోన్మత్తుడగు రెడ్డి ఎట్టి దుండగముల జేయ సమకట్టి యున్నాడో గమనింపుడు. ఆహా! ఆహా! ఆ పతివ్రతామతల్లి కెట్టి అపాయ మాపాదించినది. ఆ యార్త నాదమును వినుడు—ఆ యార్తా రవము విన వచ్చు చున్నదా? లెండు—కాపాడుడు. ఓ విష్ణు దేవా! కర్తవ్య మేమి. ఓ బ్రహ్మ దేవా! ఉపేక్షింపకుము. ఓ మహాదేవా! రక్షింపుము, రక్షింపుము.

(త్రినాథులు ఆతురమున పోవుదురు)

నార : ఆహా! భక్తి మహాత్మ్యము కేమనవచ్చును!

తే॥ గీ॥ మకరి నోటను జిక్కిన । మద గజమును
గావ నారాయణుడు బోవు । కరణి నిపుడు
హరియు, హరి వెంట హరుడును, । హరుని వెంట
ధాతయును పోవుచున్నారు । యాతురమున.

ఆహా! ఆహా!

బ్రహ్మ విష్ణు మహేశులు భక్తవశులు.

భక్తి త్రాళ్ళచేవారల బంధనమునుజేసి ముక్తిగాంచనగును.

శ్రీ త్రినాథ వ్రత మహాత్మ్యము నెరుగగా వశము గాదు. అట్టి భక్తవశంగతులగు శ్రీ త్రినాథులను గద్య పద్య గేయంబుల సంకీర్తన మెంత జేసినను తనివి దీరునా!

(ప్రవేశము త్రినాథులు)

విష్ణు :—బిడ్డా! నారదా! మేము వ్యాఘ్ర రూపముల జని ఆ దుర్మార్గుని, ఆ మదోన్మత్తుని వెన్నాడి పారద్రోలి ఆ దీనురాలిని రక్షించినారము. ఆ మహా సాధ్వి కెట్టి మానభంగమును గలుగలేదు—దివ్య దృష్టిని గాంచుము.

సీ॥ తిలకించు మాదెస । దివ్య దృష్టిని వెస
నా పతివ్రత కెట్టి । హాని లేదు
మూడు దెబ్బలులుగా । మువ్వురు మూర్తుల
మరిగి యా దుర్మార్గు । నచటి [illegible]

## భక్తిలీల

పారద్రోలియు మాన । భంగమా సాధ్వికి
గలుగనీక కరుణ । గావినాము
తన కుటీరమునందు । దన పిల్ల వానితో
దనియుచు నున్నదా । తల్లి హాయి!

తే॥ గీ॥ నీతి సత్యము మానస నిర్మలమ్ము
గాంచు భక్తుల గాపాడ । గంకణమ్ము
గట్టుకొని లోకముల నేలు । నట్టి, మూర్తి
త్రయము నెరుగవె, నారదా! । ధన్య లీల!

నార: (దివ్య దృష్టిని దిలకించి) ఆయమ కుటీరములో దన పిల్లని బాలు గుడుపుచు సురక్షితముగా నున్నది. ఆహా! మిమ్ము నమ్మిన వారికేమి కొరత గలుగును.

విష్ణు: నారదా! నీవు కోరియున్న రీతిగా త్రినాథవ్రతమను నొక వింత వ్రతము గల్పించి నారము. దాని నిప్పుడే త్రిదేవు లాచరించుచున్నారు. నీవు దాని విధానముం దెలిసికొని త్వరగ భూలోకమున కరిగి ఆవును వెదకుచున్న మధుసూదనున కుపదేశింపుము. పిదప మా మహాత్మ్యమును జూపెట్టుదుము.

నార: ధన్యోస్మి, ధన్యోస్మి.

(తెర వ్రాలును)

## శ్రీమతి సరోజినీదేవి

సీ॥ స్వారాజ్య స్వాతంత్ర్య సంసిద్ధికై తన్వు
ధార బోసిన యట్టి ధన్య చరిత
స్వార్థంబు త్యజియించి సౌఖ్యంబు వీడి ప్ర
జా సేవజేసిన సదయ హృదయ
పరదేశ పరభాష పరసంప్రదాయముల్
వీడ గల్గినయట్టి విమల చరిత
మాత కస్తూరికి మాతయై దగనిల్చి
ప్రియము బల్కినయట్టి నయగుణాఢ్య

గీ॥ సాధుగుణశీల స్వాతంత్ర్య సమరధీర
అమరగాయని శాంత రమా లలామ
దివికి జేర సరోజిని దేవి యౌర
మరపు రాదెన్నటికి నిల మరువ గలమె.

గీ॥ మహిత గుణాయుత భారత దుహిత యౌర
భారతావనీ భావి సౌభాగ్యమునకు
మూల మైనట్టి స్వాతంత్ర్యమును వహించి
కృషియొనర్చిన సాధ్వి సత్కీర్తి దనరె॥

శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు

<u>చరిత్రపుటలో చెఱిగిపోని చిరంజీవి</u>

# ఫ్లారెన్సు నైటింగేలు

* శ్రీ జంపాల ఉమామహేశ్వరరావుగారు *

శోకాతుల లోకంలో
దివ్యోజ్జ్వల దీపికలో
చీకట్లను చీల్చుకొంచు
శోకాలను పోకార్చుతు
సంక్రాంతులు సవరిస్తో
పయనించిందా తేజోపుంజం.
తిమిరావృత కుడ్యంపై
ఫ్లారెన్సు ప్రసరించిన
దివిదివ్య జ్యోతిర్ద్యుతి
భవికోన్నత ఛాయల్లో
బాధార్తుల వ్యథావ్రుదుల
నుదయించును మధుమరీచి.

గత చరిత్ర గవాక్షాల
తొంగి చూచు ఫ్లారెన్సు
సదమల జీవితశిష్టం
మేదిని కొక మహిమోజ్జ్వల
రోచిస్సును సూచిస్తూ
భాసించును భవిక చరిత పంక్తుల్లో
కరుణాయుత క్రమజ్యోతి
కేలదాల్చి నిల్చిన ఫ్లారెన్సు
త్యాగోజ్జ్వల మహిమా మండిత
మహిళా లోకానికి మేలుబంతిరదై
విశ్వచరిత వీణాగళమున
వినిపించును యుగయుగాల.



(కిల్వర్ కోచే ఆధారంగా)

# స్వతంత్ర పరిశీలన

# స్త్రీలను గురించిన సామెతలు

* శ్రీమతి అ. రాజేశ్వరిగారు *

ప్రపంచమందుగల ప్రతి దేశంలోను, ప్రతి భాషలోను సామెతలు అనేకంగా ఉన్నవి. ఆ సామెతలను బట్టి, అవి పుట్టిన దేశంలోగల ఆచార వ్యవహారాలు, మనస్తత్వాలు, కొంతవరకు తెలుసుకో వచ్చును. ఇప్పుడు మన దేశంలో మన తెలుగు భాషలో, అందులోనూ స్త్రీలను గురించిన సామెతలు కొన్ని పరిశీలించి ఎటువంటి విషయాలు తెలుసుకో వచ్చునో ఎంతవరకూ స్త్రీ మనస్తత్వాన్ని తెలుసుకునే అందుకు అవి తోడ్పడగలవో చూద్దాం. అసలు సామెత అంటే ఏమిటో ముందుగా తెలుసు కోవాలి. సామెత అనే మాట సమతా అనే సంస్కృత పదమునుండి వచ్చినది. సమతా అంటే సమత్వం, సాదృశ్యం, పోలిక అని అర్థం. ఒక విషయం ఎలాగున్నదో చెప్ప దలచి నప్పుడు, అదివరకు అందరికి తెలిసిన దానితో పోల్చి చెప్తాము. మన మెవరికైనా ఒక పేదవానికి దయదలచి ఒక వస్త్రదానం చేసినప్పుడు ఆ పేదవాడు ఆ వస్త్రం బాగుండలేదని ఆక్షేపిస్తే "పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చకుంచమని పీకులాడుట" అని అంటాము. ఈ సామెత లోగడ ఎప్పుడో ఎక్కడో జరిగిన విషయమే. దానిని పోలిన ముచ్చట ఎప్పుడు జరిగినా ఆ ముచ్చటను పోలినది గనుక ఆ సామెత జ్ఞప్తికి వస్తూంటుంది. ఆలాగున ఒకరి నోటినుండి ఒకరి నోటికి ఒకతరం నుండి మరొక తరం వారికి వస్తూ లోకంలో నిలచి పోతుంది. ఆలాగున వచ్చిన సామెతలకే లోకోక్తులని కూడా అంటారు. అనాకారిగా ఉన్న బిడ్డను తల్లి ముద్దుపెట్టుకొని గారాబంగా చూచు కుంటున్నప్పుడు, ఎవరయినా, "అంత అనాకారిగా ఉన్న బిడ్డను, ఆవిడ ఎలా ముద్దు పెట్టుకో గలదో" అని అంటారను కోండి, అప్పుడు "కాకిపిల్ల కాకికి ముద్దు" అని అంటాము. ఎవరి పిల్ల వారికి ముద్దు అన్నా అదే భావంగాని, కాకిపిల్ల అన్నప్పుడు అందము లేదన్న విషయం స్పష్టపడుతుంది. అందముగా లేక పోయినా, ఇతరులకు అసహ్యంగా ఉన్నా, కన్న తల్లికి ఆమె ఒడ్డ ముద్దుబిడ్డే, అన్న విషయం, సర్వత్ర ప్రాయంగా ఈ సామెతలో స్పష్టంగా బోధపడుతుంది.

కొన్ని సామెతలు ఎలా పుట్టినవో చూడండి. ఒక బాలుడు చిన్న తనంలో ఒకరి పెరట్లో జొరబడి ఒకతోటకూరకాడ దొంగిలించి [illegible] తల్లికిచ్చాడు. ఆమె వాడిని మందలించలేదు. తెచ్చినది వండిపెట్టి తాను కూడా తిన్నది. దొంగిలించడం తప్పన్న విషయం తల్లి చెప్పక పోవడం చేత ఆ బాలుడు క్రమ క్రమంగా దొంగతనాని కలవాటు పడి, పెద్ద దొంగతనాలు చేసి, తుదకు పట్టుబడి, ఖైదులోకి వెళ్లుతున్నప్పుడు, తల్లి "అయ్యో నాయనా దొంగ పని ఎందుకు చేశావురా" అని ఏడ్చిందట. అప్పుడు వాడు, "తోటకూర నాడేల చెప్పక పోతివే తల్లీ" అన్నాడట. ఇది ఒక సామెతగా వ్యాపించింది. ఆరంభంలో స్వార్థపరత్వం చేతనో, అశ్రద్ధ చేతనో పిల్లలకు బుద్ధి చెప్పక ఆ పిల్లలు ఎక్కువగా చెడిపోయిన తర్వాత విలపించే పెద్దవారిని చూచి, ఈ సామెత అంటాము. చిన్నప్పుడు లొంగుబాటుకు రాని వాడు, పెద్దయినా తర్వాత మరి వచ్చేది అసంభవమన్న భావం "మొక్కయి వంగనిది మ్రానయి వంగుతుందా" అని సామెతగా అంటాము. ఆపద రాకుండా ముందుగానే జాగ్రత్త పడవలసిన విషయం, అశ్రద్ధ చేసి తీరా ఆపద వచ్చిన తర్వాత జాగ్రత్త పడ బోయిన వారిని చూచి "చెయ్యి కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నదట" అంటాము. ఎవరో ఒక స్త్రీ ఆకులు పట్టుకోకుండా గంజి వార్చబోయి, చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుని, ఉంటుంది. దానిని చూచి ఈ సామెత పుట్టి ఉంటుంది.

స్త్రీల సామెతలలో అనేకం అత్తా కోడండ్రకు సంబంధించినవే. అధికారం చెలాయిద్దామన్న అభిలాష మానవునికి సహజం. కన్న బిడ్డలపై తలిదండ్రు లిద్దరూ అధికారం చెలాయించినా, ప్రేమతో కూడుకున్న విషయం గనుక అధికారం దుర్వినియోగం కాదు. ఒకప్పుడు ఎక్కు-

వగా కోపించి దండించినా పిల్లలు భయభక్తులతో ఉంటారు గాని ద్వేషం కలిగించుకోరు.

కోడలు మరియొక యింటినుండి వచ్చినది. కన్నకూతురి మీద ఉన్న ప్రేమ కోడలిపైన అత్తగారికి సాధారణంగా ఉండదు. అధికార వాంఛ సాధారణంగా ఉండడం చేత అత్తగారు అడుగడుక్కీ కోడల్ని ఏదో విధంగా ఆక్షేపిస్తుంది. కోడలు కూడా అత్తగారు, తనను ఆక్షేపిస్తుందేమో అనే అనుమానంతో సంచరిస్తుంది. "అత్తవారింటి సుఖం మోచేతి దెబ్బ", "దయలేని అత్తకు దండం పెట్టినా తప్పే", అంటుంది. కోడంట్రికంపడ్డ కోడలే అత్తగారయ్యే సరికి, 'అత్తా ఒక యింటి కోడ'లన్న సంగతి మరచి పోయి, తన కోడలిపై తానున్న అధికారం చెలాయిస్తుంది. అంతే కాక తానెంతో కోడంట్రికం కష్టాలు పడ్డట్టు తన కోడలిని తానెంతో గారాబంగా చూచుకొంటూ ఉన్నా తనకోడలు తన మీద నేరాలుచెప్తూ కోడంట్రికం పడుతూన్నట్లు చెప్పుకుంటున్నదని అంటుంది. ఇది సాధారణంగా ప్రతి ఇంటిలోనూ కనబడుతూన్న విషయమే. పొరపాటున కోడలి కాలు తగిలి నూనె గిన్నె పడిపోతే "అంత కళ్లు నెత్తిని పెట్టుకుని నడిస్తే ఎలాగ?" అంటుంది, అత్తగారు. తానే ఆ పని చేసినప్పుడు, "త్రోవలో నూనె గిన్నె పెట్టుకుంటారా?" అంటుంది. అలాగే కుండలు బద్దల కొట్టినప్పుడున్నూ, "అత్తకొట్టిన కుండ అడుగోటికుండా, కోడలుకొట్టిన కుండ కొత్తకుండా" అనే సామెత పుట్టింది. అత్తా కోడళ్ళ సఖ్యత యిలా ఉంటుంది గనుకనే, ఒకరుండి ఒకరు లేక పోయినప్పుడు, కోడంట్రికం పెట్టిన దన్న రవ్వ అత్తకుండదు. కోడంట్రికం పడ్డానన్న గోల కోడలికుండదు. అప్పుడు యిద్దరూ మంచి వారనిపించుకో వచ్చునన్న విషయం, "అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలు లేని అత్త గుణవంతురాలు," అనే సామెతలో గోచరమవుతుంది. ఈ సామెతలు పూర్వకాలంలో పూర్తిగాను ఇప్పటికీ అక్కడా అక్కడా చాలా స్త్రీల విషయంలో యదార్థంగానే అన్వయిస్తూ ఉండినా, ఇప్పుడుకథ అడ్డంగా తిరిగినట్లు కన్పడుతుంది. స్త్రీ విద్య యిప్పుడిప్పుడు ఎక్కువగా వ్యాపిస్తూ ఉండడంచేత, అనేక కుటుంబాలలో అత్తగార్లకంటే కోడళ్ళే ఎక్కువ విద్యావతులుగా ఉంటున్నారు. మునుపటి లాగున కోడండ్లపైని అధికారం చెలాయించడానికి అత్తగార్లు భయపడు తున్నారు. కోడండ్లు అలాంటి అధికారం చెలాయించ నీయకుండా ఉన్నారు. అంతేకాదు, అత్తగార్లపైనే కోడండ్లు అధికారం చెలాయించడం కూడా జరుగుతూంది. "కొడుకుతో జెప్పి ఏం చేయిస్తానో చూడు" అనే కాలం కూడా పోయింది. విద్యావతులయిన భార్యలను వెనుక వేసుకుని తల్లులను మందలించే కొడుకులను చూచి, తల్లులు "పెళ్లాం బెల్లం" అంటారు. "అడ్డాలలో ఉన్నంత వరకే బిడ్డలుగాని, గడ్డాలు వచ్చిన తర్వాత బిడ్డలా" అంటారు. తల్లికి కొడుకుల కన్నా కూతుళ్ళే ఎక్కువ ఉపచారం చేస్తూఉంటారు. అందుచేతనే "కుంచమంత కూతురుంటే మంచం మీదనే కూడు," అనే సామెత పుట్టింది. తోడికోడళ్లకు పరస్పర ద్వేషం ఉంటుందన్న విషయం, "మొగుడు కొట్టేడన్న దుఃఖం కంటే తోడికోడలు దెప్పిందన్న దుఃఖం ఎక్కువ" అనే సామెతలోను, సవతుల పోరు విషయం "స్వర్గానికి వెళ్లినా సవతి పోరు తప్ప"దనే సామెతలోను కనబడుతాయి. "ఏడ్చిన దానికి మొగడువస్తే నాకు మగడు వస్తా"డన్న సామెత సవతుల విషయంలో పుట్టినదే. ఇది ఎప్పుడంటామో చూడండి, ఇద్దరు అపేక్షించే ఫలం ఒకటేఅయి అందులో ఒకరు కష్టపడుతూ ఉండడం రెండవ వారు ఉదాసీనులై ఊరకనే ఉండడంచూచి ఎవరయినా "ఏం నీవేం ప్రయత్నమైనా చెయ్యవు, నీ కక్కరలేదా ఆ ఫలం" అంటే, ఆ ప్రయత్నం చేసేవాళ్ళకు వస్తే తనకూ వస్తుందన్న భావం తెలియజేయడానికి ఏడ్చినదాని మగడువస్తే, తన మగడూ వస్తాడు అంటారు.

చాలా సామెతలు లోకంలో చెడ్డతనమును ఆక్షేపించడానికే పుట్టినవి. "ఇల్లు ఇరకాటం ఆలి మర్కటం" అని యిల్లాలి అలసత, పనిలో అశ్రద్ధచూచి మగవాడనే సామెత. చిన్నపనులు చేయలేక పెద్దపనులు చేయడానికి సాహసించే వారిని చూచి, "ఉట్టికెక్క లేనమ్మ స్వర్గాని కెక్కునా?" అంటాం. తన సౌఖ్యం ఎక్కువగా చూసుకుని మగని సంరక్షణ చూడని స్త్రీని చూచి "చల్ది కూడు తిన్నమ్మకు మగడి

అకలేం కావాలి" అంటారు. ఇంట్లో ఎప్పుడూ ఏదో దానికి కలహిస్తూ ఉన్నవారిని చూచి, "పోరులేని గంజి గుక్కెడయినా చాలు" అంటారు. కష్టజీవి తాను పడుతూన్న బాధను గుర్తింపక హేళనగా మాట్లాడే సుఖ జీవిని చూచి, "బిడ్డ కుట్టు గొడ్రాలికేం తెలుసు" అంటాడు. తప్పు తమదే అయినా నిర్దోషులను గద్దించే వారిని చూచి "మొగుడ్ని కొట్టి మొగసాలకు పోయిందట" అంటాము. ఎదటి వారి పచ్చచూచి ఓర్వలేక కుళ్ళుతూ ఉన్న వాళ్ళని చూచి, "సాటమ్మ సరిగ పెట్టుకుంటే ఊరమ్మ ఉరి పెట్టుకుందట" అంటాం. నడవడి మంచిది కాని స్త్రీల సామెతలు కొన్ని ఉన్నాయి. తల్లి చెడ్డగుణం బిడ్డకు ఉన్నప్పుడుచూచి, "తల్లి చాలు బిడ్డకు తప్పుతుందా?" అంటాం. "పండగనాడు పాచి మగడేనా?" "రంకు నేర్చింది బొంకు నేర్వదా?" చాలా కాలం చెడు ప్రవర్తనకు లోబడి ముసలి కాలంలో నీతులు చెప్పే వారిని చూచి, 'వృద్ధనారీ పతివ్రతా' అంటాము. ఏదో ఒక చిన్న పొరపాట్లు జరిగిన యింటివారిని గురించి పెద్దగా హేళన చేసి, రవ్వపెట్టే వారినిచూచి, ఆ యింటి వారు "ఇంటింటా ఒక మట్టిపొయ్యి మా యింటా ఒక మట్టిపొయ్యి" అంటాము.

దగ్గరగా ఉన్న వస్తువును చూడకుండా వెతుకుతున్న వారినిచూచి, "ఉయ్యాల్లో బిడ్డను పెట్టుకుని" ఊరెల్లా వెతికిందట" అంటాం. సుకుమారి వాళ్ళని చూచి "కమ్మని రోగాలు తియ్యటి మందులు కావాలి. వీళ్లకు" అంటాం. కష్టాలు ఒక దానికంటే ఒకటి ఎక్కువ కష్టమైనది కలుగుతే "గోరు చుట్టుపై రోకటిపోటు, తగిలిన కాలుకే తగులును, నొగిలిన కొంపే నొగులును" అనుకుంటాం.

కొన్ని సామెతలకు తప్పు అర్థం చెప్పతారు. "బాలానా రోదనం బలం" అంటే ఏడ్పుపిల్లలకు బలం యిస్తుందని కాదు, ఏడ్చే పిల్లలు సాధిస్తారు, ఏడ్పే వాళ్ళకు బలం అని అర్థం. "సింగినాదం జీలకర్ర" అనే సామెత ఏమీ లేదన్న భావంలో ఉపయోగిస్తాము, గాని చాలామందికి ఏమిటో తెలియదు. సింగిని అంటే గంటమీద దెబ్బకొట్టినాదం వచ్చేటట్టు గంట అంచు చుట్టూ తిప్పే కర్ర. ఆ కర్రకు నాదం ఉండదు. జీరక అనే సంస్కృతపదం తెలుగులో జీలకర్ర అయింది. గాని అది కర్రకాదు.

కొన్ని సామెతలు ఉపదేశములుగాను నీతి బోధకములుగాను ఉన్నాయి. "అనుసు ద్రాక్ష నేల కాలు కడగ నేల, ఎరువు సొమ్ము బరువుచేటు, నోరు మంచిదయితే ఊరూ మంచిదే, పేదవాని కోపం పెదవికి చేటు" మొదలయినవి యింకా చాలా ఉన్నాయి.

సామెతలు సాధారణంగా యతిప్రాసలు శబ్దాలంకారాలతో వినసొంపుగా, సూత్రప్రాయంగా తక్కువమాటలతో వేమన సూక్తులాగున తీసినకొద్ది అర్థంతోను భావంతోను ఉంటాయి. మానవతత్వం అనేక విషయాల్లో ఎప్పటికి ఒక్కలాగునే ఉంటుంది. కనుక కొన్ని సామెతలు నాటికి నేటికి సమంగా అన్వయిస్తాయి. అయినా సంఘ పరిస్థితులలోను, సంస్కృతిలోను, చాలామార్పు వచ్చినది. స్త్రీలలోను విద్య వ్యాపించినది కనుకను, నేడు కొన్ని సామెతలు స్త్రీలకు అంతగా అన్వయించవు. "ఆచారపు అచ్చమ్మలు, చాదస్తపు చెల్లమ్మలు" యిప్పుడు తక్కువయినారు. కొన్నాళ్లకు మరి ఉండక పోవచ్చును.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో]



పెక్కుమంది సోదరీమణులు తమ రచనలతో పలుమార్లు మా ఆంధ్రమహిళను అలంకరించారు. మే నెలలో ప్రచురింపబోయే జన్మదిన సంచికలో రచయితల ఫోటోలు ప్రకటిస్తున్నాము. దయతో, ఏప్రిల్ 15-వ తేదీలోగా, వారి ఛాయాచిత్రములను పంపిన, బ్లాకులు తయారు చేయించుకుని ప్రకటింతుము. త్వరలో పంపవలసినదిగా కోరుచున్నాము. సం॥

# వియోగం

* శ్రీమతి పి. యస్. సుదేష్ణ *

"......నా ఇంట్లో నీకు చోటు లేదు. నీ ప్రియుని దగ్గరికే వెళ్లు, పో—ఇంకెప్పుడయిన ఈ గడప తొక్కావంటే నీ ఒంట్లో ఊపిరుండదు జాగ్రత్త!"

కన్న తండ్రే ఈ మాటలన్నాడు. ఇంక ఆమేమి చేస్తుంది. తల్లికూడ నాన్నకు భయపడుతుంది. భర్త కర్త కఠోరమైన మాటల్తో కూతుర్ని తిట్టిపోస్తూంటే, పెదవి కదల్పక, కడుపు నుంచి పొంగివచ్చే దుఃఖాన్ని దిగ మ్రింగుతు, చూస్తూ వుంది.

"తండ్రితో పోట్లాడి ఇంటినుంచి వెళ్లితే లోకమేమను కొంటుంది! ఇంట్లో కూర్చుని ఎన్ని అకృత్యాలు చేసినా, పాడులోకము కన్నుమూసు కొంటుంది. బహిరంగంగా ఎంత నిష్కల్మష హృదయముతో ప్రవర్తించినా, లోకం ఆ యువతి శీలాన్ని అనుమానించి ఆమెను నడివీధి కీడు స్తుంది. ఇదేమి న్యాయం? నిజంగా దేవుడుంటే ఇన్ని అన్యాయాలు జరుగుతాయా? ప్రతి ప్రాణికీ జీవాధారం లభించి, ఈ జానెడు పొట్టకేకూడు లేకపోతుందా?...... ఆత్మ హత్య!!!!......కూడదు—చచ్చి సాధించ గలిగే దేమీ లేదు. నాకీ జీవితంలో విరక్తి గలుగ లేదు. కలగడానికి అవకాశం ఏది? నా చదువు నిష్ప్రయోజనము. కాలేజీ, ఇల్లు తప్ప ఇంకే చోటికైనా పోనిచ్చారా నాన్న? నేను "ఆగాఖాన్ పాలెస్"నందుండిన మహాత్మా గాంధీజీవంటి డిటిన్యూ. ఇక మీదనైన స్వేచ్ఛగ ప్రవర్తించడానికి వీలుంటుంది. నేను ఎవరిని లక్ష్యపెట్టను. నా మనస్సునే అనుగమిస్తాను..."అనుకొంటూ, మనస్సు పరిపరి విధాల లాగుతుంటే, ఏకధారగా కార్తున్న కన్నీటిని తుడుచు కొంటూ, తండ్రికి జవాబైన చెప్పక, దీనంగా తనవైపు చూస్తున్న తల్లికి కళ్ళనుంచి హృదయ పూర్వక నమస్కారము చేసి, వీధి గుమ్మం దాటింది.

ఆమె లలిత. బందరు నివాసియగు అడ్వొకేటు రామరావుగారి కుమార్తె. రామరావు ఇంటపులి, బయట పిల్లి. లలితంటే అసహ్యం. అందుచేత యుక్త వయస్సు వచ్చినా వివాహంకాలేదు. కాని అతడు ఒక పుణ్యం మాత్రం గట్టుకొన్నాడు. లలితను ఆ వూరి హిందూకాలేజియందే బి. ఏ. దాక చదివించాడు. లలితలో అందచందాలు ఉట్టి పడుతున్నాయి. నవ్వులొలుకుచు నక్షత్రాల్లాగ మెరుస్తూన్న కండ్లు, చిన్ని నోట్లోనుంచి తొంగి చూచే పలువరుస;— ఇంతకు లలిత నగ్నశోభ (పౌడరు, లిప్‌స్టిక్ నుంచి రాని అందం). ఏ కాలేజి విద్యార్థిని ఆకర్షింపకుంగును!

ఇట్లు ఆకర్షింపబడిన వారిలో రాజశేఖర్ ముఖ్యుడు. అతడే లలిత హృదయాన్ని, అయస్కాంతములాగ ఆకర్షింప గలిగాడు. శేఖర్ రెడ్డికులజుడు. ఉత్తముడనదగిన వాడు. లలితా శేఖరులు బి. ఏ. వరకు క్లాస్‌మేట్స్. వారి స్నేహం ప్రణయంగా పరిణమించిది.

విశ్వవిద్యాలయ పరీక్షలు ముగిసినాయి. లలిత-శేఖరు, లిద్దరు బాగా వ్రాశారు కాబట్టి పాస్ అవుతా మను కొన్నారు. అతడింక స్వగ్రామాని కెళ్లాలి. లలిత సెలవు పొందడానికి ఆమె ఇంటికి వచ్చాడు.

సూర్యుడు వీరి ఎడబాటును చూడలేక తలవంచుకొను చున్నాడా అన్నట్లు కొండమాటుల్లోంచి పడమట సముద్రం లోనికి జారుచున్నాడు. గది కిటికిలోనుంచి లలితా-శేఖరులు ఆ దృశ్యాన్ని పరికిస్తూ, సూర్యునే సాక్షిగా నిడికొని, ఎన్ని కష్టాలు గలిగిన వివాహము చేసుకొంటామని తీర్మానించుకొన్నారు.

ఇంతలో రామరావు కోర్టునుంచి ఇంటికొస్తూ, ఎవరిదో మగగొంతు వినబడితే అనుమానించి, తెరచివున్న లలిత గది లోకి తొంగిచూచి నిర్ఘాంతపోయాడు. మానవ ప్రతిబంధకములు ప్రేమోత్పత్తికి అడ్డంకులు కావని అతడు తెలిసికోలేక పోయాడు. మనిషిని బంధించినా మనస్సును బంధింప లేరని అతడెరుగడు. కళ్ళల్లో నిప్పులు గ్రక్కుచు, లలితను ఇంట్లోకి లాక్కెళ్లాడు. రాజశేఖర్ నాటి సంఘటనను గురించి విచారిస్తూ, తన గ్రామం వెళ్లిపోయాడు.

రాత్రి అయింది. ఆ వూర్లో లలితకు బంధువులు, స్నేహితులు బోలెడు మందున్నారు. వాళ్లెవరి దగ్గరకు వెళ్ళ గూడదను కొన్నది లలిత. వీధిలో పోతూ, పోతూ, చేతిలో వున్న గాజొకటి అమ్మేసి డబ్బుతీసికొని స్టేషనుకు వెళ్ళింది. తానేం చేస్తున్నది తనకే తెలియడంలేదు. కలకత్తా టికెట్ కొనడము, రైలెక్కి ఎవరులేని స్త్రీల కంపార్టుమెంటులో కూర్చోడం, రైలు స్టేషను వదలడము—నిమిషాల మీద జరిగి పోయాయి.

ఎన్ని స్టేషనులు దాటిందో, ఎన్నిచోట్ల రైలాగిందో ఆమె గమనించలేదు. తనకుగలిగిన అవస్థను తలంచుకొంటూ, బయట చీకటినిచూస్తూ, కళ్ళవెంబడి వేడినీళ్ళను కార్చుతు కూర్చుంది. చల్లటి హస్త స్పర్శ—లలిత అదరి పడింది. "సోదరీ "అన్న మాటలను విన్నది. కండ్లు తుడుచుకొని చూచేసరికి, ఎదుట ఒక స్త్రీ నిలిచి వున్నది. ఆమెకు దాదాపు నలభై, ఏళ్ళుండొచ్చు. చుడ్డానికి గొప్ప యింటి స్త్రీలాగ కనబడింది. లలిత వైపు చాలా జాలి కలిగిందా విడకు. క్రమంగా లలిత చరిత్ర తెలిసి కొన్నది. తన పేరు రమణియని, కలకత్తాలో వున్నానని చెప్పింది.

కలకత్తా! కూలీ! కూలీ!! కలకత్తా స్టేషన్!! వచ్చేశింది కలకత్తా. లలితను తన ఇంటి కాహ్వానించింది రమణి. "నా "అనే వారులేని ఆ మహాపట్టణములో, మాతృ వాత్సల్యముతో రమ్మని పిలుస్తుంటే పోక పోవడమా? టాక్సీ చౌరంఘీ వీధిలో గొప్ప భవనము ముందాగింది. లలితకెందుకో ఆ ఇంటి వైఖరి చూచేటప్పటికి తీరని అనుమానం కలిగింది. వ్యభిచార గృహమని పోల్చుకొంది.

తానెందుకా వూరికి వచ్చిందో, ఏం చేస్తుందో కూడా తెలియని స్థితిలో కలవరపడ సాగిందామె. రమణి ఎన్ని విధాల బతిమాలినా గదినుంచి కదలలేదు. రాత్రి అన్నం తినలేదు. నిద్ర శాంతిని చేకూర్చగలదని, పరుండినది. నిద్రాదేవత ఆమెను ఆవేశించింది. క్రింద గదుల్లోమాత్రము గందరగోళంగావుంది. వింత వింత రంగుల ఎలెక్ట్రిక్ దీపాలు రంగురంగు కాంతుల ప్రసరించుచుండెను.

లలిత తలుపు గొళ్ళెంపెట్టడం మరచిపోయింది. సుమారు 11 గంటలై యుండొచ్చు. ఎవరో వాకిలి తెరచినట్లు కిర్రుమన్న శబ్దమయినది. ఆమెకు మెలుకువైంద. కళ్ళు నులుముకుంటు లేచి చూస్తే, ఎదుట పాతికేళ్ళ యువకుడు తన వయిపు వికటాట్టహాసముతో చూస్తూ తూలుతుండెను. నోరు బ్రాందీకంపు. లలితకతన్నిచూస్తే సంకోచము, జాలి, భయము, అసహ్యము గలిగినవి.

"ఇదిగో! చూడు! నిన్నే-నే నెవరో తెలుసునా? నా పేరు రామచంద్ర. నా కంటె ధనికులీపట్టణములో లేరు నీవెవరైతే నాకేం! నీవు అందకత్తెవని, గాయకురాలవని, విద్యావతివని, ఒక రాత్రికే నా వద్ద నూరు రూపాయలు పుచ్చుకొని, నిన్ను నావశం చేసింది రమణి. ఇంకా ఏమేమో వాగుతున్నాడు.

గుండెల్లో దడ పుడుతున్నా, లేని ధైర్యం తెచ్చుకొని తన వృత్తాంతాన్ని గద్గదస్వరంతో తడబడ్తు చెప్పతుంటే-రామచంద్ర రెప్పవాల్చక ఆమె నోటివైపే చూస్తూ, వంగి ఆమె మంచంమీద ఒకకాలుంచి వింటుండెను. బ్రాందీ కయిపు తగ్గింది. విద్యావంతులకు కూడ ఇటువంటి అవస్థలు గలుగుతాయంటే, నిరక్షరకుక్షియగు రామచంద్ర కాశ్చర్యమేసింది. అతని ఎఱుకలేకుండనే మార్పొకటి అతనిలో గలిగింది. వెంటనే లలితతో ఇట్లు చెప్పాడు: "సోదరీ! నేను మునుపటి వాడినికాను. నీ గాథ నాలో పరిణామాన్ని గలిగించింది. రమణిచే మోసగింపబడినావు. అది వారకాంత నీకు ఇక్కడ్నుంచి తప్పించు కోవాలనియుంటే తత్క్షణం వెళ్లు."

అతనికి తన కృతజ్ఞతను ఆనందాన్ని చూపిస్తు ఒక చిరునవ్వు విసరి, సెలవు పుచ్చుకొన్నది.

భయంలేకుండా కారు చీకట్లో చరచర నడచి సముద్ర తీరము వైపు పోతున్నది—లలిత. టంగ్! టంగ్!! టంగ్!!! మని మూడు గంటలు మ్రోగినది. ఎక్కడికి పోయిన విధి తనకు ప్రతికూలుడుగానే వుంటాడని, మరణమే శాశ్వతానందాన్ని చేకూర్చ గలదని ఆమె తలచింది. సముద్రతీరంలో నిలుచున్నది. ఆలస్యమయితే, రమణివంటి వ్యక్తుల కళ్ళలో పడాల్సివస్తుందేమో అని జడిసింది. ఒక నిమిషం ఆమె ఆత్మమరల ప్రపంచంలో జీవించ

మని బోధించింది. సముద్రుడు కాల రూపములో గర్జిస్తు ఆమెను తన లోకాని కాహ్వానించాడు.

దూరాన్ని ఏదో నీడ తన దిక్కుగా వస్తున్నట్టు లలిత గ్రహించి, తాను ఆ వైపే నడక సాగించింది. రెండునీడలు ఆ చీకట్లో మిళితమై పోయాయి—"లలితా"!—"శేఖర్"!

ఇరువురు ప్రపంచాన్నే మరచిపోయారు. అసంభవమను కొన్నది సంభవించింది. "శేఖర్"ఇక్కడి కెట్లొచ్చావ్! అని అడిగితే శేఖర్ లలితతో ఈ విధంగా చెప్పాడు. "లలితా! నేను వూరికి పోతుంటే రైల్లో ఇంపీరియల్ బ్యాంకు మానేజరుతో మాట్లాడటం తటస్థించిది. అతడు, కలకత్తా బ్రాంచిలో ఆడిటర్ పని ఖాలిగావుందని, నన్ను ఆ పనికి అంగీకరించమన్నాడు. సరే నన్నాను. తీరా ఇంటి కెళ్ళే సరికి మా నాన్నకు మన ప్రేమవృత్తాంత మెట్లా తెలిసిందో కాని, నేను గుమ్మం తొక్కకముందే, బయటికి గెంటి, తన ఇంట్లో వుండవీల్లేదన్నాడు. ఇక్కడి కొచ్చేశా. రెంకువందల జీతంపైన ఉద్యోగాన్ని అంగీకరించా. కానీ, లలితలేని ప్రపంచం శూన్యమనిపించింది. డబ్బు సంతోషాన్ని చేకూర్చజాలదనియు, ప్రేమలేని మానవుని జీవితము ఎండిన చెరువుతో సమానమనియు, గ్రహించాను. నిన్ను చూచే భాగ్యం కలుగుతుందనే ఆశ నశించింది. మరోలోకంలోనైనా నిన్ను కలిసి కొంకామని, ఆత్మహత్యకు సిద్ధపడి ఇక్కడికొస్తే దూరాన్ని నీడ అగుపించింది. ఎవరై యుంటారా! అని సమీపిస్తే—నా లలిత—మనం చావాలని దేవుని ఉద్దేశము కాదు, లలితా! రా మన యింటికిపోదాం"

మందమారుత మొకటి లలితా—శేఖరుల నాశీర్వగిస్తు, సముద్రపునీటి తుంపురులు, వారి మీద రాల్చింగి. పక్షులు ఒకటొకటే మేతకొరకు బయలుదేరుతున్నాయి. సూర్యునికి మెలుకువైంది. లలితా—శేఖరులను భార్యా భర్తలుగా చేశాడు, ఆపద్బాంధవుడు......దినకరుడు... ..



# యోగ్యత!

శ్రీమతి వి. యస్. ఆర్. నాయికమ్మగారు

ఫలము నాశించి సాఫల్య పదము లెపుడు
మూలగూర్చుని పాడిన - ముదమొసంగు
ఫలిత మదిమాత్ర మెన్నడు పొందలేరు,
యోగ్యతను ఫలమునుబొంది యోగ్యులగుడు!

*　　*　　*

పెద్దవారల చేయూత పేరుకేని
మది దలంచక ముదమున మందగతిని
పడుచు లేచుచు పయనించు బాలపాప
లందు యోగ్యత గాంచుడు లక్షణముగ!

*　　*　　*

పరుల సహకార మాశించు ప్రజలకెపుడు
క్షణిక సుఖానందంబను కాంక్ష ప్రబలి
బద్ధకంబను రుగ్మత పట్టుగాని
యోగ్యతను దానికి వార యోగ్యులగును!

*　　*　　*

ఘోరయాపద లన్నింటి గోటమీటి
వచ్చి పైబడు కష్టాల, వమ్ముసర్చి
ప్రగతి పథమున బెదరక పయనమగుటె
నవయుగ ప్రవక్త బాపూజి నమ్మినట్లు!

*　　*　　*

పరుల సహాకారమీడిన బలముకలుగు
ఆత్మవిశ్వాస మద్దాని యండనుండు
మదిని పీడించు భూతాలు మాయమగును
యోగ్యతకు సాటి ధరణిలో యేదిగలదు?



# మాలతి కాపురం

శ్రీమతి: చంద్రిపట్ల రతకీర్తి గారు

వేసవి కాలం సాయంత్రం అవుతున్నది. ఎండయింకా తగ్గలేదు. మాలతి ఆ సంవత్సరమే స్కూలు ఫైనలు ప్యాసయింది. ఇంకా కాలేజీలు తెరవలేదు. ఏం తోచడం లేదు. కాసేపు స్నేహితురాలి యింటికి వెళ్ళి రేడియోతోనైనా కాలక్షేపం చేసివద్దామని బయలుదేరింది. ఇంతలోకి తండ్రి గారి గొంతుక వినిపించింది.

"అమ్మాయికి పెళ్ళివారు వస్తున్నారు కాస్త జాగ్రత్తగ వుండండి" అని

మాలతి తల్లితోటి నాయనమ్మతోటి గాబోలు చెప్తున్నారు.

"అయితే పెత్తనం సాగినట్టే" అనుకుంటూ అల్లాగే కూర్చుండి పోయింది.

* * *

పెళ్ళివారువచ్చి హాల్లో కూర్చున్నారు. నలుగురు మగవాళ్లు యిద్దరాడవాళ్లు వచ్చారు. కబుర్లతోటి నవ్వులతోటి హాలు ఎగిరిపోతోంది. మాలతివచ్చి పెళ్ళి కుమారుని కెదురుగుండా చాపమీద కూర్చుంది. పెండ్లి కుమారుడు ఖద్దరు పంచె ఖద్దరులాల్చీ వేసుకున్నాడు. కాళ్లకుపైరు జోళ్ళు, తల నున్నగా గుండుకాక క్రాపింగువుంది. వెనకాల చిన్న పిలక! అతడు వీళ్ల సంభాషణలో జోక్యం కలిగించుకోడం లేదు కదా, తక్కిన వాళ్ళంతా ప్రతీమాటకీ ఈ చెవినుంచి ఆ చెవివరకూ నవ్వుతుంటే ఇతనికి చిరునవ్వైనా లేదు ముఖంమీద.

తన చూపులబండీ ఏమైనా పట్టాలు తప్పుతుందేమో నని నాలుగైదు సార్లు కంటి చివరనుంచే పరిశీలనగా చూసింది మాలతి. అబ్బాయిమాత్రం ఒక్కసారి తనకేసి చూచినట్టే లేదు. కుర్రవాడు బాగానేవుంటాడు పాతికేళ్ళుంటాయి.

వంశాలు, వంగడాలు, ఆస్తి పాస్తులు, వుద్యోగాలు, తాతలహోదాలు, ఒకళ్లకొకళ్లు తెలియబరచుకునేసరికి రాత్రి ఎనిమిది అయింది. పెండ్లివారు వెళ్లిపోయారు. తండ్రిగారు లోపలికి వచ్చిచెప్పారు. "పిల్లవాళ్లకు నచ్చిందిట. మన కూ్కడా నచ్చితే తాంబూలాలు పుచ్చుకునే వెడతారట. కట్నంకూడా మనమిచ్చే మూడువేలు కాక మరో వెయ్యి పెంచారు. పోతే పోయింది. మళ్ళీ యిటువంటి సంబధం రాదు. మాలతి నడిగిచూడండి, తాంబూలాలు యిచ్చేద్దాం" అని

మాలతి నిర్ఘాంత పడింది తండ్రి అసలే పట్టుదల అయిన మనిషి. ఆయన కిష్టమైనపనికి ఆ యింట్లో యెవరూ యెదురుచెప్పడానికి వీలులేదు. ఇప్పటికే అయిదారు సంబంధాలు దాటిపోవడం జరిగింది. ఈ సంవత్సరం పెండ్లిచేసి తీరుతానని ప్రతిజ్ఞచేసి కూర్చున్నారు మాలతి తండ్రిగారు. ఇప్పుడు తను కాదంటే విరుచుకు పడతారు. ఏమైనప్పటికీ పెండ్లి అంటే జీవితాంతం వుండే సమస్య. అంత చులకనగా వప్పుకునేందుకు వీలులేదు. అయినా "ఆలోచిద్దాంలే" అని మాలతి నాయనమ్మగారితో నెమ్మదిగా అంది.

"ఇంకా యెన్నాళ్ళు ఆలోచిస్తావమ్మా! ఇంటావంటా లేదు సమత్తాడి యిళ్ళబడి వుండడం. ఇంకా పెద్దకట్నాలిచ్చి వొరగదోసేందుకు నువ్వొక్కదానవే ఒంటి కాయ సొంటి కొమ్ముపుకాదు గదా! ఒప్పుకో అమ్మా ఒప్పుకో" అని నాయనమ్మ సాగదీసింది.

"బామ్మా ఆ పెళ్లి కొడుకు చాదస్తం మనిషిలా వున్నాడు. ఆ జుట్టు పిలక ఏమిటి? ఒక్క మాటైనా మాట్లాడలేదు. నాన్నగారేదో అడిగితే ఛర్రుమంటు సమాధానం చెప్పాడు. అదేమిటి బాబూ" గారం గుడుస్తూ అంది.

"నచ్చక పోవడ మేమిటే వెర్రినాగీ. సంబంధానికేం చక్కగావుంది. రేపో మాపో లెక్చరరీ అవుతుంది. తిండి గింజలకు లోటులేదు. రెండు సొంత లోగిళ్ళాయిరి. ఆడ బడుచులు అత్తవారిళ్ళ కెళ్ళారు. ఇదంతా నీ అదృష్టం

చూసుకో. తల్లి క్రిందలు తపస్సు చేస్తే పుట్టుకకు మనకిటు వంటి మనువు వస్తుందటే! కట్నంకాస్త యెక్కువని మన సంబంధానికి తలలొగ్గారట. సంబంధం చక్కగావుంది."

మాలతికి అసలు కట్నం యిచ్చి పెండ్లి చేసికోవడం సుతలాము యిష్టంలేదు. వాళ్ళస్కూలులో డిబేటింగుమీటింగ్సులోను వూళ్ళోయింకా చిన్న చిన్న సభల్లోను వరకట్నాలను చక్కగా నిషేదించింది. అయితే ఈ రోజుల్లో కట్నం యివ్వందే పెండ్లిఅవదు. ఏంచేస్తుంది.

"సంబంధం మాటకాదు బొమ్మా నే అనేది. చిన్నవాడి మాట."

"కుర్రాడా, ఏం వంకరొచ్చిందీ కన్ను ముక్కు తీరుగావుంటేనూ! చిన్నతనంలో కస్సుబుస్సు మంటారు. దానికేమిటి! అందులో కాస్తవున్న వాళ్ళేమో హోదాగా వున్నారు."

"సరే నీ యిష్టం" అని నోరు మూసుకుంది మాలతి.

"అసలే జబ్బుమనిషిని అమ్మా! ఎప్పటి దప్పుడవుతే మంచిది. వీలయితే సాధ్యమయినంత వరకు ఆ సంబంధం రయిటు చేయం"డని యిదివరకే అన్నగారు వ్రాశారు.

ఇంట్లో అందరి వోట్లూ అటు వయిపే పడ్డాయి. తను ఒక్కతే ఏం చేస్తుంది? తను ఎంత విద్యావతి అయితేనేం? తన మొర ఎవరూ ఆలకించే పద్ధతిలో లేరు. వివాహం! ఆ జన్మాతం ఆదరించి రక్షించే సౌభాగ్యాన్నిచ్చే భర్త వాణీసుతుడై, అలంకారుడేయి, ముసిముసి నవ్వులతో తన్నావహ్వానించే కన్గవలోవున్న ఆ అవతారమూర్తి అడుగు జాడల్లో మసలి తనజన్మను ఆనందమయం చేసికుందా మనుకున్న మాలతి, ఒక్కక్షణం కూడా ఆలోచించుకొని తన అనుమతిని యిచ్చేందుకు వీలులేకుండా "వూ" అన వలసి వచ్చింది. ఆ నెలలో మాలతి వివాహం జరిగింది.

కులగురువుల ఆశీర్వచనాలు, అమ్మలక్కల వ్యాసాలు అయ్యేటప్పటికి రాత్రి పదకొండు గంటలైంది. పెళ్లికొడుకు పందిరి మంచంమీద వెల్లగిత్తలా పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. మాలతివెళ్లి మంచం దగ్గరగా నుంచుంది. మాలతి అనుకున్నట్టుగా భర్తచూపు కఠినంగాలేదు. అసలు ఆ చూపే లేదు. మెరసిపోయే కళ్లలో మాలతికేసి చురచురా చూస్తున్నాడు. తను పొరపాటు పడిందేమో! తన ప్రియుడు ప్రేమమూర్తియే గాబోలునని మనసులో అనుకుంది మాలతి.

"ఏయ్ ఆ పాలుయిల్లా పట్టుకురా." అగుగులో అడుగు వేసుకుంటూ వెళ్లి పాలగ్లాసు తీసుకొని వచ్చి అందివ్వబోయింది. అతను చెయ్యిచాపాడు. ఆమె వెనక్కి తప్పింది.

"ఏమిటా వేషం యిస్తావా? యివ్వవా" ఉరిమాడు పెళ్లికుమారుడు.

పాలగ్లాసు వెంటనే చేతికిచ్చి నుంచుంది. గబగబాఅన్ని పాలు తాగేసి "ఈకసిన్ని తాగి పడుకో అక్కడ చాపవేసుకుని. నాకు నిద్దరొస్తుంది. ముందొక్కకునుకు తీయాలి" అని పడుకోబోతుంటే,

"తమల పాకులు రాసి యివ్వనా"అంది మాలతి.

"అక్కరలేదు"

"ఎకానమీ గాబోలు"

"ఏడిశావులే నోరుముయ్యి"

మాలతి గతుక్కుమంది. అంత కోపం ఏమిటి బాబూ! ఇతనితోనే నా తను ఊహా ప్రపంచంలో కట్టిన ఆశాసౌధాలను సత్యం చేయడానికి పూనుకునేది. తను ఆశించిన కోర్కెలు, అనుకున్న ఆశయాలు అన్నీ మంట కలవ వలసిందేనా! "భార్యఅంటే బానిసకాదు కొట్టి తిట్టి చంపడానికి. భర్తకున్నంత హక్కు భార్యకూవుంది" అనే తెరగతి లోది. అయినప్పటికి మాలతి భర్త ఏమైనాఅంటే భార్య పడిందుకు లేశమాత్రం అవసరం లేదనే మొండి ఘటం కాదు. అయితే మొదట్లోనే యింత అధికారమా! పుస్తికట్టిన యీ యిరవైనాలుగు గంటల పరిచయంతప్ప మరేవిధమైన సంబంధము వారిద్దరి మధ్యనూ లేదే! ఒక వేళ స్వభావమే అంతేమో! కొంతమంది పైకి అలావున్నా లోపల వెన్నలా వుంటారట. సంతృప్తిపడి వూరుకుంది మాలతి.

* * *

అది మూడోసారి మాలతి అత్తవారింటికి వెళ్లడం. మాలతి అయితే అత్తారింటికి వెళ్లివచ్చింది కాని మాలతి

భర్తమాత్రం ఒక్కసారి కూడా తానయి రాలేదు. ఏ గొప్పా, ఎన్ని పండుగలకు రమ్మనమని మామగారు ఉత్తరమ్ములమీద ఉత్తరాలు వ్రాసినా రాలేదు. ఇంకేమి రెండు నెల్లు వెళ్లి వచ్చినా భీతివదలలేదు మాలతికి! మాలతికి అక్కడున్నందే హక్కులు గుండెల్లో మెదుల్తూనే వున్నాయి. భర్త తనతో ఎక్కువగా మాటలాడడు. సరిగా పళ్ళుతోముకునే పుల్ల గాని గడ్డం గీసికొనే బ్లేడుగాని (అసలు తను మంగలివాడి చేతనేగాని ఏ వాడినీ తనకు తాను గడ్డంగీసికోడు లెండి,) తల దువ్వేందుకు గాని పట్టుపంచెగాని యివ్వడమేమీ లేదు. అసలు అతను అడగలేదు. ఈమె చేయలేదు. అడిగితే ఎందుకు చేయదు! తనకు మాత్రం సరదా లేదా? ఎవరయినా అడిగిందీ చేస్తారా? తొలిసారి అడిగితే మలిసారి తానే చేస్తుందిగా. అసలుమాటే అడడు. ఎంతమంది భర్తలు సరసాలాడుతూ సపర్యలు చెయించుకోవడం లేదూ భార్యల చేత. ఏదైనా సిగ్గువిడిచి మాలతి చేయ బోయినా అతడు వద్దంటాడు ఏమో! ఎప్పుడు ఒకలాగే వుంటారా? ఈ సారి సరదాగా వుండకూడదూ, ఏమైనాగాని తను భార్య కాక పోతుందా? అతడు తన భర్తకాక పోతాడా?

ఆనందం లేక పోయినా అత్తవారింటికి వెళ్ళడం తప్పింది కాదు. రాత్రి పొద్దుబోయింది వెళ్ళేటప్పటికి. భర్త ఎక్కడికో వెళ్ళాడట. యింకారాలేదట. అంతకంటే యెక్కువ తెలియదంది అత్తగారు. దిగబెట్టేటందుకు వచ్చిన తమ్ముడు తిరిగి ఆ బండికే వెళ్ళిపోయాడు.

తెల్లవారి కొంచెం పొద్దు ఎక్కిం తర్వాతనే మెలకువ వచ్చింది మాలతికి. ఇదివరకు అలవాటు ప్రకారం దొడ్లోకి వెళ్ళి గబగబా పళ్లుతోముకొని వచ్చింది. అత్తగారు ఏం జేస్తున్నారా అని వంటయింటి కేసి వెళ్ళింది. తలుపులు వేసివున్నా పొగ దిట్టంగావస్తుంది. తలుపులు తీసి చూచింది.

మాలతిభర్త ఎప్పుడు వచ్చాడో ఏమో! చిరుగులున్న పట్టుపంచ కట్టుకుని చద్దన్నం తింటున్నాడు. ఆవకాయ అన్నము కారంగాబోలు, కళ్ళమ్మట నీళ్లు వస్తున్నాయి. ఆపైన దిట్టంగా కమ్మిన పొగ ముక్కు, కళ్లు ఏకమై పోతు న్నాయి. ముద్దలు గబగబా మింగుతున్నాడు. మజ్జిగగిన్నె ఒక ప్రక్క, అంట్లగిన్నెలు ఒక ప్రక్క పెట్టి వున్నాయి. కళ్లు మూసుకొని అట్లాగే పడుకున్నాడు. వాకిలి తలుపులు కిర్రుమని చప్పుడైతే "ఎవరూ" అని చూస్తే అది వంటింటి మాలతి.

"తలుపులు తీస్తే అపశకునం ముండ ఎదురుగా! కొత్త కిరస్తాని కూడా చేయదు ఇలాగ. మీ బాబుకు మీకూ ఇల్లా బాబు!" అని రుయివుగా సమాధానం యిచ్చాడు.

కాలేజికి వెళ్ళేముందు హారాయిక్ చేతిలో పోసుకుని దంతపుదువ్వెన అద్దం పట్టుకుని తలదువ్వుకొంటూ ఏమ్మన మంది భర్తని.

మాలతి మొగుడు చిన్నపంచ ఒకటి కట్టుకుని వున్నాడు. "ఆ గుడ్డతోనేగా, నాదివడబట్ట. నన్ను ముట్టుకోకు" అన్నాడు.

చాదస్తానికీ చదువుకీ ఎక్కడా సంబంధంలేదు. ఆ చిరిగి పోయి మాసిపోయిన పట్టుపంచ కట్టుకోకపోతే శుభ్రంగా వుతికినబట్ట కట్టికొని తినకూడదూ. అంత చదువు చదువుకున్నారు ఆ చాదస్తమేమిటి? తడిగుడ్డ కట్టుకుని మరీ కాలేజీ బట్ట కట్టుకుంటారు. అంత మంచి వుద్యోగంలో వున్నారు. అంగవస్త్రం కట్టికోవడం ఏంకర్మం? స్టూడెంట్సు చూస్తే నవ్వరూ? తనని ఓ మాలదాన్ని చూసినట్టే చూస్తున్నారు యింటిలో వాళ్ళందరునూ. ఎల్లా బాబు కాపురం చేయడం. తనలో తానే ప్రశ్నించుకొని బాధపడింది మాలతి.

ఆడబడుచు కూతురు పుట్టినరోజుకు వూళ్ళో అమ్మలక్క లంతా వచ్చారు పేరంటానికి. మాలతి చక్కగా పాడుతుంది. సంగీతపు పోటీ పరీక్షలో ఫస్టు ప్రైజు కూడా వచ్చింది. అందరూ పీక్కు తిన్నారు ఏవన్నా పాడమని. మాలతి ఓ భావగీతం పాడింది. అంతా చాలా బాగుందని మెచ్చుకు న్నారు. పక్కగదిలో కూర్చుని మాలతి మొగుడు విన్నాడు. గదిలోకి రాగానే "ఏమిటా పేధవ కిరస్తాని పాట, పల్లవి లేదు చరణం లేదు" అని విసుక్కున్నాడు. భర్తకు భావ కవిత్వంమంటే యిష్టం లేదేమో! అవును చాలమంది పండితు లకు భావకవిత్వం అంటే కిట్టదు.

మర్నాడు మాలతి మొగుడు కాలేజినుంచి వచ్చే సరికి ఫిడేలు మీద త్యాగరాయ కృతి పాడుతోంది మాలతి.

"ఏమిటా చెదవ పాటలు అస్తమానం బోగించానిలా ఎన్నేకదా పాడొద్దని చెప్పాను. బుద్ధిలేదు?" అసలు సంగీతం అంటేనే భర్తకుకిట్టదు గాబోలు పోనీ మానేస్తానని అనుకుంది మాలతి.

ఓసారి మాలతిమొగుడు రాత్రి పన్నెండయినా యింటికి రాలేదు. వస్తున్నాడేమో చూద్దామని డాబాపైకి వెళ్ళింది. దూరంనించే భర్తరాక గమనించింది. గబగబా కిందికి వచ్చి వీధితలుపు గడియతీసి అరుగుమీద నుంచుంది. అతడు గబగబా రాకడంచూచి తనకోసమే గాబోలు గబగబా వస్తున్నాడు అనుకుంది. వెన్నెల మీద పడుతోంది. తెల్ల జరీ చీరకట్టుకుని నీలంచు తెల్లరవిక తొడుక్కుని తలలో పూలు పెట్టుకుని పచ్చనిఛాయగల మాలతి వెన్నెలలో మిలమిలా మెరసి పోతోంది. మొగుడు వుండబట్ట లేక పోయాడు. వస్తూనే అడిగాడు. "ఎవరికోసం ఇలా అర్ధరాత్రి ముస్తాబై కూర్చున్నావు. ఎవరైనా...వస్తానన్నారా? ఇక్కడనుంచున్నావు?" మాలతి గిర్రుమని వెనక్కి వెళ్లి పోయింది యింటిలోకి. మర్నాడు పొద్దున్న మాలతి కనిపించలేదు.

"మీ అమ్మాయి అర్ధరాత్రి యెవరితోనో లేచిపోయింది" మాలతి మొగుడు మామగారికి కార్డు వ్రాశాడు. మరి రెండురోజులకే మాలతిశవం నదిలో తేలింది.



# భయము

శ్రీమతి టి. జి. హైమవతిగారు

భయము అనేది యేమి? అదెటువంటి వస్తువు? అదెక్కడనుంచి పుట్టినది? దానికేదైనా రూపము కలదా? అనేకమంది బాలురు, వృద్ధులుకూడ అనవసరమైన వాటికి "భయము భయము" అనెదరు. అట్లు భయమనునది మాటిమాటికెందుల కుచ్చరింపవలసి వస్తుందో తెలుసుకోవలసిన అవసరము కలదు.

చాలామంది తల్లిదండ్రులు ముఖ్యముగా తల్లులే తమ బిడ్డలకు ఉగ్గుపాలతోగూడ భయమనేది కలుగజేసి వారి భవిష్యత్తులో వారిని పిరికివాళ్లనుగా చేయుచున్నారు. వారు తమ బిడ్డలను ప్రేమయనే భావముతో "అటువెళ్లకు. యిటు వెళ్లకు. ఎండలో వెళ్లకు కాళ్లు కాలుతాయి. వర్షములో వెళ్లితే జలుబు చేస్తుంది. చీకటిలోకి వొంటరిగా వెళ్లవద్దు. వీధులలో వొంటరిగాపోయిన దొంగ లెత్తుకు పోతారు," అని యనేకములైన బోధలు చేయుదురు. ఈ విధముగా పెంచబడే బిడ్డలు ప్రతియొక్క విషయమునకు భయపడి స్వయంగానే పని జేయజాలక పోతున్నారు. కుక్కలను, పిల్లులను చూచి భయపడుటేగాక తమ నీడను చూచుకొని భయపడెదరు. ఈ భయమనేది కొన్ని పరిస్థితులలో చాలా ప్రమాదముగు చున్నది. ఈ భయమువల్ల వచ్చిన పిరికితనమువల్లనే అనేక జబ్బులు కూడ వచ్చుచున్నవి. ఆ విధముగా వచ్చు జబ్బులే హిస్టీరియా, ఫిట్సు మొదలైనవి. మిక్కిలి గారాబముగా పెంచబడే బిడ్డలే ఇటువంటివానిచే బాధపడుచున్నారు.

పిల్లలు పసితనంతో బడికి వెళ్లుటకు పేచీ పెట్టుట సహజము. అట్టి పిల్లలను తల్లులు తొందరలో, "నీవు బడికి వెళ్లనంటున్నావని మాస్టరుగారితోచెప్పి కొట్టిస్తాను. మాస్టరు నిన్ను కొట్టుతారు," అని కోపావేశముతో పలికి మరియు రెండు దెబ్బలుకూడ వేయుదురు. అది చాలా పొరపాటు. బిడ్డల కెప్పుడు నుత్సాహ పూరితమైన మాటలు జెప్పుచు మంచి పలుకులతో నచ్చచెప్పి బడికి పంపవలెను. లేనిపోని. మాటలు చెప్పి బడి యనినను, మాస్టరనినను భయపడునట్లు చేయకూడదు.

బిడ్డలయొక్క భవిష్యత్తు ముఖ్యముగా తల్లులమీదనే ఎక్కువగా ఆధారపడి వుంటుంది. ప్రతియొక్క తల్లియు తన బిడ్డకు పసితనమునుండియు చారిత్రాత్మకమైన ధీరపుత్రుల జీవితముల, ఇంకా యనేక పౌరాణిక కథలను జెప్పుచు, వారి ఆశయములను అమలులో బెట్టునట్లు ప్రోత్సహించవలెను. కాని భయము, భయముతోగూడిన విషయము లేమియు తమ వాడుక ప్రసంగములలోకి రానీయకూడదు.



## పాఠము 2.

## సంయుక్తాక్షరములు.

హల్లులు మూడు విధములు :—

१. నిలువుగీత ‘।’ గలవి, २. నిలువుగీత లేనివి, ३. రేఫము.

ङ, छ, ट, ठ, ड, ढ, द, र, ह, అక్షరములు తప్ప మిగిలిన అక్షరములన్నియు నిలువుగీత గలవి.

१. నిలువుగీత గల అక్షరము మరియొక అక్షరముతో కలుపునప్పుడు నిలువుగీత ‘।’ ను తీసివేసి తరువాత అక్షరముతో చేర్పవలయును.

ఉదా :—स + त = स्त స్త, प + य = प्य ప్య,

ज + व = ज्व జ్వ, ख + त = ख्त ఖ్త.

१. నిలువుగీత లేని అక్షరమును యితర అక్షరముతో కలుపునప్పుడు మొదటి అక్షరము పూర్తిగ వ్రాయబడి రెండవ అక్షరము మీది అడ్డగీత (—) తీసివేయబడి మొదటిదాని క్రింద చేర్చబడును.

ट + ट = ट्ट ట్ట, ड + ड = ड्ड డ్డ.

३. ‘र’ అక్షరములు మొదట పలుకబడునెడల అక్షరముయొక్క తలకట్టుమీద ఈ గుర్తు (ˆ) వ్రాయబడును.

ఉదా :—र + म = र्म ర్మ, धर्म ధర్మ.

‘र’ అక్షరము తరువాత ఉచ్చరింపబడునెడల నిలువు అక్షరము క్రింద ‘\’ యిట్టి గుర్తు ఉంచబడును.

ఉదా :—ग + र = ग्र గ్ర, प + र = प्र ప్ర, म + र = म्र మ్ర,

क + र = क्र క్ర, द + र = द्र ద్ర, ज + र = ज्र జ్ర,

ह + र = ह्र హ్ర.

छ; ट; ठ; ड; ढ; ఈ అక్షరములక్రింద ‘∧’ ఈ గుర్తు ఉంచబడును.

ఉదా :—ट + र = ट्र ట్ర.

## కొన్ని సంయుక్తాక్షరములు.

क्क; क्क క్క.  ल्ल; ल्ल ల్ల.  क्ल; क्ल క్ల.

क् + त = क्त క్త.  क् + व = क्व క్వ.  क् + ष क्ष క్ష.

च् + च = च्च చ్చ.  ज् + ज = ज्ज జ్జ.  ज् + ञ ज्ञ జ్ఞ.

त् + त = त्त త్త.  त् + र = त्र త్ర.

द् + द = द्द ద్ద.  द् + ध = द्ध ద్ధ.  द् + न = द्न ద్న.

द् + म = द्म ద్మ.  द् + य = द्य ద్య

ट् + य = ट्य ట్య.  ड् + य = ड्य డ్య.

श् + व = श्व శ్వ.  श् + र = श्र శ్ర.  श् + च = श्च శ్చ.

श् + ल = श्ल శ్ల.

ह् + व = ह्व హ్వ.  ह् + म = ह्म హ్మ.  ह् + य = ह्य హ్య.

ह् + ल = ह्ल హ్ల.  ह् + ण = ह्ण హ్ణ.

## శబ్దములయొక్క ఉచ్చారణ నియమములు.

१. హిందీలో పదముల యంత్యాక్షరమందలి 'अ' కారమును తీసివేసి పలుకుదురు.

**बात** బాత్ (మాట)  **घर** ఘర్ (ఇల్లు)  **फल** ఫల్ (పండు)

२. కాని, చివరనున్న యక్షరము సంయుక్తాక్షరమైనచో పూర్తిగానే యుచ్చరింపబడును.

**इन्द्र** ఇంద్ర  **सत्य** సత్య (సత్యము)

३. इ, ई, ऊ—వీనికి తరువాత 'य' అక్షరమున్న యెడల 'य' మీది అకారము

ఉదా:—**प्रिय** ప్రియ  **सीय** సీయ (సీత)  **राजसूय** రాజసూయ.

౪. మూడు హ్రస్వ అకార అక్షరములుగల పదములయందు మూడవ అక్షరము, నాలుగు హ్రస్వ అకారములుగల పదములయందు రెండవ, నాలుగవ అక్షరములును అయిదు హ్రస్వ అకారములుగల పదములందు మూడవ, అయిదవ అక్షరములును పూర్తిగా పలుకబడవు.

ఉదా :—**पवन** పవన్ (గాలి) **कसरत** కస్రత్ (కసరతు)

**गपड़चौथ** గపడ్‌చౌథ్ (వ్యర్థగోష్ఠి)

౫. ఈ క్రింది విషయములందు అకారము పలుకబడదు. మూడు అక్షరములుగల దీర్ఘ స్వరాంత పదములలో రెండవ అక్షరము మీది ఆకారము :—**कमरा** కమ్రా (గది)

నాలుగు అక్షరములుగల హ్రస్వ స్వరాంత పదములలో రెండవ అక్షరము మీది అకారము :—**झटपट** ఝట్‌పట్ (వెంటనే)

కాని, రెండవ అక్షరము సంయుక్తాక్షరమైనప్పుడును, పదముయొక్క మొదటి అక్షరము ఉపసర్గ అయినప్పుడును రెండవ అక్షరమునందలి అకారము పూర్తిగా పలుకబడును.

ఉదా :—**पुत्रलाभ** పుత్రలాభ్ **प्रचलित** ప్రచలిత్.

౬. నాలుగు అక్షరములుగల దీర్ఘస్వరాంత శబ్దములందు మూడవ అక్షరము మీది అకారము.

ఉదా :—**समझना** సమఝ్‌నా (తెలిసికొనుట) **कचहरी** కచహ్రీ (కచ్చేరి)

## అనుస్వారము.

౧. హిందీలో ' ' ' ఈ గుర్తు అనుస్వారము, 'ँ' ఈ గుర్తు అనునాసికము (అర్ధానుస్వారము) అని చెప్పబడును.

(అ) సంస్కృత పదములందు అనుస్వారము పూర్తిగ పలుకబడును.

ఉదా :—**हंस** (హంస)

(ఆ) హిందీ పదములపైని అనుస్వారము ముక్కుతో పలుకబడును.

(ఇ) తెలుగులో " ఊఁహూఁ " ('అలాగా' అను అర్థమును తెలియజేయు ధ్వని)లోని ఊఁహూఁ లలోని నాసిక ధ్వనివలె నుండును. దీనిని వ్రాతలో 'అర్ధానుస్వారము', 'అను

నాసికము' అందురు. దీనికి ప్రత్యేకముగా 'ँ' ఈ రూపము వున్నను కొందరు కేవలము 'ं' యిట్లే వ్రాయుదురు. అయినను దీనిని అనునాసికముగానే ఉచ్చరింపవలయును.

(ఈ) అర్ధానుస్వారము 'ँ' తో కూడిన హిందీ అక్షరము తెలుగు లిపిలో వ్రాయునప్పుడు ఆ యక్షరము ప్రక్కన తెలుగు అరసున్న వ్రాయబడును. కావున తెలుగులోని 'అరసున్న'కు ఉచ్చారణ లేకపోయినను హిందీ శబ్దములతో వాడబడినప్పుడు మాత్రము దానిని ముక్కుతోనే ఉచ్చరింపవలెను.

ఉదా :—**गेहूँ, गेहूं** గేహూఁ (గోధుమలు)   **आँख, आंख** ఆఁఖ్ (కన్ను)

२. అనుస్వారమునకు తరువాత వర్గాక్షరమున్నచో అనుస్వారమునకు బదులు ఆ వర్గ పంచమాక్షరము వచ్చును.

అనగా **शंकर** అను పదములో అనుస్వారము తరువాత '**क**' (క) వచ్చినది. ఇది కవర్గమునకు చేరినది. పై నియమము ప్రకారము 'క'కు ముందు ఆ వర్గ అంత్యాక్షరము '**ङ**' (ఙ) వ్రాయవలెను. అనగా **शङ्कर** అని వ్రాయవలెను.

ఉదా :—**संजय = सञ्जय ;   आनंद = आनन्द ;   दंड = दण्ड.**

३. కాని **संसार, संशय, हंस** మొదలగు వానిపైనుండు అనుస్వారము '**न्**' వలె పలుకబడును :—

**सन्सार,   सन्शय,   हन्स.**

[వెనుకటి సంచికలో, స్వరములు, గుణింతమునుగూర్చి వ్రాయబడెను.

ఇట్లే, ప్రతినెల, హిందీ పాఠములు క్రమపద్ధతిలో ప్రచురింపబడును.

వచ్చే సంచికలో మహాత్ముల వచనములు కొన్ని హిందీలో, ఆంధ్ర అనువాదముతో ప్రచురింపబడును.]



# ఆంధ్రదేశంపైకి రెండు 'లక్ష్మమ్మల' దండయాత్ర!!

విమర్శ అనేటప్పటికి విమర్శకుని దృష్టిలో అనేక విషయాలలో సూక్ష్మంగా పరిశీలించాలసి వస్తుంది. వ్యక్తిగతంగా విమర్శకుడు ఎప్పుడు దూషణ భూషణలు చేయకూడదు. ఒక రచనలో, చిత్రంలో, నటనలో మనం చూడవలసింది శక్తి సామర్థ్యాలు, కథా వస్తువు. విమర్శకులు ముక్కుకు సూటిగా నిర్మొగమాటంగా ఉండాలి.

ముఖ్యంగా యం. ఆర్. ఏ అండ్ శోభనాచల సంయుక్త నిర్వాహణలో తయారైన 'లక్ష్మమ్మ'ను ప్రతిభా వారి నిర్వాహణలో తయారైన 'లక్ష్మమ్మ'ను విమర్శ చేయబోయే ముందు ప్రొడ్యూసర్లకు ఒక హెచ్చరిక. ఇకనుండి అయినా ప్రొడ్యూసర్లు పోటీపడి ఒక కథను ఇద్దరు తీస్తూ దానిలోని కథావస్తువును, వాస్తవికతను నాశనంచేసి ఏదోతీశామంటే తీశామని దేశం మీదకు వదిలితే, వృథా ప్రయాస, డబ్బుదండగ తక్క, దేశానికిగాని, తమకుగాని, ఫిల్ముపరిశ్రమకుగాని, కలిగించే అభ్యుదయం శూన్యం అని గ్రహించాలి.

కథావస్తువు: రెండు కమ్మకుటుంబాల మధ్య జరిగిన కథ. ముఖ్యాంశాలు:—ముసలప్పనాయుని ఏకైక పుత్రిక లక్ష్మమ్మ. మనసార ప్రేమించి పెండ్లి చేసికున్న వెంకయ్య నాయుడు ముసలప్పనాయుడి ఇంటి అల్లుడవుతాడు; లక్ష్మమ్మ గర్భవతిగా ఉన్న సమయంలో ఒక దేవదాసికి తన హృదయాన్ని అర్పించి, భార్యకు తెలసిన పిదప, భార్యతో పోట్లాడి తన స్వగ్రామం చేరుకుంటాడు. లక్ష్మమ్మకు అంతకు ముందుగానే పుత్రిక కలుగుతుంది. కాని ప్రేమించి పెండ్లి చేసికొన్న భర్త అనురాగానికి దూరమై పోయింది. అది ఆడబిడ్డ, అత్తగార్లకు మంచి అవకాశమైనది. కాని లక్ష్మమ్మ అంటే ఆమె బావలకు తోడికోడళ్లకు మాత్రము అపారమైనప్రేమ. బావలు తోడికోడళ్లు లేని సమయంలో ఆదనుకనిపెట్టి లక్ష్మమ్మ ఆమె కుమార్తెను ఆడబిడ్డ కొడుకుకు ఇవ్వనని అనటంచేత ఆమె భర్తకు లక్ష్మమ్మపై లేనిపోని అపవాదాలు మోపి చివరికి లక్ష్మమ్మను భర్తచేత హత్య చేయించ గలుగుతారు. ఇది కథ.

శోభనాచలవారి లక్ష్మమ్మకు దర్శకుడు గోపీచంద్. కథ సహజంగా, వాస్తవికతకు సన్నిహితంగా నడుస్తుంది. సంభాషణ గంభీరంగా ఉంది. నటీవర్గం తమతమ పాత్రలను చక్కగా పోషించారు. లక్ష్మమ్మను వెంకయ్య నాయుడు హత్యచేసిన చివరి ఘట్టాన్ని చాలా అద్భుతంగా చూపాడు. దేవదాసియైన రాధపాత్రను నాశనం చేయకుండా, ఆమె పాత్రకు ప్రాధాన్యత యిచ్చి, ఆమె నోటినుండి అమూల్యమైన మాటలను కవి పలికించాడు.

లక్ష్మమ్మగా కృష్ణవేణి బాగా నటించింది. భర్తగా నటించిన నారాయణరావు తన పాత్రను చక్కగా అర్థంచేసికొని ముఖ్యంగా లక్ష్మమ్మ మీద తల్లి, చెల్లి నిందలు మోపినప్పుడు, చివరి ఘట్టంలో అద్భుతంగా నటించాడు. లక్ష్మమ్మ తండ్రిగా సుబ్బారావు అతి సహజంగా నటించి తండ్రి ప్రేమను వెల్లడి చేయ కలగినాడు. లింగమూర్తి భావాలు, నటన, సంభాషణను చూస్తుంటే అతనిలో గల గంభీరత ప్రకటితమైనది.

ప్రతిభావారి 'శ్రీలక్ష్మమ్మ'లో కథావస్తువులోని వాస్తవికతను పూర్తిగా నాశనంచేశారు. హాస్యాన్ని అనవసరంగా ప్రవేశపెట్టి కథలోఉన్న సీరియస్‌నెస్‌ను పాడు చేశారు. దేవదాసి పాత్రను ఖూనీచేశారు. అత్త ఆడబిడ్డలచేత అతి ఘోరమైన కార్యాలు చేయించి ప్రజలను ఏడ్పించ కలిగినారే కాని వారి పాత్రలకు చక్కని స్థానాన్ని కల్పించలేక పోయారు. కొన్ని ఘట్టాలలోని భయంకర హింసలు ప్రజలు సహించలేనివి. వెంటనే మరికొన్ని ఘట్టాలలోని వెర్రిహాస్యానికి ప్రజలు అసహ్యించుకుంటూ నవ్వుతారు. ఈ రెండు ఘోరాల మధ్య కథా వస్తువులోని విశిష్టత పూర్తిగా అంతరించింది.

## చిత్ర సమీక్ష

అనవసరమైన సన్నివేశాలు కల్పించి, చిత్రాన్ని పొడిగించారు. శ్రీ లక్ష్మమ్మగా అంజలీదేవి అతిసహజంగా నటించింది. జి. వరలక్ష్మి అద్భుతంగా నటించింది. నాగేశ్వరరావు పాత్రను సమంగా పోషించ లేదేమోనని సందేహం కలుగుతుంది.

ముఖ్యంగా ఈ రెండు చిత్రాలు చూస్తే, శోభనాచల వారి లక్ష్మమ్మలో నాగరిక హృదయాన్నాకర్షించే సంభాషణలు, సన్నివేశాలు, నటన కనబడుతుంది. ప్రతిభా వారి శ్రీ 'లక్ష్మమ్మ'లోని శృతిమించిన శృంగారం పల్లె జనానికి కూడా వెగటనిపించకపోదు.

పోటాపోటీలలో ఇరుకక్షుల వారు అతిగా శ్రమించి, అతి శీఘ్ర కాలంలో చిత్రాలను తయారు చేశారు. పాలు మాలికకు పేరుపొందిన ఆంధ్రులు ఇంతదీక్షతో చురుకుగా పనిచేయటం ముదావహమే. అంటే వారిలో సామర్థ్యం లోపంకాదని తేలుతుంది. ఆ సామర్థ్యాన్ని సద్వినియోగం చేయటం అత్యవసరం. పోటాపోటీలలో ఒకరిగొంతు ఒకరు నులుముకుని, పరిశ్రమనే కూల ద్రోయకుందురు గాక యని మా హెచ్చరిక.

* * *

## రాగిణీవారి 'తిరుగుబాటు'

'తిరుగుబాటు'కథ, మామూలుగా దేవత, గృహలక్ష్మి, స్వర్గసీమ కథలను పోలి యున్నది. ముందు భార్యా భర్త పిల్లలు అనురాగంగా ఉండటం, సిరిరాగానే గాని, మరియొక కారణముచేగాని భార్యను పిల్లలిని మరచి భర్త ఏదో ఒక విధంగా మరియొక స్త్రీని ప్రేమించి వీళ్ళను హింసించటం. దానితో భార్య, పిల్లలు వీడిపోవటం, ప్రేమించిన స్త్రీమీద కొద్దిగా వ్యామోహం తగ్గగానే, మాటామాటా రావడం, దానిపైన ఏదో వ్యాధి రావడం చివరకు తాళికట్టిన భార్యయే శరణు కావడం. ఈ విధంగానే తిరుగుబాటు కథ ఉన్నది.

ఇందు ఆనందమయి, భర్తపెట్టిన కష్టాలకు అణగి మణగి ఉండక, భర్త ప్రేమించిన స్త్రీని ఇంటిలోకి తెచ్చి అవమానిస్తుంటే దాసివలె వారికి సేవలుచేయక, పిల్లల భవిష్యత్తు కోసమై 'తిరుగుబాటు'చేసి వెళ్లిపోతుంది. ఈ సమస్యనే ప్రధానంగా తీసికొని దర్శకుడు చిత్రాన్ని తీశారు. కాని చివరికి భర్తకు జబ్బుచేసినప్పుడు, వెళ్ళి పోయిన భార్యవచ్చి తన రక్తాన్నియిచ్చి బ్రతికిస్తుంది. అందువలన, కథ మామూలే అయి పోయింది. "తిరుగు బాటు" అనే విషయానికి ప్రాధాన్యం ఏమాత్రం దర్శకుడు చూపలేక పోయారు.

చిత్రం నడుస్తున్నంత సేపు ప్రేక్షకులకు ఉత్సాహం ఉండదు. కథలో పట్టుత్వం లేక పోయింది. సముద్రాల వారి కలంలోనుండి చక్కని సంభాషణలు వినగలుగుతాము అనుకొన్నవారికి నిస్పృహకలిగింది.

ప్రసాద్‌గా నటించిన నారాయణరావు ముందు ఘట్టాలలో చూపినంత ప్రతిభను విషాద ఘట్టాలలో చూపలేకపోయాడు. శాంతకుమారి సహజంగా చక్కగా నటించింది. అనూరాధగా కృష్ణవేణి ఏ ఏ సన్నివేశాలకు ఏ విధంగా నటించాలో అర్థంచేసికొని నటించింది. జాక్‌గా నటించిన బి. యస్. ఆర్. బాగా నటించాడు. ప్రప్రథమంగా తెలుగు చిత్రంలో నటించిన లలిత, పద్మినులు చక్కగా నటించారు. వారిచేత చిలుకపలుకులవలె తెలుగును మాట్లాడించారు. బాబు, కన్న పాపగా పిల్లలు చక్కగా నటించారు.

పాటలలో కూడ భాషా పటుత్వము, భావ పటుత్వము లోపించినవి. చౌకబారుగా ఉన్నవి. పాటఃతీరులో నూతనత్త్వం ఏమాత్రంలేదు. ఫోటోగ్రఫీ బాగానే ఉన్నది.

చిత్రం మొత్తంమీద చెప్పకోదగ్గ విషయం ఏమంటే దర్శకుడు పలువిధములయిన చక్కని సమస్యలను తీసికొని వివిధములైన పాత్రలను ప్రవేశపెట్టి కథలో ప్రాధాన్యత ఇచ్చారు. అయితే తిరుగుబాటుచేసి కూడ భార్య తనే వెళ్ళిపోయి అన్ని కష్టాలుపడి, చివరికి భర్త కష్ట సమయంలో తన రక్తాన్నియిచ్చి భర్తను రక్షించుకుంది. పాత చిత్రాల నాయకురాండ్రకు యీమెకు ఏమీ భేదము కనపడలేదు. అందువలన ఆనందమయి పాత్రకు దర్శకుడు ఇవ్వదలచినంత ప్రాధాన్యత ఇవ్వలేక పోయినారు.

—బి. ప్రభ.



# ఎందుకీ పత్రికలు

* వెలగల భాస్కరరెడ్డి *

ఈ మధ్య ఎన్నో వింత వింత పత్రికలు వానాకాలపు దోమల్లా జనియిస్తున్నాయి. వాటి రోదన అనేక అమాయిక ప్రజల్ని విద్యార్థుల్ని అధోగతి పాలు జేస్తున్నాయి. పత్రిక స్థాపించుటలో పత్రికాధిపతి భావమేమి? దానికి లైసెన్సు యిచ్చుటలో ప్రభుత్వాశయ మేమిటి? ఏదైన పత్రిక నొకదానిని ప్రచురించి నప్పుడు సాంఘికముగనో, రాజకీయముగనో, వినోదముగనో, విజ్ఞానముగనో ప్రజల నభివృద్ధి చేయుటకు బదులు చీడ పురుగువలె జీర్ణింప చేయుటలో అర్థమేమి?

ఈ మధ్య నూతనముగ వెడలెడు కొన్ని పత్రికలు చూచుటలేదా? ఫిలిమ్స్ సెన్సర్ చేసినట్లు పత్రికలను చేయకూడదా? సెన్సారు చేయడమెట్లు? నిలువెల్ల విషమే యన్నట్లు పత్రిక శ్రీకారమునుంచి చిత్తగించే వరకు ఒకటే తైఖరాయెను? లేక యిటువంటి పత్రికా ప్రచారము ప్రభుత్వమునకు కూడా అంగీకారమేనా? రజాకార్ల దౌర్జన్యము కన్న కమ్యూనిస్టుల దురాగతములకన్న హీనముగ నున్నదే. భారతదేశము ఆర్యభూమి పాతివ్రత్యమునకు నిలయము. ఇట్టి పవిత్ర మాతృ భూమిలో హేయమై, వినస్వరమైన వ్యాసములు, చిత్రములతో నీచాతి నీచముగ ప్రకటించు టెంత చిన్నతనము? ఎంత అజ్ఞానము? ఎటువంటి సినీమా లవసరము అని తర్కించు యీ కాలములో అంతకంటె అసహ్యాకరమైన యీ రచన లెందుకు? ఎందరు విద్యార్థులు యీ కొరమాలిన పత్రికలే పాఠ్య భాగములుగ పఠించి, భ్రష్టులయి పోవుచున్నారో గమనించారా?

ఇప్పుడైన ప్రభుత్వమిట్టి పత్రికలకు దోహద మివ్వక యిచ్చిన వాటిని రద్దుచేసిన ప్రజానీకమున కెంతయో మహోపకారము చేసినవారగుదురు.

పత్రికాధిపతులారా! ఎందులకు మీ విజ్ఞానము? మీ యీ పత్రికలవలన లోకమునకు మీరెంతటి అపకారము చేయుచున్నారో గమనించితిరా? సంపాదకుడు మహోపాధ్యాయుడు, రచయితలు గురువులు. అట్టి నిర్వాహకుల కెంత పవిత్ర భావములుండవలెను. ప్రజలలో నీతి విజ్ఞాన ప్రబోధము చేయక పోవుటయే గాక, అవినీతికరములైన కథల కబుర్లతోను, అసహ్యాకరమైన చిత్ర రచనలతోను నిండియున్న యీ పత్రికలెందుకు?

# కొవ్వూరు మహిళా సమాజము

## 14వ వార్షికోత్సవము.

పై వార్షికోత్సవము 9-3-1950 తేదీ సాయంకాలము 4 గం॥లకు సమాజ భవనము (త్రివిక్రమ భవనము) నందు జరుపబడినది. సభకు శ్రీమతి సి. హెచ్. చంద్రమతి అమ్మగారు అధ్యక్షత వహించిరి. శ్రీమతి నరహరి శెట్టి శకుంతలాదేవి బి. ఏ. గారు సభా ప్రారంభ మొనర్చిరి. సమాజ కార్యదర్శిని శ్రీమతి వేదవల్లి తాయారమ్మగారు కార్యదర్శిని నివేదికను చదివిన తరువాత పురస్త్రీలు కొందరు పన్యసించిరి. ఈ గ్రామమునందిట్టి "సంస్కృత బాలికా పాఠశాల"ను నిర్వహించుచున్న మహిళా సమాజమువారి కృషిని చాలా ప్రశంశించి, పురవాసులెల్లరు తమ బాలికల నీ విద్యాలయమునకు బంపి, విద్యాలయము నభివృద్ధిలోనికి తేవలెనని అధ్యక్షులు తెలిపిరి. సభకు సుమారు అయిదారు వందల మంది స్త్రీ పురుషులు వచ్చిరి.

సభానంతరమునందు సంస్కృత బాలికా పాఠశాల విద్యార్థినులు "శాకుంతల" నాటకమును సంస్కృతము ప్రథమాంకమును ప్రమీలార్జునీయము తెలుగునను ప్రదర్శించి ప్రేక్షకుల నానంద వీచికలనోలలాడించిరి. సమాజ పక్షమున ప్రదర్శనమందు పాల్గొనిన బాలికలకు రజత పతకములను బహూకరించిరి. పిమ్మట కార్యదర్శిని వందనములతో "జనగణమన" జాతీయ గీతికతో సభ ముగిసినది.

కార్యదర్శిని.



# గ్రామ సేవికా శిక్షణ కేంద్రము

## సీతానగర ఆశ్రమము, వయా రాజమండ్రి.

కస్తూర్బా స్మారక ట్రస్టు, ఆంధ్ర.

ఈ కేంద్రములో 1950—51 సం॥పు శిక్షణ, వచ్చే జూన్ 15వ తేదీనుండి ప్రారంభింపబడును. ఈ శిక్షణకు రాదలచిన, వచ్చే మేనెల 15-వ తేదీలోగా దరఖాస్తులు మా కార్యస్థానమునకు పంపవలయును.

ఇట్లు,
దీ. బుచ్చికృష్ణమ్మ,
కార్యదర్శిని.



# గ్రంథసమీక్ష



### కపోతీ కపోతము

[కపోతి దంపతుల కథ]

పద్యకావ్యము.

రచ. : జోస్యుల రాజా రామ మోహనరావు.

ప్రచురణాలయము : ఆంధ్ర ప్రచారిణీ ప్రెస్సు.

మూల్యము 0-౮-0. ప్రతులు దొరకుచోటు శ్రీ బులుసు వెంకటేశ్వర్లు గారు బి. ఏ. రామారావుపేట, కాకినాడ.

కపోతీ కపోతము పద్యకావ్యము. భారత, భాగవత, రామాయణాది గ్రంథములు, మన పాఠకులకు చిరపరిచితములే. ఈ కపోత దంపతులకథ భారతమునందలి, శాంతి పర్వ తృతీయాశ్వాసమందలిది. కౌరవోత్తముడైన భీష్ముని, అతని మనుమడు, లోకారాధ్యుడైన ధర్మరాజు ఒక దినము ఇటులడిగెను. "తాతా! లోకములో నీ వెరుంగని ధర్మము లుండవు. గనుక, శరణు జొచ్చిన అతిథిని గొల్చిన ఏ పుణ్యము గలుగును? వినిపింపు"మని వేడెను. అప్పుడు ధర్మజునకు భీష్ముడు ఈ ఉత్కృష్ట కపోత దంపతుల కథను సవిస్తరముగ విన్నవించెను.

ఇందు ముఖ్యమైనవి, కపోతముల ధర్మచింతనము, భగవద్భక్తి, శరణాగతరక్షణము, అతిథి పూజ, త్యాగశీలము, మొదలగు నంశములు.

శైలి సులభముగను, ధారాశుద్ధి రసవంతమునై చదువుట కెంతయు నాహ్లాదకరముగ నున్నవి. అచ్చుచక్కగ నున్నది. ఇందు నుదహరించిన పద్యము మచ్చునకు చదివి చూడుడు. అన్నియు నిందే యిమిడియున్నవి. పెద్దలు, పిన్నలు సులభముగ గ్రహించుకొనగల్గునట్లు ఈ కవి చక్కగ వ్రాసెను. ఇటువంటివి చదివిన పుణ్యము, లోకజ్ఞానము సంప్రాప్తమగును.

"ఇంతిరో! యాతిథేయములనింపు జనింపఁజేయనే
కాంతలు నీకుసాటి? సురకాంతలనైనను గానవత్తురే
జింతను వీడు మియ్యతిథి సేవలొనర్ప క్షుధార్తి బాపఁగా
నింతులకెందు దేహములనిచ్చుట చెల్లునె నాథుడుండఁగా.

* * *

### పరిత్యాగము

[వచనా నాటకము]

రచన: శ్రీ వెంకటేశ్వరరావు. సాహిత్య విశారద,

ప్రతులకు:

కనక మేడుల వెంకటేశ్వర్లు సాహిత్య విశారద, యలమర్రు గుడ్లవల్లేరు, కృష్ణా జిల్లా. వెల 0-10-0.

ప్రచురణాలయము. ఆంధ్ర ఆర్టు ప్రెస్సు, ఏలూరు.

ఇందలికథ ఒక తెలివి తేటగలిగిన విద్యార్థుడగు మోహనుని గూర్చి. అతనికి తల్లిదండ్రులు, ఒక అవివాహితయగు సోదరిగలరు. డబ్బులేక, మోహను డెంత తెలివైన వాడైనను చదువుసాగలేదు. పోనీ ఆఖరికి ఉద్యోగమయిన చేయుదమనిన, అదియు జతపడలేదు. మోహనునికిద్దరు స్నేహితులుండిరి. ఒకడు తనవలె బీదవాడు, కాని కరుణార్ద్ర హృదయుడు. రెండవవాడు, పొగరుబోతు. మోహనుని చెల్లెలిని వివాహమాడుట కాశించి, అతనికెటులైన ఉద్యోగ మిప్పించెదనని చెప్పి ఆశపెట్టి, మోహన్ చెల్లెలిని బలత్కరించ బోతాడు. అప్పుడు, మోహన్ అతని సహాధ్యాయుడు, కలిసి వానిని యింటినుండి వెడల గొట్టెదరు. వీరి స్థితి యిటులుండుట చూచి, మోహనుని సహాధ్యాయుడు, అతని చెల్లెలిని వివాహమాడుతాడు. మోహనుని స్థితిచూస్తున్న అతని ఉపాధ్యాయుడు ఎంతో ప్రయత్నంపై మోహనునికి ఉద్యోగం ఇప్పిస్తాడు. ఉద్యోగ మొచ్చిందని వినగానే, అంత పేదస్థితిలో నున్న తండ్రిగారు గుండెఆగి చనిపోతాడు. ఇది నిజంగా జరిగిన కథే అనవచ్చు. ఎందుకన ప్రపంచస్థితి ఈ విధంగానే యున్నది.

—రా. లక్ష్మి.

* * *

### ఎవరంటావే మోయ్.

రచయిత : కాజ వెంకటేశ్వరరావు. ప్రతివెల 0-2-0. ప్రతులకు : కాజ వెంకటేశ్వర రావు. హిందీ పండిట్. కంకిపాడు కృష్ణాజిల్లా.

రచయిత కేవలం వ్యక్తిగత పొగడ్తలతో తప్ప మరే విధమైన భావాలను స్పష్టంగా తెలియపర్చ లేక పోయారు.

# గ్రంథ సమీక్ష

ఆంధ్రదేశంలో రంగా, సార్ల, గోపరాజు సరస్వతిగార్ల ప్రతిభా విశేషాలు తెలియని వారుండరు. మధ్యలో రచయిత జై ప్రకాష్ ప్రతిభా విశేషాలు వ్రాశారు.

అందులో నాజేజేలు, చామంతివాంచ, నేటిజోలపాట, ఈ శీర్షికలతో గేయాన్ని రచించారు. రచయిత గేయ రూపంగా వ్రాసి ఏమంత భావాలను వెల్లడి చేయలేక పోయారు. గేయరూపం కంటే వచన రూపంగా పిల్లలకు సరిపోయే విధంగా చక్కని శైలిలో వ్రాసినట్టయితే బాగుండేది. చదువుతుంటే ఈ గేయాలు చక్కగా అర్థమవుతవి.

* * *

## కావ్యశ్రీ

రచయిత : సుండాబత్తుల నారాయణరావు.

ప్రతి వెల ఎనిమిది అణాలు.

ప్రతులకు: సుండాబత్తుల నారాయణరావు ద్వితీయకక్ష్య. పి. ఆర్. కాలేజి. కాకినాడ.

ప్రప్రథమంగా 'కావ్యశ్రీ' ఆంధ్ర మాత స్తుతితో ప్రారంభించబడినది. పిదప 'కావ్యశ్రీ'లో రచయిత అనేక శీర్షికలను ప్రాధాన్యంగా తీసికొని పద్యాలను రచించారు. 'కావ్యశ్రీ'లో ముఖ్యంగా 'ఆంధ్రశ్రీ' 'కవిగారి భార్య' 'పండిత ప్రశంస' 'నమస్సు' 'మంగళసూత్రము' 'చందమామ' అనే పద్యాలు చక్కగా నున్నవి.

పద్యాలు సరళంగా, చక్కని శైలిలో ఉన్నవి. చదువుతుంటే చక్కగా అర్థమౌతున్నవి. 'కవిగారి భార్య' అనే పద్యంలో కవి భార్య తన భర్తను తలచుకొని బాధపడే సమస్యలు చక్కగా వ్రాశారు. ఈ పద్యం చదువుతూంటే కాళిదాసు రచించిన మేఘసందేశంలో యక్షుడు విరహవేదన జ్ఞాపక మొస్తుందికాని 'కవిగారి భార్య'లో కావలంచుని పోయిన భర్తను తిరిగి జ్ఞాపకం చేసికొని భార్య విలపిస్తుంది.

'నమస్సు'లో రచయిత అమరజీవియైన గాంధీజీని ఉద్దేశించి చక్కగా రచించారు. రచయిత ప్రథమ ప్రయత్నమైనను 'కావ్యశ్రీ'ని చక్కగా తీసికొని రాగలిగినారు.

—జి. ప్రభ

## సౌభాగ్య

ప్రత్యేక వార్షిక సంచిక వెల 8 అణాలు.

ఇది మదరాసు ప్రభుత్వ స్త్రీజనాభ్యుదయ శాఖచే ప్రచురింపబడిన ఐదవ వార్షిక సంచిక. పైపై పూతలు అనవసర ప్రసంగాలు లేకుండా, అతి సహజంగా, ఆశయమునకు తగినట్టుగా వెలువడింది.

ఇందు "నిర్మాణకార్య క్రమము—స్త్రీలు" "నేటి సమాజము—మహిళా పాత్ర"; "భారతనారి"; "ఆహార సమస్య—ఆడవాళ్ళు" మొదలగు యెన్నో స్త్రీ జనోపకరణమైన వ్యాసములున్నవి. ప్రతి వ్యాసములోను స్త్రీల కుపకరించు విషయములు పెక్కుగలవు. ఇవికాక నేటి నాగరికతా వ్యామోహముచే చిన్నచూపు చూడబడు మన సాంఘికాచారముల విలువ, పురాతన కళా విన్యాసపు శోభ, పండుగ పబ్బముల అంతరార్థము మొదలగు వానిని గురించి వ్రాసిన వ్యాసములు చక్కగా నున్నవి. మఱియు "బాల వాటిక"; "గృహ చికిత్సలు"; "పడమటిల్లు" అను శీర్షికల పేరుతో బాలుర కానందమును, జ్ఞానమునిచ్చుకథలు చిన్న చిన్న వ్యాధుల కుపయోగబడు నటువంటి కొన్ని మందులు, పలువిధములగు వంటకములు క్రమముగ గలవు.

కడపట "హిందీ" ఉర్దూ" శీర్షికలుగూడ గలవు.

"సౌభాగ్య" స్త్రీజనాభ్యుదయ పత్రిక యనుటకు సందేహమేమియు లేదు. స్త్రీ జనాభ్యుదయమునకై యిది సర్వవిధముల తోడ్పడగలదు.

దీని ప్రచురణ సందర్భమున ఓ. పట్టాభి సీతారామయ్యగారు, సుచేతా కృపలానీ గారు, చింతలపూడి సన్యాసరావుగారు మొదలగువారు తమ ఆశీస్సులు, సందేశములు దయతో పంపి ప్రోత్సహించిరి. మఱియు శ్రీయుతులు హారిసర్వోత్తమరావుగారు, సోమశేఖర శర్మగారు, గోటేటి జోగిరాజుగారు మొదలగు విద్యావంతులు తమ తమ వ్యాసముల నంపి పురోత్సాహపఱచిరి.

ఇందు వ్యాసములు వ్రాసిన మహనీయులు, మహిళాభ్యుదయమునకై పాటుబడు యితర పత్రికలకు గూడ, తమ వ్యాసముల నంపి తోడ్పడుదురని ఆశించుచున్నాము.

—కం. రం.



## శ్రీ కస్తూరీబా మహిళా పాఠశాల.

### చతుర్ధ వార్షికోత్సవము

పెద్దాపురము.

శ్రీ కస్తూరీబా మహిళా పాఠశాల చతుర్ధ వార్షికోత్సవము. శ్రీ వేముగంటి పాపాయమ్మగారి అధ్యక్షతను 26-3-50 తేదిని. ఆర్యవైశ్య సత్రభవనములో జరిగినది. ఉదయము 8½ గంటలకు పై పాఠశాల స్థాపకురాలు శ్రీ బారు సరోజనీదేవిగారు పతాక వందనమును జరిపించినారు. విద్యార్థిను లెల్లరు, జోహారు గీతమును గానముచేసి, పతాకమును పూజించిరి. మధ్యాహ్న కార్యక్రమమున విద్యార్థినులు కొందరు, "అభిజ్ఞాన శాకుంతల"మను నాటకమును ప్రదర్శించిరి. అందు, చి॥ బేబి సుగుణమణి, నిష్పాణిసోనా ప్రసన్నదేవులు బహు చక్కగానాడి, సభాసదుల నానందింప జేసి వారి మన్ననల నందిరి, శ్రీమతి వి. మోజస్‌గారు, పాఠశాల తరపున ప్రైజులు నిచ్చిరి. శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారు చింతామణి భట్టు లక్ష్మీబాయమ్మగారు. బాలికలకు బహుమతుల నిచ్చి, ప్రోత్సాహపరచిరి పై కార్య క్రమములతో నాటి ఉత్సవ దినము జయప్రదముగా జయజయారావములతో ముగిసినది. జైహింద్.

పెద్దాపురం }
27-3-50 }

శ్రీ కస్తూరీబా మహిళా పాఠశాల.
కార్యదర్శిని.

## స్వీకారము

1. వీరసేనుడు
2. అర్క (అరవింద సందేశములు)
3. ప్రేమైక జీవులు.
4. విశ్వరహస్యము.
5. హాస్యకుసుమాలు.
6. అంధుడు.
7. పెనుమంచిలి జైనదేవుడు.
8. సి. ఆర్. రెడ్డి కాలేజి మాగ్‌జిన్.
9. మాల వెంకన్న (బాబుకార్యాలయం)
10. సంస్కృతం ద్వితీయశతకం.
11. గృహచికిత్స.
12. ప్రబోధరత్నాకరము.
13. శ్రీ యోగాశ్రమము.
14. యోగాసనములు.

ఇవి మే సంచికలో సమీక్షించబడును.

ఆంధ్రమహిళ.

# ఆంధ్రమహిళా సభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్ పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :— కుట్టు, ఎంబ్రాయిడరీ, తోలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీదవిద్యార్థినులకు ఉచితము.
(గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది)

మెడికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు మైపు, మాతృహోంను - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగాజేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# ఆంధ్రమహిళ



JNE 1950. ANDHRA MAHILA ANNAS 6



వధువు సౌ॥ వెంకట కుటుంబమ్మ.
వరుడు శ్రీ మైనేని హరిప్రసాదరావు.

దివితాలూకా, పెదముట్టేవి గ్రామంలో, వ్యవసాయదార్లును, ఆంధ్ర దేశములో మోటారు రవాణా వ్యాపారములో ప్రఖ్యాతిజెందినవారు నైన శ్రీ వడ్లమూడి కుటుంబరావుగారి సోదరి శ్రీమతి వెంకట సుబ్బమ్మ వివాహము, ఏప్రిల్ 30వ తేదీని పెదముట్టేవిలో అతివైభవముగ జరిగినది.

ఆ శుభసమయములో శ్రీ కుటుంబరావుగారు, ఆంధ్ర మహిళా సభకు రూ. 116-0-0 లు కానుకగా నంపిరి.

వీరికి మా కృతజ్ఞత.
వధూవరులకు మా శుభాశీస్సులు.

ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళా సభ

## కాశీ విశ్వ విద్యాలయము, హిందీ, కళా శాఖలు.

కాశీ విశ్వ విద్యాలయపు సీనియర్ తరగతులు, జూనియర్, సబ్ జూనియర్ తరగతులు, జూన్ ఐదవ తేదీనుండి ప్రారంభమగును.

ఇంటర్ మీడియట్ తరగతులు జూలైనుండి ప్రారంభమగును.

వీనిలో జేరగోరువారు వెంటనే దరఖాస్తులు పంపవలెను. జూన్ 15వ తేదీ తరువాత దరఖాస్తులు గణింపబడవు. హిందీలో ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష, విశారద పరీక్షలకు, సంగీతము, నృత్యములందు, శిక్షణ జరుగుచున్నది.

విద్యార్థినులకు వసతి సౌకర్యములు గలవు.

తెలుసుకొనగోరువారు వివరముల పట్టీకై వ్రాయవచ్చును.

మా కార్యాలయములో, మధ్యాహ్నము 2 గం॥—4 గం॥ల లోగా స్వయముగా వచ్చి, తెలిసికొనవచ్చును.

కరెస్పాండెంటు.



# ఆంధ్రమహిళాసభలో

# 1949—1950.

## కాశీ విశ్వ విద్యాలయపు ఎడ్మిషన్ పరీక్షా ఫలితములు

[illegible] ఎడ్మిషన్ పరీక్షలకు, ఆంధ్ర మహిళా సభ మహిళా విద్యాలయపు బాలికలు [illegible] మంది [illegible] 2[illegible] [illegible]. వారిలో ఇద్దరు ప్రథమ శ్రేణిలో ఉన్నత స్థానములను బడసిరి. [illegible] ద్వితీయ శ్రేణిలోను [illegible] తృతీయ శ్రేణిలోను కృతార్థులైరి. కృతార్థులైన వారి పేర్లు ఈ దిగువ వ్రాయబడినవి.

### ప్రథమ శ్రేణి

1. సుధా శేషాద్రి ... .. విశ్వ విద్యాలయంలో 1వ స్థానము.
2. హేమలతా ఆప్ మెహతా .. విశ్వ విద్యాలయంలో 2వ స్థానము.

### ద్వితీయ శ్రేణి

1. చంద్రా డేవిస్.
2. కే. భాస్కరం.
3. క్రిష్ణదర్శన్.
4. కే. సుబ్బలక్ష్మి.
5. కే. రాజరాజేశ్వరి.
6. యం. లక్ష్మి.
7. యస్. మాలిని.
8. సుశీలా జోషి.
9. టి. లక్ష్మి.
10. సి. హెచ్. రాజేశ్వరి.

### తృతీయ శ్రేణి

1. సి. హెచ్. రాధ.
2. డి. పద్మాలయ.
3. హరిదర్శన్.
4. ఇందిరా భవానీ రామయ్య.
5. కే. జానకి.
6. పి. గిరికుమారి.
7. ఉషా జజోడియా.
8. వి. వి. రత్నమాల.
9. వి. శతకీర్తి.
10. వి. శ్యామల.
11. వి. రుక్మిణి.
12. వై. రాజ్యలక్ష్మి.
13. వై. సీతాదేవి.
14. టి. యం. వసంతకుమారి.

కృతార్థులైన విద్యార్థినులకు మా అభినందనములు. ఇట్లే పట్టుదలతో వారి భావి విద్యాభ్యాసములలోనూ, తదితర కార్యక్రమములలోను విజయమును బొందవలెనని మా హృదయపూర్వక శుభాకాంక్షలు.

* * *

# హిందీ పరీక్షా ఫలితములు.

1949 ఆగష్టులోను, 1950 ఫిబ్రవరిలోను, దక్షిణ భారత హిందుస్థానీ ప్రచార సభ వారిచే నేర్పాటు చేయబడ్డ హిందీ పరీక్షలకు, ఆంధ్ర మహిళాసభ నుండి 27గురు విద్యార్థినులు వెళ్లిరి. వారిలో, పదముగ్గురు ప్రాథమిక, పదముగ్గురు మధ్యమ, ఇద్దరు రాష్ట్రభాష పరీక్షలు వ్రాసిరి. వారి ఫలితములు ఈ క్రింద పేర్కొన బడినవి.

## 1949 ఆగష్టులో హిందీ పరీక్షలలో కృతార్థులైనవారు.

ప్రాథమిక పరీక్ష :—8 మందికి — 6 గురు కృతార్థులైరి.

### ప్రథమ శ్రేణి.

1. టి. కమలాకుమారి.
2. ఆర్. హైమవతీదేవి.
3. పి. భానుమతి.
4. [illegible]. సత్యనారాయణమ్మ.

### ద్వితీయ శ్రేణి.

1. డి. జానకిలక్ష్మి.
2. వి. యస్. సరళ.

మధ్యమ పరీక్ష :—4 గురికి — 4 గురు కృతార్థులైరి.

### ద్వితీయ శ్రేణి.

1. జి. సత్యనారాయణమ్మ.
2. టి. బంగారమ్మ.
3. పి. వరలక్ష్మి.
4. జి. గంగాబాయి.

## 1950 ఫిబ్రవరి నెలలో హిందీ పరీక్షలలో కృతార్థులైనవారు.

రాష్ట్రభాష :—పరీక్ష వ్రాసిన యిరువురు విజయముగాంచిరి.

### ద్వితీయ శ్రేణి.

1. యం. కృష్ణవేణి.
2. పర్వతవర్ధనమ్మ.

మధ్యమ పరీక్ష :—8 మందికి, 7 గురు విజయముగాంచిరి.

### ప్రథమ శ్రేణి.

1. బి. సత్యనారాయణమ్మ.
2. టి. విశాలాక్షి.
3. యిందిరాగోపాల్.
4. టి. కమలాకుమారి.
5. ఏ. రంగనాయకి.

### ద్వితీయ శ్రేణి.

1. రోహిణీ నాయర్.
2. బి. రామతులశమ్మ.

ప్రాథమిక పరీక్ష :—5 గురికి, 4 గురు కృతార్థులైరి.

### ప్రథమ శ్రేణి.

1. కె. గిరిజాశంకర్, (11 సం॥ బాలుడు.)

### ద్వితీయ శ్రేణి.

1. యం. కమలాబాయి.
2. జి. శకుంతల.
3. పి. లక్ష్మీనరసమ్మ.

విజయముగాంచిన వారలందఱకూ మా అభినందనములు, శుభాకాంక్షలు.

(తరువాయి 5వ పేజీలో)

## జూన్ 9వ తేదీ విడుదల




ఆంధ్రా సీడెడ్ :— నవయుగ ఫిలిమ్స్, విజయవాడ.

మైసూరు, బొంబాయి :— ప్రకాశ్ పిక్చర్స్, బెంగళూర్ సిటీ.

నైజామ్ :— కర్ణాటక ఫిలిమ్స్ లిమిటెడ్, బెంగళూర్ సిటీ.

వివరములకు :

ప్రకాశ్ ప్రొడక్షన్స్,

శాంథోమ్, మద్రాసు.

ఆంధ్ర మహిళ

52621

సంపుటి 7 •• [illegible] '50 •• సంచిక 2

[illegible]

[illegible]



ఇంకా, కథలూ, నాటికలూ, గద్యాలూ, పద్యాలూ, హిందీ పాఠం, గ్రంథసమీక్ష.

సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్..

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ యం. యే., యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు

(2వ పేజీ తరువాయి)

పారిశ్రామిక విద్యాలయపు పరీక్షా ఫలితములు ఏప్రిల్ సంచికలో ప్రచురింపబడినవి.

* * *

ఎక్కువ శ్రద్ధతో విద్యార్థినులకు శిక్షణ గరపి సహకరించిన ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు మా ధన్యవాదములు.

మొత్తముమీద, 1949-50 సం॥ ఆంధ్రమహిళాసభ కార్యక్రమాన్ని విజయవంతముగానే కొనసాగించినదని చెప్పాలి. విద్యా పారిశ్రామిక శాఖల ఫలితములు తమ కృషిని చెప్పకయే చెప్పుచున్నవి. కళాశాఖకూడ పండుగ పబ్బములకు గోష్ఠుల నేర్పాటు చేయుటయేగాక, నర్సింగ్ హోమ్ సహాయార్థం రమారమి రూ. 7000 చావా ప్రదర్శనమువలన సంపాదించిరి. సారస్వత శాఖలో, పురాణ కాలక్షేపములు, పెద్దలచే ఉపన్యాసాలు జరిగాయి. బాబు రాజేంద్ర ప్రసాద్, రాజకుమారి అమృతకౌరు, ఇంకా ఎందరో ప్రసిద్ధ వ్యక్తులు సభకు వేంచేసి, అందలి కార్యక్రమాన్ని తిలకించారు. నర్సింగ్ హోమ్‌కు శంకుస్థాపన జరిగింది. ఆంధ్ర తుఫాను బాధితుల నిధికై సభ్యురాండ్రు, విద్యార్థినులు రూ. 11000, 4000 పాత బట్టలు వసూలుచేశారు. క్రీడా క్లబ్బు శాఖలు, గ్రంథాలయ శాఖలు, క్రమక్రమంగా అభివృద్ధి జెందుతున్నాయి. సభ్యురాండ్రు, ఇంకా అనేక కార్యక్రమాల్లో పాల్గొంటూ, తమ విద్యా సంస్కృతులను పెక్కు విధముల చాటుతున్నారు. పండుగలూ, పబ్బాలూ, సన్మాన సభలూ, గౌరవ సభలూ, ఎంతో ఉత్సాహంతో, సంతోషంతో, సహకారంతో, స్నేహభావంతో జరుపుతున్నారు. ఈ కార్యక్రమాలన్నీ విజయవంతంగా, జరిపించిన కార్య నిర్వాహక వర్గానికి, సలహాలతో సహకరించిన ట్రస్టు బోర్డువారికి మా కృతజ్ఞత.

అ. చన్నఘంటమ్మ. — జ. జమునాబాయి.




సంపుటి 7 జూన్ 1950 సంచిక [illegible]

# యునెస్కో కర్తవ్యం

ప్రపంచాన్నంతా తుత్తునియలు చేస్తూన్న పరస్పర ద్వేషమనే భయానక మనస్తత్వాన్ని అతిక్రమించకపోతే, కల్లోలిత ప్రపంచం గాఢ తిమిరంలోకి జొచ్చుకొని పోతుందనీ ఈ ద్వేషాతిక్రమణ యునెస్కో పరిముఖంగానే జరుగాలనీ, ఇటీవల ఫ్లారెన్సులో జరిగిన, ఐదవ యునెస్కో సాధారణ సమావేశంలో, 1000 మంది ప్రతినిధులను హెచ్చరించారు, భారతీయ ప్రతినిధియు, మాస్కోలో భారతీయ రాయబారియునైన, సర్. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు.

ప్రపంచంలో అర్ధభాగం జనాభాయైన, ఆసియా ఆఫ్రికా ఖండాల ప్రజలు, అజ్ఞానములో, అవిద్యలో, అనారోగ్యంలో మ్రగ్గుతూ, సాధారణ జీవితాన్ని సుఖమయంగా జేయగల ప్రాథమిక అవసరాలైన తిన తిండి, కట్ట గుడ్డ, నిలువ నీడ లేక, అల్లాడుచున్న యీ తరుణంలో, విజ్ఞాన వికాసాలతో, ఆధునిక విద్యా సంస్కృతులతో, ఆర్థిక సమృద్ధిలో, నోలలాడుచున్న ప్రభుత్వాలు ఆయుధ నిర్మాణంలో, యుద్ధసన్నాహంలో నిమగ్నులై వారి ధనసంపత్తిని దుర్వినియోగము చేయుట శోచనీయాంశమని వారు చెప్పారు. ఇది వాస్తవము. అంతులేని అణ్వస్త్ర శక్తిగాని, లక్షలాది విమాన దళముగాని, ప్రజానాశన కారణములు కాగలవు గాని, పీడిత ప్రజా హృదయాల్లో అగ్నిహోత్రంలా ప్రజ్వలిల్లుచున్న ద్వేషకణములను చల్లార్చలేమి, యుద్ధనిర్మూలనకున్గాని, శాంతి స్థాపనకుగాని సాధనా లొక్కనాటికి కానేరవు. పాశవ బలంచే తాత్కాలికంగా సంభవించే విజయము ఏ పక్షమువారిదైతే మాత్రమే, మానవునిలోని మానవత్వమే నశించి, ఆదర్శాలు అంతర్ధానమైన యనంతరం, ప్రజాస్వామ్యంగాని, కమ్యూనిజమ్‌గాని, ఇంక ఏ రాజకీయ కక్షగాని, రూపుగలిగి నిలువగలదని ఎంచుట పరమ మౌఢ్యం.

పరజాతి పీడన స్వజాతి నాశనానికి కారణభూతమని విశ్వశించవలసిన ఆవశ్యకతను విస్మరిస్తూ, ప్రజాస్వామ్య ప్రభుత్వాలమని చాటి చెప్పుకుంటూ ఉన్న రాజ్యాలవారుకూడ జాతి

దురహంకారాన్ని చూపుచున్నారు. అమెరికాలోని నీగ్రోల దుస్థితి, ఆఫ్రికాలోని భారతీయులపై తెల్లవారల అత్యాచారాలు ఇందులకు ప్రబల నిదర్శనములుగా, చరిత్ర పుటలలో నల్ల అక్షరములతో లిఖింపబడుచునే యున్నవి.

మానవునియందలి వ్యక్తిత్వాన్ని గౌరవించక, వారి ప్రాథమిక హక్కులను అణగద్రొక్కుచూ, సంస్థ, సమాజముల ప్రాధాన్యములో, అందలి బెజములైన వ్యక్తులను దోపిడీ విధానములో, అనేక రకములైన కట్టుబాట్లలో, అస్వతంత్రులుగా జేయుచున్నంతకాలము, వారిలోని విప్లవ శక్తులకు ప్రోద్బలమే కలుగుతుంది. అదీగాక, ప్రభుత్వమేకక్షను జెందినది, ఏ ప్రభుత్వముయొక్క ఆశయములు ఉత్కృష్టమైనవి అను విమర్శ సామాన్య ప్రజకెందుకు? వారికి వృత్తి, భుక్తి, వసతి, కలిగించేది ఏ పరిపాలనయో, అదే వారి మక్కువ మొగ్గు సూపగలదు.

ఐక్యరాజ్యసమితియొక్క ఆదర్శములకు వ్యతిరేకంగా, అస్త్రబలమును బట్టి, రాజకీయ కక్షలను బట్టి చీలికలై, సమితిలో రెండు బలవర్ధక కక్షలుకాగల సూచనలు కన్పట్టుచున్నవి. వివిధరాజ్యాల నడుమ విస్తరిల్లిన అనుమానము, ద్వేషము ఇందులకు కారణములగుచున్నవి. ఒకరినొకరు అవగాహన చేసికొనగల సహన స్వభావము పెంపొందించుకొని, వెనుకబడియున్న దేశాల యభివృద్ధికై, సమితి పరిముఖంగా, ధనవస్తు సాంకేతికుల సహాయము లభించినచో, అన్ని జాతులవారు, అన్ని రాజ్యాలవారు, సమాన అవకాశ ప్రతిపత్తులు కలవారు కాగలరు. అదియే ప్రజాస్వామ్యాభివృద్ధికి మూలము కాగలదు.

ఇట్టి నిర్మాణానికై, అంతర్జాతీయ సహకార ద్రవ్య నిధిని ఐక్య రాజ్య సమితివారు ఏర్పరుచుట ఎంతయు అవసరమని చెప్తూ, అస్త్రబలంయొక్క అసంపూర్ణతను లోకానికి ఋజువుచేస్తూ, పరస్పరద్వేష భూయిష్ఠమైన వాతావరణను మార్చి, సహనము సౌభ్రాతృత్వము, సమానత్వము నిర్మించవలసిన బాధ్యత యునెస్కో, అంటే ఐక్యరాజ్యసమితి, విద్యా శాస్త్రీయ సాంస్కృతిక పరిషత్తు సభ్యులదని, రాధాకృష్ణనుగారిచ్చిన ఉద్బోధ ఎంతయు అనుసరణీయమైనది, ఆవశ్యకమైనది.



# హిందూ స్త్రీల హక్కు బాధ్యతల పునరుద్ధరణ

శ్రీ. అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఎమ్. ఎల్. ఎ

హిందూ శాస్త్ర సవరణనుగూర్చి శాసనసభలో, ప్రత్యేక సమావేశాలలో, ఉపన్యాసాలలో, వార్తా పత్రికలలో ఎన్నో వక్తవ్యాలు వచ్చుచున్నవి. సంస్కర్తలు క్రోడీకరించి నూతన రాజ్యాంగము ననుసరించి సంస్కరణ మార్గములో పోవాలని వాదిస్తే సనాతనులు ఇందు ఏ విధమైనమార్పు పనికిరాదని, యిటీవల జరిగిన ప్రత్యేక సమావేశములో ఎంతో వాదోపవాదములు జరిగినవి. వేదకాలమునాటి స్త్రీల హక్కులను వివరిస్తూ, ప్రస్తుతము జరుగవలెనన్న సంస్కరణ అవసరమేనని రచయిత ప్రతిపాదించుచున్నారు.
సం॥

ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి!
సూర్యా చంద్ర మసౌ విధృతౌ తిష్ఠతః।
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి!
ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః॥
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి!
నిమేషా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధ మాసామాసా
ఋతవః సంవత్సరా ఇతి విధృతాస్తిష్ఠంతి॥
ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి!
ప్రాచ్యోఽన్యానద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః।
ప్రతీచ్యోఽన్యాః యాంయాంచ దిశమను॥

ఈ మహామంత్రము వేదశిఖరములని, వేదముల సారమని చెప్పబడెడి ఉపనిషత్తులలోకెల్ల మిగుల గొప్పదగు బృహదారణ్యకోపనిషత్తుయొక్క 3వ అధ్యాయము 8వ బ్రాహ్మణములోని 9వ మంత్రమై యున్నది. ఏ జాతియొక్కగాని, ఏ కాలములోనైనాగాని నాగరికతయొక్క ఔన్నత్య క్షీణతలకు, కొలతబద్ద, ఆ జాతిలో ఆ కాలమున స్త్రీలకుగల స్థానమే. నేటికి పదివేల సంవత్సరముల క్రిందట, భారతవర్షములో, జనకమహారాజుయొక్క దర్బారులో జరిగిన పండితుల మహాసభలో, తనతో వాదోపవాదములు చేయుచున్న బ్రహ్మచారిణి, మహా విద్వాంసురాలునగు 'గార్గి' యను నామెను సంబోధించుచు యాజ్ఞవల్క్య మహాఋషి ఇచ్చిన ప్రత్యుత్తరములలో పై మహా మంత్రము భాగమై యున్నది. "ఓ గార్గి! అక్షరుడైన పరమాత్ముని యొక్క ప్రచండమైన శాసనమువలననే, సూర్యుడు, చంద్రుడు తమ తమ స్థానములలో నున్నారు. ఓ గార్గి! అక్షరుడైన పరమాత్మయొక్క ప్రచండమైన శాసనము వలననే ఆకసము, భూమి తమ స్థానములలోనుంచి పడిపోకుండ నిలచియున్నవి. ఓ గార్గి! అక్షరుడైన పరమాత్మయొక్క ప్రచండమైన శాసనము వలననే, నిమిషములు, ముహూర్తములు, రాత్రింబగళ్లు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు వరుస తప్పకుండ తమ తమ కాలములలో వచ్చుచున్నవి. ఓ గార్గి! అక్షరుడైన పరమాత్మయొక్క ప్రచండమైన శాసనము వలననే కొన్ని నదులు శ్వేత పర్వతముల నుండి తూర్పుగా ప్రవహించుచున్నవి. మరికొన్ని నదులు పశ్చిమముగా ప్రవహించుచు అటులనే పోవుచున్నవి. ఇతరనదులు తమ పోకడలలో ఆగకున్నవి." అని యీ మంత్రమున కర్థము.

ఆ కాలము భారత నాగరికతలో స్వర్ణయుగము. జనకమహారాజుయొక్క పండిత సభలో ఆయన పెట్టిన గొప్ప పందెమును గెలుచుటకు యాజ్ఞవల్క్యుడు ప్రయత్నించెను. ఆయన ననేక ప్రశ్నలనడిగి యోడించవలెనని పండితులనేకులు యత్నించిరి. అన్ని ప్రశ్నలకును ఆయన సహేతుకమైన ప్రత్యుత్తరముల నిచ్చుచుండెను. ఎవరును ఆయనను గెలవలేక పోయిరి. ఆ సమయములో గార్గియను పైన జెప్పబడిన విదుషీమణి లేచి తాను కొన్ని చిక్కు ప్రశ్నలను అడిగెదనని వాటికి తగిన సమాధానములను యాజ్ఞవల్క్య ఋషి చెప్పినట్లైనచో యెవరును ఆయనను ఓడించలేరనిన్ని చెప్పినది. అందరును అంగీకరించిరి. ఆమె అనేక క్లిష్టమైన ప్రశ్నలను వేసినది. ఆ మహాఋషి వాటి కన్నిటికిని తగిన ప్రత్యుత్తరముల నిచ్చెను. సభికులందరును తృప్తిచెందిరి. ఇక

ఎవరును ఆయనను ఓడింపలేరని గార్గి చెప్పెను. ఆ దర్బారులో ఆ మహా ఋషికి ఆ గొప్ప పందెము బహుకరించబడెను. బాలురు యిరువదియైదు సంవత్సరములు వెళ్లు వరకును బాలికలు పదునెనిమిది సంవత్సరములు వెళ్లు వరకును విధిగా బ్రహ్మచర్య శిక్షణ విధానము ననుసరించి సకల శాస్త్రములను నిర్బంధముగా అభ్యసించిన కాలమది. ఆధ్యాత్మిక, మానసిక శాస్త్రములేగాక ప్రకృతి శాస్త్రములు సాంఘిక ధర్మశాస్త్రములుకూడ బాల బాలికలకు నేర్పబడెను వృత్తి విద్యలుకూడ నేర్పబడెను. బాలికలకు గృహ పరిశ్రమలు ప్రధానముగ నేర్పబడెను వేదమంత్ర రచయితలలో స్త్రీలుగలరు.

బృహదారణ్యకోపనిషత్తుయొక్క నాల్గవ అధ్యాయము, ఐదవ బ్రాహ్మణములో యాజ్ఞవల్క్య ఋషి తన భార్యయైన మైత్రేయికిచేసిన బ్రహ్మజ్ఞాన వుపదేశములు ప్రధానస్థానము నాక్రమించుచున్నవి. ఆమె గొప్ప విద్వాంసురాలు పర బ్రహ్మతత్వమును గూర్చి మోక్షమునుగూర్చి భర్తతో వాదోపవాదములు చేసెను. ఆమెయొక్క సందేహము లన్నిటిని ఆయన తీర్చెను. నాల్గవ అధ్యాయము, ఐదవ బ్రాహ్మణములోని ఆరవ మంత్రములో ఆయన ఆమెతో నిటుల చెప్పినటుల కలదు "ప్రియురాలా! భార్య భర్తను ప్రేమించుట భార్యకొరకు కాదు. తన ఆత్మోన్నతికై ప్రేమించుచున్నాడు. పుత్రులను తల్లి దండ్రులు ప్రేమించుట పుత్రుల కొరకుగాదు తమయొక్క ఆత్మోన్నతికై ప్రేమించుచున్నారు. మనము భూతములను ప్రేమించుట వాటికొరకు గాదు. మన ఆత్మోన్నతి కొరకై ప్రేమించుచున్నాము. (మానవుని హృదయములో ప్రేమ అను సద్గుణము నాటబడియున్నది. దానికి దయ అనికూడ పేరు. అతడు తన దారా పుత్రాదులను పొరుగు వారిని ప్రేమించుట మూలముగా నా సద్గుణములను వృద్ధిచేసికొనని యెడల నైతిక పతనమొందుచున్నాడు. కుటుంబము యొక్కయు ఇరుగు పొరుగు వారి యొక్కయు ప్రేమ, లోకమును విశ్వమును ప్రేమించుటను నేర్చుకొనుటకు ముఖ్యమైన మెట్టు. భగవంతుడు ప్రేమ స్వరూపుడు గనుక ఆయనను పొందుటకు మాతృ దేశమును మానవకోటిని సమస్త భూతములను విశ్వమును ప్రేమించుట



అవసరమైయున్నది) నా ప్రియురాలైన మైత్రేయి! పరమాత్మనుగూర్చి వినవలెను. ధ్యాన మననములను చేయవలెను. వినుట వలనను ధ్యాన మననముల వలనను ఆయనను తెలిసికొని నపుడు పైనచెప్పబడిన దంతయు పూర్తిగా తెలియును." ఆమెకు ఆయన చేసిన బోధలలో చేరిన పదవ మంత్రములో మోక్షమునుగూర్చి యిటుల చెప్పినాడు. "పరిపూర్ణత్వమును జెందిన ముక్తుడైన జీవాత్మ పరమేశ్వరుడనెడి మధుర వీణాగానము చేయునప్పుడు దాని వివిధ ప్రత్యేక శృతులను వేరువేరుగా తెలిసికొనజాలము. అవన్నియు ఆ వీణా గానములో కలిసిపోవును. అటులనే ముక్తుడైన జీవాత్మ గూడ పరమాత్మలో చేరిపోవును." అని చెప్పబడినది.

బృహదారణ్యకోపనిషత్తుయొక్క ఆరవ అధ్యాయం, నాల్గవ బ్రాహ్మణము, 16వ మంత్రములో యెవరైతే తనకు పూర్తియగు దీర్ఘాయువు కలిగినట్టియు, మంచి పండితుడైనట్టియు పుత్రుడు కావలెనని కోరునో అతడు తన భార్యతో కలసి చేయవలసిన వ్రతము భుజించవలసిన పాయసము చెప్పబడినది అటులనే 17వ మంత్రములో తనకు సంపూర్ణమగు ఆయుర్దాయము కలిగినట్టియు, మంచి పండితురాలైనట్టియు కుమార్తె కావలెనని కోరువాడు తన భార్యతో సహా చేయవలసిన వ్రతము భుజించవలసిన పాయసము చెప్పబడియున్నది. ఈ విధముగా - ఆ కాలములో విద్వాంసులైన కుమారులను కుమార్తెలను కావలెనని సమానముగా కోరినటుల తెలియుచున్నది. బృహదారణ్యకోపనిషత్తుయొక్క 1వ అధ్యాయము, 4వ బ్రాహ్మణము, 3వ మంత్రములో స్త్రీయొక్క యుత్పత్తిని గురించి యిటుల చెప్పబడినది. "(ప్రథమ) పురుషుడు సుఖముగా నుండలేదు. ఒంటరిగా నుండు వారికి సుఖములేదు. తనకు సహచారిణి కావలెనని కోరెను. శరీరమును పెద్దదిగ చేసి భార్యా భర్తలు కౌగలించుకొని యొకటిగా నున్నటుల సృష్టించుకొనెను. అంతట ఆ పెద్ద శరీరమును రెండు సమ భాగములుగా విభజించెను. అందులోనుండి భార్యా భర్తలిరువురుద్భవిల్లిరి. కాబట్టి యీ శరీరము (పురుషుని శరీరము) తనలో సగభాగమే. రెండుసమ చెక్కలుగా చీల్చబడిన బఠాణీగింజయొక్క ఒక చెక్క వలె సగభాగమైయున్నది. మిగిలిన సగభాగము (వివాహ మాడి)

భార్యను తెచ్చుకొన్నప్పుడే పూర్తియగును. అప్పుడాయన ఆమెలో కలిసిపోయి యేకమగును. 'పాదస్వరంవలె నుండి పూర్వార్థము పుట్టింది' అని యాజ్ఞవల్క్య మహర్షి చెప్పెను. ఈ మంత్రమువలన పురుషుడు, స్త్రీ ఒకే శరీరములోని సగభాగములనియు, సమాన హక్కు బాధ్యతలు కలవారనియు తెలుస్తున్నది. భారత దేశముయొక్క అర్చ్యము అర్ధనారీశ్వరుడగు ఈశ్వరుడు. ఆయన తన భార్యయగు పార్వతిని (శక్తిని) సగభాగముగ చేసికొని యున్నాడు. ఉపనిషత్తులు గృహస్థాశ్రమమును ప్రశంసించుచున్నవి. వివాహము కాకముందు పురుషుడు సుఖముగా నుండడు. తనలో సగముగానే యుండును. ఈ కొరతను తీసివేసి తాను పూర్తియగుటకుగాను వివాహమాడి భార్యను తెచ్చుకొనును, అని శ్రీ శంకరాచార్యుల వారే తమ భాష్యములో వ్రాసినారు. తైత్తిరీయోపనిషత్తుయొక్క శిక్షావల్లి యేకాదశ మంత్రములో "మాతృదేవో భవ। పితృదేవో భవ। ఆచార్య దేవో భవ। అతిథిదేవో భవ॥" అని చెప్పబడి యున్నది. ఇందువలన తండ్రికంటెను, ఆచార్యునికంటెను, అతిథికంటెను ప్రథమ గౌరవ స్థానము తల్లికివ్వబడెను. సుఖమైత్రియు, శాంతియుతమైత్రియు, ప్రేమపూరితమైత్రియు, ఆత్మోన్నతికి తోడ్పడునట్టియు కుటుంబము భారత జాతీయ జీవనమునకు ప్రథమ పునాదిగ చేయబడినది. స్త్రీలకును పురుషులకును సర్వవిధముల సమానహక్కు బాధ్యతలు కలుగజేయబడినవి. ఆస్తిపంపిణీకిని వారసత్వమునకును సంబంధించిన హక్కులు కూడ స్త్రీ పురుషులకు సమానముగానే యుండెను.

పిమ్మట చాల శతాబ్దములకు విదేశీయుల దండయాత్రలు మొదలైన కారణములవల్ల స్త్రీలయొక్క గౌరవ ప్రతిపత్తులు, హక్కు బాధ్యతలు క్షీణించినవి. బాల్యవివాహము లేర్పడినవి. స్త్రీలు వేదములు చదువరాదనిరి. సూత్రముల కాలములో ఆస్తి హక్కులు నశించినవి. మనుస్మృతిలో స్త్రీ అస్వతంత్రురాలు. చిన్నతనములో తండ్రియొక్కయు, పడుచుతనములో భర్తయొక్కయు వృద్ధాప్యములో కుమారుని యొక్కయు పోషణలో స్త్రీ యుండవలెను; ఆమెకు ఆస్తియందు హక్కులేదు అని వ్రాయబడినది. ఇది మనువు నిజముగా వ్రాసినది కాదనియు, దరిమిలా స్వార్థపరులైన పురుషులు మనుస్మృతిలో యిరికించినారనియు కొందరు చెప్పుచున్నారు. ఏదెట్లైనా తేల్చుట కష్టము. మనుస్మృతిలోని స్త్రీ అస్వతంత్రురాలను సిద్ధాంతము మీదనే బ్రిటిషు వ్యాఖ్యానకర్తలు తమ గ్రంథములను వ్రాసినారు. అవి బ్రిటిషు కోర్టులలో ప్రమాణమైనవి. మనువు కాలమునాటి నుండి తరువాత వచ్చిన స్మృతికర్తలు, యాజ్ఞవల్క్య స్మృతికి వ్యాఖ్యాతలగు మితాక్షరమును రచించిన విజ్ఞానేశ్వరుడు దాయభాగమును రచించిన జీమూతవాహనుడు స్త్రీలయొక్క ఆస్తిహక్కులను పునరుద్ధరించుటకు, వృద్ధిచేయుటకు ప్రయత్నించుచు వచ్చిరి. విజ్ఞానేశ్వరుడు తన వ్యాఖ్యానములో స్త్రీకి భర్త, తల్లిదండ్రులు, బంధువులు యిచ్చిన ఆస్తియందు స్త్రీధనముగా దాన విక్రయాది సంపూర్ణ హక్కులున్నట్లే, ఆమెకు భర్తనుండిగాని తండ్రినుండిగాని వారసత్వముగా వచ్చిన ఆస్తి గూడ దానవిక్రయాది సంపూర్ణ హక్కులుగల స్త్రీధనమే అగుచున్నదని వ్రాసినాడు. జీమూతవాహనుడు అవిభక్త కుటుంబములో కూడ మరణించిన పురుషునియొక్క భార్య తనభర్తయొక్క ఆస్తిని జీవితకాలమువరకు అనుభవించవచ్చునని వ్రాసినాడు. మితాక్షర వ్యాఖ్యానములో అవిభక్తకుటుంబములో వితంతువుకు మనోవర్తి మాత్రమే కలదు. ఇటుల స్త్రీల ఆస్తి హక్కులు అభివృద్ధియగుచున్న కాలములో బ్రిటిషువారి పాలనక్రిందికి మనదేశము పోవుటయు, బ్రిటిషు వ్యాఖ్యాతలగు మెక్నాటన్, స్ట్రేంజ్, మెయిన్ మొదలగు వారు మనువుయొక్క స్త్రీ అస్వతంత్ర సిద్ధాంతమునకు ప్రాముఖ్యతనిచ్చి అభివృద్ధి నిరోధమును కలుగజేసినారు. స్త్రీలయొక్క హక్కులు అభివృద్ధి కాకుండా బ్రిటిషు కోర్టులతీర్పులనెడి యినుపసంకెళ్లతో బంధింపబడినవి. అంతవరకు ప్రజాభిప్రాయమును బట్టి అభివృద్ధికరమైన మార్పులు జరుగుటకు అవకాశముండెను. ఈ మార్పులు ఆచారములయ్యెవి. ఆచారములనే అంగీకరించుచు స్మృతికర్తలు వ్యాఖ్యానకర్తలు వ్రాసేవారు. బ్రిటిషు పాలకులు రాగానే హిందూలాను (ధర్మశాస్త్రమును) అప్పటికి నిలచియున్న ఆచారములలో క్రోడీకరించి, ఆంగ్లేయ పండితులు వ్రాసిన గ్రంథములు ప్రమాణములుగ తీసికొని, వాటిని కోర్టుల తీర్పుల

ద్వారా ఖచ్చితముగా అమలుజరిపినారు జిల్లాకోర్టు హైకోర్టు క్రీదికొన్నిటి తీర్పులు పరమప్రమాణములైనవి. వాటిని మార్చు అధికారము శాసన సభలకుమాత్రమే కలదు. హిందూలా విషయములోను హిందువుల ఆచారముల విషయములోను శాసన సభలు జోక్యముకలుగచేసికొనకూడదని వాదించువారు పూర్తిగా అభివృద్ధి నిరోధకులు; ప్రస్తుత హిందూ చట్టమువల్లను ఇపుడు మనలోనున్న హిందూ ఆచారముల వల్లను లాభములను పొందుచున్నవారు. ఆంగ్లేయ పండితులు ఆంగ్లేయ కోర్టులు వారికి ప్రమాణములట! ప్రాచీన కాలము నుండి స్మృతులలోను ఆచారములలోను ఎన్నో మార్పులు జరిగినవో వారు గమనించ దలచరేమి. వేదకాలమునకు పోవుటకు వలయు మార్పులు చేయుటకు వారికిష్టములేదు. వారికి కావలసినది ఇపుడు నిలచియున్న ఆచారములు మాత్రమే; తీర్పులుమాత్రమే. భారతీయ ప్రతినిధులతో కూర్చిన శాసన సభికులతో ప్రజాభిప్రాయము ననుసరించి చట్టముల ద్వారా మార్పులు చేయకూడదని, శాసన సభలు ఈవిషయములలో జోక్యము పుచ్చుకొనుట వలన మతమునకు అపాయము కలుగుచున్నదని వీరుచెప్పేవాదము విడ్డూరమైనది. సహగమనమును నిషేధించు చట్టము, వితంతువులు పునర్వివాహము చేసికొనుటకు అనుమతి నిచ్చు చట్టము, చాలకాలము క్రిందనే ప్యాసయినవి. ఇటీవల భారతీయ శాసనసభ రాష్ట్రీయ శాసన సభలు చాల అభివృద్ధి కరమైన చట్టములు చేసినవి. బాల్యవివాహములు నిషేధించిన శారదాచట్టము, వివిధకులముల మధ్యను ఒకేకులములోని అంతశ్శాఖల మధ్యను వివాహములు నిషేధములు కావు అని అనుమతించు చట్టము, సగోత్రీకులు, సప్రవరీకులు వివాహమాడ వచ్చునను చట్టము, భారతశాసన సభవారు మంజూరు చేసియున్నారు. కొన్ని పరిస్థితులలో కోర్టుల ద్వారా వివాహ విచ్ఛేదము పొందుటకు హక్కును కలుగ చేయుచట్టము మదరాసు రాష్ట్ర శాసన సభలలోను బొంబాయి రాష్ట్ర శాసన సభలలోను మంజూరై ఆరెండు రాష్ట్రములలోను అమలులో నున్నవి. కొన్ని విశేషపరిస్థితులలో భార్య భర్తనుండి విడిగా కాపురము చేయుటకు హక్కు, అందుకు కావలసిన ఇల్లు మనోవర్తి, భర్త ఆమెకుఇచ్చు బాధ్యత కలుగచేయుచు ఢిల్లీ శాసన సభవారు చట్టమును చేసినారు. ఆస్తిసంక్రమణ విషయములో జ్ఞాతులకన్న సోదరీ పుత్రులకు సోదరులకు మనుమరాండ్రకు వితంతు కోడండ్రకు దగ్గర వారసత్వము నేర్పాటుచేసిన చట్టములు ప్యాసుఅయినవి; ఆస్తిహక్కుల విషయములో హిందూ స్త్రీల ఆస్తిహక్కుల చట్టమును ఢిల్లీ శాసన సభచేసినది దానినిబట్టి, మరణించిన భర్తఆస్తిలో కుమారుడితోపాటు సమానభాగము జీవితకాలమునకు రావలెనని చట్టముచేయబడ్డది. ఇటులనే వితంతుకోడలికి కూడ హక్కు కలుగ చేయబడినది. సమిష్టి కుటుంబములో వితంతు భార్య తన మరణించిన భర్తయొక్క భాగమును జీవితకాలము పొందు అనుభవించు హక్కు కలుగచేయబడినది. ఈ చట్టము వితంతు స్త్రీని మనోవర్తిభరణములో నుండి విముక్తిచేసి తన జీవితకాలమువరకు భర్తయొక్క భాగపు ఆస్తిని అనుభవించు హక్కు కలుగచేసినది. ఇది స్త్రీలహక్కుల పునరుద్ధరణకు గొప్పమెట్టు.

స్త్రీలు ఇపుడు కోరునవి వారికి న్యాయముగా రావలసిన హక్కులు రెండు.

(1) స్త్రీకిదివరకునుండి వారసత్వముగా సంక్రమించిన ఆయాస్తియందు జీవితకాలపు హక్కు మాత్రము గాక పురుషులకువలెనే సంపూర్ణ దానధర్మ విక్రయ హక్కులు గల హక్కులుకావలెను. క్రైస్తవ స్త్రీలకును ముస్లిం స్త్రీలకును వారివారి ఆస్తి చట్టములలో సర్వవిధములైన ఆస్తికిని సంపూర్ణ హక్కులు గలవు. ఇట్టిసంపూర్ణ హక్కులనే హిందూస్త్రీలుకూడ కోరుచున్నారు. తమ స్త్రీధనమునందు మాత్రము హిందూ స్త్రీలకు సంపూర్ణ హక్కులు గలవు. వారసత్వము ద్వారావచ్చిన ఆస్తికికూడ సంపూర్ణ హక్కులను కోరుచున్నారు.

(2) తమ తండ్రియొక్కగాని తల్లియొక్కగాని ఆస్తిలో కుమాళ్లకును కూతుళ్లకును సమాన భాగమును కోరుచున్నారు. క్రైస్తవులలో కూతుళ్లకు కుమాళ్లకు సమాన భాగములు గలవు.

ఇంతేగాక బహు భార్యానిషేధ చట్టమును కొన్ని విశేష పరిస్థితులలో వివాహ విచ్ఛేద హక్కును మద్రాసు బొంబాయి రాష్ట్రములలో నిపుడున్నటులే

(48-వ పేజీ చూడుడు)



# జాజిమల్లి

అడివి బాపిరాజు

## రెండవ గుచ్ఛము

౧

ఎన్నో అందాలు ఎందరి జీవితాలలోనో ప్రత్యక్షం కాకుండానే, భావమాత్రంగానైనా దర్శనం ఇవ్వకుండానే, ఈ జగత్తు నడిచిపోతూ ఉంటుంది. కాని ప్రాథమికమైన సౌందర్యభావం మానవులందరి జీవితంలోనూ వికసించి ఉంటూనే ఉంటుంది. జీవితాన్ని నిజంగా అర్థంచేసికోలేని కర్కశవాదులు రెండుచేతులా ఆకాస్త అందాన్ని కూలద్రోసి, ధూళినిండిన దారులలో యాత్ర సాగిస్తారు.

పల్లెటూరివారి జీవితాలలో కవిత్వమూ, సంగీతమూ నిర్వ్యక్తంలో అంతర్భావమైపోతాయి. అవతల ఒడ్డులేని సముద్రము, లోతులు తెలియని కడలి, పద్మాలకు ఎప్పుడూ ఏవో చిరుగాలులు ప్రసరించిన యేటి అలలులా ఆలోచనలను ఉద్భవింప చేసేవి.

పల్లెవాటికి సముద్రం ఒక మహారాజ స్నేహితుడు. కాబట్టే వాళ్ల జీవితాలలో అనంతమైన దూరాలు, లోతులు మించిన పారాలు. వాళ్లు ఓడలు నిర్మించే విశ్వకర్మలూ, ఆ ఓడలు దేశాల కడపలకు తేలిపోజేసే నావికులు కాగలిగారు.

పద్మమ్మకూడా తండ్రి తెప్ప నావమీద చేపలకోసం ఉదయ దిశాంచలాలు దాటి వెళ్లేటప్పుడు తానూ వెళ్లింది. ఉప్పునీళ్లలో చేపపిల్లలా ఈదగలిగేది. ఎంత మునిగినా, లోతులందని నీలజలాలు, ఎంత ఈదినా దూరమందని కెరటాలు; కొండవిరిగినట్లు ఒడ్డుకు దొర్లిపడే తరంగాలు, ఆకాశాలతో గుసగుసలుపోయే కల్లోలాలు; ఏనాడనుంచి, ఏ దరి పోతాయో తెలియని పారావార ప్రవాహాలు పద్మమ్మ జీవితాన్ని సుళ్లుమట్టి, ఆ బాలికకు అవ్యక్త వాంఛల్ని ఎన్నో అందిస్తూ ఉన్నాయి.

ఏడు సముద్రాలకూ పెంపుడుబిడ్డ పద్మమ్మ. ఆ సముద్రాల లావణ్యం అంతా పద్మమ్మలో నవనవలాడుతూ ఉండేది. ఆ జవ్వని కంఠమూ లావణ్యం దాల్చింది.

సంగీతం మేష్టరు నరసింహామూర్తి నేడు పద్మావతి అయిన పద్మాలుకు గాన విద్యా శిక్షణ ప్రారంభించాడు. కెరటాలలోని, తుఫానులలోని, ఆకాశ నీలాలలోని, అనంత దూరాలలోని మాధుర్యాలు వాకలు కట్టించుకొన్న ఆమె కంఠం ఆ శిక్షణకు ఏలా లొంగుతుంది?— సముద్రానికి ఆనకట్టలు కట్టగలవా? లోతులకు కొలతలు వేయగలరా? నరసింహామూర్తి కష్టపడి కర్ణాటక బాణీ సంపాదించుకొన్న

సంగీతం వేస్తరు. కావలిలో, కావలి చుట్టుపక్కల గ్రామాలలో, సంగీత సభలుచేసి 'పాటకుడు' అని పేరుపొందిన వాడే! అయితేమాత్రం సంగీత సముద్రానికి వారధి కట్టడానికి ఆతను శ్రీరామచంద్రుడా ఏమన్నానా!

పద్మావతి తన రాగాలు తాను సృష్టించుకోలేదు. తన సతులు తానే నిర్మించుకోలేదు. సముద్రానికి సంప్రదాయాలు ఎవరు శిక్షించగలరు! నరసింహమూర్తికి మతిపోయింది.

౨

పద్మావతి ఒంటినిండా నగలు దిగవేశాడు బుచ్చి వెంకట్రావు. ఆనాటికి అవి పదమూడువందల ఏభైరూపాయల మూల్యం కలిగిన బంగారం నగలు. తాను పెద్దచేపల వరకు డబ్బుతున్నాడు. యుద్ధంలో దేశాలు తిరిగివచ్చినవాడవటం చేత ఇంతోకొంతో లోకజ్ఞానం సంపాదించుకున్నాడు. దేశాలు తిరిగేవారికి దుమ్ముధూళిలా అక్కర్లేదనుకొన్నా జ్ఞానం కాస్త అంటుకు తీరుతుంది. కాని ఇది ఏమిటి? అని ప్రశ్న వేసుకొనే యోగంతో బయలుదేరిన పురుషునికి ఆతడు ఎంత తక్కువబుద్ధి శ్రేణిలోవాడైనా లోకజ్ఞానం బాగా వచ్చితీరుతుంది. బుచ్చి వెంకట్రావు తన జీవితానికి నిచ్చెనలు అమరించి, పైకి వెళ్లాలి అన్న పట్టుదలకలిగిన సంకల్పజీవి. ఆతడు సముద్రమూలాలకి ఈదుకుని వెళ్లిన మనిషి. యుద్ధంలో రంగూనుకు వెళ్లినప్పుడు సముద్రం ఓడమీద దాటినవాడే. ఏరేదైనా సముద్రానికి అవతలవొడ్డు రేవు కాదు. సముద్రంవేరు, రేవులువేరు. రేవులన్నీ, సముద్రానికి సేవకులవంటివి అని బుచ్చివెంకట్రావు ఊహించుకొన్నాడు.

తాను తన జీవితంలో గొప్పవాడవటం తన పద్మావతి కొరకే. తనకు తన పద్మావతికి ఒకసారే చదువురావాలి. తన జీవితం చెట్టు అయితే ఆ చెట్టంతా నిండి వికసించిన పూవులప్రోగు పద్మావతి. పూవులులేనిచెట్టు అందమే కాదు. చెట్టు లేక పూవులు ఎట్లా వికసించగలవు.

ఇద్దరికి ఒకడే ప్రయివేటుమాష్టరు. ఇద్దరికి ఒకే పాఠాలు చెప్పుతున్నాడు ఆ మాష్టారు. పద్మావతి దబ్బున గ్రహిస్తుంది దబ్బున మరచిపోతుంది. బుచ్చివెంకట్రావు ఒక పట్టాన పాఠం త్వరగా గ్రహించలేడు. గ్రహించిన పాఠం త్వరగా మరచిపోడు. కాబట్టి తన బాధ్యతకు తానే రెండవగురువై నాడు వెంకట్రావు. ఏపాఠమైనా నాలుగుసార్లు త్వరగా గ్రహించి వెంటనే మరచిపోయినతరువాత ఐదవసారి పద్మావతికి పాఠం శాశ్వతంగా వచ్చేది. ఈవిధంగా ప్రవాహాలు పుట్టి, ప్రవాహాలు పుట్టుగా వారిద్దరి జీవితాలలోకి జ్ఞానం ప్రవహించుకు రాసాగింది. ఆ జ్ఞానంతోపాటు లోకానికి కప్పివున్న తెరలు ఒక్కొక్కటే పైకి చుట్టుకు పోసాగాయి.

పద్మావతి భర్తను తన్ను కూడా ఈ ప్రదేశాలకు ఆప్రదేశాలకు తిప్పి ఉత్తమ గాయకుల పాటలు తాను వినేటట్లు చేయవలసిందని ప్రార్థించింది. వాళ్లిద్దరు సంగీత సభలకు మద్రాసుకు వెళ్లసాగారు. కాని కర్ణాటకవాణి పద్మావతికి పులకలు కలిగించలేకపోయింది. వారిద్దరు రామేశ్వరంవరకు ప్రయాణం చేసినప్పుడు దర్శనం చేసికొన్న తంజావూరు, చిదంబరం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం మొదలైన దివ్య క్షేత్రాలలో ప్రత్యక్షమైన దేవాలయాల రీతిగానే కర్ణాటక వాణీవుంటుంది. రాగాలు, మూర్ఛనలు, కీర్తనలు, గతులు, తాళాలు, క్షేత్రాలై మండపాలై ఉత్తుంగ గోపురాలై విమానాలై పద్మావతికి గోచరించినవి. ఆమెకు ఆనందము కలిగినది, భయమువేసినది.

ఏ సుబ్బలక్ష్మో, శేషంగుడో, కర్ణాటక సంప్రదాయ ప్రపంచం ఇంద్రజాలికులులా ప్రత్యక్షం చేసేటప్పటికి పద్మావతి దిగ్భ్రమచెంది అతిలోకమైన దివ్యమాధుర్యంలో మై మరచిపోయి స్థాణువులా ఐపోయేది.

పద్మావతి: నాకీలాంటి సంగీతం ఏలా వస్తుందండీ? ఈ రాగాలపోకడలే నా గ్రహణశక్తికి మించిపోతున్నాయి. నేను ఎన్నాళ్లు తపస్సుచేస్తే ఆ తపస్సు ఎన్ని జన్మలో వీడని దీక్షతో ఆచరిస్తే, నాకు ఈలాంటి సంగీతం అబ్బ గలదు? ఎందుకు నాకు ఈ సంగీతం చెప్పించడం. ఆ సుబ్బలక్ష్మి అమృతప్రవాహం ముందర నాకంఠం ఉప్పు నీళ్ల కాలవలా కనపడింది.

బుచ్చివెంకట్రావు: ఒసి వెర్రిదానా! ఒక్కరోజులో సుబ్బలక్ష్మి తనకున్న యావత్తు సంగీతశక్తితోను వుండి

పడిందా? ఎన్ని సంకల్పాలు కట్టపడిందో. నేను లక్షాధికారిని కావాలంటే ఒక్కరోజులో కాలేనా చెప్పు.

పద్మ: అంతవిద్య మన నరసింహమూర్తి మాస్టారు చెప్పగలరనేనా?

బుచ్చి: నరసింహమూర్తి మాస్టారు కాకపోతేను అనుకో. ఇంకా క్రోటకుంట, నెల్లూరు, గూడూరు జంక్షను చెన్నపట్టణం ఉన్నవికదా?

పద్మ: ఎన్నివుంటే ఏమండీ? నాకెట్లావస్తుంది ఆ సుబ్బలక్ష్మి కంఠం?

బుచ్చి: ఎవరందాలు వారివి; ఎవరిగొప్పలు వారివి; ఏమంటావ్! నీ కంఠంలో తీపి ఆ సుబ్బలక్ష్మి కంఠంలో కనపడేలేదు! నీకున్నగొప్పవారిది.

పద్మ: ఐతే నన్ను పట్నం తీసికెళ్లో లేకపోతే దక్షిణాదికి తీసుకుపోయో గొప్పవాటిదగ్గర సంగీతం చెప్పించండి.

3

బుచ్చి వెంకట్రావు ఎండురొయ్యపప్పు ఎగుమతి మద్రాసునుండే చేయ సంకల్పించాడు. తన ఆఫీసు కావలి నుండి మద్రాసుకు మార్చాడు. కావలినుండి మద్రాసువరకు ఉండే పల్లెగ్రామాలలో పల్లెవాళ్లను తన కంపెనీకే వారి రొయ్యపప్పు అమ్మేటట్లుగా ఏర్పాటు చేసికొన్నాడు. తన ఆఫీసు వాల్‌టాక్స్ రోడ్డులో కుదుర్చుకొన్నాడు. తను కాపురం ఉండే యిల్లు రాయపేటలో కుదుర్చుకొన్నాడు. బ్రహ్మప్రళయంమీద ఊరంతా జల్లిస్తే ఆ ఇల్లు దొరికింది. భార్యకు సంగీతం చెప్పే నరసింహమూర్తి మాస్టారును కూడా తీసికొని వచ్చాడు.

పద్మావతికి చెన్నపట్నం వచ్చినప్పటినుంచీ జీవితం ఒక అనంతమాలికలా అయి పోయింది. కావలసినన్ని జాజి పూవులు. కావలి వచ్చినప్పుడే ఆమెకు మొదటి సారి జాజి మల్లె ప్రత్యక్షమైనది.

ఒక్కొక్క వస్తువు, ఒక్కొక్కరి జీవిత ప్రవాహాన్ని నూతన పథాలకు త్రిప్పుతుంది. ఒక్కొక్క పువ్వు ఒక్కొక్క బాలిక ప్రకృతినే మారుస్తుంది. పెద్ద జాజి పువ్వును మదరాసులో జాజమల్లి పూవు అంటారు. తెలుగు దేశంలో పెద్ద జాజి అని మాత్రమే పిలుస్తారు. అసలు జాజికీ మల్లికీ ఉద్భవించిన పుష్ప అయివుంటుంది. అటు మల్లి పూవులోని సౌందర్యాలూ ఉన్నవి ఇటు జాజిలోని సుకుమారతా ఉన్నది. ఏదో వినశక్యం కలిగించేయుస్తు వాసన నక్షత్ర రూపమై, నక్షత్ర లోకాల అవలి దశలకు కొని పోయే రూప సౌందర్యము స్వచ్ఛత జాజిమల్లి పూవులో నృత్యమాడుతూ ఆమెకు గోచరించినవి. ఆమె మల్లి పూవులెరుగును; నాగమల్లి పూవులూ ఎరుగును. నాగమల్లి చెట్లు వాళ్లపల్లె దగ్గరనే ఉన్నవి. వర్షాకాలం రాగానే అవిచక్కగా వికసించి వానజల్లులతో పాటు అవిజల్లులు జల్లుతై కురుస్తవి. తెల్లవారగట్లే లేచేది పద్మ వాటిని ఏరుకొటానికి. చెవులలో జువకాలుగా అమర్చుకొనేది. దండలుగుచ్చి మెడలో వేసుకొనేది. తన చింపిరిజుట్టులో అలంకరించుకొనేది. ఒక్కొక్క పువ్వూ ముచ్చిక తెంపి ఆ పువ్వులోని తియ్యటి పాలను తాగేది. సన్నగా బూరాలు ఊదేది.

ఆ నాగమల్లి పుష్పాలుగాని జాజిమల్లి ఎదుట సామ్రాజ్ఞి ఎదుట రాణులులా అయి పోయినవి. నాగ మల్లి మల్లియ పీఠానికి దారి చూపిస్తుంది. మల్లిక జాజిమల్లి సింహాసన వితర్దిక కడకు గౌరవంగా తీసికొని వెళుతుంది.

కావలి పట్నంలో తాను తన భర్తకాపురం పెట్టిన మొదటి వసంత మాసంలో ఈ జాజిమల్లె పుష్పాలు అమ్మకానికి వచ్చినప్పుడు ఏమిటి ఈ కొత్తరకం పూవులు ఇంత అందంగా ఉన్నా యేమిటి అనుకొన్నది. జీవితం అడుగు భాగాలలో దాగుకొని ఉన్న వెన్నో కాంక్షలను ఆశయాలను ఈ జాజిమల్లి పూవుల వాసన రేకెత్తించినవి. ఎక్కి ఎక్కి పైకి ఎక్కి ఏదో ఒక మహానది ప్రవహించి క్రిందికి వచ్చే శైల జన్యపు పర్వత సానువుల చెరియల వెంబడే పైకి ఎక్కుతూ కొండలు దాటుతూ ఆనవీ బాలిక ఉద్భవించే పరమ రహస్య ప్రదేశాలకు ఆ జాజిమల్లి వాసనలు తీసికొని పోతున్నట్లుగా ఆమె మనస్సుకు ఉప్పొంగులు కలిగించేవి.

చెన్నపట్నంలో అన్నీ జాజిమల్లె పూతే! అంటి దొప్పలలో దొంతరలు; దండలవట్టులు, దండెడతో తూకాలు; జాజిమల్లియతో సరిపిస్తున్న కనకాంబరాలు, మరువంకురువేరులున్న కదంబ మాలలు. మదరాసు జాతీయ కుసుమమైన సర్వప్రశస్తమైన [illegible].

ఎన్ని వాడకట్టుల [illegible] లో పుష్పించుతున్నానో! [illegible], [illegible], [illegible] జాతీయ [illegible] అమదరాసు నగరంలో ఎన్ని [illegible] గాలి [illegible]!

౪

నరసింహమూర్తి సంగీతం చెప్తారు వాళ్ళింటిలోనే మకాం. నెలసరిగా సంగీతం చెప్తారు వంట బ్రాహ్మణుడూ అయ్యాడు; పద్మావతికి పిత్రుదేవుడూ గురువూ అయ్యాడు. పద్మావతి కనుముక్కు తీరుగల అందమైన ముఖముకల, పడుచు. ఆమెలో నాగరికత స్థానం ఏర్పరచు కొన్నప్పటినుంచీ ఆమెకున్న నీలోత్పల కాంతి ఉజ్వలశ్యామల కాంతి కాజొచ్చించి. శరీరం సామ్యాంగ పరిపుష్టమై కాకతీయ శిల్పబాలికా సౌందర్యం మూర్తింమకొన్నది.

సంగీతం చెప్పను నరసింహ మూర్తికి పల్లెపద్దాలు పడుచు ఏవో పరమరహస్యాల పాల సముద్రతరంగాలలోనుండి అవతరించిన లక్ష్మిలా గోచరమయ్యేది. పల్లెవారికి ఈ అందాలు ఎక్కడనుంచి వచ్చాయి? కాశీరాజు మత్స్యగంధి చేప గర్భంలో దొరికినట్లు ఈ పద్మావతి కూడా ఏ సముద్రపు అలలలో కొట్టుకువచ్చిన వరుణదేవుని కొమరితె ఏమో! నల్లవారున్నారు. వారు తెల్లచీర కట్టుకుంటే చీరనల్లబడి పోతుందేమో అన్నట్టుంటారు. కాని పద్దాలు నలుపురంగు ఆకాశ నీలంలా, సముద్రం లోతుల గరుడపచ్చల నీలంలా నరసింహమూర్తికి దర్శనం అయ్యేది. జూకామల్లి పూవుల నీలంలో ఉన్న ఆర్ద్రత ఆమె శరీరచ్ఛాయలో వికసించి ఉన్నదని నరసింహమూర్తి అనుకున్నాడు.

నరసింహమూర్తి: ఏమమ్మా పద్మావతి ఏదో ప్రవేటు మాష్టరును పెట్టి మీ ఆయన నీకు ఏవో నానాకాలం చదువు చెప్పించాను. నిజంగా సంగీత రహస్యాలే అర్థమవాలంటే చదువుకూడా బాగావచ్చితీరాలి అమ్మాయి.

పద్మావతి: ఇక్కడకూడా ప్రయివేటు మాష్టారును పెట్టించుకోవమ్మా కాదటయ్యా!

నర: ప్రయివేటు మాష్టారు చదువు ఆటా పాటలచదువు. ఏదయినా స్కూలులో చేరి చదువుకోవాలి. ఆ చదువుకే ప్రయివేటు మాష్టారు చదువు బలమిస్తుంది.

పద్మ: ఇంత పెద్దదాన్ని ఇప్పుడు స్కూలు ఏమిటండీ మాష్టారు?

నర: ఆంధ్ర మహిళా సభలో చేరరాదూ వాళ్ళు ఆ బెనారసు యూనివర్సిటీ పరీక్షకు పంపిస్తారు. రెండేళ్ళల్లో టింగు, రంగా అని ఇంటర్ మీడియెట్‌లో చేరవచ్చును.

పద్మ: ఇవాళ మా వాళ్ళను అడుగుతానుండండి. ఒక్కప్పుడు నాకు ఈ చదువెందుకు బాబూ అని పిస్తుంది. ఈ పట్టణవాసం, ఈ మోటారు కార్లు ఈ గడబిడలల్లో ఏమి ఆనందం ఉంటుంది. మా పల్లెలో ఆ సముద్రం వొడ్డునే ఆ ఏటికాడనే ఎంతో ఆనందంగా ఉండేది.

నర: ఇక్కడమాత్రం సముద్రం లేదటమ్మా.

పద్మ: ఇక్కడ సముద్రం సముద్రంలా అనిపించదయ్యా.

నర: అక్కడ కెరటాలు ఇక్కడ ఉన్నాయ్. అక్కడ ఇసుక ఇక్కడ ఉన్నది.

పద్మ: ఎట్టా అయినా ఆ సముద్రం వేరు, ఈ సముద్రం వేరు. ఇన్ని లక్షల జనంలో సముద్రం మన సముద్రంలా కనిపించదు. ఎవరి సముద్రమో చూడడానికి వచ్చినట్లుగా వుంటుంది. మాష్టారూ ఈ సముద్రంలో చేపలు దొరుకుతాయా.

నర: అదేమిటమ్మా! పొద్దున్నే తెప్పలు కట్టుకొని మీవాళ్ళంతమందో జెల్లారగట్టే సముద్రంలోకి వెళ్లిపోతారు. పది పన్నెండు గంటలకు తిరిగి వస్తారు. తెప్పలనిండా కావలసినన్ని చేపలు పట్టుకు వస్తారు.

పద్మ: అవి విదేశి చేపలేమో?

నర : మంచిదానవే!

పద్మావతి ఆంధ్రమహిళాసంస్థలో చేరింది. బుచ్చి వెంకట్రావు తాను అన్నికుల క్షత్రియురాలని చెప్పాడు. ఆంధ్ర మహిళాసభ విద్యాలయంలో చేరినప్పటినుండే పద్మావతికి దీక్ష ఎక్కువ అయింది. రాత్రింబగళ్లు చదువే. మహిళాసభ విద్యాలయంలో ఉన్న బి.ఏ., పాసయిన ఉపాధ్యాయినిని ఒకర్తె ఆమెకు ప్రయివేటు మాష్టరుగా కుదిర్చాడు బుచ్చి వెంకట్రావు.

మద్రాసు వచ్చినప్పటినుంచీ బుచ్చి వెంకట్రావు వ్యాపారం వృద్ధిఅయింది. వచ్చిన ఆరు నెలలలో ఆతనికి ఎనిమిదివేలు లాభం వచ్చింది. భర్తను ఆంధ్రమహిళా సభకు దగ్గిరిగా ఇల్లు అద్దెకు పుచ్చుకోమని పద్మ పోరు పెట్టింది. సలివన్స్ గార్డెన్‌లో చిన్న మేడ నూరు రూపాయలు అద్దిచ్చి కుదుర్చుకొన్నాడు బుచ్చి వెంకట్రావు.

చదువు వస్తున్న భార్య బుచ్చి వెంకట్రావుకు నిత్య నూతన విద్యామూర్తిలా, సౌందర్య దేవతలా కనిపించేది. చదువుకున్న బాలికలతో సహవాసాలు అలవరచుకొన్న పద్మావతికి ఏదో ఒక నూతన ప్రపంచం సన్నిహితము కాసాగినది. చదువులు, దేశాలు, దుస్తుల విధానాలు, వివిధ భావములు, రాజకీయాలు, అలంకరణలు, ఆనందాలు, శుచి, శుభ్రతలు పద్మావతికి అర్థం కాసాగినది.

ఆమె ఇల్లు అలంకరించటం నేర్చుకొన్నది. తాను కడిగిన ముత్యంలా ఎప్పుడూ నిర్మలంగా ఉండటం నేర్చుకొన్నది. వివిధ సువాసనలు, తమ తమ వ్యక్తిత్వాలతో ఆమె జీవితంలోనికి వచ్చి చేరినవి. తాను అర్థం చేసికొన్న ప్రతి సంస్కృతి ఆ బాలిక తన భర్త జీవితంలో కూడా ప్రవేశపెట్టాలని ప్రయత్నం చేయసాగింది. బుచ్చి వెంకట్రావు ఆమెకు దాసానుదాసుడై శిష్యుడైనాడు. వారిద్దరికి ఈ దైనందిన సంస్కృతి విద్యా శిక్షణ ఎంతో ఆనందం కలిగించే వ్యాసక్తి అయింది.

ఇల్లు అలంకరించుకొనే పాఠం ఉపాధ్యాయిని చెప్పేది. చెప్పిన పాఠమెల్లా ఆచరణలో పెట్టాలని పద్మావతికి కుతూహలం. భర్తతో మరాం పెట్టేది. రోజుకు ఒక కొత్తరకం భావం బుచ్చి వెంకట్రావును ఉక్కిరి బిక్కిరి చేసేది. ఇవాళ కిటికీలన్నిటికి పచ్చరంగు, ఎర్రరంగులు కలిగిన పువ్వులు, రేపు నీలంమీద తెల్ల బారలు కలిగిన తెరలు; ఇవాల పేము కుర్చీలు, రేపు రోజు వుడ్డుసోఫా కుర్చీలు. "నీకేమైనా మతిపోయిందా" అంటాడు బుచ్చి వెంకట్రావు.

నరసింహమూర్తి మాష్టారు పద్మావతి భావాలన్నీ వింటూ ఎంతో ముచ్చట పడిపోయేవాడు. ఎంతోకాలం సంగీతంలో ప్రయివేటు మాష్టరుగా ఉండి నూరు రూపాయలు నెల్లూరులో సంపాదించుకుంటూ కుటుంబం పోషించుకుంటూ ఉండేవాడు. నేడు 62 ఏళ్లు వచ్చాయి. భార్య పోయింది. బిడ్డలు లేరు. స్వచ్ఛమైన వెలనాడి బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. పెద్దవాడవటంచేత నెమ్మది నెమ్మదిగా పాఠాలు తగ్గిపోయినాయి. నెల్లూరు వదలి స్వగ్రామమయిన కావలి చేరుకొన్నాడు. కావలి చేరుకొన్న కొద్ది దినాలకే బుచ్చి వెంకట్రావు 50 రూపాయిలిచ్చి నరసింహమూర్తిగారిని భార్యకు సంగీతపు మాష్టరుగా ఏర్పాటు చేసినాడు. నేడు ఈ కుటుంబంతో తాను మదరాసు వచ్చాడు. తానింత వండుకొని వాళ్లిద్దరిని వడ్డించుకు తినమని ఇవతల పెట్టేసేవాడు. పద్మావతే ఆతనికి కూతురైంది. బుచ్చి వెంకట్రావు అల్లుడైనాడు. వీళ్లిద్దరి దినదినాభివృద్ధి ఆతనికి నిత్యసంతోష కారణమైనది.



## రూపకం

# అద్దంమీద ఆవగింజ

శ్రీమతి కొత్తపల్లి లలిత

[వెనకటి కథలో రామం, జానకి ఏదో చిన్న వాగ్వివాదంవల్ల అలుకవహిస్తారు. జానకి భోజనంమాని పడుకుంటుంది. తాతయ్య తంటాలు ఇక చదవండి.]

## మూడవరంగం

(హాలులో మూడు కుర్చీలు, ఓ టేబులు; టేబులు మీద తాంబూల సామగ్రి వెండి 'ట్రే'లో; రామం, తాతయ్య, చెరో కుర్చీలో కూర్చుని వుంటారు తాంబూలం వేసుకొంటూ.)

రా : (ఆశ్చర్యంగా) నిజమేనా, తాతయ్యా.

తా : నీతో అబద్ధం చెబుతానట్రా? జానకి తలికితండ్రి మాకు కావలసినవాడే. అందుకనేగా, జానకి తల్లిని మావయ్యకి నేను చేసుకొంటా. ఇప్పుడు నీకు చెప్పింది, జానకి అమ్మమ్మను గురించి. ఆవిడికి ఎంతకోపం అనుకొన్నావు. మీ మావయ్య పెళ్లిలో, ఆవిడి తన మొగుడిమీద కోపం వచ్చి ..

రా : కోపం వచ్చి ..చెప్పు తాతయ్యా!

తా : ఆం. ఏముందిలే. బావిలో పడింది.

రా : బావిలోనే! నలుగురిలో ఎంత అల్లరి, అప్రతిష్ఠ!

తా : ఇంకా మెల్లిగా అంటావూ. పెళ్లికొచ్చిన వాళ్లంతా విస్తుపోయారు. మీ మామయ్య మామగారు తలెత్తుకొని తిరగలేకపోయాడు.

రా : తరవాత ఏంజరిగింది?

తా : ఆం ఏం జరుగుతుంది! ఆనాటినుండి ఆయన చచ్చేదాకా పెళ్లానికి ఎప్పుడూ కోపం తెప్పించి ఎఱగడు. ఆమె నంది అంటే నంది; పంది అంటే పంది. లేకపోతే కాపరం సాగుచేసుకొంటాడురా?

రా : (ఆలోచిస్తూ) ఆవిడ జానకికి ఏమవుతుంది.

తా : అదిగో! రామాయణం అంతా విని రాముడికి సీత ఏమవుతుంది అన్నాట్ట, నీలాంటివాడే ఒకడు. అమ్మమ్మ అవుతుందిరా. ఆవిడపేరే దీనికి పెట్టారు. వాళ్లవంగడం అన్ని విధాలా మంచివాళ్లేగాని, కాస్త ప్రసమకోపం...

రా : జానకికీ అంతే...ఆ వంశడమేగా.

తా : అందుకనే కాస్త జాగ్రత మంచిది అన్నాను. దాన్లో అన్నీ సుగుణాలే ఇది తప్ప.

రా : (ఆతురతతో) మరేం చెయ్యమంటావు! నువ్వే చెప్పు సలహా. అదే చేస్తాను.

తా : ఆం ఏముంది. ఆడవాళ్లని వశం చేసుకోడం అర నిమిషం. వాళ్లు ఏదంటే అది అనడమే. మొదట్లో అలా అంటే, చివరికి వాళ్లే లొంగి మనం ఏదంటే అది చేస్తారు. వాళ్లతో ఎప్పుడూ వాదించకు.

రా : అదికూడా చదువుకొందిగదా అని వాదించి హేతువు చూపించి ఒప్పిద్దామని నా ఊహ.

తా : అక్కడే పప్పులో కాలేసి—జల్దున జారావు. ఎంత చదువుకున్నా ఆడవాళ్లు బుద్ధితో ఆలోచించరురా!

రా : ఏమో! నీదంతా పూర్వపద్ధతి.

తా: చక్కని నీ నవీన పద్ధతి—ఇంతకు వచ్చింది.

రా: ఇకనుంచి నువ్వు చెప్పినట్లే చేస్తా. నేను కాస్త వీధిలోకి వెళ్లివస్తాను. (అనిలేచును)

తా: ఒరేయ్ ఒక్కమాట. ఇదంతా దానితో చెప్పేవు. జాగ్రత్త. అసలికే మోసం వస్తుంది.

రా: అబ్బెబ్బే. మన వ్యూహాలు దానికి తెలియనిస్తానా? (అని వెళ్లిపోవును)

తా: (వంటవాడితో) ఇదుగో, నిన్నే. భోజన సామగ్రి అంతా ఆ వెండికంచంలో వడ్డించి నాతో మేడమీదికి రా. నేను మేడమీద అమ్మాయిగారి గదిలో వుంటాను.

వం: చిత్తం. (వెళ్లిపోవును)

(తాతయ్య మేడమీదికి పోవును వంట ఇంటిలో గిన్నెల చప్పుడు)

## నాలుగవ రంగం.

(మేడమీద గదిముందు తాతయ్య నిలువబడి యుండును.)

తా: అమ్మాయీ, జానకమ్మ.

జా: ఎవరదీ.

తా: నేనే. తాతయ్యని.

జా: ఎందుకూ? క్రింద మీ మనుమడుగారున్నారుగా!

తా: అదీ నీ వరస. కాస్త రాకూడదే తలుపుతీసి?

జా: నే నెందుకు? మీరంతా ఒకటి, నేనొక్కదాన్ని ఒకటి.

(జానకి తలుపుతీయును)

తా: ఎందుకే ఈ కోపం. అన్నంకూడా మానేశావు. రోజూ ఇంతేనా ఏమిటి? లేకపోతే, ఈవేళ నేను వచ్చాననా!

జా: నా బ్రతుకింతే. అందరూ నన్నే తిట్టండి (అని గద్గద స్వరముతో ప్రత్యుత్తర మిచ్చును)

తా: (జానకి దగ్గరగా వెళ్లి బుజ్జగిస్తూ) లేదు తల్లీ తాతయ్య నిన్న తిడతాడుటే. ఆ రామిగాడికి బుద్ధిలేదుగాని బంగారంలాంటి నిన్ను తిట్టటమేమిటే?

జా: నీకూ అదే ఇష్టంగా. ఈవేళ అన్నాలవేళ మీరిద్దరూ, నేను లేకపోతే, శని విరగడయిపోయిందని సంతోషిస్తూ భోజనం చేశారుగా!

తా: నీయిల్లు బంగారంగానూ, అదేంమాటలే. ఈవేళ భోజనాలదగ్గర వాణ్ణి ఎలా తిట్టానో నీకేం తెలుసు. కావలిస్తే ..

జా: అబ్బర్లేనులే. నీకు నేనంటే చాలా ఇష్టం అని తెలుసు.

తా: మరి అన్నీ తెలిసుండేనా ఇలా వుండడం! లేచి చప్పు చప్పున నాలుగు ముద్దలు తిని, రేడియో పెట్టుకో. అప్పటికి వాడుకూడా వస్తాడు.

జా: (అనుమానంతో) ఆయన లేరా ఇప్పుడు?

తా: అబ్బే. నేను తిడితే పశ్చాత్తాపం కలిగి అలా ఎక్కడికో వీధిలోకి వెళ్లాడు. ఇప్పుడే వస్తాడు.

జా: రాక్షర్లేనులే. వస్తే మళ్లీ తెగతెంపులేగా!

తా: (లాలిస్తూ) ఒసే, నాకు తెలియక అడుగుతాను. వాడు నిన్నేమన్నాడే.

జా: ఏమనాలి. అసలు నామీద ఆయనకి ప్రేమ లేదు. వుంటే ఈవేళ నన్ను కారు నడపనివ్వా ఏమిటి?

తా: వాడి మొహం నీమీద ప్రేమ లేకపోతే వాడు బతకగలడే. నేను వచ్చానుగదా అని తాను నడపడం మొదలెట్టాడు. అంతే.

జా: నువ్వు వచ్చావుగదా అనే నేనూ నడపాలనుకొన్నా. నే నడపడం ఆయన కిష్టంలేదు. ఆ ఘనత ఏదో తానే బావుకోవాలని ఊహ.

తా: వాడి మొహం. బావుకున్నాడుగా. కారు చెడగొట్టాడు నయం. బ్రతికి బయటపడ్డాము. అంత తొందరపాటు కూడదు.

జా: (కొంచెం సంతోషంతో) బాగా అన్నావు, తాతయ్యా. ఆయనది అతి తొందర. అన్నింటికీ ముందు సిద్ధం. ఆయనతో వాదిస్తే...

తా: అవునుగాని నేను ఒక్కటి చెబుతాను విను. వాడితో వాద నేమిటే! మొగాళ్లతో వాదించి ఏ ఆడది జయించిందే!

# అద్దం మీద ఆవగింజ

జా: చదువుకొన్న వారుగదా అని, నవనాగరికతాయుతులు ఉన్నాయని, వాడింటి సహోతుకింకా నన్ను చెప్పాలని నా ఊహ. మధ్యాహ్నం అలాగే. ఏదో, ఇంకా, నేను చెప్పక పూర్వమే దెబ్బలాట. ఓర్పు పొత్తిగా లేదు.

తా: నీకావిషయం పూర్తి ఏమాత్రం నాకు వాతే. అ ప్రథమ కోపం వాళ్ల వంశంలోనే వుంది.

జా: అలాగా. నాకు తెలియదు. ఈ వంశ పారంపర్యంగా వస్తూన్నదన్నమాటే.

తా: ఆహా! నీకేం తెలుసు. నక్కపుట్టి మూడాదివారాలు కాలేదు, ఇంకా గాలివాన ఎరగనంటట. రామం తండ్రి తండ్రి ఉన్నాడే—అంటే మా వియ్యంకుడు—అబ్బ ఎంత కోపం. మాటిమాటికి చిట్టు బుఱ్ఱు మంటూండేవాడు. మాట పడ్డం ఎరగడు. అండమేగాని, ఓమాటు ఏమయిందను కొన్నావూ......ఎందుకులే అదంతా ఇప్పుడు...

జా: (తాతయ్యకి దగ్గరగావచ్చి బతిమాలుతున్నట్లుగా) చెప్పు తాతయ్యా...చెప్పుమరి . ఏమయింది.

తా: ఆc. ఏమీలేదు. మీ అత్తయ్య పెళ్లిలోనే...మా వియ్యపరాలు ఏదో అందిట. ఆపళంగా, అందరి ముందూ, ఏంచేశాడనుకొన్నావు...

జా: (తొందరగా) చెప్పుతాతయ్యా. ఏంచేశాడు.

తా: ఆc. ఏం చేస్తాడు. జంధ్యాలు తెంపేసుకొని, "నాకీ సంసారం అక్కర్లేదు. నేను సన్యసిస్తా" నన్నాడు. పెళ్లికొచ్చిన వాళ్లంతా ముక్కుమీద వేలేసుకొన్నారు.

జా: ఎంత అభాసు! ఎంత అప్రతిష్ఠ! మీరేం చేశారు?

తా: ఏముంది చెయ్యడానికి. మావియ్యపరాలిని బతిమాలి, ఆవిడచేత క్షమార్పణ చెప్పించి, మళ్లీ జంధ్యాలు వేయించాము.

జా: (ఆతురతతో) ఆయన రామానికి ఏమవుతాడు తాతయ్యా!

తా: నీ తెలివి తెల్లారినట్లే వుంది. తాతే. తండ్రి తండ్రి.

జా: ఇప్పుడు నాకు అర్థం అయింది ఈయన కోపం. పెళ్లిళ్లో ఇదివరకుంచీ వున్నదన్న మాటే. తరువాత, ఆవిడేం చేసింది?

తా: ఏముంది చెయ్యడానికి! ఆయనకి కోపం తెప్పించకుండా, తన పని తాను చేయించుకొనేది. మగాడిని ఆడది వశం చేసుకోడం ఎంతసేపే.

జా: ఈయన లొంగడుగా! ఎంత హొరువు చూపించి వాదించినా తాను పట్టిన కుందేటికి మూడే కాళ్లు అంటారు.

తా: అక్కడే వుంది నీ పొరపాటు. మొండితో వాదించదే మొనిషే! వాళ్లని లొంగదీసుకోడానికి యుక్తులు పనికిరావే, పిచ్చిపిల్లా.

జా: మరేం చెయ్యమంటావు.

తా: సామెత చెప్పినట్లుంది నీ ప్రశ్న. అందుకే మా రోజుల్లో చిన్నప్పుడు పెళ్లిళ్లు చేసి, రాకని పోకని కల్పించి ఒకర్ని ఒకరు అర్థం చేసుకొనేలా చేసేవారు. ఇప్పుడేం లేదు. ఈవేళ చూడ్డం. రేపు పెళ్లి. ఎల్లుండి...

జా: సరేగాని చెప్పుతాతయ్యా సలహా.

తా: ఏమీలేదు. వాడేదంటే దానికి సరే అనడం. తన మాట విన్నానని వాడనుకొని ఇంక నువ్వేమడిగితే అదే చేస్తాడు. అంతేగాని ముందే వాదంలోకి దిగుతే పట్టుదలలు అధికమై రంగం చెడుతుంది. అమ్మాయ్. ఇంక నువ్వు భోజనం చెయ్యి. వంటవాడు పైకి తెస్తాడు. అప్పుడే చాలా ఆలస్యం అయింది. నే క్రిందకి పోయి పడుకొంటూ...అయితే. మెట్లమీద దీపం వుందా... నాకు రాత్రి కొంచెం కనబడదులే...

జా: ఆ. వుంది. మెల్లిగా దిగివెళ్లు.

(నిష్క్రమింతురు)

## ఐదవ రంగం

(రామం సావడిలో కుర్చీలోనే నిద్రపోతూ వుంటాడు. అకస్మాత్తుగా దొడ్లో పెద్ద చప్పుడవుతుంది.)

రా: (ఉలిక్కిపడిలేచి, అలవాటు చొప్పున) జానీ (అని పిలిచి నాలిక కొరుక్కొని) ఎవరది (అంటాడు.)

వం : (ప్రవేశించి) ఏం బాబూ అలా కేకవేశారు.

రా : ఏంలేదు దొడ్లో ఏదో పెద్ద చప్పుడయింది. నువ్వు విన్నావా?

వం : మీరంటే జ్ఞాపకం వచ్చింది. నాకూ నిద్దట్లో ఏదో వినబడింది. నూతివైపునుండి వచ్చినట్లయింది.

రా : (ఆతురతతో) ఆఁ (అని మేడమీదికి పోవును. వంటవాడు నిశ్చేష్టుడై చూచుచుండగా జానకి ప్రవేశించును)

జా : (రెండవ వైపునుండి ప్రవేశించి) ఏమయ్యా నీకేమైన పెద్ద శబ్దం వినబడిందా?

వం : మీరంటే జ్ఞాపకం వచ్చింది. నాకూ నిద్దట్లో ఏదో వినబడింది. నూతివైపునుండి వచ్చినట్లయింది.

జా : నూతివైపునుండా? అసలు నువ్వు ఇక్కడ ఎందుకున్నావు?

వం : బాబుగారు...

జా : (తొందరగా) ఊఁ ..చెప్పు. బాబుగారు...

వం : పిలుస్తే వచ్చాను.

జా : (భారము పోయినట్లుగా) బాబుగారు పిలిచారా? ఏరి వారు?

వం. మేడమీదికి వెళ్లారు.

జా : సరే నేనూ మేడ మీదికే వెడుతున్నాను. (అని వెళ్లబోవును. ఎదురుగా రామం ప్రవేశించును. జానకి ఆగిపోవును. ఇద్దరు ఒకరివైపు ఒకరు తప్పు చేసినట్లు చూసుకొంటూ నిలబడిపోదురు. వంటవాడి సంగతే వారికి పట్టినట్లులేదు)

వం : (మెల్లిగా) ఆ చప్పుడు ఏమిటో...కాస్త...

రా : (నిద్రలోంచి మేల్కొన్నట్లు ఉలికిపడి) మరే దాని సంగతే మరచిపోయాం. నువ్వు దీపం పట్టుకు రావయ్యా. పద నేనూ వస్తున్నా.

(వంటవాడు దీపానికై వెళ్లును.)

జా : నేనూ వస్తా.

రా : నువ్వెందుకు? ఈమాత్రం భాగ్యానికి.

జా : మీరే వెళ్లాలి కాబోలు.

రా : నేను కాకపోతే నువ్వు వెళ్లు.

జా : అప్పుడే అంత కోపం ఎందుకు. మీరే వెళ్లండి నే నిక్కడే వుంటాను. నేనేమైతేనేమి మీకు.

రా : (ఏదో జ్ఞాపకం తెచ్చుకొన్నట్లు) సరే, నువ్వు కూడా రా. తప్పుమాటలెందుకు?

జా : (ఏదో జ్ఞాపకం తెచ్చుకొన్నట్లు) మీరు వెళ్లండి నేను తాతయ్య ..

రా : అయ్యో! తాతయ్య ఏడీ! (అని లోనికి పరుగున వెళ్లి తిరిగివచ్చి) గదిలో తాతయ్య లేడు.

జా : ఇందాకా నాతో చీకట్లో నాకంతగా కనపడ దన్నాడు. అయ్యో, అయ్యో, దొడ్డిలో నూతిలో నూతిలో పడిపోలేదుగదా!

రా : రండి, రండి (అని దొడ్డిలోనికి పరుగెత్తును, లాంతరు తీసికొని వంటవాడుకూడా వచ్చును. జానకి వెనుకనే వెళ్లును.)

జా : అయ్యో, అయ్యో! ఎవరేనా నూతిలోకి దిగండి. తాతయ్యా (అని ఏడువబోవును.)

రా : అన్నింటికీ ముందు ఏడుపు. ఆడవాళ్లకి నెత్తిమీద నీటికుండ వుంటుంది. ఏమయ్యా నువ్వు పైన తాడు పట్టుకో నే దిగుతా. జానకీ నువ్వు లోపలికి దీపం చూపించు.

జా : అతను దిగుతాడు. మీరు తాడు పట్టుకోండి. మీరు పైనవుంటే తాతయ్యని వెంటనే అందుకొని ఫస్టు ఎయిడ్ చేయవచ్చు. లేకపోతే తాడు ఆ చెట్టుకి కట్టండి.

రా : నే చెప్పినట్లు చేస్తావా వాదమా?

జా : నాకు వాదమెందుకు, నాకు తోచింది చెప్పాను. మీ ఇష్టం మీది, నా ఇష్టం ఎందుకు?

రా : అన్నింటికీ ముందు మాటివిరుపులు, కోపాలు, తాపాలు. (కొంచెం ఆలోచించి) జానీ, నీ ఇష్టం వచ్చినట్లే చేద్దాం. ఆ తాడు ఆ చెట్టునకు కడదాం. రా.

ఏమయ్యా నువ్వు లాంతరుతో నూతిదగ్గరవుండి ఆ టార్చిలో లోపలికి చూడు.

జా : (మెల్లగా) ఊరికే అన్నానుగాని, వీడకు మాత్రం తెలియదూ. ఇంతకీ ఆ వంటవాడికి ఈతరాదేమో! మీరంటే గోదావరి ఇవ్వడ్డునుండి అవ్వడ్డుకి ఈదినవాళ్లు.

రా : కాదు, జానీ, అల్లాగే చేద్దాం. నువ్వన్నట్లు నేను తాతయ్యకు శ్రద్ధగా చికిత్స చేయవచ్చు.

జా : కాదు, రామూ నీ ఇష్టం...

రా : కాదు, జానీ, నీ ఇష్టం .. (అని చెట్టు వైపునకు నడచును)

(తాతయ్య ఎదురుగా వచ్చును)

తా : ఆహాహా! ఎంత సమయస్ఫూర్తండి. ఈ రాత్రంతా ఒకరినొకరు ఒప్పించుకొంటూనే గడిపేవారా! లేక నన్నేమైనా నూతిలోంచి తీసేవారా? పదండి లోపలికి. (ఇదంతా వంటవాడు ఆశ్చర్యంగా చూస్తూ చూస్తూ వెళ్ళిపోవును) ఇంక మీరు వెళ్లి పడుకోండి. చాలా రాత్రయింది. ఇందాకటినుంచీ నువ్వు సావిట్లోనే వున్నావురా రామం.

రా : రాత్రి ఆలస్యంగా వచ్చాను. దాన్ని లేపడం ఎందుకని...(అని నసుగును)

తా : ఓహో! అదా సంగతి, కోపం కాదన్నమాట. సరే ఇంకేలాగా లేచిందిగా. పైకి వెళ్లండి. (జానకితో) వెళ్లండే రాత్రంతా అలాగే ఒకళ్లకేసి ఒకళ్లు చూసుకొంటూ నిలబడతారా ఏమిటి. ముసలాణ్ణి కాస్త నాకు నిద్రా, నిప్పులూ అక్కర్లేదూ. మళ్లీ రేపు రైలుకి పోవాలి.

రా, జా : (ఇద్దరూ) రేపే తాతయ్యా!

తా : రేపు కాకపోతే ఎల్లుండి. ఇక్కడే వుంటానా ఎప్పుడూ? ఏదో మిమ్మల్ని చూసిపోదామని వచ్చాను. కాస్త...గుణపాఠం .. నేర్పి...

జా : నువ్వు నూతిలో పడిపోయావని అనుకొన్నాం.

రా : నేననుకోలేదు సుమా.

జా : అనుకోపోతే నూతిదగ్గరికి ఎందుకు వెళ్లావు?

రా : మొట్టమొదట నేను మేడమీదికి వెళ్లాను.

జా : ఓహో! అలా! అయితే నేను అనుకోలేదు. నేను మీ గది దగ్గరికి వెళ్లి చూసా మొట్టమొదట.

తా : మళ్ళీ మొదలు పెట్టారన్నట్రా. మీ రభసోడానికి అసలు నేనే పదండే. ఇంక వెళ్లండి, వాదన ఆపి.

రా : (నవ్వుతూ) అట్టే ఇంక మేం వాదించుకోం.

జా : వాదించుకొన్నా రోషించుకోం. కలహించుకోం.

తా : అవును. అంచేతే పెద్దలు, ఆలుమగల కలహం అద్దంమీద ఆవగింజంత సేపు నిలుస్తుంది అన్నారు. వెళ్లండి. వెళ్లండి.

రా, జా : (నవ్వుతూ) నీ కంటె పెద్దలెవరు తాతయ్యా!

తా : సరే పోనీ, నేను అన్నాను. ఇంక మీరు వెళ్లి పడుకోండి. ఉస్...

(తెర)



# సంధ్య

* శ్రీమతి కే. కామాక్షి *

ఓహో! వసంత సంధ్యారాణీ
నీదుమను సిగ్గులో నీ అరుణ కాంతిలో
కవికుమారుని కలము పరువులెత్తేనో?
కోకిలా కంఠాన మధురిమము పెరిగెనో??
నీరాగ కిరణాల నీదు చిరునవ్వులో
ఈ వసంత సుమాల మధు సౌరభములోన
భావుకుల హృదయాలు విరిసెలే పువ్వులై!
నీకటాక్ష జ్వాల నీ అలంకారములో
నైరాశ్యశీతాల నిమపక్కరించేటి
భగ్నహృదయములోన కిసలయించునో ఆశ?
ఓహో! వసంత సంధ్యారాణీ.



# పోస్టు చెయ్యని ఉత్తరం

❋ శ్రీ గోపీచంద్ ❋

హేతువాదం అంటే ఏమిటి? హేతువాదం మన కిచ్చే జ్ఞానం ఎటువంటిది? అనేపట్టంలో పోయినమాటు ఆపుచేశా. హేతువాదం స్వభావం ఏమిటో ప్రస్తుతంలో ఆలోచిద్దాం.

హేతువాదానికి శక్తి లేదని ఎవ్వరూ అనరు. దాని ప్రయోజనం అందరూ అంగీకరించేదే! కాని స్వల్ప విషయాలూ, తాత్కాలికావసరాలకు కావలసిన విషయాలూ తెలుసుకోటానికి మాత్రమే హేతువాదం పనికి వస్తుందని, సంపూర్ణ సత్యాన్ని తెలుసుకోటానికి ఇది ఉత్తమ సాధనం కాదనీ, అందువల్లనే హేతువాదులు సంపూర్ణసత్యం తెలుసుకోవటం సాధ్యపడే పనికాదు అంటున్నారనీ ఆధ్యాత్మికవాదులు వాదిస్తున్నారు.

హేతువాదానికీ సత్యానికీ సంబంధం ఉన్నమాట ఎవ్వరూ కాదనరు. మనం కొద్దిగా తెలుసుకోగలిగితే దాన్నిబట్టి అంతా తెలుసుకోగలం. మనలను మనం తెలుసుకోగలిగితే ప్రపంచాన్ని తెలుసుకోగలం. భాగంలో ఏముంటుందో మొత్తంలోనూ అదే వుంటుంది అని హేతువాదులు చెపుతారు. కాని హేతువాదం ఎప్పుడూ నిజాన్నే చెపుతూ వుందా? తప్పటడుగులు వెయ్యలేదు? అని ప్రశ్నిస్తున్నాడు నళినీకాంత గుప్త. "అనేకసార్లు తప్పటడుగు వేసింద"ని తానే జవాబు చెపుతున్నాడు. ఈనాడు భూమి సూర్యునిచుట్టూ తిరుగుతూవుందని హేతువాదం చెపుతూ వుంది. అనేక సంఘటనలు ఈ సిద్ధాంతాన్ని ఋజువు చేస్తున్నవి. కాని హేతువాదం ఎల్లప్పుడూ ఈ మాటే చెప్పి వుండలేదు. ముందు చెప్పకపోవచ్చుకూడా. పూర్వులు అనేకమైన ఋజువులతో దీనికి విరుద్ధమైన సిద్ధాంతాన్ని నమ్మారు. రాబోయేవారు దీనికి విరుద్ధమైన, పై రెంటికీ సంబంధంలేని మరొక సిద్ధాంతాన్ని సృష్టించగలరు. వీరందరూ హేతువాదులే! ఈ సిద్ధాంతాలన్నీ హేతువాదం మీద ఆధారపడి సృష్టించబడ్డవే. దీనినిబట్టి హేతువాదం సత్యాన్ని తెలుసుకోగలదు అనుకోవటం కంటె, రకరకాల సిద్ధాంతాలను సృష్టించగలదు అని మాత్రమే అనకోటానికి వీలవుతుంది అంటాడు నళినీకాంతగుప్త. "కొంతమంది హేతువాదం సత్యాన్ని క్రమక్రమేణా తెలుసుకోగలుగుతుంది అని చెపుతారు. కాని వెంటనే సంపూర్ణసత్యం తెలుసుకోబడదు అంటారు. మనకు కావలసింది క్రమక్రమేణా సత్యం దగ్గరకు వెళ్ళటం కాదు. సత్యం తెలుసుకోవటం. ఈ పని హేతువాదం చెయ్యలేదు."

యోగాభ్యాసంవల్ల సహజ జ్ఞానాన్ని ప్రకాశవంతం చెయ్యొచ్చనీ, అది సత్యాన్ని తెలుసుకోగలుగుతుందనీ ఆధ్యాత్మికవాదులు చెపుతారు. "జీవితాన్ని పరిపూర్ణంగా చూడలేదు గనకా, మనిషినీ ప్రపంచాన్నీ కలిపి చూడలేదు గనకా, హేతువాదం సత్యాన్ని తెలుసుకోటానికి తగిన సాధనం కాదు" అన్నాడు బెర్గసన్.

జీవితంలో అనేక ముఖ్యవిషయాలు దానికి అందుబాటులో లేవు. విమర్శించి, వ్యాఖ్యానించి, జతపరచటం హేతువాదం గుణం. ప్రాపంచిక వ్యవహారాలు నెరవేర్చుకోటానికిగాను హేతువాదం పుట్టింది. దీనికి ప్రపంచాన్ని ముక్కలు ముక్కల క్రింద చూడటం అవసరం. హేతువాదం ఆపనే చేస్తుంది. ఉనికిని ముక్కలు ముక్కలుగా విభజిస్తుంది. విభిన్న శక్తులక్రింద జమ కడుతుంది. మళ్ళీ అన్నిటినీ తన నియమాలను అనుసరించి జత పరుస్తుంది. జీవితాన్ని నడపటానికి ఇది అవసరం—కాని యదార్థం తెలుసుకోటానికి మాత్రం ఇది మార్గం కాదు. ఎందుకంటే ప్రపంచంలో దేనికీ స్థిరత్వంలేదు. జీవితం ఎప్పుడూ మారుతూ వుండేదే, ఇటువంటిదాన్ని ముక్కలుక్రింద చూట్టమే తప్పు. కాబట్టి సత్యాన్వేషకులు హేతువాదం మీద ఆధారపడి లాభంలేదు అంటారు ఆధ్యాత్మికవాదులు. ఈ విధంగా హేతువాదం హద్దులను నిరూపించి సహజ జ్ఞానాన్ని సమర్థిస్తున్నారు ఆధ్యాత్మికవాదులు.

మనస్సుకి కొంత స్వతంత్ర శక్తి వుండటంవల్ల ఎటుపడితే అటు ఆలోచించ గలుగుతూవుంది. క్రొత్తగా స్వాతంత్ర్యం

# పోస్టు చెయ్యని ఉత్తరం

పొందిన వాదనలాగా నిర్ధారిస్తున్నారు. అందువల్ల మన వృత్తి లేక స్వభావానికి సంబంధం అనుకున్నప్పటికీ కూడా సడలించగలుగుతూ వుంది. మానవుడు ఈ అభిప్రాయాలని తప్ప తాను నిర్ణయించుకోవాలంటే, ఈ సహజ జ్ఞానానికి ఆధారపడాలి. అంటే సంస్కృతిలోన్న సహజ జ్ఞానానికి తెలిసిన జ్ఞానం కాదు. ఆ జ్ఞానాన్ని మానవుడు వైచిత్ర్య పరితం చెయ్యగలిగి, అలా చేస్తే వారి స్వభావాన్ని పరం తెలుసుకోగలుగుతాడు, అప్పుడే మన జీవితాలను శ్రేష్ఠంగా నడప గలుగుతాడని వారు చెప్తున్నారు.

అధ్యాత్మికవాదులు, సహజ జ్ఞానాన్ని గురించి, హేతువాదాన్ని గురించి ఏమంటున్నారో తెలియచెయ్యటానికి, వారి దృష్టినిగురించి ఇంత విపులంగా వ్రాశానుగాని, వారి దృష్టినంతా నేను అంగీకరిస్తున్నానని నీవు అనుకోగూడదు. ఏ విషయాన్ని గురించి అయినా అవుసూ, కాదూ అనే నిర్ణయానికి వొచ్చేముందు ఆ విషయాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలిగదా! నిజంగా సహజ జ్ఞానాన్ని ప్రకాశవంతం చెయ్యటం అంటే ఏమిటో నాకు అర్థంకావటం లేదు. ఏ విధంగా ప్రకాశమానం చెయ్యాలో, దేని సహాయంతో చెయ్యాలో నా బుద్ధికి అందటం లేదు.

నేను హేతువాదానికి కొన్ని హద్దులున్నాయనే విషయం అంగీకరిస్తాను. కాని హేతువాదంద్వారా కాక మరొకవిధంగా అయితే నే సత్యాన్ని గ్రహించగలం అనే మాటగాని, హేతువాదం అవసరంలేదు అనే మాటగాని ఒప్పుకోలేను. ఈ మధ్య హేతువాదం చాలా నిశిత విమర్శలకు గురిఅయిన మాట నిజమే. ప్రగ్మాటిజం ఉద్దేశాలలో హేతుబద్ధత లేదనీ, మనస్తత్వ శాస్త్రం మానవుని ప్రవర్తనలో హేతు బద్ధతలేదనీ, నిరూపించటానికి ప్రయత్నిస్తుంది.

ఈ రెండు సిద్ధాంతాలు కలసి, అభిప్రాయాలుగాని, ప్రవర్తనగాని హేతువాదానికి కట్టుబడివుండవలసిన అవసరం లేదని, అలావుండటానికి అర్హతపొందిన హేతువాద పద్ధతి లేదనీ చదువరులకు స్ఫురింపజేస్తయి. నీకూ నాకూ అభిప్రాయభేదాలు వుంటే వాదంలోకి దిగటం వల్లగాని, మధ్యవర్తిత్వాన్ని అంగీకరింపటం వల్లగాని ప్రయోజనం ఏమీ వుండదని తెలియచేస్తాయి. మనకున్న ఆర్థిక సంపత్తిలోను మిగిలిన సంపత్తిలోను, స్థాయిని తేల్చుకోవటం కంటే సత్యాంతరం లేదని ఈ సిద్ధాంతాలు తెలుస్తాయి." ఈ స్పష్టం చాలా అసాధారణమైనదని నాతో ఏకీభవిస్తావనుకుంటాను. వాస్తవమైన సిద్ధాంతాల వల్ల హేతువాదబలం పెరిగింది కదని, జీవితానికి గాని, ఆలోచనలకుగాని మార్గం చూపించగలిగేది కాని శక్తి ఏమాత్రం. నన్నిలా అడిగితే, మనం చెప్పలేవాళ్ళి, నిరూపించలేవాలి. హేతువాదాన్ని మనం కాలక్రమంలో రెండు భాగాలుగా విభజించవచ్చు. 1. సిద్ధాంతానికి సంబంధించినది. 2. జీవితానికి సంబంధించినది. మొదటి లక్షణాన్ని 'మనం ఒక నమ్మకాన్ని కుదుర్చుకొన్నే నిమిత్తం అవసరమైన సాక్ష్యాన్ని పోగుచేసే అలవాటు' అని నిర్వచించాడు బెర్ట్రాండ్ రసెల్. హేతువాది కట్టిగా ఇదమిద్ధమని తేల్చుకోలేనప్పుడు మిగిలిన విషయాలను గమనంలో ఉంచుకునే, తన సాక్ష్యాన్నిబట్టి నమ్మటానికి ఎక్కువ వీలున్నదానికి ప్రాముఖ్యత ఇస్తాడు. ఒక విషయానికి ప్రాముఖ్యత ఇస్తున్నా తేలని విషయాలను గురించిగాని, తక్కువ నమ్మటానికి ఆస్కారంగావున్న విషయాలను గురించిగాని ఆలోచించకుండా ఉండడు. వాటిని గమనంలో ఉంచుకుని, వాటిని ఎప్పటికప్పుడు విమర్శించుకొని చూచుకుంటూ వుంటాడు. క్రమక్రమేణా వాటికి అనుకూలమైన సాక్ష్యం దొరికితే వాటిని నమ్ముతాడు. కొంతమంది మన అభిప్రాయాలకు వర్తించవలసిన Objective fact అనేదే లేదు అంటారు. వారి ధోరణిలో అభిప్రాయాలు అనేవి బ్రతుకు తెరువుకి సాధనాలు మాత్రమే. కాబట్టి ఏ అభిప్రాయాలైతే మానవునికి సహాయపడతాయో, అవే 'యథార్థ' మైనవి.

ఈ సందర్భంలో క్రీస్తు శకం ఆరవశతాబ్దంలో జపాన్లో జరిగిన ఒక సంఘటనను రసెల్ ఉదాహరణగా చెప్పాడు. అప్పుడే ఆ దేశంలోకి బౌద్ధమతం అడుగు పెట్టిందట. ఈ కొత్తమతం మంచిదో చెడ్డదో తెలుసుకోటానికని ఒకరిని అనుసరించి చూడవలసిందని చెప్పారట. అతను ఇతరులకంటే మంచి స్థితిలో వుండటం సంభవిస్తే అందరూ ఈ మతాన్ని స్వీకరించ దలిచారట! నేటి ప్రగ్మాటిస్టులు

కొద్ది మార్పులతో ఇటువంటి సిద్ధాంతాన్నే సమర్థిస్తున్నారు. కాని అనుభవంలో ఇలా జరగటంలేదు. నిత్య జీవితంలో వీరూ మామూలుగానే వ్యవహరిస్తున్నారు. వీరిలో ఎవ్వరైనా ఏ జ్యూరీలోనైనా సభ్యుడుగా వుండటం తటస్థిస్తే, నేరస్తుడు తప్పుచేశాడా లేదా అని ఆలోచిస్తారే గాని ప్రజల్లో ఎవ్వర్ని వురితీస్తే లాభమా అని ఆలోచించరు. కాని ఇల్లాంటి దృష్టి కొన్ని దేశాల్లో లేకపోలేదు. అయితే ఇటువంటిది జరిగేటప్పుడు అంతా రహస్యంగా ఉంచుతారు. రహస్యం దాగకపోతే స్కాండల్ పుడుతుంది. ఈ దాయటమనే ప్రయత్నాన్ని బట్టి క్రిమినల్ విచారణలో వున్న Objective truthలో పోలీసువాడికూడా నమ్మకం వున్నట్లు స్పష్టపడుతుంది. సైన్సు తెలుసుకో దలిచింది ఇటువంటి సత్యాన్నే. అసలు సత్యమే లేదనే వాదం, ఉన్న సాక్ష్యానికి విరుద్ధంగా మరొక విషయాన్ని నిరూపించ దలిచినప్పుడూ, అసలు సాక్ష్యంలేనిదాన్ని నిరూపించ దలిచినప్పుడూ పుడుతుంది. మామూలు వ్యవహారాల్లో మనం సత్యం అనేది వున్నట్టే ప్రవర్తిస్తాము. దీనినిబట్టి అసలు 'నిజాలు' అనేవి వున్నాయనీ, కొన్ని నిజాలు మనం తెలుసుకోగలమనీ, మనకు తెలిసిన నిజాలనుబట్టి తెలియని నిజాలనుకూడా షుమారుగా తెలుసుకోవొచ్చనీ చెప్పుకోవలసి వస్తుంది. Can man be rational అనే వ్యాసంలో రసెల్ ఈ విషయాన్ని చర్చించి, "నిజాలను గురించిమన నమ్మకాలను మన కోర్కెలనుబట్టీ, అలవాట్లను బట్టీ, అసహ్యాలనుబట్టీ ఏర్పరచుకోకుండా, సాక్ష్యాన్నిబట్టి ఏర్పరచుకోవటమే హేతువాదంయొక్క సిద్ధాంతరూపం" అని చెప్పాడు.

కొంతమంది మనస్తత్వశాస్త్రం హేతువాదంయొక్క శక్తిని సంకుచిత పరచిందనీ, ప్రజల అభిరుచుల పుట్టుకను చూపి మన నమ్మకాలు హేతుబద్ధంగా వుండటానికి వీల్లేదని చెపుతుందనీ అంటున్నారు కాని ఇది యదార్థం కాదు. మనస్తత్వ శాస్త్రం హిస్టీరియా, పిచ్చి మొదలైన జబ్బులను నయం చెయ్యటానికి పుట్టిందనే విషయం జ్ఞప్తికి వుంచుకుంటే ఈ విషయం మనకు తేలిగ్గా బోధపడుతుంది. పిచ్చి మొదలైన జబ్బులు సమాజ వాంఛలను అణుచుకోవటం వల్ల వొస్తాయనీ ఈ వాంఛలను బహిర్గతం చెయ్యటంవల్ల పోతయ్యనీ మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెపుతారు. ఈ చికిత్స మానవునికి ఆరోగ్యకరమైన స్థితి వొకటివుందనీ, ఈ రోగులు ఆ స్థితినుంచి దిగజారారనీ, తాము మరచిపోదలచిన కోర్కెలనుకూడా జ్ఞాపకంచేసి మళ్ళీ మామూలు స్థితికి తీసుకురావొచ్చనీ ఈ శాస్త్రం నమ్ముతుంది. దీనివల్ల మనస్తత్వ శాస్త్రం హేతువాదానికి విరుద్ధమైందనిగానీ, హేతువాదం నిలవటాని వీల్లేనిదని నిరూపిస్తుందనిగానీ అనుకోటానికి కుదరదని నీవు నాతో అంగీకరిస్తావు.

ఇంతవరకు మనం సిద్ధాంతానికి సంబంధించిన హేతువాదాన్ని గురించి ఆలోచించాం. ఇక జీవితానికి సంబంధించిన హేతువాదాన్ని గురించి ఆలోచిద్దాం.

జీవితానికి సంబంధించిన విషయాల్లో అభిప్రాయ భేదాలు రెండు రకాలుగా వుంటై. 1. కోర్కెల్లో భేదం. 2. పద్ధతుల్లో భేదం. ఈ కోర్కెలకు కారణాలు తెలుసుకోవటం చాలా కష్టం. మన కోర్కెలు హేతుబద్ధమైనవో కావో తెలుసుకోవటం కూడా కష్టమే! మన కోర్కెలకు అనుకూలంగా ఊహించటం, అనుకూలమైన సాక్ష్యాలు పోగుజెయ్యటం అనేది మామూలుగా జరుగుతున్న విషయమే! మానవుడు తన్ను తాను వంచించుకోవటంలో అందెవేసిన చెయ్యి. ఒక పద్ధతిగా నడుద్దామని అభిలషించినప్పుడు ఆ మార్గం వొక గమ్యస్థానానికి తీసుకొనిపోతుందని నమ్ముతాడు. నిజాలనుగురించీ, జరిగే అవకాశాలను గురించీ తనకు అనుకూలంగా, తన దృష్టికి వ్యతిరేకంగా వున్నవానికి భిన్నంగా వూహిస్తాడు. జూదగాళ్లు తమకు అనుకూలమైన గుడ్డి నమ్మకాలను అనేకం పోగుజేస్తారనే విషయం మనకు తెలిసిన విషయమే! రాజకీయాల్లో పాల్గొనేవారు తమ పార్టీ నాయకుడు ఇతర పార్టీల నాయకులుచేసే మోసపు పనులు చెయ్యడని నమ్ముతారు. అధికారవాంఛ వున్నవాళ్లకు ప్రజలు 'మందగా' కనుపిస్తారు. పొగాకుతాగేవాళ్లు నరాలకు మంచిది అంటారు. ఈ విధంగా మానవుడు చాలావరకు దృష్టిదోషానికి గురి అవుతాడు. ఈ దృష్టిదోషం తగలకుండా తప్పుకోవటం చాలా కష్టం. రచయితల విశ్వాసాలనుగానీ శాస్త్రవేత్తల విశ్వా

(తరువాయి ౩౪-వ పేజీలో)




"అమ్మా!..."

"పడుకోమ్మా!...నిద్రపో!"

"నాన్నేరే?"

వస్తారులే అమ్మా! పడుకో! మా తల్లివి గాదూ! నిద్రపోమ్మా!"

చిట్టి ఈవేళ ఎంతసేపు జో కొట్టినా నిద్రపోవడం మానేసి నాన్న కావాలని ఏడుస్తూంది. చిట్టికి రోజూ తండ్రి కథలు, కబుర్లు చెబుతూంటే అలా వింటూ నిద్ర పోవడం అలవాటు. నరసమ్మ కాపరానికి వచ్చిన ఆరేళ్లకి చిట్టి పుట్టింది. చిట్టి కిప్పుడు నాలుగో ఏడు. లేక లేక కలిగిన సంతానం కావడంవల్ల చిట్టికి తల్లిదండ్రులు బాగా గారం చేశారు. చిట్టి తరవాత నరసమ్మకి మళ్లీ సంతానం కలగ లేదు.

చిట్టి ఉలిక్కిపడి లేచి ఏడవడం మొదలుపెట్టింది. ఎంత ఊరుకో బెట్టినా ఊరుకోలేదు. జడుసుకుందో ఏమో! నరసమ్మ అమ్మవారికి పూజచేసిన కుంకం చిట్టి నొసటను పెట్టి, పిల్లను ఎత్తుకుని ఓదారుస్తూ అటూ ఇటూ తిరిగింది. పిల్ల "నాన్న నాన్న" అంటూ గుక్క పట్టిన ఆయాసంతో అలిసిపోయి మళ్లీ కళ్లుమూసింది. నరసమ్మ చిట్టిని మళ్లీ జాగ్రత్తగా మంచం మీద పడుకోబెట్టి చేతులతో మెల్లి మెల్లిగా తట్టుతూ జో కొట్టింది. చిట్టినిద్రలో అప్పు డప్పుడు ఉలికి పడుతున్నది.

నరసమ్మకు కూడా ఆవలింతలు వస్తున్నాయి. రాత్రి ఒంటిగంటు కావస్తున్నది. ఊరంతా మాటుమణిగింది. దూరంగా అప్పుడప్పుడు కుక్కలు మొరిగిన చప్పుడు వినవస్తు న్నది. ఇద్దరు బంట్రోతుల్ని పిలిచి ఇంటికి కాపలాపెట్టి ఇనస్పెక్టరు వెంకటరావు సాయంత్రం పెంద్రాళ్లే భోజనం చేసి పోలీసులతో ఎక్కడికో వెళ్లిపోయాడు. మళ్లీ తిరిగి 10, 11 గంటల లోపుగానే వస్తానని చెప్పాడుగాని ఇంత వరకు తిరిగి రాలేదు. ఆయన మారుమూల పొలాల్లోదాగి ఉన్న ఎవరిని పట్టుకోడానికి వెళ్లారో ఎవరికి తెలుసును!

వెళ్లేటప్పుడు నరసమ్మ ఈవేళ ఎప్పటికి తిరిగివస్తారని అడిగింది! యధాప్రకారంగానే వెంకటరావు చిట్టిని ఒక సారి ఎత్తుకుని ముద్దు పెట్టుకుని, చిరునవ్వు నవ్వుతూ సాధ్య మైనంత త్వరలోనే వస్తానని చెప్పి వెళ్లిపోయాడు. నరసమ్మ గుమ్మందాకా వెళ్లి నిలబడింది. బంట్రోతులతో ఇల్లు భద్రమనిచెప్పి వెంకటరావు పోలీసులతో చరచరా నడిచి వెళ్లిపోయాడు.

ఈ మధ్యన దోపిడీలు, గృహ దహనాలు ఎక్కువైన కొద్దీ ఆ ఊళ్లో అలజడి ఎక్కువగా ఉంది. ఆ ఊరు ఒక మారు మూల ఉన్న ఊరు. ఒక చిన్న పోలీసు స్టేషను ఉంది. ఊళ్లో చిన్న పోస్టాఫీసు ఒకటి ఉన్నా ఆ ఊరు నించి ఉత్తరంవేస్తే అది రెండు మూడు రోజులదాకా అసలు ప్రయాణమే మొదలు పెట్టదు. అక్కడక్కడ పల్లె టూళ్లలో జరుగుతున్న దారుణ కృత్యాలు విన్నప్పటినించీ నరసమ్మకు భర్త ఈ ఉద్యోగం చెయ్యడం చాల ప్రమాద కరమని తోచింది. అయితే ఉద్యోగం లేకపోతే రోజు గడవడం ఎలాగ? గత్యంతరం లేక మరిఒకచోటి కెక్కడి కైనా సురక్షిత ప్రదేశానికి వెళ్లిపోదామని ఆమె పట్టు పట్టింది. వినిపించుకోకపోతే సాయంత్రం భోజనాలవేళ మళ్లీ రెట్టించింది.

"ఇలాంటప్పుడు బదిలీ చెయ్యమంటే చెయ్యరు."

"ఏం?"

"ఇక్కడ ఇలాంటి ఘోరాలు జరుగుతున్నాయని తెలిస్తే సైవారు మాత్రం ఇక్కడ బదిలీకి ఇష్టపడతారా?"

"పోని జబ్బు చేసిందని సెలవు పెట్టండి?"

"అది కష్టంమీద సెలవు దొరకుతుందే అనుకో! సెలవు అయిపోయిన తరవాత మళ్ళీ ఇక్కడికే రావాలిగా!"

నరసమ్మకేమీ తోచలేదు మళ్లీ కొంతసేపూరుకుని అతని ముఖంకేసి చూసి ఇలాగ అంది.

"పోని, నేనూ చిట్టీ మా యింటికి వెళ్లిపోతాము పంపించివెయ్యండి!"

"నేను కాదన్నానా! అసలు కాస్త మంచి రోజు కుదిరితే పంపించివేద్దామనే అనుకుంటున్నాను."

ఈ మాట అనేసరికి నరసమ్మ ఇక మాట్లాడలేక పోయింది. అసలు తానే పట్టుమని పదిరోజులపాటు అయన్ని విడచి ఉండలేదు! చిట్టి క్షణం నాన్న కనబడక పోతే నానా గందరగోళము చేస్తుంది. వెనక ఒకసారి బయలుదేరి పుట్టింటికి వెడితే వారం రోజులయ్యేసరికి చిట్టి జ్వరం పెట్టుకని చిక్కి శల్యమైపోయింది. పట్టుమని పది రోజులైనా ఉండకుండా తిరిగి బయలుదేరవలసి వచ్చింది.

నరసమ్మ అల్లాగే ఆలోచిస్తూ మంచాని కానుకుని కునికిపాట్లు పడుతూంది. రాత్రి మాగపు పొలాలలోనుంచి కీచురాళ్ళమోత వినిపించేటంత నిశ్శబ్దంగా ఉంది.

ఒక్కసారిగా ఇరుగు పొరుగున ఉన్న కుక్కలన్నీ బొయ్యిమన్నాయి. నరసమ్మ ఉలిక్కిపడిలేచి బంట్రోతుల్ని కేకేసింది. రెండోజాము నిద్రలో ఉన్నారేమో! వాళ్లెవరూ పలకలేదు! వాళ్లు గుర్రుపెట్టి నిద్రపోతున్న చప్పుడుమాత్రం స్పష్టంగా వినిపిస్తున్నది.

మళ్లీ చెవులు గింగురుమనేటట్లు కుక్కలు మొరిగాయి. ఊళ్లో దూరంగా పెద్ద కోలాహలం వినబడింది. కుక్కలు మొరగటలు అంతకంతకు ఎక్కువౌతున్నాయి గాని తగ్గడం లేదు. నరసమ్మ గట్టిగా "వెంకన్నా!" అని బంట్రోతును కేక పెట్టింది. అరుగుమీద పడుకున్న బంట్రోతులు లేస్తున్నారో లేదో చూదామని ఆమె కిటికీ దగ్గరకు వెళ్లింది. కిటికీ తలుపులు తెరిచిచూసింది. ఢామ్! ఢామ్! అని 5, 6 సార్లు తుపాకి మోతలు వినిపించాయి.

ఆ దృశ్యం చూసేసరికి ఆమెగుండె ఆగిపోయినట్లయింది. ఎదురుగా యాభై అరవైమంది, నల్లటి చొక్కాలు, లాగులు తొడుక్కుని చేతుల్లో కాగడాలు పట్టుకుని వస్తున్నారు. అందులో ఒకడు బూరాలో మూతిపెట్టి గట్టిగా "తలుపులు తెరవకండి! వీధుల్లో రాకండి! తలుపు తెరిస్తే తల లెగిపోతాయి." అని కేకలు పెడుతున్నాడు కొందరి చేతుల్లో కత్తులు బల్లాలు కాగడాల వెలుతురులో తళతళ మెరిసిపోతున్నాయి. మరికొందరు తుపాకులు బుజాల మీద పెట్టుకున్నారు. వారందరు ఒకే క్రమంతో అడుగులు వేసుకుంటూ కాళ్లతో గట్టిగా చప్పుడు చేసుకుంటూ నడిచి వస్తున్నారు. ఆమె గట్టిగా కేకలువేసి బంట్రోతుల్ని పిలిచింది. వాళ్లెవ్వరూ పలకలేదు. రెండోవైపునున్న మరో కిటికీ తెరిచిచూసింది! ఇంతవరకు అరుగుమీద పడుకుని ఉన్న బంట్రోతు లెవ్వరూ కనబడలేదు. ఒక్కసారిగా ఆమె మనస్సులో వాళ్లు తమ ప్రాణాలు దక్కించుకోడానికి పారిపోయిన సంగతి మెరుపులా మెరిసింది. ఆమెకు మరి కాళ్ళాడలేదు! భయంతో నోరారిపోతు నాలుక పిడచ కట్టుకుపోతూన్నట్లనిపించింది. ఆ తరవాత ఆమె చిట్టిని కదలకుండా జాగ్రత్తగా మంచంకింద పడుకోబెట్టి పిల్ల కనబడకుండ దుప్పటీ మంచంకోళ్ల కిందికి దిగజార్చింది. మళ్ళీ చిట్టిని ముద్దుపెట్టుకుని నిశ్శబ్దంగా ఏడుస్తూ మంచం కోడుదగ్గిర బిక్కుమంటూ కూర్చుంది. భయంచేత ఆమె కాసమయంలో ఆలోచించే శక్తికూడా నశించి పోయింది...

ఇంతట్లో ఎవరో దబదబా తలుపు తట్టారు!

"తలుపు! తలుపు!" పిడుగల్లాగ తలుపులమీద ఒక వంద తాపులు వినిపించాయి! తరవాత ఒక పెద్ద దుంగతో తలుపులమీద మోదిన చప్పుడు... తలుపులు తటాలున ఊడి

చెరి ఒక పక్కకి పడిపోయాయి! బిల బిలమని నాగడాలతో 50, 60 మంది లోపలికి ప్రవేశించారు.

ఆమె భయంతో గోడకు ఒక మూలగా కూలబడి పోయింది.

“ఇనస్పెక్టరు ఎక్కడ దాక్కున్నాడు?” అని ఒక కర్కశ స్వరం అడిగింది.

“సాయంకాలమే పోలీసుల్ని తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు!”

“నిజం చెప్పు.” నిప్పుకణికల్లా ఎర్రగా మెరుస్తున్న రెండు కళ్లు ఆమెను గద్దించి అడిగాయి!

ఆమె చేతులు జోడించి దీనంగా నిజమే చెబుతున్నానని సమాధానం చెప్పింది.

ఒక తర్జని భయంకరంగా ఆమెను నగలన్నీ ఒలిచి ఇమ్మని ఆజ్ఞాపించింది.

ఆమె కిక్కురు మనకుండా నగలన్నీ ఒలిచి ముందు పెట్టింది. ఈలోగా బాటరీలైట్లు కొన్ని విద్యుద్వీక్షణాలతో ఇల్లు నాలుగు మూలలా గాలించాయి.

మళ్లీ కర్కశమైన ప్రశ్న—

“పిల్లనెక్కడ దాచావు?”

ఆ ప్రశ్నతో ఆమె హృదయంలో రక్తం గడ్డకట్టుకు పోయింది. ఆమె హీన స్వరంతో సమాధానం చెప్పింది.

“దాచలేదు! వాళ్ళ బామ్మగారింటిదగ్గర ఉంది!”

“అబద్ధాలాడుతున్నావు! చెబుతావా? ఒక్క పోటు పొడిచెయ్యమన్నావా?”

ఆమె బావురుమని ఏడుస్తూ అతని కాళ్ళమీద పడింది. ఈ గల్లంతుతో మంచంకింద పడుకున్న పిల్ల లేచి పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది.

అతను జబ్బ పట్టుకొని ఆమెను గోడకానించి తోసిపెట్టి, రొప్పుతూ, ఆమెకేసి తీవ్రంగా చూసి మళ్ళీ ప్రశ్నించాడు.

“దొంగా! నాతో అబద్ధం చెబుతావా? ఇనస్పెక్టరు ఎక్కడ దాక్కున్నాడో చెప్పు!”

ఆమె గొలగొల ఏడుస్తూ అతి దీనంగా ఇనస్పెక్టరు పోలీసులతో వెళ్ళిపోయిన విషయం రెట్టించి చెప్పింది.

అతను పిస్తోలుతీసి నొసటిమీద పెట్టి “ఇప్పుడైనా నిజం చెబుతావా? చంపెయ్యనా?” అని గద్దించాడు.

ఆమెకు సమాధానం చెప్పే ఆలోచనా శక్తి పూర్తిగా క్షీణించింది. మళ్ళీ చేతులు జోడించి అతని కాళ్ళమీదపడి ఏడుస్తూ దయాభిక్ష వేడింది. ఉత్తర క్షణంలో ధామ్మని పేలిన పిస్తోలు ధ్వనితో ఆమె గొంతు వెనువెంటనే జీవము అంతరించాయి. పిమ్మట ఊరంతా దద్దరిల్లేటట్లు ప్రతిధ్వనించే కర్కశ నినాదాలతో ఆ విప్లవకారులు ఆకాంక్షలలో క్షణకాలం తమ ఆదర్శ రాజ్యం నిర్మించారు! ఆ తర్వాత వారు సక్రమ పాద విన్యాసాలతో ఆనాటి అంధకారంలో లీనమైపోయారు.

దయాభిక్షకోసం జోడించిన హస్తాలతో అలాగే కొయ్యబారిపోయిన ఆమె కళ్లు శూన్యంకేసి నిరీక్షిస్తూ నిలిచిపోయాయి. చిన్నపిల్ల నేలమీదపడి ఏడుస్తూంటే ఒక ఎలకపిల్ల అక్కడికివచ్చి, ముని కాళ్ళమీద నిలబడి ఆపిల్లకేసి చూసి, తిరిగి తన దారిని వెళ్లిపోయింది.



# ప్రబంధయుగము, స్త్రీలు

"ఆంధ్రశ్రీ"

అనాదినుండియూ భారతదేశములో స్త్రీలకు అర్హా గౌరవం ఇవ్వబడినట్లు మనకు సాహిత్యం తెలుపుతూవుంది. స్త్రీ గృహానికి యజమానురాలు. భార్యాభర్తలిరువురూ గృహమనే రథాన్నిలాగే రెండు చక్రాలు. అందుచే రెండు చక్రాలూ సమరసభావంతో నడిస్తేనేగాని బండి సుగమంగా ప్రయాణం సాగించలేదు.

స్త్రీలను భారత దేశీయులు బానిసలుగా చూస్తారనే భావం పాశ్చాత్య దేశ వాసులు మన దేశానికి అధికారులుగా వచ్చి మన గృహాన్నీ సంఘాన్నీ తప్పుగా అర్థంచేసుకొని చేసిన ప్రచారం తప్ప వేరుకాదు. మనవారు విస్సన్న చెప్పిందే వేదం అన్న విధానంలో పాశ్చాత్యులు చెప్పే ప్రతీ భావాన్నీ గ్రుడ్డిగా ఆమోదించడం పరిపాటి అయి పోయింది.

కాని ఒక్కసారి మనం మన పూర్వ గ్రంథాలను పరికిస్తే స్త్రీలు పూర్వకాలంలో ఎంతటి గౌరవ ప్రతిపత్తులతో పూజింపబడేవారో ఏ విధంగా గౌరవింపబడేవారో తెలుస్తుంది.

మన ప్రబంధ యుగంలో స్త్రీలు అత్యంత ఉచ్ఛదశలో నున్నట్లు మన ప్రబంధాలను పరిశీలించినచో బోధపడగలదు.

ఆదరణకు భారతదేశం పుట్టినిల్లు. అతిథి అభ్యాగతుల్ని ఆదరించడంలో భారత స్త్రీ ఎట్లా ప్రవర్తించేదీ పెద్దనమను చరిత్రలోని

'వండ నలయదు వేవురు వచ్చిరేని
అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి;
అతిథు లేతేర నడికిరేయైన బెట్టు
నలయు భోజ్యంబు లింటు నవ్వారిగాగ'

అని ప్రవరాఖ్య పత్నినిగూర్చి చెప్పిన పద్యంవల్ల తెల్లమవుతూ వుంది.

ఒక్క గృహస్థ ధర్మాన్ని నెరపుతూవున్న సోమిదమ్మ మాత్రమే గాదు, వారకాంతయైన వరూధిని గూడ

'చందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతి గందె, వడదాకె యొప్పులాలుకు
వదన, మస్మద్గృహంబు పావనముసేసి
బడలికలువాసి చనుము'

అని ప్రార్థిస్తుంది.

అందుచే ప్రబంధ కాలంలోని స్త్రీలు ఆతిథ్యం పరమ ధర్మముగా ఎంచేవారన్న విషయం బోధపడగలదు.

"ఎవ్వాని గృహాంతరంబున భవాదృశ
యోగిజనంబు పావన
స్నాన విధాన్నపానముల సంతస మందుచు
జీవునిచ్చలుక్"

వారిదే భాగ్యవైభవము, పుణ్య విశేషము. వారిదే అవంధ్య జీవనము, వారిదే జన్మము అని చెప్పడంవల్ల ఈ ఆతిథ్య ధర్మాన్ని ఎంత ఉత్కృష్టంగా పరిగణిస్తూవున్నారో తెలియగలదు.

నిర్వచనోత్తర రామాయణంలో స్త్రీల ధర్మాన్ని బోధిస్తూ చెప్పిన ఈ క్రింది పద్యంవల్ల స్త్రీలకుగల అర్హా స్థానం బోధపడగలదు—

'పతియ చుట్టంబు బక్కంబు బతియ చెలియు
బతియ తల్లియు దండ్రియు బతియ గురుడు
పతియ దైవంబుగావున్న నతనిపంపు
నచ్చుటయ కాదె ధర్మంబు నాతికరయ'

ఇదే విషయాన్ని శృంగార నైషధంలోనూ పాంచాలీ పరిణయంలోనూ కూడా ప్రబోధించినట్లు మనకు గోచరిస్తుంది.

ఈ క్రింది పద్యాలవల్ల :—

పాటించి కొలువుము భవన దైవంబుల,
సవతుల గొనియాడు సఖులబోలె,

గారాధనము సేయు మత్తమామల కెపుడు,
పరిజనంబుల మీద కరుణ గలిగి,
యలుగకు కోపించి నపుడు నాధుని తోడ,
మదిలోన నుబ్బకు మన్ననలకు
బోడి కోడండ్రతో గూడియాడి చరింపు,
దాసీజనము బ్రోవు దక్షిణకరణి,

బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తివిశ్వాస సౌహార్ద్ర పరత నెరపు
దివ్య పతిదేవతా చార పరమపుణ్య
వర్త్మ మేమరకుండుమీ తల్లికాన.

(శృంగార నైషధము)

చిత్తమెరింగి భర్తలకు
సేవలు చేయుట ధర్మమమ్మ లో
కోత్తర యత్తగారి కెదు
రుత్తర మెత్తకు మమ్మ యమ్మరో
యొత్తకు వంచినట్టి తల
యియ్యమ తోయ్యలులందు నంత య
త్యుత్తమరాలు మేలనగ
నుండుట భూషణమమ్మ కోమలీ.

(పాంచాలీ పరిణయం)

కలవారి పడుచు ననుచుం
దెలిపెదు సు నడకచేత దీనుల బతులీ
వులు కొంచమిడిన బదివేల్
ఫలియించు నటించుగాని పదరెడుసుమ్మీ.

(పాంచాలీ పరిణయము)

పై విషయాలు వారియొక్క సద్గుణ పుంజాన్నీ వినయ విధేయతల్నీ బంధుప్రీతినీ గౌరవ మర్యాదలను కాపాడే విషయంలోనూ కుటుంబ గౌరవాన్ని నిలిపే విషయంలోనూ స్త్రీలు నడచుకోవలసిన రీతిని తెలుపుతుందే కాని వారు కేవలం బానిసలుగా అత్తమామల ఆజ్ఞల్ని పరిపాలించే కీలుబొమ్మలుగా వుంటారని భావించకూడదు. అంతే కాదు పూర్వకాలమున స్త్రీలు వంటయింటి బానిసలుగాను, పిల్లలుగను యంత్రములుగాను వుండేవారను భావం మన వారిలో చాలా ప్రబలంగా వ్యాపించివుంది. కానీ వారిలో అతి ప్రతిభావంతులైన విద్యాధికలు కూడ నుండిరను సంగతి ప్రబంధములను జదివినవారికి తెలియగలదు. ఈ విషయాన్ని ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ఈ క్రింది పద్యం ఋజువు పరుస్తుంది.

కావ్య నాటకా లంకార గాన మదన
శాస్త్ర పరిచయ మహిమంబు జాల పొగడ
భామినీమణి నెరపె నుద్దామ పటిమ
నా యసురభర్త మెచ్చి పురె యనంగ

ప్రబంధ యుగానికిముందే మన దేశంలో గణిత శాస్త్రమునం దఖండ ప్రజ్ఞా సమన్వితయగు లీలావతివంటి ధీశాలురను గలరను సంగతి జగద్విదితమే.

ఒక్క విద్యలలోనేగాక పూర్వకాలమునందలి స్త్రీలకు జలక్రీడలు, దాగుడుమూతలు, ఊయేలలూగుట, బొమ్మ పెండ్లిళ్లు, పింపిళ్లు, ఓమనగుంటలు గొల్ల స్తంభాలు మొదలైన క్రీడా విలాసాల్లోనూ ఈత, కత్తిసాము, గుర్రపు సవారివంటి సాహస క్రియలలోనూకూడా పాల్గొనేవారని ప్రబంధాలనుండి గ్రహింపగలము. అందుల కుదాహరణగా రెండు పద్యాలుదాహరిస్తాను.

దినముల్ కొన్ని చనంగ నంత గడు నర్థిక
బొమ్మ పెండ్లిండ్లు గు
జ్జెనగూళ్ళ చ్చనగండ్లు పింపిసులు పుచ్చిల్
గీరనంగింజ లో
మన గుంటల్ కనుమూసి గంతన నలు
కంబాలాట లోనైన
ఖేలనముల్ మీఱగ బోంట్లతో నలరె
బాలరత్న మెల్లప్పుడున్.

(కళా పూర్ణోదయము)

తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంత సే
వను పడనిర్చి ముందరికి బాటి కెలంకులకూ బొలంగి దా
వెనుకకు నేగుదెంచి కడు వేడ్క యొనర్పగ బంతియాడ నె
మ్మని గనకంపు గోల నడిమింటనె త్రిమ్మరి దారికొట్టుచున్.

(ప్రభావతీ ప్రద్యుమ్నము)

# ప్రబంధయుగము, స్త్రీలు

నల భీమపాకమని ఎక్కువగా పేరొందడానికి కారణం వారు పురుషులయ్యూ స్త్రీల విద్యలయందు ప్రకాశించడం వల్లనే. అంతమాత్రాన పూర్వం పురుషులకే గాని స్త్రీలకు వంటలు భక్ష్య విశేషాలు చేయడం చేతగాదనుకోకూడదు. పాంచాలీ పరిణయంలోని ఈ క్రింది పద్యాలను చూస్తే స్త్రీలు పాకశాస్త్రమం దెంతటి సిద్ధహస్తులో తెలియగలదు.

వడ్డన జూపింత చెలువల్ తెలియోగిర మెల్పుపప్పు మెం
డొడ్డి కూరగాయ ఘృత ముక్కెర చక్కెర తేనెలడ్డు వా
ళ్ళైన లానవాలు చలియించని తైరులు మేరుమేరు పై
గిడ్డి దలంచిరో యనగ గేస్తురకిచ్చె సమస్తభాగ్యముల్.

చేత మెతు కంటకుండన్
సీతాభోగము వారి చినయోగిర మా
రా తుమ్మిపూర తెలుపా
హా తావియయారె వేడియని వేపిరాగిన్.

మన భారత నారీమణులు 'కార్యేషుదాసీ కరణేషు మంత్రీ...' అనే విధంగా పతులకు వివిధరంగాలలో చేదోడు వాదోడుగా వుంటూ తమకుగల చనువునుబట్టి వారికి వారి కార్యాలలో తోడ్పడుతూ వుండేవారు.

పతులు విచారముగానుండే సమయాల్లో వారికి ధైర్యాన్ని గొల్పుతూ (శృంగార నైషధంలో దమయంతి నలుని ప్రోత్సహించి ధైర్యము గొల్పుతుంది) నిస్సహాయ నిరాలంబ స్థితిలో తగిన ఆలోచనలు తెల్పుతూ (శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానంలో చంద్రమతి విశ్వామిత్రుని ఋణవిముక్తుడగుటకు భర్తకు తగిన సలహాల నిస్తుంది) వున్న ఘట్టాలు ఏ ప్రబంధంలో వెదకినా మనకు కనిపిస్తూనే వుంటాయి.

వీటన్నిటికీ తోడు స్త్రీలు పురుషులతో సమానంగా ఆహవరంగంలో పాల్గొనేటంతటి ధైర్య సాహసాలూ యుద్ధ పాటవం కలవారనికూడా ఉత్తర హరివంశంలోని ఈ క్రింది పద్యాలవల్ల తెలియగలదు.

తంత్రీ వినోదంబు తడవు సైపని వ్రేళ్ల
గొనయంబు తెగలపై గోరి కనుట
యుద్ధంబు పిడిముట్టి నలయు పాణితలంబు
ల స్తకం బిటియించు లావు కలిమి
చెలికత్తె నొత్తిలి చిఱలేని యెలుంగు
సింహనాదంబుచే జెదరకునికి
ప్రమద నర్తన కేలి బంతవింపని పదం
బైమరాణంబుల నలత బడమి

సోయగపు చిత్రరూపంబు జూచుచోట
వేసరు విలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటలు మొక్కలంపు గెలుపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ

అజిజూచున్ హరిజూచు జూచు కములం
దందంద మందార కే
సర మాలా మకరంద బిందు సవిల
స్యందంబు లందంబులై
తోరగం బయ్యెదకొంగొకింత దొలగం
దోడ్తో శరాసారమున్
దరహాసామృత పూరముం గురియుచున్
ధన్వంగి కేళీగతిన్.

గదవిసరి వైచె నరకుడు
వదలక నతదుని మెత్తకై వైచెను దివిజు
డది ముదిత దుముకు సేసెను
దుది బరిఘము వైచె నతడు దొయ్యలి విఱిచెన్.

ఇట్లు స్త్రీలు సమస్త విషయాలలోనూ పురుషులతో సమానంగానూ, కొండొకచో పురుషులకన్న మిన్నగానూ వ్యవహరించి కీర్తినందిన విషయాలు మనం ప్రబంధాలు తిరిస్తే కొల్లకొల్లలుగా దొరుకుతాయి.

ఇంక ప్రబంధాలలో ఎక్కువగా వర్ణింపబడే శృంగార రస పోషణలో యువిదలు చూపిన చాకచక్యము ప్రబంధం చూచినా మనకు పొడగట్టుతూనే యుంటుంది. ప్రబంధ వర్ణనలలో కొంతవరకు అతిశయోక్తికి తావు గల దన్నమాట వాస్తవమేగాని అందలి విషయాలు బొత్తిగా సత్యదూరమని కొట్టి పారవేయడానికి వీలులేదు.

మొత్తంమీద ప్రబంధయుగంలో స్త్రీలు సమస్త విషయాలలోనూ పురుషుల కెంతమాత్రము తీసిపోకుండా వాసి గాంచిన విషయం మనకు సులభంగా గ్రాహ్యం కాగలదు.



### ప్రజా ప్రాతినిధ్యాన్నిపొంది తద్వారా శాసన సభికులు కాదల్చుకొనే వారలందరకు

# హెచ్చరిక!

ఆర్యా,

మీరు కాంగ్రెసువారై కావచ్చు—కమ్యూనిస్టులే కావచ్చు—సోషలిస్టులు కావచ్చు—లేదా రాడికల్ హ్యూమనిస్టులే కావచ్చు. మీరే కక్షకి చెందినవారైనా బాధలేదు. మా సామాన్య ప్రజలు కూడు గుడ్డలకు లోటు లేకుండా శాంతియుతంగా వుండే పక్షాన యే పార్టీ అధికారంలోవున్నా ఒకటే. నూతన రాజ్యాంగం తయారయింది. భారతదేశం సర్వ స్వతంత్ర రిపబ్లిక్‌గా మారింది. అది ప్రాతిపదికగా క్రొత్త యెన్నికలు కొద్దికాలంలోనే జరుగనై యున్నవి. మీ పార్టీ కార్యక్రమ ప్రణాళికల్ని ప్రజలముందు—అంటే అమాయకులమైన మాముందుపెట్టి మాకు ఆశచూపి మా ఓట్లను పొందేందుకు ప్రయత్నిస్తారు. ఆ విధంగా ప్రజాప్రాతినిధ్యాన్ని పొందదలిచే వారికి చేసే హెచ్చరికే యిది.

మేము తెల్లదొరతనం చేసిన దుర్మార్గాన్ని సహించి వారికి వంగి వంగి సలాములు చేశాం. కాని నేడు లక్షలాది మంది విప్లవయోధుల ప్రాణత్యాగ ఫలితంగాను—స్వతంత్ర భారత పిత గాంధి మహాత్ముని నాయకత్వాన కాంగ్రెసు సంస్థ సాగించిన అహింసాయుత పోరాటు ఫలితంగాను, స్వతంత్రులమైనాము. కాంగ్రెసుపార్టీ వెంటనే ప్రభుత్వ పీఠాన్ని అధిష్ఠించింది. అప్పటినుండీ కూడా ప్రభుత్వం అనేక గడ్డు సమస్యల్ని యెదుర్కోవలసి వచ్చింది. అందువల్లనైతేనేమి మరియేయితర కారణాల వల్లనైతేనేమి ప్రత్యక్షంగా ప్రభుత్వం మాకు—మధ్యనిషేధ చట్టాన్నములు పర్చుట, జమీందారీలను రద్దుపరచుట తప్ప—యెట్టి సదుపాయాన్నిగానీ చేసియుండలేదనే చెప్పాలి. స్వతంత్రుల మైనాముగదా—మన కష్టాలు తొలగిపై సుఖిస్తాము అని యెన్నోకలలు గన్నాం. మా కలలన్నీ నేటికీ కలలుగానే నిలిచిపోయినై. "ఇంతకంటె తెల్లదొరతనమే బాగున్నది. ఇదేం కాంగ్రెసు ప్రభుత్వం బాబూ" అని పెదిమలు విరిచారు మాలో కొందరు. అది కేవలం దేశరక్షకులనే మాత్రం అవగాహన చేసుకోనివారు చేసే అపస్వర విమర్శ మాత్రమే కావచ్చు. కాని ఆ విషయంతో అటుపట్టిస్తున్న మాకు అవన్నీ యెలా అర్థమవుతవి? ప్రయత్నం చేసే సగోత్ర వివాహ సమర్థనా చట్టాలతోను, ప్రజా ప్రతినిధులు వారి నాయకులయందు కట్టులు పన్నాగాలు విన్యాస రాజకీయ తంత్రాలతోను మాకేం నిమిత్తం? మాకు కావలసింది—కడుపునిండా తినేందుకు తిండి—వంటినిండా కప్పుకునేందుకు కొంత గుడ్డ. అంతే మా యీ న్యాయమైన కోర్కెను, హక్కును తీర్చేందుకు ప్రయత్నిస్తారనే మిమ్మల్ని యెన్నుకునేది. కాని మీరు ఆ శాసన సభా భవనంలో, ఆ గాలి పంకాల హాయిలోకి వెళ్లేసరికి మా సంగతి మరచిపోతారు. మేము మీ కిచ్చిన ప్రాతినిధ్యాన్ని దుర్వినియోగం చేస్తారు స్వార్థపరులై. ఏమంటే, మిమ్మల్ని యెన్నుకున్నాక యిక మళ్లీ యెన్నికలవరకూ కదిపేందుకు బ్రహ్మకైనా తరంకాదు. అందుచేత మా బాగోగులు మీ మంచితనంపైన ఆధారపడి వున్న దన్నమాట. మీరు ప్రజా ప్రతినిధులుగా మీ బాధ్యతలను గుర్తించిన నాడుగాని మీలో మంచిదనం రాదు. మీ బాధ్యతలు మీరు గుర్తించాలంటే—ఒక్కమారు మేము నివసించే ప్రదేశాల్ని, మమ్మల్ని, వచ్చి పరిశీలించండి. మా పూరి గుడిశల్నీ, వాటికి చుట్టూ వుండే మురికి గుంటల్నీ, బక్కచిక్కిన మా బరుగు దేహాల్నీ గనుక చూచినట్లయితే హృదయముండే ప్రతి మానవుడూ కన్నీరు కారుస్తాడు. మీరుకూడా—హృదయ మేవుంటే—వలవలా యేడుస్తారు. మీరు మీ బాధ్యతలను గుర్తింపగలుగుతారు. అందుకని—రండి. ఒక్కమారు చూడండి. మా కష్టజీవులు పడే పాట్లను మా స్థితిని చూడడమెందుకంటే స్వయంగా మీరు కూడా అనుభవించినట్టయితే మీరు కష్టాలను గుర్తించేందుకు యెక్కువ అవకాశం వుంటుంది. కాని సుకుమారులైన మీరు కూడా యెందుకీ కష్టాలు? మే మనుభవిస్తున్నది చాలు. మే మనుభవించే కష్టాలుచూచి మా హక్కును

తీర్చేందుకు ప్రయత్నించాలనే భావం మీకు కలిగితే అదే పదివేలు.

అందుచేత మా వోట్లతో మా ప్రాతినిధ్యాన్ని పొందాలనుకునేవారు యీ క్రింది విషయాల్ని గమనించవలసిందిగా కోరుతున్నాం.

"మనం ప్రాతినిధ్యం వహించాలనుకున్న ప్రజల స్థితిగతులేమిటి? వాళ్లు కోరేదేమిటి? వారి హక్కులను, కోర్కెల్ని తీర్చేందుకు ప్రయత్నించడానికేనా మనం వాళ్ల వోట్లను తీసుకుంటున్నది? ప్రజా ప్రతినిధుల బాధ్యతలేమిటి? ఎంతవరకు వాటిని నిర్వర్తింపగలము?" అనే ప్రశ్నల్ని ఒక్కమారు మిమ్మల్ని మీరే అడిగి చూడండి. అలా ప్రశ్నించుకొని "మనం స్వార్థంకోసం ప్రజా ప్రాతినిధ్యాన్ని కోరడంలేదు. వాళ్ల కోర్కెల్ని తీర్చగలం" అనే సమాధానాన్ని గనుకను మీరు మీ అంతరాత్మనుండి పొందినట్టయితే అప్పుడు యెన్నికలలో పోటీ చెయ్యండి. మా స్థితిగతుల్ని అభివృద్ధి పరచేందుకు బద్ధకంకణులు గండి. మీరు అవినీతిపరులుగా తయారుకారనే నమ్మకంతోనే మేం మిమ్మల్ని యెన్నుకుంటాం. అందుకుగాను మీరు— మీ ఇజమ్స్‌తో మాకు నిమిత్తంలేదు—ఆ విధంగా నీతికి కట్టుబడి ప్రవర్తించండి. ఇదే యీనాడు మాలో ప్రతి ఒక్కరం మిమ్మల్ని కోరేది. ఏమంటే భారత దేశ ప్రతిష్ఠ, భారతీయుల జీవితము మీమీదనే ఆధారపడివున్నాయి. అందుకుగాను భావి భారత సౌభాగ్య నిర్మాతలయ్యేందుకు ప్రయత్నించండి. ఆనాడు మేము మీకు చేయూతనిచ్చి సహాకరిస్తాము. ఆనాడే ప్రపంచమందలి సాటి దేశములతో సమానస్థాయితో భారతమాత సగర్వంగా తలెత్తుకొని, "సర్వమానవ సౌభ్రాతృత్వ సాధనా మహత్కార్యానికి నాచేయూతనిచ్చి సహాకరిస్తాను" అని అనగలిగేందుకు వీలు కలుగుతుంది. మహాత్ముని ఆశయం ఫలిస్తుంది.

సెలవు. జైహింద్!

—రా. గంగరాజు



---

(24 వ పేజీ తరువాయి).

పాలనుగానీ తరచిచూస్తే ఎక్కడోవొకక్కడ వారి 'దృష్టి దోషం' మనకు కనుపిస్తుంది. నిజాలకు తనకు అనుకూలమైన దృష్టిని ఆపాదించటం జరుగుతూ వుంటుంది. రాజకీయం లోనూ, మతం లోనూ ఇది మరీ ముఖ్యంగా కనుపిస్తుంది. చాలామంది తమ ఉద్దేశాలు సంఘ సేవ చెయ్యాలనే కోర్కెవల్ల పుట్టిన వని భ్రమపడుతూ వుంటారు. కాని చాలావరకు మనుష్యుల అభిప్రాయాల పుట్టుక మరొకచోట ఉంటూ వుంటుంది. ఇందువల్ల Objectivity అనేది వుండటానికి వీల్లేదని కొందరు అనటానికి అవకాశం కలుగుతూ వుంది. ఇటువంటి సందర్భాల్లో మనస్తత్వ శాస్త్రం చాలా సహాయపడుతుంది. మనస్తత్వ శాస్త్రం ఈ కోర్కెలకు పునాదిగా, అంతర్గతంగావున్న వాంఛను పైకితెచ్చి చూపుతుంది. ఇతరులు మనలను ఏ విధంగా చూస్తున్నారో, అదే విధంగా మనలను మనం చూసుకోవటానికి అవకాశం కల్పిస్తుంది. ఈ జ్ఞానాన్ని దీనితోపాటు శాస్త్రదృష్టిని గనక ప్రచారం చేసేటట్టయితే, మానవుడు ఇప్పటికంటే హేతువాది అయి వృద్ధి చెందుతాడు. "జీవితానికి సంబంధించిన హేతువాదాన్ని, మనలో తాత్కాలికంగా ప్రబలంగావున్న కోర్కెనేకాక, అన్ని కోర్కెలనూ తెలుసుకోవటంగా నిర్వచించవొచ్చు. సంపూర్ణంగా హేతువాది అవటం అనేది సాధ్యంకాక పోవచ్చు. కాని 'పిచ్చివాళ్లు' వున్నారని మనం వొప్పుకున్నంత కాలం వొకరికంటే వొకరు ఎక్కువ హేతువాదంమీద ఆధారపడేవాళ్లు వుంటారని మనం వొప్పుకొని తీరాలి. హేతువాదం వృద్ధిచెందటం మీద పురోభివృద్ధి ఆధారపడి వుందని నా విశ్వాసం." అని చెప్పి—"మన తెలివితేటలతో మన కోర్కెలను తెలుసుకోవటం, వాటిని హద్దుల్లోపెట్టుకోవటం జీవితానికి ముఖ్యంగా కనిపిస్తుంది. జీవితం సక్రమంగా వృద్ధి చెందాలంటే ఇది అవసరం. ఇప్పుడు ప్రపంచంలోవున్న చెడు పోవాలంటే క్రమక్రమేణా తెలివి తేటలు ప్రచారం అవ్వాలని మనం ఆశిస్తున్నాం," అన్నాడు బెర్ట్రెండ్ రసెల్.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

[illegible]

పొందుపరచుకోనటం:—

ప్రకృతి యేర్పరచిన ప్రత్యేకమైన సూక్ష్మగ్రాహ్య తరుణములలో బిడ్డ [illegible] సామర్థ్యం మూలకంగా పరిసర పరిస్థితుల సంసర్గంచేత, [illegible] ను సృష్టించుకొని తాను జన్మించిన దేశ, కాల, పరిసరములకు, పరిస్థితులకు అనుగుణ్యంగా పొందుపరచుకొనే శక్తిని సంపాదించుతుంది. అనగా, తను పుట్టిన కుటుంబం, సంఘం. దేశంయొక్క భాష, సంస్కృతి, ఆచార సాంప్రదాయాలు మున్నగునవి తనలో భాగమయిపోతవి. ఈ విధంగాపొందు పరచుకొనే శక్తికే "ఆవరణానుగుణ్యత" అంటారు.

బిడ్డ సాధించుకొనే ప్రతి లక్ష్యమున కనుగుణ్యంగా ప్రత్యేకమైన సూక్ష్మగ్రాహ్యదశ ఏర్పడటం, ఆ లక్ష్యమును సాధించిన వెంటనే అది అంతరించిపోవటం, మరొక లక్ష్యాన్ని బిడ్డ సాధించటానికోసం తదనుగుణ్య దశఏర్పడడం జరుగుతుంటుంది. అనగా, బిడ్డయొక్క సర్వ శక్తులు నిర్మాణ మగువరకు ఈ విధంగా ఉద్భవిస్తూ, అంతరించుతూ వుంటాయి. ఒకసారి ఉద్భవించి అంతరించిన సూక్ష్మగ్రాహ్య దశ, మరల రాదు. అలాంటి తరుణములో బిడ్డ సాధించే లక్ష్యమున కవసరమైన అవకాశం లేని యెడల, తిరిగి ఆ లక్ష్యమును సాధించటం అత్యంత ప్రయాసకరమైన విషయం. ఈ ప్రత్యేక సూక్ష్మగ్రాహ్య దశలలో బిడ్డసాధించే లక్ష్య ములు అనేకము లున్నవి.

బాహ్య ప్రపంచ పరిసరములు పరిస్థితుల కనుగుణ్యంగ పొందుపరచుకోటం, ఇది బిడ్డ జననకాలం నుండియే జరుగు తుంది. తల్లిని గుర్తించుకోటం, తన అందమును, అవయవ ములను గుర్తించుకోటం, (ముఖ్యంగా చేతులు కాళ్లు) తన చుట్టూమాట్లాడేవాళ్ల నోటిని, పెదిమలను తదేక ధ్యానంగా వీక్షించుచూ, తన పెదిమలను కదలించుతూ, తన కంఠనాళ ములను తర్ఫీతు చేసుకొనటం, పరిసర స్వరూపములను, [illegible] ఉండటం, మొదలగునవి అయిదారు నెలల [illegible] జరుగుతుంటవి. మరొక ముఖ్యవిషయ మేమంటే, పరిసరములలో వస్తువులు వాటి వాటి స్థానే [illegible]. అవి వాటి స్థానే [illegible] ఉండటాన్ని [illegible] లైతే వెంటనే దానికి [illegible] అశాంతి [illegible] కలుగుతుంది. క్రమ[illegible] వస్తువు సంగ్రహించినబిడ్డ, క్రమభంగాని [illegible]. వెంటనే అశాంతి అందో ళనకలిగి కోపం [illegible] కూడా వ్యక్తమౌతుంది. అదే విధంగానే ప్రతిక్షణం తనకు పాలిచ్చి, లాలించి, పాలించు తల్లి కనబడకపోతే, తల్లికి మారుగ మరెవరైనా తన్ను ఎత్తుకోటం, పాలివ్వటం, స్నానం చేయించటం సంభ విస్తే బిడ్డకు కలతకలిగి అస్వస్థత ఏర్పడడంకలదు. ఇందువల్ల విదితమయ్యేదేమంటె, అనుక్షణం బిడ్డ సంసర్గం సన్నిహిత సంబంధ మేర్పరచుకొంటున్న వస్తువులు, తల్లి, ఆ ఆ స్థానంలో లేకపోతే తదను భూతితో మానసిక జీవితాన్ని నిర్మించుకొనే కృషికి భంగం వాటిల్లుతుంది. అందువలన బిడ్డ ఓర్చుకో జాలదు.

ఈ ఆరునెలల ఈడుకే అస్పష్టంగా ఉచ్చరించుటకు ప్రయత్నించుతూ అవ్యక్తమైన మధుర శబ్దాలు చేస్తుంది. ఇంతవరకూ ప్రాకుతూ, దోగాడుతూ వున్న బిడ్డ, కూర్చో టానికి ప్రయత్నిస్తుంది. వస్తువులను చేతులతో పట్టుకొం టుంది. వస్తువులను చేతులతో పట్టుకొని పరిశీలించటంతో బిడ్డ తత్వ మతి చురుకుగా నిర్మింప బడుతున్న దన్నమాట. దాదాపు ఎనిమిది తొమ్మిది నెలల మధ్య కాళ్లు చేతుల మీద నడుస్తూ, పెద్దవాళ్ళ సహాయంతో మరిదేనినైనా ఆధారం చేసుకొని కాళ్ళమీద నిలుచోటానికి ప్రయత్ని స్తుంది. కాళ్ళు భూమి మీద మోపటం నేర్చు కొంటుంది. ఏడాది నిండేటప్పటికి కాళ్ళు భూమిమీద మోపి నడవటా నికి (సహాయంతో) ప్రారంభించుతుంది. ఏడాది

పిల్ల మూడునెలలకంతా చక్కగా నడవటాన్ని సాధించుతుంది. చేతుల నుపయోగించి ఏవో పనులను చేయుటకు ప్రారంభిస్తుంది. ఈ తరుణంలోనే బుద్ధిమరింత చురుకుగా, చక్కగా నిర్మాణమవుతున్న దన్నమాట. బిడ్డచేతులను నుపయోగించటానికి బుద్ధి నిర్మాణ వికాసములకూ, అంతే సంబంధమున్నది. (ఈ విషయాన్ని గురించి విపులంగా మరెప్పుడైనా ఆలోచిద్దాం.)

ఈ విధంగా రెండేళ్ళు నిండేటప్పటికి, బిడ్డ యెన్నో కార్యములను సాధించటం, పరిచయం చేసుకోటం తాను అనుభూతిద్వారా తనశక్తులన్నిటినీ నిర్మించుకోటం చేస్తుంది. ఇంతవరకూ, అస్పష్ట చైతన్యంతో, అసమానమైన మనస్తత్వం మూలకంగా, తత్సంబంధమైన సూక్ష్మ గ్రాహ్య దశలద్వార తినబుద్దినీ, మానసికశక్తులనూ నిర్మించుకొని, అవయవములను స్వాధీనపరచుకొన్నది. ఇప్పుడు స్వేచ్ఛగా తిరిగి తన కార్యమును చేసుకోటానికి కౌశలమును పొందటానికి ప్రయత్నిస్తుంది. అనగా ఇప్పుడు బిడ్డలో స్పష్టచైతన్యం ఏర్పడుచున్నది. మూడేళ్ళ నాటికి మరింత కార్యకౌశలమును సంపాదించుతుంది.

కాబట్టి, తల్లి శిశువు జననకాలంనుండి మూడు సంవత్సరములవరకు అతి జాగ్రత్తగా బిడ్డకు తోడ్పడుట అవసరం. అనగా, బిడ్డయొక్క ప్రతి అభివృద్ధి క్రమంలో దానికి తగిన పరిసరములు పరిస్థితులు లభించుటకు ప్రయాసపడాలి. బిడ్డకు తోడ్పడాలను ఉద్దేశంతో చీటికీ మాటికీ అనవసరంగా బిడ్డయొక్క స్వేచ్ఛకూ, స్వయంకృషికీ అడ్డు తగలకూడదు.

బిడ్డయొక్క సర్వతోముఖాభివృద్ధికి వలయు పరిసరములు పరిస్థితులు లభించులాగు ప్రయాస పడాలన్న మాత్రం చేత, తన ఆర్థికస్థితికి అందుబాటులోలేని పరిసరపరిస్థితులను నిర్మించవలెననుట కాదు. లేక, ఆర్థికపరిస్థితి ప్రశస్తంగా వున్నదని, బిడ్డవున్న గదులను కేవలం అలంకరించటం, అనవసరమైన అనేక ఆటవస్తువులను అమర్చటం అనికూడ కాదు. బిడ్డ ధనికుల యింటపుట్టనీ, దరిద్రులింటపుట్టనీ, దానికి అవసరమైన పరిసరములు, పరిస్థితులు ఈ ప్రపంచమే, బిడ్డ జన్మించిన ఇల్లు, ఇరుగు పొరుగు. బిడ్డ తన సర్వతో ముఖాభివృద్ధికి, స్వయంకృషి సల్పుచున్నప్పుడు, ఆ యా నిర్మాణదశలు వికాసదశలలో తల్లి విజ్ఞాన విచక్షణలతో తోడ్పడటం అత్యవసరం. ఇందువల్ల విదిత మయ్యేదేమంటే, బిడ్డ పోషణ, శిక్షణలు బాధ్యతను భరించవలసినది తల్లియే. శిశువు తల్లి గర్భంలో నున్నప్పుడేవిధంగా తల్లిలో ఒక భాగంగా వుందో, బాహ్య ప్రపంచంలో ప్రవేశించిన తరువాత కూడ తల్లిలో ఒక భాగంగానే కొంతకాల ముంటుంది. మాతా శిశువులకంత సంబంధ బాంధవ్యము లున్నవి.

ఈ విధంగా తల్లిచెంత బిడ్డ పెరగటంవలన, బిడ్డ మానసిక శక్తులు, బుద్ధి నిర్మాణమునకూ, వికాసమునకూ అత్యవసరమైన తల్లిఅనురాగం, సన్నిహిత సంబంధం, ఆమె కార్య కలాపములయొక్క పరిచయం, అనుభూతి, మున్నగునవి బిడ్డకు లభ్యమవుతాయి. కాబట్టి తల్లి సాధ్యమైనంత కాలం బిడ్డను తనవద్ద వుంచుకోవాలి. అనగా, తల్లి పనిచేసుకొనే తరుణములో (ఇంటా, బయటా)ను, బంధుమిత్రులతో సంభాషించునపుడు, ఇరుగింటికి పొరుగింటికెళ్లునపుడు బంధుమిత్రుల ఇంటికివెళ్ళునపుడు, విందు వినోదాలలో పాల్గొనునపుడు, బజారు కెళ్లునపుడు బిడ్డను, తల్లి తన చెంత నుంచుకోవాలి. ఈ విధంగా తల్లివద్ద బిడ్డ వున్నందుచేత వివిధ పరిసరములను పరికించి పరిశీలించు నవకాశము కలుగుతుంది. పెద్దవాళ్లు మాట్లాడునపుడు వారుచ్చరించు శబ్దాలను వారు కదిలించు పెదిమెలను, వాళ్ల భాషావైఖరిని వీక్షించటానికి, ఆలకించటానికి అవకాశం లభిస్తుంది. ముఖ్యంగా ఈ దశలో (జననకాలంనుండి 3 ఏళ్ళు దాకున్న ఉపదశలో) భాషను అలవరచుకొనే శక్తి అసమానం. ఎంత చక్కని భాషను వింటుందో, ఉచ్చరించేటప్పుడు వీక్షించుతుందో, అంత చక్కని భాషను మాట్లాడుతుంది. పెద్దవాళ్ళు ఏండ్లతరబడి అన్య భాష నభ్యసించినను అలవడనట్టి, ధోరణి, ప్రయోగాలు, ధ్వనులు మున్నగునవి మూడేళ్ళ ఈడుకంతా బిడ్డకు అలవడుతుంది. ఇట్టి అద్భుత శక్తి బిడ్డ కెటుక లేకనే అబ్బుతుంది.

ఇక ఇంటిలోనున్న వస్తువులు వాటి వాటి స్థానే క్రమము ననుసరించి వుండాలి. మనం వాడే సామాను, వస్తువులు మున్నగువాటిలో బిడ్డ ఆడుకోటం కలదు. దానికి మోయ

టానికి సాధ్యమైనచో అలా ఆడుకోనివ్వాలి. మరొక ముఖ్య విషయాన్ని జ్ఞాపకముంచుకోవుట ఆవశ్యకము.

బిడ్డనుబయటు వాహ్యాళికి తోపుడు బండిలో తీసుకొని వెళ్లేటప్పుడు చుట్టుప్రక్కలా బిడ్డ పరికించటానికి వీలున్నట్లు బండి పడగను తీసివేసి, బండిలో బిడ్డ నెటు వాలుగా పడుకోబెట్టి, లేక చంకనెత్తుకోవలసిన సందర్భంలో, చుట్టు ప్రక్కల బిడ్డ పరికించటానికి అనువుగ ఎత్తుకోవాలి. నడవటం నేర్చుకొన్న బిడ్డను, నడిపించుకొని పోవాలి కాని మోసుక పోరాదు. బిడ్డ నడుస్తూ, దారిలోనున్న అన్నింటి సూక్ష్మ పదార్థాలను కూడ పరిశీలించుతుంది. అట్టి సమయములో తల్లి ఓపికతో, బిడ్డ ఆగినచోట ఆగుచూ, అడుగు మీద అడుగు వేసి నడిచే సందర్భంలో తానూ అలానే నడుస్తూ, త్వరగా నడవమని నిర్బంధించకుండా మెలగాలి. అనగా, బిడ్డను ఆకర్షించే వస్తువులను పరిశీలించుటకు అవకాశ మిచ్చుట అత్యవసరం.

కాబట్టి, ఈ విధమైన పరిసరములు పరిస్థితులను బిడ్డకు లభించులాగున చేయుటకు ధనమును వెచ్చించ నవసరము లేదన్నమాట. ఈ విధంగా బిడ్డ, అంతర్గతంగా వున్న గ్రహణ శీల మనస్తత్వ మూలకంగా, తను సాధించవలసిన ప్రతి లక్ష్యమును అనుగుణ్యమైన సూక్ష్మగ్రాహ్య దశలో, జ్ఞానేంద్రియముల ద్వారా పరిసర పరిస్థితుల సంసర్గ సంపర్కముల వలనంగా మనుజుని మహోత్కృష్ట సాధనమైన బుద్ధినీ, మానవ సహజ శక్తులనూ, నిర్మించుకొని వికసింప జేసుకొంటుంది.

[illegible]గానే మానవుడు బాల్యంలోనే, పరిసర పరిస్థితుల కనుగుణ్యంగ పొందుపరచుకోటంలో కృతకృత్యుడవుతాడు. అనగా, మనుజుడు దేశకాలాల కనుగుణ్యంగా తన కుటుంబ జీవితంలో, సంఘజీవితంలో, తన వ్యక్తి జీవితమును పొందుపరచుకొనే శక్తిని సంపాదించుతాడు. అందువల్లనే మానవుడు సర్వప్రాణులలో సర్వ శ్రేష్ఠుడు.



స్త్రీ ప

# * అమ్మ *

ఎల్. రామనాథరెడ్డి

రాత్రంతా కుండపోతగా కురిసి వెలిసిపోయింది. దాంతో ప్రకృతిలో ప్రశాంతం కలిగింది. ఉదయానికి లేలేతపల్లవదనంలో ముకుళించిన తేజస్సైన బంగారు మెరుపులు మెరుస్తున్నాయి. హృదయాలన్నీ చల్లబడినాయి.

అమ్మమాత్రం జబ్బుచేసి బాధపడుతూ ఉంది. కాళ్ళు వాతాన్ని లాగుతున్నాయి. అయినా లొంగింది కాదు అమ్మ. కాకులు కూసేముందు మేల్కొంది. ఇంటి పనులన్నీ చక్కబెట్టింది. అమ్మది చాల నికృష్ట జీవితము. ఎప్పుడు విశ్రాంతి యెరుగదు. మనుమలు కలిగిన నాటినుండి తనకి మరీ శ్రమలధికమయ్యేయి.

తెల్లవారకట్టే లేవడం—ఊరి వెలుపలి బావినుండి నీళ్ళు తేవడం...పాచి పనులన్నీ చేయడం, అంట్లు తోమడం, పాలుకాచి అన్నం వండడం...యింకా అవీ యివీ చిల్లర మల్లర పనులెన్నెన్నో అమ్మేచేసేది.

అమ్మ కిద్దరు మనుమరాండ్రు—ముగ్గురు మనుమలూను. వంటపనులన్నీ ముగించి వీళ్లని లేపేది. ముఖాలు కడిగేది. కాసిన్ని రొట్టెముక్కలుచేసి వాళ్ళకు తినిపిస్తూ వాళ్ల ఆనందంలో తన కష్టాల్ని మరిచి పోయేది.

ఇంతవరకూ ఆమె చాల చురుగ్గా సంసారాన్ని యీదుకొచ్చింది. వంట యింటిలో యంత్రంలా అరిగి పోయింది. తన బ్రతుకులో యిక సుఖంలేదా అన్న తలంపు యింతవరకూ ఆమెకు తట్టలేదు. కాని యీ ఉదయం—ఆమె ముఖ కవళికలు మారిపోయేయి. నిరాశ, నిస్పృహలు ఆమెలో దారి చేసుకుంటున్నాయి. పూర్వపు చురుకుదనం, ఉత్సుకతలు కనపడడంలేదు.

ఈ ఉదయం విసుక్కొంటూ లేచింది. "అబ్బ! నేను చచ్చే పర్యంతం యీ బాధలు నన్ను వదల వనుకుంటాను. చావకేం!—యేమైనా చిన్న కుట్టితే కదూ నా కష్టాలు తీర్చడానికి" అని తలచింది, ప్రక్క గదిలో పడుకున్న కొడుకు మదిలోంచి.

అమ్మకు అంతో ఇంతో తోడు కన్నాడు. తల్లిపడే కష్టాల వేపు అతని బుద్ధి యెప్పుడూ మళ్ళలేదు. ఆమె యింతవరకు విసుగు లేకుండా ఓర్పుతో చేయడం యింట్లో నౌకరును పెట్టుకోవాలనే ఆలోచన అతనిలో లేకుండా చేసింది. నౌకరును పెట్టుకొనేంత శక్తి ఉన్నా—అమ్మ బాగానే చేస్తున్నది. అదీగాక నౌకరెందుకని యీనాటి దానికి అని అమ్మ అంటుండేదని అనుకోవడంవల్ల కొడుకు ఊరకున్నాడు.

ఇప్పుడే ఆమె అలా విసిగిందే గాని "నౌకరును పెట్టాలి, నేనిక పనులు చేయలేను," అని కొడుకుతో కచ్చింపుగా చెప్పనూలేదు. కోడలు సాయానికి వస్తే—"వద్దు తల్లీ నే చేసుకుంటాలే" అనడమే తెలివైన పనుకొనేది. తర్వాత తన నికృష్ట జీవితాన్ని నెమరుస్తూ నిట్టూర్చేది.

"అమ్మా!" అని పిలిచాడు కొడుకు. గుమ్మం అవతలనున్న అమ్మ వినిపించుకుని వస్తోంది. కదలడంలో వాతం చేసిన కాలు కలుక్కుమంది. మళ్ళీ సహించలేని బాధ కలిగింది. గెంటుతూవస్తూనే యిలా ఉద్దేశపడింది—"నే నికయీ పనులలో గ్రుగ్గిపోలేను—నాకు బాగా విశ్రాంతి అవుసరము. పట్నంలో అమ్మాయి గారింటివద్ద రెండు మూడు వారాల పాటుంటే బాగుండేలావుంది"—

తన శ్రమ జీవితానుభవాలన్నీ ఒక్క సారిగా ఆమె బుర్రలో పరుగులెత్తి తన అభిప్రాయాన్ని బలపర్చినాయి. ఇక్కడ ఉండటమంటే యిక నరకంలా తోచింది. చివరకు కొడుకును నొప్పించి పయనమైంది.

* * *

బండి చకచకా నడిచి పట్టణంలో దింపింది అమ్మను. బండిలో ఉన్నంతసేపు నూత్న భావిజీవితంపై కలలుగంటూ

వచ్చింది. పట్నం అంతా చాల క్రొత్తగా అగుపిస్తోంది. విశాలమైన తారురోడ్లు, నిత్యం యేదో పని మీద తిరుగుతున్నట్టుండే జనం, హడావుడి, బస్సులు, కార్లు, అమ్మకి ఆశ్చర్యము పుట్టించాయి.

పట్నంలో జీవితం బాగానే ఉండొచ్చు—కాని డబ్బుండాలి—అనుకొంది. ఇంకా ఆమె యిలా అనుకొంది—ఇందాక యిచ్చిన బండికిరాయి పెడితే పల్లెటూళ్లలో రెండుదినాల భత్యంగడుస్తుంది.

నిజానికి బండికుదుపువల్ల కాళ్ళూ ఒళ్ళూ నొప్పిపట్టినా క్రొత్త జీవితంపైగల వ్యామోహం చాలవరకు నివారించింది. ఆనందంతో ఆమె హృదయం పరవళ్లు త్రొక్కుతోంది.

ఆమె బండిదిగి సరాసరి ఆ మండువా యింటి గేటు దగ్గిరకు వెళ్లింది. వెళ్ళిందోలేదో ఓ బొచ్చుకుక్క బొంయ్ బొంయ్ మంటూ కరవొచ్చింది. అమ్మ కొంచెం తికమకలాడింది. ఆ కుక్క ప్రక్కనే ఓ చిన్ని కుర్రాడు తప్పటడుగులు వేస్తున్నాడు. ఆమెను చూడ్డంతో "అమ్మేవ్—అమ్మేవ్—ముసలమ్మొచ్చిందే" అంటూ అరిచాడు.

ఇంతలో కూతురు గబాలునవచ్చి తల్లిని తీసుకు వెళ్లింది. "అమ్మా!—యింత నీరసంగా ఉన్నావే? ఎంత శ్రమపడ్డావు! ఇక యిచ్చటనే ఉండి పోయి విశ్రాంతి తీసుకోమ్మా"అన్న కూతురు మాటలు తల్లినేత్రాల్లో జీవం పొదిగాయి.

ఆ రాత్రి కూతురు పరుపు మంచంపై పరుండమంది అమ్మని. ఆమెకిదే మొదటిసారి పరుపుపై పండుకోవడం.

తన కొడుకు యింటికాడైతే బయట వరండాపైనే మేలు వాల్చేది. వర్షాకాలం మాత్రం యింటిలో నట్టింటనే పరుండేది. ఇక అందరూ నిద్రపోయే వరకూ పనులే చేస్తూ అంతిమంగా తనే తలుపులుమూసి నిద్రపోవడం జరిగేది.

ఇక్కడల్లా కాకుండా, తాను చేయవలసిన పనేలేదు. అంచేత అర్ధరాత్రివరకూ ఉండే అవుసరంలేదు. భోజనాలు—వెంటనే పడక—యీ జీవితం అమ్మకు చాల వింతగా క్రొత్తగా అనుభవాని కొస్తోంది.

మర్నాడు ఐదవ్వగానే లేచింది అలవాటుప్రకారం. ఎవరూ చెప్పందే—కిచ్చెన్ లోకి పోయి—కూరగాయలు తరగడం ఆపనీ యీపనీ సాయం చేసింది నౌకరు పిల్లకి. మళ్ళీ ఆపై రెండుగంటలూ యేం చేయాలో తెలీలేదు అమ్మకు. నిజంగా ఆమె చేయాల్సిన పనిలేదు—చేయనీరు కూడ. ఆమె చేసే దల్లా తినడం తాగడం పిల్లల్ని కని పెట్టడం, కూతురితోను, అక్కడికి వస్తూపోయే వాళ్ళతోను పిచ్చాపాటీ చెప్పు కోవడము తప్పితే మరేమీ లేదు. వాళ్ళంతా తన కూతురుతో యేవేవో మాట్లాడే వారు. అవేమీ అమ్మకి అర్ధమయ్యేవి కావు. "మీ అమ్మకు క్లబ్బనగా, సినిమాలనగా, రేషనింగనగా యేమీ తెలీవులాగుంది "అనే వారు అమ్మ వింటుండగానే, చిన్న పిల్లలు కూడ. పట్టణం సంగతులు చెప్పుకుంటుంటే అమ్మ విస్తుపోతూ పరభాషిలా వింటుండేది. వాళ్ళను కని పెట్టడం వాళ్ళ మాటలు వింటూడంలో అమ్మకు దినాలు గడుస్తున్నాయి.

దాదాపు పదిరోజులయింది అమ్మ పట్టణంవచ్చి. అల్లుడు కూతురు ఆమెను అన్నివిధాల ఆదరిస్తున్నారు. ఓ నాడు కారు యెక్కించి పట్టణంఅంతా త్రిప్పి చూపించారు. మనుష్యులు యెక్కడంతోటే తుర్రుమని పోతున్న కారును చూచి అమ్మ చాల ఆశ్చర్యపడింది.

మంచి మంచి చూడదగ్గ స్థలాలు, పెద్దపెద్ద షాపులూ, భవంతులూ, చూపించారు. ఓ రోజు సినిమాకు లాక్కెళ్లారు. అమ్మకివన్నీ క్రొత్తగా ఉండడంచాత సిగ్గుగా ప్రవర్తించేది.

ఆమె జీవితం యిలా పరివర్తనమౌతుందని యెప్పుడూ తలంచలేదు. ఆమె జీవితం యింత వైభవంగా గడుస్తున్నా యేదో వెలితిగా ఉన్నట్టున్నది. అంత ఆనందం లేదు. కొడుకుని మనుమల్ని విడిచిపెట్టి అమ్మ యింతకాలమెప్పుడు ఉండలేదు.

పట్టణం జీవితం ఆమెకంతగా రుచించలేదు. వాళ్లపై చెడ్డ అభిప్రాయం కలిగింది. వాళ్ల జీవితాలు చాల చెడ్డవని అనుకుంది. వాళ్ళు భగవంతుని కూడ ధ్యానించరు. చివరకు

తినేసెయ్యం దాని పుట్టు పూర్వోత్తరాలు కూడ వాళ్ళకు తెలీవు. వరిమొక్కల గురించి వాళ్ళ కసలు తెలీదు.

ఇక్కడామెకు పనీపాటాలేదు. మందమతిగా కూర్చుండడమే పని. ఇది ఆమెకు మరీ విచారం కలుగ చేసింది. ఆమె పనికిబాగా అలవాటయి పోయింది. ఆమె విశ్రాంతికి వచ్చినా పనిచేయాలనిపిస్తున్నది.

ఆమెవల్ల దమ్మిడీ కలిసిరాకపోయినా వాళ్లు భోజనం పెడుతున్నారు. పనేమీ చేయకుండా ఉచితంగా భోజనం తినేసి ఉండడం అమ్మకేమంత మనస్కరించ లేదు. ఆమె బుర్రలో అనేక తర్క వితర్కాలు చెలరేగుతున్నాయి. "ఉచితముగా తినేయడానికి నాకేం హక్కుంది—ఇతరుల కవుసరములేని మనిషికి విలువెక్కడ ఉంటుంది,—నా బ్రతుకు యితరులకు శ్రమే తప్ప ఉపయోగం లేదు." ఇలా ఆమె యెన్నెనో అనుకుంది. ప్రతి దినమూ యిలాగే ఆలోచిస్తూ దినాలు గడుపుతోంది అమ్మ.

ఇంటికి వెళ్లివస్తానని యెప్పుడయినా అంటే కూతురూ అల్లుడూ బ్రతిమాలేవారు యింకాఉండమని. అమ్మ వాళ్ళను కాదనకలేక పోయేది. ఒకరోజు మధ్యాహ్నంమే—యథాప్రకారంగా పిల్లలిని కనిపెడుతూ వరాండాపై కూర్చుని ఆలోచిస్తున్నది. తన ప్రక్కనే కూర్చున్న కూతురు బజారు ఖర్చుల విషయములో నౌకరు పిల్లను చీవాట్లు పెడుతోంది మాటల్లో—అవకాశం చిక్కితే చాలు తినే సేయాలని చూస్తుంటారు అంది. ఈ మాట అమ్మకదోలా అయింది. హృదయం చలించింది. పూర్వం తాను పెత్తనం సాగించిన సంసార దినాలు జ్ఞాపకానికొస్తున్నాయి.

ఇదే సమయంలో ఆడుకొంటున్న పిల్లాడు చటుక్కున బోరలాపడ్డాడు. కూతురు అమ్మోయ్ అంటూ పిల్లాడిని లేవనెత్తింది. పిల్లాడి చేతిలోని సీసాపగిలి చేయి తెగి రక్తం కారుతోంది. వాడు గోలపెట్టేస్తున్నాడు. అమ్మ ప్రాణం నిలువునా నీరైపోయింది. పంచదార కట్టుకట్టడానికింట్లోకి వెళ్లింది. కూతురు ఖిడీన్కు పరుగెత్తింది కాస్సేపటిలో యిద్దరూ వచ్చారు.

అదేమిటే అమ్మా అంది కూతురు. "ఇదమ్మా!—పంచదార—కట్టు కట్టితే రక్తం ఆగిపోతుంది" అంది ఆప్యాయంతో.

"అబ్బ!—యిల్లాటప్పుడు వెకిలిగా పనిచేయ గూడదమ్మా—పంచదారెందుకు తగలేయను-యిల్లాంటివి నీకేమీ తెలీవు"—

ఆ మాటలు చాల అవమానకరంగా తోచినాయి అమ్మకు. కొంచెం సిగ్గుపడింది.

"ఇలాంటి విషయాలు నీకేమీ తెలీవులాగుంది. యిలా వెకిలిగా పనులుచేయగూడదు" ఈ మాటలే పదేపదే అమ్మ బుర్రను కదిలించివేస్తున్నాయి.

ఆమె యిలా అనుకొంది, "అరడజను పిల్లల్ని చిన్నప్పటి నుంచీ పోషిస్తూ, కాపాడుతూవచ్చిన నాకా తెలీకపోవడం. నన్నా అవమానించడం—అబ్బ నాకేం సుఖం లేదిచ్చట వెళ్లిపోవాలి". అని తన నిర్ణయంవాళ్ళకు నచ్చజెప్పి బయలుదేరింది.

* * *

బండిదిగి గేటుతీసి యింటిలో ప్రవేశించింది, అమ్మ సంతోషంగా. కాని అక్కడలాగు యే కుక్కా బొంయ్ మంటూరాలేదు. ఏ కుర్రాడు ముసలమ్మొచ్చిందే అంటూ కేక వెయ్యలేదు.

ఇల్లు చాల నిశ్శబ్దంగా ఉంది. ఒక్కమాటైనా వినబడడంలేదు. వాళ్లుకూడ పట్టణం వెళ్లారేమోననుకుంది. లోనకు వెళ్ళింది—తన చిన్ని మనమరాలు లలిత మాట వినబడింది. చప్పుడువిని—"ఎవరది?" అంది లలిత. ఆ గది చాల చీకటిబారి ఉంది. అవతలివేపునుంచి కొద్ది వెలుతురు వస్తున్నది—అక్కడ నులక మంచంపై కోడలు పరుంది. ఆమె పయి నీరసంగా ఒరిగిఉంది లలిత. అమ్మ రాగానే కోడలు తలపైకెత్తి చూసింది.

"ఓ అమ్మా!—వచ్చావా వచ్చావా!" అంటూ అంతులేని సంతోషంతో లేచివచ్చింది కోడలు. "అమ్మా! నీవు లేక పోవడం నిర్జీవంగా ఉంది యిల్లు.—మొదట లలి

...ను ఆపేక్షించుకుని చాల బాధపడి పోయింది. చూడు ఎలా చిక్కి పోయిందో. జీవన్‌కి కూడా జ్వరం. ఇదిగో యిప్పుడే వెళ్లారు నీళ్ళకి.”

ఇంతలో జీవన్, సరోజిని నీళ్ళు తెచ్చారు. జీవన్ అమ్మని చూడ్డంతో ఆత్రతగా వచ్చి వంటికెక్కాడు—“అమ్మా! వచ్చావా!—నీవు లేక పోవడంయేమి బాగుండలేదే!—నీవు పోయిన తరువాత మనవి రెండు బిందెలు పోయినాయి అజాగ్రత్తవల్ల. పాదులన్నీ చెడి పోయేయి. మరి ఆవు పాలు సరిగా యివ్వడము లేదు” ఇలా యింకా యింకా చెప్పేస్తున్నాడు.

అమ్మ—తానులేక పోవడంవల్లకదా యింత అనర్థము వచ్చిందని అనుకుంది. ఉండు నాన్నా—అబ్బ చాల పనుంది చేయాల్సింది. మాసిన గుడ్డలెలా ఉన్నాయో, యీ బూజులూ, దుమ్మూ—అంతా తుడవాలి, చేయాలి, పని చేయాలి—“ఊరికే కూర్చుంటేనే మందబుద్ధి” అని అమ్మ మళ్ళీ సంసారాన్ని దిద్దింది.

## నవ భారతి అవతరణ

శ్రీమతి డి. యస్. రాజేశ్వరీ పట్నాయక్

(లెండీ మన గాంధిని గొల్వండి అను వరుసలో పాడవలెను)

లెండీ మన ప్రకృతిని జాటండీ వేగలెండి
జండా లెత్తిండీ ‘జాయ్‌హింద’ని నిల్వండి ॥లెం
కాలాబెట్టు మారెను గమనించు కోండి
బాపూ ఆత్మజ్యోతి ఆదర్శ మండీ ॥లెం
మన బాపు వారసుడై మన జవహరండి
శాంతి స్థాపన జేయ సహకారించండి ॥లెం
స్థిరచిత్తుడు మహామనుడు మనపటేలండి
ఉద్దండుడు మేధావి మనకండేయండి ॥లెం
రణశంఖము పూరించెను మన సుభాషండి
జైహిందని గర్వింప మందడు గేయండి ॥లెం।
ప్రజాభీష్ట పాలనమె మన ప్రభుత్వమండి
నవ భారతి అవతరణ సుభదివసమిదండీ ॥లెం।






# యుక్తి

అనగనగా ఒక యూరిలో రాము అనే పిల్లవాడుండేవాడు. వాళ్ళ తండ్రి ఊరికంతటికి పెద్ద. పాడి పంటలలోను ధనమునందు అందరికంటె ఎక్కువైన వాడు. అనగా పది, పన్నెండేండ్ల వాడు కాని ధైర్యసాహసములలో పెద్దవానిలాంటి వాడు. ఒకనాడు తండ్రి విచారిస్తూ యింట్లో గోడకి జారబడి పెకులు లెక్కపెడుతున్నాడు. అది చూసి రాము 'నాన్నా ఎందుకలాగ యేడుస్తావు? మనకేమి అపాయం కలుగ లేదు కాదా' అని ముద్దుగా ప్రశ్నించేడు. ఏమని చెప్తాడు? తండ్రి ఏ రీతిగా కొడుకునకు తెలియపరచటమో తెలియక "నాయనా వారం రోజులు క్రిందట మన రెండు మేకలూ మాయమయ్యాయి కదూ"

"అయితే"

"అది కాదు నాయనా, మళ్ళా యీ వేళ మన నల్ల ఆవుని ఆ దురాత్ముడు—హంతకుడు రా-క్ష-సు-డు...."

"నాన్నా ఏమిటి! సరిగా చెప్పు నాన్నా"

ఇంకేముంది వాళ్ళ ఊరి పొలి మేరలో నున్న గుహలోని రాక్షసుని మహిమను తెలియజేసాడు రాముతండ్రి. వెంటనే రాము ఒక గండ్రగొడ్డలి, గునపము పట్టుకొని మట్ట మధ్యాహ్నపువేళ ఒంటరిగా రహస్యంగా గుహదగ్గఱకు వెళ్ళాడు. కన్నంలోనుంచి తొంగిచూసేడు. తాటిచెట్టులాగు పడి దొర్లుతున్న భయంకర స్వరూపాన్ని చూచేడు. రాక్షసుడు నిద్రించుచున్నవాడని తెలిసికొన్నాడు. ఆ గుహ గుమ్మముదగ్గర గునపముతో ఒక పెద్ద గొయ్యి త్రవ్వేడు. గుమ్మాని కనతలగట్టున నిల్చి బూరా ఊదేడు. రాక్షసుడా కేకవిని "ఎవడురా నాకు నిద్రాభంగము కలిగించేదని బయటకు వచ్చేడు. ఈలోపునే రాము ఆ గొయ్యిని ఆకులతోను కొమ్మలతోను పైపైన కప్పి ఉంచాడు.

దానిని తెలిసికొనలేక రాక్షసుడు లంఘించి గోతిలో పడ్డాడు. పడే పడటంలో రాము తన గండ్ర గొడ్డలిని రాక్షసుని పీకపైకి విసిరాడు. రాము గురి తప్పుతుందా! రాక్షసుని ప్రాణమును సగం తీసింది. వెంటనే ఊరిలోకి పరుగెత్తి తాను చేసినపని అందఱికి చెప్పేడు. అంతావచ్చి చావడానికి సిద్ధమైయున్న రాక్షసుని కఱ్ఱలతో మోది, బాలుడైన రాము సాహసానికి యుక్తికి మెచ్చుకొన్నారు.

—ఇందుకూరి.

# ఐహిక, ఆముష్మిక బహుమతి

* జాన్ క్రిష్టియను *

[సత్యము పలుకువారు, వినయము, కనికరముగలవారు, నూటికి 5 గురు తక్కువ లేరని చెప్పవచ్చును. అట్టివారికి దేశభక్తియుండదా? దేశభక్తిగల సైనికులే సైనికులు. మనమంతా మనదేశ సైనికులము కదా!]

అవి ఛత్రపతి శివాజీ పరిపాలనా దినములు. వేనకు వేలు యువకులతని సైన్యములో చేరుటకు ప్రతిదినము వచ్చుచుండెడివారు.

ఒకసారి యిరువదిమంది మహారాష్ట్రి యువకు లొక చిన్న గ్రామము నుండి శివాజీ సైన్యములో చేరుటకై బయలు దేరారు. చలువ వస్త్రములను తొడుగుకున్నారు. తళతళ మెఱయుచున్న యాయుధములను ధరించారు. వెళ్తూ వెళ్తూ వారొక పర్వతము క్రిందకు చేరుకున్నారు. ఆ పర్వతము నుండి చిన్న యేరు ప్రవహించుచున్నది. వర్షాకాలము పోయినప్పటికి దాని లోని నీరుపొంగి పొర్లుతోంది.

ఏరుయొక్క దరిచేరుటకి దాని నెట్లా దాట డమాయన్న ప్రశ్న యువకులలో బయలు దేరినది. దానిలో దిగి యీదుకొని వెళ్ళేటట్లయితే బట్టలు తడిచి పాడగును. కాబట్టి వారు తమ బల్లెముల సహాయమున యీ యొడ్డునుండి ఆ యొడ్డునకు దుముకుటకు నిశ్చయించారు.

సిపాయిలనగా దేశమున కొక విధమగు సేవ చేయవలెను. అట్టి సేవకు మీరు సమర్థులా! అసమర్థులా! యను పరీక్ష దేవుడే చేసినట్టు, ఆ సమయములో ఒక బీద ముసలమ్మ వారికడకు వచ్చినది. అంతుచే ఆమె వారిని "వత్సలారా! మీకు శుభమగు గాక!" అని దీవించి "నేను వృద్ధురాలను. ఈ యేటిని దాట జాలను. ఏదో యొక విధముగా నన్ను కూడా యేరు దాటించండి" అని బ్రతిమాలింది.

"మనము యేటిలో దిగ నిశ్చయించ లేదే. ఈమె మనకు పిశాచివలె అడ్డను వచ్చింది. ప్రస్తుతము మన కర్తవ్య మేమిటి?" అన్నట్టు వారొకరి ముఖ మొకరు చూచుకొని యేటిని దాటివేసారు. తుదకొక్క యువకుడు మాత్రమే మిగిలి యున్నాడు. ముసలమ్మ నిశ్శబ్దంగా అది యావత్తు చూస్తూ నిలచుండి పోయినది. అప్పుడా యువకు డామెతో యిలా-అన్నాడు. "మాతా భయపడవద్దు. నా వీపుపై కూర్చొన బెట్టుకొని నిన్నావలి యొడ్డుకు చేర్చెదను". ఆనందాశ్చర్యము లొక్క సారిగా కలిగిన హృదయము గలదై వృద్ధురాలు అతనిని ఆశీర్వదిస్తూ వీపుపై కూర్చొనగా నతడామె నావలి యొడ్డునకు సురక్షితముగా చేర్చెను. బట్టలన్నీ తడిసిపోయినవి. వాటి నెండలో నారవేసాడు. ఎండిపోయిన వెంటనే వాటిని మరల ధరించి తన యాలస్యమును గూర్చి యోచించక యుత్సాహముతో శివాజీ కోట వైపునకు సాగిపోయెను.

శివాజీ మహారాజు శివనేరనే కోటలో నొక మైదానముమీద తన సర్దారులతో కూడ నిల

బడియుండెను. దూరదూరము నుండి అనేకులు తన సైన్యము (ఫౌజు)లో చేరడానికి వస్తున్నారు. వారితో మాట్లాడియూ ఒక్కొక్కప్పుడు గుఱ్ఱము మీద స్వారీ చేయించుచు, పరీక్ష చేయుచు, వారిని తనసైన్యములో చేర్చుకొనుచుండెను. ఇంతలో మరి మావళి గుంపు చేరెను. శివాజీ వారితో "మీతోడి యువకుడేడి" అని ప్రశ్నించెను. వారతడు ఖదిరి అనే గ్రామములో ఏదో పనిమీద ఆగిపోయెనని అందుచేత వచ్చుటకు కొంత ఆలస్యమగునని బదులు చెప్పిరి.

శివాజీ: "సరే! మంచిది. అతడు వచ్చిన పిమ్మట మీ పరీక్షజరుగును".

కొంతసేపటికా మావళీ యువకుడువచ్చెను

శివాజీ: (అతనితో) "మారోజీ! నీవే ల జాలము జేసితివి. ఖదరీ గ్రామములో నీకేమైన పనియున్నదా?"

మారోజీ: "మహారాజ్! ఏమిపనీలేదు. కాని కొద్దిగా ఆలస్యమైంది".

శివాజీ: "నీ బట్టలు తడిసినట్లున్నవే? నీవా యేటిని దాటలేక యీదుకొని వచ్చితివా"?

మారోజీ: (తల క్రిందకు వంచి) "చిత్తము. నేను యేటిలో దిగి వచ్చితిని".

సైన్యమున చేరుటకు ధీరులు, వీరులు కావలెనని తెలిసియు ఒక చిన్న యేటిని దాటలేని యీ తుచ్ఛుడా నా సైన్యములో ప్రవేశించుట అన్నట్టు శివాజీ అతని వైపు తీక్షణముగా చూచాడు. మారోజి మాత్రము అట్లే నిలువబడియున్నాడు. అంతకు మించి తనేమియు చెప్పలేదు. శివాజీ కొంత వఱకు ఆగి, "మారోజీ, ఏం, నిజము చెప్పవు. ఎందుకింత తడవైనది?" అని బిగ్గరగా పలికెను.

మారోజీ: "యే కారణము లేదు మహారాజా"!

ఘన కార్యము చేయగల ఘనుడెన్నడును తన ఘనతను ప్రకటించడు కాని తన కార్యములే తన ఘనతను వ్యాపింపజేయును.

ఇంతలో మావళీ యువకుడు శివాజీ ముందుకువచ్చి ముసలమ్మ సంగతియంతయు చెప్పెను. అదివిని శివాజీ ముందుకు వచ్చి తన ఖడ్గమును మారోజీకి యిస్తూ యిలా అన్నాడు.

"నాకు యిటువంటివారు కావాలి. ఎవరయితే తమ గర్వము విడిచి పెట్టి బీదలకు సహాయము చేసెదరో ఎవరు అట్టిపనికై అన్ని సమయములయందు సిద్ధపడి యుంటారో వారే నిజమైన దేశభక్తులు." అట్లు చెప్పి శివాజీ మారోజీ నడుమునకు కత్తి కడుతూ "నిన్ను వేయి సైనికులున్న సైన్యానికి అధిపతిగా చేశాను. ఖదరీ గ్రామమును నీకు జాగీరుగా యిచ్చుచున్నాను". అని చెప్పెను.

బీదవారికి గొప్పవారును, తిండిలేనివారికి కలిగినవారును, బలహీనులకు బలమైన వారును వారివారి శక్తికొలది సహాయము చేయుటయే కదా మానవ కర్తవ్యము. అట్టి వారికి ఫలము లేకుండాపోదు. మన మారోజి బలహీనురాలయిన ముసలమ్మకు సహాయము చేయుట చేతనే కదా! శాశ్వతముగ నుండెడి బహుమతిపొందెను.

## ఐహిక, ఆముష్మిక బహుమతి

అట్టివారి కీలోకమునే కాక పరలోకమందు కూడ బహుమతి యుండును కదా! అతని కంతటి మహా భాగ్యము కలిగినది. అట్టి కనికర హృదయులు వినయ మనస్కులుండిన భగవంతుడెంత సంతోషించును పరులకు సేవ జేయుటయే తన కర్తవ్యముగా నెంచెడి సిపాయికి తగిన సత్కారము చేసినందుకు అందరూ ఏక కంఠముతో "శివాజీ మహారాజుకు జై!" అని కేకలు వేసిరి

కనికర హృదయులకు, యదార్థ వర్తనులకు లోకములో తావు లేదు. కాని మన శివాజీ మహారాజవంటి ఆదరణ కర్తలున్నచో అట్టివారి సంఖ్య వృద్ధికాగలదు. అట్టి వారిని దేవుడు దీవించుగాక!

జైహింద్ (హిందీ ఆధారము)

## నవ్వు పువ్వు

(డాబామీద భార్య అంచునకు జారబడి ఉంది)

భర్త—ఏమే యిక్కడున్నావు.

భార్య—నేను ఒకనికోసం వేచియున్నాను.

భర్త—అదేం; ఎవరి కోసమేవ్ ?

భార్య (నవ్వుతూ)—ఏమీ లేదండి; ఒకని భార్యను యింకొకడు దొంగిలించేడండీ వెంటనే ఆమెను వెతకడం కోసం వెళ్ళినవాని తండ్రికోసం వేచియున్నాను.

భర్త—అదేమిటే శోధన ?

భార్య—ఇటు వినండి. రాముని భార్యను రావణుడు ఎత్తుకొని పోయేడండి సీతను వెదుకడం కోసం ఆంజనేయుడు వెళ్ళేడు. హనుమంతుని తండ్రియైన వాయువు కోసం కూచున్నాను.



काम - పని.
पानी - నీరు
चिट्ठी - ఉత్తరము.
चाय - తేనీరు.
बाज़ार - బజారు.
पाठ, सबक - పాఠము.
भात - అన్నము
तमाशा - తమాషా, వేడుక.
खाना - భోజనము
घर - ఇల్లు
बजे - గంటలు, (వేళ)
दिन, रोज़ - దినము.
यहाँ - ఇక్కడ.
वहाँ - అక్కడ.

कितने ఎన్ని ?
झूठ - అసత్యము.
सच - సత్యము, నిజము.
क्या - ఏమి ?
कौन - ఎవరు, ఎవరు. ఏది.
कहाँ - ఎక్కడ.
क्यों - ఎందుకు.
अब ఇప్పుడు.
हमेशा - ఎల్లప్పుడు
आज - నేడు
कल - నిన్న, రేపు
परसों - మొన్న, ఎల్లుండి.
कभी कभी - అప్పుడప్పుడు.
कैसे - ఎట్లు

अभी - ఇప్పుడే
हाँ - అవును. సరే.
नहीं - లేదు, కాదు.
ज़मीन - నేల.
चटाई - చాప.
देख - చూడు.
लिख - వ్రాయు.
जा - వెళ్లు.
रह - ఉండు, నివసించు.
पका - వండు
बोल - చెప్పు, మాటలాడు.
हँस - నవ్వు
कर - చేయి.
आ - వచ్చు.

1. हम तमाशा देखते हैं। మేము వేడుక (వింత) చూచుచున్నాము.
2. तू चिट्ठी लिखती है। నీవు వుత్తరము వ్రాయుచున్నావు. (స్త్రీ)
3. क्या, आप घर जाते हैं? తమరు యింటికి వెళ్లుచున్నారా ?
4. क्या, वह रोज़ नौ बजे पाठशाला जाता है? అతడు రోజు తొమ్మిది గంటలకు బడికి వెళ్లునా ?
5. मैं सात दिन से यहाँ रहता हूँ। నేను ఏడురోజులునుండి యిచ్చట వుంటున్నాను.
6. तुम कितने दिन से वहाँ रहते हो? మీరు అచ్చట యెన్ని రోజులనుండి వుంటున్నారు?
7. माँ खाना पकाती है। అమ్మ వండుచున్నది.
8. तुम झूठ मत बोलो। మీరు అబద్ధము చెప్పవద్దు.
9. (तुम) हमेशा सच बोलो। ఎల్లప్పుడు నిజము పలుకుడు.
10. आप क्यों हँसती हैं? తమరు ఎందుకు నవ్వుచున్నారు ?
11. तुम यह काम कैसे करते हो ? మీరు ఈ పని యెట్లు చేయుచున్నారు ?
12. क्या वह अभी बाज़ार जाता है? అతడు యిప్పుడే బజారు వెళ్లునా ?

13. हाँ, वह अभी बाजार जाता है। ఔను, అతడు యిప్పుడే బజారుకు వెళ్లుచున్నాడు.
14. शारदा कभी कभी यहाँ आती है। శారద అప్పుడప్పుడు యిచ్చటికి వచ్చును.
15 वे कौन हैं? వారెవరు?
16. वह घर नहीं जाता। అతడు యింటికి వెళ్లడు.

సూచన:—(1) ప్రశ్నించునపుడు హిందీలో వాక్యమునకుముందు 'क्या' చేర్చుదురు. కాని, సామాన్యముగా సంభాషణయందు क्या వదలి వేసి కడపటి అక్షరమును పొడిగించి, ఒత్తి పలుకుదురు.

(2) వ్యతిరేకార్థక వాక్యములలో సహాయక క్రియలు (हूँ, है, हैं, हो) లోపించును.

## తాత్కాలిక వర్తమాన కాలము

ధాతువునకు కర్తయొక్క లింగ వచనములననుసరించి "रहा" చేర్చినపిదప సరియైన సహాయక క్రియ చేర్చినచో తాత్కాలిక వర్తమాన కాల మేర్పడును.

ఉదా:—मैं आ रहा हूँ నేను వచ్చుచూ వున్నాను. (పుం॥)
मैं आ रही हूँ నేను వచ్చుచూ వున్నాను (స్త్రీ)
हम आ रहे हैं మేము వచ్చుచూ వున్నాము (పుం॥)
हम आ रही हैं మేము వచ్చుచూ వున్నాము (స్త్రీ)
तू आ रहा है నీవు వచ్చుచూ వున్నావు (పుం॥)
तू आ रही है నీవు వచ్చుచూ వున్నావు (స్త్రీ)
तुम आ रहे हो మీరు వచ్చుచూ వున్నారు (పుం॥)
तुम आ रही हो మీరు వచ్చుచూ వున్నారు (స్త్రీ)
आप आ रहे हैं తమరు వచ్చుచూ వున్నారు (పుం॥)
आप आ रही हैं తమరు వచ్చుచూ వున్నారు (స్త్రీ)
वह आ रहा है అతడు వచ్చుచూ వున్నాడు (పుం॥)
वह आ रही है ఆమె వచ్చుచూ వున్నది (స్త్రీ)
वे आ रहे हैं వారు వచ్చుచూ వున్నారు (పుం॥)
वे आ रही हैं వారు వచ్చుచూ వున్నారు (స్త్రీ)
यह आ रहा है ఇతడు వచ్చుచూ వున్నాడు (పుం॥)

**यह आ रही है** ఈమె వచ్చుచూ వున్నది (స్త్రీ)
**ये आ रहे हैं** వీరు వచ్చుచూ వున్నారు (పుం॥)
**ये आ रही हैं** వీరు వచ్చుచూ వున్నారు (స్త్రీ)

## పాఠము 6.

### లింగము

(1) పుంలింగ స్త్రీలింగములు తెలుగులో వలెనే హిందీలో గూడ పురుష స్త్రీ జాతుల ననుసరించి యుండును.

హిందీలో నపుంసక లింగము లేదు.

తెలుగులోని అప్రాణివాచకములైన నపుంసక లింగములు హిందీలో కొన్ని పుంలింగములుగను, మరికొన్ని స్త్రీ లింగములుగను పరిగణింప బడును. లింగ భేదమును తెలుసుకొనుటకు నియమములు హిందీలో యెక్కువగా లేవు. అభ్యాసము వల్లనే శబ్దముల లింగములను ఎరుగవలెను. అయినను ఈ క్రింది నియమములు కొంత వరకు అట్టి విభజనకు తోడ్పడ గలవు.

హలంతములును, ఆకారాంతములును అగు అప్రాణివాచక హిందీ శబ్దములు సాధారణముగ పుంలింగములుగ పరిగణింప బడుచున్నవి.

ఉదా :—**फल** పండు. **कमरा** గది.

సూచన :—ఈ పైనియమమెల్ల చోట్లనుపయోగపడదు. కావున ఒక శబ్దము యొక్క లింగము నిర్ణయించవలసినపుడు దానితో వచ్చు విశేషణమును బట్టిగాని, వాక్యమునందలి క్రియను బట్టిగాని నిర్ణయించుకోవలెను.

'**इ**' కార '**ई**' కారాంతములగు నప్రాణి వాచక శబ్దములు సాధారణముగా స్త్రీ లింగములగును.

ఉదా :—**तिथि** తిథి ; **नदी** నది.

కాని, **पानी** (నీరు), **दही** (పెరుగు), **घी** (నెయ్యి), **मोती** (ముత్తెము), **जी** (హృదయము), అను శబ్దములు మాత్రము ఈ నియమము ననుసరించి స్త్రీ లింగములు కావలసియున్నను, పుంలింగములుగా వాడబడుచున్నవి.

(11వ పేజీ తరువాయి)

## హిందూ స్త్రీల హక్కు బాధ్యతల పునరుద్ధరణ

పాశ్చాత్య దేశములలోను వర్తించు నట్టి అభివృద్ధికర మార్గము కాకూడదని కోరుచున్నారు.

ఈ అభివృద్ధి కరమైన మార్పు లన్నిటిని చేయుచు హిందూ లాను క్రోడీకరించి ఒక చట్టముగా చేయుటకు హిందూకోడ్ బిల్లును ఇండియా పార్లమెంటులో ప్రవేశ పెట్టినారు. ప్రజాభిప్రాయమును రావుకమిటీ ద్వారా వివరించియే ఆ బిల్లును ప్రవేశపెట్టినారు. దానిని పూర్వాచార పరాయణులే గాక కొందరు కాంగ్రెసు ప్రముఖులు కూడ ప్రతి ఘటించుట మిక్కిలి శోచనీయము. మనమిప్పుడు స్వాతంత్ర్యము పొందినాము. లౌకిక విధానము అవలంబించి నాము. ప్రతి పురుషునికిని స్త్రీకిని సమ హక్కు లిచ్చెడి సమాన రాజకీయ హక్కు బాధ్యత లిచ్చెడివి గనుక, ఆస్తిహక్కుల విషయములలోను సాంఘికముగాను స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి కలుగచేయు చట్టములను నిషేధించుట అక్రమము. కొంచెము కాలయాపన మగునే గాని హిందూ కోడ్ చట్టము గాక మానదు. ఆస్తి హక్కుల తోపాటు ఆస్తిని చక్కగా నిర్వహించు బాధ్యతకూడ స్త్రీలకివ్వబడును. గృహస్థాశ్రమ ధర్మములను నిర్వర్తించుటలోను విజ్ఞాన వికాసములను పొందుచుందురు. మన స్త్రీలు ఇంగ్లాండు అమెరికా రష్యా స్త్రీలను అనుకరింప నక్కరలేదు. భారతములోని గొప్ప స్త్రీలను అనుసరించుటయే శ్రేయోదాయకము. మనము కోరే అభివృద్ధికర మార్పులన్నియూ పూర్వకాలమున నున్నవే.



సీరియల్ నాటిక

# భక్తలీల

శ్రీ లాకె శ్రీనివాసరావు

రంగము ౬.

[ప్రదేశము : మార్గ మధ్యము ; వటవృక్ష పునీకలో.

ప్రవేశము : ఆచార్యుడు.]

ఆచార్యుడు : ఆచార్యుల వారన్న శ్రీపురంలో ప్రజలు ఎంత భయభక్తులతో నుంటారు. రెడ్డిగార్కి సైతం హడలు. కాని, మాయావిడ దగ్గరమాత్రం నాకు హడలు. రెండో వివాహం చేసుకొన్న నాలాంటి ముసలిముండా వాళ్ల గతి యింతే. యౌవనపు భార్యలు ముసలి మగలను లక్ష్యపెడతారా! హెచ్చొ తగ్గొ చూస్తారా! మా యావిడ నాచే సంతలో సామగ్రిని కొనిపించి చాకలి మూటలుమోయు గాడిదవలె యీ మూటలు మోయి స్తున్నది. అలా చెయకపోతే యీ కాస్తబుట్టూ పీకి పెడుతుంది. ఎముకలు విరిచిపోగడ్తుంది. ఏం చేయను.—అబ్బా! ఈ మూటలు భారంవల్ల మూపు వాచి బొబ్బలెక్కినవి. ఈ చెట్టు నీడలో కొంచెం కొంచెం ఆయాసము తీర్చుకొని పోతాను. (చెట్టు నీడను కూర్చొని) ముసలిముండా ప్రాణం గనక చిరు తిండ్లపై మనస్సు పరుగెట్టుంది. ఈ చిరుతిళ్లు సంతలో కొన్నా! కొంచెం తిని ఆకలి తీర్చుకుంటా! (భుజిస్తూ అచ్చటికి వచ్చుచున్న నారదుని చూచి) వీడి తస్సా గొయ్యా! ఎవడురా వీడు? నారదునిలా వేషం గీషం వేసుకొని యీ కాస్తా తినేటానికి యిటు వస్తూన్నాడు. త్వరగా తినేయాలి (తొందర తొందరగా తినుచుండ నారదుడు ప్రవేశించును).

నారద : భక్తుడా! నాకవసరము లేదులే! త్వరపడుచున్నా వెందులకు?

ఆచా : దయచేయండి స్వామీ! చూడగా మీరు నారదుడులా కనిపిస్తున్నారు. పరమభాగవతుల్లా నున్నారు.

నార : నాకంతటి ముఖస్తుతిజేయ నవసరములేదు.

ఆచా : స్వామీ! మీవంటి సిద్ధపురుషులకు తెలియని దేముండును?—దయ తలంచి స్వర్గసుఖం పొందటానికి ఏదేని మార్గముపదేశించాలి.

నార : అట్లయిన, ఒక వ్రత ముపదేశించెదను. దాని నాచరించువారు తరింతురు.

మధుసూదనుడు : (ప్రవేసించి) మహాత్ములారా! నమస్కారములు.

నార : శుభమస్తు.

ఆచా : పుత్రపౌత్రాభివృద్ధిరస్తు.—మధుసూదనుడా?—

మధు : ఔను, శ్రీ పురాచార్యులుగారూ!—ఈ మార్గమున నొక యావుపోవుట గాంచితిరా?

ఆచా : లేదు మధుసూదనా!

మధు : ఇచ్చటకు సంత ఎంతదూర ముండగలదు?

ఆచా : ఇదిగో! ఈ సమీపాన్నే ఉంది.

మధు : స్వాములు సెలవొసంగుడు. నా యావు పలాయనమైనది. సంతత వెదకుటకు పోయెదను.

నార : ఓహో! సంతకరుగుచుంటివా? నాకొక చిన్న మేలు జేసితివేని నీయావు లభించుటకు తగిన మార్గముం జెప్పెదను.

మధు : ఆర్యా! చెప్పుడు శిరసా వహించెదను.

నార : ఒకకాసీ కక్కులాకులు, ఒకకాసీ సాంబ్రాణీ, ఒక కాసీ నూనెను తెచ్చియిత్తువా?

మధు : స్వామీ! నాచేత నొకకాసైనలేదు. ఏలాగివి యెట్లు దెచ్చి యీయగలను?

ఆచా : ఇదిగో! ఈ మూడుకాసులు తీసుక వెళ్లు (మూడు కాసులిచ్చును).

మధు : స్వామీ! నాయావు జిక్కెడి మార్గమును దెలివియుంటిరి.

నార : సామగ్రిని గొనితెమ్ము. పిమ్మట కర్తవ్య మెరింగింగింతును.

మధు : చిత్తము. (నిష్క్రమించును)

ఆచా : స్వామీ! మీరు విష్ణు భక్తులా! శివభక్తులా?

నార : నేను బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రినాదుల భక్తుడను.

ఆచా : దేవుడొక్కడేగదా! ముగ్గురనెందుకు పూజిస్తూన్నారు?

నార : ఆచార్యా! మనము దేవుని అనేక నామములతోను, అనేక మూర్తులుగాను, అనేక విధంబులను పూజించుచున్నాము. ఏరూపంబున పూజించినను దేవుడు సంతోషమును జెందును.

ఆచా : అయితే యీ ముగ్గురిలో గొప్పవారెవరు?

నార : ఎవరికి వారే. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అను విచారణ పనికిరాదు.

ఆచా : నాకుమాత్రం ఓ సందేహం ఉంది. నేను విష్ణు మతస్థుడనైనప్పటికి శివునియందే అభిమానం ఉంది.

నార : "పొరుగింటి పుల్లకూర రుచి" యన్నట్లు కొందరు తమ తమ మతములందుగల సత్యాసత్యము తెలుగక అన్యమతము నపేక్షించుచుందురు.

ఆచా : అన్యంలోనే రుచుంది స్వామీ!

నార : (పరిహాసముగా) అన్యాయమందు రుచి గలుగునప్పుడుండవచ్చునేమో!

ఆచా : నేను మా మతస్థుల కండ్లు కప్పటానికే యీ నామాలూ గీమాలూ ధరిస్తూన్నది. కాని శివుడే గొప్పవాడు. ఎందేతా అంటే రాతి విగ్రహాలు మనుష్యులు చేయటం నేర్చుకొన్నాక విష్ణుమతం వచ్చింది. లేకుంటే బోడిరాళ్లే అన్ని దేవాలయాలలో నుండవలసిందే! శివుడు పురాతన దేవుడు. అందుకే లింగాకారాన్ని పూజిస్తారు. శంకరాచార్యుడు, మధ్వాచార్యుడు, రామానుజులూ మొదలైనవాళ్లు ఏవో మసిబూసి యిలా చేశారు. ఈ విష్ణువుని మీదికి తెచ్చారు.

నార : ఆచార్యా! మనము వాదప్రతివాదములతో దర్కించి కాలమును వ్యర్థముజేయక దేవుని భజించవలెను. దేవునికి భక్తియే ప్రధాన వస్తువు.

ఉ॥ కాలము వమ్ముసేయక, చి
కాకు మనంబున బాసి, వాదిన
శ్మేలని వీడి, సంతత మ
మేయ ప్రభాకరుడై వెలుంగు శ్రీ
లాలను డైన దేవు నెడ
లాలిత భక్తి లయింప జేసి, యే
లీల భజించినన్ సుఖ ను
లీలల మోక్షము చేయి జిక్కదే!

మధు : (ప్రవేశించి) స్వామీ! ఇదిగో మీరు కోరిన వస్తువుల దెచ్చియున్నాను. (సామగ్రిని నారదున కొసంగును)

నార : సూక్ష్మమున మోక్షమును బొందుటకును, మిక్కిలి పేదవారు నైతెము భగవంతు నర్చించి సకల సుఖములు పొందుటకును, ధనధాన్యాది భాగ్య భోగంబుల దుల దూగుటకును, మీకొక క్రొత్త వ్రతమును ఉపదేశించు

చున్నాడను. అదియే శ్రీ త్రినాథవ్రతము. దాని నాచరించి ముముక్షువులు గండు.

మధు : స్వామీ! ఈ వ్రతమే పర్వదినమున జేయవలెను?

నార : దేవుని భక్తితో గొలుచుటకు తిధి వార నక్షత్రములు గావలయునా? ప్రాణములు పోవుచున్న రోగికి ముహూర్తమును నిర్ణయించి యౌషధముల నొసంగుదురా?

ఆచా. అయితే యీ వ్రతాన్ని ఎప్పుడుబడితే అప్పుడే చేయవచ్చునా?

నార : ఔను, ఈ తత్‌క్షణమే జేయుదము.

ఆచా : కడుపునిండా భుజించియేనా? ఉపవాసం చేయొద్దా?

నార : అవసరములేదు. ఆకలి దప్పులతో మనస్సును నిశ్చలముగా నిలుపుట కష్టము. కావున ఉపవాసములతో బనిలేదు. శిశ్చలమైన మనస్సే యీ వ్రతమును జేయుటకు ప్రధానము.

ఆచా : నివేదనకు పదార్థము?

నార : ఏమియూ నవసరము లేదు. కలిగినవారు తమ యిచ్చానుసారముగా నర్పించవచ్చును. కానీ ప్రసాదము కొరకు తగవులాడరాదు. ఎవరికెంత లభించినదని జగడ మాడరాదు. ఎవరికెంత లభించిన నంతే భాగ్యమని తలంచవలెను.

ఆచా : సరే, ఈ వ్రతం చేయటానికి ఎంత పైక మవసరముంటుంది?

నార : ఈ వ్రతము జేయుటకు మూడుకానుల సామానులు మాత్రము చాలును.

సీ॥ నిర్మలమైనట్టి । నిశ్చల మానస
ధాములై త్రైనాథ । స్వాములకును
ఒక కాని సాంబ్రాణి । ఒక కాని నూనెను
వక్కలాకుల కొర । కొక్క కాని
సమకూర్చి తెచ్చిన । సామగ్రి సమముగా
మూడువంతులు వేసి । ముప్పురకును
యర్పించి భక్తితో । నర్చించు వారలు
మోక్షము వేగమే । పొందగలరు.

తే॥ గీ॥ తిథియు, వారము నక్షత్ర । విధియులేదు
ఉపవసింపగ బనిలేదు । యొద్దిలోన
నెవ్వరైనను సీవ్రతి । మెచ్చమైన
నాచరింపగ జెల్లునో । యార్యులార ।

మధు : గురుసత్తమా! ఇది వింత వ్రతముగా నున్నదే! త్రినాథులను బూజించుటకు మనస్సు వేగిరపడుచున్నది. వ్రతమును జేయింపుడు.

నార : అట్లయిన, బ్రహ్మ విష్ణు మహేశ్వరులను బ్రతిష్ఠింపుడు. వక్కలాకులను త్రిమూర్తులకు సమముగా బంచి పెట్టుడు. నూనెను మూడు ప్రమిదలందు బోసి ముమ్మూర్తులకు దీపముల నర్పించుడు. సాంబ్రాణి ధూపమును త్రినాథులకు సమముగా సమర్పించుడు.

(మధుసూదనుడును, ఆచార్యుడును నట్లు జేయుదురు)
ఇంక మీ మానసముల నిశ్చలముజేసి ధ్యానింపుడు.

(నారదుండొక్కొక చరణము బాడుచుండ పిమ్మట మధుసూదనాచార్యు లిరువురు బాడుచుందురు)

జాయ్! త్రైనాథులకును
జాయ్! త్రిలోక వందితులకు
జాయ్! త్రిలోక పాలురకు
నమో! నమో!! నమో!!!

(అందరు భజించుచుండ పూజామంటపమందు త్రిమూర్తుల చిహ్నములుగా రాతి విగ్రహములును, ఒక రత్నహారమును బుట్టును.)

నార : (ధ్యానానంతరమున)—ఆహా! ఆహా! వీక్షించితిరా! శ్రీ త్రినాథుల మహిమా విశేషంబున నీ వ్రత మంటపమందు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను శ్రీ త్రినాథుల రాతి విగ్రహము లుద్భవించినవి. ఎట్టి మహత్తు! ఆహా! చూచితిరా! ఒక రత్నహారంబున్నూ యిందు బుట్టినది. ఇట్టి వ్రతము జేసినవారికి రత్నరాసుల కేమి కొరత?

ఆచా : ఓహో! ఓహో! చాలా అద్భుతంగా నుందే!

మధు : ఆహా! ఏమి మహత్తు! అద్భుత సంఘటనము!




## వీరసేనుడు

ప్రపంచ విఖ్యాత కవి షేక్సుపియర్ వ్రాసిన 'ఒథెల్లో దిమూర్' అనే విషాదాంత నాటకానికి అనువాదం యీ వీరసేనుడు. అనువాదకులు విద్వాన్ శ్రీ చావలి లక్ష్మీనారాయణగారు బి.ఏ., బి.ఇడి., ప్రతులకు గ్రంథకర్త పేర పొన్నూరు (గుంటూరు జిల్లా)కు వ్రాసుకొన వచ్చును. ఖరీదు 1-4-0.

ఒథెల్లో కథ తెలియనివారుండరు. ఇటలీదేశపు మంత్రి కూతురు డెస్టిమోనా రూపసి. ఆమె పరాయి దేశపువాడు, పరాయి మతపువాడు, కారు నల్లనివాడు అయిన ఒథెల్లోను, అతని ధైర్యసాహసాలకు మెచ్చి పెళ్లిచేసుకుంటుంది. వారి పరస్పర ప్రేమానురాగాలకు హద్దు వుండదు. తనకు రావలసిన పైవుద్యోగం కేశియో అనే ఒథెల్లో స్నేహితుడికి రావటంతో ఇయాగో అనే రాజోద్యోగి కేశియోపైన పగపట్టి, అతనిని ఏవిధంగానైనా నాశనంచేయ ప్రతిజ్ఞ పడతాడు. ఈ ప్రయత్నంలో ఎవరు ఎంతమంది ఎట్లా నశించినా అతను లెక్కచేయకుండ స్వార్థపు పట్టుతో ఆరంభిస్తాడు. అందగాడు, మాటకారి అయిన కేశియోతో డెస్టిమోనాకు సంబంధము వున్నట్లు ఒథెల్లోకు సందేహం కల్పించి ఋజువులు తానే సృష్టించి చూపుతాడు. అంత అతిగా ప్రేమించటాన ఒథెల్లో యీదెబ్బకు తట్టుకోలేక, అసూయా ద్వేషాలకు గురిఅయి, భార్యగొంతు పిసికి చంపుతాడు. ఇంతలో ఇయాగో కుట్రయావత్తు తెలిసి తాను కూడ పొడుచుకు చచ్చిపోతాడు. ఈ పాశ్చాత్య పాత్రలకు గ్రంథకర్త భారతీయ పేర్లనుపెట్టి కథ మన దేశములో జరిగినట్లుగా వ్రాశారు. ఒథెల్లో యే వీరసేనుడు. డెస్డిమోనా పద్మాదేవి.

ప్రథమాంకములో పద్మాదేవి వీరసేనుడితో వెళ్లిపోయిన సందర్భములో ఆమె తండ్రి వీరసేనుడితో "నా ముద్దుతల్లి తన జాతి ధనికులను సుందరులను తృణీకరించి రక్షకస్థానమున వుండే యీ నల్లని పరాయి పిశాచము దగ్గరకు వస్తుందా? యిందులో యేదో మోసము వున్నద"ని అంటాడు. మూడవ అంకములో మేధావి (ఇయాగో) కూడ వీరసేనునితో "ఆమెబుద్ధి వెనుకటికంటె తెలివిన పడి తన జాతి మూర్తులతో మిమ్ము పోల్చుకుని పశ్చాత్తాపపడునేమోనని భయముగా వున్నదం"టాడు. ఇటువంటి ప్రస్తాపనలవల్ల ధాన్య కటకపు మంత్రికూతురు పద్మ వలచిన వీరసేనుడు ఆ ప్రాంతపువాడుకాడని, నల్లనివాడని తేల్తున్నది. కాని పాండ్యుడని అతనిని అంటారు. అందువల్ల పాండ్య దేశపు వాడన్నమాట. కాని కథా సందర్భాన్నిబట్టి దక్షిణాపథములోనే వున్న ధాన్య కటకపు పడుచు పాండ్య దేశీయుడిని పెళ్లాడి అతడు నల్లనివాడయినంత మాత్రాన తన జాతే పోయినట్లు పశ్చాత్తాపపడవలసిన కారణం కనిపించదు. మూలములోని ఒథెల్లో చీకటి ఖండమని పేరుపడ్డ ఆఫ్రికా ఖండములోని మొరాకోనివాసి అయిన మూరు జాతివాడు. వాతావరణాదులవల్ల కారు నల్లని పెద్ద విగ్రహము కలవాడు. ఇస్లాము మతావలంబి. కాని డెస్డిమోనా ఇటలీ దేశపు స్త్రీ. మంచునుమించిన తెల్లని రంగుగల కుసుమ కోమలి. ఒక మంత్రికూతురు. క్రైస్తవి. మనసులు ఏకమవుటవల్ల వారిద్దరికి పెళ్లి అయింది కాని అంతరువు చాలా వున్నది. ఆ సంగతి ఒథెల్లో మరవలేదు. అందువల్లనే కు

యుక్తులకు పిలిపోకని ఇయాగో యీ కాపురాన్ని ఎత్తిపోసి డెస్డిమోనాకు కేశియోపై వలపు కల్పించి చెప్ప సాహసించటము, ఒథెల్లో కొంత అనుమానపడటం జరుగుతాయి. అందువల్ల స్త్రీపాత్రలను అనువాదకులు మూలములోలా మార్చి తప్పించితే యీలోటు వచ్చేది కాదు. ద్వితీయాంకములో మేధావి వీరసేనుడితో "మా దేశపు స్త్రీలు తమ దుండగములను భగవంతునకు చూపుటకైనను ఒప్పుకొందురుగాని భర్తలకు కలలోనైనా పొడకట్టనీయరు. వారి నైతికాదర్శము చేయకుండ విడుచుటకు కాదు; తెలియకుండ దాచుట" అంటాడు. ఇది ఇటలీకి సరిపోతే పోవచ్చునుకాని కటకానికి ఎట్లా సరిపెట్టటం? మన దేశంలో కటకపు ప్రాంతపువారు తప్పుకునువారని, పాండ్యులు మంచివారని చెప్పగల అవకాశాలు మనకు లేవు. అందువల్ల భారతీయ పేర్లనిచ్చి అసహజ వాతావరణం కల్పించటానికంటె ఆ పాశ్చాత్య వాతావరణం అట్లాగే వుంచగలిగితే బాగుండేది.

రెండో అంకములో తాగుడు దృశ్యములో మేధావి "నీ ఆంగ్లేయుడు, నీ బోడి ఫ్రెంచియుడు తాగుడులో భారతీయునకు వీసమునకు కొరగారు. నీ ఫ్రెంచియునికి చావు తెచ్చిపెట్టి, నీ యాంగ్లేయునికి ముచ్చెమటలు కమ్మించునంత త్వరలో భారతీయుడు రెండవబుడ్డి తాగగలడు" అని అంటాడు. అందుకు రెండవవాడు "ఓ భరత మాతా ఎంత కమ్మనిదానివే" అంటాడు. ఈ సంభాషణ అతకకుండ వెకటుగా కనిపిస్తుంది. తాగుడు జీవితావసరమని ఎంచే పాశ్చాత్య దేశాలు ఒకదానితో ఒకటి పోల్చుకుని గొప్పపడితే బాగానే వున్నది; కాని తాగుడు కేవలం దుర్వ్యసనంగా భావించే మన దేశంలో యీ సంభాషణ సహజంగా కనిపించదు. మొత్తంమీద కథను భారతీయం చేయటంతో ఇటువంటి అనవసరపు చిక్కులు చాలా వచ్చినై.

ఇంక భాషసంగతి—"ఏమిటి విశేషములు సచేశ!" అని రెండుమూడు చోట్ల కనిపిస్తుంది. పుస్తకమంతట మద్రాసు అరవ సోదరులు అన్నట్లు అది, వాడు అనే తప్ప ఆమె, అతను, ఆయన మొదలయిన ప్రయోగాలు కనిపించవు. మేధావి వీరసేనుడితో "దాని సంగతి దాని భర్తకే చెప్పినగాని ఇంకొకరికి బుద్ధిరాదు" అని అంటాడు ఇతను 'దాని' అర్థం భార్య కాబోలు. పై వుద్యోగితో పెద్ద వాడితో మాట్లాడుతున్నప్పుడు భార్యను గురించి చెప్తూ ఒక వస్తువును గురించి చెప్పినట్లు అది, దానికి అనటం ఎంతమాత్రం సభ్యత అనిపించటంలేదు. మూడో అంకములో నాయిక అయిన పద్మాదేవి "ఆర్యపుత్రుని నీవు ప్రేమించు మాట నిజమే. దీర్ఘకాలమునుండియు వాని నెరుగుదువు" అంటుంది. పరాయిపురుషుడు సత్యుడితో, తన భర్తను గురించి, ఒక మాటలో ఆర్యపుత్రుడు, రెండవమాటలో వాడు, ఇదెక్కడి పదాల కూర్పో అంతుపట్టదు. ఎటువంటి స్త్రీగాని భర్తను వాడు అనదు. అందులోను ఆర్యపుత్రుడు అని గౌరవించిన మరుక్షణాన్నే వాడు అనిపించటం చాల అన్యాయం. పద్మాదేవి పాత్ర ఔచిత్యాని కదొకలోటు. తృతీయాంకములో నీ "వాని ముచ్చట తీర్చుటకే నేనే పని చేసెను" అంటుంది. ఆ 'వాడు' ఎవరో పసి పిల్లవాడు కాదు, ఆమె భర్తగారే. ఒకచోట వీరసేనుడు 'నా ప్రియ ప్రేమ' అంటాడు. ప్రేమ తీపినిపట్టి ప్రియము కూడ అవుతుందని అనుకోవాలి. అచ్చు తప్పులు ఎక్కువ గానే వున్నయ్. పద్యాలు పేర్చి కూర్చి వ్రాసినట్లు కనిపింపుతయ్. రసవంతముగా ఇంపుగా సాఫీగా నడచినట్లు తోచవు. అంతలోను చివరి అంకము పరవాలేదనిపించు చున్నది. షేక్స్పియర్ మహాకవి వ్రాసిన ఒథెల్లో అనుకోకుండ తెలుగు 'వీరసేనుడు' మాత్రమే అనువని చదవ గలిగితే ఇన్ని లోపాలు స్ఫురించకపోవచ్చు.

అ. గిరిజ.

* *

## హాస్యకుసుమాలు—ప్రథమ గుచ్ఛము.

కూర్పు : "గుంటుపల్లి"

ప్రకాశకులు : హాస్యసుధ ప్రచురణలు,

మైలాపూరు, మద్రాసు-4.

వెల 8 అణాలు.

హాస్యము నవరసములలో నొకటి. హాస్యము చేయ గలుగుట సులభ సాధ్యముగాదు. ఈ కళలో ప్రావీణ్యము

పొందుటకు మనిషికి సాంకేతిక్యము, యుక్తి, సమయ స్ఫూర్తి అవసరము. ఒక్క మాటలో, ఒక్క రేఖలో (Cartoon) హాస్యము నిమడ్చ గలిగినవారున్నారు. ఎంత క్లుప్తములో దీని నిమడ్చగలిగితే వారంత ప్రభావాలుగన వచ్చును. ఏదో ఒకమాట, ఎవరికో ఒకరికి నవ్వును గొలిపినంత మాత్రమున దానిని హాస్యమనలేము. సభ్యుడు, విచారశీలుడునగు మానవునికి నవ్వును గొలుపగలిగిన వాక్యమే నిజమైన హాస్యము. ఇట్టి హాస్యపు సంఘటనలు 200 యీ పుస్తకములో "కుసుమముల" పేరున ప్రచురింపబడినవి. మఱియు హాస్యరసముయొక్క నిర్వచనము విపులముగా వ్రాయబడినది. వీనిలో కొన్ని మన మిగిలవారికు విన్నవే అయినప్పటికి, మరికొన్ని నిజముగ "కుసుమము"లే అన వచ్చును. అందమైన పూలు నేత్రానందమును గొలిపినట్లే, ఈ "హాస్యకుసుమాలు" మనస్సు నానంద పఱిచి, మనల నవ్వించగలవు.

—క. రం.

*　　*

## ప్రేమైకజీవులు

రచయిత : ఇందుకూరి సత్యనారాయణరాజు.

ప్రచురణాలయము : ఆంధ్రా ప్రింటింగ్ హౌస్,

మదరాసు-7.

ఇది ఆరు చిన్న కథల సంపుటి. ఈ ఆరు కథలు చదువుటకు ఒకదాన్నిమించి యింకొంటి ఎక్కువ వుత్సాహకరముగ నున్నవి. అన్ని చక్కగ నున్నవి. భాష సులభముగ నున్నది. ఇందు ముఖ్యముగ "అన్వేషి" అనే కథ ఎక్కుడుగ రీతిని కనపరుస్తున్నది. ముష్కరులైన సిపాయిలు మహాసాధ్వియగు నరస భర్త యొక్క జాడలు తెలుపమని వేధించుచున్నారు. ఆ భర్త జాడ తెలుపుటకు ఇష్టగించక చిన్నబిడ్డలతో ఆ ముష్కరులచేతిలో చావును కిష్టగించుతుంది. ఇంచుమించు అన్ని కథలలో నీతి చక్కగ ఇమిడివున్నది. కొన్ని కథలు ప్రేమపూరితముగ నున్నవి. అందుకే "ప్రేమైకజీవులు" అని కవి పుస్తకమునకు పేరిడెను.

## అందుడు

రచయిత : కనుమేడల వెంకటేశ్వర్లు, రాష్ట్రభాషా విశారద.

పబ్లిషర్సు : రామా అండ్ కో., ఏలూరు.

వెల రూ. 0-8-0.

ఇది పద్యకావ్యము, అయినప్పటికి చదివిన చక్కగ బోధపడుచున్నది. ఇందలి కథ అంధుడు తన జీవితమును సముద్రపు ఒడ్డున కూర్చుని సముద్రునకు తెలుపుచుండుట. స్వాభావికముగ ప్రస్తుత ప్రపంచములో కలుగు సంఘటనలే అంధుని జీవితములో విశదముగ చున్నవి. అంధుడు చదువతగ్గ పుస్తకము.

—రా. లక్ష్మి.



Regd. No. 4753

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూరు - మద్రాసు

బాలికా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషను పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :— (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

అన్నివిధాల మహోన్నతం

ఏవి.ఎం. ప్రొడక్షన్సు వారి

మొదటి తెనుగు చిత్రం

# జీవితం

(లైఫ్)

డైరెక్షన్:
ఎం.వి.రామన్

జూలై 14వ తారీఖు నుంచి




ఆంధ్రా, సీడెడ్, నైజామ్ :—రాజశ్రీ పిక్చర్స్ లిమిటెడ్, విజయవాడ & సికింద్రాబాద్.

మైసూరు :—తల్లం పిక్చర్సు సర్క్యూట్, బెంగుళూర్ సిటీ.

మద్రాసు, నార్తు ఆర్కాటు, సౌత్ ఆర్కాటు, చెంగల్పట్టు, చిత్తూరు జిల్లాలు :

నేషనల్ పిక్చర్సు, మద్రాసు & నెల్లూరు.

తమిళనాడ్ :—సరస్వతీటాకీ డిస్ట్రిబ్యూటర్సు, మదుర.

# ఆంధ్రమహిళ

సంపుటి 7 : జూలై '50 :: సంచిక 3

ముఖచిత్రం—గ్రహపరిక్రమ.

చిత్రకారుడు : శ్రీ యస్. [illegible]



సంపాదకురాలు . శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.,
సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే., యల్. టి.
ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు

## అంతర్యుద్ధం అంతరించకపోతే !

నిజమైన శాంతిస్థాపనను హృదయపూర్వకంగా ఆశిస్తున్నదని ఎట్లా విశ్వసించటం ? ఇతః పూర్వము ఇట్టి వివిధసమితులు నడిచిన త్రోవయే ప్రస్తుతసమితికి గూడ గత్యంతరమైతే, దశవర్ష ప్రణాళికలు, శతవర్ష ప్రణాళికలూ, వృథాప్రయాస యనక తప్పదు.

ఆయుధ బలాలతో యుద్ధానికి ఢీ కొంటూ విఱ్ఱవీగియున్న బలవత్తర రాజ్యాల దృక్పథంలో మార్పు తేగలిగిననాడు గాని ఐక్యరాజ్యసమితి తన కార్యభారాన్ని నెరవేర్చినది కాజాలదు. బక్క రాజ్యాలలో సామరస్యం కలిగించటం సులభసాధ్యం. బలవత్తర రాజ్యాలు కండ్లు తెరచి తాము లోకానికి జరుపగల హానిని, అక్రమాన్ని గుర్తించేటట్టు చేయటం కష్టసాధ్యం. రష్యా అమెరికాల మధ్య, కొరియాలో అంతర్యుద్ధ రూపంగా ఆరంభించిన పోరాటం, అరికట్టలేక పోతే, మానవుని దృక్పథంలో మార్పు రానంతవరకూ, యుద్ధం ప్రపంచాన్నంటి పెట్టుకొనియే యుంటుందని యీ సమితులన్నీ విరమించు కోవటం ఉత్తమం.



(8వ పేజీ తరువాయి)

జూలై మొదటి వారం వన మహోత్సవం దేశమంతటా జరిపించ నున్నారు. రెండో తరగతి పుస్తకంలో తాత మామిడి మొక్క నాటటం కథ జ్ఞప్తికి తెచ్చుకుని ప్రతి వాళ్లు ఒక మొక్క నాటితే దేశమంతా పచ్చల తోరణ మవుతుంది. దేవస్థాన సమాజము వారుకూడా గుడి ప్రాకారాలలో తోటల్లో దొడ్లలో చోటు వున్నక్కడెల్లా మొక్కలు నాట వలసిందని దేవస్థానాలకు ఉత్తరవులు జారీ చేశారు. పండితులు పురోహితులు, శాస్త్రీలు అందరు తమ తమ మత గ్రంథాలలో నుంచి పురాణాల్లోనుంచి చెట్లు నాటటం, పెంచటం మొదలయిన ఘట్టాలను ఏరి కూర్చు తున్నారు. మహాత్ముని సమాధి వున్న రాజఘాట్‌లో శ్రీ రాజేంద్రబాబు మొదటి మొక్క నాట నున్నారు. నెహ్రూ పండితుడు మరొక చోట. ఇట్లా దేశమంతటా, పెద్దలు నాయకులు, దేశ సేవా తత్పరులు ఆధ్వర్యం వహించి శ్రద్ధతో భక్తితో మొక్కలు నాటతారు. ఇన్నాళ్లు పెద్దలు చెప్పిన మాటలు గాలిలో పూదేయటానికి వీలయింది. నాయకులు ప్రారంభించిన సంస్థలు తాళం వేసు కొనటానికి కూడా సాధ్యమయింది. మరి ప్రతిరోజు మన సపర్యలు కోరే యీ మొక్కలు యేమి చేయ నున్నవో, యేమి వెల్లడించ నున్నవో, నిరీక్షించి చూడతగిన విషయమే.

* * *

శాంతి స్థాపనకై దశవర్ష ప్రణాళికలు ఒక వంకనుండి తయారవుతూనే ఉన్నాయి. ఉన్నపళంగా కొరియా ఒక ప్రపంచ సంగ్రామ క్షేత్రంగా ఇట్టే తయారైంది. చూడగా, చూడగా, యుద్ధాన్ని ఆపుచేసేవి సమితిలూగావు, సమావేశాలూగావు, మానవుని అభివృద్ధీగాదు, ప్రపంచంలో సమృద్ధీకాదు — మనుష్యుడు జీవించి యున్నంతకాలం, ప్రపంచంమీద యుద్ధంకూడా జీవించియుండక తప్పదని పిస్తూ ఉంది. మహాప్రళయం నుండిగాని శాంతి తిమిరాలు వీయవేమో !



### విజయం

ఆంధ్రమహిళ సభనుండి కాశీ ఇంటర్‌మీడియట్ పరీక్షలకు వెళ్లిన ముగ్గురు విద్యార్థినులు కృతార్థురాండ్రైరి.

తిరిగి ఇంటర్ క్లాసులు ప్రారంభమైనవి.

# ప్రస్తుత పరిస్థితులు

❋ శ్రీమతి అచ్యుతుని గిరిజ. ❋

జూన్ నెలలో అన్నిరకాలా పరీక్షా ఫలితాలు వచ్చినవి. ఎక్కడ చూసినా ఒకటే హడావుడి. ఏ చదువు చదివించాలి, ఏ కాలేజీలో పిల్లలను చేర్చాలన్న సమస్య పాతదే అయినా, ఇంజనీరింగు వైద్యకళా శాలలమీద వచ్చి పడుతున్న అప్లికేషన్లదాడి చూస్తే విచిత్రంగా ఉన్నది. 350 సీట్లు మాత్రమే ఉన్న ఇంజనీరింగు కాలేజీలకు మూడు వేల అప్లికేషన్లు వచ్చినని. మిగతావాటి సంగతికూడా అట్లాగే వున్నది. ఈ పరిస్థితులు గమనించి విద్యామంత్రి మాధవమీనన్ మొన్న నీమధ్య యిట్లా అన్నారు—

ప్రస్తుతం సైన్సు ప్రయోజనకారిగా వున్నది. ఇంజనీరింగు, వైద్యం చదివితే తప్పకుండ చక్కని పెద్ద వుద్యోగం దొరకు తుంది. అందువల్ల యీ చదువుల కిట్లా విద్యార్థులు యెగబడటములో ఆశ్చర్యము లేదు. ప్రతివారు యూనివర్సిటీ చదువు చదివి యీ కోర్సులకు రావలసిన అవసరము లేకుండ స్కూలుఫైనలు కాగానే చదవటానికి అవకాశంగల టెక్నికల్ కోర్సులు ఏర్పాటు చేయాలి. అప్పుడు కాలేజీల లలో యీ వొత్తిడి వుండదు. ఎంతో మందికి విద్య, జీవనమూ కూడ సునాయాసంగా లభించగలవు. కానీ ప్రభుత్వం డిగ్రీలుంటేనే గాని ప్రభుత్వోద్యోగాలు యివ్వటం లేదు. ప్రజల కింకా ప్రభుత్వోద్యోగాల పై మోజు తగ్గలేదు. నాకుచూడగా పైనుంచి క్రిందివరకు ఒక సమగ్రమైన మార్పు చేసి ఒక క్రొత్త విధానం ప్రకారం విద్య నేర్పటం మంచిదని తోస్తున్నది, !

మంత్రిగారు క్రొత్త విధానం ఎంత త్వరలో ఆలోచిస్తే అంత ప్రజోపయోగం వుంటుంది. ప్రజలకు టెక్నికల్ శిక్షణ యివ్వతలచు చున్నప్పుడు అది ఎంత సమగ్రంగా శాస్త్రోక్తంగా వుంటే అంత శ్రేయస్కరం. అందుచేత తాత్కాలికంగా చిన్నచిన్న కోర్సులు ఏర్పాటు చేసి స్కూలు ఫైనలు కాగానే చదవటానికి అవకాశం కల్గించినా దేశ ఔన్నత్యం, సౌభాగ్యం, వాటిని మించిన నూతన నిర్మాణావశ్యకత మనస్సులో వుంచుకుని ఆ శాఖలో విశాలమంత ఉన్నత శిక్షణ నివ్వగల క్రొత్త క్రొత్త కళాశాలలను త్వరలోనే స్థాపింపక తప్పదు. ప్రజోపయోగమైన శిక్షణ పొందిన విద్యార్థులు ఎంత మందివున్నా ఎక్కువ కారు.

*　　*　　*

కాలేజీల చదువుల సంగతి వుద్యోగాల సంగతి యిట్లా వుండగా మద్రాసు ఆంధ్రులకు మరొక ఔడద వచ్చి పడ్డది. బాహాటంగా ఎన్నో స్కూళ్లలో తెలుగు తీసి పారేశారు. చిన్న చిన్న పిల్లలను యింత పట్నంలో బస్సులు ట్రాములలో పంపటానికే భయపడుతుండగా అసలు చదవటానికి బడే దుర్లభమయ్యే తిరుణం వచ్చింది. రెండు మూడు హైస్కూళ్లు తెలుగు వుంచినా అక్కడ చదివి పరీక్షయిన పిల్లలే ఎంతో మంది వుండటాన కొత్తవారికి స్థలంలేదు. కొన్ని కాలేజీలలో కూడా తెలుగు తీసివేయాలన్న ప్రస్తావనలు బయలు దేరుతున్నయ్. అయినప్పటికి తెలుగువారు బాహాటంగా యేవిధమైన ఆందోళన చేయటంలేదు. ప్రముఖుల కా ప్రశంసే పట్టినట్లులేదు. చిత్తూరులో ఒక్క బోర్డు హైస్కూలు వారు తమిళులను చేర్చుకోమని అన్నారని అక్కడి తమిళులు యావన్మంది కలిసి విద్యా శాఖా మంత్రి దగ్గరకు న్యాయం కలిగించమని రాయభారం వెళ్లారు. ఇతరులను చూసి అయినా మద్రాసు ఆంధ్రులు పాఠం నేర్చుకోగలిగితే బాగుండును. ఆంధ్ర రాష్ట్రం రాకపోగా ఆంధ్రులకు మిగిలిన అన్యాయం అవమానం యింతగా వున్నయ్.

జూలై ఒకటవ తేదీ నుంచి 8 అవున్సుల రేషను 7 అవున్సులకు తగ్గించు తున్నారు. 3 సంవత్సరాల వయసు వరకు పిల్లలకు రేషన్ సున్న. పాలయినా కలిపి పోయ వచ్చునకొంటే మూడు రూపాయిల పాల డబ్బా ఆరు రూపాయల వరకు పెరిగింది. మళ్లీ పెద్దల కోసం పిల్లల కోసం పబ్లిక్ నల్ల మార్కెట్టు వెతుక్కుంటు బయలు దేర వలసి వస్తుంది. రేషనింగు పద్ధతి ప్రవేశ పెట్టి ఆరు

సంవత్సరాలు గడిచింది. ఏమైనా కొంత మళ్ళీ పోయిన నెలకొల్ప కొన్నాళ్లు గడచిన తరువాత. ఇప్పుడు కొంచెము పట్టి కొలది నాలుగు సంవత్సరాలు పట్టినట్లు భావించమని పెద్దలు సలహా ఇస్తే చెప్తున్నాం. ఏమిచెసినా ఆహార సమస్య అంతు పట్టటంలేదు. తాత్కాలిక విధానాలతో పరిష్కరించే సమస్య కాదయిది. శాశ్వతంగా పనికివచ్చే మార్గం చూడాలి. మన ప్రభుత్వం అంచనాలు వేయించుకున్న, నిర్మించా లనుకొంటున్న ఆనకట్టలు నీటి పారుదల సదుపాయాలు నిరాఘాటంగా నెరవేరితేనే గాని ఆహార సమస్య శాశ్వతంగా పరిష్కారం కాదు. అప్పటివరకు కష్టాలు నష్టాలు అనుభవించక తప్పదు.

*　　　*　　　*

పెద్ద పట్టణాలల్లో పెట్రోలు ధరమీద కంట్రోలు పెట్టుకు వుంచి రేషనింగు తీసి వేశారు. ఇంక మీదట సరి అయిన ధరలకు ఎంత పెట్రోలయినా దొరుకు తుంది. ప్రజా సామాన్యానికి యీవన్నందికి యీమార్పు తెలియ వలసిన అవసరం కూడ ఉండదు. కాని పెట్రోలు లేక షికార్లు మానుకున్న వాళ్లకు మళ్లీసరదా రోజులు వచ్చినయ్. ఎక్కడికక్కడికే సంతోషం.

*　　　*　　　*

మొన్న యీమధ్య మద్రాసులో మహారాష్ట్ర మండల్ వారు ఒక 'రంగ వల్లి' ప్రదర్శనం ఏర్పాటు చేశారు. మహారాష్ట్ర చిత్రకారుడు వాసుదేవ రామచంద్ర అథాలే రంగు పొడులతో నేలమీద చిత్రించిన దేశనాయకుల బొమ్మలు అందరిని చాలా ఆకర్షించినవి. మెత్తగా నూరిన రాతి పొడిలో బజారులో అమ్మే రంగులను తనకు కావలసిన పరిమాణములో కలుపుకుని చేతిబొటన, చూపుడువేలు వుపయోగించి మామూలుగా ముగ్గు వేసినట్లుగా యీ పొడి చల్లుతాడట. ఇంత నైపుణ్యంతో వేసిన బొమ్మలు చెదిరి పోకుండ శాశ్వతంగా వుండటానికి తగిన సాధనాలు ఆలో చించాలని మండల్ వారు అను కుంటున్నారు. దక్షిణ భారతీయులు ముగ్గులు రంగ వల్లులు తీర్చటంలో చాలా నేర్పు చూపించే వారు. అన్ని కళలతో పాటు ఇది కూడా యీ మధ్య కొంచము వెనక పడ్డది. వెనక పడిన యీ కళను మళ్లీ ప్రజలకు జ్ఞాపకం చేసి ప్రచారం చేయటానికి యిటువంటి ప్రదర్శనాలు బాగా వుపకరించు తయ్. చిన్న పిల్లలు ఆడవాళ్లు తీరిక సమయాల్లో రంగ వల్లులు ముగ్గులు తీర్చటం అలవాటు చేసుకుంటే కాలక్షేపంగా వుంటుంది. ఇల్లు అందంగా కూడా ఉంటుంది.

*　　　*　　　*

మూడవ ప్రపంచ ఆరోగ్య సమ్మేళనానికి వెళ్లిన భారత ఆరోగ్య శాఖా మంత్రి రాజకుమారి అమృతకౌర్ తిరిగి మనదేశం చేరుకున్నారు. వైద్యానికి అత్యవసరమైన మందులను కొన్నిటిని, ఫాక్టరీలు నిర్మించి మన దేశంలో కూడ తయారు చేయించ వలసినదిగా లండన్ వైద్య సంస్థలను కోరినట్లు తెలుస్తున్నది. ధనా భావంవల్ల విదేశాలలో వున్నంతగా ఆరోగ్య సదుపాయాలు కలిగించ లేకపోయినా ప్రస్తుతానికి మలేరియా, క్షయ, ప్లేగు నివారణలకు, ప్రసూతి శిశు రక్షణలకు సదుపాయాలు కలిగించుతామని అన్నారు. ప్రపంచ ఆరోగ్యసమితి సహకారంతో ఇండియా ప్రభుత్వం వారు దేశ క్షేమానికి ఒక అయిదేళ్ల పథకం కొనసాగించ టానికి పూనుకున్నారు. ప్రసూతి శిశు రక్షణలలో ట్రెయినింగు యివ్వటం యీ పథకములో ఒక ముఖ్యాంశము. అఖిల భారత ప్రసూతి శిశు రక్షణ కేంద్రము వారి యాజ మాన్యమున యీ ట్రెయినింగు యివ్వ బడుతుంది. శిక్షణ పొందటానికి భారతీయులే కాక బర్మా, సిలోన్, థాయి లాండు, ఆఫ్ఘనిస్థానులనుంచి, ఇండోనీషియా, వియత్ నామ్, కాంబోడియా, లావోస్ దేశాల నుంచి కూడ విద్యార్థులు వస్తారని తెలుస్తున్నది. ఇంతటి అపూర్వ అవ కాశం మన దేశీయులు సదుపయోగ పరచు కుంటే అంత ర్జాతీయంగా గౌరవ ప్రతి పత్తులు యేర్పడటమే కాక దేశంలో ఆరోగ్య వైద్య విషయాలలో ఒక క్రొత్త శకం ఆరంభం కాగలదని అనుకోవచ్చు.

*　　　*　　　*

స్వరాజ్యం రావటంతో మనకు కొన్ని కొత్త పండుగలు వచ్చినవి. పతాకోత్సవం స్వాతంత్ర్య దినోత్సవం మొదలయిన వాటిల్లో చేరిందే 'వన మహోత్సవం'. దేశ సౌభాగ్యానికి వృక్ష సంపద ముఖ్యమని తలంచటాన ప్రభుత్వం వారు

(81వ పేజీ చూడండి.)




## తృతీయ గుళుచ్ఛము

౧

ఏమిటీ సంగీతం, ఎందుకూ ఈ సంగీతం అని పద్మావతి అనుకొన్నది. ఎవరైనా మధురంగా పాట ఒకటి పాడుతుంటే విన్నవారికి మైమరపు ఎందుకు కలగాలి? ఏ రాగాలాపన లోనో, ఏ కీర్తన పాడటంలోనో, కంఠంలో ఏ గమకమో వికసింప జేయటం లోనో, ప్రాణాలు కరిగిపోయి దొనదొన ఆనంద రూపమై భాష్పాలు ప్రవహించి వస్తాయి. ఆమె తన కంఠం పూర్ణవికసితం చేసి మూడు స్థాయిలలో పాడుకుంటూ తన గాన సౌందర్యానికి తానే మైమరచి పోయేది. ఆమెకు లోకమంతా సంగీత మయమా అని ప్రశ్నోదయించేది. చప్పుడు చేయవు అని అనుకొనే కదలికలలో కూడా ఏవో అస్పష్ట రాగాలు ధ్వనిస్తూనే ఉంటవి. నిట్టూర్పులో పున్నాగవరాళి; సాయంకాలపు మలయ మారుతంలో మలయ మారుతమే ఉన్నది.

సంగీతంతో సహచరియం వల్ల గాంధర్వ పీఠాన్ని ఆర్జించటం వల్ల పద్మావతికి పగటి కలలు ఎక్కువ కాసాగాయి. వాస్తవిక ప్రపంచము కన్న భావనాలోకం ఆమెకు ఎక్కువ నిజం కాసాగినది. వాస్తవిక ప్రపంచంలో అన్నీ ఆపశ్రుతులే. ఒక అపశ్రుతిని శ్రుతిగా దిద్దుకొనే టప్పటికి యింకొక కొత్త అపశ్రుతి దాపరిస్తుంది. జీవితం నిత్య శోభనమయం చేసుకోవాలంటే నిత్య జాగరుకత అవుసరం కదా?

పద్మావతికి పెళ్లినాటి భర్త వేరు. ఈనాటి భర్త వేరు. ఆనాడు తాను పద్దాలు, తన భర్త బుచ్చివెంకులు. ఇద్దరూ కలిసి తిరుపతి కొండ మెట్లు ఎక్కుతూ ఉంటే ఆమెకు తాను ఒక పర్వతం ముందర ఎక్కినట్లయి పోయింది. తన భర్తను, యింకా చేపల వాసన పొదుము కొన్నట్లే ఉన్నది.

నిద్రపోతూ గురక కొడతాడు. ఆతనికి లలితంగా ప్రణయ వాక్యాలు పలకటం చేత కాదు. లాలించ లేదు, అనునయించ లేదు.

నిజమే! డబ్బు గణిస్తూన్నాడు. ఏ సిల్కు ఆర్టు పాలెస్ లోనో, ఏ బాలుసామి అయ్యర్ షాపులోనో చక్కచక్కని బెంగుళూరు చీరలు, బెనారెస్ పట్టుచీరలు, ఖద్దరు సిల్కు అద్దకం చీరలు, వెంకటగిరి, వురయూరు, కోయంబత్తూరు, ఫుల్లపాడు, నూలు నేత చీరలో బుచ్చివెంకట్రావు కొనుక్కువచ్చి భార్యకు బహుమతులు ఇస్తూ వుండే వాడు. సెకండు హ్యాండ్ హిల్‌మన్ మింక్సు కారు కొన్నాడు. భార్యను

[illegible] తెలుగాం [illegible]. ఏదికి [illegible] కేసుడు [illegible] హాయి [illegible] కూర్చొనే వాడు.

ఆమెకు అసంతృప్తి తొలకరి వర్షం చినుకులు మూసేవి హృదయంలోకి ప్రసరించి వచ్చినట్లు ప్రవేశించింది. ఈ జీవితంలో తనకేమి లోటున్నది? భర్త కోరుకున్న కోరికల నన్నిటిని నెరవేరుస్తున్నాడాయెను. బాగా సంపాదిస్తున్నాడు. బాగా ఖర్చు చేస్తున్నాడు. తన జీవితం యేనాడో ఉన్నత పథాలకు యెక్కి వెళ్లేందుకు అతడు మెట్లు నిర్మిస్తున్నాడు, కాని డాక్టరు మూలం కనుక్కోలేని రోగానికి కారణం తెలియలేని చిన్న రోగంలా ఆమె జీవితంలో అసంతృప్తి ప్రవేశించిది. మృగశిరా కార్తె రాగానే ఆకాశంలోకి చిన్న చిన్న కారుమేఘాలు మూల మూలలగా ప్రయాణించి వచ్చినట్లు ఆమె హృదయం మూల మూలలా అసంతృప్తి చొచ్చుకు వచ్చింది.

ఆమెలోని స్త్రీత్వము నూతన పరిణామం పొందుతున్నది. ఆమె చదివిన చదువులలో జీవితానికి నూతనార్థాలు పొడ చూపినవి. రాత్రిళ్లు తన ప్రక్క నిదురపోయే భర్త ఆమెకు ఎవరో క్రొత్త వానిలా గోచరింప ప్రారంభించినాడు. ఇన్నాళ్లు యిరువురి జీవితాలు ఒకటిగానే ప్రవహించి వచ్చినవి. ఆమెకు అతడు జీవిత సర్వస్వము. ఒక నాడు తన జీవితానికి పరమేశ్వరుడై తన ప్రపంచానికి చక్రవర్తియై తన ఆలోచనలు, హృదయము, ఆశయాలు, నిండియున్న తన ప్రాణసర్వస్వము అణువు అణువున విడంబించి యున్న ఈ పురుషుడు, ఈ రోజులలో ఎందుకు తనకు క్రొత్త వాడగుచున్నాడో ఆమె కేమి తెలుసును!

౨

ఒక నాడు పద్మావతి బుచ్చి వెంకట్రావు ఎన్నూరు వైపుకు కారుమీద పోయి వస్తున్నారు. అతనికి ఎన్నూరులో ఏవో కొన్ని చేపల విషయం కనుక్కోవలసి వచ్చింది. ఈ నాడు ఆ ఎండి పోయిన ఉప్పు చేపల వాసన పద్మావతి భరించలేక పోయింది ఆమెకు తల తిరిగి వాంతి వెళ్లిపోయింది.

బుచ్చి వెంకట్రావు కంగారు పడిపోయి మంచినీళ్లు ముఖము మీదచల్లి యెత్తుకు తీసుకొని వచ్చి కారు మీద పడుకో పెట్టి, ఇంటికి తీసుకొని వచ్చినాడు. డాక్టరు వచ్చి, మందు ఇచ్చినాడు కొంచెము సేపటికి ఆమెకు బలము వచ్చి మామూలు మనిషి అయినది.

తన జీవితం ముందుకు సాగివచ్చిన వేగంతో తన భర్త జీవితం ముందుకు సాగి రాలేదు. అతని రూపమే కర్కశమై ఆమెకు కనిపించినది. అతని చుట్టూ ప్రసరించియున్న గంధమే నేడామెకు భరింపరాని దవుతున్నది. అతని మాటలలో అపశ్రుతులూ, అపస్వరాలు స్వచ్ఛ జలాలతో ప్రవహించి వచ్చే శైవాలినిలో రాళ్లురొప్పలు వస్తున్నట్లను కొని, పద్మ భరింప లేనని భావించినది.

ఆమె అతనితో ఏక శయ్యాగతురాలు కాలేక పోయినది. ఆ భావమే ఆమెకు నానాటికి దుర్భరమై పోయినది. ఏదేని వంకతో ఆమె తనకు వేరే పడక ఏర్పాటు చేసికొన్నది.

"అదికాదు బావా! వంట్లో అంత బాగుండటం లేదు!"

"ఏమిటి జబ్బు! డాక్టరుగారు చెప్పిన మందు పుచ్చు కోవు, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటావు. నవ్వులతో ఎప్పుడూ కలకలలాడే నీ మొఖము వానలు కురవని పొలంలా బిగుసుకొనిపోయి ఉంటున్నది, నిజంగా నీ వంట్లో బాగుండ టము లేదా? నీకు చీరలు కావాలా నగలు కావాలా? పద్మా నీవు ఏదో మారిపోతున్నావు!"

"నా వంట్లో బాగుండటములేదు బావా. తిండి తిన్నగా సహించటము లేదు. వళ్లు అంతా నెప్పులుగా ఉంటున్నది. రాత్రిళ్ళు నిద్రపట్టదు."

"రా వెంటనే డాక్టరుగారి దగ్గరకు వెళ్లుదాము. ఇలాంటివి అశ్రద్ధచేస్తే కొంపలు ముంచుకు వస్తాయి అప్పుడు ఏమి అనుకున్నా ఏమి లాభములేదు."

"నా వంట్లో కొంచెము నలతే తప్ప డాక్టరుని చూడ వలసినంత అవసరము లేదు. నువ్వు వట్టి కంగారు మనిషివి."

ఏమైన బుచ్చి వెంకట్రావు హృదయంలో ఏదో భయం ప్రవేశించినది. ఎప్పుడూ నిర్మలమైన హృదయంతో చంటిబిడ్డలా ఆడుకొనే తన పద్మావతి ఏమిటి ఇలా అయిపో

స్తున్నది. నిజంగా దాని వంట్లో పెద్ద జబ్బు ప్రకటించిం చేమో, ఏలాగా డాక్టరు దగ్గరికి రాదు. కనుక కిట్టిమైన డాక్టరు ఒకరిని ఇంటికే తీసుకొనివచ్చి పద్మావతిని పరీక్ష చేయించటం మంచిది.

ఆ మర్నాడు ఉదయం డాక్టరు లక్ష్మి అనే ప్రసిద్ధి వహిం చిన వైద్యురాలిని బుచ్చి వెంకట్రావు తీసికొని వచ్చినాడు. ఆమె పద్మావతిని పూర్తిగా పరీక్షచేసినది. జ్వరము రావటం లేదాయెను. ఒళ్లు నొప్పులు మామూలేగాని, ఎచ్చటా ఎక్కువగా నొప్పిగాని పోటుగాని లేదాయెను. మొదట డాక్టరు లక్ష్మి బుచ్చి వెంకట్రావు మాటలు విని ఆమె గర్భవతేమోనని అనుకున్నది. అదీలేదు. ఇంక ఏమిటి?

పద్మావతికి వంట్లో ఏవిధమైన జబ్బులేదని నరములు నీరసించి యుండవచ్చునని మానసికమైన వ్యథ ఏదో ఆమెకు తెలియకుండానే పుట్టించి యుండవచ్చునని డాక్టరు లక్ష్మి బుచ్చి వెంకట్రావును వేరే తీసుకొనివెళ్లి చెప్పినది. అతన్ని ఆమెకు సర్వదా సంతోషము కలిగేటట్లు చూడ మని ఆమె నొక్కి చెప్పినది.

పద్మావతిని చూచి డాక్టరు లక్ష్మి, "పద్మావతమ్మగారూ శరీర సంబంధమైన జబ్బు ఏదీలేదు. కాని, కొంచెం నరాలు నీరసించాయి, సరదాగా ఉంటూ ఉండండి. ప్రస్తుతం సంగీతం నేర్చుకోవడం ఆపి, నాలుగు రోజులపాటు సర దాగా కాలక్షేపం చేయండి. రెండు మందులపేర్లు మీ ఆయనకు వ్రాసి ఇచ్చాను. అవి పుచ్చుకొనే విధానమూ వ్రాసి ఇచ్చాను. ఒక్కొక్కటి రెండేసి బుడ్లు చాలు. మీవంటి సంగీత పాఠకులు ఎంతో ఆనందముగా గడప వచ్చుకదా! సాయంత్రమపుడు మా ఇంటికి రండి. కొంత సేపు రోజు ఖులాసాగా కాలక్షేపం చేయవచ్చును." అని సలహా ఇచ్చినది.

పద్మావతి మందులు పుచ్చుకుంటున్నది. కాని ఆవిడ జబ్బేమి నిమ్మదించినట్లు లేదు. రాత్రిళ్లు నిద్రలేక కూర్చో వడం సాగించింది. ఒక్కొక్కప్పుడు ఊరికే ఎక్కి ఎక్కి ఏడవడం, కొంచెం పని సరిగా జరగలేదనుకున్నా విపరీత మైన కోపం రావడం, చేతులో ఏముంటే ఆ వస్తువుని నేలకేసి కొట్టి పారేసి బద్దలుకొట్టడం, చీరలు, రవికెలు చింపు కోవడం. [illegible].

బుచ్చి వెంకట్రావు భయపడి దయ్యము పట్టుకుందేమో నని అనుమానపడి, కావలి తన వాళ్లకు టెలిగ్రాము ఇచ్చాడు. అత్తగారు, మామగారు, తన తల్లిదండ్రులు, ఇంకా ఇద్దరు ముగ్గురు చుట్టాలు పట్నం చక్కా వచ్చారు.

చింతాగ్రహారం నుండి దయ్యాల మంత్రకాడిని తీసుకు వచ్చారు. పద్మావతికి మరీ మతిపోయింది.

"ఏమిటండీ మీ గొడవంతానూ! మీకన్నా మతిలేదు నా కన్నా మతిలేదు. నాకు దయ్యం పట్టడమేమిటి? ఎందుకు బాధపడుతున్నానో నాకు తెలియదు. మనస్సంతా పాడైపోయింది. ఇలా దయ్యాలనీ దేవతలనీ ఒళ్లు చేప లలో వాళ్లాడే మనవాళ్లే ఓచ్చి బావాలన్నీ ఇంకా మిమ్మ లను పట్టుకుని వేళ్లాడుతూనే వున్నాయి. ఇవన్నీ ఇంతటితో ఆపుచేయండి. లేకపోతే నేను నిజంగా ఏ సముద్రంలోనో పడిపోతాను." అని పద్మావతి భర్తతో కేకలువేస్తూ ఒక రకంగా ఏడుస్తూ చెప్పింది.

ఆంధ్ర మహిళాసభ కార్యదర్శిని పద్మావతికి "నాలుగు రోజులుపాటు మహిళా సభలోనే మకాము పెట్టండి పద్మావతిగారూ! పిల్లలతో, ఈ మాష్టర్లతో కాస్త కాల క్షేపం జరిగి మీ మనస్సు నిమ్మదిస్తుంది." అని సలహా ఇచ్చింది. ఆ సలహా బుచ్చి వెంకట్రావుకు నచ్చింది. వాళ్ల చుట్టాలందరు బాగుందన్నారు. పద్మావతి వచ్చి మహిళాసభ హాస్టలులో చేరింది. ఇదివరకల్లా విద్యార్థినిగా వుండనేవుంది.

## 3

ఆంధ్ర మహిళాసభలో చేరిన దగ్గరనుండి పద్మావతి నిమ్మదిగా నిమ్మదిగా శాంతించి ఆమె హృదయంలో ఏ మూలనో దాగికొని వున్న భయాలు మంచువలె మాయం కాసాగాయి. ఆ భయాలకు కారణమైన పరిస్థితులు ఆంధ్ర మహిళాసభలో లేవుకదా?

తాను తన భర్తతో ఏకశయ్యాగతురాలు కానక్కరలేదు. హాయిగా ఏ విధముగా పురుషుని సంపర్కము లేని ఒక

[illegible] మూలము చేసి [illegible] పరిసరాల నుంచి ఆమె [illegible] పద్మావతికి శాంతం చేకూర్చేది.

గాయత్రి వాళ్ళందరు నవ్వుతూ ముందువున్న తోటలో చేరి కథలు చెప్పుకుంటూవుంటే తాను 'ఊ' కొట్టేది. తనకు తెలిసిన కథలు చెప్పేది. వాళ్లతో ఉయ్యాల లూగేది. కాలమ్ము బొమ్మల్లో పందాలు వేసేది. డాక్టరు లక్ష్మి బుచ్చి వెంకట్రావును పద్మావతితోకూడ వాళ్లిద్దరూ కొన్నాళ్లపాటు విడిగా వుండటమే మంచిదని సలహా ఇచ్చింది.

బుచ్చి వెంకట్రావు ధనవంతుడు. ధనం తేనె వంటిది. తేనె ఈగలను ఆకర్షిస్తుంది. ధనం ఒక రకమైన ఈగజాతి మనుష్యులని ఆకర్షిస్తుంది. వెంకట్రావుకు స్నేహితులకు కొదవేమిటి? మనుష్యులలో ధనము సంపాదించేవాళ్లు 3 జాతులుగా తయారవుతారు. ధనం, ఇంకా ధనం, ధనం పోగు చేయడంలో ఆనందం. ధనం పెంచడంలో వుంది. అందుకు పరమార్థం ధనం పెరగడమే; రెండో రకం వాళ్లు తాము సంపాదించిన ధనం, తాము సంతృప్తిగా అనుభవించాలని కోరుకుంటారు. మూడో రకంవారు తాము సంపాదిస్తున్నట్లు లోకానికి తెలియాలి, తమ ఐశ్వర్యము చూచి లోకం దిగ్భ్రమచెంది అసూయపడిపోవాలి, అది వారి ఆనందం.

బుచ్చి వెంకట్రావు యీ మూడు రకాలుగాకూడా ఆనందం పడేవాడు. భార్య చక్కని నగలతో అందమైన చీరలతో దేవలోకం నుంచి తిలోత్తమలా దిగివచ్చినట్లు కనబడుతూ తనతోపాటు సినిమాలకు రావడం, బీచికి రావడం ఎంతో ఆనందంగా వుండేది. ఐశ్వర్యములో ఏమాత్రం బొద్దుకాకుండ చిన్ననాటి అంగసౌష్టవము పరిపూర్ణత పొందిన శరీరము సౌందర్యము కలిగి చిన్ననాటి లావణ్యము అప్పటికి [illegible] పద్మావతి నేడు ఎల్లోరా [illegible] కుడ్యాలలోని [illegible] విగ్రహంలా వున్నది.

అలాంటి భార్య ఈనాటి కాతనికి దూరమైనది. ఆమె తనతో ఏకశయ్యాగతురాలు కాదు. ఆమెకు స్వకీయమైన పరిమళము ఆమె తనప్రక్క నిదురపోవునప్పుడు, మేలుకొని తన్ను లతలా చుట్టి ఉన్నప్పుడు, తనతో సమంగా నడిచి వచ్చేటప్పుడు, ఆమె తన అంకాసనం అలంకరించి ఉన్నప్పుడు, తన్ను పొదివికొనిపోయి, ఆ సుగంధము తన జీవితంలో భాగమైనది. ఆ సుగంధము నేడు తనకు సన్నిహితమై లేదు.

ఏమి జరిగినది! ఎందుకు తనకామె ఇలా దూరమై పోయినది? ఆనందపూర్ణమైన తమ దాంపత్య పూర్ణిమను నేడు ఏ రాహుగ్రహము మింగివేసినది? పుష్పానికి పరిమళంలా తన చిన్నారి భార్యకు సంగీతము కాదా? నేడా సంగీత మేమైపోయినది? చిన్ననాటినుంచీ ఆ బాలిక కోటి తిమింగలాల బలము సమకూర్చేదికదా? ఆమె చూపుల రక్షణలో సముద్ర మొసళ్లన్నా భయపడక అతివేగంగల ప్రవాహాలన్నా భయపడకుండా ఎన్నిసార్లు తాను సముద్రంలో ఉరకలేదు.

తనకు చదువువస్తూ కవిత్వము అర్థమయ్యే ఈ రోజుల్లో, ఆమె పెదవులలో ఉద్భవించిన కాంతులలో నూరవ పాలు ఎరుపులలో నుండి పగడాలు పుట్టి ఉంటాయి అని, అనుకున్నాడు. ఆమె నవ్వితే తళతళలాడే పళ్ల తళుకులలో నూరవపాలు ధగధగలో నుంచి ముత్యాలు పుట్టాయి అనుకున్నాడు. దట్టంగా, నల్లగా, ఒత్తుగా, పట్టులా ఉన్న ఆమె జుట్టు చీకటిలో నుండి నూరవపాలు నిగనిగలు సముద్ర లోతులై వుంటుందని బుచ్చి వెంకట్రావు సరిపోల్చుకునేవాడు.

పద్మావతి ఎందుకు వెళ్లినట్లు? తానే దోషము చేసినాడు! ఆ వెర్రిబాగుల పిల్ల మనస్సు చెడిపోలేదుకదా? ఆమె ఎడబాటు నానాటికి అతనికి భరించరానిదై పోయినది. సినిమాలకు వెళ్లేవాడు కథలు అర్థమయ్యేవికావు. అప్పుడికింకా మద్రాసు నగరంలో ప్రొహిబిషన్ రాలేదు.

బబ్బి కెంకట్రావు బసోటోకో, కాస్మొరాకో —యి కొంచెం ఘాటైనవి ద్రాక్ష సారాయిలు, బీరులు, విస్కీలు, బ్రాందీలు వగైరాలు మొదలు, సోడాలలో కలిపి ఆ తరువాత ఏమీ కలుపకుండా సేవించడం ప్రారంభించాడు. తన పనియందు శ్రద్ధ తగ్గిపోయింది. జాగ్రత్త తప్పవల్యేటప్పటికి ఆతని కంపెనీకి సంబంధించిన అనేకలు మధ్యవస్తులు, ఆతని ఖజానా మహా రహస్యాలోనికి ఎక్కువగా పోనివ్వసాగారు.

ఆతని పురుషత్వము స్త్రీ స్పర్శ సర్వకాలము కోరే గాఢవాంఛా పూర్ణమైనది. స్త్రీ శరీర సంచలిత సౌరభాలు ఆఘ్రాణించక ఒక్క నిమేషమైన ఆతడు మనలేడు. ఇంత వరకూ ఆతని ప్రపంచము ఆతని భార్య- నేడు ఆ ప్రపంచము శూన్యము.

౪

పద్మ కలలో ఎన్నిసార్లో భర్త కనపడేవాడు. ఆ కలలు ఒకొక్కప్పుడు హృదయ బాధా పూర్ణమైన సంఘటనల తోనూ, ఒకొక్కప్పుడు ఉత్సాహసమ్మిశ్రితానుభవ యుక్తం గానూ ఉండేవి.

ఏలా వచ్చింది తనకీ బాధా పూర్ణమైన పరిణామం? ఎందుకు? ఏ మార్గాల తన జీవితం ప్రవహించబోతున్నది? ఎంతవరకు? ఏది కోరి? వేలుగణించే భర్తను వదలిపెట్టి తన చిన్ననాటినుంచీ తనతో ఆడుకొన్నవాడు, లోకం అందిచ్చే చేతులు పట్టుకొని తనతోపాటు అతడున్నూ పై పథాలకు నడిచి వచ్చాడుకదా? ఏ జీవితం జీవిస్తే ఆ జీవితాన్ని సమగ్రంగా అందిపుచ్చుకొని, దృఢమైన నడకలు వేయగల ధీమా కల్గినమనిషి! అతనికి చేపల పేర్లన్నీ తెలుసు, వాటి గుణగణాలు తెలుసు, వాటి జీవిత విశేషా లన్నీ తెలుసు. సముద్రపు మొసలి (Shork) కాని, టేకి చేపగాని, తూటిగాని, ఎదురు వచ్చినప్పుడుగాని, పడవని ఎదుర్కొన్నప్పుడుగాని, వాటి బారినుండి ఏలా తప్పించు కోవాలో, కూడా వుండే నూలు బల్లెంలో వాటిని హత మార్చడంగాని అతనికి పూర్తిగా తెలుసు.

తన్ను పడవలో తీసుకు వెళ్ళేవాడు. అతడు తెడ్డువేస్తే తాను గోలపెట్టేది. ఆతడు తెరచాప ఎత్తి చుక్కాని కోల వేస్తూ వుంటే తాను పడమటకు కూర్చొని

“ఏ దిక్కుపోతాదో
ఈ కదలి మన పడవ
ఆ తీరమేలేని
ఆకాశమే నీరు “ఏ దిక్కు”

పైకెగసే వాగుల్లో
పలపాల తుంపర్లో
నీరాల బయలుల్లో
దారడిగి దారొంది “ఏ దిక్కు”

తెరచాప రెక్కలతో
తెల్లని పులుగై పడవ
(తెల్లని పిట్టై పడవ)
మన వలపు రేవునకు
మనల నిరువురచేర్చు “ఏ దిక్కు”

అని పాడుతూ ఉంటే తన బావ తన్ను చిరునవ్వులతో చూస్తూ తానూ ఒకపాట ఎత్తుకునేవాడు.

“వాగువాగులు కలిసి సాగుదారుల ఎంట
వాగువడిలో పూవు వడిగాపోరొ పడవ
నాముందు నీ నవ్వు నా ఎనక అలనవ్వు
ఈ పడవ తెరలెత్తు మనబ్రతుకుదవుదవ్వు.



“ఇలా ఉంటుందని [illegible]ండి. మా నాన్న [illegible] చెప్పి [illegible].

చెరువులానే అతనున్న రెండెకరాలతోపాటు మరో పదెకరాలు కౌలుకి మా నాన్న, ఆయన తమ్ముడూ సాగు ఆరంభించారు.

వ్యవసాయం చేస్తుండగా మా నాన్న అనేక దెబ్బలు తిన్నాడు. ఎంత కష్టపడి పండించినా అది కౌలుకు సరి పోయేది. వ్యవసాయదారుడి పని మాచెడ్డ దుఃఖం బాబూ.

రానురాను మానాన్న యీ జమీందారుకు బకాయి పడ్డాడు. తర్వాత రెండు గాలివానలు వచ్చి కళ్ళారా మాసిన పంటంతా నాశనం అయిపోయింది. మాకు బుణాలు బాగా పెరిగిపోయాయి. ఇంటి చుట్టూరా అప్పులే.

మా స్వంత భూమి అమ్ముకున్నా అప్పు తీరిందికాదు. మా దూడల మేకల మందంతా మా భూమితోబాటు యీ జమీందారుకు కలిసింది.

మరో దిక్కులేక మానాన్న మా చిన్నాన్న కూలి పను లకు పోయారు.

నేను ఓ పాలేరు క్రింద వెళ్ళాను—అయితే మరి నాకా పనేం చాతనవును? నేను పాలేరు నౌతానని వాళ్ళెప్పుడూ అనుకోలేదు.

వాళ్ళు నన్ను పాడుచేసారు.

ఆ తర్వాత యిలా మారాను. మా బ్రతుకెవ్వరూ బ్రత కరు.”

“అయితే మీ యీ జమీందారు మీకేం సాయం చేయ లేదా?” నేను అడిగాను.

“హీం...ఆయన చేస్తాడూ! ఇద్దరు ముండల్ని పెంచు తున్నాడు—వాళ్ళిద్దరికీ చెరో మేడానండి. వాడి కుక్కలు తినేతిండి మాకు లేదిప్పుడు.

ఆయన ప్రాణానికేం ఫరవాలేదు. అలా యెంతో భూమి ఆయనకు కలిసింది. ఆయన పుణ్యమా అంటూ మేమంతా బ్రతికి చెడ్డామండి—మీరాయనపేరు యెప్పుడూ వినలేదూ?”

“నేను కొంచెం త్వరగా పోనియ్”

“ఆ పోనిస్తానండి. ఆయన మాకు ద్రోహం చేసాడండి—మమ్మల్ని సర్వనాశనం చేసాడు. కౌలు ఎప్పుడూ తగ్గించి యెరుగడు. పంటలు పండినా యెండినా అంతే—తీరని ద్రోహం కాదాండి.

లేకపోతే యిల్లాంటి చలిలో నేను చచ్చిపోదునా? నేను పుట్టిన ఊళ్ళోనే హాయిగా సుఖంగా బ్రతికుందును.

ఇప్పుడు మా కుటుంబం అంతా చెల్లా చెదరై తలోదారి చూసుకున్నాం—దేవుడికేం దయలేదు. మాయీ బాధ కంతకీ కారణమైన ‘వాడిని’ శిక్షించమని దేవుణ్ణి ప్రార్థిస్తు న్నాను.

పోనీలే—దేవుని దయ వాడిమీదే ఉండ నివ్వండి. మనమే బాధపడదాం మరి”—

నాకు చాల జాలివేసింది అతని చరిత్ర విన్నాక. ఇలా యీ రిక్షావాళ్ల చరిత్రలు ఒక్కొక్కటీ తెలుసుకోవాలని పించింది. తీరా తెలుసుకుంటే గుండె పగిలి చస్తాం.

“ఇదిగో ఆ యెడం వేపు డాబా యింటికి” అన్నాను నేను.

“చిత్తం!—నా కథంతా విన్నారు.. నా బాధంతా తెలుసుకున్నారు. ఒక్కణా డబ్బులు యెక్కువీయండి”

నేను అర్థరూపాయి తీసి యిచ్చాను.

“మీరు కొంచెం యెక్కువ యీయాలి. నిన్నటినుంచి నా కన్నంలేదు. నీరసంచేసి బండి తిప్పలేదు. నాల్గు రొట్టె ముక్కలు కొనుక్కోవాలి”

మరో పావలా యిచ్చాను.

అతని ముఖంలో హర్షాతిరేఖలు విచ్చాయి. అతడు రిక్షా తిప్పుకు పోయేడు.

చల్లగా వస్తోంది గాలి—పాప్కం! అతను యీ చలికి అలవాటు పడ్లేదు.

అతన్ని వాళ్లు పాడుచేసారు!!!



# జేన్ ఐర్

*** శ్రీమతి మాలతీ చందూర్ ***

(షార్లెట్ బ్రాంటి రచించిన జేన్ ఐర్ ఒక స్త్రీ విషాద గాథ. దిక్కూ మొక్కూ లేని బాలిక తన పినతల్లి పంచన బాల్యంలో అష్టకష్టాలుపడి, చివరికి పాఠశాల వాతావరణంలోనూ—తను ప్రేమించిన పురుషుని సాన్నిధ్యంలోనూ ఎక్కడా సుఖం పొందలేకపోయింది. ఆత్మతృప్తికై తన ప్రియుణ్ణి వొదిలి వుండలేక మాసిపోయింది. ఈ నవల ఆంగ్లంలో ఉత్తమ పురుషలోనే నడుస్తుంది. జేన్ ఐర్ నవలలో నాయిక జేన్ తన బాల్య యవ్వనాలని చెప్పుకొస్తుంది.)

---

నా చిన్నతనమంతా కష్టాల్లో తిట్లతో గడిచింది. మా పిన్ని కర్కోటకపు మనిషి. బాబాయి చనిపోతూ పిన్ని చేత నన్ను తన పిల్లలతో సమానంగా పెంచుతాను అని మాట తీసుకొన్నాడు. పిన్ని తన పిల్లలతో సమంగా పెంచుతానని మాట యిచ్చినా నన్నుమటుకు ప్రతిక్షణం దిక్కూ మొక్కూ లేని అనాథ బాలికగా చూసేది. ఆవిడ ప్రవర్తన నేను తల్లిదండ్రి లేనివాననని జ్ఞాపకం తెచ్చేదిగా వుండేది. పిన్ని పిల్లలుగూడా నన్ను చాలా నీచంగా చూస్తూ, చీటికీ మాటికీ కొడ్తూండేవారు. ఒకనాడు నేను పిన్ని కొడుకు జాన్‌తో దెబ్బలాడి అతని చేతిమీద కొట్టడం వల్ల, పిన్ని నన్ను మూడు నెలలు వాళ్లతో మాట్లాడకుండా చేసింది.

ఆ మూడు నెలలూ యింటివెనక పనివాళ్లున్న భాగంలో వుండేదాన్ని. ఒకనాటి వుదయం పిన్ని నన్ను రమ్మని కబురంపింది. నేను వెళ్లేవేళకి పిన్ని గదిలో కొత్త మనిషి కూర్చుని వున్నాడు. ఆయన నన్ను పరీక్షగా చూసి పిన్నితో "అల్లరి పిల్లలకు తగినది లావుడ్ అనాథాశ్రమమే" నని అన్నాడు. అక్కడి క్రమ శిక్షణవల్ల పిల్లలకి మంచి బుద్ధు లబ్బుతాయట. లావుడ్ పాఠశాల అనాథ బాలికా శ్రయము. కొంతసేపు వారిద్దరూ నా అల్లరితనాన్ని గురించీ, నా లోపాల్ని గురించీ మాట్లాడుకున్నారు. చివరికి ఆయన వెళ్లిపోయారు. పిన్నీ నేనూ మిగిలాము. "నేను చెడ్డ దాన్ని కాదు. నువ్వే చెడ్డదానివి—ఈ యింటికంటె అనాథాశ్రమమే మంచిది" అన్నాను పిన్నితో. తనూ అందుకే తొందర పడ్తున్నా నందావిడ. నా కప్పటికి పదేళ్ళు.

లావుడ్ అనాథాశ్రమములోని ఎనభైమంది పిల్లల్లో నేనొకత్తెనయాను. ఏ వొక్కరికీ వొంటినిండా బట్టా, కడుపునిండా తిండీ వుండేదికాదు. కరకుకట్టే చలి. కష్టా లనేందుకు దుప్పటీ ఐనాలేదు. యిన్ని కష్టాలు హెలెన్ స్నేహంవల్ల మర్చిపోయేదాన్ని. తాళకాలే కడుపులవల్లా, ఆ తినేదీ చచ్చుసరకం ఆహారం కావడంవల్లా, అనాథాశ్ర మంలో విషజ్వరాలు బయలుదేరాయి. ఆ జ్వరం హెలెన్ను పొట్టనెట్టుకుంది. ఈ ప్రపంచంలో నాకున్న ఆ ఒక్క ఆత్మీయురాలూకూడా పోయింది. అనాథాశ్రమంలో మొదటి ఆరు సంవత్సరాలు విద్యార్థినిగానూ, చివరి రెండు సంవత్సరాలు వుపాధ్యాయినిగానూ మొత్తం ఎనిమిదేళ్ళు ఏకాకినిగా గడిపాను. ఇంతలో మా అనాథాశ్రమపు ప్రిన్సిపాల్ పెండ్లితో నేనా ఆశ్రమానికి తిలోదకాలు యిచ్చాను.

సెప్టెంబరు నెలలో మిల్‌కోట్‌లో నున్న థారన్ ఫీల్డు హాలుకి ఉపాధ్యాయినిగా కుదిరాను. థారన్ ఫీల్డులో నే అడుగుపెట్టేవేళకి వృద్ధ స్త్రీ ఒకామె నన్ను ఆప్యాయంగా ఆహ్వానించింది. ఈ గృహాన్నంతా ఆమే నిర్వహిస్తూండేదట. పేరు ఫెయిర్ ఫాక్స్. యజమాని వూళ్ళో లేరు. ఆయన సంరక్షణలోనున్న ఎనిమిదేళ్ల బాలిక ఎడేల్‌కి నేను చదువు చెప్పాలి. ఫెయిర్ ఫాక్సుకి నా యజమాని రాఛెస్టర్ దూరపు చుట్టం.

థారన్ ఫీల్డు మూడంతస్థుల పెద్ద భవంతి. చుట్టూ పెద్ద తోట. రాఛెస్టరు ఒక పెద్ద జమీందారు. ఇంట్లో గదులు పెద్దపెద్దవి. పొడుగాటి వరండాలు—ఎత్తయిన ద్వార బంధాలు—ఇల్లు పురాతనమైనదైనా చాలా దర్జాగా

[illegible] వుండే [illegible]

"—[illegible] కనా?" అని [illegible] అడిగాను.

"[illegible], అలాంటివారు కారు. మంచి మనిషి. చుట్టుపక్కల [illegible] ఆయన [illegible]" అని చెప్పింది.

"అసలెలాంటివాడు?"

"నాకసలు ఆయనంటే చాలా యిష్టం. రైతులంతా ఆయనపట్ల చాలా భయభక్తులతో మెలుగుతారు. ఎప్పుడూ వూళ్ల మీదే తిరుగుతూంటారు."

"ఆయన స్వభావం ఎలాంటిది?"

"గమ్మత్తుగా వుంటాడు. అతను చాలా దేశాలు తిరిగాడు. ఒక్కొక్కప్పుడు చాలా విసుగ్గావుంటాడు. అతను ఎప్పుడు సంతోషంగా వుంటాడో—ఎప్పుడు విసుగ్గా వుంటాడో చెప్పటం కష్టం," అంది ఆమె.

మేడలోని మూడో అంతస్థుకు ఎప్పుడూ భీకరంగా—నిశ్శబ్దంగా వుండేది. మెట్లమీదనుంచి ఎప్పుడన్నా వెళ్తుంటే, కేకలు, మూలుగులు, వెర్రి నవ్వులు వినిపించేవి. నా కెందుకో భయంగా వుండేదా శబ్దం. ఫెయిర్ ఫాక్సుని ఆ కేకలేమిటని అడిగాను. గ్రేస్‌పూల్ అనే పనిమనిషి అలా కేకలు పెడుతుందని చెప్పింది. గ్రేస్ మొహం పిచ్చిగా కనపించింది నాకు. మూడో అంతస్థులో దెయ్యాలు నివసిస్తున్నట్లనిపించేది.

జనవరి నెల బయట చలిచలిగా వుంది. ఒకనాటి సాయంత్రం పక్కవూరికి బయలుదేరాను. తోవకి రెండు వైపులా చెట్లు. దారి చాలా వంకరగా సన్నగా వుంది. దూరాన్నుంచి గుర్రపు డెక్కల చప్పుడు వినిపిస్తోంది. వేట కుక్క భౌమని అరుస్తూ నాముందునుంచి పరిగెత్తింది. డెక్కల చప్పుడు అకస్మాత్తుగా ఆగింది. గుర్రం అదుపు తప్పింది. రౌతూ, గుర్రం యిద్దరూ క్రింద పడిపోయారు. సహాయం చేద్దామని దగ్గిరగా వెళ్లాను.

"నేను చేయగలిగేదేమన్నా వుందా?"

"పక్కగా బెణ్కింది చాలు. ఎముకలు విరగలేదు గాని నొప్పి వచ్చింది" అన్నాడు లేవబోతూ రౌతు. మనిషి పొట్టిగా కనిపించాడు. ఆజానుబాహువు. పెద్ద ఛాతీ. విలువైన దుస్తులు ధరించాడు. ముత్యా వేళ్లకి వైన వుంటాయి.

"మీరు గుర్రం ఎక్కేదాకా వుండి—ఆ పైన నేను వెళ్లిపోతాను" అన్నాను.

"చీకటి పడుతోంది. నువ్వు తొందరగా వెళ్లడం మంచిది. మీ యిల్లెక్కడ?" కాలు మీదలేవ ప్రయత్నిస్తూ అడిగాడు.

"అదుగో—ఆ కనపడే మేడ."

"థార్న్ ఫీల్డుమంచా?"

"అవును."

"ఎవరిల్లది?"

"రాఛెస్టర్ జమీందాయది?"

"నువ్వు అక్కడ పనిచేస్తున్నావా"...ఆశ్చర్యంగా తడబడుతూ తెల్లపోయి చూశాడు.

"చదువు చెప్పేందుకు వచ్చాను."

"ఓహో! పంతులమ్మవా! సహాయం లేకపోతే లేచేట్టు లేను," అంటూ నా భుజంపైన చెయ్యివేసి గుర్రం మీద ఎక్కాడు. ఒక్క చిటికలో గుర్రం రౌతూ—అంతా కలలా మాయమయ్యారు.

ఇంటికొచ్చేవేళకి యింకొకటి కుక్క వీధిలో పడుకునుంది. జమీందారు వూరునుంచి వచ్చారనీ—కాలుకు దెబ్బ తగిలిందనీ ఫెయిర్ ఫాక్స్ చెప్పింది.

మర్నాడు జమీందారుకి నన్ను పరిచయం చేశారు. మనిషి ఆకృతి క్రూరంగా వుంది. అందంగా లేడుగాని యోగ్యుడిలా కనపించాడు. అధికారయుతంగా నా చిన్నప్పటి జీవితాన్ని—అనాధాశ్రమాన్ని గురించి ప్రశ్నలడిగాడు. మాటల మధ్యలో అకస్మాత్తుగా యింక నన్నూ నా శిష్యురాల్ని వెళ్ళమని ఆజ్ఞాపించాడు. మరోరోజు నాతో ఎంతో వుత్సాహంగా తన జీవితాన్ని గురించి,

నవ్వుల్లా మాట్లాడాడు. మాట వరసలో అసందర్భంగా తను అందగాడ్నా అని అడిగాడు. కాదని నిజం పలికాను. జాలీ హృదయం లేకనికూడా అన్నాను.

"నాకాసంగతి తెలుసు. పూర్వం నాకు వొంట్లో దయా, దాక్షిణ్యం వుండేవి. రానురాను కఠోరంగా తయారయాను. అది నా తప్పుకాదు. విధి నాకావిధంగా నేర్పింది." అన్నాడు సాలోచనగా.

ఇంతలోకే పెంపుడు తండ్రి తెచ్చిన అకుపచ్చ పట్టు గౌను తొడుక్కుని ఎడెల్ వచ్చింది. ఆ గౌనువంక జమీందారు "నేను ఒకప్పుడు పచ్చగా చిగురుస్తూ వుండే వాణ్ణి. గడిచిన వసంతం ఆ చిగురు తొలుకు పువ్వు నా చేతిలో వుంచింది. ఆ పువ్వుని నాపాపపరిహారం కోసం జాగ్రత్తగా పెంచుతున్నాను," అని మరో ప్రపంచంనుంచి వలె అన్నాడు. బ్రాంది డోసు ఎక్కువ పడిందేమోనని అనుకున్నాను.

రాను రాను జమీందారు చాలా చనువుగా వుంటూండే వాడు. ఆప్యాయంగా మాట్లాడేవాడు. ప్రతి సాయంత్రం యేవో ఖబుర్లు చెప్పుకుంటూండేవాళ్ళం. కాని కోపం—క్రూరత్వం అప్పుడప్పుడు తొంగిచూస్తూండేది. జమీందారు నాపట్ల యజమానివలెకాక స్నేహితుడిలా ప్రవర్తిస్తూ వచ్చాడు. నాకు తెలియకుండానే అతనిమీద భక్తి గౌర వాలు ఏర్పడ్డాయి.

ఒకనాటి రాత్రి నాగదిలో పడుకొని జమీందారు ప్రవర్తననుగురించి ఆలోచిస్తున్నాను. అతని స్వభావంలోని కఠినత్వానికి కారణం వెతుకుతున్నాను. అర్ధరాత్రివేళ. నిశ్శబ్దంగావుంది. నా గది తలుపును ఎవరో తట్టినట్టుయింది. వులిక్కిపడి లేచాను. తలుపు వెనక వెకిలినవ్వుతో కిచకిచ శబ్దం అయింది. మూడో అంతస్తుమీదకు దడదడ పరిగెత్తిన అడుగుల చప్పుడు. పిచ్చిది గ్రేస్‌పూల్ అర్ధరాత్రి ఏమో గోలచేస్తోందేమోనని ఫెయిర్ ఫాక్సుతో చెప్పేందుకు పక్కగదిలోంచి కేకకు తలుపు తెరిచేసరికి వరండాఅంతా పొగ చుట్టేసింది. ప్రాణం నిలవడం లేదు. జమీందారు గదిలోంచి పొగా మంటలూ వస్తున్నాయి. ఒక్క అంగలో గదిలోకి వెళ్లిపడ్డాను. పెద్ద పరుపుకు చావ పందిరి మంచం చుట్టూ కాలుతోంది. తెరలన్నీ అంటుకొన్నాయి. రాచెస్టర్ పాపలా నిద్రపోతున్నాడు. ఏమి చెయ్యడానికి తోచలేదు. పక్కకూజాలోని నీళ్లని మంచంమీద చల్లుతూ తెరలన్నీ లాగివేశాను.

"నన్ను అర్ధరాత్రి నీళ్లలో ముంచుదామనుకున్నావా? యిదేమిటి!" అని నిద్రనుంచి గుబుక్కున లేచి అడిగారు జమీందారు.

జరిగిన సంగతంతా చెప్పాను. నన్ను కదలకుండా ఆగది లోనే వుండమని చెప్పాడు. లైటు తీసుకుని సంగతేమిటో తెల్సుకుందుకు వెళ్ళాడు. తిరిగి వచ్చి తను అనుకున్నట్టె ఈ పని గ్రేస్‌పూల్ చేసిందనీ, ఆమె విపరీతమైన మనిషనీ ఆ నవ్వులు కేకలూ ఆమెవేననీ చెప్పాడు.

నే వెళ్లబోతూంటే యీ జరిగిన విషయం ఎవరితో చెప్పకర్దని నానించి మాట తీసుకున్నాడు. తలుపు తెరవ పోతూంటే నా చేతిని తన చేతుల్లోకి తీసుకు "కట్టు కథల్లో యింతా అంతా నిజం వుంది. నీలాంటివారికి పరోపకారం స్వభావసిద్ధంగా వస్తుంది. నా ప్రాణం రక్షించావు," తడ బడుతూ యీ మాటలన్నాడు. కంఠంలో ఒకవిధమైన బరువూ, కళ్లల్లో కాంతీ కనబడ్డాయి.

అటుతరువాత యజమాని గ్రేస్ పూల్‌ని శిక్షించేయ్యడం గాని యింట్లోంచి తరిమెయ్యడంగాని చెయ్యలేదు. ఆ తొలి నాడు ఉదయం జమీందారు ఊరికెళ్ళారు. పదిహేను రోజులదాకా అతనిదగ్గరనుంచి ఏ ఖబురూ రాలేదు. నన్ను చూస్తే యజమానికి ప్రత్యేకాభిమానమని నేను పేక మేడలు కట్టుకున్నాను. వాటిని చూసి ఈ పదిహేను రోజుల ఏకాంతంలో నవ్వుకున్నాను.

(సశేషము)



“ పోతేనే పోనీ ఇలాగ దొంగలించుకెడతాడా? ... నమ్మకన్నా కలగన్నానా? ఇన్ని కష్టాలపాలు చేసావు కదా. అయ్యో భగవంతుడా?”

“ ఇప్పుడేడిస్తే ఏంవస్తుంది? నువ్వు చేసినందుకు ఏదు. అన్నివేళలు మనవి కావంటే ఏమైనా విన్నావు? నా మాటేపైనా వింటావుటే! ఇంకా ఏమైనా తీసికెళ్ళాడేమో పోయి మాసి ఏడ.”

పక్క యింటి వారంతా లాంతర్లు తీసుకొచ్చారు. ఇంటికి వెనకా, ముందూ అంతా చూసారు. కాని ఎక్కడా దొంగ జాడలేదు.

ఒక పక్కయింటివాడు: ఎవరో యిదివరిగి చెసిన పనండీ పాపం.

మరొకడు: ఇంటికి కన్నం వెయ్యకుండానే ఎల్లా వచ్చాడండీ! ఇంకా ఏంతీసుకెళ్ళాడో?

మాయావతి: ఇంకేంపోలేదు. పాత్రలు, గుడ్డలు అన్ని ఎక్కడివక్కడే ఉన్నాయి. నావస్తువేదయినా తీసుకెడితే బాగుండేది. పరాయమ్మ యింటి వస్తువ తీసుకెళ్లె. ఎంత అవమానం. ఎంత అప్రతిష్ట. వాళ్లకు నేనెల్లాగ నాముఖం చూపిస్తాను?

“ హారంయొక్క సంతోషం బాగా తెలిసిందా?” అన్నాడు శాస్త్రి.

“ అయ్యో అవమానం వచ్చి పడ్డది.”

“ నేనెన్ని చెపితే గేుం, విన్నావా? హారంకాస్తా పోయింది. ఇంతత్వరలో ఆరు వందల రూపాయలు నష్ట పడ్డాం. భగవంతుడు నా మర్యాద ఎలా నిల్పుతాడో ఏమో!”

“ నా యింటి దేదైనా దొంగిలించుకు పోకూడదా? పాపం విమల కొత్తగా చేయించుకుంది. ముద్దుముచ్చట తీరేటట్లయినా దీన్ని పెట్టుకోలేదు. అయ్యో నేనేం చేయను?”

“ పది సవర్లని నీకుబాగా తెలుసా?”

“ అవును పది సవర్లేనండీ.”

వాళ్ళేమంటారు? మా ఇంట్లో సొమ్ము పోయింది కాబట్టి మీరే తెచ్చివ్వండి అంటావా అప్పుడేం చేస్తావు?”

“ అయ్యో ఇప్పుడు నేనేం చెయ్యను? ఇన్ని రూపాయలెక్కడ్నించి తేను?”

“ ఎక్కడినుంచైనాసరే ముప్పు తిప్పలుపడి మూడు చెరువుల నీళ్లు తాగి తీసుకురావలసిందే. కాని నీవు ఎంత తప్పపని చేసావు!”

“ అయ్యో ఎరువు తెచ్చుకున్న సొమ్ము పెట్టుకుంటే భగవంతుడు కూడా చూడలేకపోయాడు. కొన్ని క్షణా లన్నా వేసుకున్నానో లేదో ఇల్లాంటి విపత్తు వచ్చిపడిందే. నేను దురదృష్టవంతురాల్ని.”

“ ఇప్పుడు నోరూ నెత్తి బాదుకుంటే ఏమొస్తుంది? మాట్లాడకుండా కూర్చో. పక్క యింటి విమలగారితో భయ పడవద్దని, మీసొమ్ము మీకు చేర్పించేదాకా నిద్రించ మనీ, మరీ మరీ చెప్పు.”

శాస్త్రిలో ఇప్పుడు చాలా మార్పు కనిపిస్తూ వచ్చింది. ఆరు నెలల పర్యంతం మధ్యాహ్నమైనా విశ్రాంతి తీసుకో కుండా రాత్రి పన్నెండు గంటల వరకుగూడా పనిచేస్తూనే ఉండే వాడు. పూర్వం స్కూలులో పాఠాలు చెప్పడమే ఉండేది. ఇప్పుడో, సాయంకాలం బడి నుంచీ రాగానే భాగవత కాలక్షేపం చెయ్యడానికి వెళ్లేవాడు. అక్కన్నుంచీ తిరిగి మరోపరి జాతకాలు చుట్టానికి వెళ్లేవాడు. విధీ విరా మం లేకుండా డబ్బు సంపాదనలో మునిగి పోయాడు. ఇల్లాగ అయిదు నెల్లుగడిచాయి.

ఒక రోజు సాయంకాలం దీపాలు పెట్ట బోతుంటే శాస్త్రి ఇంటికొచ్చాడు. చేతిలో ఒక కాయితం పొట్లాం ఉంది. అది భార్య కందించాడు. “ తీసుకో నీఋణం తీర్చు కున్నాను” అన్నాడు. మాయావతి పొట్లాం విప్పి చూచే టప్పటికల్లా అందులో చంద్రహారం తళతళ మెరియ జొచ్చింది. ఆమె ముఖం వికసించిన కమలంలాగ అయింది. ఆమె సంతోషానికి మేర లేకపోయింది. భర్తగారితో ఇలా అంది, “ మీరు దీన్ని కోపంతో ఇస్తూన్నారా? లేక సంతోషంతోనా?”

“అంటే నేను పెళ్ళాన్ని ఇష్టమైనా కష్టమైనా పడవల్సిందేనంటావా — ?”

“ఆఁ అవ్వునూ.”

“అప్పు నాకిక మరేమిటి?”

“వీలు చెరపట్టి విడిపెట్టేసా ..రామయ్య.”

“అప్పుడు ఇంకా ఇంకో హారం చేయించాలా ఏం?”

“లేదు లేదు ఆ హారం వొద్దు. దానిని విడల కారణే ఇచ్చేస్తాను. లేకుంటే ఇన్నాళ్లూ ఏమనుకుంటారా ఏం.”

“నిజంగానా.”

“ప్రమాణపూర్తిగా?”

“ఔను. ప్రమాణ పూర్తిగా.”

“ఇక అంతా నాకే యుక్తిగాలిచే!”

“(మిసి మిసి నవ్వులు నవ్వింది)”

“ఎంత కష్టపడి చేయించానో నీకేమైనా తెలుసా?”

“ఇది అసలు బంగారమే హైగా అయిందా?”

“అసలు బంగారమేమిటి, అంతకంటే ఎంతో అధికమైంది నా ఆత్మ స్వాతంత్ర్యాన్ని కూడా బలిదానంచేసాను ; చంద్రహారం కోసం.”

“అట్లా ఇవాళాయి పడుకుందాం ఏమండీ!”

“అయితే చంద్రహారం చేయించి నా బాకీ తీర్చుకున్నా. ఇంకా నీ బాకీ మిగిలింది.”



# అభిసారిక

*శ్రీ వసంతరావు రామక్రిష్ణరావు.*

ఈ భయంకర నిర్జన శోభ విజిత
మైన కానన మందు నీకై నిరీక్ష
చేయుచుంటిని ; ప్రియతమా ! నీయమోఘ
ప్రణయ సౌఖ్యము ననుభవింపగ దలచి.

నీ నిమీలిత నేత్రాల నీలినీడ
జాడలందున వర్తింప సంతసమున
కటిక కాటుక రాశి చీకటుల లోన
ఈ మలీమస సంకేత సీమనుంటి.

వేగ రావోయి ! ప్రేమికా ! విలసితప్ర
శస్త్రప్రణయైక కుసుమంబు సంతరించి
నిల్చి యుంటిని నీకయి ; నీకరంబు
నందు నైసేసి యానందమనుభవింతు.

లలిత లాస్య విలాస కళా విశేష
వైభవము గన్న ప్రణయ జీవన సుఖమ్ము
ననుభవింపగ నెంచి గాఢాంధకార
మైన నిర్జనసీమ నీకై నిలచితి.

సహజ శరదిందు మందహాస ప్రసన్న
కాంతి వెలయించు నీప్రేమ గాంక్షసేసి
నీప్రణయవాసి నిల్చిన యీప్రదేశ
మునకు రావోయి ! ప్రియతమా ! కనికరించి.

నిర్మల ప్రేమవీక్షలో నిలుపుకొంటి
నీదు రూపము ; నీతోడి నిఖిల సుఖము
ననుభ వింపగ నాశించి యర్ధరాత్ర
మందు నైతము వచ్చితి నబల నేను !

ఓయి ! ప్రియతమ ! నా నిస్సహాయదీన
మైన దురవస్థ జూచి నాపైనిగరుణ
దాల్చి సత్వరమే రమ్ము ! దారుణమగు
నీవి యోగాగ్ని నిక సహింపజాల.

నాప్రణయ దీక్షలోని శక్తిప్రభావ
మనుప మానము నిర్మలమైనదనెడు
నిజపరిస్థితి గుర్తించి ; నీదుప్రేమ
ప్రణయినీ సౌఖ్యమున బుచ్చి ప్రణుతి గనుము.



మూలం :—ఈవ్ క్యూరీ.

# నారీమణులు

హెచ్. ఆర్. శేషగిరిరావు.

ఏదైనా ఉత్కృష్ట, ఉత్తమ జీవితాన్ని కథగా వర్ణించే టప్పుడది పాఠకులకు మనోరంజకమై ఆ కథా చరిత యొక్క మూలాధారమును, ఆ కాలమునాటి సాంఘిక జీవితమును దెలియుటకనేకములైన యవకాశముల గల్పింపవలెను. ఒక జీవితాన్ని వర్ణించేటప్పుడు దానిరచయిత ఆ జీవిత, మార్గము, ప్రజోపయోగమో, కష్ట జీవితమో, విషాదాంతమో, మార్గదర్శకమో, ఉత్తేజకరమో, ఉన్నతమో, ఏదియో గ్రహించి జీవిత చరిత్ర వ్రాయును. ఇచ్చట మదాం



క్యూరీ జీవితచరిత్ర ప్రథమమున కష్టతరమై—ఉన్నతమై—ఉత్తేజకరమై చివరి కాదర్శప్రాయ మగుచున్నది.

పోలెండ్ రాజ్యాన్ని కబళించి తమ బానిసలుగా జేసి కొన్న రోజులవి. జార్ చక్రవర్తుల దురంత పాలన కంతము లేక ప్రజలలమటించిన రోజులవి. ప్రజలకు జాతీయ గీతముల బాడుకొను హక్కైననూ లేక విలపించిన రోజులవి. అవే పందొమ్మిదవ శతాబ్దపు చివరి పాతిక సంవత్సరములలోని రోజులు. పాఠశాలలోని విద్య, దేశములోని కార్యాలయములలోని రాజ్య పరిపాలనలు గూడా రష్యను భాషలోనే జరుగు రోజులవి. పాఠశాలోపాధ్యాయులు, పరీక్షకులు గూడా రష్యనులే. ఏడొద్దిమంది పోల్ వారున్నను జార్ ప్రభుత్వ శిరిసాజ్ఞలచే చిక్కుపడి ఉక్కిన పైవారే. పోల్ బాలబాలికలెంత యుబలాట పడినను దేశ చరిత్రను, నాటి రాజ్యాంగ పరిస్థితుల నిసుమంతైనను దెలియనీయక ప్రభుత్వము వారి నణగద్రొక్కిన రోజులవియే.

వార్సా నగరంలోని నొవోలిప్కి వీధిలో నున్న బాలుర యున్నత పాఠశాలయందు, మాన్షూర్ వాడిస్లావ్ స్క్లొడోవిస్కీ కుటుంబము నివసించెను. దాని యజమానియగు భౌతిక శాస్త్రముఖ్యోపాధ్యాయుని కుమార్తె (1868) మన్యా—పిదప జగద్విఖ్యాత మేరీక్యూరీ నామ ధారిణి. ఆయన పనిచేయు పాఠశాలకు ద్వితీయ పరీక్షకుడు. విద్యార్థులకు విద్యా భోజనము లిడిగొంత ప్రతిఫలమును గ్రహించు చుండును. జోషియా, బ్రోన్యా, మన్యా, జోసెఫ్, హేలా ఆయన సంతానము. అక్కడిపాఠశాల పేరు 'జిమ్నషియమ్'. దానిలో మాన్యా పెద్దక్లాసు వరకు చదివినది. ఆ చదువువత్సరములనే యఖండ ప్రతిభ జూపి ఉపాధ్యాయుల విద్యార్థుల మన్ననలందినది. ఒకానొక రష్యన్ పరీక్షకుడు (ఉన్నతపదవులు రష్యనులవే) రష్యా ప్రభుత్వమును గూర్చి ప్రశ్నింప మన్యా యొక్కతెయే సమూలముగా నా ప్రభుత్వమును విమర్శించి కొన్ని సూచనల నొసగి నది. తీరిక వేళల పద్యకవిత్వము, దేశచరిత్రను, విజ్ఞానశాస్త్రమును చదువు చుండెడిది. 1882వ సంవత్సరమున జిమ్నాషియమ్ వీడినది. వార్సా విశ్వవిద్యాలయము—కాదు—జార్స్ విశ్వవిద్యాలయమున స్థానము స్త్రీలకు నిరాకరించుటచే చదువాగినది.

## మదాంక్యూరీ

[illegible] ఉపాధ్యాయ [illegible] ఫ్రెంచి [illegible] శాస్త్రముల [illegible] విద్య [illegible] ఉద్యోగ [illegible] 'స్కాటి' [illegible] నరపగుటచే 'స్కాటి' విశ్వవిద్యాలయమున చేరినది. (1892) పారిస్ విశ్వవిద్యాలయము చేరి కొన్నాళ్లు చదివినది. ఒకానొకింత పనిచేసెను, వారిచ్చిన మిగిలిన కర్ర సామాను గదిలో నివాసము మొదలిడినది. 'మార్సియర్ కొవా లిప్మ' యను స్నేహితు డొక గొప్ప స్నేహితుని పరిచయపరిచెను. ఇది యీమె లిప్మన్స్ రసాయన శాస్త్రాగారమున ఉపాధ్యాయపదవి యందుండుటవల్లను జరిగినది.

ఆ ఫ్రెంచి శాస్త్ర వేత్త—పేరీక్యూరీ—త్వరలోనే యీమెను వివాహ మాడినాడు. పేరీ భౌతిక శాస్త్ర కళాశాలలో నైగుగండల ఫ్రాంకుల జీతగాడు. ఎనిమిది గంటల శాస్త్ర పరిశోధన మూడు గంటల గృహకృత్యములామెకు చాల లేదు. ఆమెకుమార్తె—ఐరిన్—జన్మించిన కొలది దినములలోనే అయిస్కాంతి కిరణమును గురించి ప్రచురించినది. ఆమె భౌతిక రసాయన శాస్త్ర పరిశోధనల జేసి పేరందినది.

మేరీక్యూరీ జీవిత మంతయు నొకయెత్తు ఆమె కనిపెట్టిన "రేడియం" ఒక యెత్తు. 1897వ సంవత్సరమునుండి రేడియం పరిశోధన లారంభింప బడినవి. వివిధ శాస్త్రజ్ఞులు పరిశోధించిన వివిధ లవణముల గైకొని తమపదార్థము నీ దంపతులు సంపాదించిరి. అరు బయట చేసిరి—మంచుకొండలో—జడి వానలో—పట్టపగలు—కటిక చీకటిలో పరిశోధించి యురేనియమ్ థోరియమ్ల రేడియో ధార్మిక శక్తుల వెలువరించిరి. 1898 లో మూల పదార్థము కాల్చగా మిగిలిన దానితో పరిశోధన జరిపి ఆపదార్థమును పిచ్—బ్లెండ్ లోకమునకు వెలువరించిరి.

[illegible] ఇంగ్లండు—ఆస్ట్రియా—జర్మని—ఫ్రాన్సు లలో ప్రకటింపబడినది. ఆ క్రొత్త పదార్థమునకు రేడియం అని నామకరణ మిడ్పబడినది. [illegible] నాలుగేండ్లామె (1898—1902) పరిశోధించి 1½ గ్రాముల రేడియం కనిపెట్టినది. ఒక గ్రాము రేడియం 7,50,000 బంగరు ఫ్రాంకుల వెల కట్టబడినది. ఆమెకు 1903 లో భౌతిక శాస్త్ర కోవిద అను బిరుదీయబడెను. మరల నోబెల్ బహుమానము—1904 లో.

19 వ తారీకు ఏప్రిల్ 1906 వ సం॥ విచార దినము. ప్రఖ్యాతయశోవిరాజితుడు పేరీక్యూరీ మోటర్ ప్రమాదమున మరణించినాడు. పేరీ స్థానమున క్యూరీ ముఖ్యోపాధ్యాయిని యైనది. ఇదియే మొదటిసారి స్త్రీల కీయబడిన యుత్తమస్థానము.

మరల ఒంటరి జీవిత మారంభ మాయెను. 1911 లో రసాయన శాస్త్రమున నోబెల్ బహుమాన మందినది. 1914 లో రేడియం విద్యాలయము స్థాపించినది.

"ఎక్స్ రే" పరికరములపుడే ప్రారంభింప బడినవి. ప్రథమప్రపంచ యుద్ధమున రేడియం వైద్యశాలలు రేడియం కారులు చాలా గొప్పసేవ జేసినవి. 1920 లో మిత్రుల కోరికపై నామె అమెరికా వెడలినది. ఎక్కడకు వెడలినను యఖండ స్వాగతమే. అమెరికా ప్రయాణము—శాస్త్రజ్ఞుల సుహృద్భావము ప్రజాభివందనము లామెలో నేనో రగుల్కొల్పినవి.

ఆమె యంత్య దినములతి విచారకరములైనవి. కళ్లు కానక పోవుట, చెవుల బధిరత్వము నామెను కృంగదీసినవి. కళ్లు బాగు చేసిరి కాని లాభములేదు. జూలై 6, 1934 వ తేదీని మదాంక్యూరీ మృతిజెందినది.

మదాంక్యూరీ శాస్త్రమునకు జేసినసేవ—శాస్త్రము ద్వారా మానవులకు జేసినసేవ—శాస్త్రము రేడియం ద్వారా చేయుచున్న సేవ యమోఘముకదా! ఈమె చరిత్ర చివరికాదర్శ ప్రాయమై తద్వారా మార్గదర్శక మవుటలేదా! ఇంక యెందరెందరు మహిళలీ మహిమాన్వితంచి శాస్త్రమును మానవోపయోగముగా జేయుదురో కదా!



# అంతర్జాతీయ ద్రవ్యనిధి

శ్రీ వారణాసి వెంకటాచలంగారు

అంతర్జాతీయ ద్రవ్యనిధి అనగా నేమి? ఈనిధిని ఏర్పాటు చేయుటయందు వుద్దేశ్య మేమి? ఈ విషయము మనము బాగుగ అవగాహన చేసికొనవలయును.

ఈ ప్రపంచమునందు ఏదేశముకూడా సంపూర్ణస్వాతంత్ర్యమును పొందినదని చెప్పుటకు వీలులేదు. గత రెండు మహాయుద్ధములుకూడా యీ భూగోళమందుగల నాగరిక రాజ్యములన్నిటి మధ్యను సంభవించి, అన్ని రాజ్యములకు సమానమైన ఆర్థిక నష్టము కలిగించినవి. రాజకీయమార్పుల విషయమై చెప్ప నలనికాదు.

ఆ నాటినుండి వివిధ దేశములమధ్య వ్యాపారము జరుగుచుండెను. ఏ దేశముగాని, ఉత్పత్తి కేవలము తమదేశస్థుల వుపయోగముకొరకు మాత్రమే చేయడంలేదు. ఆయా దేశములు అవసరమునకు మించిన వుత్పత్తిచేసిన వస్తు సామగ్రిని యితర దేశములకు రవాణా చేయును. అట్లే తమదేశములో వుత్పత్తిగాని వస్తుసామగ్రిని యావత్తును యితర దేశములనుండి దిగుమతి చేయుచుందురు. ఏ దేశమునకైతే దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువగ నుండునో, ఆ దేశము ఆర్థికంగా వృద్ధిచెందును. అందుకల్ల ప్రతిదేశము వీలైనంతవరకు యిట్టి ఆర్థికోన్నతస్థితిని పొందటానికి ప్రయత్నం చేస్తూవుంటుంది. ఇతర దేశాలతో ఎగుమతి దిగుమతి వ్యాపారము యుద్ధకాలమందు సక్రమంగా కొనసాగదు. వస్తువుల కొనుబడి, అమ్మకము, వర్తకులమధ్య బేరం ఫైసల్ అవడం, రెండు దేశాలమధ్య మారకపు ఏర్పాట్లమీద ఆధారపడియుండును.

భారతదేశమునకు గట్టియైన ఆర్థిక పరిస్థితులు ఏర్పడవలెనన్న యితర దేశములనుండి వచ్చే వస్తువులమీద హెచ్చు సుంకములను విధించి ఆయావస్తువులు అమితంగా రాకుండ అరికట్టవచ్చును. కానీ యిదే పద్ధతి యితర రాజ్యాలల్లో కూడా చేస్తే ఏమిచేయవలయును?

గత యుద్ధానంతరం అమెరికా దేశము ఆర్థికముగా అగ్రస్థానమునకు వచ్చింది. సమస్తవస్తువులను వుత్పత్తిచేయుచున్నది. వివిధ దేశములవారికి అవసరమగు వస్తువులనేగాక, బియ్యము, గోధుమలు మొదలగు ఆహారపదార్థములను కూడా మిక్కుటముగ పండించుచున్నది. అందువల్ల ప్రపంచములోగల దేశములన్నిటికంటె అధికమైన ఎగుమతి వ్యాపారము చేయగలశక్తిని పొందినది. తద్వారా ప్రపంచములోగల ధనము చాలవరకు ఆదేశమునకు చేరినది.

వివిధ రాజ్యాలతో ఎగుమతి దిగుమతి వ్యాపారమునకు ముఖ్యమైన వసతి మారకము. ఈ మారకం ప్రస్తుతకాలంలో డాలర్లలో జరుగుచున్నది. కాని దిగుమతివ్యాపారం ఎక్కువగా చేయు దేశములకు, యితర దేశములందు కొనుబడికి సరిపోయేటంత పరపతి యుండనేరదు. వ్యాపారమంతయు యీ పరపతిమీదనే ఆధారపడియుండును గనుక, అట్టి వసతి బక్క రాజ్యాలకు ఏర్పాటు చేయడంకొరకే యీ అంతర్జాతీయ ద్రవ్యనిధి నిర్మింప బడినది.

బ్రెట్టను వుడ్డు సమావేశపు సలహాల ననుసరించి ఈ అంతర్జాతీయ ద్రవ్యనిధిని నిర్మించిరి. 43 దేశములవారు ఈ అంతర్జాతీయ ద్రవ్య నిధిలో సభ్యులుగా నున్నారు. ఈ నిధి మొత్తము 8.8 బిలియను డాలర్లు కలిగి యున్నది.

| | |
|---|---|
| 1. యునైటెడ్ స్టేట్సు | L 2.8 బిలియన్లు. |
| 2. బ్రిటను | L 1.3 ,, |
| 3. రష్యా | 1.2 ,, |
| 4. ఫ్రాన్సు | 450 మిలియన్లు. |
| 5. చైనా | 550 ,, |
| 6. ఇండియా | 440 ,, |

ఇదే విధముగా 43 మెంబరు రాజ్యాలకు కోటాలు ఏర్పాటుచేసిరి. ఈ కోటా మొత్తం కొంత బంగారములోను, కొంత తమ మారకపు నాణెములతోను వుండును. వేరువేరుగా వారివారి తాహతు ననుసరించి యీ నిధికి కోటాలు ఏర్పాటు చేసిరి. ఈకోటాల ననుసరించి ఏమెంబరు దేశమునకైనను ఎగుమతి దిగుమతి వ్యాపారాల మధ్య అత్యవసర సమయములందు అన్యదేశములలో కొనుబడికి కావలసిన డాలర్లను అప్పుగా యిచ్చెదరు. ఈ విధముగా

## అంతర్జాతీయ ద్రవ్యనిధి

ఒక్క గా న్యాయమైన ప్రాతిపదికపైన నడచిన యీనాటికి సుస్థిరంగా గలవు.

కాని ఆర్థికంగా అభివృద్ధి చెందిన కొన్ని దేశములు అటూ ఇటూ తిరిగినా, క్రిందటి యుద్ధానంతరం రాజ్యములు నానాటికి మరీ అధ్వాన్నంగా దిగజారిపోయినవి. కొన్ని ప్రపంచ దేశాలు ఇంకా కూడా మిక్కిలి బాధపడుతున్నవి.

ప్రపంచములో శాంతి భద్రతలు వుంటేనేగాని అంతర్జాతీయ వ్యాపారము సజావుగా నడవదు. అందులకై అంతర్జాతీయ ద్రవ్యనిధి వివిధ రాజ్యాల మధ్య ఆర్థికంగా గొప్ప కలివిడి దారుగా నుండును. నిర్ణయములైన కోటాల ననుసరించి అంతర్జాతీయ వర్తక వ్యాపార పరిస్థితులను సవ్యమైన మార్గము నందుంచును. దీనికి సంబంధించిన ఒక అంతర్జాతీయ బ్యాంకును కూడా నిర్మించినారు.

ఈ ద్రవ్య నిధిలో మనదేశముకూడా మెంబరుగా చేరి . ఈ నిధిని మహత్తరమైన ఆదర్శముతో సృష్టించిరి. యుద్ధానంతరము స్తంభించిపోయిన అంతర్జాతీయ వర్తక వ్యాపార పరిస్థితులు సక్రమమైన మార్గములందు పెట్టడం, అవసరమైన ప్రభుత్వాలకు దేశాలకు సరపతి డాలర్ల రూపేణా అప్పుగా యివ్వడం, ఆర్థికముగ క్షీణించిన బక్క దేశములందు శాంతిభద్రతలు ఏర్పడి ఆర్థికస్థితి మార్పు చెందు వరకు రాజకీయంగా ప్రభుత్వాలు నిలచి, వుత్పత్తిని వృద్ధి చేసికొని అనుకూల పరిస్థితులు ఏర్పడేటంత వరకు కోటాలను ఏర్పాటుచేసి, ఎగుమతి దిగుమతి వ్యాపారము క్రమ పద్ధతులమీద నడిపించడమే యీ అంతర్జాతీయ ద్రవ్య నిధి యొక్క వుత్తమాదర్శము.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# శ్రీ వీరేశలింగ సంస్మృతి

కలమే వాడియౌ ఖడ్గమే నిశితమౌ
 కాజాలుచున్ వారునన్
గలసందే హమ్ము నిరాకరించి ఘనవా
 క్శైన్యపుణ్య వజ్రాయుధో
జ్జ్వల ధారా శకలీ కృత ప్రతిభట
 ప్రజ్ఞా గిరీంద్రుండవై
తెలుఁగుం దేశము నేలినాడవు భవ
 ద్దివ్య స్మృతుల్ పూజ్యముల్.

అరిగి నాఁడవు మము వీడి యమరలోక
దివ్య పథముల కేనాఁడో దీప్తితోడ
జీవ వత్తావకీన వాక్ జృంభణములు
తెలుఁగు గుండెల నేఁడుఁ బ్రతిధ్వనించు.

నీమాటలు మంత్రములై
పామర హృదయములందాఁకి పాపాచార
స్తోమమ్ము నడఁచె లోక
క్షేమమ్మొనరించెఁ దావకీన మృదూక్తుల్.
నీనాటిన సంస్కారన
వీనాంకూరములు తెలుఁగు నాట మహోర్వి
జ్ఞానామర భూజములై
నేఁడు ఫలించినవి ధారుణీ సుఖదములై.

నిరుపమము నీకవిత్వమ్ము నీదు వక్తృ
శాశలము గద్యరచనా ప్రకార మతుల
హాస్యరస పోషణమ్ము స్తుత్యము మహాంధ్ర
ప్రియతమా కందుకూరి వీరేశలింగ.

శ్రీ బి. సీతారామశాస్త్రి.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## మూడవ భాగము.

### అభివృద్ధి పరిమాణము.

శిశు జనన కాలంనుండి దాదాపు రెండేళ్లు నిండుదాక దైహికంగా, మానసికంగా ఏ విధంగా క్రమాభివృద్ధి చెందుతుందనే విషయాన్ని కొంతవరకు తెలిసికొన్నాము. ముఖ్యంగా వెనుకటి ప్రకరణంలో బిడ్డ, అంతర్గతంగానున్న "గ్రహణశీల మనస్తత్వం" మూలకంగా తను సాధించవలసిన ప్రతి లక్ష్యమున కనుగుణ్యమైన సూక్ష్మగ్రాహ్య దశలో (అప్పుడప్పుడు ఏర్పడు జ్ఞాన తృష్ణ తరుణములలో) తన జ్ఞాన కర్మేంద్రియములద్వార బుద్ధి తత్వమును, తక్కిన మానవ సహజ శక్తులను నిర్మించుకొని వికసింప చేసుకొంటుందనీ, తత్ఫలితంగానే మానవుడు బాల్యంలోనే తను జన్మించిన దేశ, కాల, వంశ, సమాజముల కనుగుణంగా తన అభిరుచులు, ఆలోచనలు, అభిప్రాయములు ఆచార వ్యవహారములు మున్నగు వానిని అలవరుచు కొంటాడు అనీ దీనినే ఆవరానుగుణ్య ప్రవర్తన అని పేర్కొన్నామనీ ముచ్చటించాముగదా!

ఇప్పుడు మనం "అభివృద్ధి పరిమాణము"ను గురించి వీలయినంత విపులంగా ఆలోచిద్దాము.

బిడ్డ వయస్సుకు తగిన అభివృద్ధి—దైహికంగా మానసికంగా పొందుతున్నదా, లేదా అను విషయాన్ని ముఖ్యంగా తల్లి పరిశీలించుట అత్యవసరం. అనగా బిడ్డ ఆయా వయస్సుకు తగినట్టుగా ప్రాకటం, దోగాడుటం, నడవటం, స్వేచ్ఛగా తిరగటం, పరిశీలించటం, వస్తుజ్ఞానం కోసం పరిసరముల యందు, బంధు మిత్రులయందు ఆసక్తి ప్రేమలను వెలిబుచ్చటం, తోటి పిల్లలతో చెలిమి చేసుకోటం, ఆడటం, స్వయంగా తన పనులను చేసుకోటం చేతుల నుపయోగించి పనులు చేయటంలో శ్రద్ధ, ఆసక్తి, కౌశలం వ్యక్త పరచటం మున్నగునవి.

మరింత విపులంగా పరిశీలిద్దాము :—

### వయస్సుకు తగిన అభివృద్ధి.

(Age-Norms ఏజ్ నారమ్సు)

6 నెలల బిడ్డ ప్రవర్తన —ఈ ఈడులో ఇంతవరకు ప్రాకుతూ, దోగాడుతూనున్న బిడ్డ కూర్చోటానికి ప్రయత్నిస్తుంది. వస్తువులను చేతితో పట్టుకొంటుంది. అలా పట్టుకొన్న పదార్థమును పరిశీలించటంలో ఆసక్తి అధికమవుతూవస్తుంది. ఈ ఆరునెలల ఈడుకే అస్పష్టంగా ఉచ్చరించుటకు ప్రయత్నిస్తూ అవ్యక్తమైన మధుర శబ్దాలు చేస్తుంది.

8, 9 నెలల మధ్య, నున్న బిడ్డ ప్రవర్తన :—బిడ్డ, ఈ వయస్సులో, కాళ్లు చేతులమీద నడుస్తూ, తల్లి కాళ్లనో, వేళ్లనో, చీరనో పట్టుకొనిగాని, బల్లనో గోడనో మరి దేనినైనా సరే ఆధారం చేసుకొనిగాని కాళ్ళమీద నిలువుగా నిలుచోటానికి ప్రయత్నిస్తుంది.

ఏడాది నిండిన బిడ్డ ప్రవర్తన.—బిడ్డ పెద్దవాళ్ల సహాయంతోలేక మరి దేనినైనా ఆధారంచేసుకొని నడవగలదు. నిలుచున్న బిడ్డ ఎట్టి ఆధారం లేకుండ స్వయంగా కూర్చోటానికి ప్రయత్నిస్తుంది. ఏడాది నిండీ నిండక మునుపే బిడ్డ పెక్కు పనుల్ని చేస్తుంది. తలుపులను తెరవటం, మూయటం, సీసా బిరడాలను తీయటం, తిరిగీ పెట్టటం, వస్తువులను వాటి స్థానంనుండి తీసి దాపునే మరోచోట పెట్టటం, తిరిగీ వాటిని వాటి స్థానాన్నే ఉంచటం, ఈ విధంగా అనేక పర్యాయాలు చేస్తుంది. కాగితంమీద గీయటానికి పెన్సిల్ను పట్టుకొంటుంది. ఎవరైనా గీతగీస్తే, అనుకరించటానికి యత్నిస్తుంది. తల్లి పాలగిన్నెనో ఉద్ధరిణినో చప్పుడుచేస్తే (పాలలో పంచదారవేసి కలిపేటప్పుడు) తనుకూడ అలా చేయటానికి ప్రయాసపడుతుంది. ప్రకాశవంతమైన రంగు గల ఆట

వస్తువుని [illegible] అందుకొని [illegible] మూలం [illegible] కింద కొట్టుకొని [illegible] అడుగుతున్నట్లు [illegible] పోయి పెడితే ఆ వస్తువును తీసుకోటానికి [illegible] ప్రయత్నిస్తుంది. అయినప్పటికీ వస్తువును చేతిలో నుంచి బిడ్డకిచ్చి [illegible], ఆ వస్తువును అందుకోటానికి పైకాగితమును తీసి వేస్తుంది. సాధారణంగా ఎవరో బిడ్డ పాలు తాగటానికి గిన్నెను పట్టుకోగలదు. తల్లి బట్టలు తొడిగేటప్పుడు చేతులెత్తటం, కాళ్లు అందివ్వటం చేస్తుంది. తన కిష్టంలేని పనుల నిరాకరిస్తుంది. తనముందున్న వస్తువులను ముట్టవద్దంటే ముట్టి తీరుతుంది. బిడ్డ ఏదో పనిని చేస్తున్నప్పుడు దగ్గరనున్న పెద్దవాళ్లు నవ్వినట్లయితే, వాళ్లను మరొకమాటు నవ్వించటానికోసం తిరిగి ఆ పనినే చేస్తుంది. ఈ ఈడులో సాధారణంగా బిడ్డ అమ్మ, అత్త, తాతా అనే మాటలు ఉచ్చరించుతుంది. రెండు మూడు క్రొత్త మాటలను కూడ ఉచ్చరించటానికి ప్రయాసపడుతుంది. మన మాటలను అవగాహనం చేసుకోగలదు. చేతులు తిట్టమని, దాచుకోమని మనం నోటితో చెప్పినయెడల అలా చేస్తుంది. సౌజ్ఞచేయ నవసరం లేదు. చేతులతో పిలవటం, పొమ్మనటం మున్నగునవి చేయగలదు.

15 నెలల బిడ్డ సహజాభివృద్ధి :—ఈ ఈడు బిడ్డ ఎవరి సహాయ మపేక్షించకనే స్వయంగా నిలువబోగలదు. నడవగలదు. రెండు చెక్క ఇటికెలతో గోపురంలాగు (ఒకటి మీద నొకటి పేర్చి) కట్టగలదు. బిడ్డ చేతిలో రెండు బొమ్మ నిమ్మెలనిచ్చి, దానిముందు మరొకటి ఉంచితే, బిడ్డ తన చేతిలోనున్న రెండు బొమ్మెలలో నొకటి క్రింద పడవేస్తుంది.

అంతవరకు పలుకుతున్న అమ్మ, అత్త, మామ మొదలగు మాటలతో సహా మరికొన్ని శబ్దములు పదములు బిడ్డ నోట్లో పొర్లుతుంటాయి. ఏవో మాటలు చెప్పుతున్నట్టుగా అనేక శబ్దములను ఉచ్చరించుతుంటుంది. ఈ వయస్సులో అన్నం చేతి(వేళ్ళ)తో తీసుకోటానికీ, నోట్లో పెట్టుకోటానికి ప్రయత్నిస్తుంది. బట్టలు తొడిగేటప్పుడు స్థిమితంగా నిలుచుని తొడిగించుకొంటుంది.

[illegible] నెలల బిడ్డ సహజాభివృద్ధి :—ఏడాదిన్నర వయస్సు బిడ్డ చక్కగా నడవబడగలదు. తన కాళ్లు చేతులకు బలంచేకూర్చుకొనుటేగాక మంచి లాఘవము, సమర్థత, కౌశలం సాధించటానికి తన 'యావచ్ఛక్తిని' ఉపయోగించుతుంది. అతి చురుకుతనంతో ఎప్పుడూ ఏదో ఒక పనిని చేస్తూనే ఉంటుంది. ఈ వయస్సులో బిడ్డ ప్రాకికే నడవటంతో తృప్తిచెందదు. ఎక్కువమూరం నడవటానికీ, బరువైన వస్తువులను మోసుకొని పోవటానికీ ప్రయత్నిస్తుంది. వస్తువులను చక్కగా పట్టుకోగలదు. బరువును మోయటానికి అభ్యసించుతుంది.

ఉదా :—శీఘ్రతతో నున్న చెంబునుగాని, మరేదైన పాత్రనుగాని మోసుకొని పోవటమంటే అమిత ఇష్టం. నీళ్లచెంబును రెండు చేతులతో పట్టుకొని తూలుకుండ నడ్డు కొంటు నడుస్తుంది. మెట్ల ఎక్కటమంటే అమితానందం. మేడ మెట్లు, బల్ల, కుర్చీ మున్నగువాటి నెక్కటానికి తన రెండు చేతులతో దేనినో నొకదానిని గట్టిగ పట్టుకొని ఎక్కటం అంటే దానికెంతో సరదా. తన యావచ్ఛక్తి నుపయోగించి ఎక్కటం అనే లక్ష్యాన్ని సాధించి తీరుతుంది. బిడ్డ ఇలా ఎక్కటం ఏదో ఒక వస్తువును తీసుకోటానికి మాత్రం కాదు. కొన్ని సందర్భాలలో ఏ వస్తువులు అక్కడ లేక పోవచ్చును. (1) పైకి పోవలెనన్న సహజ వాంఛవల్ల అది అంత ప్రయాసపడి సాధించుతుంది. మరిన్ని (2) బలంచే కూర్చుకోటానికీ, (3) కౌశలం సంపాదించటానికీ ఇది సాధనమన్నమాట. బలం, సమర్థత సంపాదించుకోటానికి కొంతకాలం ఈ విధంగా అభ్యసించుతుంది. (ముఖ్యంగా ఈ వాంఛ అభివృద్ధి సోపానముల నారోహించటానికి హృదయాంతర్గతమైన ప్రేరణ అని చెప్పవచ్చును.) ఈ విధంగా బిడ్డ చక్కగా నడవటం అలవర్చుకొన్న తరువాత తను నడవగలనను ఆత్మ విశ్వాసం కలుగుతుంది. అలా కలిగినప్పుడే పెద్దవాళ్లు చేసినట్టు చేయటానికి మొదలెట్టుతుంది. అనగా అనుకరించటానికి ప్రారంభమన్న మాట.

అనుకరణశక్తి :—బిడ్డ అనుకరించే దశ ఒకటి వున్నదని గ్రహించుట అవసరము. ఈ దశలోనే బిడ్డ, తనచుట్టు

చుట్టువున్న వాళ్ళను పరిసరములలోని, చెట్టు చేమలు పశు పక్షి కీటకాదుల (వివిధ ప్రాణుల)ను అనుకరించటమంటే దానికి కడితానందం. ఈలా అనుకరించమని ఎవరో బోధించనవసరంలేదు. హృదయ ప్రేరితంవల్లనే అనుకరించుతుంది. అయితే ఈ అనుకరణశక్తి అనేది స్వేచ్ఛగా పెరుగుతున్న బిడ్డలలోనే ప్రస్ఫుటంగా వ్యక్తమవుతుంది. ఈ ఏడన్నర్థం బిడ్డ నాలుగుకన్న ఎక్కువ సంఖ్య చెక్క ముక్కలను ఒకటిమీద నొకటి పెట్టి (క్రింద పడకుండ) గోపురం లాగు కట్టగలదు. బల్లమీదగాని, కాగితం మీదగాని, సీసు సున్నం లేక పెన్సిలును వ్రేళ్ళతో పట్టుకొని గీతలు గీయటానికి ప్రయత్నిస్తుంది. పెద్దవాళ్లు బిడ్డవద్ద కూర్చొని కాగితంమీద గీచినట్లైతే, వారి ననుకరించుతూ గీత గీచుతుంది. కళ్లు ముక్కు చెవులు మున్నగు ఇంద్రియాలను కాళ్లు చేతులు వెంట్రుకలను మున్నగువాటి పేర్లను చెప్పి చూపించమంటే ఆ పేర్లను చక్కగా అవగాహనం చేసుకొని చూపించుతుంది. ఆరు, ఏడు మాటలను నేర్చుకొని వుంటుంది. అస్పష్టమైన శబ్దములు ఉచ్చరించుతూ తను మాట్లాడుతున్నట్టు వూహించుకొంటుంది. వాటిని తల్లి అర్థం చేసికొన్నట్టు నటించితే బిడ్డ కమితానందం కలుగుతుంది. తనలో తానే మాట్లాడుకోటంకూడ కలదు (ఊహా ప్రపంచంలో). అలా చేయటంచేత మాట్లాడటం అలవర్చుకొంటుందన్న మాట.

అన్నంకాని మరే తిండి పదార్థముగాని చక్కగా వ్రేళ్లతో తీసుకొని నోట్లో పెట్టుకోగలదు. పుస్తకంయొక్క ఆకులను త్రిప్పుతూ బొమ్మలను చూస్తుంది. చెప్పులను స్వయంగా తొడుక్కోటానికి ప్రయత్నిస్తుంది. కాని సరిగ్గా వేసుకోజాలదు. ఆడుకొనేటప్పుడు పెద్దవాళ్లమీద అభినయించుతూ, నవ్వుతూ ఆనందిస్తుంది.

1 సం॥ 9 నెలలు బిడ్డ.—బిడ్డ ఈ ఈడులో, ఎవరి సహాయమవసరం లేకనే కొంత దూరందాక నడవగలదు; వెనకకూ ముందుకూ నడుస్తుంది; తన దేహం, కాళ్లు, చేతులు మున్నగు సర్వాంగములను స్వాధీనంలో పెట్టుకొనే శక్తిని సాధించినదన్నమాట. చెక్క దిమ్మలతో మనం ఒక గోపురం కట్టి దాని ప్రక్కనే మంతొకటికూడ కట్టినయడల ఈ రెంటికీ వున్న వ్యత్యాసము బిడ్డ గ్రహించుకోగలదు. మంతెను కట్టడానికి ప్రయత్నిస్తుంది గాని కట్టజాలదు. మనం ఒక గీతను చక్కగ గీచి, దాని ప్రక్కనే గికికి గికికి గీచినట్లైతే ఈ రెంటికీ ఉన్న భేదాను గ్రహించినట్టు ముఖంలో వెలిబుచ్చుతుంది.

బిడ్డ, సాధారణంగా ప్రతిదినమూ చూస్తున్న ఏదో ఒక వస్తు రూపమును స్పష్టంగా జ్ఞాపకం తెచ్చుకొని దాని పేరును చెప్పగలదు. రెండు పదములను చేర్చిన చిన్న వాక్యములను మాట్లాడగలదు. ఈ ఈడులోనె బిడ్డ తన చుట్టునున్నవాళ్లు మాట్లాడు మాటలను—అర్థమైనా, కాకపోయినా—వల్లించుతూ వుంటుంది. ఆహారం పుచ్చుకొనే సమయంలో తన కిష్టమైన తినుబండము పేర్లను చెప్పి పెట్టమని అడుగుతుంది; దొడ్డికెళ్లటానికి తనకని నిర్ణయించిన చోటికెళ్లి కూర్చుంటుంది. తలుపు గొళ్లెమును తీయటానికీ, వేయటానికీ అభ్యసించుతుంది; తనకిష్టమైన వస్తువులు, పక్షులు, కీటకాదులు, కుక్కపిల్లలు మున్నగువాటిని తల్లికి చూపించాలన్న కోరిక గలిగినపుడు బిడ్డ తల్లి కొంగును, చేతికి పట్టుకొని లాక్కొనిపోయి చూపించుతుంది. ఈ వయస్సులోనే మలమూత్ర విసర్జన విషయంలో ఆపుకొనేశక్తి బిడ్డకు వచ్చివుంటుంది.

రెండేళ్లు వయస్సు బిడ్డ ప్రవర్తన —రెండేళ్లు నిండేటప్పటికి బిడ్డ పెక్కు పనుల్ని జేయగలదు; పూర్వంకన్న ఎక్కువ నేర్పుతో చేయగలుగుతుంది. ఈ ఈడులో చక్కగా నడవటమేగాక పరుగెత్తటంకూడ అలవర్చుకొంటుంది. ఆరు చెక్కముక్కలతో గోపురం చక్కగా కట్టగలదు. పొడుగాటి చెక్క దిమ్మలతో రైయినులాగు వరసగ పేర్చి రైయిను అంటూ ఆడుకొంటుంది. (రైయిను మొదలగువానితో పరిచయమున్న బిడ్డ) కాగితాన్ని ఒక మడత మడిచినచో (బిడ్డ ఎదుట) తనుకూడ మడవటానికి ప్రయత్నిస్తుంది. మనం నిలువగీతను గీచినట్లైతే బిడ్డకూడ అలా గీయటానికి యత్నిస్తుంది. (అడ్డగీతకన్న నిలువ గీత గీయటం సులభం). అడ్డగీతను కూడ గీయటం క్రమేణ బిడ్డకు సులభసాధ్యమవుతుంది. పరిచితమైన పేర్లను (నాలుగైదు) చెప్పగలదు. బిడ్డకు పరిచయమైన పేర్లను చెప్పి వస్తు

[illegible] వంటే [illegible] ఉంది. వాటిని తెలుసుకున్నప్పుడే శిక్షణ [illegible]. ఈ వయస్సులో అనేక పనులను, చిన్న చిన్న కార్యములు చేస్తూవుంటుంది. అనేక రకాల ఆటలు ఆడటం అదంటే ఇష్టం. వస్తువు విప్పటానికి అమర్చటానికి [illegible]. తను చూచినదానిని ఇతరులకు చెప్పగలుగుతుంది. ఈ వయస్సులో ఇసుకతో ఆడటం దానికెంతో ఇష్టం. ముఖ్యంగా గిన్నెతో (మరి దేనితోనైనా) ఇసుకను నింపటం క్రింద పోయటం తిరిగి నింపటం ఇలా ఆడటం దానికి మిక్కిలి ఇష్టం. నీళ్లతో ఆడటం కూడ దానికెంతో ఆనందం. గిన్నెతోనో చెంబుతోనో నీళ్లు నింపడం క్రింద పోయడం, తిరిగి నింపడం, క్రింద పారబోయడం లేదా ఏదో పాత్రలో పోయడం, ఈ విధంగా పలుమార్లు చేస్తూపోతుంది. అదేవిధంగా, బరువైన వస్తువులను—బల్ల, చిన్న కుర్చీ, పాత్రలు మున్నగువాటినీ, బట్టలు వగైరాను, అవి వున్నచోటినుండి మరోచోటికి అతి ప్రయాసతో మోసుకొనిపోయి పెట్టడం తిరిగి ఆ చోటు నుండి మోసుకవచ్చి వాటి స్థానంలో పెట్టడం, ఈ విధంగా పెక్కు పర్యాయాలు తనకు సంతృప్తి కలుగువరకు చేస్తూ పోతుంది. దీనినే కార్య చక్రమంటారు (Cycle of activity) ఈ రీతిగా, బిడ్డ వివిధ కార్యములను 'చక్రగతి'ని చేస్తూవుంటుంది. దీని ఉద్దేశం పెద్దవాళ్లకు అగమ్యగోచరంగా వుంటుంది. కాని బిడ్డ ఇలా 'చక్రగతిని' పెక్కుపనులను చేయటంవల్ల అనేక విషయాలను నేర్చుకొంటుంది. ముఖ్యంగా బిడ్డయొక్క సర్వాంగములకు పరస్పర సమ్మేళనము కలుగుతుంది. ఈ విధమైన పనుల్ని చేయునప్పుడు బిడ్డ వ్యక్తపరుచు శ్రద్ధాశక్తులు, ఆనందం, నేర్పు అనేవి ఆశ్చర్యభరితం, ఇట్టి కార్యకలాపంచే తన కవసరమైన లక్ష్యమును సాధించుకొని మరొక కార్యకలాపానికి వెళ్లునప్పుడు బిడ్డ ముఖంలో ప్రదర్శితమగు సంతృప్తి సంతోషములు వర్ణనాతీతము. ఈ వయస్సులో బిడ్డ చాలాదూరం అంటే షుమారు ఒకటి రెండు మైళ్లు నడవగలదు. మేడ మెట్లు అవలీలగా ఎక్కగలదు. ముఖ్యంగా బిడ్డ విహరించు విషయంలో కొన్ని ముఖ్యాంశముల నెరుగుట అత్యవసరం.

నడవటం అనే [illegible] బిడ్డ కొక అభిలాష. అత్యవసరం కూడాను. బిడ్డ చాలాదూరం నడవగలదని అనేకులు అనుకోటం పరిపాటి. పెద్దవాళ్లతో సమానంగా—అనగా—అంతే వేగంతో నడవగలదని. నిజమే బిడ్డ కాళ్లు దేహమునకు తగినంత పరిమాణం కలిగివుండవు. క్రమేణ అవి పెరుగుతవి. అందువల్లనే పెద్దవాళ్లంత వేగంగా నడవలేక పోవచ్చును. కాని, బిడ్డ తన కాళ్లకు బలం చేకూర్చుకోటానికి చాల దూరం నడవటానికి ఇష్టపడుతుంది. ఇదొక సహజ వాంఛ. ఇలా వాంఛించు బిడ్డను అజ్ఞానంచేత పెద్దవాళ్లు ఎత్తుకొని పోవటం, లేదా తోపుడు బండిలో కూర్చోబెట్టి త్రోసుకపోవడం చేస్తుంటారు, (ఇలాంటివాళ్లే, బిడ్డల స్వయంకృషికీ, అడుగడుగునకు అడ్డు తగులుతూ వారి అభివృద్ధి పరిమాణమునకు భంగం కలుగజేస్తుంటారు. ఈ విషయాలను మరొకచోట సవిస్తరముగ ఆలోచిద్దాము.) మరొక విశేషమేమంటే, బిడ్డ కాళ్లతో మాత్రమేకాదు నడవటం, కళ్లతో కూడ నడుస్తుంది. పరిసరములోని ఆకర్షణీయమైన పదార్థములే బిడ్డను నడిచేలాగు ప్రోత్సహించుతవి.

దృష్టాంతం:—బిడ్డ నడుస్తూ, ఆవుదూడో, లేక మేకపిల్ల మేయటం చూస్తుంది అనుకొందాం. అది వెంటనే అక్కడ కొంతకాలం పరికించుతూ కూర్చుండి పోతుంది. తిరిగి లేచి మరికొంతదూరం నడుస్తుంది. ఏదో ఒక పువ్వును చూచి వాసనచూస్తూ కూర్చుంటుంది. మరల లేచి కొంత దూరం నడుస్తూ ఏదో ఒక చెట్టును చూస్తుంది. ఆ చెట్టు చుట్టూ నాలుగైదు పర్యాయాలు చుట్టి చుట్టి వచ్చి, అల్లలాడే ఆకులను పువ్వులను పరికించుతూ కూర్చొంటుంది. ఈలా చేయటంవల్ల బిడ్డ ఒకటి రెండు మైళ్ల దూరం నడిచినట్టు అవుతుందిగదా! ఇలా నడవటంలో అది అలసట చెందదు. అప్పుడప్పుడు ఆకర్షణీయమైన పదార్థములను వీక్షించుతూ కూర్చొటంవల్ల బిడ్డకు వలసినంత విశ్రాంతి లభిస్తుంది. పెద్దపెద్ద రాళ్లు, నీళ్లు కంటబడితే బిడ్డ ఆనందానికి అంతముండదు.

పరిసరముల మధ్య నడవటం అనేది సహజాభివృద్ధి పరిమాణంగల బిడ్డకు సహజానందం! సహజమైన వాంఛ!

(తరువాయి 81వ పేజీలో)

# శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజపు
# 18వ వార్షికోత్సవం

మేనెల 14వ తేదీని, తణుకులో శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజపు 18వ వార్షికోత్సవం, శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవిగారి అధ్యక్షతను జరిగింది.

ప్రారంభోపన్యాసకులైన శ్రీ జటావల్లభుల పురుషోత్తం గారు, సంస్కృత భాష దేశ భాషలకు జీవగఱ్ఱ అనీ, అందులో చెప్పబడిన భారతీయ సంస్కృతి ఉత్తమమైనదనీ, ఉగ్గడించారు.

శ్రీమతి ఇందుమతీ దేవిగారు పూర్వ సంప్రదాయాలను విచ్ఛిన్నంచేసే అధునాతనత్వం మంచిదికాదనీ, స్త్రీలు తెలుగు సంస్కృత భాషలలో కృషిచేసి ఉత్తమ గృహిణులు కావాలనీ ఉద్బోధించారు. తమ కృతులలోనుంచి పద్యాలు అందంగా చదివి విన్పించారు.

రాత్రి 7-30 గంటలకు సమాజ బాలికలు హిందీ, తెలుగు, సంస్కృత భాషలలో నాటకాలు ప్రదర్శించారు. తెలుగులో అప్రమ (సంగీత నాటిక) సంస్కృతంలో గీత గోవిందం (సంగీత నాటిక) హిందీలో "అజాత శత్రుకే దో దృశ్య" ప్రదర్శించే ప్రేక్షకుల మెప్పు పొందారు.

## సమాజాన్నిగూర్చి :

తణుకులో 1932లో శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు, ఇంటూరి ప్రేమవతమ్మగారు ఈ బాల సరస్వతీ స్త్రీ సమాజాన్ని స్థాపించారు. చిన్నగదిలో, కొన్ని పుస్తకాలతోను, కొద్దిమంది సభ్యురాండ్రతోను యీ సంస్థ నడిచింది. 1938 నుంచి శ్రీయుత పోతా ప్రగడ అంకరాజుగారు అత్యుత్సాహంతో యీ సంస్థకు ప్రోద్బలం యిచ్చారు. చోప్పెల్ల మహాలక్ష్మమ్మగారు మంత్రి ప్రగడ వరలక్ష్మమ్మ గారు మొదలైన దక్షులైన కార్య నిర్వాహక వర్గంతో శ్రీమతి సత్యవతమ్మగారు, అనేకమందియొక్క సానుభూతి సహకారాలతో విరాళాలు వసూలుచేసి, స్థలంకొని మూడు భవనాలు నిర్మించి, ఇప్పటికి, మిక్కిలి ఉపయోగంగా ఉన్న, ఒక పెద్ద లైబ్రరి, ఒక సంస్కృత ప్రాథమిక పాఠశాల, ఒక బేసిక్ విద్యాకేంద్రం, రాట్నె పరిశ్రమ, హిందీ, సంగీతం, నాట్యం కలిగిన ఒక చక్కని బాలికా జాతీయ విద్యాలయం చేశారు.

ఈ సంస్థయొక్క గ్రంథాలయానికి, సంస్కృత పాఠశాలకు, బేసిక్ విద్యాకేంద్రానికి ప్రభుత్వంవారు సాలీనా గ్రాంటులు ఇస్తున్నారన్న విషయం సంస్థయొక్క ఉత్తమత్వాన్ని చాటుతోంది.

ఇప్పటికి పశ్చిమ గోదావరి జిల్లాలో స్త్రీ విద్యకై పాటుపడుతూన్న సంస్థలలో ఇది యొకటి.

—సూ. భా.



నాటక ప్రదర్శనములలో పాల్గొన్న బృందము.

---

(30వ పేజీ తరువాయి)

హృదయ ప్రేరితమైన ఇట్టి కార్యకలాపంవల్ల బిడ్డ అనేక విషయాలను నేర్చుకొంటుంది. అనగా! ఆకులు పువ్వులు, పక్షులు, కీటకాదులయొక్క వివిధ రంగులను, ఆకారములను వీక్షించటం, పోల్చుకోటం, గ్రహించటం మొదలగు శక్తులు అలవడుతవి. పశు పక్షి మృగాల ప్రవర్తన మొదలగువాటితో పరిచయం కలుగుతుంది. దైహికంగాచూస్తే బిడ్డకు బలం, నేర్పు మున్నగునవి అలవడుతవి. నడవటం, వంగి పువ్వుల నేర్పరచటం, గొయ్యి త్రవ్వటం మున్నగు పనులవల్ల, బిడ్డ శుభ్రమైన గాలిని పీల్చుకొని తత్ఫలితంగ తిన్న తిండిని చక్కగ జీర్ణం చేసుకొంటుంది. దేహానికి బలం చేకూరుటేగాక అంగ సౌష్ఠవం ఏర్పడుతుంది.



# కాశ్మీరపు లక్క పని

కాశ్మీరపు లక్క వస్తు పరిశ్రమ లోకప్రసిద్ధము. ఇంక కొన్ని యితర పరిశ్రమలవలె, యీ పరిశ్రమకూడ కుటీర పరిశ్రమే. ఆ లక్క వస్తువులు అమ్మకానికి ప్రదర్శిస్తే, అది ఒక లలిత కళా ప్రదర్శనవుతుంది. కాశ్మీర దేశపు పుష్పాలులా వివిధ వర్ణాలతో ఆ వస్తువులు తళ తళ లాడిపోతూ వుంటాయి. వానికి వేసే రంగులు వుపయోగించే నూనెలు కాశ్మీరదేశంలో తయారైనవే. కాని యీ మధ్య విదేశాలనుండి చవకని చెప్పి నూనెలు, రంగులు తెప్పించి వుపయోగిస్తున్నారు. కాని ఆ విదేశపు సరకుల్లో ధాతువు లేదు. కాంతి లేదు. కాబట్టి నిజమైన కళాప్రియులు దేశీయ వస్తువులతో తయారైన లక్క సామానులే కావాలని పట్టుబడుతున్నారు.

ఈ లక్క వస్తువులని ఒక విధమైన కాగితపు గుజ్జుతోకాని కర్రతోకాని విన్యసిస్తారు. కాగితపు గుజ్జుతో తయారుచేసినవి ఖరీదెక్కువ. మొదట మామూలు కాగితపు గుజ్జు తయారుచేసి ఆ గుజ్జుతో పట్టు పురుగుల గుజ్జు ఇంకా కొన్ని జిగురు సామానులు కలిపి వస్తువులను తయారుచేసే గుజ్జు తయారుచేసిస్తారు. ఆ గుజ్జుతో కావలసిన వస్తువును పోతపోస్తారు. ఆరిన తరువాత గవ్వ మెరుగు పెట్టి నునుపు చేస్తారు. అప్పుడు దానిమీద లక్క రంగులతో చిత్రకారుడు తన నైపుణ్యము కళా వైదగ్ధ్యమూ వుపయోగించి సౌందర్య పూర్ణమైన వస్తువును తయారు చేస్తారు.

పూర్వకాలంలో కాశ్మీర దేశంలో నాగరికులైన పెద్దలు కలందాను (కుంచలపెట్టె) నొకటిని తమ శాశీ కోకలలో దోపుకొని తిరుగుతూ వుండేవారు. ఈ కలందానుపెట్టె అతి తేలికయై చక్కని లక్క రంగుపని తనం కలది. ఈ కలందానంలో చిన్న సీసాబుడ్డి రెండు మూడు కుంచెలు, ఒక కాగితపు చుట్ట వుండేది. దాని అందము, పనితనాన్నిబట్టి అది ధరించిన మనుష్యుడు గొప్పవాడో చిన్నవాడో తెలుసుకునేవారట. జనానాలో స్త్రీలు తమ బొట్టు పెట్టెలను, నగల పెట్టెలను, యిలాంటి లక్క సామానులనే చేసుకునేవారు. ఈ రోజుల్లో అనేక రకాలైన లక్క సామాన్లు తయారు చేస్తున్నారు. కలాలు పెట్టుకునే స్టేండులు, కాగితాలు కోసుకునే కత్తులు, అద్దుడు పేపరు ఒత్తుడ్లు, పెట్టెలు, పువ్వు కలశములు, ఫ్రేములు, కుంకుమభరిణలు మొదలైన అనేకమైన వస్తువులు యీ రకంగా లక్క పరిశ్రమ వస్తువులుగా చేస్తున్నారు. అనేక కొత్త కొత్తైన రూపాలు సృష్టిస్తున్నారు. ఈ రంగులలో కూడ చిత్రచిత్రమైన కలియకలతో లతాభంగిమలతో సౌందర్యం వుట్టిపడ చేస్తున్నారు. కళాకారుడు కర్రతో చేసిన సామానులు పైన కన్న కాగితపు గుజ్జుతో చేసిన సామానుపైనే తన కౌశల్యము చాలా బాగచూపగలడు.

ఇంత పనితన మున్నది గనుకనే కాగితపు గుజ్జుతో చేసిన లక్క సామానులు చాల మూల్యము కలిగి వుంటయి. కాబట్టి చవకగా యీ అందమైన వస్తువులు కావాలని కోరె వారికోసం కర్రతో సామానులు చెక్కి లక్క రంగు వేస్తున్నారు. ఎంతైనా యీ కాగితపు గుజ్జు సామానులకు కర్రతో చేసిన సామానులు అందంలోను, కాంతిలోను, తులతూగలేవు.

పువ్వులు పెట్టుకునే ఇత్తడి కలశాలకు కూడా కాగితపు గుజ్జు పూసి లక్క వస్తువులవలెనే తయారుచేసున్నారు ఇవి నీరూ నిలుస్తాయి, లక్క వస్తువుల అందమూ కలిగివుంటాయి.

(బొమ్మకు లోపలి అట్ట చూడండి.)



P. B. I.

తెలుగులో వలెనే హిందీలో కూడ వచనములు రెండు:—

(1) ఏక వచనము. (2) బహువచనము.

(1) ఆకారాంత పుంలింగ శబ్దములు తప్ప యితర పుంలింగ శబ్దములు ఏవియును బహు వచనమునందు మార్పు చెందవు.

ఉదా:—**घर** ఇల్లు **घर** ఇండ్లు.
**बादल** మేఘము **बादल** మేఘములు.

సూచన.—ఇట్టి స్థితిలో శబ్దము యొక్క వచనము క్రియను బట్టిగాని, శబ్దము యొక్క విశేషణము మును బట్టి గాని తెలిసికొననగును

(2) **आ** కారాంత పుంలింగ ఏకవచన శబ్దముల కడపటి '**आ**' ను '**ए**' గా మార్చిన బహువచనములగును.

ఉదా:—**लड़का** బాలుడు **लड़के** బాలురు.

(3) హలంతములగు స్త్రీలింగ ఏకవచన శబ్దములకు అనునాసిక ఏత్వము చేర్చిన బహు వచనములగును.

ఉదా:—**आँख** కన్ను. **आँखें** కండ్లు
**बात** మాట. **बातें** మాటలు.

(4) '**इ**' కారాంతములగు స్త్రీలింగ ఏకవచన శబ్దములకు చివర **याँ** కూర్చిన బహు వచనములగును.

ఉదా:—**तिथि** తిథి. **तिथियाँ** తిధులు.

(5) '**ई**' కారాంత స్త్రీలింగ ఏకవచన శబ్దముల కడపట '**ई**' ని '**इ**' చేసి, పిదప **याँ** చేర్చిన బహువచనములగును.

ఉదా:—**लड़की** బాలిక. **लड़कियाँ** బాలికలు.

(6) అచ్చులు కడపటగల స్త్రీలింగ ఏకవచన శబ్దముల కన్నిటికిని **एँ** గాని **यें** గాని చేర్చిన బహువచనములగును.

ఉదా :—**दवा** మందు **दवाएँ, दवायें** మందులు.

**वस्तु** వస్తువు **वस्तुएँ, वस्तुयें** వస్తువులు.

**(अ)** పుంలింగముగాని, స్త్రీలింగముగాని అగు ఏ నామవాచకమునకైనను బహువచనములో విభక్తి ప్రత్యయము చేర్చవలసినచో ఏక వచన రూపమునకు **ओं** చేర్చి, పిదప విభక్తి ప్రత్యయము చేర్చవలెను.

ఉదా :—(1) **घर** ఇల్లు. **घरों में** ఇండ్లలో
(2) **लड़का** బాలుడు **लड़कों का** బాలుర యొక్క
(3) **पुस्तक** పుస్తకము **पुस्तकों से** పుస్తకములనుండి.

**(आ)** '**इ**' కార '**ई**' కారాంతములగు నామవాచక శబ్దములకు బహువచనములో ప్రత్యయము చేర్చవలసినచో '**ओं**' కు బదులు **यों** చేర్చవలెను

ఉదా :—**स्त्री - स्त्रियों से** స్త్రీలతో (**ई** కారాంతమైనచో, చివరి **ई** కారమును **इ** గా మార్చి, పిదప **यों** చేర్చవలెను.)

**हम, तुम, आप, वे, ये** ఇవి ఏక వచనములుగ (ఒకరిని గూర్చి మాట్లాడునపుడు) గూడ వాడబడును. పలువురిని గూర్చి మాట్లాడునపుడు వానికి '**लोग**' అను పదము చేర్చవలెను.

సంభాషణలో '**मैं**' కి బదులు '**हम**' ఉపయోగించుట హిందీలోని విశేషము.

## పాఠము 8.

### విశేషణములు.

| | | | |
|---|---|---|---|
| **अच्छा** మంచి | **बुरा, खराब** చెడ్డ | **सफ़ेद, गोरा** తెల్లని | **काला** నల్లని |
| **बड़ा** పెద్ద | **छोटा** చిన్న | **साफ़** శుభ్రమైన | **गंदा, मैला** మురికియైన |
| **मोटा** లావైన | **दुबला, पतला** సన్నని | **आसान** సులభమైన | **कठिन, मुश्किल** కష్టమైన |
| **लंबा** పొడవైన | **चौड़ा** వెడల్పైన | **हलका** తేలికయైన | **भारी** బరువైన |
| **मीठा** తీయని | **कड़ुआ** చేదైన | **ख़ूबसूरत, सुंदर** అందమైన | **बदसूरत** కురూపియైన |
| **ऊँचा** ఎత్తైన | **नीचा** తగ్గైన | **पक्का** పండిన, పక్వమైన | **कच्चा** పండని |

## వి శే ష ణ ము లు

| | | | |
|---|---|---|---|
| **ठीक** సరియైన | | **सस्ता** చౌకయైన | **महँगा** ప్రియమైన |
| **हरा** పచ్చని | **पीला** పసుపు పచ్చని | **ठंड़ा** చల్లని | **गरम** వేడియైన |
| **लाल** ఎఱ్ఱని | **नीला** నీలిరంగైన | **थोड़ा** కొంచెము | **बहुत, ज़्यादा** ఎక్కువ. |

'అ' కారాంతములగు పుంలింగ విశేషణములు కడపటి '**आ**' కారమును '**ए**' గా మార్చిన బహువచనములుగను, **ई** గా మార్చిన స్త్రీ లింగములుగను అగును ఆకారాంత విశేణము యొక్క రూపము నామవాచకము యొక్క లింగ, వచనములనను సరించి మారుచుండును.

విశేషణము హలంతమైనచో దాని రూపమందెట్టి మార్పురాదు.

ఉదా :—**अच्छा लड़का** మంచిబాలుడు (**लड़का** - పుంలింగము, ఏకవచనము
**अच्छा** - పుంలింగము, ఏకవచనము)

**अच्छे लड़के** మంచి బాలురు (**लड़के** పుంలింగము, బహువచనము)
(**अच्छे** పుంలింగము, బహువచనము)

**अच्छी लड़की** మంచి బాలిక (**लड़की** - స్త్రీలింగము, ఏకవచనము)

**अच्छी लड़कियाँ** మంచి బాలికలు (**लड़कियाँ** స్త్రీలింగము, బహువచనము)
(**अच्छी** స్త్రీలింగము ; ఏకవచనము, బహువచనము)

**गरम पानी** వేడి నీరు (**पानी** - పుంలింగము)

**गरम चाय** వేడియైన తేనీరు (**चाय** - స్త్రీలింగము)

**ठंड़ा पानी** చల్లని నీరు

**ठंड़ी हवा** చల్లనిగాలి (**हवा** - గాలి ; స్త్రీలింగము)

| | |
|---|---|
| **मैं मीठा फल खाता हूँ ।** | నేను తియ్యని పండు తినుచున్నాను. |
| **मैं मीठे फल खाता हूँ ।** | నేను తియ్యని పండ్లు తినుచున్నాను. |
| **यह फल कड़ुआ है ।** | ఈ పండు చేదుగానున్నది. |
| **वे पेड़ ऊँचे हैं ।** | ఆ చెట్లు యెత్తుగా నున్నవి. |
| **कलकत्ता बड़ा शहर है ।** | కలకత్తా పెద్ద పట్టణము. |
| **(तुम) थोड़ा पानी लाओ ।** | మీరు కొంచెము నీరు తీసికొని రండు. |
| **वह अच्छी हिन्दी लिखती है ।** | ఆమె మంచి హిందీ వ్రాయుచున్నది. |
| **यह कमरा चौड़ा नहीं है ।** | ఈ గది వెడల్పు లేదు. |

## విశేషణములు

| | |
|---|---|
| यह कुर्सी छोटी है। | ఈ కుర్చీ చిన్నది. |
| यह छोटी घड़ी ठीक चलती है। | ఈ చిన్న గడియారము బాగానడచుచున్నది (ప<br>చేయుచున్నది). |
| यह गाय काली है। | ఈ ఆవు నల్లగా నున్నది. |
| वह क़लम सस्ती है। | ఆ కలము చౌకగా నున్నది |
| हिमालय ऊँचा पहाड़ है। | హిమాలయము యెత్తైన పర్వతము. |
| धवलगिरी ऊँची चोटी है। | ధవళగిరి యెత్తైన శిఖరము. |

**फल** పండు. (పుంలింగము ఏకవచన, బహువచనములు)

**पेड़** చెట్టు. (పుంలింగము ఏకవచన, బహువచనములు)

**शहर** నగరము ; పట్టణము. (పుంలింగము ; ఏకవచన, బహువచనములు)

**पानी** నీరు. (పుంలింగము, ఏకవచనము)

**हिन्दी** హిందీ (స్త్రీలింగము) (అన్ని భాషల పేర్లు స్త్రీలింగములు)

**कमरा** గది. (పుంలింగము ; ఏకవచనము ; **कमरे** బహువచనము)

**कुर्सी** కుర్చీ. (స్త్రీలింగము ; ఏకవచనము. **कुर्सियाँ** బహువచనము)

**घड़ी** గడియారము. (స్త్రీలింగము ; ఏకవచనము. **घड़ियाँ** బహువచనము)

**गाय** ఆవు. (స్త్రీలింగము ; ఏకవచనము. **गायें** బహువచనము)

**क़लम** కలము. (స్త్రీలింగము ; ఏకవచనము. **क़लमें** బహువచనము)

**पहाड़** పర్వతము. (పుంలింగము ; ఏకవచన, బహువచనములు)

**चोटी** శిఖరము ; శిగ. (స్త్రీలింగము ; ఏకవచనము. **चोटियाँ** బహువచనము)



సీరియల్ నాటిక

# భక్తిలీల

శ్రీ లాకి శ్రీనివాసరావు

[ప్రదేశము : మార్గము. ప్రవేశము : మధుసూదనుడు విగ్రహాములతో]

మధు : కం॥ లభియించెన్ త్రైనాధుల
శుభ మూర్తులు నాదు చిత్త । మూనంబులచె
విభవంబు మీఱ సతతము
నభిషేకము జేసి మదిని । యానందింతున్.

గాండ్లవాడు : (ప్రవేశించి) స్వామీ! రక్షించండి! రక్షించండి! నా నేరాన్ని క్షమించండి!

మధు : ఏమి నేరమును జేసితివి?

గాండ్ల : బాబూ! తమరు భక్తులని మహాత్ములని తెలియక తమదగ్గర కానీ తీసుకొని గిద్ద తిరుగ వేసి నూనెను తప్పు కొలత కొలిచి యిచ్చాను.

మధు : అయిన నేమందువు? ఆ తైలము స్వాములవారికి దీపారాధన జరిగినదె.

గాండ్ల : (వణుకుచున్న చేయిని జూపి) అప్పటినుంచి యీచెయ్యి యిలా వణుకుతూ నొప్పి పెట్టుతుంది. ఈ చెయ్యితో ఏకార్యమూ చేయలేను.—అబ్బా! బాధ! బాధ! రక్షించండి! రక్షించండి!

మధు : ఓయీ! నీవు అన్యాయము జేసితివి. ఇకముందెట్టి అన్యాయము జేయనని శపథముజేసి శ్రీ త్రినాథ స్వాముల వ్రతము జేయుదునని మ్రొక్కి వారి వ్రతమును జేయుము. నీచేయి బాగుపడి ధన ధాన్యాది భాగ్య భోగములతో దులదూగి మోక్షమును బొందెదవు.

గాండ్ల : స్వామీ! శ్రీ స్వాముల వారికే గాక ఎవరికైనా అన్యాయముగా తప్పు కొలతలు కొలిచి నూనెను అమ్మను. మరిన్ని నియమితమైన లాభంతో న్యాయమైన వర్తకం చేస్తాను. అన్యాయపు వర్తకం యింకా చేయనని స్వాములవారి ఎదుట ప్రమాణం చేస్తూన్నాను. తప్పక శ్రీ త్రినాధులవారి వ్రతాలు మూడింటిని చేస్తాను. (మ్రొక్కగా భాధతగ్గి చేయి బాగుపడును) ఆహా! ఆహా! ఎట్టి మహత్తు! నాచెయ్యినొప్పి వదలి బాగుపడింది. జాయ్! త్రినాథస్వాముల వారికి జాయ్!

మూడు మూర్తులు । మూడు రంగులు
మూడు గుణములు దాల్చినా—ఓ!—
ము మ్మూర్తు లారా!
మోక్ష మిచ్చి నన్ను గావండీ!
ముక్తి నొసగీ నన్ను గావండీ!

గురువర్యా! నమస్కారము. నేను తరించడానికి మార్గం ఉపదేశించారు. ధన్యుణ్ణి! ధన్యుణ్ణి!

మధు : బిడ్డా! ఇంటికి బోయి మీ వధూవరులు నా కుటీరమునకు రండు. వ్రతవిధానముం దెలియజేసి వ్రతమును జేయింతును.

గాండ్ల : చిత్తము, స్వామీ! అలాగే వచ్చెదము.

మధు : ఇంక బొమ్ము. (నిష్క్రమింతురు)

(తెర వ్రాలును)

## ఎనిమిదవ రంగము.

[ప్రదేశము : మధుసూదనుని కుటీరము కడనున్న వటవృక్షము. ప్రవేశము : మధుసూదనుడు విగ్రహములతో నా మఱ్ఱిక్రింద నిలచును]

మధు :—

తే॥ గీ॥ సర్వమును నిల్ప బెంపగ । సంహరింప
మూడు గుణములు దాలిచి । వేడు కలర
మూడు రూపుల వెలయు ము । మ్మూర్తులార!
మిమ్ము బూజించు నట్టి భాగ్య । మ్మొకలిగె.

శాంత : (ప్రవేసించి ఆతురతతో) ఈ ప్రతిమలెక్కడివి?

మధు : అవును వెదుక బోవు చుండ త్రోవలో నొక మహా పురుషుడు శ్రీ త్రినాధస్వాముల వారి వ్రతంబు జేయించెను. ఆ వ్రత మంటప మందవతరించిన త్రిమూర్తులు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. వీరిని మఱ్ఱి నీడనే బ్రతిష్ఠింపుడని ఆ మహాభాగుడు సెలవిచ్చె.

శాంత : ఆహా! అహా! ఏమి నాభాగ్యము. శ్రీ త్రినాధుల సేవా ఫలము లభించునది. (విగ్రహముల బ్రతిష్ఠించుటకు స్థలమును శుభ్రపరచి మధుసూదనుని శిరమునుండి విగ్రహములను దించి ప్రతిష్ఠించును) తండ్రులారా! మమ్ము రక్షింప నేతెంచితిరా! మిమ్మి మఱ్ఱి నీడనే బ్రతిష్ఠించుచున్నాను. దయగనుడు.

మధు : శాంతా! శీఘ్రముగ స్వాముల కాతిధ్యముగొని రమ్ము (శాంత పోవును) ఆహా! ఏమి నాభాగ్యము.

తే॥ గీ॥ పూచె పున్నెము, చక్కగా । గాచె తపము,
పండె భాగ్యము, నా మది । నిండె శాంతి,
జన్మ తరియించె మీదు భ । జనము దొరకె
కరము మోడిచి ధ్యానింతు । కరుణ గనుడు.

శాంత : (ఆతిథ్యములో బ్రవేసించి) స్వాములారా! నా యాతిధ్యమును స్వీకరింపుడు. తండ్రులారా! ఆకలి గొని యున్నారు. ఈ ఫలముల నారగింపుడు. ఈ స్వర్ణ భద్రా నదీ జలముల ద్రావి దాహశాంతిని బొందుడు. ఈపుష్పములే అలంకారములు. అలసితిరి, వీవనతో విసరెద. ఎండ బడలిక దీర్చుకొనుడు. ఆహా! నేను నిరు పేదను. మీకేమి యాతిధ్యము నీయగలను? దయామయులారా! (ధ్యానించును. మధుసూదనుడును ధ్యానించును)

ఆ॥ వె॥ నాదు తండ్రులార! । నాదు దేవత లారా!
ఏమి యీయ జాల । నేను పేద,
నాదు చేతు లెత్తి । నా మనంబు నిలిపి
తృటియె ధ్యాన మిడుదు । తృప్తి గనుడు.

(అనంతరము భర్తతో) స్వాముల ప్రసాదమును దీసి కొనుడు (ఈయగా)

మధు : పరమ భాగ్యము. (అంగికొనును. పిమ్మట నా దంపతులు ప్రసాదమును భుజించు చుం అప్రాంతమున ఆవు "అంబా! అంబా!" యని అరచుచుండ నాశ్చర్యముగా) శాంతం! శాంతం! అదుగో! అదుగో! మనయావు అరచుచు నిటే వచ్చుచున్నది.

శాంత : ఆనంద మానందము. మనయావు తనంతట తాను వచ్చుట శ్రీ స్వాముల వారి అపారకరుణా కటాక్షము చేతనే గదా! (ఆవు అంబాయని యరచుచుండ) దా! దా! అంబా! దా! (భర్తతో) ఆవును గట్టి పాలను దీసి స్వాముల కర్పింతము రండు. (నిష్క్రమింతురు)

(తెర వ్రాలును.)

## తొమ్మిదవ రంగము.

[ప్రదేశము : శ్రీపురమందలి ఆచార్యుని గృహము.

[ప్రవేశము : ఆచార్యుడు విచారమున.]

ఆచార్యుడు : ప్రతిమనిషీ మధుసూదనుడి దగ్గరకే పోతే నావద్దకు వచ్చేవాడెవడు? శ్రీపురానికి ఆచార్యుల వారని ఒకడికేనా భయభక్తులు లేవే! అంతా వాడి కుటీరానికే పోయి ఆ పాడు ముండా వాణ్ణే గౌరవిస్తూన్నారే! నాకేసి ఒకరూ చూడరే! అంచాత నాకు చాలా అవమానం కలుగుతూంది. ఏదో ఓ పన్నాగం పన్నాలని ఉంది. లేకుంటే వీడు నాకన్నా గొప్పవాడు

అవుతాడు! ఏదో ఓ యెత్తువేసి రెడ్డికి పురిగొలిపి ఆ త్రినాథ వ్రతాన్ని మానిపించాలిసి వుండి. దానిచేతనే వాడికంతగా గౌరవం కలుగుతూంది. నేను మాత్రం సహించలేను.

సీ॥ ఒక్కడు నాకన్న । నెక్కువ సంపద
　　　లొందిన నే జూచి । యోర్వలేను ;
　ఒక్కడు నాకన్న । నెక్కువ పాండి త్య
　　　మొందిన నే జూచి । యోర్వ లేను ;
　ఒక్కడు నాకన్న । నెక్కువ ప్రఖ్యాతి
　　　నొందిన నే జూచి । యోర్వ లేను.
　ఒక్కడు నాకన్న । నెక్కువ గౌరవం
　　　బొందిన నే జూచి । యోర్వ లేను.

తే॥ గీ॥ శ్రీపురా చార్య వర్యుడు । శ్రేష్ఠు డనగ
　దిశల యందున బ్రఖ్యాతి । దేలి యాడ
　జనులు భయ భక్తులను గాంచి । వినయముగను
　మెలగ వలె గాదె యాజ్ఞల । దలను దాల్చి.

(నిష్క్రమించును)
(తెర వ్రాలును.)

## పదియవ రంగము.

[ప్రదేశము : శ్రీపుర పట్టణమందలి జమీం దారు రామిరెడ్డి గృహము.

ప్రవేశము : రామిరెడ్డి విచారముతో]

రెడ్డి : జమీందారుడ ననియైన యోచించినది కాదే! ఆహా! రెడ్డిగారి ప్రతాపమును గ్రుడ్డిజేసి గడ్డిపరక కన్న హీన ముగా జూచినదే!—ఒక బ్రాహ్మణస్త్రీ—అందున అశక్తురాలు—అన్నమునకు వాచినది నన్నింత తేలికగా జూచునా!—ఓసి శాంతా! ఆ మధుసూదనునితో నీ వేమి సుఖముల ననుభవించగలవే! నా ధనమూ నా ప్రతాపము లేశమాత్ర మాలోచింపకుంటివే! ఆ రోజు, ఆ యడవిని గనుక తప్పించుకొన గలిగితివి. ఆ మూడు పొదు పులులు రానియెడల నాడు నా ప్రతాపమును దెలిసియే యుందువు.—నేనెన్ని వార్తలు బంపినను తిరస్కారమును జేయుచునేయున్నావు. ఎన్ని కానుకలు బంపినను నాముఖముః బారవేయించు చున్నావు. నిన్నేమి చేయుదునో చూడుము. నిన్నే కఠినముగా దండించకున్న యీ రెడ్డి జమీందారుని జీవిత మెందులకు? అంత కండ్ల కావరమా! అంత మర్యాదా హీనమా!

ఆచార్యుడు : (ప్రవేసించును)

రెడ్డి : ఆచార్యుల వారికి నమస్కరించు చున్నాడను.

ఆచా : శుభం! మంగళాని భవంతు.

రెడ్డి : ఆచార్యుల వారి రాకవలన ధన్యుడను.

ఆచా : రెడ్డీ! నన్ను పితృసమానంగా చూస్తూ గౌరవిస్తూంటావు. నాకదే యానందం.

రెడ్డి : మీరు నా పితృసమానులు గారా! నాగురువులు, నా మేలు గోరు చుండెదరు.

ఆచా : ఇప్పుడు నీమేలు కోరాలిసే వచ్చా! మన శ్రీపురంలో ప్రజలంతా శ్రీ మంతులై ధన ధాన్యాలలో తుల దూగుచున్నారు.

రెడ్డి : అందువలన మనకు సంతోషమే గదా!

ఆచా : రెడ్డిగారి కంటే ప్రజలు వెయ్యి రెట్లు ధనవంతులై యుంటే రెడ్డిగారి గొప్పతన మేముంటుందీ?—

రెడ్డి : ఏమేమి! రెడ్డిగారి ఘనతయే లేదా?

ఆచా : ఇంకా రెడ్డిగారి అధికారం క్రింద ఓ పురుగైనా మెలగుతుందీ? వెఱ్ఱివాడా!

రెడ్డి : మీ మాటలకు నాకు నవ్వు వచ్చుచున్నది. రెడ్డిగారి ప్రతాపమునకు గాని, కీర్తిప్రతిష్ఠలకు గాని, అధికారము గాని, ధనమునకు గాని శ్రీపురము నందెదురాగలవాడెవడు? అట్టివానికి ప్రాణముల పై నాసలేదా?

ఆచా : వీరూ వారూ అనట మెందుకు? ఎవరుబడితే వారే గొప్పవారుగా నుంటే ఇంకా నిద్రపోతున్నావూ!

రెడ్డి : నా యాజ్ఞలోను నా యధికారములోను గల ప్రజలు నాకన్న అధికు లెట్లు కాగలరు?

ఆచా: శాంతనీ మధుసూదనుణ్ణీ ఎరుగుదువు గదా?

రెడ్డి: (చకితుడై) ఆ!—శాంత, మధుసూదనం—అహా?

ఆచా: వాళ్ళ కుటీరం దగ్గర త్రినాధులని మూడు రాతి విగ్రహాలు పెట్టి ప్రజలచే త్రినాధ వ్రతమని ఓ వ్రతంచేయిస్తూన్నారు. ఆవ్రతం చేసిన వారంతా చెప్పలే నటువంటి భాగ్య వంతు లవుతున్నారు. అంచాత దాన్ని మాన్పిస్తే గాని నీవు చాలా యిక్కట్లు పాలవుతావు—అంతా ధనవంతులైతే నీమాట నెవరైనా మన్నిస్తారు?

రెడ్డి: వ్రతము, గితము; ఎవరా వ్రతముజేసి నాకన్న గొప్ప వార లయ్యెదరు? నేటినుండి ఆవ్రతము చేసినవారిని చెట్టునకు గట్టించి చీలలు వేయించి కాళ్లు చేతులు నరికించి చిత్ర వధలు చేయింతును. ఇది నా కఠినమైన ఆనుజ్ఞ. దీనిని ప్రజలందరూ శిరసావహించి పాటించవలెను.

ఆచా: సెబాస్! సెబాస్! అలా కాకుంటే ప్రజల్లో నీ యాగడం విడవదు. ఆ శాంతా మధుసూధనులే దీనికి కారణం.

రెడ్డి: (ఆగ్రహమున) శాంతా —మధుసూదనం—వారికి రెడ్డిగారి ప్రతాపము దెలియకున్నది. ఇంక దెలియజేయగలను.

ఆచా: నీ భయం కొంచెమైని ఉన్నట్లు లేదు. ఉంటే అలా చేస్తారూ?

రెడ్డి: నిజము ఆచార్యా! నిజము. వారికి నాకడ లేశమైనను భయములేదు. నే నెరుంగుదును. మంచి సలహా నొసంగితిరి. వారికి దగిన ప్రాయశ్చిత్తము జేయవలసి యున్నది.

ఆచా: ఆ విగ్రహాల్ని ఊడ పెరికించి పారవేయించితేనే తప్ప ఆ దుండగం అణగదు.

రెడ్డి: ఆచార్యా! తండ్రితో సమానులగు తమతో నా మనస్సు నందలి విషయములు తెలియజేయుటకు సంకోచ పడను—ఆ—శాంతను—మన సార—ప్రేమించి యున్నాను.

ఆచా: బలే! నీలాంటి వాని ప్రేమయే కలిగి యుంటే దాని కేం కావాలీ! ఇంకా స్వర్గానికి పోవాలి అది.

రెడ్డి: ఏమి లాభము? నన్ను తిరస్కారి భావమున జూచుచున్నది.

ఆచా: ఏమీ?—ఏమీ?—నిన్ను తిరస్కారంగా చూస్తూ వుందీ?—నిన్నే?—నిన్నే?—ఆహా! ఎంత ధైర్యం వహించిందీ?

రెడ్డి: నేను దాని భోగములనే పొందకున్న యీ ప్రాణము లేల? ఈ విభవములేల? ఈ శ్రీపురమేల?

ఆచా: అయ్యో! అయ్యో! అంతపని యెందులకూ? చిటికెలో అది నీపాదాల చెంతకు రాదూ!—చూడూ! వారు నీ శాసనాన్ని పాటించి ఆవ్రతాన్ని విడవలేరు. అప్పుడు దండనకు చిక్కుతారు. అందుపై జరుగ వలసిన కథంతా జరుగుతుంది?

రెడ్డి: సరే, ఇంక మీరు పొండు. వారి నేరములను గుర్తించి నాకు దెలియ జేయుడు—సమయమును నిరీక్షింపు చుండుడు—తక్షణమే నాశాసనమును ప్రకటన జేయించెదను.

ఆచా: నే వెళ్లుచున్నాను. చిటికెలో వారిని తీసుకరానా! (నిష్క్రమించును)

(తెర వ్రాలును.)



# అందము చందము

"అందము చందము" అను నీ రెండు పదములను జన సామ్యము, ఒకే అర్థమున వాడుచుందురు. కాని బాగుగా యోచించి చూచిన యీ రెండిటికిని భేదము లేక పోలేదు. అందమనునది, యింద్రియానుభవము. ఆకర్షణీయమైన వ్యక్తిగాని, ప్రకృతి రామణీయకముగాని నేత్రానందమును గొల్పును. సౌందర్యమైన వస్తువు సంతతము యానందదాయక మగునని, ఆంగ్లకవి (కీట్సు) నుడివెను. అట్లే శ్రుతి సుఖమైన వాయిద్యము, గానము, చిత్రము, శిల్పము, నాట్యము, పానీయము, వేర్వేరు ఇంద్రియములకు ఆనందమును జేకూర్చును. అందుచే యింద్రియములయొక్క ఆనందానుభవమే 'అందము' అనుపదము వ్యక్తపఱచును.

ఇక చందము కేవల యింద్రియానుభవమేకాక కళగూడ నిమిడియున్నది. మన అలంకారికులు చెప్పిన అరువది నాలుగు కళలలోను అందమునకంటె చందమునకే యెక్కువ ప్రాధాన్య మగుపడుచున్నది. చందము లేనిదే అందము హృదయానంద జనకము కానేరదు. చందమను పదమునకు సామాన్య అర్థము 'రీతి' మనము వ్యవహారములో 'అతడే చందమున పోయెను' అనుటలో 'అతడే రీతిగా పోయెను' అను అర్థమున వాడుచున్నాము. ఇచ్చట 'చందమను' మాటకు అర్థ మదికాదు. దీనికి "సౌష్టవము" అని చెప్పనగును. (దానినే ఆంగ్లభాషలో "ఎలిగెన్సు ఆఫ్ ఫారమ్" అని వ్యవహరించుచుందురు.) చంద మనునది ప్రతి కళలోను కానగును. అది లేనిచో అందము సంపూర్ణము కాదు. శోభిల్లదు. బాహ్యసుందర విగ్రహముతోపాటు, మనోమాలిన్యములు లేక, పరిపూర్ణ ప్రేమ, సుగుణముల కాలవాలమైన యాత్మ సౌందర్యము యొక తేజోవంతమైన జ్యోతివలె ప్రకాశించును. అందుచే చంద మనునది అందమునకు తోడ్పడి హృదయానందము గొల్పునని యనవచ్చు.

మానవ జీవిత రహస్యము, అంద చందంబుల సమ్మేళనమే యననగును. ప్రతి దిన చర్యలోను, మానవునకు, ఆనందమును చేకూర్చునవి యీ రెండే. తాను ధరించు వస్త్రములు, ఆభరణములు, తీర్చి దిద్దుకొను కురులు, కుడుచు ఆహారాదులు, గృహోపకరణములు, పలుకు మాటలు, నడుచు నడక, వీని యన్నింటియందును యొక రకమైన రీతితోగూడిన అందము కావలెనని ప్రయత్నించు చుండును. తానుపయోగించు వస్తువులలో గల అందమునకు, తన బుద్ధి చాతుర్యముచే, చందమును మేళవించి, వాని రెండిటి సమ్మేళనమున, హృదయ ప్రకాశితమైన ఆనందమును అనుభవించును. అందచందంబులు గల స్త్రీ మోము ప్రకాశిత సుందరమై, ఆకర్షణీయముగ నుండును. కన్నులు కళ కాంతులు వెదజల్లుచు. కేవలము కలువ రేకులవలె లేకున్నను, మానవుని తరింపజేయు సౌజన్యం, ఆ కన్నులకు ప్రకాశితమైన అందము నిచ్చును.

'వదనము, హృదయ ప్రతిబింబము,' అను ఆర్యోక్తి నిజము. పరమ పవిత్రుడైన బాపూజీ 'బోసినవ్వు' లోకమునంతను నాకర్షింపలేదా? తేజోవంతమైన మహాత్ముని వ్యక్తిత్వము, మన కళ్లకు మఱుగైనను, ఆ సౌందర్య ప్రతిమ ప్రతి భారతీయుని మనమున ముద్రితముకదా! అట్టి మహిమయే అంపచందంబుల సమ్మేళనము. మన భారత దేశమున, మహర్షుల వచనములును, గ్రంథ రాజములును, యిట్టి సౌందర్యమునే పొగడిరి. దీని శక్తిని గ్రహించి, యెక్కొక్క రెన్నో రచనలు, సూక్తులు వ్రాసిరి. ముక్తికి, భక్తికి, శక్తికి నిలయమగునది యంద చందములతో గూడిన సౌందర్యము. పూర్వము సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి, అరుంధతి మొదలగు సతీమణులు, ఆరాధ్య దేవులైన, మహాశక్తి స్వరూపిణిలు కారా? అందమునకు వన్నె నిచ్చువారి శీలాది రీతులు, వారిని యీ కాలముననూ, ఆదర్శనీయులుగా జేసెననుట నిక్కువము.

బాగుగా యోచించిచూచిన, అంద చందంబు లనునవి, ప్రకృతియందే మిళితమై యున్నవి. ఉన్నత కళారాధకుడగు భగవంతుని సృష్టియంతయూ నీ రెండిటి సమ్మేళనమే కదా! మానవ సృష్టిలోను, ప్రకృతిలోను యీ శక్తి ప్రతి

శ్రీమతి రత్నాల కమలాబాయి

కవిని, చిత్రకారుని యాకర్షించును. (వీరు ప్రకృతి సౌందర్య పిపాసులు కారె!) తనివితీర యానందమును గ్రోలి, పొంగి, లోకమునకు, కావ్యములును, చిత్రముల నిచ్చినవా రెందరు మహానుభావులు! కేవలము, బాహ్య సౌందర్య మిట్టి యానందమును కలుగజేయ నేరదు. అంద మనునది యింద్రి యానుభవము, క్షణికము, చందమనునది, అందముతో కూడిన, హృదయానంద జనకము. సౌందర్యమే కళ! కళయే సౌందర్యమని, రవీంద్రనాథ కవీశ్వరుడు పల్కెను. యింకను, 'అందమే సత్యము, సత్యమే ప్రేమ, ప్రేమయే పరంజ్యోతి' యని వచించెను. గాన చందమే యవసరము అందమునకు. చందమనునది హృదయానందకర మెట్లగును. అనునది చూతము.

కళలన్నియు, 'అరువదినాలుగు అయినను, అందు కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, నాట్యము, శిల్పము అనునవి, లలిత కళలు. తక్కినవి వ్యావహారిక కళలు. ఇవి యన్నియు హృదయానంద జనకములే అయినను, లలిత కళలయందు అనుభవించు యానందము, తక్కిన వ్యావహారిక కళలలో కానరాదు. కారణమేమన, కళారాధకుడు కళారాధనము, దానివలన కలుగు యానందమున మున్గి, యా యానందములో సృష్టించును. అప్పుడే పద్యమును, చిత్రమును, నాట్యము మొదలగునవి రమించుట. అట్లుకాక, వ్యవహారిక కళలలో ధనమునందెక్కువ దీక్ష వహించుటవల్ల కళయొక్క ఉన్నతాశయములు నిష్ఫలములగు చుండును. లలితకళ లన్నియు, ఆనంద జనకములే. అందు కవిత్వము, సంగీతము శ్రవణానందమును చిత్రలేఖనము, నాట్యము, శిల్పము నేత్రానందమును సమకూర్చును. వీనిలో నేత్రానంద జనకములైనవి చూచుటతోడనే అందమును స్ఫురింపజేయును. కాని వానిని సూక్ష్మ పరిశీలనచేసి వానిలోని ప్రతి భాగమును వస్తువుయొక్క సమగ్ర స్వరూపముతో పోల్చిచూచిన తరువాత మన మనుభవించు ఆనందమే, అందచందముల సమ్మేళనము. అనగా మొదట చూచినది అందము. చందమనునది విమర్శనతో చూచు పరిశీలనము. ఆ రెండును సరిపోయిన తరువాత అనుభవించినది, హృదయానందము. అట్లే కవిత్వము, సంగీతము, వినినంత మాత్రము చేపొందునది శ్రవణానందము. అందలి పద దాంపత్యము, స్వరముల పొందిక మొదలగు కళా విషయములను చర్చించిన పిమ్మట అనుభవించునది యానందము. అదియే అంద చందంబుల కలయిక.

అట్లే వ్యావహారిక కళలకు కట్టడము, వస్త్రము, కుందనపు పని మొదలగువాని యన్నిటిలోను మనము బొందు యానందము అందచందముల కలయికయే. ఒక స్వర్ణకారుడు తయారుచేసిన నగను బాగుగ మెరుగుపెట్టి మనకు చూపునపుడు, ఆ వస్తువు, అతని చేతిలో నుండగా చూచి తొలుతగా అనుభవించునది అందము. తరువాత ఆ నగ సూక్ష్మ పరిశీలన మొనర్చి అందు ప్రతి భాగమును కళాదృష్టితో విమర్శింతుము. అప్పుడు అది హృదయాకర్షణీయమైనచో మనము తొలుతపొందిన అందమునకు చందమను దానిని జోడించి వాగ్రూపములో "యీ నగ చాల అందముగా నున్నదని" ప్రశంసింతుము. అట్లే కవిత్వమున రచనా సౌందర్యమునకు తోడు, అతడు వాడిన పదజాలము పద దాంపత్యము, అర్థగౌరవము, కవితార్థ యుక్తి మొదలగునవి, అందచంద మనబడును. ఇవి యన్నియు పరిశీలించినగాని, నిజమైన యానందము జనింపనేరదు.

అందుచే అనందమనునది యెల్లరును అనుభవింప కలుగునది కాదు. అందమనునది యింద్రియానుభవము గనుక, అది జన సామాన్యము అనుభవింప వచ్చును, కాని కళారహస్యములను గుర్తెరిగి, విమర్శించి, అవ్యాజమైన ఆనంద మొందుట యెల్లరకును సాధ్యముకాదు. అట్లే, మానవజాతి, ముఖ్యముగ స్త్రీజాతి, నవ నాగరికపు రీతుల నవలంబించి విపరీత వేషమున కేవలము తెచ్చిపెట్టుకొన్న ముస్తాబు, అందము నిచ్చునని యెంచక, సుకృత శోభిత స్వాంతముల ప్రజ్వలించు, సహజ లావణ్యత, సుశీలము, ఉదార భావములతో ప్రేమ మిళితమైన, నాడే, అంద చందముల సమ్మేళన యని యెరుగవలెను. అంద చందముల సమ్మేళనయే, జీవిత, రహస్య మనగును. ఇట్టి యాత్మ సౌందర్యము పెంపొందించి, నవ నాగరికతలో పడి మునుగనినాడే భారత సంఘము, దేశము ప్రపంచ కీర్తిని పొందును. నాడే అంద చందములు ఆనందదాయక మగును.

(ఆలిండియా రేడియో వారి సౌజన్యముతో)

★




# దానమహిమ

అనగ అనగా ఒక బ్రాహ్మణుడు కలడు. ఆతనికి శారదాదేవి, లక్ష్మీసుందరి అను ఇద్దరు కుమార్తెలు గలరు. ఎట్లాగో కష్టపడి ఆ బ్రాహ్మణుడు ఇద్దరు కూతుళ్ళకు వివాహాలు చేసాడు. పెద్దల్లుడు చాలా ధనవంతుడు. రెండవ వాడు చాల బీదవాడు. కొంత కాలానికి శారదా దేవికి ఒక కొడుకు పుట్టాడు. లక్ష్మీసుందరికి ఒక కూతురు పుట్టింది. ఒక ఇరవైఏండ్లు గడి చాయి. శారదాదేవి కొడుకు పెండ్లికి లక్ష్మీ సుందరి భర్తను పురోహితునిగా నియమించిరి. తోడియల్లుని కొడుకు పెండ్లికదాయని, ఆ పురో హితుడు డబ్బు పుచ్చుకొనక పెండ్లిచేసి వెళ్ళి పోయాడు.

ఒకసారి ఆ పురోహితుడు శాస్త్రిగారి మనుమ రాలు అక్షరాభ్యాసానికి డబ్బు కావలసివచ్చి తోడియల్లుని బదులు యడుగగా అతడు డబ్బివ్వక తిట్టెను. పాపము! శాస్త్రి విచారించుచు ఇల్లు చేరెను. తరువాత కొద్దిసేపట్లో "ఆది బిక్షువు" అనే మహర్షి శాస్త్రి తోడియల్లుని ఇంటివద్ద ఆగి "భవతీ భిక్షాందేహి" యనెను. అప్పుడా యజమాని "ఇంట బియ్యము లేవు పో!" అనెను. "అట్లేయగుగాక" యని ఆ మహర్షి ప్రక్కనే ఉన్న శాస్త్రి ఇంటికి వెళ్ళి "భవతి భిక్షాందేహి" యనెను. అప్పుడా శాస్త్రి కొన్ని జొన్నలు తెచ్చి "అయ్యా మేము మిక్కిలి బీదవారము వరిబియ్యము లేకపోవుటచే, దయచేసి ఈ జొన్నలు తీసికొనుడు" అనెను. అప్పుడా ఋషి "నీవు సిరిసంపదలను పొందుదువుగాక" అని దీవించి వెడలిపోయెను. ఆనాటి నుండి శాస్త్రి మిక్కిలి ధనవంతుడై, దాతయై యుండెను. శాస్త్రి తోడియల్లుడు అంతకంతకు బీదవాడై భిక్షాధికారి యయ్యెను. కావున దాన మహిమ చాల గొప్పది.





డి. వి. రామలింగేశ్వరరావు

జన్మదిన సంచికలో, ఈర్ష్య కథ క్రింద డి. వి. నాగేశ్వరరావని పొరపాటున ప్రకటింపబడినది.

# "బాలల ద్వారా బాంధవ్యం!"

* శ్రీమతి కె. జగదాంబ. *

ఈ విశాల ప్రపంచములో నిన్న, నేడు, రేపు—కూడా మరుపుకు రానిది స్నేహము! ఆ పవిత్ర స్నేహభావము వలన వరుసగా భాంధవ్యము, ప్రేమ, పుట్టుకొచ్చి ఒకరి ఎడల మరొకరికి అద్భుత సాంగత్యము కల్గుతుంది! ఇటువంటి మహత్తరమైన, స్నేహమును గురించి ప్రపంచములో అనేక కధలున్నాయి. మామూలుగా ప్రపంచములో చెప్పలేనన్ని గొప్ప గొప్ప కధలున్నా—ఈ స్నేహ గాధకే అధిక ప్రాముఖ్యత, కల్గడానికి కారణం?—ఒక్కటే నను కోవాలి—ప్రపంచ మంతా స్నేహ భావ ములో బ్రతుకు తున్నది. స్నేహ మనే మహత్తర శక్తి ఈ విశాల అనంత విశ్వాన్ని నడుపు తున్నది. స్నేహ మనేదే నశించినప్పుడు ప్రపంచమే నశించి తీరుతుంది. ఇది నిశ్చయం?

స్నేహ భావ మున్నప్పుడు, కలహాలు, యుద్ధాలు, కలుషులు రానేరావు. దేశానర్ధకాలు కలుగనే కలుగవు! సర్వ శుభిక్షంగా, సస్యశ్యామలంగా ప్రపంచం ఆనందోల్లాసయుతమై ఉఛ్రూత లూగుతుంది.

స్నేహ మనేది నశించి నపుడే ఈ అంతః కలహాలూ, మారణ హోమాలూ, కలుషు కాట కాలు ఉద్భవించి—రాజ్య ధన కాంక్షలతో ప్రపంచాన్ని నాశనం కావించ సమకట్టారు ఈ నీచ మానవ జాతి!

కనుకనే అనాది నుండి అనేక మంది మహాత్ములు కూడా ఈ స్నేహ భావాన్నే ప్రపంచ ములో నెల కొల్ప ప్రయత్నించి—ఆఖరికి బలి దానం కూడా చేశారు త్యాగులై!

అట్టి ఈ స్నేహం—అనేక తీరులలో పుట్టు తుంది! అనేక విధాలుగా నశించు తుంది. సాధారణంగా ఒక్కొక్క స్నేహగాధ వింటుంటే ఒళ్లు గగుర్పాటుతో మనస్సాశ్చర్య విస్మయాలలో మునిగి తేలి నిశ్చేష్టులను గావించుతవి! అటువంటి చిత్ర విచిత్ర స్నేహగాధ లెన్నో ప్రపంచములో ఉన్నాయి; జరిగాయి. జరుగ బోతవి కూడా!—

విన, చూడ, చెవుల కింపుగా, కన్నుల కానందముగా ఉండే స్నేహగాధలీ ప్రపంచంలో లెక్క పెట్టలేనన్ని ఉన్నాయి.

అయినా ఇక్కడ మీ కొరకు నేను ప్రత్యేకంగా మన నూతన రాజ్యానికి దాని పొరుగున ఉన్న మరొక రాజ్యానికి కలిగిన స్నేహ భాంధవ్యము గురించిన విచిత్ర వింతగాధను వినిపించ దలిచాను. వినండి?!....

జపానుదేశం పేరు మీరు వినే ఉంటారు. అది చాలా చక్కని దేశం. బాల భాస్కరుని బంగరు కిరణాలీ దేశాన్నే మొట్టమొదటగా ప్రతీ రోజూ ఆవరిస్తుంటవి గనుక, ఈ దేశానికి ప్రపంచములో ఒక గౌరవమైన పలుకుబడి ఉంది. అయినా అది నేడు ఒక ముసలి దేశమైపోయి దిక్కూ దివాణం లేకుండా పోయింది యుద్ధ కారణంగా!

అట్టి జపానుకు "టోకియో" రాజధానీ నగరం. మన మద్రాసులో "జూ"—అంటే "జంతు ప్రదర్శనశాల" ఉన్నదే చూశారూ? అట్టివే ప్రతి పెద్ద నగరాలలోనూ ఉంటవి. అట్లాగే ఈ "టోకియో" నగరంలో కూడా ఓ పెద్ద "జంతు ప్రదర్శన శాల" ఉండేది యుద్ధానికి పూర్వం. దానిలో ఎన్నో విచిత్రమైన చక్కటి జంతువులుండేవి! కానీ, యుద్ధంవచ్చాక, రాజ్య, ధన, అధికార కాంక్షలకు లొంగి జపాను పాడై పోయింది. ఆ పాడు యుద్ధానికి బలి కాకుండా ఉండేటందుకు గాను, త్వర త్వరగా ఆ జంతువు లన్నింటినీ "టోకియో" "జూ" నుండి తరలించుక పోయి వేరువేరు సురక్షిత ప్రదేశాలలో ఉంచారు అధికారులు.

ఇప్పుడు యుద్ధం పోయింది. కానీ జపాను తిరిగి వెనుకవలె తయారు కాజాలక పోయింది. కారణ మాపాడు యుద్ధమే! అటువంటి జపానులోని పిల్లల సంగతి మీకు తెలుసా? వినండి.... జపాను పిల్లలు చాలా చక్కటివారు సుమీ! చిరునవ్వు మొఖాలు, చిన్నచిన్న నోసలు; చక్కటి చిన్న కళ్లు, గుండ్రటి వదనాలు, అందమైన జుట్టు, చిత్ర విచిత్రమైన బట్టల అలంకారం! అన్నింటిని మించిన అమాయకపు హృదయాలతో—ప్రసిద్ధి నొందారు ఆ పాపలంతా!

అటువంటి పాపలు కూడా ఆ పాడు యుద్ధ రాక్షసి చేతుల్లో నలిగిపోయారు పాపం! పోనీ, ఆ భాధను మరచి పోదామని అనుకొంటే వారికి కులాసా కల్గించి ఉషారిచ్చే వేవీ? ఏవీలేవు! పోనీ "జూ" లోకి పోయి ఆ జంతువుల ఆట పాటల చూద్దామని అనుకొంటే?.... అవీ లేవు. అట్లాగే తమ అమాయక హృదయాల నిండుగా నిరాశ అనే పిశాచికి తావిచ్చి దాని విముక్తికై ఎదురు చూచ సాగారు పాపం!

అటువంటి సమయంలో....మన దేశంలోని "కలకత్తా" నుండి ఒక పెద్ద వర్తకుడు "శ్రీ హిమాంశు నియోగి" అనే ఒకాయన జపానుకు వర్తకం కొరకై వెళ్లారు! అప్పటికే "ఇండియా" ఏనుగులకు ప్రసిద్ధి—ఏనుగు భలేగా ఉంటుంది!—అని తెలిసికొన్న అమాయక జపానీ పిల్లలు, తమ "టోకియో" నగరాన శ్రీ నియోగికి బ్రహ్మాండమైన సన్మానం చేసి—ఎంతో దీనంగా—జాలిగల్గించే విధాన ఆయన చుట్టూ మూగి "ఏనుగిప్పించండీ—బాబూ—ఏనుగు!"—అంటూ అరచి—తమ "జూ"కి ఒక చక్కటి ఏనుగ గున్నను ఇండియా నుండి పంప వలసిందిగా నెహ్రూకు తమ ప్రార్థనను తెల్పమని ఎంతో ఆర్భాటం చేశారు పాపం! నిజంగా ఆ దృశ్యం చూస్తుంటే....ఎట్లా గుంటుందబ్బా!—మీ హృదయాలకు!—?—

తదుపరి నియోగి సరాసరి ఇండియాకు రాగానే నెహ్రూజీని కలుసుకొని ఆ జపానీ బాలబాలికల వినతి పత్రాలను అందించగా—నెహ్రూజీ కూడా ఎంతో జాలితో వింత పడ్డారట!—వెంటనే ఈ సంగతి తెలుసుకొన్న మైసూరు వారు అడక్కుండానే "ఇందిర" అనే చక్కటి చిన్న ఏనుగ గున్నను ఎంతో సర్దాతో సమర్పించారు నెహ్రూకి!

నెహ్రూజీ మరింత ముచ్చట పడి తక్షణమే కలకత్తా నౌక ఎక్కించారు "ఇందిర"ను జపాన్ ప్రయాణానికై! 1949 ఆగష్టు 29 వ తారీఖున "ఇందిర" తనకొరకై ప్రత్యేకంగా నౌకలో కట్ట బడిన కర్రల గదిలోనికి పోయింది ఉల్లాసంగా! ఇందిరకు వీడ్కోలు ఇవ్వడాని కా నాడు హార్బరంతా పిల్లల మయమే!

నిజంగా ఇరు దేశాల స్నేహ బాంధవ్యానికై ఎటువంటి చక్కటి చిన్నపని జరిగింది! దీనికి కారణ భూతమైన ఆ బాలప్రపంచం ధన్యత నొందినది గదా!—ప్రపంచంలో మరువలేని మహత్తర సంఘటన అది!...

అటుపైని మరొక ఏనుగ "మిస్ కాబా" అనేది జపాన్ పిల్లలకొరకే—థాయ్ లాండ్ ప్రభుత్వం పంపింది. ఆనాడు....1949 సెప్టెంబర్ 4 వ తేదీ—"టోకియో" చేరిన "మిస్ కాబా" లక్షలాది బాల బాలికల ఆహ్వానాన్ని—దిక్కులు పిక్కటిల్లే హర్షధ్వనుల్నీ అందు కొంది! ఆ అమాయక హృదయాల అంతరంగిక భావాలను—ఈ మూఢ ప్రపంచం గ్రహించిందా—? గ్రహించి కనువిప్పు గలదా ?!—

అడిగీ అడుగడం తోనే తమ కోర్కె నెరవేర్చేది కాక పోయినా శ్రద్ధా భక్తులతో వెన్వెంటనే, నెరవేర్చి, తమ హృదయ నీరాజనాల నందిన మనపై, ముఖ్యంగా మన బాల బాలికలపై జపాన్ బుడుతలకు అపరిమిత స్నేహ వాత్సల్యాలు కలిగినాయి! వెంటనే మన నెహ్రూకు జపానీ బాల బాలికలు "ఇందిర" నప్పగించి నందుకు గాను కృతజ్ఞతా పూర్వకంగా మన దేశంలోని బాల బాలిక లందరకూ పెక్కు బహుమతులు పంపారు! ఈ విచిత్ర స్నేహ గాధతో మన భారతమాత తన సోదరి జపానీని కౌగలించు కొన్నట్లైంది ఆనందముతో! అంతే కదామరి!?— మరి ఆ బాలలు మన దేశానికి పంపిన బహుమతు లెట్టివో చూస్తే వారి ఉదార అమాయక హృదయాల లోతు ఎంతో కన్పెట్ట శక్యం కాదు సుమీ!

జపాన్ పిల్లలు పంపిన బహుమతులలో ముఖ్యమైనవి—దూదితో చేసిన చేపలు (బొమ్మలు) రెండు. ఇవి చాలా పురాతనమైనవి; అనగా షుమారు ఏభై సంవత్సరాల క్రిందట చేయబడి—ఎండకు ఎండీ—వానకు తడిసి, చాలావరకు పాడై—పూర్వం తమ అందం ఇంకా ఎటువంటిదో అనిపించు తున్నది !

తర్వాత బహుమతి చాలా సర్దాకలిగించి—చెప్పుకో దగ్గ ఘనమైనది! అదే—"బొమ్మ జంతువుల సంగీత బృందం!" జపాన్‌లో బొమ్మలు చేయడం ప్రసిద్ధుడైన "జీరో అయి జావా" అనే ఆయన వీటిని తయారు కావించాడు. ఆయన అన్నాడు:—"ఈ బొమ్మల బ్యాండును చూసి భారత పాపలు ముగ్ధు లౌతారని భావిస్తాను"! ఆ బ్యాండు బృంద మంతా అతి విచిత్రమైన ఆట సామాన్లు సెట్టు! దానిలోని ఒక "అడవి ఎలుగుబంటి" బొమ్మ ఫిడేలును ఎంచక్కా వాయిస్తుంది! అట్లాగే తదితర రకముల బొమ్మ జంతువులు వివిధ వాయిద్యాలను వాయిస్తూ ....వహావ్వా!——అనిపిస్తాయి పిన్న పెద్ద లందరికీ—!

ఇటువంటి జపాను ఇండియా బాలల స్నేహ బాంధవ్య గాథకు శిరో మణులైన కొన్ని ఉత్త రాలు చదువుకొని మనం నేటికి ఆపుదామా చరిత్రని:—

ముందుగా జపాన్ పిల్లలు మన పిల్లలకు పంపిన ఉత్తరం లోని సారాంశం ఇది!—"ఓ భారత దేశంలోని బాల నేస్తాల్లారా!—ప్రధాని నెహ్రూజీ ద్వారా "ఇందిర" ను మాకు పంపి నందుకు గాను మీకు మా ధన్యవాదాలు!— "ఇందిర' ముద్దొస్తోంది! అప్పుడే దానితో మేమంతా స్నేహం కలిపాం. ఈసారి మాతరఫున "మిసెస్—టి కొరా" మీదగ్గర కొస్తుంది. ఆవిడ మీకు దూదితో చేసిన పెద్ద పెద్ద చేపల బొమ్మలు బాగా ఇష్టమని చెప్పింది; ఇవి దాదాపు 50 సం॥ క్రితం చేయబడి వానకు తడిసి, ఎండకు ఎండి, చాలా వరకు పాడైనాయి! అయినా మీమీద మాకుగల స్నేహ బంధనా నికి స్మృతి చిహ్నంగా వాటిని మీ కంపు తున్నాము. మీకెల్లప్పుడూ శుభం కల్గుగాక! మాకు ఇకముందు ఎప్పుడూ ఉత్తరాలు వ్రాస్తుం డండీ! మరువ వద్దు!" దానిపై జపానీ పిల్లల తరఫున "కైచి యాసాకే;" "యూజీ యాసాకే!"లు సంతకాలు పెట్టారు.

ఈ క్రిందిది "టోకియో" గవర్నరుగారైన "శిషీరోయా సూయా" ప్రధాని నెహ్రూకి వ్రాసిన ఉత్తరం!

"మీరు పంపిన అమూల్య బహుమతికి జపాన్ పాపల తరఫున నేను కృతజ్ఞతాభి వంద నాలను తెలుపుతున్నాను. ప్రకృతినీ, పశు సంప దనీ, ప్రేమించే మా పిల్లలకు మీ బహుమతి ఆనందాన్ని ఇవ్వగలదని నా విశ్వాసం!—ఆ పాపలు మన "ఇందిర" ను ఆశలకు-శాంతికి- చిహ్నంగా భావిస్తున్నారు. మన ఇరు దేశాలు (ఇండియా జపాన్!) రెండూ ఇక ముందు చిర కాల మైత్రితో వర్ధిల్ల గలవని ఆశిస్తున్నాను"

ఇక జపాన్ ప్రజల ముచ్చటలను గురించి "ఆసా హీషింబ న్ప్రెస్" అధ్యక్షుడు "టకన్ హెసెబే"—ప్రధాని నెహ్రూకు తన ఉత్తర మిట్లాగు వ్రాశాడు...."జపాన్ పాపలు బ్రతికిన ఏనుగును చూడ ఎంత కాలంనుండో ఉవ్వి ళ్లూరుతుండగా వారి వాంచితార్థమును ఒనగూర్చి నందుకు మీకు నా ధన్యవాదాలు!— ఇప్పుడు జపాన్ బాలలు పంపిన బహుమతులను వారి ఈడుగల బాలలకే అందజేస్తే మా బాలలు సంతోషం ఇంకా అభివృద్ధి చెంద గలదు! 1949 సెప్టెంబరు 23 వ తారీఖున మీరు పంపిన "ఇందిర" టోకియో రేవు చేరింది. ఈ వార్తనే అన్ని జపాన్ పత్రికలూ ప్రకటిం చేయి! ఎంత ముద్దుగానో—ముచ్చటగా— వింతగా—పెద్ద పెద్ద అక్షరాలతో ప్రకటించ బడిందా వార్త అన్ని పత్రికల్లో! తర్వాత ఇందిర టోకియో వీధులగుండా పొడవైన ప్రయాణంచేసి చివరకు "జూ"కి చేరింది. దారి పొడవునా హర్షధ్వానులు చేస్తూ-కుశల ప్రశ్నలు వేస్తూ-వెంబడించిన అశేష బాల ప్రజానీకానికి శాంతంగా-సమాధానంగా-తొండం అందిస్తూ తిరిగింది వీధుల్లో - దీని నిమిత్తమై "జూ"లో ప్రత్యేకంగా ఒక చక్కటి బోను ఏర్పాటు

చేశారు. ఈలోపల మా ప్రెస్సువారు మిా ఇందిరకు ఆహ్వానమిచ్చే విషయంలో "సప్తాహము" ఏర్పాటుచేసారు....అనేక ప్రోగ్రాంలు సిద్ధపరుచ బడినవి !....ఒక్క విషయం చూసిన మేము ఎంత వింతబడ్డామో చెప్పలేము ! ఆ మొదటి రోజున ఇందిరను చూడ్డానికై తలి దండ్రుల వెంటవచ్చిన పాపల సంఖ్య దాదాపు ఒక లక్షా పదివేలు ! (1,10,000) ఇంతమంది పిల్లలు ఎప్పుడూ, ఏ జంతు ప్రదర్శనానికీ రాలేదు ఇంతవరకు "!—

ఇలాగున ఎన్నో ఎంతో ముచ్చటగా వచ్చాయి మనకు !........ఇటువంటి సంఘటన ప్రపంచంలో—ముఖ్యంగా మన దేశమువలన జరుపబడడం ఎంత ఆనందమైన కార్యం ! ప్రతీ దేశం—ప్రతీ వ్యక్తీ—అట్లానే అమాయక హృదయాలతో, ఆనందోత్సాహాలతో— స్నేహ బాంధవ్యాలను నెరుపుకొనడమే ఎల్లప్పుడూ మనము కోరుకొనవలసినది ! "

ఇంతకీ ఒక్క ముఖ్యవిషయం ఎవరూ మరువ కూడదు ! ఇంతటి మహత్తర కార్యం !—ఒక్క రేపటి పౌరులైన నేటి బాలలద్వారానే జరిగింది ! అంతే సుమా !—



# గులాబీ పూవు

అనగా అనగా ఒక ముసలివాడు, భార్య ఉండేవారు. వాళ్లు అడవులకు వెళ్లి కట్టెలు కొట్టుకొని వాటిని అమ్మి జీవించేవారు. ప్రతి రోజూ వాళ్లకు దమ్మిడీకూడా మిగిలేదికాదు. ఒక రోజున గులాబీచెట్లు తెమ్మని భార్య ముసలి వానితో చెప్పెను. ముసలివాడు, "మనకు తిండికే డబ్బు సరిపోకుండావుం టే ఇంకా గులాబీ చెట్లు ఎలా కొనగలము ?" అని అనెను. ఆ మాటకు భార్య "కట్టెలు ఎక్కువగా కొట్టి అమ్మి ఎక్కువ డబ్బు సంపాదించగలము. ఆ డబ్బుతో గులాబీచెట్లు కొనవచ్చును." అని చెప్పెను.

వాళ్లు ఒక చిన్న గుడిసెలో ఉండేవారు. వాళ్లు ఎక్కువ కట్టెలుకొట్టి చాలా డబ్బు సంపాదించిరి. ఆ డబ్బుతో గులాబీచెట్లు కొని గుడిసె చుట్టూ నాటిరి. ఆ చెట్లు మంచివి. అవి కొద్ది దినములకు మొగ్గలువేసి పూవులు పూసెను. ఆపూలు చక్కగా ఉండటంవల్ల వాళ్లు సంతోషించి అవి అమ్ముకొనుటకు వెళ్లిపోయిరి. అలా వెళ్లుతూండగా రోజూ కట్టెలు కొనేవాళ్ల ఇల్లు వచ్చింది. వాళ్లమ్మాయి "ఓ పూలో ఇలా రా " అని పిలిచింది. వాళ్లు పువ్వులు తీసుకొని వెళ్లారు. చాలా సంతోషంగా, ఆ అమ్మాయి పూవులన్నీ కొని వాళ్లకు డబ్బు ఇచ్చింది. వాళ్లు సంతోషంగా తీసుకుపోయిరి. ఇలా ప్రతిదినము వాళ్లు పువ్వులు అమ్ముకొని చాలా డబ్బు సంపాదించారు.

వాళ్లు ఇదివఱకు గుడిసెలో ఉండేవారు. ఇప్పుడు మంచి చక్కటి ఇంట్లో చుట్టూ గులాబీ చెట్లు వేయించుకొని ఆ పూసే పువ్వులను చూస్తూ ఆనందంగా ఉంటూన్నారు.

కథ కంచికి. మనం ఇంటికి.

—రమాదేవి.



చిత్రసమీక్ష:

# మొదటిరాత్రి

ప్రకాశ్ ప్రొడక్షన్సువారి 'మొదటిరాత్రి' ఇటీవల విడుదలైన తెలుగు చిత్రం. దర్శకులు శ్రీ ప్రకాశరావు. శ్రీమతి వరలక్ష్మి నాయిక పాత్రధారిణి. శ్రీయుతులు నారాయణరావు, శివరావు, ప్రకాశరావు యితర ముఖ్య పాత్రధారులు.

సాంఘికమైనా కథ, కొంచెం క్రొత్త వరవడిలో నడుస్తుంది. మనోరమ లక్షాధికారి. మాతాపితృవిహీన, విద్యావతి, సత్స్వభావ, జవ్వని, యితరుల ఆదుపాజ్ఞ లవసరము లేని స్వతంత్రజీవి. ధనాశాపరుడు మోసకాడు అయిన బాబు మాయలో చిక్కి ఆతని వివాహమాడ నిచ్ఛగిస్తుంది. తీరా పెండ్లి పందిళ్లు తయారయే సమయంలో, బాబు ద్రోహియని తెలిసికొని, నైరాశ్యముచే, అంతా విసర్జించి ఎవరికీ చెప్పకుండా వెళ్లిపోతుంది. బాబు, మనోరమ మేనత్త, మనోరమ పోకడ తెలియక పోయినా, చేచిక్కిన విత్తాన్ని సెలవు జేస్తూవుంటారు.



హోటల్లో సిపాయి మంజూను మినపపప్పు సమంగా రుబ్బమని గద్దిస్తున్నాడు.

కాలుజారి కాలువలో పడ్డ మనోరమను రక్షించి, తమతో పాటు పోషిస్తూ వచ్చారు దాసు శివాయిలు. వారితో పేదరికం అనుభవిస్తూ, అన్ని పరిస్థితులలో ధైర్యంగా, నిష్కల్మషంగా, సంతోషంగా సంచరిస్తూ ఉన్న దాసుకు తన మనసును అర్పిస్తుంది మనోరమ. కష్టాలన్నీ కడతేరాక కథ సుఖాంతమే.

ఏవో కొన్ని ఘట్టాలకు తప్పితే, కథ పటుత్వము లేకుండా, చాలా తేలికగా నడిచిందని చెప్పాలి. సామాన్య వరవడిలో, సంభాషణలు సహజంగా, తేలికగా ఉన్నాయని సంతోషించినా, గంభీరమైన సన్నివేశాలలో కూడా తేలికగా ఉండటంవల్ల, మొత్తంమీద చిత్రం చప్పచప్పగా ఈడ్చినట్టుగా కనుపిస్తుంది. అదీగాక మనస్తత్వాన్ని, మనసులో కలిగే సంచలనాన్ని ధ్వనిమూలంగా నిరూపించాలన్న ప్రయత్నాలు విఫలమైవి. బండమీద బట్టవేసి పదేపదే బాదినట్టు వినేవారికి విసుగుకూడా కలిగిస్తాయి. ఛాయాగ్రహణం, సంగీతం, బాగా ఉన్నాయనే చెప్పాలి. మధ్యలో చూపించిన అంతర్నాటకాలూ, నృత్యాలూ, కొంత ఉత్సాహం కలిగించినా, వాటి పరిమితి యింకా తగ్గించి ఉండవచ్చు.

ఇంక పాత్ర పోషణలో, వరలక్ష్మి మనోరమగాను, మంజూగానూకూడ సహజంగా నటించింది. పాత్రోచితమైన గాంభీర్యం కొంత లోపించినా, నారాయణరావు దాసు పాత్రనర్థము చేసికొని నటించినట్లే అగపడుతుంది. శివరావు హాస్యం మితిమీరకుండా తగుమాత్రంగా ఉంది. మాయమాటలుచెప్పి వరలక్ష్మిని వలలో వేసికొన్నప్పుడేమోగాని, ఆఖరున ఆమెతో చీవాట్లు తిన్నప్పుడు బాబుగా ప్రకాశరావు తెల్లముఖమే వేశాడు. మొత్తంమీద చివరకు మనోరమ బాబును, దాసును చీవాట్లు పెట్టిన దృశ్యంలో ఎవరూ సరిగా నటించలేదేమో. మేనత్త పాత్రలో విశేషమేమీ లేదు. రంగస్వామి పాత్రలో ఉదాత్తత ఉంది.

మొత్తంమీద చిత్రం అలాఅలా నడిచింది. మొదటి రాత్రి అనే పేరులో పొడసూపిన గాభరా చిత్రంలో ఏమూలా లేకపోవటం చూసేవారికి, చూచేవారికీగూడా చాలా అదృష్టం అనుకుంటాం.

—లత.




“ యధాయధా.... ..... ....కాళీధవళత్వ శంకయా.”

గాని,

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పఁజేయు ప్రానికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాప మొందుచున్నది సుమా !!!




## పెనుమంచిలి జైనదేవుడు

రచయిత : కవికొండల వెంకటరావు.

అభినవాంధ్ర కార్యస్థానము రాజమండి.

వెల రూ. 1-4-0.

ఇది సుప్రసిద్ధ రచయిత కవికొండల వెంకటరావుగారిచే రచియించబడినది. పదికథల గుచ్ఛము. ఇందలి కథలన్ని పుణ్యక్షేత్రముల గూర్చి రచయిత దర్శించిన మట్టుకు వ్రాసినవి. ఇందలి ఒక్కొక్క కథ చదివిన చక్కగ ప్రపంచజ్ఞానము, ఎక్కడెక్కడ ఏ వుత్సవములగునో మొదలగునవి తెలియ నగును. చదువుట కెంతయు ఆనందముగను వుత్సాహమును నుండును. పేరుకెక్కిన కవులు రచించిన గ్రంథము తప్పక చదువవలెగాని వేరె చెప్పుట కశక్యము. ఇది అందరు చదివి ఆనందించండి.

* * *

## మాలవెంకన్న

బాబూ కార్యాలయం

మూలం : అఖిలన్. అనువాదం : బి. విశ్వేశ్వరరావు.

కాథెడ్రల్, మదరాసు-6. వెల అ. 0-2-0.

ఇది పిల్లల ప్రత్యేక పుస్తకము. ఈ పుస్తకములు, పిల్లలకు ఎంతో ఆనందమును, వుత్సాహము కలిగించుచున్నవి. ఇందలి కథలో మాలవెంకడు తన స్నేహితుని రక్షించుటకై తన ప్రాణములను ధారపోయును. వెలివేసిన మాలవెంకడే తన కొడుకునకు ప్రాణదానము చేసినందుకు గోపాలకృష్ణయ్య పశ్చాత్తాపమునొంది అప్పటినుండి అన్ని జాతులను సమముగ చూచుచు, ప్రతి పండుగకు మాలవెంకని పేరుతో బీదలకు వస్త్రములను యిచ్చుచుండెను. మాలవెంకడు చనిపోయినా, వాని పేరు చిరస్థాయిగ నిలిచెను.

—రా. లక్ష్మి.

* * *

## గృహ-చికిత్సక్

లభించుతావు

వనస్థలీ విద్యాపీఠ్ ఆయుర్వేదిక్ ఔషధాలయ్,

పోష్టు : వనస్థలీ, జయపూర్. వెల రు. 0-4-0.

యీ పై చిన్న వైద్య పుస్తకము హిందీలో వ్రాయబడి యున్నది. సాధారణముగా జనులకు సంభవించు రోగములకు యీ పుస్తకములో మందులు, వాటి ప్రయోగము మొదలైన విషయములు చక్కగా వివరింపబడి యున్నవి. యీ పుస్తకము మూడు భాగములుగా వున్నది. మొదటి భాగములో రోగములు వచ్చుటకు కారణమును వాటినుండి విముక్తిని పొందు ఉపాయములు చెప్పబడినవి. రెండవ భాగములో సాధారణమైన జబ్బులు వాటికి మందులు వివరింపబడినవి. మూడవభాగములో మందులపెట్టె అను శీర్షికతో సవివరముగా కొన్ని రకములైన రోగములు, వాటికి సరియైన మందులు, ఆ మందులను తయారుచేయు విధములు వివరింపబడినవి. యీ మందులపెట్టె ఖరీదు రు. 10. లు. ఇందు వివరించినట్లు గృహసంబంధమైన రోగములను తామె స్వయముగా స్వల్పఖర్చుతో కుదుర్చుకొన వచ్చును. ప్రతి వారివద్దను ఉండతగ్గ పుస్తకము.

## పంచభూతముల చికిత్స

రచయిత : శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరులు.

దొరుకుచోటు : యోగాశ్రమము,

ఋషికొండ బీచి, వాల్తేరు, విశాఖ జిల్లా.

వెల 0-12-0.

ఈ పుస్తకమునందు పంచభూతముల చికిత్స విధానము గూర్చి చెప్పబడి యున్నది. ఆకాశము, వాయువు, తేజము, జలము, పృధివి అను పంచభూతముల సమ్మేళనముచేత మానవ శరీరములు నిర్మింపఁబడుచున్నవనియు, ఔషధములు, ఆపరేషన్‌లు ఇంజక్షనుల నిమిత్తము లేకుండ యోగ వ్యాయామాది వివిధ ప్రకృతి చికిత్సా విధానములచేత ఎంత అసాధారణ రోగ పీడితునినైన పూర్ణారోగ్యవంతునిగా చేయు విధులు ఇందు స్వానుభవ రూపముగా చెప్పబడి యున్నవి.

ఈ పంచభూతముల చికిత్సచే వందలకొలది రోగులు వారి వారి రోగములు పోగొట్టుకొనిన అనుభవములు ఇందు పొందు పరుపబడియున్నది.

* * *

## యోగాసనములు

రచయిత : శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరులు. వెల 0-8-0

ఈ పుస్తకమునందు ముఖ్యములగు పదియారు యోగాసన ములగూర్చి విపులముగా చెప్పబడియున్నది. మానవులు వారు తినిన ఆహారమును జక్కగ జీర్ణించుకొని వీరిలోనున్న డెబ్బది రెండువేల నాడులలోను రక్తము ప్రసరింప జేయ వలయునన్న యోగ, వ్యాయామముకన్న వేరు మార్గము లేదనియు, నియమముగలవారై, బ్రహ్మచర్యము స్వీకరించి నిత్యము యోగ, వ్యాయామ, సూర్య నమస్కారముల నభ్యసించుచు ఆసనములు కొన్నిటిని వేయుచున్న చక్కని ఆరోగ్యముగల్గి దీర్ఘాయువు కల్గువారగుదురని స్వానుభవరూప ములగు విధులలో ఇందు విపులముగా చెప్పబడియున్నది.

మానవులు వారిదైనందిన జీవితములో ఎట్లు యోగసాధన చేయవలయునో ఆయా విధులగూర్చి వరుసగా చెప్ప బడియున్నది. ఈ గ్రంథము చదివిన ప్రతివారు స్వయ ముగా యోగాసనము నవలంబించ గల్గుదురు.

—గం. అ

* * *

## సర్వోదయ

ఆంధ్ర సంపాదకులు : సీతారామ్. ఇది సర్వ సేవా సంఘం వార్తా తరఫున ప్రకటితము. సంవత్సర చందా రూ. 10. చిరునామా. సర్వోదయ సంపాదకులు, వినయా శ్రమము.

మా కార్యాలయమునకు 'సర్వోదయ' రెండవ సంచిక చేరినది. సర్వోదయ అనగా పీడితులకు, శోషితులకు ప్రబోధం కలగడమే. ఈ పత్రికలో అనేక విషయాలపై రచనలు ప్రచురింపబడినవి. సాధారణంగా మానవుని జీవనో పాధికి మార్గాలు, పరిశ్రమలు, ఈ పత్రికలోని ముఖ్య విష యాలు. దాదాపు 20 రచనలు అనేక విషయాలతో ప్రచు రింపబడినది. ముఖ్యంగా చరఖా సంఘాలు వాటి ప్రధాన కార్యాలయ విషయాలు, ఇంటింటా తాటిబెల్లం, ఏడుదు పేట అయిదు వారాల్లో నేత తర్ఫీదు, విద్యావిధానం వెంటనే మారిపోవాలి, సర్వోదయ - సంస్కృతి ఈ వ్యాసాలు చక్కగా ఉన్నవి. అఖిల భారత చరఖా సంఘం, సేవాగ్రాం వారు ఖాదీ ఉత్పత్తికి సంబంధించిన లెక్క వివరాలు ప్రచు రించారు. అందరు ఒకసారి చదువ వలసిన పత్రిక.

—జి. ప్రభ.

* * *

## విశ్వరహస్యము

గ్రంధకర్త శ్రీ వసంతరావు వెంకటరావుగారు.

సాహితీసమితి. వెల 1-0-0.

అనుక్షణము విస్తరించుచున్న మానవుని విజ్ఞానము, కేవలం శాస్త్రముగానేకాకుండా, "కథలుగా, పద్యాలుగా, పాటలుగా, గాథలుగా" వివిధ రూపాలతో ప్రజా సామా న్యానికి అందినప్పుడే, విజ్ఞానం చక్కగా ప్రచారంలోనికి రాగలదు. గ్రంధకర్త తొలిపలుకులో వ్రాసికొనినట్లు, భారత దేశంలో ఉత్కృష్టమైన తత్వవేదాంతములు గేయరూప

ములో నిమిడియున్నవి. అందువలన శాస్త్ర విజ్ఞానము గేయరూపమున ప్రజలకు పరిచయముచేయ నెంచుటలో నాక్షేపణ యుండరాదు.

ఈ చిన్నపుస్తకములో పరిమాణతత్వం, మూలపదార్థములు, నిర్మాణములో పరమాణువుకు సౌరమండలమునకు గల సామ్యము, బ్రహ్మాండమయిన సృష్టిలో మానవుని యొక్క అల్పపరిమాణము, అనంతమైన కాల వాహినిలో మానవునియొక్క బుద్బుద ప్రాయమైన జీవితకాలం, వీనిని గూర్చి చక్కని సులభశైలిలో అతి క్లుప్తముగాను, అర్థమగునట్లుగాను సూచించబడ్డాయి. మానవుడు మహాశక్తి సంపన్నుడైనప్పటికీ, సృష్టి క్రమములో క్షణికమైన తన జీవితంలో కలహం, పంతం, క్రౌర్యం విడచి సంచరించవలసిన ఆవశ్యకత చాటుచూ శాస్త్రబోధతో ఆధ్యాత్మిక బోధను సమన్వయించి యీ పుస్తకములో గ్రంథకర్త వ్రాసియున్నారు. చదువుటకు తేలికగాను, అర్థం సులభగ్రాహ్యముగాను ఉన్నది.

—అ. చ.








Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras,
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras



P.I.B.

శ్రీమతి ఇందిరాగాంధి, మేడెమ్ సోఏకర్నో, బాండాగ్‌లోని భారతీయ స్త్రీలతో.

జూన్ 9-వ తేదీని ప్రధాని నెహ్రూ జావాకు వేంచేసిన సందర్భములో.

5298

# ఆంధ్రమహిళాసభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్ పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :— కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.
(గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది)

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుప బడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల — అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.







దివికేగిన

గుళ్లపల్లి కల్పక సుబ్బలక్ష్మి

శ్రీమతి జి. సుందరమ్మగారి (ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ సభ్యురాలు) కుమార్తె. 6 సం॥వరకూ బృందావన స్కూలులో చదివి తరువాత ఇంట్లోనే, ఇంగ్లీషు, అరవము, హిందీ భాషలలోనూ, వీణ వాయిద్యమునందూ మంచి అనుభవమును సంపాదించింది. బీదలయందు దయదాక్షిణ్యములతో ప్రవర్తిస్తూ, తనస్వంత ఖర్చుకై తల్లిదండ్రులిచ్చినవిత్తమును ఎక్కువగా దాన ధర్మములలో వ్యయపరచేది. రేడియో బాలికా సమిష్టికార్య క్రమాల్లోచురుకుగాపాల్గొనేది. అన్ని విషయాలలో అతిచురుకుగావ్యవహరించేది. తుదికి, అతిచురుకుగానే తన 13-వ ఏటనే, యీలోకాన్నివీడి, తల్లిదండ్రులను, బంధు మిత్రులను దుఃఖమున ముంచినది.

ఈ బాలిక స్మృతి చిహ్నంగా, యీమె మాతా పితలు, నిర్మలా దేవి గ్రంథాలయానికి రూ 20-0-0 ఒక సబ్ జూ'యర్ తరగతి విద్యా వేతనము నిమిత్తం, రూ 72-0-0, 1950 దసరా ఉత్సవాలలో సంగీత పోటీలో బహుమతి నిమిత్తం రూ. 10-0-0 మహిళా సభకు విరాళముగానిచ్చిరి. తన తల్లి దండ్రుల యీ ఔదార్యము, ఆమె ఆత్మకు శాంతిని గూర్చగలదు ఆమె ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ, దుఃఖితులైన యీమె తల్లిదండ్రులకు సానుభూతిని దెలుపుచూ, ఆమె స్మారక చిహ్నంగా వారొసంగిన విరాళములను కృతజ్ఞతతో స్వీకరించుచున్నాము.

ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్రమహిళ

సంపుటి 7 :: ఆగస్టు '50 :: సంచిక 4

ముఖచిత్రం—యువమహారాజు, కాకతీయ రుద్రమదేవి.

చిత్రకారులు శ్రీ కులపతి అడివి బాపిరాజుగారు




సంపాదకురాలు . శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం యే., యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 7 ఆగష్టు 1950 సంచిక 4

# శాంతి ప్రయత్నాలు

రెండవ ప్రపంచ యుద్ధానికి నాంది దూర ప్రాచ్యంలో జరిగింది. జపాన్ మంచూరియా పైన పడటంతో ప్రపంచయుద్ధం మొదలయిందని చెప్పవచ్చు. ఇప్పుడు అదే ప్రాంతములో వున్న కొరియాలో అమెరికా జోక్యము కలిగించుకొనటముతో క్లిష్ట పరిస్థితులు యేర్పడుతున్నవి. అయితే క్రిందటిసారి ముతా రాజకీయాలను పాటించకుండ శాంతినే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న నాయకుడు ఒక్కడయినా లేడు. కాని యీనాడు నెహ్రూ పండితుడు శాంతి సాధన కోసము నడుము కట్టుకుని ముందుకు వచ్చాడు.

కొరియా యుద్ధంలో పూర్వపరాలు యెట్లావున్నా ముఖ్యముగా గమనించవలసిన అంశాలు కొన్ని వున్నవి. అది కేవలము అంతర్యుద్ధమా లేక భిన్నదేశాల మధ్య జరిగే యుద్ధమా అని మనము తేల్చుకోవాలి. అంతర్యుద్ధమే అయితే దానిని చూసి ఎవరూ భయపడ నక్కరలేదు. 50 కోట్ల ప్రజలుగల చైనా దేశములో సంవత్సరాల తరబడి ప్రచండయుద్ధము జరిగినా బర్మా, ఇండొనీషియా, ఇండోచైనా, ఫిలిప్పైన్స్‌లలో జరుగుతున్నా ప్రపంచశాంతికి యేమి ముప్పు రాలేదు. కొరియా యుద్ధము భిన్నదేశాలకు మధ్య జరిగే యుద్ధముగా పరిగణిస్తే వుభయ పక్షాలను నిలబెట్టి వెళ్లిన అమెరికా రష్యాలకు కొంత కాకపోతే కొంతయినా సంబంధం వుండకపోదు.

వ్యవహార దృష్టినిపట్టి దక్షిణ కొరియామీద ఉత్తర కొరియా దురాక్రమణ జరిపినట్లు పండిత నెహ్రూ అంగీకరించాడేగాని పై విషయాలను మరచిపోలేదు. అందువల్లనే ఫార్మోజా, ఇండో చైనాలకూ, కొరియాకు అమెరికా ముడిపెట్టటాన్ని ఆయన అంగీకరించలేదు. పైపెచ్చు ఫార్మోజా విషయంలో అమెరికా చైనాలుద్వారా పశ్చిమ యూరపు, రష్యాలు యుద్ధంలో ఇరుక్కునే అవకాశం వున్న సంగతిని గమనించాడు. అందువల్ల పెద్ద తలకాయలు కొంచం సర్దుబాటు చూపితేనే తప్ప లాభంలేదని ఆయన రష్యా, అమెరికాలకు ఒక సూచన చేశాడు.

"కొరియా యుద్ధం కొరియా భూభాగాన్ని దాటి విస్తరించకుండా చేయటం, భద్రతా మండలిలో ఏర్పడ్డ ప్రతిష్టంభనను తొలగించి, ఆ సంస్థద్వారా త్వరలో కొరియా సమస్యను

శాంతియుతంగా పరిష్కరించటం అన్నవే ఇండియా లక్ష్యాలు. కమ్యూనిస్టు చైనాకు సమితిలో స్థానంవచ్చి రష్యాకూడా సమావేశములో పాల్గొంటే భద్రతామండలి ప్రతిష్టంభన పరిష్కారం కాగలదు. భద్రతా మండలిద్వారానే కాక విడిగాకూడా సంప్రదింపులు జరిపి అమెరికా, రష్యా, చైనాలు, ఇతర దేశాలతోడ్పాటుతో సమస్యను శాశ్వతంగా పరిష్కరించవచ్చును.'' అని పండిత నెహ్రూ రష్యా ప్రధాని స్టాలిన్, అమెరికన్ విదేశాంగ మంత్రి ఎచిసన్‌లకు వ్రాసిన లేఖల్లో సూచించాడు.

దీనికి స్టాలిన్ జవాబిస్తూ "భద్రతా మండలి ప్రతిష్టంభనను పరిష్కరించి, తద్వారా కొరియా సమస్యను పరిష్కరించాలన్న మీ సూచనతో పూర్తిగ ఏకీభవిస్తున్నాను. భద్రతా మండలి చర్చకు కొరియన్ ప్రజా ప్రతినిధులనుకూడా ఆహ్వానించటం అవసరమని సూచిస్తు న్నాను" అని అన్నాడు. ఈ జవాబు ప్రోత్సాహకరంగా ఉన్నదని పండిత నెహ్రూ స్టాలిన్‌ను అభినందించాడు.

అమెరికా విదేశాంగ మంత్రి ఎచిసన్ జవాబిస్తూ కమ్యూనిస్టు చైనా సభ్యత్వానికీ కొరియా యుద్ధానికి సంబంధంలేదనీ, కమ్యూనిస్టు చైనాకు స్థానం సమితిని బెదరించటంవల్ల సమ కూడదనీ అన్నాడు. దీనికి పండిత నెహ్రూ మళ్లీ ఒక లేఖను వ్రాస్తూ చైనా సభ్యత్వంవల్ల ప్రపంచ దురాక్రమణదారులు బలపడరనీ, నిజానికి ఐక్యరాజ్యసమితిలో చైనా, రష్యాలను పాల్గొనేట్లు చేసి సమితిని బలపరచటము, శాంతిని సాధించటమే తన ఆశయమనీ ఉద్ఘాటించాడు. కాని అమెరికా వైఖరి మార్చుకోలేదు.

వివాదాలన్నీ ఐక్యరాజ్యసమితి ద్వారానే పరిష్కరించుకోవాలని అందరికీ ధర్మ పన్నాలు చెప్పే అమెరికా నెహ్రూ సూచనను ఎందుకు తిరస్కరించింది? ప్రజా విశ్వాసం గోల్పోయి ఫార్మోజాలో తలదాచుకుంటున్న చాంగ్‌కైషేక్‌కోసం మొండిపట్టు పట్టి చైనా వోటు తన చేతులో పెట్టుకోవాలని అమెరికా పాకులాడుతున్నది. ఈ కారణంవల్ల రష్యా వైదొలగిపోయిన అవకాశం చూసుకు కేవలం తన ఆశ్రితులతో కూడిన సమితిని ముక్కుపట్టి ఆడిస్తున్నది. సమితే తాను, తానే సమితిగా వ్యవహరిస్తున్నది. అందుకనే సమితి కొరియామీద తరువాత చేసిన తీర్మానములో ఇండియా పాల్గొనలేదు. ఫార్మోజాకు, ఇండో చైనాకూ, ఆసియా కమ్యూనిజానికీ అన్నిటినీ తానొక చెంపన కొరియాకు ముడిపెడుతు అసలు విషయాన్ని సూచించిన నెహ్రూ మాటను త్రోసివేసి కొరియాకు, చైనా సభ్యత్వానికీ సంబంధం లేదు పొమ్మన్నది.

అయితే ఆగస్టున మళ్ళీ రష్యా భద్రతామండలి సమావేశాలకు హాజరుకాబోతున్నది. కనుకనూ, మళ్లీ ఆటంబాంబును ఉపయోగించటానికి వెనుదీయనన్న అమెరికన్ ప్రెసిడెంట్ ట్రూమన్ బాంబు ఉపయోగం జరగదనటంవల్లనూ శాంతికి ఇంకా ఆస్కారం ఉన్నట్లే కనిపిస్తు న్నది. మళ్లీ శాంతి ప్రయత్నాలను జరపటానికి ఇండియాకు అవకాశం కలుగుతున్నది. కొరియా సమస్యమీదకన్నా ఫార్మోజా మొదలైన సమస్యలమీదనే ప్రపంచయుద్ధం రావటానికి అవకాశం ఎక్కువగా ఉన్నది కనుక శాంతి ప్రయత్నాలు సఫలం కాగలవని ఆశిస్తున్నాము.



ముఖచిత్రం

# యువమహారాజు శ్రీ కాకతీయ రుద్రమదేవి.

కాకతీయ చక్రవర్తులలో సకల ఆంధ్రావనిపైన తన ఏకచ్ఛత్రం పరపిన సామ్రాట్టు శ్రీ గణపతి రుద్రదేవుడు. పడమట షోలాపురం నుంచి తూర్పున సముద్రతీరం వరకూ, ఉత్తరాన వరదా నది నుండి దక్షిణ పెన్న వరకు వ్యాపించివున్న ఆరాజ్యానికి ఓరుగల్లు రాజధాని. గణపతి దేవుడికి రుద్రమ, గణపమలనే యిద్దరు కుమార్తెలు తప్ప కొడుకులు లేరు. తన తదనంతరము కాకతీయ వంశ నామము నశించి, తాను విస్తృతింప చేసిన ఆంధ్ర రాజ్యము చెల్లా చెదరయి పోగలదన్న భయముతో చక్రవర్తి తన పెద్దకూతురు రుద్రమ దేవికి పురుష వేషము వేయించేవాడు. అంతేకాదు. ఆమె యువరాజోచితమైన సకల రణవిద్యలు, రాజ్యనిర్వహణా చాతుర్యము అతిశ్రద్ధగా నేర్చినది. యువ మహారాజ పట్టాభిషేకము జరిగిన తర్వాత పురుష వేషముతోనే సింహాసనము మీద తండ్రి ప్రక్కన కూర్చునేది. ఆ యువమహారాజు వేటకు వెళ్లటము, సేనలు పరీక్షించటము, యుద్ధాలోచనలలో పాల్గొనటము, వ్యూహ రచనలు గావించటము, అవసరము వచ్చినప్పుడు స్వయముగ యుద్ధములో పాల్గొనటము జరిగేవి. అందువల్ల ప్రజలలో చాలామందికి యువమహారాజు రుద్రమ దేవుడో, రుద్రమ దేవియో అంతుపట్టేది కాదు. ఈ విధముగా తన అబలాత్వము మరచి వీరపురుషుడుగా పెరిగిన రుద్రమ కాకతీయ సామ్రాజ్యం ఎంతో నేర్పుగా సామర్థ్యంతో పరిపాలించుకో గలిగింది. ఆమె స్త్రీయెగదా అని కయ్యానికి కాలుదువ్విన సామంతులకు బాగా బుద్ధి చెప్పినది. పరాక్రముతో రాజ్యము విస్తృతింప చేసుకొంటు ప్రజోపయోగ కరములైన అనేక పనులుచేసి ఆంధ్రజాతికే శిరోరత్నమయినది.

యువ మహారాజుగా నున్నప్పటి ఆమె యీ చిత్రమును ప్రసిద్ధ చిత్రకారులు కులపతి శ్రీ అడివి బాపిరాజు గారు హృదయంగమముగ చిత్రించారు.

సంపాదకురాలు.

# ప్రస్తుత పరిస్థితులు

అచ్యుతుని గిరిజ

## ఇంటికన్న గుడిభద్రమా ?

ఇంటికన్న గుడి భద్రమని ఒక సామెత. కాని ప్రస్తుత పరిస్థితులను పట్టిచూస్తే ఆ సామెత సరిగా వర్తించటల్లేదు. ఇంట్లో ఎటువంటి మోసాలు, దొంగతనాలు జరుగుతున్నవో గుళ్లల్లోనూ అట్లాగే జరుగుతున్నవి. మొన్న నీమధ్య బొంబాయిలో ప్రసిద్ధికెక్కిన మహాలక్ష్మి ఆలయములో తెల్లవారి పూజారి అమ్మవారిని అలంకరించుతు వున్నాడు. అప్పుడ ఇద్దరు వ్యక్తులు వచ్చి మహాత్మ్మని హంతకుడిలాగా వినయ విధేయతలు వుట్టి పడుతు పూజచేసుకొంటు, అలంకారాలు చూస్తు చూస్తు ఆ నగల పళ్లెం పట్టుకొని అదే పరుగు. వాళ్లకు కారువున్నది గాని మరి పూజారికేది ? మలబారులో శబరిమలమీద వేంచేసివుండే అయ్యప్పస్వామికి కలిగిన అగచాట్లు అందరికి తెలిసినవే. పోనీ మనదేశంలో నంటే మనశక్తి సామర్థ్యాలు తెలిసి దొంగలు గుడి ప్రవేశం చేశారేమోననుకుంటే చివరకు ఇంగ్లండులో కూడ యీపనే జరిగింది. పన్నెండవ శతాబ్దపు పురాతన చర్చి అయిన ఎక్సుటర్ చర్చిలో దొంగలు ప్రవేశించి మూల విరాట్టుగా వుండే వెండి శిలువను భక్తితో మోసుకువెళ్లి దానికి అలంకరించిన ఇరవైవేల పౌన్లధర చేసే వజ్రాలను వొల్చుకొని ఆశిలువ నక్కడే పొలంలోవదలి వెళ్లిపోయినారు. కాలాంతక లోకాంతకులని పేరుపడ్డ స్కాట్లండుయార్డు పరిశోధక శాఖ వారు పరిశోధనకు వుపక్రమించారు !!

## మనదేశంలో కూడా షర్లక్ హోమ్సు, పాయిరోలు !

దొంగలు సినిమాలు చూసి, నవలలు చదివి, విదేశాలలో వారికి ఏకలవ్య న్యాయంగా శిష్యరికముచేసి నానాటికి చతురులు అవుతున్నారు. వాళ్లంత చక చకా చురుకుగా కాకపోయినా మరి మనంకూడ వాళ్లను అరికట్టగల మార్గాలు నేర్చుకోవాలి. రక్షకభటుశాఖ వారికి అసలే తప్పదు. అందువల్ల బొంబాయి ప్రభుత్వంవారు కొత్తగా ఒక పరిశోధక దళాన్ని తయారు చేయబోతున్నారు. ఎక్కువ జీతాలు ఇచ్చి బాగా చదువుకున్న వాళ్లను తెలివితేటలు గల వాళ్లను ఇతర శాఖలలోమాదిరి పోలీసు శాఖలోకి కూడ తీసుకుంటేనే గాని లాభంలేదని, బాగా సూక్ష్మ బుద్ధులయిన వారిని ఏరి వారికి అపరాధ పరిశోధనలో విదేశాలలోమాదిరి చక్కని తర్ఫీదు ఇవ్వాలని నిశ్చయించు కున్నారు. ఈ వుద్దేశము సానుకూలమై సఫలమైతే మద్రాసు ప్రభుత్వం మొదలయిన వారుకూడ అనుకరించుతారట. అప్పుడు ఇంగ్లీషు నవలల్లోనే కాక మన దేశంలోకూడ షర్లక్ హోమ్సు, హెర్క్యూల్ పాయిరోలు బయలుదేరుతారన్న మాట.

## స్త్రీలు జడ్జీలుగా వుండరాదు :

ఆడవాళ్లకు ఆస్తి పాస్తులు యివ్వరాదని, పురుషులతో సరిసమానమైన హక్కులు యివ్వరాదని, కలభాలు జరపటము అందరము చూస్తున్న విషయమే. ఆస్తులు హక్కులు నిదానం మీద తేల్చుకోవచ్చు, ఇంతలో కొంత చదువుకుని ఆవశ్యకతలు అవకాశాలు వున్న వాళ్లు వుద్యోగాలు చేసుకోవచ్చుననుకొంటే దానికికూడ అడ్డుతగులుతున్నారు. మన భారతీయుల సంగతే యింతేమోనని దిగులుపడ నవసరము లేదు. ఈజిప్టులో ఆడవాళ్లు జడ్జీలుగా వుండి తీర్పు చెప్పరాదు అని మతాధికారులు అంక్ష చేశారు. కాని న్యాయకాంక్ష వున్నవారికి యీ అంక్షలు లెక్కా ? నైల్ మహిళా సమాజానికి అధ్యక్షురాలయిన మేడం డోరియాషాఫిక్ విద్యావతి. ఖురానులో స్త్రీలు జడ్జీలుగా వుండరాదని వారికి వ్యతిరేకమగా ఎక్కడ వుదహరించిలేదని, మహమ్మదు ప్రవక్త శిష్యుడు, సున్నీ తెగ స్థాపకుడు అయిన అబూహనిఫా స్త్రీలు జడ్జీలుగా వుండి తీర్పునివ్వటానికి ఒప్పుకున్నాడని, పూర్వ ఇస్లాంచరిత్రలో స్త్రీ జడ్జీలు వున్నారని విశద పరచింది. స్త్రీలు జడ్జీలుగా వుంటారంటే మతాధిపతులు కూడ భయపడటము దేనికో.

# ప్రస్తుత పరిస్థితులు

## బెర్నార్డుషా సమితి

జూలై 26 వ సుప్రసిద్ధ ప్రపంచకవి బెర్నార్డుషా జీవిత యాత్రలో 94 వ మెట్టు ఎక్కుతున్న సంతోష సూచకముగా అలహాబాదులో 'షా సమితి' ని స్థాపించుతున్నారు. మన నెహ్రూ పండితుడు అసలే సరదా మనిషి. ఎన్ని రాజకీయ సమస్యలు వుక్కిరి బిక్కిరి చేస్తున్నా అవకాశం కల్పించుకుని పసిపిల్లలతో కలిసి రేడియో బాలానందానికి వెళ్తాడు ఏనుగు గున్నల బహుమతులు పంపుతాడు. వెళ్లినచోట్ల ఆ దేశపు దుస్తులు ధరించి పకపకా నవ్వుతాడు. అటువంటి వుత్సాహం కలవాడు! అందులోను స్వయంగా బెర్నార్డుషాకు మామిడి పళ్లు ఎట్లాతినాలో నేర్పిన స్నేహితుడు మరి 'షా' సమితికి సభ్యుడుగా పోషకుడుగా వుంటాననటములో వింత యేమున్నది? యు. పి. ప్రధాని గోవిందవల్లభపంత్, అమరనాథ్ఝూ మొదలయిన పెద్దలు యీ సమితి స్థాపన చేశారు. 'షా' నాటకాలు విరివిగా హిందీలోకి అనువదించటము, ప్రదర్శించటము వీరి ఆశయాలుట. నిజంగా రొట్టె విరిగి నేతిలో పడినదన్నమాటే. సున్నితమైన హాస్యంతో మత సాంఘిక రాజకీయాల్లో ఎటువంటి కుళ్లునైనా నిర్భయంగా నిస్సంకోచముగా విమర్శించి ఎత్తిచూపగలవాడు 'షా'. అటువంటి రచనలు చదివినా, అనువదించినా ప్రదర్శించినా పిసరంత ఉపకారమైనా మనకు కలక్కపోదు.

## కొరియాలో యుద్ధపు రవ్వలు

కొరియాలో యుద్ధము ప్రపంచశాంతికి ప్రమాదకరంగా పరిణమించుతున్నది. మూడవ ప్రపంచ యుద్ధానికి దారితీయగలదేమోనని వివిధదేశ రాజకీయవేత్తలు కలవర పడుతున్నారు. రెండవ ప్రపంచ యుద్ధము అయిపోయిన తర్వాత కొరియా ఉత్తరదక్షిణ కొరియాలని రెండుగా విభాగమయింది. ఉత్తర కొరియా కమ్యూనిస్టుల ప్రాబల్యము ఎక్కువగా వుండి రష్యా అడుగు జాడల్లో నడుస్తున్నది. దక్షిణ కొరియా జనరల్ సిజ్మన్‌రీ నాయకత్వమున అమెరికా అండకు చేరిపోయినది. ప్రస్తుతము యుద్ధానికి మీరు మూలకారకులంటే మీరు అని యిరుపక్షాలవారు ఒకరి నొకరు నిందించుకుంటున్నారు.

అమెరికా ప్రోద్బలమువల్ల శాంతిని నెలకొల్పుటకు ఐక్యరాజ్య సమితి నిశ్చయించు కున్నది. అందుకోసమై ఏర్పడిన సేనాదళం ఐక్యరాజ్యసమితి పతాకము క్రింద కొరియాలో 'పోలీసు చర్య' జరుపుతున్నది. డగ్లస్ మెకార్థర్ నాయకత్వాన వున్న యీ సేనలో చాలాభాగం అమెరికా సేనలే. ఐక్యరాజ్య సమితిచర్య న్యాయబద్ధమైనది కాదని రష్యావాదన. కొరియా అంతర్యుద్ధము క్రమముగా వ్యాపించి ప్రపంచ యుద్ధముగా పరిణమించకుండ చేయాలని భారత ప్రధాని నెహ్రూ పండితుడు రష్యా, అమెరికా, బ్రిటన్ మొదలయిన దేశాలకు స్వయముగా వుత్తరాలు వ్రాశాడు. కాని ఒక్క రష్యామాత్రమే యీ ప్రయత్నాని అభినందిస్తు వ్రాసింది. ప్రస్తుత వార్తలను పట్టి ఉత్తర కొరియాదే పైచెయ్యిగా కనపడు తున్నది. నెహ్రూ పండితుని ప్రయత్నము ఫలించితేగాని కొరియా సమస్య తేలేట్లు తోచదు. ఎట్లా పరిణమించబోయేది వూహించటము కష్టముగా వున్నది. అయినా జరుగబోయే భద్రతామండలి సమావేశానికి రష్యాకూడ హాజరు కాబోతున్నదని వార్త రావటాన ఆ సమావేశములో యీ విషయము తేలిపోగలదని ఆశించుదాము.



---

## కృతజ్ఞత.

శ్రీమతి జి. సుందరమ్మగారు, శ్రీమతి అలమేలు శ్రీనివాసన్‌గారు, మహిళాసభకు రు. 100/- విరాళముగా నిచ్చి, యావజ్జీవ సభ్యురాండ్రుగా ఎన్నుకొనబడిరి. వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళాసభ.

---




## చతుర్ధ గుచ్ఛము.

౧

ఏమీ తెలియని వాళ్ల జీవితమే ఆనందమయము. సముద్రంలో ఏరు కలిసేచోట, బెస్తల పల్లెలో ఏటిలో పోటూ పాటులూ, సముద్రం కెరటాలూ, ఆటలలాడుకొనే యిసుక వొడ్డుల్లోనే, తాను బుచ్చివెంకులుగా వున్న నాటిజీవితమే, ఏ దిగులూ లేకుండా ఏ పొగులూ తగలకుండా, మధురంగా జరిగి పోయింది. వేసవిలో సాయంకాలాల సముద్ర దూరాలనుంచి వచ్చే చల్లగాలిలా హాయిగా ఉండేది. బ్రతుకు ఏ చావపారిన కొస్సిరి మానులు ఏటిలో ఈ దరినో ఆ దరినో, నిట్రాళ్లుగా పాతి, పోటులో వలలుగట్టి పాటులో చేపలను పోగు చేసుకొనే ఆనందం బంగారు నాణేలను ప్రోగు చేసుకొనేటప్పుడైనా దొరకదు కదా! ఈ ఆలోచనలు బుచ్చివెంకట్రావు హృదయంలో మేఘాలై కమ్ముకు వచ్చాయి. పద్దాలు ఎంత ఒడుపుగా చేపలను పట్టుకొనేది. తాను గడ గాలం వేసి, కాచుకుని ఉంటే గంటలు గంటలు ఇంత చిన్న చేపైనా ముల్లుకు తగిలినవా ఏమన్నా నా, ఇంతట్లో పద్దాలు పరుగు పరుగున వచ్చి "బావా! ఎన్ని చేపలట్టినావు? ఏంది! ఒక్క సేపయినా గాలానికి తగల్లేదేం? సూసుకో, నే మంత్రంబెట్టి ఎన్ని చేపల్లాగేస్తానో! హామ్, మంకాళీ హూం మాంకాళీ ఓ యీ కెడు సేపా పడవే" అంటూ గేలగడ చేత్తోపుచ్చుకొని తన అందమైన చేతులతో యిటూ అటూ కదిపేటప్పటికి జర్రని గేలంతాడు బిగువెక్కింది. "ఓ చేప పడింది తాడుకి కట్టిన బెండు మునిగిపోయింది. తే! యిలా తే! నీవు లాగలేవని తాననేవాడు;" లాగు అబ్బో దిట్టమైన చేపే నన్నే లాగస్తున్నది." అన్నాడు. ఇద్దరూ పట్టి నెమ్మదిగా వెనక్కి నడుస్తూ ఒక సరివిచెట్టు పూతపట్టుకొని ఒక మూరన్నర 'వంజరం' చేపని యివతలికి లాగారు! ఎంత తెలివితో పద్దాలు ఆచేపను ఒడిసి పట్టుకొంది! తామిద్దరూ కలిసి ఎన్నిమార్లు చందువా చేపలూ, సొరలూ, సముద్రపు పెద్ద రొయ్యలూ, పండుగొప్పలూ, సావిడాయిలూ, నెత్తళ్లూ అతినేర్పుతో పట్టుకొని ఆనందం పడలేదు!

ఆ తీయ తీయని దినాలు వెళ్లిపోయాయి తమ జీవితంలోంచి చేపల వాసన పోయింది. కొత్తగా వచ్చిన శాండల్‌వుడ్ సబ్బు వాసనా, పేరీస్ సెంటుల పరిమళాలూ శృతులు

కళియ తెమ్మెరలు మాయలా ఎరువులు సొమ్ములా అయి పోయినాయి.

ప్రపంచ జ్ఞానం వల్ల ఇదివరకు ఎరుగని జీవితంలో క్రొత్తగా ప్రవేశిస్తాయి. ఈ చెన్నపట్నం బ్రతుకు ఎప్పుడూ ఆగని గందరగోళంతో, తగ్గని వేగంతో, అంతులేని కాంక్షలతో నిండివుంది. కోరి అంతు తెలియరాని దుఃఖాలు తెచ్చి పెట్టుకున్నాడు తాను.

అతని ఆరోగ్యంచింది, చివిలుతూ వుంటుంది అతని బలం సముద్రం కెరటాలులా ఉప్పొంగుతూ ఉంటుంది. అతని స్త్రీవాంఛ ఉత్తమానవసైజ ధర్మయుక్తా పూర్ణము. ఎన్నడూ అది అతిగా ఉండలేదు. ఉత్తమంగా ఆరోగ్యవంతమై ఉండెది. నేడాతని సహధర్మచారిణి తన్ను ఒంటిగా వదిలి వెళ్లిపోయింది. తనబ్రతుకు చుక్కాని పోయిన నావలా అయింది. ఈ వాగుల్లో, వేగమైన ప్రవాహాల లాగుడులో, తననావ మునిగిపోవునో, ముక్కలవునో!

అతడు తనమనస్సులోని బాధను చంపుకోడానికై తన కులస్థులు నివసించే చేరీలలోనికి వెళ్లేవాడు. ఎంత దుర్భరమైన జీవితం జీవిస్తున్నారు వాళ్లు! గట్టిగా కాళ్లుచాపుకుంటే మనిషి పట్టనంత చిన్న స్థలాల్లో కట్టుకొన్న గుడిసెలలో కాపురాలు—పరిసరాలు ఎన్నో కల్మషాలు కూడుకున్న ప్రదేశాలు, ఇంత పెద్ద చెన్నపట్టణంలో జీవిస్తూ ఒక్కరైనా సినిమాకు వెళ్లి చూడగలుగుతారా? ఆఖరికి చీనా బజారులో రోడ్డుప్రక్క పెట్టుకొని అమ్మే వస్తువుల్లో ఒక్క అటా సరుకైనా కొనుక్కొని ఆనందించ గలరా! ఒక నాడైనా వారు కాఫీ హోటలెరుగుదురా! సంగీతం కచ్చేరులంటే ఏమిటో వారికి తెలుసునా! ఎందరి జీవితాలల్లోన నాట్యాలు నిండిపోతున్నాయి? ఒక్క నాట్య ప్రదర్శనానికైన యీ చుట్టాలు, యీ ప్రజలు, యీ బెస్తలు, యీ చేపలు పట్టుకునే వాళ్లు సముద్రపు ఒడ్డున చిన్న పీతలులా బ్రతుకులు బ్రతికే వీళ్లు వెళ్లిచూచి ఆనందించ గలరా?

ఎక్కడ చూచినా వలలు—! చేపలు వుంచుకునే బుట్టలు! గేలాలు! కుళ్లిపోయిన చేపల వాసన!!

ఏనాటికైనా, యీ చేరీలు, తీర్చిన వీధులతో, చిన్న చిన్న తోటల మధ్య వున్న సొగసైన యిళ్లతో, శుభ్రమైన బట్టలు కట్టుకొని ఆడుకునే పిల్లలతో, పొందికగా అలంకరించుకొని కళ్లల్లో కాంతులు వెలుగుతూ వుండగా ఆరోగ్య దేవతలులా నడిచిపోయే స్త్రీలతో కలకలలాడి పోగలదా! తెచ్చిన చేపలు వుంచేందుకు వాటిని బుట్టల కట్టేందుకు, తర్వాత యెగుమతి చెయుటానికి వేరె ఒకటి ఫ్యాక్టరీ లాంటి కర్మాగారం వుండవచ్చుగాక! అలాంటి సంస్థను శుభ్రంగా, శాస్త్రయుక్తంగా వుంచవలసి వుంటుంది. అలాంటి కర్మాగారానికి, ఆ కర్మకు, జనకులైన బెస్తలు జీవితానికి యితర సంబంధమేమి వుండకూడదు. వస్త్రాల ఫేక్టరీలో పనిచేసే వారి యిళ్లలో దూది పడివుంటుందా అసహ్యంగా!!

అతడు గాలివానంత నిట్టూర్పు విడిచి నాడు.

౨

ఆంధ్ర మహిళా సభ విద్యార్థిను అందరు కలిసి వారి ఉపాధ్యాయినుల ఒద్దికలో ప్రత్యేకం బస్సు ఒకటి కాంట్రాక్టు తీసుకొని మహాబలిపురం వెళ్లారు. బాలిక లందరూ కలకలలాడుతూ ఆ ప్రదేశమంతా నిండి పోయారు. బొమ్మలు చూస్తూన్నారు కొందరు! ఒక్కొక్క ఏక శిలతోటే నిర్మాణం చేసిన చిన్న ఆలయాలైన శిలా రథాల కడకు పరుగిడి పోయారు కొందరు. కొందరు సముద్రతీరం దగ్గరవున్న దేవాలయానికి పరుగెత్తారు. భీముని పొయ్యి చూశారు. అర్జునుని తపస్సు ఆశ్చర్యం పొందుతూ గమనించారు. వేణుగోపాలుని వెన్నముద్ద చూసారు.

వాళ్లకి శిల్ప సౌందర్యాలు అర్థమయ్యాయి అనీకాదు పల్లవ శిల్ప విశిష్టత తెలిసిందనీ కాదు! వారికి కళా రహస్యాలు అవగాహనమైందనీ కాదు. ఆప్రదేశము యొక్క మంత్రశక్తి వారందరిని ఆవహించింది. ఏ యుగాలనాటి అనుభూతులో, ఏ మహా శిల్పుల దివ్య స్వప్నాలో, ఆ ప్రదేశం నిండి, ఆ క్షేత్రంలోని ప్రతి శిలలో అణువు అణువునా ప్రసరించి, ఆ పవిత్ర క్షేత్రానికి వచ్చిపోయే యాత్రికుల హృదయాలను సోదిమి కొంటాయి.

పద్మావతికి అలాంటి ప్రపంచం చూడడమే మొదటిసారి. ఈ చిన్న చిన్న రాళ్ల గుట్టలు చూడ్డానికా యింత దూరం వచ్చింది! అని మొదట అనుకుంది. కాని నెమ్మదిగా ఆ క్షేత్రం యొక్క మహిమ ఆమెనూ ఆవహించింది. పద్మా

గారిలో తిరుక్కాలి కుండ్రంలో ఆగి ఆ పక్షితీర్థం చూశారు వాళంతా. తామంతా సర్దాగా కొండ ఎక్కారు! దారిలో అల్లర్లు చేశారు. ఆడుకొన్నారు, పాడుకొన్నారు. కొండ మీదికి వెళ్లిన వెనక, పూజారి పక్షులను పిలవడం అవి రావడం, ప్రసాదం ఆరగించడం, మళ్లీ దేని ప్రయాణాన్ని అవి వెళ్లిపోవడం, ఆ దృశ్యాలు పద్మావతి కెంతో ఆనందం కలిగించాయి, ఒక పక్షి కాశీ నుండి వస్తుందట యింకొక పక్షి రామేశ్వరాన్నించి వస్తుందట.

ఆ పక్షులు మొదట ఏ అనంత నీల్లాల్లోనుండో ప్రత్యక్షమయ్యాయి. ఆకాశంలో గాలి పడగల్లా తేలుకొని వచ్చాయి. తన మనస్సు తిరిగిపోయినట్లే ఆ రెండు పక్షులు ఎక్కడికో తూర్పులో గిరగిరా తిరిగినవి. తేలుకొని తేలుకొని వచ్చి పక్షులు పూజారి కడ వాలినవి.

కొందరు ఉపాధ్యాయినులు ఇదంతా హుళక్కి అన్నారు. "ఆ పక్షులు ఆ చుట్టుప్రక్కలనే కొండలలో ఉంటాయి. సరిగా భోజనం వేళకు అవి వచ్చి వాల్తాయి!" అని సైన్సు ఉపాధ్యాయిని.

"అయితే, ఈ చుట్టుప్రక్కల ఉన్న అన్ని గరుడ పక్షులూ ఎందుకు రాకూడ దండీ?" అని పద్మావతి ప్రశ్నించింది.

"వాటికి భయం!"

"వీటి కెందుకు లేకపోయింది!"

"వీటిని పెంచి ఈలా అలవాటు చేసిఉంటారు!"

"ఈ పక్షులు ఎంత పూర్వకాలం నాటివో?"

"ఒక జత ముసలివై పోగానే ఇంకో జతను తయ్యారు చేస్తారు!"

ఈ సంభాషణ అంతా వింటూ వున్న ఇంకో ఉపాధ్యాయిని, వీరిద్దరి దగ్గరకూ వచ్చి కూర్చుంటూ. "ఒక మహా భావాన్ని ఎంత ముక్కలు చేశావమ్మా మాలతీ?" అని అన్నది.

ముక్కలు చెయ్యడమేమిటి ఇందిరా? భావం ముక్కలు అవడమేమిటి?"

"అవును భావం ముక్కలవడమేమిటి! భావం రబ్బరు ముక్కలు కాదులే! గాజు సామాను ముక్కలౌతుంది. ఎంత శాస్త్రజ్ఞురాలివి. కలలు విచ్ఛిన్నం కావూ? ఆశయాలు భగ్నం కావూ? ఆశలు శూలాలు కావూ? ఆ విధంగానే భావాలు ముక్కలవుతాయి."

మాలతి : నువ్వు కవయిత్రివి. కథలు రాస్తావు. మధురమైన కంఠంతో పాటలు పాడుతావు. వీణ తీగలు మీటి మంత్రాలు పన్నీరు జల్లుతావు.

పద్మావతి : మాటలలో కవిత్వం ప్రదర్శిస్తున్నారే టీచరు గారు!

ఇందిర ఆలాంటి అమ్మాయి భావం ముక్కలవడమంటుందేమిటి పద్మా!

పద్మా : ఏం భావం ముక్కలయింది ఇందిరక్కగారూ!

ఇందిర : ఈ విచిత్ర సన్నివేశము అనేక శతాబ్దాల నుండీ జరుగుతూ ఉన్నదని, చరిత్రలు చెప్పుతూన్నవి. ఈ పూజారి పూర్వీకులు ఈ పూజారివలెనే పక్షులను పిలచారు. ఈ పక్షుల పూర్వీకులు యీ పక్షుల వలెనే సరిగా వేళకు యింత అందంగా వచ్చి తమ కర్పించిన ప్రసాదము ఆరగించి; రివ్వున నీలాల లోతులలోనికి ఎగరిపోయి తెల్లని మేఘాలలో కలిసిపోతున్నాయి.

మాలతి : ఎంత తియ్యగా చెప్పుతున్నావు అక్కా! కోతులను తయారు చేసి మన యింటికి వచ్చి ఆటలాడించే చెంచు, జెంగాల ముసలమ్మలకన్న ఈ పూజారులు ఎక్కువేమిటి.

ఇందిర : ఇక్కడ ఈదృశ్యంలో వుండే భావము చాలా ఉత్తమమైనది కదా! కోతులాట ఒక బిచ్చకత్తె అడుక్కునెందుకు వుపయోగించేందుకు మాత్రమే.

మాలతి : ఆకోతిని హనుమంతుడని ఆడించు తుందిగా! అది గొప్ప భావమే.

ఇందిర : ఎంత చక్కగా పోల్చావు! ఈ కొండ శిఖరాలమీద పచ్చని వృక్షాలు నిండిన యీ చరియలలో మేఘాలు మనకడకు వచ్చి మేలమాడె పవిత్ర ప్రదేశాలలో, ఒక దివ్యలోకము ప్రత్యక్షమౌతుంది. ఆ లోకంలో ప్రతి

కలిసిపోయి. మహాద్విచిత్ర సన్నివేశము మానవ జీవితాలను మహోన్నతపథాలకు కొనిపోతుంది. హిమాలయాలలో నిత్యజన్మయై ఒగివచ్చి భరత దేశంలో నిత్య ప్రవాహమై, నిత్యసముద్రసంగమమైన గంగానదీ భావము భారతీయ జీవితాన్ని నిత్య నూతనోన్మేజితము చేస్తున్నదో అలాగే యీ తిరుకాళికుంద్ర సన్నివేశము.

పద్మా: ఇందిరక్కయ్యగారు చెప్పినమాటలు నాకేవో పులకారాలు కలుగజేస్తున్నవి. నేను గ్రహించుకోలేని ఆలోచనలు జాజిమల్లి సువాసనలుగానన్ను అలుముకు పోతున్నవి.

3

నరసింహమూర్తి మేస్టరు నానాటికి చిక్కులెక్కువ పడిపోతున్న బుచ్చివెంకట్రావు పద్మావతుల జీవిత సూత్రాలు గమనిస్తూ గాఢవిషాదంలో పడిపోయాడు. వాళ్ల బ్రతుకులే ఒక సంగీతమైతే అపశ్రుతులులా, అపస్వరాలులా, తప్పుడు తాళాలులా ఏవేవో వచ్చిపడినవి. అతి వేగమైన ఒక ప్రవాహంలో పడి తాను కొట్టుకొచ్చాడు. తగిన శిష్యురాలై తనకు పేరు ప్రతిష్ఠ తెచ్చి పెట్టుతుందీ అనుకున్న పద్మావతి తన దగ్గరకు రావడమే మానేసింది. పోనీ, సంగీతాభ్యాసం కోసం ఎవరైనా ఒక పెద్ద సంగీత విద్వాంసుని దగ్గిరకు వెళ్లుతున్నదా అంటే అదీలేదు. ఆడవాళ్ల మనోభావా లెవరి కర్థమౌతాయి! అసలే సంగీతం మానివేస్తుందేమో, కొంపదీసి అని లోలోన అతడు భయపడినాడు.

తాను వట్టి వంట బ్రాహ్మణుడై పోయినాడు వీరిరువురి కోసమూ! తాను పాడుకునే సంగీతము కూడా అభ్యాసము చేసుకోడములేదు. సంగీతము భగవతార్చన అని అనుకున్న తాను చాపల వాసనకొట్టే ఒక బెస్తల దాంపత్యం, తన్నంత ఇంద్రజాలంలో ముంచివేయడం ఒక విచిత్రమే. ఆమె తనకు ఒక కూతురుకన్న యెక్కువైనది. ఉత్తమ విద్య వినయములలో కులం తేడాలు వుండనే వుండవు. అసలు కులంతేడా లేమిటి? ఏవిధంగానో గోడలు కట్టని మూడు ముఖ్యమైన కులాలు వేదకాలంలో వుండేవంటారు. వారిలో ఒకరి కొకరికి సంభంధ భాంధవ్యాలు, భోజన ప్రతిభోజనాలు ఉండేవికావా! రాను రాను జనసమృద్ధియై ఎక్కువై భావసంఘర్షణలు వృద్ధియై అనేక కులాలు ఉద్భవించాయి! ఏమిటి తనకీ ఆలోచనలు! ఏది ఎట్లయైన వీరిద్దరు తనబిడ్డలు! వీళ్లు వృద్ధిఅవడం అతను కన్నులార చూశాడు. ఆ వృద్ధిలో తానూ పాలుపంచుకొన్నాడు. వాళ్లిద్దరిని తల్లిలా పెంచాడు. చూస్తూ చూస్తూ ఉండగా ఏదో పెనుభూతం వాళ్ల జీవితాన్ని ఆవహించింది!

ఏమిటీ పెనుభూతం ఎవరిలోటు? అంత ప్రేమించుకున్నారే? ఒకరినొకరు నిడవకుండా ఉండేవారే! విడిచి బ్రతుకలేక పోయెవారే! ఒకరికోసం ఒకరు ఉద్భవించినట్లుగా ఒకరికోసం ఒకరు రూపాలు దాల్చినట్లుగా ఈడు జోడై తన కన్నుల యెదుట తిరుగుతూ యుండే వారే! ఏమిటి ఈనాటి ఈ పరిస్థితి! నరసింహమూర్తి సంగీత మేస్టర్ గారు దిన దినమూ ఆంధ్ర మహిళా సభకు వచ్చి పద్మావతిని చూచిపోతూ ఉండేవాడు. సాయంకాలము కాగానే పిల్లలందరు సభలో ఉన్న తోటలో ఆడుకొంటూ ఉండేవారు. కేరంబోర్డు కొందరు ఆడేవారు, ఊయల ఊగేవారు కొందరు. బల్ల బంతి ఆట ఆడేవారు కొందరూ, బల్లఊపు ఆట ఆడేవారు మరికొందరు. ఇలా కలకల ఆటల్లో పొంగిపోయే బాలికల మధ్య ఎక్కడో ఒక్కతే కూర్చుని పద్మావతి ఆలోచించు కొంటూ ఉండేది!

ఆమెకేమీ ఆలోచనలు తెగేవి కావు. ఇంతట్లో నరసింహమూర్తి మేస్టరు గారు వచ్చారనగానే, ఆమెకు కొంత ఊరట కలిగేది. వెంటనే అధికారి అక్కగారిని సెలవు వేడి ఆ బాలిక నరసింహమూర్తితో సముద్రం ఒడ్డుకు వాహ్యాళికి బయలుదేరేది. పన్నెండో నెంబరు బస్సు ఎక్కి ట్రిప్లికేనులో దిగి సముద్రం ఒడ్డుకు పోయే వారు వారిద్దరూ!

ఓ నాడు వారు అక్కడ కూర్చుండగా నరసింహమూర్తి సతీర్థుని శిష్యుడైన ఒక యువకుడు వీరిద్దరూ కూర్చున్న కడకు వచ్చాడు. ఆ యువకుడు నరసింహమూర్తికి కొన్నాళ్లు శిష్యరికం చేసినాడు.

యువకుడు "నమస్కారం నరసింహమూర్తి మేస్టారూ! మదరాసు ఎప్పుడు వచ్చారు? ఇక్కడ పనేమిటి? ఎంత

కాలం ఉంటూ విక్కడ?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

నరసింహమూర్తి ఒక్క నిముషం అతన్ని ఆనవాలు పట్టలేక పోయినాడు. "ఓహో! నువ్వటోయి రాధాకృష్ణా! నీవేషం చూచి నిన్నానవాలు పట్టలేక పోయినాను సుమా! ఏం చేస్తున్నా విక్కడ? ఎన్నాళ్లనుండి ఉన్నావు?" అని ఆనందంతో లేచి, అతన్ని కొంచం దూరంగా తీసుకు వెళ్లి ఆ యిసుకలో అతన్ని కూర్చోబెట్టి తానూ కూర్చున్నాడు. వారిమాటలు పద్మావతికి వినబడుతున్నాయి.

ఆ యువకుడు రాగానే పద్మావతి అతన్ని కొంచెం ఆశ్చర్యంగానే చూచింది. పట్టు పాయిజామా, పట్టులాల్చీ, చేతిలో కొంచెం ఖరీదుగల రిష్టువాచీ, మెళ్లో బంగారపు సన్నని గొలుసు, ఆ గొలుసు వేలాడుతూ ఏదో ఓచిన్న పతకమూ! కళ్లకు ఫ్రేములేని అద్దాలజోడూ! కాళ్లకు జరీ పూవులు కుట్టిన మొఖమల్ చడావులున్నాయి! ఈ యువకుడు చాలా గమ్మత్తుగా ఉన్నాడు. గిరిజాలులా జుట్టు చిత్రంగా సముద్రపుగాలికి ఎగురుతూఉంది! అతడూ నరసింహమూర్తిగారూ మాట్లాడే మాటలు ఆమె వింటూ ఆ యువకుని గమనిస్తూ ఆమె కూర్చుని ఉన్నది.

"నేను ఇక్కడ ఓ సినిమా కంపెనీలో సంగీత దర్శకుడుగా ఉన్నాను. భరతనాట్యం కూడా బాగా నేర్చుకున్నాను. గొంతుకు చాలా తియ్యగా సైగల్ కంఠంలా ఉండడంచేత, కథానాయకునికి నా కంఠం ఇస్తూ ఉంటాను."

"ఆశ్చర్యమే! ఎంత సంపాదిస్తున్నావు?"

"ఏదోలెండి, నెలకు రెండుమూడువేలు! సంగీత దర్శకునిగా ఒక్కొక్క చిత్రానికి పదివేలుచొప్పున ఇస్తారు. కంఠం ఇచ్చినందుకు పాటకు వేయిరూపాయలు. డాన్సు డైరక్టరుగాఉంటే అయిదారువేలు. ఒక్కొక్కసారి రెండు మూడు కంపెనీలలో పనిచేస్తూ ఉంటాను"

"ఏమిటీ" బాగానే ఉందోయి నీపని. నాకూ ఏదో ఈ సినీమాలలో ఏదయినా పని ఇప్పించవయ్యా"

"దానికేముందండి మేష్టారూ! "అదిగో ఆ అందమైన చిన్నకారు చూశారా!" బేబీఫియాట్టంటారు దాన్ని. అది నా స్వంతకారు. మా కుటుంబానికి ఒక "హిల్‌మాన్ మిన్క్సు" కొన్నాను. దానికి డ్రైవరున్నాడు."

"చాలాబాగా ఉంది. ఫష్టుక్లాసు! ప్రజ్ఞ అంటే నీదీ ప్రజ్ఞ!"

"మా యింటికోసారి రండి మేష్టారూ!"

"తప్పకుండానోయ్"

"అచ్చా! అయితే అడగవచ్చునో అడగకూడదో! మరి, ఆ అమ్మాయి ఎవరు? మీ బ్రహ్మచర్యానికి స్వస్తి చెప్పారేమిటి? ఎవరా సినీమాతార! సినిమాలో చేర్పించడానికి తీసుకు వచ్చారా? అయితే మనం చాలా సహాయం చేయగలము"

"ఛా! ఛా! ఆ అమ్మాయి నా బిడ్డవంటిది వంటిదేమిటి, నా పెంపుడు బిడ్డే! నా దగ్గిర సంగీతం నేర్చుకుంటూంది. మావూరే, కావలి వాళ్లు బెస్తలులే! అయినా భాగ్యవంతులు. ఆవిడ భర్త ఈ ఊళ్లోనే, పెద్ద వ్యాపారం చేస్తున్నారులే!"

"అలాగా క్షమించాలి మీరు. కాని కాస్త నలుపైనా ఏమి అందంగా ఉందండీ ఆ అమ్మాయి. పేరు మోసిన మా సినీమా తారలు చాలామందికన్న నయం. సంగీతం బాగుంటుందా అండీ మేష్టారు!"

"బాగుండడమేమిటోయ్. తిలోత్తమ కంఠమే. నువ్వన్నట్లు అనేకమంది తారలకన్న చాలా బాగా పాడుతుంది."

"నాకోమాటు వినిపించేటట్లు చేయరూ"

"చూద్దాములే!"

"ఆ అమ్మాయిలో ఏదో అద్భుతమైన ఆకర్షణ ఉంది చూస్తారూ! ఆ అమ్మాయి భర్త ఒప్పుకుంటే ఆవిణ్ణి మొదటి రకం తారగా తయారు చేయగలను. ఈ మధ్య మన గొంతుకు మీరు వినలేదు. మొన్ననే రికార్డు ఇచ్చిన ఈ పాట వినండి!

(సశేషము)



# విశ్వకవి రవీంద్రనాథుని సంస్మృతి

శ్రీమతి గోళ్లమూడి రాజ్యలక్ష్మమ్మ

మహాకవులయిన వారు తాము సృష్టించిన సారస్వతములో నాటి దేశ నాగరికతను సమాజమును ప్రతిబింబింప చేస్తారు. రవీంద్ర కవీంద్రుడు తన రచనలలో భారతదేశాన్ని నాగరికతా విజ్ఞాన పూర్ణముగ, ఉత్కృష్టమైనదిగా లోకానికి చూపించగలిగినాడు. ఇందు మూలకముగా మాతృదేశానికి నాటి దేశాలలో గౌరవకరమైన స్థానము కలిగించటమే కాక తన కవితా మాధుర్యమువల్ల రచనా శక్తివల్ల నోబెల్ బహుమానమును కూడ అందుకున్నాడు. ఉత్తమ భావ పూర్ణమైన, రసవంతమైన కవితవల్ల ఆయన ప్రపంచానికి విశ్వకవి. భారతీయులకు మాత్రం ఉత్తమ ఆదర్శములను బోధించి అమర ప్రబోధము చేయగల గురుదేవుడు.

ఒక విధంగా టాగూరు మహాశయుడు రాజకీయములలో పాల్గొనలేదనే చెప్పాలి. ఆయన సారస్వత కళారాధనలతో మానవ సమాజానికంతకీ పనికివచ్చే సేవ చేయ సంకల్పించుకున్నాడు. సఫలుడు కూడ అయినాడు. మానవ ప్రకృతిని వివిధ మానసిక ప్రవృత్తులను సమగ్రంగా పరిశీలించాడు. ఆయనకు స్త్రీలు పురుషులు, వృద్ధులు పసిపాపలు అందరు వర్ణనీయులుగాను అద్భుతంగానే కనిపించారు. అందువల్లనే ఆయన రచనల్లో యువతీ యువకులే కాక వృద్ధులు, పసిపిల్లలు, బిడ్డల మీదివాత్సల్యంతో ప్రపంచమే మరచి పోయే 'కాబూలువాలా' వంటి వాత్సల్య హృదయులు కనిపిస్తారు.

గురుదేవుడికి స్త్రీలంటే ఎంతో విశ్వాసము గౌరవము. పురుషునికి నిలబడే శక్తినిచ్చి కార్యదీక్ష ఇవ్వగలది స్త్రీయే అని ఆయన భావన. పురుషునిలో లోపించిన సమగ్రత పరిపూర్ణత స్త్రీలో అంతర్భూతమై వున్నదని తన రచనలంతటా విశద పరచాడు. అంత మాత్రాన స్త్రీ పక్షపాతి అని, ఆమె ఏమిచేసినా సహించుతాడని అనుకోరాదు. భారత స్త్రీకి నమ్రత, లావణ్యం పెట్టని సొమ్ములనీ, ప్రేమే ఆమెలో విజృంభించివున్న బలమని ఆయన సిద్ధాంతం.

ఆ అపూర్వ కళోపాసకుడు భగవంతుడు పురుషుడిని సృష్టించేటప్పుడు బడిపంతులుగా వున్నాడనీ, స్త్రీలను సృష్టించేటప్పుడు కళారాధకుడుగా మారినాడని అన్నాడు. ప్రేమే లోకానికి స్త్రీలు యివ్వగల సందేశమనికూడ ఆరూఢ పరచాడు.

వేష భాషలలో, భావ సంపదలో ప్రాచీన భారతీయ ఋషిపుంగవ శ్రేణికి చెందిన విశ్వకవి రవీంద్రనాథ టాగూరు అస్తమించి ఆగస్టు 7వ తేదీకి తొమ్మిది సంవత్సరాలు నిండుతవి. ఆయన కీర్తి ప్రఖ్యాతులకు మాత్రము మరి కాలపరిమితే లేదు. ఆకాశానరవి ప్రకాశించినంతకాలం యీ రవీంద్రుని పేరు నిల్చి వుంటుంది.

# జేనీర్

* శ్రీమతి మాలతీ చందూర్ *

[ జేనీర్ సవతితల్లి దగ్గర, లావుడ్ అర్ఫనేజ్‌లో తన జీవితాన్ని గడిపి, రాచెస్టరు జమీందారు ఇంట్లో ఉపాధ్యాయినిగా చేరినంతవరకూ వెనుకటి సంచికలో చదివాము. ఇంతవరకు జేనీర్ బాల్యదశనుగూర్చి చెప్పుకున్నామనుకోవచ్చు. ఇకమీద తన యవ్వనదశనుగూర్చి చెప్పునది చదువుదాము ]

---

ఒకనాడు మా యజమాని దగ్గిరనుంచి చాలామంది స్నేహితులతో బంధువులతో తాను ఎస్టేటుకి వస్తున్నానని చీటీ వచ్చింది. ఇల్లంతా కడగటం, తుడవటం, కొత్త సామాన్లు తేవటం యిలాంటి పనులతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాం. ఫెయిర్‌ఫాక్సు ఆ వొచ్చే ఆమె యజమానికి కాబోయే భార్య అని చెప్పింది. ఆమె తల్లితండ్రులూ, వారి బంధువులూ, స్నేహితులూ, ఒక ముప్పైఏభై మందిదాకా వస్తారనీ, ఆమె చాలా అందగత్తె అనీ, చాలా దర్జాగా వుంటుందనీ చెప్పింది. ఈ కారణాలను చూసే యజమాని ఆమెను వలచాడట. జమీందారు ఆజ్ఞ ప్రకారం నేనూ బంధువులున్న హాలులో వారి ఆటపాటలను చూస్తూ గడపాలిసొచ్చింది. ఇన్‌గ్రామ్—అనగా కాబోయే జమిందారిణి నేవింటూండగానే పంతులమ్మల్ని చూస్తే తనకి గిట్టదని వాళ్లమ్మతో అంది. నేను నెమ్మదిగా గదిలోంచి తప్పుకున్నాను. మేడమీదకెళ్తూ కాలిజోడు లేసును సవరించుకునేందుకు వంగాను. తలెత్తేవేళకి ఎదురుగుండా రాఛెస్టరు.

"దేన్నిగురించో బాధపడ్తున్నట్టున్నావ్ — కారణం చెప్పవూ?" నేను కళ్లమ్మట నీళ్ల పర్యంతం అవటం చూశాడు. "పనివాళ్లెవరన్నా చూస్తారనే భయం లేకపోతేనా! సరే, వెళ్లిరా" అంటూ పెదిమి కరుచుకున్నాడు.

థార్న్‌ఫీల్డులో రోజులు అతిథుల ఆటపాటల్తో గడుస్తున్నాయి. రోజురోజుకీ యిన్‌గ్రామూ, యజమానీ ఒకరికొకరు సన్నిహితంగా అవుతున్నారు. ఆనాడు జమీందారు ఏదో పనిమీద వూరికెళ్లారు. ఆ రోజే మాసన్ అనే పెద్దమనిషి యజమానికి స్నేహితుణ్ణని చెప్తూ యింట్లో దిగాడు. ఆ సాయంత్రం ఒక సోది మనిషి వచ్చి ప్రతివాళ్ల చేతులూ చూసింది. ఇన్‌గ్రామ్ చెయ్యిచూసి ఏదో అశుభమయిన వార్త చెప్పిందట. నాచెయ్యి చూసింది. నా హృదయంలో భద్రంగా దాచిన రహస్యాలన్నీ చేతుల్లో చదివినట్లుగా చెప్పింది. నా కాశ్చర్యం కలిగింది. ఆ సోదిమనిషి మరెవరూ కాదు. నా యజమాని రాఛెస్టరే. నా హృదయాన్ని కనుక్కునేందుకు యీ విధంగా వచ్చాననీ, క్షమించమనీ కోరాడు. ప్రొద్దుటే యజమానికోసం 'మాసన్' అనే స్నేహితుడు వచ్చి వేచివున్నాడని చెప్పాను.

"మాసన్" అనే మాటవిని యజమాని నిలువెల్లా వణికిపోయాడు. నా చెయ్యిపట్టుకొని "ఈ బాధలు, అపాయాలూ, భీకర జ్ఞాపకాలూ, లేకుండా నీతో ఏ ద్వీపంలోనైనా వుంటే ఎంత బాగుంటుంది?" అన్నాడు బాధగా.

ఆపైన ఎంతో సంతోషంతో వచ్చిన అతిథిని సత్కరించి గృహాన్ని చూపించాడు.

అది పున్నమి రాత్రి. వెన్నెల మంచులా మెరుస్తోంది. ఆ అర్ధరాత్రి నిశ్శబ్దాన్ని చీల్చే క్రూరమైన పెద్ద అరుపు నా చెవులపడింది. ఎక్కడనుంచా! అంత భీకర రోదన అని లేచాను. ఆ కేక మూడో అంతస్తునుండి వస్తోంది. కేక వెంటనే మనిషి మూలుగుతూ సహాయంకోసం భయంతో ఆర్తనాదం చేస్తున్నాడు. గబగబా బయిటికి వచ్చాను. నే బయటికొచ్చే వేళకి యజమాని అతిథు లందరినీ సేవకుడెవరో నిద్దట్లో భయపడి అరిచాడని శాంతి పరుస్తున్నాడు. అందరూ ఎవరి గదుల్లోకి వారు వెళ్లారు. కొన్ని క్షణాలు గడిచాక జమీందారు నా తలుపుతట్టి, నన్ను తనతో గ్రేస్ పూలు గదిలోకి తీసుకెళ్లాడు. గదిలో మాసన్ నెత్తురు ముద్దలా రొప్పుతూ పడివున్నాడు. నన్నక్కడ రోగికి కాపలావుంచి రాఛెస్టర్ పక్కవూరికి డాక్టరుని తీసుకొచ్చేందుకెళ్లాడు. ఆ అర్ధరాత్రి మూడుగంటల సేపు—

నెత్తురుముద్ద పక్కని పిచ్చి అరుపులూ, కేకలూ వింటూ గడిపాను. తెల్లవారుజామున డాక్టరు వచ్చి మాసన్‌కి కట్టు కట్టి తనతో వెంటపెట్టు కెళ్లిపోయాడు.

సూర్యోదయానికి ఒక్క క్షణం ముందు పక్షులు కిలకిల ధ్వని చేస్తున్నాయి. యజమాని నన్ను గులాబీ చెట్లమధ్యకు తీసుకెళ్లాడు. రాత్రి రోగి ప్రక్కన భయంతో పిచ్చి కేకలు వింటూనే పడ్డ శ్రమంతా గులాబీల వాసన సోకేటప్పటికి మరచిపోయాను. రాఛెస్టర్ వికసిస్తున్న గులాబీ కోసి నాచేతి కందిచ్చారు. దాని నాఘ్రాణిస్తూంటే మాసన్ జ్ఞాపకం వచ్చాడు. "పాపం మాసన్" అన్నాను.

"అతనికేం అపాయంలేదు. కసికొద్దీ నాకు జీవితంలో ఆనందం కలగకుండా చేస్తాడేమోనని ఆదుర్దాగా వుంది," అన్నాడు.

ఆనాటి రాత్రి పీడకల వచ్చింది. మర్నాడు మా పిన్ని అవసాన దశలో వుందని మనిషి కబురు తెచ్చాడు. కొడుకు ఆత్మ హత్యతో పిన్ని మంచ మెక్కిందట. మరణశయ్యపై నుండి నా పేరును గొణుగుతోందట. యజమాని అనుజ్ఞ అడిగాను. అయిష్టతతో నాకు వెళ్లేందుకు అనుమతి యిచ్చాడు.

పిన్నిగారింట్లో నిర్మాలిన్యమైన మనస్సుతో, ఆవిడ తప్పు లన్నీ క్షమించి అడుగెట్టాను. పిన్ని నాకు రెండపకారాలు చేశానని వప్పుకుంది. ఒకటి బాబాయికి తను చేసిన బాస తప్పింది. నన్ను తన బిడ్డలా పెంచలేదు. రెండు, మూడేళ్ల క్రితం నా మేనమామ నన్ను పెంచుకునేందుకు వుత్తరం రాస్తే అది తొక్కి పెట్టింది. మరణశయ్య మీదనుండి తప్పులు వొప్పుకుందిగాని నామీద అసహ్యం మటుకు బొందితో స్మశానానికి గొనిపోయింది. చెప్పిన ప్రకారం వారం రోజులకంటే మరో మూడు వారాలు పిన్నిగారింట్లో గడిపాను. ఒక సాయంత్రం ప్రశాంత వాతావరణంలోంచి నడుస్తూ థార్న్‌ఫీల్డులో అడుగెట్టాను. యజమాని ముందు వాళ్లో చదువుతూ కూర్చున్నవాడల్లా నా అడుగుల ధ్వని విని ఒక్క దూకుదూకి "వారం అని చెప్పి నెల గడిపావా— యీ యింటిని మర్చిపోయావా? అన్యాయం" అన్నాడు.

మర్నాడు మాటలధోరణిలో కాబోయే భార్య కైకొన్న సత్రం బగ్గీ చూపించారు. ఈ పదిహేను రోజుల్లో యిన్‌గ్రామ్ యిరవై మైళ్ల దూరంలో వున్నా యజమాని ఒక్కమాటూ వెళ్లకపోవడం నా కాశ్చర్యం కలిగించింది. రాబోయే వియోగాన్ని ధైర్యంగా సహించేందుకు మనసుని అప్పుడే సమాధాన పెడ్తున్నాను. పూర్వంకంటె జమీందారు నాతో ఎక్కువసార్లు మాట్లాడుతున్నారు. ఇదివరకుకంటె ఎంతో దయగా, మృదువుగా, చనువుగా మాట్లాడు తున్నారు. పూర్వమెప్పుడూ నేనతన్ని యింత హృదయ పూర్వకంగా ప్రేమించలేదు.

ఆ వేసవి ఎంతో అందంగా వుంది. సాయంత్రం తోటలో ఒంటిగా నడుస్తున్నాను. చుట్టూ మల్లెలూ గులా బీలూ, యీ రెంటి పరిమళాలు విచిత్రమై నాకు మత్తెక్కి స్తున్నాయి. యజమాని పెద్ద చెట్టు మొదట్లో నిల్చుని చెట్టుని పెనవేసుకున్న లతని పరీక్షిస్తున్నారు. అతని నోటి నుండి వచ్చే సిగార్ వాసన పూల పరిమళంతో కలిసి గమ్మత్తుగా వుంది. అతన్ని తప్పించుకోవాలని దూరంగా నడుస్తుంటే,

"జేన్—యిటు చూడు. ఈ లత చెట్టుని చూడు ఎలా పెనవేసుకుందో" అన్నాడు.

నేను మాట్లాడక నిల్చున్నా.

"థార్న్ ఫీల్డు నీకు చాలా అలవాటయింది కాదూ?" అన్నాడు మళ్లా.

"అవును."

"వదిలి వెళ్లడం కష్టమయినపని."

"అవును."

"పాపం," అన్నాడు. నేను నిట్టూర్చాను.

"నాకు విచారంగా వుంది. కాని నువ్వు వొదిలి వెళ్ళాలి."

"అంటే మీరు పెళ్లి చేసుకుంటున్నా రన్న మాట."

"అవును. యిన్‌గ్రామ్‌ని పెళ్లి చేసుకుంటానని వదంతి పడ్డ ప్పుడు, ఎడెల్, నువ్వూ యిక్కడ వుండటం మంచిదికాదని నువ్వే సలహా యిచ్చావు. నీకు టీచరుపని ఐయిర్లెండులోనే ఎరుగున్నవారింట్లో యిచ్చే ఏర్పాటు చేశాను."

"చాలా దూరమా?"

"ఎక్కడినుండి?"

"ఇంగ్లాండునుంచి, థార్నన్ ఫీల్డు నుంచి యింకా—"

"వో."

"మీనుంచి" కన్నీరు ఆగకుండా కారుతోంది. ఎక్కిళ్లు రాకుండా ఆపుకుంటున్నాను. చెస్టునట్ చెట్టు కింద అర్చీలో వున్నాం.

"ఇలా—యీ తిన్నెమీద కూచుని నీ ప్రయాణం గురించి మాట్లాడుదాం" అన్నాడు.

నా హృదయంలో సమాధానాలకి చోటులేదు. భరత పక్షి కూస్తోంది. శరీరం బాధతో వణుకుతోంది. నామీద నాకే స్వాధీనం తప్పుతోంది. ఆ స్థలాన్ని విడవడంలోని విచారాన్ని కష్టాన్నీ తెలియపర్చాను. నా ఆనందాన్ని—సంతోషాన్నీ విధి పెళ్లికూతురు రూపాన్ని నానుంచి దాచుకుంటోందని తెలియపర్చాను.

"నాకు పెళ్లికూతురా? పెళ్లికూతురు లేదు."

"ఇకముందు వుంటుంది."

"అవును. పెళ్లికూతురు వుంటుంది." పళ్లు బిగపట్టి "నువ్వుండాలి—నువ్వు వెళ్లడానికి వీల్లేదు" అన్నాడు.

"నే వెళ్లిపోవాలి." అణుచుకున్న బాధంతా వరదలా వచ్చింది. "మీకేం వుపయోగం లేకుండానే వుంటాననుకొన్నారా? నేను యంత్రాన్ని అనుకుంటున్నారా? బీద దాన్ని, సామాన్యమైన దాన్ని కాబట్టి నాకు ఆత్మ, హృదయం లేవనుకుంటున్నారా? దేవుడు నాకు అందం ధనం, యిచ్చివుంటే నన్ను వదలడం ఎంత కష్టమో మీకు తెలియజేసేదాన్ని. నా ఆత్మ దైవసాన్నిధ్యంలో ప్రార్థించినట్లు మీ పాదాలముందు మోకరిల్లుతోంది."

"ఇల్లాగే, ఎప్పుడూ యిల్లాగే—జేన్—అబ్బా—జేన్"—అంటూ నన్ను తన కౌగిలిలోకి తీసుకు, నా పెదిమల్ని తన పెదిమలతో తాకాడు.

"మీరు పెండ్లి అయినవారితో సమానం," అన్నాను.

"జేన్—విడిపించుకొనేందుకు పోరాడకు. నేను నిన్నే పెళ్ళాడతాను—అసలు నా వుద్దేశం—అదే." అన్నాడు. హృదయానికి హత్తుకుంటూ.

నే వారిని మాటలు నమ్మలేకపోయాను. కాని అతను తన ఆలోచనలూ మాటలూ నిజమని నిరూపించాడు. అతని ముఖంలోని విజయ చిహ్నాలని చూడలేదు. అతను తనలో "జరుగుతుంది — అన్యాయంకాదు — దేవుడున్నాడు." అని గొణుక్కున్నాడు. వెంటనే ఒకే ఒక్క మెరుపు మెరిసింది. మెరుపులో అతని మోము సూర్యబింబంలా ప్రకాశించింది. వర్షంలో తడవక మునుపే యింట్లోకి జేరాం. ఆ రాత్రి పిడుగుపడి చెస్ట్నట్ చెట్టు విరిగి పడిపోయిందని మర్నాడు లేచేవేళ ఏడెల్ వచ్చి చెప్పింది.

పెండ్లికి రెండు రోజుల ముందునుంచి రాత్రిళ్లు మళ్లా దుస్స్వప్నాలు కనడం మొదలుపెట్టాను. ఎందుకో దిక్కుమాలిన పాప పదేపదే—కలలో నాచేతుల్లో వుండేది. రెండోనాటి రాత్రి థార్నన్ ఫీల్డు హాలు శిథిలావస్థలో పాడుబడి గబ్బిలాలు, ఎలుకలతో నిండి నిర్మానుష్యంగా వున్నట్లు కలగన్నాను. మెలకువ వచ్చి కళ్లు తెరచే వేళకి నా గదిలో ఎవరో దీపం చేతులో వుంచుకొని నా పెండ్లి బట్టలను పరీక్షిస్తున్నట్లు తోచింది. యింట్లో మనుషులెవరూ కారు. గ్రేస్ పూల్ కూడా కాదు. నల్లగా పొడుగాటి మనిషి. తెల్లని దుస్తుల్లో వుంది. భీకర మొహం, నెత్తురు ముద్దల్లాంటి కళ్లూ వున్న విపరీతాకారం అద్దంలోంచి నాకు కనబడింది. బట్టలన్నీ యిటూ అటూ తిప్పి కాలికిందేసి చింపి తునకలుచేసి నా పక్కవైపుకి తిరిగి నా మొహంమీద మొహంపెట్టి చూసేవేళకి నే తెలివితప్పి పడిపోయాను. మర్నాడు రాఛెస్టరు కీ కథంతా చెప్పగా ఎంతో బరువు దించినట్లు—"బట్టలేగా ఫరవాలేదులే—గ్రేస్ పూల్ చేసి వుంటుంది." అని అన్నాడు. పెండ్లయిన సంవత్సరానికి అలాంటి స్త్రీని యింట్లో ఎందుకు వుంచుకొన్నదీ చెప్తానని నాకు బాస చేశాడు.

పెండ్లినాటి ఏ పెండ్లికొడుకూ రాఛెస్టరంత భీకరంగానూ—స్థిరంగానూ వుండి వుండడు. కొన్ని క్షణాల ఆలశ్యాన్నే భరించలేకపోయేవాడు. పెండ్లి థార్నన్ ఫీల్డు పక్కనున్న చర్చిలో జరగబోతోంది. పెండ్లి చేయించే అతనూ, అతని గుమాస్తా—పెండ్లికొడుకూ, పెండ్లికూతురూ తప్ప మరెవరినీ పిల్చులేదు. చర్చిలో ఫాదరీ "మీ యిద్దర్లో

యెవరికైనా న్యాయప్రకారం పెండ్లికి అభ్యంతరాలు లేక" అని అంటూంటే యిద్దరు మనుషులు చర్చిలోకి వొచ్చారు. అందులో ఒకడు "రాఛెస్టరు భార్య బతికే వుంది" అన్నాడు వగరుస్తూ.

రాఛెస్టర్ ముఖాన్న కత్తివాటుకి నెత్తురుచుక్కలేదు. అతని కళ్లు మెరుస్తున్నాయి. నన్ను మోటుగా తనకి దగ్గరగా లాక్కున్నాడు. "నా ప్లాన్ చెడిపోయింది. ఇంక పెళ్లి జరగదు. ఫాదరీ నీ బైబిల్ కట్టెయ్యి. వీరిద్దరూ చెప్పేది నిజం. నా మేడలో ఒక పిచ్చి మనిషిని బంధించి వున్నానన్న వదంతి మీకు తెలుసు ననుకుంటాను. ఆమె నా భార్య. పదిహేనేళ్ల క్రితం నాకు పెళ్లయింది. ఆమె పేరు బెర్తా మేసన్. ఈ మేసన్‌కి చెల్లెలు. మూడు నెలల క్రితం ఆమె వల్లే యీ మేసన్ గాయపడ్డాడు. ఆమె శుద్ధ పిచ్చిది. పిచ్చి కుటుంబంలోంచి వచ్చింది. కాని యీ సంగతులేమీ నా పక్కనున్న జేన్‌కు తెలియవు. గ్రేస్‌పూల్ ఆధీనంలో నున్న ఆమెను మాయింటికి వచ్చి మీరంతా చూడండి" అన్నాడు నిర్లక్ష్యంగా.

గ్రేస్‌పూల్ గదిలో ఆరాత్రి నాబట్టలు చింపిన వికృతాకారం బోనులోని మృగంలా తిరుగుతోంది. జమీందారుని చూడగానె మీదికి దూకి రెండు చేతులతో మెడ నొక్కపోయింది. అతను బలవంతంగా వొదుల్చుకొని గొలుసులతో కట్టేశాడు. మావైపుతిరిగి దీనంగా "యీమె నాభార్య" అన్నాడు.

ఆ మధ్యాహ్నం క్లిష్టపరిస్థితులన్నీ నా తలలో తిరుగుతున్నాయి. మనసు థారన్ ఫీల్డు వదలి వెళ్లమని తొందర చేస్తోంది. కాని హృదయం ఆ నిశ్చయం వల్ల నాప్రియునికి జరిగే అన్యాయాన్ని ఆలోచించమని నన్నాపుతోంది. రాఛెస్టర్ బాధతో, దైన్యంతో, ప్రార్థనలతో నాకు తన జీవితగాథ చెప్పి తన నిర్దోషిత్వాన్నీ నిస్సహాయత్వాన్నీ నిరూపించుకున్నాడు. నేనతన్ని మనసారా క్షమించాను. కాని ధర్మము నన్ను వెడలి పొమ్మని తొందర పెట్టింది.

మర్నాడు పనివాళ్లు లేవకమునుపే థారన్ ఫీల్డునీ, యజమానినీ వదలి పారిపోయాను. నాదగ్గరున్న ఆఖరి షిల్లింగు బండివానికిచ్చాను. అడవుల్లో, పల్లెల్లో తిండి లేక అలమటించి పోయాను. చివరకి అదృష్టవశాత్తూ ఒకరి యింట్లో నాకు ఆశ్రయం లభించింది.

జ్వరం తగ్గి నేను కళ్లు తెరచాను. నన్ను రక్షించిన యిద్దరక్కచెల్లెళ్లూ, అన్నగారైన జానూ కనిపించారు. జరిగిన జీవితాన్ని గురించి నేనొకమాట వారితో చెప్పలేదు. నన్ను వాళ్లు ప్రశ్నలువేసి—నా జీవితపు లోతులు తవ్వలేదు. నాపేరు జేనీ ఎలియెట్ అని బొంకాను. ఆడపిల్లలిద్దరూ ఎంతో దయగా స్నేహంగా వుండేవారు. వాళ్లకూ నాకూ క్రమంగా ప్రేమాభిమానాలు ఎక్కువయాయి.

వారిసోదరుడు జాన్ నామీద ప్రత్యేకశ్రద్ధ తీసుకోడం మొదలు పెట్టాడు. అతను చాలానిష్టపరుడు. జాన్‌కి నా గత జీవితంమీద ఎందుకో ఆశక్తికలిగి, ఎన్నో ఆరాలు తీశాడు మాటల తొందరలో నా అసలుపేరు తెలుసుకుని తనకు దూరపు బంధువైన నా వారు వదిలిన ఆస్తికి వారసురాలునే నేనని బయలుపెట్టాడు. అది పదివేల పౌనుల ఆస్తి. ఆ ఆస్తిని మేం నలుగురం సమంగా పంచుకున్నాము. జాన్ దేవుడు నన్నొక మిషనరీ భార్యక్రింద సృష్టించాడని చెపుతూండేవాడు. అతను మానవ సేవకై తనజీవితాన్ని అంకితం చేయదలచాడు. అలాంటి పవిత్రసేవకి తనకి తోడునీడగా వుండమని కోరాడునన్ను. నేను ఒక సోదరిగా తనజీవితంలో మానవసేవకై సాయం చేసేందుకు యిష్టపడ్డానుగాని అర్ధాంగిగా నిరాకరించాను. కాని అతను భార్యగాతప్ప మరేవిధంగానూ నాతో సంబంధానికీ, నన్ను మానవసేవకై దూరదేశాలకు తీసికెళ్లేందుకు యిష్టపడలేదు.

జాన్ ప్రయాణానికి ముందురోజున మరోమారు తన హస్తాన్నీ నాకు వ్రతం యియ్యపోయాడు. ఆరాత్రి భగవంతుని నాకుదారిచూపమని ప్రార్థించాను. నాగుండెలు కొట్టుకొన్నాయి. ఎచ్చటినుంచో కంఠం వినబడింది.

"జేన్—జేన్—జేన్"

"భగవాన్—ఏమిటిది!" వూపిరితీసుకున్నాను.

నాకు తెలియకుండానె నోటివెంట ఎక్కడనుంచి అని మాటలు వెలువడ్డాయి. ఆ కంఠం ఇంట్లోంచీకాదు—నా పక్కనుంచీకాదు—దొడ్లోంచీకాదు. అది నేప్రేమించి పూజించిన—ఎడ్వర్డు ఫెయిర్‌ఫాక్స్ రాఛెస్టరు కంఠం.

అకంఠంబాధలో, విపత్తులోవుండి సాయంకోసం తొందరగా రమ్మని దైన్యంగా కోరుతున్నట్లుంది.

“నేవస్తున్నా” అని అరచాను. “నాకోసం వేచివుండండి—నేను వస్తున్నాను”—అని నాకు తెలియకుండా నే పరుగెత్తాను. రోడ్డంతా చీకటిమయం.

ఆ తెల్లవారిగట్ల థారన్‌ఫీల్డుకి బయలుదేరాను. చిరపరిచితమైన ఆదారి—చెట్లు అన్నీ నన్ను స్నేహితుల్లా ఆహ్వానించాయి. యజమాని మేడవద్ద నిశ్చేష్టితనై నిల్చిపోయాను “ప్రేయసి తియ్యని కలలు కంటోందనే తలపుతోవచ్చిన ప్రియునికంటికి నిర్జీవరాలు కనపడ్డవిధంగా అయింది.” ఆ ఎత్తైన మేడవంక చూశాను. శిథిలమై నిర్మానుష్యంగా వుంది. భయపడి సత్రంలోకి పరుగెత్తుకొచ్చాను. సత్రపు యజమానిని: “రాఛెస్టర్ థారన్‌ఫీల్డులో వుండటం లేదా?” అని ప్రశ్నించాను.

“లేదు—ఎవ్వరూ ఆయింట్లో వుండటంలేదు. క్రిందటి వేసంగిలో యిల్లు కాలిపోయింది. చూడలేకపోయాం—ఆ మంటలూ అవీనీ!!

“ఇల్లంటుకునేందుకు కారణం?”

“మేడలో పిచ్చిది వుందిట. కాపలామనిషి నిద్రపోతూంటే తప్పించుకుని రెండో అంతస్తులోని గదికి నిప్పంటించిందట పిచ్చిది. పూర్వం ఆగదిలో పంతులమ్మ వుండేదట.”

“జమీందారు నిప్పంటుకున్నప్పుడు వూళ్లో వున్నారా?”

“వున్నారు. పనివాళ్ల నందరినీ బైటికిచేర్చి—పిచ్చి భార్యను తప్పించేందుకు ప్రయత్నించారు. కాని ఆమె పైడాబా పిట్టగోడ ఎక్కింది. రాఛెస్టర్ పట్టుకునేందుకు ప్రయత్నించారు—డాబామీంచి కిందకు దూకింది. తల వెయ్యి వక్కలయింది.”

“ఎవరికీ ప్రాణహాని లేదుగదా?”

“లేదు—వుంటేనే బాగుండేది.”

“అంటే?”

“పాపం జమీందారు”—అన్నాడు జాలిగా.

“అతను బతికే వున్నారా?” అన్నాను ఖంగారుగా.

“పూర్తి గుడ్డివాడయ్యాడు. మంటలమధ్య మనిషి కుమిలిపోయాడు. కాలుతూవున్న దూలం కుడికంటి మీదపడి కన్ను కాలిపోయింది. రెండో కంటిమీద నిప్పుకణాలు పడ్డాయి. చెయ్యి గోడకిందపడి నలిగిపోయింది. అతనిప్పుడు చాలా నిస్సహాయ స్థితిలో వున్నాడు.”

“ఎక్కడున్నాడు?— ఎక్కడున్నాడు”

“ఫెర్డాదగ్గర ఒక తోటలో చిన్న కుటీరం నిర్మించుకొని అక్కడుంటున్నాడు. నిర్మానుష్య ప్రదేశం.”

ఫెర్డాన్ జేరాను. ఇల్లు చెట్లతో కప్పబడి వుంది. దూరంనుంచి చూస్తే వాసయోగ్యంగాలేదు. గుమ్మం తెరుచుకు ఒక మనుష్యాకృతి బయటికొచ్చింది. నక్షత్రాల గుడ్డి కాంతిలో అతని చెయ్యి దేనినో వెతకుతున్నట్లు చూశాను. తడుముతూ తడుముతూ నడుస్తున్నాడు. నేనా ఆకృతిని తత్క్షణం గుర్తించాను. నా యజమాని—దైవం—ప్రియుడు—నా రాఛెస్టర్. మొహం ఎంతో మారిపోయింది, కాలిన మచ్చలు. నుదురులోని కర్కశత్వం పోయి నిరాశ గోచరిస్తోంది. వెనక్కి తడుముకుంటూ వెళ్లిపోయాడు. దొడ్డిదారిన ఇంట్లో ప్రవేశించాను.

పనిమనిషికి బదులుగా మంచినీళ్లు అతని గదిలోకి నేను పట్టుకెళ్లాను. నన్ను చూసి కుక్క తోకాడిస్తూ నా కాళ్లు ప్రేమగా నాకింది. దాన్ని బుజ్జగించి, “నీళ్లు తాగుతారా?” అని అడిగాను—“ఎవరు—మాట్లాడేది ఎవరూ?” ముందుకు రెండడుగులు వేశాడు. చాచిన అతని వేళ్లని నేను అందుకున్నాను.

“ఇవి ఆమె వేళ్లు” ఆనందంతో అరిచాడు. “ఇది ఆమె కంఠం—” అని మాట పూర్తిచేశాడు.

“జేన్—జేన్—” అని బాధగా అన్నాడు.

“స్వామీ, తిరిగి వచ్చాను—” అన్నా దగ్గిరికి సాగుతూ.

“నా అవుటితనం—యీ గుడ్డితనం—ఆనాడు పిడుగుచే కూలిన ఛెస్ట్‌నట్ ట్రీ కంటే హీనంగా వున్నాను.” అన్నాడు విచారంగా.

కాని నేనతనికి నా హృదయంలోనున్న ప్రేమనీ, విలువనీ తెలిపాను. నాప్రభువుని పెండ్లాడాను. మాపెండ్లయిన రెండో సంవత్సరంలో అతనికి ఒక కన్ను వచ్చింది.



# విజ్ఞానం

శ్రీమతి వి. యస్. ఆర్. నాయకమ్మ.

తక్కువగా కనిపిస్తూండే గ్రహం బుధుడు. బుధుని జన్మ వృత్తాంతం హిందూ శాస్త్రాల్లో చాలా మనోరంజకంగా వర్ణించబడి యున్నది. దేవగురుడు బృహస్పతి భార్యతార. చంద్రుడు బృహస్పతి దగ్గర చదువుకుంటున్నాడు. గురువు గారి పెళ్లాం చాలా అందంగావుంటుంది. చంద్రుడు ఆకర్షింప బడ్డాడు. తత్ఫలితంగా తార గర్భవతియైనది. వారిరువురి ప్రేమకలాపాలు బృహస్పతి తెలుసుకోలేదు. తారా చంద్రుల ప్రేమఫలమే బుధుడు. బుధుడు జన్మించగనే చంద్రుడు నిర్భయంగా వచ్చి, పుట్టిన బిడ్డడు తన కొమరుడేననీ, కాబట్టి తనవద్దనే వుంటాడనీ-తనతో తీసుకపోతాననీ-అన్నాడు. తన పెళ్లాం కన్నది గనుక తనకొడుకే నన్నాడు బృహస్పతి. ఇరువురు పోట్లాడుకో సాగారు. అంతట బ్రహ్మ మధ్యవర్తిగావచ్చి బుధుడు చంద్రుని కొడుకే నని, తీర్పుచెప్పాడు.

పైకథ కల్పితం. కాని సత్యసంఘటనలు కూడా కానవస్తున్నై యింకో విధంగా. భూమి మీదికి యెప్పుడూ ఒకే ప్రక్క అర్ధగోళాకారంగా చంద్రుని ఆకారం కానవస్తోంది. బుధుడూ బృహస్పతీకూడా యెల్లప్పుడూ ఒకే వైపుగల అర్ధగోళాకార రూపం సూర్యుని దిక్కుకు వుంటోంది. రెండోవేపు అర్ధగోళాకారం యెప్పుడూ సూర్యుని వైపుకు రావడంలేదు. యీకారణంగా చంద్రునికీ, బుధునికీ తప్పక యేదో సంబంధం వుండి వుండాలి. బుధుడు బృహస్పతి వైపునకుకూడా యెక్కువ ఆకర్షింపబడుతునే వుంటాడు.

బుధుడు మన పూర్వులకుకూడా చిరపరిచితుడే నన్నవిషయం దీనివల్లకూడా మనకు విదితమవుతోంది. పాశ్చాత్య దేశాల్లో జ్యోతిశ్శాస్త్రులకందిన వివరాలను బట్టి బుధుణ్ణి యెప్పుడు కనుక్కోవడానికి ప్రయత్నాలు జరిగినవో తెలుస్తోంది. కోపర్నిక్స్ తన జీవితాంతిమ సమయంలో బుధగ్రహాన్ని చూచే భాగ్యం లభించలేదుగదా యని మనఃక్లేశ మనుభవించాడు. అదలా ప్రకటించుకున్నాడు కూడాను. అతడా గ్రహాన్ని చూడాలని మహాతాపత్రయ పడ్డాడు. యెందువల్లనంటే బుధుని గమనం తదితర నక్షత్రాల గమనానికి సంబంధించిన సిద్ధాంతాన్ని బాగా తెలియజేస్తోంది. కాని దౌర్భాగ్య వశమున అతడు తన జీవితకాలంలో బుధగ్రహాన్ని చూడజాలక పోయ్యాడు. బుధుడు అన్యగ్రహాల్లాగా సునాయాసంగా కాన్పించడు. కోపర్నికస్ నివసించేది ప్రోన్‌బర్గ్. ఆపరిసరం 'విస్టూలా' సరస్సుల నుండి లేస్తుండే ఆవిరితో క్రమ్మబడి వుంటుంది. అందువల్ల బుధగ్రహం కానరావడం మరింతదుర్లభంకూడా అయినది.

కాబట్టికోపర్నికస్ యొక్క బుధగ్రహం ప్రజలకు పరిచిత గ్రహమేనన్న విషయం బుజువైంది. క్రీస్తుకు 264 సంవత్సరాల పూర్వమే బుధగ్రహం పేర్కొన బడ్డట్టు ప్రమాణాలు లభిస్తున్నై. ఇంతకు ముందే యెన్నడో బుధుడు కనుగొన బడ్డట్టు అనుమానించ బడుతోంది. కాని దౌర్భాగ్య వశమున మనకా వివరాలు లభించకున్నవి. ప్రప్రథమంగా బుధగ్రహాన్ని కనిపెట్టిందెవరో కూడా మనకు తెలియరాకున్నది. దూరదర్శినీ యంత్రం కనిపెట్టకముందు మాత్రం బుధగ్రహాన్ని యెవరూ ప్రత్యేకించి చూచి వుండరనే విషయం నిశ్చయంగా చెప్పవచ్చును. విస్తృత వైజ్ఞానికాధ్యయనంకూడా దూరదర్శినీ యంత్రం కనిపెట్టబడ్డ తరువాత నేజరిగింది.

## బుధగ్రహం

# బుధగ్రహం

బుధగ్రహాన్నే విధంగా కనిపెట్టాలో అన్న విషయాన్ని మనం బాగా ఆలోచించ వచ్చును. ప్రభాకరుడింతవరకూ వెల్తురు భూమిపై ప్రసరింపజేస్తున్నాడు. అటువైపున, జ్వాజ్వల్యమానమైన యొక పదార్థము కానవస్తుంది. ప్రారంభిక జ్యోతిర్విద్వాంసులు-ఆకాశంలో యీస్థానంలో నక్షత్రం లేదన్నారు. మరేమై వుంటుంది? ఇందుకుగాను ప్రతిదినమూ పరీక్షించి చూడగా భూమికి కొలదిపైగా, ఆకాశంలో మిలమిల మెరుస్తూ క్రమంగా కాంతి దిన దినమూ హెచ్చుతూ, తిరిగీ క్రమముగా తగ్గుతూ, తుదికి అస్తమించుచున్న యీ వస్తువు ఒక గ్రహమని నిర్ణయించారు.

ఇది అప్పుడప్పుడు తూర్పు దిక్కులోనూ మరొకప్పుడు పశ్చిమ దిక్కులోనూ గానవచ్చును. అసలివి వేర్వేరు గ్రహాలు కావుగదా అన్న సందేహంకూడా కలుగుతుంది. ఇది ఒకే గ్రహమని ఆదిలో జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చాలా కష్టంమీద నిర్ణయించగలిగారు. అంటే రెండు దిక్కుల్లోనూ ఒకేసారి గానరాదు. తూర్పున గనపడనప్పుడే పశ్చిమ దిక్కున గానవచ్చును. అప్పుడిది రెండుగావనీ, ఒకటే ననీ నిర్ధారణైనది.

మనదగ్గర దూరదర్శినీ యంత్రం వుంటే వెంటనే సాముద్రిక పంచాంగంపైకి దృష్టి పోనిచ్చి బుధస్థానం తెల్సుకుంటాం. అది భూమికి కొంచెం పైనవుంటే, వెంటనే అటు చూస్తే యంత్రంతో-పగటి వెల్తురులోకూడా మినుకుమినుకు మంటూ బుధుడు గానవచ్చును.

బుధుడు చంద్రుని కన్నా చాలా పెద్ద గ్రహము. గాని చంద్రునికన్నా చాలా దూరంలో వుండుట వల్ల యీగ్రహ మహత్తు అంతగా మనకు గోచరించుటలేదు. కాని మనదృష్టిని చప్పున ఆకర్షించునట్టి ఆకారమే బుధునిది. బుధుడు గోళాకారములో లేడు. అర్ధచంద్రాకారంలో కానవచ్చును. చిన్న చంద్రుడా అన్నట్లుగా వుంటాడు. ఇతని కళలుకూడా చంద్రుని కళల్లాగానే వుండును. బృహస్పతి కళలుకూడా బుధుని కళల్లాగానే వుండును కొంచెం యించుమించుగా. ఇందువల్లనే అనుకుంటాను బృహస్పతికీ, చంద్రునికీ కూడా, బుధుడు కొమరుడని చెప్పబడడం.

బుధగ్రహంకూడా భూమిలాగానే స్వయంప్రకాశరహితమైన పదార్థాలతో కూడియున్నది. ఈ నక్షత్రం ఒక వేపు సూర్యుని దిక్కుకేసి వుంటుంది. అటు వైపుమాత్రం మిలమిల మెరుస్తుంటుంది. బుధుని ప్రకాశరహితమైన వైపు మనకు గోచరించదు. అందువల్లనే అర్ధచంద్రాకారంలో కానవస్తుంది. మనం చూచి నిర్ణయించుకోలేనంత చిన్నదిగా వుంటుంది బుధ గ్రహం. బృహస్పతి అర్ధవృత్తాకారంకూడా దూరదర్శినీ యంత్రం సహాయంలేకుండా యెంత పెద్దదో నిర్ణయించుకోలేము. బుధుని కళలుకూడా సూర్యునిపై భూమి ఆధారపడినట్లుగా స్థానపరివర్తనం కారణంగా పెరుగుచూ తరుగుచూ వుంటోంది. అందువల్లనే పరిశీలనగా చూడజాలకున్నాము. ఇది చాలా చిన్నదీ, మిలమిలలాడు నట్టిదీ. అందువల్ల పరిపూర్ణంగా దీని వృత్తాంతము తెలియదు.

బుధుడు 88 రోజుల్లో సూర్యుని ఒక్క పర్యాయం చుట్టి వస్తున్నాడు. ఇది సూర్యునికి 36000000 మైళ్ల దూరములో వుంది. అదే ఒక్కొక్కప్పుడు 29000000 మైళ్ల దూరంలోకి వస్తుంది. మరొక్కొక్కప్పుడు 43000000 మైళ్ల దూరంలోకి పోతుంది. అందువల్ల గ్రహంయొక్క పరిభ్రమణ వేగంకూడా మారుతుంటుంది. బుధుని అత్యధిక పరిభ్రమణ వేగం సెకండుకు 35 మైళ్లు. అత్యల్ప పరిభ్రమణ వేగం సెకండుకు 23 మైళ్లు ఇది భూమికి 136000000 మైళ్లనుండి 50000000 వరకూ దూరంలోవుండును. బుధుని వాస్తవికవ్యాసం 3 వేలమైళ్లుండును. దీనిది భూమి వైశాల్యములో 7 వ వంతు వైశాల్యము. బరువు భూమిబరువులో 1/32 వంతు. కాని యిది నిశ్చయం గాదనుకొంటాను. సూర్యుని బరువులో 1/8000000 వంతు. భూమియొక్క ఘనపరిమాణంతో పోలిస్తే దీనిఘన పరిమాణం, 0.75...

భూమికి సూర్యునికాంతి లభించిన దానికంటే, దీనికి 7 వంతులలభిస్తోంది. ఇది ప్రాతః కాలం కానవచ్చినపుడు "అపోలో" అనీ సాయంకాలం కానవచ్చినపుడు బుధుడని పిలువ బడుతోంది. ధూమ్రకేతువుల కారణంగా బుధుని చలన శక్తి చాలా తక్కువగా పరివర్తన మందుచున్నది. సూర్యునివేపుకు వున్న బుధుని భాగంయొక్క వేడి 3500 శతాంశ గ్రేడ్‌లో వుంటుంది, ఇది మే మాసములో భూమికి

దాపుగనూ నవబంయ శెలలో సూర్యునికి దాపులోనూ వుంటుంది. రైఫిల్ గుండు వేగముకన్నా దీని పరిభ్రమణ వేగం నూరు రెట్లు అధికంగా వుండును. కాని రైఫిల్ గుండు బుధుని ఆకారంతో పోలిస్తే దీనివేగం చాలా తక్కువగా వుంటుంది. బుధుడు తన వ్యాసదూరాన్ని పరిభ్రమించడానికి రెండు నిముషాల కాలం పట్టును. కాని రైఫిల్ గుండు తన వ్యాసభాగంగల దూరాన్ని కొన్ని వేలరెట్లు ఒక సెకండులో పరిభ్రమించగలదు.

బుధుని వాస్తవిక నైసర్గిక పరిస్థితుల విషయంలో మనకు పూర్తి ఖచ్చితంగా తెలియదు. అచ్చట జీవించడం దుర్లభమో, శుభమోకూడా చెప్పడం కష్టం. భూమిమీద జీవించడానికి సంభవమైనట్లు అక్కడ జీవించడం సంభవం కాదన్న విషయం మాత్రం తథ్యం. సూర్యుని తాపం, వెల్తురూకూడా భరించరానంతగా బుధునిపై పడుచుండును. ఈ నక్షత్రం సూర్యునికి చాలా దూరంగా పోయినప్పడే సూర్యుని వేడిమి భూమిపై అత్యధికంగాపడే భూభాగాలపై కన్నా మిసుమిక్కిలిగా దీనిపై బడును. ఇది సూర్యునికి దరిదాపుల కొచ్చినప్పుడు, యిక నా వేడిమి ప్రకాశమూ, భరించరానంత భీభత్సంగా వుంటుంది.

చంద్రునిలో బాష్పజలం వుందన్న విషయం అర్థమైనది. బుధునిపై ఋతుపరివర్తనము భూమిపై ఋతుపరివర్తనకంటే చాలా అధిక వేగంగా జరుగుతుంది. బుధునిలో వేడి, చలి, కాలముల మధ్య 44 రోజుల వ్యవధియే వుంటుంది. యీ తొందర తొందరగా జరుగు పరివర్తన బుధునితో నివాస క్రియా కలాపాలపై అధికప్రభావం పడుతోంది. వాయు మండలం వేడి, చలి మొదలగు వాటిపై తగు ప్రభావాన్ని జమాయిస్తోంది. బుధగ్రహంలో గనుక వాయు సంచారం సరిగావుంటే జల వాయువులందు తగినంత పరివర్తన జరుగును. కాని వాయుమండలం, బుధునిపైబడు సూర్యవేడిమిని పరివర్తిత జేసి, జీవ నివాసయోగ్యంగా చేయగలదా లేదా అన్నదే సందేహాస్పదం.

బుధునిలో జీవులు జీవించడానికి అనువుగా వుందునా అన్న సమస్య మనకు విడకున్నది. భవిష్యత్తులోకూడా యీ సమస్య విడునన్నయాశ గాన్పించదు.

ఇటలీలో సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర పండితుడు ప్రొఫెసర్ షియాపరేళ్ కొన్ని సంవత్సరాల క్రితం బుధుని పరిభ్రమణా పథమును గురించి అన్వేషణ సాగించి బుధుడు సూర్యుని చుట్టూ తిరిగినంత సమయంలోనే తనచుట్టూ తాను తిరగగల్గుతోంది. ఇందువల్లనే యెల్లప్పుడూ సూర్యుని వేపుకు బుధుని అర్ధగోళాకారం వుంటుంది. మనభూమి కూడా యీవిధంగానే పరిభ్రమణ సాగించినట్లైతే, సగ భాగంలో యెప్పుడూ పగలూ, సమభాగంలో యెల్లప్పుడూ రాత్రీ తమ నిరంకుశ పరిపాలన సాగిస్తై అని అన్నాడు. అది వాంఛనీయమా మనకు? బుధుడు చంద్రుని అనుకరిస్తాడు. బుధునియొక్క సూర్యుని చుట్టూ పరిభ్రమించే వేగం పరివర్తనం జెందుచుండును. తనలో తాను తిరుగు వేగం మార్పులేకుండును. అందువల్ల ఒక భౌతిక వత్సరమందు బుధుని 5/8 వ భాగం సూర్య ప్రకాశానందం పొందగల్గుతుంది.

అమెరికా వాసి శ్రీ పరకాయి వల్లావెల్ మహాశయుడు కూడా పై కథనాన్ని సమర్థించాడు. అతడు బుధునిలో చాలా నల్లటి చారలు చూచాడు. బుధునిలో యేమాత్రమూ మేఘ చిహ్నాలు చూడలేకపోయాడు. బుధుని పైభాగము రంగులేనట్టిది. దీని భూగోళికరూపం నల్లగానూ తెల్లగానూ వుండును. సూర్య ప్రభావమే బుధుని ఆటుపోటులకు కారణమవుతోంది. స్వయం ప్రకాశం కాదుగాబట్టి.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## మూడవ భాగము.

### అభివృద్ధి పరిమాణము.

(2-వ వ్యాసం).

**వయోనుగుణ్యప్రవర్తన :—**

ఇంతవరకు, వయస్సు కనుగుణంగా అభివృద్ధి చెందునట్టి బిడ్డయొక్క లక్షణాలను గురించి కొంత తెలిసికొన్నాము. స్పష్టంగా, సంక్షిప్తంగా చెప్పాలంటే, ఆయా వయస్సులో బిడ్డ వ్యక్తపరిచే సహజమైన స్వాతంత్రేచ్ఛ, పరిసరముల యందు ఆకర్షణ, ఆసక్తి, ఆటలు మాటలు, అనలసత్వము, అవిరామమైన కృషి, నడక, నేర్పు, చుట్టునున్న పిన్న పెద్దల యందు కనబరచే అనురాగ ప్రేమలు, చెలిమి, సంబంధ బాంధవ్యములు మున్నగు వాటినిగురించి కొంత తెలిసికొన్నాము. ఇట్టి సహజాభివృద్ధినే "వయోనుగుణ్య ప్రవర్తన" అని పేర్కొన్నాము.

ఇప్పుడు ఇట్టి సహజాభివృద్ధిని చెందని బిడ్డల విషయమును గురించీ, వాటి మూల కారణములను గురించీ ఆలోచిద్దాము:—

సహజాభివృద్ధిని పొందని బిడ్డలలో అనేక రకాలుగ వుంటారు. కొందరు వయస్సు కనుగుణంగా అభివృద్ధి చెందక, ఆలస్యంగా చెందుతారు. మరికొందరు, అభివృద్ధి పథంలో పురోగమించుతూ—ఒకానొక స్థితిలో—తిరోగమించుట కలదు. ఇంకా కొందరు జన్మతో మందమతులుగా వుంటారు. ఈ రీతిగ వీరు అనేక రకాలుగ వుండుట కలదు. ఇక వీరి లక్షణాలు:—ఆలస్యంగా అభివృద్ధిచెందు బిడ్డలలోను, తిరోగమించు బిడ్డలలోనూ స్వేచ్ఛకు సంబంధించిన 'సహజేచ్ఛ' సామాన్యంగా లోపించి యుంటుంది. ఇట్టి బిడ్డలు తల్లిమీద లేక తమను లాలన పాలన చేయునట్టి వారిమీద అనవరతము ఆధారపడి యుంటారు. స్వయంగా కృషిచేయరు. వీరిలో 'గ్రహణశీల మనస్తత్వం' చురుకుగా పనిచేయదు. నడక, ఆటలు మాటలు, నేర్పు మున్నగునవి ఆలస్యంగా అభివృద్ధి చెందుతవి. అలసత్వం గోచరిస్తుంది. ఇక మందమతుల విషయంగమనిద్దాము. వీరు అసలు పరిసరములయందు కాని, పిన్న పెద్దలయందుకాని, ఏలాంటి ఆకర్షణ, అభిలాషలు, ఆసక్తి, అనురాగము, స్నేహము కనబరచరు; నడక ఆటలు మాటలు నేర్పు మున్నగునవి వయసునకు తగినట్టుగానుండవు. భీతి, చీటికీ మాటికీ ఏడ్పు, వ్యాకులత, పరిసరములయందు పిన్న పెద్దలయందు అయిష్టము, అలసత్వము మున్నగు దుర్లక్షణములు వీరిలో అధికంగా కనబడుతవి. ఈ లక్షణాలలో కొన్ని—ఏడ్పు, వ్యాకులత, భీతి మున్నగునవి—అభివృద్ధి ఆగిపోయి తిరోగమించు బిడ్డలలో సైతం వ్యక్తమవుతాయి.

బిడ్డలు సహజంగా చక్కని అభివృద్ధిచెందటానికీ, అలా చెందక పోవటానికి, ఆలస్యంగా అభివృద్ధి కావటానికీ మూలాధారములు 'వంశ పారంపర్యము,' 'పరిసర పరిస్థితుల ప్రభావం' అను యదార్థమును అందరం ఎరిగిన విషయమే. అయినా కొంత విపుల పరుస్తాను.

**వంశపారంపర్యము :** ఈ విషయములో ఒక ఉదాహరణ తీసికొందాము. వంశ పరంపరగానో, లేక, తల్లిదండ్రుల నుండియో బిడ్డకేదో ఒక వ్యాధి సంక్రమించిందనుకొందాము. ఆ వ్యాధికి, ఆదిలోనే తగిన చికిత్స చేస్తూ, ఆరోగ్య కరమైన, ఆహార విహారాలు, పరిశుభ్రమైన పరిసరాలు ఆ వ్యాధి నివారణకారణములై బిడ్డ దైహికంగా, మానసికంగా సక్రమాభివృద్ధిని చెందుటకు వీలుకావచ్చును. అలాకాక, ఆ వ్యాధి త్వరగా కుదరక పోతేగాని, అది నయంకాని వ్యాధి అయితే గాని బిడ్డ బాధపడటమేగాక, శారీరకంగా, మానసికంగా, దాని అభివృద్ధి అరికట్టబడుతుంది. లేదా, అసలు అభివృద్ధికే తీరని అవరోధం కలుగవచ్చును. కొన్ని సందర్భాలలో, బిడ్డకు ఆరోగ్యకరమైన దేహముండినా, పుట్టుకతో మందమతిగా

పుట్టవచ్చును. అలా ఒక్కతో మందమతిగానున్న బిడ్డ విష విషయంలో, అలా పుట్టుటకు కారణాలు, వాటి నివా రణోపాయములను కనిపెట్టటానికి గొప్ప మనస్తత్వ శాస్త్ర వేత్తలు మహత్తరమైన కృషి ఈ నాటికీ సల్పుతున్నారు. (ఏవో కొన్ని టిని కనుగొన గలిగారు కాని అంత ఫలప్రదంగా నివారణోపాయములను కనుగొనలేదు.) ఆ కారణాలు వంశ పారంపర్యం అనిమాత్రం తెలుసు కొన్నాను.

పరిసర పరిస్థితులు: పరిసర పరిస్థితుల ప్రభావం వలన కూడ బిడ్డల అభివృద్ధి సక్రమంగా సవ్యంగా కాక పో వచ్చును. లేదా అలస్యంగాకాని, తిరోగమనంలాగుగాని కావచ్చును. వీటికి ముఖ్యకారణాలు రెండు:—

ఒకటి:—బిడ్డయొక్క దేహారోగ్యంలో కాని, అంగ ములలో కాని లోపముండుట.

రెండు:—పరిసర పరిస్థితులుకాని, శిక్షణకాని లోప భూయిష్టముగా నుండుట.

మొదట, బిడ్డదేహమునకు సంబంధించిన విషయాలను ఆలోచిద్దాము. అనగా, శారీరక శాస్త్రమును గురించి కొంత తెలిసికొనుట అవసరమన్నమాట. ఇది ఎంతో విస్తారమైన విషయం అతిక్లిష్టం కూడాను. సాధ్యమైనంత సంక్షిప్తంగా స్పష్టంగా గ్రహించటానికి ప్రయత్నిద్దాము.

దేహానికీ మానసిక తత్వానికీ అత్యంత సన్నిహిత సంబంధ మున్నదను విషయం నిర్వివాదాంశం. మనవాంఛలు అను భూతి, ఆలోచనలు, ఆచరణలకూ, మనశరీరంలోని ప్రతి భాగానికి అత్యంత సన్నిహిత సంబంధమున్నది. మన మనః ప్రకృతులు, ఆలోచనల కనుగుణంగా మన దేహంలో మా ర్పులు కలగటం మనమందరం ఎరిగిన విషయమేను. ఒకటి రెండు ఉదాహరణలను తీసికొందాము. కోపతాపములు, భీతి మున్నగు ఉద్రేకములు కలిగినపుడు మన ముఖం కళ్లు ఎర్రబడి పోవటం, దేహమాద్యంతం వణకిపోవటం, చెమర్చి పోవటం మున్నగు మార్పులు కలుగుతవి. అదేవిధంగా మనం అనారోగ్యంగా వున్నామని ఎప్పుడూ అనుకోవటం వల్ల నిజస్థితిలో మనదేహంలో అనారోగ్యం తల చూపుట గలదు. అదేరీతిగ మనం దేహారుగ్మతతో బాధపడునపుడు స్పష్టంగా ఆలోచించటంకాని, ఆనందించటంకాని, చక్కగా ఏకార్యమునైనా నెరవేర్చుటకాని వలను పడదు. ఏదోవ్యాకులము, లేక ఆందోళన కలిగినపుడు మనం చేయు కార్యములు అయోమయంగా, అవకతవకగా, అసం పూర్తిగా వుండటం సహజం. బుద్ధి చురుకుగా పని చేయ జాలదు. సూక్ష్మంగా గ్రహించటం, నేర్చుకోవటం కష్ట సాధ్య మవుతాయి. కాబట్టే, దేహానికీ మనస్సుకూ, అవినాభావ సంబంధమున్నదను విషయం తేటతెల్లం.

దేహంలో ముఖ్యంగా ఒక ప్రత్యేకభాగం మనోవ్యాపార మునకు, మానసికాభి వృద్ధికీ సంబంధించి యున్నది. ఇదియే 'నాడీవ్యూహము' లేక నాడీమండలము అంటారు (Nerveons System). ప్రతి మనోవ్యాపారము నాడీమండల సంచలనము వల్లనే కలుగుతుంది. మెదడు, (దీనిభాగములు:—పెను మెదడు, చిఱుమెదడు, మధ్యమెదడు, సుషున్న శీర్షికము మున్నగునవి), జ్ఞానేంద్రియము, దేహమందంతటా వ్యాపించి యుండు అసంఖ్యాకనరములు ఈ 'నాడీ వ్యూహనిర్మాణ మునకు' చెందినవేను.

దేహమునకూ మనస్తత్వమునకూ సన్నిహిత సంబంధమును కలిగించేది ఈ నాడీమండలమేను. పరిసరములుతోటి మాన వులకు సంబంధ బాంధవ్యములను కలుగజేసేది ఈ 'నాడీ వ్యూహమే'. అందుచేతనే దీనిని 'సంసర్గ వ్యూహము' అని నైతమంటారు. నాడీ వ్యూహము వలననే మనుజునికి చేతనాచేతన ప్రపంచములో మానవకోటితో సంబంధ బాంధవ్యము లేర్పడుతున్నవన్నమాట.

దీనిని గూర్చి మరు సంచికలో యింకా విపులంగా చర్చిద్దాము.

సశేషము.



# ఆంధ్రదేశ జానపదగేయములు

కూర్పు :—శ్రీ కవికొండల వెంకట్రావుగారు ★

[ఆలిండియా రేడియో సౌజన్యంతో]

“బండ్లు దిగి నడవండి వీటికి
గుండ్లపై బడ కంటి నేటికి
రహదారి ఎకుకుదిగుడులు—
మహారాజుల మరిలబండ్లకు
నునుపుగను జేసేము మేము—
ఇనుప తిరుగుడు గుండ్లను ॥ బం ॥

ధూళిదుమ్మును నెత్తిమోసిన—
తోడబుట్టుల మన్నలారా!
రాళ్లునీళ్లను కలిపి మెత్తిన—
కూలిపడచుల మక్కలారా! ॥ బం ॥

గున్న పొన్నలు తీయమావులు—
కూళ్లుతినుమా చలువతావులు
దారిప్రక్కనె చనెడు కాలువ—
దప్పికార్చెడు కామధేనువ ॥ బం ॥

ఎఱ్ఱజీపము నల్లబల్ల—
ఎఱుకవ్రాతల హద్దులోపల
పెద్దమోకును లాగుకొనుచును—
గుద్దులాడుచు బాడుకొందము ॥ బం ॥

ఎవ్వరీనడ బాటసారులూ—
అశ్వాలకు నొత్తిళ్లియుండుడు
మాట మొగమాటమ్ము లేదిట—
మట్టికంకఱ తగులు కాలికి ॥ బం ॥

ప్రొద్దుపొడుపున వచ్చువారము—
ప్రొద్దుపొడుగున లాగువారము
ప్రొద్దుకునుకున బోవువారము—
అద్దిరా అదెమార్గమనుకొన ॥ బం ॥

ఈ పాటపేరు “రస్తామరమ్మతు.” రస్తామరమ్మతు ఎటువంటిదో భాషయొక్క మరమ్మతు అట్టిది అని చిత్రంగా సూచించి మీ ఊహకు వదిలి వేయడానికిగాను యీపాట ఉపోద్ఘాతం.

మన యీ “బహుళాంధ్రోక్తి” మయప్రపంచమందు ప్రజలు మాట్లాడే భాషకు, పండితులు కొల్లాడే భాషకు మధ్యను మంచిగావుండి మేలెం వతుగా మెరిసేది జానపద గేయమే. ఒక జాతి యొక్క ‘సంస్కృతిని’ సంప్రదాయాన్ని, సంపదను, పెంపును, సక్రమంగాను, సరిసంగాను ఎప్పటికప్పుడు చూపిస్తూ చిరంతనంగా నిలబెట్టేది పల్లెటూరి గానమే! ఉదాహరణకు యీ పాటలు చూచి, రోకుహాకులు, లోచనాలోచనలు గ్రహించండి.

శుక్రవారం సంతలోన బావయ్యో బావయ్యా!
చుట్టమీద తొక్కినావో బావయ్యో బావయ్య!
నువ్వు తొక్కినందు కేడవలేదు బావయ్యో బావయ్య!
నీ కాలు నొప్పి కేడిచాను బావయ్యో బావయ్య!
ఆదివారం సంతలోన బావయ్యో బావయ్య!
అంది అంది గుద్దినావు బావయ్యో బావయ్య!
నువ్వు గుద్దినందుకు ఏడవలేదు బావయ్యో బావయ్య!
నీగుత్తినొప్పి కేడిచాను బావయ్యో బావయ్య!
బుధవారం సంతలోన బావయ్యో బావయ్య!
నా బుగ్గలెట్టుకు కంసినావు భావయ్యో బావయ్య!
నీవు కరిసినందు కేడ్వలేదు బావయ్యో బావయ్య!
నీ పళ్లనొప్పి కేడ్చినాను బావయ్యో బావయ్య!

గట్టుమీద పాలపిట్టా—నాసామి—
కొట్టబోతె తేలుకుట్టు—నాసామి!
చక్కరాల పడవమీద—నాసామి—
చెక్కగొట్టు సిన్నవాడా!—నాసామి!
చెక్కవచ్చి చెంపగొట్టి—నాసామి—
చెప్పరానిదుఃఖమొచ్చె—నాసామి!
మంచినీళ్ల బావికాడ—నాసామి—
మందునూరే మామకొడకా—నాసామి!
మందునైతె నాకుతెలుసు—నాసామి—
వల్లకాదు—మల్లిపోరా—నాసామి!

నాతిచుట్టు తిరిగేవాడా—నాసామి—
నూతిలో పుల్లేసినాడా—నాసామి!
పుల్లనైతె నాకుతెలుసు—నాసామి—
పుల్లకాదు—మల్లిపోరా—నాసామి!
ఎర్రనేల గట్టుమీద—నాసామి—
ఎడ్లగానే చిన్నవాడా!—నాసామి!
ఎడ్లనైతె నాకుతెలుసు—నాసామి—
పల్లగాదు—మల్లిపోరా—నాసామి!

ఈ పాటలు సేకరించడంలో వుండేకష్టం ఎక్కడుందీ అంటే, పామరజనలు చదువుకున్న వారిముందు తమ ప్రకృతిని వెల్లడిచేయడంలో వుండే అయిష్టమందుంది. నాగరీక విజ్ఞానులు పాడమంటే పాడరువారు. అన్నప్పుడు పాడమన్నా పాడరు. చూడండి! వాణ్ణొకణ్ణో ఆలాపనచేయరా అంటే ఏమన్నాడు? ఏది ఆపోతు? ఏది ఆపాలం? అన్నాట్ట. అలాగ్గామనం వాళ్లను వెంటాడిస్తూ వెత్తిగాడొసుకు ఊగుకు మనమే అతికించుకొంటూ ఆఖరకు ఒక పాటక్రింద తేల్చుకోవాలి: లేదా, కలం కాగితం ఏమీలేకుండా, వాళ్లతోపాటు ఆరుబయట, తీరుబాటు గడియల్లో కళను కళకొలుక్కైయేతే గ్రహన్ని విని తిరించాలి!

అలా సంపాదించతగ్గపాట హరిజన వాడది ఒకటి చూడండి. అది మతంగమ్మ పాటయొక్క తుత్తునుక.— మతంగమ్మ మాలవాళ్ల దేవత. పాటయొక్క పల్లవి "ఏల్లాయిశే! ఏల్లాయిలే!" ఫిల్లేల కత్తిబుజాన్ని వేసుకుని పాడతారు! కూడాకూడా డప్పులు మ్రోగుతూ వుంటాయి. అదో ఉత్సాహం! ఉద్రేకం! ఉద్దీపనం!

ఏల్లాయిశే! ఏల్లాయిశే!
సెకకొట్ట మంటె కొట్టాదియ్యా!— ॥ఏ॥ ॥ఏ॥
సిన్నవాణ్ణి తియ్యమంటే తియ్యాదియ్యా!—॥ఏ॥ ॥ఏ॥
మడకెత్తుచ్చుకొని మెడమీద గుద్దితే!— ॥ఏ॥ ॥ఏ॥
చెంగద్దుకు తీసద్ది చిన్నవాణ్ణి— ॥ఏ॥ ॥ఏ॥
తగడత్తిత్తా! గంధమా— ॥ఏ॥
తావుల్ల గంధమా— ॥ఏ॥
మంచినీళ్ల గంధమా— ॥ఏ॥
మాతమ్మ గంధమా— ॥ఏ॥

'మాతమ్మ' అంటే మతంగమ్మ! చివరిభాగం ఆమెకై తీసేగంధం, ఆమెకు చేసేపూజ అవిని. "తావుల్ల గంధమా" అంటే పరిమళించే చందనం అన్నమాట. "మంచినీళ్ల గంధమా" అంటే మంచినీళ్లతో తీసిన గంధం అన్నమాట. కాని రసకంధాయమంతా మొదటి నాలుగు చరణాల్లోనే వుంది. సెకకొట్టమంటే కొట్టాదయ్యా—సెక—మంట—పొయ్యిరాజెయ్యమంటే రాజెయ్యదట పెళ్లాం. సిన్నవాణ్ణి తీయమంటే తీయదట. కానిమడకర్ర—లావుపాటి కర్ర పుచ్చుకొని మెడమీద గుద్దితే చెంగొత్తుకుంటూ తీస్తుందట. ఎవర్ని? చిన్నవాణ్ణి—ఆనాలుగు చరణాలు ఎటువంటి జానపద చిత్రాన్ని అచ్చుగుద్దినట్టు కనపరుస్తున్నాయో కన్నారా? పేదవాండ్లగుడిసె, గుడిసెలో కుటుంబము, కుటుంబంలో అన్యోన్యంజరిగే కలహం. కలహంలో మెళమెళ దరువు, తాళం, మురువు!

"తగడత్తిత్తా! గంధమా! ఏల్లాయి లేఏల్లాయిలే.
తావుల్లగంధమా! ఏల్లాయిలే ఏల్లాయిలే!
మంచినీళ్లగంధమా! ఏల్లాయిలే ఏల్లాయిలే!
మాతమ్మ గంధమా! ఏల్లాయిలే ఏల్లాయిలే!"

మరి పెద్దవాళ్లు మీరడిగితే ఈ పాటలు ఇల్లాగ్గానే అపురూపమై పోతాయి చూడండి. మేంసంపాదిస్తాం. అని మా కొద్దివాళ్లు ఎంచేశారూ ఒక పర్యాయం—నేను సాయంత్రం షికారునుండి ఇంటికి వచ్చేసరికి పట్టుకున్నాం ఒక జానపదగేయాన్ని అన్నారు. అయితే పాడండి అన్నాను. పాడేముందు ఎవర్నుండి సంపాదించారు?" అని అడిగాను. పనిచేసే ఆడపిల్లలు లేరూ! పేడాగీడా పోగు చేసుకుంటూ తిరుగుతారు! వాళ్లచేత పాడించాం అన్నారు. అంటే పాడండీ అన్నాను. అంటే మాపిల్లవాళ్లు గడ్డికోత పాటంటూ ఏదోపాటపాడారు. కాని దాన్ని వదిలేసి, "మరి యేమైనా విన్నారా వాళ్లనుండి?" అని ప్రశ్నించారు. ఆ! వినడమేమిటి? పాడించాం దంపుల్ల పాటొకటి అన్నారు. అంటూ చదివారు. బాగుంది ఆపాట. అదిఇది.

"సీతసిరగట్టు, నాజీ నడికట్టు, నాచెయ్యా
పచ్చాబొట్టూ వారాధిగట్టూ

వారాధిగట్టూపై, వడెండబోసి.
రాసిలకా పోసిలకా! వడ్లు దందాము!
రాసిలకా పోసిలకా! వడ్లు దందాము!
దంపిన వడ్లాను రాసీచేద్దాము;
సీతసిరిగట్టు, నాజీ నడికట్టు నాచెయ్యి
పచ్చాబొట్టూ వారాధిగట్టూ
ఆ సువ్వి ఓ సువ్వి!"

అయినా అస్తమానం పాటల సంఖ్యకోసం, పాటల పాడవుకోసం చూడక ఈ పాటలయొక్క పుట్టుపూర్వోత్రపు స్వభావాలొక మారైనా కొంచెం పరామర్శించడం మేలేమో. ఒకసారి ఒక కోయవాడు పట్నవాసంవచ్చి తన వేసం తన విద్య ప్రకటిస్తూ అన్నాడు. "దొరా! మామన్యం వస్తె మేము పట్టుతేనె వెదురుబియ్యపాయసం మీకు భోజనంగా పెడతాం దొరా! మేము నృత్యంచేస్తాం దొరో. కొమ్ములూదుతూ చప్పుళ్లు చేస్తు ఊరికే "గుము" "గుము" అని అనుకొంటూ అభినయిస్తాం దొరా! మేం ఊసాడం దొరా! పలుకాండందొరా!" అన్నాడు కళ్లువిప్పుకుంటూ త్రిప్పుకుంటూ" అప్పుడేమని ఊహించేను? "గుముగుము"-తుమ్మెదరొద "ఝుముఝుము" అంత నైసర్గికంగా వెలువడి వుండాలి. అటువంటి జానపదగేయం మరొకటి వుండబోదు. అని తలపోశాను. కొండవీటి చేంత్రాడం తపాడుగ్గా వుండడంలో గాని, వేన వేలుగా వినిపించడంలోగాని లేదు అందలి, ఆనందం. ఆ అందం, ఆనందం అనభవించడంలో వుంది అభిజ్ఞత, అని అనుకున్నాను. ఎందుకూ? ఒక తూరి, చెట్టూత్తై పిట్టా నట్టింటపెట్టా అన్నంత దూరంగా, అన్నంత దగ్గఅగ, వినవచ్చింది. "ఎవరే జాణలు? ఏరే జాణలు!" "ఉగ్గు ఉగ్గు." "అ రంగ! వో రంగ" "ఎవరే జాణలు?" అని. ఒక వైపుమాస్తినిగదా గోదావరి నీలాల నీరు, నీటిలో చాకిరేవుబల్ల, బల్లమీద ఒల్లెఉతుకుతూన్న చాకెత. మరింకా అది పాడుతుందేమో అని ఆశించాను. గాని, అది ఉతకడమే మానేసింది, ఉతుకుతో ఊసూఉస్సు కూడా మానేసింది, నాకళ్లు దానికళ్లల్లో నాట్య మాడగానే!

ఒక్కొక్కప్పుడు ఈ పాటలు సమస్యలు కొల్పుతూ తమర్ని పూరించ మంటాయి. ఉదాహరణకు

ఏవూరు భామా, ఏమె నీ పేరు?
మాయూరు మనవూరె, పేరు పెళ్లాము!

"మనవూరె" "పెళ్లాం" అన్న వాక్కులువావి. ఎన్నెన్నో మార్పుల్లుగా విని విని చివరకుంచిన ముక్కలవి. నిజానికెవనికేవూరు ఇష్టమైతే ఆవూరే చెబుతుంది ఆపాట ఏపేరుమీద మోజుంటే ఆపేరే పలుకుతుంది ఆపాట. అటుకంటి అమ్నిబస్ పాట అది. 'మావూరు గుంటూరు.' పేరు "గున్నమ్మ" అనొచ్చు, మావూరు నెల్లూరు; పేరు నెలవంక అని అనవచ్చు.

ఇంతకంటె విడ్డూరపు రహస్యం మరొకటి చెప్తాను.

"ఏమయో కాపా! మా యింటికేలరావు?"

ఆ పిలుపు ఓనాడు విన్నానో లేదో అప్రయత్నంగా నేనే ఆ కాపునకొని పదం పూర్తివేసికోసాగాను.

"మీయింటి కేలరానే? నీవింటికాడ లావో?
కంటి కాపడ బోవో?" అంటూ—

నేనే ఈలాంటి పరవశత్వంలో పడేవాణ్ణి ఇతరులు కారని అనుకోకండి. ఒక నాడు మద్రాసు రేడియోనుండి.

"నోమినో మల్లాలా, నోమల్లాలా!"

అన్నపాట పట్టుకుని "అయిసర బజ్జాల్లా" మన్నాడు ఓ మిత్రునకు వినిపిస్తే అతగాడు వెంటనే

"ఓ రాచవూల గుమ్మాడి నోమి నోమ ల్లాలా!
నోమల్లాలా!"

అని అందుకున్నాడు. అది అప్పుడొక అర్థము ఒక తాత్పర్యము నాకందించినట్లయింది.

"ఓ రాచవూల గుమ్మాడి నోమినోమ నీలాల" అని— ఆ పాట వీరికివస్తే నిలయవిద్వాంసులు ఇప్పుడు పాడగలరు. రాకుంటే తత్తుల్యమై దాన్ని మరొకటి పాడతారు—

"సువ్వి సువ్వన్నలారా! సువ్వన్నలార!
మల్లి సువ్వన్నలార! మాయన్నలార!
పొద్దున్న కామూడు పొలమెల్లి నాడూ
ఇంటికాడ దేవి వేమిమి పనులూ?—సువ్వి—
మంగళం పాడుతూ మేడపై నుంటే
ఆడేటి బాలుడు ఇళ్లకొచ్చేను—
ఇళ్లకొచ్చిన బాల కల్లో కొచ్చేను—సువ్వి—."



# ఉత్తరంలో బిందులు... * (రేఖారూపం) "కొత్తపల్లి లలిత"

...ఈవేళ నీకీ వుత్తరం వ్రాద్దామనుకోలేదు. మధ్యాహ్నం చాలా ఎండగావుంటే పట్టు చిలక్కొయ్యకు తగిలించి కుర్చీలో కూలబడ్డాను...ఇన్ని పౌన్ల బఱువుకు పేముకుర్చీ కిఱ్ఱుమని బాధ పడ్డది...నిజంగా నువ్వన్నట్లుగా స్థూల కాయం వుంటే కష్టమే నేఁ...వొళ్లంతా చెమటతో తడిసి పోయి మట్టి వాసనేస్తోంది...అందుకు కారణం? కంపు కొడ్తున్న బనీను—ఛా, అంటూ చాకలికి తెచ్చింది తొడుక్కుందామని బీరువా తీశాను...హనుమంతుని లా లంక లాంటి బీరువానంతా అల్లకల్లోలం చేసినా ఎక్కడా లేనిదే! పాపం—నా బనీను అని జాలి వేసింది—ఎక్కడుందో? ఏమయిందో? రెండో ప్రయత్నంలో నీ జార్జెట్ చీర మడతల్లో దాగి వుండటం కనబడింది...సరే అని బనీను తొడుక్కుంటిని గదా—సెంట్ వాసన నన్ను గట్టిగా నలిపివేసింది...దానితో స్పర్శసుఖం జ్ఞాపకానికొచ్చింది...

వెంటనే కాగితం ముక్క సంపాదించి నీకు ప్రేమ లేఖ వ్రాద్దామని నిశ్చయించు కొన్నాను...ఎక్కడా దొరక లేదు...నా లెటర్ పాడ్ ఏమి చేసావో? నాలుగు కాగితాలు పొయ్యిలోకి చింపుకొని అది కాస్తా బొగ్గుల డబ్బాలో దుక్కొదావనుకూంటాను...ఏ? సరేగానీ—ఏమే, వంట గదితాళం చెవులు మంగళ సూత్రంతో ముడి వేసికొని పుట్టింటికి చక్కా వెళ్లావేమిటే? మొత్తానికి మంచి దానివే...సరే—జరిగిన పని ఇది— 'శేషాద్రి వేంకటప్పారావు' అన్న పేరుగల విద్యార్థి కాంపోజిషన్ నోటుబుక్కులో నుంచి నాలుగు కాగితాలు వంకిరటింకరగా చింపేశాను—వాడెప్పుడో ఈ ఆకస్మికమైన 'ఖాళీస్థలాన్ని చూసుకొని —"మనమాష్టారు గజ దొంగరా నిజంగా" అని స్నేహితునికి చెప్పక తప్పదు! పైగా వానికిలాగ జవాబు వచ్చి వుంటుందని నా గట్టి నమ్మకం..."పోనీలేరా...ఇంకా పూర్తిగా పుస్తకమే కాజెయ్యలేదు లేక కోమటికి అదో పరక్కి అమ్మేసుకో లేదు సంతోషించరా—వాళ్లకిచ్చే జీతాలేమూల కొస్తవిరా?"...అవును బ్రతక లేకపోతే బడిపంతులు అన్నారు!......"పోనీ—వాడికి నా దీన స్థితి తెలుస్తే గా జాలి పడడానికి? నేను భార్యకు ప్రేమలేఖ వ్రాద్దామని చింపుకొన్నానని వాడు అనుకోగలడా? ఇంతకూ నాదీ ఖర్మం! (అసలు నువ్వు కూడా ఈపాటికిది చదివి కొంగు చాటు చేసుకొని దొంగనవ్వులు నవ్వుతున్నావుగదూ?)

నిజంగా-ఎందుకో గాని కడుపునిండా భోంచేసినా సరిగ్గా నిద్ర పట్టడం లేదు...కలతగా వుంటుంది. ఇంతలో చీకట్లో నక్షత్రంలా వస్తావు...రక రకాల ఆకర్షణీయమైన పోజుల్లో వస్తావు...ఒక్కొక్క సారి పెసరట్టువేస్తూ వుల్లిపాయల వాసనతో, ఇంకోసారి మొగలిపూల జడ రేవితో, నవ్వుతూ కులుకుతూ—అల్లరి పిల్లలా గాజుల చప్పుడుతో నా కుర్చీ వెనక్కు వచ్చి క్రాఫింగ్‌ని చల్లని వేళ్లతో సవరిస్తూ—పెంకి పిల్లవవుతావు! ఇంకా ఈ దృశ్యాల్ని రంగు-రంగుల్లో వర్ణిస్తే నీకళ్లు సిగ్గుతో మూతలు పడ్తవి...నాకు ఆ క్షణంలో కనబడవు...బాధగా వుంటుంది. నీకు కోపమొస్తే పీటి మూలాన్న మరీ అందంగా మారి పోతావు గా!...ఎవ్వరో పరాయి వాళ్లు ఆ మెఱుపుని గమనిస్తారు...నాకు లేనిదే ఇంకోళ్లనుభవిస్తే అసూయ పుడ్తుంది. ఊహూ...నేను చెప్పను...నామనస్సులోనే ఇంద్ర ధనుస్సుని దాచేసు కొంటాను...ప్రస్తుతం ఇప్పుడు చంద్రుణ్ణిమేఘం కమ్ముకొని చలింప జేసినట్లుగా నన్ను ఉద్రేకం.........

ఇటువంటి మానసికావస్థలల్లో నీవు ఎంతో అలవికానంత సౌందర్యంతో జేదీప్యమానంగా వెలిగి పోతావు...అప్రాప్త మనోహారిలా...స్వప్న సుందరిలా...భావ కవిత్వంలా తియ్యని వెన్నెల్లా, కనబడ్తావు...ఏమిటీ విచిత్రం? నువ్వేమంటావో నాకు తెలుసును—"హా ప్రేయసీ...రూప గర్వితా!" అంటూ శూన్యంలోకి చేతులు జాచండీ అంటావు—"నేను మీ ప్రక్కనే గాలిలా అంటి పెట్టుకొని వున్నప్పుడీ ప్రేమలూ, ప్రతాపాలూ ఏమవుతవండీ?"—అని ప్రశ్న వేస్తావు...స్పెషల్ తెనుగు చదివావు...వియోగానికున్న తియ్యని లక్షణాలెన్నో ప్రబంధాల్లో చదవలా? కానీ ఏమి చెయ్యగలం? ఈ చెవితో విని ఆ చెవితో విడిచేస్తారు స్టూడెంట్సు! కానీ ఎంత శోచనీయమో ఆలోచించి చూడు—

# స్వతంత్రోషస్సూక్తము

రచన " ఉషశ్రీ "

## స్వేచ్ఛాదేవి

ఎవరోహో !
మీ రెవరోహో !!
ఈ రహో నిశీధినీ తమస్సులో
ఈ మహో గభీర నిస్తబ్ధతలో
ఎవరోహో !
——మీ——
రెవరోహో ! !

ఈ అరోామయ గృహద్వారములో
ఈ విషోరగక్రూర దృష్టులలో
ఎవరోహో !
——మీ——
రెవరోహో !!

ఆనంద కళముతో
సౌందర్య శోభతో
హాయిగా పాడెదరు
తాండవ మ్మాడెదరు
ఎవరోహో !
——మీ——
రెవరోహో !!

## విముక్తజనత :

ఓహో !
స్వేచ్ఛాజీవీ !
ఆహో ! భారత భావీ !!
స్వతంత్ర దేవీ !!
ఈ రహోనిశీధినీ తమస్సులో
ఈ మహో గభీర నిస్తబ్ధతలో
మేమమ్మా——
ఓ-మేమేనమ్మా !

ఓహో !
ఈ అరోామయ గృహ ద్వారములో
ఈ విషోరగ క్రూర దృష్టులలో
అపరంజుల నలంకరించి
ఉషోరాగ మాలపింప
వచ్చామమ్మా !
మేమమ్మా——

ఆనంద కళముతో
హాయిగా పాడెదము——
సౌందర్య శోభతో
తాండవ మ్మాడెదము——
అమ్మా ! మేమమ్మా !!

## స్వార్థగళం :

అహ్హాహ్హా !
హా ! హా ! హా ! హా !
ఇది ఘోరం
ఇది క్రూరం
దుర్భరం
దుస్సహం
ఎవడా దోహకారి ?
ఎవడా మోసగాడు ! ?

నాపై సమరం జరిపిన
ఈ పైశాచిక విజయం
సహించలేను
వహించలేను——

......................
......................

నా జీవిత అంతిమ నిశ్వాసం——
నా జీవనమున నాఖరు పర్వం——

# స్వతంత్రోషస్సూక్తము

## విముక్త జనత :

ఓహో ! ఓహోహో !!
క్రూర కర్కశ కఠోర పిశాచమా !
ఘోర భయానక-హా ! నిశాచరీ !!
నీ జీవిత అంతిమ నిశ్వాసం
మా జీవిత ప్రథమాశ్వాసం
నీ జీవితమున కాఖరు పర్వం
మా జీవిత స్వర్గారోహణ పర్వం
నీకు—
నరకకూప అవరోహణం

ఓహో !
నీ వేదన గానం
నీ రోదన గాత్రం
వినిపింపకు
కనుపింపకు

బహిష్కృతి—నీకై
తిరస్కృతి—నీకై
పదచ్యుతి—నీకిక—ఓహో

## స్వేచ్ఛాగళం

మీ భావి మనోహర మహో !
మీ భావికి మహోదయ మిదే !
మారుతుంది విశ్వం
చేరుతుంది నూత్నం
ఉషోదయం
శుభోదయం—



(31వ పేజీ తరువాయి)

ప్రేమను హృదయంతో అవగాహన చేసుగోవాలి. వాదప్రతివాద నలతో, భావ వికాసంతోనూ లాభం లేదు... అటువంటి నిండు ప్రేమ కాళ్లకు బంధాలు వేయదు .. స్వేచ్ఛ, హాయినిస్తుంది...ప్రేమ పుష్పసౌరభం వంటిది... ఒక కాల ప్రవాహం వంటిది—ఈ రూపం మనలోనే వుంది ...ఎక్కడో కొండ మీదవుందని ప్రేమకు లేనిపోనికో ణాల్ని కల్పించి మానవుడు శరీరికంగా బాధపడ్తూంటాడు .. కొన్నిటిని మేధాశక్తితో సాధించ లేమని తెలుసుకోవాలి... హృదయంతో అర్థంచేసుగో వాల్సివుంటుంది అని గ్రహించాలి—భక్తిలో, ప్రేమలో, మతంలో ఇదే అంతిమదశ ! అన్నట్లు—నీకు జ్ఞాపకం వుందా? నీకు పుట్టిన రోజున ఇచ్చిన శరత్ నవలలు? పైని చెప్పిన సన్నగీతలవంటి భేదాల్ని ప్రత్యక్షంగా మనకాయన సాహిత్య వీధుల్లోని వ్యక్తులచేత అనుభవింపజేసి—నిశితంగా చూపించడానికి సాహసించినది ఒక్క శరత్ బాబు! చూడు—మనకా ప్రేమ మెఱపుతీగల్ని మనస్సుని కదల్చే సన్నివేశాల ద్వారా ఎంత సహజంగా చిత్రిస్తాడో ..కావ్యజగత్తు ఈ దృష్టిలో వారి సాహిత్యాన్ని గమనించాలి! సరే—నాకు పిల్లల పుస్తగాలు దిద్దుకోవాల్సిన పనివుంది...' మీకు ప్రేమ లేఖలు వ్రాయడం చేతగాదని' వేళాకోళం చేస్తావులే—పోనీ—ఇప్పటికీ సెలవు...మంచి పెద్ద జవాబు చక్కని భాషలో వెంటనే వ్రాస్తావుగదూ...మర్చిపోవద్దు—.






# దాస్య విమోచనం

జి. కె. సుబ్బలక్ష్మి

(బాధితురాలై విచారంతో వున్న తల్లీ, పిల్లలూ.)

పిల్ల :—అమ్మా ఆకలే......అబ్బా ఆకలి దహించుకు పోతూంది....అమ్మా అమ్మా.

ఇంకొక పిల్ల :—అబ్బ నా బట్టలు అన్నీ చినిగి పోయాయి. చలితో వణికిపోతున్నాను. అమ్మా ఉహు....

తల్లి :—కాస్త ఓపిక పట్టండి నాయనా ఎప్పటికైనా మనకు మంచి రోజులురావూ ?... నా చిన్న తండ్రుల్లారా మీ ఏడుపువింటే కడుపు తరుక్కు పోతూంది. ఏంచెయ్యను. ఈ నాటికి మన అవస్త ఇలాపట్టింది. ఇంత మంది బిడ్డలుండే పరాధీననై పోయాను. జగత్ప్రసిద్ధికొన్న వీర పుత్రులను కన్న వీర మాతనై కూడా నేడు అనాథనై పోయాను. వారేవుంటే నాకీగతి పట్టునా వారున్నన్నాళ్లూ పరరాజులు నన్ను కన్నెత్తైనా చూడగలిగారా నాదురదృష్టం మీరంతా అర్భకులై పోయారు.

పి. కొడుకు :—విచారించకమ్మా ఏంచేస్తాం....

తల్లి :—నాకోహినూరూ, గోలుకొండా, రత్న హారాలూ, నా గంగాయమునా గోదావరీ కంఠ హారాలూ నా సర్వస్వమూ కొల్లగొట్టారు. నా కంఠహారాలు మాత్రం ఉంటే ముప్పైకోట్ల కడుపులూ చల్లబడేవి....అవన్నీ తల్చుకుని ఏంలాభం ? ఆగర్భ శ్రీమంతురాలనయిన నా కడుపున పుట్టిమీరింత కష్టపడుతున్నారు.

కొ :—విచారించకు తల్లీ మేమంతా పెద్ద పెరిగాక....

త :—పెద్ద పెరిగితే ఏం లాభం నాయనా.... మీలో ఐకమత్యం లేకపోయాకా....ఐకమత్యంగనుక ఉంటే సాధించ లేని కార్యం వుందా ?

కొ :—అవును తల్లీ మేమంతా అన్యోన్యంగా వుండి. మీ మాటలుగనుక వింటే తప్పకుండా జయిస్తాం....

పిల్లలు :—అమ్మా, బుద్ధి తెలియక అజ్ఞానులమై ఇన్నాళ్లు తిరిగినందుకు క్షమించు. ఇంక మీద మేమంతా కలిసి అన్నయ్య చెప్పినట్టు వింటాం. మాకు జయం కలగాలని ఆశీర్వదించు తల్లీ....

తల్లి :—ఈ నాటికైనా మీరు పౌరుషవంతులయ్యారు గనుక ఇంకి మన కష్టాలు తీరినట్టే....ఎంత అవసర మొచ్చినా ఎంత కష్టమొచ్చినా సత్యం, ధర్మం, తప్పకుండా ఉన్నారంటే తప్పకుండా జయం లభిస్తుంది. వెళ్లిరండి ..(అందరు వెళతారు) (కొన్నాళ్ల తరువాత 'ఉదయమ్మాయచు" పాట వినిపిస్తుంది).

తల్లి :—అమ్మయ్య ఇన్నాళకు నా సంకెళ్లు వదిలి స్వేచ్ఛ జీవనం వచ్చింది....పాపం నా బాబు నా కోసరం ఎంత కష్ట పడ్డాడో.... ("నమొహిందు మాతా" పాట అంతా పాడుతారు.)

★



# యుక్తి పరీక్ష

* శ్రీమతి అద్దేపల్లి లక్ష్మి. *

పూర్వకాలంలో విదర్భ నగరాన్ని పరిపాలించే మహారాజుల్లో వైజయంతీ మహారాజు చాల తెలివి గలవాడు. ఒకసారి ఆయన రాజ్యంలో, మంత్రిగారి అకాల మరణంవల్ల, మంత్రి పదవికి ఖాళీ ఏర్పడింది. అంటే ఏమిటి ఆ రాజుగారికి ఒక మంత్రి కావలసి వచ్చాడు. మంత్రిగారు చాల తెలివైనవాడుగాను, సమర్థుడుగాను వుండాలిగదూ, అందుకని ఆ స్థానంలో మంత్రిగార్ని నియమించడం కోసం రాజుగారు నాటింపు వేశారు. ఆ సాటింపు విని ఇద్దరు బ్రాహ్మలు మంత్రి పదవికి అర్జీలు పంపుకున్నారు.

రాజుగారు ఆ బ్రాహ్మల నిద్దరిని పిలిపించి వారి పుట్టు పూర్వోత్తరాలు అన్ని తెలిసికొన్నాడు. వారిద్దరికి ఒక చిన్న పరీక్ష పెట్టాడు. అదేమిటంటే ఇద్దరి బ్రాహ్మలకు చెరొక వెయ్యి రూపాయలు ఇచ్చి ఆరోజు ఆ డబ్బుతో భోజనం చేసి ఖర్చు పెట్టెయ్య మన్నాడు. ఆ వెయ్యి రూపాయలు ఆరోజు ఎట్లా ఖర్చుపెట్టదామా అనుకుని ఎవరికివారు ఆలోచించారు. మరిచిపోయినా ఆ బ్రాహ్మలపేర్లు ఏమిటో తెలుసా దండిభట్లు, కొండిభట్లు. దండిభట్లు ఏంచేశాడంటే ఆ వెయ్యి రూపాయలు తీసికొని బజారు పోయి ఆ రోజుకి ఇంటికి కావలసిన సామానంతా పట్టించుకుపోయినాడు. ఇంటికి వెళ్లి భార్యతో పంచభక్ష్య పరమాన్నములతో హాయిగా వంట చెయ్యమని చక్కగా అవ్వన్నీ ఇద్దరు బ్రేనుపులు వచ్చేదాక భోజనం చేశారు. ఆ వెయ్యి రూపాయలలోను ఎంతని ఖర్చు పెడతాడు భోజనంకోసం. మహా ఖర్చుపెడితే ఆ రోజుకి ఇరవై లేకపోతే ముప్పై ఖర్చుపెట్టేను. పోనీ వంద రూపాయలనుకో. మిగిలిన తొమ్మిది

వందల రూపాయలు తీసికొని సాయంకాలం రాజావారి కోటకు పోయి రాజుగారి దర్శనం చేసుకొని, కోటలో ఆ సొమ్ము ఇచ్చేశాడు. వంద రూపాయలు మాత్రం భోజనానికి ఖర్చు అయినాయి అని రాజుగారితో మనవి చేసుకున్నాడు.

ఆ రెండవ బ్రాహ్మడు కొండిభట్లుగుడా ఎట్లా వెయ్యి రూపాయలు ఖర్చు పెట్టదామా అని ఆలోచించి, ఆలోచించి, చివరకు ఒక ముత్యాల వర్తకుని దగ్గరకు వెళ్లాడు. ఆయనకు వెయ్యి రూపాయలు ఇచ్చి రెండు మంచి ముత్యాలు కొన్నాడు. అవి ఇంటికి తీసుకొని పోయి, ముత్యాలు కాల్చి సున్నం చేశాడు. ఆ సున్నం బొటనవేలుకు రాచుకొని, అంగడికి పోయి ఒక కొట్లో ఒక తమలపాకు, మరొక దుకాణంలో పోకచక్క తీసికొని రాజుగారి ఆస్థానానికి సాయంకాలం వేళకు చేరుకొన్నాడు. అప్పుడు రాజావారు బ్రాహ్మణు లిద్దరిని పిలిపించి వారు ఏ ఏ రీతిగా వేయి రూపాయలు ఖర్చు పెట్టారని ప్రశ్నించారు. అప్పుడు దండిభట్లు, తాను ఒక వంద రూపాయలు ఖర్చుచేసి ఆ రోజు పంచభక్ష్య పరమాన్నములతోను తృప్తిగా భోజనం చేశానని చెప్పాడు. అప్పుడు కొండిభట్లు ఇల్లా చెప్పాడు. "రాజా మీ రిచ్చిన వేయి రూపాయలు నాకు తమలపాకుల్లో సున్నానికి చాలలేదు. తమలపాకులు, చెక్కలు తిరిగి అరువు అడగవలసి వచ్చింది. ఇంకా భోజనానికి ఎక్కడ సరిపోతుంది మహారాజా" అని మనవి చేసుకున్నాడు.

ఆ విధంగా రాజావారు ఒక్క పరీక్ష చేశారు. మరునాడుదయము రాజుగారు తిరిగి ఇద్దరు బ్రాహ్మలని పిలిపించి ఇద్దరికి చెరొక కాని ఇచ్చి ఈ కానీతో ఇల్లు నింపించి పట్టుకురావలసింది అని చెప్పాడు. దండిభట్లు ఆ కానీ తీసికొని, కానీతో ఇల్లు ఎలా నిండుతుంది, ఏం వస్తువులు దొరుకుతాయి అని ఆలోచిస్తూ వీధివెంట వస్తున్నాడు. అలా వస్తుండగా ఒక ఇంట్లో నౌకరు ఇల్లువూడ్చి, కసవు బైట పారపొయ్యబోతున్నాడు. వెంటనే ఈ బ్రాహ్మడు ఆ బంట్రోతు దగ్గరకు పోయి, "అబ్బాయి ఒక కానీ ఇస్తాను, ఆ కసవు అంతా ఇస్తావా" అని అడిగాడు ఆ నౌకరు తనలో నవ్వుకొని, ఊరికే బయట పారబోసేదానికి కానీ వస్తోంది అని అనుకుని అట్లాగే ఆ కసవు అంతా ఇచ్చేశాడు. అదంతా మూట కట్టుకుని దండిభట్లు రాజుగారి ఆస్థానానికిపోయి అదంతా హాలునిండా విరజిమ్మాడు. హాలంతా ఎక్కడచూచిన క్రింద దుమ్ముతో నిండిపోయింది.

కొండిభట్లు బజారుపోయి కాని ఇచ్చి మట్టి ప్రమిద కొని దాంట్లో మంచినూనె పోయించుకుని ఒక గుడ్డముక్క చింపి వత్తిగా నలిపివేసి అది తీసుకొని రాజుగారి కోటకు పోయినాడు. ఆ హాలు తలుపులన్ని వేసేసి, ప్రమిదలోని ఒత్తికి అగ్గిపుల్ల గీసి అంటించాడు. అప్పుడు ఆ దీపంతో ఇల్లంతా నిండుగా వెలుగు వచ్చింది.

ఈ విధంగా రాజుగారు ఇద్దరు బ్రాహ్మలను రెండు పరీక్షలు చేసి అందులో తెలివిగలవారిని నిర్ణయించాడు. డబ్బు హుందాతనంతో ఖర్చు పెట్టేటందుకు, తక్కువ డబ్బుతో ఎక్కువ వుపయోగము చేకూర్చేటందుకు సమర్థుడైన కొండిభట్లను మంత్రిగా నియమించాడు వైజయంతీ మహారాజులుంగారు.

★

# మహిళా సమాజము - మదనపల్లి.

మదనపల్లె మహిళాసమాజము యొక్క ఎనిమిదవ వార్షికోత్సవము 16-7-50. ఆదివారము సాయంత్రము 4 గంటలకు మదనపల్లె హోప్ భవనమునందు జరుపబడెను. డాక్టర్. ఆర్. సుశీలా దేవి. ఎమ్. బి. బి. ఎస్. గారు అధ్యక్షత వహించిరి.

ప్రార్థనతో సభ ప్రారంభింప బడెను. మహిళాసమాజపు అధ్యక్షు రాలైన శ్రీమతి. కె. సుందరా బాయిగారు. అధ్యక్షురాలిని సభవారికి పరిచయమొనర్చిరి. తర్వాత కార్యదర్శిని యైన శ్రీమతి. టి. వసంతలక్ష్మి, బి. ఎ; సమాజపు గతసంవత్సరపు నివేదికను చదివిరి. అనంతరము సభాధ్యక్షు రాలు స్త్రీలు తమ తమ యిండ్లయందారోగ్య విషయమై తీసికొనవలసిన శ్రద్ధనుగురించి విస్తరించి చెప్పిరి. చిన్నబిడ్డలకు కుక్కదగ్గు, పడిశెము వచ్చినపుడు గమనించవలసిన విధానము, ఇటువంటివి రాకుండ యుండుటకు తీసికొనవలసిన జాగ్రతను గురించి మాట్లాడిరి. మరియు చిన్నపిల్లలు నిద్రించు స్థలముల నెట్లు శుభ్రముగ నుంచుకొన వలెనని విశదముగ తెలిపిరి. స్త్రీలకు మహిళాసమాజమనునది యత్యావశ్యకమైన సంస్థ యనియు, హింఖీ, ఫిర్త్గా సంఘములు, గానము మొదలైన లలిత కళలు గలిగి, స్త్రీలయభ్యుదయమునకు పాటుపడు సంఘములకు ప్రోత్సాహము నివ్వవలెననియు, మదపల్లెలో నుండు, యీ మహిళాసమాజము యిట్టి యావశ్యకమును, ప్రయోజన కరమునగు కార్యముల నొనర్పుటవలన దానికి పుర జనులందరు తోడ్పడి యభివృద్ధి చేయవలయుననియు చెప్పిరి.

తదనంతరము సమాజపు మెంబర్ల బాలికలచేత నాటకము నృత్యములు, వాద్యసమ్మేళనములు జరిపింపబడెను. నాటకము విద్యావతులైన స్త్రీలు గృహస్థ ధర్మము నాచరింపవలసిన విధానమును బోధించునట్టిదిగ నుండెను. ప్రదర్శనముల తర్వాత కార్యదర్శిని వందన సమర్పణనొనర్చె. 'జనగణ' మంగళ గానముతో సభముగిసెను.

కె. సుందరాబాయి.

ప్రెసిడెంటు.

సభ కలిసిపోవుటకు ముందు, ఉపాధ్యక్షురాలగు శ్రీమతి. అమృత వల్లమ్మ గారు ఎనిమిది సంవత్సరములుగ శ్రీమతి కె. సుందరాబాయిగారే యీ సమాజమును కష్టపడి జరుపుచున్నందున, ఆమెనే యీసంవత్సరము కూడా సమాజమున కధ్యక్షులై దీని నభివృద్ధికి తేవలెననీ మహాసభ యందు చెప్పిరి. సభవారందరును దీని నామోదించిరి.

టి. వసంతలక్ష్మి. బి. ఎ.

సెక్రెటరి.



# శ్రీమతి భారతీదేవి అస్తమయం

చెట్టొకటి విత్తొకటి కాదు. సింహం కడుపున గొర్రె పిల్ల పుడుతుందా? అదే విధంగా మన భారతీదేవి విషయంలో కూడా. ఆంధ్ర దేశనాయకుల అష్టదిగ్గజాల్లో పూజ్య చెలికవాడ వెంకట నరసింహ పంతులుగారొకరు. వారిని ఎరుగని ఆంధ్రుడే కాదు పరిసర ప్రాంతరాష్ట్రవాసుడు కూడా వుండడు.

అటువంటి మహనీయుని కడుపున ద్వితీయపుత్రికగా మన భారతీదేవి జన్మించింది. కృష్ణా జిల్లాలో పుట్టి, పశ్చిమ గోదావరి జిల్లాలో చాలా కాలం పెరిగి తూర్పు గోదావరి జిల్లాలో అంత్య శ్వాసపీల్చింది.

చక్కగా చెంపకు చారడేసికన్ను, మల్లెమొగ్గలాటి పలువరుస, చిరునగవు చిన్న పెదవులపైన చిందులాడుతూంటే యెంతసేపు చూచినా ఆ మూర్తిని రెప్పవాల్చకుండా చూడాలని, ఎడతెరపిలేకుండ సంభాషించాలని కోరిక జనించనివారు వుండేవారు కాదు.



కీ. శే. శ్రీమతి భారతీదేవి.

బహిరంగ సభలలో ఆమెయిచ్చిన గంభీరోపన్యాసాలు. యువతీ యువకులను సమీకరించుకొని ఆమె చూపిన కార్యక్రమసూచనలు, ఆమె వుపదేశించిన వుద్బోధనలు యే కార్యకర్తా తన జీవితంలో, మరువలేడు. ఆమె గుంటూరు శారదానికేతనంలో రాజమండ్రి సేవాసదనంలోనూ పొందిన శిక్షణ యేదోవిధంగా అనుచరులకు అబ్బేటట్టు చేయకలిగింది.

ఇరవైరెండవ సంవత్సరం నిండక మునుపే యింతటి మేధాశక్తిని, యింతటి కార్యదీక్షను ఆమె యెట్లాప్రదర్శించ కలిగిందాయని అందరూ ఆలోచించడమే. ఆశ్చర్యమే వారి యోచనకు ముఖ్యకారణం.

తూ. గో. జిల్లా బోర్డుకు మూడు తాలూకాల ప్రతినిధిగా ముమ్మిడివరం నియోజిక వర్గంనుండి ఆమె సభ్యురాలైంది. అంతేకాకుండ ఆమె అఫీసులో అడుగిడీడదే తనవుగా సభ్యులు ఏకగ్రీవంగా నిర్ణయించి ఆమెను ఎడ్యుకేషనల్ బోర్డుకి అధ్యక్షురాలుగా చేశారు.

ఆమె డెల్టా యువజన కాంగ్రెసుకి ప్రచారకార్యదర్శిగా సుమారు నాలుగు సంవత్సరాలు పనిచేసింది. ఆమె కార్యదర్శిగా చేసినపర్యటనవల్ల మన్యగ్రామాల్లో మేలిముసుగుల చాటున సూర్యరస్మి సోకని అగర్భ శ్రీమంతులు వీధుల్లోకి వచ్చి నేడు ప్రముఖ కార్యకర్తలయ్యారు.

మా డెల్టాలో యెవరైనా కొందరు మహిళామణులు దేశసేవ చేయడానికై సిద్ధపడ్డారంటే అది ఆమెచలువ. ఆమె పెట్టిన భిక్ష. 1942.ఆగస్టు వుద్యమంలో ఆమె 'విజ్ఞాన సమితి' స్థాపనద్వారా సహచరులకు చేసిన జ్ఞానోపదేశం రాజకీయవిజ్ఞాన మరువ తగినది కాదు. అందుకనే ఆమె వెనువెంటనే తూ. గో. జిల్లా యువజన కాంగ్రెసుకి వుపాధ్యక్షు రాలుగా యెన్నికోనబడింది.

ఆమె మాకోనసీమకు కోడశై కోహినూరు కంటె ప్రకాశమానంగా వెలుగొందుతోంది. భారత రిపబ్లిక్ దినోత్సవ సందర్భంలో ఆమె మలికిపురం బహిరంగ సభలో యిచ్చిన గంభీరోపన్యాసం మందగతిలోనున్న మదపు టేనుగునకు తగిలిన అంకుశపు పోటులాగ ప్రతివాని హృదయంలోనూ దూసుకుపోయింది. అంతేకాదు అనపర్తిలో ఆం. రా. ట్రేడ్ యూనియన్ సభలో రంగా అధ్యక్షతను భారతీదేవి కార్మికుల విధులను గురించి, కనీసకోర్కెలను గురించి

## శ్రీమతి భారతీదేవి అస్తమయం

ఇచ్చిన వుపన్యాసం ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించతగ్గవే

ఐతే భారతీదేవి మే 16వ తేదీన భారతావనిలో లీనమైపోయింది. ఆమె ముద్దుబిడ్డలు ముగ్గురు, భర్త కామేశ్వరరావుగారు తండ్రి నరసింహం పంతులుగారు, ఆమెతోటి కార్యకర్తలు దుఃఖసముద్రంలో మునిగి వున్నారు. ఆమె యిక మనకులేదు. ఆమె యిచ్చిన సందేశాలు, ఆమెమనకు చూపిన మార్గాలే మనకు మిగిలివున్నాయి ; అవే మనకు శరణ్యాం.

ఆమె పేరిట స్మారకచిహ్నాలు వెలకొల్పటం, స్మారక నిధిని వసూలుచేసి అనాధ బాలికలకు, పేదస్త్రీలకు వుపకారం జరిగేటట్టు చూడడం, దీనికై నడుంకట్టడం నేటి ఆంధ్రమహిళల కనీస ధర్మం. తూ. గో. జిల్లా కాంగ్రెసు ఆఫీసు కట్టి దానికి 'భారతీదేవి భవనం' అని పేరుపెడితే తూ. గో. జిల్లా వాసులు ఆమెపట్లతమకుగల వాత్సల్యాన్ని వెల్లడి చేసికొనగలరు.





## ఆంధ్ర మహిళాసభ

### క్రొత్త కార్యకలాపములు

ఆంధ్ర మహిళాసభ ఆధ్వర్యమున అడయారులో ఒక ఉచిత వైద్యశాల నర్సింగ్ హోములను స్థాపించాలనుకున్న విషయము అందరికి తెలిసినదే. ఆ భవన నిర్మాణము చురుకుగా జరుగుతున్నదని తెల్పుటకు సంతసించుచున్నాము.

పారిశ్రామికశాఖ విద్యార్థినుల నిమిత్తము ఒక ప్రత్యేక వసతిగృహము ఏర్పాటు చేయబడినది.

ఎలిమెంటరీ స్కూలు లీవింగ్ సర్టిఫికేట్ (E. S. L. C.) తరగతులు ప్రారంభించుటకు నిశ్చయమైనది. శిక్షణ తెలుగులో యివ్వబడును. వయస్సుతో నిమిత్తములేదు. ఇంతకు ముందు అయిదవ తరగతి వరకు చదివినవారు చేరవచ్చును. పూర్తి వివరములకు కార్యదర్శిని, ఆంధ్ర మహిళాసభ, మైలాపూరు, మద్రాసు అని వ్రాయవచ్చును.

**को** - ని, ను, కు. (ద్వితీయా విభక్తి) **से** - వలన, నుండి, కంటె (పంచమీ విభక్తి)
**से** - చేత, తో (తృతీయా విభక్తి) **का, के, की** - యొక్క (షష్ఠీ విభక్తి)
**के लिये, के वास्ते** - కొఱకు, కై (చతుర్థీ విభక్తి) **में**; లో; **पर** - మీద (సప్తమీ విభక్తి)

ద్వితీయా విభక్తి ప్రత్యయమగు '**को**' సాధారణముగా ప్రాణి వాచకములకే చేర్చబడును. అప్రాణి వాచకములకు చేర్చబడదు.

ఉదా: **नौकर को बुलाओ** - నౌకరును పిలువుము.
**घर जाओ** - ఇంటికి వెళ్లుము.
**पानी लाओ** - నీరు తీసుకొని రమ్ము.

షష్ఠీ విభక్తి ప్రత్యయములు **का, के, की**, వీని ప్రయోగము తరువాత వచ్చు నామ వాచకము యొక్క లింగవచనముల ననుసరించియుండును.

ఈ ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ, ఏక వచనమైనచో '**का**' వచ్చును.

ఉదా :—**कृष्ण का घर** - కృష్ణుని యొక్క యిల్లు. (**घर** - పుంలింగము, ఏకవచనము. అందుచే **का** ప్రత్యయము వాడబడినది).
**लक्ष्मी का कमरा** - లక్ష్మి యొక్క గది. (**कमरा** - పుంలింగము, ఏకవచనము).

'**के**' ప్రత్యయము యొక్క ప్రయోగము రెండు విధములు.

(1) ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ, బహువచన మైనచో '**के**' వాడబడును.

ఉదా :—**गोपाल के भाई** - గోపాలుని యొక్క సోదరులు. (**भाई** - పుంలింగము, బహు వచనము, కాబట్టి **के** ప్రత్యయము వాడబడినది).

(2) ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ, ఏక వచనమై యుండినను, దానితో నేదైన ప్రత్యయము వచ్చిన, **का** కు బదులుగా **के** వాడబడును.

ఉదా :—**सीता का कमरा** - సీత యొక్క గది.
**सीता के कमरे में** - సీత యొక్క గదిలో.

(कमरा అను పదము పుంలింగ, ఏకవచనము. కాని ఈ నామవాచకముతో में అను ప్రత్యయము వచ్చినందున के వాడబడినది).

ప్రత్యయము తరువాత వచ్చు నామవాచకము స్త్రీలింగమగుచో (రెండు వచనములలోను) की వచ్చును.

ఉదా :—विमला की किताब - విమల యొక్క పుస్తకము.

(किताब - స్త్రీలింగము, ఏకవచనము).

हिन्दुस्तान की नदियाँ - హిందూ దేశపు నదులు.

(नदियाँ - స్త్రీలింగము, బహువచనము).

ఆకారాంత పుంలింగ, ఏకవచన శబ్దమునకు ప్రత్యయము వచ్చినపుడు చివరి 'आ' కారము 'ए' కారమగును.

ఉదా :—रास्ता - త్రోవ (రోడ్డు)

रास्ते में - త్రోవలో.

పుంలింగ నామవాచక శబ్దమునకు ముందు 'आ' కారాంత విశేషణమున్నచో, ప్రత్యయము వచ్చినపుడు విశేషణములోని చివరి 'आ' కారము గూడ నామవాచకములోని आ వలెనే, ए గా మారును.

ఉదా :—नया बंगला క్రొత్త బంగళా.

नये बंगले में - క్రొత్త బంగళాలో.

छोटा घर - చిన్న యిల్లు.

छोटे घर का किराया - చిన్న యింటి అద్దె (బాడుగ).

బహువచన నామవాచకములతో ప్రత్యయము వచ్చినపుడు, నామవాచక రూపము లెట్టి మార్పు జెందునది 7 వ పాఠమునందలి अ, आ నియమములలో సూచింపబడినది.

| | |
|---|---|
| सूरज సూర్యుడు (పుం) | गरमी వేడిమి. (స్త్రీ.) |
| खिलौना ఆటవస్తువు (పుం) | हाथी ఏనుగు (పుం). |
| भाई సోదరుడు. | बहन సోదరి. |
| शाम సాయంకాలము (స్త్రీ). | आज कल ప్రస్తుతము. |

## పా క్య ము లు

**मिलना** లభించుట; దొరకుట.

**मिलना** చూచుట; దర్శించుట; కలుసుకొనుట

**चलना** వెళ్లుట.

**मदरसा** బడి (పుం).

**रात** రాత్రి (స్త్రీ)

**पंक्ति** పంక్తి (స్త్రీ)

**निकलना** బయలుదేరుట; (సూర్యుడు) ఉదయించుట; (నది) పుట్టుట.

**सोना** నిద్రించుట.

**मंदिर** దేవాలయము (పుం)

**सभा** సభ, (మీటింగ్) (స్త్రీ)

**कोई** ఎవరు; ఎవరో; ఎవడైన.

## వా క్య ము లు.

| | |
|---|---|
| मैं राम को यह किताब देता हूँ। | నేను రామునికి ఈ పుస్తకము యిచ్చుచున్నాను. |
| गोविन्द घर से आता है। | గోవిందుడు యింటినుండి వచ్చుచున్నాడు. |
| तुम क़लम से लिखती हो। | మీరు కలముతో వ్రాయుచున్నారు (స్త్రీ). |
| जानकी उमा से बड़ी है। | జానకి ఉమకంటె పెద్దది. |
| सूरज से हमको गरमी मिलती है। | సూర్యునినుండి మనకు వేడిమి లభించుచున్నది. |
| गंगा नदी कहाँ से निकलती है? | గంగా నది యెచ్చటనుండి బయలుదేరుచున్నది? (గంగా నది యెచ్చట పుట్టుచున్నది?). |
| वे पंडित जी से मिलने के लिये दिल्ली जा रहे हैं। | పండిత్ జీని చూచుటకొఱకు వారు ఢిల్లీ వెళ్లుచున్నారు. |
| मैं इन्दिरा के वास्ते सुंदर खिलौना लाता हूँ। | నేను ఇందిర కొఱకు అందమైన ఆటవస్తువు తెచ్చుచున్నాను. |
| आप का घर कहाँ है? | తమ యిల్లు యెచ్చట వున్నది? |
| रामारावजी के लड़के बंबई में पढ़ते हैं। | రామారావుగారి కొడుకులు బొంబాయిలో చదువుచున్నారు. |
| मैं आपके भाई को बहुत दिन से जानता हूँ। | నేను తమ సోదరుని చాల కాలమునుండి ఎరుగుదును. |
| आप की बहन आजकल कहाँ रहती है? | తమ సోదరి ప్రస్తుతము యెచ్చట వున్నది? |
| हाथी की आँखें छोटी होती हैं। | ఏనుగు (యొక్క) కండ్లు చిన్నవి. |
| मेज़ पर क्या है? | మేజా పై ఏమి వున్నది? |
| वह स्टेशन पर है। | అతడు స్టేషనులో వున్నాడు. |

हम रोज़ शाम को समुद्र पर जाते हैं। — మేము రోజు సాయంకాలము సముద్రమునకు వెళ్లెదము.

## పాఠము 10.

### కొన్ని అవ్యయములు.

ऊपर పైన.
नीचे క్రింద.
बाहर వెలుపల.
भीतर, अंदर లోపల.
पास దగ్గర, వద్ద (అధీనముగ)
नज़दीक దగ్గర.
साथ వెంట.
विना లేనిదే.
बाद పిమ్మట; తరువాత
पहले పూర్వము; ముందు (సమయము)
सामने ఎదుట.
पीछे వెనుక
सिवा తప్ప.
यहाँ వద్ద.
बारे में గురించి.

నామ వాచకములతో పై అవ్యయములకు ముందు 'के' విభక్తి ప్రత్యయముపయోగించబడును.

ఉదా:—मेज़ के ऊपर బల్లపైన.

కాని క్రిందివానికి ముందు की విభక్తి ప్రత్యయము వచ్చును.

तरफ़, ओर వైపు.
तरह వలె, మాదిరి.
अपेक्षा కంటె
जगह స్థానమున.
नाईं వలె.
खातिर కొఱకు.
बदौलत వల్ల.
मारफ़त ద్వారా.

कृष्ण के घर के पास एक मंदिर है। — కృష్ణుని యింటి వద్ద యొక దేవాలయమున్నది.
क्या, आप के पास यह किताब है? — తమరి వద్ద ఈ పుస్తకమున్నదా?
तुम पेड़ के नीचे बैठो। — మీరు చెట్టు క్రింద కూర్చొనుడు.
मेज़ के ऊपर कलम है। — బల్ల మీద కలమున్నది.

| | |
|---|---|
| आप बाहर क्यों बैठते हैं ? अंदर चलिये । | తమరు వెలుపల యెందుకు కూర్చున్నారు? లోపలికి రండు. |
| राधा का मदरसा घर के नज़दीक है । | రాధబడి యింటికి దగ్గరగానున్నది. |
| आप भी पिताजी के साथ चलिये । | తమరు కూడ తండ్రిగారితో వెళ్లుడు. |
| कलम के बिना काम नहीं चलता । | కలము లేనిదే పని జరుగదు. |
| मैं रात को दस बजे के बाद सोती हूँ । | నేను రాత్రి పదిగంటల మీద నిద్రించుచున్నాను. |
| आज की सभा में आप पहले बोलिये । | నేటి సభలో (మీటింగ్) తమరు మొదట మాట్లాడుడు. |
| देखिये, आप के सामने कौन है ? | తమరి యెదుట యెవరున్నారో చూడుడు. |
| तुम आज मेरे यहाँ कितने बजे आते हो ? | మీరు నేడు నా వద్దకు (నా యింటికి) యెన్ని గంటలకు వచ్చెదరు? |
| आपके सिवा यह काम करनेवाला कोई नहीं । | తమరు తప్ప ఈ పని చేయు వారెవరు లేరు. |
| गाँधी जी के बारे में बीस पंक्तियाँ लिखो । | గాంధీజీని గూర్చియిరువది పంక్తులు వ్రాయుము. |
| क्या, आप अभी बाज़ार की तरफ जा रहे हैं ? | తమరు యిప్పుడే బజారు వైపు వెళ్లుచున్నారా? |
| इस तरह लिखना ठीक नहीं । | ఈ విధముగా వ్రాయుట సరికాదు. |
| ललिता को अपेक्षा सरल अच्छी हिन्दी लिखती है । | లలితకంటె సరళ మంచి హిందీ వ్రాయుచున్నది. |
| गोपाल राव की जगह रामचन्द्रराव काम कर रहे हैं । | గోపాలరావు స్థానములో రామచంద్రరావు పని చేయుచున్నారు. |



---

(46వ పేజీ తరువాయి)

జూలియా పరమసాధ్వి, ఆమెది ఆదర్శజీవితము. వివాహములందు వరుల నిర్ణయించుకోగల యధికారము యువతులకే యుండవలెనుగాని మతాధికారుల యంగీకారముపై నాధారపడి యుండరాదని ఆమె వాదము. యువతీ యువకుల క్షేమ, నిష్కామముకు అత్యావసరము. నిర్బంధ విధానము యీ విషయమందెంత మాత్రము చూపరాదు అను అనుభవమును చాటుచున్నది యీకథ.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో.)



# జూలియా బాహిల్

శ్రీ వారణాసి వెంకటాచలంగారు

ఐర్లాండు దేశములోని ప్రజలు క్రైస్తవులలో క్యాథలిక్ తెగకు చెందినవారు. ఈ దేశంలో గ్రామస్థుల సాంఘిక జీవితము అమితముగా పారీష్ ప్రీస్టుల పరిపాలనకు లోనై యుండును. ఈ పాదిరీలను మన దేశమందుగల మతాధిపతులతో పోల్చవచ్చును.

ఐర్లాండులోని ఒక గ్రామంలో మైడను అను ఒక ఫాదిరీ వుండెను. ఇతని పారిష్‌కు చెందిన గ్రామమందే ఫాలిన్ అను సామాన్య వర్తకుడు వుండెను. ఇతడు చిల్లర సామానులు అమ్ముకొని జీవితం గడుపుచుండెను. ఇతని కుమార్తె జూలియా చాలా చక్కనిదై యుండెను.

ఆ గ్రామ మందు గల పౌరులందరు క్యాథలిక్ తెగకు చెందినవారు గనుక, వారికి క్రైస్తవ మతాచారము అందు గాఢనమ్మకముండెను. అట్టి గ్రామములన్నియు క్యాథలిక్ ఫాదిరీల పలుకుబడికి లొంగి యుండును. మైడను యొక్క మాటకు తిరుగులేదు. ఈయన యుక్తవయస్సు వచ్చిన యువతులు యువకులతో స్వేచ్ఛగా తిరుగరాదని శాసించెను. అట్లు తాను విధించిన శాసనమును తిరస్కరించిన యువతులెవరైన యున్న, ఆదివారము తాను చర్చిలో బైబిలు చదువు సమయమున ప్రజలందరి ముందు, వారిని తీవ్రముగ నిందించు చుండెను.

జూలియాలో సౌందర్యము కరుడుగట్టింది. గ్రామమందలి యువకు లందరను ఆకర్షించగల అందము చందము గలదై యుండెను. జూలియా ప్రతి దినము తన యిచ్ఛవచ్చినట్లు యువకులతో గూడి వాహ్యాళి వెడలు చుండెను. ఫాదరీ మైడను ఫాలిన్ యొద్దకు వచ్చి, తన కుమార్తె జూలియాను మందలించి స్వేచ్ఛా విహారము మానునట్లు చేయమని నిర్బంధించెను. తండ్రి కుమార్తెను సన్మార్గమున పెట్టలేని యెడల తానే గ్రామస్తు లందరికి చెప్పి జూలియా యొక్క ప్రవర్తన మారునట్లు చేయగలనని ప్రగల్భములు పలికెను.

ఫాలిన్ యొక్క అంగడికి రెండు కవాటములు గలవు. ఒకనాడు జూలియా స్టోరులో కూర్చుండి తండ్రికి వస్తు విక్రయమందు సహాయము చేయుచుండెను. ఆ సమయమున ఒక ధనికుడచటకువచ్చి 60 పౌనుల కట్నమిచ్చినచో తాను జూలియాను వివాహమాడెదనని, ఆమె తండ్రికి చెప్పెను. అప్పుడే ఫాదిరీ మైడను అచ్చటికి వచ్చి జూలియాతో నీ క్రింది విధముగ సంభాషించెను. "జూలియా, నీవు ఫాలిన్ కుమార్తెవు. ఫాలిన్ ఈ గ్రామస్తుడు. మీరుభయులు మా తెగకు చెందినవారు; కాన నేనధికారినై యున్న చర్చికి సంబంధించినవారు. మన మతాచారములకు విరుద్ధముగ నీవు యువకులతో విచ్చలవిడిగ తిరుగుచు ప్రేమ జీవితము గడుప యత్నించు చున్నావు. ఇది మన మతము వొప్పదు. నీవు యిప్పుడు నీ తండ్రితో మాట్లాడుచున్న వ్యక్తిని వివాహమాడక తప్పదు. అట్లు కానిపక్షమున నిన్ను ఈ గ్రామము నుండి వెలివేసి నానా కష్టములపాలు చేసెదను."

కాని జూలియా యీ బెదిరింపుకు భయపడలేదు. ఆమె తన అంతరంగిక జీవితములలో ఫాదిరి ప్రమేయము కలుగజేసికొనుట సమంజసము కాదనియు, తనకిష్టము లేనిదే యెవ్వరిని వివాహ మాడననియు, తన శీలరక్షణ తన బాధ్యతయనియు, యువతీ యువకుల పరస్పర ప్రేమకు చెందిన విషయములందు ఫాదరీల కెట్టి జోక్యము యుండరాదనియు చెప్పెను. ఈ విధముగ అధికారరీత్యా మాట్లాడ బోయిన మతాధికారికి జవాబు చెప్పగా, ఆయన కమితమైన యాగ్రహము వచ్చెను.

జూలియా తాను వివాహమాడనని తండ్రితో గట్టిగా జెప్పెను. మైడను తన అధికారమును తిరస్కరించినందులకై జూలియాను, గ్రామ పెద్దల పంచాయతీచేసి, సంఘమునుండి వెలి వేయించి గ్రామము విడిచి పోవలసినదిగా శాసించెను. జూలియా తన మనోనిశ్చయము నేమాత్రము మార్చుకొనక అమెరికాకు వలస పోయెను. ఆమె వెళ్లునపుడు తన్ను అన్యాయంగా, అక్రమముగా ఫాదిరి దేశాంతరము పంపినందులకై, గ్రామములో ప్రతి సంవత్సరము ఒక్కొక్క ఇల్లు కూలునట్లు శపించెను.

(తరువాయి 45-వ పేజీలో)

సీరియల్ నాటిక

# భక్తిలీల

శొలాకి శ్రీనివాసరావు

[మధుసూదనుఁడు ప్రజలందఱిచే త్రినాధ వ్రతము చేయించుచూ వారి ఆదరమును చూరగొన్నాడు. పుర ఆచార్యునికి ఇది అసూయా కారణముకాగా, గ్రామపెద్దయైన రెడ్డిని పురిగొల్పి, వ్రతము మాన్పించే ఏర్పాట్లు చేయమంటాఁడు. మధుసూదనుని భార్యయైన శాంతను వలచి నిరాకరింపబడ్డ రెడ్డి, పగసాధింపు కిది యొక ఉపాయమని యియ్యకొంటాఁడు. తరువాత చదవండి.]

## 11-వ రంగము

[ప్రదేశము : శ్రీపుర వీధి, ప్రవేశము : తలారి టమటమా వాయించుచు]

తలారి : ఒహోయ్! జనులారా! త్రినాధ వ్రతం యెవరైనా చేసినా, యెవరైనా చేయించినా వారిని చెట్టునకు కట్టించి, ఇనుప చీలల కొట్టించి, మాంసకండలు పెరికించి కాకులకు గ్రద్దలకు వేయుదురుని. ఇంకా అనేక రకాలుగా చిత్రకధలు చేయబడుతుం దొహోయ్!—ఇది శ్రీ శ్రీ శ్రీ శ్రీపురం జమీందారు రామిరెడ్డిగారి శాసనం గనుక యీ శాసనాన్ని యెవరున్నా అతిక్రమించి త్రినాధ వ్రతము చేయరాదొహోయ్!!!—

(తెర వ్రాలును.)

## 12-వ రంగము.

[ప్రదేశము : శ్రీపుర వీధి, ప్రవేశము : ఆకలి కొన్న రామన్నయను గ్రుడ్డి బాలుడు.]

రామన్న : ఆహా! లేదు లేదు. పట్టెడు కూడు పొట్టకు లేదా? ఓయి ధనవంతా! నీవేమి మూటగట్టుకొని పోతావు? నీవు మాత్రము అన్నమూ ఉప్పూ తింటావుగాని బంగారం మ్రింగలేవుగదా! మావంటి పేదవారిని హీనంగా జూచి నీవేమి సుఖాలను పొందుతున్నావు?

సీ॥ మేడల లోపల। మెలగెడి ధనికుడ!
వేడుక గలదె నీ। మేడలందు?
చెట్టునీడ వసించి। కష్టముల మరచి
వేడుకగా నుందు। వాడ నేను.
అందమౌ మంచము। నందు బానుపువైచి
పవళించి సుఖముల। బడయ గలవె?
కఠినమౌ నేల దుః। ఖము పానుపు బరిచి
పవళించి హాయిగా। బడుదు దృష్టి.

తే॥ గీ॥ కూడు గుడ్డల కేనాడు। కొదువ లేక
గొలుచు చుండవు దేవుని। గుణ విహీన!
కూడు గుడ్డల కన్నడు। కొదువ కలిగి
కొలుచు చుండెద దేవుని। కోర్కెతోడ!

చిన్నరెడ్డి : (ప్రవేసించి) నిజము రామన్నా! నిజము. ఈ ధన ధాన్యములతో నేమి పని? ఒక గడ్డి పోచయైనా మనవెంట వచ్చునా? రావు, రావు. అందరమూ ఆ జానెడు పొట్టకే బాధపడుచున్నాము. ఈ మాత్రము

చిన్నపొట్ట పోషించుకొనుటకే ఎన్నో తంత్రములు, ఎన్నో అబద్ధములు, ఎన్నో హత్యలు చేయుచున్నాము.

రామ : నాయనా! నీ వెవరివు?

చిన్నరె : నేను రామిరెడ్డిగారి కుమారుడను.

రామ : ఏమూ! చిన్న రెడ్డిగారా?

చిన్నరె : ఔను రామన్నా!

రామ : నిన్నటినుండి కడుపున కింత తిండి దొరకినది కాదు. ఆకలి బాధకు ప్రాణాలు అలమటిల్లి పోతూన్నాయి.

చి॥రె : రామన్నా ఈ పండుతిని ఆకలి తీర్చుకో! అనక మాయమ్మతో జెప్పి అన్నము పెట్టింతును.

రామ : (పండు తీసికొని తింటూ) నీవు చాల పుణ్యాత్ముడవు రెడ్డీ! ధర్మధాతవు. నాకే కండ్లు కనిపిస్తే కూలో నాలో చేసుకొని యీపొట్ట పోషించుకొనలేక పోదునా?

చి॥రె : ఇక్కడికి కొంచెము దూరములో మధునూదనుని కుటీర మున్నది. అక్కడ త్రినాధ స్వాములవారి విగ్రహము లున్నవి. అక్కడకు పోయి స్వాములను పూజించి నట్లయిన నీ కండ్లు కనిపించును. ఆ దేవతలను పూజించుము.

రామ : నాయనా! అక్కడకు నన్నెవరు తీసుక వెళతారు? త్రోవ తెలియదే!

చి॥రె : నేను తీసుక వెళ్లెదను రా!

రామ : వద్దు నాయనా! నీవు గొప్పయింటి బిడ్డవు. అంత దూరము రావద్దు. మీ యమ్మా మీ నాన్నా కోప పడతారు. నీవు రాకుము. దేవుడింకెవరినైనా తోడు కలుపుతాడు.

చి॥రె : రామన్నా! నన్ను మాయమ్మా మానాన్నా కోప పడరు. ముద్దుగా జూతురు. అయినను ఒకరి కొకరు సహాయము జేసుకొనకున్న నెట్లువును? మనుష్యులమై యెందుకు పుట్టవలెను? మనకు దేవుడెందుకు జ్ఞాన మిచ్చెను? దానిని వినియోగించవద్దూ?

తే॥ గీ॥ శక్తి మాలిన వారికి । శక్తి కొలది
జేయ వలయును గాదె స । హాయ మిలను
మానవుని కేల దేవుడు । జ్ఞాన మొసగె?
దాని వినియోగ పరచుటే । ధర్మ పథము.

పోవుదము, రా! (నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును)

## 13-వ రంగము.

[ప్రదేశము: మార్గము. ప్రవేశము : కొందరు పిల్లలు భజన జేయుచు మధుసూదనుని కుటీరమునుండి శ్రీపురమునకు బోవుచుందురు.]

పిల్లలు :—

త్రినాధ స్వాముల స్మరించ రండీ!
తీరును కష్టము నరులారా!
త్రినాధ స్వాములు ధన ధాన్యంబులు
స్థిరముగ నిత్తురు నరులారా!
మూడు కానులే చాలును వారికి
మూర్ఖము విడుడో నరులారా!
మూడు మూర్తులను మ్రొక్కిన వారికి
మోక్షము గలదో నరులారా!
వక్కాకులును సాంబ్రాణి నూనెతో
వ్రతము జేయుడీ నరులారా!
చక్కగ స్వాముల మదిలో దలంచి
సంతస మొందుడి నరులారా!

(ప్రవేశము : చిన్నరెడ్డి గ్రుడ్డి రామన్నతో)

చి॥రె : అన్నలారా! శ్రీ త్రినాధస్వాముల దర్శనమునకే వచ్చుచున్నారా?

పిల్లలు : ఔను, రెడ్డన్నా! ఔను.

అనంతుడు : అక్కడ ఏమి మహత్తు! ఏమి మహత్తు! దేవుళ్లకు తప్పక మ్రొక్కాలి!

బైరాగి : అన్నా! త్రినాధ స్వాములవారికి మ్రొక్కినాకు మూగ వదలిపోయింది. మాటలు వచ్చేవికావు ఇప్పుడు చక్కగా మాట్లాడుతున్నా!

అనం : నాకూ సొట్ట పోయి నడచుటకు కాళ్లు వచ్చాయి రెడ్డన్నా !

నారాయణ : నాకున్నూ రోగం పోయి శరీరం ఆరోగ్యంగా నుంది, అందం కూడా కలిగిందన్నా ! నాకు రూప మంతా వదలిపోయిందన్నా !

చి॥రె : అన్నలారా ! త్రినాథులను భజించిన వృథయగునా ? మోక్షము కలుగును.

పిల్లలు : మేము యీనాటినుండి దేవుని భజన విడువము రెడ్డన్నా ! విడువము. మేము వైరాగులమైపోతాము.

చి॥రె : అన్నలారా ! ఇంత చిన్న వయస్సు నందే వైరాగ్య మును బొందవచ్చునా ?

నారా : ఏమి ! ప్రహ్లాదుడు పిల్లవాడు కాడా ?

అనం : ధృవుడు మహాభక్తుడు కాడూ ?—చిన్నప్పుడే దేవుని భజనజేసి మోక్షము బొందలేదూ ?

భైరా : చిన్ననాటినుండీ భజిస్తేనే మోక్షం లభిస్తుంది. పెద్దవార మయేక ఎలా భజించినా భజించవచ్చు. కానీ యీ చిన్నతనంలో చేసే పాపాలన్నీ ఏమవుతాయి ? కొండలవలె పెరగవూ ?—కనుక చిన్ననాటినుంచీ దేవుని భజించాలి !

చి॥రె : నిజముగా దేవుని భజించుట వల్లనే మానవులు తరిం తురు. కానీ, జ్ఞానమైన మానవ జన్మమెత్తి దేవుని భజించకుండా ఎందరో పాపముల జేయుచూ అధోగతి పాలగుచున్నారు.

భైరా : నేను రాబోవు జన్మములో మనుష్యుడనై పుట్ట నన్నా ! తుమ్మెదనై పుడతాను. ఏమందువా ?— శ్రీమన్నారాయణుడు తామర పద్మముపై నిలిచివుంటే అక్కడకువెళ్లి ఆ పద్మంపై వ్రాలి ఆ దేవుని సన్నిధిని పాదసేవ చేయొచ్చు. మానవుడనై పుడితే అక్కడికి పోవడానికి వీలుకలుగదు. కనుక తుమ్మెదనై పుడ తాను.

తుమ్మెదనై ఝుం ఝుం మ్మనుచు, కమ
లమ్మున గూర్చొని స్వామికి జే ! జే !
పాడెదను.

అనం : కోయిలనై కూ ! కూ ! కూ ! కూయుచును స్వామికి
స్వాగత మేనిత్తున్.

నారా : నెమలిని నేనై రమణీయముగా నాట్య
వినోదము సలిపెదను.

చి॥రె : అన్నలారా ! మీ భక్తి కొనియాడదగి యున్నది. మీరు భక్తి పూర్ణులు. మొక్క మొలిచినప్పడే చక్కని ఆకులు వేయవలెను. ఇంక నాకు సెలవీయుడు పోవలెను.

భైరా : అన్నా ! ఎక్కడికి వెళ్లుచున్నావు ?

చి॥రె : నేను స్వాములవారి సన్నిధికే, ఈ గ్రుడ్డి రామన్నను తోడుకొని పోవుచున్నాను.

భైరా : వేగం వెళ్లండి. తప్పక రామన్నకు కండ్లు కని పిస్తాయి, స్వాములవారికి మ్రొక్కండి.

చి॥రె : అట్లే వెళ్లుచున్నాము.

పిల్లలు : రెడ్డన్నా ! సెలవు, సెలవు.

చి॥రె : సెలవు. (రామన్నతో నిష్క్రమించును)

(తెర వ్రాలును.)

## 14-వ రంగము.

[ప్రదేశము : శ్రీపుర పట్టణ సామీప్యము. ప్రవేశము : పిల్లలు త్రినాథుల భజన చేయుచు పట్టణమునకు బోవుచుందురు.]

పిల్లలు : త్రినాథ స్వాములు—త్రిలోక నాథులు
త్రినాథ స్వాముల—స్థిరమని మ్రొక్కిన
ధన ధాన్యంబులు—దండిగ గలుగును.

నారాయ : ఒరేయి ! ఈ త్రినాథస్వాము లెలాంటి వాళ్లురా ?

అనం : ఎరుగవురా ?

గ్రద్ద నెక్కినవాడు—ఎద్దు నెక్కినవాడు
హంస నెక్కిన వాడు—హరి హర బ్రహ్మ.

(ప్రవేశము ఆచార్యుడు తుంబాజీ అను శిష్యునితో)

ఆచార్యు : ఒరేయ్! పిల్లలూ! ఒరేయ్! పిల్లలూ!

(పిల్లలు తన్మయత్వంతో భజన చేయుచుందురు)

ఆచా : ఒరేయి పిల్లలూ! యిటు వినండ్రా!

పిల్లలు : ఏమండీ! ఏమండీ! ఏమండీ!

ఆచా : త్రినాధుల భజన చేస్తే రెడ్డిగారు దండిస్తారు తెలుసా?

బైరా : ఎందుకండీ దండిస్తారు? ఇది తప్పు పనిగాదే! ఒక వేళ మదోన్మత్తతచే కొడితే మా ఒంటిపై కొడతారు గాని మా మనస్సును కొట్టగలరండీ!

(అనంతుడు ఆచార్యునితో వచ్చిన తుంబాజీని వెక్కిరించును.)

తుంబాజి : గురూజీ! చూడండి!—అడుగోనండీ! అడుగో నండీ! అన్నంతుడు చీమిడి కారుతూందని వెక్కిరిస్తూ న్నాడు—ఊఁ!—ఊఁ!!—(ఏడ్చును)

ఆచా : ఊరుకో తుంబాజీ! ఊరుకో! — అనంతం! తుంబాజీని వెక్కిరిస్తూన్నావా! తప్పుకాదూ?

అనం : ఔనండీ! దేవుని భజన వద్దంటే తప్పుకాదూ?

బైరా : ఆచార్యులుగారూ! దేవుని భజన మాన్పించడానికి ఎవరికి హక్కుంది?—

ఆచా : మన రెడ్డి ప్రభువుకు.

బైరా : రెడ్డి దేవునికన్నా అధికుడా? మానవుడు దేవునీ, దేవుని కార్యాలనీ అటంకం చేయడానికి శక్తి ఉంటే సుఖ దుఃఖాలను పొందుతాడూ?

ఆచా : (తనలో) ఈ కుంక వెధవలికి జవాబు చెప్పటం కష్టం. వీళ్లతో నాకెందుకు వాదం! మిగిలితే యీ కాస్త జుట్టూ పీకేయగలరు.

అనం : మా రెడ్డిగారి అబ్బాయికూడా శ్రీ త్రినాధ స్వాముల్ని భజించడానికి వెళ్లాడు. రెడ్డి అయన కొడుకుకే అడ్డు చెప్పలేనప్పుడు ఎలా మమ్ముల దండిస్తాడూ?

ఆచా : ఏమీ! ఏమీ! రెడ్డిగారబ్బాయా?

నారా : ఔనండి!

ఆచా : చిన్నరెడ్డి త్రినాధులను చూట్టానికి మధుసూదనం గాడి కుటీరానికి వెళ్లాడా?

బైరా : చూడటానికే కాదండీ! పూజించటానికే వెళ్లాడు.

ఆచా : ఔనండీ! అలా నిర్ఘాంతపోతారేమండీ! గుడ్డి రామన్నను కూడా తోడుక పోయాడు.

ఆచా : ఒరేయ్! తుంబాజీ! వేగంగా రా! ఆ చిన్నరెడ్డి చెడిపోతూన్నాడు. వాడూ బైరాగివా డౌతూన్నాడు.

(తుంబాజీతో నిష్క్రమించును. పిల్లలు భజన చేయుచు ఇండ్లకు పోవుదురు)

(తెర వ్రాలును.)

సశేషం.



# మారిన మనస్సు

శ్రీమతి : టి. శకుంతల

[సామాన్యంగా క్రొత్తగా కాపరానికి వెళ్ళిన ప్రతికొత్త కోడలి మనసులోనూ కలిగే సంచలనమే యిది. క్రొత్త వాతావరణంలో ఆమె దృష్టి తన భర్తపైన, తనపైన మాత్రమే కేంద్రీకరించ బడియుంటుంది. భర్త బంధువులపై అభిమానమనేది, క్రమంగా, ఆత్మశిక్షణమీద అలవడేదిగాని, సహజంగా, అప్పటికప్పుడు పుట్టేదికాదు. ఈ కథలో సుధవలె అందఱూ తమ మనసును శిక్షించుకోకలిగితే, అత్తకోడండ్ర మధ్య, ఆడబడుచుల మధ్య సామాన్యంగా కలిగే మనస్పర్థలు, తగువులాటలు సంభవించక, హైందవగృహము శాంతి కునికిపట్టై కాగలదు.]

సుధ కాపురానికొచ్చి ఏడాది అయిందేమో! ఈ యేడాది నుంచీ తనకి యింకొకరితో సంబంధం, అవుసరం వున్నట్టే తోచలేదు. పగలల్లా తను సింగారించుకోవడం, యేదో పుస్తకాలు చదవడం అల్లుకోవటం—యీపనులే కాని తనకి ఒకళ్లతో మాట్లాడవలసిన పనేలేదు. భర్త తనని యెంత ప్రేమగాచూస్తాడో తనకే తెలుసు. తనను ఒక ప్రాణంగా చూస్తాడు. తనకుకూడా భర్త అంటే యెంత ప్రేమో చెప్పలేదు. తన ప్రాణంకూడా లెఖ్ఖపెట్టనంత అధికంగా ప్రేమిస్తోంది అతనిని. చూచేవాళ్లు యిద్దరినీ యెంతో ఆనందంగా చూస్తారు. అన్నీ బాగుండగా తనమనస్సు యిప్పుడెందుకు బాధపడాలి? సుందరమ్మకూడా కోడలు రావాలి, తన యిల్లు కలకల్లాడాలని ఉత్సాహ పడేమనిషే. కాని యిన్నాళ్లనుంచీ సుధ తన అత్తగారిమాటు యేమన్నా ఆలోచించిదా? తన సంతోషం తనభర్త సంతోషమే కాని యితర విషయాలు తను ఎన్నడూ పట్టించుకోలేదు. అవి అన్నీ తనకు అనవసరంగా తోచాయి. మురళికికూడా యీ ఏడాదితో చదువు పూర్తి అయింది. రేపో మాపో ఉద్యోగం రావచ్చు. తన భర్త ఒక్కడినీ ప్రేమించడమే కాని, అతనికి సంబంధించిన బంధువులను ఆప్యాయంగా చూడాలని సుధకు తోచలేదు. వాళ్లకికూడా తన బాధ్యతేమీ లేదనే తనవూహ.

కొండంత ఆశపెట్టుకున్న సుందరమ్మ కోడలి వైఖరికి కుంగిపోయింది. ఆవిడ ఆడపిల్లలు లేక పోయినా కోడలు అన్నిలోపాలు సర్దుతుందని అనుకుంది. సుధ ముభావం సుందరమ్మకి ఎంతో ఆశ్చర్యమేసింది. తనంటే విరోధమా? విరోధ పడడానికి కారణం యేమీ కనపడదే! పనిపాటులు చెయ్యనక్కరలేదు. తనే చేసుకుంటుంది. భర్తదగ్గర లేదని దిగులా సుధకి? తనతో మాట్లాడకపోతే దిగులు పోతుందా? తన రోజులకీ, తన కోడలు రోజులకీ సహస్రం తేడా కనిపించింది. అట్లా అని కొడుకుతో చెపితే! వాడి మనస్సు యిద్దరిమధ్య పడి వేగడమే కాని వేరేమీ లేదు. సుందరమ్మ ఓర్పుగల మనిషి అవడంవల్ల కాలం దొర్లుతోంది.

సుధ చక్కని పాపనెత్తుకుని అత్తవారింటికి వచ్చింది. పిల్లవాడికి మూడవ మాసం. వాడికి అస్తమానం జలుబు, దగ్గు ఏంచెయ్యాలో తనకు తెలియదు. చిన్న చిన్న వాటికి డాక్టర్లు అంత శ్రద్ధగా మందు యివ్వరు. ఒకనాడు పాపకి కడుపునొప్పి వచ్చి తెల్లవార్లూ యింటిల్లపాదికీ నిద్దర్లు లేవు. సుందరమ్మే పిల్లవాణ్ణి ఒళ్లో పెట్టుకుని యేదో తనకితోచిన మందువేసి నిద్రపుచ్చింది. ఇదివరకు తన భాధ్యతంతా తన భర్తదే అని తనవూహ. కాని సుందరమ్మ యింతశ్రమ తన పిల్లవాడినిగురించి పడి, యింతశ్రద్ధ యెందుకు తీసుకుంటుంది! తనమీద, తన పాపమీద ఎంత ఆపేక్ష ఆమెకి! తనకు యితరుల సహాయం అక్కర లేదనుకొంది. ఇప్పుడు ప్రతి విషయంలో సుందరమ్మ సలహా తీసుకోవాలి. లేకపోతే ఆపని విషమిస్తుందేమో! తనకి ఏ విషయాల్లోనూ అనుభవం లేదు. తన భర్తమాత్రం యేంచేస్తాడు? పగలల్లా ఆఫీసుపని సాయత్రం యింటికిరావటం. తనతో కాస్సేపు అప్యాయతగా మాట్లాడం మళ్లా బయటకు షికారుకిపోవడం. ఏదన్నా పిల్లవాడివిషయం అడిగితే "అమ్మనడగమని" సమాధానం చెప్తాడు. అడగనంటే ఎక్కడ మనస్సు కష్టపడతాడో! అయినా తన మనస్సుని యిట్లా కప్పిపుచ్చి కాలం దొర్లించటం తనకి కష్టంగా లేదూ? బహుశా తనిప్పుడు బాధపడుతున్న విషయమదేనేమో! తెలుసుకోకుండా వుంది తను. అయినా యింట్లో వాళ్లమీద తనకెందుకంత ఖేదం?

సంసారంలో అనేకమందిని ప్రేమతోను, యిష్టంతోనూ చూడవలసిన బాధ్యత తనమీదలేదూ? చదువుకున్న తనకే యీ మాత్రం తోచకపోవటం తనకే అసహ్యమనిపించింది. ఆమాట తలుచుకుంటేనే తన మనస్సుకదోలాగుంది. వాళ్లు మాత్రం తనకి అక్కర లేనివాళ్లా? తనమీద యెన్నో ఆశలు పెట్టుకుని వుంటారు. తన యీ ప్రవర్తన వాళ్లకెంత బాధ కలిగించిందో? తనకిప్పుడు ఏమిటి దారి? ఎట్లా వాళ్లతో కలిసి మాట్లాడ కలదు? తనబుఱ్ఱ చాలా దిమ్ముగావుంది.

రెండు సంవత్సరాలుగడిచేటప్పటికి సుధ నెమ్మదిగా ఒక్కొక్క పనే తనమీద బాధ్యత వేసుకుని చేసుకోవటం అలవాటు చేసుకుంది. సుందరమ్మకి కోడల్లో కలిగిన యీ మార్పుచాలా ఆశ్చర్యం కలిగించింది. అయినా ఆవిడ యేమీ కలుగచేసుకునేదికాదు. సుధకిమాత్రం మధ్య మధ్య తన పాత వూహాలు మనస్సులో బాధిస్తూ వుండేవి. చదువుకున్నది కాబట్టి మనస్సుకి బుద్ధిచెప్పుకొని ధైర్యం తెచ్చుకునేది.

ఇప్పుడు ప్రతిపనీ, ప్రతివిషయం తనకి చాలా సంతోషాన్ని యిస్తున్నాయి. గృహంలో గృహిణికి ఏయే బాధ్యత లుంటాయో తెలుసుకోకలిగింది. ఇంటికి యెవరు వచ్చినా సంతోషంతో మాట్లాడటం, బంధువులతో అప్యాయతగా వుండటం, అత్తగారిని ప్రేమతోను గౌరవంతోనూ చూడటం, యివన్నీ తనకిప్పుడెంతో ఆనందాన్ని, సౌఖ్యాన్ని యిస్తున్నాయి. ఇప్పుడు సుందరమ్మగారు కూర్చున్న చోటు నుంచి కదలవలసిన పని లేదు. సమస్తం సుధ సర్దుకు పోగలదు. మనుమడిని దగ్గర పెట్టుకుని ఆడుకోవటం సుందరమ్మకి పనిగా యేర్పడింది. సుధ అంటే సుందరమ్మకి కన్న కూతురుకంటే యెక్కువ ప్రేమ. సుందరమ్మంటే సుధకి అమితగౌరవం. ఇక భార్యాభర్తల అన్యోన్యం చెప్పడానికే వీలులేదు. ఆ చంటి పాప ముద్దులతో ఆ గృహమే ఒక స్వర్గంగా తయారయింది. కాని సుధలో కలిగిన యీ మార్పుకి కారణం యేమిటా అని సుందరమ్మ అప్పుడప్పుడు ఆలోచిస్తూ వుండేది. సుధకూడా తన పూర్వ ప్రవర్తన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సిగ్గుపడుతూ వుండేది.



# నిర్వేదము

'సత్య'

సాగడినాక నట్టనడి
  సంద్రము లోనికి నెట్టి, బిట్టుగా
సాగిలి ఏడ్చి యేడ్చి, కడ
  సారికరమ్ములు మోడ్చి ప్రేయసీ
యేగను నీదు జ్యోతి; పరి
  కింప మదీయ మనోజ వేదనా
సాగర మింకి పోవునటె?
  సౌహృది కియ్యది యెట్లుసాగునే?
అద్దమరేయి మేలుకొని
  హాయిగ పాడెడి వీణపాటలో
నెద్దియొ మూగ భావనము
  నింపుగ నింపెదు నిన్నుగాంచి, నే
ముద్దిడ బోవ; హస్తములు
  ముందుగ నడ్డినసన్ని వేళమే
ముద్దర వైచుకొన్న యది;
  మోహనమూర్తి! మదిన్ గదలుచ్చున్
  నీదు మూర్తిని గనలేక ఖేదమొంది
  క్షణము క్షణముకు మనసు చంచలము చెందు
  కడకు నిద్రింతునెట్టులో కన్నుమూసి;
  కలను గన్పించగలవను కాంక్షతోడ.
  కాంక్షలన్నియు ప్రేమపై అంతఃలాచు
  గడచిపోయెను యిట్టులే కాలమెల్ల;
  నీవు లేనట్టి విగతనేస్తుండ నేను
  యెట్లుసాగింతు జీవితాన్నింక మీద—.

(స్వీయ ఖండ కావ్యమునుండి).






## ముగ్గురు మిత్రులు.

సుప్రసిద్ధ రష్యన్ రచయిత మాక్సింగోర్కీ వ్రాసిన నవలకు ఇంగ్లీషు తర్జుమా ' Three of Them. ' దానికి అనువాదం యీ ' ముగ్గురు మిత్రులు. ' శ్రీ గద్దె లింగయ్యగారు అనువాదకులు. గోర్కీ మహాశయుడు వ్రాసిన మరొక నవల 'అమ్మ' మాదిరి 'ముగ్గురు మిత్రులు ' రాజకీయాలకు సంబంధించినది కాదు. ఇలియా, పాష్కా, జాకోబులనే ముగ్గురు రష్యన్ బాలమిత్రులు తమ పేదరికాన్ని మరచిపోయి సంఘంలో ఆదర్శప్రాయముగా సత్పురుషులుగా సుఖజీవనం చేయాలని సంకల్పించుకుంటారు. కాని కూకటివేళ్లతో కుళ్లి కంపుకొడుతున్న సంఘము ప్రతిక్షణము వాళ్లకు దరిద్ర దేవతా రూపంలో యెదురు నిలుస్తుంది. చివరకు వాళ్లు విఫలులై అణగారి పోతారు. ఈ ముగ్గురు మిత్రులు యేకాలపు వారైనా కావచ్చు. ఏదేశపు వారైనా కావచ్చు. అన్యాయం దౌర్జన్యం హెచ్చులొచ్చులు వున్న ప్రతి సమాజములోను ముగ్గురు మిత్రుల చరిత్రల వంటివి కుప్పతిప్పలు. ఇట్లా దేశకాలాలకు అతీతమై స్థిరంగా నిలవగలగటమే ఉత్తమ రచనల ముఖ్య లక్షణం.

500 పైగా పుటలు గల యింత పెద్ద గ్రంథములో ఉపయోగించిన భాష ఒకేతీరుగా చక్కని వాడుక భాషలో వుండి సాఫీగా నడచింది. ఎక్కడగాని యిది అనువాదమనిపించేటట్లు కుంటుపడి తోచలేదు. అక్కడక్కడ పొరపాటున జారిన ' రాలా ' పోలా, లగెత్తు, తౌనం, మొదలైన పదాలను సవరించితే యింకా బాగుండేది. ఏమైనప్పటికి యీ మధ్య వెలువడుతున్న హిందీకి అనువాదాలకన్న యీ అనువాదం చాల ఉత్తమంగా సహజంగా సాఫీగా వున్నది.

ప్రతులకు ఆదర్శగ్రంథ మండలి ఎలమఱ్ఱు కృష్ణజిల్లా అనిగాని ఆదర్శగ్రథమండలి 35 బాలకృష్ణ భవన్, విజయవాడ అనిగాని వ్రాయవచ్చును. ధర అయిదు రూపాయిలు.

* * *

## ఆంధ్ర వీరాంగనలు.

దేశాన్ని రక్షించి కాపాడిన వీరాంగనలు అనేకమంది వున్నారని తెలియపరచగల గ్రంథము ఆంధ్ర వీరాంగనలు. గ్రంథకర్త శ్రీ మాగంటి బాపినీడుగారు. గార్గి మైత్రేయీల చరిత్రలతో ఆరంభించి సీత, సత్యభామ, ద్రౌపది, పద్మిని, దుర్గావతి, చాంద్ బీబీ, ఝూన్సీరాణులను సంస్మరించారు. క్రమంగా ఖడ్గతిక్కన భార్య చానమ్మ, మాంచాల నాయకురాలు రాణీ రుద్రమదేవి గణపమదేవి మొదలయిన ఆంధ్రవీరాంగనలకు జోహారు లర్పించారు. ఆ తర్వాత గాంధీ యుగము వస్తుంది. స్వాతంత్ర్య సమరములో స్త్రీలు అందులోను ఆంధ్ర వనితలు మహాత్ముని పిలుపులిని సమర రంగానికి ఎట్లా పరుగెత్తివచ్చినది వివరించారు.

పూర్వ స్త్రీలగాథలు రసవంతముగా చక్కని వుపోద్ఘాతముగా వున్నవి. చాంద్ బీబీ, ఝూన్సీరాణీ, రాగమ్మ లక్ష్మమ్మ రుద్రమ మొదలయిన వారికథలు చిన్న చిన్నవిగా ఉత్తేజ పూరితముగా వుండి పిల్లలకు విడతీసి వినిపించటానికి అనువుగా వున్నవి. గాంధీ యుగపు గాథలు పోను పోను ఒకేరకపు రోకటి పాటగా వుండి విసుగు కలిగించుతున్నవి. ఆంధ్రేతరులయినా దేశ సమాజసేవలు చేసిన డాక్టరు అనీ

బిసెంటు, కజిన్సు సతిగార్లను గురించి వ్రాసినట్లే డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డినిగురించి, ఆమె సేవను నెలకొల్పిన సంస్థలనుగురించి వివరముగా వ్రాయకపోవటము సమంజసముగా లేదు. స్వాతంత్ర్యసమరములో వీరవిహారముచేసి మొక్కవోని దీక్షతో శారదా నికేతనమువంటి జాతీయ విద్యాసంస్థను నెలకొల్పి సేవచేస్తున్న శ్రీమతి ఉన్నవ లక్ష్మిబాయమ్మగారిని గురించికూడ ప్రత్యేకరించి వ్రాస్తే యీ ఆంధ్ర, వీరాంగనా చరిత్ర సమగ్రముగా వుండేది, మొత్తంమీద పుస్తకములో సమతూకములోపించి ముందు బరువు ఎక్కువగా కనిపిస్తున్నది.

ప్రతులకు గ్రంథకర్తపేర జాతీయ విజ్ఞానమందిరం, 5ఏ వ్హాబ్రేస్‌రోడ్డు రాయపేట మద్రాసు అని వ్రాయవలెను. ధర 3-0-0.

అ గిరిజ.

*  *  *

## ప్రబోధ రత్నాకరము

అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వామి.

ప్రకాశకులు : శ్రీ రామకృష్ణమఠాధ్యక్షులు

వెల రూ 2-4-0

ప్రతులకు శ్రీ రామకృష్ణమఠము.

మైలాపూరు. మద్రాసు : 4.

శ్రీ వివేకానందస్వామిచే 'అమెరికాయందలి సహస్రద్వీపవనమున కొంతమంది శిష్యులకు జరిగిన వేదాంతోపదేశములే ఈ ప్రబోధ రత్నాకరము. 'ఇన్‌స్పయిర్డుటాక్సు' అనుదానిని ఆంగ్లమున మిస్. ఎస్. యి. వాల్డో అనునామె రచించినది. ఆగ్రంథమునకు ఆంధ్రానువాదమిది.

అనువదించేటప్పుడు భావ ఏమాత్రము బాగుగాలేదు. ప్రబోధరత్నాకరము చదువుతుంటే ప్రతివ్యక్తిలో తప్పక చలనం వచ్చితీరాలి. కాని భావలో ఏమాత్రం పటుత్వము, ఉద్రేకము లేకుండాపోయింది. దీనినే మనం ఆంగ్లమున చదివి ఉంటే ప్రతివారి హృదయములకు శ్రీ వివేకానంద స్వామివారి అమూల్య వాక్యాలు హత్తుకు పోయేవి,

సహస్రద్వీప వనంలో వివేకానంద్ 19-6-1895 నుండి 6-7-1895 వరకు ఇచ్చిన చక్కని ఉపన్యాసాలు ఈగ్రంథమున ఉన్నవి. వేదాంత ఉపన్యాసాలలో శ్రీ వివేకానంద స్వామి సర్వమత ధర్మములనూ భోధించారు. ప్రథమంగా వీరు ఉపన్యాసం ప్రారంభించేటప్పుడు క్రైస్తవ మత గ్రంథమునుండియే ఒకవాక్యమును తీసికొని ప్రారంభించిరి. ప్రకృతికి, దైవానికి గల సంబంధాన్ని తెల్పినారు. దైవం అంటే ఏమిటి ? లోకులు ఎవరు ? సంసారమంటే ఏమిటు బ్రహ్మ అంటే, బౌద్ధమతం, మొదలైన సమస్యలను గూర్చి వేదాంతోపన్యాసం చేశారు.

జి. ప్రభ.

*  *  *

## తాజమహాలు

రచన :—పువ్వాడ శేషగిరిరావుగారు.

మూల్యము :— వెల రూపాయి.

ముద్రాపకులు :—శ్రీ పరాశక్తి ప్రింటింగువర్క్సు.

జి. 97. తెనాలి.

తాజమహాలు ఇది పద్యకావ్యము. ఇందు ఎనిమిది శీర్షికలున్నవి. తాజిమహాలు, జోత్స్న, బిందువు, జీవతంత్రి, ఏది, కళ, మహాప్రస్థానము, సమర్పణ మొదలగునవి. ఇందు ముఖ్యముగా చెప్పవలసినవి తాజమహాలు వర్ణన, కళయొక్క ప్రాముఖ్యత.

మొగలు చక్రవర్తి అయిన షాజహాను తనభార్య ముంతాజి మరణింపగనే ఆమె పేర జగద్విఖ్యాతమగు తాజమహాలు ఆగ్రాలో కట్టించెను. దానివర్ణన కళ్లకు కట్టినట్లుగనున్నది. తక్కిన శీర్షికలలో షాజహానుకు తనకొడుకు ఔరంగజేబువల్ల సంభవించిన దుర్ఘటనలు. కళ అను శీర్షికలో షాజహాను తన భార్యపోయి ఔరంగజేబువలన బాధలచే నిరాశచెందియున్నప్పుడు, అతనికుమార్తె జహానారా అతనిలో ఆశయు తృప్తియు కలిగించి కళాప్రాశస్త్యము, తండ్రి గొప్ప దనము జాటి చెప్పెను. ఇది తాజమహాలని నామమాత్ర మయినప్పటికి కేవలం తాజిమహాలు వర్ణనేలేక, షాజహాను యొక్కకుటుంబ పరిస్థితులన్నియు క్లుప్తముగ విశదీకరింపబడినది.

—రా. లక్ష్మి.

★

నా ది నా ది నా ది




నా ది నా ది నా ది

# అమృతాంజనము

గాని,

" యథాయథా............ కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పఁజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

అత్యవసర సమావేశము జరుపుతున్న భద్రతా మండలివారు. U. S. I. S.

జూలై 25 తేదీన లేక్‌సక్సెస్‌లో అమెరికా వారి కోరికమీద భద్రతా మండలి అత్యవసర సమావేశం జరిగింది. శత్రువుల నెదుర్కొని ప్రపంచ శాంతినికాపాడడానికి కొరియారిపబ్లిక్కుకు కావలసిన సహాయమంతా చేయడానికి ఐక్య రాజ్య సభ్యులందరూ అంగీకరించుచున్నారని మండలి వారు ఒక తీర్మానము చేశారు ఈజిప్టు ఇండియాలు మాత్రం తమ ప్రభుత్వాలనుంచి యెటువంటి సందేశములురానందున వోటింగులో పాల్గొనలేదు.

U. S. I. S.

అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రతినిధి అర్నెస్టు ఎ గ్రాస్, కొరియా ప్రతినిధి డాక్టరు చాంగ్‌తో కరస్పర్శన గావించుచున్నారు.

# ఆంధ్రమహిళా సభ

## మైలాపూరు, మద్రాసు



**మహిళా విద్యాలయము :—** హిందీ, తెలుగు విద్యార్థినులకు మెట్రిక్యులేషన్, ఇంటర్మీడియట్ క్లాసులు, నృత్యము, గానము.

**పారిశ్రామిక విద్యాలయము :—** (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది వస్త్రోత్పత్తిలో గవర్నమెంటు పరీక్షలకు తర్ఫీదు. పేద విద్యార్థినులకు ఉచితము.

**టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :—** స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

**మహిళా మందిరము :—** స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

**ఆంధ్రమహిళ :—** స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

**నిర్మలాదేవి గ్రంథాలయము :—** సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

**నర్సింగ్ హోమ్ :—** స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల — అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# ఆంధ్రమహిళ



SEPTEMBER 1950. ANDHRA MAHILA ANNAS 6

# వందేమాతరం

వంగ, కళింగ, తెల్గు జనపాలన లందతిరక్తి గాంచి, భ
వ్యాంగి, భవత్ప్రభా కిరణ వశ్యులఁచేసి, పరప్రజావలిన్
నింగి వెలుంగు యిందుగతి నిర్మలకీర్తి జగంబునందు, నీ
రంగును జూపవే ప్రముఖ రాజ్యమవై భరతాంబ వెల్గవే.

" దేహియటంచు పరదేశ జనావళులిందు జొచ్చి, మ
మ్మాహుతి జేసి దుర్గతికి ఐక్యత నంతమొనర్చి మోసమున్
ద్రోహము జేసిరమ్మ మముదోత్తి, వెలుంగక భారతీయు లం
దే హితవుండె నంచు మదినెంచి దగుల్కొనె మాయ
వారుగన్.

మాత ! భవద్గుణాళిని సమంజసభంగి బరిగ్రహించి నీ
ఖ్యాతిని సుస్వభావమును ఖండము ఖండము చందుచాటి వి
ఖ్యాతి జగంబునం బడసె గాంధిమహాత్ముడు నీదుబిడ్డ భ
ర్మ్యాతిశయుండు శాంతిపరు డంచిత సద్గుణపూర్ణచిత్తుడై.

తల్లి ! మా బానిసత్వ సంతాపమడచి
మాకు స్వాతంత్ర్యమిచ్చి సన్మానమంది
స్వర్గసీమను విహరింప వాంఛకల్గి
వెడలిపోయెను బాపూజి విడచిమమ్ము.

రంజితభంగి నవ్య ఘనరాజ్యములన్నియు నిన్నుఁగొల్వ, ముం
దంజను వేసి నీ తనయు లార్థిక, సాంఘిక, నైతికంబులం
దున్ జయమొంద, సంపదల దూగగ దీవనలిచ్చినాడు, పు
ష్పాంజలి నందుకొమ్ము భరతాంబ వెలుంగుము సౌఖ్య
సంపదన్.

శ్రీ ఇందుకూరి రామకృష్ణరాజు.



స్వతంత్ర దినోత్సవ సందర్భములో ఆంధ్ర మహిళాసభ సభ్యురాండ్రు, విద్యార్థినులు, జండాలు చేబూని
స్వతంత్ర గీతముల పాడుచు, దేవాలయమునకు వెళ్లట.



శిశుత్వంలో పెరుగుదలమీదనే, భావిజీవితంలో అతనిదేహస్థితి ఆధారపడియుంటుంది. కనుకనే తల్లి కనక మునుపూ, కన్న పిదప పాలిచ్చి పోషించుచున్నంతకాలమూ శిశువుకు ఆరోగ్యవంతమైన పెరుగుదలనిచ్చే ఆహారం భుజించడం అత్యవసరం.

నేడులభించే ఆహారంలో, శరీరాన్ని క్రమపద్ధతిలో పెంచే విటమిన్లు చాలాకొరతగా వున్నాయి. కనుక, తల్లి అధికంగా విటమిన్లు తీసుకోవాలి, లేదా, బిడ్డ అతి బలహీనంగా జన్మిస్తుంది. అటువంటి బిడ్డను పెంచిపోషించడం మరీకష్టం. పెద్ద వారికి కావలసిన 'ఏ.డి.' విటమినులు రోజుకొక అర్ధణా ఖర్చుతో, "ఎమ్. జి. బి." (మద్రాసు గవర్నమెంటు బ్రాండ్) షార్క్ లివర్ ఆయిల్ వలన లభించును. శిశువులకు రోజుకు ఒక కానీ మాత్రమే అవుతుంది.

## మద్రాసు గవర్నమెంటు బ్రాండ్




## షార్క్ లివర్ ఆయిల్

పెద్దవారికి – ఖరీదు రోజుకు అర్ధణా

### ఎడామిన్

శిశువు జన్మించిన క్రొత్తలో, (మద్రాసు గవర్నమెంటు వారి) షార్క్ లివర్ ఆయిల్‌లో ఉండే క్రొవ్వు పదార్థాలు, అతిసుకుమారంగాయుండే జీర్ణశక్తికి అంతగా పడక పోవచ్చు. అట్లయిన, నిర్మలమైన ఎడామిన్ ఇవ్వండి, ఏ బాధాయుండదు. రోజుకు కొద్దిచుక్కలు మాత్రమే చాలు.

- విటమిన్ 'ఏ': శారీరపు పెరుగుదలను పెంపొందించును. రొంప, ఆటలమ్మ, పొంగు, గాలి బిళ్లలు మొదలయినవి రాకుండాను, బిరికి నందువల్లా, కోసుకొన్నందువల్లా కలిగిన గాయాలద్వారా అంటువ్యాధులు రాకుండా కాపాడును.
- విటమిన్ 'డి': దొడ్డి కాళ్లు రాకుండా చేయును. ఎముకలు, పంటి వరుస దృఢంగా పెరిగి పెంపొందేటందుకు, యిది ముఖ్యావశ్యకము.

క్రొవ్వు పదార్థములు: విటమినులను పూర్తిగా జీర్ణము చేసికొనుటకు, శరీరమునకు అదనంగా శక్తిని కలుగచేసే ఆహారము నిచ్చుటకు, తగిన పేరుకొనదగినావై యుందున్నది.

# గవర్నమెంట్ ఆయిల్ ఫ్యాక్టరి, కాలికట్

పారిశ్రామిక, వాణిజ్య శాఖ

# మద్రాసు ప్రభుత్వము

దక్షిణ భారతదేశమునకు డిస్ట్రిబ్యూటర్లు:

పారీ అండ్ కంపెనీ లిమిటెడ్ మద్రాసు.

SISTA'S-GO-5 B - Telugu

ప్రతి స్నానమునకు
తలంటు యొక్క మనోహరమైన అనుభవము —



కేరళ తలంటు సబ్బుయొక్క శ్రేష్ఠమైన నురుగు మీ చర్మములోనికి, లోతుగాయినికి శుభ్రపరచి, చర్మమునకు అధిక మృదుత్వమును కలుగచేయును. వీటియొక్క లేతయైన, పరిశుద్ధతైలములు, సహజపరిమిళములను, క్రిమి సంహారిణిని, చర్మపు క్రింది భాగమునకు లోతుగాకూడకొనిపోయి బాగుగ పనిచేయును. అయినను చన్నీళ్లతో కేరళ సబ్బునురుగును క్షణమాత్రములో కడిగివేసికొనవచ్చును. కేరళసబ్బుయొక్క శుద్ధమైన పరిమళము స్నానమైనతరువాత గంటలకొలది నిలచును.

# కేరళ సబ్బు

పరిశుద్ధమైన తైలమునుండి తయారైనది



వేపసబ్బులోని క్రిమిసంహారిణి, చల్లనైన, మరియూ, చేదైనగుణములుగల వేపనూనె, ముఖ్యముగా వేసవిలో శరీరసౌఖ్యమునకు రక్షణ.

## కేరళా సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్

పారిశ్రామిక, వాణిజ్యశాఖ

## మద్రాసు ప్రభుత్వము

SISTA'S-KS-3 B-TEL



సంపుటి 7 | సెప్టెంబరు 1950 | సంచిక 5

# అధ్యక్షపీఠం

నాసిక్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి అభ్యర్థులుగా శ్రీయుతులు, పురుషోత్తమదాస్‌టాండన్, ఆచార్య కృపాలనీ, శంకరరావ్ దేవ్ గార్లు నిలచారు. అందులో మొదటి యిరువురుకు హోరాహోరీ పోటీ జరిగినది. వీరిరువురిలో ఎవరు అధ్యక్షులయినా అభినందనీయులే.

అయితే....ప్రస్తుతంలో వీరిని అభినందించటంగాని, పూర్వచరిత్రలో వీరు చేసిన ఘన కార్యాలను ఏకరవుపెట్టి, స్వాతంత్ర్య సమరంలో వీరు గావించిన స్వార్థ త్యాగాన్ని స్మరించి, సత్యాగ్రహ యోధులై, వీరు వెన్నిచ్చిన లాఠీఛార్జీలు, అనుభవించిన కారాగృహ శిక్షలు, పడ్డ కడగండ్లూ లెక్కపెట్టూ, వాటిఆధారం పై యిప్పుడీ ఉత్కృష్టపదవీ బాధ్యతా నిర్వహణకు వీరి సమర్థతా సమర్థతలు నిర్ణయించటంగాని మా అభిమతంగాదు. గతాన్నిస్మరిస్తూ గుటకలువేసే రోజులుకావివి, ప్రస్థుతాన్ని పరికిస్తూ పురోగమించాల్సిన రోజులివి.

గతంలో కాంగ్రెస్ ప్రభుత్వ వ్యతిరేకమైన సంస్థ—పరాయి ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, దానిని దేశమునుండి పారద్రోలుటయే కాంగ్రెస్‌యొక్క ప్రధానాశయము. ఇప్పుడన్ననో కాంగ్రెసేప్రభుత్వము, ప్రభుత్వమే కాంగ్రెస్. పరప్రభుత్వంలో ఒక్కొక్క విషయంలో, ఎటువంటి స్వేచ్ఛ, ఎటువంటి స్వాతంత్ర్యం, ఎటువంటిసమృద్ధి, ఎటువంటి సమైక్యత కోరి పోరాటం సల్పామో, అట్టిస్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమృద్ధి, ఐక్యతలు ప్రజలలో కల్గించిననాడే, కాంగ్రెస్ తన ఉనికిని సమర్థించుకోగలుగుతుంది, ప్రజామోదాన్ని పొందకలుగుతుంది.

గత మూడుసంవత్సరాల అనుభవంవల్ల, కాంగ్రెస్ సంస్థలో ప్రస్తుతము వ్యాపించియున్న కుళ్లు, కపటం, ముఠాతత్వం, అధికారవ్యామోహం, ప్రజలందఱకూ కండ్లకు కట్టినట్టు తెలుస్తూ ఉంది. యీ నగ్నసత్యాన్ని ప్రతి కాంగ్రెస్ నాయకుఁడూ ఒప్పుకుంటూనే ఉన్నాఁడు. ఇట్లు అధఃపాతాళానికి దొర్లుకుపోతూ ఉన్న సంస్థ యింక ఎన్నాళ్లు భూమిమీద నిలవదొక్కుకొని ఉండగలదా అనే భయం అందఱి హృదయాలనూ ఆవహించియే యున్నది.

ఈ క్లిష్టపరిస్థితులలో సాధించుటం అతి సాహస కార్యమని ఒప్పుకొనితీరాలి. బుద్ధిబలముతో, కార్యకుశలతతో, ధర్మోత్సాహంతో, చిత్తపారిశుద్ధ్యంతో సంస్థసముద్ధరణ, దేశ సౌభాగ్యం లక్ష్యాలుగా ఊహించుకొని, సంస్థ నాయకులలోను, సభ్యులలోనూ వ్యక్తిగతమైన ఆత్మశుద్ధి, సత్యసంధత, త్యాగశీలత పురికొల్పుట అధ్యక్షుల బాధ్యత అయియుంది. ఈ బాధ్యతను సమర్థతతో నిర్వహించి, తిరిగి కాంగ్రెసు పూర్వ ప్రతిష్ఠను నెలకొల్పిననాడు, దేశాన్ని ఎదుర్కొంటూఉన్న ఎన్ని యిక్కట్లయినా కాంగ్రెసు ప్రభుత్వం ధైర్యంగా ఎదుర్కొగలుగుతుంది. అంతర్జాతీయ రంగాల నావహించిన యుద్ధభీతిగాని, ఇటీవల దేశంలో ప్రకృతి సిద్ధంగా కలిగే తుపాను, అతివృష్టి, అనావృష్టి, భూకంపం, వరదలవల్ల సంభవించే కరువు కాటకాలుగాని, అప్పుడు ఎదుర్కొలేని, పరిష్కారముగాని సమస్యలుగా తోచవు. ఈ సమస్యలు పరిష్కారమైననాడు కాంగ్రెస్ తిరిగి ప్రజామోదమును బడిసే సంస్థకాకతప్పదు. ఆనాడుగాని కాంగ్రెస్ అధ్యక్షుడు (ఎవరైనప్పటికీ) సమర్థుడుగా అభినందించబడడు.



ప్రఖ్యాత సంస్కృతాంధ్ర పండితులు

## శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి నిర్యాణము

అనితరమైన సాహిత్య సేవజేసి, తమ అమూల్య పరిశోధనలచే, ప్రాచీన ఆంధ్ర వాఙ్మయమును అజ్ఞాతమునుండి వెలికిదెచ్చి, 'తెలుగు మెరుంగులను' మనకందిచ్చిన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, ది. 29-8-50 న, తిరుపతి పుణ్యక్షేత్రములో, తమ 63వ ఏట దివంగతులైరి. వీరి మృతిచే ఆంధ్రసాహిత్య వీధులనుండి, ఒక ఉన్నతస్థాయి విద్వాంసుని నిష్క్రమణము జరిగింది.

వీరు రాజధాని కళాశాలలో అధ్యాపకులుగానుండి, తదుపరి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాధిపతిగా నుండిరి. ఈ భాండాగారములో చేసిన పరిశోధనలచే, పెక్కు పూర్వగ్రంథములను పునరుద్ధరించి, పూర్వాంధ్ర వచన రచన, పూర్వాంధ్ర జానపదసాహిత్యము, వ్యావహారిక భాష యందే సాగినదని నిరూపించినారు. ఇటీవల తిరుపతి దేవస్థాన వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధన శాలలో కృషిచేసి తాళపాకవారి పదకవితలను, వేంకటేశ్వర వచనాది ప్రాచీన గ్రంథములను వెలికి దెచ్చారు.

వీరు మహాపండితులు, కవులు, చక్కటి విమర్శకులు. వీరు ప్రకటించిన బసవపురాణము, శృంగార శ్రీనాథము, క్రీడాభిరామము, చాటుపద్య మణిమంజరి, తెలుగుమెఱుగులు మొదలగు గ్రంథములు వీరి రసజ్ఞతను, పరిశోధనాశక్తిని చాటిచెప్పుచున్నవి. విజ్ఞాన ప్రబోధకములగు వీరి రచనలు, మధురములైన వీరి పద్యములు పెక్కులు, పత్రికాముఖంగా ప్రజలకు సుపరిచితములే

ఆ జన్మాంతము మాతృభాషా సేవజేసి కృతార్థతనొందిన వీరిజన్మ ధన్యమైనది. వీరి శుద్ధాత్మకు భగవంతుడు శాంతిని ప్రసాదించుగాక.



# ప్రస్తుత పరిస్థితులు

* శ్రీమతి అచ్యుతుని గిరిజ *

## భూకంపము.

ఉత్తర హిందూస్థానములో యీ మధ్య వరదలవల్ల చాలా నష్టము కలిగింది. పాడి పంటలతో తులతూగే ఆంధ్ర జిల్లాలు తుపానుతో కరువుకు లోనయినవి. ఇంక రైల్లు ప్రమాదాలు వారానికొకటి జరిగి ఎక్కిన రైలు సురక్షితంగా దిగేవరకు గుండె దిగులుగా వున్నది. ఈ బాధలు, జన నష్టం చాలనట్లు ఆగస్టు 14న అస్సాము ప్రాంతాల్లో బ్రహ్మాండ మయిన భూకంపము వచ్చింది. వచ్చిందేమిటి యీ రోజు వరకు చిన్నవో పెద్దవో కుదుపులు వస్తూనే వున్నవి. కంపనము హిమాలయాల్లో ఆరంభించి అస్సాము కొండల్లో లోయల్లో విజృంభించింది యీ వైశాలకు పైగా ప్రజలు నిలవ నీడలేని వాళ్లయినారు. ఉన్న కొద్దిపాటి ధాన్యం భూగర్భంలోకి పోయి దాక్కుంది. నదులన్నీ గంధక పూరితాలయి ఆ వాసనలతోనే జీవరాసిని హతమారుస్తున్నవి. ఎన్నో టీ తోటలు నూనెగనులు రూపులేకుండ పోయినవి. అయితే గుడ్డిలో మెల్ల అన్నట్లు భూకంపము కొండల్లో లోయల్లో తీవ్రంగా రావటాన ధన నష్ట మంత దారుణంగా ప్రాణనష్టము సంభవించలేదు. కాని ప్రకృతి దయ తలచి విడిచిపెట్టిన మనష్యులను సకాలాన సరిఅయిన సహాయం చేసి రక్షించుకోగలగాలి. అసలే బీద దేశం, చెట్లుకింద నివసించే జనాభా ఎక్కువ. దానికి తోడు తినతిండి, వుండేయిల్లు లేని కాందిశీకుల సమస్య వెన్నంటివున్నది. దేశమంతట ఆహార సమస్య తీవ్ర రూపందాల్చి క్లిష్టపరిస్థితులు కలిగించుచున్నది. ఇటువంటి పరిస్థితులలో వొంట్లో ప్రాణం తప్ప మరి యే ఆధారము లేకుండ వున్న అస్సాము సోదరులకు మానవ ధర్మాన్ని అనుసరించి కాపాడటానికి చాలా సమయస్ఫూర్తి వితరణ అవసరం. మునుపనేకసార్లు ఆపద జరిగిన ఆరు నెలలకు తిరిపెము డబ్బా చేతపట్టి మరినాలుగు నెలలకు కొన్ని లక్షలు పోగుచేసి చివరకు ఆడబ్బు యెవరికివ్వాలో యేమిచెయ్యాలో తెలియక తికమకలు పడటం అందరకు తెలిసిన సంగతే. వెనుకటి విషయాలవల్ల సంపాదించిన అనుభవ జ్ఞానము వుపయోగించి సకాలానికి సరిఅయిన విధంగా, వున్నంతవరకు సహాయపడటం మనందరికి విధ్యుక్త ధర్మం. ప్రభుత్వంవారు సహాయము చేయడానికి పూనుకుని సైనిక వాయువిమానదళాలను కూడ పీడిత ప్రజాసేవకు పంపుతున్నారు. ఆహారాన్ని సరఫరా చేస్తున్నారు. కాబట్టి అస్సాము టీ నూనెల వ్యాపారం కొంతకాలము నిల్చిపోయినా ప్రజలు ఆపదగడిచి గట్టెక్కగలరని నమ్మదాము.

## కులతత్వవాదము.

కులాన్నిపట్టి లెక్కగా కాలేజీలలో సీట్లు వుద్యోగాలు యివ్వాలని ప్రభుత్వంవారు అన్నమాటను వ్రాతంగా తీసుకుని ఆగస్టు 14వ తేదీన రామస్వామినాయకరు ఆధిపత్యాన వూరేగింపులు సమావేశాలు వుపన్యాసాలు జరిగినవి. కాని యిదివరకే అనేక సంస్థలలో ఆఫీసులలో యీ ప్రభుత్వ శాసనానికి అసమ్మతి చూపించారు. మాలో కులతత్వాలు రెచ్చగొట్ట వద్దని అన్నారు. నిజానికి మన జనాభా ఎంత; మనకు వున్న చదువులబళ్లు ఎన్ని? ఒక్కొక్క కులములో లెక్కప్రకారం యిద్దరో ముగ్గురో తప్ప చదువుకొనే అవకాశము ఎందుకు వుండకూడదు? జన సామాన్యము తమకు కావలసిన చదువు కావలసినంతవరకు చదువుకోగల పరిస్థితులు మనం ఏర్పరచుకోవాలి. ఇంక వుద్యోగాల సంగతీ అంతే. ప్రతివారికి ప్రభుత్వం జీవనోపాధి కలిగించగలదా? లేదు. ఒక్కొక్క కులంలో యిద్దరో ముగ్గురో పెద్దచదువులు సంపాదించి చేస్తున్న, చేయగల సేవ యేమిలేదు. ఆ ముగ్గురిని మినహాయించగా మిగిలిన ప్రజలు యేమవుతారు? దేశము మొత్తంమీద ఎక్కువమందికి వృత్తులు కల్పించి జీవనోపాధి ఏర్పరచి కుల తత్వాలతో సంబంధములేకుండ శాంతజీవనం చేయగలమార్గం మనమందరము చూసుకోవాలి.

## పేదలకు న్యాయసహాయం

మన దేశములో చేతిలో డబ్బున్నవాడే న్యాయము పొంద గలుగుతున్నాడు. మరీధనికుడైతే సుప్రీము కోర్టు

వరకు వెళ్ళగలరు అంతలేకపోతే హైకోర్టు. కొంచెము బీద వాళ్ళైతే జిల్లా కోర్టుతోసరి. ఇంకా నిరుపేదల సంగతి అరణ్యరోదనమే. వాళ్ళు గుడిసెముందు నిల్చుని ఏడుస్తుంటే నిలబడి చూసేవాళ్ళుగాని ఆర్చేవాళ్ళు తీర్చేవాళ్ళు వుండరు. నిజానికి న్యాయమంటే అందరికీ ఒకటేగదా, అందరికీ సమానముగానే న్యాయము లభించాలిగదా అన్న వుద్దేశముతో బొంబాయి ప్రభుత్వంవారు మరీ నిరుపేదలకు, నిమ్న జాతులకు ఉచితంగా న్యాయసహాయం కలిగించ తలచుకున్నారు. దీని విషయమై ఏర్పడ్డ సలహా సంఘంవారు ప్రభుత్వం ఖర్చులు భరించి నిరుపేదలకు నిమ్నజాతులకు దేశమంతటాకూడ ఉచితంగా న్యాయము కలిగే ఏర్పాట్లు చేయాలని సూచించారు. ఇదే దేశమంతటా ఆచరణలోకి వస్తే రామ రాజ్యములో ఒక సోపానము ఎక్కినట్లే మనము భావించుకోవచ్చు. ఈనాడు ఉచితంగా న్యాయ సహాయం చేయాలని బుద్ధి పుట్టినట్లే రేపు విద్యనివ్వాలని జీవనోపాధి కలిగించాలనికూడ అనిపించవచ్చు.

## పోస్టలు సౌకర్యాలు

మామూలుగా పోస్టాఫీసులు యితర ఆఫీసుల మాదిరి ఆ టైములోనే పనిచేస్తున్నవి. ఆఫీసులకు పోయివచ్చే వారి సౌకర్యార్థం ఇకమీదట ముఖ్య నగరాలలో రాత్రి పది గంటలవరకు పోస్టలు సౌకర్యాలకుగాను ఆఫీసులు తెరిచి వుంచే ఏర్పాట్లు చేస్తున్నారు. అంటే రాత్రి పదిగంటల వరకు కార్డుకవర్ల అమ్మకం, మనియార్డర్లు, రిజష్టర్లు పార్శెళ్లు తీసుకోవటం మొదలయిన మామూలు తంతంతా జరుగుతుంది. అక్టోబరు 1 వ తేదీ నుంచి మద్రాసులో 2 రాత్రి పోస్టాఫీసులు వుంటవని తెలుస్తున్నది. ఆదివారం శెలవు యిచ్చినా ప్రజలకు యీ సౌకర్యం కలిగించటము చాలా బాగున్నది. త్వరలోనే అన్ని చోట్లకూడా ఏర్పాటు చేయవచ్చు.

## పిల్లలకు క్రొత్త చికిత్సా సాధనము

అనేకమంది చిన్న పిల్లలకు చచ్చువాతము వచ్చి కదల మెదలలేక పోతారు. మరికొంత మంది ఎక్కువ కాలము జబ్బుచేసి సరిగా కోలుకోక నిస్త్రాణవల్ల అంగవైకల్యము పొందుతారు. ఇటువంటి వారికి ఎలక్ట్రిక్ బాత్ అనే చికిత్సా సాధనము ఒకటి వున్నది. దానితో తగు విధాన విద్యుత్ శక్తిని ప్రసరింపచేస్తే పిల్లలు ఆరోగ్యము పొందగలుగుతారు. ప్రతి ఒక్క విద్యార్థి ఒక్కొక్క అణా చొప్పున యిచ్చిన విరాళం పదిహేను వేలు పోగుచేసి సేవా సమితివారు అటువంటి యంత్రాన్ని రాయపురం హాస్పెటలుకు యిచ్చారు. భవనగరు మహారాణీ వారు ప్రారంభోత్సవం చేస్తు విద్యార్థుల కృషికి సంతసిస్తూ వారిచ్చిన యంత్ర సహాయం వల్ల అనేక మంది పిల్లలు ఆరోగ్యం పొందగలరని దీవించారు. సామర్థ్యము, నిజమైన సేవాదీక్షవుంటే అణాలు అర్ధణాలు పోగుచేసి చేయగల అమూల్య వుపకారాలు ఎన్నో వున్నవి.

## ఆంగ్లోఇండియన్ సమాజానికి సలహా :

ఆంగ్లో ఇండియన్ సమాజ అధ్యక్షుడయిన ఫ్రాంకు ఆంథోని సమాజములో మాట్లాడుతు యిట్లా అన్నాడు—

"మనమంతా పుటకచేత, వునికిచేత భారతీయులమని మరువరాదు. ఇంగ్లీషువారమని చెప్పుకుంటే వున్న అవకాశాలు కూడ పోవటముతప్ప యేప్రయోజనము లేదు. మన ఆంగ్లో ఇండియన్ సంఘానికి యింకా పదిసంవత్సరాలవరకు అన్ని విధాల తగిన చేయూత రక్షణ యిస్తామని భారత ప్రభుత్వం వారు హామీ యిచ్చారు. ప్రతివాళ్లు దీనిని చక్కగా అర్థము చేసుకుని వ్యవహరించాలి. మరొకమాట. కులతత్వాల ప్రమేయం మనకు వద్దు. కులరీత్యా వచ్చే ఆ కొన్ని వుద్యోగాలు మనకు ఎటు సరిపోవు. మునపటిమాదిరి తెలివితేటలు శక్తి సామర్థ్యాలు వినియోగించి బాహాటమైన పోటీలలో నెగ్గి వుద్యోగాలు సంపాదించుకుందాము. అదే సరిఅయిన మార్గము. రైల్వే,సైనిక, నావిక, పోస్టలుశాఖలలో ఎంతైనా అవకాశము వున్నది. ఎక్కడైన అన్యాయము అక్రమము వుంటే సంఘబలముతో యెదిరించి న్యాయము పొందుదాము."

సంఘానికి ఐకమత్యత బోధించి ఆత్మశక్తిని ఎరుకపరచి ఉత్సాహ మివ్వగల ఉద్బోధ ఎంతైనా శ్రేయస్కరము.






## పంచమ గుచ్ఛము

" ఇంతేనా, నా సంగతివిన, నా
వంతైనా ప్రియురాలి మనసు కరగదు
పంతమో, చింతయో
కంతుడుంటేనా ఎడద గాసిపెట్టి దూసిపెట్టి
చింతాకులంత చిందర చేసినా
డింతేనా ? "

నిజంగా అతని కంఠం చాలా మధురంగా ఉంది. ఆపాట ఏదో కొత్తరకం బెంగాలి వరసలా ఉంది. ఆ కొద్ది మాటలూ మూడు నిమషాలు పాడాడు రాధాకృష్ణ.

ఆ యువకుడు ఆ పాట ఎంత లో గొంతుకతో పాడినా చుట్టుప్రక్కలవారికి కొంతమందికి వినిపించింది కాబోలు నెమ్మది నెమ్మదిగా పదిమంది ఆ ప్రాంతాలకు చేరినారు

" అడే రాధాకృష్ణడా ! "

" అదు ! ఎన్నరొంబనైసాయిరుకు అంద కంఠం "

" రాధాకృష్ణ ఏమీ బాగా పాడతాడయ్యా ! "

" ఆ అమ్మాయి కొత్త సినీమాష్టారులా ఉంది. "

" మాంఛి చురుగ్గా షోగ్గా ఉంది. "

ఈ మాటలు అస్పష్టంగా ఉన్నా పద్మావతి చెవిలో పడ్డాయి. ఆమెమోము కెంపు వారింది. ఆమె గుండెలు కొట్టుకున్నాయి. ఆమెకు కోపమూ వచ్చింది సంతోషమూ వచ్చింది. ఆమె నెమ్మదిగాలేచి, తలవంచుకొని, బీచిరోడ్డు వైపుకు నడవడం ప్రారంభించింది. అది గమనించి నరసింహామూర్తి " వస్తున్నాను ఉండు అమ్మాయి ! " అని కేక వేసి రాధాకృష్ణవైపు తిరిగి " మళ్ళీ కలుసుకుంటాను. నీ అడ్రస్సు మురుగప్పవీధి ; పదోనెంబరు ఇల్లుకాదూ ! త్యాగరాజనగరంలో ! తప్పకుండా వస్తాను. ఎప్పుడు నీకు సావకాశం ? " అని ప్రశ్నించాడు.

" నాకా మాష్టారూ ! ఎల్లుండి షూటింగు లేమీ లేవు. సాయంకాలం అయిదు తర్వాత మా యింటికి రండి. ఉండండి ! ఉండండి ! మిమ్మల్నీ ఆఅమ్మాయిని నా కారు మీద దిగబెట్టనా ? " అని రాధాకృష్ణ అడిగినాడు.

" వద్దులే, ఆ అమ్మాయికి ఇష్టంఉండదు. "

ఎంత చక్కగా ఉంది ఆ కంఠం. ఎంత ఠీవిగా ఉన్నాడు ఆ అబ్బాయి. అలా పుట్టుకతో రావాలి. ఎంత తెచ్చిపెట్టు

ఉంటే వస్తుంది సంస్కారమూ? ఈ ప్రశ్నలు పద్మావతి హృదయంలో దాగిపోతూనే వస్తూనే ఉన్నాయి. బస్సులో ఆమె నరసింహమూర్తి మాస్టరుగారితో మాట్లాడలేదు. ఏలాగో ఆంధ్రమహిళాసభ వచ్చింది. ఆమెను దింపి నడిచి ట్రాంకెడప వెళ్లి రాయపేట చేరుకున్నాడు నరసింహమూర్తి మేష్టరుగారు. ఆ రాత్రంతా పద్మావతికి నిద్రరాలేదు. పక్క మీద ఇటూ అటూ పొర్లింది. లేచి ఎలక్ట్రిక్కు దీపం వెలిగిద్దామా అంటే తనగదిలోని ఇతర బాలికలు లేస్తారు.

నెమ్మదిగా పక్కమీదనుండి లేచి, పైడాబామీదకు వెళ్లింది. సభాభవనాల మధ్యనున్న పూలతోటలోనుండి పూలవాసన పైకి ప్రసరించి వస్తున్నది. ఆకాశాన అక్కడక్కడ మబ్బులు ప్రయాణం చేస్తున్నాయి. చంద్రుడు అస్తమించడంచేత నక్షత్రాలు తళ తళలాడుతూ ఆకాశం అంతా చిత్రమైన ముగ్గులు పట్టులులా నిండి ఉన్నాయి.

ఆ తారకలను చూస్తూ నాటి విచిత్ర రూపాలు చిత్ర కాంతులు గమనిస్తూ ఉన్న పద్మకు ఈ తారకలపేరు సినీమా స్త్రీలకెందుకు వచ్చింది అని ఆశ్చర్యం పొందింది. ఈలా వారు మినుకు మినుకు మంటూరా! ఇంత ఎత్తున ఉంటూరా అందుబాటులో లేకుండా! చూపులకు చిన్నగా ఉన్నట్లు కనబడి నిజంగా బ్రహ్మాండాలంత వారా వారు! చల్లని రాత్రిలో మినుకుమనే ఈ చుక్కలు సూర్యునికన్న ఎక్కువ వేడిమికల మహా సూర్యగోళాలని టీచరుగారు చెప్పింది. ఆలానే సినీమాతారలు పైకి ఒకరూపు లోపల ఒకరూపూ కలవారనా తాత్పర్యం?

ఆమె చిరునవ్వు నవ్వుకుంది. ఎందుకువచ్చిందో ఆ పోలిక ఆపేరు. తాను సినీమాతార అయితే అద్భుతం అన్నాడేమి ఆ సంగీత దర్శకుడు. తనలో ఏమిఉంది! తనలో ఏదో ఆకర్షణ ఉందట! ఏమిటో ఆ ఆకర్షణ? తెల్లని బంగారం చాయలో మిల మిలలాడే బాలికలు ఎంతమందో తనతో చదువుకుంటున్నారు. మదరాసులో ఆ బంగారు విగ్రహాలు మిల మిలలాడే చీరలు ధరించి చిత్రమైన ఫేషన్ల బ్లౌజులు తొడిగి, కొందరు పంజాబీ దుడతాలు తొడిగి, విచిత్రమైన నగలు ధరించి ఎంత అందంగా ఉంటారు. తాను వారిముందు కోతిలా ఉంటుందేమో!

ఆ అమ్మాయి ఎంత అందంగా పాడినాడు.

ఆ రాత్రి ఆ చుక్కల వెలుగులో కలిసిపోయేటట్లు తానూ ఏవ మధురమైన కంఠంతో ఆ పాటే పాడింది. తన కంఠం కృష్ణవేణి కంఠంలా ఉంటుందా? భానుమతిగొంతు వరలక్ష్మిగొంతులకు సరిపోల్చడానికి వీలుందా? ఆ సంగీత దర్శకుడు తనకంఠం వింటె ఏమంటాడో? ఏమంటాడు...

ఆ సంగీత దర్శకుడు రాధాకృష్ణకూ రాత్రి నిద్దరపట్టలేదు. ఏదో 'సెక్సు' ఆకర్షణఉంది ఆ బాలికలో! ఎంత జిగిగా ఉంది ఆమె అంగసౌష్టవం! ఆమె నరసింహమూర్తిమాష్టారు శిష్యురాలా? అంటే సంగీతంలో నిధి అన్నమాట. నిజంగా ఆ యువతి సినీమాలో చేరవలసిందే! ఏమిఠీవిగా నడిచింది! ఔ స్టలా? అయితే దాశరాజు కూతురు యోజనగంధిలా ఉంది మత్స్యగంధిమాత్రం కాదు. ఏదో చక్కని సువాసన ద్రవ్యం ఉపయోగించింది. ఆమె మూర్తి శిల్పంవలెనేఉంది. ఈ నాడు తానో మొదటి రకం సినీమా తారను లోకానికి ఇస్తాడుగాక. పుల్లయ్యగారివంటి దర్శకులేకాదు సినీమా ప్రపంచానికి కొత్త తారలను ఇచ్చేది! 'వాహిని' వారివంటి సంస్థలేదు! పాతతారలను నూతన కాంతితో వికసింపచేసేది! ఒక సంగీత దర్శకుడు తెలుగు సుబ్బలక్ష్మిని ప్రపంచానికి ప్రత్యక్షం చేస్తాడుగాక. మరునాడు నరసింహమూర్తి రాధాకృష్ణ ఇంటికి వెళ్లినాడు.

రాధాకృష్ణ మేడ చిన్నదైనా చాలా అందంగా ఉంది. ఆ మేడ తాను కట్టించుకున్నానని రాధాకృష్ణ చెప్పినాడు. వంటఇల్లు, భోజనశాల ఆ రెండు ఇళ్లను కలిపి వరండా ఉంది. వరండాకు ఈవలావల దొడ్డి. ఆ దొడ్డికి గోడలు వున్నాయి.

అసలు మేడకు దూరంగా తూర్పున ఇంకొక చిన్న మేడ కట్టించుకున్నాడు, రాధాకృష్ణ. ఆ మేడకు పైన ఒక పడక గదీ, ప్రక్కగదీ—క్రింద ఆలాగే పడకగదీ, ప్రక్కగదీ ఉన్నాయి. పెద్దగది అతని సంగీతం గది. క్రింద గది అతని గాంధర్వమేళం గది. రెండు ఫిడేళ్లు, రెండు వేణులు, రెండు వీణలు, ఒక క్లారియొనెట్, ఒక పియానో, ఒక జలతరంగము, ఒక తబలాతరంగము, ఒక మృదంగము, ఒక తబలా, ఒక సారంగి, ఒక దిల్‌రుబా ఇవి అతని ఫేళ

వాద్యాలు. ఆ వాద్యాలు వాయించేవారికి అతడే జీత మిస్తాడు. ఆమేళం కోసం తన జీతం కాకుండా ఇంకో వేయిరూపాయలు ఆతన్ని సంగీత దర్శకునిగా పెట్టుకున్న సినీమా కంపెనీవారు జీతం ఇచ్చుకోవలసి వస్తుంది. అతని పైగదిలో "హిస్ మాస్టర్స్‌వాయిస్" కాబినేట్ గ్రాండ్ గ్రామాఫోను ఉంది. ఒక గోడ్రెజ్ ఇనప బీరువానిండా ఉత్తరాది దక్షిణాది వారల రికార్డులు ఉన్నాయి. ఇంకో బీరువానిండా, హిందీ, తెలుగు, తమిళ, బంగాళీ, మరాటీ, గుజరాతీ, రికార్డులున్నాయి.

మూడవ బీరువానిండా ప్రసిద్ధికెక్కిన పాశ్చాత్య సంగీత మేళాల రికార్డులు, ప్రసిద్ధపాశ్చాత్య గాయకుల రికార్డులూ, ఉన్నాయి.

ఫ్రాంసు నుండి వచ్చిన "ఆర్గను" ఒకటి ఒకమూలను ఉంది. ఆతడు అన్ని వాద్యాలూ వాయించ గలడు.

అన్నిగదులూ చక్కగా అలంకరించుకొన్నాడు. క్రింద ప్రక్కగది తనతో పనిఉండి వచ్చిన పెద్దమనుష్యులు కూర్చుండే గది. పైన ప్రక్కగది తన పడకగది.

ఇవన్నీ నరసింహామూర్తి మేష్టారుకు చూపించాడు.

"ఇంత వాడవయ్యావోయి! అంతాడబ్బే సినీమాలో." అన్నాడు నరసింహామూర్తి మేష్టారు.

"అవునండీ! మీ అమ్మాయి పేరేమిటి?"

"పద్మావతి!"

"ఆ అమ్మాయి కంఠం చాలా బాగుంటుందను కుంటాను."

"బాగుండడమేమటోయి, కిన్నెర కంఠం! నువ్వు విని తీరాలి!"

"ఎప్పుడు తీసుకువస్తారు?"

"ఏదో నెలవురోజున కాని, ఆ అమ్మాయి భర్త ఈ ఊళ్లోనే ఉన్నాడు. పెద్ద చేపల వర్తకుడు. ఆతని ఆజ్ఞ లేకుండా ఆ అమ్మాయిని ఎక్కడికీ కదలించడానికి వీలు లేదు."

"ఏమిటీ? భర్త ఒకడున్నాడూ, పైగా ఆ భర్త ఈ ఊళ్లోనే ఉన్నాడూ? ఆతని ఆజ్ఞ కూడా కావాలీ? అయితే మీరు ఆ అమ్మాయిని బీచికి ఎట్లా తీసుకు వెళ్లారు?"

"అది ఆ భర్త ఆజ్ఞ వల్లనే!"

"సరేలెండి! ఆభర్తనే అడగండి. ఆతన్ని కూడ వెంట బెట్టుకురండి. నాకు కావలసినవి మధురమైన కంఠాలు. కనక, ప్రథమం ఆ బాలిక బాణీ వినాలి ఏమంటారు?"

"సరే సరే! ప్రయత్నిస్తాను."

అక్కడే పద్మావతికి మరునాడు రాత్రికూడా నిద్ర పట్ట లేదు. ఆయువకుడు ఎంత అద్భుతంగా పాడినాడు. ఎవ రాయన? సంగీత దర్శకుడా? సినీమాలలో పాడతాడా? అనుకున్నది. ఆపాట అంత అందంగా తానూ లోగొంతులో పాడుకున్నది. ఆ పాటవిన్న సహాధ్యాయులైన కొందరు బాలికలు సుడి గాలులులా వచ్చి, ఆమెచుట్టూ చేరినారు. "ఆపాట ఇంకోమాటు పాడు పద్మా!" అని కొందరు. "ఏదీ ఏదీ కాస్త కంఠమెత్తండి!" అని కొందరు ఆ బాలికను వేధించ సాగినారు.

ఆంధ్రమహిళలో ఆమె సంగీతమంటే బాలికలందరూ ప్రాణాలిస్తారు. రోజూ చదువులయ్యాక పడుకునే ముందర హాస్టలు భవనం పై మేడమీద ఉపాధ్యాయినులు, బాలికలు చేరి పద్మావతిని పాడమంటూ ప్రార్థిస్తూ ఉంటారు. ఆ బాలిక తన మధురగాంధర్వం వెన్నలలోనో, తారకల కాంతిలోనో మోళనం చేస్తూ ఉంటుంది.

ఈ దినం ఆ బాలిక లెంతమంది బ్రతిమాలినా పద్మ పాడ డానికి వప్పుకొనలేదు. విసుగుచెంది ఒక్కొక్క బాలికా వెళ్లిపోయింది. పద్మావతికి ఏదో బాధవచ్చింది. తన భర్త అంత చక్కని గాయకుడు ఎందుకు కాలేకపోయాడు. అనుకున్నది. ఇంతట్లో ఆతని మూర్తి తన మనస్సులో ప్రత్యక్షమైంది. ఎంత నాగరికతను అతడు దగ్గిర తీసుకున్నా అది దున్నపోతుపై కప్పిన పట్టు పచ్చడంలా ఉంది కాని ఆతడు ఫేమనుతో కలకల లాడిపోడు. ఆతని కంఠం ఉరుములా ఉంటుంది. ఆతని దేహం నల్లరాతితో చెక్కిన

చిన్నప్రాణంగా ఉంటుంది. అతను బహుమానాల్లు గెలిచినా, పట్టు బాడ్జీలు తెచ్చుకొన్నా, అతనెవరూ అతని దుస్తులూ ఏమాత్రమూ ప్రతి తెలియలేదు.

ఈ సంగీత ద్వారకుడు ఎంత అద్భుతంగా పాడినాడు. తమ తోటలోని పూలన్నీ ఒక్కసారి పరిమళాలు విరజల్లి నట్లయినది కదా! అది మనుష్యుని కంఠం కాదు, దేవతల కంఠం.

ఆమె మంచంమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ సమయంలో అందరు బాలికలూ నిద్రపోయేవే, చదువు కొనసాగించడానికి వరండాలో తిరుగుతున్న వసతి గృహాధికారిణి కిటికీలోనుండి చూచి పద్మావతి స్థితి గ్రహించింది. తలుపుతీసే ఉండడంచేత, ఆమె చల్లగా పద్మావతి గదిలోనికి వచ్చి, ఆ బాలిక ప్రక్కనే మంచంమీద కూర్చుండి, పద్మమీద చేయివైచి, "పద్మా! ఏమిటిది? ఈపాటికి నిద్రపోతూ ఉంటావు అనుకున్నాను, వంట్లో ఏమీ బాగాలేదా?" అని ప్రశ్నించింది. ఆ అధికారిణి పేరు శ్రీమతి కరుణామయి. హాస్టలులోని బాలికలందరూ ఆమెబిడ్డలు. తన తీయని కంఠంతో మెల్లగా మాట్లాడుతూ, బాలికల మనస్సులు గ్రహించి వారిని కంటికిరెప్పల్లా కాపాడు తుంటూ ఉంటుంది. శ్రీమతిగారంటే బాలికలందరూ ప్రాణాలర్పిస్తారు. ఆమెతో తమ సంతోషాలూ, ఆశయాలూ, కష్టాలు చెప్పుకుంటారు. ఎవరికైనా ఏ కాస్త జ్వరమూ వచ్చినా ఆవిడ వారి ప్రక్కను ఉండాలని గోల పెడ్తారు.

శ్రీమతి అంత తీయగా తన్ను ప్రశ్నించగానే, ఆమెకు మరీ దుఃఖం ఎక్కువైంది. గబుక్కున పద్మ తన తలను శ్రీమతి ఒళ్లో పెట్టి వెక్కి వెక్కి ఏడ్చింది. ఎందుకా బాల ఆలా ఏడుస్తున్నదో శ్రీమతికేమి తెలుసు. కాని పద్మకు నరాలజబ్బు వచ్చి ఆరోగ్యం చాలా చెడిపోవడంచేత భర్త ఆమెను ఆంధ్రమహిళా సభ విద్యాలయంలో చేర్పించారు. చదువూవస్తుంది, ఆమె ఆరోగ్యం పూర్తిగా కోలుకుంటుంది అనికదా ఆమెను తమ విద్యాలయంలో చేర్పించి హాస్టల్లో ప్రవేశ పెట్టించినాడాయన. కాని నరాలజబ్బు తగ్గిన ఎన్నాళ్లకోగాని పూర్తిగా అదివదలదు. అందుకని పద్మ ఏడుస్తున్నదనుకుని శ్రీమతి కెమ్మగా ఆ బాలికను అనున యించ ప్రారంభించినది.

"ఏమి పద్మా! ఈ స్వాతంత్ర్య మహోదయ ప్రారంభంలో భారతీయాంగనలు తమ మహోత్తమ కర్తవ్యం నిర్వర్తించడానికి సిద్ధంగా ఉండవద్దూ?"

పద్మావతి మౌనం.

"మనం ధైర్యం వహించి, బాధ్యతలు గుర్తించి నిజమైన శాంతిదేవతలమై మగవారికే దారి చూపించవలసి ఉన్నది కదా!"

పద్మావతి తలఊపింది.

"అనేకమంది బాలికలు ఎంత చదువుకున్నా జ్ఞానవిదగ్ధ మూర్ఖత్వం వదలలేక వారిదగ్గర వీరిమీద నేరాలూ, వీరి దగ్గిర వారిమీద నేరాలూ చెప్పుతూ తగాదాలు పెంచుతూ, ముప్పైమల్లు ఇముడుతాయి, మూడుకొప్పులు ఇముడవు అన్న సామెత మూడుకందల రెట్లు నిజంచేస్తున్నారు. అందుకు కారణం తమ సహజమైన స్త్రీత్వం దగ్ధంచేసుకొని మగవారి సుగుణాలు అలవాటు చేసుకొనలేక, మగ రాయళ్లలా సంచరిస్తూ ఉంటారు."

"మగవారు మాత్రం ఉత్తమంగా సంచరిస్తున్నారా పిన్నిగారూ?"

"ఆనాటికీ ఈనాటికీ మగవాళ్లలో మార్పుఏమీరాలేదు తల్లీ. పనివేడి తగ్గగానే వారికి భామవేడి కావాలి. ఉత్తమ మైన ఉద్యమంలో చటుక్కున చేరుతారు. తీవ్రంగా పట్టుదలతో పనిచేస్తారు. జయమో అపజయమో తేలగానే చప్పబడిపోతారు."

"గాలిపోయిన రబ్బరు బుడగలులా!"

"అదీ సరియైన పోలిక తెచ్చావు. విజయమే సంభవిస్తే వాళ్ల ఆత్మబలిభావం ఎగిరిపోయి, స్వలాభాపేక్షా, స్వపక్ష పరాయణత్వమూ స్వీయ యశోకామత్వమూ ఉద్భవిస్తాయి. ముప్పైమంది, మూడువందల ముఠాలవుతారు. దేశాన్ని గంగలో దింపుతారు."

"మన ఆంధ్రదేశ వ్యవహారాలన్నీ అల్లానే ఉన్నాయి కాదండీ పిన్నీ."

"నిజం చెప్పావు. ఇంకమనమూ అలానే సిద్ధం అయితే?"

"ఆడవాళ్లు దేవతల బిడ్డలాండి! వారికీ అధికారం చేతికివస్తే మీరన్నట్లు గర్వాలు ఆకాశం అంటుతాయి. అప్పచెల్లెళ్లుకన్న ఎక్కువుగా స్నేహంగా ఉన్నస్త్రీలు ఒకరినొకరిని భరించలేనంత విరోధం వహిస్తారు."

ఆవిధంగా పద్మావతిని ఊరడింపచేసి శ్రీమతి వెళ్లిపోయింది.

పద్మావతికి ఏదో వర్ణనాతీతమైన శాంతికలిగి దిండుపైన తలవాల్చింది. ఆ మరునిమిషంలో నిద్రాదేవి గాఢసంశ్లేషయుక్త అయిపోయినది.

3

సంగీత దర్శకుడు రాధాకృష్ణ స్వయంగా తన గురువుగారిని గురుభాయీ నరసింహమూర్తి మేష్టారిని వారింటికి చేర్చాడు. వారువెళ్లగానే బుచ్చి వెంకట్రావు హాలులో ఎలక్ట్రిక్ దీపం వెలుతురున పేపరు చదువుకొంటున్నాడు.

"మేష్టారూ రావడం ఆలస్యంచేశావే! పద్మ కులాసాగా ఉందికదా?" అని బుచ్చివెంకట్రావు నరసింహమూర్తి మేష్టారును పలకరిస్తూ ఆతనితో వచ్చిన రాధాకృష్ణవైపు తేరిపారచూచాడు. ఆ చూపులలో 'ఎవరయ్యా ఈ అతి పట్న వాసంవాడు?' అన్న ప్రశ్న స్పష్టంగా మూర్తింబించింది.

"ఏమీలేదు. ఈయన రాధాకృష్ణ! చాలా పేరుపొందిన సంగీత దర్శకుడు. నాతోపాటు మా గురువుగారి దగ్గిర సంగీతం నేర్చుకొన్న వెంకటరత్నం శిష్యుడు. నాదగ్గిరా కొంతకాలం శిష్యరికం చేశాడు. ఈతనిది బాపట్లనే! చటుక్కున సముద్రం ఒడ్డున కలుసుకున్నాం." అని నరసింహమూర్తి మేష్టారు తొందర తొందరగా జవాబు చెప్పినాడు.

"అలాగా చాలా సంతోషం!" అంటూ లేచి బుచ్చి వెంకట్రావు రాధాకృష్ణ చేతిని స్పృశించి కరవందనం చేశాడు.

రాధాకృష్ణ చేయి కలిపినాడు. అతి సున్నితంగా పీచుగా చేయి కాస్తయితే నలిగిపోయేటట్లుంది. ఎంతో బండగా ఉన్నాడు! అందుకేనా ఆ చేతి కలువ పువ్వులాంటి ఆ అందమైన బాలిక అంత [illegible] తీసుకుంది, అని అనుకున్నాడు రాధాకృష్ణ.

బుచ్చి: కూర్చోండి రాధాకృష్ణగారూ! మిమ్మల్ని తెలుసుకోవడం చాలా ఆనందంగా ఉంది. మా ఆవిడ చాలాగొప్ప సంగీత కళాకారులా అంటారు మా నరసింహమూర్తి మాష్టారు. మీరు వినాలి మీ అభిప్రాయం చెప్పాలి.

నర: అదేనయ్యా వస్తూ అనుకున్నాము, రాధాకృష్ణ సంగీతం నువ్వు వినితీరాలి ఏమంటావ్యా రాధాకృష్ణ! మా బుచ్చి వెంకట్రావుకు సంగీతం అంటే ప్రాణం.

రాధా: అవును! ఆయన్ని చూడగానే గ్రహించవచ్చును. ఆయన కళాహృదయం ఈ హాలు చూడగానే గ్రహించవచ్చును.

నర: ఈ రోజుల్లో డబ్బున్న ఒక్క పెద్దమనిషి ఒక్క కళాపూర్ణమైన బొమ్మకొన్న పాపాన పోతున్నారటండీ!

రాధా: ఈ రోజులలో లలితకళలు నేర్చుకోడం ముష్టి ఎత్తుకోడానికే! జమీందారులు వారికి శతాబ్దాల నుంచి వచ్చిన సంస్కృతీ భోజత్వంచేత కళావేత్తలను పోషిస్తూ వచ్చారు. ఇప్పుడేముంది జమీందారీలు లాగేశారు. స్వతంత్ర సంస్థానాలు ఎగిరిపోయాయి. ఎవరు అపరభోజులూ, కృష్ణదేవరాయలూను.

బుచ్చి: జమీలూ అవీ పోవలసిందే అనుకోండి. కాని లక్షలుధనం ఆర్జించే ధనస్వాములకు ఏమీ పొయ్యే కాలం వచ్చింది చెప్పండీ?

నర: ఈ దేశంలో ప్రభుత్వం కులతత్వ ప్రభుత్వం తక్కిన దేశోద్ధారక ప్రణాళికలన్నీ కులతత్వ రాక్షసి కడుపులో ప్రాణాయస్వాహా అయిపోతున్నాయి.

రాధాకృష్ణ: ధనస్వాములకు కళలెందుకండీ. సంగీతం కన్న సంగీతం పాడే బాలికమీద ఎక్కువ మోజు. అందుకనే సినీమా సినీమాలు అని కంపెనీలు పెడుతూ ఉంటారు.

అలా పెట్టడం మా జోటీవారికి లాభమే అనుకోండి. లేకపోతే ఎంతమందో చిత్రకారులూ, గాయకులూ మాడి పోవలసిందేకదా!

బుచ్చి : నేను ఇంతవరకూ కొంచెం కళావేత్తలు అనుకున్న వారి సలహాతో ఒక డజను బొమ్మలు కొన్నాను రాధాకృష్ణగారూ!

రాధా : మొత్తం ఏమాత్రం అయి ఉంటుందండీ!

బుచ్చి : పదిహేనువందలు ఖర్చయ్యాయి. కాని, అంతవిద్య సంపాదించుకొని, అలా అందంగా బొమ్మలు వేస్తే నూరూ నూటయాభై వారిని ఏం పోషిస్తాయి చెప్పండి రాధాకృష్ణగారు.

రాధా : చూడండి మా సినీమావారు లక్షలు సంపాదిస్తారు. ఒక్కబొమ్మ కొన్న డైరక్టరు, తార, తారకుడూ ఉన్నారా? ఒక్క రామబ్రహ్మంగారు తప్ప పుట్టాడు మహానుభావుడు.

నర : ఏమనుకుంటే ఏం లాభం? ప్రభుత్వం ప్రజా రాజ్యంట. ప్రజలకు కళ కావాలి. ఆ కళను ప్రదర్శన శాలలుగా ఏర్పాటు చెయ్యాలి ప్రభుత్వం. ప్రభుత్వానికి మాటలు జాస్తీ చేతలు నాస్తి.

బుచ్చి : ఎప్పుడండీ మీ సంగీతం మేం వినడం.

రాధా : నా కారు పంపిస్తాను.

నర : మా కారుమీదే వస్తాము. మీరు ఎప్పుడు వీలో అప్పుడే వస్తాము. మా అమ్మాయినీ తీసుకు వస్తాము.

రాధా : రేపు రాత్రి ఎనిమిది గంటలకు రండి. మా ఇంట్లోనే మీ భోజనాలు. మళ్లీ కాదనకండి. మాకు కులం తేడాలు లేవండోయి బుచ్చి వెంకట్రావుగారు.

బుచ్చి : నాకు ఆ విషయంలో ఎవరినీ ఏమీ ఇబ్బంది పరచకూడదని నియమం.

రాధా : మా ఆవిడ ఒక నాయరమ్మాయి. సంగీతానికి నాట్యానికి నాకు శిష్యురాలయింది. ఆ తర్వాత భార్య అయింది. కాని మన బ్రాహ్మణులకన్న ఆచారాలు. మాంసం ముడలేదు. చేపల వాసనే గిట్టదు. కోడిగుడ్డు కూడా పడదు.

బుచ్చి : మాకూ ఈ మాస్టారు పుణ్యమా అని చప్పటి భోజనమే అలవాటయింది.

రాధా : కాబట్టి తప్పకుండా రేపు రావాలి. మీ ఆఫీస ఫోను నెంబరివ్వండి. ఫోనులో జ్ఞాపకం చేస్తాను సెలవు. నమస్కారం మాష్టరూ.

రాధాకృష్ణ సెలవు పుచ్చుకుని వెళ్లిపోయాడు.

౪

రాధాకృష్ణ ఇంటిలో బుచ్చి వెంకట్రావూ, పద్మావతీ నరసింహమూర్తి, రాధాకృష్ణ భార్య సుశీల. నాయరు వంట పండితుడు మధురమైన మలబారు శాకాహార భోజనమూ పిండివంటలు వడ్డించంగా భోజనాలూ పూర్తిచేసి తాంబూలాలు వేసుకుంటూ లోని హాలులో కూర్చున్నారు. రేడియో చక్కని సంగీతం పాడుతున్నది.

పద్మా : ఇప్పుడు వచ్చేసంగీతం అంతా వట్టి కాఫీహోటల సంగీతం మాస్టారూ!

నర : అవునమ్మా అవును. ఎవరికి కావాలి ఉత్తమమైన కర్ణాటకబాణి?

రాధా : ఉత్తమమైన ఉత్తరాది బాణికూడా ఉత్తరాది వారికే అక్కర లేకపోతోంది.

సుశీ : నాకుమాత్రం ఈనాటి సంగీతం చాలా అందంగా ఉంటుంది

బుచ్చి : కొన్ని కొన్ని ఉత్తరాది సినీమాపాటలు సురయ్యా పాడినవీ, కన్నన్ బాల పాడినవీ, లతామంగేష్కర్, షంషెడ్ బేగం పాడినవీ, చాలా ఇష్టం నాకు.

అక్కడనుంచి అందరూ రాధాకృష్ణ గాంధర్వ మందిరానికి పోయారు. అక్కడ రాధాకృష్ణ మేళంవారు అంతా సిద్ధంగా ఉన్నారు.

రాధాకృష్ణ తన భార్యనూ, ముగ్గురు అతిధులనూ అక్కడ ఉన్న సోఫాలపై కూర్చుండపెట్టి, తాను వెళ్లి తన మేళ వాద్యాల వారిమధ్య తన దర్భకాసనంపై అధివసించాడు.

అక్కడనుంచి అతడు గంభీరమూ మధురమూ అయిన తన కంఠమెత్తి నాలుగు పాటలు పాడినాడు. ఆ తర్వాత

సుశీలా వెళ్లి రాధాకృష్ణప్రక్క కూర్చుండి రెండు మళయాళపు పాటలూ, ఒక తెలుగుపాట పాడింది.

నరసింహమూర్తి మేష్టారు, ఆనందంతో చప్పట్లుకొట్టి "చాలా ఆనందంగా ఉందయ్యా. ఇంక మా అమ్మాయి పద్మావతి పాట వినాలి నువ్వు. అమ్మా ఏదీ ఒక్క పాట వినిపించూ! రాధాకృష్ణా! ఒక్క ఫిడేలు మృదంగమూ మాత్రమే మేళం. నా ఫిడేలు తెచ్చుకున్నాలే! దానితో నేనూ వాయిస్తాను" అన్నాడు.

"పాడు పద్మా! భయమేమిటి? అంతా మనవాళ్లే!" అని బుచ్చి వెంకట్రావు భార్యను కోరినాడు.

పద్మావతి శ్రుతిచూచుకుని తన గురువు అందివ్వగా నెమ్మదిగా రాగం ప్రారంభించింది. రెండు మూడుసార్లు భయంచే శ్రుతి తప్పిపోయింది. కాని వెంటనే అందుకుంది. నెమ్మదిగా నెమ్మదిగా తనకు ఇష్టమైన ఆ తోడిరాగం సాగించింది. ఆ రాగంలో తానవర్ణంలోనికి ప్రసరించింది. ఆ వెంటనే త్యాగరాజకృతి అందుకుంది. ఆ కృతికి సరిపడిన స్వరకల్పనా వికసనంతో ఆ పాట పూర్తిచేసింది.

ఆ పాట పాడినంతసేపూ అందరూ మంత్రముగ్ధులై విన్నారు. రాధాకృష్ణకు ఆ పాట వింటూఉంటే తాను ఒకనాడు సందర్శించిన ఉదక మండలం ప్రకృతి దృశ్యం ప్రత్యక్షం అయింది. ఒత్తుగా వివిధములైన ఆకుపచ్చని రంగుల చెట్లు నిండిఉన్న కొండచరియలు, చిన్నచిన్న సెలయేళ్లు, చెరువులు, లేళ్ల గుంపులు, పూవులు, నెమళ్లు, పక్షులు, మేఘాలు ఒక మహా శ్రుతిలో స్వరాలై దర్శన మిచ్చినట్లు అతనికి తోచింది. ఆ కంఠం అంత అమృతమయమని అతడు కలలోనైనా అనుకోలేదు. ఆ బాలికా, ఆమె గానమూ చంద్రమూర్తీ, చంద్రికా అయి అతని ఎదుట లోచన గోచరమైనట్లయినది.

ఆమె వెంటనే రాగమాలికతో "కస్తూరీ తిలకం" అన్న శ్లోకంపాడింది. శ్రీకృష్ణ భగవానుడు నీలమేఘ శ్యామల కాంతి పూర్ణుడై, కోటి సౌందర్య విరాజిత హాసాంచల వదనుడై సదస్యులందరికీ గాంధర్వ రూపంలో ప్రత్యక్షమైనట్లనిపించినది. క్షేత్రయ్యపదం ఆ వెంటనే ఎత్తుకొన్నది.

నరసింహమూర్తి ఆనందం వర్ణనాతీతం. ఆతడా ఆనందంతో అచేతనుడౌతూ తనఫిడేలును వాయించడం మానుతూ ఉండేవాడు.

ఏమి వాణి! ఇది మానవమాత్రుల వాణా అని బుచ్చి వెంకట్రావు ఆమెను తప్ప సర్వమూ మరిచిపోయాడు. సుశీలాదేవి కనురెప్ప వేయని అనిమిషత్వంతో పద్మావతిని చూస్తూ ఆమె గాంధర్వంలో మేళవించిపోయింది.

పద్మావతి పాటచాలించి అక్కడే తలతల వంచుకొని కన్నుల నీరు కారిపోగా వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. అది గమనించగానే సుశీలాదేవి ఒక గంతున ఆ బాలిక కడకు పరుగిడి ఆమెను పొదివి పట్టుకొని లేవదీసి తన గదిలోనికి తీసుకుపోయింది. అక్కడ ఆమెను ఒక సోఫాపై కూర్చుండబెట్టి తానామె ప్రక్కన కూర్చుండి, "అంత సిగ్గయితే ఏలాఅమ్మా! అనిఇంగ్లీ తెలుగుతో మాట్లాడుతూ, "నీ సంగీతం నేను వర్ణించలేను. జన్మకోసారికూడా ఈలాంటి పరమసౌందర్య స్వరూపమైన సంగీతం వింటామో లేదో" అని అన్నది.

ఇంతట్లో నాయరును పిలిపించి "కోకో చేసి, వెంటనే తీసుకురమ్మ"ని ఆజ్ఞ ఇచ్చి, ఈలోగా తాను మలబారునుంచి తెచ్చిన మంచి ఔషధం రెండు మాత్రలు మింగించి మంచినీళ్లు త్రాగింపించింది.

సుశీల పద్మావతిని గదిలోకి తీసుకువెళుతూ ఉంటేనే పద్మావతి తేరుకుంది. మందుబాగా పనిచేసింది. కోకో పద్మావతిని పూర్తిగా మామూలు మనిషిని చేసింది.

సుశీలాదేవి పద్మావతిని తన స్నానాల గదిలోకి తీసుకుపోయి, మొగం కడుక్కోమని, తుడుచుకునే తువాలు ఇచ్చింది. ఆమెకు తలసర్ది పౌడరుఅదీ రాసి, బొట్టుంచి తనపూల బుట్టలోనుంచి జాజిమల్లియ దండను తీసి ఆమె తలలో అమరించింది.

పద్మావతి జాజిమల్లియల దండను చూచింది. ఆమె మనస్సు తేటబారింది. ఆదండ తన తలను అలంకరించిన సుశీలను పద్మావతి సిగ్గుతో పలకరిస్తూ ఇంగ్లీషులో "వదినా ఈ నాటినుంచి మనం ఇద్దరం ప్రాణస్నేహితులం సుమా!" అన్నది.



దిస్తే తెనుగు సాహిత్యం, ప్రాక్ దేశపు ఇటలీ భాష అనే బిరుదును నిలుపు కోటమే కాక, ఇటలీ భాషను పాశ్చాత్య తెలుగు భాష అని అనిపించినా అనిపించగలదు!

తెనుగు తేట; కనడము కస్తూరి; అరవము...... శ్రీనాథుడు తెలుగు భాషను "దేశభాషలందు తెలుగు లెస్స" అనిశ్లాఘించాడు. భారతికవి "సుందరమాన తెలుంగు" అని పాడి కొనియాడాడు.

మన దేశభాషల పరిశీలన మన దేశంలో ఉన్నది ఒక్క సంస్కృతీ, ఒక్క భావనా శక్తీ, ఒక్క జీవిత దృష్టీ అని విశదం చేస్తుంది. ఒక్క దేశంలో భాషల వైవిధ్యం ఉన్నంత మాత్రాన సంస్కృతి భాష భాషకూ మారుతుం దనుకో గూడదు. జనించె గిరి శిఖరాలు వేరైతే మాత్రం గంగా సింధూ గౌతమీ కృష్ణవేణీ మొదలైన నదులన్నీ సంగమించేది ఒక్క సముద్రం లోనేగా?



## ఆకాలం

శ్రీమతి అద్దేపల్లి లక్ష్మి

అదొక మంచి కాలం
అదొక మహా మంచి కాలం
ఆకాలం మళ్లీరాదు,
ఈకాలం వెళ్లీపోదు.
ఆకాలం, ఆకాలంలో
ఆకలి లేదు, ఆశలు లేవు
అబద్ధం లేదు, అన్యాయం లేదు,
అసూయ లేదు, అసహనం లేదు,
అసహాయత్వం అసలే లేదు,
ఆకాలంలో అంతా ఒకటే
నీవూ నేనూ వాడూవీడూ అంతా ఒకటే.
ఆడ మగ, కుల మత, తన మన
అనే భేదాలకు అసలు తావే లేదు.
ఆకాలంలో వారు పరలోకంలో మరి
అమరత్వం పొందేరట
ఈకాలంలో వారు ఇహలోకం లోనే
ఈసడింపులు తిని ఈడిగపడ్తున్నారు.
అదొక కాలం
ఆకాలంలో మరి
రాజపాలితులే ప్రజలు
ప్రజల బంటులే రాజులు
ప్రజా ప్రభుత్వమే అది
ప్రజాపాలకు లేవారు
ప్రజారాజ్యమే అది
రాజే ప్రజ, ప్రజే రాజు
ఆరాజుల ఔదార్యం,
ఆప్రజల త్యాగం
ఒండొరుల అనురాగం.
అనుపమాన మైన దా రాగం.
ఆకాలం మహామంచి కాలం
ఈకాలమా, అమ్మయ్యో!
ఈకాలం పేరు తలవకు
ఈర్ష్య; అసూయ, అగ్ని
ఇవ్వన్నీ ఈకాలంలో
ఇమిడివున్నాయి సాలెగూడులా
ఆకాలం మళ్లీరాదు
ఈ కాలం వెళ్లీ పోదు
ఆకాలం, అదొక మహామంచి కాలం!



# ఆలు లేదు - చూలు లేదు - కొడుకు పేరు....

శ్రీమతి అయ్యగారి కనకం

కమల స్కూలుఫైనలుకు వెళ్లిన సంవత్సరమే ప్యాసు కావలసినది గాని యూనివర్సిటీకి డబ్బు ఋణపడి యుండుట చేత మూడు సంవత్సరాలు పరీక్షకు వెళ్లవలసి వచ్చింది. తరువాత ఇంకను చదవడమా? ఉద్యోగం చేయడమా? అన్న సమస్య వచ్చింది. ఆమె కాస్తులెవరో బయల్దేరి "నీవు రేడియో కేదైనా వ్రాయమ్మా అది వాళ్లకునచ్చితే నిన్ను మాట్లాడమని డబ్బుకూడా యిస్తారు. రాను పోను ఖర్చులు కూడా యిస్తారు. అల్లా నెలకోసారి కనక నీకవకాశమిస్తే యింక ఉద్యోగమెందుకమ్మా" అని చెప్పారు. అయితే ప్రయత్నం చేసిచూస్తా నంటూ కమల తొందరగా 'అత్తా కోడండ్లు' అనే నాటకం వ్రాసింది. ఇంట్లో అందరికి కూడా చదివి వినిపించింది. ఇది తప్పకుండా రేడియోకు సరిపోతుందని అందరూ అన్నారు.

"అయితే అమ్మామరి యిది పోస్టులో పంపించాలి. మూడు స్టాంపులిస్తావా?" అంది కమల.

"అక్కా, ముక్కానీ బిళ్లనేనిస్తానే. మరి నీకు డబ్బు వచ్చాక మూడు రూపాయలిస్తావా?" అన్నాడు తమ్ముడు భాస్కరం.

ఇంతట్లో పక్కగదిలో నుంచుని వింటూన్న వాళ్ల అన్నయ్య "ఏమే చెల్లాయ్ ఏమిటా మనోరథ రాజ్యపాలన? నిజంగా నీనాటకం రేడియో వాళ్లు తీసికుంటే నాతో మాట్లాడవా?" అన్నాడు

"ఇదిగో టైమయిపోకుండా యిది కాస్త పోస్టు చేయిద్దూ. తరవాత మాట్లాడుకోవచ్చు".

"మరి నే నొక్కసారి చదవవద్దూ"?

"ఇప్పుడు నువ్వుచదవవద్దు బాబూ" అన్నది కమల.

"రేడియోలోనే వినవచ్చులేరా అబ్బాయి" అంది వాళ్లమ్మ.

"ఒరేయ్ అన్నయ్యా, అక్కరాసిన చిత్తు కాపీ నాదగ్గరుంది యియ్యనా?" అన్నాడు భాస్కరు.

"చెల్లీ! అన్నయ్య కిచ్చానే నీకవరు" సరే. ఆరోజు రాత్రి కమలకు సంతోషంచేత నిద్దర పట్టలేదు. తెల్లవారి లేచిన తరువాత కూడ "ఆలిండియా రేడియో విజయవాడ వాళ్ల కందితే రేపిస్తారు కదూ జవాబు," అనుకుంది కమల.

"ఏమని ఇస్తారు" అంది వాళ్లమ్మ

"రమ్మనే రాస్తారనుకుంటున్నా నమ్మా. నాకో మంచి చీరొకటి కొనిపెట్టవులే అమ్మా!" అంది కమల

"ఏదో డబ్బు వస్తుందంటున్నావుగా? అదిపెట్టి కొనుక్కో" అమ్మ బదులు చెప్పింది.

"అబ్బో ఆడబ్బు వస్తే నేనొచక్కని కలం కొనుక్కోవాలి బాబూ" అనుకుంది. కమల యింకా యింకా నాటకాలూ, కథలూ వ్రాయాలని

ఇంతట్లో తమ్ముడు పరిగెత్తుకుంటూ వచ్చి "అది నాపేరు పెట్టి పంపించిందే. వాళ్లుకనక నిజంగా డబ్బుపంపిస్తే చిల్లి దమ్మిడీ కూడా అక్కకివ్వను. నేనూటు కుట్టించుకోనూ అదిపెట్టి."

"నేనేం నీపేరెట్టి పంపించలేదోయ్ తమ్మయ్యా. నాతో అబద్ధాలు చెపుతున్నావా; నాన్న రానియి నీపని పట్టిస్తా" అని బెదిరించింది అక్క. ఇలా నాలుగు రోజులు గడిచేయి. ఒక రోజు మధ్యాహ్నం కమల రేడియోలో మాట్లాడానికి బెజవాడ వెళ్లడానికి ఏచీరకావాలో అని ఆలోచిస్తూంటే కమలమ్మ గారున్నారా అంటు తపాలా బంట్రోతు వచ్చాడు.

రేడియో వార్తకోసమెదురు చూస్తున్న కమల పరుగెత్తుకుంటూ వచ్చింది.

రిజిస్టర్డు పోస్టులో ఏదో ఉత్తరమొచ్చింది.

'దానికోసమె ఎదురు చూస్తున్నా నంటూ ఎంతో సంతోషంతో' సంతకం పెట్టింది "ఆలిండియా రేడియో విజయవాడ నుంచే" అంటూ కవరు విప్పింది.

ఆమె వ్రాసిపంపిన నాటిక మరియొక చిన్న కాగితంతో భద్రంగా వేసికొనందుకు సామభూతి చూపిస్తూ తిరగగొట్టబడింది!!



# మధ్య తరగతి స్త్రీలు సహకార సంఘాలను వినియోగించుకోవాలి!

## ప్రపంచ చరిత్రలో మన దేశ స్త్రీలుకూడ ముందంజ వేయాలి!

శ్రీ సత్తిరాజు రామచంద్రరావు.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత కరువు కాటకాలతో, హిందూ ముస్లిం దెబ్బలాటలతో ఉన్న భారతదేశాన్ని మన నాయకుల చేతులలో పెట్టి, తెల్లవాళ్లు వెళ్లిపోయారు. ఆహారధాన్యాలు లేక విదేశాలమీద ఆధారపడవలసి వచ్చింది. డాలర్ ను ఉపయోగించుకొంటేనేగాని దేశాభివృద్ధి లేకపోవడం వలన, వ్యాపారపంటలు (పుగాకు వగైరా) పండించవలసి వస్తోంది. డాలర్ వల్ల పరిశ్రమలు అభివృద్ధికి కావలసిన పరికరాలు లభిస్తాయి. అప్పుడు గానిపరిశ్రమలు ప్రాజక్టులు కట్టలేరు. డాలర్ కుగాను వ్యాపారపంటలు పండించనీయవలసి వస్తోంది, అని మన పెద్దలు ప్రకటిస్తున్నారు. తినుబడి సరకులు తక్కువ అవుతున్నాయి అనే వంకతో వ్యాపారస్తులు ఆహార ధాన్యాలను దాచివేస్తూయున్నారు. బ్లాక్ మార్కెట్టులో ప్రతీవ్యక్తి సరుకును కొనుక్కోవలసి వస్తోంది. ఆహారధాన్యాలు లేకపోతే ప్రజలు చావవలసి వస్తుంది. ఎవడైనా చస్తాడా? చచ్చినట్లు కొనుక్కోవాలనే ధీమా దొంగ వ్యాపారులకు తెలిసిపోయింది. దానితో ఆహారధాన్యాల రేట్లను పెంచివేస్తూయున్నారు. కొరియా యుద్ధంతో మూడవ ప్రపంచయుద్ధం వచ్చేసిందని రేట్లు పెంచేశారు. కలకత్తాలో 39 గురిని (దొంగ వర్తకుల అరెస్టు చేయడం జరిగింది.) యీవిధంగా భారతదేశ పరిస్థితి యుందని పేపర్లలో ప్రతీరోజు చదువు చూస్తే యున్నాం.

మనదేశం బీదదేశం. మనదేశంలోని ప్రజల జీవితాలు చాలా స్వల్పం. (అంటే సరైన తిండిలేదు. తృప్తిగా తినుటకుదానికితగిన సంపాదన లేదు.)ధనార్జితం తక్కువ అవడం, ఆహారధాన్యాదులు నిత్యజీవితావశ్యకమైన సరకులు 5,6 రెట్లు పెరిగిపోయి ఉండడంబట్టే, మనం మనతీరిక గంటల్లో వేరే పనిచేయుచూ, మనకుటుంబ పోషణను చూచుకొంటున్నాం. యీవిధంగా రెండవ వృత్తిని చేసికోవడంలో రెండు పద్ధతులు ఉన్నాయి (1) అధికారంకలిగిన ఆఫీసర్లు N. G. O. దగ్గర నుండి బంట్రోతు వరకు వారి అధికారంతో ప్రజలను భయపెట్టి, కుటుంబాన్ని పోషించుట (2) వేరే ఉద్యోగం చేసికొనుట. యీ పైరెండు పద్ధతులు చేసేవ్యక్తులయొక్క ఆరోగ్యసూత్రాల ప్రకారం చూచినా, గౌరవ మర్యాదల ప్రకారం చూచినా అతి దారుణం. యీ పద్ధతులను గ్రహించే పూజ్య బాపూజీ, "కష్టపడేవానికి నెలకు తక్కువలేకుండా రు 30/- ఉండాలని, ఎల్లప్పుడు గోలపెట్టేవారు. గాని ఆయన గోలను ఎవ్వరూ వినలేదు సరికదా ప్రతీవ్యక్తి సుఖంగా బ్రతికే రోజులలో రోజుకు రూపాయికూడ సంపాదించేవారుగా కాలేకపోయారు. గాంధీజీ సిద్ధాంతాల ప్రకారం యిన్ ప్లేషన్ రోజులలో, 5 రెట్లు పెరిగిన యీ రోజులలో ప్రతి వ్యక్తికి తక్కువలేకుండా రు. 150/- ఉండాలని నిర్ణయమన్నమాట. గాని మదరాసు ప్రభుత్వముకన్న హెచ్చు కరువు భత్యం యిస్తూయున్న కేంద్ర ప్రభుత్వంకూడ అంత యివ్వడంలేదు.

ఒక N.G.O. ను తీసుకొందాం. అతను మధ్యతరగతి మనిషి. కొత్తగా చేరినవానికి కరువు భత్యంతోసహా సుమారు రు. 90/- యిస్తూయున్నారనుకొందాం. భార్య తను బ్రతకాలి. అతను మితంగా ఖర్చుచేసేవ్యక్తి అయితే ఈక్రింది విధంగా యుంటుంది. యింటి అద్దె 20/- దీపాలఖర్చు 3/- భోజనం 60/-లు (అన్నీ కలిపి) బట్టలు, ఆరోగ్యం 30/-లు అప్పుడప్పుడు వినోదాలు యితరఖర్చులు. 10/-లు. మొత్తం రు. 123/- యీలెక్కలు యింకా తక్కువ పైడబ్బు చాలక అప్పుచేయవలసి వస్తుంది. యీ విధంగా అప్పులభారం హెచ్చు అయినప్పుడు వ్యక్తికి ఏవిధంగా వుత్సాహం ఉంటుంది? చాలీచాలని నిర్ణయ జీతాలు మినహా, యజమానుల నుండిగాని, ప్రభుత్వం నుండిగాని, ఏయితర సౌకర్యములు లేనందుననే లంచాలు తినడం, రెండవ వృత్తిని చేసుకోడానికి ప్రయత్నించడం జరుగుతోంది. ఈరెండవ ప్రయత్నంవల్ల గౌరవం పోవడం, ఆరోగ్యం పాడవడం, జబ్బులు హెచ్చు

అవడం, పనియందు శ్రద్ధలేకపోవడం ఆఖరుకు ఉద్యోగము నుండి తీసివేయబడడం జరుగుతోంది.

ఈవిధంగా మధ్యతరగతి ప్రజలు పడుతున్న కష్టాలకు అంతూ పంతూలేదు. కార్మికుడు తను, తనభార్యా కలసి పని చేస్తూయున్నా జీవితాలను గడపలేకున్నారు. అటువంటి పరిస్థితులలో మధ్యతరగతి కుటుంబం అంతా ఒక్కరిమీదనే ఆధారపడి బ్రతకడం అంటే నానా అవస్థల పాలుగావడం అవదంటూరా? అది జీవితానుభవం. యీ యిన్ఫ్లేషన్ పోవాలంటే ప్రజలకు కావలసిన జీవితావసరసరుకులు(బట్ట, తిండి, యిల్లు,) ప్రజలకు అందేటట్లు చెయ్యాలి, వ్యవసాయాన్ని, పరిశ్రమలను అభివృద్ధిపరచాలి, ప్రభుత్వం నిస్సహాయస్థితిలో యున్నప్పుడు, ప్రజలు ముందంజవేయాలి. మనభవితవ్యం సహకారంమీద ఆధారపడియుంది. స్త్రీ పురుషులు కలిసి వ్యవసాయాన్ని పరిశ్రమను అభివృద్ధిపరచాలి. ధనం సంపాదించాలంటే స్త్రీలు, పురుషులకు సహకరించాలి. కస్తూరీబాయి శిక్షణ కేంద్రాలను హెచ్చుగా స్థాపించాలి. చేతి పరిశ్రమనే కాకుండా స్త్రీలకుకూడ వ్యవసాయాన్ని అభివృద్ధిపర్చడం ఎట్లాగో, బట్టల పరిశ్రమలలో స్త్రీలు పనిచేడం ఎట్లాగో నేర్పాలి. వాటితోపాటు విద్య ప్రథమచికిత్స మొదలైనవి నేర్పాలి. అవి నేర్పబడుటలేదు. సరిగదా వీటిని నేర్పుటకు ప్రభుత్వం పెట్టుబడి చాలదు, కాబట్టి సహకార సంస్థల ద్వారా వాటిని అభివృద్ధి పరచాలి. మనకొరతలను సహకార సంస్థల ద్వారానే నిర్మూలించుకోవాలి. 55 సం॥ లనుండి పని చేస్తూ యున్న సహకార ఉద్యమం ఇప్పుడు స్త్రీల చేతులలోకికూడ వెళ్లాలి. ఈ అభివృద్ధికి చదువుకొన్న స్త్రీలు ముందంజ వేయాలి. వారు ముందంజ వేయడంలేదు. పొలంలో వ్యవసాయం చేయడానికి చదువుకొన్న భారత స్త్రీ బెంగ పెట్టుకొంటుంది. చదువుకొన్న స్త్రీలు సుకుమారంగా పెరిగారు, అందుచేత వ్యవసాయం చేయలేరు, చేస్తే కాలో చేయో విరుగుతుందని భయపెట్టుతారు. ఈ నిరుత్సాహాన్ని చూస్తే, పెద్దలు (కుటుంబ పెద్దలు) "ఎంత చదువు చదివినా పద్దులు వ్రాయడానికేకదూ!" అని హేళన చేయడంకద్దు. కుటుంబ పెద్దలు అనే హేళన మాటలను విని, కోపంతో, మనస్త్రీలు, "యింటిపనులతో తీరికే ఉండదు." అని అంటూ తమవిద్యను ఇతరులకు చూపకుండా, వేరే ధోరణిలోకి మార్చేస్తారు. వంట పెత్తనం మనకు ఉందని, డబ్బు పెట్టి, తాళాలు మనదగ్గర వున్నాయని, యింటి ఖర్చులు తనే చేస్తూయున్నాననే సంతోషం మధ్య తరగతి చదువుకొన్న స్త్రీకి ఉన్నా, కుటుంబం ఒక వైపునుండి నాశనం అవుతూవున్న, భర్త తెచ్చేధనం కుటుంబానికి సరిపోదని తెల్సినా, ఆర్థికంగా తనభర్తకు సహకరించదు—అందు చేతనే విదేశస్థులు "భారత స్త్రీలు పరాన్నభుక్కులని" విమర్శించిన మాటలు మన మధ్యతరగతి స్త్రీలకు మాత్రమే చెందుతాయి. ఎండలో పనిచేస్తే నాబిడ్డ ఎర్రబడి పోతుంది, మంచిరక్తం శరీరంలో ప్రవహిస్తుంది, గంభీర స్వభావం ఏర్పడుతుంది, వయ్యారంగా కనపడదు అనేభయంవల్లనో మరి ఏయితర కారణాల వల్లనోగాని తమ బిడ్డలను తల్లిదండ్రులు నీడనే కూర్చోపెట్టి పనిచేయిస్తారు. చదువును కొంతవరకు (III ఫారం) చదివించి, తరువాత సంగీతం, 'లేసు' అల్లడం నేర్పుతారు. అత్తవారింటికి వెళ్లిన తరువాత అవి రెండు మూలపడుతాయి. అవి వారిజీవనానికి పనికి రానివని వదలివేస్తారు. దానితో వారి విద్యలు అన్నీ సమాప్తి. మరల పెద్దబాలశిక్షకు తయారు (చదువునే మర్చిపోతారు) తమబిడ్డలకు కూడ నేర్పరు. ఇది మన దేశంలోని మధ్యతరగతి స్త్రీల సహజగుణం. ఇది వ్యతిరేకతతో వ్రాయడంకాదు. మనకు అనుభవమే.

గాని...ఇతర దేశాలలో...చూడండి. అనేకమంది స్త్రీలు పురుషులతో సమానంగా తయారై ఆర్థికంగా జీవితానికి సహకరిస్తూ యున్నారు. మొన్న మొన్న ఆంధ్రప్రభలో జకోస్లేవేకియాలో ఒక స్త్రీ రైలుయింజను డ్రైవర్ అంటూ బొమ్మ వేశారు. జపాను స్త్రీలు విమానాలు నడుపుటలో శ్రద్ధచూపించారు. అన్ని దేశాలలో స్త్రీలు పురుషులతో పాటు ముందంజ వేయుచున్నారు. గాని మనదేశపు స్త్రీలు విద్యలోను, ఉపన్యాసములు చేయడంలోను నీడనే కూర్చుని చిన్న చిన్న పనులు చేయడంలోను సమర్థులు, ప్రపంచ స్త్రీలు ఉరకలు వేస్తూయుంటే మనం నడుస్తున్నాం. ఇతర దేశంలోని స్త్రీల గురించి ఆలోచిద్దాం.

# మధ్య తరగతి స్త్రీలు సహకార సంఘాలను వినియోగించుకోవాలి

"సినామాలోఫ్" అనే మధ్యతరగతి స్త్రీకి స్వంత యిల్లు ఉంది. ఆవు, వ్యవసాయ పరికరాలు, చిన్న పూవుల తోట ఉన్నాయి. ఆమె పెద్ద చదువు చదివింది. మంచి బట్టలు వేసుకొని శుభ్రంగా అందంగా తయారౌతుంది. ఆమె చదువుకొన్నది కాబట్టి క్లబ్బుకు వెళ్లుతుంది. డ్యాన్సు చేస్తుంది. పాడుతుంది. అనేకసార్లు ప్రజలకు తననాట్యం చూపింది. బహుమతులుకూడ పొందింది. యిన్ని లక్షణాలు కలిగిన ఆమె ఎవరు? ఉపాధ్యాయురాలా? పాటకురాలా? ఆఫీసు గుమస్తా? యింజనీరా? ఆసుపత్రిలో నర్సా! లేక డాక్టరా?.........అంటే పూర్వం ఉపాధ్యాయురాలు. హైస్కూలులో పని చేసేది. కాని యిప్పుడో? ఆమె ఆపనులలో లేదు.

ఆమె యిప్పుడు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని మామూలు సభ్యురాలై ఉంది. వ్యవసాయానికి ఉపయోగించబడే ట్రాక్టర్ (నాగలివంటిది) డ్రైవర్. ఆమె భర్తకూడ వ్యవసాయ క్షేత్రాలలో పనిచేస్తూ యుంటాడు. అతను పూర్వం చదువు లేనివాడు. చురుకైన వాడు. అతని తమ్ముని (బాగా చదువుకున్న వాడు)కి పెండ్లి చేయాలని ఆమెతండ్రి అనుకొనేవాడు గాని, ఆమె అతనిని ప్రేమించక, అతని అన్ననే ప్రేమించి పెండ్లిచేసుకొంది. తనకు వచ్చిన విద్యనంతా తన భర్తకు నేర్పింది. చదువు అసలే లేదని నీచంగా చూచి ఎరుగదు. అందుకే తనభర్తకు తనంటే చాల ప్రేమఅని గర్వంగా చెప్పుకొంటుంది. ఆమె టాల్‌స్టాయి, టాగోర్, హ్యూగో షేక్సుపియర్ మొదలైనవారి పుస్తకాలు చదువుతుంది. ప్రతీ కొత్తసినిమా చూచి నాట్యం నేర్చుకొంటుంది. సినిమాలోని మంచిని అర్థం చేసుకొంటుంది.కథలు వ్రాస్తుంది. నిజమైన మనిషి, జీవితం ఎట్లాఉండాలనే విషయంపై, వాళ్ల క్లబ్బులో చర్చరాగా ఆమె అమోఘంగాచెప్పి, అందరిని ఉర్రూతలూగించింది.

1940 సం॥లో యుద్ధం రావడంవల్ల ఆమె చదువుమాని వేసింది. తన గ్రామంలోనే వ్యవసాయం చేస్తూయుంది. యుద్ధంతరువాతనే ఆమెపెండ్లి జరిగింది. ఆమె తండ్రి యుద్ధానికి పిలువబడ్డాడు. తను యుద్ధంలోకివెళ్లుతూ తమ నాయకుడు చెప్పిన మాటలు తన కుమారికి చెప్పాడు. "సోదరీమణులారా! మీరు యుద్ధభూమిలో పని చేసేకంటే వ్యవసాయం, పరిశ్రమలకొరకు పాటుపడితే హెచ్చు ఉపయోగం ఉంది." అని చెప్పిన మాటలువిని వ్యవసాయంలోకి దిగింది. అప్పటినుండి రాజకీయ, టెక్నికల్ పుస్తకాలు చదవడం మొదలు పెట్టింది. ఆమె వ్యవసాయపు ట్రాక్టర్ టిప్ టాప్‌గా యుంటుంది. 1941 సం॥లో ట్రేడింగ్ నేర్చుకొంది. ఆమె చూపిన శ్రద్ధవలన ఆమె మిషన్ బాగా పనిచేసింది. సమిష్టి క్షేత్రాలలోని భూమిని సుమారు 1647 ఎకరాలను సాగుచేస్తానని ప్రమాణం తీసుకొంది. ఈ పట్టుదలతో ఆమె 500 కిలోగ్రాముల పంటచెరకును సంపాదించినది.ప్రతీ సంవత్సరం శీతాకాలంలో ట్రాక్టర్లను బాగు చేయడం, కొత్తట్రాక్టర్లను నడపడం, వ్యవసాయ శాస్త్రంలో అభివృద్ధికరమైనవన్నీ నేర్చుకోడం చేసేది. ఆమె ట్రాక్టరునే తయారు చేయాలని పట్టుదలతో టెక్నికల్ పుస్తకాలు చదువుతోంది. ఆమె క్రితం సం॥రం 2,440 కిలో గ్రాముల గోధుమలు, వేలకొద్దిడబ్బు సంపాదించింది. ఆ ధనంలో భర్త ధనంతో ఆకుటుంబం అనేక కొత్తసరకులు కొన్నారు. దగ్గర యుండే పెద్ద పట్టణమునకు వెళ్లి బట్టలు కొనుక్కొంటూ కొన్నిరోజులు ఉండి; డ్రామాలు సినిమాలుచూచి, కొత్త, పుస్తకాలు, ఆటవస్తువులు, టెక్నికల్‌వస్తువులు కొనుకొన్నారు. ఇన్ని చేస్తూకూడ ఆమె వ్యవసాయంలో అమోఘంగా పనిచేస్తూంది. "నేను ఎప్పుడు ట్రాక్టర్ డ్రైవర్‌గా ఉండ దలచాను." అని గర్వంగా అంటుంది. ఈ విధంగా ఆమె తనకుటుంబానికి పనికివస్తోంది.

ఇంత అభివృద్ధి మనస్త్రీలలో లేకపోయినా, నీడను కూర్చొని పనిచేసే గృహపరిశ్రమలలోనైనా ముందంజవేయాలి. ఉపన్యాసకాలం కాదని గుర్తించాలి. ఉపన్యాసంతోపాటు పరిశ్రమలకూడ జరిపే రోజులివి. పరిశ్రమలు ప్రాజక్టులు మన దేశానికి లేవు కాబట్టి కుటీర పరిశ్రమలద్వారా మన ఆర్థిక సమస్యలను పరిష్కరించుకోవాలి. స్త్రీలుచేసే ప్రతీ కుటీర పరిశ్రమ సహకార సంఘాలద్వారా జరపాలి. లేసు అల్లడం కొమ్ములతో బొమ్మలుచేయడం, స్త్రీలకు కావలసిన టైలరింగ్ పనులు అన్నిచేయడం. అద్దకాలు, అల్లడం, మొదలైనవన్నిచేస్తూ వీలైతే వ్యవసాయ క్షేత్రాలుస్థాపించి, ట్రాక్టర్

ఉపయోగించటం, మొదలైనవి చేయడానికి కృషిచేయాలి. వీటిని చేయుటకుగాను ప్రతిమధ్యతరగతి స్త్రీ కృషిచేయాలి. షేర్లు కట్టుటకుగాను డబ్బు వసూలుచేయాలి. భర్తలకు నచ్చ జెప్పాలి. బాధ్యతగా నడిపించాలి. దురాశ, గర్వాలను విస ర్జించాలి. పూర్వపు చాదస్తాలను మానాలి. నాశనం అయిపోతున్న మధ్యతరగతి ప్రజలను కుటుంబాలను రక్షించు కోడానికి నడుములు కట్టాలి. కష్టపడితేనేగాని ఫలితం లేనందున కష్టపడాలి. ఫలితం వెంటనే చూడగలుగుతాం. శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మ, శ్రీమతి విద్యావతి వగైరా చదువుకున్న మహిళానాయకురాళ్లు, విరాళాలు పోగు చేసి, కేంద్రాలను స్థాపిండంకంటె, సహకార సంస్థలద్వారా ఆర్థికంగా మధ్యతరగతి కుటుంబాలను రక్షించే పద్ధతి ఆలో చించాలని ప్రార్థన. దీనికి వెంటనే ప్రత్యేకంగా కమిటీ ఏర్పరచి ప్రతిపట్టణ, గ్రామాలలో సంఘాలను నడపవలసిందని కోరుచున్నాను. లేసు పనిలో మిషనరీవారు సక్రమంగా పనికితగ్గ వేతనాలు యివ్వడం లేదని వినికిడి, వెంటనే సహ కార సంఘాలను ఏర్పరచి వారిపనికి రక్షణ యివ్వవలసిందని సూచన. ఈవిధంగా చేస్తే మధ్యతరగతి కష్టాలు గట్టు ఎక్కుతారు. మన మధ్యతరగతి స్త్రీలు కుటుంబ ఆర్థిక రక్షణకు పనికివస్తారని ప్రపంచానికి చెప్పే రోజుకొరకు ఎదురు జూస్తూయుంటా...



పెద్ద కథ

# ....“బొమ్మ....బొరుసు”

(‘Matter of Life and Death’ అనే ఇంగ్లీషు చిత్రము చూసిన తర్వాత కలిగిన భావాలతో వ్రాసిన రచన యీ బొమ్మ—బొరుసు కథ. సంపాదకురాలు.)

ఎన్నో మెట్లు ఎక్కి చివరకి పైమెట్టుమీదికి వచ్చాను. వెనక్కి తిరిగి చూస్తే ఒక్క మెట్టు కన్పించలేదు. నాకు అంతా ఏదో కలలాగ వుంది. ఎక్కడనుంచి వచ్చినది, ఎక్కడ ఉన్నదీ ఏమీ పాలుపోలేదు.

ఆ పరిసరాల్లో అంతటా చాలా చల్లగా హాయిగా వుంది. దూరాన మంచు శిఖరాలు కరిగి సెలయేళ్లుగా మెల్లి మెల్లిగా పారుతున్నై. ఓ మూలనుంచి అతి మధురమైన గానము వినవస్తూంది. మరొక వైపున ఓ సరస్సులో రెండు హంసలు మెల్లిగా యీదుకుంటూ పోతున్నై.

ఓ స్త్రీ రూపం...ఓ పురుషాకృతి...జంటలుగా,— చాలా జంటలు ఆ ప్రదేశమంతటా విహరిస్తున్నారు.

ఇంతలో ఓ పురుషాకృతి నా సమీపంగా వచ్చి నవ్వుతూ నిలబడింది....మరుక్షణంలో నేను ఆ పురుషాకృతి వెనువెంటనే బయలుదేరాను. త్రోవలో చాలా జంటలు మమ్మల్ని చిరునగవులతో పలకరిస్తూ పోతున్నారు.

నేను, ఆ పురుషాకృతి వెళ్లి, వెళ్లి ఓ సరస్సు ఒడ్డున కూర్చున్నాము. ఆ పురుషాకృతి చెప్పింది...“నా కర్మ పరిపక్వము అయి ఎంతో సుకృతం చేసుకున్న ఫలితంగా నేను యీ ఊర్ధ్వ లోకాన్ని పొందాను, అంతా సంతోషమేగాని, విచారమన్న మాట వుండదు,”—

ఆ తరువాత ఆ పురుషాకృతి అంది,—“అదిగో చూడు నీ పూర్వ చరిత్ర ఏలాంటిదో, నువ్వు యిక్కడకు ఎలా వచ్చావో.”

...మొట్టమొదట ఆ సరోవరంలో మా ప్రతిబింబాలు కన్పించినై. తరువాత రెండడుగుల వలయాకారంలో నీళ్లు పోయి దట్టంగా పొగమంచు కన్పడింది. మెల్లి మెల్లిగా ఆ మంచు విడిపోయి ఒక కంత ఏర్పడింది. అందులోంచి చూస్తే లెఖ్ఖపెట్ట లేనన్ని చలువరాతి మెట్లు కన్పించినై. మరుక్షణంలో ఆ మెట్లు మసక మసకగా అయిపోయి అన్నీ కింద స్పష్టంగా కనుపించడం మొదలు పెట్టాయి.

అదిగో జ్ఞాపకం వుంది.

మావూరే, అదిగో ముప్పనవారి సిల్కు మిల్లు, భారతం వారి డేరా సినిమా; అమ్మణ్ణి మూడంతస్థుల మేడ...

అప్పుడే కలెక్టరు కచ్చేరిలో రెండు గంటలు కొట్టారు. రోడ్డుమీద ‘నాన్ రొట్టి బిస్కట్’ వాడు కేకలు వేసుకుంటూ ఖాతా ప్రకారం మా యింటికి వచ్చి రొట్టెలు యిచ్చి వెళ్లాడు. మా అమ్మ ఎండపొడలో కూర్చొని. సుమతి శతకం చదువుతూన్నాను. ఇంతట్లో కాళ్ల మట్టెల చప్పుడు మాపిన్ని వస్తూన్నట్టు తెలియ చేసింది. “మీనా, బజారుకు వెళ్లి నాల్గు వందలు మల్లెపూలు పట్రా అమ్మా, యీ పావలా తీసుకొని వెళ్లి,” అంటూ పురమాయించింది మా పిన్ని. రాళ్లు ఏరడం మాని మా అమ్మ పిన్ని కేసి తల యెత్తి చూసింది. మా పిన్ని అమ్మ కేసి చూడనే లేదు. లేచి వెళ్లపోతుంటే, “బాగా బేరమాడి పుచ్చుపూలు లేకుండా ఏరి పట్రా,” అంటూ హెచ్చరించింది మాపిన్ని.

మండువా, శోభనాల గది, కచ్చేరి సావిడి, నడవా, వరండాదాటి, వీధి గుమ్మం దగ్గరకు వచ్చేటప్పటికి వీధి

శ్రీ శ్రీహరిరావు

గుమ్మంలో కూర్చొని, జాగ్రత్తగా కంతతాపడుతున్న మా అన్న, "ఎక్కడికి యీ ఎండలో?" అన్నట్టు ప్రశ్నార్థకంగా చూశాడు. "మల్లెపూలకి, రమణకు జడ కుట్టుందిట పిన్ని," అంటూ మెట్లుదిగా. ఇంటికి బజారుకు మైలు ఉంటుంది. పావలా గుప్పిట్లో గట్టిగా పట్టుకొని ఆలోచిస్తూ వెడుతున్నాను. కాళ్లు మండుతున్నై. కాస్త దూరంలో మర్రిచెట్టు నీడ. అక్కడకు వచ్చాక ప్రాణం లేచివచ్చింది. మళ్లీ చాలా దూరం ఎండ. తరువాత అయ్యరు హోటలు నీడ. బాగుంది.—ఎండ...నీడ...ఏమిటీ వీట్ల వింత కలయిక! నీడ అంటూ వుంటేగాని ఎండ రౌద్రము తెలీదు కాబోలు! "ఎండ...నీడ" చాలా గమ్మత్తుగా వుంది. పూలఅమ్మి కసిరికొట్టింది, "యింతటి పావలా బేరానికి పుచ్చులు, చచ్చులు, ఏరవచ్చిందయ్యా యీ గుంట," అంటూను...

పూలు తీసుకొని మళ్లీ ఆలోచిస్తూ యింటికి వస్తూన్నా. ఎంత ఆలోచించినా అర్థంకాదు. నేను, మా అన్న, మా అమ్మ, ఎందుకు మనస్సుల్లో తీవ్రబాధ అనుభవిస్తున్న దీని నా చిన్న మెదట్లో ఏమీ సమాధానం దొరకలేదు.

మాపిన్న రోజూ సాయంత్రం అయిదు గంటలకి వీధి అరుగుమీద సభ తీర్చుతుంది.

ఆ సభకి ఆమె అధ్యక్షురాలు. ఇరుగు పొరుగు ఆ సభకి హాజరు అవుతారు. ఆ సభలో అనేక విషయాల చర్చలు, తీర్మానాలు జరిగి పోతుంటై. దీపాలు పెట్టగానే సభ చాలించి ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్లిపోతారు. అధ్యక్షురాలి కాలిమట్టెలు లోపలికి వస్తాయి.

నాకు జ్ఞానం రాక పూర్వము మా సంసారపు సంగతులన్నీ యీ సభలద్వారా నాకు తెలిసినై. — ..."మా నాన్నగారు ప్లీడరీ పని చేసి చాలాడబ్బు, మంచిపేరు. గడించారని, ఆ రోజుల్లో మా అమ్మ బంధుకోటిని ఎంతో ఆదరణగా చూస్తూ, "మా సీతమ్మ, ఆ సీతా దేవేనమ్మా;" అంటూ నల్గుర్లోను కీర్తి తెచ్చుకుందని, అయితేనేం, మా అమ్మకి, (మా పిన్నిలాగే) గడుసుదనం, దాపరికం లేక సంసారం చితికి పోయిందని, నల్గురు కూతుళ్ల పెళ్లిళ్లు పురుళ్లు పుణ్యాలు, చేసేటప్పటికే సంసారం డీలా అయిపోయిందని, ఉన్నట్టు ఉండి మమ్మల్ని బీదవాళ్లగా చేసి మా నాన్నగా పోయారని, అప్పట్నుంచీ మా మేనమామ మమ్మల్ని పోషి న్నాడని".......................అంటూను.

మా అమ్మ మామూలుగా వంట చేస్తూంది. మా పి సభకు పోయింది. నేను మా అమ్మకు చేరువలోనే వసా కూర్చున్నాను. పైన రెండు రామ చిలుకలు పండబా కాయల్ని కొట్టూ పైపొట్టు నా మీద పడేస్తున్నాయి. దొడ్డి గోడ అవతల బోగంది (పుష్పారత్నం) హార్మోని శృతి వేసుకొని "ఓరోరీ, సరసుడా" అంటూ ఆ భించింది. గొల్ల అప్పడు, బొబ్బిలి పాటలు పాడుకుంట ఆవులకి కుడితి పెట్టూన్నాడు. తులశమ్మ అరుగుమీద— నేను తెచ్చిన మల్లెపూల వాలుజడ...నీలం పట్టుపరికి ఎర్ర టుపేటా గౌనుతో మాపిన్ని మనమరాలు రమ నాలాంటి వేషంతోనే మా అక్క మంగళ, గచ్చకాయ ఆడుకుంటున్నారు...

గచ్చకాయల ఆట ఆపి రమణదగ్గరున్న అణాకాసుతో "బొమ్మ...బొరుసు"...ఆట మొదలు పెట్టారు. వ అక్క తల్లో కూడ చిన్న మల్లెపూల దండ ఉంది పేరు రమణ, "బొమ్మ" అంటూంది; మా అక్క "బ రుసు", అంటూంది. ఎంతసేపు చూసినా "నాదేబొమ్మ" అంటూ రమణ కేరింతాలు కొట్టూంది. అయినా మా అక్క ఏమీ చిన్న పుచ్చుకోలేదు. అలాగే ఆడ్తూన్నారు.

ఆలోచించాను. నాకు మా అక్కకి ఎంత తేడా మ న్సుల్లో...మా యిద్దరికి దేంట్లోను పోలిక లేదు. అది దేని కాతరు పెట్టదు. ఒకళ్లు అంటే ఆవగింజ అంతయినా లె పెట్టదు. దేనికీ మనస్సులో బాధ పడదు. అసలు దాని మనసు అంటూ లేదేమోననే నా అనుమానం. మా అక్క అబ్బో! చాలా కోరికలు ఉన్నై. తర్చు మాఅమ్మ వేపించుకొని తినేది. అందరిదగ్గర నెత్తిబద్దలు కొట్ట తెచ్చుకొనే శక్తి చాలా ఉండేది. ఒకరు ఏమైనా అన కుంటారేమో అనే భయము ఎక్కడా వుండేది కాదు. మా యిద్దరికి ఎంత తేడా! —నేను, "మల్లెపూల దండ (చిన్నది!) పెట్టాను రావే," అని మా పిన్ని పిల్చినా

పట్టించుకోలేదు. నాకు తెలుసు—. నన్నూ మా అక్కని చిన్నతనం పర్వాలనే మా పిన్ని పూలు పెట్టానంటుంది. మా అక్కకి నాలాంటి పిచ్చిఊహాలు ఉండేవి కావు.

మా అమ్మ పులుసులోకి పోపు వేయిస్తూంది. పోపు వాసన చాలా కమ్మగా ఉంది. ఓ పక్కనుంచి రమణ తల్లీ మల్లె పూల వాసన, వెనకాల తోట అవతల భోగంవాళ్ల దొడ్లోంచి సంపెంగపూల వాసన బాగా వేస్తూన్నాయి. పోపు వాసన బాగుందా? పూల వాసన ఇంపుగా వుందా? అన్నది చెప్పడం కష్టం.

ఇంకా బొమ్మబొరుసు ఆట అవనేలేదు. "ఇంక చాలిద్దూ,...బొరుసు ఆట, నువ్వూన్నూ," అంటూ మా అమ్మ కేకలేసింది మా అక్కని వాళ్లిద్దరు లెక్క చెయ్యకుండానే యింకా, 'బొమ్మ...బొరుసు' అంటూ ఆడ్తూనే వున్నారు.

మా అమ్మ విసుక్కుంది; "బొమ్మ బొరుసూ," అనుకుంటూ. ఎందుకు మా అమ్మకి బొమ్మ...బొరుసు, అంటే అంత కష్టం.? నాకు తెలీలా. ఇంతట్లో, మా పిన్ని వాళ్ల సభ చాలించి లోపలికి వస్తున్నట్లు దూరాన్నించే మట్టెల చప్పుళ్లు చెప్పాయి.

మళ్లీ క్షణంలో, 'బొమ్మ...బొరుసు' పోయి మండువాలో దీపం కిందికి 'పార్కి' వారి ఆంధ్ర వాచకాలు చేతికి వచ్చాయి రమణకి, మా అక్కకీని.

రాత్రి పడుకొని ఆలోచిస్తూంటే సమాధానం దొరికింది—అవును.—మా పిన్ని తనకున్న భాగ్యం చూచుకొని మురుస్తుంది, అధికారం చలాయిస్తుంది. తన సొంత అక్క అయినా మా అమ్మని పైవాళ్ల ఎదుట ఎంతో అలుసుగా చూసి మా అమ్మ పొందిన బాధచూసి సంతోషిస్తుంది. మా అమ్మ పూర్వం ఎంత వైభవంగా వుంటేనేం.? అహఁ. తెలిసింది. మా పిన్ని "బొమ్మ." మా అమ్మ 'బొరుసు'! అందుకే మా అమ్మకి, "బొమ్మ...బొరుసు" అంటే అంతకించ. నాకు అనిపించింది—ఆసాళంగా లేచి వెళ్లి మా అక్కని, రమణని లేపి ఆచెంప, యీచెంప వాయిద్దామని—వాళ్ళ ఆటతో మా అమ్మని బాధపెట్టినందుకు.

ఇట్టే నాలో నాకే నవ్వొచ్చింది—'ఛా! వాళ్ల మొహం! వాళ్ల ఆట సరదా వాళ్లకేగాని, వాళ్లకేం తెలుసు? యింకోళ్లకి కష్టం కల్గిస్తున్నామని." నేనుకనుక ఆలోచించి సమన్వయించుకొని అర్థం కల్పించుకున్నాను గాని"— అని.

ఒక్కొక్కప్పుడు అనుకునేదాన్ని—"నాకు ఎందుకు ఇన్ని ఆలోచనలు, ఊహాలు, బాధ పడటం. చక్కగా, రమణలాగ నవ్వుకుంటూ, కేరుకుంటూ ఎందుకు హాయిగా వుండకూడదు అని. మర్నాటినుంచి నాతీరు నాదే.

రమణ, మా అక్క, సుశీల, కమల, అంతా నవ్వుకుంటూ గోల చేసుకుంటూ బడికి వెళ్లేవాళ్లు. నేనుమటుకు మా పినతండ్రిగారి వెనకాలే ఏదో ఆలోచించుకుంటూ వెళ్లేదాన్ని.

అంటే అంతచిన్న వయస్సులోనే నాకు మానసిక పరిపక్వము వచ్చేసింది. మంచికో చెడ్డకో! యిలాంటి ఆలోచనలతోటే తెల్లవారిపొయ్యేది.—మళ్లీ సాయంత్రం కాగానే క్రిందటిరోజు సంగతులే, "బొమ్మ...బొరుసు— ఇలా రెండేళ్లు గడిచాయి.

తరువాత మా అన్న కాలేజీ చదువుకు రాజమండ్రీ వచ్చేసాం. నాకు, మా అన్నకు ముఖ్యంగా, మా అమ్మకు ప్రాణాలు తెరిపిని పడినాయి. ఏదో వనవాసములోంచి బయటకు వచ్చినట్లు అనిపించింది. అయితే, మా అక్కకి మాత్రం ఏమీ తేడా కన్పించినట్లు తోచదు! దాని స్వభావానికి సరిపడ్డ పరిస్థితుల్ని అది అప్పుడే కల్పించుకుంది. రోజులు నెమ్మదిగా సాఫీగా జరుగుతున్నై. నేను, మా అక్క సదనములో చదువుకు చేరాము. మా అమ్మ అంటే యిరుగు పొరుగు ఎంతో ఆదరణ, అభిమానం చూపించేవారు.

సదనంలో మాస్టర్లు అంతా నేను అంటే ఎంతో అపేక్ష పడేవారు. ఒక్క సంస్కృతములో తప్పిస్తే మిగత వాట్లో అన్నిట్లోను నాకే మొదటి మార్కులు వచ్చేవి. మా అక్క చదువులో ఎప్పుడూ వెనకే. వాళ్లక్లాసు మాస్టర్లు మా

అక్కయ్యని కొప్పడేవారు,—"మీ చెల్లెల్ని చూడు, ఎంత బాగా చదువుతుందో, నువ్వు మటుకు ఒట్టి......" అంటూను. అని మటుకు ఎప్పుడైనా దేనికైనా కాతరు చేస్తేనా!

ఇలావుండగా మా అక్కకి ఎదురు మేనరికం యిచ్చి పెళ్లిచేశారు. కొన్నాళ్లు అవగానే మా బావ తీసుకొని వెళ్లిపోయాడు. అది వెడుతుంటే నాకు బావురుమని ఏడ్పు వచ్చింది, మా అమ్మకు మల్లేనే! కాని—మా అక్కకి ఏమీ మనస్సులో చలనం కన్పించలేదు—చాలా ఆశ్చర్య మయిన విషయము!

రోజులు సరిగ్గా వెడితే యింకేం కావాలి! మా అమ్మకి ఉన్నట్టుండి చాలా జబ్బుచేసింది. రోజుకురోజు గడవడం చాలా దుర్భరమయ్యేది. డాక్టరుగారు ఎంతో మంచిఆయన దొరికారు. చాలా శ్రద్ధగా మందు యిచ్చేవారు. మా పరిస్థితిక్ ఎంతో జాలిచూపేవారు. అయితే—రోజూ వచ్చి చూసివెళ్లేటప్పుడు మాత్రం, "అమ్మాయీ జట్కాకి ఆరు అణాలు యియ్యి అమ్మా," అని తీసుకొని వెళ్లేవారు. ఆయనకు తెలుసు మేము ఎంత లేనిస్థితిలో వున్నది, యిరుగు పొరుగు దగ్గర బదులుతెచ్చి యిసున్నాన్న సంగతీని. అయినా ఆయన తీసుకొనేవారు! అప్పుడు ఆయనలో మానవత్వం మాయమయ్యేదేమో!

ఈ రోజుల్లో తరుచు ఎరిగినవాళ్లదగ్గరకి చేబదుళ్లకు వెళ్లవలసి వచ్చేది. ఎంతరక్తం పంచుకున్న చుట్టాలయినా, మా అమ్మచేత లెఖ్ఖలేనన్ని సార్లు మనిషి సహాయం పొందిన వాళ్లైనా, అవసరం వచ్చినప్పుడు—వెధవ ఒకటి రెండు రూపాయలు బదులు యివ్వడానికి ఎంతో క్రుంగిపొయ్యే వారు. "మీబావ యింకా క్యాంపునించి రాలేదే, మీనా!"—అంటూను. అక్కడకి రెండు రూపాయల్లో ప్రాణాలు కాస్తా గుటుక్కుమనేట్టు.

ఎంతో నిస్సహాయ స్థితిలోఉండి, అడగలేక, అడి? వాళ్లకి ఎంత దగ్గర బంధువులు అయినా బదులు యివ్వరు, యివ్వలేరు. చక్కగా పూసుపోక కబుర్లు పదివాగి, ఉబ్బేసి, పూర్తిగా ఎగకొట్టేవాళ్లకి ఎంత సంతోషంతో యిస్తారు—వేలకువేలు అప్పులు. ఇది ముమ్మాటికి సత్యం—ఏమీ అంటే, యిదొక ఆచారము, పరిపాటిన్నీ.

మా అమ్మకు జబ్బుగావున్న యీ యిరవై రోజులు, మేము ఉన్నయిల్లు రోజూ కిటకిటలాడి పొయ్యేది. మా శాఖవాళ్లు అంతా, మా అమ్మకి ఎలావుందో అని చూచిపోడానికి వచ్చేవారు.

పెద్ద చిక్కువచ్చి పడ్డది. డాక్టరుగారు మా అమ్మని ఎక్కువ మాట్లాడించవద్దు అంటే, యీ వచ్చిన అమ్మ లక్కలు అందరూ మా అమ్మచేత ఒక ముక్కకి పది ముక్కలు మాట్లాడిస్తేనే కాని తృప్తి పొందేవారుకారు. వీళ్లందరికీ పెద్ద భయం పట్టుకుంది.—కడసారి పిల్ల, దీనికి పెళ్లి అవకుండానే, మా అమ్మకు యింత జబ్బు చేసిందే—అని.! వీళ్ల యీ మాటల్తోటి మా అమ్మకు ఎక్కువ అయ్యేది.

అనుకునేదాన్ని—'యివాళ ఎవర్నీ చూడ్డానికి రానియ కూడదు' అని. అయితే సాయంత్రం పురాణం వేళకి అందరూ తయారు. నేను ఏమీ చెయ్యలేక పొయ్యే దాన్ని. అవును—'ఓ వ్యక్తి అ దర్పాలు, అభిప్రాయాలు, ఎంత ఉన్నతమైనవైనా సంఘానికి ఉండే శక్తి ముందు. ఏపాటి!

ఎలాగైతేనేం కొన్నాళ్లకి మా అమ్మకి బాగా తగ్గి పోయింది.

(సశేషము)



# ప్రఖ్యాతవ్యక్తులు

## పూజ్యశ్రీ గిడుగు పంతులుగారు

సంస్కృతీ శృంఖలా బద్ధమై, కోరకుబడని కైవారాల భాషలో సాహిత్య పరమ ప్రయోజనాన్నే విస్మరించి వ్రాయబడ్డ గ్రంథాలు సామాన్య జనుల ఆదరాభిమానాలు చూరగొనలేక పోవడంవల్ల, భాషకు సంప్రాప్తించిన దుస్థితిని బాపి తనవారైన సామాన్య జనుల బాంధవ్యాన్ని సమకూర్చి మనకూ, మన భాషకూ, వినలేని మహోపకారంచేసిన మహనీయుడు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు.

శ్రీ రామమూర్తి పంతులుగారు క్రీ. శ. 1863 సం॥ విశాఖ జిల్లా పర్వతాలపేటలో జన్మించారు. వీరి తాతముత్తాతల స్వస్థలం తూర్పు గోదావరి జిల్లాలోని "ఇందుపల్లి". ఒకప్పుడు ఇందుపల్లిలో పంటలు పండక పస్తులు పడి, చెడి వీరి పూర్వులు విశాఖ జిల్లాకు కాపురం వెళ్లిపోయారు. పంతులుగారి తండ్రి వీర్రాజుగారు. విజయనగర సంస్థానానికి చెందిన తాణాలో "సముద్దారు"గా పనిచేస్తూ వుండేవారు. పర్వతాలపేటలో ఆ నాటికి వీధిబడ్లు లేకపోవడంచేత పంతులుగారు శ్రీ వారణాసి గున్నయ్య శాస్త్రిగారి దగ్గర విద్య నభ్యసించారు. రాత్రి సమయంలో తండ్రిగారి దగ్గర కూర్చొని భారత రామాయణాది మహా కావ్యాల గురించి తెల్సుకొంటూండేవారు. "చిన్ననాడు నేర్చిన బాలరామాయణంలోని కొన్ని భాగాలు నాకింకా గుర్తున్నవి," అని వారు వృద్ధదశలో కూడ ఒకప్పుడు చెప్పారు. 1875 సం॥ తండ్రి వీర్రాజుగారు స్వర్గస్థులవడంతో తల్లితో సహా విజయనగరంలో కాపురంపెట్టి శ్రీ కాళ్లకూరి విశ్వనాథం గారి దగ్గిర ఆంధ్రాంగ్ల విద్యలభ్యసించి, తరువాత మహారాజావారి కాలేజిలో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయారు.

ఆర్థిక దుస్థితుల బలవత్ ప్రోద్బలంవల్ల పంతులుగారు అంతటితో చదువు చాలించి ఆరు నెలలపాటు విశాఖపట్నం కలెక్టరాఫీసులో గుమాస్తాగా పనిచేశారు. తరువాత 1880 సం॥లో అనుకుంటా—పర్లాకిమిడి పాఠశాలలో పంతులుగా ప్రవేశించి 1910 సం॥ దగిమిలా వరకూ రమారమి 30 సం॥ పని చేశారు. ఉద్యోగం చేసేరోజుల్లోనే పంతులుగారు బి.ఏ., పరీక్షలో కృతార్థులయారు. పర్లాకిమిడి పరిసర ప్రాంతాలలో వున్న కొండలలో "సవర"లనే ఒక తెగ విద్యాగంధం లేని పశుప్రాయులు నివసిస్తూండేవారు. వారికి బడులు పెట్టించి విద్యాబుద్ధులు చెప్పించాలనే అభిలాష పెద్దది కాగా, 1892 సం॥ ప్రాంతాల్లో పంతులుగారు 'సవరభాష' అభ్యసింప పూనుకొన్నారు. తమవద్ద ప్రాడిగం చేసే "తేడు" అనే పేరుగల ఒక కొండవాడి దగ్గర్నుంచి సవర పదాలూ సవర పాటలూ నేర్చుకొన్నారు. ఈ విధంగా ఆ జాత్యభ్యున్నతికీ, వారి భాషా వికాసానికీ ఎంతగానో కృషి చేశారు; ఫలితం సాధించారు కూడా! సవరలకు బడులు స్థాపింప బడ్డాయి; వారు నాగరకులు కావడానికి వలసిన ఇతర సాధనాలున్నూ ప్రయోగింప బడ్డాయి—కాని, ఆ కొండలలో తిండీ తిప్పలూ లేకుండా, ఎండా వానా అనకుండా తిరగడంతో పంతులుగారికి 'మలేరియా' జ్వరం తగిలింది. క్వినైన్ మందులు వాడడంతో మలేరియా అయితే తగ్గుముఖం పట్టిందిగాని—తగని చెవుడు మటుక్కి వారికి సంప్రాప్తించింది.

సజీవమైన ప్రతి వస్తువూ మారుతుంది; అట్లా మారకపోతే దాని సజీవత్వాన్ని అది రుజువు చేసుకోలేరదు. అదేవిధంగా సాహిత్యం కూడా! సజీవ భాషలుకూడా

వాగ్దేవ శ్రీ జోగిపంతులు

ఆనాటి కానాడు మారుతూంటాయి; మారాలికూడా! నన్నయనాటి తెలుగు భాష ఏ మార్పులూ లేకుండా అలాగే వుండనడం అవివేకం. కాల చక్ర గమనంతో ప్రజల అభిరుచుల్లో కూడా ప్రస్ఫుటమయింది. గతంలోకి మళ్లే గ్రాంధికాన్ని గౌరవించడం మానారు. వారిలో కలిగిన ఈ విపరీత పరివర్తనాన్ని ప్రాచీన సంప్రదాయాన్ని పట్టుకు వేళ్లాడే పండితులు మాత్రం కానలేకపోయారు. లక్షణ విరుద్ధంగా గ్రంధాలు రచించ కూడదన్నారు.; నెత్తి మొత్తుకున్నారు. అయినా వ్యావహారిక భాషా వాదులు, గ్రాంధిక భాషా వాదుల్ని బలంకొద్దీ వెనక్కు నెట్టి పురోగాములై, సంఘానికీ, సాహిత్యానికీ, మహోపకారం చేశారు. వారిలో గిడుగు పండితుడూ, అప్పారాయ మహాకవీ గణ్యులు. "గిడుగు పండితుడు మహాయుద్ధాలు చేసి త్రోవ సరిచేస్తే—గురు జాడ మహాకవి వ్యావహారిక భాషా రథాన్ని ముందుకు నడిపించుకు పోయారు." ఈ సందర్భంలో పంతులుగారు వ్రాసిన "ఆంధ్రపండిత భిషక్కుల భాషా భేషజము" అనే గ్రంధ సాహితీ పిపాసకులంతా చదివి తీరవలసిందే!

పంతులు గారికి 1915సం॥ శ్రీ చెళ్లపిళ్ల శాస్త్రిగారి పరిచయం ఏర్పడింది. తమ వ్యావహారిక భాషా వాదం నిలబెట్టుకోడానికి పంతులుగారు వాగ్యుద్ధాలు చేస్తూ ఊరూరా తిరిగే వారు. వచన రచనకి వ్యావహారిక భాషా వరవడి పెట్టుతుందని శ్రీ చెళ్లపిళ్ల కవి వాడుకభాషలో తమ వచన రచన సాగించడం మొదలుపెట్టి పంతులు గారికి పరమానందం కలిగించారు. 1919 సం॥లో పంతులుగారు "తెలుగు" అనే మాస పత్రికకు సంపాదకుడుగా వుంటూ తమ వాదాన్ని ప్రచారం చేసేవారు. 1926 సం॥లో పంతులుగారు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి కృత్రిమ భాషా ప్రయోగాలు ఎత్తి చూపించి ఆంధ్ర సాహిత్య పరిషత్ సభలో "గిడుగు పిడుగు" అనిపించుకొన్నారు.

1933 సం॥ రాజమహేంద్రవరంలో పంతులుగారి 'సప్తతిపూర్తి' బ్రహ్మాండంగా జరిగింది. అప్పుడువారి రచనలన్నీ సంపుటాలుగా ప్రచురించ బడినవి. వాటిలో 'బాలకవిశరణ్యం,' 'వ్యాసములు' ముఖ్యములు.

ఆనాటి కానాడు పెద్దతనం రావడంతో జవసత్వాలుడిగి పోసాగినవి. కాని సాహిత్యం మీద వుండే అపారమైన ఆసక్తి మాత్రం వారికి వదల్లేదు. 1939 సం॥లో కూడా అప్పుడప్పుడు వెంకట శాస్త్రిగారిని కల్సుకొంటూండే వారు.

చివరకు 1940 సం॥ జనవరి 30 తేదీన తమ 77వ ఏట పంతులుగారు కీర్తి శేషులయారు. వారి మరణంతో ఆంధ్ర సాహితీ సీమనుండి ఒక మహాజ్యోతి దిగ జారిపోయింది. ఆంధ్ర సాహిత్యంలో శిష్ట వ్యావహారి కానికి విశిష్టమైన వెలుగుబాటలు వినిర్మించిన ఒక మహా నక్షత్రం ఆంధ్ర సాహితీ విహాయసం నుండి అదృశ్యమై పోయింది.

ఓం శాంతి! శ్శాంతిః! ! శ్శాంతిః!!!



# ఇదే కల

**※ శ్రీ జగం ※**

'ఉష' పత్రికలో పని. పదకొండు గంటలకు ఆఫీసు టైము. అయినా ఏదైనా వ్రాసుకోడానికి ప్రొద్దుట కాఫీ త్రాగి ఆఫీసుకు పోవడం అలవాటు. చాల రోజుల్నించి అలానే వస్తూవుండేవాణ్ణి. ఏదో ఓ కథ వ్రాసి తిరిగి యింటికి పోయేవాణ్ణి.

ఆషాఢమాసం వచ్చింది. ఆకాశంలో మేఘాలు నిరాటంకంగా ప్రయాణాలు సాగిస్తూ, ఏ విరహి విరహగాథనో ప్రియురాలికి ఎరిగించి, వాని కన్నీటి ధారలను ఆమె ముందు కురిపించి పోతోన్నట్లు అనిపించింది.

క్రొంగొత్త జంటల హృదయానందాన్ని ఈసారి ఈ అధిక ఆషాఢం వచ్చి మరింత అణగద్రొక్కింది. ఎన్నాళ్లిగానో మనస్సుల్లో యువ్విళ్లూరిన యావ్వన కేళికి ఈ పాడు ఆషాఢ మాసాలు అంతరాయం కావడం ఎంత ఘోరం? తీరీ తీరని వాంఛలతో ఒకరికొకరు దూరమై, నూతనానుభూతి మూలంగా ఏర్పడిన సుఖసంతోషాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ దురపిల్లే స్థితి ఏర్పడడం చాలా బాధాకరం.

అందుమూలంగానేమో ప్రకృతి అలాంటివి యోగుల హృదయ వేదనలను ఈ మేఘాల దౌత్యంతో కొంత ఉపశమింప జేయ పూనుకుందేమో!

ఆఫీసులో కూర్చుని, కిటికీనుండి ఎదుటి ఆకాశాన్ని చూస్తూ—యిలా ఆలోచిస్తూ—సిగరెట్టు మీద సిగరెట్టు తగలవేస్తూ—మతిని ఉద్రేకపరచ ప్రయత్నించాను. కాని ఆ వుద్రేకానికి మారు అతిగా పొగ పీల్చడంవల్ల తల తిరిగి పోయింది. మైకంతో కళ్లు మూతలుపడి, మనస్సు వికారంతో బాధ పొందింది.

అలాంటి సమయంలో మెదలకుండా కళ్లు మూసుకుని వుండడమే వుత్తమం. కళ్లు సగం మూతలు పడుతూంటే నేను బలవంతంగా పూర్తిగా మూసుకుని, కుర్చీకి జేరగిలబడి కొంచెం విశ్రాంతి తీసుకో ప్రయత్నించాను. నేనెంతో శ్రమపడకుండానే ఎందుచేతనో ఈసారి నిజంగా నిద్రే వచ్చివేసింది...

టీ షాపులో టీ త్రాగి, కిళ్ళీ కొట్టువద్ద కిళ్ళీ వేసుకొని సిగరెట్టు కాలుస్తూ, మెయిన్‌రోడ్డున ఆఫీసుకు పోతూన్నాను. ఆ ప్రక్కకూ—ఈ ప్రక్కకూ మరలుతూన్న నా చూపులు అకస్మాత్తుగా ఫుట్‌పాత్‌కు అనుకుంటూ వస్తూన్న ఓ అమ్మాయి మీదకు వాలినై. ముక్కుపొడి రంగుతో మిశ్రమమై బంగారురంగు జీరలతో నున్న కోక. కంటికి తీర్చిదిద్దిన కాటుక, చిట్టి పెదవుల చిందులాడే నవ్వులు, అన్నిటికీ మించిన సొగసు ఆ అమ్మాయి నడక. ఆ ఒయ్యారమైన నడక చట్టున ప్రబంధకారులను జ్ఞప్తికి తెచ్చింది. హంస గమనమని వారు వర్ణించేది యిట్టి నడకనేమో అనిపించింది. ఆమె తీరు చూడగానే, బడిలో పంతులమ్మ పని చేస్తుందని వెల్లడైపోతుంది. పైట చెంగును నడుముకుచుట్టి దోపుకుంది. అందు మూలంగా ఆమె నడుమూ ఆమె సొగసుకు వన్నెగూర్చేదిగానే వుంది. చాలా తక్కువ వయస్సే!

నేను ఆఫీసుకు పోతూన్నాను. ఆ అమ్మాయి బడికి పోతుంది. నేను యింటికి పోతూంటే ఆ అమ్మాయి కూడా యింటికి పోతుంది. దారి ఒకటే. మధ్య దారిలో కలుసుకునే వాళ్లం. నా ఓంక వింతగా చూచేది ఆమె. నేనూ ఆమె ఓంక వింతగా చూచేవాణ్ణి. ఆమె తలవంచుకునేది. నేనూ తలవంచుకునేవాణ్ణి. ఒకరిని ఒకరం దాటిపోయే వాళ్లం.

నా చిన్నతనంలో చదువుకున్న బడి మా ఇంటికి దగ్గర. ఆ బడిలోనే మా వీధిలోనివాళ్లంతా కొంత కొంత వరకైనా చదువుకున్నవాళ్లే. మా మేనమామ కూతురు బడిలోకి వెళ్తుంది. వాళ్ల యిల్లు బడికి మరింత దగ్గర.

ఇంటికి పోతున్నాను నేను. మా అత్త పిలిచింది. బేబీని తీసుకువెళ్లి, బడిలో అప్పజెప్పి, చదువు సరిగ్గా చెప్పమని చెప్పమంది పంతులికి.

బడిదగ్గరకు వెళ్లాను. కిటికీదగ్గర నిలిచాను. లోనకు చూస్తూ పంతులుగారితో ఈ విషయం చెప్పాలనుకున్నాను.

కాని తీరానూ కై—తీవిగా కుర్చీలో కూర్చుని, చేతిలో బెత్తం ఆడిస్తూ ప్రత్యక్షమైంది పంతులమ్మ. ఇంతకూ ఆ పంతులమ్మ మరెవరుకూడా కాదు. రోజూ దారిలో ఎదురయ్యే ఆ అమ్మాయే. ఆశ్చర్యంతో నిలచిపోయాను.

మా జేబీ పలకమీద 'అ ఆ 'లకు బదులు అందమైన ముగ్గులు ఎలా వస్తవో దుకూహ్యం. ఈ విషయమై గోడతో మాట్లాడినట్లు మాట్లాడాను. ఆమే ఆ గోడకు సమాధానం చెప్పినట్లే చెప్పింది: 'సరిగా సమయానికి బడికిరాదు. చదువుచెప్పడం ఎలా!'

ఈ ప్రశ్నకు జవాబు—'వచ్చిన సమయంలోనైనా అక్షరాలు చెప్పినట్లు కనిపించదు. పలకమీద ముగ్గులు ఎలా వస్తున్నవో!'

వచ్చే నవ్వును ఆపుకుంది. నేను వెళ్లిపోదామనే వుద్దేశ్యంతో—'కొంచెం శ్రద్ధతో సరిగా చెప్పాలి.' అన్నాను.

జేబీనిచూస్తూ—'ఇలా దగ్గరకువచ్చి కూచో!' మధ్య కొంత వ్యవధియిచ్చి—'అలానే చెపుతాను' అంది. మొగం తిప్పుకొని నవ్వుకుంది.

ఇంతకూ ఆ చెప్పడం జేబీకికాదు. నేను దగ్గర కూర్చుంటే నాకు చెప్పుతూంది చదువు. నాకూ నవ్వు వచ్చింది. నవ్వుకొని నేను వచ్చివేశాను.

*　　　*　　　*

'ఇదేమిటీ! నిద్రలో నవ్వుకుంటున్నారు. లేవండి! లేవండి!! ఆఫీసు ఊడ్చాలి' అంది చీపురుకట్ట చేత బట్టుకొని వ్రాడ్చు మనిషి. త్రుళ్లిపడి లేచాను. కళ్లు నులుముకున్నాను. కలం, కాగితాలు వ్రాయసుమీదనే వున్నయ్. నిద్రమూలంగా వికారం తలత్రిప్పు తగ్గింది. కాని ఈ మధురస్వప్నం యిలా భగ్నమైనందుకు కొంచెం మనస్సు నొచ్చుకున్నా. అది తలపునకు వచ్చి నవ్వకుండా వుండలేకపోయాను. పకపకాన నవ్వాను.

వారెవ్వా! ఎంత మధురం! నాకు చదువు చెప్పుతూంది!—నిజంగా అంతకన్నా నాకు కావలసింది ఏముంటుంది? ఎప్పుడూ నవ్వుతూ—ఎదుట కూర్చుని, ఆ మొగంలోని సౌందర్యాన్ని, ఆ కాటుక కన్నుల కాంతి చూపుల్ని, ఒయ్యారమైన ఆ నడకని, ఆ చిట్టి పెదిమిల మీద ప్రసరించే హాసాన్ని, చూస్తూ చూస్తూ, తీయటి గొంతుతో చెప్పే పాఠాన్ని వల్లిస్తూ ప్రపంచంలోని దుఃఖాల్ని, యింతవరకూ నేను పొందే దుర్భర జీవితయాతనా భారాన్ని విస్మరించి, స్వర్గ సుఖాన్ని పొందకపోయేవాడినా?

కాని ఏం ఫలం? ఇది కల! ఒట్టి కలమాత్రమే. అందులోనూ పగటికల. ఆమాత్రం ఆశ పొందడానికైనా వీలులేని పగటికల. కనుకనే అసలు అలాంటి పంతులమ్మ అనేదే ప్రపంచంలో పుట్టివుండదేమో నను కుని మనస్సును వూరట పెట్టాను. కథకు మారు ఈసారి ఈకలను గూర్చే మీకు చెప్పాను. మీరు మరోవిధంగా భావించకండి. ఇది కల! ఒట్టికల మాత్రమే సుమండీ!—



# పరాధీన!

## ❋ సూరంపూడి భాస్కరరావు ❋

పసిగుండె భరముతో బడలిపోయినది!
చిరుగుండె సిగ్గుతో చివికిపోయినది!
వలదోయి మాధవా వలదింత కరుణ!
నిరుపేద గళమునందేల కౌస్తుభము? ॥పసి॥

నిర్ధనను సామి నే నేమీయగలను?
కరుణింపకయ్యా, నేపరదాసినయ్యా
నిదురించు కోర్కెల కదలించకయ్యా
మోయలేనయ్యా ఈ మోహ భారమ్ము ॥పసి॥

యమునా సరిత్తీర రమణీయ తలిని
నిమ్మకుసుమ కేళనై నిలుచున్న వేళ
మృదుహాస్తములు నెత్తురదుముకొంచీవు
మొగలిరేకులు తెచ్చి ముడిచినయపుడె ॥పసి॥

మొగలిరేకులు తెచ్చి ముడిచినది చాలు!
కౌస్తుభమ్మిపుడేల గళమునవైతు!
ఒడలెల్ల పుల్కలై పడిపోవు నన్ను
పట్టుకొనవమ్మ దేవ పడిపోవనిమ్ము ॥పసి॥



# కవికలంలో కలకలం

శ్రీ కాశీభొట్ల సూర్యనారాయణ శాస్త్రి

'శరత్కాలపూర్ణిమ తల విరియబోసుకుని ముసిముసి నవ్వులతో ప్రపంచమంతా పసిడినిగ్గుల ముగ్గులు పెడుతోంది. చంద్రుడు కొండమీద కూర్చుని 'ముగ్గులు మాఘేషుగ్గా వున్నాయ్' అంటూ పకపకా నవ్వుతూ, పండువెన్నెల కాస్తున్నాడు. చుక్కలు తనచుట్టూ తిరుగుతూ 'జాగ్రత్తా! చక్కలగింత పెడతాం' అన్నట్టుగా కల్పిస్తూ సరసాలాడు తున్నయ్. ప్రక్కనున్న సన్నజాజినిండా వెన్నెల కురు స్తోంది. చుట్టూ పన్నీటి వాసన్లు చుట్టుకుంటున్నయ్. చల్లటి పిల్లవాయువులు సమయం దొరికిందికదా, అని పూలమొక్క లను కౌగలించుకుని పుష్పాలను ఆడిస్తున్నయ్. అప్పుడే చల్ల గాలి చేరువలోనున్న సరోవరం మీదనుంచి సన్నగావచ్చి సరసు వదనాన్ని దూసింది. ఆగాలికి ఆమె ముంగురులు చెదరి ఫాలస్థలంమీద నాట్యమాడుతున్నయ్. ఇంతట్లోకే ఆమెదృష్టి అప్రయత్నంగా నైట్‌క్వీన్ మొక్కవైపుకు తిరిగింది. సరసు అట్లాగే చల్లగాలిలో పడుకుని పండువెన్నెల తింటూ, జాబిల్లికి కళ్లప్పగిస్తూ, తనభర్త అనంతం, యింకా రాకపోవటానికి కారణమేమిటా అని, ఆలోచిస్తోంది. మధ్య మధ్య కన్నీళ్లు కారుస్తూ చీరె చెంగుతో కళ్లుతుడుచు కుంటోంది..., అంతే—

రాంబాబు రాసేకథ అంతవరకే అయింది. గబగబా పరు గెత్తవలసిన కలంపాళీ పట్టుపట్టి ఆగిపోయింది... కారణం?

రాంబాబు రాసేకథలు రజ్జుగానే యుంటాయని అందరికీ తెల్సు. గద్య పద్య రచనలలో 'శృంగారకవి' అని మెప్పు బడసినవాడే. ప్రతీవాడూ పుస్తకం తెరచి, అతనికథ చదివి తీరితేనే గాని మరొక కథకి మనస్సప్పగించడు. రాంబాబు రాసేకథ పూర్తికాలేదు. హృదయం బరువుగావుంది. ఉద్దే శ్యాలు పూరటంలేదు. భావాలు పైకి పొంగటంలేదు. ఆవేశం కుంటుపడింది. ఎడారిమీద నీళ్లబొట్టుమాదిరిగా ఉత్సాహం అసలే శూన్యం.—ప్రకృతి మాత్రం ప్రశాం తంగానే ఉంది. వర్ణించటానికి తగిన వాతావరణం వక్రించింది అతని మనస్సులో. తిరిగి కలంతీసి కాగితం మీద పెట్టాడు. కదలలేని పరిస్థితుల్లో ప్రఖ్యాత అక్షరంకోసం తపించిపోతోంది ఆకలం.

బుఱ్ఱలో ధరించరాని ఆటంబాంబు లాంటిధ్వని—హృద యంలో ఊరుముల ప్రోత—అర్థంకాని ఆందోళన— అదో ప్రవాహప్రహోరు—తాళలేకపోయాడు రాంబాబు. కుర్చీని ప్రక్కకువత్తిగించుకుంటూ ఒణికిపోయే ఒడలును టేబిలు మీదకు వంచాడు. కళ్లు చెమ్మగిల్లిపోతున్నాయ్. కొలకులు నిండా నీళ్లు నిండాయి. మెదలకుండా కళ్లు మూసుకుని టేబిలుమీద పడుకున్నాడు.

పావుగంట పరిగెత్తింది కాలం. నాలుగుమంచు బిందువులు అతని వదనంమీద పడి అతన్ని మేల్కొల్పి వుంటాయి. మూర్ఛపోయిన మనిషిలాగ పిచ్చిగాలేచాడు. వరండాలో నుంచి యింటివైపు తొంగిచూచాడు. ఏమీ తోచిందికాదు. విసురుగా నడిచివెళ్లాడు. దగ్గరగా నొక్కివున్న తలుపులను కాళ్లతో డబాయించి తన్నేడు గట్టిగా. తిన్నగా పడకగది లోకి వెళ్లి నుంచున్నాడు. కడుపులోనుంచి కెరటాలహోరు తన్నుకొస్తోంది. చూరునుంచి కారే వానచుక్కల్లాగ కళ్లంట నీళ్లు కారిపోతున్నాయి.-కారణం?; అక్కడ యేముంది?-

తన పెళ్లిపోటో గోడకి తగలబడివుంది. ఆ తలంబ్రాల వస్త్రాలూ—ఆచామంతిపూల చమ్కీహారాలూ—8-2-47 ఆ పెళ్లితేదీ: అవన్నీ చూచేసరికి: ఆ వివాహసమయం— ఆ మంగళధ్వనులూ— ఆ వైదిక మంత్రోచ్చారణలూ— ఆ తలంబ్రాలు పోయటం—ఆ దండలు వేసుకోవటం— అప్పటి తనప్రియురాలి క్రీగంటి చూపూ—ఆ సూత్రధారణ మొదలైన వన్నీ జ్ఞాపకం వచ్చివుంటాయ్. మరొకశోక తరంగం హృదయాన్ని చీల్చుకొచ్చింది. రామం మంచంమీద బోర్లపడ్డాడు. అవన్నీ తలుచుకొంటూవుంటే ఇంతట్లోకే అతని ప్రాణస్నేహితుడు యీఖంగారంతా విని గబగబా పరుగెత్తు కొచ్చాడు తలుపులు తెరుచుకొని;

'ఏరా! రామం!! ఏమిటి ఈ వికారం?' అంటూ రాంబాబును కుదిపాడు. లేవలేదు రాంబాబు. ముఖంమీద

తాసిని కీస్లు చల్లాడు. మరికొంత సేపటికి లేచికూర్చున్నాడు రామం.

'రామం ? ఏమిటిరా హడా విడిచేస్తున్నావ్ ?'

మాట్లాడటం లేదు రామం.

'నేను చెప్పలేమా ! ఇంకా యేముంటుంది కారణం ! అర్ధరాత్రివేళ పుట్టే అసాధ్యపు ఆలోచనలకు అంతుంటుందా? ఒంటరి జీవితానికి ఓపికా, ఓర్పూ వుండొద్దూ ! హద్దులేని అకాల ప్రవాహం ఒక్కొక్కప్పుడు యిట్లాగే నెట్టుకొస్తుంది. కాస్తా కూస్తా నాలుగేండ్లవుతోంది మణి మాన్యాల కోసం దుబ్బలాడి, మల్లెపూవులాంటి యిల్లాల్ని వదిలేసి నీజీవితానికి మచ్చ తెచ్చుకున్నావ్. మాలాంటివాళ్ల హితవాక్యాలు నీ మతిని మళ్లించలేక పోయాయి. అందులో నీఒక రచయితవు. నీకొకళ్లు చెప్పాలా ?—చెయ్యాలా ? సమస్త విషయాలూ తెలిసివున్న వాడివి. అయినా యీకవిత్వం పిచ్చక్రిందే మైనా పరిణమించిందేమో !

'నేనింకా బ్రతుకలేనురా జయరాం !'

'నీమొహం ! నువ్వు బ్రతుకలేక పోవటమేమిటి ? నీకు నువ్వు ఆయుర్దాయం పోసుకున్నావా ? నిన్ను పోతపోసి పుట్టించిన ఆబ్రహ్మకే తెలియాలి నువ్వు బ్రతకవలసిందీ లేనిదీ.

'జయరాం ! వుండు. ఇంకో వికార ప్రవాహం వచ్చి నన్నీడ్చుకు పోతోంది. నేనింకా నిల్చోలేను. ఈ శరత్వెన్నెలలు నన్ను చీవాట్లు పెడుతున్నాయ్. ఆచందమామ నా కాఠిన్య హృదయాన్ని చూచి వెటకారంగా నవ్వుతున్నాడు. ఈ క్రిమి కీటకాదులు నన్ను చూచి కోలాహలం చేస్తున్నయ్! ఈ చుట్టూవీచేవి పిల్లగాలులుకావు—నామగతను పోగొట్టే మంచిగంధపు వాయువులు. ఉండూ ! చూశావా ; చంద్రుడు తన శీతకిరణాలతో నన్ను పొమ్మని పొడుస్తున్నాడు. వెళ్లక పోతే నన్ను చంపుతాడేమో ! మారుడు తనవిల్లుతో నా మనస్సులో గ్రుచ్చుతున్నాడు. నా మెదడులో యేదో పెద్ద ధ్వని బయలుదేరుతోంది. ఈ పాపిష్టి ప్రపంచంలో యీ కపట జీవితాన్ని గడపలేను. నేనింకా ఒక్క నిమిషం కూడా వుండలేను. పోవాలి ; నా దుర్గదగ్గరకి పోవాలి. క్షమించమని వేడుకోవాలి. నువ్విక్కడే...వుండు ' అంటూ ఉన్మాదుడులాగ వురికెత్తుక పోయాడు అక్కడనుంచి రాంబాబు. అప్పటికి వూరంతా మాటుమణిగింది. అప్పటికి పది కొండు గంటలు మటుక్కు అయివుంటుంది.

రాంబాబుకు యిరవైయో యేటనే వివాహమైంది. లక్ష్మి ప్రసన్నం కంటె సరస్వతీ ప్రసన్నం యెక్కువ అతనికి. తండ్రిలేడు. తల్లి వృద్ధురాలు. మరో అన్నగారి వద్ద వుండామె. మామగారికీ లనకీ వరకట్నంవద్ద యుద్ధమొచ్చింది. ఆయన ఇస్తానన్న వెయ్యినూట పదహార్లూ యింతవరకూ ఇవ్వలేక పోయాడు. అందుచేత నిర్దోషి అయిన ఆ అబలను, రత్నంలాంటి భార్య దుర్గను వదిలేశాడు రామం. దుర్గ తన కెన్ని ప్రేమలేఖలు వ్రాసినా, యెన్నిసార్లు వేడుకున్నా, 'యేకాకినిగా యేడవమనే' ప్రత్యుత్తరమైంది రామందగ్గర నుంచి. కాని ప్రయోజనం లేకపోయింది. ఎంతమంది మిత్రులు హితబోధ చేసినా అతని బుద్ధిబాగుపడాలేదు—అంతకంటె కర్తవ్యం అతనికి తోచాలేదు !!

తన జీవితాన్ని దుఃఖ దేవత చేతుల్లోపెట్టి రోజులు దొర్లించు కుంటుంది దుర్గ. ఈ అపనింద నెత్తిమీద పెట్టుకుని మోస్తూ పథ్యానికి గూడా పరులతో మాట్లాడని పరమ సౌశీల్యవతి ఆ దుర్గ, అట్లాగే కాలం వెళ్లబుచ్చుతోంది. ఆమె దుఃఖావేదనని చూడలేక ఆమె తల్లిదండ్రులు మరింత క్రుంగి పోతున్నారు. దుర్గ నామధేయానికి తగినట్లు సదా ఆమె వదనసీమలో ఆనందవికాసం తాండవిస్తూండేది. ఒక్కొక్కప్పుడు ఆమె దుఃఖాన్ని చూచి ఆమె లావణ్య రేఖలు వెక్కిరిస్తూవిరగబడి నవ్వేవికూడా. ఇల్లా ఆదుర్గ వియోగ సముద్రాన్ని మునిగి తేలుతో వుంటె—

తెల్లవారి ఝామున నాల్గుగంటలకల్లా అత్తావారింటికి చేరుకున్నాడు. రాంబాబు వరండాలో పడుకునివున్న బావ మరది హడావిడి కొద్దీ అతనిమీద టార్చి వేసి చూచాడు యెవరో అనుకుని. ఆలైటు వెలుతురులో అతని దురాలోచనలు దగ్ధమైనట్లు కళ్లుజిగాలు మని, 'నేనేనోయే' అంటూ చక్కగా సమాధాన మిచ్చాడురామం.

'ఏం ? యింత అర్ధరాత్రి వేళ, యిల్లా వచ్చావేంబావా ?'

# కవికలంలో కలకలం

'లోపల తలుపు తీయిస్తూ, కే కెయ్యి ఒక్కసారి'—అన్నాడురామం.

రామం భావమరది తలుపు తీయించాడు. రాంబాబు మామగారూ, అత్తగారూ విస్తుపోయిచూస్తున్నా రతని వైపు.

'ఏంబాబూ: యిప్పటికి దయొచ్చిందా యీ నిరుపేద మీదకి. ఇంత ఖంగారుగా వచ్చావేం?'—అన్నారు మామగారు.

'నీవు మాట్లాడవేం? నాయినా!'—అంది అత్తగారు.

'దుర్గేదీ? ముందా సంగతి చెప్పండి, ఎక్కడుంది. ఒక్కసారి చూడనివ్వండి.' అంటూ ఆవేశ పడతాడు రాంబాబు.

'ఆ ఆవేశందేనికి రామం! ఇంకాలేవ లేదు. అదిగో అక్కడేపడుకునివుంది. రా!' అంటూ లోపలికి తీసుకు వెళ్లి; బయటికి వచ్చేసింది అత్తగారు.

నిద్రాదేవత జోలపాటలో సుఖ డోలికలూగే దుర్గని లేపుతూ 'దుర్గా! దుర్గా!' అంటున్న రామం మంచంవద్ద నుంచుని.

దుర్గ కళ్లుతెరచి కంగారుగాలేస్తూ 'ఎవరు? ఎవరు? అంటూ గాభరా పడుతోంది.

'నేనుదుర్గా! నీరామంని. ఇన్నాళ్లనుంచీ నీ జీవితాన్ని విరామంలో; విషాదంలో; వియోగ దుఃఖసాగరంలో ముంచేసిన నీ నాధుణ్ణి రాంబాబుని దుర్గా. నన్ను; నీరామాన్ని, యీ దుర్మార్గుడ్ని క్షమించావూ?!,

'ఆ! ఆ! ఏమిటామాటలు. అంత ఘోరంగా మాట్లాడతారేం? ఆడదాన్ని నేను క్షమించటమేమిటి? చాలు. నాదే తప్పనుకోండి. గత విషయాలు మాట్లాడకండి, లేవండి.

'దుర్గా! ఈ పాపిని క్షమించటమే కాదు శిక్షించినా పాతకం తీరదు. నిన్ను తిరిగి పరిగ్రహిద్దామని వేడుకొంటున్నాను. ఒల్లవ్వూదుర్గా! నాకు కట్నమూవద్దూ-కానుకా కానుకావద్దూ! నాపత్ని......,

'అట్లాంటిమాట లెందుకండీ! నే నొల్లక పోవటమేమిటి? నాహృదయాంతరాళంలో వుడికే వుల్లాసవాంఛే అది—ఉత్సాహపిచికే అది'

'అమ్మయ్యా! దుర్గా; నేటికి......'

'అవునుగాని; ఆ జేబులో కాగితా లేమిటి? తొంగి చూస్తున్నయ్?

'అదొక కధలే. దాన్ని సరించే మరకీకర్మ పక్వమైంది.'

'పూర్తికాలా?'

'అప్పటికి అంతవరకే అయింది. యిప్పటికి అయినట్టే. యిదిగో యిటుచూడు. తర్వాత నాలో అవాంతరం వచ్చింది. అప్పటి నీ మధుర సంభాషణ, యీ కథ గానేటప్పుడు నా మనస్సును మరచ్చుతు చేస్తూ, నాహృదయ మాలిన్యాన్ని పరిశుభ్ర పరచింది.

'సరేగా?, అది పూర్తిచేయండి చూదాం?' అంది—దుర్గ.

'నువ్వుగూడా చెబుతావు కదూ?' అన్నాడు—రామం.

'ఊఁ'

'ఎంతవరకు అయింది. "భర్తరాకపోవటానికి కారణం యేమిటాఅని ఆలోచిస్తూ మధ్య మధ్య కన్నీళ్లు కారుస్తోంది. తన తప్పును తాను తెల్సుకుని అప్పుడు తలభర్త...తపించే తన భార్యవద్దకు వచ్చి...క్షమాభిక్ష...'

'ఆ! ఆ! అది వ్రాయకండి!'

'ఆ: సరే: భార్యవద్దకు వచ్చి తనకష్టలన్నీ కప్పిపుచ్చుకుని క్షేమంగా వున్నాడు. అప్పుడు మాదుర్గ...అదే సరసు వదనం ఆనందంతో కలకల్లాడి పోయింది. ఆ ప్రణయ వృక్షానికి కలకలం లేకుండా వారికాలచక్రం గిఱ్ఱున తిరుగుతోంది.—



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి పరిసి సుభద్రమ్మ

[క్రిందటి సంచికలో, పిల్ల వయసునుబట్టి క్రమేపి ఎదుగుతు బుద్ధి వికాసము చురుకు కలిగి వుండక పోవటానికి గల కారణాలను తెలుసుకున్నాము. మనోవ్యాపారమునకు మానసికాభివృద్ధికి సంబంధించి ఒక ప్రత్యేక స్థానమును శరీర నిర్మాణములో ఏర్పరుచుకున్న నాడీ వ్యూహము లేక నాడీ మండలమును గురించి యీ మాటు తెలుసుకుందాము. సం॥]

## నాడీవ్యూహంలో రెండు ప్రధాన భాగములున్నవి

1. మొదటి ప్రధాన భాగము :—మస్తిష్క—పృష్ఠ నాడీ వ్యూహము (Cerebro-Spinal Nervous System అనగా, పెను మెదడు, చిఱుమెదడు, వెనుపాము తక్కిన నాడీ మండలము చేరి.)

2. రెండవ ప్రధాన భాగము :—అనుకంపిత నాడీ వ్యూహము. (Sympathetic Nervous System.)

ప్రథమ ప్రధాన భాగములో నాలుగు ఉపభాగము లున్నవి. ఆయా భాగమునకు ప్రత్యేక ప్రత్యేకమైన వ్యాపారము (లేక ధర్మములు) లుంటాయి. వాటి వ్యాపారములను బట్టియే నాలుగు విభాగములుగ విభజించబడినవి.

(అ) మెదడు :—దీని కెంతమాత్రం కీడు కలగకుండ కపాలము (తలపుఱ్ఱె)తో మూయబడి యుంటుంది.

(ఆ) వెనుపాము (సుషుమ్న నాడీ అనికూడ అంటారు. Spinal Cord) ఇది మెదడుయొక్క వెనక భాగము. ఇది వీపుమధ్య ప్రదేశంలో నిడుపుగా క్రిందివరకు వ్రేలంబించియుంటుంది. దీనికెట్టి హాని సంభవించకుండ ఇది 'పృష్ఠ మణివంశము' అను ఎముకల గూడులో (దీనిని వెనుపూస అంటారు—) మూయబడి వుంటుంది.

(ఇ) మూడవభాగమనేది అసంఖ్యాకమైన నారలాంటి నాడీ జాలము. ఇవి దేహంయొక్క ఉపరి భాగమునకూ నాడీకేంద్రము లనబడు మెదడు, వెనుపాముకూ మధ్య రహదారులగా ఏర్పడుతాయి. ఈ నరములలోకూడ రెండు విధాలున్నవి :—

(1) 'అంతర్వాహిని నాడులు' లేక స్పర్శనాడులు (Afferent Nerves), (2) చలన నాడులు (Efferent nerves.)

అంతర్వాహిని లేక స్పర్శనాడులు. దేహంయొక్క ఉపరిభాగమునుండి నాడీ కేంద్రములగు మెదడు, వెనుపాముకు రహదారులుగ ఏర్పడుతాయి.

"చలన నాడులు" మెదడు, వెనుపాము, అను నాడి కేంద్రములనుండి దేహంయొక్క ఉపరి భాగమునకు రహదారులగ నుంటాయి.

(ఈ) నాలుగవ విభాగము :—ఇంతకుముందు చెప్పిన నాడీకణ జాలమునకు (Nerve tissue) సంబంధించినట్టుగా మరికొన్ని ప్రత్యేక భాగములున్నవి. ఇవి మన చుట్టునున్న బాహ్య ప్రపంచానుభూతి జ్ఞానములను మన మనః ఫలకం మీద ముద్రించుట కనువుగా అభివృద్ధి చెందుతవి. ఇవియే "జ్ఞానేంద్రియములు", చలన అంగములు.

జ్ఞానేంద్రియముల ద్వారా—(అనగా, కళ్లు, చెవులు, చర్మం, ముక్కు, నాలుక—) మన చుట్టు నున్న ప్రపంచానుభూతి జ్ఞానములను పరిగ్రహించు కొంటాము. చలన అంగముల మూలకంగా— (అనగ—కాళ్లు చేతులు, కండరములు, కంఠనాళములు—) మన వాంఛలు, ఆలోచనలు, అనుభూతిని వ్యక్తపరుస్తాము, అంచేతనే చలన అంగములు, మన ఇచ్ఛకు, సంకల్పమునకు ఉపకరణాలు అంటారు.

ముఖ్యంగా జ్ఞానేంద్రియముల నిర్మాణము అత్యద్భుతము అత్యంత సూక్ష్మమైన ఎముక, తోలు, కండరములు అతి సున్నితమైన పొరలు మున్నగువాటితో అద్భుతంగా నిర్మింపబడి వుంటాయి. అంతకన్న అత్యద్భుతమైనది నాడీ తంతువులు (Nerve fibres) ఈ నాడీ తంతువులే ప్రతి అంగమును వెనుపాముకు, లేక మెదడుకూ, లేదా ఈ రెంటికీ సంబంధమును కలుగజేస్తవి. అంగములు మున్నగువాని మధ్య సంబంధము నేర్పరచునట్టి ఈ నాడీ తంతువులు లేని యెడల ఇవి అన్నీ మనకు నిరుపయోగమన్న మాట. ఇందుకు పక్షవాయువుతో బాధపడు రోగియే మనకు దృష్టాంతము. ఈ వ్యాధిగ్రస్థునిలో ఈ నాడీ తంతువులు పనిచేయుట లేదు.

ఇక రెండవ ప్రధాన భాగమగు అనుకంపిత నాడీ వ్యూహమును గురించి చూద్దాము. (దీనికి అనుతాప నాడీమండలమనికూడ అంటారు. Sympathetic Nervous System)

అనుకంపిత నాడీ వ్యూహములో కొన్ని నాడీ కణములు నాడీ తంతువులయొక్క గుత్తులు వుంటాయి. (Bunches of Nerve-cells & Nerve fibres) వీటిని 'నాడీ ముడులు' అంటారు (Ganglia) లేక, స్నాయుపుచ్ఛ గ్రంధులు అంటారు. వీటితోపాటు స్పర్శ, చలననాడులు కూడ వుంటాయి. చలన నాడులు ఈ నాడీ గ్రంధులనుండి బయలుదేరి శాఖోపశాఖలగా దేహమందంతటా వ్యాపించుతవి. స్పర్శనాడులు ఊపిరితిత్తులు, గుండె, కడుపు, ప్రేగులు మొదలైనవాటినుండి బయలుదేరి ఈ నాడీ గ్రంధులను చేరుకొంటాయి ఈ నాడీ గ్రంధులు, వెనుపాముకు ఇరుప్రక్కలా—(వెనుపామున్నంత పొడవునా) అక్కడక్కడ వుంటాయి. అంతర్భాగంలోని అంగములలో (గుండె, కడుపు) ఏ ఒక్కదానిలో మార్పు కలిగినా ఆ అంగమునకు సంబంధించిన తక్కిన భాగములలో 'ఈ అనుకంపిత నాడీ మండలముద్వార, ఆ మార్పు కనుగుణ్యమైన మార్పులు జరుగుతాయి. ప్రతి అంగము ఏదో ఒక నాడీ గ్రంధికి చెందియుండు లాగున స్పర్శ చలన నాడులు చేస్తాయి. అదే విధంగా ఈ నాడీ గ్రంధులను వెనుపాముతో చేర్చుతాయి. ఈ రీతిగ ప్రతి అంగమూ, ఏదో ఒక నాడీ గ్రంధికి చెందియున్నందుచేతనే, అంగములలో కలుగు మార్పులయొక్క అనుభూతి నాడీ గ్రంధుల కందుతుంది. అక్కడనుండి వెనుపాము, మెదడుకు అందుతుంది. (అక్కడనున్న స్పర్శ చలన నాడీమండలమునకు అన్నమాట.)

ఉదా:—ఏదైనా చాల వేడి పదార్థం మన కడుపులో పడగానే బాధాకరమైన అనుభూతి, అనుకంపిత నాడీ వ్యూహంద్వారా మెదడుకు అందుతుంది; అనగా ఎరుక అవుతుందన్నమాట. తక్షణమే మెదడు, కడుపులో ఏవిధమైన కీడు వాటిల్లకుండ చేయమని గ్రంధులకు వార్త నంపజేస్తుంది. అలా శాసించుటచేత అక్కడ హాని సంభవించకుండ ప్రతి చర్య జరుగుతుంది.

అనుకంపిత నాడీ వ్యూహముద్వారానే ఒడ్డకు హాయి, బాధ మున్నగు అనుభూతి కలుగుతుంది. ఈ విధమైన చైతన్యం ఏర్పడుతూ క్రమేణ సౌఖ్యం, అసౌఖ్యం, సంతృప్తి అసంతృప్తి, సంతోషం, దుఃఖం మొదలగు మనో ప్రవృత్తులకు సంబంధించిన చైతన్యం అభివృద్ధి చెందుతుంది (Emotions భావోద్రేకములు.)

సంగ్రహంగా చెప్పాలంటే, 'నాడీ వ్యూహమనేది దేహంలోని ప్రతి భాగమును తక్కిన భాగములన్నిటితో మేళనమై వాటి వాటి వ్యాపారములను సక్రమంగా, సవ్యంగా జరుగులాగున చేస్తుంది. అనగా సర్వభాగములు పరస్పర సమ్మేళనముతో తమ ధర్మముల నిర్వహించుతాయన్నమాట. పెను మెదడు (బృహన్మస్తిష్కము Cerebrum) నాడీ మండలమున రారాజువంటిది. ఇదియే సర్వేంద్రియ జ్ఞానమునకు, జ్ఞాపకశక్తికీ స్థానము. సర్వావయములు ఇది శాసించిన ప్రకారం నడుచుకొంటాయి. (మెదడు, వెనుపాము నాడీకేంద్రములను విషయం జ్ఞాపకముంచుకోవాలి) ఏఒక భాగంలో ఎట్టిమార్పు కలిగినా తక్కిన భాగములో దాని కనుగుణానుభూతి కలుగుతుంది.

ఇక మానసికంగా చూస్తే, ఈ నాడీ వ్యూహంవలననే మనకు ఎరుక అనేది కలుగుతుంది. బాహ్యంలోగాని, అంతర్గతంగాగాని ఏమి జరిగినా, మనకెరుక కలగటం ఈ నాడీ వ్యూహముద్వారానే. దీని సహాయంవలననే మను

జాతు అవగాహనం చేసుకొనుటం అనుభూతి పొందటం, ఆలోచించటం, కార్యముల నెరవేర్చటం.

ఇందువల్ల తెలిసినదేమంటే, బిడ్డయొక్క దైహికాభివృద్ధికీ, మానసికాభివృద్ధికీ, ఆరోగ్యమైన శరీరం సర్వావయవముల పాటవం అత్యవసరం. జ్ఞాన కర్మేంద్రియములు, చలన అంగములు, నాడీ వ్యూహము సంపూర్ణారోగ్యముగా వుండి వాటి వాటి వ్యాపారములను చురుకుగా, సక్రమంగా నిర్వహించినపుడే బిడ్డ సర్వతోముఖంగా అభివృద్ధిచెందుటకు అవకాశమున్నుంటుంది.

మరికొన్ని ముఖ్య విషయములు :—

శిశువు తల్లి గర్భంలో నున్నపుడు జ్ఞానేంద్రియములను గవాక్షములు మూయబడి యుంటాయి. (స్పర్శేంద్రియము) అది చీకటి చెఱసాలలలో నున్నట్టుగా వుంటుంది. తన కవసరమైన ఆహార ద్రవ్యములను తల్లి భుజించునట్టి దానినుండి తన అంతరాంగములద్వారా పరిగ్రహించుకొంటుంది. పుట్టినప్పుడు శిశు సర్వాంగములు, నాడీవ్యూహము, కండరములు మున్నగునవి అతి లేతగా, సున్నితంగా వుంటాయి కాని బిడ్డ ఉపయోగించుటకు సిద్ధంగా మాత్రం వుంటాయి. అది పుట్టిన కొన్ని ఘడియలవరకు జ్ఞాన—కర్మేంద్రియముల వ్యాపారము జరగదు.

స్పర్శేంద్రియం మాత్రం ఆదినుండియే చురుకుగా దాని వ్యాపారం కొనసాగిస్తుంటుంది.

శిశు శరీరముయొక్క సమస్తభాగాలు, ముఖ్యంగా నాడీ వ్యూహం యొక్క నిర్మాణము సక్రమంగా, సంపూర్ణారోగ్యంతో వున్నయెడల శిశు జన్మించిన కొన్ని ఘడియల నుండియే నేర్వటం అను కార్యకలాపం ఆరంభమవుతుంది. అలా కాక, తల్లిదండ్రుల వలననో (వంశపారంపర్యం) మరే కారణం వల్లనో (పరిసర స్థితుల ప్రభావం) శిశువుకు వ్యాధి సంభవించినను, లేదా, దానిదేహంలో ఏదో ఒకభాగం—దేహాంతర్గత అంగములు కాని, (అనగా గుండె, ఊపిరి తిత్తులు కడుపు, పిత్తకోశం, మూత్రపిండములు మొ॥) కళ్లు, చెవి, స్పర్శ మున్నగు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు కాని వాటి వాటి వ్యాపారమును సక్రమంగా నిర్వర్తించ లేకపోయినను, లేదా లోపించి పోయినను, నాడీ వ్యూహము సక్రమగ సత్వాముగా, పని చేయజాలదు. ఫలితం, జ్ఞాన కర్మేంద్రియములద్వారా మనః ఫలకమున ముద్రింపబడు పరిసర స్వరూపములు గాని, అనుభూతిగాని (పరిసర జ్ఞానము), సేకరించుకొనునట్టి తన సహజ ధర్మమును బిడ్డ సక్రమంగా నెరవేర్చుకోజాలదు. ఇందువలన బిడ్డయొక్క గ్రహణశీల మనస్తత్వమునకూ, వ్యక్తావ్యక్త చైతన్యమునకూ, లోటు ఏర్పడుతుంది. లేదా బుద్ధి వికాసము ఆలస్యంగా కావచ్చును. మరింత విపులీకరించటానికి ప్రయత్నిస్తాను—జ్ఞానేంద్రియముల ద్వార పరిసర జ్ఞానమును పరిగ్రహించుకొను శక్తి బలహీనం కావచ్చును. లేదా! అసలు గ్రహణ శక్తియే లోపించి పోవచ్చును. ఏ ఒకటి రెండు జ్ఞానేంద్రియములద్వార మాత్రమే పరిసర జ్ఞానమును గ్రహించునట్టి దౌర్భాగ్యపు స్థితి ఏర్పడినచో, బిడ్డ మనో ఫలకంమీద చిత్రితమైన పరిసరజ్ఞానము, అనుభూతి అసంపూర్ణంగా అస్పష్టంగా, కొన్ని వేళలలో అవక తవకలగా, అయోమయంగా వుంటాయి. బిడ్డలో ఇట్టి స్థితి ప్రారంభంలో అస్పష్టంగా గోచరించినను, క్రమేపి బిడ్డ మందమతిగా పరిణమించ వచ్చును. ఇంద్రియములలో అంగములో ఏ దొక్కటి లోపించినా బాహ్య ప్రపంచానుభూతి జ్ఞానములను లోటు ఏర్పడుతుంది. అందువల్లనే, ముఖ్యంగా జ్ఞానేంద్రియములు, పరిసర అనుభూతి జ్ఞానములను పరిగ్రహించుట కనువగు సింహద్వారాలు అంటారు. ప్రతి జ్ఞానేంద్రియంద్వార బిడ్డ ఏవిధంగ జ్ఞానార్జన చేసికొంటుందో చూద్దాము.

(సశేషము)



# మహిళా స్వాతంత్ర్యము

[రచయితలు, శ్రీకన్నెకంటి వీరభద్రాచార్యులు. వీరు నవభారతమను పేర మొదటినుండి రిపబ్లికు వఱకు కాంగ్రెసు చరిత్ర పద్యకావ్యముగా చక్కనిశైలిలో రచించిన జాతీయకవులు. మృదుమధురమగు వీరి రచనా విధానము తెలియనివారు విశాలాంధ్ర రాష్ట్రమున నరుదు. పల్నాటి సోదరకవులలోనొకరు. ఈ క్రింది నవభారతము నుండి స్వీకరించి పంపుచున్నాము].

—శ్రీమతి వై. లక్ష్మమ్మ.



౧

మహిళా స్వాతంత్ర్యంబనఁ
దహతహ లాడెదవు, స్వార్థతత్పర నియమ
గ్రహ వశులై కొందఱు, వా
రిహపర సౌఖ్యములఁ గాంచు టెఱుఁగరు వినుమా!

౨

పురుషుఁడు నే నధిపతి నని
మురియుచుఁ బ్రేయసిని మాఱు మూలల నిడి, దు
ర్భర మాయా శాసనముల
నొఱపిడిఁ గావించి జీవితోన్నతిఁ జెఱచున్

3

నోరెత్తి పలుక రాదని
ద్వారంబును దాఁటిపోవఁ దగదని చదువుల్
నేరువ వలదని సతతము
నారీమణి నణఁచునట్టి నరుఁడొక నరుఁడే?

౪

ధవులెంత ధూర్తవర్తనులైన నేమాయె
బోధించ రాదు పూఁబోణులంచుఁ
బతులన్యకాంతాభి రతులైన నేమాయె
మందలింపఁగ రాదు మగువ లంచు.
పరులెంత బాధించు వారైన నేమాయె
నెదురాడఁగారాదు సుదతు లంచు
భర్తలెంతటి స్వార్థపరులైన నేమాయె
నడ్డుఁ జెప్పంగరా దతివలమచుఁ
దలఁపుల నణంచి కీలుబొమ్మల నొనర్చి
జీవిత మహార్ఘశలనెల్లఁ జెండి వైచి
యధిపతుల మంచు గర్వించు నట్టినరులు
నరులు కారన్న వారు వానరులు కాని.

౫

కాంతలఁ గామయంత్రములుగా
వివరించెడి నాఁటి దుష్టసి
ద్ధాంతము నాశ్రయించి
వనితా హృదయంబులఁ గ్రుంగఁదీసి ర
వ్వంతయు జాలి చూపని
దయారహితాత్ములు, స్వార్థతత్పరుల్
హంతకు లంచు నమ్ముఁడు!
యధార్థము వారికి మేలు కల్గునే

౬

ఏకలుషాంబురాశిఁ బడి యీదుట
కైనను, సర్వకాలముల్
మాకధికారముండు, ననుమానము
లెందుకు, కాంతలాటుచే
మీకది లేదటంచు శృతిమించిన
రాగముఁ దీయువారు, స్త్రీ
లోకము నుద్ధరింప నవలోకన
చేయరు స్వార్థతత్పరుల్

౭

ఏయుగమందునైనఁ గనమీ సదమంత్రపు
శాసనంబులు
న్యాయముగా జనించినవి,
నాఁటి సతీతిలకల్ స్వతంత్రతా
స్థాయినిఁ గాంచరే?
పతులఁజంపిరె? వారలు భర్తృసేవలన్
జేయరె? జాణలైరె?
నిరసించిరె? నైతిక వర్తనావళిన్

# మహిళా స్వాతంత్ర్యము

౮

సతు లజ్ఞానము లౌట, వారికి
    విద్యోత్సాహంబుఁ జేకూర్చుచోఁ
బతు లేకార్య మొనర్పఁ జాల
    రని సంభావింతు రార్యుల్, పరి
స్థితి నూహింపుఁడు! పక్షవాత
    రుజచే జీవించు నారోగి జీ
వితమంతే పనియైనఁ జేయఁగలఁడే ?
    వీక్షింప నింతేకదా.

౯

పలువది కోట్లొప్పెడు, మా
బలగంబని గంతు వేయఁ బొల్పడమఁడు, మీ
బలగమున సర్ధభాగము
నిలిచెనా జీవచ్ఛవముగ నిస్పృహఁ గొలుపన్

౧౦

సమాన జ్ఞాన కళావిలాసఖను లై,
    సర్వాత్ము లై యాత్మని
గ్రహ విద్యాధన సాధనాభిరతు లై
    కల్యాణవాంఛాపరి
గ్రహణానంద నిమగ్ను లై కదలి
    దీక్షామార్గముఁ బట్టి, మీ
మహిళా సంఘము నుద్ధరింపుఁ
    డది సేమంబుర్వి కెల్లప్పుడున్






# మా పొరుగింటి తపస్విని

* చిరంజీవి శ్రీపాద గాయత్రి *

నా పేరు నిర్మల. మా ఇంటిప్రక్క మేడలోని వెంకయ్యగారు చాలా మంచివారు. వారి కుటుంబమూ, మా కుటుంబమూ చాలా స్నేహంగా వుంటుంది. తరతరాలగా అంటే మా తాతగారూ, వాళ్ళ తాతగారి దగ్గరనుంచి ఈ స్నేహం వర్ధిల్లుతోంది. వాళ్ళబ్బాయి మురళి, నేనూ చిన్నప్పటినుంచి ఆడుకొనేవారం. మమ్మల్ని చూసినవారంతా అన్నా చెల్లెళ్ళమో అనుకొనేవారు. మురళికి పన్నెండేళ్లు. నాకు పది. మేమిద్దరంకూడా ఒకే క్లాసు. ఇద్దరం చాలా కొంటెవాళ్ళం. ఏదో ఒక రకమైన అల్లరి చెయ్యనిదే మాకు తోచేదికాదు.

మురళీ వాళ్ళ మేడలోనే ఒక భాగంలో ఒక దంపతులు అద్దెకున్నారు. పాపం! వారికి పిల్లలులేరు. ఆ ఇంటి ఆవిడ సీతమ్మగారికి దైవ భక్తి ఎక్కువ. ఆవిడ ప్రొద్దున్నే లేచి, కాఫీ ఐనా త్రాగకుండా స్నానంచేసి దేవుని పూజిస్తూ కూర్చునేది. ఏమిటో పాటలుకూడా పాడుకొనేది. నాకూ, మురళికీ ఆవిడ పిచ్చి భక్తిని చూస్తే నవ్వొచ్చేది. మేమంటే ఆవిడకి ఎంతో ముద్దు. మాకు బిస్కెట్లు పిప్పరమెంట్లు, పెడుతూ వుండేది. అందుకని మేము వీలైనప్పుడల్లా ఆవిడతోనే ఉండేవాళ్ళం.

ఆ రోజు ఆదివారం. బడికి సెలవు. నేను మా ఇంట్లో కాఫీ తాగుతూవుండగా మురళి తొందరగా మా ఇంటికివచ్చి "మాట" అంటూ నన్ను వాళ్ళింటికి లాక్కొని పోయాడు. ఇద్దరం సీతమ్మగారింటికి వెళ్ళేము. ఆవిడ దేవుని పీఠము ముందు కూర్చుని, కళ్లు మూసుకొని, భక్తి పారవశ్యంతో పాటలు పాడుకొంటోంది. మురళి నా చెవులో "ఒక తమాషా చేద్దామా" అన్నాడు. నేను ఏమిటన్నట్టు మురళివైపు చూసేను. మురళి నన్ను వాళ్ళన్నయ్య గదిలోకి తీసికెళ్ళి అలమారలో వున్న నాటక సరంజామంతా తీసి చూపించి "నిర్మలా! ఇప్పుడు మనిద్దరమూ ఈ డ్రస్సులలో నువ్వు లక్ష్మిగానూ, నేను విష్ణువుగానూ డ్రస్సు వేసుకొని సీతమ్మగారింటికి వెళ్ళి ఒక తమాషా చేద్దాము"

అన్నాడు. నేను సరే అని నవ్వి ఒక కిరీటం తగిల్చుకొని, చీర కట్టుకొని, బొట్టు పెట్టుకొని, ముత్యాల దండలూ, పూసల దండలూ వేసుకొని లక్ష్మిలాగే తయారయ్యాను. మురళి కూడా పంచకట్టి, కిరీటం పెట్టి, దండ వేసుకొని విష్ణువులాగ తయారయ్యాడు. ఎవ్వరూ చూడకుండా సీతమ్మగారింట్లో ప్రవేశించాము ఆవిడ ఇంకా కళ్లు మూసుకుని పాటలు పాడుతూనే వుంది. మేము సద్దు చేయకుండా దేవుని మందిరానికి, ఆవిడకీ మధ్య ఎవని "పోజ్"లలో వాళ్లు నిల్చున్నాము. ఆవిడ పాటలాపి కళ్లు తెరచింది. వెంటనే మురళి గొంతుకుమార్చి "అమ్మా! నీ భక్తికి మెచ్చి ప్రసన్నులైనాము. నీకు త్వరలో ఒక చక్కని పాపాయి పుడతాడు. నీ కోరిక ఫలిస్తుంది" అని దీవిస్తున్నట్లు అన్నాడు. నేనుకూడా మురళి అన్నట్లే అన్నాను. ఆవిడ మా కాళ్ళమీద పడి, మాకేసి పిచ్చిగాచూస్తూ "శాంతాకారం భుజగశయనం" అని స్తోత్రం చేస్తూ మూర్ఛపోయింది. నాకు తెలియక నవ్వుతున్నాను. కానీ, మురళి ఖంగారుగా "అయ్యో! అయ్యో! నిర్మలా! మా అమ్మనీ, అక్కనీ పిలవ్వే. ఈవిడ మూర్ఛపోయిందే" అని అరచాడు. నేను మురళి అక్క వసంత దగ్గరికెళ్ళి సంగతంతా ఒక్క గుక్కలో చెప్పేశాను. మురళి అన్న సైకిలుమీద డాక్టరు దగ్గరికి పరిగెత్తాడు. వసంత, వాళ్ళ అమ్మ, సీతమ్మగారిని పరుపుమీద పడుకోబెట్టి, ముఖంమీద నీళ్లుజల్లి, విసరడం మొదలైన ఉపచారములు చేస్తూ, ఇదేం పనని మమ్మల్ని చీవాట్లు పెట్టేరు. ఐదు నిముషాలైన తరువాత ఆవిడ కళ్లువిప్పి "మహానుభావా" అని మళ్ళీ మామూలు ధోరణిలో మొదలెట్టింది. మేము "పక్కు"మని నవ్వేము. వసంతా వాళ్ళూ తిట్టేరు మమ్మల్ని. ఇద్దరం ఒకమూల నక్కేము. ఇంతలోకే మురళి అన్న డాక్టరుతో సహా ఒచ్చేడు. ఆవిడ మెల్లగా లేచి అందరినీ చూసి విస్తుపోయింది. మురళి అమ్మ జరిగిందంతా చెప్పింది. ఇంతలోకే వసంత కాఫీ పట్టుకొచ్చి ఆవిడకిచ్చింది. ఆవిడంతా విని ఆశ్చర్యపోయింది. అందరితోపాటు మా కొంటెపనికీ, వేషానికి ఆవిడకూడా విరగబడి నవ్వింది. మేము మొదట చీవాట్లుతిన్నా తరువాత ఏదో గొప్ప ఘనకార్యం చేసినట్లు వాళ్ళతో కలసి నవ్వేము. ఇప్పటికికూడా మా పొరుగింటి తపస్వినిని చూసినప్పుడల్లా ఆ సంఘటన జ్ఞాపకమొచ్చి ఆవిడా మేముకూడా, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వుకొంటూ వుంటాము.



# వంటవాని యుక్తి

❋ శ్రీమతి కె. పార్వతి ❋

ఒక వూరిలో నొక గృహస్థు గలడు. అతను ఒక రోజున రెండు మామిడిపండ్లు తెచ్చి తన వంటవానికి యిచ్చి యిట్లా చెప్పెను: "నేడొక స్నేహితుడు మన యింటికి రాబోవుచున్నాడు, ఈ పండ్లు ముక్కలుగ తరిగియుంచి అతను వచ్చిన తోడనే మా కిద్దరికిని బెట్టుము."

వాటట్లు తఱిగి యెట్లుండునోయని ఒక్కముక్క తినెను. అది కడు రుచిగ నుండుటచూచి తక్కినవికూడ తానె తినివేసెను. అంత కొంతసేపటికి యజమాని వచ్చి ముక్కలు తఱిగియుంచితివా ? అని ప్రశ్నించెను. అప్పుడు వంటవాడు చెక్కుతీయుటకె రాక ఈ కత్తి మొద్దుపోయి వున్నది అని, ఒక మొద్దుకత్తిని యజమానుని చేతికిచ్చెను. దానిని గొనిపోయి యాతడు నూరుచుండగా వంటవాడు యింటి యరుగుమీద కూర్చుండిన క్రొత్త స్నేహితుడిని చూచి " అయ్యా ! మీ రెవ్వరోగాని యిచ్చటికేల వచ్చిరి ? ఏలనో మీపై కోపము గలిగినది. మీ చెవులు రెండు కోసి పంపుటకై మా యజమాని మిమ్ముల నిచ్చటికి బిలుచుకొని వచ్చియున్నాడ"ని చెప్పి తలుపు కంతగుండ కత్తి నూరుచున్న యాతని చూపెను. అదిగని వాని మాటలు నమ్మి యా స్నేహితుడు పరుగెత్తిపోవ నారంభించెను. అప్పుడు వంటవాడు "మీ స్నేహితుడు మామిడిపండ్లురెండును దీసికొని పాఱిపోవుచున్నాడు"అని కేకలువేయ, నింటి అతడు యింటి బయటికి వచ్చి కత్తియెత్తి పిలుచుచు ఒక్క పండిచ్చి పొమ్మను తాత్పర్యముతో 'ఒక్కటి ఒక్కటి' యని అరచుచు వెంబ పడెను. ఒక్క చెవి మాత్రము కోయుదు ననుచున్నాడని తలచి అతడు మఱింత పరుగెత్త సాగెను. ఇంటివాడు కొంత దూరముపోయి వాని పరుగు పుచ్చుకొన నేరక మరలి వచ్చెను.

★

# "చెడపకురా చెడేవు"

* చిరంజీవి ధవళ నాగేశ్వర్ *

అనగా అనగా వెంకన్న అనే కాపు వుండేవాడు. అతను ఒక కుక్కను, ఒక పిల్లిని పెంచుచుండేవాడు. పిల్లికి పాలు, కుక్కకు అన్నము ప్రతి రోజూ పెట్టుచుండేవాడు. కుక్క, పిల్లికి పాలు పోయుటచూచి ఓర్వలేక పోయెను. పిల్లిని చంపినచో, దానికి పోయు పాలు తనకే పోయుదురని కుక్క తలచెను.

ఒకనాడు పిల్లి పాలు త్రాగుచుండెను. కుక్క దానినిచూచి దానిని చంపుటకు పరుగెత్తెను. పిల్లి ఆ కుక్కనుచూచి భయపడి పరుగెత్తెను. పిల్లి ముందు తరువాత కుక్క జోరుగా పోవుచుండెను. వెంటనే పిల్లి ఒకయింటి లోనికి పోయెను. కుక్కకూడ లోనికి ప్రవేశించెను. వెంటనే ఆ యింటి యజమాని కుక్కను కఱ్ఱతో భయపెట్టి వీధిలోనికి తరమివేసెను. కుక్క పిల్లిని ఎట్లేని చంపుదునని గర్వించి వీధిలో దాగుండెను.

పిల్లి కుక్క పోయెనేమోయని తలచి వీధిలోనికి పోయెను. వెంటనే కుక్క దాని సమీపించి చంపుటకు సిద్ధపడెను. అప్పుడు పిల్లి, " ఓ కుక్కా ! నేను చనిపోకుండా వుండుటకు ఒక మంత్రము నేర్చితిని. అది నీకుకూడా చెప్పెదను " అనెను. అదివిని కుక్క తనకా మంత్రము చెప్పుమనెను. వెంటనే పిల్లి దాని దగ్గరకుపోయి చెవిలో మెల్లగా అరచెను. కుక్క అది విని " యది మంత్రముకాదు. నన్ను మోసపుచ్చుచున్నావు చంపెద"ననెను.

అప్పుడు పిల్లి " ఓ కుక్క, ఇదే మంత్రము. యిక నీవు చావవు. నీకు నమ్మకములేనిచో, యీ గోడఎక్కి దానిమీదనుంచి, క్రిందనున్న

రాళ్లమీదికి గెంతును" అనెను. ఆ తెలివితేని కుక్క "సరే! నా గోడమీద నుండి రాళ్లపై దూకుతాను. నేను చచ్చిపోయినచో నిన్ను చంపి తింటాను. నాకు దెబ్బ తగలకపోతే నిన్నేమి అననులే" అని గోడయెక్కి రాళ్లమీదికి దూకెను. పెద్ద చప్పుడయింది. మరి ఆ కుక్క కదలలేదంటే నమ్ము. రక్తము వరదలా కారింది. అప్పుడు పిల్లి చిన్న నవ్వునవ్వి పారిపోయింది. మరునాడు ఆకుక్క చెత్తల బండిలోనికి వెళ్లింది.

ఒకరిని చంపతలచితే వారికే హానివచ్చును.



# ఫ్లారెన్స్ నైటింగేల్

※ చిరంజీవి గొల్లకోట వసంతకుమారి ※

ఫ్లారెన్సు నైటింగేలు యను నామె 1820వ సంవత్సరమున, ఇటలీ దేశములోని ఫ్లారెన్సు దగ్గిర ఒక చిన్న వూరిలో జన్మించెను. ఆమె తల్లి దండ్రులు ధనికులు. వారామె జీవితము సౌఖ్యముగా జరుగవలెనని ఆశించి, దానికి తగిన విధమున, నాగరికత పద్ధతిగా నాట్య సంగీతాదులను నేర్పించిరి. కాని ఆమెకు మాత్రము తన జీవితమును విలాసవినోదములతో హాయిగా సాగించుట కెప్పుడును యిష్టముండెడిది కాదు. దుఃఖములో నున్నవారి నోదార్చవలెనని, వారి నాదరించి, వారికి సహాయము చేయుటలోనే తన కానందము కలుగునని భావించెడిది. తన తీరిక సమయములో ఆసుపత్రులను గురించి సమాచారములను తెలిసికొనెడిది. ఆమె, తనకు రోగి సంరక్షణయందు ఇష్టమని తన కోరికను వెల్లడించినప్పుడు, ఆమె తల్లిదండ్రులు నివ్వెరపడి వీలుకాదని ప్రతిఘటించిరి. ఆమెకు వివాహము చేయవలెనని మంచి మంచి వరులను వెదకి దెచ్చిరి. పరుల సేవయే లక్ష్యముగాగల ఆమె, అన్ని సౌఖ్యములను విడనాడి, కన్యగానే, తన జీవితమును రోగుల సేవయందే గడుపుటకు నిశ్చయించుకొనెను.

ఈమె పారిస్‌లో డాక్టరు పరీక్ష చదివి, కెయిసర్ స్వార్త్‌లో నున్న, డెకనస్ హాస్పిటలులో రోగి సంరక్షణ పని నేర్చుకొన్నది. అప్పుడామె, తన కార్యమును జయప్రదముగా విదేశములలోగూడా సాగించగలిగిన శక్తిని సంపాదించ గలిగినది. అధికారులామె సామర్థ్యమును గుర్తించి, క్రిమియను యుద్ధమపుడు, కావలసిన వసతుల నేర్పాటుచేసి, వెంటనే యామెను స్కూటారియను వూరునకు పంపిరి. అక్కడామె రాత్రింబగళ్లు విరామము లేకుండగ, శ్రమకోర్చి, రోగులకు సేవజేసెను.

మరుసంవత్సరమే, సెబస్టపూలు ముట్టడియైనపు డామె సైనికుల కొనర్చిన సేవ వర్ణనాతీతము. కొంచెమైనను విశ్రాంతి తీసికొనక, రాత్రులందుకూడా, చేతిలో నొక దీపమును పట్టుకుని, ప్రతియొక్కరి పడక దగ్గరకును, మెల్లగా పోయి, వారి అవసరములను కనిపెట్టుచూ, దయార్ద్ర హృదయయై, వారిని సంరక్షించు చుండెడిది. అందులకనే యామె నెల్లరును "The Lady with the Lamp" "The Soldier's Friend" అనియు పిలువసాగిరి.

ఎక్కువ పనిచే, ఆమె మిగుల నీరసపడి, చివర దినములలో ఆరోగ్యమునుగూడా గోల్పోయెను. ఆమె ఆసుపత్రులందు చాలామట్టుకు, పరిస్థితులను మార్చెను. కనుకనే యామెను సంస్కర్త యనెడివారు.

ఆ రోజుల్లో నర్సు వృత్తికి యిప్పుడున్న గౌరవముండెడిది కాదు. తన యోరిమి పట్టుదలలతోను, ఆత్మ నిగ్రహముతోను, ఉత్సాహ ధైర్యములతోను సంఘమునకు మహత్తర సేవ లొనరించి, తన పంతమునే నెగ్గించుకొన్న మహనీయురాలీమె! ప్రపంచమందంతటను, మానవుల బాధను తగ్గించి, తన జీవితమును సార్థకము చేసికొనిన నారీమణి! మహిళాలోకము ఆదర్శముగా పెట్టుకొనదగిన వనితలలో యీమె ఒకతె.



"**मैं**" అను సర్వనామమునకు ప్రత్యయము చేర్చినపుడు '**मुझ**' గా మారును. షష్ఠీ విభక్తిలో మాత్రము **मेरा, मेरे, मेरी** అగును. '**हम**' యను సర్వనామమునకు ప్రత్యయము చేర్చినపుడు ఏలాటి మార్పురాదు. కాని, షష్ఠీ విభక్తిలో మాత్రము **हमारा, हमारे, हमारी** అగును.

| | |
|---|---|
| **मैं** నేను | **हम** మేము. |
| **मुझको, मुझे** నన్ను, నాకు. | **हमको, हमें** మమ్ము. మాకు. |
| **मुझसे** నాచేత, నాతో | **हम से** మాచేత, మాతో. |
| **मेरे लिये** నాకొఱకు | **हमारे लिये** మాకొఱకు. |
| ***मेरा, मेरे, मेरी** నాయొక్క | ***हमारा, हमारे, हमारी** మాయొక్క. |
| **मुझ में** నాయందు. | **हम में** మాయందు. |
| **मुझ पर** నామీద. | **हम पर** మామీద. |

*షష్ఠీ విభక్తిలో సర్వనామము తరువాత వచ్చు నామవాచకము పుంలింగ, ఏక వచనమైనచో **मेरा**, నామవాచకము పుంలింగ, బహువచనమైనచో **मेरे**, స్త్రీలింగమైనచో **मेरी** వచ్చును. షష్ఠీ విభక్తి ప్రయోగములో **आ-ए, ई** నియమము ననుసరించ వలెను.

**मैं** వలెనే **तू** ప్రత్యయములు చేర్చునపుడు **तुझ** గా మారును. షష్ఠీ విభక్తిలో **तेरा, तेरे, तेरी** యగును.

'**तुम**' ప్రత్యయము చేర్చినపుడు ఏ మార్పుజెందదు. షష్ఠీ విభక్తిలో మాత్రము **तुम्हारा, तुम्हारे, तुम्हारी** యగును.

సూచన :—ఉత్తమ, మధ్యమ పురుషసర్వనామములతో షష్ఠీ విభక్తిలో **का, के, की** లకు బదులుగా **रा, रे, री** క్రమముగా వ్రాయవలెను.

'**आप**' యనుసర్వనామము విభక్తి ప్రత్యయము చేర్చినపుడు మార్పుజెందదు.

ఉదా :—**आप से** - తమచేత.   **आप में** - తమయందు.

**वह, यह, कौन, जो** (ఎవరైతే) **कोई** (ఎవడైనా) **वही** (అతడే, ఆమెయే, అదియే) **यही** (ఇతడే, ఈమెయే, ఇదియే) ఇవి విభక్తి ప్రత్యయము చేర్చినపుడు క్రమముగ **उस, इस, किस, जिस, किसी, उसी, इसी** యగును.

వీని బహువచన రూపములు క్రమముగ **उन, इन, किन, जिन, किन्हीं उन्हीं, इन्हीं** యగును.

ఉదా:—**उसमें** - దానియందు. (**वह में** అనరాదు). **उनको** - వారిని '**कोई**', **वही, यही** యను సర్వనామములకు తప్ప మిగత వానికన్నిటికిని ద్వితీయా విభక్తియందు రెండు రూపములు వచ్చును.

ఏకవచనము:—**उसको, उसे; इसको, इसे; किसको, किसे; जिसको, जिसे; मुझको, मुझे; तुझको, तुझे.**

బహువచనము:—**उनको, उन्हें; इनको, इन्हे; किनको, किन्हें; जिनको, जिन्हें; तुमको, तुम्हें; हमको, हमें.**

పై రెండు రూపములను ఒక దానికి బదులు మరొక దానిని వాడవచ్చును. కాని, రెండవ రూపమునే తరచు వాడుదురు. '**क्या**' కు ప్రత్యయము చేర్చినపుడు '**काहे**' గా మారును. ఈ రూపము విశేషముగా వాడుక భాషలో వాడుదురు.

ఉదా:—**काहे को** (లేక) **काहे के लिये**—దేనికొఱకు.

నిజవాచక సర్వనామము **आप** - తాను.

ఇది స్వ, శబ్దము వంటిది. ఉత్తమ, మధ్యమ, ప్రథమ - మూడు పురుషములలో రెండు వచనములందు వచ్చును, దీనిని ఏనామవాచకముతో జేర్చినదానియర్థమునే పొందును. ప్రత్యయము చేర్చినపుడు యిది **अपने** యగును.

**आप** తాను

**अपने को** తనను.

**अपने से** తనతో, తనకంటె, తనవలన.

**अपने लिये** తన కొఱకు.

**अपना अपने, अपनी** తనయొక్క.

**अपने में** తనయందు.

**अपने पर** తనమీద.

**खुद** (స్వయముగ) అనునది కూడ **आप** కు బదులు ప్రథమా విభక్తియందు మాత్రము వాడుదురు.

*नाम పేరు (పుంలింగము).
तबीयत ఆరోగ్యము, మనస్సు (స్త్రీ).
दूकान దుకాణము (స్త్రీ).
सवेरा ఉదయము. (పుం).
सवेरे ఉదయమున.
अलमारी అలమారు (స్త్రీ).
बुरा చెడుగు (నామవాచకము, పుం॥).
पता విలాసము, చిరునామా, జాడ (పుం).
साड़ी చీర (స్త్రీ).
नक़्शा మ్యాపు, పటము (పుం)
मालूम होना తెలియుట.
जगाना మేల్కొలుపుట.
जागना మేల్కొనుట.
चाह కోరిక (స్త్రీ).
चाहना కోరుట.
पछताना పశ్చాత్తాపము జెందుట.

साफ़ साफ़ స్పష్టముగా

| | |
|---|---|
| तुम्हारा नाम क्या है ?<br>तुम्हारा क्या नाम है ? | మీ పేరేమి ? |
| मेरा नाम राधा है। | నా పేరు రాధ. |
| यह बात तुम्हें कैसे मालूम है ? | ఈ సంగతి (విషయము) నీకెట్లు తెలియును ? |
| कल से उस की तबीयत ठीक नहीं है। | నిన్నటినుండి ఆమె ఆరోగ్యము బాగుగా లేదు. |
| यह हमारी दूकान है। | ఇది మా దుకాణము. |
| कल सवेरे पाँच बजे मुझे जगाओ। | రేపు వుదయము ఐదు గంటలకు నన్ను లేపండి. |
| *इस घर में कौन रहता है ? | ఈ యింటిలో యెవరు నివసించుచున్నారు ? |
| तुम्हारी किताब मेरी अलमारी में है। | మీ పుస్తకము నా అలమారులో నున్నది. |
| किसी का बुरा मत चाहो। | ఎవరి చెడుగును కోరవద్దు. |
| वह अपना काम अच्छी तरह से नहीं करता। | అతడు తన పని చక్కగా చేయుట లేదు. |
| आप काहे को वहाँ जाते हैं ? | తమరచ్చటికి యెందుకు వెళ్లుచున్నారు ? |
| क्या, आप इन्हें जानते हैं ? | తమరితనిని యెరుగుదురా ? |
| जो किताब आप के पास है, वह मेरे पास भी है। | తమ వద్దనున్న పుస్తకము నా వద్దకూడ వున్నది. |
| यह बात किसी से मत कहो। | ఈ సంగతి యెవరితోను చెప్పవద్దు. |
| वह अपने को सबसे बड़ा समझता है। | వాడు తన్ను అందరికంటె గొప్పగాతలచుచున్నాడు |
| मैं ख़ुद वहाँ जा रहा हूँ। | నేను స్వయముగా అచ్చటికి వెళ్లుచూ వున్నాను. |
| क्या, तुम्हें उनपर विश्वास है ? | మీకు వారిమీద నమ్మకమున్నదా ? |

| | |
|---|---|
| जो अपना काम खुद नहीं करता, वह पछताता है। | తన పని స్వయముగా చేయనివాడు పశ్చాత్తాపము జెందును. |
| क्या तुम्हें उसके घर का पता मालूम है? | మీకు యతని యింటి విలాసము (అడ్రసు) తెలియునా? |
| आप यह साड़ी किस के लिये ले रही हैं? | తమరీ చీర యెవరికొరకు కొనుచున్నారు? |
| तुम जिस कालेज में पढ़ते हो, उसी कालेज में मेरा भाई भी पढ़ रहा है। | నీవు ఏ కాలేజీలో చదువుచున్నావో, ఆ కాలేజీలో నే నా సోదరుడు కూడ చదువుచున్నాడు. |
| यह किस देश का नक्शा है? | ఇది ఏ దేశపు పటము? (మ్యాపు). |
| वह अपने घर पर नहीं है। | అతను (తన) యింటివద్ద లేదు. |
| तुम अपने मन की बात साफ़-साफ़ कहो। | మీరు మీ మనసులోని విషయము స్పష్టముగా చెప్పండి. |

*यह घर తరువాత में ప్రత్యయము వచ్చినందున 'यह' 'इस' గా మారినది.





U. S. I. S.

అమెరికా సంయుక్త రాష్ట్రాల యుద్ధటాంకుని కొరియా యుద్ధరంగానికి సామగ్రిని మోస్తూ ఉంది.

సీరియల్ నాటిక

# భక్తిలీల

పోలాకి శ్రీనివాసరావు

['ఆంధ్రమహిళ' పత్రికలో ప్రకటించబడుతున్న 'భక్తిలీల' సీరియల్ నాటిక యింతటితో ముగిసిపోయినది. ఈ నాటికలో పాత్రలన్నీ సహజముగా కని పించుతవి. ధన మదాంధుడు, దురహంకారి అయిన రెడ్డివంటి ప్రబుద్ధులు తమ అధీనములో వున్న బీదలను దీనులను పీడించటము, స్త్రీలను నీచదృష్టితో చూడ టము మామూలే. కాని వారికి జ్ఞానోదయము కావటము నిజముగా ఈశ్వర సాక్షాత్కారమే. ఆచారివంటి జోహుకుందారులు డబ్బాగాళ్లు వెనకవుండి సూత్ర ములను పట్టుకుని ఆడించితేనేగాని రెడ్డివంటి నాయకులు బాగా గంతులు వేయ లేరు. శాంత ధృఢ నిశ్చయము సహనము గమనించతగినవి. తమ నాటికను పత్రికలో ప్రచురింపనిచ్చిన శ్రీ పోలాకి శ్రీనివాసరావుగారికి మా కృతజ్ఞత. ప్రజలు నానాటికి ఎదుర్కొనవలసి వస్తున్న సమస్యల నాధారముగా తీసుకుని రచయిత నాటికలను వ్రాయగలరని ఆశిస్తున్నాము. సం॥]

## పదునేడవ రంగము

[ప్రదేశము: మధుసూదనుని కుటీర ప్రాంతము.

ప్రవేశము: మఱ్ఱిక్రిందను గల శ్రీ త్రినాథ విగ్రహములను శాంతా మధుసూదనులును, చిన్న రెడ్డి గ్రుడ్డిరామన్నయు పూజించుచుందురు.]

శాంత: తే॥గీ॥ అల్ల కల్లోలమై యల్ల । లాడుచున్న
చిత్త సాంద్రము లోపల । భక్తి యన్న
నావ నిర్మించి దాన త్రైరి । నాథుల నిడి
యాటు లాడించు దాననే । నాడు దాన
నందు గూడెడి యాపద । లరయ రయ్యా!

చి॥ర: తల్లీ! శాంతాదేవి! స్వాముల ప్రసాదమును యీ గ్రుడ్డి బాలునకిచ్చి కండ్లు వచ్చునట్లు దీవింపుడు.

శాంత: (ప్రసాద మిచ్చి) బిడ్డా! స్వాముల కరుణవలన కండ్లు కనుపించును చూడుము.

రామన్న: (ప్రసాదమును దిని తేరిజూచి) ఆహా! ఆహా! ఏమి నా అదృష్టము. కండ్లు కనిపిస్తూవున్నాయి.

తే॥గీ॥ చేర్తు మిము మానసమున మ । మ్మూర్తులార!
కండ్లు కనుపించె మీదగు । కరుణ వలన
జూడ గలిగితి లోకపు । జోద్య ములను
భాగ్యము ఫలించె పున్నెము । పండె నాది.

చి॥ర: ఆహా! ఎట్టి సుదినము.

తే॥గీ॥ బ్రహ్మ విష్ణు మహేశ్వర । ప్రముఖులార!
మీదు దర్శన భాగ్యంబు । మీదు సేవ
పూర్వ పుణ్య ఫలంబున । బొంద గలిగె
నాదు మానస మానంద । వార్ధి దేలె.

(ప్రవేశము ఆచార్యుడు తుంబాజీతో)

ఆచా: ఒరేయ్ చిన్నరెడ్డీ! ఏమిటూ పెంకిపని—ఓ మధుసూదనం! ఓ శాంతా! రెడ్డి ప్రభువు త్రినాథ వ్రతము చేయరాదని కఠినంగా శాసిస్తే ఆయన ఆజ్ఞకు వ్యతిరేకంగా మీరు వ్రతాలు చేస్తారూ? మీ భరతం పట్టిస్తానుండండు—ఒరేయి తుంబాజీ! నీవు వేగిరం వెళ్లి ఆ రెడ్డిని పిలువు. వేగిరం వెళ్లు.

తుంబ: ఆలాగేనండీ! (పోతూ) ఈ చీమిడి కారటం ఆగిపోతే అప్పుడు దేవుళ్లను నమ్మతా! (పోవును.)

ఆచా: ఈ చిన్న పిల్లల్ని చేతిలో కొంచెం ప్రసాదం పెట్టి యిలా సాదుల్ని చేస్తున్నారూ! మీకు శిక్ష పొందటానికి సమయం వచ్చెను తాళండి!

శాంతి: ఆచార్యులుగారూ! అన్నియు తెలిసిన మీరే యిట్లజ్ఞానము జెందవచ్చునా?

ఆచా: ఇంకా నోరు మూసికొని చక్కా ఊరుకోక నన్ను అజ్ఞానంటున్నావూ?

మధు:—శ్రీ త్రినాథులను పూజించుట తప్పా? సకల శాస్త్రము చదివిన తామే నిందించ వచ్చునా?

చి॥ర: ఈ ఆచార్యుడు చదువుకొన్నంత మాత్రమున ఫలితమేమున్నది?

తే॥గీ॥ పండితుండని లోకము। పలుక వచ్చు
సకల శాస్త్రాలు చక్కగా। జదువ వచ్చు
దాని వినియోగ పరుచని। వాని కన్న
బశువు మేలని చెప్పగా। వలయు భువిని.

శాంత: మహా పండితులు మీకు మేము ధర్మమును జెప్ప వలయునా?

ఆచా: చాలు చాలు! నోర్మూయండి. నోటికి వచ్చినట్లు వాగకండి. ఈ బొమ్మల్ని ఊడబెరకి అవల పార వేయిస్తా రెడ్డి వస్తే.

శాంత: మా దేవుళ్లను మాత్రము నిందించవద్దు.

ఆచా: ఈ నోరులేని రాతిబొమ్మ లెలా దేవుళ్లవుతారు? కాళ్లతో త్రొక్కిన రాళ్లు దేవుళ్లట! చాలించు కాషాయి వస్త్రాలు కట్టుకొని, తులసి మాలలు వేసుకొని దేవుడా! దేవుడా! అని అరిచితే దేవుడు ప్రత్యక్షమవుతాడూ? ఈలాంటి కపట వేషాలు వేసుకొని పొట్ట నింపుకుంటూన్నావు. ఆ రెడ్డి నాశ్రయించ కూడదూ? పొట్టకు పట్టెడు దొరుకదూ?

శాంత: ఆహా! ఎంతటి దౌర్జన్యము.

(ప్రవేశము రామిరెడ్డి)

ఆచా: రెడ్డీ! చూడూ! ఈ శాంతకూ ఈ మధుసూదనం గాడికి ఏ మాగడం? నీ అధికారాన్ని అతిక్రమించి త్రినాథుల వ్రతం చేస్తూ యీ చిన్నరెడ్డినీ ఆ అడుక్కున్న వెధవనీ బైరాగివాళ్లుగా చేశారు. కఠినంగా దండన విధించాలి—చిన్నరెడ్డీ! నీవు ఇంటికి పో, ఏయ్! అడుక్కున్న గుంట వెధవా! ఎవడవురా నీవు? పో!—ఆ—పో!

రామ: నేనేమి తప్పు చేశానండీ!

ఆచా: నీకు శాస్తి కావాలా పోతావా లేదా? (రామన్న పోవును)—చిన్నరెడ్డీ! నీవూ వెళ్లు.

చి॥ర: నేను మీతో వచ్చెదను లెండి.

ఆచా: ఏయ్! శాంతా! రెడ్డియొక్క పాదాలు పట్టుకొని నేరాన్ని వప్పుకొని తాను చెప్పేటట్టు తిరుగు. బాగుపడి పవిత్రానికి వస్తావు. (రెడ్డితో రహస్యముగా) మంచి అవకాశం లభించింది. కొంచెం బింకం చూపెడితే నీ వద్దకు పరుగెత్తుకొస్తుంది.

రెడ్డి: చిత్తం, చిత్తం. అట్లే చేయుదును. (మధుసూదనునితో) మధుసూదనా! ఏమీ నా యాజ్ఞకు విరుద్ధమా? అంత కండ్లుకానని చేతలా? త్రినాథ వ్రతము చేయరాదని ప్రకటింపబడినది. తిరస్కార భావమున యీ వ్రతము జేయుచున్నందుకు నీవూ నీ భార్యా దండనార్హులు. ఈ నేరమున కేమి జెప్పుకొనెదవు?

మధు: ప్రభూ! దేవుని పూజలు మాన్పింప వచ్చునా?

రెడ్డి: నోర్మూయి! నాయాజ్ఞ నుల్లంఘింతువా?—ఆచార్యా! మొదట వీనిని ఆ చెట్టునకు గట్టుడు.

పిమ్మట యీ శాంతను విచారించి దండన విధించబడును.

(ఆచార్యుడు మధుసూదను నొక చెట్టునకు గట్టును)

శాంత : హా! ప్రభూ! ప్రభూ! నా పతిని పగ్గములచే గట్టించు చుంటివా! ఇది ధర్మమేనా?—త్రినాధుల భజించునంత మాత్రమున దయా దాక్షిణ్యము లేక దండన విధించుచుంటివా?

రెడ్డి : దయా దాక్షిణ్యమేల లేకుండును? నీకు లేకుండిన నాకును లేకుండును. ఇంక నీ నేరమున కేమి చెల్పుదువు?

శాంత : ఆహా! దేవుని భజించుట నేరమా?

రెడ్డి : నోర్మూయి! మన్నూ మిన్నూ గానక సంచరించుచున్నావు. అన్ని కార్యములలోను నన్ను దిరస్కరించుచున్నావు—ఇంకనైనను నన్ను ప్రేమించి నా యుద్దేశ మంగీకరించిన మీ నేరములను మన్నించి దండన తప్పించబడును. ఏమనెదవు?—తుది పలుకు బలుకుము.

శాంత : (బిగ్గరగా) ఆహా! ఎట్టి పాపపు మాటలు వినవలసి వచ్చుచున్నది. త్రినాధులారా! త్రినాధులారా? రక్షింపుడు.

రెడ్డి : నోర్మూయి! నీ దేవుళ్ళూ గీవుళ్ళూ జూచెదను.

చి॥రె : నాన్నా! తప్పు, తప్పు. ఆమెను బాధించవద్దు. పాపము—దేవుళ్లను నిందించరాదు. హిరణ్యకశిపు డేమైనాడు?

రెడ్డి : నీవు ప్రహ్లాదుడవూ నేను హిరణ్యకశిపుడను, పో కుంకా!

చి॥రె : అది ప్రహ్లాదనాటకము, ఇది త్రినాధ నాటకము.

ఆచా : చిన్నరెడ్డీ! తప్పు అలా జవాబు చెప్పక.

రెడ్డి : శాంతా! జవాబు చెప్పకుంటివేమి? నన్ను ప్రేమించెదవా లేదా?—నీ నేరమున కేమందువు? మాటాడవేమి?—మాటాడవేమి?

ఆచా : ఆ బొమ్మలు రక్షిస్తాయని నిన్ను తిరస్కారము చేస్తూంది.

రెడ్డి : (ఆగ్రహమున) ఈ రాతి విగ్రహములా మీ దేవుళ్లు. అయిన మీ దేవుళ్లెట్టివారో జూచెదను. (కత్తిదీసి విగ్రహములను నరుకబోవ శాంతాదేవి అడ్డు నిలుచును)

శాంత : ఆ! ఆ! ఆ! ప్రభూ! రెడ్డి ప్రభూ! దొరా! దొరా! నా కన్న తండ్రులను హింస జేయకుము. నా దేవుళ్లను ఛిద్రము జేయకుము. నా రక్షకులను—జగద్రక్షకులను గొట్టకుము. వారికి బాధ గలుగనీయకుము. మనస్సు నొచ్చును. నిన్ను బ్రతిమాలుకొందును, నన్ను జంపుము, నన్ను గొట్టుము, నన్ను నరుకుము.

రెడ్డి : (ఉద్రేకమున) నిన్నే నరికెదను—నిన్నే—చూడు—నిన్నే—నరికెదను—చిత్రవధ జేయుదును.

చి॥రె : నాన్నా! నాన్నా! నన్ను నరుకుము. నన్ను జంపుము. నా ప్రాణములను దీయుము. నన్ను జిత్రవధ జేయుము. నా ప్రాణము లెట్టివో ఈమె ప్రాణములు, నీ ప్రాణములు, అతని ప్రాణము లట్టివే!

(ఒక పాము అచ్చటకువచ్చి ఆచార్యుని వెంటబెట్టును.)

ఆచా : అయ్యో! పాము, పాము. (పరుగున పోవును)

(పాము ఆచార్యుని విడిచి రెడ్డి దెస దిరుగును)

రెడ్డి : ఓ సర్పమా! నా దెసకు వచ్చుచుంటివా! నీకాలమాసన్నమైనది రమ్ము. (రెడ్డి కత్తినిదూసి నరుకబోవ సర్పము చిన్నరెడ్డిని పొడిచి అదృశ్యమగును. చిన్నరెడ్డి మూర్ఛిల్లును. అందరూ నిశ్చేష్టులై భయకంపితులగుదురు)

రెడ్డి : హా! చిన్నరెడ్డీ! రెడ్డీ! నాయనా పలుకవేమి?—మూర్ఛిల్లితివా? తండ్రీ! చిన్నరెడ్డీ! తేరిజూడుము—తల్లీ! శాంతాదేవీ! రక్షింపుము. నీ పాతివ్రత్య మహాత్మ్యము వల్లనే యిట్టి దృశ్యము జూడనైనది. నా నేరములను క్షమింపుడు. అమ్మా! నా ముద్దు కుమారుని మా చిన్నరెడ్డిని బ్రతికింపుము. రక్షింపుము. జననీ! జననీ! కోపము విడనాడుము. దయ వహింపుము.

ఇదిగో నీ విభుని బంధములను విప్పుచున్నాడను— తండ్రీ మధుసూదనా! నీవైన రక్షింపుము. (మధుసూదనుని కడకు బోయి కట్లను విప్పుచుండును.)

శాంత : ఆహా! దైవ చిత్ర మెట్టిదీ!—నన్ను గాపాడ సహాయము వచ్చిన చిన్నరెడ్డి ప్రాణముల దీయుటయా! ఓ దేవతలారా! మీ చిత్ర విచిత్ర నటనమును దెలిసికొనుట కేరితరము?—ఆహా! ఎట్టి నటనాకౌశలమును జూపెట్టితిరి! ఓ త్రినాధులారా! నాయనలారా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులారా! ఈ చిన్న బాలుని— ఈ మూర్ఛాగతుని కంట్లార జూడలేను. రక్షింపుడు. మీ మహాత్మ్యమును జూపుడు. సదా మీ వ్రతము లాచరించువాన, శ్రీ త్రినాధ వ్రత మహత్వము జూపెట్ట రారూ! కావగా! కావ—

కం॥ రారే! శ్రీ త్రైనాధులు
రారే! కాపాడగాను! రయమున నిటుకున్
రారే! తరుణము మరువక
రారే! నా తండ్రులార! రారే! రారే!

(త్రినాధులు ప్రత్యక్షముగాగా రెడ్డి, మధుసూదనులు మమత జెందుదురు)

త్రినాధ : బిడ్డా! నీ భక్తికి మెచ్చి మా త్రినాధుల దర్శన భాగ్య మొసంగితిమి. వరముల గోరికొమ్ము.

శాంత : నాయనలారా! నా తండ్రులారా! నన్ను రక్షింప నేతెంచితిరా! ధన్యురాల, ధన్యురాలను. ఈ చిన్నరెడ్డి ప్రాణముల నొసగి కాపాడుడు.

త్రినాధ : అట్లే యొసంగితిమి.

చి॥రె : (లేచి నమస్కరించి) ఓ త్రిమూర్తులారా! లోక కల్యాణవరులారా! రక్షింపుడు, రక్షింపుడు!

త్రినా : బిడ్డా! నీ భక్తికి మెచ్చితిమి.

శాంత : దేవతలారా! నాదొక కోరిక గలదు. దాని ననుగ్రహింప వేడుచున్నాను.

త్రినా : తల్లీ! ఇంకను వరముల గోరుకొమ్ము.

శాంత : తండ్రులారా! మీ దర్శనమును జెందక మమత జెందియున్న నా ప్రాణేశ్వరుని యీ రెడ్డి ప్రభువును మమత దేల్చి దర్శన భాగ్య మొసంగుడు.

త్రినా : ఓ బిడ్డా! మమత దేలిరి.

రెడ్డి : (నమస్కరించి) ఓ ముమ్మూర్తులారా! నా నేరములను మన్నించి పాప పరిహారముం జేసి రక్షింపుడు, రక్షింపుడు!

త్రినా : ఓ మానవా! సర్వ ప్రాణులకంటె మీ మానవ జాతికి విజ్ఞాన మధికముగా నొసంగబడెను. అట్టి విజ్ఞానోదయమున అగ్నిలో దుముకగలవు. నీటిలో నివసించగలవు. గాలిలో నెగురగలవు. పరమాణువు మొదలు బ్రహ్మాండము వరకు బరిశోధన జేయగలవు గాని భగవంతుని జయించలేవుగదా! భగవంతు డొకడున్నాడని తెలిసికొని, పాపభీతి జెంది సకల జీవకల్యాణమునకు నీ మానవ తేజస్సును వినియోగపరచి నీవు సంతోషించినప్పుడే దేవుడును సంతోషించును. నీ తెలివి ఏల? కాల్పనా? దానిని సక్రమముగా వెచ్చించి యింకనైన ధర్మ పథమున మనుము.

రెడ్డి : ఓ దేవతలారా! ఇంక ధర్మ మార్గమున జరించెదను. నా నేరములను క్షమించి గాపాడుడు.

త్రినా : అట్లే, గాపాడెదము.

మధు : ఓ త్రినాధులారా! మీ సందర్శన భాగ్యంబున ధన్యుడనైతిని.

శాంత : నాయనలారా! మీ సాన్నిధ్య భాగ్యమొసంగి మమ్ముల గాపాడుడు.

త్రినా : ఓ బిడ్డలారా! మీ రెల్లరును కొన్ని నాళ్లు భూలోకముననుండి మా వ్రతమును బ్రజల కుపదేశించి పిదప మా సన్నిధానమును బొందుడు.

చి॥రె : ఓ దేవతలారా! మీ వ్రతమునందొక సందేహము నాకు గలుగుచున్నది. తెలిసికొనవచ్చునా?

త్రినా : బిడ్డా! నీ సందేహమేమో గ్రహించితిమి. దీప ధూప తాంబూలాదుల మాత్రమే సమర్పించుటేల ననియేనా?

చి॥శ: నిజము స్వాములారా! నిజము. మిక్కిలి సామాన్యమైన పదార్థములనే అర్పించుట కేమి హేతువో దోచుటలేదు.

త్రినా: సర్వాంతర్యామి సర్వ వస్తువులలో నిమిడియుండ యేవస్తు వర్పించినను యర్పించకున్నను, నీలోనున్న వస్తువే తృప్తిగా నపేక్షింప బడును. ఆ దేవ వస్తువే నీ చిత్తము. దానిని నిశ్చలముజేసి భగవంతునకు సమర్పించు నదే భక్తి. కానీ మానవులు మతాది నియమములకు లోనై, దేశకాల పరిస్థితులకు తమ తమ మనోవాంఛిత వస్తువు లనేక రకముల సమర్పించి తిరిగీ భగవంతుని ప్రసాదముగా వానినే గొనుచున్నారు. వస్తువులను స్వీకరించుట వలననున్ను, తాము నియమా నియమముల వల్లనున్ను కలిగెడి మంచి చెడ్డల ఫలితములు మీరే మీ లోకమున బొందగలుగుచున్నారు. కానీ మీకు మాత్రము భక్తియే ప్రధానమైన వస్తువు.

చి॥శ: ధన్యోస్మి, ధన్యోస్మి.

త్రినా: ఓ బిడ్డలారా! భూలోకమున భక్తికి ప్రాధాన్యమొకటి మాకెట్టి పదార్థాపేక్షయు తారతమ్య భేదమును లేదనుటను, జాతి మత భేదములు లేకుండా, ధనవంతులు ధనహీనులు, శక్తివంతుల శక్తిహీనులు, అను తారతమ్యములు లేకుండా ఫలపత్రాది పుష్ప నియమములు లేకుండా; ఉపవాసాది క్లేశముల పాలు బడకుండా మమ్ముల భజించి తరించుట కొరకే నవీన వ్రతమును దీపధూప తాంబూలాదులతో మాత్రము మూడు కానుల వెచ్చముతో నియమించి కల్పింపబడినది. భక్తి తత్వమెరిగి ముముక్షువులు గందు.

తే॥గీ॥ చల్లనౌ మాదు చూపుల । జల్లగాను
జల్లి ప్రోతుము జగములు । జయము గాంచ
సలలితంబగు భక్తిచే । సంతసమున
మమ్ము భజయించి పరమ మో । క్షమ్ము గనుడు

నారదుడు: (ప్రవేశించి)

తే॥గీ॥ సాధనము ముక్తిగాంచ నౌ । సాధవ్రతము
వ్రతము జేయగ మూలము । భక్తి యొకటె
భక్తి తత్వ మెరింగి మీ । శక్తి కొలది
వ్రతములను జేయుడీ ముక్తి । బడయు కొరకు.

త్రినా: బిడ్డా! నారదా! నీ యభీష్టము దీరినదా?

నార: మీ దయారసము జిల్కినపుడు భక్తుల కేమి కొరత నాయనలారా!—ఓ భక్తులారా! భక్తిలీల శ్రీ త్రినాథ వ్రత మహాత్మ్య నాటకము నెరింగితిరి. స్వాముల భజింతము.

జే! జే! జే! జే! భారతి రమణా!
జే! జే! జే! జే! లక్ష్మి రమణా!
జే! జే! జే! జే! గిరిజా రమణా! జాయ్!!!

(తెర వ్రాలును)

సమాప్తము.

[ఈ నాటకమును వరుసగా బ్రచురించుటకు ప్రారంభించి రెండు రంగములు ప్రచురించి "వెలుగు" పత్రిక నిలిచిపోయెను. పిమ్మట మొదటి రంగమునుండి ఏడవ రంగము వరకు ప్రచురించి "ప్రబోధ" పత్రిక నిలిచిపోయెను. "ఆంధ్రమహిళ" పత్రిక మొదటినుండి పూర్తిగా ప్రచురించి సహకారము గావించెను. ఈ పత్రికల అధిపతులకు కృతజ్ఞతాభి వందనముల నర్పించుచున్నాను.

భాషాభిమానులు దీనిని పుస్తక రూపమున అచ్చొత్తించి ప్రచార యోగ్యము గావించవలసిన దనియు, అట్లు సహాయ మొసంగువారికి కాపీరైటు హక్కులు ఉచితముగా సమర్పించగలననియు వందన పూర్వకముగా తెలియజేయుచున్నాడను.

ఇట్లు విధేయుడు.
బాలబంధు, పోలాకి శ్రీనివాసరావు.
బూరవెల్లి, ఉత్తర విశాఖ జిల్లా.



# పెరుగుచున్న పసిబిడ్డలకు విటోఫెర్రిన్ అత్యవసరం

పసిపాపలకు విటోఫెర్రిన్ యిచ్చి వారి పెరుగుదలను గమనించండి. పెరుగుచుండు పాపాయిలకును, వ్యాధుల నుండి తేరుకొనుచుండువారికిని, శరీరాభివృద్ధికి అత్యవసరమగు వస్తువిశేషాలు ఇందులో ఉన్నవి.





తయారుచేయువారు:
ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్,
మల్లేశ్వరం, బెంగుళూరు.

విక్రయ ప్రతినిధులు: బెస్ట్ & కంపెనీ, లిమిటెడ్,
పోస్ట్ బాక్సు నెం. 63, మదరాసు.

BZ25-76

---

# మైసూరు పట్టు బట్టలు

## హెచ్చుకాలము మన్నిక కలవి

మునుపటికంటె ఇప్పుడు మైసూరు సిల్కు వస్త్రములే హెచ్చుగా స్త్రీలు ధరించుచున్నారు. మైసూరు సిల్కులలో శ్రేష్టమైన చీరెలు, గౌనుగుడ్డలు, రవికె గుడ్డలు మొదలైనవి స్త్రీలకు, పురుషులకుకూడా అవసరమగు సర్వ విధములగు దుస్తులును అధికముగా వాడబడుచున్నవి.



మైసూరు సిల్కులు
100 కి నూరు పంతులు
స్వచ్ఛమైనవి, కల్తీలేని
పట్టువి.



## మైసూర్ సిల్కు్స్

గవర్నమెంట్ సిల్కు వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras



అజంతా గుహాకుడ్యంలోని శిల్ప నైపుణ్యం.

లక్షులమ్మ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థినులు, వై. పద్మ, ఆర్. సుగుణ ఏప్రిల్‌లో జరిగిన లోయర్ టైప్ పరీక్షలలో కృతార్థులైరి. తిరిగి ఏప్రిల్ పరీక్షలకు శిక్షణ ప్రారంభమైనది.

కరెస్పాండెంటు.



ఆంధ్ర మహాసభలో ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారు, శ్రీ సంజీవరాయ శర్మగారిని ఆహ్వానించుచున్న దృశ్యము.

పుట్టుకచే అంధులయ్యు, గణిత శాస్త్రములో అత్యద్భుత ప్రతిభా పాటవములను గడించి, మహాసభలలో సభికులకు, గణిత శాస్త్ర ప్రవీణులకు, సంభ్రమాశ్చర్య కౌతుకములను గలిగించుచున్న శ్రీ సంజీవరాయ శర్మగారికి చెన్నపురిలో బహు ప్రదేశములలో సన్మానములు జరుగుచున్నవి. 20—9—1950 బుధవారం సాయంకాలము, వీరి ప్రదర్శనము ఆంధ్ర మహిళాసభలో కూడ జరిగినది.

# రాధా సిల్కు ఎంపోరియమ్

14, సన్నధి వీధి, మైలాపూర్, మదరాసు-4.



మీకు మా హృదయపూర్వక ఆహ్వానము.

దీపావళి, నవరాత్రులకు

ఇతర శుభకార్యములకు

మా వద్ద

మీ మీ అభిరుచులకు తగినట్లుగా

సరసమైన ధరలలో, నాణ్యత కల

పట్టు, జరీ చీరలు

నిత్యవాడుకకు, పక్కారంగులలో నేతచీరలు

దొరకగలవు.

ఒక్కసారి

మీరు మా

ఎంపోరియమునకు దయచేయుడు.

## రాధా సిల్కు ఎంపోరియమ్

14, సన్నధి వీధి, మైలాపూర్, మదరాసు.

# అశోకా టాయిలెట్ పౌడరు

మీరు అనేక విధములైన పౌడర్లను ఉపయోగించి ఉండవచ్చును. ఈ మా అశోకా టాయిలెట్ పౌడరును కూడా ఒకసారి వాడి చూడండి. దీనిని వాడినచో ముఖమునకు చక్కని అందము నిచ్చును. చర్మము నును పుగా, నిగనిగలాడునట్లుచేయును. వేసవికాలపు ఉష్ణ తాపము నణచి మీకు హాయి నొసగును.







# అశోకా టాల్కమ్ పౌడరు

ఈ పౌడరును ప్రత్యేకముగా చిన్న బిడ్డల వుపయోగార్థమై మేము తయారు చేసితిమి. మీ బిడ్డలకు దీనిని ఒకసారి వాడి చూడండి. పిల్లలకు దీనిని వాడినచో, పేలుటు, చిడుములు మొదలైనవి లేకుండ, చర్మమును పరిశుభ్రముగా నుంచును.

అశోకా మార్కును గమనించి కొనవలయును.

# ఆంధ్రమహిళ


సంపుటి 7 :: అక్టోబరు '50 :: సంచిక 6


ముఖచిత్రం:—ప్రపంచజ్యోతి, "బాపు"

చిత్రకారుడు—ఎల్. మీరాంబాబు.




సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.



ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా అయిదు రూపాయలు




సంపుటి 7 అక్టోబరు 1950 సంచిక 6

# అనుసరణ రూపమైన ప్రబోధం కావాలి.

అక్టోబరు 2వ తేదీ ఒక పండుగ దినముగా, యుగపురుషుఁడు, అవతారమూర్తి, మానవోద్యమ స్వరూపుఁడునగు మహాత్ముని 81-వ జన్మదిన వర్ధంత్యుత్సవాన్ని, ప్రపంచమంతా, అతి భక్తితో జరిపించారు. ఆయన ఆశయాలను స్మరించారు, ఉపదేశాలను ఉచ్చరించారు. ఆయన అడుగుజాడలల్లో నడవాలని ప్రబోధించారు. అయితే యీ భక్తిలో, యీ స్మరణలో, యీ ఉచ్చారణలో, యీ ప్రబోధంలో, ఒకవిధమైన అధీరత, నీరసం, స్పష్టమౌతూనే ఉన్నాయి. వేదికనెక్కి ఉపన్యసించేవారిలో బెదురు సమావేశమై వినువారిలో విరక్తి, యాదార్థ్యానికి ఆశయ లక్ష్యానికి మధ్యనున్న మరుభూమినిగూర్చి ఆలోచించేవారికి నిస్పృహా, యీ ఉత్సవంలో ప్రధాన స్థాన మాక్రమించా యనుట అతి వాస్తవము.

ఇదీ ఒక విధంగా మంచిదే యనవచ్చు. కేవలం ఊహా కెరటాలపై ఊగిసలాడకుండా, యాదార్థ్యాన్ని నేటికైనా గుర్తించటం ప్రారంభించామని దీనిభావం. స్వరాజ్యం, వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం అనేవి ప్రపంచంలో ఉన్నవనేదే మరచి, బానిసత్వపు సుషుప్తిలో మునిగియున్న మనను, జాతీయోద్యమమనే మేలుకొలుపుతో తట్టి లేపాడు మహాత్ముఁడు. మనము కండ్లు నులుము కుంటూ, ఉద్యమ తత్వాన్ని అర్థంచేసుకోకమునుపే, స్వరాజ్య సంపాదనకై యిసుమంతైనా కృషిచేయకమునుపే, ఆ మహాపురుషుడు స్వరాజ్య ఫలాన్ని అనుభవించమని మనకు ప్రసాదించాడు. అయితే ఏవిధంగా మనము దీనికి అర్హులము? విద్యవలనా, విజ్ఞానమువలనా, త్యాగము వలనా, కృషివలనా, నిష్టవలనా, నియమమువలనా, దేనివలన మనకీ అర్హత కలుగుతుంది??

అదీగాకుండా, ఉద్యమంలో మహాత్ముని అనుచరులు, ఉద్యమ వీరులుగా అనేక త్యాగములు చేసిన మహాపురుషులు, మహాత్ముని కాంతి నీడలో, ఉద్యమ ప్రవాహంలో ఈదినంత కాలము, వారు మానవాతీతులుగానే గోచరించారు. ఉద్యమానంతరము వారు కేవలము సామాన్య మానవులైపోయారు. మహాత్ముని వారసులుగా, ఆయన సంపాదించిన నిధిని తే,పానికి

రక్షకులుగా నుండవలసిన వీరు, ఆ బాధ్యత నిర్వహించటానికి యోగ్యతలేనివారై పోయారు. ఇటు రక్షకులు, అటు అనుభవించవలసినవారు. కూడ అర్హులుగాక పోవటము వలన, యీ స్వరాజ్య ఫలమును, విలువను ఎవరూ పొందలేక పోవుచున్నారు.

అయితే, యీ అర్హత ఎపుడు కలుగుతుంది? రక్షకులు, ప్రజలుకూడ, ఏ ఆశయంతో, ఏ ఆయుధంతో, ఎట్టి నియమముతో మహాత్ముడీ ఫలాన్ని పట్టుకొచ్చాడో, ఆ నియమాన్ని అవలంబిస్తూ, ఆ ఆయుధాలను పరికరాలుగా ప్రయోగిస్తూ, ఆ ఆశయాన్ని పరిపూర్ణంగా అవగాహన చేసికొన్ననాడు ఆ ఫలాన్ననుభవించే యోగ్యత మనకు కలుగుతుంది; ఆ నిక్షేపాన్ని రక్షించేశక్తి రక్షకులకూ గలుగుతుంది.

ఆ అర్హత మనలో కలగాలంటే, మన రక్షకులుగా, నాయకులుగా ఉన్నవారు, మహాత్ముని అనుచరులమని చెప్పుకొంటున్నవారు, కేవలము ఉచ్చారణ మాత్రమైన ప్రబోధం చేస్తూఉంటే, వారికీ రక్తిలేదు, మనకూ విరక్తి తప్పదు. నల్లమార్కెట్టు వ్యాపారస్థులు, మధ్యపానాసక్తులు, కులకక్ష మతకక్ష వాదులు, ఇంకా యింకా అనేక దుర్వ్యసనలోలురు, ఎవరుపడితేవారు, సాంఘికంగానో, రాజకీయంగానో, ముఖ్యంగా తమకు గల ధన ప్రాబల్యంచే ఒక పదవిని సంగ్రహించుకొన్నవారు, అనువు చిక్కినప్పుడల్లా, ఉపన్యాసవేదిక నెక్కి వీరు ఉచ్చరించే గాంధీ సూక్తులు వింటూంటే అగ్నిగుండంలో దుమికి ఆత్మహత్య చేసుకోవాలనే ఉద్వేగం పుట్టుతుంది.

అందువల్ల, నిజమైన గాంధీ అనుచరలు (ఎవరైనా ఉంటే) వారి ఉపదేశముల అనుసరించి, తమ దిన చర్యలలో కార్యక్రమంలో నిశ్శబ్దంగా చూపటం, ఎంత తక్కువ వీలైతే అంత తక్కువగా మాట్లాడటం అవలంబించటం అతివాంఛనీయం. అనుసరణతో కూడిన ఉచ్చారణ ప్రజానీకంలో నిజమైన ప్రబోధం కలిగించుతుంది.



## ఆంధ్ర మహిళా సభలో

# గాంధీ జయంత్యుత్సవము.

ది 2-10-1950 మహాత్ముని జన్మదిన వర్ధంతిని, ఆంధ్ర మహిళా సభవారు జరిపించిరి.

గం॥ 4-30 లకు, శ్రీమతి అమ్మనరాజాగారు పతాకము నెగురవేసిరి. బాలికల జండా వందనానంతరము, శ్రీమతి అమ్మన్నరాజాగారు ఉపన్యసిస్తూ, కొద్దిమంది పూజ్యులైనవారి అఖండ త్యాగముచే లభించిన మన స్వతంత్ర పతాకమును, మనమంతా అతి పట్టుదలతో ఎంతటి త్యాగానికైనా వెనుతీయక రక్షించుకోవలసిన గొప్ప బాధ్యత మనపై నున్నదని చెప్పిరి. తరువాత బాలికలు సూత్ర యజ్ఞమును జరిపిరి. ప్రార్థనానంతరము శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద జరిగిన సభలో, శ్రీ వసంతరావు వెంకటరావుగారు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, శ్రీ రామస్వామిగారు గాంధీగారి జీవితములోని ముఖ్యాంశములను గూర్చియు, వారి ఉద్యమాన్ని గూర్చియు ప్రసంగించిరి.

కార్యదర్శినులు.

# ప్రస్తుత పరిస్థితులు

శ్రీమతి అచ్యుతుని గిరిజ

## టెక్నికల్ శిక్షణ కేంద్రాలు :

ప్రస్తుతం చూస్తున్న పరిస్థితులనుబట్టి పేదలకు మంచి కాలం కనుచూపు మేరలోకి వచ్చినట్లు స్ఫురిస్తున్నది. బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం, వారికి ఉచితంగా న్యాయస్థానాలలో న్యాయం పొందే అవకాశాలు కల్పించింది. మేము మాత్రం వారికి తీసిపోతామా అని మద్రాసువారు ముందుకువచ్చారు. అయితే ప్రభుత్వంవారికన్న ప్రజలు, వారి ధర్మసంస్థలే ముందు అడుగు వేసినయ్.

మద్రాసులో పేద బాల బాలికలకు ఉచితముగా వృత్తి విద్యలలో చేతి పరిశ్రమలలో శిక్షణ నివ్వటానికి వాసలి టెక్నికల్ కేంద్రమని ఒక సంస్థను ప్రారంభించారు. ఇక్కడ ప్రస్తుతం అచ్చుపని, ఆఫీసు పరికరాలు తయారు చేయటం నేర్పుతున్నారు. మాతృభాషలో ప్రాథమిక విద్య నేర్పే అవకాశాలుకూడ కల్పించారు. యథాశక్తిని బీద బాల బాలికలకు మర్యాదగా జీవించటానికి తగిన జీవనోపాధి చూపించ పూనుకున్న యీ సంస్థకు ప్రారంభోత్సవం జరిపిన శ్రీ మాధవమీనన్‌గారు దేశంలో యీనాడు టెక్నికల్ విద్య అత్యావశ్యకమని శెలవిచ్చారు. అంటే మంత్రిగారు యిదివరలో ప్రకటించినట్లు వివిధములైన టెక్నికల్ శిక్షణ కేంద్రాలను విరివిగా ప్రారంభించుతున్నారన్నమాట.

## దేవస్థానం వారి ధర్మకార్యం :

మద్రాసు కాథోలిక్కు మిషన్‌వారు భారీ ఎత్తున దరిద్ర నారాయణుల సేవకు పూనుకున్నారు. బేసిన్ బ్రిడ్జిలో వారి కున్న ఏడెకరాల విశాలమైన స్థలములో ఆధునిక ఏర్పాట్లతో పద్ధతులతో కొత్త భవనాలు నిర్మించుతున్నారు. ఈ భవనాలలో సెయింట్ జోసఫ్ పేరిట ఒక శిక్షణ కేంద్రాన్ని బీద విద్యార్థులకు నెలకొల్పి షుమారు 200 మంది మెకానికల్ ఇంజనీరింగు, వందమంది వడ్రంగి చెక్క పనులు నేర్చుకోవటానికి అవకాశాలు కల్పించుతున్నారు. సాయంత్రం వేళల హిందీ క్లాసు తరగతులుకూడ వుంటవట. ఒక సంవత్సరమైన తర్వాత ఎలక్ట్రికల్ ఇంజనీరింగులోకూడ శిక్షణ యివ్వబడుతుందని అంటున్నారు. ప్రభుత్వంవారి సహాయం అవసరం లేకుండానే యింత పెద్ద సంస్థలు పేదల కోసం నెలకొల్పి వారికి చక్కని జీవనోపాధులు కల్పించ పూనుకోవటం నిజంగా ప్రజాసేవ అని ఒప్పుకోవాలి.

## అందరికి సైనిక శిక్షణ :

బ్రిటిషువారి హయాములో సైనిక విభాగంలో వుండేవారు తప్ప యితరులకు ఆయుధాలను చూడటానికి అవకాశం కలగలేదు. ఇంతలో గాంధీ మహాత్ముడు సత్యాగ్రహ మార్గం చూపించాడు. ఒక చెంపమీద కొట్టినవారికి రెండవ చెంప కూడ యివ్వమన్న క్రీస్తు బోధను, అహింసే పరమ ధర్మమన్న బుద్ధబోధను వంట జీర్ణింపచేసుకోమన్నాడు. కొంతవరకు ఆచరణ యోగ్యంగానే వున్నదని అందరు ఒప్పుకున్నాం. కాని యిప్పుడు పెద్ద చిక్కే వచ్చిపడ్డది. మొన్న నాసిక్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభ సందర్భంలో నెహ్రూ పండితుడు, కాంగ్రెసు అధ్యక్షుడు టాండన్‌గార్లు ఇద్దరుకూడ ప్రజలందరికి సైనిక శిక్షణ అవసరమని, తప్పనిసరిగా అందరికి శిక్షణ యివ్వాలని అన్నారు. భోన్‌సాల సైనిక శిక్షణ కేంద్రానికి వెళ్లి ఆ విద్యార్థులు కత్తులు తుపాకులు పట్టుకుని గుర్రాలమీద ఎక్కి అభివందనాలు చేస్తే చూసి మురిసిపోయినారు. కొద్దికాలంలోనే దేశమంతటా మగువ మాంచాలలు, ఖడ్గ తిక్కనలు, తయారవుతారన్నమాట. అసలే దేశం నానాభీభత్సంగా వున్నది. ఏదో ఒక విద్వేషం ఏదో ఒక కారణం పెట్టుకుని ప్రజలు పరస్పరం కలహించుకుంటున్నారు. ఇటువంటి చిత్తవికారం గల ప్రజలకు సైనిక శిక్షణనిచ్చి ఆయుధాలను సరిగా గురి చూసి వుపయోగించటం నేర్పితే బాణాసురుడి కిమల్లే వాళ్ల చేతులు ఎప్పుడు దురద పెడుతు వుంటవేమోనని సందేహం వస్తున్నది. పోనీ పరస్పర కలహాలు మాని బుద్ధి తెచ్చుకుని ప్రపంచ అశాంతి వాతావరణములో ఆత్మరక్షణకే పాటుపడతారని అనుకుందాము. మొత్తం దేశాన్నంతటినీ రెండు

# ప్రస్తుత పరిస్థితులు

ఏటంబాంబులతో విధ్వసంచేసే సామర్థ్యంగల ప్రచండులను ఎదిరించే తాహాతును సంపాదించుకోవాలి. అంటే ముందు బడికి వెళ్లాలి. బాగా చదువుకుని సైన్సు అర్థం చేసుకోవాలి. కర్మాగారాలు నిర్మించి యంత్రాలు, తంత్రాలు, అస్త్రాలు, శస్త్రాలు చేయటం నేర్చుకోవాలి. తయారుచేసిన అస్త్రశస్త్రాలన్నీ తగిలించుకుని తిరగటానికి మొయ్యటానికి తగిన బలం సంపాదించుకోవాలి. అంటే వర్తకరీత్యా లాభదాయకమైనా ఆకలి తీర్చలేని పంటలన్నీ ఆపుచేసి తప్పని సరిగా ఆహారపదార్థాలు పండించుకోవాలి. పంటలు బాగా పండించాలంటే ఆధునికమార్గాల్లో అధిక ఉత్పత్తి వుండేట్లు వ్యవసాయం చేయాలి. వ్యవసాయం సరిగా చేయాలంటే నీటి సదుపాయాలు వుండాలి. నీటి సదుపాయాలు కావా అంటే లక్షలు కోట్లు వెచ్చించి ప్రాజెక్టులు నిర్మించాలి. ఇంత తంతువున్నదిగదా అని నిరుత్సాహ పడనక్కర లేదు. ఉడతా భక్తిగా యీలోపల లెఫ్టు, రైటు, ముందుకు తిరగటం, వెనక్కు నడవటం అలవాటు చేసుకుంటూ నేర్చుకుంటూ వుందాము.

## బిచ్చగాళ్ల సమస్య :

యాచననేది అనాదిసిద్ధం. ఎప్పటికి నివారించలేము కూడాను. ఏదో ఒక రూపములో ప్రత్యక్ష మవుతునే వుటుంది. అన్నంలేదని ఒకడు, బడిజీతం కట్టలేనని ఒకడు, యాత్రలు సేవించాలని ఒకడు, ఆసుపత్రిలో ఆపరేషను చేయించు కోవాలని ఒకడు, ఆసుపత్రి కట్టించాలని ఒకడు, తుఫాను నిధికి చందా యివ్వమని మరొకడు యిట్లా అన్ని రకాల వాళ్లు అన్ని అంతస్తుల వాళ్లు తయారవుతారు యాచనకు. అయితే అందరిలోకి అధమస్తులు కనుక కాలేకడుపుతో గంజినీళ్లను అడిగే బిచ్చగాళ్లంటే మనకు ఏవగింపు. తినతిండి వుండనీడ లేక పెంటపోగు కుప్పల్లో క్రిమికీటకాలతో సమానంగా తింటూ వుంటూ వాటితో ఎక్కువ సఖ్యత కలిగించుకుంటారు యీ అభాగ్యులు. అటువంటి దీనావస్థలో వుండే వాళ్లు మనచుట్టు తిరుగు వుంటే మనసుకు నిరుత్సాహంగా వుండి బాధగా వుండటమే కాక ఆరోగ్యానికి కూడ భంగం. ఇన్ని కారణాలచేత బిచ్చగాళ్లను విచ్చలవిడిగా తిరగనివ్వరాదనీ వాళ్లనొక ప్రత్యేక స్థానంలో ప్రదేశంలో వుంచాలని నేటి సంఘపు ఆలోచన.

తత్ఫలితంగా పదేళ్ల క్రిందట కొట్టాయంలో బిచ్చగాళ్లకొక శరణాలయంస్థాపించారు. నిజంగా యింక యేవిధమైన ఆర్థిక సహాయం లేనివాళ్లను యేవిధమైన జీవనోపాధి లేని వాళ్లను యిక్కడ చేర్చుకుని పోషిస్తున్నారు. వాళ్లచేత చాపలు బుట్టలు అల్లటం చీపుర్లు కట్టించటం మొదలయిన పనులు చేయిస్తు వాళ్ల పిల్లలను గురించి ప్రత్యేకమైన శ్రద్ధతీసుకుంటున్నారు. ఆ పిల్లలకు చదువు, ఆటలు పాటలు వృత్తి విద్యలు నేర్పించుతున్నారు. మళ్లీ వీళ్లుకూడ పైతృకమైన వృత్తిలో ప్రవేశించవలసి రాకుండ వాళ్లబ్రతుకు వాళ్లు మర్యాదగా సుఖంగా గడపగల అవకాశాలు చూపించుతున్నారు. ఆ మున్సిపాలిటీలో బిచ్చమెత్తటం ఒక నేరం. ఒక మున్సిపాలిటీ విజయవంతముగా నిర్వహించ గలిగిందంటే ఆ పని యితరులుకూడ కొనసాగించ గలరన్నమాట. అంతే కాక ప్రస్తుతం బిచ్చగాళ్ల బెడద వొదిలి పోతుంది. ఆ తర్వాత వాళ్ల పిల్లలు యే వృత్తిలోనో పరిశ్రమల్లోనో ప్రవేశించి సుఖంగా జీవించుతారు కాబట్టి అప్పుడు బిచ్చగాళ్ల గొడవ అసలేవుండదు. అందువల్ల ప్రజలుకూడ శక్తికొద్ది మనస్ఫూర్తిగ సహకరించుతారు. ప్రతి వూరిలోను బిచ్చగాళ్ల సమస్య యీవిధంగా పరిష్కరించ వూనుకుంటే సాంఘికంగాకూడ ఎంతో ప్రయోజనం వుంటుంది.

## భద్రతామండలి : శాంతిదూత :

భద్రతామండలి వారి కార్యక్రమం మూరెడు ముందుకు బారెడు వెనక్కు అన్నట్లుగా వుంది. మునుపు మండలిలో ప్రతిష్ఠంబన వచ్చినపుడు నెహ్రూ పండితుడు నడుముకట్టి రష్యా తిరిగి సమావేశానికి హాజరయేట్లుగా చూశాడు. రష్యా సమావేశానికి రావటం అధ్యక్షత వహించటం జరిగినయ్. కొంతకాలము జరిగిపోయింది. కాని పరిస్థితులు అప్పటికి యిప్పటికి గేమి మారలేదు. కొరియాలో యుద్ధంనోవన యుద్ధం జరుగిపోతూనే వున్నది. అక్కడ జరుగుతున్న వినాశనానికి ప్రాణ నష్టానికి అంతులేదు. అమెరికావారు చేతిలో డాలరు మెరుస్తు ప్రపంచాన్ని మురిపిస్తున్నారు. అందువల్లే వాళ్లుచేసేవి దురాక్రమణలని తెలిసి,వింటూచూస్తూ

కూడా ప్రపంచం ప్రాకుతూంటున్నది. కొరియా సమస్య అట్లా వుండగా ఫార్మోసా చైనా సమస్య తీవ్రరూపం దాలుస్తున్నది. కమ్యూనిస్టు చైనా దేశానికి ప్రాతినిధ్యం వహించాల్సింది ఆ దేశపు కమ్యూనిస్టు ప్రభుత్వంవారు. న్యాయరీత్యా కమ్యూనిస్టు చైనా ప్రతినిధి వుండవలసిన స్థానంలో మాట పలుకుబడీ, అధికారంలేని షేక్‌వర్గ ప్రతినిధిని కూర్చోపెట్టారు. మంచూరియామీద అమెరికావారి దురాక్రమణ గురించిన ఫిర్యాదు భద్రతా మండలిలో వినిపించి వాదించుకోవలసిన హక్కును కమ్యూనిస్టు చైనాకు యిచ్చితీరాలని ఇండియా, రష్యా, బ్రిటనులు ఎంతగా చెప్పినా ప్రయోజనం లేకుండా వున్నది. ఆర్థికరీత్యా ప్రతిభవున్న అమెరికా ప్రపంచ శాంతిని నిర్లక్ష్యంచేస్తు, ధరలు హెచ్చించి అన్ని దేశాల వారిని బాధిస్తున్నది.

భద్రతామండలిని సమీపించిన సమస్యలన్నీ భద్రంగా బుట్టలో కూర్చుంటున్నయ్. మన కాశ్మీరు సమస్యా అంతే అయింది. సెంగరు అర్థంగ పోనూపోయినాడు రానూ వచ్చాడు అని సామెత చెప్పినట్లు డిక్సను దొరగారు రానూ వచ్చారు, వెళ్లనూ వెళ్లారు. సామరస్యం మటుకు కుదరలేదు. అంత త్వరగా పరిష్కారమయితే అవి రాజకీయాలనే అనిపించుకోవు. కాని ఒక్క విషయానికి సంతోషించాలి. భద్రతామండలి పుణ్యమా అని ఇండియా బుజావర్తన సత్యకాంక్ష, శాంతిప్రియత ప్రపంచమంతటు మారుమోగుతున్నయ్. ఆసియా ఖండపు ప్రాచ్య దేశాలన్నింటికి ప్రాతినిధ్యం వహించగల ప్రతిష్టను సత్ప్రవర్తన ద్వారా ఇండియా సంపాదించుకున్నది. ప్రాక్పశ్చిమాలకు శాంతిదూతగా వుండగలవాడు యావద్భారత హృదయ సమ్రాట్టు నెహ్రూ పండితుడేనని విదేశ పత్రికలు బహిరంగంగా ఘోషించుతున్నవి. శాంతిదాత మహాత్మాగాంధీ తన వారసుడుగా స్వీకరించిన నెహ్రూపండితుడు యీనాడు ప్రపంచ శాంతిదూతగా వ్యవహరించ బోతున్నాడంటే ఆశ్చర్యమేమున్నది?





## ఆంధ్ర మహిళాసభలో

# దసరా కార్యక్రమం

18-10-1950 దుర్గాష్టమి, 19-10-1950 మహర్నవమి, 20-10-1950 విజయదశమి, ఈ మూడురోజులు దసరా కార్యక్రమము, యథారీతిని, ఉదయమున దేవీ పూజతో సాయంకాలము నృత్య, నాటక, గాన ప్రదర్శనములతో జరుగును.

విద్యార్థినులకు, సభ్యురాండ్రకు, ఆటలలో, పాటలలో, నాటకములలో, హిందీ, తెలుగు భాషలందు వాగ్వివాదములలో, పోటీలు ఏర్పాటు చేయబడినవి. పోటీలలో జేర దలచినవారు 10-వ తేదీలోగా వారి పేర్లను పంపి, వివరములు తెలిసికొనవచ్చును.

జ. జమునాబాయి, అ. చన్నమ్మ ఘంటమ్మ.




## షష్ఠగుచ్ఛము

సంగీత దర్శకుడు రాధాకృష్ణ ఇంట్లో పద్మావతి సంగీత ప్రదర్శనమైన కొద్ది రోజులకు, ఒక సాయంకాలం పద్మావతి స్నేహితురాండ్రతో చీనా బజారుకు వెళ్లింది. ఫేసు పవుడరూ, తిలకాలూ, సబ్బులూ అలాంటివన్నీ కొనుక్కుందామని వారి ఉద్దేశం. హాస్టలుకు కావలసిన సరుకులు కొత్వాలు సావిడిలో కొనడానికి వసతి గృహాధికారిణి శ్రీమతి కరుణామయిగారు వస్తూవుంటే, వారితో ఈ బాలికలందరూ వచ్చినారు. అచ్చట ఒక కొట్టులోనికి ఎగబడి ఏవో రంగురంగుల చీరలూ రవికల గుడ్డలూ బేరం చేస్తున్నారు. అక్కడికి రాధాకృష్ణా ఆతని భార్య సుశీలాదేవీ చక్కా వచ్చారు.

"నమస్కారం పద్మావతీ దేవిగారూ! చీరలు కొంటున్నారా ఏమిటి?" అంటూ సుశీల, పద్మావతీ తక్కిన బాలికలూ ఉన్నచోటికి వచ్చింది.

"నమస్కారం సుశీలాదేవిగారూ! అదిగో రాధాకృష్ణగారుకూడా వచ్చారు. నమస్కారం రాధాకృష్ణగారూ, వీరందరు మా సభాపాఠశాలలో చదువుకుంటున్నారు. వీరు కరుణామయిగారు మా హాస్టలు అధికారిణి! పిన్నిగారూ, వీరు రాధాకృష్ణగారు. వీరు వారి భార్య సుశీలాదేవిగారు, మలయాళీలు. రాధాకృష్ణగారు ఎంతో ప్రసిద్ధిపొందిన సంగీత దర్శకులు." అని తొందర తొందరగా మాట్లాడింది.

పద్మావతి మోము ప్రఫుల్లమవడమూ, ఆమె కళ్లల్లో కాంతీ శ్రీమతి చూచింది. శ్రీమతి కరుణామయికి ఏమి బుద్ధి పుట్టిందో, కాని సుశీలను చూచి, "ఏమండీ సుశీలాదేవిగారూ, మీరు తెలుగు బాగా మాట్లాడుతున్నారే! కొంచెం మళయాళీ యాస ఉందనుకోండి! మీరు తప్పక మా ఆంధ్ర మహిళాసభలో మెంబరు కావాలి!" అని అడిగింది.

సుశీల : తప్పక చేరతానండీ. రేపో, ఎల్లుండో వీలు చేసుకుని వస్తాను.

కరుణా : మీరు మీ భర్తగారిచేత మా సభలో పదిహేను రోజులు తర్వాత జరిగే సభలో సంగీతం పాడించాలని మిమ్ము ప్రార్థిస్తున్నాను.

రాధాకృష్ణ: మా గృహలక్ష్మిగారిని ప్రోగ్రాంలో పెట్టలేదు కరుణామయి చెప్పారు. మీరు ఎప్పుడు వచ్చి పాడ మంటే, అప్పుడు వచ్చి, పాడడానికి సిద్ధం.

పద్మావతి: తప్పకుండా రాధాకృష్ణగారూ! ఆ సందర్భంలో సుశీలాదేవిగారూ పాడుతారు.

సు: పద్మావతిదేవిగారూ పాడుతారు.

క: చాలా బాగాఉంది! ఆ సభ సవ్యంగా రక్తి కడుతుంది.

పద్మా: అమ్మో! నేను పాడనమే!

సు: నేను పాడితే చాలా బాగుంటుందేమి! ఏమమ్మా చెబుతావు. నువ్వు పాడతానంటేనే, నేను పాడడానికి మాట ఇస్తాను.

క: మా పద్మావతి నీ నవ్వుకి ఒప్పుకుంటుంది లెండి.

రాధా: పద్మావతీదేవిగారి గురువుగారు నాకూ కొంతకాలం గురువుగారు సుమండీ! మా గురువుగారు నరసింహ మూర్తి ఫిడేలు వాయిస్తారులెండి.

పద్మా: మా మేష్టారి అనుమతి పుచ్చుకోవద్దా రాధాకృష్ణ గారూ!

రాధా: ఆయన అతి సంతోషం పడతారు.

ఇంతట్లో చీరలుబేరం సాగింది. సుశీల మంచి చీర ఒకటి తీసి, "ఇది కొనుక్కో పద్మావతి వదినా! నీకు ఇదిబాగా ఒప్పుతుంది!" అన్నది.

ఆ చీర కరుణామయికి నచ్చలేదు. అది అతి నవీన విధానంగా ముందు కుచ్చులకు వచ్చేభాగం ఎంతో పెద్దలతలతో, తక్కిన చీర రంగుకు భేదంగాఉన్న రంగుతో ఉంది. చీర అతి పల్చన. అలాంటి చీరలు కొందరు సినీమాతారలూ, పెద్ద ఉద్యోగస్థుల తనయలూ కడుతున్నారు. అయినా పద్మావతి అలాంటి చీర కట్టుకుంటే, ఆమె మనస్సు ఏఏ రీతుల ప్రవహిస్తుందో అని కరుణామయి అనుకున్నది. ఒక్కొక్క రకం మనఃప్రవృత్తి కలవారు ఒక్కొక్కరకం చీరనూ, రంగునూ ఎన్నుకోడం ఉంది. ఒక్కొక్కప్పుడు ఒకొక్క చీరా, ఒక విచిత్రమైన లతలు గలిగిన, రేతకలిగిన, రంగులు కలిగిన ఫ్లా స్త్రీలలో ఒకొక్క మార్పు కలుగ చేస్తుంది అని కరుణామయి అనుకున్నది. ఆ చీర కొనవద్దని చెప్పుదామని రెండుసార్లు అనుకున్నది. నాలుక చివరికి మాట వచ్చింది. తానుమాటంటే పద్మావతి అది రాజాజ్ఞగా పరిపాలిస్తుంది నిజమే! కాని లోన ఎంతో బాధ పడుతుంది. కానీ ఎవరిజ్ఞానం వారె సంపాదించుకోవాలిగదా అని నిశ్చయానికి వచ్చి కరుణామయి మాట్లాడక ఊరుకుంది. పద్మావతి ఆచీర కొనుక్కుంది.

తక్కిన బాలికలకు చీరలూ, రవికెల గుడ్డలూ ఏరుతూ కరుణామయీ, బాలికలూ ఆపనిలో నిమగ్నులయ్యారు. సుశీలా, రాధాకృష్ణా, పద్మావతీ షాపులోనుండి వీధిలోనికి వచ్చి అక్కడఉన్న వారి కారులో కూర్చున్నారు. సుశీల కారు నడుపుతుంటుంది.

"నువ్వే కారు నడుపుతావా ఏమిటి వదినా?" అని పద్మావతి సుశీలను అడిగింది.

"అవును. ఇది నాకారు. మా అన్నగారికి వేరే కారు ఉంది. నాకారు ఇంకోరు నడిపేందుకు అవుసరం లేదు." అని సుశీల పకపక నవ్వుతూ జవాబు చెప్పింది.

రాధాకృష్ణ చూపులు ఇంతవరకూ పద్మావతిపైనే ఉన్నాయి. అతడు సిగరెట్టు మీద సిగరెట్టు ఊదేస్తూనే ఉన్నాడు. ఆ అమ్మాయి దేహవిన్యాసము అతన్ని విపరీతంగా ఆకర్షించింది. శిల్ప శాస్త్రరీత్యా ఇంత మనోహరమైన శరీరం ఈ లోకంలో ఉండదు అని అతడనుకొన్నాడు. ఆ రూపానికి తగినట్లు మోము. ఆ మోము సౌందర్యంలో పంచదార లడ్డూవంటి ఆర్యజాతివారి రేఖలు ఉండక పోవచ్చుగాక. ఆ చామనచాయ ఎంత ఒప్పిందో! ఆ దేహం ఎంత స్నిగ్ధంగా ఉన్నదో. స్వచ్ఛమైన రంగు, ధనం సంపద రాగానే రంగుకూడా వచ్చింది. వీళ్లు మాంసాదులు తినడం మానివేశారుట. దానివల్ల మానసికంగా మార్పులు వస్తాయి కాబోలు!

ఆ బాలిక కళ్లు విశాలంగా సోగలై వెన్నెల కాంతులు పొదుపుకొని ఉన్నాయి. చామనచాయ వారిలో ఇంత అందం ఉంటుందని అతడిదివరకు ఊహించుకోలేదు.

ఈలా అతని ఆలోచనలు ప్రవహించి పోతున్నవి.

ఆర్ద్రత కలిగిన అతని చూపులు తనపై పూర్తిగా ప్రసరించి పోవడం పద్మావతి గ్రహించింది. అతని హృదయంలో తన్నుగురించిన ఏవో ఆలోచనలు గుబాళించుకొంటున్నాయనీ ఆమె ఊహించుకుంది. ఇంత పేరుపొందినవాడు, ఇంత గాయకుడు తానంటే సమ్మోహపడడం తనకెంతో గొప్ప అనుకుంది. ఆమెకు ఏదో పట్టరాని ఆనందం కలిగింది. 'మీరూ మా వదినా పాడేటట్లయితే నేనూ పాడతానండీ రాధాకృష్ణగారూ!" అని చటుక్కున పద్మావతి అన్నది.

రాధాకృష్ణ చకితుడై "ఆఁ ఏమిటీ! చాలా బాగుంటుంది. ఆరోజు మనవాళ్లందరికి దివ్యమైన సంగీతం పిండి వంటలు విందు చేద్దాము." అన్నాడు. ఇంతట్లో కరుణామయి తక్కిన బాలికలూ పైకి వచ్చారు. పద్మావతి వారందరితో కలసి ఆంధ్ర మహిళాసభకు వెళ్లిపోయింది.

౨

బుచ్చి వెంకట్రావు రాధాకృష్ణ యింటిలో జరిగిన సంగీత ప్రదర్శనం జరిగిన పదిరోజులకు ఒక సాయంకాలం తన కారుమీద ఒంటిగా రాధాకృష్ణమేడకు వచ్చినాడు. ఆతనికి ఇన్నాళ్లకూ మంచి స్నేహాలు దొరకలేదు. వ్యాపార సంబంధం కలిగినవారు పదిమందితో ఆతనికి పరిచయం కలిగినమాట నిజమే! కాని అది పరిచయంగానే ఉండి పోయింది.

ఆతనికి అతి సన్నిహిత మిత్రుడు నరసింహమూర్తి మేష్టారే! ఇంతవరకూ భార్యాతానూ సర్వతోముఖంగా జ్ఞానవంతులవ్వాలన్న దీక్షే ఆతనికి స్నేహాలు అవసరం లేకుండా చేసింది. ఇప్పుడు భార్య దూరమైపోయింది. మదరాసులో నరసింహమూర్తి మేష్టారు నానాటికి తనకు తాబేదారయ్యాడు. స్నేహం చాకిరీగా మారిపోయింది.

ఇంక ఆతనికి తన వ్యాపారంతప్ప ఇంకో వృత్తి లేక పోయింది. సాయంకాలం ఏమీ తోచేదికాదు. బీచికి వెళ్లడం మొదటిదినాలల్లో కొంత కాలక్షేపం అయింది. సినీమాలు కొంత కాలక్షేపం తీర్చేవి. చివరికి రెండూ విసుగు పుట్టించాయి. కొన్ని దినాలు ఆలా కారు వేసుకొని మద్రాసంతా తిరిగేవాడు. ఆ మహా నగరంలో ఆతడు వెళ్లనిచోటు లేదు, తిరగని సందులేదు. అదీ విసుగు పుట్టించింది.

ఆలాంటి బుచ్చి వెంట్రావుకు రాధాకృష్ణ మంచి స్నేహితుడు కావచ్చును అనిపించింది. ఆ ఆలోచనలతో రాధాకృష్ణ ఇంటికి వచ్చాడు.

రాధాకృష్ణ ఇంటిలో లేడు. "ఏదో సినీమా చిత్రంలో ఒకపాట రికార్డు చేస్తుండడమువల్ల వారు వెళ్లినారు" అని సుశీలాదేవి ఆయనతో చెప్పి, "రండి! కాస్త కాఫీ తాగుదురుగాని!" అని లోని హాలులోనికి ఆహ్వానించింది.

బుచ్చి వెంకట్రావు బలసంపద కళ్లు తనివోవ సుశీల చూస్తూ ఆతడు కూర్చున్న సోఫాకు ఎదురుగానున్న సోఫాలో కూర్చుంది.

"మీరు యుద్ధానికి వెళ్లివచ్చారా వెంకట్రావుగారు?"

"వెళ్లివచ్చాను. కాని అదినాకు ఉపకారమే చేసిందో, అపకారమే చేసిందో?"

"అదేమిటి ఆలా అంటారు?"

"అవునండీ! యుద్ధానికి వెళ్లకముందు నేను పట్టి పల్లెటూరి పల్లెవాడిని. యుద్ధంనుంచి వచ్చాను. ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలు పుట్టాయి. చేపల వర్తకం పెట్టాను. రంగూనుకు రొయ్య పప్పు ఎగుమతీ. రెంటిమూలాన బాగా లాభం వచ్చింది. ఇంకా నాకూ మా ఆవిడకూ జ్ఞానసముపార్జనతృష్ణ ఉద్భవించింది. నాగరికతా, చదువూ కావాలి. ఆవిడకు సంగీతమూను. మేము నాగరికుల మయ్యాము. కాని తృప్తీ ఆనందమూ మాత్రం మాయ మయ్యాయి సుశీలాదేవిగారూ!"

బుచ్చివెంకట్రావు మాట్లాడుతున్నంత సేపు సుశీల ఆతనివైపు రెప్ప వాల్చకుండా చూస్తూంది. ఎంత విచిత్రంగా ఉంది బుచ్చి వెంకట్రావు కథ. పద్మావతిలోనూ ఏదో అసంతృప్తి ఉంది. ఈతనిలోనూ ఏదో అనూహ్యమైన ఆవేదన బయలుదేరింది. తన జీవితమూ చిత్రమైనదే. తనకు ఈ వివాహంకాక ముందే పురుష సంబంధం ఉన్నది, స్కూలుఫైనలు పరీక్ష అయి తిరువాంకూరులో సంగీతమూ, నాట్యమూ కొంత నేర్చుకొంది. ఒక మళయాళీ సినీమా

చిత్రంగా కేవలం [illegible] (ప్రేమ [illegible] నాట్యశేఖరు అనుకోండి; [illegible] వచ్చాయి. [illegible] [illegible] వచ్చాయి. అందులో నాట్యశా స్త్రమును [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible] లోచించా, అనేకట్ల [illegible] చేరు వచ్చింది. [illegible] [illegible] [illegible], నాట్య [illegible] [illegible] కళ [illegible] [illegible] నాట్యశేఖరు [illegible] [illegible] [illegible] స్తా. అనేక [illegible] ఒకటి [illegible] ఉన్నారు. కొంత డబ్బు బ్యాంకిలో వేస్తున్నారు. తన జీవితం హాయిగా ప్రశాంతించిపోయింది. కాని

"[illegible] వెంకట్రావుగారూ! తృప్తి, ఆనందమూ అనేవి మనలోఉన్నా యంటూరా, పైనుంచి వస్తేవంటూరా?"

"మనలోనే ఉన్నాయనుకోండి. కాని, పైన మనకు సంభవిస్తున్న పరిస్థితులను బట్టికదా మనకు ఆనందమూ తృప్తీ కలగటము!"

"అవును. నిజమే కాని, ఎలాంటి పరిస్థితి మనకు సంఘటించినా, దానివల్ల మన ప్రవృత్తి ఎందుకు మారాలి?"

"నిగ్రహం కలవారికి మారదనుకోండి. కాని ఎందుకు మనం ఈ పనులన్నీ చేస్తున్నామో తెలియనివారికి నిగ్రహం కలుగదు. జ్ఞానం వృద్ధిఅయినకొద్దీ, మనస్సుకు నిలకడ ఏర్పడుతుంది."

"సంపూర్ణ జ్ఞానం కలవారికి?"

"సంపూర్ణత అనేది జ్ఞానానికి ఉందా?"

"కాబట్టి, జ్ఞానం సంపాదించడానికి అంతులేదు. కాబట్టి జ్ఞానం సంపాదించే వారందరికీ అసంతృప్తి అన్నమాటేనా?"

"ఈ విషయాలన్నీ ఆలోచించడానికి నాకు శక్తి ఎక్కడ ఉందండీ!"

"కాబట్టి ఏమీ ఆలోచించకుండా ఉండరాదాండీ!"

"అది ఎల్లా సాధ్యం! నేను యోగినా? ఉప్పు పులుసూ కారమూ తినేవాడిని."

"అయితే ఆ ఆలోచనలవల్ల వచ్చే [illegible], [illegible] [illegible] [illegible] [illegible]. అసంతృప్తివల్ల వచ్చే వ్యాధులను బాధను భరించాలని ఉన్నది."

"అందుకనే ఎప్పుడూ ప్రయత్నం చేస్తున్నారు?"

ఇంతట్లో నాయుడు ఏవేవో ఫలహారాలు, "టీ కెటిల్‌"తో "ఫ్లాస్కో", పంచదార పకిట్టా చంచాలు, అన్నీ, పట్టుకు వచ్చి, ఆ [illegible] హాలులో ఒకమూలగా ఉన్న టీ బల్లపైన ఉంచాడు. సుశీల "రండి వెంకట్రావుగారూ!" అని పిలిచి ఆతన్ని టీ బల్లకడ ఉన్న కుర్చీలో ఒకటి కూర్చుండ కోరింది. వాళ్ళిద్దరూ కూర్చుండి ఉపహారం సేవింప సాగించారు.

"ఏమండీ వెంకట్రావుగారూ! మీరు తోచనప్పుడల్లా మా ఇంటికి రండి. ఎప్పుడు పడితే అప్పుడే రావచ్చును. నేను అరవ సినీమా చిత్రాలలో, మలయాళ చిత్రాలలో, నాకంతెను కొందరు సినీమా తారలకు ఇస్తున్నాను. అందుకై పాటలు రికార్డింగుకు మాత్రం వెడుతూ ఉంటాను. నాట్యకర్తగా సినీమా చిత్రాలలో నటిస్తాను. గనుక, ఆ సమయాలలో తీరుబడిఉండదు. కాబట్టి మీరు ముందు ఫోనుచేసి, మా ఇద్దరిలో ఎవరన్నా ఉన్నారో లేరో కనుక్కొని, ఎవరున్నా తప్పకుండా రండి. మీ ఆవిణ్ణికూడా తీసుకు వస్తూ ఉండండి."

"మా ఆవిడ ఆంధ్రమహిళాసభ విద్యాలయంలో విద్యార్థిని. ఆవిడ ఆ సభ విద్యాలయం, వసతిగృహాల క్రమశిక్షణకు బద్ధురాలుకదా! కాబట్టి ఎప్పుడు ఆవిణ్ణి వీలుగా తీసుకురావచ్చునో అప్పుడల్లా తీసుకు వస్తాను."

"మీరెప్పుడు ఇంటిదగ్గిర ఉంటూ ఉంటారు."

"ఇల్లూ, ఆఫీసూ ఒక్కటే గనుక ఎప్పుడుబడితే అప్పుడే ఉంటాను."

"అయితే నేనుగాని, నేనూ మా ఆయనాగాని, మా ఆయన ఒక్కరేగాని మీ ఇంటికి తరుచుగా వస్తూవుంటామండోయి."

"అంతకన్న భాగ్యమేముందండీ!"

౩

అంతకన్న అంతకన్న బుచ్చి వెంకట్రావుకు సుశీలతోనూ రాధాకృష్ణతోనూ స్నేహం ఎక్కువయినది. ఈసారి వీరింటికి రావడమూ, వీరు బుచ్చి వెంకట్రావు ఇంటికి వెళ్లడమూ! అందరూ కలిసి సినిమాకు వెళ్లడమూ! వెంకట్రావుకు కాలం జరగటం లేదని ఆవేదన పోయింది.

ఆతనికీ సుశీలకు స్నేహం ఎక్కువైంది. సుశీల ఆతణ్ణి ఒక్కణ్ణే కలుసుకునేది. ఆతణ్ణి కారుమీద ఈ ఊరు ఆ ఊరు ప్రయాణం చేయించేది. రాధాకృష్ణ "సుశీల మీ చెల్లెలనుకోండి. మీ రామె స్నేహంలో ప్రపంచజ్ఞానం పూర్తిగా అలవరచుకొంటారు బుచ్చి వెంకట్రావు బావ గారూ!"

సుశీల బుచ్చి వెంకట్రావుకోసం రాగానే ఆతని భుజాల మీద చేయివేస్తుంది. ప్రక్కనే కూర్చుంటుంది. ఆతని ఛాతీ మంచి విశాలమైనదని తడుముతుంది. దండలు ఉక్కుతో చేసివుంటారని నొక్కుతుంది. తనకు బలమైన వాళ్లను చూస్తే ఆనందమంటుంది

సుశీల కలుపుగోరుతనమూ, ఆమె లేనిపోని పిచ్చిపిచ్చి ఊహాలు పెట్టుకోకుండా తనతో సాయిలా బాయిలాగా ఉండడమూ ఆతనికి చాలా ఆనందం కలిగింది. ఆతని హృదయంలో ఏవో బరువులు కరిగిపోయి నట్లయినది.

మధ్యమధ్య ఆంధ్రమహిళాసభ పాఠశాల ప్రధానోపాధ్యాయిని అనుమతితోనూ వసతి గృహాధికారిణి అనుమతితోనూ పద్మావతిని రాధాకృష్ణగారింటికి బుచ్చి వెంకట్రావు తీసుకు వచ్చేవాడు. ఆసమయంలో రాధాకృష్ణ ఆనందానికి మేరలేకపోయేది. పద్మావతీ ఆతడూ సంగీతం అని కూర్చునే వారు. రాగాలు, తాళాలు, సినీమాలలో ఆనాడు ఎక్కువగా వాడుకలోనికి వచ్చిన పాటలు, అవి విపరీతంగా ప్రజామోదం పొందడానికి హేతువులు, గట్టిసంగీతం ఎందుకు ప్రజలకు భరింప రానిదవుతున్నది, ఈ విషయాలు ఆమెకు చెప్పేవాడు రాధాకృష్ణ. ఆమెకు ఉత్తరాది, మహారాష్ట్ర సినీమాల పాటలు గ్రామఫోనులో వినిపించేవాడు, తాని చ్చిన వరసలు ఉత్తరాది వరసలకన్నా, దక్షిణాది వరసలకన్నా ఎందుకు బాగుంటాయో చెప్పేవాడూ, ఆయా వరసలూ, ఆయా పాటల వరసలూ పాడి వినిపించి ఆమెకు తెలియ చేసేవాడు.

ఆమేడలో సుశీలా, వెంకట్రావూ లోకైకృష్ణనకూ పద్మావతీ రాధాకృష్ణ లోకైకృష్ణనకూ కేటుకు వెళ్లేవారు. పద్మావతిని ఏదేని వంకతో రాధాకృష్ణ స్పృశించేవాడు. ఆమె దేహం తన శరీరానికి తగులుతూ ఉండేటట్లు సోఫాలో కూర్చుండేవాడు. నడుస్తూ ఉన్నప్పుడు, ఆమె నడుంచుట్టూ చేయివేసేవాడు.

మొదట పద్మావతి భయపడింది. ఈ విధానం అతి నవీనం కాబోలు. ఇందులో తప్పులేదని సమాధానం పెట్టుకున్నది. అంతకన్న అంతకన్న రోజులు గడిచినకొద్దీ ఆ బాలికకు రాధాకృష్ణ స్నేహం అతి అవసరమైనది. సంగీతం విషయాలు నేర్చుకోవడం ముఖ్యమే! అంతకన్న ముఖ్యం రాధాకృష్ణ మాటలే! ఆతడు మాట్లాడేవన్నీ ఆమెకు తెలియదు. ఆతడు ఏవేవో చెప్పేవాడు. ఆతడు ప్రపంచం లోని అన్ని విషయాలు తెలిసికోలేదు. ఆతని చదువూ అంత పెద్దదికాదు. రోజూ వచ్చే దినపత్రికలు వార్తలిస్తాయి. కొన్ని ఉపన్యాసాలు ముద్రిస్తాయి. అవి విజ్ఞానం విషయాలేమి చెప్పగలవు? స్నేహితులైన సినిమావారు మాట్లాడుకునే మాటలూ, చప్ప చప్పని ఆరణాల మాస, పక్ష పత్రికలు ఏమంత జ్ఞానం ఈయగలవు?

అయినా ఇప్పుడిప్పుడే ప్రపంచ జ్ఞాన వాతావరణంలో హృదయపుష్ప పుటాలు విప్పుతూన్న పద్మావతికి ఆతడు ఏ విషయం చెప్పినా అవన్నీ అద్భుతంగానే ఉండేవి. ఇంతకూ ఆతడు అదృష్టవంతుడూ, చాలా తెలివైన సంగీత దర్శకుడూ!

ఇటు పద్మావతికి ఏరీతిగా ఏదో సంతృప్తి హృదయం నిండిపోయిందో, ఆ రీతిగా సుశీలాదేవి స్నేహంవల్ల బుచ్చి వెంకట్రావుకూ వర్ణింపరాని తృప్తి కలిగింది.

ఆతని హృదయంలోనూ సుశీలాదేవి విషయంలో స్త్రీ పురుష సంబంధ విషయికమైన భావాలు కలుగలేదు. ఆలాంటి భావాలేమైన పద్మావతీ వెంకట్రావుల హృదయ

(తరువాయి 16వ పేజీలో)

# ధర్మసంస్థాపన—గీతాసూక్తి

# గాంధీజీ సందేశము

* శ్రీమతి వేపపల్లి తాయారమ్మ *

శ్లో॥ యదా యదాహి ధర్మస్య । గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య । తదాత్మానం సృజామ్యహం ॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనామ్ ।
వినాశాయచ దుష్కృతాం ।
ధర్మ సంస్థాపనార్థాయ ।
సంభవామి యుగేయుగే ॥

అని గీతాసూక్తి 4 అ॥ 7, 8, శ్లో॥

"అర్జునా! ధర్మమునకు కీడుఁగలిగి, అధర్మము విజృంభించి నప్పుడు నేనవతరించెదను. మఱియు సత్పురుషులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును, ఆయా యుగ ధర్మములను స్థాపించుటకును ప్రతి యుగమునందు నవతరించుచున్నాను." అని పై శ్లోకములకర్థము. ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రములో కురుపాండవ యుద్ధ ప్రారంభమునందు, ఉభయ సేనలమధ్య నరఋషి కళతో జన్మించిన యర్జునుడు రథారూఢుడై, తన బంధు మిత్రాదులను ఆచార్యులు మొదలైన వారినిఁజూచి ఒక్కమారుగా విషాద వాతావరణంలో మునిగి పోయాడు. శరీరమంతా కంపించి భగ్నమని మండించి. గాండీవము చేతినుండి జారింది. "అత్యల్పమును నశ్వరమునైన రాజ్యభోగముల కొఱకా? ఇందరు బంధుమిత్రులను హింసించుట!" అని గాఢ వైరాగ్యము కలిగిందా ఋషిజన్మకు. కాని తన కత్యంత ప్రియసఖుడును, మేనమరిదియు, చిత్రప్రియుడును, ప్రస్తుతము రథసారథియు నగు శ్రీకృష్ణభగవానుడా విషాదజ్వాలలను తనగీతామృత వర్షముచే శమింపజేసి యుద్ధోన్ముఖుని జేసాడు.

అలా చేయడానికి కారణము? ఏ యుగంలో గాని యేకాలంలో గాని ధర్మం తారుమారు అయ్యే సమయంలో భగవంతుడు తానే యవతరించియో, లేక తన కళతోనే మహాపురుషు లైన యవతరింపజేసియో ఆయా యుగ ధర్మాలను నిలబెడుతూ శాసిస్తూ యుంటాడు. సృష్ట్యాదినుండీ అటువంటి యవతారాలు జరుగుతూ యున్నందువల్లనే భగవంతునికి అనంత కోట్యవతారములని ప్రసిద్ధి కలిగింది.

క్రీస్తుకు పూర్వము సుమారు 600సం॥ల క్రిందట మన భారతదేశంలో శక్తిపూజ విశేషంగా నుండేది. మద్య మాంసాది నైవేద్యాలు, జంతు బలి విశేషించి నరబలి రక్త పానము మొదలైన యత్యాచారాలెన్నో వామాచార పద్ధతి నుండేవి. ప్రజల్లో స్త్రీలు, బాలురు, స్వేచ్ఛగా తిరగడానికి కూడ కష్టంగా వుండేది. అటువంటి హింసా ప్రపూర్ణమైన కాలంలో దాని నరికట్టడానికి శ్రీ బుద్ధభగవానుడు అవతరించాడు. జప, తప, యజ్ఞ, యాగాదులన్నిటి మట్టుబెట్టి "అహింసా పరమో ధర్మః" అనే ఒక్క ధర్మాన్నే స్థాపించవలసి వచ్చినది. అంతటి తీవ్ర చర్య తీసుకొనకపోతే అనేక సంవత్సరాలనుండి వ్రేళ్ళు పాతుకుపోయిన ఆచారాల్లోంచి ప్రజల నీవలకు లాగడానికే సాధ్యంకాదు.

దేశంలో యూదుల దురాచారాలను రూపుమాపడానికి అవతరించిన యేసుక్రీస్తు కూడా అట్లే సత్యాహింసలను ప్రభోధించాడు. బుద్ధభగవానుని తరువాత కొంతకాలం శాంతంగా శాంతంగా అహింసా ప్రచారం సాగినా, కాల క్రమేణ తగిన నాయకుడు లేకపోవడం చేత ఆ సిద్ధాంతం వెఱ్ఱితలలువేసి ప్రజలను పాషండులుగా తయారుచేసింది. అప్పుడు మళ్ళీ హిందూ ధర్మం క్రమపద్ధతిలో నడిపించడానికి శ్రీ శంకరాంశ సంభూతుడైన శంకరాచార్యులవతరించి వైదిక మతోద్ధారణఁజేశారు.

ఇలాగే రాజారామ్‌మోహానరాయ్ అమానుష కృత్యమైన సహగమన దురాచారాన్ని రూపుమాపాడు. కేశవ చంద్ర సేనుడు ప్రారంభించిన ఏకేశ్వరోపాసనా రూపమై బ్రహ్మ మతాన్ని విశ్వ వ్యాప్తిచేశాడు.

# గాంధీజీ సందేశము

ఇట్లే యెందరో మహానుభావు లాయా కాలానుసారంగా కారణజన్ములై జన్మిస్తారు. వీరిలో నవయుగ శాంతిదూత యైన శ్రీ మహాత్మా గాంధీజీ ఒకరు. వీరు క్రీ. శ. 1869సం॥ అక్టోబరు 2వ తేదీన గుజరాతు దేశమందలి "పోరుబందరు" గ్రామంలో జన్మించారు. భారతదేశం విదేశీయులైన బ్రిటిష్ వారిపాలనలోకి వచ్చిన కొంత కాలానికి మనదేశీయులు దేశ స్వాతంత్ర్యం కొఱకు... కాంగ్రెసు ఉద్యమాన్ని లేవదీశారు. దానికి గోఖలే, తిలక్, లాలాలజపతిరాయ్ మొదలైన మహాశయులు వేసిన బాటకు శ్రీ బాపూజీ అసహాయోద్యమ మనే తారురోడ్డు వేసి 1921సం॥లో స్వరాజ్య రథానికి సారథ్యం వహించాడు. దౌర్జన్య రాహిత్యమైన పద్ధతిలో స్వరాజ్యం సంపాదించాలని గట్టిపట్టు పట్టాడు. దానికి అంగాలుగా, ఆహారనియమం, బ్రహ్మచర్యం, సర్వభూత సమత్వం, హరిజనోద్ధారణ, మొదలైన భగవల్లక్షణాలన్నీ అవలంబించాడు. అన్నిటికంటె ప్రధానంగా సత్యము, అహింస, అనే రెండు దివ్యాయుధాలను ధరించాడు. ఆయనకు ప్రామాణిక గ్రంథము శ్రీ భగవద్గీత. ఒకచేత గీత ఒకచేత తకిలీ పట్టుకొని స్వరాజ్య సమరం సాగించాడు. మాయాసంగరకోవిదులు, రాజనీతి విశారదులునైన పాశ్చాత్యులుకూడా భగవత్కృపతో గూడిన బాపూజీ సత్యాహింసలకు జోహారుచేసి 1946సం॥ ఆగస్టు15వ తేదీని భారతాంబకు స్వేచ్ఛను ప్రసాదించారు.

గాంధీజీ యింతటి యపూర్వ విజయం పొందడానికి సాధనమైనది శ్రీ గీతాసూక్తి. అందలి కర్మయోగాన్నే ఆయన యెక్కువ యవలంబించాడు. సర్వోపనిషత్సారమైన గీతలో శ్రీ కృష్ణభగవానుడు ముముక్షువు, లాచరింప వలసిన ధర్మములను కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములని మూడు యోగములను సంపూర్ణంగా విశదీకరించారు. అర్జునుడు చేయవలసిన పని సంహారకృత్యము గనుక దానివల్ల కలిగేదోషాలను తలచుకొని భయపడగా, అట్టిదోషాలేవీ యతని కంటుకుండేలాగు ప్రథమంలో స్వామికర్మ యోగాన్నే యుపదేశించారు. ఈ కర్మ సిద్ధాంతములను మన్వంతరాదిలో భగవంతుడు వివస్వతున కుపదేశించాడు. అప్పటినుండీ రాజర్షులంతా యీ సిద్ధాంతముల ననుసరించియే లోక సంగ్రహార్థము ప్రజాపాలన గావించారు.

ఫలాపేక్షలేకుండ కర్మ నాచరించుట, కర్మఫలము నంతయు యజ్ఞపురుషుడైన భగవంతున కర్పించుట, కేవల లోక సంగ్రహార్థమే కర్మనాచరించిన వారు కర్మయోగసిద్ధిని బొందుతారు అని ఆ సిద్ధాంతములు.

ఆ సిద్ధి యేమనగా, మన జీవాత్మ అనేక జన్మలలో చేసిన శుభా శుభ కర్మలయొక్క ఫలితమునంతా సంచిత రూపమున జీవునకంటియుండి జనన మరణములకు సుఖ దుఃఖ ములకు కారణ మవుతుంది. అటువంటి కర్మ దోషముల నుండి, కర్మవాసనలనుండి విముక్తి చెందకపోతే జీవుడు పరిశుద్ధుడు కాలేడు. తన యెదుటనే యున్న పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందలేడు. జీవాత్మ పరమాత్మయొక్క యంశమే గనుక సంభావముచే పరిశుద్ధుడైనా, ఆతని నావరించియున్న అవిద్యచేతను, దేహాభిమానముచేతను, కర్మ దోషములవల్లను సంకుచిత జ్ఞానుడై జనన మరణ ప్రవాహంలో బడి మునిగి తేలుతూ యుంటాడు. అటువంటి దోషాలన్నిటినీ పరిహరింపజేసుకోడానికి ప్రతి ముముక్షువు విధిగా కర్మయోగము నాచరించాలి.

శ్రీ గాంధీజీ స్వరాజ్య సంపాదనా దీక్షా పరతంత్రుడైనందున ఆ కార్య దీక్షలో తాను చేసే కృత్యములు భారతీయులచేత చేయించబోవు కృత్యములు, వాటికి సంబంధించిన దోషములేవీ యంటకుండే నిమిత్తము, తాను సంకల్పించిన కార్యసిద్ధికొఱకు, భగవద్గీతలను మననముచేసి కర్మయోగానికే యెక్కువ ప్రాధాన్యమిచ్చారు. ఆ యోగము నందు సిద్ధిబొంది "అనాసక్తియోగము" అను గీతావ్యాఖ్యాన గ్రంథమును తన మాతృభాషయైన గుజరాతీభాషలో వ్రాసి ప్రచురించారు. ఫలాపేక్ష లేకుండా కర్మచేయుటయే గీతకు పరమసిద్ధాంతము గనుక వారి వ్యాఖ్యానానికి "అనాసక్తి యోగము" అనే పేరుపెట్టారు. "స్వరాజ్య సంపాదన సాధ్యమా" అని యెందరు హేళనజేసినా, "ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంతప్తులై, ఆరంభించి పరిత్యజింతురు, విఘ్నాయత్తులై మధ్యముల్" అని భర్తృహరి మహాశయుడుచెప్పినట్లు తనపట్టిన పట్టు వీడక, మానావమాన

ములు, సుఖదుఃఖములు లాభాలాభములు, జయాపజయము సమంగా చూచుకొని, భారతీయులందరిని తన మార్గానికి త్రిప్పి తాను తెరవెనుకనుండే కృషి చేసేవాడు.

"ఓ పార్థా! నాకు మూడు లోకములందును చేయవలసిన పని కొంచమైనను లేదు. పొందదగిన వస్తువేదియు పొందబడకుండలేదు. అయినను నేను కర్మచేయుటయందే నిమగ్నుడనై యున్నాను. అట్లు నేనెప్పుడైన కొంచమైనను కర్మచేయుటయందు ప్రమత్తుడనై యున్న యెడల జనులు నన్నే యనుసరించెదరు. అనగా సోమరులైపోదురు. అప్పుడు నేను కర్మనాచరించని యెడల యీ లోకములన్నియు ఉత్సన్నములగును. అనగా నశించును. నేనే అవ్యవస్థకు కర్తనై లోకములను నాశముచేయు వాడనగుదును" అనే ప్రమాణాన్ని బాపూజీ చివర చివరకు ఆచరించారు. ఏవిషయాన్ని గాని ఉపన్యాసవేదిక నెక్కి నర్దించలేదు. తాను సంకల్పించిన ప్రతివిషయము కార్యరూపంలో చేసి చూపేవాడు. ఆయనకు పరమ ప్రియమైన రాట్నం పరిశ్రమను తన అనుచరులెవ్వరూ పూర్ణంగా ఆచరించకపోయినా, తానుమాత్రం యెప్పుడు తకలీ తీస్తూ నేయుండేవాడు చెప్పి చేయించడమనేది పురాణ వైరాగ్యం. కఠినమైన జితేంద్రియత్వము బ్రహ్మచర్యము మొదలైన మునీంద్ర కృత్యాలన్నీ స్వయంగా ఆచరించి చూపి జనులకాసక్తి కలిగించిన మహాయోగి. దేశంలో ధనిక దరిద్ర భేదంలేకుండా చేయడానికెన్నో శ్రమలు పడ్డాడు. ఇక స్త్రీలవిషయంలో, చెప్పాలంటె బాపూజీ చేసిన కృషి అపారం. అసూర్యం పశ్యలైన రాణివాసపు స్త్రీలుకూడా బాపూజీ ఆదర్శాన్ని శిరసావహించి కార్యరంగంలో దుమికారు. కారాగారాల్లో బిడ్డలను కన్న మాతృదేవతలు కూడా ఉన్నారు. గాంధీజీ యుగ ధర్మాన్ని స్థాపించడాని కవతరించిన మహనీయుడైనందున నేటికాలానికి కావలసిన పనులన్నీ తానే ఆచరించి మనచేత ఆచరణలో పెట్టించాడు.

ఇటువంటి కర్మాచరణనే శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకుపదేశించి బంధువధ జనితమైన మహాపాపాన్ని అంటకుండా జేశాడు. ఆధ్యాత్మిక పక్షంలో మన జీవాత్మకు అనేక జన్మలలో జేసిన కర్మఫలము సంచితరూపంగా యుంటుంది. ఆసంచితమువల్లనే జీవునకు జరామరణాలు, సుఖ దుఃఖాలు కలుగుతూ ఉంటాయి. ఈ జన్మలో ఫలాపేక్ష లేకుండా చేసిన కర్మ ఉత్తరజన్మకు కారణము కానేరదు. కాని సంచితకర్మను పూర్తిగా నశింప జేయలేదు. ఆగామినే పూర్తిగా అరికడుతుంది. సంచితము జ్ఞానయోగమువల్లను, భక్తియోగమువల్లను పూర్తిగా నశిస్తుంది.

కర్మయోగసిద్ధునకు జ్ఞానయోగ భక్తియోగములు రెండు లభించి, జీవాత్మ పరిశుద్ధుడై కర్మబంధములనుండి విముక్తుడై పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు. శ్రీ బాపూజీ యీ కర్మయోగసిద్ధాంతముల నాచరించి వానిని భరత వర్షములోని 40 కోట్ల ప్రజలకు ప్రబోధము గావించి, వారిని విదేశ పరిపాలనా బంధమునుండి విముక్తులనుజేసి స్వారాజ్య స్వరూపమైన భరత మాతృ సాక్షాత్కారాన్ని కలిగించాడు. ఈ విధంగా శ్రీ కృష్ణభగవాను డాధ్యాత్మిక పక్షంలోను, మహాత్మా గాంధీజీ ఐహిక పక్షంలోను తత్వోపదేశకులైనారు.

విష్ణువు గీతాజ్ఞానము నాశ్రయించియే త్రిలోకపాలనము చేస్తున్నాడు. మహాత్ముడుపదేశించిన రాజ్యాంగ తత్వముల ననుసరించి స్వతంత్ర భారతాన్ని పరిపాలించడానికి, స్థిరీకరించడానికి, ఆయన శిష్యులైన నెహ్రూ పండితుడు మొదలైన నాయకులు తమ యావచ్ఛక్తిని ధారపోస్తున్నారు. ఈ మధ్య నెహ్రూచేసిన విదేశ పర్యటనంలో గాంధీజీ సిద్ధాంతముల నాదర్శంగాజేసి, చెప్పిన సందేశాలను గురించి అమెరికా అధ్యక్షుడు. నెహ్రూపండితుడు చెప్పిన విషయాలు అఖిల ప్రపంచానికి ఆదర్శాలు కాగలవని శ్లాఘించారు. కాన శ్రీ కృష్ణభగవాను లుపదేశించిన కర్మయోగ సిద్ధాంతములు ముముక్షు లోకమునకంతటికి ఆచరణ యోగ్యములైనట్లు' మహాత్ముడుపదేశించిన కర్మయోగ సూత్రములు రాజ్యాంగ వేత్తల కాచరణీయములు. శ్రీ కృష్ణార్పణమస్తు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)



# తెలుగు కవిత్వము

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

ఏ కాలమందును, సమకాలము వారి మన్ననలందు కవులుగాని, కావ్యములుగాని బహు స్వల్పముగా నుండును. కావ్య జీవితములో ప్రవేశించిన కవి, తన కవిత్వములో రస రామణీయకములను సృజించి, శిల్పమునకు వన్నెదెచ్చి, కవిత్వ తత్త్వములోని పరమ ప్రయోజనమును ప్రపంచమునకు వెల్లడిచేయును.

తెలుగు కవిత్వావతరణమునకు మూలపురుషులైన కవిత్రయము వారి కాలమునుండి తెలుగు కవిత్వము ప్రారంభమైనట్లు మనము నిర్ణయించితిమి. కవిత్రయము వారికి పూర్వము కవిత్వము లేదని నా యభిప్రాయము కాదు. ఆదికవి నన్నయ భారతమునకు పూర్వము మన తెలుగు దేశములో నున్న సారస్వతము మహా భారతమువంటి యుద్గ్రంథముతో పోటీకి నిలువలేక నశించియుండును. కనుక తెలుగు కవిత్వావతరణమునకు కవిత్రయమువారిని మూలపురుషులుగా మనము భావించుచున్నాము.

తెలుగు కవిత్వమునకు గల పరమ ప్రయోజనమును సాధించినది, నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు మొదలైన వారు. కావ్యజీవితమునకు సంబంధించినంతవరకు, పైన సూచించిన కవులు గాక, చాలమంది తెలుగు కవిత్వ మహిమను వెల్లడిచేసిరనుట నిశ్చయము. కాబట్టియే వారికవిత్వము సమకాలీన పరిస్థితులను దాటి సహజసిద్ధమైన సర్వజనీన స్వభావముతో నేటికి నిలచియున్నవి.

అట్లు నిలచియున్న కావ్యములలో మహాభారతము మొదటిది. మహాభారతము సంస్కృత ఇతిహాసమగుటచే, రాజరాజ నరేంద్రుని కోరికపై నన్నయ్య యాంధ్రీకరణముగావించి పూర్తిగా మూడుపర్వములు తెనిగించకుండగనే తాను మృతి జెందెను. నన్నయ్య తెనిగించిన కావ్యమందలి వస్తువును పరిశీలించినచో, నాతడు మానసిక స్వభావ నిరూపణమునకు ప్రాధాన్యమిచ్చినట్లు తెలియుచున్నది. ఇట్టి కవిత్వములో కవి వ్యక్తిత్వము వెల్లడికాక మానదు. సమకాలిక పరిస్థితులను దాటి, పురోగమన దృక్పథముగల కవిత్వము శాశ్వతముగా నిలిచిపోవుచున్నది. కవియొక్క ప్రతిభయే కావ్యమునకు జీవితము. ప్రతిభావంతమైన కవిత్వమునకు కాలమును పరిస్థితులను ధిక్కరించు గొప్ప శక్తి కలదు. ఆ కారణము వల్లనే యాంగ్ల సాహిత్యమందు పేరొందిన షేక్స్పియర్ వంటి మేధావుల కావ్యములు నేటికిని యన్ని దేశములందును పఠనీయ గ్రంథములుగా నిలిచి యున్నవి!

అట్టి ప్రతిభ యంతర్భూతమైన మన తెలుగు కావ్యములలో భారతము ప్రధానమైనది. ఆది కవియైన నన్నయ్య వలెనే, తిక్కన, ఎఱ్ఱాప్రగడలు వ్యక్తిత్వము ప్రతిభగల వారని చెప్పవలెను. మహా భారతములో పదునైదు పర్వము లాంధ్రీకరించి వ్యక్తిత్వ నిరూపణము గావించిన తిక్కన తెలుగు కవిత్వము అప్రతిమానమైనది.

తెలుగు కవిత్వములో ధ్వని సూచకముగా, గానమాధుర్యమును యిమిడ్చి, రసస్ఫూర్తి, రామణీయకములను ప్రదర్శించుటకు వీలు కలుగుచున్నది. మనకావ్యాలలో, తెలుగు నుడికారమునకు మధురమైన సంగీత శబ్దమున్నది. ఆలంకారికులు నిర్వచించిన శబ్దాలంకారములున్నవి. నాటి కవులు సమకాలిక పరిస్థితులను అవగాహనచేసికొని, ప్రజానందము చేకూర్చు సాహిత్యమును సృష్టించిరి. అందువలన నాటి కవులు ప్రజావాదులు, రాజాశ్రితులునై తమ కావ్యముల జీవితమునకు శాశ్వతత్వమును నెలకొల్పిరి.

తిక్కన కవిత్వమును, శ్రీనాథుని కవిత్వమును పరిశీలించినచో పెక్కు విషయములు తెలియును.

విక్రమసింహపుర పరిపాలకుడైన మనుమసిద్ధి మహారాజు నాస్థానముననుండిన తిక్కన, నిర్వచనోత్తర రామాయణము రచించి యాతనికి కృతిఇచ్చెను. తిక్కన సోమయాజి

బాల్యమునుండియు స్వానిష్ఠుడై, యమునాతటవాసియై ప్రతిభాశాలియై కవియయ్యెను.

తిక్కన కవిత్వమునకు ప్రసాదగుణము భాసురమైనది. కఠిన పదములను సంస్కృత పదములను విసర్జించి, తేలికయై స్వచ్ఛమై, సులభగ్రాహ్యమైన తెలుగుపదములతో నీతడు చక్కని కవిత్వము సృష్టించెను. కవి తన వ్యక్తిత్వమును చూపుటకు, పదముల నాడంబరముగా నుపయోగించును. కాని తిక్కన కవిత్వమునకు యెట్టి యాడంబరమును లేక మృదు పదమిళితమై మధురముగనున్నది. కవిత్వమల్లుటలో స్వతంత్ర పద్ధతిని అవలంబించిన వాడగుటచే, యాంధ్రీకరణ మందు గూడ నాతడు శిల్ప కల్పనాచమత్కృతి ప్రదర్శించెను.

తిక్కన తెలుగు కవిత్వములో జాతీయపదప్రయోగ ములు నూతనత్వమునకు పేరుపడియున్నవి. సందర్భో చితముగ, అప్రయత్నముగ దేశ్యపదములు కవిత్వములో వెల్లివిరిసినవి. వ్యవహారములోను, సాంప్రదాయములోను, ఆనాటి జాతీయములే నేటికీ యా రూపములోనే నిలిచి యున్నవి. అమెరికాదేశపు కవియైన 'అలన్‌పో' రామణీయకమును లయాత్మకరూపమున సృజించుట కవిత్వమని నిర్వచించెను. అట్లే, తిక్కన జాతీయాభిమానకారకములైన పదముల నుపయోగించి రామణీయకమైన, లయాన్వితమై ఛందోబద్ధమైన తెలుగు కవిత్వమును సృష్టించెను. భారత కథానాయకుల సహజ మానవ స్వభావ పరిజ్ఞానమును, తిక్కన కావ్యకళాదృష్టితో కూడిన నైపుణ్యముతో ప్రదర్శించెను.

అట్లే శ్రీనాథుడును సామాన్య జనవృత్తి వర్ణనమునకు సంబంధించిన విధముగా కవిత్వమును చెప్పియున్నాడు. శ్రీనాథుని గ్రంథములవలన, ఆనాటి కవులు ప్రజా జీవనము కెంతో సన్నిహితులైన విషయము తెలియగలదు. పల్నాటి చరిత్రమును ద్విపదగను, కాటమరాజు కథను ప్రబంధముగను నీతడు రచించెను. ప్రజా హృదయములకు సన్నిహితమైన విషయములను గైకొని నాటి కవులు కవనము చెప్పిరి.

కాబట్టి కావ్యముయొక్క ప్రయోజనము నాశించి, సమకాలిక పరిస్థితులను, అధిగమించగల తెలుగు కవిత్వము యెంతయు కొనియాడదగినది. శ్రీనాథాదుల ప్రజా కవిత్వము శాశ్వతము శక్తివంతము నైనది.



---

(10వ పేజీ తరువాయి)

మూలాల స్పందనం అయిఉండేనో ఏమో, కాని వారిద్దరి ఆవేదనలూ తగ్గిపోయాయి.

పద్మావతి ఇప్పుడు విద్యాలయంలో తృప్తిగా చదువు కుంటున్నది. తోటి బాలికలతో ఎక్కువ చదువు సంపా దించుకుంటున్నది. వారితో కలిసి మెలసి తిరగడం ఆమెకు ఎక్కువ ఇష్టమైనది. అంతకన్న అంతకన్న శ్రీమతి కరుణా మయిగారితో స్నేహం వృద్ధిపొందింది.

కరుణామయికి పద్మావతి అంటే చెప్పలేని దయ కలి గింది. ఆమె చదువు విషయంలో ఆమె ఎక్కువ శ్రద్ధ వహించి తానే ఎన్నో విషయాలు ఆమెకు బోధించేది. పద్మావతి సభలలో నిర్భయంగా సంగీతం పాడేటట్లుచేసి ఆమె సభా పిరికితనం మాయం చేసింది.

ఇంతలో దసరా ఉత్సవాలు వచ్చినవి. ఆ ఉత్సవాలలో ఒక రోజున రాధాకృష్ణ, సుశీల, పద్మావతిగార్ల సంగీతపు కచ్చేరి జరిగింది. ఆరోజున పద్మావతి అపర మీరాబాయిలా ప్రకాశించింది. సంగీతంలో సుబ్బలక్ష్మికి దీటనిపించుకుంది. పాడిన పాటలలో ఒకటిమాత్రమే త్యాగయ్య కృతి. తక్కినవన్నీ ఈనాటి కవులలో ప్రసిద్ధికెక్కినవారి పాటలు కృష్ణ శాస్త్రిగారి ఊర్వసీ గీతమొక్కటీ, మురళీగీతమొక్కటీ పాడింది.

"మోయింపకోయ్ మురళి మోయింపకోయ్!" అన్న పల్లవిలో రాధాదేవిలో, ప్రతి భక్తునిలో మురళీకృష్ణ దివ్య భావంవల్ల ఉద్భవించే, పరమ మనోహరానందం, రాగంలో అవరోహణంలో, చూపించింది. "తీయ తేనియ బరువు మోయలేని బ్రతుకు" అని అనుపల్లవి ఎత్తుకొని, ఆ ఆనంద విపశత్వం, ప్రియా ప్రణయగాఢోత్కంఠ అయిన రాధ ఆ విశ్వ సౌందర్యంలో లయమూ కావాలి, లయము కాకుండా, తన దివ్య పురుషునితో సాలోక్య, సారూప్య సామీప్యానందమూ పొందాలి.

ఆ పాట శ్రోతల హృదయాలు కరిగించినది. ఆనం దంతో అనేకమంది స్త్రీల కన్నుల నీరు జలజల ప్రవహిం చాయి.



గతసంచిక తరువాయి

# ....“బొమ్మ...బొరుసు”

[మీనా తండ్రి ప్లీడరుచేసి చాలా డబ్బు సంపాదించాడు, కాని నలుగురు కూతుళ్లకు వివాహాలు చేసేటప్పటికి తిన్నదంతా అయిపోయి కుటుంబానికి ఏమీ మిగల్చకుండా చనిపోయాడు. మీనా తల్లి, పిల్లలతో తన చెల్లి పంచన చేరింది. పినతల్లి భాగ్యవంతురాలు గర్వంగా ఉండేది. ఆమెకు రమణ అనే కూతురున్నది. మీనా అక్క-రమణతో “బొమ్మ...బొరుసు” ఆట ఎప్పుడూ ఆడుతుండేది. ఆ ఆట అంటే మీనా తల్లికి గిట్టేదికాదు. మీనాకు ఎందుకు తల్లికి ఆ ఆట ఇష్టంలేదు తెలిసేదికాదు, చివరికి గ్రహించింది. పినతల్లి భాగ్యవంతురాలై బొమ్మలాగ జీవితము గడుపుతుంటే తనతల్లి బొరుసై కూర్చున్నదని. అన్న చదువుకి మీనా కుటుంబమంతా రాజమండ్రి చేరారు. అక్కకు వివాహమైనది. ఇంతలో తల్లికి జబ్బు చేసి చాలా విషమ పరిస్థితులు ఎదుర్కోవలసి వచ్చింది. అవసరానికి ఏ బంధువులు ఆపదలను ఆదుకోలేక పోయారు. వాళ్ల తల్లికి మందిచ్చే డాక్టరు ఎంతో ఆదరణతో చూస్తుండేవాడు. చివరికి తల్లి నెమ్మదిగా కోలుకోసాగింది.] ఇక చదవండి.

---

మా అమ్మకి రోజురోజు నాగురించి బెంగ ఎక్కువ అయింది,—ఎక్కడ పెద్దదాన నవుతానో అని. మా అమ్మ ఆవిడ చెయ్యదగ్గ ప్రయత్నాలు ఆవిడ చేస్తోంది. యీ ప్రయత్నాలలో మా దగ్గరబంధువు—‘ఓ పుట్టు కుంక—’ మా అమ్మకి ఎన్నో సలహాలు ఏమీ ఖర్చు లేకుండానే యిచ్చేది.

మా అమ్మకు,—మా అమ్మకు ఏమిటి! మా శాఖలో చుట్టుప్రక్కల వున్న రెండుమూడు జిల్లాలలో వాళ్లకి యీవిడ (పుట్టుకుంక!) అంటే, ఎంతో గౌరవం, భయమూను. యీవిడకు చాలా ఆచారం, దైవ భక్తి, నియమము, నిష్ట, పూజా, పునస్కారాలు ఉన్నై. యీవిడ చాలా భగవద్ గ్రంథాలు చదివింది. ఆఖరికి కాశీ కృష్ణమాచార్యులవారి తరువాత, ఆయనకు యిచ్చేటంత గౌరవం యిచ్చేవారు యీవిడకు మాశాఖవాళ్లంతా!

ఇంతమందిచేత గౌరవింపబడుతున్నా నాకు, మా అన్నయ్యకు ఆవిడ అంటే పరమ అసహ్యము వేసేది. కారణాలు లేకపోలేదు—

ఎంత వేదాంతజ్ఞానము, దైవభక్తి, ఉన్నా—ఇంకోళ్లని హేళన చెయ్యడం, న్యూనత పరచడం, తన్ని తనవాళ్లను ఆదేపనిగా పొగడుకోడం, ఆ పిసినారితనం, అన్నిటికంటె ఆవిడవుండే ఆ యింట్లో ఆ అశుభ్రత—అవన్నీ ఆవిడకు ఏలా సరిపడ్డాయో ఆమూల విరాట్టికే తెలియాలి!

పౌర్ణమినాడు, నూటపదకొండుసార్లు తంగేడు వేళ్లతో మంత్రాలు చదివించుకుంటూ, దంత ధావనం చేస్తేనేం! ముప్ఫైమూడు కెంపులు, పళ్లు, చీరలు, జంధ్యాలు, గోపీ చందనం ముక్కలు (అ)యోగ్యులైన బ్రాహ్మలకి దానం చేస్తేనేం! రోజుకు ఒక్కసారి అయినా, తోటివాళ్ళ మనస్సు కష్టపెట్టలేకుండా ఉండలేక పొయ్యాక!

ఈవిడ, యీవిడ ఆచారము, దైవభక్తి ఎలాంటివో యీవిడకు దేవతార్చన చేసే ఆచారికూడా ఆలాంటివాడే!

అతను ఆవూరి మఠానికి పెద్ద పూజారి. అతను ఎలాంటి వాడో ఆవూళ్లో అందరికి తెలుసు—మెరక వీధిలో ఓ భోగందాన్నే కాకుండా, మా శాఖలో ఓ తల చెడ్డ దాన్నికూడ ఉంచుకున్నాడు. చాలాసార్లు తాగి రోడ్డు మీద పడిపోయిఉంటే, బండిమీద పడేసి మఠంలో చేర్చే వారు—

ఇలాంటివాడు, మర్నాడు శంఖంలోంచి ఆ తీర్థము పోస్తే, యీ జ్ఞానులంతా, “కృష్ణా అంతా నీకే అర్పితం నాయనా,” అంటూ కళ్లకు అద్దుకొని తీర్థం పుచ్చుకొనే వారు. ఇట్లాంటి భక్తులచేత, పూజార్లచేత, ఆరాధింపబడే

ఆ భగవంతుడికే గనుక ప్రాణం వుండివుంటే—తప్పకుండా పొటాషియం సెయనైడు మింగి ఆత్మహత్య చేసుకొనేవాడు భగవంతుడు.

ఇంకే, మా అమ్మ ఎంత భయపడుతూ వుండిందో, ఓరోజు అంతపనీ అయింది. మా అమ్మ ఎంతో బెదిరిపోయింది. ప్రక్కవాటులో వున్న కామేశ్వరమ్మగారు, బంగారమ్మగారు, "మీ వాళ్లకు ఎవ్వరికీ తెలీకుండా చూస్తాములెండి. యిప్పుడెందరూ పిల్లలు ఎదిగాకే పెళ్లిళ్లు చేస్తూన్నారు." అంటూ మా అమ్మను కోప్పడ్డారు.

తరువాత నాకు మా అమ్మని చూసినా, మా అమ్మకు నన్ను చూసినా, ఏదో కారణం తెలీని భయం వేసేది. నాకు అర్థం కాలేదు. నేను, మా అమ్మచేసిన పెద్ద తప్పు ఏమిటో!

దైవవశాత్తు ఓ సంబంధం కుదిరేటట్టు సూచనలు కనపడినై. నా ఫోటో పంపవలసి వచ్చింది. పెళ్లి చూపులకి ఫోటో తీయించుకోవడంకంటె నీచము యింకేమి నాకు కన్పించదు.

తయారు చేసారు—బంగారమ్మగారి బనారసు పట్టుచీర, పగడాల కండ, సూర్యకాంతమ్మగారి నానుపేటలు, కనకమ్మగారి (మాలపిల్ల) లోలాకులు, అవి పెట్టి—నాకు చాలా కంటకం అనిపించింది. ఎరువు వస్తువులు పెట్టుకోవడమన్నా, చీరలు కట్టుకోవడమన్నా నాకు చాలా అసహ్యము. ఇంక మా అక్క అంటారా!—చిన్నప్పుడు ఆ రమణ పరికిణీలు కట్టుకొని, వోణీలు వేసుకొని దాని వొడ్డాణం పెట్టుకొని ఎంతో మురిసిపొయ్యేది—దాని తత్వం దానిది! ఎలాగైతేనేం ఫోటో పంపించారు—

ఇంకో వారానికల్లా నన్ను చూసుకోడానికి వస్తున్నట్లు తెలియవచ్చింది. తెలీక అడుగుతాను—పిల్లను వచ్చి స్వయంగా చూసుకొనేకాడికి, ఆ ఫోటోల సౌలభ్యము కూడా ఎందుకు? దండగ!

మళ్లీ ఎరువు అలంకరణాలు జరిగాయి. వాళ్లు అంతా తర్లివచ్చి, వాళ్లు అంతా కళ్లు చేసుకొని నన్ను చూసి, నా పాటవిని వెళ్లారు.

పెళ్లి నిశ్చయము అయింది! ఇచ్చి పుచ్చుకోడాల విషయములో ఆ భక్తగాలు సమువాయించింది. ఎలాగైతేనేం నా పెళ్లి అయింది గొప్పగా! మా అమ్మకు పెద్ద బరువు వదలిపోయింది.

'మీన' అన్న నాపేరు వాళ్లకు రుచించక పెళ్లిలో, 'పద్మ' అన్న కొత్తపేరు పెట్టారు. (మన ప్రభుత్వం అన్నిటికి కొత్త నామకరణాలు చేస్తూన్నట్లు!) అంటే యింటిపేరుతోపాటు నాపేరుకూడ బదిలీ అయిపోయింది.

అయితే, 'మీన'కి, 'పద్మ'కి ఏమిటి తేడా!

నాల్గునెలల తరువాత నేను రజస్వలయ్యానని సంబరం చేసారు. నాకు ఎంతో అసహ్యము వేసింది. ఏడుపు వచ్చింది. నాకు అర్థంకాదు—మనము ఎందుకు యింత కృత్రిమంగా బ్రతకాలో లోకంలో నిజం, ఎప్పటికి పనికి రాని వస్తువు! మళ్లీ ఏడాది తిరగకుండానే కార్యముచేసి అత్తవారింటికి పంపించేసారు.

జీవితం ఇంకో ప్రాకారంలోకి వచ్చేసింది. నాకు జ్ఞానం తెలిసినప్పటినుంచి, అతి సున్నితమైన మనస్సు కల దాన్ని అవడంవల్ల, దేనికి పట్టుబట్టక పోవడం, పోట్లాడటం, కోపం తెచ్చుకోవడం లేకపోవడం మూలాన, కొత్త జీవితానికి యిట్టే అలవాటు పడిపోయాను. కొన్నాళ్లు పొయ్యేటప్పటికి అత్తింటి కాపురం అంటే ఏమిటో కొద్ది కొద్దిగా రుచి చూడటం తెలిసింది.

నావల్ల ఏమీ లోటు, తప్పులేకుండానే, మా అత్తగారికి నామీద విసుగు, అకారణంగా కోపం, చివాట్లు, మొట్టికాయలు మొదలుపెట్టాయి.

తొందరపడిపోయి, నల్లటి కొరడముచ్చులాంటిదాన్ని, బీదదాన్ని తన కొడుక్కి కట్టబెట్టిందట—కొడుక్కి. ఏమీ ముద్దు ముచ్చట్లు తీర్చలేక పోయిందట మా అమ్మ. ఇంకా ఎన్నో శాపనార్థాలు. ఆరోజు సాయంత్రం వంట చేస్తూ భగవంతుడికి నమస్కారంపెట్టా, "స్వామీ జీవితంలో, పెళ్లి అయి, భర్తను సంపాదించుకోవలసిన గడ్డు వుండి, అత్తింట్లో కాపురం చెయ్యాల్సివుండే, యీ ఆడ

వాళ్లను మట్టుకు నల్లగా, కొండముచ్చుల్లాగ పుట్టించకు," అంటాను.

అయితే, పెళ్లిచూపులకివచ్చి, "లక్షణంగా ఉందమ్మ పిల్ల, ఏమి కళ్లు, ఏమీ సంగీతము, ఎంత తియ్యటి కంఠం," అంటూ పొంగిపోయిన తర్వాత అయిన కోడల్నేకదూ నేను! మరి. పెళ్లి అయ్యాక ఆ కొండముచ్చు రూపం ఎలా వచ్చిందో, తియ్యటి గొంతుక కాస్తా చెవికోసిన మేక కంఠం ఎలా అయిందో, ఆ పరమేశ్వరుడికే తెలియాలి!

ఓ రోజు సాయంత్రం, మా అత్తగారు, ఆడబిడ్డలు పేరంటానికి వెళ్లారు. నేను వంటచేస్తూ ఒక్కదాన్నే యింట్లోవున్నాను. ఏదో కులాసాపుట్టి, "ఎందరో మహానుభావులూ..." అంటూ మొదలుపెట్టానో, లేదో!, "చాలిద్దూ, ఓ పద్మా, సాయంత్రంవేళ, సానిదానిలాగ ఏమిటా సంగీతము," అంటూ వస్తూనే హుంకరించింది మా అత్తగారు. వ్యాఖ్యాము బ్రేకుపడింది. చటుక్కున జ్ఞాపకం వచ్చింది—మా అమ్మ పులుసులోకి పోపు వేయిస్తూంది. నేను పక్కనే వరండాలో కూర్చున్నాను. దొడ్డి అవతల భోగంవాళ్ల యింట్లో పుష్పారత్నం హార్మోనియం శృతి వేసుకొని, "ఓరోరి సరసుడా...అంటూ ఆరంభించింది."

అవును సాయంత్రంపూట సానివాళ్లేగాని సంసారులు పాటపాడకూడదు. అయినా సంసారంచేసే స్త్రీకి సంగీతం, చక్కదనం ఎందుకు? సానివాళ్లకు ఉండాలిగాని!...

కొన్నిరోజులు గడచిన దగ్గరనుంచి నాకు తెలీకుండానే, చిన్నప్పట్నుంచీ ఏకోశాన్నీ నాలోలేని వికారాలు మనస్సులో మెదలడం మొదలుపెట్టాయి. 'నాయుడు పిల్లలాగే నేను ఎందుకు ఉండలేకపోవాలి అన్న యీర్ష్య దాంపత్య జీవనంలో అసంతృప్తి మొదలైనవి. నాకు చాలా ఆశ్చర్యం, ఆందోళనా కల్గినై. ఇదేమిటి! యీ పదహారు ఏళ్లనుంచి నాలో ఉన్న మంచితనం, సౌమ్యం, హృదయ వైశాల్యం ముందు యిలాంటి లేకిపూహాలు ఎందుకు వస్తున్నాయో! అనుకొని మనస్సుని ఎంత మందలించినా కార్యము లేకపోయింది. ఇన్నాళ్లు ఎలా అణచబడి ఉన్నాయో! యీ స్వభావికమైన కోర్కెలు, ఒక్కసారి అగ్నిపర్వతంలాగ, ఉప్పెనలాగా పైకి పొర్లివచ్చేసాయి. రోజూ రాత్రిళ్లు నాకు, నా ఉన్నతమైన మానసిక స్వభావానికి—యీ కొత్త ఊహలకి తీవ్రమైన సంఘర్షణ జరిగేది.

ఇట్లావుండగా, ఎందుకో నన్ను మావూరు తీసుకొని వెళ్లేందుకు మా అన్న వచ్చాడు. విశాఖపట్టణంలో కాలేజీలో సర్టిఫికెట్టు తెచ్చుకునే పనిఉండి మా ఆయన కూడా మాతో బయలుదేరారు. నాకు మనస్సుతో యుద్ధం జరుగుతున్న యీ రోజుల్లో యీ ప్రయాణం నాకు రెండు విధాల పెద్ద ముప్పు అయింది—ఏమయిందీ అంటే—

తెల్లవారుతూంది. వాల్తేరు వచ్చింది. మా ఆయన అక్కడ దిగి విశాఖపట్టణం వెళ్లే రయిలుకి వెళ్లబోతున్నారు. మా అన్న ప్లాటుఫారముమీద ఏదో పుస్తకము చూస్తూ నిలబడ్డాడు.

ఆ కాసేపు ఒక్కళ్లం సరదాగా రెండు నిమిషాలు మాట్లాడుకోవచ్చునన్న ఉబలాటంతో, మా ఆయనతో, "మీరు ఆముదాలవలస వెళ్లగానే తర్చు ఉత్తరాలు రాస్తారు కదూ"—అంటు మొదలు పెట్టానోలేదో!—సమాధానం చెప్పకపోతే మానె, "నేను ఆ రైల్లోకి వెడుతున్నా"నని అయినా చెప్పకుండా కూలివాడిచేత పెట్టె పట్టించుకొని వెళ్లిపోయారు.

మా అన్న యిదిఅంతా గమనిస్తున్నాడు. అతనికి కళ్లనీళ్ల పర్యంతం అయింది.

నా భగ్నహృదయాన్ని వర్ణించక్కర్లే—నన్ను, మా ఆయన్ని పరీక్షగా చూస్తున్న ఓ ముసలవ్వగారు, "మొగాళ్లు అప్పుడప్పుడు కాస్త బింకంగా వుంటారమ్మా, ఎందుకు అలా యిదవుతావు. నువ్వు మీవూరు చేరేటప్పటికల్లా అతగాడి దగ్గరనుంచి ఉత్తరం రాకపోతే నన్నడుగు, యీ మొగాళ్ల లక్షణమే అంత," అంటూ నా భుజంమీద తట్టేవరకు నాకు తెలినేలేదు. అప్పటికప్పుడే రైలు రెండు స్టేషనులు దాటి పరుగెత్తుకొని పోతూంది.

(సశేషం)

# నారీమణులు

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవి

## శ్రీమతి రుక్మిణీదేవి

మహానుభావులు తరచు లోకంలో ఉద్భవించరు అవతరించారా అంటే భగవదేచ్ఛఅయిన ప్రపంచ పరిణామ సూత్రానికి తాముపయనిస్తూ ఇతరులకు చేయూతనిచ్చి మార్గదర్శకులవుతారు. ఆ మహానుభూతి నొందినవారే ధన్యజీవులు.

సమస్త దేశాలూ ఒకే దేశమై, సమస్త జాతులూ ఒకే జాతియై, సర్వ మానవమతమూ మానవత్వమై, విశ్వమానవ సౌభ్రాతృత్వంతో, సానుభూతితో, స్నేహానుభూతితో, కళాపిపాస కార్యదీక్షలతో, సమస్తజనులూ, ఒకేజ్యోతిని ఆరాధించిననాడు మాత్రమే ఈ భూతలం స్వర్గతలం అవగలదు.

ప్రకృతియే భగవంతుడు. భగవంతుడే ప్రకృతి. ప్రకృతి అంతా కళా పూరితం. ప్రకృతియొక్క దినచర్యలో ప్రతి నిత్యమూ భగవద్దర్శనం నిత్య ప్రదర్శితం. మానవుని నిత్య కృత్యాలలో సదయ హృదయంలో సున్నితంగా చేయబడే ప్రతిపని కళలో ఒక అంశ. ఆ సఫలీకృతంలోనే మనకు భగవద్దర్శనం అవుతుంది. ప్రపంచంలోని ప్రతి అణుజీవాణులలోనూ కళ నిగూఢమై, అంతర్భూతమై వుంటుంది. దానిని తాము అన్వయించుకుని, తామందులో లీనమైనవారే కళా తపస్వులు. వారీ లోకాలనేకాక, ఇంకా కొన్ని దివ్యలోకాలలో సంచారంచేస్తూ, ఆ ఆనందానుభూతి యొక్క దివ్య దర్శనాన్ని ఇతరుల కందచేసి, వారినికూడా ఆ లోకాలలో విహారింప చేస్తారు.

ఈ అనంత విశ్వంలో, వినిర్మలాకాశంలోని షోడశకళా పరిపూర్ణుడైన చంద్రునినుండి,ఒక కళాతరంగం, ఒక మహనీయ కార్యనిర్వాహణాభారాన్ని ఉద్దేశించి పయనమయింది. లేకపోతే, ఆమూర్తిలో వేయిసంద్రాల గంభీరతలూ, ఆగమనంలో దివ్యరాగ గమకాలూ, కండ్లలో కోటితారల కాంతులూ, చిరునవ్వులలో శచీనృత్యాలూ చిందులాడవు, పూవు పుట్టుకతోనే తనజీవిత లక్ష్యమైన సువాసనలను వెదచల్లుతుంది. ముండ్లులేని మహోత్తమ గులాబీపువ్వమా మూర్తి. ఆ మూర్తిలోని ప్రతి చిన్ని భావమూ కళలోని ఒక అంశ. కళోద్ధరణమే ఆ శక్తి లక్ష్యమా!

యుగ యుగాలనుంచీ నాట్యమొక కళ. మహాతపస్వి భరతముని ప్రోక్తం భరతనాట్యం. అందుచేతనే మూసలోని బంగారంలా నిర్మలమూ, పవిత్రమూ, ప్రభావయుతమూ, యోగ విజ్ఞానపూరితమూఅయి దీనికొక ప్రాధాన్యతా, ప్రాముఖ్యతా వున్నాయి. కాని భర్తృహరి శ్లోకంలోని గంగానదిలా, అంబరాన్నుండి భరతముని మెదడులో ప్రవేశించి తద్వార, అవిచ్ఛిన్నంగా, అసమానప్రతిభతో ఈ భారత భూమిని ప్రవహించిన ఆ భరతనాట్య మహాప్రవాహం, కాలకర్మాన, పరపాలనా పర్వత భారం క్రింద పడిపోయి ప్రవహించుటకు ప్రదేశం లేక, గాలివెలుగులు సోకని నిలువ, నీరయి పాకుడుకట్టింది, ఈ నాట్యకళ.

ఉత్సాహబలంతో, ఉద్ధరణాదీక్షతో, కడుప్రయాసతో ఆ నిలువనీటికి పాకుడువదలించి, వినిర్మల మధురజలంగా మార్చి ప్రవహింపజేసిన ఆ మహావ్యక్తి......

అంతేకాదు. దానిని తన శిరానపెట్టికొని, విశాల ప్రపంచమంతటా పయనించి, ఆరాధనావేశంతో, తాను కళలో లీనమయి, కళను తనలో లీనంచేసికొని, రాను రాను తానూ కళా ఒకటేఅయిపోయి, యోగవివశయై తనువునే మరచి, తన్మయమునొంది, దివ్యరాగమే అయి, దివ్యనాట్యమే అయి, దివ్యలోకాలను ప్రదర్శితం చేసి నాట్యకళాధిదేవత నటరాజమూర్తియై నిలిచిన, ఆ మహావ్యక్తి, ఒక

(తరువాయి 24వ పేజీలో)



# పన్నా

*　　*　　*

నాటిక

*　　*　　*

శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి

## పాత్రలు

| | |
|---|---|
| సంగ్రామసింహుడు | పాకీవాడు |
| మంత్రి | అక్బాశాహ్ |
| వనవీరుడు | అక్బాశాహ్ తల్లి |
| పన్నా | వనవీరుని భార్య |
| ఉదయసింహుడు | పన్నా కొడుకు |

(శోకగ్రస్తుడై సంగ్రామసింహుడు, పన్నా)

సంగ్రామసింహుడు: పన్నా! తల్లిలేని నాఉదయునికి పట్టాభిషేకము చేయువఱకు బ్రతికినా నాకేచింత ఉండేదికాదు. మొదటినుంచి నువ్వే వాడికి తల్లివై పెంచావు. ఇంక తండ్రివికూడా నీవే—ఇంక నేను మాట్లాడలేను.

పన్నా: మహారాజా! మీరల్లా అధైర్యంగా మాట్లాడటం నేను భరించలేకపోతున్నాను. నాకు బిడ్డలిద్దఱు. అందులో పెద్దవాడే ఉదయసింహుడు. నా పెద్దబిడ్డడి కోసం నా బిడ్డనైనా అవసరమైతే సమర్పించి రాజ్య సింహాసనం ఎక్కేలాగ చేస్తాను. మీ రధైర్య వాక్యాలు ఊహించనైనా ఊహించకండి.

సం: అదేమిటి పన్నా! అల్లా అంటున్నావేమిటి? "ఏమీ లేదు, తమరు విశ్రాంతిగా పరుండండి." అంటూ వచ్చే దానివి ఇల్లా మాట్లాడుతున్నావేం?

పన్నా: మహారాజా! మీరనవసరంగా దీనత్వం చూపించ బోతే నాకు మాట్లాడటం చేతకాలేదు. నేనేం చెప్ప గలను?

సం: ఏదో అనిష్టాశంక హృదయానికి కల్పించావు. అసలే నా అతిస్నేహం పాపశంకలు చేయటం సాగించిందీ మధ్య.

పన్నా: ప్రభూ! మంచి తీర్థం త్రాగండి. వనవీరు డున్నాడు మీరేమీ సందేహించకండి. దైవం రక్షిస్తే మీకూ ఏమీ పరవాలేదు. మంత్రిగారువస్తారింతలో.

సం: అదుగో వస్తున్నట్లున్నారు.

(మంత్రి ప్రవేశం)

మం: మహారాజా! వనవీరుడు వస్తున్నాడు.

సం: మహామంత్రీ! నేను నిశ్చింతగా నాదారి వెదుకు కొంటున్నాను మీరే సర్వసమర్థులు.

మం: మహారాజా! కంగారు పనికిరాదుగదా! తమకా! ఇంతటి మహాధీరులకా మేముపదేశాలు చేయబూనడం?

(వనవీరుడు ప్రవేశం)

వన: మహారాజాధిరాజునకు సేనానివనవీరుడు నమస్కరించు చున్నాడు.

సం : పన్నావా నాయనా ? విశ్వాసపాత్రుడవు రాజభక్తు డవు. నీ సహాయంచేత సాకీరాజ్యం కొంతవఱకు నిలి చింది.

వన : మహారాజా ! ఎంతమాట. నేడిట్లు మాటలాడుచుంటి రేమి ? మంత్రివర్యా ! ఏల నాకు కబురు పంపించారు.

మం : సేనాధిపతీ ! రాజుగారు నీతో అవసరమైన మాటలే సెలవిస్తున్నారు. జాగ్రతగా పరికిలించు. ఆచరించటానికి సిద్ధంగా ఉండు. సమయ మల్లాటిది. గ్రహించు. వ్యర్థ ప్రశంసలకిది కాలముగాదు.

వన : నాకు కంగారు———

సం : సేనానీ, నీవు రాజువై రాజ్యపాలన చేయదగ్గవాడవు —నాపని ఇంక———

వన : ఆఁ ? శాంతం ! పాపం !

సం : అంతే వనవీరా ! ఉదయునికి రాజ్యం నువ్వే వప్పగించు తర్వాత.

## 2వ రంగము

(మంత్రి ఉదయసింహుని ఒడిలో ఉంచుకొని ఉండును.)

మం : తండ్రీ ! ఉదయసింహా ! నీ భావి ఎల్లా మారనై యుందో ! మొదట్లో చక్కగా రాజభక్తి ప్రదర్శిస్తూ రాజత్వ భావనే లేకుండా ఉండేవాడే ఈ వనవీరుడు ! ఆహా ! రాజ్యలక్ష్మీ ! ఎంత క్రూరభావనలు కల్పిస్తావు నువ్వు ? పన్నా ! పన్నా ! ఇల్లారా ! ఎక్కడికి వెడు తున్నావు ?

పన్నా : నమస్కారము మహామంత్రీ ! ఉదయుడు—ఆహాఁ ఉదయ రాజకుమారుడు మా పిల్లవాడితో కలిసి యిల్లా వెళ్లారు. ఆయన నాడిస్తూ ఇటువచ్చాను. ఇంటికే వెళ్లుతున్నానండి.

మం : ఇదుగో ఉదయసింహుడు నిజంగా రాజసింహం కాదగ్గవాడు. నీవనుమానించి మాట్లాడావేం ! నీకు ఈతడూ కుమారుడే. ఉదయకుమారు డనసక్కరలేదు. కాని పన్నా ! జాగ్రత ! పరిస్థితులు మారాయి. సమ యానికి కనిపించావు. రహస్యం—ఎందుకోలేకాని ఒక సంగతి. రాజకుమారుడే అనుకొంటున్నావో నీ కుమా రుడే అనుకొంటున్నావో గాని ఉదయసింహుణ్ణి రక్షించే బాధ్యత నీమీద ఉంది. ఇవి మామూలు మాటలుకావు. సంగతులు నీవే తెలుసుకో. రోజులు బాగాలేవు.

పన్నా : మహామంత్రీ, నాకు భయ———

మం : తీసుకువెళ్లు, ఇంక చెప్పను. జాగ్రత.

## 3వ రంగము

(వనవీరుడు, భార్య, రాత్రి ఇంట్లో)

వన : ఈ రాజ్యము నాచేతికి చిక్కిందల్లాగా చిక్కింది. ఈ కుఱ్ఱవాడొక్కడుకదా నాకు అడ్డం. లేకపోతే అవిచ్ఛిన్న సామ్రాజ్యం ఏలవచ్చునే ?

భార్య : అయితే ! ఇవేంమాటలు ? ఎంత హీనం ! ఆ వూహలు తప్పని నేనన్నది వ్యర్థమయిపోయిందా ? వద్దు. మనం ఈ మట్టిలోపుట్టి ద్రోహానికి తలపెట్ట కూడదు—రాజద్రోహం.

వన : నేనే రాజుని—ఈపని కాస్త చేసేస్తే విశాల రాజ్యాధి పత్యం స్వీయమైపోతుంది. నీకు తెలియదుగాని ఇప్పుడీ పని చెయ్యకపోవటం రాజద్రోహం చేసుకొన్నట్లు కాదూ !

భార్య : అబ్బ ! ఏమి విపరీత సమాధానం నేర్చారు ? పడు కోండి ఇప్పటికింక—రేపు తలపెట్టవచ్చు. ప్రొద్దు పోయింది.

వన : అంతేలే—లేకపోతే———

వన : (ఆత్మగతం) ఈమెకు నిద్రపట్టింది. ఇంక నేను భయలుదేరుతాను. కత్తి పదునుగానే ఉంది. ఒక్క దెబ్బచాలు. ఆహా ! ఏమి నిశ్శబ్దం !—ప్రపంచం అజ్ఞా నంలో పడి తనక్షేమం తాను మరచిపోతోంది. మనం అవివేకం చూపితే ఎల్లా ? తరుణం తర్వాతరాదు.

## 4వ రంగము

(అదేరాత్రి అప్పుడే మాటలు మెల్లగా)

పాకీవాడు : పన్నా ! పన్నా ! వనవీరుడొస్తున్నాడు. కత్తి పట్టుకొని వస్తున్నాడు. నువ్వేదో నిన్న నాతో అన్నావు. జాగర్త రాజకుమారుడెల్లాగ ?

పన్నా : ఆ ఎక్కడున్నాడు ?

పాకీ : ఆ మేడకాడ బయలుదేరాడు జాగ్రత్తమ్మ! ఎందుకో ఏంటో ? నే పరుగెత్తుకొచ్చాను. సెప్పమన్నావుకదా తల్లీ ! నాకేం తెలుసుద్ది ?

పన్నా : సరే నీ బుట్టఏదీ ? ఇల్లా పట్టుకురా !

పాకీ : ఇదిగో ఎందుకిదీ ?

పన్నా : మాట్లాడకు—తే ! ఇక్కడేఉండు నే నిప్పుడే వస్తా.

(పన్నా పిల్లవాణ్ణి బుట్టలోపెట్టి ఆకులు కప్పి తెచ్చి ఇస్తుంది)

(దారిలో ఈ మాటలనుకుంటుంది.)

పన్నా : నీగతి ఏమవుతుందో? నాయనా ! సంగ్రామసింహ మహారాజు మరణసమయం గుర్తుకువస్తోంది. నా కర్తవ్యం ఎట్లా నెరవేరుస్తానో—ఒరే—ఇదిగో ! ఈ బుట్ట పట్టుకుపోయి ఊరు చివర ఉండు. ఈ గోడదాటిపో, జాగ్రత! ఎవరికీ కనిపించకు. నేను వచ్చేదాకా ఆ మూల డొంకలో దాక్కుని ఉండాలి. వెళ్లు—

పా : ఆఁ. ఏంటీ—ఆఁ ?

పన్నా : మాట్లాడకు త్వరగా పో—

(తన పుత్రుని ఉదయసింహుని పక్కపై పరుండబెట్టుచూ పన్నా)

పన్నా : ఈ మంచంమీద పడుకోనాయనా ! నా కడుపున పుట్టినందుకు నీకీ రాజభోగ మనుభవించే మంచంమీద పడుకునే అదృష్టం పట్టింది. ఇక్కడే ఒక్క అరఘడియే నీ భోగం. ఇదే నా త్యాగం—నీ యోగంకూడా యిల్లాఉంది. లేకపోతే నాకెందుకు పుడతావు ? తండ్రీ ! ఎప్పటికైనా నీ ప్రాణాలు రాజుకోసం ఏ యుద్ధంలోనో విడువవలసినవే. నీకీభాగ్యం నేడే లభించింది. ఆవేళ ఆ మహారాజు దగ్గఱ నానోట ఆమాటెందుకే వచ్చిందేమో ? ఆ మహారాజే ఆశ్చర్యపడ్డాడు. నా మనస్సప్పుడేమిటో తెలుసుకోలేని బాధపడింది—ఇదా ?......ఏమిటా చప్పుడు !

(తలుపుకొట్టినట్లు)

వన : పన్నా ! పన్నా ! పన్నా !

పన్నా : రాజా ! వస్తున్నా ! (తలుపుతీసి) ఏమిటింత అర్ధరాత్రి ఇల్లా—

వన : (ప్రవేశం) తరవాత మాట్లాడవచ్చు ఉదయసింహుడేడీ ?

పన్నా : నాకేమీ తెలియటంలేదు.

వన : నీకేంతెలియాలి ? ఏడీ ? ఈ మంచంమీద వాడేనా ? ఏం ? మాట్లాడవేం ? బుఱ్ఱ ఊపకపోతే అవునసలేవా ?

(కత్తితో నరికి వెళ్లిపోవును)

## 5వ రంగము

(ఊరిచివర డొంకదగ్గఱ)

పన్నా : ఏరా ? ఎక్కడ ? ఉన్నావా ?

పాకీ : అమ్మా ! ఎంతసేపటికి వచ్చావమ్మా ! నా గుండె దడగుంటాది—

పన్నా : మాట్లాడకు రేపల్లా పిల్లవాణ్ణి దాచాలినువ్వు.

పాకీ : ఏడమ్మ ! ఇవ్వండీ ?

పన్నా : నీవు తెచ్చిన బుట్టేదీ ? ఆఁ ఇందులో ఉన్నాడు పో. మాట్లాడకు రేపురాత్రి ఇక్కడే పెందరాడే కనిపించు ఇది ఇల్లాగే అమర్చితే—ఎవరికీ తెలియకూడదు పో—

## 6వ రంగము

(వనవీరుడు, భార్య, ఇంటిలో)

వన : ఇంక పరవాలేదు అంతపనీ చేసే వచ్చాను నిన్న.

భార్య : నాకు ముందే తెలిసింది ప్రజలంతా ఎంత గోల పెట్టుతున్నారో కనిపెట్టారా? పన్నా పాపం "పెంచాను పిల్లవాణ్ణి ఇల్లా అయింది చివఱకి" అని ఏడుస్తోందిట— పెంచినందుకు దానికీ బాధ — మీకు హృదయం లేదు ఛీ—

వన : చాల్లే—ధర్మోపదేశం కట్టిపెట్టు—ఏడిస్తే తరుము గొట్టిస్తా దాన్ని.

## 7వ రంగము

(పన్నా ఆశాశాహ్—ఆశాశాహ్ ఇంటిముద్ద)

పన్నా : ఆశాశాహ్ మహారాజా! నీకీభారము తప్పదు ఈవీర బాలకుని మీదగ్గఱ దాచి పెంచకపోతే దిక్కులేదు. ఇద్దరు సామంతరాజులను వేడుకొని వచ్చాను. ఎవరికీ దయకలగలేదు నా పని నేను చేస్తున్నాను. మీకర్తవ్యం మీరూ గుర్తించండి. సంగ్రామ సింహుడు మిమ్ములను రక్షించిన మహారాజు. ఆ మహారాజుకులం నశిస్తోంది—నా——

ఆశా : ఏమిటమ్మా! చెప్పటం లేదా? ఆ వనవీరుడుతో మాకెందుకీ అనవసర వైరాలు? వెళ్లు నీ తిప్పలు నువ్వే పడు.

పన్నా : నా తిప్పలయిపోయాయి రాజా! నా బిడ్డణ్ణి బలి యిచ్చి రాత్రి రాత్రి నదిలో పారవేశాను: నేనందు కేడవను. ఈ పనిమాత్రం సాధించలేకపోతే అది వ్యర్థం కదా!

ఆశా : అబ్బే—వీల్లేదు.

ఆశా-తల్లి : (ప్రవేశం) రాజకుమారా! ఏమిటది! వింటున్నాను. కాదనకు నాయనా! అది పన్నా. దానీది ఎంత రాజభక్తి చూపిందో గుర్తించక పిరికిపందవై సిగ్గులేని మాటలా మాటలాడేవి? తీసుకో ఉదయసింహుణ్ణి, నే పెంచుతాను. భయంలేదు. పెద్దవాడయ్యాక వాడే వెళ్లి వాడి సింహాసనం జయించి తీసుకుంటాడు.

ఆశా : అమ్మా!

తల్లి : అంతే ఇంక మాట్లాడకు.



---

(20వ పేజీ తరువాయి)

అబలామూర్తి, స్త్రీశక్తి, ఆ నాట్యంలోని ప్రతిభావ విన్యాసమూ దివ్యలోకాని కొకసోపానం. ఆమె యేమన రుక్మిణీదేవి.

కళయే ఆమెప్రాణం. ఆమెకళా తపస్విని. కళను ఉద్ధరించేందుకూ, కళను విస్తృతం, విస్మృతం చేసేందుకు కంకణం కట్టుకున్న ఆ కళాజీవి, దివ్యజ్ఞాన సమాజాధ్యక్షురాలయిన డా॥ అనీబిసెంటు మాతకు పెంపుడు కూన. దివ్యజ్ఞాన సమాజాధ్యక్షులయిన శ్రీ డా॥ అరండేలుగారి సతీమణి. ఈమె దివ్యజ్ఞాని, యోగ విద్యాభ్యాసిని. కళోద్ధరణకోసం అడయారులో కళాక్షేత్రాన్ని స్థాపించి, తద్వారా కళా వ్యాప్తి చేస్తూవున్న రుక్మిణీదేవి ధన్యజీవి. ఈ నాట్యసుందరి విశ్వమానవప్రేమైకజీవిని. రూపొందిన జగదాంబగానున్న, ఈ అబలలో ఇంత మహానుభూతి ఎట్లుండగలదు!

కళలో దివ్యత్వాన్నీ, దివ్యజ్ఞానాన్నీ, కళలో జ్ఞానాన్నీ విజ్ఞానాన్నీ, కళలో ప్రపంచ పరిణామాన్నీ, కళలో ఆనంద బ్రహ్మాన్నీ దర్శించి, దర్శింపచేసి, తరించి, తరింపచేసిన కళాతపస్విని, ఈ ధన్యజీవి అడుగుజాడలు, యావత్ప్రపంచ నారీ లోకానికి అనుసరణీయాలు.



# ప్రపంచ ఆరోగ్యసమితి

శ్రీమతి చన్నఘంటమ్మ

ఐక్యరాజ్యాల ఆధ్వర్యములో నిర్వహింపబడే వివిధ సమితులలో, ప్రపంచ ఆరోగ్యసమితి ఒకటి. దీనినే, ఆంగ్లమున World Health Organisation అంటాము. W.H.O. అను సంక్షిప్త నామముతో వ్యవహరిస్తాము. వర్తమానంలో యీ సమితి పరిముఖంగా మనభారత దేశంలో కొన్ని పరిశోధనలు జరుగు చుండుటవల్ల దీనినిగూర్చి కొద్దిగనో, గొప్పగనో మనము వార్తా పత్రికలవల్ల తెలిసికొనుచునేయున్నాము.

అయితే, యీ సమితి ఎప్పుడు, ఏ విధముగా ప్రారంభమైనది, ఎట్టి కార్యప్రణాళికను ఏ విధముగా అమలు జరుపుచున్నది అను వివరములను గూర్చి ఇప్పుడు కొంచంగా చెప్పుకుంటాము.

అసలు, ఒక జాతియొక్కగాని, ఒక దేశముయొక్కగాని, అభ్యుదయము ఏ స్థాయిలో నున్నదీ నిర్ణయించాలంటే అందలిప్రజల ఆరోగ్యము ఏ స్థాయిలో ఉన్నదీ గమనించాలి. ఎందువలన? ఆరోగ్యమునకు లక్షణములు ‘శరీరస్వస్థత’ ‘మానసిక స్వస్థత’. ఇవి సిద్ధించిన వ్యక్తినే ఆరోగ్యవంతుడని నిర్వచిస్తాము. ఆహార పానీయములను గూర్చి, పరిశ్రమ విశ్రాంతులను గూర్చి, దేహ పరిసరముల పరిశుభ్రతను గూర్చి, కొన్ని ప్రాథమిక ఆరోగ్య సూత్రములను, సామాన్య వ్యాధి నిరోధక మార్గములను తెలియజేసే విజ్ఞానము, ఈ నియమములను క్రమబద్ధంగా అనుసరించి, దృఢమైన దేహసౌష్టవమును బడయుటకు వలసిన ఆర్థికస్థోమత, ఆహారసమృద్ధి, వ్యాధినిరోధన నివారణలయందు శాస్త్రయుక్తమైన విజ్ఞానముగల నిపుణులైన వైద్యుల సలహా, సహాయములు, ఆధునిక యంత్ర సామగ్రితో సమర్చబడిన వైద్యశాలలు, ఔషధాలు—ఇవన్నీ అందుబాటులో నున్నప్పుడే ప్రజలు పరిపూర్ణమైన ఆరోగ్యమును బడయ గలుగుతారు. ఆర్థిక స్థోమత, ఆహారసమృద్ధి, విజ్ఞానం వైద్య సహాయములు—ఇవన్నీ సానుకూలంగా సందర్భ పడ్డప్పుడే, ప్రజలయొక్క ఆరోగ్యము ఉన్నతస్థాయిని పొందగలదు కనుకనే, జాతి అభ్యుదయ నిర్ణయానికి, జాతి ఆరోగ్యమొక కొలతబద్దగా ఉపయోగ పడుతూ ఉంది.

ప్రాథమిక అవసరాలకు, ఆరోగ్యమునకు ఇంత సన్నిహిత సంబంధము ఉండబట్టే, పరిపూర్ణమైన ఆరోగ్యమును బడయుట ప్రతి మానవునియొక్క ప్రాథమిక హక్కుగా, నాగరిక ప్రపంచమంతయు, ఏకగ్రీవంగా, అంగీకరిస్తూంది. అందువలన విశ్వమానవ కళ్యాణమే ఆశయముగాగల ఐక్యరాజ్యసమితి యీ హక్కును సమర్థిస్తూ “జాతి మతవిచక్షణలు గాని, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, విభేధములు గాని, ఈ మన్మాత్రమూ అడ్డురాకుండా సర్వ ప్రజానీకమూ పరిపూర్ణమైన ఆరోగ్యమును అనుభవించుటకు అనువైన మార్గముల నాలోచించి, పరిశీలించి, అమలు జరుపునట్టి ఉన్నతాదర్శముతో” ప్రపంచ ఆరోగ్యసమితి నొకదానిని స్థాపించుటకు, ఫిబ్రవరి 1946 సం॥లో నిశ్చయించారు.

అంతకు పూర్వము పారిస్‌లో, జనీవాలో, వాషింగ్టన్‌లో అంతర్జాతీయ దృక్పథంతో కొన్ని ఆరోగ్య సమితులు వ్యవహరిస్తున్నప్పటికీ, వీనివలన క్రియారూపమైన ప్రయోజనము సిద్ధించలేదు. నానారాజ్య సభ్యత్వముగల ఒక ప్రపంచ సమితి దక్క అంతర్జాతీయ ఆరోగ్య సమస్యలను సక్రమంగా పరిష్కారము చేయలేదని ఈ విధంగా ఋజువగుటచే, 1946 ఫిబ్రవరిలో బ్రెజిల్, చైనా ప్రతినిధులు, ఐక్యరాజ్యసమితి స్థాపనగూర్చి ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదన సభ్యుల ఏకగ్రీవామోదమును బడయుటజేసి, దీని ప్రథమ సమావేశమునకు తక్షణ ఏర్పాట్లు గావింపబడ్డాయి. దీనికై ఏర్పడ్డ తాత్కాలిక సంఘం సమకూర్చిన నిబంధనావళిని, పేర్కొన్న ఆశయములను అంగీకరించిన 56 సభ్యరాజ్యాల ప్రతినిధులు, 1948 జూన్ నెలలో, జెనీవాలో ప్రథమ సమావేశమును అత్యుత్సాహముతో, విజయవంతముగా జరిపించి, అవస్య కార్యక్రమ

ప్రణాళికను నిర్ణయించారు. తదుపరి ఇంకనూ పెక్కు స్వతంత్ర రాజ్యములు యిందు సభ్యత్వమును బొందుటచే, ఐక్యరాజ్యసమితి సభ్యత్వపు సంఖ్యకన్న, యీ ఆరోగ్య సమితి సభ్యత్వ సంఖ్యయే అధికమైనది.

ప్రణాళికను అమలు జరుపుటకై, 18 గురు ఎన్నిక సభ్యులుగల ఒక కార్య నిర్వాహక సంఘము, ఒక డైరక్టరు జనరల్, సెక్రటేరియెట్ పరివారం ఏర్పాటు గావింప బడ్డారు. సమితి సభ్యులనుండియే కార్య నిర్వాహకసభ్యులు ఎన్నుకొన బడ్డారు. ఈ నిర్వాహక సంఘపు సలహాపై డైరక్టర్ జనరల్ కార్యక్రమమును అమలు జరుపుతాడు. ప్రస్తుతపు నిర్వాహక సంఘాధ్యక్షులు మన లక్ష్మణస్వామి మొదలియారుగారేనని తెలుసుకొనినప్పుడు, దీనిని గూర్చిన కుతూహలము మీలో పెంపొందవచ్చు.

ఒక్కొక్క దేశమందు కొన్నికొన్ని వ్యాధులు ఎక్కువగాను మరికొన్ని తక్కువగాను వ్యాపించివుంటాయి. ఆయా దేశములందలి వాతావరణ, శీతోష్ణస్థితిగతులు, ప్రజల ఆహారనియమాదులు, యీ వ్యత్యాసమునకు కారణములుగా ఉంటాయి. ఇట్లు నానాదేశాల్లో వ్యాపించియున్న వివిధ వ్యాధులకు మూలకారణములను, ఏయేవాతావరణములో నివి విజృంభించునదియు, వీనికి నివారణ నిరోధనోపాయము లెవ్వియనియు పరిశీలించి, సమన్వయించి, యిట్లు సేకరించిన విజ్ఞానమును ఆ మూలాగ్రముగా ప్రకటించుట ప్రపంచ సమితి యొక్క ఒక కర్తవ్యము. ఆయా దేశములలోనిరోధన, నివారణావకాశములను ఔషధ సామగ్రిరూపంగాను వైద్య సలహారూపంగా సమకూర్చుట రెండవ కర్తవ్యము. ఈ కర్తవ్యములు సవ్యముగా నెరవేరుటకు ఒక్క కేంద్ర సమితికి సాధ్యముకాదని, వివిధ సభ్యరాజ్యాలు 6 ప్రాంత సమితులుగా విభజింపబడ్డాయి. మన భారతదేశము ఆగ్నేయాసియా ప్రాంతీయ సమితిలోకిజేరినది. ఢిల్లీ యీ సమితి యొక్క కార్యస్థానము.

మరియూ ఆరోగ్య విషయములో కొన్నిదేశాలు ముందంజ వేసియున్నవి, మరికొన్ని వెనుకబడి ఉన్నవి. వెనుకబడియున్న ఒక్కొక్క దేశము ఈ ప్రపంచసమితికి దౌర్బల్యము చేకూర్చునమటు తథ్యము

ఎందుకంటే—ఆధునిక ప్రయాణ సౌకర్యాలవల్ల మానవుడు దూరాన్ని అవలీలగా అతిక్రమిస్తున్నాడు ఇవ్వాళ ఇక్కడున్నవ్యక్తి, రేపు యూరప్‌లో ఇంకరెండు రోజులకు అమెరికాలో ఉండగలుగుతున్నాడు. ఈ విధంగా వివిధ జాతులకలయిక తటస్థిస్తూఉంది. వాణిజ్యవ్యాపార అభివృద్ధివల్ల, ఒకచోట నుత్పత్తియైన పదార్థము దూరసీమలకు ఇట్టె రవాణాయగుచున్నది. జనాభా కలయికతో, వస్తురవాణాతో, వ్యాధుల వ్యాప్తికి చక్కటి అవకాశము కలుగుతూఉంది. ఒక దేశములో ఎక్కువగా వ్యాపించియున్న వ్యాధి, పరిసర ప్రాంతములకే గాక, దూరదేశములకుగూడ యీ విధముగా రవాణా యగుచుండుటచే, ఆరోగ్యవిషయములో వెనుకబడియున్న దేశాలు ఇతర దేశాలకుగూడ అరిష్టాకారణములగుచున్నవి. అందువలననే, ప్రపంచ ఆరోగ్య సమితియొక్క ఆదర్శము పరిపూర్ణముగా నెరవేరవలెనంటే ఇట్లు వెనుకబడియున్న దేశాలపై తన దృష్టిని ప్రసరింపజేయాలి.

భారత దేశము ఇలా వెనుకబడియున్న దేశములలో నొకటి గనుకనే, సమితియొక్క పరిశోధన కార్యక్రమము ఇక్కడ ఎక్కువగా సాగించుటకు కారణము. క్షయ, మలేరియా వ్యాధులు మన దేశంలో అత్యధికంగా వ్యాపించి, వర్షావర్షము కొన్ని లక్షల ప్రజలను పొట్టబెట్టుకొను చున్నాయి. కావేరీ డెల్టా ప్రాంతంలో, తూర్పు వంగ రాష్ట్రి డెల్టా భూములలో కలరా సంవత్సరపు పొడుగునా ప్రజలను పీడిస్తూనే ఉంటుంది. బాలింతలకు శిశువులకు నామమాత్రంగానైనా చెప్పుకోదగ్గ వైద్యశాలలు లేవు. ఈ కారణాలవల్ల, ఈ వ్యాధుల విజ్ఞానములో నిపుణులు, సమర్థులునైన ప్రపంచ వైద్యులు కొందఱు మనదేశంలో వివిధ ప్రాంతాల్లో పర్యటించుచున్నారు. వీరు మన పరిస్థితు లనుగూర్చి ప్రపంచ సమితికి నివేదిస్తే, ప్రపంచ సమితి కొన్ని ఏర్పాట్లు గావించవచ్చు. త్వరలోనే ఈ సమితి ఆధ్వర్యములో, మన దేశంలో, 3 క్షయవైద్య శిక్షణ ప్రత్యేక కేంద్రములు స్థాపింపబడునని వినికి.

వివిధ దేశాలలోని స్థానిక, ప్రభుత్వ, ఇతర సేవా సంస్థలతో పోటీపడక, వారితో తగువిధంగా సహకరించుటయే

(తరువాయి 31వ పేజీలో)

# గౌరవస్థానం

రేడియో కొన్నతర్వాత రాఘవరావుకూ రాజేశ్వరికీ వారి పిల్లలకూ దానితోడిదే లోకమైపోయింది. ఏ రోజుకారోజు నవనవమైన కార్యక్రమాలు వినడమూ వానిని గురించి మళ్లీ మళ్లీ చెప్పుకోడమూ విమర్శించుకోడమూ వాదించుకోడమూ. ఒకటేమిటి అంతా రేడియో లోకమే.

సాయంత్రం నాలుగు గంటలైంది. విజయవాడ రేడియో పేరంటం కార్యక్రమం వినడానికి త్వరత్వరగా కాఫీలు ఫలహారాలు ముగించుకొని వచ్చి కుర్చీలో కూర్చున్నది రాజేశ్వరి. "ఆహా! తయారైనావూ మీ స్త్రీల కార్యక్రమం వినడమంటే నీకెంత సరదా. ఎంత పనైనా మానుకొని వస్తావన్నాడు" రాఘవరావు నవ్వుతూ. "రేడియో పెట్టండి. యివ్వాళ చాలా ముఖ్యమైన విషయమున్నది," అన్నది రాజేశ్వరి. "ఏమిటేమి" టన్నాడు రాఘవరావు. "స్వతంత్ర భారతవర్షంలో స్త్రీల స్థానము. గురించి ఒక విదుషీమణి ప్రసంగ మున్నదన్నది. రాజేశ్వరి ప్రారంభ గీతమైన తర్వాత ప్రసంగం ప్రారంభమైనది. సతీపతులిద్దరు శ్రద్ధగా విన్నారు—భారత రాజ్యాంగ చట్టంలో స్త్రీలకు పురుషులతో సమానంగా లభించిన హక్కులు బాధ్యతలు ఉపన్యాసకురాలు ఎంతో చక్కగా వివరించింది. ఆఁ యీ కాగితాలమీద వ్రాయబడినహక్కుల కేమిలే అన్నట్టు రాజేశ్వరి అసంతృప్తిగా ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. వెంటనే రాఘవరావు ఆమె వంక మందహాసంతో చూస్తూ "ఇకనేమి మీ రొట్టె నేతిలో పడ్డదన్నమాటే. మీరు పురుషులతోబాటు సమానముగు ఏ హక్కులు కావలెనని పదింపదిగా తీర్మానిస్తున్నారో అవన్నీ వచ్చేసినాయి" అన్నాడు.

> మనదేశంలో స్త్రీల కష్టాలు "లా" కు బద్ధం కానివి, శాసనాలకు లొంగనివీవి. వానిని రాజశాసనాలు పరిష్కారం చెయ్యలేవు. స్త్రీ పురుషుల మధ్య బానిసయజమాని భావం వున్నంతవరకు శాసనరూపేణ హక్కులు వచ్చినా అవి కాగితం మీది హక్కులుమాత్రమే.

"రొట్టె నేతిలో పడంగానే ఏం సంబరము, చేతిలో పడొద్దూ?" అన్నది రాజేశ్వరి.

"నేతిలో పడ్డది చేతిలోకి రాకేం చేస్తుంది. స్త్రీ అన్న కారణంగా ఎందునూ నిషేధించరాదు—చదువులు, ఉద్యోగాలు, ఆస్తి హక్కులు, వోటు హక్కులు ప్రాతినిధ్యపు హక్కులు ఒకటేమిటి అన్నీ వచ్చాయిగా?"

"ఈ రావడానికేమిలెండి?"

"రాబట్టే గవర్నరులు, మంత్రులు రాయబారిణులు, శాసన సభల్లో సభ్యతలు, స్పీకర్లు—ఓ అన్నీ చేస్తున్నారు."

"పదహారుకోట్ల నలభైలక్షల స్త్రీలల్లోను వీరెన్ని వేలవంతూ?"

"ఓహో అందరికి రాలేదనా నీ కోపం? మగవాళ్లు మాత్రం అందరూ మహోన్నత పదవుల్లోనే ఉన్నారూ."

"అదే నేను చెప్పేదీనీ? స్త్రీలైనా పురుషులైనా ఏ పదిమందో గొప్ప ఉద్యోగాలు చేస్తే ఏమి జరిగింది. అయినా మీ మగవారితో మాకు సాటేమిటండీ. మావన్నీ కాగితాలమీది హక్కులు"

"ఎవరికైనా కాగితములమీద వ్రాసిన తర్వాతనేగా అమలులోకి వచ్చేది? ఇప్పుడు ఏ స్త్రీయైనా ఒక ఉద్యోగానికి దరఖాస్తు చేస్తే స్త్రీలకు యివ్వబడదని త్రోసివేయడానికి వీలవుతుందా?

"చూడండీ. లంచాలు పుచ్చుకొనే ఉద్యోగస్థులను బ్లాకుమార్కెట్టు సాగించే వ్యాపారస్థులనూ శిక్షించడానికి ఎన్నో చట్టాలున్నాయి శిక్షాస్మృతిలో. అయితేనేమి

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

చట్టానికి కానరాని వెలుతులేవో వారి ఆశలను పూరిస్తూనే ఉన్నాయి. దొంగకు తోడుపొయ్యే పిచ్చిదేశం మనది."

"అయితే ఏమంటావు?"

"చట్టాలు ప్యాసైతే చాలదంటాను."

"ముందు శాసనాలైతేగాదూ తర్వాత ఉద్యోగాలు వచ్చేది?"

"ఉద్యోగా లెవరికి కావాలండీ?"

"అయితే ఏమి కావాలె"

"గౌరవస్థానం."

"పదవితోబాటు అదీ వస్తుంది."

"పదవిలో ఉన్న ఏ పదిమందో ఆ పదవి ఉన్న నాల్గు రోజులూ గౌరవింపబడితే స్త్రీ సంఘమంతా గౌరవింప బడినట్లేనా? కాదుగా. స్త్రీ అనే వ్యక్తికే గౌరవం రావాలె."

"ఆఁహా! అయితే సరే ఎప్పటికీ తరుగూ ఒరుగూ లేని శాశ్వతమైన గౌరవస్థానం రావలెనంటావు. ఆడపిల్ల అనేది మాతృ గర్భంలోంచి బయటికి వచ్చి కాల గర్భంలో కలిసి పోయేవఱకూ ఒక్క విధమైన గౌరవం రావాలెనంటావు. ఛేప్—"

"మీ రిట్లా ఆక్షేపిస్తే నేను చెప్పలేను."

"అబ్బ! ఇదే నీతో వచ్చిన చిక్కు ప్రసంగం మధ్యలో యిట్టే కోపం తెప్పించుకొని సంభాషణకు అంతరాయం కల్పిస్తావు ఇంతకు—నే నేమన్నాను? మీరు ఎన్నాళ్ల నుంచో సమాన హక్కులు కావాలెనంటున్నారు గనుక అవి వచ్చేశాయన్నాను."

"ఏమి వచ్చాయి? మన దేశంలో స్త్రీల కష్టాలు లాకుబద్ధం కానివీ. శాసనాలకు లొంగనివీని. వానిని రాజ శాసనాలు పరిష్కారం చెయ్యలేవు. నిజం చెప్పవలసివస్తే మన దేశంలో పురుషులకు స్త్రీలను గౌరవంగా చూడటము తెలియదు. స్త్రీని మన్నించడం న్యూనతగాగూడా భావి స్తారు—ఒక స్త్రీని చిన్నబుచ్చడమంటే అలవోకగా సర దాగా చేస్తారు."

"నీవు పొరబడుతున్నావు. మన పురాణాల్లో త్రిమూ ర్తుల భార్యలకున్న గౌరవం ఎవరికున్నది? మన దేశంలో మాతృస్థానంలో స్త్రీకివున్న పూజ్యత ఎక్కడున్నది?"

"త్రిమూర్తుల భార్యల కథలూ ధర్మ శాస్త్రాల్లోని శ్లోకాలు బాగానే ఉండవచ్చును కాని ప్రస్తుతం ఆచరణలో ఉన్న విషయం చూడండి."

"ఆచరణలో మాత్రం?"

"అవును మీకేమి తెలుస్తుంది మీరు అపోజిషన్ పార్టీవారు"

"నీవి వట్టి అపోహాలు. ఇప్పుడు స్త్రీల గౌరవం చాలా హెచ్చింది."

"చట్టాల ఆడంబరంచూచి మీరట్లా అభిప్రాయపడు తున్నట్టున్నారు. మీ రెన్నైన చెప్పండి పురుషులు స్త్రీలను చులకనగా చూడటంలో లవలేశమైనా మార్పు కలగలేదు."

"తార్కాణం?"

"వేలు లక్షలు."

"ఉదాహరణకొక్కటి."

"ఆధునికులు వ్రాసే కథలు చదవండి, కావ్యాలు చద వండి. పత్రికలు చదవండి. ప్రహసనాలు చదవండి నాట కాలు చదవండి. సినిమాలు చూడండి నాటకాలు చూడండి పురణాలు వినండి హరికథలు వినండి. పాటలు వినండి పద్యాలు వినండి. చదువుకొనే విద్యార్థినిని చూడండి స్త్రీ యెంత చులకనగా చూడబడుతున్నదో తెలుస్తుంది. ఎదుటి మనిషి స్త్రీ గదా. మనమేమన్నా మళ్లీ ఎదురు తిరిగి అనదుగదా. మనమెట్లా మాట్లాడినా పరవాలేదని చూస్తున్నారేగాని ఇందువల్ల తమ గౌరవమెంత వమ్మై పోతున్నదో చూచుకోడంలేదు పురుషులు. ప్రతి క్రియా విరహితలైన స్త్రీలంటే మగవారికంత తేలిక. ఆ సంగతు లన్నీ అట్లా ఉంచండి. ఇంట్లోనైనా భార్యను మన్ననగా చూచే భర్త ఒక్కడైన మచ్చునకైనా కనిపిస్తాడేమో."

"ఆ, నే నుండగానే ఎంత అన్యాయానికి ఒడి గట్టావు!"

"(నవ్వుతూ) మీరు మహా మన్నిస్తున్నారు."

"మన్నింపకచేసే దేమున్నది? "పడతుకలయొద్ద మగవారు బానిసీలు"

"ఆఁ యీ వ్రాతలకేమి మీ వంటి భావ కవులుంటే యిట్లాంటి వెన్నైనా వ్రాస్తారు."

"ఇది నేను వ్రాసిందికాదు."

"మీవంటివారు వేరొకరు. నూతన రాజ్యాంగ చట్టం ప్రకారం. స్త్రీకి చదువుకోడానికీ, ఉద్యోగాలు చేయడానికీ ఆస్తి పాస్తులు అనుభవించడానికీ, వోట్లు నివ్వడానికీ శాసనసభల్లో ప్రవేశించడానికీ స్థానాధికారాలు చలాయించడానికీ అధికారాలు వచ్చాయి యిక మీకేమి తక్కువని మీరంటున్నారు—నిజంగా మనకన్నీ వచ్చినాయని స్త్రీలు అనుకుంటున్నారు. కాని స్త్రీ పురుషుల మధ్యనున్న యజమాని బానిసభావం అట్లాగే వున్నది. అందువల్ల ఆతని నిరంకుశత్వం ఆమెపై బహుముఖాలుగా చెలాయింపబడుతునే ఉన్నది. ఆమెను పుట్టింటికి తరిమివేస్తునే ఉన్నాడు. అక్కడనుండి ఏమేమో కట్టుకురమ్మని నిర్బంధిస్తునే ఉన్నాడు. ఆమెను పరిత్యజించి పునః వివాహం చేసుకుంటూనే ఉన్నాడు. ఆమె సలహా పాటించకుండా ఆస్తిపాస్తులు తగలేస్తునే ఉన్నాడు. తన సహధర్మిణియైన ఆ వ్యక్తిని గుర్తించకుండా నిరంకుశంగా ప్రవర్తిస్తున్నాడు. ఆమెను జోగిని చేయతలచుకుంటే జోగినీ భోగిని చేయతలుచుకుంటే భోగినీ చేయడం యింకా అతని చేతులలోనే ఉన్నది. స్త్రీగూడా మనిషేననీ, ఆమెకు హృదయం ఉన్నదనీ, తెలివితేటలున్నవనీ, యుక్తాయుక్త పరిజ్ఞాన మున్నదనీ, ఆమెను తనతో సమానంగా చూడటం తన ధర్మమనీ పురుషునకు తోచడమేలేదు. ఈ తలంపు పురుషుని హృదయంలో కలగనప్పుడు స్త్రీకి గౌరవ మెట్లా వస్తుంది? ఏ చట్టాలు వీరిని రక్షిస్తాయి. అందువల్లనే మహాత్ముడు ప్రతి సంస్కరణకూ మనః పరివర్తన ముఖ్యమంటూ ఉండేవాడు. దీనికీ అంతే."

"ఆహాహా! ఏమి మహోపన్యాసము. నీ ప్రసంగం గూడా రేడియోకెక్కిస్తే బాగా ఉండును. మీ స్త్రీలంతా విని ఆనందిస్తారు."

"మీరుమాత్రం సంతోషించరన్నమాట."

"నేను అసోజిమసుహ్రాత్తి వాడనని యింకాకనే అన్నావుగా. నేను సంతోషిస్తానంటే నమ్ముతావ్రా."

"ఇంతకూ ఈ స్త్రీ హైన్యతకంతకూ కీలకం ఒకటే ఉన్నది."

"ఏమిటో అదిగూడ వినిపిస్తే"

"స్త్రీకి ఆర్థికోపపత్తి లేదు. అందువల్లనే స్వయం వ్యక్తిత్వంగూడా లేదు—ఎప్పుడైతే స్త్రీ ఒకరి పెట్టుపోతలుమీద ఆధారపడి ఉన్నదో అప్పుడే ఆమె బ్రతుకు తేలికైపోయింది—"

"బరువెక్కడానికి నీవే ఏదో ఉపాయం సూచించూ"

"తన్నుదాను పోషించుకోడం నేర్చుకోవాలె"

"సరిసరి యిదా నీ సూచన? పాటకపు స్త్రీ అందరూ తమ్ము దాము పోషించుకొనేవాళ్లే—వాళ్లేం సుఖంగా ఉంటున్నారు?"

"వాళ్లే నయం. సంపన్న కుటుంబినులు, మధ్య కుటుంబినులు—పురుషుల పోషణ తప్పితే అధోగతిపాలై పోతున్నారు. వాళ్లకు స్వయం పోషణశక్తి ఉండాలి. ఇంతకూ స్త్రీని తనతో సమానమగు స్థాయిలో మిత్రురాలివలె పురుషుడు చూడాలె. అప్పుడే స్త్రీ పురుషు లిరువురికి సౌఖ్యమూ కలుగుతుంది, దేశం అభివృద్ధిలోకి వస్తుంది. కుటుంబాల్లో శాంతి భద్రతలు చేకూరితే దేశానికి శాంతి భద్రతలు చేకూరినట్లే."

"అయితే యీ క్లిష్ట సమస్య భద్రతా సంఘానికి నివేదించవలసిందే."

"ఎందుకూ? కాశ్మీర సమస్యకు తోడుగా ఉంటుందనా?

"కాదుకాదు వాళ్లు బాగా చర్చించి యీ విధంగా మెలగండని మా పురుషులకు సూచిస్తే ఆ విధంగా మెలగుదామని."

"అదికాదులెండి. అక్కడా మనవాళ్లేనని మీరెత్తు" రాఘవరావు పకాలున నవ్వాడు.



# మహిళా ప్రబోధము

* శ్రీ జె. చిరంజీవి *

'The strength of the chain is the strength of it's weakest link' అన్నట్లు సమాజమునందు ఏ ఒక్క భాగము, తగురీతి అభివృద్ధి చెందకుండినను సమాజము ఉన్నత స్థితికి రాలేదు. నేడు దౌర్బల్యము స్త్రీ జాతియందు కాన వచ్చు చున్నది.

స్త్రీలు తమ్ము తాము అనేక విధములు గాపాడుకొన వలెను. వారిలో సదవకాశములను దుర్వినియోగము చేసికొని చెడి పోవు వారనేకులున్నారు. సత్ప్రవర్తన నలవరచు కొనుటకై ప్రత్యేకించి కొన్ని యంశములను పాటించి తగురీతి ఆచరింప వలసిన అవసరమెంతేని గలదు. అంనొకటి ఆలోచనా శక్తి నలవరచుకొనుట. నేడు సామాన్యవనిత యందు ఆలోచనా శక్తి శూన్యమగుట శోచనీయము. వీరిలో పల్వురకు దాని యావశ్యకతయే తెలియకపోగా యది అనసర మని యనుకొనుచున్నారు. నేటి నాగరికతా ప్రపంచమున గూడ స్త్రీలు ఇట్టి దురభిప్రాయమునకు లోనౌట స్త్రీజాతి కేగాక మానవ జాతికంతయును దుర్దినములు ప్రాప్తించిన వన్న మాట. "ఏ యందమును లేక నల్గురిచే నీసడింపబడి యవహేళన చేయబడు వనిత యాలోచింపవలెను గాని మాకేమి పని" అని కొందరు విదుషీమణుల యభిప్రాయము. ఇది పొరపాటు. ఇట్టి యభిప్రాయముల ఫలితమే నేటి స్త్రీ సంఘము. సంస్కరణ పూర్వకమైనదే యైనను ఆలోచన, సహకారము లేనిదే నెగ్గదు. కావున యాలోచనా శక్తి నభివృద్ధి చేసికొనుట ముఖ్యము.

"నే నెవరిని? నా యాశయమేమి? నా కర్తవ్యమేమి? ఏ రీతిగా ప్రవర్తించిన సంఘ క్షేమమునకు దేశ క్షేమమునకు తోడ్పడగలను?" అని ఎందరు మహిళ లాలోచించు చున్నారు? వింత కోర్కెలు, ఈర్ష్యాసూయ భావములు కృత్రిమ వేషములు వేనకు వేలుగా కానవచ్చు చున్నవి. అంతియేగాని ఒక ప్రత్యేక పవిత్ర ఆశయమును తదను గుణ్యమైన ఆలోచనా పూర్వక ప్రవర్తనయు గానవచ్చుట లేదు. ఆలోచనా శక్తి ప్రస్తుత స్త్రీ జాతిలో అభివృద్ధి చెందక యుండుట వలన కాలవలోని కాగితపు పడవవలె స్వీయపంథాలేక సంచరింపవలసిన దుస్థితి వచ్చినది. ఒకప్పుడు పసిపిల్లలవలెను వేరొకప్పుడు చిలుకలవలెను యనాలోచిత మైన పల్కులను పల్కుచుందురు. అట్లు చేయుట మహిళ లకు గౌరవ ప్రదమైనది యనియే నేటికినీ వారి దురభిప్రా యము. వినువారి మనసునందేమి సంచలనము గల్గునో వారలే విపరీత ప్రవృత్తులకు లోనగుదురో, ఏ తత్ఫలముగ వారి జీవిత క్షేమ మెట్లు పరిణామము చెందుచున్నవో యాలోచింపరు. ఇది చాల శోచనీయమైన వ్యవస్థ. ఒక విషయమునుగూర్చి ముచ్చటించునపుడు దానిముందు వెనుక లాలోచించియే చేయవలెను. దీనికి యాలోచన అవసరము. ఎవరి మాటను వారే గౌరవింపనిచో అన్యులు గౌరవింపరు.

సిల్కుచీరలు సింగారించుకొను స్త్రీ ఒక్కనాడేనియు సిల్కును గూర్చి యాలోచింపదు. నక్షత్రములను, చంద్రుని చూచి ఉప్పొంగు స్త్రీ ఒక్కనాడేనియు వానినిగూర్చి యాలోచింపదు. సారస్వతము, చరిత్ర శాస్త్రము, రాజకీయ ములు, ఎంత చదివినను యాలోచన లేనిదే రాణింపునకు రావు. చిలుక పలుకలవలన లాభము లేదు. నల్గురు యువకులు మాట్లాడుకొను తావున స్త్రీ ఒక ప్రతిమను బోలియుండును. ఆమెయును వీరిమాత్రము చదివినదే. విశ్వ విద్యాలయ బిరు దములు వీరికున్నన్ని ఆమెకును గలవు. తీరిక ఎక్కువగాన యింకను చదివియుండ వచ్చును. కాని యాలోచించుటకు మాత్రము శ్రమ తీసికొనదు.

మహిళలు తమలో నిబిడీకృతమైయున్న మహత్తరమైన శక్తిని యీ విధముగా త్రుప్పు పట్టనీయ కూడదు. సోమరి తనము నుండి విముక్తి నందుటకై సదా ప్రయత్నింప వలసి యున్నది.

ఇక రెండవది వ్రాయుట అలవాటు చేసికొనుట. ఇదికూడ స్త్రీలలో వెనుకబడి యుండుటకు కారణము సోమరితనమే. భావములు కేవలము విశ్వ విద్యాలయముల

యందు విద్యనార్జించిన విద్యావతుల సొత్తేగాదు. ప్రతి వ్యక్తియు స్వతంత్రభావమును గల్గి యుండుట సత్యము. అట్టిదానిని అభివృద్ధి చెందుటకెట్టి యవకాశము నీయక పాడు చేయుచున్నారు. ఒకే విషయమునుగూర్చి నలు గురకు భిన్నాభిప్రాయములుండ వచ్చును. అట్టి తరి వానిని వ్రాసియుంచినచో విజ్ఞానాభివృద్ధి కెంతేని తోడ్పడిన వారు కాగలరు. లేనిచో మహత్తర భావములు వ్యక్తీకరణ లేమి నమసిపోవును. ప్రతివారికిని ప్రత్యేక మనోవ్యవస్థయందు మహత్తర భావములు స్ఫురించును. ప్రపంచమునందెరుక బడక ఎందరెందరు స్త్రీ పురుషులు గతించిరో? వారి భావ ములనే కలముద్వారా బయల్వెడలనిచ్చినచో సంఘ వ్యవస్థ యేరీతిగ నుండెడిదో? ఈ వ్రాయుట అలవాటు చేయక పోవటమువల్ల ఎన్నెన్ని మహత్తర భావములో అమూల్య అభి ప్రాయములో వృథా యగుచున్నవి. దానివలన సంఘ పురోభివృద్ధి కంతరాయము గల్గుచున్నది. ఆలోచన, దానిని లిఖించుట, ఒకదానికొకటి సాయపడును. ఒకదానివలన వేరొకటి యభివృద్ధి చెందును. మహిళా! వశాధ్యమున నింకెంతకాల ముండనిచ్చెదవు? మహత్తర కార్యములు చేయు సామర్ధ్యము నీకు కలదు. నేను నీవు వెనుకబడి యుండుటకు కారణము నీ ప్రవర్తన, నీ సంఘ పరిస్థితియని తెలిసికొనుము. వీని సంస్కరణ జరుగనిదే అనగా ఈ క్రుళ్లు తొలగింపనిదే, తొలగింప ప్రయత్నింపనిదే యే సంస్థయు నిక్కమయిన సంస్కరణ చేయలేదు. ఇందులకు సహ కారము, తీవ్ర కృషి యవసరము. "ఉత్తిష్ఠత! జాగ్రత!! ప్రాప్యవరాన్ని బోధత!!!" యను కఠోపనిష ద్భాగమును సదా జ్ఞప్తి యందుంచుకొనుము.



---

(26వ పేజీ తరువాయి)

ప్రపంచ సమితియొక్క ఉద్దేశము. ఇటీవల బొంబాయి రాష్ట్రములో పోలియో మైలెటిస్ అనే ఘోర వ్యాధి విజృంభించి అనేక బాలబాలికలను మృత్యువున కందించినది. ఈ వ్యాధి నివారణకు Iron Luugs అవసరమయ్యాయి. భారత ప్రభుత్వము ప్రపంచ ఆరోగ్యసమితికి వ్రాసుకోగా, వెంటనే Iron Lungs U.S.A. నుండి మనకు పంపించారు. ఈ సమితి యీ విధంగా ప్రభుత్వములతో సహకరిస్తుంది.

ఇంకా, ఇతర ప్రజాహిత సమితులతోగూడ యీ సమితి సన్నిహితముగా వ్యవహరిస్తుంది. దీనియొక్క భవిష్యత్తు వివిధ రాజ్యాల హృదయపూర్వక సహకారముపై నాధారపడి యున్నది. ఏనాడైతే వివిధ దేశాలు పరస్పర స్నేహ బాంధవ్యాలతో జగత్కుటుంబములోని తమ బాధ్యతా స్థానాన్ని గ్రహించి, తమ సౌభాగ్యమే ప్రపంచ సౌభాగ్యమని, ప్రపంచ సౌభాగ్యమే తమ సౌభాగ్యమని దృఢముగా విశ్వసిస్తు, హృదయ పూర్వకముగ నొండొరు లతో సహకరిస్తారో, ఆనాడే ప్రపంచ ఆరోగ్య సమితి యొక్క విజయ పతాక ప్రతిష్ఠ జరుగగలదు.

[ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో]



# మీరు మెక్లీన్ తో
# నేడు పళ్లు తోముకున్నారా?



"నేను
ఏళ్లతరబడిని
మెక్లీన్స్
వాడుతున్నాను
నా నిత్యకృత్యాలు
దీని తోనే
ప్రారంభిస్తున్నవి".

| |
|---|
| నోటిని పరిమళభరిత మొనర్చి<br>దుర్వాసనను<br>నివారిస్తుంది |
| ఆమ్లాలను విరిచివేసి<br>మీ ఇగుళ్లను<br>సంరక్షిస్తుంది |
| పళ్లమీది మరకలను తొలగించి<br>వాటిని ధవళతర<br>మొనర్చుతుంది |

అనుకరింపశక్యంకాని ప్రత్యేక సూత్రం ప్రకారం తయారైన మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు జగద్విఖ్యాతి గాంచినది. దీనికి కారణాలు: ఇది మిక్కిలి పరిశుభ్ర మైనది. పంటిమీది మరకలు తొలగించుటలోను, నోటిని శుభ్రపరుచుటలోను శక్తివంతంగా పనిచేస్తుంది. వాడునపుడు ఆహ్లాదకరమైనది, పరిమళభరితమైనది.

కోట్లకొలది ప్రజలు అలవాటుగా నిత్యం మెక్లీన్స్‌తో దంతధావనచేస్తూ తమ నిత్యకృత్యాలను ప్రారంభిస్తున్నారు.

నేడే మెక్లీన్స్ కొనండి!




MTX 2 TG

క్రియాధాతువునకు ఏక వచనములో **एगा,** బహువచనములో **एँगे, मैं** కర్తగానున్నపుడు **ऊँगा, तुम** కర్తగానున్న **ओगे** చేర్చిన భవిష్యత్కాలమగును.

| ఏకవచనము. | బహువచనము. |
|---|---|
| **मैं आऊँगा** నేను వచ్చెదను. | **हम आएँगे** మేము వచ్చెదము. |
| **तू आएगा** నీవు వచ్చెదవు. | **तुम आओगे** మీరు వచ్చెదరు. |
| | **आप आएँगे** తమరు వచ్చెదరు. |
| **वह आएगा** అతడు వచ్చును. | **वे आएँगे** వారు వచ్చెదరు. |

స్త్రీలింగ శబ్దములు కర్తలుగా నున్నపుడు **गा, गे** లు **गी** గా మారును.

(**आ-ए-ई** నియమము చూడవలసినది).

అచ్చు అంతమందు గల ధాతువులకు భవిష్యత్కాలములో **एगा, एँगे** లకు బదులు **वेगा, वेंगे, यगा, यंगे** అనియు, **ऊँगा, ओगे** లకు బదులు **वूँगा, वोगे** యును చేర్చివచ్చును.

ఉదా:—**जाएगा** కు బదులుగ **जावेगा, जायगा**

**जाएँगे** ,, ,, **जावेंगे, जायँगे**

**जाऊँगा** ,, ,, **जावूँगा**

**जाओगे** ,, ,, **जावोगे**

హల్లు అంతమందుగల ధాతువుల భవిష్యత్కాల రూపమీ క్రింది విధమున నుండును:—

**मैं कर + ऊँगा—मैं करूँगा** నేను చేయుదును.

**हम कर + एँगे—हम करेंगे** మేము, (లేక మనము) చేయుదుము.

| | |
|---|---|
| **तू करेगा** నీవు చేయుదువు. | **तुम करोगे** మీరు చేయుదురు. |
| | **आप करेंगे** తమరు చేయుదురు. |
| **वह करेगा** అతడు చేయును. | **वे करेंगे** వారు చేయుదురు. |

**ले, दे, हो** ధాతువుల రూపములు.

| | |
|---|---|
| **मैं लूँगा** నేను తీసికొందును. | **हम लेंगे** మేము తీసికొనెదము. |
| **तू लेगा** నీవు తీసికొనెదవు. | **तुम लोगे** మీరు తీసికొనెదరు. |
| | **आप लेंगे** తమరు తీసికొనెదరు. |
| **यह लेगा** ఇతడు తీసికొనును. | **ये लेंगे** వీరు తీసికొనెదరు. |

## పాఠము 18.

### సంభావ్య భవిష్యత్కాలము.

ఇది భవిష్యత్కాలము నుండి ఏర్పడును.

సామాన్య భవిష్యత్కాలమునందలి చివర గా, గే, గీ అను తీసివేసినచో సంభావ్య భవిష్యత్కాలము ఏర్పడును.

స్త్రీలింగ పుంలింగములందు రెండింటియందు మార్పులేకుండనే యుండును.

| | |
|---|---|
| యథా :—मैं जाऊँ | हम जाएँ |
| तू जाए | तुम जाओ, आप जाएँ |
| वह जाए | वे जाएँ |
| मैं दूँ | हम दें |
| तू दे | तुम दो, आप दें, |
| यह दे | ये दें |

### సంభావ్య భవిష్యత్తు యొక్క ప్రయోగములు

నిమిత్తము, కోరిక, ఆజ్ఞ, అనుమతి, షరతు, సందేహము—వీనిని వ్యక్తపరచుటకు సంభావ్య భవిష్యత్కాలమును ప్రయోగించబడును.

1. నిమిత్తము.

ఇందులో నిమిత్తమును సూచించు వాక్యమునకు ముందు **कि** గాని, **जिससे** గాని వచ్చును.

**तुम उसको यहाँ बुलाओ जिससे वह बंबई न जावे** అతడు బొంబాయి పోకుండునట్లుగా అతనిని యిచ్చటికి పిలువుము.

2. కోరిక, ఆజ్ఞ, అనుమతి.

కోరిక :—**भगवान हमारे ऊपर कृपा करे**—భగవంతుడు మనపై కృపజూపుగాక.

ఆజ్ఞ :—**वह आज घर न जावे** అతడు నేడు ఇంటికి వెళ్ల కూడదు. (అతనిని వెళ్లనివ్వవద్దు).

అనుమతి :—**मैं जाऊँ** నేను వెళ్లనా? నన్ను వెళ్లమనెదరా?

3. షరతు :—

దీనిలో కార్యకారణ సంబంధమును తెలుపు రెండు వాక్యములు '**तो**' యను సముచ్చయముతో చేర్పబడియుండును.

## సంభావ్య భవిష్యత్తు యొక్క ప్రయోగములు

మొదట కారణవాక్యము **यदि** లేక **अगर** (అగుచో) తో ప్రారంభమగును. కొన్ని సమయములలో **यदि, अगर** లోపించవచ్చును. 'కార్య' వాక్యము మొదట '**तो**' మాత్రము తప్పకనుండవలెను.

**(अगर) तुम आगरा जाओ तो ताजमहल ज़रूर देखो।** మీరు ఆగ్రా వెళ్లినచో తాజ్‌మహల్ తప్పక చూడండి.

సూచన:—సంభావ్య భవిష్యత్కాలములో '**तुम**' కర్తగానున్నప్పుడు దాని రూపము విధ్యర్థక రూపమువలెనుండును. (చూ. పాఠము 4.) అర్థమును బట్టి కాలభేదమును తెలిసికొనవలెను.

ఉదా:—**तुम कहो तो मैं जाऊँगा** నీవు చెప్పినచో నేను వెళ్లుదును.
**(कहो तो-कहोगे तो)** (సం॥ భవిష్యత్).

4. సందేహము, అనుమానము.

**वे आवें या ना आवें, मैं नहीं जानती** వారు వత్తురో, రారో, నేనెరుగను.

**कौन जाने?** ఎవడెరుగు?

**मैं क्या जानूँ?** నేనేమెరుగుదును?

**सभा** సభ; మీటింగ్; సమావేశము. (స్త్రీ.)
**कई** కొన్ని, కొందరు.
**प्रमुख** ప్రముఖులు.
**नेता** నాయకుడు; నాయకులు. (పుంలింగము, ఏకవచన, బహువచనములు).
**ठहरना** ఆగుట; ఉండుట.
**परसों** మొన్న; ఎల్లుండి.
**सबक़** పాఠము. (పుంలింగము).
**मनाना** ఉత్సవము, పండుగ జరిపించుట.
**होकर** త్రోవను, గుండా, మార్గమున. (Via.)

**पत्र** ఉత్తరము, జాబు (పుంలింగము).
**अगला** రాబోవు.
**महीना** నెల. (పుంలింగము).
**वापस आना** / **लौटना** } తిరిగి వచ్చుట.
**यहीं** ఇచ్చటనే.
**कसूर** నేరము; తప్పిదము.
**मानना** ఒప్పుకొనుట, సమ్మతించుట.
**बुलाना** పిలుచుట.
**जिससे** దేనినుండైతే.

**आज यहाँ एक सभा होगी।** నేడు యిచ్చట యొక సభ జరుగును.

**उसमें कई प्रमुख नेता बोलेंगे।** ఆ సభలో (అందు) కొందరు ప్రముఖ నాయకులు మాట్లాడుదురు.

## సంభావ్య భవిష్యత్తు యొక్క ప్రయోగములు

| | |
|---|---|
| आज रात की गाड़ी से हम दिल्ली जायँगे। | నేటి రాత్రి బండిలో మేము ఢిల్లీ వెళ్లెదము. |
| क्या आपके मित्र यहाँ दस दिन ठहरेंगे? | తమ స్నేహితులిచ్చట పది రోజులుందురా? |
| नहीं वे परसों जायेंगे। | లేదు, వారు ఎల్లుండి వెళ్లెదరు. |
| मास्टर साहब आज नया सबक लेंगे। | ఉపాధ్యాయులు నేడు క్రొత్త పాఠము తీయుదురు (నేర్పుదురు). |
| हम अपने स्कूल में गाँधी जयंती मनायेंगे। | మేము మా స్కూలులో గాంధీ జయంతి జరుపుదుము. |
| यहाँ से कलकत्ते होकर हम प्रयाग जायेंगे। | ఇక్కడనుండి కలకత్తా మార్గముగా మేము ప్రయాగ వెళ్లెదము. |
| वहाँ से आपको पत्र लिखेंगे। | అచ్చటనుండి తమకు పత్రము వ్రాయుదుము. |
| हम अगले महीने में वापस आयेंगे। | మేము పై నెలలో తిరిగి వచ్చెదము. |
| कौन जाने, कल क्या होगा? | రేపు ఏమి జరుగనున్నది యెవరెరుగుదురు? |
| जब तक मैं न लौटूँ, तब तक आप यहीं रहें। | నేను మరలవచ్చు నంతవరకు తమరిచ్చటనే యుండండి. (ఉందురుగాక). |
| तुम अपना कसूर मानो तो मैं तुम्हें क्षमा करूँगी। | మీరు మీ తప్పిదము ఒప్పుకొన్నచో నేను మిమ్ములను క్షమింతును. |
| अगर तुम मेरी बात न मानो तो मुझे दुख होगा। | మీరు నా మాట వినకున్నచో నాకు దుఃఖము కలుగును. |
| क्या मैं डाक्टर को बुलाऊँ? | నేను డాక్టరును పిలువనా? |



## రేపల్లె మహిళా మండలి

పై మహిళామండలి భవన నిర్మాణ సహాయార్థం, తమిళాంధ్ర సంగీత దర్శకులుగా పేరుపొందిన శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారు, రేపల్లె గ్రామములో, 1-9-50న పాటకచ్చేరి జరిపిరి. మండలివారు వెంకటేశ్వరరావు గారికి స్వాగతపత్రమును సమర్పించి, వెండితో చేసిన సరస్వతీ, లక్ష్మి విగ్రహములను బహూకరించిరి. ఈ కచేరీ మూలమున, భవన నిర్మాణ నిధికి రూ. 3000/- లు వసూలు చేయబడినవి.

పాములపాటి వైరాగ్యభాయి,
కార్యదర్శిని.

## ఆంధ్ర మహిళాసభ

### క్లబ్బు శాఖ

ది. 6—9—50న ఉదయశంకర్ నృత్య బృందములోని శెట్టీ అనునతను నృత్య భంగిమలను, జానపద గేయములను అభినయించి చూపెను.

ది. 15—9—50న విఘ్నేశ్వర పూజానంతరం శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయగారు హార్మోనియమ్ పై తమ సంగీతమును వినిపించిరి.

చిత్ర సమీక్ష:

# నా స్మృతి పథంలో 'బర్సాత్' చిత్రం

* శ్రీమతి కొత్తపల్లి లలిత *

'బర్సాత్' చిత్రం నవీనపథంలో నడిచింది. కథ అతి సామాన్యమైనదే కానీ కొన్ని ఆదర్శ సమస్యల్ని పురస్కరించుకొని వేసిన ప్రాతిపదిక స్పష్టంగా గోచరిస్తుంది.

ఇద్దరు స్నేహితులు కాశ్మీరంలోని సుందర ప్రదేశాన్ని చూడడానికని వెళ్తారు. అతి రమణీయమైన ప్రకృతిశోభ కుప్పతిప్పలుగా, ఆ పూలచెట్లల్లో, జలపాతాల్లో అన్ని ప్రదేశాల్లో కనబడుతుంది...కథానాయకుడు కవి, కళారాధకుడు, వేదాంతి! అతని హృదయవేదన మానవులకు వ్యక్తపర్చడం మాటల్తో కాదు...ఆ శోభ అంతకన్నా మించిన దగుటచేతనే 'వైలన్' అర్థం చేసుకొన్నది! ఈ చిత్రంలో దాని ఉపయోగం వలన భావగర్భితమైన వాతావరణ మేర్పడినది...ఆ గుంపులు గుంపులుగావున్న పూలల్లో సుగంధం తప్పకుండా వుండితీరుతుందనిపిస్తుంది...ఆ గలగలలాడుతున్న జలపాతాల్లో వెయ్యి హృదయాల ఉద్రేకం వుందనిపిస్తుంది...అక్కడక్కడ కనబడ్తున్న చిన్నచిన్న రాళ్లుకూడా ఏవో గుసగుసలాడుకొంటున్నవా?......అవును—సంగీతం ప్రకృతిలో విడివిడిగా వున్న అందాన్ని ఒకదానికొకటి కూర్చి, విశ్వజనీనమైన ఏకైక స్వరూపాన్ని దానికి, ఆపాదిస్తోంది. మన హృదయాల్ని మహత్తర శక్తితోనే స్పందింప జేస్తోంది. తరతరాలనుంచీ! ఈ లక్ష్యాన్ని ఏచిత్రంలోకూడా సిద్ధింప జేయలే దింతవఱకూ. ఇదే నవీన పథం—కథా ప్రారంభములో 'వైలన్' అంతములో సన్నాయి!—ఈ సూర్యోదయ సూర్యాస్తమయ మహా ప్రవాహాలకు ఆనకట్ట శ్రీలతామంగేశకర్ వినిపించిన భావోన్మత్త గీతాలు...ఈ స్వరమేళనం చిత్రానికి విశిష్టమైన వాతావరణాన్ని కల్పించి (మొదటినుంచి చివరవరకూ సూచింపబడిన) మందమైన కథా గమనాన్ని ఇంచుక తొందరచేసి జీవం పోసిందన వచ్చును...ఇటువంటి ప్రదేశంలో రాగరక్తిమను వర్ణించినారు...అంతులేని జీవనరాగం కొంతవఱకూ సంగీతగమనంలోనే నడిచింది...హృదయాన్ని మరింత ఉత్సాహితలూపింది...ఆ 'వైలను' ద్వారా ఎన్నో మూగబాధల్ని అవగాహన చేసుకొంటాం...కళారాధకుని విషాదజగత్తు దాని లోతుల్లోనే వున్న మాధుర్యం (ఆనందమా?) అందులో ప్రేయసికై వెఱ్ఱిపిలుపు—ఎన్నో అర్థం చేసుకొంటాం...'వైలను' ఎక్కువ విషాదాన్ని కొలకపోస్తుందేమో నని కాబోలును 'సన్నాయిని' ప్రవేశపెట్టి కళ్యాణశోభను సంపాదించవలెనని చూసినారు...'వైలను' అడిగిన ప్రశ్నల్ని పూరించాలని చూసింది 'సన్నాయి'...కానీ, అత్యుత్తమ స్థాయిలో రెండూ వొకటేనేమో—విషాదం ఆనందం!...అవును నిండుగా వ్యక్తపర్చాలంటే అదంతా ఆ పాత మధురం........దీన్ని కలంతో కన్నా కుంచెతో బాగా వర్ణించ గలమేమో! అక్కడైనా రంగుల్ని చూపించగలం...కానీ శాస్త్రంలోని వేదాంతాన్ని, సొంపుల్నీ, పరిమళాన్నీ—ఇన్ని వేలు వేలు లక్షణాల్ని ఏకైకరూపంగా చిత్రించగలమా? అందుచేతనే సంగీతాన్ని ప్రకృతి వినాగా ఎక్కడా పూర్తిగా అవగాహన చేసుకోలేమని విశ్వసనీయంగా అనిపిస్తుంది.

ఇంత అంతులేని ప్రకృతి రమణీయతలోనే కాఠిన్యం గర్భితమైవుంది...జరామరణ దుఃఖ బాధితులైన మానవులకు మహా నిలయమిదే!!!

సౌందర్యం కూడా నశిస్తుందంటే కళ్లు నమ్మలేవు...పూలు కళ్లు చిల్లులు పడేలా నిండుగా వికసించి అనుక్షణంలో వాడిపోయి వాసన పోగొట్టు కొన్నట్లుగానే మానవుడు కొన్నాళ్లు గుండె చీలుకపోయేలా జీవించి, ఎట్టని జ్వాలవలె నిమిషంలో సమసిపోతాడు!! అవును—ఎన్నాళ్లని విసుగు లేకుండా వుండగలడూ......

బర్సాత్‌లోని హృదయ విదారకమైన సన్నివేశాలు: మానవుడంటే ఏమిటీ? ఒక మహాకావ్యమే వాని

హృదయం...కానీ వాని కేటి సంపత్తి పెక్కు బజారైన విహీన విషయసంస్కృతి—అని చూపిస్తుంది......ఇందులో ఇద్దరు పురుషులవలె ఇద్దరు కాస్త్రీ రమణీమణులు...వారికి ప్రకృతి పుష్పసౌరభం, పసిపాపల అమాయకత్వం పెట్టని ఆభరణము లైనవి...నైతిక స్వభావము ననుసరించి వలపుల్ని వెదజల్లుట సమర్థతతో చూపెరి......

'ప్రేం క్యా కహతా, బతావ్ జీ—' అని అనుకుంటారే గాని దాన్ని అనుభవించడం ఆస్వాదింప జేయడంలో వెనుకంజ వేయరు......

ఒక స్త్రీ కళారాధకుని ప్రియురాలు...ఆమె ప్రాణాల్ని తెగించి ప్రేమవిజయాన్ని పొందుతుంది.

Unborn tomorrow and dead yesterday,
Why fret about them if to be sweet!

అన్న ప్రకారంగా జీవించే రెండో పురుషుని వలలో చిక్కిన దింకోపడుచు...ఆమె ప్రోషితభర్తృకవలె అతనికై నిరీక్షించినది...అంత పసనుగా అంత పవిత్రంగా ఒక అమాయక హృదయం మాత్రమే ప్రేమించ గలదని నిరూపించినది...దానికి ఫలితంగా ఆమె గర్భిణి అవుతుంది...ఆశారేఖలు రెండు కళ్లల్లో వత్తులై వెలుగుతూనే వుంటవి...అతడు పశ్చాత్తాపం పడి తిరిగివచ్చేంత వరకూ, కాలం కాళ్లకు బంధాలు వేసికొని కూర్చుంటుందా? ఆమె అంటే క్షమా స్వరూపం కావున అన్నిరోజులు నిరీక్షించినది...ఒకనాడు నిరాశ మృత్యురూపంతో వచ్చి ఆమెను వెంటతీసుకొని పోతుంది! ఆమెను స్త్రీగా గౌరవించలేక పోయిన పురుషుడు ఆలస్యంగావచ్చి ఆమె మృతకళేబరాన్ని గౌరవించి దహన సంస్కారములు చేస్తాడు...ఆ జంటచరిత్ర అంతటితో ముగిస్తుంది...అసలంతకన్నా జరగవలసిన దేముంటుందీ?

ఇంకో దిక్కులో: దీక్షగా ప్రేమించిన కవి ఎన్నో కష్టాలుపడినా ప్రేయసిని పొందుతాడు...నిజంగా ప్రేమిస్తేనే ఇద్దరూ ఆకలయికకు అర్హులని నిరూపిస్తారు. ఇందులో హృదయాన్ని కలిచివేసే కొన్నిఘట్టాలు: కవిని వేశ్యఇంట్లో ప్రవేశపెట్టి వెళ్తాడు స్నేహితుడు. (ప్రేయసి పెద్ద ప్రవాహములో తనకై మరణించినదన్న విచారంలో వుంటాడు) ఈ సన్నివేశం విషమంగా కనిపిస్తుంది 'ఇక్ ముహబ్బత్ ...?' అని ప్రశ్నిస్తాడాయన. అక్కడ హేయమైన నాట్యల ... బనాపిస్తుంది...అదే సమయంలో పల్లవాడు ఏడుస్తాడు...వేశ్యకూడా మాతృదేవి...సమస్తాన్నీ మర్చిపోయి వాణ్ణి బుజ్జగిస్తుంది...పతివ్రతల వలెనే వేశ్యకూడా పిల్లని కన్న అన్న ఫిలాసఫీత్వం కొట్టవచ్చినట్లు చూపినారు...ఆ పసిపాపని ఏడ్పు అతని గుండెల్ని పిప్పి చేస్తుంది...అప్పుడడుగుతాడు—'తుం మా హో?'... 'వుసకా బాప్ కౌన్?' 'కిస్మత్ హై వుసకా బాప్!' అని కన్నీళ్లు పెడ్తుంది!! జేబులోనుంచి కొన్ని నోట్లు తీసి ఆమె కాళ్లదగ్గర పెట్టి వెళ్లిపోతూ ఆమెపాదాల్ని స్పృశిస్తాడు...కళ్ల కద్దుకొంటాడామెపాదధూళిని...'అమ్మా...నీ స్థితిని నేను అర్థంచేసుకొన్నాను...నీ నైతిక పతనానికి కారణభూతుణ్ణి నేను—పురుషుణ్ణి...ఇటువంటి నీచుణ్ణి నీవు క్షమించి నవ మాసములు భరిస్తున్నావు...నేను నిజంగా సిగ్గుపడుతున్నాను...నీ మాతృత్వం నన్ను అవమానిస్తోంది...ఇంతకుమించిన కఠినశిక్ష ఇంకోటి లేదు తల్లీ—" ఈ మాటలు పైకి అన్నవి కావు...ఆ గభీరనిశ్శబ్దములో ఇంత అర్థమవుతుంది.

మానవుల దుర్మార్గ చర్యలు చూసి మన హృదయాలు ముకుళించుకొని పోతవి...క్షణకాలం ఏడుస్తాం...మళ్లీ మన ప్రవర్తన అదే దారి త్రొక్కుతుంది...మనం లజ్జా విహీనులం...మానాభిమానముల్లేని పశుతుల్యులం...రాక్షసులం...మనమా మానవులం? అందుకనే బయటకు వచ్చి స్నేహితునితో అంటాడు "వో మా హై...అవురత్ నహీ...మాసే కోన్ ప్యార్ కర్తా? కైసా ప్యార్ కర్తా?"......

ఈ సందర్భములో ఎడిటర్ పటేలు (ఫిలిం ఇండియా) చేసిన విమర్శన సారాంశముకూడా చెప్పవలెను—ఈ చిత్రంలోని స్త్రీలు వారికి కాబోవు ప్రియుల్ని చూసిన తక్షణం వారికి దాస్యమంటూ కాళ్లమీదపడి ముద్దు పెట్టుకొంటారు...ప్రేమ పుష్పించడానికి ఇంచుక కాలతీతం జరపవలసినదీ—అప్పుడే పవిత్రంగా రాణిస్తుంది...ప్రేమను ఈ విధమైన దగ్గర దారిని నడిపించడం యేమంత బాగలేదు...పైగా పల్లె పడుచులైనా స్త్రీ సహజమైన

## నా స్మృతి పథంలో 'బర్సాత్' చిత్రం

'మందగమనం' 'సిగ్గు' కొంత చూపవలసినది...అంత బాహాటంగా వుద్రేకాన్ని వెల్లడిచేసిన ధోరణి అసమంజసంగా వుంది...మొదటినుంచీ చివరివరకూ 'చీకటిలో' జరిగినట్టుగా చూపిన దృశ్యాలు, ఎక్కువ గౌరవించ వలసినట్లుగా కనుపించలేదు...పగలు లేనిరాత్రి ఒక అంతులేని నిశీథంగా విసుగ్గా వుంది...డైరక్టరు శ్రీ రాజకపూర్ ఎక్కువ బీభత్సాన్ని ఈ చిత్రంలో ఒలకపోసినాడన్నారు. ఇది చిన్నవాళ్ల హృదయాలమీద చాలా భారవంతముగా కూర్చొని ఉత్సాహ పూరితంగా వుండవలసిన వారిక్కి మనో వైకల్యాన్ని కల్పిస్తుందేమో నన్నారు...జీవితంలో సహజంగా వున్న ఈ చీకటి కోణాన్ని కళ్లకు కట్టినట్లుగా చలన చిత్రం ద్వారా చూపడంలో ఎటువంటి 'వైరాగ్యం' 'ప్రవర్తన' కల్గినా—ఈ నల్ల దనాన్నికూడా భరించవలసినదే. ఇది మానసిక తత్త్వ విరుద్ధమైన దేమీకాదు...చేసినవాళ్లం చూపటానికూడ సాహసించాలి...ప్రత్యక్షంగా చూసి కొంత సిగ్గుపడాల్సి వస్తుంది...మన నీచమైన ప్రవర్తనల్ని కొంత మార్చుకోవాలి...సంఘ నైతిక పతనానికి కారకుల మైన మనం స్వహస్తాలతోనే దాన్ని నిర్మూలించాలి...అప్పుడే మానవులం—మనల్ని మనం గౌరవించు కోగల్గుతాం.



# ప్రభాకరాస్తమయము

## బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి మృతికి సానుభూతి తెల్పు పద్యములు

ఉ॥ వెంకట శాస్త్రిగారి మృతివీనుల
శోక వియోగవీచికా
లంకెలగుందు మాకనుకొలంకుల
నీరము పోకమున్నె యీ
సంకటమా! ప్రభాకరు విశాలవిలోల
విసుద్ధ కావ్యముల్
యింకను ఆంధ్రభాష విని యింపు
ఘటింప నభాగ్యయైనదా ॥

సీ॥ వాక్యాసనుండు మున్ వసుధను సృజియింప
తిక్కన కవి మంచి వాక్కు నేర్వ
శ్రీనాధ కవిమేటి సిగ్గు వలపుల నేర్వ
బమ్మెర వారు సద్భక్తి నేర్వ
ఆలసానికులజుండు ఆటపాటల నేర్వ
ముక్కు తిమ్మన ముద్దు పల్కు నేర్వ
పాండురంగ విభుడు పదముల జిగి నేర్వ
కృష్ణరాయలు తెన్గుగూర్చి నేర్వ
యవతరించిన యాంధ్రభాషావధూటి
హృదయ శల్యముజేసి యుచ్ఛ్వాసలూపి
తెనుగు బాసకు భాష్య సందేశమొసగి
యస్తమించెను నేడు ప్రభాకరుండు ॥

సీ॥ మూలమూలలనుండి మూల్గెడు గ్రంథముల్
బయల దీసిన నీదు భవ్యశక్తి
తెనుగు భాషారుచి తేన్గ మెరుంగులన్
తేటతెల్లముజేయు దివ్యశక్తి
ఆంధ్ర భాషా యోష నలరింపగల యట్టి
అతుల మేధావి యైనట్టి శక్తి
ప్రాచీన గ్రంథముల్ ప్రీతితో నిన్నాళ్లు
తర్కించి వ్రాయు సంధానశక్తి
స్వర్గమునజూప మనమును నుత్సాహమంది
పాంచ భౌతిక దేహంబు పాసినావ!
పుణ్యచరితముడైన నీ పాత్రములను
నిక్కువంబుగ భాష పునీతమయ్యె ॥

(మధుర శ్రీనండి)

# పరిణయ చిహ్నం

శ్రీ కాశీభట్ల సూర్యనారాయణశాస్త్రి

అది అతిఘోరం — మహాఘోరం — మహాప్రళయం. కాదు జీవితానికి మరపుతీరని మచ్చ—ప్రేమలతా కుంజమునకు గొడ్డలిపెట్టు—ప్రియులపాలిట పెనుభూతం—కాదు కాముకీకాముకుల కలయికకు కత్తిపోటు—ప్రణయ సామ్రాజ్యపతనానికి పెద్దమెట్టు—కాదు విలాసమానసాలకు బలుసుముల్లు—పరస్పరానురాగ ప్రవాహానికి ఆనకట్టు—కాదు; కాదు ప్రణయపూరిత హృదయాలకు ములుకులాంటి పలుకు—ఇంకెందుకు ?—విపరీత విపత్కర విషాదపూరితమైన దుర్వార్త: అంతేకాదు—రోషావేశావృతమైన కర్ణ కఠోర కఠినోక్తి!!

"ఆగు ఆగు శంకరం? ఆగవేం? నిన్నే, ఏయ్ ఆపండి భజంత్రీలు. నిన్నేనయ్యా? ఆపవయ్యా! నీపూపు మంత్రం." అంటూ శాస్త్రుల్లను అరికట్టేశాడు, శరవేగంతో వస్తూ లలిత తండ్రి.

తీర్చిదిద్ది, పచ్చని తోరణాలతో అలంకరింపజేసిన ఆవరణలో, రెండువేల ప్రేక్షక జనసమూహంలో, వివిధ రకములైన మంగళ వాయిద్యములతో, పండిత శ్రేష్ఠుల పలు రకములైన స్వస్తి వాక్కులతో, కాలికి గజ్జె కట్టి విటులకు విరహమెచ్చునట్లు నటించు వేశ్య శ్రేణిలో, సకలబంధు, మిత్ర సమూహంబగు కల్యాణ మండపములో, చిరకాలము నుండీ, తన కలియకకైగోరి, తన హృదయోద్యాన వనమున విహరించు సుందరియగు లలితవైపు క్రీగంట చూచుచూ—చిరునగవు మోముతో సూత్రధారణచేయు సుముహూర్త సమయమది.—

చేయునదిలేక నిశ్చేష్టుడై నిలబడిపోయాడు శంకరం. ఆశాపాశము అంతరించింది. తన హృదయ నిర్మాణ ఉహాంతస్తులు నేల కూలిపోయాయి. హృదయాధి దేవత పరాజయమైంది. సంతోషము క్షణభంగురమైంది. సభా మండపమంతా గలభా కాజొచ్చింది. 'ఎందుకొరకై ఆటంకమా!' అని చూపరులందరూ వెలవెలబోయి చూస్తూ సమాధానం కొరకై వేచివున్నారు. 'నావల్ల అపరాధమేమా' అని శంకరం తండ్రి అంఘుడగుటచే, వియ్యంకుని వైపు చెవులు నిగిడ్చి, తడుముకుంటున్నాడు. తన ప్రణయ రజ్జువు బిఱ్ఱ బిగిసి, ఛేదింప బడుటకు కారణమేమా అని నిర్ఘాంతపోయి, తల క్రిందకువంచి ప్రియుని పాదపద్మముల మీద బొటబొటమని కన్నీటిచుక్కలు కార్చటం మొదలు పెట్టింది లలిత.

"ఏమండీ! మీకేమైనా జ్ఞానం గలదా? ఏం! మాట్లాడరేం? కలియుగ యుధిష్ఠిరుడులా తడుముకుంటూ కంగారు పడతారేం? మీకు భూవసతి ఎక్కువగలదనిచెప్పి, కపటమాటలతో మాకళ్లుగప్పి అన్యాయం చేస్తారా? ఆ వున్న కొద్ది వసతియైనా అప్పులతో కప్పబడిందటగా! ఏం? అంత దిటవుగా చెప్పారు? నీకేమైనా..."అంటూ పెద్ద పెద్ద గర్జనలతో కరములు జాపుకుంటూ వరుని వద్దకు వచ్చి "నాకు నచ్చలేదు యీ అబద్ధాల సంబంధం. కూతుర్కు మరొక వివాహముచేస్తా. ఆపవోయ్! సూత్రం కట్టడం? ఇదిగో మీనలుగు సొమ్ము. ఎవరికి కావాలి?" అంటూ వెయ్యి రూకలూ విరజిమ్మేడు లలిత తండ్రి.

అది కల్యాణమండపమా—లేక కదన రంగమా! అనుకుంటున్నారు అమాయికప్రజలు, ఒళ్లంతా కళ్లు చేసికుని చూసే వృద్ధ పురోహితుడు పాపం! పారజల్లిన వెయ్యి రూపాయిలూ ఏరుకొంటూ 'ఆహా! ఎంతలో ఎంత విపరీతం! కాల ప్రవాహంలో అన్నృతమెంత వింతగా పరిణమించింది. "అదేమిటి: వకీలుగారు! ఇదిమీకు భావ్యంగాదు. ఏమిటింత రసాభాసు. ప్రాణవిత్తమాన...అన్నట్లు వివాహ కాలంలో బొంకవచ్చునని ధర్మశాస్త్రం. కాని, మీరిదివరకే తెలుసుకొనవలసింది అంటూ అడ్డు వెళ్లాడు. 'వెళ్లవయ్యా చెప్పొచ్చావు. నీ డబ్బుకోసమని కల్లబొల్లి కబుర్లు చెప్పి పిల్ల భవితవ్యాన్ని నాశనం చేద్దామని బయలుదేరావు. ఇంక అక్కడ్కి పూరుకో. ఇట్లా ఎందర్ని మోసంచేద్దామని? ఇదిగో చెబుతున్నా—పీటలమీదనుంచి లేచిపోవలసిందే. లేవండి? అంటూ పెద్దగా ఓంద్రపెట్టాడు లలిత తండ్రి.

గోపాన్ని జ్వాలలు బంధకోటిమీద ప్రసరి నవజల్లాడు కోటలు. తనమూకోపంగా వాక్యసంపుటిని వినలుగున్నాను నడనివీనా.

"లేటుంటివి స్వార్థపరులైన లోకస్తులాన్ని ఏంచేస్తే పాపముంది? ప్రేమ ఘాతకులైన మా వృద్ధయులను ఎడ బాటుచేసిన ఆ మంగళసూత్రం ఏంచేస్తే ఏముంది? నాకు శాపోపేమే పతిని దూషించి, పలువురిలో భంగపరచిన ఆ గులాకను ఏంచావిస్తే నా హృదయానికి భారం తగ్గుతుందా? నాన్నగారు అయితే ఏం!—భగవంతుడవృతే ఏం?" అనుకుంటూ పొంగి పొర్లి పోయేదుఃఖ ప్రవాహాన్ని దిగ మ్రింగుతూ మరి కొంతసేపటికి పరిపరి విధాలా పశ్చాత్తాప పడుతోంది తన పితృదేవత తొట్రుపాటుకు లలిత.

సకల శోభాయమాన, రమణీయాలంకృతమైన కల్యాణ మండపములో, సకల బంధు మిత్ర సపరివారముతో వెలు గొందు ఆ సభాస్థలియందు, తనకు కలిగిన అవమానము భరింపలేక, హృదయారామమునుండి ప్రేమయుక్తమైన మొక్క వేడి నిట్టూర్పు 'అమ్మా'! యని విడిచి చేతిలోని మాంగల్యము మందగమన యను లలిత పాదములపై పడ వైచి—అచ్చట నుంచోనజాలక బయలుదేరి గృహో న్ముఖుడై వెడలిపోయాడు శంకరం. వృద్ధపూర్వ సువాసినులు బుగ్గలమీద వ్రేళ్లు వేసికుని 'ఇదేంచోద్యమమ్మా! కల్యాణపు ఘటనరాకద్దూ. గీటులేంటే ఎట్లా అవుతుందీ?' అని కొంత మంది.

'ఏమిటీ ఆశ్చర్యం!—ఆగతాయి వేషమూను.' అని మరికొందరు.

'అయ్యో! గుటుకపడే ఏకాష్టం గొంతు చీల్చుకుని బయటుపడే యోగముంటే ఎట్లాగవుతుందీ' అని మరి కొందరు సాగతీస్తున్నారు సహేళనగా. లలిత దుఃఖా వేదనతో బయలు వెడలి తన పరుపుపై పడుంది. అంతే— అప్పటి మొదలు అనారోగ్యమే—

తొలుత శంకరం లలితలు కాలేజీలో క్లాసుమేట్సు. బి. యే. ప్యాసయి, వుద్యోగం కొరకు అన్వేషిస్తూ లలితకు తనమదిలో స్థానమిచ్చాడు శంకరం. 'విద్యకు మించిన రూపము—రూపుకు మించిన ధనము—ధనముకు మించిన ప్రేమ. ఇంకేమి కావాలి?' అని లలిత తన జీవితాన్ని శంకరాని కంకితమిచ్చింది. చివరకు సుముహూర్తము అశ్వ మైంది. సుదకు భంగమైంది!

ఆహా! సుఖా సుఖములు దైవానుగ్రహముగదా!

లలిత భర్తృవిరాగ దుఃఖాక్రాంతయై పరమేశ్వరుని పరి పరి విధముల ప్రార్థింపసాగింది. ఇట్లు కొన్ని దినములు గడిచాయి. ఏ దుర్ముహూర్తమున మాంగల్య విసర్జన జరి గిందో, అప్పటినుండి కుసుమకోమలమైన తన శరీరము దుఃఖ భాజనముచే కృశించింది. తుట్టతుదకు శల్యావశి ష్టయై, చివరిసారి తన ప్రేమీయుని దర్శనంకొరకు తపిం పించింది. శంకరాన్ని తన్ను చూచుటకు రమ్మనమని, యిక తన ప్రాణముల మీద ఆశవీడితినని, కడసారిచూపు యిమ్మ నని ఒకనాడు తనసోదరునిచే శంకరానికి కబురంపింది. నిత్యము లలితపై ధ్యానము నిలిపియున్న శంకరం ఆ జాబు కన్న వెంటనే తన మోహానాంగి మోము సందర్శించుట ఎట్లా! అని బయలు దేరాడు.

గరళకంఠుని కటాక్షమును కాముకులమీద వీక్షిం చేయుటచే, పాపమా సమయమున లలిత తండ్రి కచ్చేరీ వెళ్లిపోయాడు. తమ్ముడుకూడా పాఠశాలకు బయలు దేరాడు. చంద్రునికొరకు చకోరము ఎదురుచూచునట్లు లలిత తన హృదయేశ్వరుని మీద మదిని నిల్పి, పరుండి పోయింది. పేదలగన్న పెన్నిధివోలె పరమేశ్వరుడు నయ్యవ రంబున నచ్చట నవతరించనో యన, శంకరం అచ్చటకు వచ్చి లజ్జాజనిత హీనస్వరముతో, గద్గద యుక్తంగా 'లలితా'! అని పిలచాడు. దిగులుతో, నీరసంగా వున్న లలిత ఆ స్వరం ఎవరిదా అని తలయెత్తి చూపింది. శంకరం సిగ్గుచే కుడికాలి గోరుతో భూమిని గిల్లుతూ మోము క్రిందకు దించుకున్నాడు. లలిత అతనియెడల పరవ చూపుతూ ప్రక్కమీద కూర్చుని 'శంకరం సిగ్గెందుకు? మన ప్రేమను ధర్మంచేసిన భగవంతుడు లేడూ! దిక్కులేనివారికి దేవుడే దిక్కుగాదూ! తన చక్రం చేపట్టి మన శత్రువు ఛేదించడూ?—మన యిరువురనూ తిరిగి ఐక్యం చెయ్యడూ నటనసూత్రధారుడుగా ఆ నారాయణుడు—రా శంకర

ఇట్లా కూర్చో! శంకించుకోకు '—అని చెయ్యి చూపుతుంది.

పాపం శంకరం లలిత కృతజ్ఞతకు దోహదమిస్తూ ఆమె ప్రక్కన ఆసీనుడవుతాడు.

'ఏం! లలితా! ఎట్లావుంది.' నీ ఒంట్లో. అంటాడు.

'ఎలా వుందనిచెప్పను. గాఢాంధకారంగావున్న చిమ్మ చీకట్లు చీల్చుకుని, ఎగుటవచ్చే యీదురుగాలిని ఓర్చుకుని, తరంగ శబ్దాల హోరుకు తాళుకుని అంతులేని సముద్రయానం చేసే నావమాదిరిగా వుంది నా శరీరం. ఏం చెప్పను—యీ రోజుకు పదిహేనురోజులు జ్వరంవచ్చి. రెండు రోజులైంది పథ్యంతిని. నిన్ను చూసేసరికి నాశనమైంది నీరసం. ఇంకా నెలదినములకుగాని కోలుకోదు నా శుష్క శరీరం. శంకరం? అలా వున్నావేం?' అంది లలిత.

'ఏం? ఎట్లావున్నాను?'

'దిగులుతో నున్నట్లున్నావు?

'ఇంకేముంది. అప్పటి నా అపరాధమే దీనికి కారణం.

"అపరాధమేమిటి శంకరం? నా బోటి ఆడువారికి గాని ఆ భారం. నీ కేమిటి! ఎందుకు చింతించటం. దిగులొందకు శంకరం. నెల రోజులు నిండిన తరువాత వెనుకటివలె నిండు వెన్నెలలో విహరింపవచ్చు మనం. పండుటాకుల నీడల్లో పరుగులెత్తవచ్చును. క్షమించు శంకరం? నా తండ్రి చేసిన తప్పు తలుచుకోకు. ఇక నేను ఎక్కువగా మాట్లాడలేను. దాహమవుతోంది. అని మంచము క్రిందకు చూస్తూ వెదకబోతుంది లలిత."

'ఏం: మంచినీరా. ఇదిగో గ్లాసు యిక్కడనే వుంది.' అని నీటి గ్లాసును లలిత నోటికందిస్తాడు శంకరం.

'శంకరం నిన్ను వదలలేను. ఇకనన్ను నీవు వివాహం చేసికో వలసిందే. ఎన్ని అవాంతర కారణాలు అడ్డుపడినా సరే.—ఇక్కడ కాకపోతే మరేప్రదేశంలో నైనా సరే.' అంటుంది అర్థిస్తూను.

'ఏమిటే పిచ్చ లలితా! నిన్ను భార్యగా స్వీకరించే బాధ్యత నాదీ. నీవు నిద్దరపో. నీరసం వస్తుంది. అన్నట్టు నేను 15 వ. తేదీని నాగపురం వెడుతున్నాను తెలుసా?"

'ఆ! నాగపురమా! ఇంకా యేం. ఇరువైయైదు రోజులుంది. అప్పటికి నాకు స్వస్థత చేకూర కూడదూ!'

'ఎందుకు'

'ఎందు కేమిటి. నేను వస్తా నీతో. నిన్ను వదలి నిముసం గూడా వుండలేను. నన్నూ తీసికెళ్లవూ! అక్కడైనా వివాహమాడు నన్ను. నా హృదయస్థానంలో నీకు తప్ప మరెవరికి దొరకదు స్థావరం. బి. యే. పరీక్షల్లోనే నీకర్పించా సర్వస్వం. నా జీవిత శకటానికి నీవే మార్గదర్శకుడవు. నా పరమావధికి నీవే పరమేశ్వరుడవు. నా భవిష్యత్తుకు నీవే ఆధార భూతుడవు. ఏదీ ఒట్టువేయి. నన్ను తప్పకుండా తీసికెళ్లవూ? అని చెయ్యి జాపింది జాలిగా—లలిత.

'ఏమిటీ చదువు లలిత! మరేం ఫరవాలేదు. ఇదిగో వాగ్దానం.' అని కరం స్పృశించాడు శంకరం. 'మరి మీ నాన్న వచ్చే వేళైంది. నేను వెడుతున్నా. నెమ్మదిగా పడుకుని నిదురించు, లేకపోతె నీరసం హెచ్చవుతుంది.' అని లలిత శిరోజాలు నిమురుతూ లేచి గృహోన్ముఖుడై వెళ్లిపోయాడు శంకరం.

శంకరం లలితల వియోగ సాగరంలో కాలనావ గంతులిడుచు పరుగులెత్తింది. లలిత తపించే తారీఖు వచ్చింది. ఆమె వదనంలో ఆనందరేఖలు తాండవిస్తున్నాయి. శంకరం నాగపురమునకు ఉద్యోగాన్వేషణకై బయలుదేరుతూ లలితా మందిరానికి వేంచేశాడు. శంకరంకొరకు ఎదురు చూస్తూ లలిత పెరటి సావిట్లో తారట్లాడుతోంది. రాత్రి 9 గంటలు కావచ్చినది. రజనీచరుడు తన ఆరాధ్యరమణి రోహిణి కొరకై తారామండలంలో చరిస్తున్నాడు. శంకరం లలితను చూచి 'లలితా' అన్నాడు శాంతంగా.

పిలుపు వినగానే తలుపు చాటునుండి 'ఎవరు?' అంది ప్రశ్నార్థకంగా లలిత. 'నేను. నా పేరు శంకరం. మరి తెలవిస్తావేమో నని—

ఆనందాతిశయంతో శంకరం చేతులు పుచ్చుకుని 'నన్ను గూడా తీసికెళ్లవూ! నీవు తీసికెళ్లకపోతే నేను బ్రతుకలేను.' అని కన్నీరు పెట్టుకుని 'ఏ నుయ్యో! గొయ్యో!' అంది ఆపుకునే దుఃఖంతో.

'మీ వృ—! నే చెప్పేసమాట వినవ్వా లలితా. మా నాన్న గారికి, మాంసాహారకర్తైనా వింటే నన్నేం చేస్తారో తెలుసా? ఆలోచించు. కలలోనైనా నిన్ను మరువను—అలాగే నన్ను నిన్ను కలుస్తా.' అంటూనే శంకరం ప్రతినలు తీస్తూ.

'అలా పల్లకాగా, మా నాన్నగారు, అంతగా శ్రద్ధగా నిద్ర పోతున్నారు. ఇప్పుడు నేను కూడా సద్దు కట్టించే వాకిళ్ళూ లేదు. చే! ఆలస్యం చేస్తే ఏ అలికిడో తగులు తుంది. అనుమానం కొద్దీ ఆశ కలిసి వస్తుంది. తే, అని గోల చేస్తుంది లలిత.

'అయితే రా! ప్రయాణం రా. ఈ వస్తువులుగూడా ఎందుకు?' అంటాడు శంకరం.

'ఈ వస్తువులుగూడా నాతోనే వస్తాయి. జరుస్తావేం శంకరం? కాస్త ఇటూ నడచి...'

'ఆ రావేం ఏమిస్తా' అని శంకరం లలిత హస్తం పుచ్చుకొని దృష్టి కన్నులలో పడుతూ, లేస్తూ బండిదగ్గరకు వస్తాడు. కూత వెయ్యటానికి సిద్ధంగావుంది రైలు వీరిద్దరి కోసమా అన్నట్టు. శంకరం చకచకా టికెట్లు తీసుకుని లలితతో బండెక్కుతాడు. కాలప్రమాణంలో రైలు ప్రయాణం కనపడని అనువులాగ వుంది వారుభయులకు. నూతన దంపతుల పాతగాథలతో పరుగుతీస్తోంది ధూమ శకటం. ప్రపంచంలో లేని ప్రణయమా అన్నట్లు సంగనాది వలె సాగిపోయేటి లలితాశంకరంలను దింపుతూ, కళ్యాణాకళ్యాణాన్ని కూతతో వెదజల్లి వెళ్ళిపోయింది రైలు. శంకరం లలితలు నాగపురం కాపురస్థులయ్యారు నాటికి. భగవంతుని కృపవలన కొద్దినాళ్ళకే 200 రూపాయిల జీతంతో కాలేజీలో కుదుటుపడ్డాడు శంకరం. కొన్నాళ్ళయ్యేసరికి లలిత హృదయంలో పల్లవి ప్రారంభమైంది.

శంకరం ఒకనాటి సాయంత్రం బజారెళ్ళి నెక్లెసు ఒకటి కొనితెచ్చి జేబులో వుంచుకుని లలితతో కులాసాగా కాలం గడుపుతున్నాడు.

'మరి ఏమైంది?' అంది లలిత.

'ఏమిటి—ఏమవుతుంది—అంతా మామూలే.'

'మామూలవుతే ఎట్లా? నిశ్చయం చేసుకోరాదూ?'

'ఖాయమవుతుంది. నెలకు 200 రూపాయలతో?'

'అదిగో మాటాడారా, అప్పుడే మరాను. జీతం విషయం కాదు. మన జీవితసమస్య. భగవంతుని కరుణ వుంటే మన పరిణయం ఎప్పుడూ?' అంటుంది లలిత.

'ప్రణయ ప్రవాహాలు రెండూ ఏకమై పరుగుతీస్తూ వుంటే పరిణయం దేనికి? లలితా మనకు ముహూర్తం అచ్చిరాలేదు?'

'సుముహూర్తం కాకపోతే దుర్ముహూర్తమా లెక్క.'

'అదికాదు నేనన్నది. నీ ఇష్టం ఎప్పుడుపడితే అప్పుడే ఇదుగో కళ్లుమూయి. గమ్మత్తు చేస్తా.'

'ఏం! ఏమిటి? ఎందుకు!' అని కళ్లు మూసుకుంటుంది లలిత.

'ఇదిగో పరిణయ చిహ్నం—ప్రేమ ముద్రిక—భాగ్య చంద్రిక — సువర్ణ సూత్రం — మహిళా మనోరంజని. నిష్కల్మషంగా, నిరాఘాటంగా నీ కలంకరింప జేస్తున్నా.'

అంటూ శంకరం లలితమనోలతను తనమదికి అల్లుకుంటూ బోసిపోయే ఆమె లేతమెడలో సువర్ణ హారాన్ని సొంపుగా పడవేసి, తనివితీరా ముద్దు పెట్టుకున్నాడు.

లలిత కలతచెంది కంగారుతో మెడ చూసుకుని మెరిసి పోయే నెక్లెసును చూసి మురిసిపోయి, తన్మయత్వంతో శంకరం ఒడిలో వాలిపోయి అతని ప్రేమైకదృష్టిని ఆకర్షించింది.



హిందీ మూలం - కుమారి కనకలతా సిన్హా

# మరచి పోయిన కథ

బుద్ధిరాజు సుందరం

ఎప్పుడు, ఎవరితో ఆమె వివాహము జరిగినదో ఆమె కేమి తెలియును? ఆ! మరచి పోయిన ఒక కథవలె కొద్ది కొద్దిగా జ్ఞాపకము కలదు.

ఒక దినమున తన గృహమునకు కూడా బాజా మేళముతో మంచిమంచి వస్త్రములు ధరించి అనేక మంది మనుష్యులు వచ్చినట్లు, నగలు నాణ్యములు తెచ్చినట్లు, తనతోటి పిల్లవాడు ఒకడు వచ్చినట్లు, "ఈ పిల్లవానితో మనము కూడా ఆడుకుందామా". అని తన స్నేహితురాలైన సరితాతో అన్నట్లు, ఆ మాటవిని అందరు నవ్వినట్లు, ఇంతకుమించి ఆ పిల్లవాడు యేమయినాడో యింకేమియు ఆమెకు జ్ఞాపకము లేదు.

బహుశా యిదియే కాబోలును ఆమె వివాహము? వివాహ మంటే యేమిటో అప్పుడు యేమి తెలియును? "వివాహం" అను మాట తెలుసుగాని వివాహ మంటేదాని అర్ధ మేమిటో తెలియదు. ఒక అమాయకపు పిల్లవాడు, ఒక సిగ్గు పడుచున్న పిల్ల, ఇరువురు పచ్చని వస్త్రములు ధరించుట, వచ్చికూర్చొనుట సరి, ఇద్దరికి ముడిపడు టేను. తరువాత...

"పెండ్లి చేసుకోనెదవా" అని యెవరైనా అడిగితే మంజు ముఖము యెర్రనై చికాకు పడేది. అట్లు యెందుకు చేస్తారో ఆమెకే తెలియుటలేదు. ఆమెకు తెలియకుండానే విధానములన్ని ఇట్లు జరిగినవి. బహుశా హేళన చేయుచున్నారని కాబోలును ఆమె చికాకుపడేది.

* * *

వివాహము మానవజీవితమునకు పరిపూర్ణత నిచ్చునుడి అని మంజులకేమి తెలియును? జీవితములో కష్టసుఖము లను ఇంకయు యెరుగని ఆ అమాయకురాలునకు ఈ విషయముల అర్ధము ఏమి తెలియును? ఆడుకుంటుంది, పాడుకుంటుంది, ఒక్కొక్కప్పుడు అలుగుతుంది, యింతకు తప్పయింకే భావమును ఆమె యొక్క ఆ చిన్న హృదయములో కలుగుట లేదు.

ఆమె పేరు మంజుల. కాని అందరూ ముద్దుగా "మంజు" అని పిలుస్తారు. ఈమె తల్లి ఈమె చిన్నతనమునందే స్వర్గస్థురాలైనది. ఈమె తండ్రి, ఒక మేనత్త మిగిలియున్నారు. ఈమె తండ్రిగారు పండి పోయిన ఒక మామిడిపండు. కొమ్మనుండి యెప్పుడురాలి పోవునో! మేనత్త తన యౌవ్వన కాలముననే వైధవ్యము పొందినది. ఈ యిరువరి ప్రేమసాగరములో పెరిగి పెద్దదైనది మంజు.

"ఈ జీవితము మీద నమ్మక మేమిటి? ఈ దినవుంటే రేపటికి మాయమవుతాము. నేను చనిపోయిన పిమ్మట మంజుగతి యేమగును? ఇతరుల కష్టములలో యెవరు పాల్గొనెదరు? యేదైనా ఒక త్రోవను మంజుకుయేల చూపరాదు? నాకనులుకూడా తృప్తి పొందుతవి. కోరిక పూర్తికాకుండా చనిపోయిన వారికి స్వర్గములో కూడా శాంతికలుగదు" అని మంజు నాన్నగారు ఆలోచించిరి.

బాజాలువాగినవి. యెవరో వచ్చిమంజుకి ప్రధానం చేసిరి. యిది అంతయు యేమిటో మంజుకు యేమియు తెలియదు. నాన్నగారు ఆనంద సాగరములో మునిగి పోవుచున్నారు. "చక్కని అల్లుడు దొరికెనని", అత్త పున్నత్తురాలగుచున్నది. పెండ్లికి చుట్టాలు పక్కాలు వచ్చారు.

* * *

ప్రపంచ మేమిటో కొద్దిగా మంజులకు తెలియుచున్నది. "అత్త యెటువంటిది? యెప్పుడూ గూడా నన్ను ప్రేమించదే! తలదువ్వదు, నగలు పెట్టదు." అని ఆలోచించేది. కాని తన ఆట పాటలలో మునిగి యివి అన్నియు మరచిపోయేది.

"ఒక దినం తనకు గాజులు తొడిగించ" మని అత్తని అడిగినట్లు జ్ఞాపకముకలదు. "పిచ్చి పిల్ల, గాజులు వేసి

"కొనిన ఆటలో విరిగి పోయినది" అత్త జవాబు చెప్పెను. మంజు తలపట్టు విడువలేదు. అత్త ఒక చక్కని బొమ్మ మంజుకి ఇచ్చినది. ఆ బొమ్మ చూచుకొని మరచి పోయినది మంజు.

ఆ దినం పోయి.........

సరితా ముస్తాబై వచ్చినది. పిల్లలందరు ముస్తాబై సీతా కోక చిలుకలవలె వుండిరి. మంజు వారిని చూచి తిన్నగా తాను చూచుకున్నది. వాళ్లు ఆమెకు యెంతో అందగా అగుపించారు. "నేను కూడా నీ మువ్వపుని మంచి బట్టలు ధరిస్తే.........అత్తో? నేను అందంగా వుంటే ఆ విధముయెందుకో అంత కోపం? ఈ దినం నేను ఆ విధ చెప్పినట్లు వినను. నాకు ఆ విధకు ఇష్టే వస్తైరాని" అనే ఆలోచనలు ఆమె హృదయములో పొంగి పొరలి వచ్చినవి.

※ ※ ※

ఇంటిలో దీపాలు పెట్టేరు. మంజు ఇంకారా లేదు. అత్త గాఢగా పడుకున్నది. ఆమె మెట్లు దిగుచుండగా తలుపు తెరచి నట్లు చప్పుడు అయినది. మంజు విలువైన ఒక చీర ధరించి అద్దమునకు యెదురుగా నిలబడి బొట్టు పెట్టు కొనుచు తన అందము చూచుకొని తన్మయురాలగుచుండగా అత్త చూచినది. "యెంత పని చేసేవే దౌర్భాగ్యురాలా, నీ భాగ్యము అప్పుడే మంటగలసినదే" అని అత్తనిప్పులు కక్కుచు అన్నది. అకస్మాత్తుగా ఆమెదృష్టి మంజు ముఖముపై పడినది. ఆమె నయనములనుండి బొటబొట కన్నీటి బిందువులు రాలినవి. "వైధవ్యము పొందినవారు శృంగారించు కో కూడదమ్మా" అని అతికోమల కంఠముతో బోధపరచుచు తనకొంగుతో మంజు ముఖముపైనున్న కుంకుమ బొట్టును చెరిపినది. మంజు మౌనముగా కదలక మెదలక బొమ్మవలె నిలబడియున్నది. ఆమె చెవులలో "వైధవ్యము పొందిన వారు శృంగారించుకో కూడదమ్మా" అను శబ్దములు ప్రతిధ్వనించుచునేయుండెను.



# ఆంధ్రమహిళకు అభివందనములు

గృహిణీమణులకిలలో
సహకారము నాచరించు చక్కని నీతుల్
మహిళల కందిచ్చెడి ఓ
మహితయశోపూర్ణ ఆంధ్రమహిళకు శుభమౌ.

గృహకృత్య నిర్వహణమును
సహనము, విజ్ఞానము, శిశుసంరక్షణమున్
మహిళలకుం దెల్పెడి ఓ
మహితయశోపూర్ణ ఆంధ్రమహిళకు జయమౌ.

ఇహసౌఖ్యము పరసౌఖ్యము
లహాహాలభియించె జదువ నతివలకున్, నీ
సహకారము మరుతురె, ఓ!
మహితయశోపూర్ణ "ఆంధ్రమహిళకు" జై జై.

శ్రీ ధవళ నాగేశ్వర్



# ఆడంబరానికి పోతే....

✻ శ్రీ ఎ. వి. రత్నం ✻

నేను కాలేజీలో చదువుతుండగనే మా నాన్నగారు నాకు వివాహం చేశారు. మొదట్లో నాకు అంగీకారం లేక పోయినా "బలవంత బ్రాహ్మణార్థం" అన్నట్లు చేసివేశారు. దసరా శెలవులకు యింటికి తిరిగివచ్చి మళ్లీ కాలేజీ ముఖం చూడలేదు. ఇది ఏమిటని ప్రశ్నిస్తే అత్తవారింటికి అదృశ్యమై పోయేవాడ్ని. మావాళ్లంతా ముక్కుమీద వ్రేలు వేసుకొని నన్ను విచిత్రంగా చూడ్డం మొదలు పెట్టారు. "వివాహం విద్యా నాశనం" యన్న సామెత నావిషయంలో సరి పడింది. మా నాన్నగారు "లలాట రేఖ నపునః ప్రయాతి" యనుకొని బెంగతో దివంగతులయ్యారు. ఆశా సౌధాలు అమాంతంగా కూలిపోయాయి. మా అమ్మగారు కూడా ఆయన సాన్నిధ్యానికే జేరుకున్నారు.

ఒంటరిగాణ్ణి. ఎంతో విచారించా. బంధువులు, దూషించారు. తల్లిదండ్రుల హృదయాల్లో కార్చిచ్చుర గొల్పి వారి నాశనానికి కారకుడనయ్యా. కాలచక్రం గిర్రున తిరిగి పోతోంది. మామగారి పుణ్యమా అంటూ ఉద్యోగం స్వీకరించా. గుంటూరులో ఒక టుబాకో కంపెనీలో గుమాస్తా గిరి. ప్రవేశించిన ఒక నెలలోనే పాట్లు తెలిసి వచ్చాయ్. నేను కాలేజీలో నెలకు ఖర్చుపెట్టిన దానికంటె ఇది కొంచెం ఎక్కువడబ్బు యివ్వగల్గుతున్నది.

ఎన్నాళ్లని హోటల్ భోజనం చెప్పండి. మంచిరోజు చూసి ఒక చిన్నయిల్లు తీసుకొని కాపురం పెట్టా. మా రాణిగారు దిగారు. ఆమె అందగత్తె—సుకుమారవతి—కష్టాలకు, నష్టాలకు సహించలేదామె—

మా జీవితాలు ఆనందంగా, స్వేచ్ఛగా, గడిపివేసే వాళ్లం. ఓయ్యాం, బట్టలు, అద్దె, సిగరెట్లు, పువ్వులు, పిడకలు, నూనె కూరలు, ఒక టేమిటి? అన్ని కొనుక్కొనేసరికి ఏమీ మిగిలేదికాదు.

అదీ గాకుండా మంచి వయస్సులో వున్న మేము—అడ్డు ఎవ్వరూ లేకపోవుటచే—జల్సాగా, హుషార్‌గా వుండేవాళ్లం. సినీమాలు, టీపార్టీలు, డిన్నర్‌పార్టీలు, పుట్టిన రోజులు...గుండె గుభేలు మంటుందన్ని విషయాలు చెప్పితే—నేను మిత్రులదగ్గర కూడా అప్పు జేస్తూవుండే వాడ్ని—అందుకు ప్రతిఫలంగా గౌరవ మర్యాదలకు భంగం కాకుండా కాఫీహోటల్‌కు వెళ్లడమో, భరతనాట్యాలకు హాజరుకావడమో లేదా డ్రామాలకు పోవడమో జరిగేది. ఎంత ఖర్చు అవుతుందో ఆలోచించండి. చివరకు నాకు సంతోషం సన్నగిల్లింది. వినోదం వెనక్కి పోయేది......

ఇంటిదగ్గర మా ఆవిడ—అమ్మో ఆమెను నేనే కవినైతే బాగా వర్ణించే వాడ్ని—ఏమాత్రం బిక్కమొహం పెట్టినా నా ప్రాణం చివుక్కుమనేది. ఆమె ఏ బాధ పడిపోతుందో యని భావించే వాణ్ణి. ఆ ఆనందానికి లోచుకోడం ఎంత మంది? యని ప్రశ్నించుకొనే వాళ్లం.

అప్పుల భారమెక్కువై పోయింది. అన్నం సహించేది కాదు. అడుగు ముందుకు పడేదికాదు. స్నోలు, పౌడర్లు, తగ్గించాం. సినీమాలు మానివేశాం. కాఫీహోటల్‌కు నమస్కారం చేశాం. ఇందుకు ఎంతో బాధగా వుండేది. ముందు సుఖంగా కాలంగడపి ఇప్పుడు యిన్ని బాధలు పడడం...పూలు అమ్మినచోటే కట్టెలు అమ్మవలసి వచ్చి నట్లుగా—ఎంత దర్జాగా, గౌరవంగా, వుండవలసి వచ్చింది. ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. సెలవుపెట్టా ఆఫీసుకు...

మామగారు వచ్చి మండిపడి పోయారు. "ఆడంబరానికి పోతే.. ఎలావుంటుంది. తాహతునుపట్టి బ్రతకాలి... అందులోనూ యిద్దరికిద్దరే. నీవు చూస్తే ఇంటర్ తగలేశావ్, ఆమెచూస్తే స్కూల్ ఫైనల్ చదివింది...ఈ చదువుల ఫలితం యిది. ఇన్ని బాకీలు ఏలా తీర్చుదామనుకొన్నారు. ఇంక కొంచెం ఆలస్యం అయితే బాకీదార్లు—నీ స్నేహితులే అయినా—అల్లరి చేయకుండా—తొందర పడకుండా వుంటారా? లోకం రీతికాదని ఇప్పటికైనా తెలుసుకోండి" అని హితోపదేశం చేశారు. బాకీలు తీర్చి బందరు వెళ్లిపో

యారు పనివుంది. మరునాడు ఆంధ్రప్రభలో..." నిరాడంబర జీవితాన్ని గడపండి"—బాబూ రాజేంద్రప్రసాద్ ఉద్బోధయనే శీర్షిక నన్ను కళ్లు తెరిపించింది.

మరొక పేజీలో...ఇండియా ప్రభుత్వ బడ్జెట్టు—కలిమి గలవారికి మరికొంత కలిమి—లేమి గలవారికి మరికొంత లేమి—మధ్యతరగతి కుటుంబం గలవారికి మట్టే...యన్న పరమ సత్యాక్షరాలు నన్ను ఆలోచనలోనికి దింపివేశాయ్. ఎంతకాలమో మా యీ ఉద్యోగ ఉచ్చస్థితి! మా ఆవిడ కేక వేస్తోంది..." ఏమండోయ్...కాఫీ సిద్ధమయింది..." "ఆడంబరానికి పోతే"...అంటూ లేచా.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

## జ్ఞానేంద్రియములు

1. చక్షురింద్రియం :—ఈ సింహద్వారంగుండా బిడ్డ వెలుతురు, రంగులు రూపము మున్నగువాటిని గ్రహించుతుంది. (అనగా—పరిసర వస్తు స్వరూపము మున్నగునవి అన్నమాట.)

2. శ్రవణేంద్రియం :—దీని మూలకంగా ధ్వనులు, శబ్దములును, వాని మధ్యనున్న విభేదములను గ్రహించుతూ వాటికి సంబంధించిన ప్రత్యేక జ్ఞానమును పొందుతుంది.

3. స్పర్శేంద్రియం :—బిడ్డలో మొట్టమొదట చురుకుగా పనిచేయునట్టిది స్పర్శేంద్రియమే. దీనిద్వార అది నుండియే బాహ్యప్రపంచ జ్ఞానమును పొందుటకు ప్రారంభించుతుంది.

విపులంగా :—శీతోష్ణ స్థితుల అనుభూతి, పదార్థాల యొక్క కఱుకు, నునుపు, కఠినత్వం, మృదుత్వం వెలుగు గ్రహించుకొంటుంది.

(పైమూడు ఇంద్రియముల సమ్మేళనంద్వార స్పర్శ, స్వరూపం, చలనము, ప్రమాణము, దూరము, తూకము మున్నగువాటిని గురించిన విజ్ఞానం ఏర్పడుతుందన్నమాట.)

4. ఘ్రాణేంద్రియం :—దీనిద్వార వాసనను గ్రహించుతుంది. సుగంధ దుర్గంధమనకున్న భేదము, వీటివలన కలుగు ఆప్యాయత భాధ మున్నగువాటియొక్క అనుభూతి, కలుగుతుంది. క్రమక్రమంగా వాటిని పీల్చుటచే ఆరోగ్యంలేక అనారోగ్యం కలుగుతుందనే జ్ఞానం కలిగి, పరిశుభ్ర వాతావరణంలో వుండాలన్న కోరిక కలుగుతుంది.

5. జిహ్వేంద్రియం :—నాలుక మూలకంగానే బాహ్య ప్రపంచ పరిజ్ఞానం, రుచి మొదలగునవి కలుగుతాయి.

జ్ఞానేంద్రియములు సక్రమంగా వాటివాటి వ్యాపారములను నిర్వర్తించినపుడే, బిడ్డ తన చుట్టునున్న పరిసరములను ఆకర్షించుకోటం, వాటియందు ఆసక్తి అభిలాషలను కనబరచటం, తన దేహంయొక్క అంగములను, గ్రహించుకోటం, పరిసరముల జ్ఞానమును పొందటం, వాటికనుగుణ్యంగా ప్రవర్తించటం మొదలైనవి వ్యక్తమవుతాయి. అదేవిధంగా చలన అంగములలో కూడ లోపం వుండరాదు. అనగా కాళ్లు, చేతులు కంఠనాళములు మున్నగునవి మన అనుభూతి ఆలోచనలు, అభిలాష ఈ చలన అంగములద్వార వ్యక్తపరచును. జ్ఞానార్జనకోసం కృషి చేస్తాము.

కాబట్టి, జ్ఞానేంద్రియములలో కాని, చలన అంగములలో కాని, ఏ ఒక్కదానిలో లోపమున్ననూ, బిడ్డ సర్వతోముఖాభివృద్ధి చెందదు; జ్ఞానేంద్రియములలో ఏదో ఒకటి లోపించినచో బాహ్య ప్రపంచ జ్ఞానములో (పరిసర జ్ఞానంలో) లోపం ఏర్పడుతుంది. అనగా, కొన్ని అనుభవములను గ్రహించుకోలేక సవ్యంగా అవగాహనం చేసుకోలేక పోతుంది. (ఇందుకు చెవిటివారినో గ్రుడ్డివారినో దృష్టాంతం తీసుకొంటే స్పష్టమవుతుంది) తత్ఫలితంగా, క్రమేపి భావి జీవితంలో అపార్థం చేసుకోటం, వ్యథ, పరనింద, లజ్జ, దీనత్వం మొదలగు గుణములు పట్టుపడతాయి. అదే రీతిగ చలన అంగములలో ఏది లోపించినా—అనగా కాలో చెయ్యో లేకపోతే—అత్యసిద్ధికై కృషిచేయు శక్తి లోపించటమేగాక, ఇట్టివారికి సయితం, లజ్జ, వ్యథ పరనింద, దీనత్వం మున్నగునవి పట్టువడుతాయి. అనగా మానసిక రోగా అన్నమాట. కంఠనాళములలో లోపమున్నట్టయితే బిడ్డ తన భావములను స్పష్టంగా వ్యక్తపరచజాలదు. అందువలన తీరని వ్యథ, కోపతాపము, పైజెప్పిన తక్కిన గుణములు పట్టుపడుతాయి.

ఇందువలన స్పష్టమయినదేమంటే, వంశపారంపర్యం వల్ల నైతేనేమి పరిసరములోని లోటువలన నైతేనేమి బిడ్డ

## వనితా విజ్ఞానము

కేదైన వ్యాధి సంభవించినట్లైతే, తల్లి తన బిడ్డవ్యాధి నివారణార్థం, ఆదిలోనే చికిత్స (డాక్టర్ల సలహా సహాయములను తీసికొని), చేస్తూ, ఆరోగ్యకరమైన పరిశుభ్రమైన ఆహార విహారాలు పరిసరాలు కలుగజేయాలి. తత్ఫలితంగ బిడ్డ అభివృద్ధి పథంలోని అవరోధము తొలిగిపోయి (శారీరకంగా) సక్రమమైన సత్వరాభివృద్ధి పొందుతుంది. ఏదో ఒక అంగలోపంవలన, బాధపడు బిడ్డ విషయంలో శిశు మనోవిజ్ఞానమును గురించి కొంతయైన పరిజ్ఞానమొంది తగు రీతిని బిడ్డకు తోడ్పడినయెడల, మానసిక వ్యాధులకు స్థానమే లేకపోవచ్చును. లేదా, అవి ఏ కొద్దిగానో తలసూపినను, వాటిని అంకురంలోనే త్రుంచి వేయవచ్చును. ఒక్కమాటలో తల్లి ఆదినుండియే తన బిడ్డ శారీరక మానసికాభివృద్ధికి జిజ్ఞాస విచక్షణాలతో అత్యంత మెళకువతో వర్తించాలన్న మాట.

(సశేషము.)



# మానవుడు

శ్రీపాద

అతడొక మహాత్ముడు !
అతడొక మహర్షి !!
అతడొక మానవుడు !!!
అవునన్నా, కాదన్నా
నిజా నిజాలను
నిత్యజీవిత
సన్నివేశాలను
పరికిస్తే కనుపించే
దంతా మానవస్వరూపమె !
'మనోదౌర్బల్యం
మతోన్మాదం
అహంకారం
స్వార్థభూయిష్టం
స్మశానవైరాగ్యం
ఇవే ఈలోకానికి
పంచప్రాణాలు.

ఒక్కొక్కప్రాణం
ఈ బొందినుండి
పై కెగసిపోతే
కప్పుకొన్న కారు
చీకట్లు సడలిపోతే
అతడొక మహాత్ముడని
అతడొక మహర్షియని,
అతడొక మానవుడని
అంటుందా ఈ లోకం ?
కాదని కదనభూమిలో
కత్తిసాము చేస్తుందా ?
ముప్పది మూడుకోట్ల
దేవతల మూర్తి మయం ;
ఏదో మానవ జగత్తును
పై కెగవేసే కారణజన్మం ;
సంసారానికి స్వస్తిజెప్పి
సంపాదించిన సన్యాసం ;
సమకూర్చిన సారాంశమె
'మహాత్ముడు, మహర్షి'యని
అంటె అర్థమంటు ఏమైన
ఉందా ?....ముళ్లకంచె
మార్గంలో మల్లెపూల
సృజయించుట
మానవ ప్రయత్నానికి
విరుద్ధ మగుతుందా ?....

వస్తాయి జన్మదినాలెన్నో
పోతాయి యౌవన కళలెన్నో
వచ్చేవాటికి హారతులెత్తి
ధరలపెంచి, గుళ్లుగట్టి
మహాత్ముల మెప్పించేందుకు
భజనలు సాగిస్తె
మారబోదు ఆకారం !
ఎగిరిపోదు ఆ వికారం !!
"అతడొక మానవుడైతె
'నేనూ' ఒక మానవుడనే" యని
వాదిస్తె, ఒక ప్రశ్న :
'అమరత్వం, దైవత్వం,
పిశాచత్వం, రాక్షసత్వం,

## మానవుడు

ఏ తత్వంతోనైన
జతసేయని మానవత్వం
ఉందా నీలో ? '

వచ్చే సమాధానం 'పూజ్యం !'
అతడొక మహాత్ముడు
అతడొక మహర్షి
అయితే అవుగాక —
కాచి వడబోసిన
నూటికి నూరుపాళ్లు
ఒక మానవుడు !
కాదన్నావా అది నీ కర్మ.
అవునన్నావా మార్చుకో
నీ మనసు.






## బానిసలదేశం

రచయిత: శ్రీ సోమసుందర్.

ప్రతులకు: కళాకేళి, సామర్లకోట.

వెల ఒక రూపాయి.

'బానిసలదేశం' తొమ్మిది కథలతో నిండిన కథల సంపుటి. ఆనందవాణి, జ్యోతి పత్రికలు అగివరలో ప్రచురించిన వీటిని తిరిగి కళాకేళీ ప్రచురణ శాఖవారు పుస్తకరూపంలో ప్రచురించారు.

అభ్యుదయ భావాలతో ప్రజలకు ఉపయుక్తమైన రచనలు వ్రాయటంలో వచ్చిన ఉద్యమం కారణంగా విడుదల అయిన ఉత్తమ కథలలో ఈ కథలు కొన్ని.

రచయిత అభ్యుదయ భావాలు కలిగిన కవేకాక అభ్యుదయ భావాలు కలిగిన కథకుడుగా ఈ రోజున ఆంధ్ర ప్రజానీకానికి ఉత్తమ కథా సాహిత్యాన్ని బహుకరిస్తున్నారు.

ముఖ్యంగా మనం ఈ కథలు చదువుతుంటే ప్రతివారికి రచయితకు, ప్రజాజీవితానికి గల సన్నిహిత సంబంధం ఈ రచనలలో కనిపిస్తున్నవి.

ముఖ్యంగా కథలన్నిటిలో, "ఎగురుతున్న ఎర్రమన్ను" ఉద్రేకంతో కూడిన కళా ఖండం. పిదప "ప్రేమ కథలో ఆఖరిఘట్టం", అభ్యుదయ పంథాను సూచించే వాస్తవిక గాథ.

"ప్రేమకథలో ఆఖరిఘట్టం" అనే కథలో ప్రథమంలో సలీమ్ అనే యువకుడు ఉషను ప్రేమిస్తాడు. ఆమెదే లోకమనుకుంటాడు. తన మధురమైన గానానికి ఉషాదేవి వీణ వాయించేది. కాని ఆ ఉష అతనికి దూరమైపోతుంది. గడచిన మధుర స్మృతులను తలపోస్తూ "ప్రేమ, ప్రేమ" అనే పదం తప్ప వేరే సమస్య అతనిలో ప్రవేశించదు. అటువంటి వ్యక్తి జీవితంలో కవి ప్రవేశించి దేశాభ్యుదయానికి పాటుపడమని ప్రభోధం చేస్తాడు. చివరికి సలీమ్‌లో అద్భుతమైన మార్పు వస్తుంది. ఆ మార్పే పీడిత ప్రజలకు నిరంతర సేవచేయాలనే భావాలకు దారితీస్తుంది.

ఇటువంటి సమస్యలలో రచయిత చక్కని కథలను అందజేసినందుకు అభినందనీయులు.

## జ్యోతి

జన్మదిన సంచిక

సంపాదకులు: ఎ. రవీంద్రనాథ్.

ప్రతులకు: 'జ్యోతి' తెనాలి.

ప్రతి వెల 12 అణాలు.

'జ్యోతి' జన్మదిన సంచిక మా కార్యాలయానికి చేరింది. 124 పేజీలతో చక్కని ముఖచిత్రంతో వెలువడింది. దీనిలో కథలు, గేయాలు, నాటికలు, రాజకీయాలు, మొదలైన చక్కని రచనలతో ఉన్నవి.

ముఖ్యంగా "అపశ్రుతులు, బుద్ధ, ఆలాపన, వ్యత్యాసాలు, కళంకిని, భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు" అనే రచనలు బాగున్నవి. ఫిలిం ప్రపంచం (ప్రత్యేక సమీక్ష)లో చక్కని భావాలతో, ఉద్రేకాలతో, కూడిన రచన ఉన్నది.

'వ్యత్యాసాలు' అనే గేయంలో ధనికుడు, కార్మికుడు, ఉద్యోగి, నిరుద్యోగి, సాని, సంసారి, జ్ఞాని, అజ్ఞాని అనే పాత్రలు ప్రాధాన్యంగా తీసికొని శ్రీమతి జమ్మలమడక

# గ్రంథ సమీక్ష

సీతా మహాలక్ష్మి ఆ ఆ పాత్రల భావాలు ఏ విధంగా ఉన్నవి చక్కగా చూపించారు. 'బుద్ధ' నాటికలో బుద్ధుని మానసిక సంఘర్షణ, అతనిలో ఆశయాలు, సందేశాలు చిన్ననాటినుండి ఏ విధంగా రూపొందినవి చిత్రించారు అనువాదకులైన శ్రీరామచంద్రకాశ్యప. ఈ 'బుద్ధ' నాటిక సశేషం ఉన్నది. పూర్తిగా చదివితే దీనిలోని భావాలు ప్రతివారికీ అర్థం కాగలవు.

అన్ని సమస్యలతో కూడిన రచనలతో జ్యోతి జన్మదిన సంచికను చక్కగా తెచ్చిన సంపాదకులు శ్రీ రవీంద్రనాథ్ గత మూడు సంవత్సరములుగా జ్యోతిని ఆంధ్ర ప్రజానీకానికి అందజేస్తున్నందుకు అభినందనీయులు.

## అర్క

సంపాదకులు: గోవిందరాజులు.

ప్రతివెల 1 రుపాయి.

వలయువారు: శ్రీ అరవిందాశ్రమ తెలుగు ప్రచురణశాఖ,
"అర్క" కార్యాలయం, పుదుచ్చేరి.

శ్రీ అరవిందనిలయమునుగూర్చి తెలుసుకోవాలంటే ప్రతివ్యక్తి ఆశ్చర్యపడవచ్చు. ప్రథమంగా శ్రీ అరవిందులు ఒక విప్లవకారి!! అటువంటి విప్లవకారి ఈ విధంగా ఈనాడు ప్రజలకు జ్ఞానోదయం కలిగిస్తున్నారు.

'అర్క' శ్రీ అరవింద ప్రబోధములను ప్రకటించు పత్రిక. సంవత్సరానికి శ్రీ అరవిందులు నాలుగుమాటులు ప్రజలకు వారి ఆశ్రమంలో దర్శనమిస్తారు. దర్శనమిచ్చే రోజులు ఆగష్టు 15, నవంబరు 24, ఫిబ్రవరి 21, ఏప్రియల్ 24 తేదీలు. అప్పుడు శ్రీ అరవిందుల చక్కని సందేశాలను అందచేయుటకు ఈ 'అర్క' పత్రిక వెలువడుతుంది.

ఈ 'అర్క'లో అనేక విషయాలపై చక్కని వ్యాసములు శ్రీ అరవిందులు, శ్రీ మాతలచే రచింపబడినవి ప్రచురించారు. 'అర్క'లో కేవలం తత్వబోధ వుండును. అనేక సమస్యలపై చక్కని వ్యాసములలో ప్రతివారు చదువుకొని అర్థం చేసుకొనేలాగ ప్రచురింపబడినది.

24 నవంబరు 1949 న ప్రచురింపబడిన 'అర్క'లో శ్రీ అరవిందుల, శ్రీమాతల సందేశములుకొన్ని ప్రచురించారు.

21 ఫిబ్రవరి 1950 లో ప్రచురింపబడిన 'అర్క'లో న్యాయతీర్పు, ఒలింపియా చక్రము, శ్రేష్ఠబిరుదము, శ్రీ మాతృవాక్కులు, విశ్వనటుని పిదప భవిష్యత్ వైపుకు అనే ఏకాంకనాటి, మొదలైన, చక్కని రచనలు వున్నవి. ఈ 'అర్క' వలన ప్రజలకు చక్కని ప్రబోధకరమైన సందేశములు అందగలవు.

జి. ప్రభ.

## దారా.

రచన: పువ్వాడ శేషగిరిరావుగారు.

మూల్యం: వెల రూపాయి.

ముద్రాపకులు: శ్రీ పరాశక్తి ప్రింటింగు వర్క్సు,
జి. 97, తెనాలి.

ఇందు అయిదు శీర్షికలున్నవి. అన్నియు షాజహాను కుమారుడైన దారానుసరించి క్లుప్తముగా వ్రాయబడినవి. ఇందు ముఖ్యముగ చెప్పవలసినది అరణ్యరోదనమనునది. దారా సకుటుంబముగ ఆఫ్గనిస్థానము చేరుచుండగనే భార్య "నాదిరాబాను" అరణ్యములో మరణించెనట. శైలి మృదు మధురముగనున్నది. చదివిన వెంటనే అర్థజ్ఞానము కలుగునట్లున్నది.

రా. లక్ష్మి.

## 'ఇనుపకోట'

ఇనుపకోట ఒక నవల. రచయిత శ్రీ కవికొండల వెంకటరావుగారు. ఈ నవలలో తిన తిండిలేని పేదతల్లి తన పిల్లను అమ్ముకోవటము, వేశ్యలు ఆడపిల్లలను కొని వృత్తికొరకు పోషించటము, అగ్రజాతులలోనేకాక మాల మాదిగలలోకూడ వున్న శాఖా భేధాలు, బహిష్కారాలు, అమాయక పేదలను ఆశపెట్టి బర్మాకు కూలీలుగా ఏజంట్లు పంపించటము మొదలయిన విషయాలనేకములు వివరించారు. కాని పాత్రల ప్రవర్తన అసహజముగా అసాధారణముగా కనిపించుతుంది. వాడిన భాష సరళముగా లేకపోగా గాంభీర్యముగా భావగర్భితముగాగాని అందముగాగాని లేదు.

అభినవాంధ్ర కార్యస్థానమువారు ప్రకాశకులు. ప్రతులకు రచయితపేర ఇన్నీసుపేట, రాజమండ్రికి వ్రాసుకొనవచ్చును. ధర రు. 2-8-0.

—అ. గిరిజ.





U. S. I. S.

అమెరికా నౌకాబలమునకు చెందిన పెద్ద విమానవాహకము, అమెరికా రేవునుండి దూరప్రాచ్యమునకు పయనమైనది. కొరియా యుద్ధరంగంలో ఐక్యరాజ్యాల సేనల సహాయార్థం ఈ విమానదళం.

# ఆంధ్ర మహిళా సభ

(రిజిష్టర్డ్)

లజ్ చర్చి రోడ్డు :: మైలాపూరు :: మదరాసు.

రాణీ రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయపు బీద విద్యార్థినుల భోజన నిధికై,

## నృత్యగాన ప్రదర్శనములు

రసికరంజనిసభ, మైలాపూరు.

రాణీ రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయములో, గత నాల్గు సంవత్సరముల నుండి, యువతులకు, గృహ పరిశ్రమలందును, చేతిపనులందును, ఉచిత శిక్షణ యొసంగబడుచున్నది. ఇందలి మిక్కిలి బీద విద్యార్థినులకు జాతి, కుల, మత, వివక్షతలు లేకుండా, ఉచిత భోజన వసతి సహాయములకు గూడ ఏర్పాట్లుగలవు. ఈ ఏర్పాట్లు నిరాఘాటంగా కొనసాగుటకుగాను, యీ సహాయనిధి.

### కార్యక్రమము

శుక్రవారం 6–10–1950 గం॥ 6-15 లకు కుమారి (బేబీ) కమలచే భరతనాట్యము.

శనివారం 7–10–1950 గం॥ 6-15 లకు గానరత్న వి. వి. శఠగోపన్ బృందమువారి కర్ణాటక సంగీతము.

మంగళవారం 10–10–1950 గం॥ 6-15 లకు ఏమదేయ కళాకేంద్రపు రమణి— గోపాలకృష్ణ బృందమువారి నృత్యము.

### రేట్ల వివరములు

| | రోజువారి. | సీజన్. |
|---|---|---|
| స్పెషల్ రిజర్వుడు | రూ. 20/- | రూ. 50/- |
| రిజర్వుడు | రూ. 15/- | రూ. 30/- |
| మొదటితరగతి | రూ. 10/- | రూ. 20/- |
| రెండవ తరగతి | రూ. 5/- | రూ. 10/- |
| మూడవ తరగతి | రూ. 2/- | రూ. 5/- |

టిక్కెట్లు అమ్ము స్థలములు :

1. ఆంధ్ర మహిళాసభ, మైలాపూరు.
2. రసికరంజని సభ, మైలాపూరు.

ఎట్టి విరాళమునైనా, కృతజ్ఞతతో స్వీకరించ బడును.

జి. దుర్గాబాయి,
ట్రస్టుబోర్డు కార్యదర్శిని.

జి. జమునాబాయి,
మిసెస్. ఎ. సి. కృష్ణారావు,
సంయుక్త కార్యదర్శినులు.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras,
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

# ఆంధ్రమహిళ



NOVEMBER 1950. ANDHRA MAHILA ANNAS 6



ఆంధ్ర విద్యాసంఘము, ఢిల్లీ

కార్యనిర్వాహకవర్గము :

కూర్చున్నవారిలో ఎడమప్రక్కనుండి : శ్రీ సి. వి. నారాయణరావు. మిసెస్. బి.ఎస్. నాగరాజయ్య. శ్రీ పి. ఎస్. మూర్తి శ్రీమతి జి. దుర్గాబాయి, శ్రీ కె. ఈశ్వరదత్తు.

నిలుచున్నవారిలో ఎడమప్రక్కనుండి : శ్రీ బి. యస్. నాగరాజయ్య. శ్రీ వి. ఎ. డి. రాయలు. శ్రీ ఐ. ఎన్. చారీ.

సంఘముయొక్క వివరములు. 54-వ పేజీలో చూసి తెలిసికొండి.

ప్రధానాంధ్ర, రాయలసీమ కేంద్రములలో విడుదల





అక్టోబర్

**27**

ప్రారంభము

టి.యన్.టి వారి

# అదృష్ట దీపుడు

సూర్యకుమారి... పద్మ... శర్మ... ముక్కామల

సీత... చిట్టి... కుటుంబరావు ...

డైరెక్టర్... ఎస్. సౌందరరాజన్

# రీటా హెయిర్ టానిక్

## తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.

**RITA**

**HAIR TONIC**




---



---



---

# ప్రతి స్నానము మీకు తలంటు యిచ్చే నునుపును యిచ్చును –



కేరళ తలంటు సబ్బుయొక్క శ్రేష్ఠమైన నురుగు మీ చర్మములోనికి, లోతుగాయినికి శుభ్రపరచి, చర్మమునకు అధిక మృదుత్వమును కలుగచేయును. వీటియొక్క లేతయైన, పరిశుద్ధతైలములు, సహజపరిమళములను, క్రిమి సంహారిణిని, చర్మపు క్రింది భాగమునకు లోతుగా కూడకొనిపోయి బాగుగ పనిచేయును. అయినను చన్నీళ్లతో కేరళ సబ్బునురుగును క్షణమాత్రములో కడిగివేసికొనవచ్చును. కేరళసబ్బుయొక్క శుద్ధమైన పరిమళము స్నానమైనతరువాత గంటలకొలది నిలచును.

## కేరళ సబ్బు

**పరిశుద్ధమైన తైలమునుండి తయారైనది**



వెప్‌సబ్బులోని క్రిమిసంహారిణి, చల్లనైన, మరియూ, చేదైనగుణములుగల వేపనూనె, ముఖ్యముగా వేసవిలో శరీరసౌఖ్యమునకు రక్షణ.

**కేరళా సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్.**

పారిశ్రామిక, వాణిజ్యశాఖ

**మద్రాసు ప్రభుత్వము**

SISTA'S-KS-3B-TEL

# బార్లీ నీళ్లు మరియు గంజి ఈ విధంగా తయారుచేయడం సులభము.




**బార్లీ నీళ్లు:** సమమట్టంగా రెండు టీస్పూనుల ప్యూరిటీ బార్లీని నీళ్లతో ముద్దచేసి, ఒక పయింటు నీళ్లలో కలిపి, ఐదు నిమిషాలు మాత్రమే తాపీగా ఉడకనిస్తేచాలు. రుచికి ఉప్పో, పంచదారో లేకపోతే నిమ్మరసమో కలపండి.

**గంజి:** దీనిని మామూలు ప్రకారమే చేయండి, కాని తయారు చేయడానికి 20 నిమిషాలే తీసుకుంటుంది. ఒక్క చెంచాడు ప్యూరిటీ బార్లీ ఎనిమిది చెంచాల సాధారణ బార్లీబియ్యంతో సమానమని గమనించండి.




అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్, పోస్ట్ బాక్స్ నెం. 664, కలకత్తా.

---

# ఇటియోల్ ఆదర్శమైనది

## పూతి నాశిని — హాయి నిచ్చును
## క్రిమి నిర్మూలిని — విషసంబంధంకాదు







తయారించువారు:
ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్,
మల్లేశ్వరం, బెంగుళూరు.

విక్రయ ప్రతినిధులు: బెస్ట్ & కంపెనీ, లిమిటెడ్,
పోస్ట్ బాక్స్ నెం. 68, మదరాసు.

పండిత డి. గోపాలాచార్యులవారి

# అరుణ

స్వర్ణోత్సవము

1898 – 1948

ఆయుర్వేద పునరుద్ధారకులు

గర్భాశయ రోగనివారిణి

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.**

---

## వసంత హేరాయిల్



తల దువ్వుకొనుటకు ప్రశస్తమైన సువాసన నూనె. తల వెంట్రుకలు రమణీయముగా పెరుగును. జుట్టు పట్టుకుచ్చువలె నిగనిగలాడుచూ చూపరుల మురిపించుచుండు.

సీసా 1-కి రూ. 1-0-0. (పోస్టేజి ప్రత్యేకము)

రెండు సీసాలవరకు అ. 0-12-0.

విక్టోరియా డిపో,

మైలాపూరు, మద్రాసు.

---

## శ్రీ యోగాశ్రమము

ఇచట శ్రీ యోగీంద్రులవారిచే ఔషధములు, ఆపరేషన్లు, లేకుండ, సమస్త వ్యాధులు నివారణ గావింపబడును.

వివరములు గోరువారు 0-12-0 పోస్టు బిళ్లలు పంపిన ఆశ్రమనివేదిక పంపబడును.

శ్రీ యోగాశ్రమము

ఋషికొండబీచ్ :: పెదవాల్తేరు

త్వరలో విడుదల కానున్నది!

ప్రఖ్యాత కథ .... ప్రసిద్ధ తారాగణం...

ఇప్పుడొక్క మహత్తర చలన చిత్రముగా రూపొందినది!




నాగయ్య
లలిత
పద్మిని
నటించినది..

Based on
VICTOR HUGO'S
"LES MISERABLES"

చమ్రియా రిలీజ్...



NARAYANAN Co
Release

# ఆంధ్రమహిళ

సంపుటి 7 :: [illegible]ంబరు '50 :: సంచిక 7


ముఖచిత్రం :— "పద్మ కన్య"
చిత్రకారుడు — ఎల్. సీతారాంబాబు.



ఇంకా, కథలూ, కబుర్లూ, బాలానందం, హిందీ పాఠం, ఇతర విషయాలు.


సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు




సంపుటి 7 | నవంబరు 1950 | సంచిక 7

# అమరజీవి బెర్నార్డుషా

అర్థశతాబ్దంపైగా యావత్ప్రపంచాన్ని తన అసమాన రచనలచేత ఉర్రూతలూగించిన మహాకవి జార్జి బెర్నార్డుషా ది 2-11-1950, ఉదయం పరమపదించాడు. షా పేరువిన్న ప్రతి భారతీయుడికి విశ్వకవి రవీంద్రుడు అమరజీవి-గాంధీ మహాత్ముడు చటుక్కున స్ఫురించుతారు. వారు ముగ్గురు మన అందరి మాదిరి తింటు, తిరుగుతు నిన్న మొన్నటివరకు మన కళ్లయెదుట జీవించివున్నప్పటికి, ఒక ప్రత్యేకమైన సాంప్రదాయానికి, ఋషి తెగకు సంబంధించినవారుగా గోచరించుటయే దీనికి ముఖ్య కారణం. పూర్వపు ఋషులు, మునులు తమను కారణజన్ములుగా ఎంచుకుని మానవసేవకు, లోక కల్యాణానికి ఏవిధంగా పూనుకున్నారో అదేవిధంగా యీ త్రిమూర్తులుకూడ ప్రపంచానికి కొత్త లావణ్యాం, కొత్త ఆనందం, కొత్త జీవిత పంథాలను చూపించటానికి నడుముకట్టి నిల్చారు. ఏ అధికారబలంగాని, యే అన్యుల సహకారం ప్రోద్బలం గాని, యే హానికర మార్గాల ద్వారాగాని కాక, కేవలం శాంతిప్రధాన మార్గంలో, మధుర వచనాలతో, ఛలోక్తులతో, అనునయాలతో ఉద్బోధ చేశారు. మృత్యుభయంచేత కాదు గాని పరోపకార చింతనతో ఎంతోకాలము జీవించాలని దృఢ సంకల్పము చేసుకున్నారు. వారి దృఢ సంకల్పము, నిరంతర ఆలోచన, జీవితోత్సాహమే వాళ్లను జ్ఞానవృద్ధులుగా, వయోవృద్ధులుగా యింతకాలం మననిచ్చింది. తుపాకి గుండుకు బలికాకపోతే మహాత్ముడు కూడ కనీసం శతమానం బ్రతికివుండెడి వాడే.

ఆంగ్ల సాహిత్యంలో షేక్సుపియరుకు దీటు అయిన నాటక కర్త షా. ఈయన వ్రాసిన నాటకాల సంఖ్య 50కి మించుతుంది. వీటన్నిటిని కేవలం పండితులకేకాక ఆంగ్లభాషా పరిచయం వున్న యావన్మందికి సుబోధకంగా వుండే విధాన రచించాడు. సంస్కార ప్రియుడు, సహేతుక సామ్యవాది, సాంఘిక మత విషయాలలో మూఢ విశ్వాసాలనుగాని, అహంకార దుస్సహనాలను

గాని మన్నించడు. సంఘంలో వేళ్లు పాతుకుపోయిన యే ఒక్క ఆర్థిక, రాజకీయ మతసాంఘిక దురాచారాన్నో, మౌఢ్యాన్నో మనసులో పెట్టుకుని ఆ చెడును చక్కగా వ్యక్తంచేసి, దానిని రూపుమాపటమే షా ప్రధాన ఆశయం. అందువల్ల షా భావానికి ప్రాధాన్యతనిచ్చి దానికి అనువైన పాత్రలను సృష్టించుతాడు. మహత్తరమైన యీ సంస్కార ప్రియతవల్లనే ఆయన ఒక ప్రసిద్ధ నాటకకర్తగానేకాక, వేత్తగా, బోధకుడుగా, వెనుకబడినవారికి చేయూతగా స్మరింపబడుతున్నాడు.

గాంధీ, రవీంద్రులవలె షాకూడ స్త్రీ ప్రబోధము చాలా చేశాడు. వారికి తమ నిజమైన స్థానమును, లక్ష్యమును చూపించి దానిని పొందే చైతన్యము కలిగించాడు. స్త్రీ అంటే పురుషుడికి బానిస కాదనీ, అన్ని విధాల స్వయం వ్యక్తిత్వమున్న, సరిసమాన ప్రతిపత్తివున్న, సహధర్మచారిణి అనీ చాటించాడు. భార్య తన బానిస అనుకునే భర్త ఎటువంటి సంకుచిత దృష్టిగలవాడో స్వార్థపరుడో అటువంటి స్వార్థపరురాలే భర్త తన అదుపులో వుండాలని కోరుకునే స్త్రీ కూడ. ఇదికూడ స్వార్థమే, కూడనిదే. ఆ భావములను సుబోధకముగా విపుల పరచటానికే కాండిడా వంటి పాత్రలను సృష్టించి షా స్త్రీలకు తగిన హితవు గరిపాడు. ఆయన సృష్టించిన దేవిజ్‌న్ పాత్ర నిజంగా అమరపాత్ర. సాహిత్యరంగంలో పేరు తెచ్చుకోవటమే కాక తన స్త్రీ జాతికే వన్నె తెచ్చింది.

సత్యమార్గము నవలంబించే వారికి ఎవరి భయము వుండదు. వాళ్లు అన్నింటికి అతీతులు, అందువల్లనే షా నిర్భయముగా, నిస్సంకోచముగా, నిర్మొగమాటంగా సాంఘిక, రాజకీయ, ఆర్థిక మతవిషయాలను, ప్రత్యేక వ్యక్తులను, సునిసితంగా విమర్శించినప్పటికి ఇది అబద్ధము, ఇదికాదు అని నోరెత్తగల ధైర్యము ఎవరికి లేకపోయింది. ఆయన ఇంగ్లీషు భాషలో వ్రాయటాన ప్రపంచములో ఎక్కువభాగం మూలమే చదివి ఆనందించగలుగుతున్నారు. ఎన్నో భాషలలోకి ఆయన రచనలు అనువదించబడినవి. ఆయన నాటకాలనేకం ఫిల్ములుగా, తోలుబొమ్మలాటలుగా ప్రచారములో వున్నవి. తన కృషి సఫలము కావటము తనను ధనగౌరవాలతో సత్కరించటము స్వయముగాచూసిన అదృష్టవంతుడు షా. 95 ఏళ్ల శతవృద్ధు, పూనిన కార్యక్రమం నిర్విఘ్నంగా, నిశ్చలంగా చివరివరకు కొనసాగించగలిగిన ప్రతిభాశాలి. ఆయన రచించిన ఒక్కొక్క వాక్యం లోను ఆయన కీర్తి ప్రపంచపుటంచులవరకు వ్యాపించింది. ఇటువంటి కీర్తిపరుడు జాతస్య మరణం ధృవం అన్న పద్ధతిని కాయము విసర్జించినా అమరుడే.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# ప్రస్తుత పరిస్థితులు

* శ్రీమతి అచ్యుతుని గిరిజ *

## "ముత్యాలపంటలే పండుతాయి":

మనదేశంలో పూర్వం ముత్యాలతో సున్నం చేసేవారనీ రాచవారు ముత్యాల ముగ్గులు తీర్చేవారనీ అంటావుంటారు. ఏది ఎట్లావున్నా ప్రస్తుతం మాత్రం ముత్యాల వాడుక సొమ్ములతో ఆగిపోయింది. జపానువారి కల్చరు ముత్యాల వ్యాపారం హెచ్చిన తర్వాత ప్రజానీకంలో మంచి ముత్యాల మీది మోజు చాలాభాగం తగ్గిపోయింది. దేశీయులందరి చేత విరివిగా మంచి ముత్యాలు ధరింప చేయటానికి కాక పోయినా జాతిసంపదను పరిశ్రమలను పెంపొందించటానికి మద్రాసు ప్రభుత్వంవారు ముత్యాల ఉత్పత్తిగురించి కృషి చేస్తున్నారు. పెర్షియన్ సింధుశాఖ స్వాతిపురుగులకు పుట్టి నిల్లు. అక్కడినుంచి దాదాపు 800 జీవించివున్న స్వాతి పురుగులను విమానాలలో అతి జాగ్రత్తతో మద్రాసు చేపల పరిశ్రమాలయానికి చేర్చారు. మన సముద్ర తీరాలలో యీ పురుగులు సరిగ్గా జీవించి చక్కని ముత్యాలను ఉత్పత్తి చేయగలవేమోనని పరిశోధనలు జరుపుతున్నారు. మన అదృష్టం బాగుండి పరిశోధనలు ఫలించితే దేశంలో ఒక క్రొత్త పరిశ్రమ నెలకొల్పబడి అనేకమందికి జీవనోపాధి లభిస్తుంది. జాతిసంపద హెచ్చుతుంది. అప్పుడు మా తెలుగుతల్లికీ మంగళారతులు పాటలో అన్నట్లు ముత్యాల పంటలే పండుతాయి. జయీభవ.

## బాలప్రపంచం

ఇది బాలలయుగంగా వున్నది. ఇదివరకు పిల్ల కాకి, పిల్ల సన్యాసి వాడిదేముంది అనేవాళ్లు. ఇప్పుడట్లా అనటానికి ఎవరికి ధైర్యము చాలదు. అధవా యే పెద్దవాళ్లయినా పొర పాటున అన్నారా అంటే ఏదో తప్పుపనిచేసినట్లు నలుగురు వాళ్లవంకే చూస్తారు. జవహరుతాత జపానుపిల్లలకు ఏనుగు గున్నను పంపించాడు. జపాను బాలలు మనవాళ్లకు మర బొమ్మల వాద్యసమ్మేళనం పంపించారు. పరాయివాళ్ల ఇంగ్లీషుభాష మన పిల్లలకెందుకు పొమ్మన్నాడు మంత్రి మామయ్య. "చదువు వచ్చినంత వస్తుంది రానంత రాదు అంతే. పిల్లలకు పరీక్షలెందుకు పొమ్మన్నాడు టీచరు అన్నయ్య. అయిదుబళ్లు నేర్పవలసిన అవసరంలేదు తల, లతలతో మొదలు పెట్టాలి చదువు అన్నారు కొంతమంది. తలావద్దు లతావద్దు చదువంతా పెద్దయినతర్వాత నాలుగు రోజుల్లో ఇట్టే వస్తుంది. ముందు నేర్పవలసింది చేతిపనులే నన్నారు మరికొందరు. ఇట్లా అనేకమంది బాలసేవా తత్ప రులు సేవారంగములో ప్రకాశించుతున్నారు. ఇంకా చెప్పా లంటే పిల్లలకు ప్రత్యేకంగా పత్రికలు ప్రత్యేకంగా రేడియో ప్రోగ్రాములు ప్రత్యేకంగా ఫిల్ములు ఎన్నోవున్నవి. కాని యివన్నీ యేదోఒక పేరుపెట్టుకుని పెద్దవాళ్లు నడుపుతున్న తంతు. మాకే స్వరాజ్యం వస్తే మాకే స్వాతంత్ర్యం ఇస్తే అని గర్జిస్తున్న బాలవీరులకిది నచ్చలేదు. మాకు కావలసిన విషయాలు మాకు తెలియాలిగాని మీరు చెప్పేదేమిటి అని అనుకున్నారు కాబోలు మొన్నటి విజయదశమి నాడు విజయవాడలో బాల బాలికలంతా చేరి ఒకబాల సంఘం ఏర్పరచుకున్నారు. అంతా వాళ్లదే పెత్తనం. పెద్దవాళ్ల సహకారం అక్కరలేదు. 12 ఏళ్ల కె. శ్యామల సభ ప్రారం భోత్సవం చేసింది. 14 ఏళ్ల జె. శంకర్ అధ్యక్షత వహించాడు తీర్మానాలు కూడా ప్యాసుచేశారు. ప్రతి వూళ్లోను యీ సంఘాలు ఏర్పడి అమ్మకు నాన్నకు తెల్లవారిలేస్తే జరిమా నాలు విధిస్తారేమో జాగ్రత్త.

## నేటి ప్రయాణం

ఈ మధ్య రైలు ప్రమాదాలు మరీ విరివిగా జరుగుతున్నవి. దానితో ప్రతివాళ్లకు ఖంగారు ఎత్తిపోయింది. ఎక్కిన రైలు సురక్షితంగా దిగేవరకూ సందేహమే. పెద్ద పట్టణాల లోను, ముఖ్యమైన చోట్ల తప్ప రైలు సాధారణంగా ఎక్కువసేపు ఆగదుగదా! మామూలు పరిస్థితులలోనే ప్లాటు ఫారంమీద నానా గల్లంతుగాను వుంటుంది. ఎక్కేవాళ్లను ఎక్కనియ్యరు. దిగేవాళ్లను దిగనియ్యరు. దానికితోడు

## ప్రస్తుత పరిస్థితులు

ఇప్పుడొక కొత్త సమస్య ప్రయాణీకులకు సంప్రాప్తమయింది. ఇంజను పక్క పెట్టెలలో ఎక్కితే ఏ అపకతవకయినా జరిగినప్పుడు ముందు మనవంతే వస్తుందని భయం. మధ్య పెట్టెల్లో ఎక్కితే వెనక పెట్టెలు గుద్దుకుని నలిగిపోతామేమోనని భయం. చివరగా ఎక్కుదామంటే చివరి పెట్టెలు ఏ గొలుసో వూడి వెనక్కే పడిపోతవేమోనని సందేహం. ఇంతగా తల్లడిల్లే హృదయంతో ఎటూ పాలుపోక రైలు పొడుక్కు ఒక్కసారి పరుగెత్తిచూసి రావలసి వస్తుంది. చివరకు చేతిలోవున్న టిక్కెట్టు తరగతిని పట్టి మనసులో యేశంకవున్నా చోటు కనిపించినచోట కూర్చోవలసి వస్తుంది. అంతకన్నా సావకాశం వుండదు. ఒకవేళ సమయానికి రైలు ఎక్కలేక అది తప్పిపోతే నేటి ప్రయాణీకులు చింతపడరు. అంతా మన మంచికోరకేనని భగవంతుడు యీ రైలు ఎందుకు తప్పిపోయేటట్లు చేశాడోలే అని తృప్తిపడతారు. ఇదీ యీనాటి ప్రయాణీకుల మనస్తత్వం. ఇంజను డ్రైవరు గార్డువంటి పూచీదారుల బాధ కూడ ఇట్లాగే వుంది. జరిగితే ప్రాణాపాయమే జరగవచ్చు లేదా ఆయువు గట్టిగావుండి అపదగడచి బ్రతికినా జరిగిన ప్రమాదాలకు సమర్పకాలు చెప్పమని నిర్దోషిత్వం వెల్లడించుకుని బయట పడగలగాలి. ప్రతి అడుగు అడుగుకి భయమే. ఏ దుష్టులో లేనట్టు వొదులుచేశారో, యే బ్రిడ్జి వానలో నానిపోయిందో యే దిబ్బ ఎండలో బీటపారిందో అని వివిధ ఆలోచనలతోను సందేహాలతోను కీడే ఎంచే మనసుతోను బాధ పడుతూవుంటారు. చివరకీవిధంగా రైలు ప్రయాణమంటే గడగడగా తయారయింది. ఇదివరకు పదిరూపాయల టిక్కెట్టు కొని జనం సరదాగా రాత్రిం పగళ్లు విసుగు విరామం లేకుండ తిరగటం, సరదాకోసం ప్రయాణంచేసి రావటం అన్నీ జ్ఞాపకం వస్తున్నయ్. మళ్లీ ఆ వాతావరణం, ఆ రక్షణా మనకు ఎప్పటికి లభించగలవో.

### తపోభూమి !

ప్రతి మానవుడికి తిండి, బట్ట, యిల్లు, ముఖ్యావసరాలు. ఈ మూడింట్లోను తిండి మరీ ముఖ్యమైనది. ప్రాణానికే ఆధారం. కాని యీ తిండికి సరిఅయిన నిర్వచనం పూర్వం నుంచి యిప్పటివరకు ఎవరుగాని ఖచ్చితంగా చెప్పలేకపోయినారు. షడ్రసోపేతంగా విందారగించిన వారూ వున్నారు. ఆకలి బాధకు తాళలేక కుక్కతోళ్లు నమిలిన ప్రబుద్ధులు వున్నారు. ఈనాడుకూడా అంతే. విందులు పార్టీలు జరుగుతునే వున్నవి. ధనికులు పెద్దలు సుఖభోజనాలు చేస్తూనే వున్నారు. ఎటొచ్చి చీకటి మార్కెట్టు ధాటికి తట్టుకోలేని ప్రజానీకం యిబ్బంది పడుతున్నారు. అంతే. పెద్ద పట్టణాల్లో రేషన్లు సరిగా సక్రమంగా అందినా చాలాచోట్ల ఇబ్బందిగా వుంటున్నట్లు ప్రత్యక్షంగా చూస్తున్నాము. పత్రికల్లో చదువుతున్నాము. శ్రీకాకుళంలో కరువే వచ్చిందని అంటున్నారు. మలబారులో గిరాకీ ఇంకా తగ్గలేదు. పరిస్థితులిట్లా వుండి మనసుకు నిరుత్సాహంగా వుంటున్నప్పటికి పెద్దల ఓదార్పులు సమర్పకాలు సలహాలు వింటున్నప్పుడు తమాషాగానే వుండి నవ్వువచ్చి తీరుతుంది. ఆ నవ్వే చాలు మనుష్యులకు సత్తువ రావటానికి. మొన్ననీ మధ్య రాజగోపాలాచారిగారు పశువులను పరీకించటానికి వెళ్లారు. ఆ సందర్భంలో పచ్చి గడ్డితిని పశువులు పాలను యిస్తున్నవిగదా, మన ఆహార పరిశ్రమాలయాల్లో గడ్డిలో నుంచే ఆహారం శాస్త్ర సహాయంతో ఎందుకు తయారు చేయకూడదు అని అన్నారు. అర్థమైన గడ్డీ తినటము జీర్ణింప చేసుకోవటము నేర్చుకున్న ప్రజలకు పచ్చిగడ్డిలో నుంచి తీసిన ఆహారం రుచింపకపోదు. రాష్ట్రపతి పురుషోత్తమదాసు టాండనుగారు ముందు సర్వసమతా ప్రచారానికి పూనుకున్నారు. దేశంలో పాలనీ పెరుగనీ వెన్ననీ వుండటాన, అవి వుపయోగించుతూ వుండటాన ఆ వస్తువులుకొని తినగలవాళ్లు, లేనివాళ్లు అని రెండు తెగలు ఏర్పడినయ్. దీనితో విభేధం ఏర్పడుతున్నది. అది ఎప్పుడు మంచిదికాదు. నలుగురు ఒక దోవన పోతేనే సామరస్యం కుదురుతుంది. అందుకని టాండనుగారు సూక్ష్మంలో మోక్షం గోచరించే సూత్రం కనిపెట్టారు. నెయ్యి, పాలు, పెరుగు యావన్మంది మానేసి అసలు వంటే మాని పచ్చికాయలు కూరలుతింటే చాలా దివ్యంగా వుంటుందని సెలవిచ్చారు. నిజంగా యీ సూత్రం అమలులోకి వచ్చిననాడు స్త్రీలకు అక్షరాల స్వాతంత్ర్యం స్వేచ్ఛ వచ్చి తీరుతయ్. రోజుకు కనీసం అయిదు గంటలు వంటింట్లో గడపవలసిన అగత్యం వుండదు.

(తరువాయి 28వ పేజీలో)




## సప్తమ గుచ్ఛము

"ఈ పద్మావతి దేవిగారికి గాయకులమైన మేమంతా 'గీతాదేవి' అని బిరుదు ఇస్తున్నాము." అని రాధాకృష్ణ ఆ సంగీతసభ అనంతరం, పద్మావతి సంగీతాన్ని మెచ్చుకుంటూ ఉపన్యాసం ఇచ్చి ముగించాడు. సభ అంతా కరతాళధ్వనులు నిండిపోయాయి.

అక్కడనుండి "గీతాదేవి" సంగీతం కచ్చేరీలు మద్రాసులో ఎన్నో జరిగాయి. కొన్ని ఆంధ్ర విద్యా సంస్థల పోషణార్థం ధనం వసూలు చేయడానికి గీతాకుమారి సంగీత సభలు ఏర్పాటయ్యాయి. ఒక్కొక్క గాన గచ్చేరీకి పదివేలు, పదిహేనువేలు రూపాయలు రాబడి రాసాగింది. ఆంధ్ర తుపాను నిధికీ, తమిళదేశం వరదల నిధికీ, ప్రభుత్వం వారు ఆ బాలికను కచ్చేరీలకు ప్రార్థించి ఒప్పించుకొన్నారు.

'గీతాదేవి' ప్రసిద్ధ నామమయింది. గ్రామఫోను కంపెనీలవారు ఆమె పాటలు రికార్డుతీయ ఏర్పాట్లు చేసుకొన్నారు. ఒక ప్రసిద్ధ ఆంధ్ర సినిమా కంపెనీవారు ఆమెను తమ చిత్రంలో ఉపనాయికగా రమ్మనమని పిలిచినారు. ఆమె రానని చెపితే, ఆమె కంఠం నాయికకు గాంధర్వ రకంగా బుక్ చేసుకున్నారు.

వీని అన్నింటికీ కారణం రాధాకృష్ణ. రాధాకృష్ణ పద్మావతీ చరణ చారణ చక్రవర్తి అయిపోయినాడు. ఒక్క రోజు పద్మావతిని చూడకపోతే అతనికి తోచదు. తాను ఆంధ్ర మహిళా సభకు సుశీలను పంపి పద్మావతిని తీసుకు రమ్మంటాడు. 'గీతాదేవికి' చదువు సాగటంలేదు, పద్మావతికి మతిలేదు.

మహిళా సభా విద్యా సంస్థాధ్యక్షురాలు పద్మావతిని సంక్రాంతి ముందర తన గదిలోనికి పిలిపించుకొంది. "ఏమమ్మా పద్మావతీ! నువ్వు సంగీతంలో అతి ప్రసిద్ధురాలవై పోయినావు. నువ్వు మా సభలో ఉండటం కీర్తే! కాని, విజయం పొందదలచుకొన్న పరీక్ష మాట ఏమిటి? ఇంతవరకూ చదువులో బాగా వచ్చావు. కాని, ఈ సంగీతం గొడవవల్ల కాబోలు మొన్న అర్ధ సంవత్సరం పరీక్షలో చాలా తక్కువ మార్కులు వచ్చాయి. పరీక్షలు ఇంక నాలుగు నెలలే ఉన్నాయి. ఇప్పటినుండీ గట్టిగా చదవక

పోతే నువ్వు పరీక్షకు వెళ్లే లాభం వుండదు. నీకు సంగీతంలో పేరురావడం, నీవల్ల లోకానికంతకూ ఉపకారం జరగడం మా కందరికీ ఎంతో ఆనందంగానే ఉంది. అయితే మన చదువుమాట ?"

"అవునండీ అదే నేను ఆలోచిస్తున్నాను. ఇంతా కష్టపడి చదివి, పరీక్షకు వెళ్లకపోతే ఏమి లాభం ? ఈ ఏడు పరీక్షకు వెళ్లలేకపోతే, ఇంక జన్మలో పరీక్షకు వెళ్లలేను."

"కాదుమరి ! కనుక బాగా ఆలోచించుకో, పరీక్షకు వెళ్లడం మానివేస్తే, నువ్వు హాస్టలునుంచి వెళ్లిపోవాలి. నిరుడు పరీక్షలో నెగ్గని ఇద్దరు బాలికలు ఈ నాలుగు నెలలు ఇక్కడేఉండి చదవాలని వస్తామని వ్రాసినారు. వారిని నీ గదిలో ప్రవేశపెట్టగలను."

"నేను పరీక్షకు వెళ్లితీరుతానండి !"

"అయితే సంగీతం ? పేరూ ? సభలూ ? రికార్డులూ ? సినిమా ?"

"ప్రస్తుతం అన్నీ మానేస్తాను !"

"రేపు రాధాకృష్ణగారు వచ్చి బలవంతం చేస్తారు, సుశీలగారు వచ్చి బ్రతిమాలుతారు !"

"అవన్నీ లెక్కచేయనండీ ! పరీక్షకని సంకల్పంతో కదా ఇక్కడ చేరిందీ ! అది పూర్తిచేసుకుని తీరుతాను."

"ఇంక నేను చేసే ఏర్పాట్లు విను. నీ భర్తగాని, నరసింహామూర్తి మేష్టారుగాని సాయంకాలం వచ్చి మాట్లాడవచ్చును. సుశీలగారూ రాధాకృష్ణగారూ వస్తే నీకు తీరుబడి లేదన్నమాట ! సంగీత బేరాలు ఏవీ ఒప్పుకోడానికి వీలు లేదు. ఏవైనాసరే ! ఎంత గొప్పవాళ్లయినాసరే ! సాయంకాలం షికారు బందు ! ఇవి ఇష్టమైతే పరీక్షకు దరఖాస్తు పెట్టిస్తాను. లేదంటావూ నువ్వు మీ ఇంటికి వెళ్లవలసిందే !"

ఈ మాటలు ఖచ్చితంగా అధ్యక్షురాలు అంటూవుంటే పద్మావతి ముఖం వెలవెలపోయింది. అదిచూచి

"నేనింత నిష్కర్షగా అంటూఉంటే, మనస్సులో బాధపడకు తల్లీ ! నీకోసమే చెప్పాను. ఏ విషయమూ తేలాకోళంగా చూడకూడదు. తర్వాత నీ ఇష్టము" అని అన్నది.

పద్మావతి ఆలోచించుకుంటూ వెళ్లిపోయింది.

౨

నరసింహామూర్తి మేష్టారుకు ఏదో ఆవేదన పట్టుకుంది. పద్మావతి విషయం చూస్తూవుంటే అతనికి మతిపోయింది. ఈనాడు ఆమె జీవితం తనకందని వేగంతో ప్రవహిస్తోంది. ఆ మహా ఝంఝామారుతంలో తానో మూలకు కొట్టుకొనిపోయినాడు. ఆతన్ని గమనించే వారేలేరు. రాధాకృష్ణ "ఓహో !" అంటాడు. "మేష్టారూ ! ఎప్పుడు వచ్చారండోయి ?" అంటాడు. "సుశీల ! లోపల ఉండండీ !" అంటాడు. ఆ తర్వాత ఆ ముక్కలూ అనడం మానివేశాడు.

రాధాకృష్ణ గానమేళంలో, మొదట అతడు ఫిడేలు వాయించేవాడు. ఆ రోజుల్లో "మేష్టారూ ! ఈ పాట ఈ రకంగా ప్రారంభిద్దాము !" అనేవాడు. "గురువుగారూ, ఇప్పుడు ఆ ఫ్లూటు, ఈ సంగతులు వేస్తే బాగుంటుంది కాదండీ ?" అనేవాడు. నేడు ఆలాంటి సలహాలు అడగడు. ఆయన రాకపోయినా రాధాకృష్ణ మేళం సాగిపోతూనే వుంది. గమ్మనమనీ అడగడం తగ్గించాడు.

అప్పుడంత గౌరవం చేసిన రాధాకృష్ణ, నేడింత వుదాసీనం వహించాడేమి ?

నరసింహామూర్తి మేష్టారి హృదయం కృంగిపోయింది. అటు బుచ్చి వెంకట్రావు తనకు దూరమైపోయాడు. ఇటు పద్మావతి చదువులో పడిపోయింది.

బుచ్చి వెంకట్రావు సుశీలా ద్వితీయుడై లోకం అంతా తిరుగుతున్నాడు. ఇప్పుడంత త్రాగడానికి వీలులేదు. పట్టణంలో ప్రొహిబిషను వచ్చింది. రహస్యంగా ఏలాంటి బుడ్లైనా దొరుకుతాయి. కాని అతనికి ధైర్యం లేకపోయింది. త్రాగుడాతనికి జీవితంలో భాగం కాలేదు. పైగా త్రాగుడుకన్న నిషా కలిగిన సుశీల స్నేహం దొరికింది. ఆ స్నేహంలో బుచ్చి వెంకట్రావుకు పద్మావతీ అవుసరంలేదు, నరసింహామూర్తి మేష్టారూ అవసరంలేదు అనిపించింది.

రాధాకృష్ణకు సుశీల అంటే నమ్మకమే! మలబారు నాయర్ల అమ్మాయి. సంగీతమూ, నాట్యమూ తిరువాంకూరులో నేర్చుకుని, మదరాసులో భరతనాట్యంలో అందె వేసిన చేయి కావాలని, ఆ మహానగరం వచ్చింది. మదరాసులో కామాక్షీశ్వర పిళ్లదగ్గిర తంజావూరి విధాన నాట్యం నేర్చుకునే రోజుల్లో రాధాకృష్ణ కామాక్షీశ్వర పిళ్లె ఇంటికి వచ్చినాడు. కామాక్షీశ్వర పిళ్లకు ఆతడు శిష్యుడు.

రాధాకృష్ణ తన గతి ఏమిటి అని పదేళ్ల క్రిందట తట పటాయించే రోజుల్లో కొంతకాలం కూచిపూడి వెళ్లి నాట్యం నేర్చుకున్నాడు. కొన్నాళ్లు వేదాంతం లక్ష్మీనారాయణగారికి శిష్యుడయ్యాడు. ఆతడు ఆడవేషం వేసి నాట్యం చేస్తే ఆడవాళ్ల నాట్యంకన్న, ఆతని నాట్యం బాగుంటుందన్నారు. "వేషము స్థానం నరసింహారావుగారి చిన్ననాటి ఆడవేషం అంత బాగుంటుంది!" అని ఒక నాట్యకళా విమర్శకుడు వ్రాసినాడట. ఆ వెనక తంజావూరి విధానంకోసం ఆతడు మదరాసువచ్చి కామాక్షీశ్వర పిళ్లకు శిష్యుడయ్యాడు. అక్కడ తోటి శిష్యురాలైన సుశీలతో ఆతనికి పరిచయం గాఢమైనది.

సుశీలకు ఆమె ఇంటిదగ్గిర కూచిపూడి నాట్యం నేర్పినాడు. ఆమెకు ఆంధ్ర సంగీతం నేర్పినాడు. వారిద్దరి స్నేహమూ ప్రేమగా మారింది. రాధాకృష్ణ సంగీత దర్శకత్వంలోకి వురికాడు. వివిధ వాద్యకుశలులైన వారిని చేర్చి, సంగీతం మేళం ఏర్పాటు చేశాడు. ఎందులోనన్నా చొచ్చుకుపోయే జాతి గనుక ఆతడు మేళవిధానంలో ప్రథమ శ్రేణిలోకి వెళ్లినాడు. వెంటవెంటనే, ఒక సినీమా కంపెనీ ఆతన్ని సంగీత దర్శకుడుగా నియమించింది. వారు తీసే బొమ్మలు పాటలు దివ్యంగా జనానురంజకంగా తయారై దేశమంతా మారుమ్రోగిపోయినవి. సుశీలాదేవి నాట్యమూ ప్రసిద్ధి వహించింది. రాధాకృష్ణ సుశీలలు రిజిష్టర్ వివాహం చేసుకున్నారు. వారి వివాహానికి సినీమా ప్రపంచం, రసజ్ఞలోకం బంధు మిత్రసమేతమై హాజరైంది.

బుచ్చి వెంకట్రావుకు సుశీలకూ స్నేహం అతలా అల్లుకుపోయి వారిద్దరూ విడవకుండా ఉండడము నరసింహమూర్తి మేష్టారుకు భయం వేసింది. వీళ్లిద్దరూ ఎంతవరకూ వెళ్లినారో ఈ అతిస్నేహంలోంచి ఏ విషాద పరిణామం ఉద్భవిస్తుందో? రాధాకృష్ణ ఉద్దేశమేమిటి? రాధాకృష్ణ మనస్తత్వం ఏలాంటిది. ఆతనికి ఇతర స్త్రీలతో సంబంధాలున్నాయా?

ఏమిటీ సినిమా ప్రపంచం? నీతీ నియమాలకూ ఈ ప్రపంచానికి ఎక్కడా చుట్టరికమే లేదా? సినీమాలోకం సుడిగాలి లోకం. అతి అనేది తప్ప ఇంకోటి కనబడదు. ఆ వాతావరణంలో! స్త్రీ పురుష సంబంధాలకు ఒకదానికీ మార్గమూలేదు. ఒక హద్దూ పద్దూ లేదు. ఈ సినీమా వాతావరణం ఇతరమైన జీవిత పథాలకు కూడా ప్రసరించి దైనందిన నిత్యజీవితాన్నికూడా కల్మషం చేస్తున్నది. నరసింహమూర్తి మేష్టారు గడగడ వణికి పోయాడు.

ఈ ప్రళయంలో ఒంటివాడై పోయినాడు నరసింహమూర్తి మేష్టారు. అవతల బుచ్చి వెంకట్రావు ఇంటినిండా సినీమా తారలు, తారకులు నిండిపోసాగినారు. చిట్టి చిట్టి దర్శకులూ, మేరుపర్వాతంలాంటి దర్శకులూ కాఫీ వేళకూ, సినీమా వేళకూ, షికారు వేళకూ సిద్ధం. బుచ్చి వెంకట్రావుతో "మనం ఇలాంటి ఆదర్శరూపమైన చిత్రం తీయాలండీ వెంకట్రావుగారూ!" "మీరే నాయకులు సుశీలాదేవి నాయిక, ఇంక చిత్రం పట్టపగ్గాలుంటాయా?" ఇవి నిత్య సంభాషణలు.

ఇంక తానూ! "మేష్టరూ! కాస్త కాఫీ తయారు చేయండి." "ఏమీ మేష్టరూ కొంచెం వుడ్‌లాండ్సుకు ఫోను చేసి, ఇన్ని ఫలహారాలు అవీ తెప్పించండి!" "ఇదిగో నిద్రా? మేష్టరూ, ఏమిటయ్యా, వెళ్లి నా కారు మీద సుశీలాదేవిని తీసుకురండి!" ఇలా బుచ్చి వెంకట్రావుకు పెద్ద బంట్రోతైనాడు.

అన్నీ ఓపిగ్గా చేస్తున్నాడు! పెద్దవాడు! అయినా పూర్వకాలపు ఘటం కనుక కాస్త జబ్బపుష్టీ, శక్తికలవాడు.

బుచ్చి వెంకట్రావు చివరకు ఒక సినీమా తీయడానికి నిశ్చయించాడు. తమ కంపెనీకి పేరు పెట్టమని సుశీలనే అడిగినాడు. నరసింహమూర్తి మేష్టారు "నీ కెందుకు

వెంకట్రావూ, ఈ సినీమా పిచ్చి? ఏదో, నీ రొయ్యి పప్పు వ్యాపారం చక్కగా సాగుతోంది నాలుగురాళ్లు వస్తున్నాయి. సినీమా అంటే లక్షలమీద మాట. ఆ డబ్బంతా గంగపాలే కావచ్చును. లేకపోతే కూవంపాలే అనుకో'' అని నరసింహామూర్తి మేష్టారు అన్నాడు.

" ఉండవయ్యా! నీ సలహా ఎవరికి? ఇందులో మంచి చెడ్డలన్నీ సుశీలకు తెలుసును." అన్నాడు బుచ్చి వెంకట్రావు.

రామచంద్ర అనే ఒక డైరక్టరు : ఊరుకోవయ్యా స్వామీ! పానకంలో పుడకలా అడ్డంరాకు.

సోమేశ్వర రావు అనే సినీమా నటుడు : మీకు సంబంధించని విషయాలలో మీ సలహా ఎందుకండీ! లక్షాధికారి వెంకట్రావుగారు బొమ్మ తీస్తామనడం ఏమిటీ, వెధవ స్త్రీ దారిలో ఎదురుపడినట్లు మీరు అడ్డం రావడం ఏమిటి?

సుశీల : మేష్టారూ! సినిమా గొడవలు మీకేమీ తెలియవు. మీరు వింటూ ఊరుకోండి!

వెంక : మీ వంటపని మీరు చూసుకోండి బాబూ!

ఆ మాటలు వెంకట్రావు అన్నాడు. నరసింహామూర్తి మేష్టారుకు పిడుగు తాకినట్లయింది. అతడు తెల్లబోయి అలా నిలుచుండి పోయినాడు. గజగజ వణకిపోయినాడు. అతని కళ్లల్లో నీరు తిరిగింది. తూలుతూ అతడు లోపలికి వెళ్లిపోయాడు.

3

" అమ్మాయీ! మీ ఆయన సంగతి క్షమించి రాగాన్ని, పడింది." అన్నాడు పద్మావతితో.

" ఏమిటండీ అది. నాకు పరీక్షరోజులు వస్తున్నాయి. రాత్రనకా చదువుతున్నాను. మొదటి తరగతిలో నెగ్గితీరాలి!''

" నాకు చాలా సంతోషంగా ఉంది. నువ్వు షికార్లు మానివేసి చదువులో పడ్డావు. ఆ రాధాకృష్ణ స్నేహం తగ్గించావు; కాస్త నాకు మనస్సు ఊరట పడింది."

" ఏం? రాధాకృష్ణ స్నేహానికి ఏమి వచ్చింది? పరీక్షలో నెగ్గాలని పంతంతో చదువుతున్నాను కనుక షికార్లు మానాను. అంతే రాధాకృష్ణ గొడవ ఏమి వచ్చింది? రాధాకృష్ణగారు చాలా మంచివాడు. ఆయనవల్ల ఇంత పేరూ ప్రతిష్టా స్వంత సంపాదనా వచ్చింది."

" అలాగా "

" కాదుటండీ, మేష్టారు. నా మనస్సంతా ఇప్పుడు పరీక్షమీద లగ్నం అయి ఉంది. మీరు రాధాకృష్ణగారి మీద నేరాలు గీరాలు చెప్పి మనస్సు పుండుచేయకండి. మీరు ఈ రెండు మూడు నెలలూ నాకు కనబడకుండా ఉంటే మంచిది. నే వెళ్తాను. సెలవు"

పద్మావతి లోనికి వెళ్లిపోయింది. నరసింహామూర్తి మేష్టారు దిగులుపడి పోయినాడు. అతని మనస్సు క్రుంగిపోయింది. కాళ్లీడ్చుకుంటూ బస్సు దగ్గిరకు పోయినాడు.

అతనికి తాను అతి వృద్ధుడైనట్లు తోచింది. రాధాకృష్ణ ఎందుకు దాపురించాడు? వోపార్థ్యం పండింది. తానింక ఎవరికి కావాలి. తన అవసరం ఎవరికింకా? బుచ్చి వెంకట్రావు ఇంట్లో తాను వంటవాడు. తన బాణీ పాతరకం. రాధాకృష్ణ సంగీత మేళానికి తానెందుకూ పనికిరాడు. తెలుగు తనం లేని పిచ్చిపాటలు కోరే లౌకానిక కళాయుక్తమై, పరిపూర్ణ సౌందర్య రూపమైన తన ఆంధ్రబాణి ఎవరికి అవసరం గనుకనూ! దేశం నీచస్థితిని పొందినప్పుడు కళకూడా నీచస్థితిని పొందుతుంది. కవులు నీరసించారు గాయకులు నీరసించారు. శంబంగుడి, మునూరి, సుబ్బలక్ష్మి, వెంకటస్వామి నాయుళ్లను ఎవరు గౌరవిస్తారు? వారి గానం దేశంలో లక్షకు ఒకరు వింటారేమో! తప్పితే ఇద్దరు వినవచ్చును. కాదయ్యా పదిమంది. ఆంధ్రులైన హరి నాగభూషణంగారు, పాటుపల్లివారు, వారణాసి బ్రహ్మయ్య, బలరామయ్యగార్లు, మంత్రవాది వేంకటప్పయ్యలు కాంగ్రెసులో సీనియరైన పెద్దలులా వెనకే ఉండవలసి వచ్చింది.

అతడు పెద్ద నిట్టూర్పు విడిచాడు. నల్లబజారు నాయకులు, మాయాబజారు సినీమాలు, మాయారంభలైన తారలు, గారడీవాండ్రైన గాయకులు! చాలయ్యా మదరాసు!

ఏమిటి తన కర్తవ్యం. తానూ క్షేత్రయ్యలా తీర్థయాత్రలు సేవించి, "భగవాన్ నువ్వైనా విను ఈ పౌరాణికమైన బాణి" అని ఆయన దగ్గిర పాటలు పాడుకోవచ్చును.

ఏమి బుద్ధి పుట్టిందో ఆతడు చటుక్కున లేచాడు. అర్ధరాత్రి దాటినా ఏదో ఉత్తరం వ్రాస్తూనే ఉన్నాడు. హాలు గడియారం రెండు కొడుతూ ఉండగా బుచ్చి వెంకట్రావు, సుశీలా కారులోంచి దిగి, పకపక నవ్వుకుంటూ, తలుపు తట్టినప్పుడు నరసింహామూర్తి మేష్టారు పది పేజీలు ఉత్తరం డ్రాయరులో దాచి, వచ్చి వీధి తలుపు తెరిచాడు.

ఆతడున్నాడన్నైనా లేకుండా బుచ్చి వెంకట్రావు సుశీలను కౌగలించుకొని, "ఇవాళ మన ప్రోగ్రాం గ్రాండుగా సాగిందికాదూ! ఏం ఇవాళ ఇక్కడ పడుకోరాదూ?" అని ఆ యువతి మోము తనవైపు తిప్పుకొని, పదిముద్దులామె పెదవులపై కురిపించినాడు.

సుశీల చల్లగా ఆతని ఆలింగనాన్నుండి చిత్రంగా తప్పుకొని, "అలాంటి నిద్రోడాలు లేవు మన జాతకంలో! ఇంతవరకూ, మన సరిహద్దు! సో! సో! సెలవు! నరసింహామూర్తి మేష్టారు నిద్ర చెడిపోము! సెలవు గురువుగారి గురువుగరూ!" అంటూ తుర్రున వీధిలోనికి తేలిపోతుంది. గుమ్మం దగ్గిర నుంచి "బుచ్చీ! రేపు సాయంకాలం రా! మరిచిపోకు" అని కారెక్కి బుర్రుమనిపించి, మాయమైంది.

బుచ్చి వెంకట్రావుకు కోపం వచ్చింది. "ఈ ఆడవాళ్లు వట్టి బ్రహ్మరాక్షసులయ్యా!" అంటూ సోఫాలో కూర్చుండి సిగరెట్టు వెలిగించాడు.

"ఎంతవరకూ వెళ్లింది ఈ వ్యాపారం?"

"ఎంతవరకూ వెళ్లడమేంటి? చాలా దూరం వెడితే ఆ అప్సరసరాక్షసి అలా పారిపోతుందటయ్యా వెఱ్ఱి బ్రాహ్మడా?"

నరసింహామూర్తి మేష్టారు ఒక్క నిమేషం బుచ్చి వెంకట్రావును తీక్ష్ణంగా పరికించినాడు. సరే ఇంక రాగాలాపన ప్రారంభం కాలేదనుకొన్నాడు.

"ఏంది అట్టా చూస్తున్నావు. నేను రాక్షసునిలా కనబడుతున్నానా, లేక నే జెప్పింది అసత్యమనుకుంటుంనావా?"

బుచ్చి వెంకట్రావు మోము జేవురించింది. ఆతను జర్రుమని లేచి తన పడకటింటిలోనికి పోయినాడు.

౫

మరునాడు చాలా ప్రొద్దెక్కేవరకూ బుచ్చి వెంకట్రావు లేవలేదు. మామూలు అలవాటుగా నరసింహామూర్తి మాష్టారూ లేవలేదు. పనివాడు లేచి, ఇల్లంతా సర్దినాడు. పని మనిషి వచ్చింది అంట్లువేసే నరసింహామూర్తి మేష్టారు కనబడలేదు. వంటగదిలోకి ఎవ్వరూ వెళ్లడానికి వీలులేదు కాబట్టి పనివాడు లోపలికి వెళ్లి చూడలేదు.

బుచ్చి వెంకట్రావుకు తొమ్మిది గంటలకు మెలకువ వచ్చింది. స్నానాలగదిలోనికి వెళ్లి మొగం కడుక్కొని కాఫీకని వచ్చి, "మేష్టారూ! కాఫీ ఏదయ్యా" అని పొలికేక పెట్టినాడు.

పనివాడు పరుగున వచ్చి "పొద్దున్నుండీ ఆయన అలికిడి లేదు సామీ? ఏందో?" అని మనవి చేశాడు.

"ముసలివాడయి పోతున్నాడు! ఎవర్నన్నా పెట్టుకోవాలి" అంటూ వంటి యింటి వేపుకు వెడితే, బుచ్చి వెంకట్రావు తలుపులు వేసిఉన్నట్లు తెలిసింది.

"ఏడి మేష్టరు" అని వెంకట్రావు గొణుగుకుంటూ మళ్లీ మేడయెక్కి నరసింహామూర్తి మేష్టారు గది దగ్గిరకు వెళ్లితే ఆ తలుపుపైన గొళ్లెంపెట్టిఉంది.

"ఇదేంది చెప్మా!"

బుచ్చి వెంకట్రావు తలుపు గొళ్లెం తీసి, లోనికి వెళ్లాడు. అన్నీ సర్ది ఉన్నాయి. బల్లమీద తనకు వ్రాసినట్లు కవరు ఉంది. ఆతడా కవరు చింపి లోని ఉత్తరం చదవడం సాగించినాడు.

"చిరంజీవి నా పుత్రసమానుడైన బుచ్చి వెంకట్రావును దీర్ఘాయువుగా, ఆరోగ్యయుతునిగా, బహు సంతానవంతునిగా ఆశీర్వదిస్తూ!

"నాయనా! చుక్కానిలేని నావలా ఉన్న ఈ చిరు పడవకు నీ హృదయం అనే రేవులో ఆశ్రయం ఇచ్చావు,

అరవైమూడు సంవత్సరాలు గడిచి, అరవైనాలుగో ఏడు జరుగుతో ఉంది. ఇంతవరకూ నా జీవితంలో అసత్యము, అధర్మమూ ప్రవేశించలేదు. నేను నీ దగ్గిర ప్రవేశించని మునుపే బ్యాంకిలో రెండువేలు దాచుకున్నాను. నువ్వు నా కిచ్చిన జీతాలు పదిహేనువందలు వరకూ ఉన్నాయి.

"నువ్వూ, నీ భార్యా బిడ్డలు లేని నాకు బిడ్డలయ్యారు. మీమీద నా ఆశలన్నీ పెట్టుకుని, మీ ఆనందం నా ఆనందం అనుకుని, మీ వృద్ధి నా వృద్ధి అనుకొని సంతోషంతో పొంగిపోయాను.

"కాని పరిస్థితులు ఈలా తారుమారు లవుతాయని అనుకోలేదు. పద్మావతి సినీమా తార సగం అయింది. తక్కిన సగమూ పూర్తి అయిపోతుంది. నువ్వు తారలమధ్య చంద్రుడవు అయిపోతున్నావు. ఈ విధానం ఎంతవరకూ సాగిపోతుందో! నీ కంపెనీ ఆఫీసులో కనుక్కుంటే ఈ మధ్య నువ్వు చాలా కర్చు పెట్టుతున్నట్లు తెలిసింది. ఎందుకో నేను ఊహించ దలచుకోలేదు.

"నేను నీకూ అవసరంలేదు, నీ భార్యకూ అవసరంలేదు. మీ జీవితాలు విచిత్ర పరిణామాలు పొందాయి. ఇంకా అనేక చిత్ర విచిత్ర పరిణామాలు మీ జీవితాలలో రాగలవు! కాని ఆ పరిణామాలలో నాకు భాగంలేదు. నేను భాగం పంచుకొనే రకం కావు అవి!!

"నీ కోసం పద్మావతీ, పద్మావతికోసం నువ్వూ ఉద్భవించారనీ, మీ ఆదర్శ జీవితం, హీనస్థితిలో ఉన్న కులాల వారికే, జాతులకే కాకుండా ఉత్తమ కులాలవారికీ, జాతులకూ కూడా ఆశయం కాగలదని ఉప్పొంగిపోయాను. కాని, మీరూ అందరితోపాటువారే అయ్యారు.

"ఈ సందర్భంలో నేను మీ దగ్గిర లేకుండా దూర దేశాలకు పోతే మీరు ఒకరికొకరు సన్నిహితం అవుతారేమో!

"మీ ఇద్దరూ నేను ఆశించేరీతి వృద్ధిపొంది తిరిగి కలియుదురుగాక. మీకు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యాలూ, దాంపత్య ప్రేమ సాఫల్యము, బహు సంతాన లాభమూ కలుగుగాక అని ఆశీర్వదిస్తూ,

గాఢానురాగంతో

నరసింహమూర్తి మేష్టారు."

ఈ ఉత్తరం చూడగానే బుచ్చి వెంకట్రావు మొదట చాలా ఆశ్చర్యం పొందాడు. "ఏడిశాడు వెర్రి బాగులవాడు! పోతేపోయాడు. శని విరగడైంది అనుకుంటాను. ఈ రోజుల్లో పెద్ద నీతి నియమాలు రాస్తాడేమిటి? దేవుడుంటే నీతి నియమాలూ! దేవుడేడి గోపరాజు రామచంద్రరావు అనే ఆయన వాదించినట్లు? ఇతరులకు ఇబ్బంది లేకుండా, మనకీ ఇబ్బంది లేకుండా ఉంటేచాలు. కాని, నాకు నీతులు చెప్పవస్తాడేమిటి?" ఆతని మోములో చిడిముడిపాటు కాంతులు ప్రసరించాయి.

"అయినా మంచివాడు. ఎంత చాకిరీ చేశాడు! ఎంత నమ్మకం! తల్లీ తండ్రీ తనకూ పద్మాకూ అయ్యాడు. ఎంత ఓపిక, ఎంత నెమ్మది, ఎంత ఆపేక్ష! సరే ఎక్కడకు వెడతాడు? నాలుగు రోజులు కాగానే వస్తాడు. ఈలోగా తిరిగిరాసి!"

ఆ మర్నాడు బుచ్చి వెంకట్రావు చూసుకున్న ఉత్తరం పద్మావతికీ వచ్చింది. ఏమిటీ ఉత్తరం, అనుకుంటూ, పద్మ కవరు విప్పి చదవ నారంభించింది.

ఉత్తరం సాగినకొద్దీ ఆమె గుండె దడదడ ఎక్కువ కాసాగింది. ఉత్తరం పూర్తిచేసి కాళ్లు తేలిపోగా, పద్మావతి మంచంమీద కూలబడింది. ఏమిటి మేష్టారే! తమ్మ విడిచి వెళ్లిపోడమా! ఇంకేముంది! ఇంక తనకు సముద్రమే దిక్కు.

ఆమెకేదో భయం పట్టుకుంది. తాను తన భర్త దగ్గిరకు వెళ్లడానికి భయం వేసింది. వెళ్లి ఏమిటి అని నరసింహమూర్తి మేష్టారును గురించి అడగాలని. కాని ఏమి అడుగుతుంది? ఆయన చాలా దూరమైపోయాడు.

తమను గురించి ఆయన అల్లా రాసినాడేమిటి! ఏమిటి. ఆలా వెళ్లిపోయినాడేమిటి? తనగతి ఏమిటి?

ఆమెకు కళ్లు తిరిగి పోయినాయి.



# ...."బొమ్మ....బొరుసు"

[మీనా తండ్రి ప్లీడరు చేసి డబ్బుబాగా సంపాదించినా చివరికి ఏమీ మిగల్చకుండా చనిపోయాడు. అందు మూలంగా వాళ్ళకుటుంబం అంతా మీనా పిన తల్లి పంచకు చేరారు. పిన తల్లి భాగ్యవంతురాలు, గర్వి. పిల్లలు "బొమ్మ....బొరుసు" ఆట ఆడటం మీనా తల్లికి ఇష్టముండేదికాదు. కారణం తనచెల్లి భాగ్యవంతురాలై బొమ్మ లాగుంటే తాను బొరుసై గూర్చునందని. అన్న చదువుకని మీనా కుటుంబం రాజమండ్రి చేరారు అక్కడ ఏన్నో కష్టాలు ఎదుర్కో వలసివచ్చింది. మీనాకు యుక్తవయస్సు వచ్చింది, చివరికి ఏదో ఒక విధంగా ఒక సంబంధం నిశ్చయం చేసి మీనాకు వివాహం చేసి అత్తింటికి పంపారు. కాని అక్కడ జీవితం మరీ దుర్భరమైంది. అత్త సాధింపులు, భర్త మట్లాడక పోవడం ఎక్కువకాసాగాయి.]

మనస్సు యీమాటు పూర్తిగా నన్ను ఎదిరించింది.—ఏం? నేను ఆయన దగ్గరనుంచి ఆవగింజంత ఆపేక్ష పొంద తగనా? ఎప్పుడూ దేనికోసరం ఆయన్ని వేపించుకొని తినలేదే!—నల్లగావున్నా, నా చక్కదనం, సుగుణాలు, తెలివితేటలు, ఓర్పు—ఆయన దగ్గరనుంచి ఆమాత్రం ఆపేక్షను కోరగూడదా? అలా అయితే నేను ఆయన కోసరం అస్తమానం ఎందుకు దేవుళ్ళాడాలి? ఎందుకు నా ప్రేమని అంతా ఆయనమీద ఒలకబొయ్యాలి? ఆయన నాకంటె నాలుగు ఛాయలు కారునలుపు. అంగుళం దళసరి ఉన్న కళ్లద్దాలు పెట్టుకుంటేనేగాని ఏమీ కన్పించదు. నేను ఎప్పుడూ ఆయనలో 'లోట్లు ఉన్నాయే' అనన్నా అనుకోలేదు. నాకీ అనుభవం జరగవలసి వుంది, జరిగింది. సరి పోయింది.

మా వూరినించి మా మేనమామగారివూరు నేను మా అమ్మ వెళ్లవలసి వచ్చింది. మా మేనమామ కూతురు—నిరంజన— నాతోటిదే (పెళ్లిమటుకు అవలేదు.) వుంది. చిన్నప్పుడు చూశానేమో జ్ఞాపకంలేదు. చాలా కాలానికి చూసుకోవడం వల్ల చెలిమి ఎక్కువ అయింది.

నిరంజన రెండేళ్లనుంచి కాశీ మెట్రిక్యులేషనుకు వెళ్తూ ఫెయిలు అవుతూంది. దానికి చదువుకు నల్గురు ప్రైవేటు ట్యూటర్లు. వీళ్లే కాకుండా సంగీతానికి ఇంకో మాష్టరు. "దీనికి చదువుకాని, సంగీతముగాని అంటవు", అని ఎవరు పడ్డే వాళ్లు యిట్టే చెప్పచ్చును. "ఇష్టము, అభిలాష లేనిదానికి, యింత ఖర్చుచేసి ఎందుకు యీ ట్యూషన్లు" అని నేను అడిగితే, "ఏమో నాకు తెలీదు, మా నాన్నగారు, అమ్మ చెప్పిస్తూన్నారు. అయినా నా ప్రైవేటు మాష్టర్లంతా ఎట్లా బతికేది?" అంటూ సూటిగా సమాధానం యిచ్చింది. అవును—యీ మాట నిజమేమో!

దీని అలవాట్లు, అభిప్రాయాలు, వేషము, నడవడిక, అంతా ఇంకో అంతస్తు పొద్దున్నే ప్రక్కమీద కూర్చోని, రెండు కప్పుల వేడి కాఫీ తాగిన తరువాతకాని ముఖం కడుగుకోదు! పొద్దున్న గంట, సాయంత్రం గంట అద్దం ముందు కూర్చోని ఆ 'పాండ్సు' సౌందర్య సాధనాలు ఉపయోగిస్తేనేకాని దాని ముస్తాబు పూర్తికాదు.

ఏమయినా దీనితో కలసిఉన్న ఆ యిరవైరోజులూ నాకు అనుభవంలో లేని ఆనందాన్ని యిచ్చాయి. ఇంచు మించు రోజూ సినిమాకు తీసుకొని వెళ్లేది. పొద్దున్నపూట ఏదైనా కొనుక్కోవాలన్న మిషతో ఊరంతా తిప్పేది. తరచు బీచికి తీసుకొనివెళ్లేది. అన్నిటికంటె నాచేత పాటలు పాడించుకొని, విని చాలా ఆనందించేది. ఇది ఒక్కతే కాదు—మా మేనమామ, ఆయనపెళ్లాం, వాళ్లింటికి రోజూ తప్పకుండా వచ్చే స్నేహితుడు—డాక్టరు జానకిరాం గారు—నాల్గు అయిదు సార్లు నాచేత గంటలతరబడి

పాడించుకొని పరవశులయ్యేవారు. నాకుకూడ కంఠంలో అంతమాధుర్యము ఉన్నదని అంతకుపూర్వం తెలీదు.

ఎవరికైనా వాళ్ల విద్యకు ప్రోత్సాహము దొరికి, వాళ్ల విద్యవల్ల యింకొళ్లకి సంతోషము కల్గుతూంది అన్న సంగతి తెలిసినప్పుడు కల్గే తృప్తి యింతా అంతా కాదు. అంత ఎందుకు—చిన్నప్పుడు మావూళ్లో చాకలి సుబ్బడు "యీ రేవుబట్టలు మల్లెపువ్వుల్లా వుతికావురా, సుబ్బిగా," అని మా పిన్ని అంటే ఎంత పొంగి పొయ్యేవాడని!

ఓరోజు బీచిలో మెల్లిగా నడుస్తూ నాకు మనస్సు ఉండబట్టక, "నిరూ, నీ వేషము, నీ తీరు నాకేం నచ్చ లేదు. ఇదేం బాగాలేదు" అని మొదలుపెట్టేసరికిల్లా—

నిరంజన తన తర్కశాస్త్రము విప్పింది. "...అవును. నా వేషము నీకు నచ్చలేదు. పమిట సరిగ్గా వేసుకోను. నేను తొడుక్కొనే బ్లౌసులు నీకు మరీ వెకటుగా వున్నై... నేను చీర ఎలా కట్టుకుంటేనేం... మెడదగ్గర రవికె ఎక్కువగా కత్తిరించి ఉంటేనేం... నెలకి పాతిక రూపాయలు "పాండ్సు" మీద కర్చుపెట్తేనేం... నీకెందుకు? లోకానికి ఎందుకు? లోకము నాకు డబ్బు దానంచేస్తుందా?... ఒక్కటిమటుకు నీవు జ్ఞాపకం పెట్టుకో—'నీవు చేసే పనులవల్ల, ఆడే మాటలవల్ల యింకోళ్లకి, ఎంత సన్నిహితులైనా సరే, కష్టం కల్గించకుండా ఉన్నంతవరకు, నీ యిష్టం వచ్చినట్లు నీవు వుండు. అంతే.'... నేను వేషము వేసుకొని యీ బీచిలో తిరిగే నూటుకాయల్లందర్నీ ఆకర్షిద్దామని నేను అనుకుంటున్నానని అనుకోకు. అది వొట్టి పిచ్చి ఊహ. మా నాన్నగారు ఆయన తాహతకు తగిన, నాకు నచ్చిన సంబంధం తెస్తారు. పెళ్లి చేసుకొని సుఖంగా ఉంటాను. మరి, ఆకాడికి యీ వేషము ఆర్భాటము ఎందుకు అంటావేమో—విను. నా అందాన్ని చూసి నాకు గర్వము. నా అందాన్ని యింకోళ్లు పొగడుతూంటే వినడం నాకు సరదా. నా అందాన్ని యాథాలాపంగానే ప్రదర్శించి నా అందానికి వచ్చే పొగడ్తన్ని వినడంకంటె నాకు ఎక్కువ అయింది ఏమీలేదు. ఈ అభిలాష ఉండబట్టే నా అందాన్ని ఎంత ఎక్కువ ప్రదర్శింప చెయ్యడానికి వీలు అవుతుందో అందుకు ప్రయత్నము చేస్తాను...

నేను తొడుగుకొనే బాడీలు, వేసుకునే బ్లౌసులు, చీర కట్టుకొనే విధం, కొప్పు ముడుచుకొనే తీరు...అందుకు ఉపయోగిస్తాయి. ఏమిటి ఇందులో అంతపెద్ద నేరము? ఏమిటా అవినీతి? నా మనస్సు నిర్మలంగా ఉండి చెడు తలంపులపైకి మనస్సు పోనప్పుడు; లోకం కాకులై కూసుకుంటే నాకేం, ఎవరో పోకిరి వెధవలు దగ్గుకుంటే నాకేం ...'మీనకళ్లు ఎంత చక్కగా వున్నాయమ్మా, ఎంత శ్రావ్యంగా పాడుతుందమ్మా' అని అంటె నీకు ఒళ్లు పులకరించదూ! అలాగే "నిరంజన చక్కదనం......" అంటే నాకు ఎంతో తృప్తిగా వుంటుంది." అంటూ, నన్ను ఉడికించడంకోసరం అన్నట్టు, "ఆనందమేగా వాంఛనీయము; ఆనందమేగా......" అంటూ కాంచన మాలని యిమిటేషను చెయ్యడం మొదలు పెట్టింది......దాని తర్కము, ఆ బీచిగాలి, అది పులుముకున్న లవండరు వాసనా, నన్ను ఉక్కిరి బిక్కిరిచేసి వదిలిపెట్టాయి. ఆలోచిస్తే అది అన్నదాంట్లో వేలుపెట్టి చూపదగ్గ అవినీతి ఏమీ లేకపోగా, దాని వాదన సబబుగా కన్పించింది, అవును, మనస్సు స్వచ్ఛంగా ఉన్నప్పుడు భాధ దేనికి?

తర్కశాస్త్రము అంటూఉండే చాలా పేచీ కోరు వస్తువు. ఎటుకావలిస్తే అటు మొగ్గుతుంది. దానికి నిలకడ లేదు.

ఓరోజు నేను, నిరంజన కారంస్సు ఆడటానికి కూర్చున్నాము. ఎవరు స్ట్రైకు చెయ్యాలనిచెప్పి నిరంజన నన్ను అడిగింది, "బొమ్మా...బొరుసా..." అంటూ.

నాకు చటుక్కున అనుకోకుండ ఏడుపు వచ్చేసింది. లేచి వరండా చివరకు వెళ్లి ఏడుస్తూ కూర్చున్నా. నిరంజన చాలా భయపడి తనమీద ఎందుకు కోపము వచ్చిందని అడిగింది—చెప్పాను, "బొమ్మ-బొరుసు" అంటే నాకు ఎందుకో భయంగా వుంటుందని, మనస్సు కలత పెట్టుందని. నిరంజన తన తెలివితక్కువకు చాలా నొచ్చుకుంది. మేము గేములు వరసగా ఆడాము. నాకు ఒక్క పాయింటుఅన్నా రాకుండా ఓడించేసింది. అనిపించింది—"నిరంజనకూడ 'బొమ్మే'నని మా పిన్ని, రమణ, మా అక్క వాళ్ళకంటె కూడ ఇది పెద్ద బొమ్మ.

అయితే, నేను "బొరుసు"నా అన్న సందేహం వచ్చింది.

నిరంజన తన వేదాంతముతో, తర్కముతో, నా మనస్సులోని సౌమ్యాన్ని, తృప్తిని, అన్నింటిని సరిపుచ్చుకొనిపోయే గుణాన్ని, ముక్కలు ముక్కలుగా చితకగొట్టి పెట్టింది. నేను మళ్ళీ వాట్లన్నిటినీ అతికించుకొనేలోపల అతుకుల్లో—తీరనివేదన, అసంతృప్తి, పట్టుదల, పగ, మొదలైన పిచ్చి వికారాలువచ్చి స్థావరము ఏర్పరచుకొన్నాయి. సరిపోయింది.

మళ్ళీ నేను మా ఆముదాలవలస వచ్చేసాను జగన్నాధుని రథం దొర్లిపోతూనే ఉంది. మా ఆయనకి చదువుఅయి, ఉద్యోగం అంటూ ఏవీ దొరక్కపోయినా, భగవంతుడు యిచ్చాడు కనుక నాకు ఆడపిల్ల పుట్టింది. మావాళ్లు చాలా సంతోషించారు. మా అత్తగారు అందరికంటె ఎక్కువ సంతోషించింది. నాలాగా నల్లగా గొంతెముచ్చులాగ (మా ఆయనకూడా నలుపేగా!) కాకుండా తెల్లటిపిల్ల పుట్టినందుకు.

ఈ పోలికలు ఎలావస్తాయి? ఎక్కడనుంచి వస్తాయి. నేను మా ఆయన, నలుపైనా పాప తెల్లగావుంది. తల్లి రతీదేవి. తండ్రి మన్మధుడు. పుట్టేపిల్ల కాస్తా బొగ్గుల్లో మాణిక్యము! ఏమిటీవింత?...... .....

యుద్ధం పుణ్యమా అంటూ మా ఆయనకు బెంగుళూరులో ఏరోప్లేనుల ఫాక్టరీలో పని దొరికింది. ఓసారి సెలవులకువచ్చి నన్ను, పాపని, మా అత్తగార్ని తీసుకొని వెళ్లారు. కొత్త సంసారందిద్ది మా అత్తగారు వెళ్లిపోయింది.

నా జీవితం మూడో ప్రాకారంలోకి వచ్చేసింది. నాకు కాస్త ప్రాణం తెరిపిన పడ్డట్టె, మా బ్లాకు చిన్నదైనా బొమ్మరిల్లులాగా బాగుంది. పనిచేసేవాళ్ల బ్లాకులు అన్నీ పోలీసు లైనుల్లాగ ఒకే మోస్తరుగా ఉంటై.

నాకు ఆశలు చిగురించడం మొదలుపెట్టాయి; ఒంటరి కాపురం. తర్చు మా ఆయనతో కలసి సినిమాలకి వెళ్ల వచ్చును. నా యిష్టం వచ్చినంతసేపు పాడుకోవచ్చును అడ్డుపెట్టేవాళ్లుండరు. మా ఆయనతో తనివితీర ఒంటరిగా ఎంతిసేపు అయినా కబుర్లు చెప్పుకోవచ్చు. ముద్దు పెట్టుకుంటే, పక్కగదిలో అత్తగార్కి వినిపిస్తుందో, అవతల గదిలో పెద్ద ఆడబిడ్డకు వినిపిస్తుందో అన్న భయం ఇంక అక్కర్లేదు, అనుకుంటూ ఎన్నో ఆకాశసౌధాలు నిర్మించుకున్నా.

కొన్నాళ్లు మా ఆయన వైఖరిచూడగా నా గాలి మేడ లన్నీ ప్రవాహతోసహా కూలిపోయినై. అకారణంగా నామీద కోపం తెచ్చుకొని విసుక్కునేవారు. నాతో మాట్లాడటం అంటే ఎంతో బాధపడుతున్నట్టు కన్పించే వారు. మా ఆయనకి, నేను పుట్టింటిదగ్గరనుంచి ఏవీ డబ్బు తేలేకపొయ్యానని, నేను అందంగా లేనని, మా అత్తగారు చెప్పే చెప్పులు, మనసు విరిచేసాయనుకుంటాను.

పొద్దున్నే తొమ్మిదింటికల్లా ఫాక్టరీకి పోయేవారు. మళ్ళీ సాయంత్రం ఆరింటికి వచ్చేవారు. మా పక్క బ్లాకులోనే ఓ సింధీ సంసారము ఉండేది. వాళ్లింట్లో 'షీలా' అనే అమ్మాయి ఉండేది. వాళ్ల సంసారానికి మా ఆయనకి చాలా జోస్తి. రోజు సాయంత్రం యింటికి రాగానే కాఫీ తాగి బాగా పొద్దుపోయేదాకా ఆ షీలాతో నవ్వుకుంటూ ఎడతెగని కబుర్లు చెప్పుకునేవారు. తర్చు ఆ సింధీ సంసారముతోనో, లేకపోతే యింకెవరైనా స్నేహితులతోనో కలిసి సినిమాకు వెళ్లేవారు.

ఒకసారి నాప్రాణం చివుక్కుమని, మా ఆయన ఆ సింధీ సంసారంతో సినిమాకు వెళ్లబోతూంటే, "నన్నూ తీసుకొని వెళ్లరూ," అని అడిగేసరికల్లా, "వీల్లేదు" అంటూ ఉత్తరువు జారీచేసారు.

అనుకుంటాను—నన్ను తమతోకూడ బయటకు తీసుకొని వెడితే ఆయన హోదాకు తక్కువ అవుతుందనో, నల్లగాఉన్న పెళ్లాంతో కలసి వెడితే వూళ్లో అందరూ నవ్వుతారనో, ఆయన బెంగ.

బయటకు వెడితే లోకం అంతా వాళ్ల వాళ్ల పనులు మానుకొని యింకోళ్లని చూస్తూ కూచుంటారా? పిచ్చిగాని!

మళ్లీ నేను మా ఆయన్ని ఎప్పుడూ అడగలేదు! ఒదిగి వుంటున్నకొద్దీ యింకా అణచాలని చూస్తారు మొగుళ్లైనా సరే, అధికారులైనాను!

ఏమీ క్రొత్తదనం, వింత అనుభవం సంతోషంలేకుండానే రోజులు పరిగెత్తుతున్నై. తెల్లవారుతుంది...పొద్దెక్కుతుంది...రాత్రి అవుతుంది...మళ్లీ తెల్లారుతుంది...భళ్లుమంటూను...

ఆయన ఫాక్టరీకి పోగానే ఏమీ పనివుండేది కాదు. పాప పడుకొని నిద్దరపొయ్యేది. మధ్యాహ్నం పాపతో కొంతసేపు ఆడుకొనేదాన్ని. యింకేమి చెయ్యలేక...ఫాక్టరీ పక్కగానే పెద్ద ఏరోడ్రోము ఉంది. కిటికీలోంచి పైకివెళ్లే, క్రిందకు దిగే విమానాలకేసి చూస్తూ వెర్రిదానిలా కూర్చునేదాన్ని........................

ఇంకెంతో లేదు. రథం గమ్యస్థానంకోసరం ఉరుకులెత్తుతూంది . ఆర్నెల్లు గడచిన దగ్గరనుంచీ నాకు రోజూ జ్వరం వచ్చేది. అలాగే ఎంతో ఓర్పుతో చేసుకునేదాన్ని. అయితే అంతకంతకు నాకు సాధ్యముకాలేదు. మా అమ్మ, అత్తగారు వచ్చారు నాకు సహాయంకోసరం.

యీమాటు, అనాకారితనంతోపాటు, రోగిష్టిదికూడా అయింది కోడలు, మా అత్తగార్కి, నాల్గు రోజులుండి మా అత్తగారు వెళ్లిపోయింది.

మా ఆయనలో మార్పు వచ్చింది. అంటే యిప్పటికి నాలో మంచితనం ఆయన్ని ఆకర్షించిదన్నమాట! తర్చు ఫాక్టరీకి సెలవుపెట్టి నా దగ్గరే కూర్చొని ఏవో కబుర్లు చెప్పేవారు.

చక్రం వెనక్కి తిరిగింది. నా ఆరోగ్యముకోసరం డబ్బు కర్చుపెట్టాలి. డబ్బు ఏది? ధనం! ధనానికి ఎంతశక్తి ఉంది! "రూపాయ" పుట్టి దానితరువాత మిగతవి అన్నీ పుట్టాయని! చాలా దూరంలో ఉన్నా మా అక్క, (మంగళ!) బావా చాలా ఆర్థిక సహాయం చేసారు. నాకు చాలా దుఃఖము వచ్చింది. మా అక్కచేతే సహాయం పొందవలసి వచ్చినందుకు.

ఇప్పుడు బాగా స్థిరపడి పోయింది—మా అక్క బొమ్మ. నేను బొరుసని!—

మా అమ్మ మనదేశంలో ఉన్న అన్ని దేముళ్లకి మొక్కుతుంది. నాకు త్వరగా నెమ్మదించే టట్టు చెయ్యమని—అయితే,—పంచామృత స్నానం చేయించుకొని, పట్టు పీతాంబరాలు కట్టించుకొని, ముత్యాలదండలు, రత్నాలహారాలు, కెంపుల మకుటము పెట్టించుకొని, ఓచేత్తో తామరగోక్కుంటూ రెండో చేత్తో కర్పూరహారతి పూజారి యిస్తూంటే పూజలు అందుకొని, ఆ చీకటి కొట్లో పడుకొనే మూల విరాట్టులందరూ — భక్తుల దీనలాపాలు వింటే, లోకానికి యింకేం కావాలి?

దేశంలో ఉన్న ఒక్కదేముడికీ మా అమ్మ ప్రార్థనలు వినపడలేదు.

........................ఓరోజు నా గుండెల్లో చాలా నొప్పి పెట్టింది. మా అమ్మ యింకా దేముళ్లకి మొక్కుతూనే ఉంది. మా ఆయన ఫాక్టరీకి వెళ్లారు. సాయంత్రం కిటికీలోంచి పైకి ఎగిరే, క్రిందకు దిగే విమానాలకేసి చూస్తూన్నాను. సాయంత్రం నాకు చాలా బాధ ఎక్కువ అయింది......

ఆ తరువాత—నా ముద్దులపాప, అంగుళం దళసరి కళ్లద్దాలు పెట్టుకొనే మా ఆయన, వెకిలిగా నవ్వుతూ మా ఆయనతో రోజూ కబుర్లు చెప్పే ఆ పిల్ల "చక్కటి చుక్క, నిరంజన", అందరూ నా మనసులోంచి నెమ్మది నెమ్మదిగా జారిపొయ్యారు..................................

..............ఇంతసేపు నేను చూస్తూన్న దృశ్యం కాస్తా చెదిరిపోయింది. దానిసానే లెఖ్ఖపెట్టలేనన్ని పాలగచ్చు మెట్లు పన్పించాయి. ఇంకొంతసేపట్లో ఆ మెట్లుకూడా మాయమై ఆ స్థలంలో పొగమంచు ఆవరించింది. మెల్లి మెల్లిగా ఆ పొగమంచు విడిపోయి నీళ్లు వచ్చేసాయి. మామూలు సరస్సు అయిపోయింది. మా ప్రతి బింబాలు అందులో మామూలుగా కన్పించినై.

నేను ఆ పురుషాకృతి కలసి ఎంతో ఉల్లాసంగా పోతున్నాం. ఎన్నో జంటలు—పురుషాకృతి, స్త్రీ రూపం—చిరునగవులతో విహారం చేస్తూన్నారు. అంతటా మలయమారుతం వీస్తోంది. పారిజాతపు నీడల్లో కొన్ని స్త్రీ రూపాలు చలువరాతి తిన్నెలపై కూర్చొని వీణాగానము చేస్తూన్నారు. దూరాన ఓ సరోవరంలో రెండు రాచ హంసలు బాగా విప్పారిన తామరపూల మధ్యగా యీదుకుంటూ పోతున్నై.

నేను ఆ పురుషాకృతి దూరాన మంచు శిఖరాలవైపు ఎంతో సంతోషముతో పోతున్నాం......





# గౌతమబుద్ధ

—: నాటిక :—

(అంకత్రయము)


రచన : కీ. శే. శ్రీ. కోనే వెంకటేశ్వరరావు

పాటలు, పద్యాలు : శ్రీ "జగం"

సంపాదన : కె. జగదాంబ


ఇందలి పాత్రలు

శుద్ధోదనుడు — శాక్యవంశపు మహారాజు

సిద్ధార్థుడు — శుద్ధోదనుని కుమారుడు

ఛన్నుడు — సిద్ధార్థుని రథసారథి

దేవదత్తుడు — సిద్ధార్థుని మిత్రుడు

రాహులుడు — సిద్ధార్థుని పుత్రుడు

బింబిసారుడు — మగధాధీశ్వరుడు

మారుడు — సిద్ధార్థుని తపస్సు చెరచ నెంచిన అదృశ్యవ్యక్తి

యశోధర — సిద్ధార్థుని ధర్మపత్ని

(ఇంకను సేవకులు, గొల్లలు, యజ్ఞ నిర్వాహకులు వత్తురు)

## తొలి పలుకు

[ప్రపంచంలో జీవులు పుట్టుంటారు, గిట్టుంటారు. కానీ, తన జీవిత కర్తవ్యాన్ని నెరవేర్చుకొన్నవాడే మానవుడు. అతడే మహాత్ముడు!

"జీవినై పుట్టాను. ఇక పెరిగి మృత్యుదేవత క్రూరదంష్ట్రలకు బలైపోవడమేనా నా జీవిత పర్యవసానం? నేనెందుకు పుట్టాను? బ్రతకడమెందుకు?" అనే జిజ్ఞాసను రేకెత్తించుకొని, తరుణోపాయం వెదకి, సఫలీకృతులైనవారు బహు కొద్దిమంది! అట్టివారిలో క్రీస్తు, బుద్ధుడు, గాంధి—వీరు ముఖ్యులైనారు ఈ అంధకారయుత ప్రపంచమునకు. వారిలో బుద్ధుని చరిత్ర అత్యద్భుతము!

జీవితంయొక్క అంతరార్థంకొరకు తన జీవితాన్నే అర్పించిన రాజకుమారుడు, యువకుడు, గౌతముడు.

సిద్ధార్థుడై వెడలి, బుద్ధుడై మరలివచ్చి, తన జ్ఞానదీపికను ఈ అంధకారబంధుర ప్రపంచంపై ప్రసరింపచేసి ధన్యుడైనాడు గౌతముడు.

"ఒకనికోసం పదిమంది బాధపడకుండ, పదిమందికోసం ఒక్కడు బాధపడడం ఉత్తమకార్యమని" తెలియజేసే సిద్ధార్థుని చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించబడింది ప్రపంచ చరిత్రలో... దానిలో ఒక శకలమాత్ర మీ రచన...]

### రంగము ౧.

(రాజమహాలు. ప్రవేశము, శుద్ధోదనుడు.)

శుద్ధోదనుడు : (స్వగతము) ఆహా! ఈవాక్యము పదే పదే స్మరణకు వచ్చి—నాహృదయమున కొక ఈటెపోటుగా నుండి ఎట్టి తీరని వ్యథనుకల్గించుచున్నది!—ఏమనిచెప్ప నా జ్యోతిష్కుడు!—నా ముద్దుబిడ్డ!—నా ప్రేమంపు రాశి! — ఈ నాశాక్యవంశోద్ధారకుడు! — నా సిద్ధార్థుడు!!—త్వరలోనే ప్రపంచమును—మమ్ములనందఱను—విడచి, సన్యసించి బుద్ధుడగుననిగదా చెప్పియుండె!—కాదు!

ఆశ్లేన్నటికిని కాజాలదు !!—శాపము ! వానిని పురిటింటనే విడిచి దివినలంకరించిన వానితల్లి మాయాదేవియును, నేనును—లెక్కకు మించిన వ్రతాదుల నొనర్చియు—మ్రొక్కులు మ్రొక్కియు—యెట్లో—ఈ నా శాక్యరాజ సింహాసనమును—నా వంశమును—నిలువబెట్టగలుగు—ఈ పుత్రరత్నమును లభింప జేసికొంటిమి !—తల్లిలేని బిడ్డను—ఈనా జీవనాధారమును—ప్రాణమునకు ప్రాణముగా జూచుకొనుచు, తల్లిలేని కొఱత యావంతయైననూ గలుగనీయక నింతగా రక్షించుచున్నాడనే !—ఇట్టివానిని—నేను—ఒకనాటికైనను సన్న్యసింపనిత్తునా ?—ఇది యెన్నటికిని జరుగదు !—జ రు గ జా ల దు !!—ముమ్మాటికిని జరుగనేరదు !!!—నేను నాయావచ్ఛక్తిని, ఉపయోగించి, నా సిద్ధార్థుడు, నాకుండునట్లుగనే జేసికొందును !—వాని ప్రకృతి యంతయు మొట్టమొదటినుండియు—సృష్టిపరిశీలన—లోకమందలి సుఖ దుఃఖ విచారణ—సత్యవస్తువును గురించి యోజించుట—ఈ విచారమునందే బడి వాడొక్క క్షణమైనను ఆంతరంగిక సుఖములేక యుండును !—వానికి సన్న్యాస మిప్పించునదికూడ ఈ దౌర్భాగ్యపు విచారమేనని నా దృఢనమ్మకము !—దీనిని చూచియేగదా—నేను—వానికి ప్రత్యేకముగా నొక దివ్యభవనమును గట్టించి—సమస్త విలాసముల నందుంచి—ఆ చుట్టుప్రక్కల వాతావరణమునుసైతము—కన్నుల పండువుగావించు పూలమొక్కలతోడను, వీనుల విందొనరించు చిలుక, గోరువంక, కోయిలలతోడను నింపి—వానికి అనుక్షణమునను—అపారమగు మనోల్లాసము మాత్రమే గలుగుచుండునట్లుగ—ఏర్పాట్లు జేయించితిని ! అయినను వాడు ఎందులకో పురవీధులు సంచరింప నిచ్ఛించెను—మొన్నటి దినమున, పట్టణమును సందర్శించి వచ్చుటకై నాయనుజ్ఞను గోరెను ! అట్లే మరునాడు చూతువుగాక, యని వాని నప్పటికి బంపి ఆ మరునాడు పురమంతయు శృంగారించి పురవీధులలో ఉత్సాహవంతులగు యువకులు మాత్రమే సిద్ధార్థునాహ్వానింపవలసినదిగా పురజనులకు చాటబంపి, ఆపిమ్మట వానికి పురప్రవేశన కనుజ్ఞనిచ్చితిని !—ఇట్లు కట్టుదిట్టములచేసి వానిని నావశము నందే యుంచుచున్నాడను !!—ఆఁ ! మా సిద్ధార్థుడు యెప్పటికిని నావశుడే !—సన్యాసి కెన్నైనను కాజాలడు !! ఇదియే నిశ్చయము !!!—

(ప్రవేశము, సిద్ధార్థుడు, ఛన్నునితో)

సిద్ధార్థుడు : తండ్రిగారికి వందనములు ! (నమస్కరించును.)

ఛన్నుడు : మహాప్రభూ ! నమస్కారములు ! (నమస్కరించును.)

శు : (దీవించుచు, సిద్ధార్థునితో) నాయనా ! క్షేమ మగుగాక !

సి : (కొంచెము తొందరతో) తండ్రీ! నిన్నటి పురసంచారము నాహృదయమునకు తృప్తి నొసంగినది కాదు !—ఈ క్షణముననే, నేను పట్టణమును మరియొక పర్యాయము దర్శించి వచ్చుటకు తమ అనుజ్ఞను వేడుకొనుచున్నాను !—ఈ ఛన్నునిచే రథమును సిద్ధముచేయించియే యిటు వచ్చితిని !

శు : (కొంచెము ఆరాటముతో) అయ్యో ! నాయనా ! ఇట్టి యారాటమేల !—మరియొక పర్యాయము చూడదలంచినను, స్థిమితముగ రేపటనో మాపటనో చూడగా రాదా?

సిద్ధా : అట్లుగాదు తండ్రీ !—ఇప్పుడే—నేను—తక్షణమే పోయి నగరమునందు సంచరింప నిచ్ఛగలిగియున్నాను !—నాయందు తమకు ప్రియముగలదేని మరుమాట చెప్పవలదని ప్రార్థన !

శు : (తనలో) ఔరా ! నేనిప్పుడేమి చేయువాడ !—కానిమ్ము ! దైవేచ్ఛ యెట్లున్న నట్లుగుగాక !—(ప్రకాశముగా కొంచెము నీరసముగా) సరియే !—స—రే!—అట్లే పోయిరమ్ము !—నీకు ప్రియమును చేయుటయే నాకును ప్రియమైనది !—(ఛన్నునితో) ఛన్నా! చూడుము ! యువరాజును బహు జాగ్రత్తగా సంచరింపజేసి తీసికొని రమ్ము !

ఛ : చిత్తము !

(అందరు నిష్క్రమించుచుండగా తెర వ్రాలును.)

రంగము ౨.

(పురబాహ్య ప్రదేశము.

ప్రవేశము : సిద్ధార్థ, ఛన్నులు.)

సిద్ధా : ఆహా! ఛన్నా! ఏమి సౌందర్యము! ఏమి సౌందర్యము!—ఈ సాయం సంధ్యయందు ప్రకృతి మాత ఎట్టి సౌందర్యముల నీనుచున్నది.

సీ॥ తన ముద్దుబిడ్డను—దరిచేర్చి లాలించు
తల్లిగా శ్రమబాపు—చల్లగాలి!
ప్రతి ఫలాపేక్షకే—పాటును బడకుండ
మనసుల రంజించు—మల్లె పూలు!
ప్రియలతో జతగూడి—ప్రేమ పాఠము నేర్వ
పైపైనవిహరించు—పక్షిజాతి!
ఏ బాధ నెరుగక—ఏమేమొ పలుకుచు
పాడుచుండెడి రీతి—పారు నీరు!

ఆ॥ వె॥ ఎల్ల జగంబుల—కెన్నెన్నొ రంగుల
తీర్చి దిద్దినట్టి—తీరుగాను
దోచు వెలుగు—ఎంత చూచిన చూచినన్
తని వి దీరదిట్టి—తరుణమందు!!

ఛన్నా! కన్నులపండువు!—ఇదియంతయు మిక్కిలి మనోరంజకముగదా!—ఇంత హాయి నొసంగుచున్న యీ ప్రపంచమున మానవుడు మిక్కిలి సుఖజీవనమును గడుపుచున్నాడుగదా!—(ప్రక్కకు చూచి) అదేమిఛన్నా! ఆమనుష్యుడు—శుష్కించి ముడతలువడిన దేహముతో లోతుకు పోయిన కన్నులతో—ప్రతీ క్షణమునను దగ్గుచు—రోజుచు—మూల్గుచు—కఱ్ఱనొకదానిని చేత గొని—నడువలేక నడువలేక అట్లు నడచుచున్నాడు! ఈ విచిత్ర దృశ్యమేమి ఛన్నా!—

ఛ : యువరాజా! వాడొక ముసలివాడు!—వాడును పూర్వమొకప్పుడు మనవలెనే శరీరదార్ఢ్యము కలిగి, పరిపూర్ణ యౌవనముతో సమస్త సుఖముల ననుభవించిన వాడే!—కాని, యిప్పుడు వానికి, వృద్ధాప్యము వచ్చుటచే శరీరమునందలి రక్తమాంసములు క్షీణించి కఱ్ఱ యూతలేనిదే నిలువజాలని స్థితియందున్నాడు!—వాడట్లు తెలివిలేక దగ్గుచుండుటకు కారణము వానికిగల క్షయ వ్యాధియే!—రాకుమారా! నీవును—నేనును—ఈ లోకమున జన్మించిన ప్రతీ వ్యక్తియు ఆ వయసున నట్టిగతి నొంద వలసిన సంగతియై యున్నది! ఇది ప్రకృతి సహజము!

సిద్ధా : ఏమి ఛన్నా! ఏమంటివి! నీవును—నేనును—ఎల్లవారును—ఒకానొకప్పుడు, ఇట్టి దౌర్భాగ్యపు స్థితి లోనికి నెట్టివేయ బడుదుమా?—అయ్యో! ఇట్టిదుస్థితి యందు బడకుండుటకు మార్గమేమైనను లేదా?

ఛ : లేదు! యువరాజా! లేదు!!—(ప్రక్కకు చూచి) రా కుమారా అటు చూడు మటుచూడుము! అదియొక మృతకళేబరము!—ఏ వ్యాధిచేతనో—మరెందుకనో—ఎవడో యొకమానవుడు మృతినొందెను! ఇప్పుడా శవమును దనమునేసి వచ్చుటకై—అట్లుకట్టి—అనేక విధముల రోదించుచు—శ్మశానమునకు మోసికొని పోవుచున్నారు రాకుమారా! ఈ లోకమున—బంటు—రాజు—రాజాధిరాజైనను—మరి యెవ్వడైనను—ప్రతివాడును ఒకానొకప్పుడు యీ విధముగ మృత్యువు వాత బడవలసిన వాడే! ఏ యొక్కరును మృత్యుమహాదేవి కనికరించి విడిచిపెట్ట జాలదు!

సిద్ధా : (విచారముతో) అకటకటా! ఛన్నా! ఏమి యీ భయంకర దృశ్యము!—ఔరా! ఈ లోకమున నింతటి మహా దుఃఖము నైతము గలదా!—ఇట్టి ప్రపంచమున మానవుడు యే ఆవగింజయంత సుఖమునో పొందుచుండునుగాని—మహామేరు పర్వతమంతటి దుఃఖమునకు గుఱియై యుండవలసిన వాడు! ఇక చాలును! ఛన్నా! నా హృదయమున నేవోగాని మిక్కుటమగు నాందోళన మేర్పడినది! రథమునింక ఇంటి ముఖము పట్టింపుము!

ఛ : చిత్తము! ("తెర")

రంగము ౩.

(అరణ్య భూమి; ప్రవేశము: సిద్ధార్థ దేవదత్తులు)

సిద్ధా : సఖా! దేవదత్తా! ఈ వేటయనునది క్షత్రియధర్మములలో నొక ధర్మమే యైనను—నాకు—పాపము!

నిరపరాధులగు—నోరెరుగని—జంతుజాలమును—దయ మాలి—క్రూరముగా వధించుట—మహాదోషముగ కన్పట్టుచున్నది! నేను నీతో యీ అరణ్య భూముల కేతెంచుట—అరణ్య ప్రకృతిని దర్శించి ఆనందించుటకే గాని ఇట్టి వేటలనాడి మోదించుటకుగాదు!

దే: అదేమి సిద్ధార్థా! నీవు చెప్పిన దొక్కమాటయు నా తలకెక్కుటలేదు! చూడుము—! నే నెట్లీ యరణ్యమున వీర విహారమొనర్తునో

గీ॥ చూపుకందిన మృగముల—తూపునొకటి
నేలగూలెడి రీతిగా—నేర్పుతోడ
విడచు నాబాణములగల్గు—వడికి జగము
వణకు-చూచెదులెమ్ము వ—ర్ణనములేల?

(నిష్క్రమించును.)

సి: (స్వగతము.) ఆహా! ఈ ప్రకృతి యెంత గాంభీర్యముగ నున్నది! అబ్బా! ఈ సృష్టి రహస్యములు మహా నిగూఢములు! ఇట్టి అరణ్య భూములనే తపోవనములుగ జేసికొనిన తపస్వులు—మహా పురుషులు—మాత్రమే ఆ పరమ రహస్యములు గ్రహింప జాలుదురు!—ఏమా శబ్దము!—(పైకిచూచి) ఓహో! అసంఖ్యాకములగు రాజహంసల సమూహమొకటి యాకసమున, నతిరమ్యముగ పోవుచున్నది! ఆహా! ఈ దృశ్యమెంత మనోహరముగ నున్నది!

గీ॥ పుణ్య సంక్రాంతి దినముల—పువ్వుబోండ్లు
శిల్ప చాతుర్యమును దెల్ప—కల్పనముల
ముత్యపుం ముగ్గులను బెట్టి—ముదము గొలుపు
నట్లె ఈ రాజహంసల—జట్టుదోచె!

(నిదానించిచూచి) ఏమది!—ఎక్కడనుండియో యొక శరము!—ఆ గుంపులోనికే పోవుచున్నదే!! అయ్యయ్యో! ఆ శరభేదనముచే యొకరాజహంసము నేల గూలుచున్నది!!!—ఎంత ఘోరమెంత ఘోరము?— ఆ పక్షి ఈ ప్రాంతములందే బడియుండవలెను! పోయి చూచెదగాక! (పోయి, ఒక శరమును చేతగొని తిరిగి వచ్చి) అకటకటా! ఈ పాడు శరమెట్టి ఘాతుకమును జేసెను!—(కొంచెమాగి) ఔను! దీని నననేల!—దీని నా పక్షిపై ప్రయోగించిన దయా విహీనుడెవ్వడో వాని ననవలయును! పాప మీశరము కఠినముగ పక్షమును జీల్చ, స్పృహదప్పి నేలబడియున్న యా పక్షియొక్క ఱెక్కనుండి—నేను—దీని నూడ బెఱికి—గాయమును శుభ్రపరచి—మృదు పత్రములతో కట్టుగట్టి—సేదదేర్చి చికిత్స యొనర్పకున్న—యీ దిక్కుమాలిన పక్షికిట దిక్కెవ్వరు?—(ప్రక్కకు చూచి) అదిగో! ఇప్పుడు కొంచెము కొంచెముగా ప్రాకగలుగుచున్నది!—ఆ గాయము పూర్తిగ మానిన పిమ్మట—బాగుగా ఆరోగ్యము నొందినమీదట—నేను దీని నాకాశపథమున విడిచెదగాక!

దే: (తొందరగా ప్రవేశించి) సిద్ధార్థా! సిద్ధార్థా! నేనొక రాజహంసమును బహులక్ష్యముతో గొట్టితిని!—అది నాకు గనుపించినది కాదు. నీకు గాని దొరికినదా?— (ప్రక్కకు చూచి) అదిగో నీవు పట్టియుంచితివి! తే తెమ్ము! అదినాది!!

సిద్ధా: (వారించి) ఆగుమాగుము! దేవదత్తా! ఆ పక్షి నాది! నీ దెంతమాత్రమును కాజాలదు!—సరేగాని! సఖుడా! నీవేనా! ఇట్టి—ఘాతుక కార్యమునొనర్చిన వాడవు! అయ్యో! అటుచూడుము!—దాని దీనదశనీ హృదయమును ద్రవ్యలొనర్చుటలేదా!

దే: (విస్మయముతో) ఇదేమి సిద్ధార్థా!—ఏమి మాటలివి!? నా కేమియు బోధపడుటలేదు!

సి: సఖా! ఇటురమ్ము! (దేవదత్తుడు సమీపమునకు రాగా, చేతనున్న శరముతో నాతని చేతిని కొంచెముగ పొడ్చును. దేవదత్తుడు అబ్బా, అనును. అట్లందువేమి దేవదత్తా!—ఈ శరముచే నీచేతికి గాయమైనను గాలేదు! రక్తమైనను రాలేదు! అంతమాత్రమునకే నీవు 'అబ్బా' అనుచున్నాడవు! పాపమట్లు బాధపడుచున్న పక్షియొక్క దీనదశ నీ హృదయమును గరగించుచున్నది గాదు! సఖా! మరియొక మాట!—దీనినిట్లు వేటాడి

(తరువాయి 38వ పేజీలో)



కీ॥ శే॥ చింతగుంట హనుమంతరావుగారు.

జననం. 29-11-1929 — మరణం. 9-10-1950

## అశ్రుతర్పణ

వీరు న్యాయమూర్తులు శ్రీ చింతగుంట రాఘవరావుగారు, శ్రీమతి సీతామహాలక్ష్మమ్మగార్ల తృతీయ పుత్రుండు. చిన్న వయస్సునందే, హిందీ, సంస్కృతాంధ్ర భాషలలో మిక్కిలి పాండిత్యమును గడించి, ఆంగ్లభాషలో కూడా మంచి ప్రవేశము కలిగించుకున్నారు.

హిందీ వీరి అభిమాన భాష. ఆంధ్రమున పెక్కు వ్యాసములు, కథలు, తాము స్వయముగనే రచించుటయేగాక, హిందీనుండి అనేక కథలను అనువదించి యున్నారు. ప్రేమ్‌చంద్ సారస్వతంలో వీరికి అభిలాష మెండు. వీరి రచనలు పెక్కు మా ఆంధ్రమహిళ పఠిముఖంగా పాఠకులకు సుపరిచితములే.

సంగీతములో, అందూ ముఖ్యంగా గాత్ర సంగీతములో వీరికి మంచి ప్రవేశము, నేర్పుగలవు. స్వయముగా కొన్ని కీర్తనలను రచించి, రాగతాళ యుతంగా చక్కగా పాడేవారు.

చిన్న వయస్సేయైనను ఆర్ష విజ్ఞానము వీరికి చక్కగా అబ్బినది. అభిప్రాయములు, నడవడిక, మిక్కిలి జ్ఞానమును సూచించెడివని ప్రతీతి.

ఇట్టి ప్రతిభాశాలియైన పుత్రుడు, ఇంత చిన్న వయసులో కాలము చేసి, తల్లిదండ్రులను, బంధు మిత్రులను, దుఃఖ సముద్రములో ముంచివైచెను. దివి కేగిన వారిఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ, దుఃఖితులైన తల్లిదండ్రులకు, బంధు మిత్రులకు మా హృదయపూర్వక సానుభూతిని తెలియజేయుచున్నాము.

ఆంధ్ర మహిళ.

# శ్రీ చింతగుంట హనుమంతరావు స్మృతి

# మంతూ!

మంతూ!...మంతూ!...

నాచెవులకు ఘడియలు పడ్డట్లున్నై "రాధాకృష్ణుడూ!" అనే ఆప్త సంభోధన వినిపించటం లేదు.

పద్మవిలాస్‌లోని నీ గదిని చూడబోదునుగదా, ఖాళీ! నా మాంసపు కళ్లకు కనిపించే ఈ శూన్యంయొక్క అంతరార్థమేమిటి చెప్మా?

మంతూ! నువ్వెంత మంచివాడివి! అంత మంచితనం ఉండకూడదు మంతూ! దేముడు మంచివాళ్లను ప్రేమించి, దబ్బున తనదగ్గరికి చేరదీసుకుంటాడుట. ఎందుకోగానీ, కీట్సూ, వివేకానందుడూ జ్ఞాపకానికివచ్చారు. చివరికి ముసలి గాంధీతాతయ్యా కనిపించాడు.

ఔనుగానీ, మంతూ నీకు జ్ఞాపకం ఉన్నాయా నాగేశ్వరపురం రోజులు?...మనం క్రికెట్ ఆడేవాళ్లం?...మనం డాక్టరాట ఆడుకునేవాళ్లం, నువ్వూ, మల్లుడూ, నేనూ?... ఒక జేమ్సువాట్‌లాగా, ఒక కొలంబస్‌లాగా కొత్తరకం పడవను కనిపెట్టి, "సంజీవసదనం" విశాలావరణల్లో నిండుకున్న నీళ్లల్లో నడిపించి, డిస్కవరీ చేద్దామనుకునేవాళ్లం? బళ్లో ఇద్దరం ఒకే బెంచీలో కూచునేవాళ్లం?...సెలవల్లో మధ్యాహ్నంపూట సూరన్నయ్యతో కలిసి "The Vicar of Wakefield" చదివేవాళ్లం?...తరువాత, మన వయస్సులమీద కాలం తన ప్రభావాన్ని చాటక, మనం కలుసుకున్నప్పుడల్లా సాహిత్యాన్ని గురించీ, పత్రికాలోకాన్ని గురించీ చర్చిస్తుంటే మామయ్య యువ కవుల్ని చూసి నవ్వుకుంటూ వెళ్లేవాడు?

పాటలువ్రాసి, చక్కగా పాడి వినిపించేవాడివి. ఔరా నీలో సంగీతమూ, సాహిత్యమూ ఎంత సన్నిహితంగా పెనగొన్నవో? నువ్వింకా కొద్దికాలం ఉంటే, నువ్వొక గొప్ప గాయకుడివీ, రచయితవీ అని తెలిసేది.

(28వ పేజీలో)

కథానిక

# దేవాలయము

మూలం: ప్రేమచంద్

అనువాదం: కీ. శే. చింతగుంట హనుమంతరావు

ఈ ప్రపంచంలో మాతృప్రేమ తప్ప తక్కిందంతా మిథ్య; నిస్సారము. మాతృప్రణయం తథ్యము, అక్షయము, శాశ్వతము అయినది. మూడు రోజులనుండి సుఖద నోట్లో ఒకనీటిచుక్కైనా పోసుకోలేదంటే భోంచేయలేదని వేరే చెప్పాల్నా? సమ్ముఖంలో పరుపుమీద చిన్న ప్రియ పుత్రుడు బాధతో మూల్గుతూ ఉన్నాడు; ఇవాల్టికి మూడుదినాలుగా కన్నులైనా తెరవడంలేదు. కొన్నిమాట్లు చంకలోకి తీసుకుంటుంది తల్లి కొడుకుని; కొన్నిమాట్లు పడుకోబెడుతుంది. నవ్వుతూ ఆడుకుంటూన్న బాలకునికి హఠాత్తుగా ఏమయిందో ఎవ్వరు చెప్పలేకుండా ఉన్నారు. అటువంటి స్థితిలో ఆ తల్లికి క్షుత్పిపాస లెక్కడివి? ఒకసారి గుక్కెడు నీళ్లు నోట్లో పోసుకుంది కాని లోపలికి దిగేందుకు కాదు. ఈ దీనురాలి ఆపదలకు ఒక హద్దంటూ లేకుండాఉంది. ఒకఏడాదయినా తిరిగిరాలేదు; ఇద్దరు పిల్లలను గంగార్పణం చేయాల్సి వచ్చింది. ఆమె భర్త స్వర్గమలంకరించాడు; ఇపుడా నిర్భాగ్యురాలి ఏకైక ఆధారమైన యీ పిల్లవాడు మిగిలాడు. అయ్యో! దైవమూ యీ పిల్లవానినికూడా తనదగ్గరనుండి లాక్కో చూస్తున్నాడా—అని యోచిస్తూండగా మాతృనయన నీరజాలనుండి బాష్పధార ప్రవహించసాగింది. తన కొడుకును సుఖద క్షణమాత్రమైనా ఒంటిగా వదలడంలేదు. గడ్డి పీకేందుకు వెళ్లేటప్పుడుకూడా, కూడా తీసుకు వెళ్లేది. గడ్డి బజారులో అమ్మడానికి వెళ్లినపుడు సయితం అతడు చంకలో ఉండాల్సిందే. అతడికోసం ఒకచిన్న బుట్టను ఒక చిన్న గడ్డి పీకే పనిముట్టును కొనిచ్చింది. తల్లితోపాటు గడ్డి పీకుతూ ఆ పిల్లవాడు గర్వంతో అనేవాడు, "అమ్మా, నాకుకూడా ఒక పెద్దబుట్ట కొనిపెట్టవే నేను చాలాగడ్డి పీకు తాను నువ్వు ఇంటి గడపమీద కూచుని ఉండాలి; నేను గడ్డి అమ్ముకు వస్తాను." అపుడు తల్లికోసమేం తెస్తావని కుమారుని ప్రశ్నిస్తుంది. రంగురంగుల చీరలు తెస్తానని వాగ్దానం చెస్తాడు; తనకోసం చాలా బెల్లం కొనుక్కో కోరుతాడు. ఆ అమాయకమైన మాటలే ఈ సమయంలో స్మృతిపథానమెరిసి మాతృ హృదయాన్ని వ్యాకులపరుస్తూ ఉన్నాయి. పిల్లవాణ్ణి చూచిన ప్రతివ్యక్తి ఎవరి దిష్టోతగిలి ఉందని అనేది; కాని ఎవరి దిష్టో? ఈ వితంతువుకుకూడా ప్రపంచంలో శత్రువులంటూ ఉన్నారా? ఉన్నట్లయితే వారివద్దకు వెళ్లి సుఖద వారి పాదాలమీద వ్రాలి పిల్లవానిని వారి చంకలో ఉంచి వానికి దిష్టితీయమని ప్రార్థించేది. అపుడుకూడా వారి హృదయం ద్రవించదా? కాని వారెవరో ఎలా తెలుసుకోవడం?

* * *

రాత్రి మూడుజాములు గడచిపోయాయి. సుఖదయొక్క చింతావ్యథిత మానస వనచరం ఇష్టమొచ్చిన దార్లంట పరుగెడుతూ ఉంది. ఏ దేవతను శరణు జొచ్చడమా, ఏ దేవునికి మ్రొక్కుకోవడమా అని ఆలోచిస్తూండగా సుఖదకు ఒక కునుకు పట్టింది. ఆ కునుకులో ఒక స్వప్నం వచ్చింది. ఆమె భర్త పిల్లవాడి తలవైపు నిల్చున్నట్లవుపించి వాడి తల నిమురుతూ అన్నాడు, "సుఖదా, ఏడ్వవద్దు. ప్రకాశానికి ఆరోగ్యం చేకూరుతుంది. రేపు దేవాలయానికి వెళ్లి దేవుణ్ణి పూజించు. అతడేనీకు సహాయం చేస్తాడు." ఇలా అని భర్త అదృశ్యుడయాడు. సుఖద కన్నులు తెరుచుకున్నాయి. "నిజంగానే వారువచ్చారు. అందులో ఏ మాత్రము సందేహము లేదు. వారికిపుడుకూడా నన్నుగూర్చిన జ్ఞాపకం ఉంది." అని యోచించినపుడు ఆమె ఆత్మ ఆశతో పరిప్లావితమైంది. భర్తపట్ల భక్తి ప్రపత్తులతో నేత్రద్వయం అశ్రుసిక్తమైంది. సుఖద బాలుని చంకలోకి తీసికొని ఆకాశాన్ని అవలోకిస్తూ అన్నది, "ఈశ్వరా, నా కొడుక్కి ఆరోగ్యం కలిగితే నిన్ను పూజిస్తాను. అనాథ వితంతువుని నన్ను దయచూడు."

ఆ సమయంలోనే ప్రకాశం కన్నులు విప్పారినాయి; దాహం కోరాడు. తల్లి పరుగున వెళ్లి ఒక గిన్నెలో నీళ్లు తెచ్చి అతనిచేత త్రాగించింది. ప్రకాశం నీళ్లు త్రాగి అన్నాడు, "ఇప్పుడు రాత్రా? పగలా?"

సుఖద, "ఇంకా రాత్రి ఉందినాయనా. నీకు ఒంట్లో ఎలా ఉంది?" అని ప్రశ్నించింది.

"కులాసాగానే ఉంది."

"నీ మాటల్లో ఎంత తియ్యదనం ఉందిరా! ఆ దేవుని దయవల్ల నీ కారోగ్యం కల్గుతుంది. ఏమైనా తిందామని ఉందా?"

"అమ్మా, నాకు కొంచంగా బెల్లం తిందామని ఉంది."

"బెల్లం తినకూడదు నాయనా, ఒంటికి మంచిదికాదు. నీకు జావ కావలిస్తే చేసిస్తాను."

"అమ్మా, కొంచం బెల్లం పెట్టవే. నీ పాదాలమీద వ్రాలుతాను."

తల్లి ఈ ప్రార్థనను కాదనలేక పోయింది. ఆమె బెల్లం కొంచంతీసి ప్రకాశంచేతిలో పెట్టింది. బెల్లం పాత్రకు మూతపెట్టడానికి వెళ్లుతూండగా ఎవరో బయటనుండి వాకిలితట్టారు. బెల్లపుపాత్ర అక్కడేఉంచి ఆమె తలుపు తెరవడానికి వెళ్లింది. ప్రకాశం రెండు గడ్డలు తీసుకుని గబ గబా మ్రింగేశాడు.

*   *   *   *

మర్నాడు పగలంతా ప్రకాశానికి ఒంట్లో కులాసాగానే ఉండింది. అతడు కొద్దిగా జావత్రాగాడు. మెల్లమెల్లగా వాకిలి దగ్గరకు వచ్చి స్నేహితులతో తానుకలిసి ఆడలేక పోయినా, వారు ఆడమంటే చూడగా అతని మనసుకు ఆనదం కల్గింది. పిల్లవాడు బాగై పోయాడని సుఖదతలబంది. ఒకటి రెండురోజులలో డబ్బు చేతిలోకి రాగానే ఆలయానికి వెళ్లి దేవుని పూజించి రావలెననుకుంది.

అవి శీతాకాలం దినాలు. పగలంతా శుభ్రంచేసుకోవడం తోను, స్నాన భోజనాలతోను గడచి పోయిందారోజు. కాని సాయంకాల మయ్యేటప్పటికి ప్రకాశం శరీరం మళ్లీ బరువెక్కింది, సుఖద గాభరాపడ్డది. పూజచేయడానికి ఆలశ్యం చేసినందుకే ఈ బాలపుష్పం ఇలా వాడిపోయిందే మోననే సందేహం ఆమె మనసులో క్షణం బయలుదేరింది. ఇంకా పగలులో కొంతభాగం శేషముంది. ప్రకాశాన్ని పడుకోబెట్టి ఆమె పూజాద్రవ్యం సమకూర్చసాగింది. పూలు ఏమన్నా జమీందారు తోటలో లభ్యమయ్యాయి. తులసీ దళాలు వాకిలిదగ్గరనే ఉన్నాయి. దేవుని నైవేద్యానంతరం నలుగురికీ పంచిపెట్టడానికి వీలవుతుంది. అధమపక్షం అప్పని కి ఒకఅణా డబ్బులుండాలి. బదులెవరైనా ఇస్తారేమోనని గ్రామమంతా గాలించిపారేసింది; ఎవ్వరు ఇవ్వకపోయే టప్పటికి ఆమె ఆశంతా నాశనమైంది; అయ్యో! ఎలాంటి దుర్దినం! ఎవ్వరు నాలుగణాల డబ్బులైనా ఇవ్వడంలేదు. ఆఖరికి ఆమె తన చేతి వెండిగాజులు ఒక వర్తకుని అంగట్లో తాకట్టుపెట్టి డబ్బు పుచ్చుకుని ఇంటికి పరుగెడతూ వచ్చింది. పూజాద్రవ్యం సిద్ధమైంది. ప్రకాశాన్ని చంకలోకి తీసు కొని, రెండవ చేతిలో పూజాసామగ్రి ఉంచబడిన పళ్లాన్ని తీసుకొని దేవాలయం వైపునకు నడిచింది. ఆలయంలో హారతి గంట మ్రోగుతూన్నది. ఒక పది పదిహేనుమంది భక్తులు నించుని మంత్రపుష్పం చెబుతూన్నారు. ఇంతలోనే సుఖద దేవళ సమ్ముఖానికి వెళ్లి నిలబడ్డది.

పూజారి అడిగాడు, "ఏయ్ ఏం చేయడానికి వచ్చావు?"

సుఖద అరుగుమీదికి వచ్చి అన్నది, "దేవునికి మ్రొక్కు కున్నాను స్వామీ. పూజింపడానికి వచ్చాను."

పూజారి పగలంతా ధనికుల సేవిస్తాడు. ఉదయం మటుకు దేవుని పూజిస్తాడు. రాత్రి గుడిలోనే పవ్వళిస్తాడు. గుడి లోనే అతని భోజనం తయారవుతుంది; కనుకనే దేవుని దగ్గర గచ్చంతా నల్లగా అయిపోయింది. స్వభావంవల్ల పూజారి కరుణాంత రంగుడు; నిష్ఠకలిగిన వాడు. ఇటు సూర్యుడటుపొడిచినా, స్నానం చేయకుండా నోట్లో ఒక నీటిచుక్కైనా పోసుకునేవాడు కాదు. కాని ఈమెమీద నిర్దయగా ఉండటం మటుకు అతని దోషం కాదు.

పూజారి అన్నాడు, "అయితే లోపలికి వచ్చేస్తావా ఏమిటి? పూజ ఏనాో అయిపోయింది. ఇక్కడికి వచ్చి అప

విత్రంచేస్తావా ?" ఒక భక్తమహాశయుడు అన్నాడు, "దేవుని పవిత్రం చేయడానికి వచ్చింది కామాలు !"

సుఖద అతిదైన్యంగా అన్నది, "దేవునిచరణ స్పర్శ చేయడానికి వచ్చాను. స్వామీ పూజా సామగ్రంతా తెచ్చి నాను."

పూజారి, "ఎంత తెలివితక్కువగా మాట్లాడుతున్నావు. పిచ్చేమి పట్టలేదుకదా ? నీవు దేవుని పాదాలెలా తాక గలవు ?"

సుఖద కింతవరకెప్పుడు గుడికి రావడానికి అవకాశం దొరకలేదు. ఆశ్చర్యంతో అన్నది, "దేవుడు త్రిలోక పాలకుడు. ఆయన దర్శనంవల్ల పాపాత్ములు సైతం తరిస్తారు కదా, నేను తాకడంవల్ల ఆయన కెలాటి అపవిత్రత కలుగు తుంది ?"

పూజారి, "నువ్వు మాదిగదానివి కదూ ?" గద్దించాడు.

"అయితే ఈశ్వరుడు మాదిగవారిని మటుకు సృష్టించ లేదా ? మాదిగవారికి దేవుడింకొకడా ? పిల్లవాడికి మ్రొక్కు బడి ఉన్నది స్వామీ."

అప్పుడే స్తోత్రం ముగించిన ఇందాకటి భక్తశ్రేష్ఠుడు బెదిరిస్తూ అన్నాడు, "తన్ని పంపించండి. అపవిత్రం చేయడానికి వచ్చింది. పళ్లెము, అది విసిరి పారెయ్యండి. ప్రపంచం తగలబడిపోతుంది. మాదిగవారు సహితం దేవుని పూజించ మొదలెట్టారు."

ఇంకొక భక్తోత్తముడు అన్నాడు, "ఇకమీదట దేవునికి మాదిగకూడు తినాల్సి ఉంటుంది ! కొద్దిరోజుల్లోనే ప్రళయం వస్తుందనడానికి ఏ సందేహము లేదు."

చలివేస్తున్నది ; సుఖద నించుని గజగజలాడుతున్నది. భక్తోద్ధారకులు కాలగతినిగూర్చి ఆలోచనలు సాగిస్తూ ఉన్నారు. చలికారణంగా పిల్లవాడు వక్షంలో దాగుకుంటూ న్నాడు ; కాని సుఖద అక్కడనుండి కదలడంలేదు. ఆమె రెండుపాదాలు భూమిలో పాతుకు పోయాయా అన్నట్లు నించుని ఉంది. ఉండుండి ఆమె హృదయంలో దేవుని చరణాలమీద వ్రాలుదామన్న బలమైన ఉత్కంఠ కల్గుతు న్నది. "దేవుడు వీరికిమటుకేనా, మా బీదవారికి ఆయనతో ఎలాటి సంబంధము లేదా ? మమ్మల్ని అడ్డగించ డానికి వీర వరు ? వీరు నిజంగానే నాపళ్లెము, అవీ విసరివేస్తే నేనేమి చేయడమా అనేభయం కల్గుతూనే ఉంది." సుఖద తన భావ పరంపరను హృదయంలోనే అణచుకొని ఉండిపోతున్నది. హఠాత్తుగా ఆమెకొక ఆలోచన తట్టింది. ఆమె అక్కడి కొంచెందూరం వెళ్లి ఒక వృక్షంక్రింద అంధకారంలో దాగుని భక్తులందరు అక్కడనుండి వెళ్లడానికి నిరీక్షించసాగింది.

(సశేషము)



(14-వ పేజీ తరువాయి)

ఒక్క కత్తిపీట, కూరలసంచి వుంటే చాలు, ఆఫీసులకు, స్కూళ్లకు సకాలానికి వంటచేసి అందించలేక పోతామేమో నన్న బెంగవుండదు. కాయలు కూరలు పిల్లులు తినవు. కాబట్టి వాటి పోరు వుండదు. కట్టెల ఖర్చు ఆదా. కాఫీలకు బదులు నీరా వుంటుందేమో. ఇటువంటి సౌకర్యాలు లాభాలు ఎన్నని చెప్పగలం. అసలు మనదేశం తపోభూమి అంటారు. "హిమశైలంబున కేగి వాయు భక్షణచేసి" తపస్సు చేసిన ఘనులు ఎంతోమంది వున్నారు. మనకిప్పుడు హిమశైలంబున కేగే సత్తువా లేదు ప్రస్తుతం అవకాశము కూడా లేదు. చైనావారు తుపాకులతో హిమశైలాన్ని వెచ్చచేయ చూస్తున్నారు. అందువల్ల మనం మన దేశ మధ్యంలోనే కూర్చుని వాన ప్రస్థాశ్రమ న్యాయంగా జీవితాలు సౌమ్యంగా ఆకులలములతో వెళ్లబుచ్చుకోవలసి వుంటుంది. ధన్యోస్మి !

(25-వ పేజీ తరువాయి)

నీకు సంకల్పసిద్ధి ఉంది. నువ్వు క్షణిక జీవులు కుసుమ జాతిలాగ పరిపూర్తిని పొందావు. నిన్నుగురించి ఎవరైనా ఎప్పుడైనా తలుచుకుంటే, అందులో రాధాకృష్ణుడూ ఒకడు.

నువ్వు నాకిప్పుడు కనిపిస్తున్నావు. ఈ "పద్మవిలాస్" లో కాదు ; దేవతాగణంమధ్య పాలతాలి పీఠంమీద క్షీరాభిషేకంలో... జేజెలబువ్వ జోతిలా...

"రాధాకృష్ణుడూ !" అన్న ప్రియమైనపిలుపు పదంనా కిప్పుడు మృదుమధురంగా వినిపిస్తున్నది. దానితోపాటు ఈ సందేశంకూడా—

"జాతస్యహి ధ్రువోమృత్యుర్ధ్రువంజన్మ మృతస్యచ
తస్మాదపరిహార్యేఽర్థేనత్వంశోచితు మర్హసి."

—గుంటుపల్లి రాధాక్రిష్ణమూర్తి.



# ఆంధ్ర మహిళాసభలో

# దసరా ఉత్సవములు

అక్టోబరు 18, 19, 20 తేదీలు, బుధ, గురు, శుక్రవారములు, ఆంధ్ర మహిళాసభలో దసరా కార్యక్రమము యథాప్రకారముగా నడిచినది. ప్రతిరోజు ఉదయం 8-30 గంటలకు బొమ్మల కొలువు పేరంటము, దేవీ పూజలతో ప్రారంభమై పూజానంతరం పోటీలు జరిగి, తిరిగి సాయంకాలం నృత్య, నాటక, ప్రదర్శనములతో వినోద కాలక్షేపం జరిగినది. ఈ ఉత్సవ నిర్వాహణలో సహకరించి, పాల్గొని, దీని విజయమునకు తోడ్పడ్డ ఆంధ్ర మహిళాసభ కార్య నిర్వాహకవర్గ, సభ్యురాండ్రకు, ఉపాధ్యాయినులకు, అభిమానులకు ఎల్లరకు మా హృదయపూర్వక కృతజ్ఞత. వివిధ కార్యక్రమములను, నిర్వాహకురాండ్రను, పరీక్షాధిపతులను పోటీలలో విజయము పొందిన వారలను, ఈ దిగువ పేర్కొనుచున్నాము.

## ఆటలలో పోటీలు

నిర్వాహణ : శ్రీమతి సి. రత్నావళిగారు, శ్రీమతి కద్రా కమలగారు

15—10—1950 తేదీ-ఆదివారం మధ్యాహ్నము విద్యార్థినులకు, ఆటల పోటీలు జరిగెను. సభ్యురాండ్రకు, సభ్యురాండ్ర పిల్లలకు 19–10–50 తేదీ మధ్యాహ్నము జరిగెను.

## విద్యార్థినుల పోటీలు

జండా పందెము : హీరాదళము. ఓవర్ హెడ్ పందెము : మోతీదళము.

బంతి నందించే పందెము : హీరాదళము.

షీల్డు : హీరాదళము.

విజయము గాంచిన ఒక్కొక్క దళములో పాల్గొన్నవారికి వేరువేరు బహుమతులును, యివ్వబడినవి.

## సభ్యురాండ్రు, వారి పిల్లల పోటీలు

చిన్న పిల్లలకు :—

| పోటీ | బహుమానములు |
|---|---|
| అడ్డాలు తప్పించుకు పరిగెత్తే పందెము. | మొదటి బహుమానము కె. ప్రమీల; రెండవ బహుమానము పి. బాల |
| నిమ్మపండు చంచా పోటీ | మొదటి బహుమానము కె. బాల; రెండవ బహుమానము ఎ. శ్యామల |

పెద్ద పిల్లలకు :—

| పోటీ | బహుమానములు |
|---|---|
| నిమ్మపండు చంచా పోటీ | మొదటి బహుమానము ఆర్. లక్ష్మి; రెండవ బహుమానము ఇందిరా గోపాల్ |
| కత్తుల వెలిగించు పందెము | మొదటి బహుమానము పి. సంపూర్ణమ్మ; రెండవ బహుమానము జి. తిమ్మాబాయి |

* * *



శ్రీమతి పి. సంపూర్ణమ్మ



శ్రీమతి ఆర్. లక్ష్మి



చిరంజీవి కె. ప్రమీళ

# వక్తృత్వ పోటీలు

## ఆంగ్ల భాషలో 17-10-50 మంగళవారం.

విషయము :

ఒక వ్యాసభాగాన్ని గుణ పాఠంచేసి భావయుక్తంగా వప్పగించుట.

మొదటి బహుమానము

ఎన్. సరస్వతి

రెండవ బహుమానము

రమణి పొందిరి.

పరీక్షాధిపతులు :

శ్రీమతి చెల్లమ్మగారు

శ్రీమతి ఇందిరా గోపాల్‌గారు

శ్రీమతి సుమతిగారు

## ఆంధ్ర భాషలో 18-10-50 అష్టమి, బుధవారం

నిర్వాహణ : శ్రీమతి అ. గిరిజగారు

విషయములు :

స్త్రీ స్వాతంత్ర్యమంటే ఏమిటి ?

బిచ్చగాళ్ల సమస్య మాన్ప గలమా ?

సీనియర్సు

మొదటి బహుమానము

ఆర్. లక్ష్మి

రెండవ బహుమానము

వి. ప్రభావతి

విషయములు :

దసరా ఉత్సవములు.

పరీక్షలు అవుసరమా లేదా ?

జూనియర్సు

మొదటి బహుమానము

కె. ప్రమీల

రెండవ బహుమానము

ఎ. లక్ష్మీకామేశ్వరి

పరీక్షాధిపతులు :

శ్రీ పందిరి మల్లిఖార్జున రావుగారు

శ్రీ గంధం అప్పారావుగారు

శ్రీమతి వి. రాజ్యలక్ష్మిగారు.

*　*　*

# దసరా ఉత్సవములు

## హిందీ భాషలో 19-10-50 మహర్నవమి, గురువారం

నిర్వహణ : శ్రీమతి టి. సుశీలగారు

**సీనియర్సు**

విషయములు :

సహశిక్ష

విజ్ఞానమువల్ల లాభనష్టములు.

మొదటి బహుమానము

ఇందిరా గోపాల్

రెండవ బహుమానము

ఇందుమతి శంఘావి ?

పరీక్షాధిపతులు :

శ్రీమతి గిరిజగారు

శ్రీమతి రంగనాయకమ్మగారు

శ్రీ కృష్ణమూర్తిగారు

**జూనియర్సు**

విషయములు :

ఒక వ్యాసభాగాన్ని గుణపాఠం చేసి భావయుక్తంగా వప్పగించుట.

మొదటి బహుమానము

ఇందిరా గోపాల్

రెండవ బహుమానము

ఎ. లక్ష్మీకామేశ్వరి

పరీక్షాధిపతులు :

శ్రీమతి గిరిజగారు

శ్రీమతి రంగనాయకమ్మగారు

శ్రీ కృష్ణమూర్తిగారు

*　*　*



చిరంజీవి ఎమ్. కృష్ణకుమారి



చిరంజీవి ఎన్. సరస్వతి



చిరంజీవి పి. వేదవతి

## పాటలలో పోటీలు 20-10-50

నిర్వాహణ : శ్రీమతి ఆర్. కమలాబాయిగారు

**వీణ**

మొదటి బహుమానము

పి. వేదవతి

గుళ్లపల్లి కల్పక సుబ్బలక్ష్మి స్మారక బహుమానం

బి. సీత

**గాత్ర**

మొదటి బహుమానము

ఎమ్. కృష్ణకుమారి

రెండవ బహుమానము

ఎస్. రాజ్యలక్ష్మి

పరీక్షాధిపతులు :

శ్రీమతి టి. అహల్యాగారు

శ్రీమతి పి. శకుంతలమ్మగారు

శ్రీ పార్థసారథిగారు

పాటల పోటీలలో పై మూడు బహుమానములు ఈ సంవత్సరము శ్రీమతి పి. శకుంతలమ్మగారు కొనియిచ్చిన్నారు. వీరికి మా కృతజ్ఞత.

# దసరా ఉత్సవములు

## నాటకములు

18–10–50 దుర్గాష్టమి, బుధవారం సాయంకాలము 6 గంటలకు శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యగారి కుమార్తెలు కోడండ్రు, మనుమరాండ్రు కలిసి, శ్రీ కృష్ణ తులాభార నాటకమును చక్కగా ప్రదర్శించిరి. ఈ ప్రదర్శనమునకు ఆహ్వానితులయిన శ్రీ స్థానం నరసింహారావుగారు ఈ పాత్రధారు నటనా కౌశల్యమును అభినందించిరి. ఒకనాటి కార్యక్రమముయొక్క భారమునంతయు వహించి నిర్వహించిన, శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యగారి కుటుంబమునకు మాహృదయపూర్వక కృతజ్ఞత.

19–10–50 మహర్నవమి గురువారం సాయంకాలము 6 గంటలకు సభ వివిధ తరగతుల విద్యార్థినులచే నాటక ప్రదర్శన పోటీలు. అన్ని ప్రదర్శనములలో సీనియరు క్లాసు విద్యార్థినులు నటించిన "తీర్పు" అనే నాటక ప్రదర్శనము ఉత్తమమైనదిగా ఈ సంవత్సరపు షీల్డును పొందినది.

సీనియరు తరగతి
తీర్పు

జూనియరు తరగతి
ఆస్థిపాస్తులా–ఆదర్శమా ?

సబ్ జూనియరు,
ఆస్థికొరకు

పారిశ్రామిక శాఖ
పాటకచ్చేరీ.

సీనియర్సు : మొదటి బహుమానము
పి. కృష్ణవేణి
రెండవ బహుమానము
వి. ప్రభావతి

జూనియర్సు : మొదటి బహుమానము
పి. రాజేశ్వరి
రెండవ బహుమానము
సి. యశోద

సబ్ జూనియర్సు : మొదటి బహుమానము
ఎస్. రాజ్యలక్ష్మి
రెండవ బహుమానము
సి. హెచ్. రుక్మిణి

పారిశ్రామిక శాఖ : మొదటి బహుమానము
వి. అన్నపూర్ణ
రెండవ బహుమానము
ఎమ్. కమలాబాయి

పరీక్షాధిపతులు :

శ్రీ లింగమూర్తిగారు

శ్రీమతి శాంతకుమారిగారు

శ్రీ డాక్టరు అవధానిగారు



చిరంజీవి ఎస్. రాజ్యలక్ష్మి



చిరంజీవి పి. రాజేశ్వరి



చిరంజీవి పి. కృష్ణవేణి



చిరంజీవి వి. అన్నపూర్ణ

(తరువాయి 58వ పేజీలో)

# గ్రీకుల నాగరికత

డాక్టరు వారణాశి యశోదాదేవి

గ్రీకుల నాగరికత బహు ప్రాచీనము. గ్రీసు దేశము ప్రస్తుతము ప్రపంచమంతటిలోను మిక్కిలి నాగరికులైన పాశ్చాత్యుల నాగరికతకు పుట్టినిల్లు. కాని హైందవ, చైనా, యీజిప్టు మొదలగు ప్రాచ్యదేశీయుల నాగరికతకన్న గ్రీకుల నాగరికత తర్వాతిదే. గ్రీసు సామ్రాజ్యము ఒకప్పుడు భారతావనిలోనికి చొచ్చుకొని వచ్చి గ్రీకుల హైందవుల సంబంధ బాంధవ్యములకు కారణమగుటయేగాక, మన రాజ్యాంగ స్థితి, నాణెములు, కళలు, శిల్పములపై తన ముద్రల శాశ్వతముగ విరచించియున్నది.

గ్రీసు భౌతిక స్వరూపము, గ్రీకుల నాగరికతాభివృద్ధికి తోడయ్యెను. దేశమంతయు కొండలు, అగ్రములు, ద్వీపములు, సముద్రములతో నిండియున్నది. గ్రీసు దేశపటమును జూచిన, అది సముద్రునిచే ముట్టడింప బడినట్లు కన్పడును. కారింతు జలసంధి, ఏజియను సముద్రమువల్ల నీటి మార్గములు ముఖ్యమై, గ్రీకుల నాగరికతా సృష్టిని అనేక జాతుల కలయికకు తోడ్పడెను. చిన్న చిన్న కొండలు దేశమును విభజించి దేశ చారిత్రమును చిన్న చిన్న స్వతంత్ర రాజ్యముల చరిత్రగా మార్చెను.

క్రీ. పూ. 3000 సం॥ ప్రాంతాన గ్రీకులు గ్రీసు దేశములోనికి వచ్చియుందురు. గ్రీకు భాష చాల గొప్పది. ఆకర్షణంతమైనది. గ్రీకులు ఆక్రమించిన దేశములందెల్ల గ్రీకు భాష వ్యాపించి, వారు నిల్చిన స్థానములందెల్ల నది దేశ భాష యయ్యెను. ఆయాదేశములందలి ప్రాత క్రొత్త నాగరికతలు సమ్మిళితమై జాతీయత అభివృద్ధి చెందెను.

క్రీట్సు, వెలలాస్ మొదలగు ఏజియను సముద్రములోని ద్వీపములలో వృద్ధిచెందిన నాగరికత, తదుపరి గ్రీసు దేశములోని మైసునియను నాగరికతకు మూలకందము. క్రేటులోని Cnossus కొండపై క్రీ. పూ. 2100 సం॥ ప్రాంతాన ఒక భవనమును, ఫేస్టసులో మరొక ప్రాసాదమును కట్టబడెను. ఇవి కొన్ని వందల సంవత్సరములు నిల్చియుండెను. క్రేటనుల చిత్రకళా చాతుర్యము మట్టి పాత్రలపై చిత్రింపబడిన వర్ణ చిత్రములవల్ల దృగ్గోచరమగుచున్నది. క్రేటనులు వ్రాయుట నేర్చియుండిరి. ఎద్దుతల, ద్వారము, కన్ను, యీ విధమగు బొమ్మలు గుర్తులుగ వారు వ్రాయుచుండిరి. Mount Dicto లో పైభాషలో వ్రాయబడి పానీయము ఉమర్చబడెను మేజా వ్రాయబడి యున్నది.

క్రేటానులోకంటె చెక్కుడుగ ఏజియను నాగరికత మిలాస్‌లో వృద్ధిచెందెను. ట్రాయి కొండలపై పట్నములు యేడును ఒకదాని శిథిలములపై మరొకటి కట్టబడెను. ఇందు కోటలు, రాజ భవనములు చాల చక్కగ నుండెను. క్రీ. పూ. 1500 ప్రాంతమున Cnossus పాలించిన రాజులు వారి భవనములను నూతన విధమున తీర్చికట్టిరి. దీని ఆవరణ ఐదుమైళ్లు; ప్రాకారపు గోడ లేదు. రక్షణకు పడవలే యాధారములు. కుళాయిలు, నీటి గృహములు, డ్రెయినేజి, కుడ్యములలోకి కట్టబడిన బావులు, భవనములలో నుండెను. రాజ భవనము రాజ నివాసస్థానమే కాదు, సాగరాంతర సామ్రాజ్య రాజ్యాంగముండెడు స్థలము. రాజులకు వచ్చు గొప్ప కప్పములు, బహుమానములు, యీ భవనములో జాగ్రత్త పెట్టుచుండిరి. ఇందు రాజసింహాసన మొక ప్రత్యేకపు గదియందుంపబడుచుండెను. ఇందు రాజు మంత్రులతో సభ తీర్చుచుండువాడట. గదులలోను, వసారాలందును కుడ్యములపై పౌర జీవనమందు స్త్రీ పురుషులకు సంబంధించిన దృశ్యములు రంగురంగులతో చిత్ర విచిత్రముగ వ్రాయబడినవి. కొన్ని గోడలపై బొమ్మలలో స్త్రీలు ఆస్థానములలోను, డాబాలమీద చక్కగా కురులు దువ్వి, అలంకరించుకొని, నాగరిక దుస్తులలో నున్నట్లు చిత్రింపబడిరి. చిత్రకారులకు, శిల్పులకు రాజోద్యోగములుండెడివి. రంగులు చేయబడుట, శిల్పుల అంగళ్లు, వీని గూర్చిన సూచనలు గలవు.

# గ్రీకుల నాగరికత

Cnossus రాజభవనము దగ్గర నాల్గువందలమంది ప్రేక్షకులు కూర్చొనుటకు వీలైన నాటకశాల కలదు. ఇందు సంగీత కచ్చేరీవారు కూర్చొను స్థానము వర్తులాకారంగా కాక చతురముగ నున్నది. ఇందు క్రేటను దేవతలకు సంబంధించిన మత సంబంధమైన ఆటలు, నృత్యములు, ఎద్దుల పోరాటములు జరుపబడు చుండెను. వీనిలో స్త్రీలు పాల్గొను చుండిరి. క్రేటులో దేవాలయములు, భవనములలో చిన్న చిన్న పూజాగృహములు వుండెను. వీరి ముఖ్యదేవత మారి. Rhea శిల్పమందు యీ దేవత సింహములచే రక్షితమైనట్లు చూపబడియున్నది. తర్వాత గ్రీకులు Rhea కొడుకు Zeusను పూజించుచుండిరి. ఈ దేవుడు, దేవతతో గొడ్డలి కూడ పూజితమగుచు తరచుగ భవనములపై చిత్రితమై యున్నది. క్రేటనులు గణితశాస్త్రము, దశాంశములు, భిన్నములు అన్నియు బాగుగ నేర్చియుండిరి. బంగారు, వెండి నాణెములుండెను.

క్రేటు తర్వాత గ్రీసులో మైసీనియను నాగరికత క్రీ. పూ. 1600 నుండి 1100 సంll వరకు వ్యాపించెను. సుప్రసిద్ధమగు టైరన్సుకోట శిల్ప పద్ధతిని సైక్లోపియన్ అందురు. ఏలనన, సైక్లోప్స్ అను శిల్పులను, టైరన్సు గోడల కట్టుటకై, విసియానుండి పిల్పించిరి. ఈ కోట దక్షిణపు గోడలోపల సామానుల గదులు కట్టుటకై చాల లోతుగ కట్టబడి యున్నది. మైసీన్ కోట కొండపై ఎత్తైన స్థలమున సైక్లోపియను పద్ధతిలోనే చిన్న చిన్న రాళ్లతో ముక్కోణాకారముగ కట్టబడినది. కొన్ని శిఖరములు చాల వింతగ, చక్కగ పెట్టబడ్డవి. కొండ క్రింద నీటి జలనుంచి ఒకవైపు, కోటలోపలినుంచి గోడలోనికి పెట్టబడెను. కోటకు రెండు ద్వారములలో ఒక ద్వారముపై రెండు ఆడు సింహములు ఒకదానికొకటి యెదురుగ నిలబడి ఒక స్తంభముపై వాని ముంగాళ్ల నుంచి యున్నట్లు చిత్రితమైనది. కావలివలెనున్న ఈ సింహముల మూలమున ద్వారమునకు సింహద్వారమని (Lion's Gate) పేరు వచ్చెను. టైరన్సు భవనములో స్త్రీ పురుష నివాసస్థానములు వేర్వేరుగ నిర్మింపబడినవి. ఈ పద్ధతి గ్రీసు శిల్పమున బహుకాలము నిల్చియుండెను. రాణుల శాలలు ప్రక్క ప్రక్కన కట్టబడియు, ఒకదానిలోనుండి మరొకదానికి ద్వారములు లేవు. పురుషుల భవనము ముందు పెరటి ఆవరణలో ఒక మండపములో దేవతలు పూజింపబడుచుండిరి. భవనము మధ్య అగ్ని స్థానము గోపురము త్రికోణాకారముగ ఎరుపు, నీలము, తెలుపు రంగులలో బాగుగ కట్టబడి యుండెను. నేల కొన్ని స్థలములందు చక్కగ సిమెంటు చేయబడియు, మరికొన్ని స్థలముల చిన్న గులకరాళ్లతో సిమెంటు యింకను గట్టిగ చేయబడియు, కొన్ని స్థలములలో నేల అనేక రంగులతో, డిజైనులతో అలంకృతమై యున్నది. కుడ్యములు శిల్పముతోను వర్ణ చిత్రములతోను నిండి యున్నవి. రెండు తలుపులుగల ద్వారములుండెను. ఇచట గ్రామములకు చుట్టు ప్రాకారపు గోడలు, భవనములలో పొగ గొట్టములు గలవు.

హోమరు కావ్యములు—ఒడిస్సీ, ఇలియడ్—గ్రీకు సాంఘిక జీవితమును ప్రతిబింబించు చున్నవి. యుద్ధము లేనపుడు సంఘ జీవనము—విందు భోజనములు, వీధులలో పెండ్లి కుమార్తెలను అత్తవారిండ్లకు తీసికొని వెళ్లు పూరేగింపులు, ఈ కావ్యములలో వర్ణింపబడినది. గ్రీకు భట్రాజులు ట్రోజను యుద్ధములను షట్పది పద్యములలో పాడుచుండిరి.

మన దేశములో గాంధారమున—అనగా పెషావర్ కాబూల్ నది, స్వెట్, బునార్, పంజాబులో పశ్చిమ భాగము—వృద్ధిబొందిన గాంధార శిల్పకళలో గ్రీకు—Hellenistic శిల్పము చాల కలిసియున్నది. గాంధార శిల్పములో యిండో గ్రీకు శిల్పులు గ్రీకు శిల్పములోని స్తంభములు మొదలగునవి, బౌద్ధ గాంధార శిల్పములో సమ్మేళనము చేసియుండిరి. ప్రస్తుతపు గుర్దాస్పూరు జిల్లాలో బియాస్ నది తీరమున అలెగ్జాండరు పండ్రెండు దేవుళ్లకు పన్నెండు ఆలయములు గట్టించి శాస్త్రోక్తముగ పూజలు, ఆటలు, వుత్సవములు జరిపించెను. యీ దేవుళ్లను మౌర్య చంద్రగుప్తుడు, తర్వాతి రాజులుకూడ పూజించుచుండిరట. ప్రాచీన గ్రీకు నాగరికతా చిహ్నములు యీ విధముగ అనేక దేశములలో గానవచ్చుచున్నవి.

(ఆలిండియా రేడియో సౌజన్యములో)




# ఓర్పుగల సుశీల

* రావికంటి శివాజీరావు *

అనగా అనగా ఒక రాజు. ఆ రాజుకు శారద, సుశీల, లీల, అను ముగ్గురు కుమార్తెలు కలరు. శారద, లీల, సుశీలను అసూయగాచూస్తూ కష్టపెట్టు చుండెడివారు. ఒక రోజు రాజు పనిమీద ఊరికి వెళ్లుచూ వారి ముగ్గురిని ఎవరికేమి కావలెనని అడిగెను. శారద తనకి మువ్వల వడ్డాణము కావలెనని, లీల తనకు కాసులపేరు కావలెనని, సుశీల తనకు ఎప్పుడూ వాడని గులాబీ పూవు కావలెనని అడిగెను. అలాగేనని రాజు బయలుదేరెను. కాసులపేరు, వడ్డాణము కొని గులాబీ పూవుకోసం చాలాచోట్ల తిరిగి తిరిగి ఒక వనమునకు చేరెను. ఆ వనములో గులాబీ చెట్టును చూచెను. రాజు ఆ గులాబీ చెట్టును పూచిన పూవును కోస్తూవుండగా ఒక రాక్షసుడు వచ్చి "ఈ గులాబీపూవు ఎవరి కిచ్చెదవో ఆ పిల్లను నాకిచ్చి పెండ్లిచేయవలెన"ని అడిగెను. సరేనని రాజు తన రాజ్యమునకు వచ్చి ఆ సంగతి తన కుమార్తెతో చెప్పెను. సుశీల సంతోషముతో ఆ రాక్షసుని వివాహ మాడుటకు వప్పుకొనెను.

రాజు సుశీలను రాక్షసునితో పంపించెను. ఒకనాడు సుశీల తన యింట్లో అద్దంముందు తల దువ్వుకొనుచుండగా తన తండ్రి జబ్బుతో వున్నట్లు కనబడెను. వెంటనే తన భర్త అగు రాక్షసునితో "నేను యింటికి వెళ్లెదను మా నాన్నకు జబ్బుగా వున్నద"ని చెప్పెను. సరే వెళ్లు కాని మళ్లా మంగళవారమునాటికి నీవు రావలెను. లేకపోతే నేను చచ్చిపోతాన"ని రాక్షసుడు చెప్పెను. ఆతృతతో సుశీల తన యింటికి చేరెను. వారము రోజులు గడిచెను. బుధవారము వచ్చెను. శారదని, లీలని, ఏమి వారమని సుశీల అడుగగా వారు చెప్ప లేదు. అప్పుడు తండ్రిని అడిగెను. అప్పుడు తండ్రి ఆరోజు బుధవారమని చెప్పెను. వెంటనే దుఃఖముతో సుశీల అడవికి బయలుదేరెను. అక్కడికిపోయి చూడగా ఒక కొలనువద్ద రాక్ష

(తరువాయి ౩౩వ పేజీలో)

# 'మన శరీరంలో పంచదార కథ'

❋ శ్రీ జి. చిదంబరరావు ❋

[మీకందరకూ పంచదార అంటే యిష్టంకదూ! పటికి బెల్లం, పెప్పర మెంట్లు, మీనాన్న ఎప్పుడూ తెచ్చిపెడ్తూ ఉంటారా? వంటయింట్లోకి వెళ్లి మీ అమ్మను పంచదార పెట్టమని మాటమాటికీ వేధిస్తారా? ఆ పంచదార మీవంటికి ఎంత అవసరమో, మీ శరీరంలో పంచదార తయారుచేసి అవసరానవసరాలను గ్రహించి, రేషన్ చేసే యంత్రాలు ఎట్లా ఉన్నాయో! మీరీ రచనలో చదువుతారు.]

---

మన శరీరంలో పంచదార కథ చాలా విచిత్రంగా ఉంటుంది. మన ప్రాణానికి పంచదార ఎంత అవసరమంటే అది లేకపోతే మన ప్రాణం పోక తప్పదు. పంచదార లేకపోతే ప్రాణం పోవడం ఎలా తప్పదో అలాగే పంచదార మన రక్తంలో ఎక్కువైనా కూడా ప్రాణాపాయమే. అయితే పంచదారకి మన ప్రాణానికి ఎల్లాంటి సంబంధ బాంధవ్యం ఉందో మనం గుర్తించాలి.

మనం తినే ఆహారపదార్థాలు ముఖ్యంగా పిండి పదార్థం, క్రొవ్వు పదార్థం, మాంసకృత్తులు అని మూడు రకాలుగా ఉన్నాయి. ఆ మూడింట్లోను పిండి పదార్థాన్ని మనం ఎక్కువగా స్వీకరిస్తాం. అంతకంటె తక్కువ తింటాం మాంసకృత్తులని. అంతకంటే తక్కువుంటుంది మనం తినే క్రొవ్వు పదార్థం. అంటే మనం అనునిత్యం కలుపుకుతినే పప్పు అన్నంలో అన్నం ఎంతో అంతకంటె తక్కువ పప్పు, అంతకంటె తక్కువ నెయ్యి ఉంటాయి. అన్నం పిండి పదార్థం, పప్పు మాంసకృత్తు, నెయ్యి క్రొవ్వు పదార్థం. పిండి పదార్థంవల్ల మనకి శక్తొస్తుంది కనక దాన్ని శక్తి జనకం అంటారు. పప్పువల్ల కణజాలాలు వృద్ధిపొంది కండ పుష్టికలిగి శరీరం పెరిగి బలం చేకూరుతుంది కనుక అల్లాంటి మాంసకృత్తులని దేహనిర్మాణకాలంటారు. నెయ్యి శరీరానికి వేడినిస్తుంది కాబట్టి అల్లాంటి క్రొవ్వు పదార్థాన్ని ఉష్ణ జనకం అంటారు. ఏ ఆహారపదార్థాన్ని మనం తిన్నా అది అరిగి, రక్తంలోకి చొరబడి ఒంటబట్టాలి. అలా ఒంటబడితేనే ఆహారంవల్ల లాభాన్ని మనం పొందగలం.

మనం ఎక్కువగా తినేది, సులభంగా జీర్ణమయేది పిండి పదార్థం. వరన్నం, జొన్నన్నం, గోధుమ మొదలైనవన్నీ పిండి పదార్థాలే. పిండి పదార్థం జీర్ణము కావాలంటే అది పంచదారగా మారి రక్తంలోకి జొరపడాలి. నోట్లో లాలా జలగ్రంథులున్నాయి. అవి, నాళ సహితమైన గ్రంధులు. వాట్లో లాలాజలం ఊరుతుంది. ఆ లాలాజలంలో 'టయాలిన్' అనే ఒక పొంగు పదార్థం (Ferment) ఉంటుంది. దానివల్ల పిండి పదార్థం పంచదారగా మారి జీర్ణమౌతుంది అందుచేతనే మనం అన్నాన్ని బాగా నమిలి తినాలి. అల్లా తింటే నోటికి తీపితగిలి

రుచిగా ఉండి చాలాభాగం పిండిపదార్థం పంచదారగామారి జీర్ణమై రక్తంలోకి చొరపడుతుంది. పొట్టలో జఠరగ్రంథులు అనేకమున్నాయి. అవి కూడా నాళసహితమైన గ్రంథులే. వాటిలో ఊరే జఠర రసంలో ఉన్న 'పెప్సిను' 'రెనిన్ను' అనే పొంగుపదార్థాలవల్ల మాంసకృత్తులు జీర్ణమౌతాయి. వృక్వకం (Pancreas) అనే ఒక పొడవైన గ్రంథి పొట్టక్రింద అమరి ఉంది. అది కూడా నాళసహితమైనదే. దాన్లో మధురరసం ఊరుతుంది. ఆ మధురరసంలో మూడు పొంగు పదార్థాలుంటాయి. ఒకపొంగు పధార్థం పిండిని పంచదారగామార్చి జీర్ణం చేస్తుంది. మరొకటి మాంసకృత్తులని యమనామ్లములుగా మార్చి జీర్ణం చేస్తుంది. మూడవది పైత్యరసంతో కలిసి క్రొవ్వు ద్రార్థాన్ని మథనం చేసి క్షీరపాకంగా మార్చి జీర్ణం చేస్తుంది. కాలేయం ఒక పెద్ద నాళసహితమైన గ్రంథి. అది గర్భ కుహరంలో కుడిప్రక్కని అమరిఉంది. దాన్లో పైత్యరసం ఊరి, పిత్తాశయం (Gall bladder)లో నిలవుండి, పైత్యనాళంద్వారా చిన్న ప్రేగుల్లోకి ప్రవహిస్తుంది. చిన్న ప్రేగుల్లో ఆంత్రరసగ్రంథులున్నాయి. వాట్లో ఆంత్రరసం ఊరుతుంది. అది కూడా జీర్ణక్రియకి తోడ్పడుతుంది.

పంచదారలో సంయోగించియున్న మూల పదార్థాలు కర్బనం, ఉదజని, ఆమ్లజని. రచన ఒకటే అయినా చాలా రకాల పంచదారలున్నాయి. గ్లూకోసని, ఫ్రక్టోసని, చెరుకు పంచదారని అనేక రకాలున్నాయి. అన్నింటిలోను సంయోగించి ఉన్న మూల పదార్థాలు మాత్రం కర్బనం, ఉదజని, ఆమ్లజని, గ్లూకోసుని తింటే వెంటనే రక్తంలోకి చొరబడి బలాన్ని చేకూరుస్తుంది పటికి పంచదార అటువంటిదే. చెరుకుపానకంలోకూడా అదేశక్తి ఉంది. కాఫీకి బదులు చెరుకు పానకంలో పాలు వేసుకుని తాగుతే అమితమైన బలం చేకూరుతుంది. పిండి పదార్థం పంచదారగా మారుతేనే గాని శరీరానికి లాభంలేదు. చిన్న ప్రేగుల్లోంచి పంచదార రక్తంలోకి గ్రహింపబడి కాలేయానికి చేరుతుంది. రక్తంలో పంచదార ఎక్కువైతే అది మూత్రంద్వారా విసర్జింపబడి అతిమూత్రం వస్తుంది. అతిమూత్రం అనే వ్యాధి వస్తే శరీరం గుల్లై ప్రాణహాని తప్పదు. శరీరంలో తయారైన పంచదారని కాలేయం తీసుకొని అవసరమైన రీతిగా రక్తానికందిస్తుంది. దాన్నే కాలేయంయొక్క గ్లైకొజను పని అంటారు. పంచదార శరీరానికి చరాస్తి; గ్లైకొజను స్థిరాస్తి.

పంచదార క్షేమనింగు శరీరంలో బాగా జరగాలంటే కాలేయం, వృక్వకం కలిసిపని చెయ్యాలి. వినాళగ్రంథులుకొన్ని మన శరీరంలోఉన్నాయి, అవి సూప్రారీనలు, థైరోయడు, పిట్యూటరీ మొదలైన గ్రంథులు. వృక్వకం (Pancreas) అనే గ్రంది వినాళగ్రంథిగాకూడా పనిచేస్తూంది. Iselets అనే కణాలు అందులో ఉన్నాయి. వృక్వకంలో ఒకరసంఊరి పంచదారని శరీరం ఉపయోగించుకునేలాగు చేస్తుంది. శరీరానికి పంచదార వంటచెరకులాంటిది. ఆ వంటచెరకు ఉంటేనేగాని, జీవంతో కూడుకున్న

మానవ యంత్రం పనిచెయ్యలేదు. శరీరంలో పంచదార వంటచెరకులాగ కాలాలి. అంటే అందులో ఉన్న బొగ్గు మండాలి. శరీరంలో పంచదారని కాల్చడానికి వృక్వకం తోడ్పడుతుంది. వృక్వకం పనిచెయ్యకపోతే శరీరంలో పంచదార మండదు. నిలవైన పంచదార రక్తం లోంచి మూత్రంద్వారా విసర్జింపబడుతుంది. దానివల్లనే అతిమూత్రం అనే వ్యాధి వచ్చి శరీరానికి మరణం సంభవిస్తుంది. అతిమూత్రానికి ఇన్‌సులీన్ అనే పదార్థాన్ని వృక్వకంలోంచి తయారుచేసి రక్తంలోనికి ఎక్కిస్తారు. దానివలన పంచదార వెంటనే తగ్గుతుంది. కాబట్టి ఇన్‌సులీన్ యిచ్చేముందు పంచదార నిస్తారు. వృక్వకం తయారుచేసిన ఇన్‌సులీన్ రక్తంలోకొచ్చి పంచదారని తగుకీతిగా ఉపయోగించేటట్టు చేసి శరీరానికి జీవశక్తిని కల్పిస్తుంది.

Adrenals లేక Suprarenal అనే వినాళ గ్రంథులు మూత్రపిండాలమీద ఉన్నాయి. వాటివల్ల అనే హార్మోను తయారై రక్తంలో కొస్తుంది. అప్పుడు కాలేయం నిలవ చేసిన గ్లైకొజను పంచదారగా మారి రక్తంలో కొచ్చి, యుద్ధానికి ఢీకొనడానికి వీలైనంతశక్తి శరీరానికి లభిస్తుంది. ఈ విధంగా నాళ సహితమైన గ్రంథులైన కాలేయ, వృక్వకాలు వినాళ గ్రంథులైన ఎడ్రినలు, వృక్వకాలు, కలిసి మన శరీరంలో పంచదార కథకి జీవాన్నిపోసి సక్రమంగా నడిపిస్తూంటే శరీరం శక్తి సామర్థ్యాలతో జీవయాత్రని గడపగలదు.



(35వ పేజీ తరువాయి)

సుడు చచ్చి పడియుండెను. అప్పుడు సుశీల తన దోసెడుతో మూడు సారులు నీళ్లు అతనిపై జల్లెను. వెంటనే ఆ రాక్షసుఁడు ఒక రాజుకుమారుని రూపులో లేచి కూర్చొనెను. "ఏమి యిటుల అయితివ"ని సుశీల అడుగగా "నేను ఒక రాజు కుమారుడను. ఒక ముని శాపంవల్ల నేనిటుల అయితిన"ని ఆ రాజకుమారుఁడు చెప్పెను. అప్పుడు వారిద్దరు రాజువద్దకు వచ్చిరి. రాజు ఆశ్చర్యపడి సంగతినంత కనుకొ్కని వారిద్దరికి అతి వైభవముగ పెండ్లి చేసెను. శారద లీలలకు యిదంతా చూచి మరింత ఈర్ష్య ఎక్కువయినది. సుశీల ఆమె భర్తతో హాయిగ నుండెను.

(24వ పేజీ తరువాయి)

బాధించి నీవు, ఈ పక్షి 'నాది' అని యనుచున్నాడవు! అట్లుగాదు, నేను దాని సంరక్షకుడను, ఇదినాదియేయని నేను వాదించుచున్నాడను! నిదానించి చూడుము!—ఆ పక్షియే మనకు తీర్పు చెప్పచున్నయది!—అది నిన్నుజూచి భయకంపిత గాత్రయై దూరముగ దొలగిపోవుచున్నది! నన్నుజూచిననో,—సంతోషముతో సమీపమునకు వచ్చుచున్నది!—ఇప్పుడు చెప్పుము దేవదత్తా! ఆ పక్షి నీది యగునో—నాది యగునో?

దే: (వినయముతో, నమస్కరించి) సిద్ధార్థా! మహాత్మా క్షమింపుము?

గీ॥ అల్పుడను నిన్ను గుర్తింప—నైతి; గాజు
రాయి రత్నమటంచును—గోయిబడితి!
రత్నమును గాంచితిని, జ్ఞాన—రత్నమదియ
ధన్యుడను నీ సుబోధతో—ధన్యతముడ!!

ఇంకపోవుదము రమ్ము! (ఇరువురు వెళ్లుచుండగా)
(తెర) (సశేషము)



హిందీ మూలం:
సియారాంశరణ గుప్త.

# పిన్ని

అనువాదం:
శ్రీమతి క. రంగనాయకమ్మ.

ఆ రోజు ప్రొద్దున్న "శ్యామూ" కళ్ళు తెరచేటప్పటికి యిల్లంతా గందరగోళంగా వుంది. తన పిన్ని "ఉమా"కు ఆ పాదమస్తకం దుప్పటి కప్పి క్రింద పడుకోబెట్టి, యింటిల్లపాది చుట్టూచేరి పెద్దగా యేడుస్తున్నారు.

ఆమెను తీసుకెళ్లేటప్పటికి శ్యామూనెవ్వరూ పట్టుకోలేక పోయినారు. అతడందరి చేతులు విదిలించుకొని వెళ్ళి "మా పిన్ని నిద్రపోతూవుంటే మీరంతా యెందుకామెను యెత్తుకొని పోతారు. ఆమె మేలుకుంటే నన్ను విడిచిపెట్టి వెళ్ళనే వెళ్ళదు. అప్పుడామెను నేను విడవను," అంటూ యేడవడం ప్రారంభించాడు.

ఎంతో కష్టంమీద విడిపించి, వారిముసలి దాది, అతనిని సముదాయిస్తూ పిలుచుకు పోయింది.

ఇంట్లో వారందరూ అతను దిగులుపడతాడని పిన్ని వాళ్ళ మామగారి యింటికి వెళ్ళింది, యిదుగో యిప్పుడొస్తుంది, అదుగో అప్పుడొస్తుందని, కొద్దిరోజులు మఱిపించారు. కాని అసత్యావరణంలో సత్యం దాగలేకపోయింది. శ్యామూ తన సహపాఠుల ద్వారా తన పిన్ని దేవునియొద్దకు వెళ్ళినది మఱి తిరిగిరాదనే విషయం తెలుసుకున్నాడు. రోజుల తఱబడి ఆమె కొఱకు యేడ్చాడు. ఏడ్చి ఏడ్చి మఱియేడవ లేక పోయినాడు కాని, కడుపులో దుఃఖం మాత్రం ఆవగింజంతైనా తగ్గలేదు. పెద్ద వర్షం కురిసిన తరువాత భూమిమీద నీరెండిపోయి నప్పటికి, భూగర్భంలో మాత్రం ఆ తడి యెప్పుడూ వుంటూనే వున్నట్లు, అతని కంటినీరు యెండిపోయి నప్పటికీ, కడుపులో కలత తగ్గలేదు. ఎప్పుడూ పిన్నికోసం ఆకాశంవేపు నిరీక్షిస్తూ కూర్చునే వాడు.

ఇట్లా కూర్చుని చూస్తూ వుండగా వొకరోజు, అతనొక గాలిపటం యెగురుతుండడం చూచాడు. మనస్సులో యేం తోచిందో, వొక్కమాటు సంతోషంతో వుప్పొంగి పోయినాడు. వెంటనే తన పినతండ్రి "విశ్వేశ్వరుడి" దగ్గరకు వెళ్ళి:—"బాబా! నాకొక్క గాలిపటం కొనియ్యి. ఇప్పుడే కావాలి—"అని అడిగాడు.

భార్య చనిపోయినప్పటినుండి విశ్వేశ్వరుడు చాలా దిగులుగా ఉంటున్నాడు. కనుక శ్యామూకు జవాబుగా "కొనిస్తాలే"—అంటూ బయిటికి వెళ్ళిపోయినాడు.

అయితే శ్యామూ గాలిపటం కొనుక్కోకుండా వొక్క క్షణంకూడా ఆగలేక పోయినాడు. కాని యేంచేస్తాడూ? పినతండ్రి కొని యిచ్చేదాకా మనస్సును పట్టుకోలేక పోయినాడు. అయితే కొనుక్కోడానికి డబ్బేది? ఏమీ పాలుపోక తల పైకెత్తాడు. ఎదురుగ్గా గోడనున్న మేకుకు పినతండ్రి కోటు వ్రేళ్ళాడుతోంది. ఇటూ అటూ చూసి, వొక ముక్కాలుపీట ఆ మేకుకు దగ్గరగా, మెల్లిగా జరిపి, దానిమీద యెక్కి కోటుజేబు తడిమాడు. అందులో వొక్క "కానీ" వుంది; దాన్ని తీసికొని వెంటనే అక్కడి నుంచి పరుగెత్తాడు.

వారింట్లోని "సుఖియా" దాసికొడుకు "భోలా" "శ్యామూ" యిద్దరూ ఇంచు మించు వొక వయస్సువారే. ఎప్పుడూ కలిసి ఆడుకుంటూ వుండేవారు. శ్యామూ పరుగెత్తుకుంటూ వాడి దగ్గరకు వెళ్ళి:—"భోలా! ఈ కాలణా తీసికెళ్ళి ఒక గాలిపటం, నూలు తెచ్చి పెట్టు. చూడూ! యెవరికి తెలీకుండ తీసుకు రావాలి సుమా?"

గాలిపటం వచ్చింది. ఇద్దరూ వొక చీకటి గదిలో చేరి దానికి సూత్రం వేశారు. శ్యామూ—(రహస్యంగా) "భోలా! ఎవ్వరితో చెప్పకుండా వుండేటైతే నీకోమాట చెప్తాను." అన్నాడు.

భోలా తల అడ్డంగా ఆడిస్తూ:—"లేదు; యెవ్వరితోను చెప్పను, చెప్పు."—అన్నాడు.

శ్యామూ:—అయితే విను. నేను యీ గాలిపటం ఆకాశంమీది దేవుడి దగ్గరకు పంపుతాను. దీన్ని పట్టుకుని పిన్ని మెల్లిగా కిందికి దిగి వస్తుంది. నాకు వ్రాయడం రాదు కాని, లేకపోతే దీనిమీద పేరుగూడ వ్రాసివుందును—అన్నాడు.

కాని భోలాకొక సందేహం కలిగింది. వాడు—"శ్యామూ! నీవు కనిపెట్టిన వుపాయం చాల బాగుంది. అయితే వొక కష్టం వుంది. ఈ దారం యింత సన్నగా వుందిగదా! పిన్ని దీనిని పట్టుకొని దిగుతూవుంటే తెగి పోతుందేమో! కనుక లావుపాటి తాడు గట్టి యెగరేస్తే మంచిదిగదూ."

ఈ ఆలోచన శ్యామూకు కూడ నచ్చింది. కాని తాడు కొనడానికి డబ్బెక్కడినుంచి వస్తుంది? ఏమాత్రం దయ లేకుండా తన పిన్నిని తీసుకెళ్ళి పారేసి వచ్చిన వాళ్ళు, యిందుకోసం తనకు డబ్బియ్యరని నిశ్చయించుకున్నాడు. ఇదే ఆలోచనతో రాత్రెంతోసేపు మేలుకున్నాడు

మొదటిరోజు చేసిన వుపాయంకన్న వేరే యింకే వుపాయం తోచలేదు. మెల్లిగా వెళ్ళి తన పినతండ్రి కోటు జేబులోనుంచి 1 రూ. తీశాడు. మర్నాడు దానిని తన స్నేహితుడు భోలాచేతికిచ్చి :—చూడు భోలా! ఇది తీసు కెళ్ళి మంచి మంచి గట్టి తాళ్ళు రెండు కొనుక్కురా. వొక టైతే పొడుగు చాలదేమో. ఇంతలో నేను "జవహర్" అన్నచేత వొక కాగితంమీద "పిన్ని" అని వ్రాయించి వుంచుతాను. పేరు వ్రాసి గనుక యెగుర వేశామంటే, గాలిపటం సరిగ్గా ఆమెదగ్గిరికే వెళుతుంది.

ఈ సన్నాహమంతా కావడానికి రెండు గంటలు పట్టింది. అప్పుడు మళ్ళీ యిద్దరూ చీకటి గదిలో చేరి, గాలి పటానికి తాడుగట్టడం ప్రారంభించారు. వీరిద్దరూ యీ పని చేస్తూ వుండగా, విశ్వేశ్వరుడు కోపంతో అక్కడికొచ్చి వీళ్ళిద్దరినీ బెదిరిస్తూ:—"నా కోటుజేబులోనుంచి రూపాయి యెవరు తీశారు?" అని అడిగాడు.

భోలా బెదిరిపోయి వణుకుతూ :—"గాలిపటం, దారం కొనడానికని శ్యామూ అన్న తీశాడు."—అన్నాడు.

విశ్వేశ్వరుడు శ్యామూను గట్టిగా రెండుదెబ్బలు కొట్టి:—"దొంగతనం నేర్చుకుంటే చెడిపోతావు జాగ్రత్త"—అంటూ యింకా నాలుగుదెబ్బలువేసి, గాలిపటం చింపేశాడు. అటుతిరిగి త్రాళ్ళనుచూసి "ఇవెవరు కొన్నారు?"—అని అడిగాడు.

శ్యామూ కళ్ళు మూసుకొని యేడుస్తున్నాడు.

భోలా :—"ఇవికూడ యితనే కొన్నాడు. ఈ త్రాళ్ళకు గాలిపడగ కట్టి యెగరేసి, పిన్నిని ఆకాశంమీద దేవుని దగ్గిరనుంచి కిందికి దింపుతామని నాతో చెప్పాడు."—అన్నాడు.

విశ్వేశ్వరుడు వొక్కక్షణం నిర్విణ్ణుడై నిలుచుండి పోయినాడు.

చినిగిపోయిన గాలిపటాన్ని చేతులోకి తీసుకొని రెండు ముక్కలూ చేర్చి చూశాడు. దానికి వొక కాగితం ముక్క అతికించి వుంది. దానిమీద "పిన్ని" అని వ్రాసుంది.

అది చూడగానే విశ్వేశ్వరుడు :—"శ్యామూ! నిన్న కొట్టానా."—అంటూ క్రింద చతికిల బడ్డాడు.



విషాద ప్రణయగాథ.

# కీట్సు రసవత్తర కావ్యం "ఇసబెల్లా"

వాద్రేవు శ్రీ జోగిపంతులు.

[జాన్ కీట్సు (1795-1821) పంథొమ్మిదవ శతాబ్దపు ఆంగ్ల కవుల్లో పేరెన్నిక గన్నాడు. ఇతడు లండన్‌లో పుట్టాడు. తండ్రి గుర్రాల సావడికి కాపరి. చిన్నతనంలో ఇతడు 'ఎన్‌ఫీల్డు' పట్టణంలో విద్య నభ్యసించాడు. తన పదిహేనవయేట ఒక డాక్టర్ దగ్గర సహాయకునిగా ప్రవేశ పెట్టబడ్డాడు. కాని సాహిత్యంమీద ఆతనికిగల అపారమైన ఆసక్తివల్ల ఆ వుద్యోగం కాస్తా వదలుకుని కలంపట్టి రచనలు సాగించాడు. ఇతడి మొట్ట మొదటి కావ్య సముచ్చయం 1817 లోనూ, ఆఖరిది 1820లోనూ వెలువడ్డాయి. 26 సంవత్సరాల పిన్నవయస్సున మృత్యువు ఆతడిని పొట్టపెట్టుకున్నా పేరెన్నిక గన్న సమకాలీన మహా కవుల కోవలో చేర్చదగిన రసవత్తర సాహిత్యాన్ని సృష్టించిన మహనీయుడు! "ఇసబెల్లా" ఇతివృత్తం ఇతడు 'బొకాషియో' అనే ఇటాలియన్ యాత్రికుని గాథలనుండి స్వీకరించినట్టు కనపడుతుంది. కావించే కృత్యాలకన్నా, భావించే భావనలకే ఈతని పాత్రలు ప్రసిద్ధి. చిన్ననాడే ప్రణయ వియోగి ఐన ఈ మహాకవి రచనలు ప్రణయ రసపరిపూతాలై వుంటయ్. "ఇసబెల్లా" కథానికను పాఠకులకి అర్పిస్తున్నా—రచయిత]

పూర్వకాలంలో ఫ్లారెన్స్ నగరంలో "ఇసబెల్లా" అనే ఒక అమ్మాయి వుండేది. ఆమె మిసిమి పసందుల చంపకీ సువర్ణగాత్రి; కన్యక. అమాయకురాలు-ఎంతటి విరోధి నయినా పల్లెత్తు మాటనలేదు. ఇసబెల్లాకి ఇద్దరు అన్నలుండే వారు. ఇద్దరికిద్దరూ అహిరావణ మైరావణులు! తమలాభం కోసం ఎదుటివారి గొంతులు తడిగుడ్డతో కోసేరకం. పచ్చి కిల్లాడీలు! వారసత్వరీత్యా వారికి సిద్ధించిన ఆస్తిపాస్తులు దండిగా నేవున్నా ఆశమెండు! ధనాశతో వారెంతటి ధర్మ గ్లానికన్నా, ఎంతటి దారుణానికన్నా వెనుతీసే వారుకారు! వారికి అన్ని భాషలూ వచ్చు; ఏమీ తెలియని అమాయక వర్తకులను అన్యాయంగా దోచుకొనేవారు.

వీరిదగ్గర 'లోరెంజో' అనే ఒక అతను వుండేవాడు. వర్తక వ్యాపార విషయాల్లో వారికి సహాయం చేయడమే ఆతనిపని. లోరెంజో ఇసబెల్లాను ప్రేమించాడు. ఇసబెల్లాకు లోరెంజో అంటే ప్రాణం. భోజనాలవేళ ఇద్దరూ ఒకే బల్లదగ్గర కూర్చుండేవారు. ప్రొద్దుటే లేచేసరికి ప్రేమ పెరిగిపోతోన్నట్టు భావించేవారు. సాయంకాలమయేసరికి రెట్టింప యిందనుకునే వారు. ఇంటా, బయటా, తోటలో, బాటలో ఆమెమూర్తి ఆతడి ముందు సాక్షాత్కరించేది. తీయని కోయిల పాటకంటే 'లోరెంజో' మాటలే మధురిమా లనిపిస్తయ్ ఆమెకి! ఇసబెల్లా కనబడకపోతే తిండి సహించ దతనికి! లోరెంజోని చూడలేకపోతే నిలవలేదామె!

ఇలాగ్గా నెలలు గడుస్తున్నయ్. వారి ముఖంలో కళా కాంతులు తరిగినట్టు కనబడ్డారు. ప్రతిరాత్రి 'ఈ విషయ మేమిటో రేపు పొద్దుటే తేల్చుకోవాలి' అనుకొనే వాడు లోరెంజో. లోరెంజో నోటమ్మట తీయని ఆ మాటలు ఎప్పుడు వింటానా అని ఇసబెల్లా అనుకొనేది అంతే!

వారు మనస్సుల్లోనే మాట్లాడుకో గలిగేవారు కాని రోజులు మాత్రం దొర్లిపోతూండేవి యదార్థం ఒకరినొకరు బయట పెట్టుకోకుండానే! ఇసబెల్లా అచుంబితాలైన అధరాలు పాలిపోయాయి; ఆమె చిక్కిపోయింది. "ఎంత బలహీనంగా వుంది?" అని బాధపడిపోయాడతడు. "నేను నామనస్సు చెప్పలేనేమో? చెప్పాలి—లేకపోతే ఆమె ప్రాణం నిలవదేమో?" అనుకొన్నాడు. 'చెప్పాలి' అను కొనేసరికి ఆతనిలో అపరాని ఆవేశం కలిగింది. అయినా ఏదో—ఎక్కడో—తెలియని ఏ తీవ్ర శక్తులో తిరోగ

# కీట్సు రసవత్తర కావ్యం "ఇసబెల్లా"

మనం సాగించమని ఉద్బోధిస్తున్నట్లుంది. ఆవేశం కలిగేది—తిరిగి పికికిరక్తం వొళ్లంతా పారేది. సంఘాన్ని సవాల్ చేయగల కుటుంబంలో పుట్టింది. అందంలో మేటి. గుణంలో మిన్న. అంతటి ఇసబెల్లాను తను—సామాన్య జీతగాడు! కోర...ఆ తలంపు అతణ్ణి ఎంత బాధించిందీ!

ఆమె—తనకోసం, తనవాడికోసం రాకపోతే అలాగే ఆలోచిస్తూ మరో రెండురోజులు గడిపే వాడేమో అతడు! కాని—తన ప్రణయ పరిజ్ఞానంతో అతడి ముఖకవళికల్ని పరిశీలించింది—గ్రహించింది అతడెంత బాధపడుతున్నాడో.

"లోరెంజో!" అతడు వెనుదిరిగి జూశాడు. అతడి కళ్లు మిలమిలా మెరిసినయ్. ఆమె కళ్లూ ముఖము కూడా ఏదో చెప్తూన్నట్టే వుంది. అతడికి అర్థమైందనుకుంటాను ఆమె మూగ సంభాషణ. తన మనస్సు చెప్పడానికి ధైర్యం చిక్కిందాతనికి.

"నిన్ను చూస్తూంటే నామనో విచారాన్ని నీకు వినిపించుకోవచ్చుననిపిస్తూంది. ఇసబెల్లా! నిన్ను ప్రేమిస్తున్నాను. గత కొన్ని నెలలుగా నా శరీరంలోని ప్రత్యణువూ 'ఇసబెల్లా' అనే ఆక్రోశిస్తున్నాయి. నేను నిన్ను విడిచి వుండలేను ఇసబెల్లా! నీ ప్రేమ నన్ను ఎన్ని అగాధాలనన్నా దాటించగలదు, ఎంతటి కృత్యాన్నయినా చేయించగలదు."

ఈ మాటలంటూ అతడామెను మనసారా ముద్దాడాడు. వసంతవాయువు సోకగానే పుష్పాలు వింతగా విప్పారినట్టు—ఒకరినొకరు కలుసుకోవడంతో వారిరువురూ కూడా ఆనందంలో తేలిపోయారు.

ఆమె తన గది చేరుకొనేసరికి హృదయానందం హద్దు మీరినట్లయింది. మతి శ్రుతి కలిపే గీతికలాలపించింది. పశ్చిమ కొండల్ని దూసుకుపోయే సూర్య కిరణాల్ని, కొండల్నించి క్రిందికి జాలువారే సెలయేళ్లనూ, ఆసెలయేటి నీళ్లలో పడి తళుక్కున మెరిసి మరిగిపోయే కిరణాల్ని చూస్తూ అంతటా తన ఇసబెల్లాయేనని—అతడు భావించాడు.

సన్న జాజిదుబ్బుల్లో, సంపంగి గుబురుల్లో వారు రహస్యంగా ప్రతి సాయంకాలం కలుసుకొంటూండే వారు. కాని వారి సమాగమాలు అట్టే కాలం సాగకుండానే ఆమె సోదరులకి తెలిసిపోయింది. లోరెంజో, ఇసబెల్లాలు పరస్పరం ఎంత గాఢంగా ప్రేమించుకొన్నారో వారికి తెలిసింది. అన్నదమ్ము లిద్దరూ గట్టిగా, మరీ గట్టిగా ఆలోచనలు సాగించారు. లోరెంజోని మరచిపోయి, మరో పెద్దమనిషి కుమారుణ్ణి పెళ్లాడమని మెల్లిగా చెబుదామని నిశ్చయించారు. లోరెంజో చేసిన ఈ అఘాయిత్యానికి వారిద్దరూ కూడా కేవలం విస్ఫులింగాలే వెలుకరించారు. మెల్లిగా వాడి మెడ కత్తిరించాలని తీర్మానించుకున్నారు.

ఒకరోజు ప్రొద్దుటే లోరెంజో తన కిటికీలోంచి విశాల ప్రకృతిని వీక్షిస్తున్నాడు. "నీ ఆనందానికి అంతరాయం కలిగిస్తున్నాం" అంటూ ప్రవేశించారు అన్నదమ్ములిద్దరూ. "మనం ఒక జరూరు పనిమీద ఇప్పుడే బయల్దేరాల్సి వుంది. సిద్ధంగావాలి" అన్నారు. అలాగే నన్నాడు. వారు వెళ్లిపోయారు. గుర్రం ఎక్కి బయల్దేరి, ఇసబెల్లా కిటికీదగ్గర ఆగాడు. "ఇసబెల్లా!" మెల్లిగా పిలిచాడు. "నిన్ను కలుసుకోకుండా వెళ్లిపోతానేమోనని భయపడ్డా. తిరిగి త్వరలోనే వచ్చేస్తా. సెలవు" అని వెళ్లిపోయాడు. ఆమె అతడి మధుర సంభాషణని మననం చేసుకుంటూ లోనికి వెళ్లిపోయింది.

ముగ్గురూ గుర్రాలమీద ఆర్నోనది దాకా వెళ్లారు. పోయేకొద్దీ అన్నదమ్ముల ముఖాలు పాలిపోతున్నాయి; లోరెంజో ప్రకృతిని పరికిస్తూ చాలా వుల్లాసంగా వున్నాడు. నదిదాటి మహారణ్యంలో ప్రవేశించారు. ఇక్కడే లోరెంజోను అమాంతం వధించి పాతిపెట్టేశారు. కత్తులూ, కటార్లూ కడుక్కొని ఇంటిముఖం పట్టారు,

అత్యవసరమైన పనులను మీద లోరెంజోను ఇతర దేశాలకు పంపవలసి వచ్చిందని ఇసబెల్లాతో చెప్పారు. ఏరోజు కా రోజు అతని రాకకోసం ఎదురుచూస్తూండేది. పగలు పడిగాపులు కాయడం—రాత్రిళ్లు రోజుతూండడం. ఇదీ ఆమె దినచర్య! గతంలో లోరెంజోతో గడిపిన మధుర క్షణాలు మననం చేసుకొని మధనపడేది. ప్రియుడి ఆలింగనంకోసరమని చేతులు జాపి బోర్లగిల బడేది.

పోగా పోగా, ఆతని జీవితం గురించి ఆమెకి ఆందోళన అధికం కాసాగింది. ప్రియుడి సమాగమం కోసం లెక్కించిన

గంతులన్నీ వృథాపోయినాయ్. ప్రియుణ్ణిగూర్చిన తెరిపిలేని భావనలవల్ల తిండీ తిప్పలూ లేవు—ఫలితంగా ఆరోగ్యం చెడింది. తరులూ గిరులూ పాడే పాటలన్నీ ఆమెకి మృత్యు గీతికల్లా వినపడేవి; హృదయం బాధపడిపోయేది. తన బాధలన్నీ తనలో ఇముడ్చుకోడానికి విఫల ప్రయత్నం చేస్తూ అప్పుడూ అప్పుడూ అన్నల్ని అడిగేది లోరెంజోని గురించి. అడిగినప్పుడల్లా అదీఇదీ చెప్పి ఆమె దృష్టి మళ్లింప జూసేవారు. వారుచేసిన మహా తప్పిదం వారి వీపులమీద మహాభారం కింద పరిణమించి రాత్రీపగలూ భయంతో గడ గడ లాడేవారు.

లోరెంజో విషయం ఏమీ తెలియక పోవడంచాత ఇసబెల్లా మరణించి వుండును; కాని అదేకో కలగాని కల వచ్చింది. అర్ధరాత్రి, తనగదిలోనే, లోరెంజో తనపాదాల దగ్గర వెక్కి వెక్కి ఏడుస్తూ పడివున్నాడు. అరణ్య సమాధి ఆతనిలో గల మృదుత్వం అంతా పీల్చివేసింది. పెదాలు పాలిపోయాయి; స్వరం సురిగిపోయింది; కన్నీళ్లు కాల్వలు కడుతున్నాయి. లోరెంజో మాట ఆతని మాటలాగలేదు అదేమో! గొంతు వణుకుతోంది. అతని కళ్లు చింతనిప్పులల్లే వున్నయి; అయినా వాటిలో ప్రేమ తొణికిసలాడుతుంది. "నా ఇసబెల్లా! నా నెత్తిన పెద్ద బరువుంది; నా కాళ్లకి పెద్ద బండ కట్టివుంది. నా చుట్టూ పెద్ద పెద్ద చెట్లున్నయి. ఆ లోకానికీ, ఈ లోకానికీ మధ్య తచ్చాడే ఒక ఛాయను మాత్రమే నేను. నదిని దాటే గొర్రెలగంటలూ, చర్చి గణ గణలూ లీలగా వినబడ్డాయి—దానితో 'నేనొక ఛాయని మాత్రమే' నని నాకర్థమయినది. మీరంతా జీవించే ఈ లోకానికీ నాకూ సంబంధం తెగిపోయిందని తెల్సుకున్నాను. గత చరిత్రను గురించిన జ్ఞానం నాకు బాగావుంది; నేను సంపూర్ణంగా జీవించే వున్నానని నా అభిప్రాయం. నాలో ఎంతటి నైరాశ్యం నిండివున్నా నిన్నుచూసి, నీ పాలిపోయిన ముఖంచూసి కొంత ధైర్యం పొందుతున్నాను—నన్ను నువ్వు మరచిపోలేదు కదా అని! నాది ఒకే ఒక ప్రార్థన. రా! నా సమాధి దగ్గరకి రా ఒక్కసారి! మహారణ్యంలో వుంది. ఒక కన్నీటిధార నా సమాధిమీద పడనీయ్ నా ఆత్మ సంతుష్టి చెందుతుంది!" అంటూ ఆ ఛాయ మాయమై పోయింది. ఇసబెల్లా అంధకారంలోకి చూసింది. ఆమె కళ్లు బరువెక్కినయి. ఉదయం ఆమె లేచేసరికి రాత్రి ఆమె చూసిన ఛాయంతా గుర్తుంది. జరిగినది ఆమె అమాయకు రాలై తెల్సుకోలేక పోయింది. మనం ఎదుర్కొనే అపా యాలూ, అవమానాలూ కేవలం కర్మపరిపాకమే కాకుండా, కొందరి కొందరి కృత్రిమ కృత్యాలవల్ల కూడా సంఘటిస్తా యని ఛాయ ఆమెకి చక్కటి పాఠం నేర్పింది. లోరెంజో సమాధి దర్శించి ఉదయమూ, సాయంకాలమూ ప్రార్థనలు సలుపుతూండాలని ఆమె నిర్ణయించుకొంది.

బయల్దేరింది రహస్యంగా. మరొక ముసలిస్త్రీని సాయం తీసుకొంది. లోరెంజో సమాధి తాను వెతుక్కోగలదు; ఏడ్చోగలుగా మధుర గీతాలాలపించ గలదు; ఆతని హృదయవేదన బాపగలదు. నదీ తీరాన్నే కొంత దూరం నడచి వెళ్లారు. ఇసబెల్లా ఆ ముసలిదానితో మాట్లాడుతూ మొలలోని బాకు చూపింది; ముసల్ది మరి మాట్లాడలేదు! హడలిపోయింది; ఇసబెల్లాకి పిచ్చెత్తినదనుకొంది. సాయం కాలమయ్యేసరికి లోరెంజో సమాధి చేరుకొన్నారు. మట్టి బయటికితీశారు. ఆతని తల నిమిరింది; తనివితీరా ముద్దు పెట్టుకొంది. ముసలిదాని సహాయంతో తల నరికి వళ్లోవేసు కొంది; పెద్దగా ఏడుస్తూ ముద్దుపెట్టుకొంది. బహు రహస్యంగా ఆతలని ఇంటికి తీసుకొచ్చారు. బంగారు దువ్వెనతో తలదువ్వింది. అక్కడా అక్కడా వున్న మట్టిని తన కన్నీటి ధారలతోనే కడిగింది. రోజల్లా తలనిమరడం—ముద్దు పెట్టుకోవడం—నిట్టూర్చడం—ఏడవడం! సెంట్లు పూసిన ఒకముఖమల్ గుడ్డలో మట్టి ఒక పువ్వులకుండలో పెట్టింది ఆతని తల. దానిపై చక్కని మొక్కనొకదాన్ని పాతింది. రోజూ తన కన్నీళ్లతోనే పెంచేది దాన్ని. ఈ మొక్కని పెంచడంలో ఆమె తనచుట్టూవున్న లోకాన్నే మరచిపోయింది. ప్రపంచంలోని మహా అందమైన వస్తువులు కూడా ఆమెని ఆకర్షించలేక పోయాయి. రోజులూ, ఋతు వులూ గురించి ఆమెకేమి అక్కరలేకపోయింది. ఎప్పుడూ ఆ పువ్వులకుండు దగ్గరే! ఆ మొక్క పెరిగి పెద్దయి పూవులు పూసింది. అంతటి సువాసన ఆ జాతిపూలలో అంతకు ముందు లేదు.

## కిట్సు రసవత్తరకావ్యం "ఇసబెల్లా"

ఇసబెల్లా నానాటికీ నీరసించిపోయింది. ఆమెని మెల్లిగా చావనీయలేదు అన్నలు. ఆమె కంట అనంతంగా రాలే అశ్రువుల్ని చూశారు. అవ్వాళ్లో అంతా విచారించారు ఆమె దుస్థితికి. ఆమె అస్తమానమూ ఆ కుండు దగ్గరే వుండటమూ, ఎప్పుడూలేని అందంతో, సువాసనతో ఆ పువ్వులుండడమూ వాళ్లకి ఆశ్చర్యం కలిగింది. దానిగురించే ఆమె విచారిస్తున్న దని వారి భావన. అందులో ఏం వున్నదో తెలుసుకోవా లనే వుబలాటం వారికి అధికమైంది. కాని ఆ కుండుని ఎప్పుడూ విడువదాయె! ఆమె గుడికి వెళ్లడమూ అరుదే! గది విడవడమూ అరుదే. విడిచినా, వెంటనే పరుగు పరుగున వచ్చి దాని సరసన కూర్చుంటుంది. అయినా అన్నలు గటి పట్టు మీదున్నారు. అదను దొరికింది. తలతాలూకు అవశేషాలే వున్నాయి. అయినా అది లోరెంజోదేనని వారికి తెలుసు. వారు చేసిన దానిఫలితం కళ్లముందు గోచరించింది. హడలిపోయారు. ఆకుండు తీసుకుని ఆవూరు వదలి పారిపోయారు; మరితిరిగి రాలేదు. ఇసబెల్లా కనపడిన ప్రతిచేతనాచేతన వస్తువులనన్నిటినీ అడిగింది తనకుండు తనకిచ్చేయ మని. "నాకుండు దాచేయడం దారుణం; నాది నాకివ్వండి" అని కొనవూపిరి వున్నదాకా అడిగింది; ఎవ్వరూ ఇవ్వలేదు. వ్రక్కలైన హృదయంతో మరణించింది. ఆమె మరణానికి ఆ గ్రామ వాసులంతా విచారించారు. ఆమె విఫల ప్రణయగాథ ఆ నోటా ఆనోటా దేశమంతటా గానం చేయబడింది.



# పెళ్లి చూపులు

"సత్య"

"మా అన్నయ్యే కనక లేకపోతే, నన్నీపాటికి ఏ వెఱ్ఱి వెంగళాయికో కట్టేద్దురు మా నాన్నావాళ్ళూను. అసలు మాఅన్నయ్య పట్టువలనే, నాకు మావాళ్ళు స్కూలుఫైనలు దాకానైనా చదువు చెప్పించేరు. మా అన్నయ్య అంటే ఇంటిల్లిపాదికీ, కొంతవరకూ మానాన్నకికూడా, హడలే! అంటే మా అన్నయ్యకి పెద్దవాళ్ళంటే భక్తిలేదనికాదు. వాడు ఎప్పుడూ సరదాగా నవ్వుతూనే ఉంటాడు. నన్నూ, చెల్లాయినీ ఏడిపిస్తూ నవ్విస్తూనే ఉంటాడు. అమ్మదగ్గిర కూడా చిన్నపిల్లవాడికి మల్లే 'అవికావాలి ఇవికావాలి' అని మారాం చేస్తుంటాడు. అందరికన్నా మా బామ్మకి వాడంటే పంచ ప్రాణాలూను. ఆవిడకి కావలసిన నల్లమందు వగైరాలు అతి శ్రద్ధగా అందజేస్తుంటాడు. అందుకే ఆవిడ అప్పుడప్పుడనేది "నాకు మా పుట్టింటాళ్ళు ఇచ్చిన ఆస్థిఅంతా మా రాంబాబుకే రాసిస్తాన"ని. అయితే ఆవిడతో మా అన్నయ్యకు ఒక్కచోటే తగవులాట వచ్చేది "నేను చావకుండా పెళ్ళి చేసుకోరా నాయనా" అంటే 'ససేమిరా' అంటూండేవాడు. ఇంకా కొంచెం బామ్మకి కోపం వస్తుందని కనిపెడితే "అప్పుడే ప్రయాణం అవుతే ఎలాగ? నేను ఇంకా పెళ్ళి చేసుకోకుండా ఉంటే నువ్వు ఇంకా పెళ్ళి చూడటానికి బ్రతికి ఉంటావు. చప్పుని పెళ్ళి చేసికొని నిన్ను చప్పుని పరలోకానికి ప్రయాణం కట్టించడం నాకిష్టంలేదు" అంటూ చమత్కారంగా మాట్లాడే వాడు.

"ఇంతికీ చెప్పొచ్చే దేమిటంటే మా అన్నయ్య అంటే ఇంటిల్లిపాదికీ ప్రేమే! కాని వాడికి కొన్ని అభిప్రాయాలూ నియమాలూ ఉండేవి. వాటి కేమాత్రం విఘాతం కలిగినా సహించలేక పోయేవాడు. దాంతో విపరీతమైన కోపం వచ్చేది. ఆ కోపంతో వాడిమాటకి తిరుగులేదు. మానాన్న అయినా సరే వాడి ఎదురుగుండా, వాడి దృష్టిలో న్యాయ విరుద్ధమైన పని చేయడానికి వెరుస్తారు..."

అంటూ జానికి వాళ్ళ అన్నయ్యనుగురించి చెపుతోంది. "ఇంతకీ పెళ్ళిచూపులు విషయమేమయిందీ? మధ్యలో మీ అన్నయ్యని గురించి మొదలెట్టావ్" అన్నా కుర్చీలోంచి సగానికి లేచికూర్చుంటూ."

"అవునన్నట్టు, అసలు విషయం మానేశా. ఆరోజున నాకు పెళ్ళివారు వస్తానన్నరోజు. అన్నయ్య ఉంటే సంబంధం స్థిరపడదు. ఏమంటే కట్నాలు లేకుండా యీ రోజుల్లో పెళ్ళిళ్ళు జరగడం అనేది అసంభవం. పెళ్ళిమాటల్లో కట్నం విషయం రాగానే మా అన్నయ్యకి ఉద్రేకం ఆగదు. కట్నాలన్నా, స్త్రీబానిసత్వం అన్నా మా అన్నయకి అరికాలిమంట నెత్తికెక్కుతుంది. వచ్చిన వాళ్ళని అగౌరవపరచి "డబ్బుకి అమ్ముడుపోయే వానికి మా చెల్లాయిని పెళ్ళి చెయ్యం. మీరు వెళ్ళొచ్చు" అనేలాగ మాట్లాడుతాడు. దాంతో వచ్చినవాళ్ళు కాస్తా చక్కాపోతారు. మా అన్నయ్య యీ ప్రవర్తనకి మా నాన్నావాళ్ళూ అడ్డురారు. వస్తే యీఅగౌరవమే వాళ్ళకీ జరుగుతుందని వాళ్ళకి తెలుసు. ఇల్లాగే నాలుగైదు సంబంధాలు దాటిపోయాయి, మా అన్నయ్య ధర్మమా అంటూ. యీ మాటువచ్చే సంబంధం గొప్ప ఎత్తులలోదనీ, ఇది దాటిపోతే ఇంతకన్నా మంచి సంబంధం రాదనీ మా నాన్నా అమ్మా అన్నయ్యకి తెలయకుండా అనుకుంటున్నారు. వాళ్ళ మాటలుచాటుగా విన్న నాకు అదోలా అనిపించింది.

"ఇప్పటివరకూ వచ్చినవి మంచి సంబంధాలు కాక పోబట్టి అన్నయ్య యీ సంబంధాలు తప్పించటానికి చేసిన ప్రయత్నమంతా నాకూనచ్చింది. యీ వెఱ్ఱిమొఱ్ఱి సంబంధాలు తప్పించినందుకు అన్నయ్యని మనస్సులోనే ఎన్నిసార్లో అభినందించుకున్నా. కాని యీ సంబంధం చాలా మంచిదిలా ఉంది. వరుడికి ఇరవై ముప్పై ఎకరాల భూమి ఉందట! వయస్సు ఇరవై—బి. ఏ. చదువుతున్నాట్ట—బి. ఏ. అనగానే మా అన్నయ్యలాంటి ఉన్నత భావాలుంటాయని తలుచుకొనేప్పటికి నా మనస్సు ఆనందంతో నిండిపోయింది. మా అన్నయ్య ధర్మమా అంటూ యీ సంబంధం తప్పిపోక

పోతే బాగుండు ననిపించింది. అప్పటి నా ఆలోచన చూస్తే ఇప్పుడు సిగ్గేస్తోంది—

"యీ నా పెళ్ళిసంబంధం విషయం అన్నయ్యకి తెలియకుండా కట్టుదిట్టంచేసి పెళ్ళివారు వచ్చేరోజుకి అన్నయ్యని శిస్తులు వసూలు చేసుకురమ్మని మాఊరు పంపారు నాన్నగారు.........

ఆరోజునే పెళ్ళివారు నన్ను చూసుకోవడానికి వచ్చే రోజు. ప్రొద్దుటే అన్నయ్య బయలుదేరి ఊరికి వెళ్ళిపోయాడు. వాడు వెళుతూంటే నాకు ఒకమూల సంతోషంగా ఉన్నా ఒక మూల విచారం లేకపోలేదు. ఏమంటే ప్రతీమారు వచ్చిన వరుడి స్వభావాల్నీ, అభిరుచుల్నీ ఇట్టే గ్రహించి నాతో వచ్చి చెప్పేవాడు. "అతనికి షోకుచేసుకోవడం తప్ప మరేమీ తెలియదనీ, విశాల హృదయం లేనివాడనీ, అన్నీ బాగానే ఉన్నాయి కాని ఆ అబ్బాయికి శాంతం అనేది ఏ కోశాన్నా లేదనీ" యీ విధంగా వచ్చిన వ్యక్తి నాకు అనుకూలుడవునోకాదు ఇట్టే గ్రహించి వర్ణించేవాడు. నిజానికి మా అన్నయ్య లేకపోతే ఇలా నా శ్రేయస్సుకోరి వరుడి అర్హతానర్హతలు గ్రహించే వారే లేరు. ఒకవేళ ఎవరైనా ఉన్నా మా అన్నయ్యకి ఉన్నయీ మహత్తరశక్తి ఎక్కడనుంచి వస్తుందీ?

"చివరికి అన్నయ్య వెళ్ళిపోయాడు......

"మధ్యాహ్నం రెండుకావస్తోంది. మా అమ్మ నాకు జడ అల్లి ముస్తాబు చేస్తోంది. యీ చీరకాదని ఆచీరా, అది కాదని ఇదీమార్చి చివరకి మబ్బురంగుచీర అదేరకం జాకట్టూ తొడిగి తగుమాత్రం అయిన నగలతో నన్ను అలంకరణ చేసింది మా అమ్మ. అప్పటికప్పుడే మా నాన్న స్టేషను కెళ్ళాడు పెళ్ళివారిని తీసుకు రావడానికి. చెల్లాయి అంతకు మునుపే తయారయిపోయిందేమో, వసారాలో తివాసీలూ అవీపరిచి, అగరువత్తులు వగైరాలు అమర్చే హడావిడిలో ఉంది. నాకు బొట్టుపెట్టి తనముఖం రుద్దుకోవడానికి అమ్మ దొడ్లోకి వెళ్ళింది. నేను అద్దంముందు నుంచుని బొట్టు సరి చేసుకుంటున్నాను. ఇంట్లో చెల్లాయి హడావుడితప్ప మరేంలేదు. నేనున్నగది ప్రక్కనే వసారా—ఆ వసారాలోనే చెల్లాయి పాటలు పాడుకుంటూ చాపలూ అవీ మారుస్తోంది ఇక్కడివక్కడికీ అక్కడివిక్కడికీను. గడియారం 'టిక్-టిక్' మంటూ మూడు గంటలు దాటి పోతోంది. నా గుండెకూడా గడియారం శబ్దంతో సమానంగా లయ వేస్తోంది.

ఇంతలో మా యింటిముందు బండి ఆగింది. వెంటనే అనుకోకుండా కిటికీలోంచి తొంగిచూశా. ముందు మా నాన్న దిగారు. వెంటనే ఇంకోముసిలాయన మానాన్న చేతిసాయంతో దిగారు. ఇంక ఆ కిటికీగుండా చూస్తూండటం బాగుండదని కిటికీజేరేసి, ఆ గదిలోనే పెట్టిమీద కూర్చుని ఉన్నా. మనస్సు పరిపరి విధాల పోతోంది. ఆ వచ్చినవ్యక్తి ఎలాఉంటాడు? ఎటువంటి వాడు. అతనుకూడా దిగేదాకానైనా కిటికీ దగ్గర నిలబడితే బాగుండిపోను...తొందరెందుకు? కొద్దిసేపట్లో చూడవచ్చునుగా? ఇలా అనుకుంటుంటే మా చెల్లాయి లోపలికి పరిగెట్టుకు వచ్చి నా చెవిలో "వాళ్ళువచ్చారే అక్కా" అని చెప్పి మళ్ళీ వసారాలోకి వెళ్ళిపోయింది. దాన్ని అడిగి కొన్నివిషయాలు తెలిసికుందామని "మాటఇల్లారా" అంటూంటే వినిపించుకోకుండా వసారాలోకిపోయి స్థంబాన్ని ఆనుకుని వచ్చిన వాళ్ళని చూస్తూ నిలబడింది.

ఇంతట్లోకీ నాన్న నా గదిలోకివచ్చి "వాళ్ళువచ్చారు అమ్మాయీ! మీ ఆలశ్యం లేదుగదా? అమ్మేదీ?" అంటూంటే యీ హడావుడి అంతావిని కాబోలు అమ్మ గదిలోకి వచ్చింది ముఖం తుడుచుకుంటూ. చెవుల్లోఉన్న సబ్బయినా చూసుకోకుండా వచ్చిన అమ్మ కంగారు చూస్తే నాకు నవ్వు వచ్చింది. మా నాన్న చెప్పేమాటలు వినిపించుకోకుండా అమ్మ గుమ్మంలోకి వెళ్ళి ఒక్కమారు తొంగిచూసి వచ్చి "పిల్లాడు మన్మధుడులాగున్నాడు" అంది. ఆ మాట వింటే నా హృదయం అదోలా ఝల్లుమంది.

ఆవిడ వరుని మేనత్తట! (తరువాత కాసేపటికి తెలిసింది). గదిలోకి వచ్చింది. చాపేసి మా అమ్మ ఆవిడను ఆహ్వానించింది. నేనూ వెంటనే పెట్టిదిగి చాపమీద కూర్చున్నా. (నావినయానికి ఆవిడ తర్వాత అభినందించింది). ఆవిడ

# పెళ్లి చూపులు

ఏభైయేళ్ళ ముత్తయిదు. పూర్వకాల అలంకారాలతో బనారసు చీర కట్టుకొని పట్టెడ నాను వగైరా వస్తువులతో నాకు దగ్గిరగా చాపమీద ఖైటాయించిది. కాస్సేపటిదాకా నావైపే తదేకధ్యానంతో చూస్తూ ఊరుకుంది కాని ఏమీ మాట్లాడలేదు.

"అంతక్రితమే వసారాలోకి వెళ్ళిపోయిన నాన్నగారు చెల్లాయిని పంపారు. చెల్లాయి గదిలోకివచ్చి అమ్మచెవులో ఏదో ఊదింది. అంతక్రితమే తయారుచేసిన టిఫెన్, కాఫీ చెల్లాయిద్వారా వసారాలోకి పంపింది అమ్మ. గదిలోఉన్న ముసలి ముత్తయిదుకు అమ్మే టిఫెన్, కాఫీ ఇచ్చింది కాని ఆవిడ తను తీసుకోనని సౌమ్యంగానే నిరాకరించింది......

"అసలు కథకన్న ఉపోద్ఘాతమే పెరిగిపోతోందే?" అన్నా.

"టూకీగా చెప్పేస్తా విను. టిఫెన్లయాయి. యీలోగా మా నాన్న ఇంకో కంఠం (వరుని తండ్రిదనుకుంటా) ఏవేవో రాజకీయాలూ, రేషనింగులూ గురించి చర్చించుకున్నారు. కాస్సేపటికి మా చెల్లాయి లోపలికి వచ్చి సాఫిడేలు పట్టికెళ్ళి వసారాలో పెట్టింది.

"మా నాన్న లోపలికివచ్చి "అమ్మాయిని తీసుకొనిరా" అని అమ్మతో చెప్పి వెళ్ళిపోయారు. మా అమ్మ నాచెయ్యి పట్టుకొని వసారాలోకి నడిపించుకు వెళుతుంటే నాగుండె ఆగిపోతుందేమో నన్నంత వేగంగా కొట్టుకోసాగింది. కాళ్ళు వణకిపోయాయి. తడబడుతూ వెళ్ళి వాళ్ళకి కొంచెం దూరంలో ఎదురుగుండా వేసిన చాపమీద నెమ్మదిగా కూర్చున్నా. ఎదురుగుండా మా నాన్న కాక ఇద్దరువ్యక్తులు కూర్చున్నట్లు గ్రహించా కాని ధైర్యంతో తలెత్తి చూడలేక పోయా—మగవానికున్న ధైర్యం ఆ క్షణంలో ఆడదాని కెందుకుండదో? ఆ వరుడూ అతని తండ్రీకూడా నన్ను రెప్ప వాల్చకుండా చూస్తూంటారు కదా! యీ ఆలోచన వచ్చే టప్పటికి తలెత్తి వరుని వేపు చూద్దాం అనిపించింది కాని ధైర్యంఏదీ?......

"నీ పేరేమిటమ్మా" అంది ఒక కంఠం. అది పెళ్ళి కుమారుడి తండ్రిదనుకుంటా.

"చెప్పమ్మా" అని మానాన్న హెచ్చరించారు.

"జానకి" అన్నా నెమ్మదిగా వంచిన తల ఎత్తకుండానే.

"అమ్మాయి ఎంతవరకు చదువుకుంది."

"స్కూలుఫైనలు చదివిందండి" అన్నారు మా నాన్న.

"వాళ్ళ అందరికళ్ళు ఏంమాట్లాడుతున్నానో గమనించుకు కూచున్నాను కనుక నాకు తెలియకుండానే మా చెల్లాయి తెచ్చిన ఇంగ్లీషు పుస్తకం నా కర్తవ్యాన్ని తెలిపింది. నిజంగా నాకు అప్పుడు ఉడుకుమోతుతనమే వచ్చింది. స్కూలు ఫైనలు చదివిందంటే అంతనమ్మకం లేకుండా మళ్ళీ అక్కడో పబ్లిక్ ఎగ్జామినేషనా?...అదే పెళ్ళికుమారుడి బి. యే. డిగ్రీ చూపమని మేంఅడిగితే ఏమవుతుంది?..." మమ్మల్ని నమ్మకుండా మా మాటమీద గౌరవంలేక మమ్మల్ని అగౌరవ పరిచారు—పోనీ మా అమ్మాయి బి. ఏ. చదవలేదు—సరేనా?" అంటూ విపరీతమైన కోపంతో యీ పెద్దలు లేచిపోతారే?... ఈ పరీక్ష ఆడదానికిమాత్రం అవమానం కాదుకాబోలు?...ఇప్పుడే కనుక మా అన్నయ్య ఉంటే వాళ్ళు నన్నుచేసే యీ పరీక్షకు వళ్ళుమండి అవతలకి గెంటివేసి ఉండును.

"చివరకి చదవడం ఎలాగూ తప్పదు కనుక చదివాను. ఆ ముసలాయన మనస్సు తృప్తిపడింది కాబోలు "ఇంతబాగా ఇంగ్లీషు చదివే పిల్లలకి తెలుగులో వాక్సుద్ధి ఉండడం చాలా కష్టంసుమాండి" అన్నాడు. అదిఒక లోపంగా సంబంధం ఎక్కడ చెడిపోతుందో అనే భయంతో మా నాన్న భారతం తెప్పించి నాచేత బలవంతంగా చదివించారు. నాకు తెలుగు చదవడం రాకపోతేగా?...భారతం చదివే టప్పటికి నాకు కొంతవరకూ సిగ్గు తగ్గింది. పుస్తకంమూసేస్తూ అప్రయత్నంగా తలయెత్తి వాళ్లవేపు చూశా. వరుని తండ్రి అంగీకార సూచకంగా అర్ధనిమీలితలోచనుడై పురాణం వింటున్నవాడికి మల్లేబుర్ర ఊపుతున్నాడు. పెళ్ళికుమారుడు అన్య మనస్కంగా ఉన్నవాడు హఠాత్తుగా నా కళ్లలోకి చూశాడు. చటుక్కున తల వంచేశా. అబ్బ ఆ కళ్లు అంత కఠినంగా ఉన్నాయేమిటి? సౌమ్యత నెమ్మదితనం ఆకళ్లలో లేనేలేవు—ఆకళ్లని చూస్తేనే భయంవేసింది. మనిషి యీ కాలపు అందరి స్టూడెంట్లకి మల్లేనూటు వగైరాలతో ఠీవిగానే

ఉన్నాడు, కాని అతనిలో సహజ సౌందర్యంనాకు ఏ కోశాన్నీ కనిపించలేదు.

"తరువాత సంగీతం పాడించారు. వరుని తండ్రి "వీణ చెప్పించక పోయారూ" అన్నాడు తేలిగ్గా. నాకు వళ్లు మండిపోయింది." పిల్లసొమ్మేం పోయింది?...వీణ నేర్చుకుంటే భరతనాట్యం అభ్యసిస్తే బాగుండిపోను అంటారు. వీళ్లకోసం ప్రపంచంలో ఉన్న అన్నికళలూ అన్నిశాస్త్రాలు అభ్యసించి కూర్చోవాలిగావును! తన కొడుక్కు కవిత్వం వచ్చా? చిత్రలేఖనమో!! అబ్బే ఇవేమి పెళ్లికొడుక్కు అవసరంలేదు. సరే అక్కడనా అవసరం తీరిపోయింది. గదిలోకి వచ్చాక ఆ ముసలావిడ ఉందే—అవిడా. నా శారీరక పరీక్ష మొదలుపెట్టింది. అతినెమ్మదిగా మాట్లాడి నాకు చెవుడులేదనీ, చిన్న అచ్చుపుస్తకం దూరంగా పెట్టి చదివించి కంటి జబ్బులేదనీ దొడ్లోదాక, నడిపించుకువెళ్ళి (యీలోగానా నడక పరీక్షిస్తూ) నాకు కుంటివంటి రోగం ఏదీలేదనీ ఒక నిర్ధారణకి వచ్చింది. ఇవన్నీ చేస్తున్నప్పుడు నాకు విపరీతమైన కోపం, ఉడుకుమోతుతనం వచ్చాయి. కాని తప్పదు—ఆడపిల్లయి జన్మించినందుకు శిక్షగా పెళ్ళి చూపుల్లో యీ అన్ని పరీక్షలకీ నిలవవలసిందే!

"వసారాలో కట్నం విషయమై చర్చ జరుగుచున్నట్లు అక్కడనుంచి వచ్చే మాటల్నిబట్టి గ్రహించాను. బేరం అయిదువేలలో నడుస్తోంది. మా నాన్న నాలుగువేలకి ఎల్లాగేనా సెటిల్ చేద్దామని చూస్తున్నాడు.

నాలుగువేలు!

మా సంసార పరిస్థితి ఎక్కడ? నాలుగువేలు ఎక్కడ? మా నాన్న ఏమైనా ఆలోచించే యీ మాట అంటున్నాడా?

ఇంతట్లోకే మా అన్నయ్య వచ్చాడు. వసారాలో జనాన్ని చూశాడు. తిన్నగా గదిలోకివచ్చి నన్ను దొడ్లోకి తీసుకువెళ్లాడు. జరిగిన విషయమంతా అన్నయ్యతో ఏడుస్తూ చెప్పాను. గబగబా వసారాలోకి వెళ్ళి "మీకు మా అమ్మాయి నచ్చిందా?" అన్నాడు.

"ఆఁ! పిల్లకేం?" అన్నాడు ముసిలాడు.

"క్షమించండి—మా అమ్మాయికి అబ్బాయి నచ్చలేదు" అన్నాడు—ఇంకేముంది? అయ్యాయి పెళ్ళిచూపులు" అంటూ జానకి ముగించింది. నేనూ లేచాను.



(अ) క్రియాధాతువునకు చివర 'आ' గాని, 'या' గాని చేర్చినచో భూతకాలిక క్రియా రూపమగును.

(आ) ధాతువు హలంతమగుచో చివర 'आ' చేర్చవలెను.

ఉదా:—**पढ़** చదువు; **पढ़ा** చదివెను.
**सुन** విను; **सुना** వినెను.

(इ) 'आ' కార, 'ए' కార, 'ओ' కారాంతములగు ధాతువులకు చివర 'या' చేర్చిన భూతకాలమగును.

ఉదా:—**आ** వచ్చు; **आया** వచ్చెను.
**खे** పడవనడుపు; **खेया** పడవనడిపెను.
**सो** నిద్రించు; **सोया** నిద్రించెను.

(ई) క్రియా ధాతువు 'ई' కారాంతమయిన, చివర 'ई' ని హ్రాస్వము చేసిన పిదప 'या' చేర్చవలెను.

ఉదా:—**सी** కుట్టు; **सिया** కుట్టెను.

## పై నియమములకు లోబడని క్రియలు.

| | | | |
|---|---|---|---|
| **कर** చేయు; | **किया** చేసెను. | **जा** వెళ్లు; | **गया** వెళ్లెను. |
| **ले** తీసుకొను; | **लिया** తీసుకొనెను. | **हो** అగు; | **हुआ** ఆయెను. |
| **दे** ఇచ్చు; | **दिया** ఇచ్చెను. | **है** వున్నాడు, వున్నది. | **था** వుండెను. |

(उ) చివరను 'ऊ' యున్నచో దానిని 'उ' చేసి 'आ' చేర్చ వలెను.

ఉదా:—**छू** తాకు; **छुआ** తాకెను.

(अ) పై భూతకాలిక క్రియా రూపములను आ - ए - ई నియమము ననుసరించి మార్చిన, పుంలింగ బహువచనము, స్త్రీలింగ ఏక వచనము ఏర్పడును.

ఉదా:—**पढ़ा** పుంలింగము ఏకవచనము. **आया** పుంలింగము ఏకవచనము.
**पढ़े** పుంలింగము బహువచనము. **आये** పుంలింగము బహువచనము.
**पढ़ी** స్త్రీలింగము; ఏకవచనము. **आई** స్త్రీలింగము; ఏకవచనము.

## పై నియమములకు లోబడని క్రియలు

(आ) पिया, दिया, लिया, किया—వీని స్త్రీలింగ, ఏకవచన రూపములు క్రమముగ पी, दी, ली, की అగును.

(आ) స్త్రీలింగ ఏకవచన రూపమునకు పైన అనుస్వారము నుపయోగించిన, స్త్రీలింగ బహువచన రూపమగును.

(इ) ఉదా :—आयीं, गईं (गयीं), सुनीं

భూతకాలములో అకర్మక క్రియయొక్క లింగవచనములు కర్తననుసరించి యుండును.

### పుంలింగము.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| ఉదా :—मैं आया నేను వచ్చితిని. | हम आये మేము వచ్చితిమి. |
| तू आया నీవు వచ్చితివి. | तुम आये మీరు వచ్చితిరి. |
| | आप आये తమరు వచ్చితిరి. |
| वह आया అతడు వచ్చెను. | वे आये వారు వచ్చిరి. |

### స్త్రీలింగము.

| | |
|---|---|
| मैं आयी। | हम आयीं। |
| तू आयी। | तुम आयीं। |
| | आप आयीं। |
| वह आयी। | वे आयीं। |

ला తీసికొనివచ్చు, बोल మాట్లాడు, भूल మరచి పోవు - ఇవి అకర్మక క్రియలుగ పరిగణింపబడును.

భూతకాలములో క్రియ సకర్మకమైనపుడు కర్తకు 'ने' అను ప్రత్యయము వచ్చును.

ఉదా :—राम ने पढ़ा రాముడు చదివెను.

सरला ने सुना సరళ వినెను.

उसने देखा అతడు చూచెను. (वह + ने = उसने)

భూతకాల క్రియ సకర్మకమైనపుడు (కర్తకు 'ने' ప్రత్యయము వచ్చినపుడు) క్రియ కర్మ యొక్క లింగ వచనములననుసరించి యుండును.

ఉదా:—**तुमने एक सबक़ पढ़ा** మీరొక పాఠము చదివితిరి.

(**सबक़** - పుంలింగము ఏకవచనము).

**तुमने दो सबक़ पढ़े** మీరు రెండు పాఠములు చదివితిరి.

(**सबक़** - పుంలింగము బహువచనము).

**उसने एक किताब दी** అతడొక పుస్తకము నిచ్చెను.

(**किताब** స్త్రీలింగము, ఏకవచనము).

**उसने कई किताबें दीं** అతడు కొన్ని పుస్తకము లిచ్చెను.

(**किताबें** - స్త్రీలింగము, బహువచనము)

కర్మలోపించినగాని, లేక కర్మకుగూడ ప్రత్యయము వచ్చినగాని క్రియ ప్రథమ పురుష పుంలింగ ఏకవచనముగనుండును.

ఉదా:—**मैंने सुना** నేను వింటిని (కర్మ లోపించినది).

**आपने राम को बुलाया** తమరు రాముని పిలచితిరి.

(**राम को** - కర్మతో ప్రత్యయము వచ్చినది).

**वे, ये, कौन, जो** లకు బహువచనమున '**ने**' ప్రత్యయము వచ్చిన, అవి క్రమముగ **उन्होंने, इन्होंने, किन्होंने, जिन्होंने** అగును.

**कहानी** కథ (స్త్రీలింగము, ఏకవచనము).

**देर** ఆలస్యము (స్త్రీలింగము)

**लेख** వ్యాసము. (పుంలింగము)

**इनाम** బహుమతి, ఇనాము. (పుంలింగము)

**पानी बरसना** వర్షము కురియుట.

**गाना** పాట. (పుంలింగము ఏకవచనము)

**थक जाना** అలసి పోవుట.

**थकावट** అలసట. (స్త్రీలింగము).

**चोर** దొంగ (పుంలింగము)

**कोशिश** ప్రయత్నము. (స్త్రీలింగము).

**इस्तीफ़ा** రాజీనామా (పుంలింగము)

**भूख** ఆకలి (స్త్రీలింగము)

**चिट्ठी** ఉత్తరము (స్త్రీలింగము ఏకవచనము).

**ख़त** ఉత్తరము. (పుంలింగము)

**जवाब** బదులు; జవాబు (పుంలింగము)

**काफ़ी** కాఫీ (స్త్రీలింగము)

**भाषण** ఉపన్యాసము (పుంలింగము)

**पकड़ना** పట్టుకొనుట.

**बताना** చెప్పుట

**डाकिया** తపాలు బంట్రోతు.

**आज आपने क्या किया?** నేడు తమరేమి చేసితిరి?

**आज मैंने एक छोटी सी कहानी लिखी।** నేడు నేనొక చిన్న కథ వ్రాసితిని.

| | |
|---|---|
| तुम इतनी देर से क्यों आये? | మీరింత ఆలస్యముగా ఎందుకు వచ్చితిరి ? |
| आज मैं स्टेशन गया, इसलिये (मुझे) देर हो गई। | నేడు నేను స్టేషన్‌కు వెళ్లితిని, ఇందుచే ఆలస్యమైనది. |
| जिन्होंने यह लेख लिखा, उन्होंने पचास रुपये इनाम पाये। | ఈ వ్యాసము వ్రాసిన వారు యాభై రూపాయలు బహుమతి పొందిరి. |
| आज खूब पानी बरसा। | నేడు బాగా వర్షము కురిసెను. |
| सुमित्रा की बहन ने एक गाना गाया। | సుమిత్ర చెల్లెలు ఒక పాట పాడెను. |
| उस लड़की ने दिन भर काम किया। | ఆ బాలిక రోజంతా పని చేసెను. |
| इसलिये वह बहुत थक गयी। | ఇందుచే ఆమె చాల అలసి పోయెను. |
| कल मेरी तबियत ठीक नहीं थी। | నిన్న నా ఆరోగ్యము బాగుండ లేదు. |
| पुलिस ने चोर को पकड़ने की कोशिश की। | పోలీసువారు దొంగను పట్టుటకు ప్రయత్నించిరి. |
| आपने जो फल भेजे, (वे) अच्छे थे। | మీరు పంపిన పండ్లు బాగుండినవి. |
| आप जानते हैं उसने क्यों इस्तीफ़ा दे दिया? | అతడెందులకు రాజీనామా యిచ్చెనో మీరెరుగుదురా ? |
| कल रात को मैंने खाना नहीं खाया, क्योंकि मुझे भूख नहीं थी। | నిన్న రాత్రి నేను భుజించ లేదు. ఎందుచేతనంటే నాకు ఆకలియుండ లేదు. |
| रामने अपने घर का पता नहीं बताया। | రాముడు తన అడ్రసు చెప్ప లేదు. (తెలుప లేదు). |
| मैंने इंदिरा की चिट्ठी का जवाब दिया। | నేను ఇందిర ఉత్తరమునకు బదులు వ్రాసితిని. |
| तुमने आज सबेरे काफ़ी पी? | మీరు ఈ రోజు ప్రొద్దున కాఫీ త్రాగితిరా ? |
| नहीं, मैंने दूध पिया। | లేదు, నేను పాలు త్రాగితిని. |
| मैंने एक सभा में पंडितजी का भाषण सुना। | నేనొక సభలో నెహ్రూగారి ఉపన్యాసము వింటిని. |
| मेरी घड़ी में पाँच बज गये। | నా గడియారములో ఐదు గంటలైనది. |
| मेरी बात सुनकर वह ज़ोर से हँसा। | నా మాట విని అతడు బిగ్గరగా నవ్వెను. |
| गाड़ी आ गई। | బండి వచ్చినది. |
| डाकिया मेरे लिये एक ख़त लाया। | తపాలు బంట్రోతు నాకొరకు ఒక పుత్తరము తెచ్చెను. |
| कृष्ण अपनी किताब लाना भूल गया। | కృష్ణుడు తన పుస్తకము తెచ్చుట మరచెను. |
| अध्यापक तुमसे क्या बोले? | ఉపాధ్యాయులు మీతో ఏమి చెప్పిరి ? |

★

# దసరా ఉత్సవములు

(32వ పేజీ తరువాయి)

20–10–50 విజయదశమి శుక్రవారం సాయంత్రము 6 గంటలకు

| ఇంగ్లీషు నాటకము | రిహార్సల్సు |
| --- | --- |
| హిందీ | సరారి లడకా |
| అరవము | శ్రీ వళ్లి కల్యాణము |

పరీక్షాధిపతులు :
శ్రీ గిడుగు సీతాపతిగారు
శ్రీ డాక్టరు అవధానిగారు
శ్రీ కృష్ణమూర్తిగారు
శ్రీ లింగమూర్తిగారు.

ఈ రిహార్సల్సు నాటకములో వి. సావిత్రి, హిందీ నాటకములో పుష్పాగాంధీ, అరవ నాటకములో జయకుమారి మొదటి బహుమానములు పొందిరి. ఇంగ్లీషు డ్రామాలో నటించిన వి. వరలక్ష్మికి శ్రీ లింగమూర్తి గారు ఒక ప్రత్యేక బహుమానము నొసంగిరి. నాటక ప్రదర్శనానంతరము ఆంధ్ర మహిళాసభ నాట్యోపాధ్యాయిని శ్రీమతి సామ్రాజ్యముగారి దర్శకత్వమున విద్యార్థినులు నృత్య ప్రదర్శనముల నొసంగిరి.

అటుపైన శ్రీమతి వెనిగండ్ల పుష్పావతి చౌదరిగారి అధ్యక్షత క్రింద జరిగిన సభలో మంత్రి సంజీవ రెడ్డిగారి సతీమణి, శ్రీమతి నాగరత్నమ్మగారు విజయవతులకు బహుమతులను పంచిరి. అటుపైన దసరా వుత్సవముల ముగింపు సూచిస్తూ, నిర్వాహకులకు, పరీక్షాధిపతులకు, పాల్గొన్న విద్యార్థినులకు సభ్యురాండ్రకు వారి బిడ్డలకు, యితర విధములుగ సహకరించిన ప్రతి వారికి, ప్రేక్షకులకు, బహుమతులకు తదితర ఖర్చులకు విరాళములిచ్చిన సోదరీమణులకు కృతజ్ఞతాభివందనములను కార్యదర్శిని నివేదించెను.





శ్రీమతి విజయలక్ష్మిగారు, కుమారి జయ అప్పస్వామి రచించిన చిత్ర పటముల ప్రదర్శనమును వాషింగ్‌టన్ ఎంబెసీలో తెరచుచున్న దృశ్యము.

కుమారి జయ అప్పస్వామిగారు భారత ప్రభుత్వమొసగిన విద్యార్థి వేతనముతో, చైనాలో చిత్ర కళా విధానాన్ని అభ్యసించారు. పై పటములో శ్రీమతి విజయలక్ష్మి, కుమారి అప్పస్వామి, వాషింగ్‌టన్‌లోని జాతీయ చిత్ర కళా మంటపపు నియంత డేవిడ్ ఫిన్‌డ్లీ.

## కృతజ్ఞత.

రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినుల భోజన నిధికై పప్పిచెట్టి రాఘవయ్యచెట్టి భారిటీస్ వారు రూ. 50/- విరాళముగా నిచ్చిరి. వీరు గత రెండు సంవత్సరములు గూడ తమ విరాళము నిచ్చి ప్రోత్సాహపరచియున్నారు. వీరికి మా కృతజ్ఞత.

అ. చన్నఘంటమ్మ.

# ఢిల్లీలో
# ఆంధ్ర విద్యాసంఘము

ఉద్యోగ నిమిత్తంగాగాని, వృత్తి నిమిత్తంగాగాని ఢిల్లీలో వసించే ఆంధ్రుల బిడ్డల విద్యాభ్యాసం ఒక పెద్ద సమస్య అయింది. ఈ విద్యార్థుల సంఖ్య ప్రభుత్వము బాధ్యత వహించేటంత పెద్దదీకాదు, నిర్లక్ష్య పెట్టవలసినంత స్వల్పమైనదీకాదు. ఆంధ్ర బాలబాలికలు, విద్యా నిమిత్తం తమ పుట్టుక స్థానాలకు తరలిపోకుండానున్నూ, గత్యంతరములేక, అన్యభాషలో విద్య నభ్యసించవలసిన యిక్కట్టును అతిక్రమించేటందుకున్నూ, వారికి తమ మాతృభాషలోగల సాంప్రదాయ సంస్కృతులను సమన్వయించుకునే అవకాశము గలిగించేటందుకున్నూ, ఆంధ్ర విద్యా సమాజము స్థాపించబడినది. ఈ సమాజపు ప్రయత్నముచే, మదరాసు సెకండరీ పాఠశాల, (ఢిల్లీ), లో 1950 మేనెల నుండి ఒకటి, రెండు తరగతులు ప్రారంభించబడ్డాయి. అనతికాలంలో యీ సమాజము తరఫున ప్రత్యేక పాఠశాల నెలకొల్పే ఆశయం ఉన్నది. అయితే కనీసము రూ. 8000/-. ప్రారంభములోనే కావలసిన ఆవశ్యకతయున్నది. ఇటువంటి సంస్థ ఢిల్లీ ఆంధ్రుల కత్యంతావశ్యమేగాకుండా రాజధాని నగరంలో ఆంధ్రులకీపాటి అవకాశం ఉండటం యావదాంధ్రలోకం అభిలషించవలసిన విషయం. అందువల్ల యీ విద్యా సంఘానికి సర్వవిధములా తోడ్పడి, యీ సదవకాశమును పురస్కరించుకోవటం ఢిల్లీ ఆంధ్రుల ప్రధాన కర్తవ్యమేయైనా, ఆంధ్రులందఱు యీ విషయములో బాధ్యత గుర్తించి, విరివిగా ధనవిరాళాలిచ్చి పోషించవలెనని హెచ్చరించుచున్నాము.



మదరాసు సెకండరీ పాఠశాల (ఢిల్లీ) తెలుగుశాఖలో క్రొత్తగా స్థాపింపబడిన ఒకటి, రెండు తరగతులు.

విరాళములను శ్రీ సి. వి. నారాయణరావు, ఎమ్. ఏ., సెక్రెటరీ, పార్లమెంటు సెక్రెటేరియట్, న్యూ ఢిల్లీ అను విలాసమునకు పంపగలరు.

ఇట్లు,

ఆంధ్ర విద్యా సంఘపు కార్యనిర్వాహక వర్గము.



### ఆంధ్ర మహిళాసభ యాజమాన్యమున

## పారిశ్రామిక విద్యాలయపు సహాయనిధికై

# నృత్యగాన ప్రదర్శనములు.

ఆంధ్ర మహిళాసభ స్థాపితమై దాదాపు 10 సంవత్సరములు కావస్తుంది. ఆంధ్ర మహిళాసభ నిర్వహించుచున్న కార్యకలాపములు ఎన్నో ఉన్నవి. ఈ సభయందు ముఖ్యముగా పారిశ్రామిక శాఖ, బెనారెస్ ప్రవేశిక, ఇంటర్ మీడియేట్ పరీక్షలకు తరిఫీదు నిచ్చు విద్యాశాఖ, నృత్య గాన శాఖలు కలవు.

రాణీ రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము స్థాపించి నాలుగు సంవత్సరములు పూర్తి అయినవి. ఈ పారిశ్రామిక శాఖలో అనేకమంది బీద విద్యార్థినులు వివిధములైన గృహపరిశ్రమలందు, చేతి పనులయందు తర్ఫీదుపొంది ప్రభుత్వ పరీక్షలయందు కృతార్థులౌతున్నారు. ఇందు విద్యార్థినులకు జాతి, కుల, మత వివక్షతలు లేకుండా అన్ని వృత్తులలోనూ ఉచిత శిక్షణయు, పెక్కుమందికి ఉచిత భోజనవసతి సదుపాయములకు ఏర్పాట్లు చేయబడినవి. ఈ ఏర్పాట్లు నిరాఘాటంగా కొనసాగుటకై నిధి సంపాదనకు గాను గతిమాసం (అక్టోబరు) 6, 7, 10 తేదీలయందు రసికరంజని సభలో నృత్య, గాన ప్రదర్శనములు జరుపబడినవి.

ఆ ప్రదర్శనములలో 6-10-50 సాయంకాలము ప్రధాన న్యాయమూర్తులు శ్రీ రాజమన్నారుగారి అధ్యక్షతను, కుమారి (బేబీ) కమలచే భరతనాట్య ప్రదర్శనము జరిగినది.

శనివారం 7-10-50 న్యాయమూర్తులు శ్రీ చింతగుంట రాఘవరావుగారి అధ్యక్షతను, గానరత్న వి. వి. శఠగోపన్ బృందమువారి కర్ణాటక సంగీత కచ్చేరి జరిగినది.

మంగళవారము 10-10-50 శ్రీ లాల్‌చంద్ దాదాగారి అధ్యక్షతను, రమణీయ కళాకేంద్రపు రమణీ గోపాలకృష్ణ బృందమువారి నృత్యము జరిగినది.

ఈ ప్రదర్శన సందర్భములలో ఈ క్రింద పేర్కొన్న వారు విరాళముల నొసగి తమ ఔదార్యమును చూపిరి.

| | | |
|---|---|---|
| శ్రీ లాల్‌చంద్ దాదాగారు | రూ. | 1,000 |
| శ్రీ మెయ్యప్ప చెట్టియార్‌గారు | ,, | 500 |
| శ్రీ కేశవలాల్ జీ షాగారు | ,, | 251 |
| గౌరవనీయులు శ్రీ సంజీవ రెడ్డిగారు | ,, | 116 |
| గౌరవనీయులు శ్రీ సీతారామరెడ్డిగారు | ,, | 116 |
| శ్రీమతి లక్ష్మమ్మగారు | ,, | 101 |
| శ్రీ సి. యం. కొఠారీగారు | ,, | 101 |
| శ్రీ పిఠాపురం మహారాజావారు | ,, | 101 |
| శ్రీ ఎ. స్వామిగారు | ,, | 100 |
| శ్రీ కుట్టి కృష్ణమీనన్‌గారు | ,, | 100 |
| శ్రీ పి. సంతానంగారు | ,, | 100 |
| శ్రీ డాక్టర్ యు. కృష్ణరావుగారు | ,, | 100 |
| శ్రీ కొఠారీ చిమన్‌లాల్‌గారు | ,, | 51 |
| శ్రీ దావీగారు | ,, | 51 |
| శ్రీ అమీచంద్ నగిన్‌దాస్‌గారు | ,, | 51 |
| యం. సి. దలాల్ అండ్ కో | ,, | 51 |
| శ్రీ వి. టి. రంగస్వామిగారు | ,, | 50 |
| శ్రీ డి. హెచ్. నంబూద్రిపాద్‌గారు | ,, | 50 |
| శ్రీ కె. రాజయ్యర్‌గారు | ,, | 50 |
| శ్రీ సుబ్బయ్యనాయుడుగారు | ,, | 35 |
| శ్రీ జే. యం. సేత్‌గారు | ,, | 30 |
| శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యంగారు | ,, | 25 |
| శ్రీ టి. ఎ. రంగాచారిగారు | ,, | 25 |
| శ్రీ చలసాని మాధవరావుగారు | ,, | 25 |
| శ్రీమతి కే. మాణిక్యాంబగారు | ,, | 25 |
| గౌరవనీయులు కుమారి స్వామిరాజాగారు | ,, | 25 |
| శ్రీ టి. భాస్కరరావుగారు | ,, | 25 |
| న్యాయమూర్తులు శ్రీ. కె. సుబ్బారావుగారు | ,, | 25 |
| శ్రీ యస్. శేష్‌మాల్‌గారు | ,, | 25 |
| శ్రీ ఎ. జానకీరామ్‌గారు | ,, | 20 |

## నృత్యగాన ప్రదర్శనములు

| | | |
|---|---|---|
| శ్రీ కె. యస్. మెహతాగారు | రూ. | 15 |
| న్యాయమూర్తి శ్రీ పంచాపకేశ శాస్త్రిగారు | ,, | 15 |
| శ్రీ వి. యస్. మణిగారు | ,, | 15 |
| కసిరామ్ అండ్ సన్సు | ,, | 11 |
| శ్రీ యం. రామచంద్రరావుగారు | ,, | 10 |
| శ్రీ జోగారావుగారు | ,, | 10 |
| శ్రీ కే. గోపాల్‌రావుగారు | ,, | 10 |
| శ్రీ యం. భక్తవత్సలంగారు | ,, | 10 |
| శ్రీ వి. వి. శ్రీనివాస అయ్యంగారు | ,, | 10 |
| శ్రీ అనంతశయనం అయ్యంగారు | ,, | 10 |
| శ్రీమతి చంద్రాబాయిగారు | ,, | 10 |
| శ్రీమతి సి. రత్నావళిగారు | ,, | 10 |
| ఉడ్‌లాండ్సుహోటల్ | ,, | 5 |
| శ్రీ బషీర్ అహమ్మద్ సయ్యద్‌గారు | ,, | 5 |
| శ్రీ హెచ్. జోగారావుగారు | ,, | 5 |
| శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు | ,, | 5 |
| శ్రీమతి జి. కమలామణిగారు | రూ. | 5 |
| శ్రీ శ్రీమన్నారాయణగారు | ,, | 5 |
| శ్రీ యస్. ఎ. గాఫర్‌గారు | ,, | 5 |
| శ్రీమతి డాక్టర్ రామకృష్ణమ్మగారు | ,, | 3 |
| శ్రీ టి. యస్. అరుణాచలంగారు | ,, | 2 |
| శ్రీ యన్. పి. రామాయమ్మగారు | ,, | 2 |

వీరికందఱకూ మా హృదయపూర్వక కృతజ్ఞత. ఆంధ్ర మహిళాసభ కార్యనిర్వాహక వర్గమువారు, ఉపాధ్యాయినులు, తదితర సభ్యురాండ్రు, విద్యార్థినులు, యీ కార్యక్రమ నిర్వహణలో మిక్కిలి తోడ్పడియుండిరి. వీరికి మా కృతజ్ఞత. అభిమానముతో, ప్రవేశ రుసుమునకట్టి ప్రదర్శనములకు విచ్చేసిన ప్రేక్షకవర్గమునకు మా కృతజ్ఞత. వీరందటి సహకార సాభిమానములతో మేము తలపెట్టిన సేవా కార్యక్రమము నిరాఘాటముగా కొనసాగగలదని భావించుచున్నాము.

జి. జమునాబాయి  అ. చన్నఘంటమ్మ





రిపబ్లిక్ అధ్యక్షులు బాబు రాజేంద్ర ప్రసాద్.
ఢిల్లీ అధ్యక్షభవనములో గరల్‌గైడ్స్, బ్లూబర్డ్స్ రాలీ చూచుచున్న దృశ్యం.

# ఆంధ్రమహిళాసభ

## మైలాపూరు - మద్రాసు

మహిళా విద్యాలయము :— హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్ పరీక్షలు, నృత్యము, గానము.

పారిశ్రామిక విద్యాలయము :— కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము.
(గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది)

టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ :— స్త్రీలకు టైపు, షార్టుహాండు - గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ.

మహిళా మందిరము :— స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము.

ఆంధ్రమహిళ :— స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక.

నిర్మలాదేవి గ్రంథాలయము :— సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము.

నర్సింగ్ హోమ్ :— స్త్రీ, శిశువుల సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మింపబడుచున్నది.

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited and published by G. Durgabai, M.A., B.L., at the Andhra Mahila Sabha, Mylapore, Madras.
Printed by M. Satyanarayana at the H. Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

# ఆంధ్రమహిళ





DECEMBER 1950. ANDHRA MAHILA ANNAS 6

## శ్రీ కృష్ణా, రాజకుమారి
## ఆంధ్ర దేశమంతటా, నైజామ్, రాయలసీమలలో

ప్రతిభా వారి

# స్వప్నసుందరి

తమిళనాడు, మైసూరు :
ఛల్లంపిక్చర్సు సర్క్యూట్,
బెంగుళూరు-2
ఆంధ్ర దేశము, నైజాము :
పూర్ణా పిక్చర్సు, విజయవాడ.
మదరాసు :
నేషనల్ పిక్చర్సు రిలీజ్.



**అంజలిదేవి**
**జి.వరలక్ష్మి**
**నాగేశ్వరరావు**
**శివరావు..ముక్కామల**

స్టూడియో
**వాహిని..**

ప్రొడ్యూసర్ & డైరెక్టర్.
**జి.బలరామయ్య**



# రీటా హెయిర్ టానిక్
## తల వెంట్రుకలను పెంచును



రీటా కురుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరుకు, ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొందియున్నారు. మీరుకూడ నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూ దేశమంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.




**RITA**
**HAIR TONIC**

# పెరుగుచున్న పసిబిడ్డలకు విటోఫెర్రిన్ అత్యవసరం

పసిపాపలకు విటోఫెర్రిన్ యిచ్చి, వారి పెరుగుదలను గమనించండి. పెరుగుచుండు పాపాయిలకును, వ్యాధుల నుండి తేరుకొనుచుండువారికిని, శరీరాభివృద్ధికి అత్యావసరమగు వస్తువిశేషాలు ఇందులో ఉన్నవి.






తయారుచేయువారు:
ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబొరేటరీ లిమిటెడ్,
మల్లేశ్వరం, బెంగుళూరు.

విక్రయ ప్రతినిధులు: బెస్ట్ & కంపెనీ, లిమిటెడ్,
పోస్టు బాక్సు నెం. 63, మదరాసు.

# మీరు మెక్లీన్‌తో

# నేడు పళ్లు తోముకున్నారా?



"నేను
ఏళ్లతరబడిని
మెక్లీన్స్
వాడుతున్నాను
నా నిత్యకృత్యాలు
దీనితోనే
ప్రారంభిస్తున్నవి".

నోటిని పరిమళభరిత మొనర్చి
దుర్వాసనను
నివారిస్తుంది

ఆమ్లాలను విరిచివేసి
మీ ఇగుళ్లను
సంరక్షిస్తుంది

పళ్లమీది మరకలను తొలగించి
వాటిని ధవళతర
మొనర్చుతుంది

అనుకరింపశక్యంకాని ప్రత్యేక సూత్రం ప్రకారం తయారైన మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు జగద్విఖ్యాతి గాంచినది. దీనికి కారణాలు: ఇది మిక్కిలి పరిశుభ్రమైనది. పంటిమీది మరకలు తొలగించుటలోను, నోటిని శుభ్రపరుచుటలోను శక్తివంతంగా పనిచేస్తుంది. వాడునపుడు ఆహ్లాదకరమైనది, పరిమళభరితమైనది.

కోట్లకొలది ప్రజలు అలవాటుగా నిత్యం మెక్లీన్స్‌తో దంతధావనచేస్తూ తమ నిత్యకృత్యాలను ప్రారంభిస్తున్నారు.

నేడే మెక్లీన్స్ కొనండి!




MTR 276

# ఆంధ్రమహిళ

సంపుటి 7 :: డిసంబరు '50 :: సంచిక 8

ముఖచిత్రం :—గౌతమబుద్ధ.

చిత్రకారుడు : డి. రామలింగేశ్వరరావు.



సంపాదకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం. యే., బి. యల్.

సహసంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం. యే. యల్. టి.

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్

సంవత్సర చందా — అయిదు రూపాయలు



## ఆంధ్ర విద్యా సంఘము

### ఢిల్లీ

18-11-50 న, ఢిల్లీలో, పై సంఘపు యాజమాన్యమున జరిగిన సమావేశములో, విజయనగరవాసినియైన కుమారి సాలూరి సరోజని గాంధి చరిత్ర హరికథా కాలక్షేపము జేసెను. శ్రీ కళా వెంకటరావుగారు సభకు అధ్యక్షత వహించిరి. శ్రీ అనంతశయనం అయ్యంగారు, తిరుమలరావు గారు, పట్టాభి సీతారామయ్యగారు, బి. సోమయ్యగారు, పి. ఎన్. మూర్తిగారు, తదితర ప్రముఖులు సమావేశమునకు విచ్చేసిరి. శ్రీమతి దుర్గాబాయిగారు, కుమారి సరోజని శ్రావ్యయుతంగా హరికథ చెప్పినందులకు ఆమెను అభినందించిరి. అభినందన చిహ్నముగా ఒక రజిత పాత్రను సంఘము తరఫున ఆమెకు బహూకరించిరి. శ్రీ రామగోపాలరావుగారి వందన సమర్పణతో సభ ముగిసినది.

బి. ఎస్. చారి,

కార్యదర్శి.

# అశోకా టాయిలెట్ పౌడరు

మీరు అనేక విధములైన పౌడర్లను ఉపయోగించి యుండవచ్చును. ఈ మా అశోకా టాయిలెట్ పౌడరును కూడా ఒకసారి వాడిచూడండి. దీనిని వాడినచో ముఖమునకు చక్కని అందము నిచ్చును. చర్మము నును పుగా, నిగనిగలాడునట్లుచేయును. వేసవికాలపు ఉష్ణ తాపము నణచి మీకు హాయి నొసగును.







# అశోకా టాల్కమ్ పౌడరు

ఈ పౌడరును ప్రత్యేకముగా చిన్న బిడ్డల వుపయోగార్థమై మేము తయారు చేసితిమి. మీ బిడ్డలకు దీనిని ఒకసారి వాడి చూడండి. పిల్లలకు దీనిని వాడినచో, పేలుటు, చిడుములు మొదలైనవి లేకుండ, చర్మమును పరిశుభ్రముగా నుంచును.

అశోకా మార్కును గమనించి కొనవలయును.

# ఆలసింపకుడు

మీ సర్వరోగముల నివారణకై శ్రీ రాఘవేంద్ర యోగీశ్వరులవారిని సంప్రదించుడు. ఆశ్రమ నివేదిక 0-12-0 పోష్టు బిళ్లలకు పంపబడును.

శ్రీ యోగాశ్రమము
ఋషికొండ బీచ్ :: పెద వాల్తేరు.

ఇంగువం
VHR
ఆరోగ్యము, ఇచ్చును!
వర్జీవన్‌దాస్ హీరాజీ అండు కో.,
194 గోవిందప్పనాయకన్ వీధి,
మదరాసు.




సంపుటి 7 డిసంబరు 1950 సంచిక 8

# ఆస్థానకవి

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్ ?" (భర్తృహరి)

సచేతన ప్రకృతిలో సారస్వతం ఒక సామ్రాజ్యమే. పరమేశ్వరుని సృష్టి చిత్రంలో ఉత్తమ కవుల భావనకందని దభావమే. వారి దృష్టి సూర్యకిరణ ప్రసారముకన్న శీఘ్రగతి గలదనియు, అచేతనములను గూడ రసపోషణచే సచేతనులనుగా నొనర్చగల సారస్వతమనెడి సంజీవి వారిచేత గలదనియు, కావున పండితులు, కవులు ఒక విధంగా సార్వభౌము లేయను ప్రతీతి సత్యము.

కాని "నిరాశ్రయా నశోభన్తే, పండితా వనితాలతాః" అనుసూక్తి, ఇట్టి వారికి రాజ్యాస్థానములు ఆశ్రయ మివ్వవలెనని సూచించుటయు సత్యమే; కాగా, పండితకవులకు ఆశ్రయులు ప్రభువులు, ప్రభువుల ఆస్థానములలో రాజ్య మేలించువారు పండితకవులు. కావున ఈ ఉభయులు పరస్పర గౌరవ భాజనులనుట సారాంశము. ప్రస్తుతం మన మదరాసు ప్రభుత్వాస్థాన కవీశ్వర గౌరవస్థానము నలంకరించిన, మహా మహోపాధ్యాయ, కళా ప్రపూర్ణ బ్రహ్మశ్రీ. శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రిగారు, కవిసార్వభౌములు, శ్రీపాదులును అగుటచే, పైఁజెప్పిన ఉభయ గౌరవములు వీరియందు సార్థకములని మాయభిప్రాయము.

శ్రీ శాస్త్రిగారు, వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు. చిన్న నాటనుండియు వేదశాస్త్రములను ససంప్రదాయముగా నధ్యయనం చేసి, వాటి పరిణతికొరకు సంస్కృతమున కాళిదాసాది మహాకవులను, తెనుఁగున కవిత్రయమును. విశేషించి, శ్రీనాధ మహాకవిని తమ లక్ష్యమునందుంచుకొని "కవితా యోగమును" సాధింప మొదలిడిరి. తదాది వీరి కవితా దృష్టి పరిశిష్టమై, వేద వ్యాసుల వంకకు మరలి, పంచమ వేదమైన మహాభారతము వంకకు ప్రసరించినది. కవిత్రయం వారు స్వతంత్రానువాదంగా రచించిన దానిని, వీరు యథాతథంగా ఏకదీక్షతో ఒక్క లేఖినితో అనువదించిరి. అంతతో గాక, రామాయణ, భాగవతములను అనువదించిరి. రామాయణమందు

# ఆస్థానకవి

క్రొత్త పోకడలు వీరి రచనలో కొన్ని కానవచ్చిననూ చక్కని సమన్వయ ధోరణికలవై, సుందర ములుగా నున్నవి. భాగవత మింకను ముద్రితము కానట్లున్నది. ఇవి గాక వీరి రచనలు, సారస్వతములైన వివిధ శాఖలలో శతాధికాలైయున్నవి. నేటి నవ్యరచనారీతులలో కూడా, అనేకములైన పల్లెపదాలు, పాటలు వీరివి ప్రచారములో నున్నవి. ఇక నాటక రచనలో వీరి "వీరబొబ్బిలి" తెలుగు నాట చిరకాలముగా రంగస్థలంలో విజయ భేరీ నినాదాన్ని మ్రోగించు చునే యున్నది. మరికొన్ని సుప్రసిద్ధ నాటకము లెన్నో వీరు రచించినవి గలవు. విశేషించి శ్రీ శాస్త్రిగారికి సంగీత కళయందును ప్రవేశం కలదనుటకు, వీరు రచించిన హరికథలు ఋజు విచ్చుచున్నవి. ఇంక నెన్నో హాస్యరచనలు కూడా యున్నవి. వేయేల, వీరికృతి కన్యలను వరించిన కృతి భర్తలు, మహారాజులు మొదలు, సహృదయులగు కవితోపాసకుల వరకును, శతాధికులై యున్నారు. వీరందర నొక్కచో చేర్చినచో శ్రీ శాస్త్రిగారి కవితా కుటుంబ మొక మహా రాజా స్థానమునకే మాత్రం తీసిపోదు. శ్రీ శాస్త్రిగారిని చూచినపుడు, ఆంధ్ర సామ్రాజ్య నేతయైన రాయలవారి ఆస్థానమందు సర్వ గౌరవములనందిన అల్లసాని పెద్దన మొదలగు ప్రాచీన కవుల రీతులు జ్ఞాపకమునకు వచ్చును. వీరును, రత్నమయ కిరీటు, రత్నోపహారములు, స్వర్ణకంక ణము, కవి గండపెండేరము, స్వర్ణపూజ, మదకరీంద్రారోహణోత్సవం మొదలగు అన్ని విధము లైన మహారాజోప చారములనొంది, వాదిమత్తేభ కంఠీరవులై, సారస్వత రంగమున నలుదిశల విజయ యాత్ర సాగించిన ధీరులు—మన సమకాలంలో ఇన్ని గౌరవములకాటపట్టైన శ్రీ శాస్త్రి గారివంటి మహాకవులను, దర్శించుట, గౌరవించుట మన యదృష్ట మనక తప్పదు.

నన్నయ్య గారన్నట్లు "నిండు మనంబు నవ్యనవనీత సమానము; పల్కుదారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు" అను నిర్వచనము, శ్రీ శాస్త్రిగారి పట్లకొంత సార్థక మని కొందరందురు. అదియు వీరికొక యలంకారమేయని మాభావం—

కావుననే వీరి వాగ్విజృంభణం చాలా ప్రౌఢంగా గర్జించినట్లుండును. సార్వజనీనంగా వీరి హృదయం ప్రేమ పాత్రము; ఉదారవంతము నని మాత్రం పలువురు చెప్పుకొందురు. ఏవిషయంలోగాని వీరితరుల శ్రమసహించ నేరరట; కావుననే, కలంచేత బట్టునది మొదలు అనేక రాజసన్మానములవలన సుమారుపది, పన్నెండు లక్షల ద్రవ్యమార్జించియు, శ్రీపాదులై యుండియు, ఈ వార్థక్యంలో, హాయిగా, ఆశ్రితకోటితో, నిర్విచారంగా, కాలక్షేపం చేయుటకు వలయు స్థాయిలేనట్లు వినుచున్నాము. కావున వీరినన్ని విధములా గౌరవించుట దేశీయులమగు మనయొక్క ప్రధానమైన బాధ్యతయని మాత్రము మనవి సేయకతప్పదు.

పూర్వము, రాజాస్థానములలో, రాజసభలలో సామాన్య జనమునకు ప్రవేశం దుర్లభమై యుండేది. నేడు మన యదృష్టవశమున ప్రజా పరిషత్తులే రాజసభలైనవి. వారివారి యభిరుచుల కొలదియు, సర్వులు సారస్వత సౌందర్యము నుపాసించనుత్సుకులై యున్నారు. మన తొల్లింటి



మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, అభినవ శ్రీనాథ, కవి సార్వభౌమ

బ్రహ్మశ్రీ. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

మదరాసు ప్రభుత్వ ఆస్థాన ఆంధ్ర కవులు.

చేతనైనా అనుభవించ వలెననే పిపాస, నవచైతన్యం ప్రజలలో గోచరించుచున్నది. కాని, సారస్వత రంగంలో మాత్రము వేరు, వేరు దృక్పథములు కూడా కానవచ్చు చున్నవి. అన్ని విషయములలోనూ నేటి స్థితి, ప్రాత క్రొత్తల కలయికతో, కొంత విప్లవాత్మకమై యున్నమాట నిజం. సాహిత్య వీథుల్లో, అనేకములైన అనుకరణములు తలలెత్తుచున్నవి. తొలుదొల్త అవి ముగ్ధ

మోహనాలై కన్పట్టినా, సారస్వతో పాసనమునకు, పతిష్ఠతకు ఆయారీతు లెంతవరకు నిలువ గలవో తెలియకున్నవి. ఇట్టి సంధిసమయంలో శ్రీ శాస్త్రిగారివంటి పండితకవులు, మన యాస్థాన మలంకరించుట ముదావహము. శ్రీ శాస్త్రిగారు యీావరకూ చూపిన సమర్థతయేగాక, మున్ముందు కూడా, భాషా వేత్తలందర కాదరపాత్రులై, తమ పాండితీ ప్రతిభచేతనూ, కవితా విశేషం చేతనూ, వర్తమాన, భావిలోకానికి, కవితా సాహిత్య రంగాలలో చెరిగిపోని వరవడిని తీర్చిదిద్ది, శాశ్వత కీర్తి ప్రతిష్ఠల నొందుదురని కోరుచున్నాము.

వీరికి ముందు ఆస్థానకవులుగా నుండిన కీ॥ శే॥ చెళ్లపిళ్ల వారు శ్రీ శాస్త్రిగారి శిష్యులే అయియుండి, వీరికన్న ముందుగా ఆస్థానకవి గౌరవాన్ని పొందుట శ్రీ శాస్త్రిగారికిన్నీ, విశేష గౌరవమునే కూర్చినది. గురుశిష్యులలో, "శిష్యాదిచ్ఛేత్పరాజయమ్" అనేసూక్తి సార్థకము. గురువుల కింతకన్న ఆనందహేతు వేమి యుండునని పెద్ద లందురు. ప్రస్తుతం మన ప్రభుత్వ నేతలు, నాయకులు చాలా సముచితమైన నిర్ణయంతో శ్రీ శాస్త్రిగారిని, ఆస్థానకవి పట్టభద్రులనుగా చేయుటచే, ప్రజాసామాన్యమే గాక, కవిపండిత సజాతీయ వర్గము, యువక కవులు కూడా చాలా ఆనందించుచున్నారు. విశేషించి, మన ప్రభుత్వాస్థానంలో, వివిధ భాషలు వివిధ సంస్కృతులు సమైక్యమై యున్నవి. ఈ రంగమున శ్రీ శాస్త్రిగారు ఇతోధికంగా, తమ ఆంధ్ర కవితా శంఖా రావాన్ని పూరించి, అచిర కాలంలో ప్రత్యేకాంధ్ర స్రామ్రాజ్య కవీశ్వరులు కావాలనికూడా, ఈసమయంలో కోరుట, ఎవరి వ్యక్తిత్వమును వారు గుర్తించుకొనుట యేయని మాయభిప్రాయం.

శ్రీకవి సార్వభౌములకూ యావదాంధ్రలోక పక్షమున మద్రాసు ప్రభుత్వాధికార వర్గమునకు, ఇవే మా అభినందములు.



# కృతజ్ఞత

వెంకటరామా అండ్ కో వారు, ఈ దిగువ పేర్కొన్న పుస్తకములను నిర్మలాదేవి గ్రంథాలయమునకు బహూకరించిరి.

| | | |
|---|---|---|
| 1. శంకరనారాయణ ఆంగ్లాంధ్ర నిఘంటువు | | |
| 2. మహాపురుషుల జీవితములు | — | చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు |
| 3. Tit bits. వినోదములు | — | ,, |
| 4. ప్రహసనమంజరి | — | ,, |
| 5. కాలభైరవుడు | — | శ్రీ కె. కుటుంబరావుగారు |
| 6. అనుపమాదేవి | — | శరశ్చంద్రుని మాతృక |
| 7. జాతీయనాయకులు | — | శ్రీ కోటమర్తి చిన రఘుపతిరావుగారు |
| 8. వనమాల | — | శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు |
| 9. రాజేంద్ర ప్రసాదుజీవితము | — | శ్రీ పరుచూరి రామకృష్ణయ్యచౌదరి |
| 10. భగవద్గీత | | |

ఇంకా ముందు ముందు వీరి సహకారముతో మా గ్రంథాలయమును వృద్ధిలోనికి గొనిరాగలమని ఆశించుచున్నాము.

క. రుక్మిణమ్మ, గ్రంథాలయ కార్యదర్శిని.

# బెర్నార్డ్ షా

* శ్రీమతి జి. కమలామణి *

సోదరీ,

అసామాన్య మానవుడైన బెర్నార్డ్‌షాను గురించి ఏమైనా వ్రాసి పంపమన్నావు. దాని కేమనను? అది కేవలం నీకు నాయందున్న అభిమానాన్ని సూచిస్తోంది. చాలా సంతోషం. కానీ,—నీకోర్కె ప్రకారం, ఆ లోకోత్తర పురుషుని గురించి వ్రాయ సాహసించడానికి చాలా భయంగా ఉందిసుమా.

ఇది వరకే మహామహు లెందరో, షాను గూర్చి ఎంతెంతో వ్రాశారు. ఇక ఇప్పుడు, 'జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?', అని, లోక మెరిగిన లోకాతీత మానవుని గురించి, ఎక్కువగా ఏస్తుతి వాక్యములూ వ్రాయనక్కర లేని అవసరం లేదు; తగినంతగా వ్రాయనూలేను! అతని మానసిక ఔన్నత్యమూ, నిశిత ధీవిశేషమూ నాకు నిరూపించి చూపించ బోవడం, భూమ్యాకాశాలను వెలుగుతో నింపుతూ, గగన వీధిలో సంచరించే లోకబాంధవుడైన సూర్యుణ్ణి, పసిపాప తన కరదీపికతో చూపించడము వంటిది. అయితే, దినమణికి దీపహారతి లాగ, షా, మహత్తర ప్రతిభా శక్తికీ, మానవాభ్యుదయ కాంక్షకీ, ఆశ్చర్యగౌరవ పూర్వకమైన నివ్వాళిగా, నాలుగు వాక్యాలు ప్రతివారూ సమర్పించ వచ్చును గనుక, నీమాట కాదనకుండా వ్రాయ సాహసిస్తున్నాను.

బాపూజీ లాగునే బెర్నార్డ్‌షా కూడా ప్రపంచ పౌరుడు; ప్రబల మేధావి; కార్య శూరుడు; కర్మయోగి!

సామాన్య మానవుల మధ్య, ప్రజ్ఞా దురంధరుల మధ్య ఒక్క విధముగా మసిలాడు. బీదలకూ, భాగ్యవంతులకూ ఒకటే న్యాయముగా భావించాడు. లోకము పోకడలన్నీ మసక దృష్టి లేకుండా విస్పష్టముగా చూచాడు. మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయాలలోని అసందర్భాలనీ, అన్యాయాలనీ, అద్దంలో ప్రతి బింబింప జేసినట్టు, అక్షరాలతో వ్యంగ్యంగా చిత్రించి చూపించాడు. ప్రపంచములోని మానవ జాతి కంతకీ వర్తించవలసిన న్యాయాలనీ, మానవ విలువలనీ, నంగినంగిగా కాకుండా, నసుగు నెసుగులు లేకుండా, నిర్భయంగా చాటిచెప్పాడు. నిరాడంబరంగా జీవించాడు!

ఏమూరు మూలనో, ఏకొండకోననో, చిన్న సెలయేరుగా పుట్టి, రానురాను విశాల ప్రవాహమై, ప్రజా శ్రేయస్సునకు తోడ్పడే, జీవనదులతో ఉపమించ తగినది ఆయన జీవిత చరిత్ర. పారావారము లాగు మేరలేనివి ఆయన ప్రజ్ఞా ధురీణత—అభ్యుదయ కారకములైన ఆయన ఆశయపరంపరలు!

ఐర్లండులోని డబ్లిన్‌లో, 1856 వ సం॥ జూలై 26 న ఆయన జన్మించాడు. ఒక సంస్థానాధీశుడి కడపటి కొడుకుల సంతతిలోని వాడు తండ్రి. సంగీతములో అమితమైన అభిరుచి, నైపుణ్యమూ గలది, తల్లి. అందుచేత నే ఏమో, ఒక విధమైన చురుకు, రాజసం, కళాభిజ్ఞత ఆయనలో ఎప్పుడూ తొణికిసలాడుతూ ఉండేవి!

మొదట కొన్ని రోజులు ఇంటిలోనే విద్యాభ్యాసం చేయించి, తరువాత, 1867 లో, ఒక బడిలో చేర్పించారు, తల్లిదండ్రులు. నాలుగేళ్లు ఒక బడినుంచి మరొక బడికి మారుతూ గడిపి, చివరికి 1871 లో, స్కూలు చదువుకి పూర్తిగా స్వస్తిచెప్పి వేశాడు, షా. నలుగురైదుగురు గురువుల దగ్గరనుంచీ, నాలుగు గోడలకు మధ్య నున్న కాలేజీలనుంచీ, విద్యాబుద్ధులు నేర్చి, డిగ్రీలు తెచ్చుకునీ కాక, అపారమైన తన శేముషీ విశేషంవల్లనూ, విశాల విశ్వం లోని అసంఖ్యాక ప్రజానీకపు సమస్యలని సూక్ష్మ దృష్టితో, సానుభూతితో, చూడగలుగుటవల్లనూయే, ఆయన అంత ఉన్నత స్థాన మాక్రమించగలిగినా డన్నమాట!

మొదలే ఎక్కువ సంపన్న కుటుంబముగాదు. ఆపైన, తండ్రి త్రాగుబోతు తనముచేత స్థిరత్వము లేక, ఉన్నది కూడా సన్నగిల్లి పోయింది. అందువల్ల బడిమానిన వెంటనే, జీవనోపాధికని, డబ్లిన్‌లో ఒక ఎస్టేటు ఏజెంటుదగ్గిర చిన్న గుమాస్తాగా ప్రవేశించి, మరొక నాలుగైదు ఏళ్లు ఎల్లానో కష్టంమీద గడిపాడు కాని, అక్కడ ఆపనిలో సంతృప్తితో ఉండలేక, 1876 లో ఆ ఆఫీసు నేకాక,

ఐర్లండును కూడావదిలి, తన అదృష్టాన్ని న్వేషిస్తూ, ఇంగ్లడు వచ్చి, లండనులో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. అవును ; ఆ అసంతృప్తి సహజమే. గరికతినడంలో తప్పు లేదుగాని, ఎంతో ఆకలిగా ఉన్న సింగపుకొదమ, గడ్డి మేస్తూ సంతృప్తి పడగలదా !

1876 నుంచి, 1885 వరకూ, కొంత నవలారచనసాగించినా అవి ఎక్కువ పేరు ప్రఖ్యాతులనుగాని, రాబడినిగాని కలిగించలేదు. అసలవి అచ్చులోనికి రావడమే అతికష్టమై పోయిందిట. "నిజమే చాలా బాగుందిగాని, చెల్లు బడికాదు." అని, ప్రకాశకులు పెదవి విరిచే వారుట, తను వ్రాసిన నవలలని జేబులో పెట్టుకుని, ఎందరెందరో ప్రకాశకులని దర్శిస్తూ, దాదాపు ఏడు సంవత్సరాలు తిరిగిన తర్వాత అచ్చులోనికి వచ్చిందట, ఆయన మొదటి నవల ! ఆ రోజుల్లో—ఏదో అప్పుడప్పుడు కొంచెంగా తండ్రి యిచ్చిన దానిపైనా, ముఖ్యంగా తల్లి సంగీత పాఠాలు చెప్పగా వచ్చిన దానిపైనా ఆధారపడుతూ కాలక్షేపం చేశాడు. ఆవిధంగా జీవితం గడపడం చాలాబాధాకరంగానే ఉన్నా, రచనలుమాని వేరొక వ్యాపారంలోనికి పోలేక పోయాడు. కష్టనిష్టూరాలకోర్చి, ఆత్మ విశ్వాసంతో పట్టుదలగా పని జెయ్యడమే ప్రజ్ఞావంతుల లక్షణం !

1885లో, "Pam Mall. Gazette" అనే పత్రికలో గ్రంథ విమర్శకుడుగా చేరిన తర్వాతనే, రచనావ్యాపారం, జీవనోపాధిరైన వృత్తిగా అనుకూలించింది. ఆ నాటినుంచి, యశోధనములు రెండూ అభివృద్ధి చెందుతూ, ఆమరణాంతం, ఒక్క పుస్తక విమర్శే కాకుండా, సర్వ విషయాలనీ పత్రికల్లో చర్చిస్తూ, గ్రంథాలని రచిస్తూ, సర్వతో ముఖ విమర్శకుడుగా విలసిల్లాడు. 1879 నించి, 1883 వరకూ రాణింపురాని నవలారచయిత, 1892 నుండి ప్రముఖ నాటక కర్తగా పేరెన్నిక గన్నాడు. దీనికి కారణం, ఆయనే తన ఉపోద్ఘాతాల్లో ఒకచోట చెప్పాడు, తను కంటికే జబ్బూ లేకుండా, స్పష్టంగా సూక్ష్మంగా, చూడ గలిగినవాడిలాగ, ప్రతి విషయాన్ని చూసి, కనపడినదంతా నవలారూపాన్ని వ్రాశాడు. కాని, ప్రపంచంలో నూటికి తొంభైమందికి పైగా దృష్టిసరిగా ఆనదు. ఆయన చెప్పినమాటలు వెంటనే ఎలా అంగీకరిస్తారు ? కళ్లజోడు పెట్టి చూపించాలి—అది గ్రహించి, ఉన్నదున్నట్టుగా చూపించే నవలారచనమాని, కళ్లకు ఆ నేలాగ నాటక సృష్టి ప్రారంభించినాడుట. 'బాక్సు ఆఫీసు ! లాభం తీసుకుని వచ్చిన ప్రథమనాటకం, 'Devils desciple.' అన్నది. ఆ తరవాతనే, తన నలభై రెండవయేట, Miss. Gurly అనే ఆమెని వివాహమాడాడు. సాధారణంగా, అందరికీ, జీవితం నీరసించవలసిన వయస్సులో, ఆయనకి జీవితం మహోజ్వలంగా సాగడం ఆరంభించింది !

స్వభావతః సభాపిరికి అయిన షా, గొప్పవాగ్ధాటి గల ప్రవక్తగా ప్రసిద్ధిజెందాడు. ఏదో సంఘము వారేర్పాటు చేసిన పోటీలో పాల్గొనడానికి, తొలిసారి వేదిక నెక్కాడట. అమితమైన బెదురూ ఖంగారుతో ముచ్చెమటలూ పోసిపోయి. చెప్పవలసిన ముఖ్య విషయాలన్నీ మరచిపోయి, నగుబాట్లపాలుగా, వేదిక దిగిపోయినాడుట. దానితో ఒక పౌరుషమూ, పట్టుదలాకలిగి, అవకాశము కలిగినప్పుడల్లా, సభలలో వేదికలమీదికెక్కి ఉపన్యాస మివ్వడ మారంభించాడట. అంతకంతకిసాపు దేరి,—చివరికి,—అతిస్పష్టంగా, చమత్కారంగా, సూటిగా నాటేలాగ మాటాడగలిగిన, సాటిలేని వక్త అని శ్లాఘించబడ్డాడు. సామర్థ్యం గలవారు ధైర్యంతో పైకి వస్తే సాధించలేనివి లేవని ఋజువుచేశాడు !

ఇది క్లుప్తముగా ఆయన జీవిత చరిత్ర : షా, స్వయంనిర్మిత ఆదర్శారాధకుడు ; అఖండ ప్రజ్ఞాశాలి, అభ్యుదయ మార్గదర్శకుడైన విప్లవవాది. విశిష్ట విద్యాభిలాషి, కేవలం భాషాలంకారాలుగనూ, సమస్యా పరిష్కారాలుగనూ వ్రాయడం కాక, మానవకోటి కోసం, అన్ని విషయాలనూ అన్ని కోణాలలోనుండీ విస్పష్టంగా చూపించి, ప్రజలలో జిజ్ఞాస లేపడమే ఆయన రచనలలో ముఖ్య విశేషం. రచనా పటిమలో షేక్స్పియర్‌కు ప్రత్యర్థిగా నిలిచి, మరొక అడుగు ముందుకు వేసిన మహానాటక కర్త. షేక్స్పియర్ పురాత నాదర్శాలకి దేవత్వం కలిగించి, అమరుడైతే, నూత నాశయాలకి ప్రాణ ప్రతిష్ఠచేసి, భావి యుగబ్రహ్మ

అయినాడు, షా!—ఇక, షేక్స్పియర్ లాగ పద్యరచన కాదనీ, వర్తమాన సమస్యలే చర్చించ బడినాయనీ, షా నాటకములను ఉన్నత కావ్యశ్రేణిలో చేర్చరాదనే విమర్శకులూ లేక పోలేదు. వారికొక్కటే జవాబు. భూతభవిష్యత్తులకు వర్తమానమే ఆధారం. ఘనత, గద్య పద్యాలతో లేదు: గద్యరచనగానీ, పద్యరచనగానీ, ప్రజా శ్రేయస్సు నభిలషించి, హృదయం కదిలేలాగ, స్వచ్ఛంగా, పదసౌలభ్యంతో వ్రాసిన దేదైనా ఉన్నత కావ్యమే!

సృష్టి శక్తిమీదా, ప్రకృతి పరిణామంమీదా, షాకు పరిపూర్ణ విశ్వాసము. ఆ ప్రబలశక్తే ఆలోచనలు రేపేది; క్లిష్ట కార్యాలనైనా పట్టుదలతో చేయించేది; ధైర్యంతో పరిస్థితుల నెదుర్కొన జేసేది; ఆ మహత్తర శక్తికి, మానవుల నవసరంగా, అన్యాయంగా అడ్డుగట్లు వేయక, స్వేచ్ఛగా, సహజంగా సాగనియ్యడమే మానవాభ్యుదయ కారకమని, లోకానికి తెలియజెప్పడం తన ముఖ్య ధర్మంగా భావించాడు 'Getting Married, Man and Super-man, Apple-Cart' మొదలైన వాటన్నిటిలోనూ, ఆయన అభిప్రాయాలని వ్యంగంగా నొక్కి చెప్పాడు. ఆవ్యంగం వెటకారమూ మాటునుండీ, మానవాభ్యుదయం, ఆనందం కోసం ఆయనపడే ఆరాటం, ప్రస్ఫుటమవుతూనే ఉంటుంది. ఆయన చెప్పినదంతా నగ్నసత్యం. అసలు సత్యాన్ని చూడడానికే సాధారణంగా జంకుతాము, అందులోనూ నగ్నసత్యం! చప్పున ఔననగలమా? అయితే, మనం వాటిని ధైర్యంగా ఆమోదించి, ఆచరణలో పెట్టినా పెట్టలేకున్నా, పురాతనాచారాలూ, సనాతన సాంప్రదాయాలూ అనే తెరలు భేదించి వేశాడు. ఉన్నదున్నట్లుగా చూపించాడు, అనుక్షణం, అనేక మార్పులు చెందుతుండే ప్రపంచలో, ఆర్థిక, మత, సాంఘిక, రాజకీయ, కళారంగాలలో మార్పులు రావడమెంత అవసరమో, మనం గట్టిగా గుర్తించేలాగ చేశాడు.

షా, కొన్ని నూతనాశయాలని చూపించనిదే, పురాతనాదర్శాలనీ, సంస్థలనీ ఖండించలేదు. మహారాజులుగా కొందరు కూర్చుని తినడమూ, గర్భదరిద్రులుగా కొందరు క్రుంగి పోవడమూ దైవ నిర్ణయ న్యాయమని, షా అంగీకరించడు. సోమరి జీవనం ఎవ్వరిలోనూ కూడ దంటాడు. స్త్రీ పురుషులందరూ మానవ వ్యక్తులేనని, అన్ని సమస్యలకీమూలం ఆర్థిక సమస్యేనని ఏ వ్యక్తీ మరొక వ్యక్తి, దయాధర్మముల మీద ఆధారపడకుండా, వ్యక్తికలిగి ఆర్థిక స్వాతంత్ర్యంతో జీవించడం మానవత్వం నిలవడానికి అవసరమని ఆయన వాదన. అన్నీ ఏ విధంగా సాధ్యమో, 'Intelligent woman's guide to Socialism and Capitalism' అన్న దానిలో సంపూర్ణంగా చర్చించాడు. మరొక దానిలో, డెమోక్రసీ అంటే, తోడేళ్లు మేకలను పరిపాలించడం, అని పరిహాసంగా వ్యాఖ్యానం చేశాడు.

"స్త్రీ పురుషు లిద్దరూ మానవ జాతిలోని వాళ్లే, ప్రకృతి అన్ని పార్టీలకన్న బలవత్తరమైనది. ఏ పార్టీగాని, ఏ సంస్థగాని చక్కగా నడిచి వర్థిల్లాలంటే, స్త్రీని సమాన మానవవ్యక్తిగా గుర్తించి, సమానావకాశాలిచ్చి, సంపూర్ణ సహకారం పొందితీరాలి. మానవులందరికీ ఆర్థిక స్వాతంత్ర్యం, సేవాభారం, విరామసౌఖ్యం, స్వేచ్ఛాజీవనం కలిగించడం



అమరజీవి బెర్నార్డు షా

ప్రధాన లక్ష్యాలుగా ఉంచుకోవాలి” అని షా, ఎన్నో చోట్ల వ్యక్తం చేశాడు. ప్రతివ్యక్తికీ జీవనోపాధి కలిగించడం, నిరుద్యోగ సమస్య నిర్మూలించడం, పసిపాపలనీ, వృద్ధులనీ, రోగులనీ, అంగవికలులనీ, జాగ్రత్తగా రక్షించి, పోషించడం, ఏ ప్రభుత్వపు దైనా ప్రధాన కర్తవ్యమని ఆయన అభిప్రాయం. వ్యక్తులలో భేదములాగే, వృత్తులలో భేదమూ, కొంతవరకూ హెచ్చుతగ్గులూ మానవజాతి ఉన్నంత కాలమూ ఉండకమానవు. కాని, సోమరితనం నిర్మూలించబడాలి. ఒక జాతి కొక్కటే వృత్తి అనీ, ఒక వృత్తి నీచమూ ఒక వృత్తి ఉన్నతమూ అనే భావంపోవాలి. వర్ణవర్గ భేదములతో, స్త్రీ పురుష భేదముతో అణిచి వేయబడకుండా, మానవులందరూ సమానావకాశములతో, స్వేచ్ఛగా జీవింపగలిగేటట్టు సాంఘిక, ఆర్థిక రాజకీయ విధానాలుండవలెనన్నదే ఆయన సోషలిజం. అంతేగాని, అందరూ, ఒక్క పనిచేస్తూ, ఏ నీతి నియమాలు హద్దు పద్దులు లేకుండా తిరగాలని కాదు. శిక్షణకలిగి, శ్రమ పడుతూనే ఏదైనా సాధించాలంటాడు.

ఇక, స్త్రీ శక్తి యుక్తులమీద ఆయనకున్న నమ్మకకి మేరలేదు. సృష్టి సహజం; ప్రకృతి పరిణామం అభివృద్ధి చేయనీ ప్రకృతి స్వరూపిణి అయిన స్త్రీయే, లోకోత్తర పురుషుని సృష్టిస్తుందనీ ఆయన ఆశయం. మానవ కల్పిత మంత్ర తంత్రాలతో ఒక పురుషునికి కట్టుబడినా, కట్టుబడక పోయినా, మాతృత్వము వహించే స్త్రీ ప్రకృతి ఆజ్ఞలను శిరసావహించి, చరితార్థురాలైన దంటాడు. అందుకని నిరసించక, సానుభూతితో ఆదరించమంటాడు.

సోదరీ, ఆయన ప్రజ్ఞా విశేషాలనీ, ఉన్నతాశయాలనీ, రచనా చమత్కారాలనీ ఎన్నని చెప్పగలము? మహా సముద్రంలో మంచి ముత్యాలు లాగ ఏరినకొద్దీ దొరుకుతూనే వుంటాయి. ఆయన రచనలు చదువుతూ ఉంటే, మునిగి పడుకుని ఉన్న మనస్సు, లేచి ఉత్సాహంతో ముందుకు పరుగిడుతుంది.

షా, పత్రికావిలేఖరి; ప్రఖ్యాత విమర్శకుడు; నవలారచయిత; నాటక నిర్మాణ నిపుణుడు; తార్కికుడు; తత్వవేత్త; వాగ్విభవము గలవక్త; ఆర్థిక, రాజకీయ సమస్యా పరిష్కార చతురుడు; సంఘ సంస్కారి; సహజ కళాశాలి; సర్వమానవ శ్రేయోభిలాషి!




## అష్టమగుచ్ఛము

### ౧

నరసింహమూర్తి మేష్టారు ఉత్తరం చదువుకున్నప్పటి నుండీ పద్మకు ఉద్భవించిన ఆవేదన నానాటికి ఎక్కువై పోయింది. తనకెంత విసుగు ఉద్భవింపచేసినా, నరసింహమూర్తి మేష్టారి రాక మాయమైపోగానే ఆలోటామెకు రోజుకు రోజుకూ ఆందోళన ఎక్కువ చేయసాగింది. సాయంకాలం కాగానే ఆయన వస్తాడన్న భావం, ఆతడు రాకపోయేసరికి గుండె గుబేలు మనడమూ! నాలుగు రోజులు గడిచేసరికి పద్మావతికి భరింపరాని బాధ కలిగింది.

ఏమయ్యాడు? ఎక్కడ బాధపడుతున్నాడో! సముద్రం లోనో, ఏ రైలుకిందో పడి ప్రాణం తీసుకోలేదుకదా!

ఆమెకు వెనకటి చరిత్ర అంతా సినీమా భాగంలా మనస్సులో నెమ్మదిగా జరిగిపోతూ ప్రత్యక్షమైనది. ఈ మధ్య తాను సముద్రతీరానికి వెళ్లినా, సముద్రంగాని, ఇసుక తిన్నెలుగాని, కెరటాలుగాని, నీరదూరాలుగాని కనపడడం మానివేశాయి. కారులూ, జనమూ, రేడియో సంగీతమూ, జనులఘోషా! వేషాలు, భావలూ, ఒత్తుగా, ఘాటుంగా కమ్ముకు వచ్చి, కనబడుతాయి. అలాంటిది నేడు నరసింహమూర్తి మేష్టారు ఆమె జీవితంలోంచి మాయమై పోయి నప్పటినుండీ, ఆమెకు సముద్రం ఎంతో దూరంగా చిన్న కెరటాలతో దృశ్యం కాసాగింది. సముద్ర చేపలు నీటిలో ప్రాణరహితమై తేలిపోయి కనబడినవి. ఎక్కడ చూచినా మండిపోతూ ఇసుక ఎడారిలా సముద్రం, ఇసుక తీరాల బయళ్లు ఆమె మనో నేత్రాలకు గోచరించినవి.

ఆమెకన్ను మూయలేదు. కన్నులు తెరిచి ఉండలేదు. నిద్దుర ఎండి పోయింది. నుదురు మండి పోతున్నది. ఒళ్లు సలసల కాగి పోతున్నది.

ఆమె ఆంధ్ర మహిళా సభలో ఉండ లేక పోయింది. భర్త దగ్గిరకు వెళ్లలేదు. సుశీల కడకు పోలేదు.

ఏమవుతుంది తన బ్రతుకు? ఎందుకు ఈ అవేదన? అందరు స్త్రీలు లేరా? వారికి ఏదో సంఘటనలు జీవితంలో ప్రత్యక్షం అవుతూనే ఉన్నాయి. ఊహించుకో లేని కష్టాలు వారికి కలుగుతున్నాయి. అవ్యక్తమైన ఆశయాలు, వ్యక్తా వ్యక్తమైన ఆశలూ వారికి ఉన్నాయి.

తన కింత బాధఏమి? ఇంటి కుడుము తెలెమి తన మనస్సునకు.

శ్రీమతీ దేవిని తనతో రమ్మని పద్మ ఆహ్వానించింది.

"ఎక్కడకు పద్మ?"

"రండి అక్కా! నన్ను మీ రెక్కడికైనా నాలుగు రోజులపాటు తీసుకు పొండి!"

"మనం ఇద్దరమే?"

"ఆ"

"ఏమిటి అసలు విషయం?"

"నన్నెక్కడకైనా సరే తీసుకు వెళ్లండి. నాలుగు రోజులుపాటు ఈస్థితే నాకు ఉంటే నన్ను మోదవాకం పిచ్చి ఆస్పత్రిలో చేర్పించవలసిందే!"

"నీ చదువుమాట?"

"తిరిగి వచ్చి ఆలో చిద్దాము అక్క! నాప్రార్థన అంగీకరించండి. నాహృదయంలో ఉన్నది అంతా మీతో ఏమి చెప్పకోగలను"

"సరే పద్మా! రామేశ్వర యాత్రచేసి వద్దాము. చిదంబరం, తంజావూరు, తిరుచునాపల్లి, మధుర రామేశ్వరం ఇవి మనం చూసి వచ్చేది."

"చాలా బాగుంది. మనం ఇద్దరమే! ఇంకెవ్వరూవద్దు"

"నాదగ్గిర డబ్బేమీలేదు. పైకప్పులకు—"

"ఆమాట తలపెట్టకండి, అంతే!"

"సరే ప్రిన్సిపాలుగారి సెలవు తీసుకుని బయలు దేరదాము. రేపు శనివారం చాలా బాగుంటుంది."

"అచ్చా!"

ప్రిన్సిపాలుగారికి తన సంగతి అంతా చెప్పకొని, పద్మావతి ఆమె కడ సెలవుతీసుకొని శ్రీమతితో బయలుదేరి యాత్ర ప్రారంభించింది.

పాఠశాలలో ఇతరు లెవ్వరికీ ఈ యాత్ర విషయం తెలియదు. వీరిద్దరూ చల్లగా వచ్చి ఎగ్మూరులో పాసింజరు ఎక్కి చిదంబరం చేరుకున్నారు. చిదంబరంలో నటరాజస్వామి దేవాలయమూ, విశ్వ విద్యాలయమూ దర్శించారు.

శ్రీమతి పద్మావతికి నటరాజ భావం వర్ణించి చెప్పింది. సృష్టిస్థితిల యాత్మకమైన లీల నాట్య భావములు; అందుకనే.

"ఆంగిక భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది
తన్నమస్సాత్వికం శివం"

అని భగవంతుని నృత్యభక్తులు ప్రార్థిస్తారుట. ఆనంద తాండవాదులు, గౌరీశంకర నాట్యాదులు, ఈ లీలలో భావ విషయాలట.

ఈ రీతిగా శ్రీమతీ పద్మావతికి నటరాజ తాండవ దివ్య భావం వర్ణించి చెప్పింది.

౨

పద్మావతి దక్షిణాది యాత్రకు వెళ్లిందని బుచ్చివెంకట్రావుకు తెలిసే సరికి అతనికి ఆశ్చర్యమూ, కోపమూ, ఏదో భయము కలిగాయి.

ఎందుకు వెళ్లింది? తనతో చెప్పలేదే! ఇంతస్వతంత్రించిందే! ఆంధ్ర మహిళా సభా కళాశాలా ముఖ్యాచార్యిణి తాను పద్మావతిని చూడడానికి వెళ్లినప్పుడు తనతో కొంచెం గట్టిగా మాట్లాడింది.

"ఎందుకండీ మీ భార్యను చదివించాలని పూనుకొన్నారు. ఆవిడ నరాలు ముద్దవుతున్నవి. ఆవిడకు పేరూ ప్రఖ్యాతులు వచ్చేశాయి. చదువుమీద శ్రద్ధ తగ్గింది. మొన్న జరిగిన పరీక్షలలో ఆ అమ్మాయికి చాలా తక్కువ మార్కులు వచ్చాయి. అంతకు ముందువచ్చిన మార్కులన్ను బట్టి ఆలోచించడానికి వీలులేదు."

"ఈ మధ్య ఎక్కడా సంగీత సభలు ఒప్పకోలేదు కదా అండి!"

"నిజమేనండి, సంక్రాంతి ముందునుంచి ఆలాగానే చదువు సాగించింది. కాని జీవితం అంతా సంగీతం పాడివి ఉన్న ఆబాలికకు చదువుకు తావులేదు. చదువుకోసం

ఈసంవత్సరపు మహోన్నత చిత్రము



పక్షిరాజావారి

# బీదల పాట్లు

నాగయ్య
లలిత...పద్మిని
నటించినది

డైరెక్షన్
రామనా



చమ్రియా రిలీజ్

సంగీతం మానుకునే సరికి, ఆ అమ్మాయికి నరాలు పట్టు తప్పి పోతున్నవి. మతి తారుమారవు తున్నది."

"మీ సలహా ఏమిటండీ ?"

"చదువు మాని పించి ఇంటికి తీసుకు వెళ్లండి."

"పరీక్షరోజులు మూడు నెలలే కాదండి ఉంటా !"

"ఏమిలాభం ?"

బుచ్చి వెంట్రావు తలవాల్చుకొన్నాడు. అధ్యక్షురాలికి నమస్కరించి, వచ్చి కారులో కూర్చున్నాడు. కారును తానే నడుపుకొని వచ్చినాడు. ఎక్కడకు పోవాలో ఆతనికి తెలియలేదు.

ఆతనికి సుశీలాదేవిని సలహా అడగుట ఇష్టంలేదు. తాను తన భార్యంటే చాలా ఆపేక్షగా ఉంటాడని ఆమె అనుకుంటుం దేమో ? అనుకుంటే తప్పేమి ? అని మళ్లీ అనుకున్నాడు. కాదు. ఆమెతో ఈ విషయం చర్చించ కూడదని ఆతడు నిశ్చయం చేసుకున్నాడు. ఆతడు వెంటనే సుశీల దగ్గిరకు కారు పోనిచ్చినాడు.

సుశీలకు పద్మావతి దక్షిణాదియాత్రకు వెళ్లిందని బుచ్చివెంకట్రావు చెప్పగానే "మంచి పని చేసింద"ని ఆమె వెంటనే అన్నది.

"అదేమిటి ? ఈ యాత్ర మంచిదేనంటావు సుశీలా ?"

"తప్పక ! తిరగనిదేశాలు. యాత్రలవల్ల వచ్చే జ్ఞానం జన్మంతా చదివినా రాదయ్యా !"

"వెళ్లితే వెళ్లనీ ! నాకేమి గాని—"

"నీ భార్య సంగతి నీకు అక్కర లేదటయ్యా ?"

"భార్య అని ఒళ్లో పెట్టుకుని తిరుగుతారా ?"

"ప్రేమ ఉంటే అంతే !"

"ప్రేమ ఉంటే కూడా, ముభావంగా ఉన్నట్లు కనబడే భార్యా భర్తలు లేరా ?"

"కాబట్టి నీకు నీ భార్య అంటేబాగా ప్రేమ అన్న మాట !"

"ప్రపంచం సంగతి చెబుతున్నాను గాని !"

"చిత్రంగా ఉంది నీ సంగతి ! ఇంతకూ నీకు రఘానీ మీద బాగా ప్రేమ ఉందా లేదా ?"

బుచ్చివెంట్రావుకు సుశీల అనే మాటలకు చాలా కోపం వచ్చింది.

"మీ ఆయన పెద్దమేడ తీసుకున్నాడు. శుభ ముహూర్తంచూసి అందులో ప్రవేశించాలి. త్వరలో సినిమా పని ప్రారంభించాలి. మీ ఆయన నాకు అప్పగించిన సోమేశ్వరరావు ఆ ప్పనులన్నీ చేస్తున్నాడు. ఏమి కథో మనం ఆలోచించ లేదు సుశీ !"

సుశీల బుచ్చి వెంకట్రావును సోఫాలో కూర్చో పెట్టి ఆతని పక్కగా, దగ్గిరగా కూర్చుండి, ఆతని మెడ చుట్టు చేయివేసి, కుడి చేత్తో జుట్టు సవరించసాగింది.

"నువ్వేగా నాకు నాయకుడవు ?"

"నువ్వేగా నాకు నాయికవు !"

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు. వారిద్దరూ అలా కూర్చుని ఉండగానే, అక్కడకు రాధాకృష్ణ ఏదో కూని రాగం తీస్తూ వచ్చాడు.

"ఏదైనా సినిమా సీను, రిహార్సలు చేస్తున్నారా ?" అన్నాడు రాధాకృష్ణ.

సుశీల నెమ్మదిగా దూరంగా జరిగింది.

బుచ్చి వెంట్రావు కంగారు పడ్డాడు. తెల్లబోయాడు. నెమ్మదిగా సంబాళించుకొని వెండి సిగరెట్టు కేసు జేబులో నుండి తీసి, మీటనొక్కి తెరచి, అందులో స్టేట్సు ఎక్స్ప్రెస్ 555 సిగరెట్లు రాధాకృష్ణను తీసుకొని కాల్చుమన్నట్లు ఆతని ఎదుటకు చూచి నాడు.

"నేను త్రీకాజిల్సు తప్ప ఇంకోరకం కాల్చను కాదటయ్యా ! ఒక్కొక్క గొంతుక్కి ఒక్కొక్క రకం చక్కగా సరిపోతాయి !" అని రాధాకృష్ణ తన సిగరెట్టు కేసు తాను తీసుకొని ఒక సిగరెట్టు వెలిగించాడు.

రాధాకృష్ణకు కోపం వచ్చిందని బుచ్చివెంకట్రావు అనుకున్నాడు. ఏమిటి ఈతని వుద్దేశం. సుశీలను తన కౌగిలింతలలోనికి పురి కొల్పింది తానే ! తమ్ము ఇద్దర్నీ చదు

ఎన్నిసార్లో రాధాకృష్ణ వెళ్లిపోయాడు. సుశీలకూడా తన్ను మనస్సు కరిగించి ఆమె అంతట ఆమె తన ఒడిలోనికి ఏలా చేరింది? చిత్రచిత్ర విలాసాలెన్నో సుశీల తన చుట్టూ భర్త ఎదుటే సుళ్లుం చుట్టివేస్తూ ఉంటే, ఆ భర్త ఏమీ అనకుండా, చూచీచూడ నట్లున్నప్పుడు సుశీల తన పురుషత్వానికి స్త్రీకావడం వారికిష్టమనుకున్నాడు బుచ్చి వెంకట్రావు. ఆతడింతవరకూ పరస్త్రీ సంగమదోషానికి పాల్పడలేదు. కాని ఈ మధ్యే ఏ దుష్టపుగడియలు ఆవేసించాయో తనకు తన భార్యకూ మధ్య దూరాలు ఉద్భవించుకు వచ్చాయి. ఆ సమయంలోనే శ్రీకృష్ణుణ్ణి కూడా మనస్సు మురిపించే సుశీల తనజీవితంలో ప్రవేసించింది. ఆ ప్రవేశంలో ఉన్నభావం పూర్తికాకుండా రాధాకృష్ణ అడ్డం వచ్చేటట్లయితే, వీళ్లు తన్ను మోసం చేస్తున్నట్లే అయిందిగా. అందుకనే ఆపిచ్చి బ్రాహ్మణుడు నరసింహమూర్తి అంత గోలపెట్టాడు.

రాధాకృష్ణ బుచ్చి వెంకట్రావుకు తెలియకుండా ఆతని మోము పరిశీలించి ఆతని హృదయంలో సుడిగాలిలై తిరిగే భావాలు గ్రహించాడు.

“సుశీ మా ఇద్దరికీ ఏమైనా ఫలహారం కాఫీలు ఏర్పాటు చేయి” అని సుశీలవైపు బుచ్చివెంకట్రావు గమనించకుండా తీక్ష్ణమైనచూపు పరపి కంటిసైగ చేసినాడు.

సుశీల బుచ్చివెంకట్రావు దగ్గిరకు వచ్చి ఆతని భుజం మీద చేతులువేసి “అయిదు నిముషాలలో దుస్తులు మార్చుకుని వస్తున్నాను. మనం ముగ్గురం చాలా మాట్లాడుకోవలసి ఉంది. కాఫ్యాదులకు ఆర్డరిస్తున్నాను” అని గబగబలోనికి వెళ్లిపోయింది.

3

ఆమె లోనికి వెళ్లిపోగానే రాధాకృష్ణ బుచ్చి వెంకట్రావు దగ్గిర కూర్చుండినాడు.

“వెంకట్రావుగారూ, మీమోములో ప్రసరించిన ఛాయలను చూచి, మీరు నన్ను గూర్చి కొన్ని తప్పభిప్రాయాలు పడుతూ ఉన్నట్లనుకుంటున్నాను.”

“అవన్నీ ఇప్పుడెందుకు లెండి?”

“నన్ను పూర్తిగా చెప్పనివ్వండి. నాకు పూర్వకాలపు ఛాందసపు భావాలేమీలేవు. స్త్రీలు ఎవరిని ప్రేమించారో వారితో ఖులాసాగా ఉండవచ్చునని నానిశ్చయమైన అభిప్రాయం. కాని వివాహం చేసుకొన్నాక ఆభర్తకు విడాకులు ఇచ్చి, తాను మళ్లీ వివాహం చేసుకోవాలి. అంతే. వివాహం చేసుకొని ఆభర్తవుండగ పరపురుషునితో సాంగత్యం చేయడం నా ధర్మశాస్త్ర ప్రకారం అధర్మం. తన భర్తను తాను పురుషునిలా ప్రేమించి, స్నేహంలో ఇతర పురుషులతో అతిచనువుగా ఉండవచ్చును. అంతే! మీరు సుశీల నడవడి యొక్క గమ్మత్తు చూచి, ఆమె మిమ్ము ప్రేమిస్తున్నదని తప్పభిప్రాయం పడుతున్నారని అనుకుంటున్నాను. నా జీవితం వదలయినదే! కాని అధర్మం, అసత్యం నాబ్రతుకును నూరుగజాల దూరానికైనా రానివ్వను. నేను సుశీలను కనుక్కుంటాను. ఆమె మిమ్మల్ని నిజంగా ప్రేమిస్తే, వెంటనే ఆమెకు విడాకులు ఇస్తాను. నేను సుశీలను గాఢంగా ప్రేమించ వచ్చును, కాని నాప్రేమ ఆమె జీవితానికి అడ్డం రాకూడదు. ఈ విషయమే మీతో చెప్పితే మీరు నన్ను గురించి తప్పభిప్రాయాలు పడరని అనుకుంటాను. ఈ సంఘటనలు స్నేహానికి అడ్డం రాకూడదు. దొంగస్నేహం అయితేనే స్నేహం కాదు. అది శత్రుత్వానికన్న అధమాధమం!”

రాధాకృష్ణ మాటలు వింటూఉంటే, బుచ్చివెంకట్రావు మనస్సు క్రుంగిపోయింది. రాధాకృష్ణ మాటలలో దాపుడు లేదని మాత్రం అతనికి తట్టింది. అవును తాను సుశీలను వాంఛించినమాట నిజం. ఆమె ఉద్దేశమేదో! తన్ను నిజంగా ప్రేమించిందేమో! తాను పద్మావతిని వదిలి ఆమెకు విడాకులు ఇచ్చి సుశీలను పెళ్లి చేసుకోవాలా?

ఆతని హృదయం ఎక్కడికో జారిపోయినట్లయినది. బుచ్చివెంకట్రావు మాటలాడలేదు. ఆతడు చటుక్కున లేచి వీధిలోనికి వెళ్లి తనకారు ఎక్కి ఇంటికి వెళ్లిపోయినాడు. రాధాకృష్ణ ఆశ్చర్యము పొంది కదలక అట్లానే నిలుచుండి పోయినాడు. ఆతని సిగరెట్టు చేతిలో కాలుతూనే ఉంది.

ఇంతట్లో సుశీల చీరమార్చి మంచిరకం సిగరెట్టులా చక్కా వచ్చింది.

"ఏడీ బుచ్చివెంకట్రావుగారు?" ఆమె మాటలు తీక్ష్ణంగా ఉన్నాయి.

"ఇంటికి వెళ్లిపోయినట్లు ఉన్నాడు!"

"నువ్వు పంపించి వేశావా?"

"నేను వెళ్లమనలేదు. వెళ్లుతోంటే ఉండ మనలేదు."

"కారణం?"

"కారణం ఏమిటి నీ మొగం! కాస్త స్పష్టంగా చెప్పాను. అతడు మారిపోయినాడు. దిగాలుపడిన హృదయంతో చక్కాబోయి ఉంటాడు."

"నీతి నియమాలు చెప్పడం సాగించావు కాబోలు. నీ దొంగనీతి, నీ పద్ధతీ నాకు తెలియవా? నీ సుగుణగణాలు మన స్నేహంలో నాకు అర్థంకాలేదా? మన సినీమా జాతి వారికి నీతి నియమాలూ కూడా! ఒక బాలికను ఒకడు పెళ్లిచేసుకుంటానని ఆశపెట్టి తీసుకుపోతాడూ! ఆవిడ ఒక గొప్పతారా! అయినా వెఱ్ఱి బాగుల్ది, అపిచ్చిది వాణ్ణినమ్మి, వాడితో పెళ్లి అవుతుందని నమ్మకంతో కాపురం చేస్తుందా! ఆమెకు గర్భం అవతరిస్తుందీ! తన అవసరం తీరగానే ఆతడు ఆమెను వీధిలోనికి త్రోసి తలుపు వేసుకుంటాడూ? ఆడవాళ్లు మీకళ్లకు పశువులు, బజారువస్తువులు, చూడు ఈ బుచ్చివెంకన్ని! వీడో పంది. చక్కనిది ప్రజ్ఞావంతురాలు ఆలాంటి భార్యను సరీగా చూడలేక తన ఇంటిలో నుంచి తరిమివేస్తే, ఆ అమాయకురాలు ఆంధ్రమహిళా సభలో వెళ్లిచేరి, ఆనందం పడుతోంది. పాపం! ఆవిడ ఏమిటో బాధపడుతూ దక్షిణాది యాత్రలకు బయలు దేరిందట!"

"ఓసి ఫూల్! నేను ఎప్పుడైనా నీ విషయంలో అనౌచిత్యంగా ప్రవర్తించానా? మనంఇద్దరం వివాహం చేసుకొని ముందు నేను సంబంధం కల్పించుకొన్న స్త్రీలు వట్టి జారిణులు. నేనా, వివాహం ముందు నా చరిత్ర అంతా నీతో చెప్పినాను. పోనీ నువ్వు మాత్రం 'అనాఘ్రాతం పుష్పం' లా ఉంటివి గనుకనా? కాని మన వివాహం అయిన దగ్గిరనుండీ నా చరిత్రలో ఏ విధమైన దోషమైనా చూపించ గలవా? ఒకటే చెప్తున్నాను బాగా మనస్సుకు ఎక్కించుకో! నీకూ ఈ బుచ్చివెంకట్రావుకూ ఎంత వరకూ వెళ్లిందో నాకు తెలియదు. నీకు ఆతనితో గాఢ సంబంధం ఏర్పాటు చేసుకోవాలని ఇష్టం పుడితే నాచాటున మాత్రం ఆ విధమైన నడవడిక సుతలామూ వీలులేదు. అంతటితో నీకూనాకూ బంద్. ఈ ఆస్థి అంతా తీసుకొని వెళ్లిపో. నేను మళ్లీ నా జీవితం ప్రారంభించుకుంటా!"

ఎప్పుడూ ఏడుపంటే ఏమిటో ఎరగని సుశీల అక్కడ సోఫాపై కూలబడి పోయింది, వెక్కి వెక్కి ఏడుపు ఆమెను ముంచుకు వచ్చింది. సోఫాలో పడిపోయి, దిండులో ముఖము దూర్చుకొని సముద్రం పోటులా రోదించింది.



# విప్రలబ్ధ—ప్రోషితప్రియ!

శ్రీ సూరంపూడి భాస్కరరావు

ఈ మనోజ్ఞ విజనస్థలి
ప్రేమపూతమగుచుండుచు
ప్రియుని జూడనరుదెంచితి.
ప్రియుడదేల దరియరాడు?॥
ప్రియుడు వెడలెనన్న మాట
ప్రియతమ కెరిగింపగోరి
ఈ విహంగ మిధునమొసంగె
హృన్నాథు ప్రవాసవార్త॥
శైశిరాత్రి కొనయాశల
స్తబ్ధముగా తరువునిలచి,
మొయిలు తేని విరహామునకు
మోడువారి కేకివగచి,
కొండవెనుక సూర్యుడోరగ
కొలనిలోని పూవువాడి,
నన్నువోలె ఈ వియోగ
నగ్నబాధ ప్రకృతినిండె॥
ఈయలౌకిక విహంగమ మిధునమొక్కటే
ఈ విషాద చరితమునకు మూగసాక్షిరౌ?॥



# పుస్తక పఠనావశ్యకత

మూలము :
లార్డ్ అవెబరీ

కానుకొల్లు లక్ష్మి
మహిళాసభ పాఠ విద్యార్థిని

ఈ నవీనయుగమున మనకున్న అన్ని సదుపాయముల లోను ముఖ్యమైన వానిలో నొకటి పుస్తకముల అందుబాటు. మన పూర్వులు పుస్తకములకై చాల కష్టపడెడి వారు. యిప్పుడు అచ్చుపని అభివృద్ధి లోనికి వచ్చిన తరువాత మనకు 'ఏది చదవాలి' అనేది ఒక సమస్య అయింది. పూర్వం పుస్తకములు చాల తక్కువగ నున్నను చాల మంచివిగ నుండెడివి. మంచు బిందువువంటి ఒక్క సిరాచుక్క వేనవేలు ప్రజల మనస్సులకు ఆలోచించు శక్తి నివ్వగల యొక గ్రంథము.

ప్రస్తుతం పుస్తకసంఖ్య హెచ్చినది. కొన్ని పుస్తకములు అని అనిపించు కొనదగనివి కూడ ఉన్నవి. చదువుటవలన కాలవ్యయమే తప్ప మరేమియును ప్రయోజనము లేని పుస్తకములును ఉన్నవి. దురుద్దేశములకు దోహదమిచ్చి మనసును పాడు చేయునవియు గలవు. జీవితములోని ఆనందము, నడవడిలోని అందము సద్గ్రంథములనేరి చదువుట యందేగలదు. అభిరుచిని బట్టికూడ పుస్తకముల నేరుకొనవలెను. ముమ్ముందు ఎక్కువగ చదవగలవారు యిప్పటివలె డాక్టర్లు, లాయర్లును గాక శారీరిక కష్టమొనరించు కూలివారే యగుదురేమో! ఎందు చేతనన డాక్టర్లు, లాయర్లు, మానసిక కష్టమొనరించి, పనిముగియగనే చాల అలసటనొంది తీరిక సమయములందు గాలి కోసమును, విశ్రాంతి కొరకును చూతురు. కూలి వారట్లుగాక శారీరిక కష్టము చేసిన యనంతరము వారి మనస్సును చదువుటకు ఉపయోగింపగలరు. మరియును యిప్పుడు ఎలిమెంటరీ స్కూళ్లలో మంచి విద్యాభ్యాసము కూడ పొందగలరు. పుస్తకములు కూడ వారికి యింతకంటె చవుకగ మంచి అందుబాటులో ఉండును. మంచి పుస్తకములు చదువుటయందు అభిరుచి గలవారికి కూడ అవి లేక పోవుటచే తగ్గిపోవును. పుస్తకముల లెక్క ఎక్కువగ నుండుటకాదు కావలసినది, మంచి వాటిని ఏరి సరిగ ఉపయోగించుకొనుటయే కొంత మంది ఏదైనను సరియే యని శ్రద్ధలేకుండ వృధాగా చదువుదురు. ఎన్నో పుస్తకములు లెక్కలేనన్ని గలవు. కాని చదువుటకు కాలమంత లేదు.

చాలమంది కనిపించిన పుస్తకము ఏదైననూ కంటికింపుగ నుండి నంతమాత్రాన ఏ స్నేహితుని గదిలోనిదో తీసికొని చదువుదురు. మంచి పేరు గలదిగాని, అందమైన బైండు గలది గాని అయిన ఏ రైల్వేబుక్ స్టాలులోనో ఎంత వెల యయిననుబెట్టి కొని చదువుదురు. అట్లు కాకుండ ఒక కొన్ని పుస్తకములను కొని వాటిని బాగుగ శ్రద్ధతో చదివి జీర్ణించుకొనిన చాల విజ్ఞానవంతముగ నుండును. అట్టి మంచి పుస్తకములు ఏమియు కఠిన పదములతోగాని, కోపముతో గాని మాట్లాడక, కర్రల నుపయోగింపని నిశ్శబ్దమైన ఉపాధ్యాయులుగ నుండి చక్కగ మనకు భోధించును. మనము ఎప్పుడు వాటి వద్దకు వెళ్లినను అవి నిద్రపోవు. ఏదైన కావలసి వాటిని సలహా అడిగిన అవి ఏమియు దాచవు. వాటిని సరిగా అర్థము చేసికొనక పోయిన అవి సణగవు కోపగించవు. అర్థము కాలేదని మనలను పరిహసింపవు. కనుక ఒక గ్రంధాలయముతో ఎంతటి ధనాలయమును పోల్చరాదు. సంతోషముగాని జ్ఞానము, శాస్త్రము, లేక మతము దీనిలో దేనియందైనను నిజముగు ఆసక్తి ఏవ్యక్తికైన నున్న దనినచో ముందు ముఖ్యముగ పుస్తక పఠనాభిలాషి కావలెను. పుస్తకములను చదువుటయందభిరుచి గల వారందరికిని పుస్తకములు ఎంత నిజమైన విలువైన స్నేహితులో తెలియును. పేట్రార్కు (Petrarck)—"నా స్నేహితుల సహాయము నాకెల్లప్పుడును వాంఛనీయము. వారు అన్ని దేశములను అన్ని కాలములలోను చూచినవారు. వారు అన్ని విషయములను, శాస్త్రములను తెలిసికొని గొప్ప మన్ననలను బొందినవారు. వారిని సమీపించుట చాల సులభము. నాకు కావలసినప్పుడు నాదగ్గరకు వత్తురు. నేను వద్దనిన వెళ్లిపోవుదురు. నేనడిగిన ప్రశ్నలన్నింటికిని బదులు చెప్పు

దురు. కొందరు జరిగిపోయిన వృత్తాంతములను తెలియ జెప్పుదురు. కొందరు ప్రకృతి రహస్యముల నెఱింగింతురు. కొందరెట్లు జీవించవలెనో చెప్పుదురు. చనిపోవుటెట్లో కొందరు బోధింతురు. కొందరు నిపుణముగ నాకానందమును గూర్తురు. కొందరు నామనస్సు నెట్లుదుపాజ్ఞలలో బెట్టుకొనవలెనో, ఎట్లు నామీదనే నేనాధారపడవలెనో, యిట్లు అన్ని కళలకు, అన్ని శాస్త్రములకుగల దారులన్నియు నాకు చూపింతురు. యిన్ని చేసినను వారికి నేను చేయదగిన ప్రత్యుపకారముగ శాంతి యుతముగ నిష్క్రమించుటకు వారికి నాగదిలో ఒక మూల కావలెనని కోరుదురు ” అని పుస్తకములను గూర్చి అనెను.

పుస్తక ప్రియులకు వేరే నమ్మదగిన స్నేహితులు, సంతోషింపదగిన సహచరులు ఎవరును అవసరము లేదు. చదువుటవలన, ఆలోచించుటవలన అన్ని కాలములలోను, అన్ని అవస్థలలోను సంతోషముగ కాలము వెళ్లబుచ్చవచ్చును. అన్ని కాలములలోని గొప్పవారిని మన కవసరమైనప్పుడు సహాయార్థము ఉపయోగించుకొనగల శక్తి మనలో గలదు. యింతకంటె కావలసినదేమి? పుస్తకములలో గొప్పగొప్పవారి శ్రేష్ఠమైన భావములను మనము పొందగలము. పుస్తకములు చిన్నవారి కుపదేశకులు; పెద్దవారికి కాలక్షేపమున కుపయోగములును. ఒంటరిగ నున్నప్పుడును, విచారముగ నున్నప్పుడును మానవుల దౌష్ట్యమును మరచిపోవుటకును, మన బాధ్యతలను నిర్వర్తించు కొనుటకును, నిరాశలను నిద్రింప జేయుటకును పుస్తకములు సహాయకులు. జీవచ్ఛవములతో సమానులైన మానవులనుండి తప్పించుకొనవలెనన్న మృతజీవులను పుస్తకములలోచూడ వచ్చును. “పుస్తకములయొక్క సముదాయమే యొక విశ్వకళాపరిషత్తే ” నన్నాడు కార్లైలు. పుస్తకముల ఆవశ్యకతయిప్పుడు అందరికి తెలియును. అవివేకుని జీవితమంతయు విజ్ఞాని జీవితములో నొక రోజుతోనైన సరిగాదు. ఒకాయన విజ్ఞాన సముపార్జనాసక్తిలో అన్నపానములను, తన కష్టములను నివరకు తనకు వృద్ధాప్యము సమీపించు చున్నదని కూడ మరచెనట. యింటి అలంకారములలో పుస్తకములు ముఖ్యమైనవి. పుస్తకములు లేనిగది ప్రాణిలేని కళేబరము వంటిది. మేకాలే తను చాల జ్ఞానము పుస్తకముల నుండి పొందినందువలన వాటికి తాను చాల ఋణపడె ననెడివాడు. పుస్తకములు సత్యమునకు దారి చూపునవి. మనసున ఉన్నతాభిప్రాయముల నెలకొల్పునవి. విచారముగ నున్నపుడు ఓదార్చును. జబ్బుగ నున్న సంరక్షించును. ఒంటరిగ నున్న ప్రొద్దు పుచ్చును. పరిచితులైన పాత స్నేహితులు. సంపదాపదలయందు సమ స్వభావము గలవి. తన వ్రాతలచే ఎన్నియో బిరుదులను, పదవులను పొందినను మెకాలే యితరుల వ్రాతలను జదివి తాను పొందిన ఆనందముతో సరియగు నానందము నేవియు యీయజాలవనెను. వృద్ధాప్య అసమర్థతలు, ముడుతలు, నెరసిన వెంట్రుకలు లేకుండగనే చిన్నవారిని జ్ఞానవృద్ధులుగ చేయగలవు పుస్తకములు. ఒక పిల్లవాడొక పుస్తకమును జదివి ఆ పుస్తక మొక కాపీ తన వద్ద నుండవలెనని దానినంతయు తాను వ్రాసి కొనెనట. అటువంటి ఆసక్తి అంత చిన్నపిల్లలో నుండుట చాల గర్వింపదగినది. ఒక గ్రంథాలయము నిజముగ నొక భూతల స్వర్గమే. ఆది దంపతులు దేవునిచే సృజింపబడిరి. స్వర్గమున దేవుడు వారికి అన్ని ఆనందములను యిచ్చెను. కాని జ్ఞానమను చెట్టుయొక్క ఫలములను భుజింప గూడదనెను. దానికి వారు వ్యతిరేకముగ భుజించుటచే నరకమునకు ద్రోసివైచెనని పాశ్చాత్య కథ. గ్రంథాలయమున జ్ఞాన వృక్షఫల భుక్తికి నిషేధము లేదు. గావున నిజముగ స్వర్గమే యనియగును.





# గౌతమ బుద్ధ

—: నాటిక :—

(అంకత్రయము)

రచన : కీ. శే. శ్రీ. కోనే వెంకటేశ్వరరావు

పాటలు, పద్యాలు : శ్రీ "జగం"

సంపాదన : కె. జగదాంబ

[మొదటి యంకములో, రాజకుమారుఁడు సిద్ధార్థుఁడు పురసంచారము చేయుచు, ముసలి తనము, వ్యాధి, మృత్యువులను చూచి కలవరపడుటయు, వేటకై వనికేగి, బాణముచే కొట్టబడిన రాజహంసను చూచి మిక్కుటమైన హృదయవేదన ననుభవించి, వేటలో ఎంతటి హింసకలదో సఖుఁడైన దేవదత్తునికి తెలియజేయుటయు చదివినాము.]

## అంకము ౨

### రంగము 1

(రాజాంతఃపురము. ప్రవేశము, యశోధర, రాహులుడు.)

య : నాయనా! రాహులా! ఏదీ నీ పాఠమును మరియొక పర్యాయము వినిపింపుము!

రా : ...అట్లు సత్యవ్రతధారుడైన యా దొంగ నిశ్చలత్వమునకు మెచ్చి ఆ మహారాజు అతనిని శిక్షింపనొల్లక సన్మానించి గౌరవించెను. సతీసుతులతోడ నా చోరుడు "సత్యమే జయము"ను మహామంత్ర మాచరణీయముగ పెట్టుకొని, చోర, జార నీచత్వములను వదలి, తనకు బోధకుడైన శ్రీ జ్ఞానానందస్వామి పాదపద్మముల నాశ్రయించి యనేక వసంతముల నానంద సౌఖ్యములతో గడపి ముక్తినొందెను..."

య : ఇందు నీ సందేహములేమి తండ్రీ?!

రా : మంచికే ఎల్లప్పుడు జయము కలుగుననన్న మాట నేను నమ్మజాలకున్నానమ్మా!

య : ఏమినాయనా! అట్లందువు?

రా : ఏమిటమ్మా? చెడ్డపిల్ల లనేకులున్నారు! వారిని బెత్తపు పూజయేగాని మరియొకటి చక్కబర్చ నేరదు.

య : రాహులా!

రా : అమ్మా! ఇది నిజము—తోటమాలి కొడుకును ఆ తరగతిలోనివాడే!

య : సత్ప్రవర్తనతో నీవుండి, వారిని సైతము మంచి వారినిగా జేయుము!

రా : తల్లీ! ప్రయోజనము లేదు!—నేనట్లే ప్రయత్నించితిని గాని లాభములేకపోయినది!

య : నాయనా! క్షమనే వహించి నీవు మెలగవలయును.

రా : వ్యర్థము తల్లీ!—తోటమాలియే, విషసర్పము, విష సర్పముగా నుండక తీరదని చెప్పెను.

య : వాటినిగూడ పరమ సాధువులనుగా మార్చవచ్చును.

రా : అవునమ్మా!—ఒక చిలువనుబట్టి తోటమాలి దాని కోరలు పెరికినాడు!—నేను దానితో నాటలాడ వచ్చునా?

య : తగదు! తగదు!!

(ప్రవేశము శుద్ధోదనుడు)

య : (లేచి నమస్కరించుచు) మామగారికి వందనములు! రాహులా! తాతగారు!

రా : (నమస్కరించుచు) తాతగారికి నమస్కారములు!

శు : (రాహులుని మూర్కొని ముద్దిడి) నాయనా! రాహులా! నీవు పాఠములను చక్కగ జదువుకొనుచున్నాడవా?

రా : చదువుకొనక మరేమి చేయగలను తాతగారూ! మొన్నను నాన్నగారు, ముందు ముందు ఇంకను నాకు మంచి మంచి పాఠముల నిచ్చుచుండెదమన్నారు—నేను రెంతయైనను చదువుకొందును!

శు : (యశోధర వంకకు దిరిగి) అమ్మాయీ! యశోధరా! సిద్ధార్థుడు నిన్ను వివాహమాడి—నీ వ్యాసంగమునను, అటుపిమ్మట ఈ పుత్రోదయముచే మరింతయును చిత్తశాంతి కలిగి—నిశ్చింతుడై యున్నవాడు! అదివరకు సర్వకాల సర్వావస్థలయందును లేశమాత్రమైన హృదయోల్లాసములేక — యెల్లప్పుడు విచారసాగరమున గ్రుంగబడియుండువాడు!—ఇట్లైనచో చక్కబడగలడని బాగుగ యోజించియే నేను వానికి వివాహ ప్రయత్నము లొనర్చి సర్వోత్తమురాలవగు, వానికి సర్వవిధముల దగిన దానవునగు నిన్ను—అతి ప్రయత్నముపై పాణిగ్రహణ మొనర్చి యున్నాడను! వానికి సర్వకాలములయందు నను నిర్మలమగు చిత్తశాంతి నిలచియుండునట్లు నీవు సర్వ విధముల ప్రయత్నించుటయే నీ విధియైయున్నది! (కంఠధ్వని తగ్గించి) ఈ దినమున నేమోగాని, నా హృదయమునందొక విధమగు యారాట మేర్పడినది! సిద్ధార్థుని చిత్తశాంతికేమైనను భంగము కలుగుటకు సూచనయేమో నని నాకు తహతహగ నున్నది!—బిడ్డా! నీవు బహు భద్రముగ నాతనివిషయమున మెలంగుచుండవలసినదిగా హెచ్చరింప వచ్చితిని!

య : నేను వారియెడ సర్వవిధముల వినయ విధేయురాలినై యుండి, వారికి నానాటికి మరింత మరింత హృదయోల్లాసమునే చేకూర్చుచున్నదానను! వారును సుప్రసన్నులుగనే యున్నారు!—రాహులునియందు వారికి పరమ ప్రీతి!—అయినను తమ యాజ్ఞ శిరసావహించి నే నింకను బహుజాగరూకతతో ప్రవర్తింతును!

శు : మంచిది! శుభమగుగాక! నేనింక పోయివత్తును! (వెళ్లును.)

య : వింటివా రాహులా! తాతగారి వాక్యములు! మీ తండ్రిగారి ఎదుట పెంకెతనపు చేష్టలుజేసి నీవు వారి మనస్సు నాందోళన పర్చరాదు!—వారికి నీయొక్క లలితమైన — ప్రియమైన—ముద్దుగొల్పు — ఆటపాటలతో మాత్రమే—సర్వదా హృదయోల్లాసమును గలిగించుచుండవలెను!

(ప్రవేశము : సిద్ధార్థుడు)

య : (లేచి నమస్కరించుచు) నాథా! నమస్కారములు!

రా : తండ్రీ! వందనములు! (వందనమిడి, తండ్రివద్దజేరి) నాన్నగారూ! నా పాఠము వినరా! బహుబాగుగా నప్పగింపగలను!

సి : ఏదీ! చూతము!

రా : (వెనుకటి పాఠను చక్కగా నప్పగించును)

సి : (సంతోషముతో రాహులుని మూర్కొని ముద్దిడి) ఎంత చక్కగా నున్నదోయీ! రాహులా! (యశోధరతో) ప్రేయసీ! యేమందువు! మన రాహులు డెంతవాడందువు?

య : తమకు తగినవాడందును!—పులిగర్భమున మేకపిల్ల పుట్టగలుగునా?

సి : ప్రేయసీ! మధురమ్యుతమగు నీ ప్రియవచనములచే నాకు దినమొక గడియవలె గడచిపోవుచున్నది సుమా!

య : ప్రేమాతిశయముచే తాము పలుకు అతిశయోక్తులివి! నేనెంతదానను?

సి : దేవీ! కాలమతిక్రమించినది. మీరింక శయనింపుడు! నేనును కొంచెము మటునిటు పచారు నొనర్చి పిమ్మట శయనింతును.

య : మహాప్రసాదము! (నమస్కరించి, రాహులుని తోడ్కొని లోనకు చనును.)

సి : (పచారుచేయుచు, స్వగతము) అహాహా! ఇట్టి దారా సుతులతోగూడి నిత్యకళ్యాణము పచ్చ తోరణముగా

ముందు గృహస్థజీవితమేగదా లోకమున ధన్యమైనది! (ప్రక్కకుజూచి) (ఆశ్చర్యముతో) ఏమది! ఔరా! ఈ బలిసిన బల్లి దీపపువెలుగునకు వచ్చుచున్న పురుగుల నెంత త్వరతో భక్షించుచున్నది! అక్కటా! ఈ దృశ్యము నేమనవలయును! (మరింత యాశ్చర్యముతో) ఆశ్చర్య మాశ్చర్యము! ఇన్ని జీవులను తన పొట్టబెట్టుకొని యాజంతువొక సర్పముకోటు బడినది! అక్కటకటా! ఈ సృష్టి రహస్యములు అగాధములై—అమోఘయములై—ఎంతవారికిని భేదింప నలవిగానివై యున్నట్లుగ గన్పట్టుచున్నదే!—(కొంచెము చింతముతో) ఏమీ!—ఈ సృష్టి రహస్యములు యేయొక్కరకునుగూడ భేదింప నలవిగానివా? కాదు! యెక్కడనైన-నెవరైన-యొక్కొక్కరు సులభముగా భేదించి వేయగలరు!!—(కొంచెము యోజించి) అట్లైన నేను సహితము అట్టి మహత్తర కార్యము నెందులకు సాధింపగారాదు?!—(ప్రబోధముతో) ఓయి సిద్ధార్థా! లెమ్ము! నడుము బిగింపుము!—స్వల్పమైన సంసారమునే జూచుకొనుచు—సర్వము నిదియేయని భ్రమ జెందకుము—! ఇప్పుడే తిరుగులేని, నిశ్చయమును గావించుకొనుము!—సృష్టి రహస్యములను భేధించుటయను మహత్తరకార్యము మాత్రమే నీకు దగినది! మరెద్దియు నీ దృష్టి పథమున పడగారాదు!—(సమాధానముగా)...అయిన ఈ నా ప్రియ యశోధర! ముద్దు కుమారుడు రాహులుడు!!—అటు తండ్రిగారు! రాజ్యము—సిరిసంపదలు!!—ఇవి యన్నియు నేమి గావలె?!! (ప్రబోధము)—పిచ్చివాడా! వీటి నేమి చేయవలెనని ప్రశ్నించుచుంటివా?—త్యజింపవలెను! ఇవన్నియు—ఇట్టివే మరియేవియైన నున్న నవియన్నియు గూడ—త్యాగము కావలె!!—ఈ విషయ వాంఛలను పొరలలో జిక్కిన నీ దృష్టికి దివ్యప్రకాశ మెంత మాత్రము గోచరముగాకున్నది!—కాజాలదుకూడ!! ఈ పొరలను లేకుండ జేసికొందువేని, అట్టివి నీ నిర్మల దృష్టికి దివ్యజ్యోతి—పరమ ప్రకాశము—వెంటనే పొడగట్టగలదు!!!—ఇంక నాలసింపకుము! మరు మాటాడకుము!!—ఈ క్షణముననే ఈ సంసార బంధములనంతటిని పరిత్యజించి సన్యాసినైపొమ్ము! (సమాధానము) మంచిది! కడసారి—ఒక పర్యాయము నిద్రించుచున్న భార్యా పుత్రుల వీక్షించి—(ప్రబోధము) ఓయీ! ఎందులకీ వ్యర్థ కాలక్షేపములు!—సరియే! పోనిమ్ము!—అట్లే ఒక్కమారు వీక్షించి పొమ్ము! (లోనికి పోయివచ్చి) యశోధరా! ప్రియా!!—బిడ్డా! రాహులా! నేనొక మహత్తర కార్యార్థమై మిమ్ముల్లిక నిట్లు విడిచి పోవుచున్నాడ! ఇట్టి నన్ను మీరు నిర్దయుడ—కఠినుడనని—క్రూరుడనని దూషింపకుందురుగాక!—మీ రెల్లప్పుడును సుఖములనే పొందుదురుగాక—! ఇవియే నాయొక్క కడసారి ముద్దులు!—ఒక్కసారి నా ప్రియ దారాసుతులను ముద్దిడివత్తునా?! (లోనకు కాలిడ ప్రయత్నించి ఆగిపోవును. ప్రబోధము ఓయీ! అవివేకీ? ఏమి నీయీ అవివేకము! నీవు వారిని ముద్దిడిన వారికి మెలకువగలిగి—వారు నిన్ను పోనిత్తురా?—వివేకివికమ్ము! లేలెమ్ము!!—ముందుకు నడువుము!—మరి వెనుకకు జూడకుము!! (కొంచెము ముందుకు నడచి మరల వెనుకకు జూచి) ప్రేయసీ!—కుమారా! మీ ప్రియవచనములకు—మీ మధురాలాపములకు—మీ లలిత ప్రవర్తనములకు—నాకు నేటితో 'స్వస్తి' యగుచున్నదిగదా! అయ్యో! కడసారి—మిమ్ముల నొక్కమారు! మనసార—ప్రేమమీర—ముద్దిడుకొని పోవుటకైనను వీలు కలుగకపోయినదే! (ప్రబోధము) ఓయీ! వ్యర్థప్రలాపీ! విషయలోలా! నీవంటి వ్యర్థ ప్రలాపిచే—విషయలోలునిచే—సృష్టి రహస్యము లొక్కనాటికిని భేధింపబడజాలవు!—ఎంతకును సిగ్గు దెచ్చుకొనకున్నాడవే!—ఇంక ఈ సమస్తమునకును 'స్వస్తి' వాక్యముల నుచ్చరించి కదలితివా సరే!—మరియొక్క యడుగు వెనుకకు వేసినను, నీ కార్య సాధన మింక బండి సున్న కాగలదు! ఇది నిశ్చయము! నిశ్చయము!! ముమ్మాటికి నిశ్చయము!!!—యశోధరా! రాహులా!!

సీ॥ అనురాగమున మిమ్ము నలరింపగా చెంత
జేరియుండుటకింక—నరయ స్వస్తి!

రాహులా! నాతండ్రీ—రావోయి ముద్దివ్వ
మని పిల్చి ప్రేమతో—గనుట స్వస్తి!
ప్రియ! యశోధర! నీదు ప్రియవచనంబుల
విని మోదమందుట—ఇంత స్వస్తి!
పుట్టినప్పటినుండి—ఎట్టి కష్టములేక
పోషించినట్టి ఈ—పురికి స్వస్తి!!

మూర్ఖతకు నన్ను విడిపోవ—ముందు స్వస్తి!
స్వస్తి యిచ్చోటునకు; అలసటకు స్వస్తి!
స్వస్తి ననుగన్న తండ్రికా—శకును స్వస్తి!
స్వస్తి భోగంబులకు నింక—శలవు స్వస్తి!!

(మరి తిరిగిచూడక ధృఢముతో ముందుకు పోవు చుండగా—)

(తెర)

## రంగము 2

(ఛన్నని గృహపు ముంగిలి. ప్రవేశము, సిద్ధార్థుడు)

సి: (తొందరగా ప్రవేశించి) ఛన్నా! ఛన్నా!!

ఛ: (ప్రవేశించి) ఎవరువారు? (చూచి) యువమహారాజు నకు వందనములు! (నమస్కరించి ఆశ్చర్యముతో) రాకుమారా! ఈ అర్ధరాత్రమున—యిట్లొంటరిగా—నా గృహమునకు—

సి: (తొందరతో) మిక్కుటముగ ప్రసంగించుటకు సమ యము చాలదు ఛన్నా!—లే లెమ్ము! వేగముగా ప్రయాణించు చక్కని గుఱ్ఱము నొకదానిని సిద్ధపఱచి నాకిమ్ము!

ఛ: యువరాజా! ఈ ప్రయాణ మెచ్చటుకు?

సి: ప్రకృతి రహస్యములను ఛేదించుటకై తపోభూము లకు—

ఛ: (వింతగా) తపోభూములకు!—రాకుమారా! నీవు గృహస్థుడవు గదా!?

సి: సర్వసంగ పరిత్యాగినై!

ఛ: (భ్రమించినట్లు) నేనేమియును కలగనుటలేదుగదా! (వేలు కఱచుకొని) కాదు!—ఇది స్వప్నావస్థకాదు! జాగ్రదవస్థయే! (విచారముతో ఆత్రముతో) యువ రాజా! యువరాజా! నాకీసంగతిని జెప్పుము! నీప్రియ భార్యాపుత్రులను, తండ్రిని—రాజ్యమును—ఈ సర్వ సంగములను పరిత్యజించెదవుగా!?

సి: ముమ్మాటికిని!

ఛ: రాకుమారా! సాహసము! అయ్యో!

గీ॥ మనసునీపయి, నినిపిన—జనకుబాసి
ఘోర సంసారవారాశి—దరినిజేర
తోడుగా నిన్నుగొనియు, సం—తోషపడెడి
భార్య నీరీతి నట్టేట—వదలివైచి
పోవనే ధర్మశాస్త్రంబు—త్రోవజూపు
ముందు యోజన లేకుంట—మోక్షమగునె?

సి: యోజించవలసిన రీతినే యోజించితిని!—ఛన్నా! ఈ లోకమున ప్రాణి ఆశయను పాశముచే జుట్టబడి అస్వతంత్రుడై యున్నాడు! సర్వ సంపత్తితోడను ఈ భూమండలము నంతటిని ఒక్క మానవుడు పొందగలిగి నను, ఇంకను నేమైన లభింపజేసికొనుటకు వాడువ్విళ్లూరు చుండును!—విషయోపభోగమే జీవికి మృత్యువు! నేడొక విషయము పొందును! మరియొకటి మిగులును! రేపు దానిని నొందును! వేరొకటి! దానిని పొందిన మరియొకటి!!! ఛన్నా! విషయములే విషములు. వాటిని పొందుకొలది, అగ్నియందు, ఆజ్యమువలె మరియు మరియు వృద్ధినొందగలవు!—నేను సత్య శోధనను కాంక్షించితిని!—దాని సిద్ధినొందుటకు—ప్రప్రథమున నీ విషయ పిశాచమునే బలినొసంగు చున్నాను! ఇదియే ఒప్పిదమైనది!—(త్వరతో) ఛన్నా! వేగముగ గుఱ్ఱమును—మరియొకమాట! నీయింట నేమైన చినిగిన దస్తులున్న—వాటినిగూడ తీసికొని రమ్ము! త్వరపడుము!! (ఛన్నుడు (నిష్క్రమించును)

ఛ: (బట్టలమూటతో ప్రవేశించి చూచి విస్మయముతో) యువరాజా యువరాజా! ఆహా—! తల జుత్తునుకూడ తీసివేసి ఎట్టి ఆకారము నందితివి!

(తరువాయి 30వ పేజీలో)

# చరిత్రే నిరూపిస్తుంది...

* శ్రీ వసంతరావు రామకృష్ణరావు *

యుద్ధాన్ని నేను—చెప్పుతున్నాను
మానవుడి జీవనం వున్నంతకాలం
ఉన్నాను—ఉంటున్నాను—
ఈ విషయం పదేపదే
చరిత్రే నిరూపిస్తుంది......
గడచిన యుగాలల్లో
మరలిన తరాలలో
జలపవన శక్తుల జగత్తులో
నిలచిన మానవత్వంలో
యుద్ధాన్ని—నేను—ఉన్నానని
చెప్పుతున్నాను—— —— —— ——

సరిగా లేని లోకాల
పరిసరాల పరిధిలో
పరుగిడే మానవుడూ—
నిలిచి నన్ను పలుకరించక
కులుకుతూ—గమనకలాపంతో
పలాయనం చేసేకాలమూ
వుంటూన్న వేళలలో
యుద్ధాన్ని—నేను—వున్నానని
ఘంటా పథంగా చెప్పుతున్నాను..........

మానవుడిలో మతాలూ,
అసూయా—వ్యక్తిగతాలూ,
జాతులూ, నీతులూ
దాతలూ, నేతలూ
పాలిత పాలకులూ
ప్రపంచ నిర్మాతలూ
పెనుభూతాలై
వున్నంతకాలమూ
అపజయం ఎరుగని
ఆత్మ ధైర్యంతో
యుద్ధాన్ని—నేను—వున్నానన్న
సంగతిని, పరమ సత్యాన్ని
చరిత్రే నిరూపిస్తుంది..........

నా రూపాన్ని—అపురూపాన్ని
నా తాపాన్ని—నా ప్రతాపాన్ని
నా ధైర్యాన్ని—నా క్రౌర్యాన్ని
గుర్తించిన మానవుడు
నా వర్తనం గురించి
నను ప్రశ్నించడు—— ——

పండిన పాపానికి, శాపానికి
పనికివచ్చే రూపాలతో
ఆత్మవినాశ విధానాన్ని
ఓనమాలు దిద్దుకుంటూ
సరిహద్దులు చూసుకుంటూన్న
మానవుడి హృదయ వ్యాపారంలో
యుద్ధాన్ని—నేను—ఆప్యాయనంగా
పెరుగుతున్నాను—నాకు నాశనంలేదు—
నా చరిత్ర కడుప్రాచీనం—నేను—
చరాచరాలలో పరిభ్రమించాను—
చరిత్ర గ్రంథాన్ని తిరగవేయ్—
ప్రతి పుటలో నారూపం కనిపిస్తుంది—
ప్రత్యక్షరంలో నా శబ్దం ధ్వనిస్తుంది.

మానవుల మధ్య—గుసగుసలలో
సంఘ విషయంలో—మత ప్రసక్తిలో
అసమ్మత విషయ విశేషాలలో
పాలిత పాలక భేదాభిప్రాయంలో
స్వాతంత్ర్య సాధన సమయంలో
వర్గ వివాద వైషమ్యంలో—రాజకీయంలో
రాజుల ఆశయంలో—రాజ్యాల విస్తీర్ణంలో
సామరస్యం లేని సంకట సమయంలో
యుద్ధాన్ని—నేను—నడుంకట్టుకొని

# చరిత్రే నిరూపిస్తుంది

పరిష్కారమార్గాన్ని—చూపుతున్నాను.
దోపిడీ ద్రోహానికి—పాప విహారానికి
నా వ్యాపారం అపురూప సాధనసంపద
నాకు నశించే శక్తిని చేకూర్చే
బాధ్యత—మానవుడిది—
నా ఆహారానికి—నరుడి దేహాలు
నా దాహానికి—మధుర రుధిరం
త్యాగంచేస్తూ—మానవుడు
సామరస్యమార్గాన్ని సాధించమంటాడు
శాంతిని—సాధించి—నెలకొల్పమంటాడు
యుద్ధాన్ని—నేను—పాటుపడుతున్నాను.

నా చేతులలో ప్రాచీనమైన
వేదవిహితమైన—
మానవ సమాజంలోని
ధర్మతేజం—సత్యనైజం
హృదయ సౌజన్యం—సౌఖ్యం
క్షాత్ర ధర్మం—ధైర్యం—
ప్రపంచశాంతీ—సౌఖ్యం—
నలిగిపోయి—నశించి—
నామమాత్రంగా—అక్కడక్కడ
నిలిచి వున్నాయి!

యుద్ధాన్ని—నేను—చెపుతున్నాను—
నా వాతావరణంలో—
ఆవహిస్తుంది—అహంకారం
నశిస్తుంది—మమకారం—
ప్రవహిస్తుంది ద్వేషద్రవం
ఘనీభవిస్తుంది వుపద్రవం
కారుణ్యం, కాఠిన్యం
క్రౌర్యం—కలుషత్వం
త్యాగం—స్వార్థం—
అన్నీ—అనేకరూపాలలో
నిలిచి వుంటాయి—
చరిత్ర తిరగవేయ్
ధరిత్రిలో—నా పేరుప్రతిష్ఠలు
స్థిరంగా—నగ్నసత్యంలో
వుండినట్లుగా—
చ......రి......త్రే......
నిరూపిస్తుంది............



(28వ పేజీ తరువాయి)

సి: ఇంతియేనా ఛన్నా! (ఛన్నునిచేతనున్న వస్త్రముల మూటను లాగికొని, ప్రక్కకుపోయి, ఆ చినిగిన వస్త్రములను ధరించుకొని, విడచిన తన రాజదుస్తులు, కిరీటము, ఆభరణములు, తలవెంట్రుకలు—వీటిమూటతో ప్రవేశించి) ఇప్పుడు చూడుము ఛన్నా! సత్యపథమున, నడచువానికి ప్రియములైయుండు వేషభావలివి! గట్టముగూడ సిద్ధమేగదా! (తన చేతనున్న మూట ఛన్నునికిచ్చి) ఛన్నా! ఇవిగో! ఈ వస్తువులు—యింటికి చేర్చి యశోధరా, రాహులులనే నాశీర్వదించితిననియు, నేనొక మహత్తర కార్యార్థమై వారిని పరిత్యజించి పోవలసి వచ్చెనదనియు, ఇందుకై విచారము కూడదనియు—తండ్రిగారికి నా వందనములనియు, నేనిట్లు పోవలసివచ్చినదని విచారింపవలదనియు, నా కొరకుగాను వెదకించుట మొదలగు కృత్యములు వలదనియు—నేను చెప్పినట్లు చెప్పుము!—నీకున్ను శుభమగుగాక!

(శీఘ్రముగాపోవ ఛన్నుడు నిశ్చేష్టతతో నిలచియుండును.)

(తెర)

(సశేషము)



# ఒక కంటిలో బెల్లము ఒక కంటిలో సున్నము

శ్రీమతి యన్. లలిత

విజయవాడ వాస్తవ్యుడు, బ్రాహ్మణ కులజుడు, విద్యా విశారదుడైన విజయరామ నామధేయునకు, ప్రభాకరుడు సుధాకరుడు అను యిరువురు పుత్రులును, పద్మజ, సరోజ, వనజ, అను ముగ్గురు పుత్రికలును గలరు. సామాన్య కుటుంబీకుడగునాతడు చిన్న వయస్సునందునే పిల్లలకు దూరమాయెను. పాపము! భారము మోయవలసిన బాధ్యత ప్రథముడైన ప్రభాకరుని మీద పడినది.

మాతృదేవియైన వేదవతిని, పద్మజ, సరోజ, వనజలను కంటికి రెప్పవలె ప్రభాకర, సుధాకరులు కాచుచుండిరి. ఏకోదరులు కనుక యెంతో అనుగుణ్యముగ వుండేవారు ఆ రవి చంద్రులు. అన్నలయందు వినయ విధేయతలు చూపుచు పట్టెడన్నము తిని యేమూలనో కాలక్షేపము చేయు చుండెడివారు ఆ మూడు ముత్యములు.

వీరి పితామహి, పితామహుడు, మాతామహి తమస్వ గ్రామములందు జీవితములు గడుపు చుండెడివారు. కాటిలో నొక కాలు, యింటిలో నొక కాలు పెట్టుకుని సిద్ధముగా వున్నారు. చేతులమీద నడుచు ఆవృద్ధ జీవములకు యింకా కాంక్ష పీకుతోంది. దూరమున నుండియే, తమ మనుమడైన ప్రభాకరునకు చేదోడు వాదోడుగానుండి తమ యాజమాన్యము సాగించేవారు.

ప్రథమ తనూజ పద్మజకు యుక్తవయస్సు వచ్చినది. త్వరలో వివాహము చేయవలసినదని, తాము చూచి ఆనందించి, పిదప ప్రాణములు వదలుతామని, యీ కోర్కె నెరవేర్చ వలసినదని, ఆ ముసలిమూటలు ముంతపొగ పెట్టినారు ప్రభాకరునకు.

ప్రభాకరునకు వయోవృద్ధుల వాక్కుయందు విశ్వాసను గౌరవము మెండు. వేదవతి సమ్మతిమీద పద్మజకు, మూడు ముళ్ళూ వేయించినారు. కాని పసుపు చూపించిన, ఆరు మాసములకే ఆ అర్థాయుస్సువాడు "ముసుగు సుఖము అనుభవిస్తూ, మీ పుట్టినింట యావజ్జీవితము గడపవలసిన"దని తన చుక్కల బజారునకు యాత్ర సాగించెను. పద్మజకు గరిట పెత్తనము యిచ్చిరి. ఆడది కదూ మరి!

వేదవతి నిర్జీవురాలై పోయినది. సరోజకు పెండ్లి విషయమే తల పెట్టలేదు. అత్తమామలు, తల్లి, వేదవతికి ధైర్యము చెప్పి, ఆమె వేదన కొంతవరకు, శాంతింపజేసిరి. "ఎవరి ఖర్మమువారిది. అందరి బ్రతుకు అవిధముగానే కాలి పోతుందా? యెంతమంది సుఖముగా లేరు కనుక సరోజను కూడ గృహిణిని చేయవలసిన"దని ప్రభాకరుని తోము తుండేవారు. ఆడదానికి యింటి పెత్తనము, మగవానికి వీధి పెత్తనమన్నారు కనుక, చాకలి పద్దువేసే చదువువస్తే చాలు నని సాగదీసికు నేది మాతామహి. డొక్క శుద్ధిలేక పోయినా 'స్త్రీకి' యే విధమైన లోపము కలుగదని, ప్రోత్సాహము చేసి, మొత్తమునకు, ప్రభాకరుని వేదవతిని, 'ఊ' అని పించారు. అన్ని తంతులు సక్రమముగ జరిగి పోయినవి.

సరోజ భర్త, సామాన్యపు వుద్యోగస్థుడు. రెక్క ఆడితేనేగాని డొక్క ఆడని ఆస్థిపరుడు. కుచేల సంతానము. దేహధారుఢ్యము సన్నగిల్లినది. దొరికిన రోజున గంజి, లేని రోజున యేకాదశి వ్రతముచేసి, గుక్కెడు, తీర్థముతో సంతృప్తిపడి, భూదేవిని కౌగలించుకునేవారు. సరోజ అక్షరజ్ఞాన శూన్యురాలు కనుక, యిన్నిపాట్లు పడవలసి వచ్చినది. ఆడది అంటే కంటిలో సున్నము. సరే! అందరికి విశదమేగా. మగవాడంటే కంటిలో బెల్లము. ఉద్యోగ్యము పురుష లక్షణమన్నారు కనుక, చదువు అబ్బని చవటకూడ, చదువుకుని తీరవలయునని ధర్మశాసనము!

సుధాకరుడు ఘట్టుఘోరము పూర్తిచేసే సరికి మైనారిటీ తీరిపోయింది. సరస్వతీ ఆకు నూరుకుని మింగినా లాభము లేక పోయినది. అసలే సుధాకరుడేమో చాంద్రాయణ వ్రతము అవలంబించినాడు.

ఇంతలో పితామహి, పితామహుడు, కూడ దాటి పోయినారు. పరలోకములో పాత్రులు వేయు పిండములు ఆరగిస్తున్నారు.

పద్మజ, సరోజల స్థితులు, యథాప్రకారముగ వున్నవి. ఈ రెండింటితోనే వేదవతికి ముఖము మొత్తినది.

తినగా, తినగా, గారెలు చేదుకావు మరి. వివాహమంటే 'పురి' అని పించినది ఆమెకు. వనజ కూడ, అక్కల పాట్లు చూచి "అబ్బా! ఆడదాని బ్రతుకు అష్టకష్టములు అనుభవించవలసినదే కాబోలు. ఈ 'స్త్రీ' జాతికి విముక్తి అనేది దైవసృష్టిలో లేదా అని, స్త్రీకి విద్య అత్యావసర"మని తర్కించుకుని, తదేక దీక్షతో చదువుకునేది. స్కూలు ఫైనలు పూర్తిచేసినది. అందచందములకు కొరతైనప్పటికి బుద్ధి కుశలతగలది. విద్యకు, తగిన వినయము, వినయమునకు తగిన సౌశీల్యము ఆమెకు అలంకారములు. పై చదువు చదువ వలయునని ఆమె అభిలాష. సోదరి కోర్కె నెరవేర్చ వలయుననుకునేవాడు ప్రభాకరుడు. తన రొట్టె నేతిలో వేసుతుందికదా అని సంబరపడేది. కాని సాగలేదు.

ప్రభాకరుడు స్వతంత్రించి యేకార్యము చేయ జాలని పురుష సింహుడు. నీతి కోవిదురాలై నటువంటి, మాతామహి అడ్డు పుల్ల నొకటి పడవైచినది. ఆడవాళ్ళ చదువుకుని యేమి చేయవలయును కనుక, యింతటితో విరమిస్తే మంచిదని, అదికాక వాళ్ళ పల్లెలో యెవరో అపసంధాయిగాని భూసంధాయి, కొంపకు చిచ్చుపెట్టి పారిపోయినదని, అటుపైని వారి అభిమతము ననుసరించి ప్రవర్తించవలసినదని, ఆజ్ఞవేసినది. ఎంతటి విద్యావంతులైతే నేమి, యుక్తాయుక్త విచక్షణ లేక పోయినపిదప?

"విస్సన్న చెప్పినది వేద"మన్నట్లు వనజాను పిలిచి యింక విద్యకు స్వస్తి చెప్పినట్లేనన్నాడు అన్న. కండ్లలో నీళ్ళు గిర్రున తిరిగినవి. ఆశ నిరాశ అయినది. సంఘపు కట్టుబాట్లలో వున్న స్త్రీ యేమి ప్రత్యుత్తర మిస్తుంది. "నీదయ" అని తూర్పు దిశకు తిరిగి నమస్కరించినది.

పద్మజకు, ఆస్తి లేనందువలన, నెత్తిన చెంగు అలంకరించుకుని, పుట్టినింట పొయ్యి పెత్తనము సాగించేది. సరోజకు చదువురాని లోపముచే భర్తకు సహాయ పడలేని దాయెను. వనజాకు, యేదో కొద్ది చదువు వున్నది కదా, ఆస్తిపయనము యిస్తే, సర్వ శ్రేయస్సుని, యొక నిరక్షరకుక్షునకు కట్టబెట్టినారు. దానికి తోడు ప్రభాకరునకు జీవనాధారమైన కొద్దిపాటి భూమి, వివాహ సమయమందు వరునకు భూదానము చేసిరి. "చదువురాని మొద్దో, కదలలేని యెద్దో" అన్నారు. కాలయాపనకు జూదరిగా మారినాడు. ఇంకేముంది సర్వము యీశ్వరార్పితమైనది. గేదె చస్తేనేగాని పాడి బయటపడదు. వనజా చిన్న రెక్కలే ఆధారమైనవి. ఎంత కాలమని, సుకుమారమైన ఒక పక్షి, గగనమార్గమున విరామము లేకుండ యెగురగలదు?

ప్రభాకరుడు కూడా తండ్రి ననుసరించి, చిన్న వయస్సనందే మరల మాతృ గర్భములోనికి పోయెను. కుటుంబము కాలు చీకటిచే క్రమ్మబడినది. ఇంక, సుధాకరుడే శరణ్యమాయెను.

కాటకపు రోజులవి. పేరు పొందిన అనాథ శరణాల యములకు కూడా కాటకము వచ్చినది. మానవతులగు వేదవతి, పద్మజలకు, 'దేహీ', అని పరులను వేడుకొనవలసిన దినములు సంప్రాప్తమాయెను. పరపిండ జీవితమునకు పరితపించుచుండిరి. వనజా విద్య భర్త కుక్షింభరిత్వమునకే చాలదు. సుధాకరుడు, ప్రప్రథమముననే రాగి చెంబు చేత పట్టినాడు. గడ్డురోజులలో అది నిండేది కాదు. తన తల్లికి, పద్మజకు సహాయము చేయలేని తన జీవితము నిష్ప్రయోజనమన్న విచారము, యేకోశమున లేదు. ఈతని క్రింద వ్యయము చేసిన ధనము, వనజా క్రింద వెచ్చిస్తే ప్రయోజనముండేది. ఆడది అంటే కంటిలో సున్నముగా!

స్త్రీకి కూడ పురుషునితో పాటు, సమయానుకూలముగ, కాలాను గుణ్యముగ, విద్య నేర్పించిన, యిట్టి యిక్కట్టులు స్త్రీ జాతికి కలుగవని నావిశ్వాసము. పద్మజ, సరోజ, వనజల విషయమున దోషి ఎవరో వివేకుల కెరుక!

వయోవృద్ధులు, తమ పూర్వాచార సంకోచ భావములకు కొంత పరివర్తన కల్పించుకుని, స్త్రీ పురుషులను సమదృష్టితో చూడవలయునా లేక, స్త్రీ తన కట్టుబాట్లను త్రెంచుకొని, విజృంభించవలయునా? ఈ సమస్య ప్రాజ్ఞులు తీర్చవలసినదే.

'సమభావము' దేశములో నుద్భవించిననాడే 'ఆంధ్ర మహిళలకు' వసంతోదయము. దేశము సకలైశ్వర్య సౌఖ్య సంపదలతో తుల తూగును. పురుషుడు, నమ్మినవారి నెత్తిన టోపీ పెట్టకపోడు, స్త్రీ, శఠకోపము పెట్టకపోదు!!






# యుక్తి

* చొప్పల్లి వెంకటసూర్యనారాయణ *

శక్తికి మించినది యుక్తియని పెద్దల సూక్తి. కాబట్టి మనం శక్తిచేత సాధించలేని పనిని యుక్తి చేత సాధించాలి. దానికి తార్కాణంగా మీ కొక కథ చెప్తా వినండి.

అనగా అనగా ఒక పల్లెటూరు. అందులో ఒక ముసలి గ్రుడ్డికోమటి. అతను చాలా బీద వాడు, సంతానహీనుడు కూడా. ఇంతో అంతో పెద్దలు గడించిన ధనం ఉండబట్టి జీవనం గడుస్తోంది. ఆ ధనం కాస్తా అయిపోకుండా మళ్ళీ డబ్బు గడించాలని కోరిక ఉంది. కాని యేలాగా అని చాలా రోజులు తీవ్రంగా ఆలోచించాడు. ఆఖరకు ఒక ఉపాయం తట్టింది. తపస్సుచేసి వరం కోరడంవల్ల ధనధాన్యాదులు సంపాదించ వచ్చు కదాయని. కాని తపస్సు చేయడానికే యడివికి వెళ్ళగలడు? అందుచేత యింట్లోనే తపస్సు మొదలెట్టేడు.

భక్తి శ్రద్ధలతో తపస్సు చేయడంవల్ల కొద్ది కాలంలోనే దేవుడు ప్రత్యక్ష మయ్యాడు. కోమటికి కండ్లగుపడక పోవడంచేత యింకా తపస్సు చేస్తూన్నాడు. అప్పుడు దేవుడే "కోమటీ యెందులకింత దీర్ఘంగా తపస్సు చేస్తూన్నావు" అని అడిగాడు. "చిన్న కోరిక ఉంది బాబు!" అని అన్నాడా కోమటి. "ఏమిటో వేగంగా కోరుకో" అన్నాడా భగవంతుడు. ఒక్క కోరికతో సర్వస్వం రావాలి అని "నాముని మనుమడు బంగారు తూగుటుయ్యాలలో నూగుతుంటే నా కండ్లారాచూచి ఆనందించాలని ఉంది స్వామీ!" అని పాదాలమీద వాలాడా కోమటి.

దేవుడీతని యుక్తికి మెచ్చుకొని, "ధన, కనక, వస్తు, వాహన, పుత్ర పౌత్రాభివృద్ధిగా వర్ధిల్లు" మని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. కోమటికి వెంటనే కళ్లు వచ్చేసేయి. యిల్లంతా సందడిగా యుంది.

చూసారా! ఈ కోమటి యెంత యుక్తి పరుడో!



# చిన్న కధ

* కుమారి వారణాసి లక్ష్మీసరోజిని *

ఒక వూరిలో ఒక భార్య భర్త వుండేవారు. భార్యపేరు పులగము: భర్తపేరు నెయ్యి. వారికి ఒక కొడుకు వుండెను. వానిపేరు దుష్టకజ్జ. వాళ్లింట్లో ఒక ఆవు, దూడ వుండేవి. ఆవు పేరు చుట్టము, దూడపేరు భూతము. ఒకనాడు వారింటికి ఒక చుట్టము వచ్చెను. ఇతనికి మధ్య దారిలోనే భర్త కనపడి, "యింట్లో పులగము వున్నది. వెళ్లు" అని చెప్పెను. ఇంట్లో తినటానికి పులగం వున్నది గాబోలు ననుకొని ఆ బంధువు యింటికి వెళ్లెను. ఇంటికి వెళ్లగానే పులగము కనబడి యిట్లా అంది, "నెయ్యి వచ్చే ధాకా వుంటారా? లేక యిప్పుడే ఫలహారము చేస్తారా?" అని అడిగెను. పులగములోకి నెయ్యి లేదేమో అనుకొని "నెయ్యి వచ్చేదాకా వుంటా" నన్నాడు చుట్టము.

తర్వాత భర్త యింటికి వచ్చెను. అందరు కలిసి ఫలహారం చేశారు. వారందరు కలిసి కబుర్లు చెప్పుకొంటుంటే పిల్లవాడు ఎందుకో ఏడ్చాడు. అప్పుడు యింటి యజమాని నెయ్యి భార్య పులగముతో "దుష్టకజ్జను యిటు తీసికొని వచ్చి, చుట్టాన్ని కట్టేసి, భూతాన్ని విప్పు" అన్నాడు. అంటే పిల్లవాడిని యిటు తీసుకు వచ్చి, ఆవును కట్టివేసి, దూడను విప్పుమని అర్థము. బంధువు యిదివిని తననే కట్టివేయమని, కజ్జపెట్టి కొట్టి, భూతాన్ని తనమీదకు వదలమని చెప్పాడనుకొని భయపడి పరుగెత్తుకొంటూ వెళ్లి వాడి గ్రామం చేరుకొనెను. ఇదంతా చూస్తూవున్న భార్యా భర్త లిద్దరు తమ తప్పు తెలిసికొని ఒండొరుల మందలించుకొనిరి.



# నవ్వు పువ్వులు

ఇల్లుగల యజమాని: యేమండోయ్ గోడలకు మేకులు కొట్టకండి; కన్నాలు పడితే మరమ్మత్తుకి మీరే ఇచ్చుకోవాలి.

అద్దెకున్నవాడు: అయితే ఇప్పటికి మేము కొట్టిన మేకులన్నీ మాకు దండగే. కనుక మేకు ఒక్కొంటికి అర్థణా చొప్పున మీరే ఇచ్చుకోండి.

* * *

తల్లి: అదేమిటే ఇనప మూకుట్లో చారు పెడుతున్నావు. వాసన వేయదూ?

కూతురు: మా సైన్సు మాస్టారు చెప్పేరు, ఒంటికి ఇనుము మంచిదని.

* * *

టీచరు: శ్యామా! రూపాయికి యెన్నికాన్లు?

శ్యాము: రూపాయి తెండి మార్చి లెఖ్ఖపెట్టి చెబుతాను.

కర్రి రాజేశ్వరరావు

# మహాపురుషుడు

శ్రీ కె. జగదాంబ

సాల్మన్ అనే రాజు పూర్వం "జెరూసలెం" అనే పుణ్యక్షేత్రాని కధిపతి. సాల్మన్ తాను బ్రతికినంతకాలమూ రాజాధిరాజువలె బ్రతుకలేదు!—ఒక ప్రజా సేవకునివలె; ఒక దేశ రక్షకునిగా బ్రతికి తన దేశప్రజలతోనే గాక ప్రపంచ ప్రజలందరితోనూ గొప్పపేరు తెచ్చుకొన్నాడు. ఈతని చరిత్ర ఏమోగానీ, ఇతని వలన జరిగిన, కొన్నికొన్ని పనులు, ఇతనిని గురించిన కథలూ, అన్నీకూడా ఈతనియొక్క గొప్ప గుణాలను తెలియజేస్తాయి!

సాల్మను ఘనతను విన్న షేబాదేశపు అందమైన రాణి అతనిని పరీక్షించి తెలిసికొన దలచి ఒకసారి జెరుసలెంకు పయనమై వచ్చింది. సాల్మన్ నిరాడంబరముగా ఆమెనెదుర్కొని మహోత్సాహం చూపాడు, ఆమె తన దేశ పరిశీలనార్థమై శ్రమపడి వచ్చినందుకు. షేబా రాణి తనకూ, తన పరివారానికీ, జరిగిన నిరాడంబరమైన సేవలూ, విందులూ చూచి ఆశ్చర్యపోయి నసుక్కొన్నది. "ఏమిటో! రాజాధిరాజనుకొన్నాను. ఘనమైనవాడని విన్నాను. తోటిరాచరికమైన మమ్మిట్లాగు చేశాడే! ఏమిటీ ఈయన ఘనత?" అని దురభిప్రాయం పడ్డది.

సాయంత్రం........సాల్మన్‌రాజు, షేబారాణీ కోర్కెపై స్వయంగా తన పట్టణాన్ని చూపించ దలచి "షికారు" బయల్దేరాడు. చక్కని గుర్రంపై సాల్మన్‌రాజు మామూలుగా వెళ్తున్నాడు. ఆతని ప్రక్కనే ఖరీదైన బట్టలు తొడిగికొని అందమైన గుర్రాన్నెక్కి అప్సరసలా, మెరిసిపోతున్న షేబారాణి తన అనుచరులతో ప్రక్కల తగుల్తున్న చెట్లూ, పుట్టలూ, తోటలూ, ఇళ్లూ, అన్నీ చూచుకొంటూ ప్రయాణం సాగించింది. అట్లాగు వారంతా చాలా దూరం—అనగా—ఊరి చివరవరకూ పోగా అక్కడ దారిలో ఒక చిన్న పుట్ట-చీమలది—తగిలింది.

షేబారాణీ గుర్రం ఇక రెండడుగులులలో ఆ పుట్టపైనుండి పోతుందనగా—"సాల్మన్‌రాజు దీనదయాళువని విన్నాము. కాని నేడాతడే తన కళ్లముందు మన ప్రాణాలు నాశనం చేస్తున్నాడు. అరె భగవాన్! దయచూపు—" అన్న మాటలు షేబారాణి గుర్రం ప్రక్కనే ఉన్న సాల్మన్ చెవిలో రింగు - రింగు - మని మ్రోగాయి. తక్షణం గుర్రాన్ని ఆపాడు. "మీ గుర్రాన్ని ఆపండి!" అని తొందరగా షేబారాణీతో ఆజ్ఞాపించినట్లు పల్కాడు.

పుట్ట తలమీద పడ్తున్న గుర్రపుకాళ్లు కళ్లెం బిగసాగ దీయడంవలన రెండడుగులు వెనక్కుపడింది. షేబారాణీ ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి ప్రక్కనేఉన్న సాల్మన్‌వంక "కారణమేమిటి?" అన్నట్లు చూసింది. "ఆహా! నిజంగా రాజంటే సాల్మనే రాజు. భగవాన్! సాల్మన్ చిరంజీవి అగునట్లు ఆశీర్వదించుమా!" అన్నమాట ఈసారి సాల్మన్ చెవికి వినపడగా అతని వదనంపై చిరునవ్వు అంకురించింది. షేబారాణీ ఒక్కసారి

ఉక్రోషం, కోపం, ఆశ్చర్యం, విస్మయం, అన్నీ కలసిరాగా గుర్రంపైనుండి ఉద్రేకంతో "మీకేమన్నా పిచ్చి పట్టిందా ?"—అని కేక వేసింది. నవ్వుతూ శాంతంగా సాల్మన్ "షేబారాణీ! తొందరపడి ఆవేశపడకు—ముందుగా గుర్రాన్ని ఈ క్రిందనున్న చిన్న పుట్టమీద కాకుండా ప్రక్కకు మళ్లించి నడపండి, కథంతా చెప్తాను తదుపరి!—" అన్నాడు. అందరూ అట్లానే ఆ చిన్న పుట్టమీదుగా కాకుండా మరో ప్రక్కగా గుర్రాలను నడిపించారు.

దారిలో సాల్మన్ రాజీవిధంగా షేబారాణీకి జరిగిన కథ చెప్పాడు. "రాణీ! చిన్నతనంలో, పశుపక్ష్యాది భాషలను ఎరుగుటకు చాల ప్రయత్నం చేసేవాడ్ని. తదుపరి కొంతకాలానికి నాకావిద్య లభించింది. సరే—నేను మనం ఆ పుట్టవైపు రాగానే నాకు ఆ పుట్టలో శ్రమపడి ఆహారాన్ని నిలువచేసికొంటున్న చిన్న చురుకైన చీమలు కన్పడ్డాయి. నేను వాటి చురుకుతనాన్ని చూశి మానవుల సోమరితనాన్ని గురించి ఆలోచిస్తుండగా మీ గుర్రం తన కాలు నొకదాన్నా పుట్టపై వేయబోయింది. అప్పుడా చీమలు తమకు రానున్న ఆపదను తలచుకొని నా దయా గుణత్వాన్ని నిష్ఠూరమాడగా మిమ్మల్ని గుర్రం ఆపమని కోరాను. అవునుమరి; ప్రపంచంలో ప్రతీ చిన్న అణుజీవికూడా కలకాలం జీవించ ప్రయత్నిస్తుంది. అటువంటి జీవుల్లో గొప్ప స్థానాన్నాక్రమించిన ఆ చీమలు నా కళ్ళముందు చస్తుంటే—చూడగలనా రాణీ ?"

"అయితే—తర్వాత నేనడిగిన ప్రశ్నకు జవాబీయకుండా నవ్వావెందుకండీ ?" అన్నది షేబారాణి. "అదా ? అహ్హాహ్హా ! నేను మిమ్మల్ని ఆ చీమలు చావనివిధంగా నడిపించినందుకుగాను. అంతకుముందే నన్ను నిష్ఠురమాడిన ఆ చిన్ని జీవులు వెంటనే మతిమార్చుకొని భగవంతునితో నన్ను చిరంజీవిగా చేయాలని మొరపెట్టుకొన్నాయి. ఆ అమాయకపు ప్రవర్తన చూచిన నాకు చిరునవ్వు కల్గింది సుమాండి!" అని జవాబిస్తూ నవ్వాడు సాల్మన్.

సాల్మన్ మాటలు విన్న షేబారాణీకి ఆశ్చర్యంతోబాటు అనుమానం కూడా కల్గింది. "అయితే—ఆ చెట్టుపైనున్న చిన్ని రంగులు పిట్ట ఏమని పాడుతుందో చెప్పగలరా ?" అన్నది. సాల్మన్ విని "ఓ! అది పాడుతుంది—షేబారాణీ వంటి సుందరయువతి తన సౌందర్యానికి తోడైన సుగుణత్వాన్ని కోల్పోవడం విచారకరమైన విషయం—ఆమె సాల్మన్‌వంటివాన్ని కూడా అనుమానించడం ఆమె ప్రవర్తనకే లోటైన విషయం. ఇకనైనా షేబాసుందరి సుగుణవతిగా తయారగుగాక—" అని అంటూ వివరించాడు.

షేబారాణి తన మూర్ఖానికి సిగ్గుపడింది.... ఇట్లాగు సాల్మన్ ప్రవర్తనకు సంపాదించవలసినవన్నీ సంపాదించుకొని ప్రఖ్యాతి గాంచాడు. ....సాల్మన్ ప్రఖ్యాతిగన్న వ్యక్తే కాకుండా ప్రపంచంలో నొక మహాపురుషుడిగా ఎన్నికైనాడు.



# పిల్లల శిక్షణ శాస్త్రీయ దృక్పథం

శ్రీమతి దరిసి సుభద్రమ్మ

[బిడ్డ సహజంగా, సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి దైహిక సంబంధమైన ఆరోగ్యభాగ్యము, సర్వాంగ సౌష్టవము అవశ్యకము అను మొదటి ప్రధానాంశమును గురించి ఇంతకుముందు సంచికలలో—(ఆగస్టు సెప్టంబరు అక్టోబరు సంచికలలో) కొంత ముచ్చటించాము. ఈ సంచికలో పరిసర పరిస్థితుల ప్రభావము—సుశిక్షణ అను రెండవ ప్రధాన అంశమును చర్చించుదాము.]

## పరిసర పరిస్థితుల ప్రభావము—సుశిక్షణ

ప్రశాంత ప్రేమలు గల వాతావరణంలో పరిజ్ఞాన ప్రబోధకములయిన పరిసర పరిస్థితుల మధ్య, సుశిక్షణను పొందుతూ పెరిగిన బిడ్డలు, ప్రాజ్ఞవంతులు, సకల సద్గుణ సంపన్నులు, కార్య నిరతులగు భావి పౌరులు కాగలరు అని గొప్ప గొప్ప మనస్తత్వ వేత్తలు నొక్కి చెప్పుట లోకవిదితము కదా! అయితే అట్టి అమూల్య పరిస్థితులు అందరికి దుర్లభములు కాని బిడ్డ సహజంగా, సక్రమంగా, సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి అట్టి స్థితిగతులు అత్యవసరమను విషయంలో ఎంత మాత్రము సంశయములేదు. ఇది ప్రకృతి శాసనమన్న మాట. దరిద్రులు ధనికులు అను విచక్షణను ప్రకృతి ఎంత మాత్రం పాటించదు. అయినా అట్టి వాతావరణము, పరిస్థితులు కల్పించుటకు ధనంకన్న ఎక్కువగా తెలివి తేటలు, ఓరిమి, జ్ఞానయుక్తమైన ప్రేమ అవసరము. పెక్కు కుటుంబాలలో కేవలం దరిద్రంవలన కాక, అజ్ఞానము, అశ్రద్ధ, ప్రమత్తతల వలననూ, ఇంటా బయటా కలహాలు, కోప తాపాలు, నిష్ఠుర వాక్యాలు, ఉబుసు పోకకు పరనింద, వృధా కాలక్షేపము మున్నగునవి బిడ్డల ఎదుట తఱచుగా జరుగుట వలననూ, బిడ్డల కభివృద్ధి కవసరమైన పరిసర పరిస్థితులు ఏర్పడవు. అంతేకాదు, వారి అభివృద్ధి అరికట్టబడుతుంది. ఇక పరిశుభ్రత, గృహాలంకారము, వస్తువులు ఒక క్రమము ననుసరించి వాటి స్థానే అమర్చుట, అను విషయాన్ని అసలు గమనించుట లేదు. బిడ్డకు మూడేళ్లు నిండుదాక దానిలో 'గ్రహణ శీల మనస్తత్వం, అనేది అతి చుఱుకుగా పని చేయటంచేత, మంచి చెడ్డలు, సక్రమములు, సభ్యత, అసభ్యతలు, నాణ్యము, మోటుతనము, అవసరము అనవసరములు అను వివక్షతను పాటించ లేక ప్రతి ఒక్కటి నీ ఆకర్షించు కొంటూ, బిడ్డ తన చిత్త వృత్తులను, బుద్ధిని నిర్మించు కొంటుంది. అనగా, వాటి మధ్య నున్న తారతమ్యములను గ్రహించునట్టి చైతన్యము అభివృద్ధి చెంది యుండ దన్నమాట. స్థూలంగా కొన్ని విషయములను తీసికొని పరిశీలించుదాము.

బిడ్డ, తన చుట్టునున్న పిన్న పెద్దలు ఎట్టి భాషను మాట్లాడేదరో అట్టి భాషనే నుపయోగించుట పరిపాటి. అనగా, పెద్దవారు కుటుంబ సంస్కృతి సభ్యత గలిగి మృదుత్వంతో చక్కని పదప్రయోగములు మాట్లాడినచో, అట్టి మాటలను అనుక్షణం ఆలకించునట్టి బిడ్డకు అట్టి సంస్కృతిగల భాషయే సహజ సిద్ధంగా అలవడుతుంది. అదేరీతిగ బిడ్డ జన్మించిన కుటుంబంలో ఇరుగు పొరుగున, సుశ్రావ్యంగా పాడగలవారి పాటలను తఱచుగా వినునట్టి అవకాశం గల బిడ్డలకు సుశ్రావ్యంగా పాడ గల శక్తి అలవడుతూ అతి అవలీలగా సంగీత కళ పట్టుపడుతుంది.

ఒక దృష్టాంతము :—మా ఇరుగింటి బాలుడికి రెండేళ్లు నిండినవి. వాని అమ్మమ్మ, అమ్మ, పని పాటలు చేస్తున్నా సరే అస్తమానం పాడేవారు. వాని అక్కయ్య ప్రతిదినము గాత్ర సంగీతం చెప్పుకొనేటప్పుడు బిడ్డ ఆలకించుతూ వుండేవాడు. పదిమాటలు కూడ స్పష్టంగ పలుకలేని ఈ రెండేళ్ల బిడ్డకు స, రి, గ, అను ఈ మూడు స్వరాక్షరములను మాత్రము, ప్రతి స్వరం యొక్క స్థాయిని బట్టి, అపస్వరమన్న మాటలేక పాడేవాడు. ఈ బిడ్డతో ఆడు

మనే పొరిగింటి అమ్మాయికి నాలుగేళ్లు. ఈ బాలునితో పాటు ఈ అమ్మాయి కూడ స, రి, గ, మ, అని పాడేది. కాని అపస్వరం పలికేది. వెంటనే ఆ కుఱ్ఱవాడు వాని ఆవే శంలో 'తప్పు' అని బిగ్గరగా కేక వేసేవాడు. వాని ముఖంలో ఆందోళన కనిపించేది. అంత పసిపాపకు అపస్వరము అని గ్రహించు శక్తి కలగటమే, గాక, అపస్వరమును ఎంత మాత్రం ఓర్చుకో లేక పొయ్యేవాడు. మరొక ఉదాహరణ.

మా బంధువులింటిలో 7 ఏళ్ల అమ్మాయి చక్కగ పాడేది. వీణవాయించటం నేర్చుకొంటూ వుండేది. ఆ అమ్మాయి బామ్మ, తల్లితండ్రులకు చక్కని సంగీత జ్ఞానముండేది. శైశవ దశనుండి కూడ ఆ అమ్మాయిని నిద్ర పుచ్చేటప్పుడు తల్లి, బామ్మ సుశ్రావ్యంగా జోలపాటపాడి నిద్ర పుచ్చే వారు. ఒక్కమాటలో—ఆ అమ్మాయి సంగీత సాహిత్యా లతో కూడిన వాతావరణంలో పెరిగిందన్నమాట. ఒకనాడు నేను వారింటి కెళ్లినపుడు ఆ అమ్మాయి వీణవాయించటం సాధకం చేస్తూవుంది. నేను వాళ్లమ్మతో మాట్లాడుతూ బిగ్గ రగానవ్వాను. నేను నవ్వినట్టే, ఆ అమ్మాయి వీణతో వాయిం చుతూనన్ను చూచింది. "ఏమిటమ్మా" నన్ను హేళన చేస్తున్నావు అని ఆశ్చర్యంతో అడిగాను. నేను పలికిన విధంగా, ప్రతి అక్షరము యొక్క స్థాయినందుకొని దానికను గుణం వీణలో వాయించింది. నా కమితానందము, ఆశ్చర్యము కలిగి ఏదో ఒక మరాఠిపాటను (వచ్చీరాక) పాడాను. వెంటనే ఆ అమ్మాయి తూ, చా తప్పకుండ వీణలో చక్కగ వాయించినది. అంత చిన్న వయస్సులో ఆ అమ్మాయికి స్వర జ్ఞానము, రాగ జ్ఞానము పట్టుపడుటకు కారణము ఇంటిలో వారందరికీ కొద్దోగొప్పో సంగీతజ్ఞాన ముండుటేగాక ప్రొద్దస్తమానం ఎవరో ఒకరు పాడుతూ వుండుటవల్ల ఆ అమ్మాయి శ్రవణేంద్రియమున కట్టి జ్ఞానము పట్టువడింది. అదేరీతిగ, వారందరూ మంచి సంస్కృతి గలిగిన వారగుటచేత చక్కని భాష మాట్లాడేవారు. ఆ అమ్మాయి కూడ ఆ మంచి మృదుత్వంలో చక్కని భాష మాట్లాడేది. (అతి బాల్యంలోనే) ఇట్టి సున్నితమైన శ్రవణేంద్రియ జ్ఞానము గలవారికి సంగీతమున కనువగు చెవి వున్నదన్నమాట. ఇట్టి సున్నితమైన శ్రవణేంద్రియము గలవారు అపస్వరము ఎన్నటికీ పాడరు; అపశ్రుతి, కఠోర శబ్దములు మోటు తనంగా మాట్లాడుటను ఓర్చుకోలేరు. ముఖ్యంగా అట్టి సందర్భాలలో ఈ అమ్మాయి అతి బాల్యంలో కూడ కేకలువేసి ఆందోళన కనపర్చేది. ముఖ్యంగా ఈ అమ్మాయి నా బంధు వర్గంలోని పిల్ల, కాబట్టి నేను వారింటికి తఱచుగా వెళ్లటం, కొన్ని సమయాల్లో దినముల పాటు వారింటివద్ద వుండటం తటస్థించేది. 10 నెలల శిశువుగా నున్న కాలంలో ఈ అమ్మాయిని నిద్ర పుచ్చుటకు ఉయ్యా లలో వేసి ఎవరు జోలపాటు పాడినా సరే! నిద్ర పోదు. కేకలు వేయటం, అటునిటు పొరలటం తప్ప నిద్ర పోదు. ఆ బిడ్డ పెత్తల్లి ఉయ్యాలనందు కొని జోలపాట పాడటానికి ప్రారంభించగానే బిడ్డ కిలకిల నవ్వుతూ ఆనందం వెలి బుచ్చేది; ఒక్క చరణం ముగిసే టప్పటికి చక్కగ నిద్ర పొయ్యేది. కారణమేమంటే, ఆ కుటుంబంలోని వారందరూ కూడ చక్కగా పాడ గలిగినప్పటికీ, పెత్తల్లి కంఠంలో, పాడే విధానంలో, అధిక మాధుర్యం, ఆప్యా యత గోచరించేది. కొన్ని నెలల బిడ్డ కట్టి ఆప్యాయత, ఆనందం కలగటం అనేది అత్యద్భుతం. ఇందుకు ముఖ్యంగా ఆ అమ్మాయి జన్మించిన కుటుంబ పరిసర పరిస్థితుల ప్రభా వమే కారణమని వేరుగ చెప్ప నవసరంలేదు కదా!

అదే విధంగా, సంగీతం, సాహిత్యాలు మున్నగు సంస్కృతి కొడంలేని పరిసరముల మధ్య పెరుగనట్టి బిడ్డల యొక్క జ్ఞానేంద్రియములు, ముఖ్యంగా శ్రవణేంద్రియము సున్నితంగా అభివృద్ధి చెందవు. సుస్వరము అపస్వరముల మధ్య నున్న భేదమెంత మాత్రం కనుగొనజాలరు. ఎట్టి అప శ్రుతిలో ఎవరు పాడినా సరే, ఈ బిడ్డలు ఎట్టి ఆందోళననూ కనబఱచరు. చిన్నప్పటి నుండియే సంగీతము నకనువగు శ్రవణేం ద్రియ జ్ఞాన మభివృద్ధి చెందని బిడ్డలు పెరిగి పెద్ద వారయి నపుడు ఎంత ప్రయాసపడి సంగీత కళనభ్యసించి నప్పటికీ, ఎప్పుడో ఒకప్పుడు వారి కంఠంలో అపస్వరము బయలు దేరకమానదు. శ్రుతిమేళనం కాక పోవటాన్ని కూడ వెంటనే గ్రహించుకోలేరు. ఇట్టి ఉదాహరణము లెన్నియో ఉన్నాయి. ఇదేరీతిగ, కొందరిండ్లలో మోటుతనంగా,

(తరువాయి 40వ పేజీలో)

# స్త్రీ స్వాతంత్ర్యము—సోషలిజము

* శ్రీమతి వి. ఎస్. ఆర్. నాయకమ్మ *

స్త్రీ స్వాతంత్ర్యము సోషలిజం ద్వారానే సాధించ గలుగుతాం. ఎందువల్లనంటే......సోషలిజం—జీవిత క్షేత్రంలో మాత్రమే సమానత్వాన్ని సాధించి వూరుకోదు. అంతటితో తన కర్తవ్యం ముగిసిందని ముడుచుకుని కూర్చోరు. ముఖ్యంగా ఆర్థిక క్షేత్రంలో స్వాతంత్ర్యాన్ని సాధించి తీరుతుంది. అది ప్రతిరోజూ సరిపడునంత సంపాదించుకోగలుగునట్లుగా, ప్రతి స్త్రీని తయారుచేస్తుంది. తగు సామర్థ్యాన్ని చేకూరుస్తుంది. పురుషునితో సరిసమాన స్థాయిలో సంచరించగల తాహతును ప్రసాదిస్తుంది. సోషలిజం యంత్రాల నుపయోగించేది లాభంకొరకేగాదు, మానవజీవితాని కుపయోగపడు వస్తువులు, తొందరగానూ—పుష్కలంగానూ—లభ్యం కాగలందులకు! సోషలిజమ్ క్రియాకలాపాలన్ని మానవ జీవితానికి అధిక సౌఖ్యానందాలు సమకూడే అవకాశాలు కలుగజేయగలందులకు! యీ విధంగా మిల్లుల్లోనూ, ఫ్యాక్టరీలలోనూ, ఆఫీసుల్లోనూ, సైన్యాల్లోనూ, అంతటాకూడా స్త్రీలకు నిర్నిరోధ ప్రవేశార్హత కలుగజేసే అవకాశ మిస్తున్నదంటే స్త్రీల శ్రమాఫలితాన్ని దోచుకుందామని మాత్రంగాదు. పురుషులను నిరుద్యోగుల గావిద్దామనిగాదు. స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛా, పూర్ణ వికాశమూకోరి మాత్రమే!

విశాల ప్రపంచాన్నొక్కపరిగాంచినయెడల—సోషలిజం ఆచరణలోగల దేశాల్లో ప్రత్యక్ష ప్రమాణంగా గాంచగలరు. అక్కడ స్త్రీలకు పురుషులతో సమానంగా వేతనాలు పొందే సావకాశం గలదు. యివీగాక స్త్రీలకు...ప్రసవించడానికొక నెలముందూ ప్రసవించిన పిమ్మటొక నెల తదుపరీ కూడా వేతనంపై సెలవు మంజూరు చేయబడుతోంది. అనారోగ్యంగా వున్నప్పుడూ, అసమర్థత్వంగా వున్నప్పుడూ కూడా అట్టివారి పోషణాభారం ప్రభుత్వమే వహిస్తోంది. యీ సౌకర్యాలు పెట్టుబడిదారీ ప్రభుత్వాల్లో లేకపోవడమేగాక—అట్టివారిని పనులనుండి వెంటనే తొలగించి వారి జీవిత నిర్వహణను నిలువునా కూల్చివేయును. పనిచేయజాలనివారి పోషణాభారాన్ని యేవిధంగా వహించడమా అన్న విషయాన్ని ఆలోచిస్తేనే పెట్టుబడిదారీ ప్రభుత్వాలు చేష్టలుడక్కి నిలువునా నీరైపోయి కూలబడిపోతాయా అన్నంతగా నాశ్చర్యోత్కంఠలో పడిపోతవి.

ఈ విధమైన ఆర్థిక స్వాతంత్ర్యము స్త్రీలకు లభించిన యెడల ప్రపంచములో సాంసారిక సౌఖ్యానందాలు సన్నగిల్లిపోతాయనీ—సతీపతుల మధ్యగల దాంపత్యధర్మాలు దాటిపోతాయనీ—పవిత్రమైన మాతాపిత సంతాన సంబంధాలు సడలిపోతాయనీ—స్త్రీ పురుష సంబంధమైన సదాచారాలు నశించిపోతాయనీ—మానవజీవితమే పశుజీవితంగా రూపొందగలదనీ అనేకులు భావిస్తారు.

కాని, యీ విషయాలన్నీకూడా—స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించినట్టీ—స్త్రీ వ్యక్తిత్వాన్ని అవహేళన చేయునట్టీ—అలసభావం జూపునట్టీ—స్త్రీని యజ్ఞపశువును జూచినట్లు జూచుటే కర్తవ్యమనుకొనునట్టీ—సదాచారాల్లో లీనమైయున్న అత్యాచారాలు యెరుగుండికూడా గ్రుడ్డిగా అనుకరింపమనువారు పలికే పలుకులు మాత్రమే! అట్టివారి వేదవాక్యాలు మాత్రమే! సోషలిస్టులు మాత్రము "మానవ జీవితము—పశుజీవితము" అను శబ్దాలకు భయపడునట్టి వారుకారు. అదీగాక పశుజీవితం పెట్టుబడిదారీ ప్రభుత్వంలో ఒకవంతువుంటే, అందులో సహస్రాంశమైనా సోషలిస్టు ప్రభుత్వంలో వుండదన్న విషయంకూడా వారికి గ్రాహ్యమే. ధనబలంతో యీ విశాల ప్రపంచములో నేడెందరి స్త్రీల మానధనాన్ని హరించుటలేదు? ధర్మపన్నాలు వల్లించే దొంగ వేదాంతుల మఠాలు—శ్రీరంగనీతులు జెప్పు సదాచార సంపన్నులనబడే దొంగ మోసగాండ్రగు సాహుకారుల ప్రాసాదాలు—ముఖ్యంగా యీ పశుకృత్యాల కాలవాలముగావా? ధర్మాధర్మం నీతి న్యాయం—అని కబుర్లూ, వుపన్యాసాలూ, దంచేవారంతా అతి నికృష్టకృత్యాలతో కుల్లుతూ—సంఘానికి కూడా,

# స్త్రీ స్వాతంత్ర్యము సోషలిజము

కుట్ల కంపుతో అసర్థకాన్ని చేకూర్చేవారే నన్న విషయం మాత్రం మరువరాదు. అయినప్పటికీ వారలా ధర్మపన్నాలు చెపుతున్నారంటే సిగ్గు భిడియాలు విడిచారన్నమాట. మానాభిమానాలు మటుమాయమైన వన్నమాట. వారి యీ దుర్నీతి పథమున పయనించు ప్రజలు స్వార్థానికై తమను తాము విక్రయించుకున్నారన్నమాట. స్త్రీ పురుషులేగాక ప్రపంచ మానవులంతాకూడా ఒకరినొకరు దగామోసం మొదలగు అన్యాయాలు, ప్రతిజ్ఞాభంగాలు చేసుకోకూడదని సోషలిష్టులు కోరుతుంటారు. వారి పరిపాలనలో అలా జరుగనివ్వరు. జరుగవు. కాని, ఒక పక్షాన్ని అసమర్థత్వంగా తయారు జేసియో—ధనకాంత. చూపియో—సంఘ భయము కలుగజేసియో—ప్రేమను స్థాపించజాలమని కూడా సోషలిష్టులకు తెలియును. వాస్తవిక ప్రేమకు స్థానం సోషలిజంలోనే వుంది. అచ్చట ప్రలోభాలకూ, బలాత్కారాలకూ తావులేదు. నిజమైన స్త్రీ స్వాతంత్ర్యము సోషలిజంలోనే సిద్ధిస్తుంది. గాన సోదరీ లోకాన్నంతటిని ప్రగతి పథమున పురోగమించవలసిందిగా ప్రార్థిస్తున్నాను—సెలవు.



(38వ పేజీ తరువాయి)

బిగ్గరగా, కఠినంగా మాట్లాడటము, బిడ్డలను లాలించునపుడు ప్రియ వాక్యములను కొంటూ, తిట్టుమాటల నుపయోగించటం, మోటుగా పరిహాసం చేయటం, బిడ్డల యెదుట సేవకులను అతి నీచంగా మాటలాడటం, దుర్భాష లాడటం మున్నగునవి జరగటం కలదు. బిడ్డలకు కూడ అట్టి అసభ్యత గల భావయే పట్టు పడుటగాక సున్నితమైన శ్రవణేంద్రియ జ్ఞానము అభివృద్ధి చెందదు. అంత మాత్రమేగాదు, ఏ జ్ఞానేంద్రియము కూడ సున్నితంగా అభివృద్ధి చెందటాని కవకాశ ముండదు. ఇట్టి వారి పలుకులో, ప్రవర్తనలో, కాఠిన్యం క్రౌర్యం మున్నగునవి కూడ వ్యక్తమవుతాయి. ఒక్క మాటలో, ప్రశాంతం ప్రేమలు, సంస్కృతిగల పరిసర పరిస్థితుల మధ్య పెరుగు నట్టివారి హృదయం మార్దవం వహించుతుంది. మాటలలో, చేతలలో కరుణ, మృదుత్వము, నాణ్యము సభ్యత ప్రదర్శన మవుతాయి. అవిద్య అజ్ఞానం మోటుతనం గల పరిసరముల మధ్య పెరుగు బిడ్డల యొక్క హృదయం, కాఠిన్యం వహించి వారి మాటలలో, నడవడికలో, మోటుతనం, కాఠిన్యం, క్రౌర్యం, అసభ్యత మున్నగునవి వ్యక్త మవుతూంటాయి. పరిసర పరిస్థితుల కంతటి ప్రభావమున్న దన్నమాట.

ఇంక పరిశుభ్రత, గృహాలంకారము, వస్తువులను వాటి వాటి స్థానే అమర్చటం (ఒక క్రమము ననుసరించి), మున్నగు విషయంలో అధిక ధనమును వ్యయపరచ నవసరము లేదు. అవసరమైనవి విజ్ఞాన విచక్షణాలు అను విషయాన్ని విస్మరించరాదు. పరిసరములు పరిజ్ఞాన బోధకములుగా నుండా లన్న విషయాన్ని మరొకచోట విపులీ కరించుతాను. వీలున్నంతవరకు బిడ్డ చుట్టునున్న వస్తువులు, ఆటసామానులు మున్నగునవి విద్యా బోధకములుగా నుండునట్టు ప్రయత్నించుట అత్యవసరము.

మన మిప్పుడు ముఖ్యంగా గ్రహించవలసిన విషయమేమంటే, బిడ్డలు శైశవావస్థనుండియే మన మాటలు, పాటలు, ప్రవర్తన, చుట్టునున్న పరిసర పదార్థములు మున్నగు వాటిని అవ్యక్త చైతన్యంతో ఆలకిస్తారు, పరికించుతారు, క్రమేణ అను కరించుతారు, తుదకు వాటిని అలవరుచుకొంటారు. కాబట్టియే ముఖ్యంగా తల్లి, తండ్రి, తరువాత బంధువర్గము, బిడ్డ యొక్క శ్రేయోభివృద్ధి కోరడం, అతి జాగరూకతతో విజ్ఞాన విచక్షణలతో మెలగాలి అన్నమాట.

(సశేషము)



కథానిక

# దేవాలయము

మూలం: ప్రేమచంద్

అనువాదం: కీ. శే. చింతగుంట హనుమంతరావు

[సుఖద మాదిగ మనిషి, అనాథ, కడుపేద, ఇరువురు బిడ్డలు మృత్యువాత బడ్డారు—ఇంకా సంవత్సరము నిండకమునుపే మూడవబిడ్డ హఠాత్తుగా జబ్బు పడ్డాడు—దేవాలయమునకు వెళ్లి, దేవుని పాదాలపై బడి, పుత్రభిక్ష వేడుకుందామనే తీవ్రమైన ఆశ ఆమెకు జనిస్తుంది—కాని పూజారి ఆమెను దేవాలయమునకు రానివ్వడు—తాను అస్పృశ్య అని పలువురు పలు మాటలాడుతారు. ఎవరూ లేని సమయంలో దేవాలయాన్ని ఎట్లాగైనా ప్రవేశించి, దేవుని పూజించాలని వేచి యుంటుంది—ఇక చదవండి.]

హారతి స్తోత్రము ముగిసిన తర్వాత భక్తులు చాలసేపటి వరకు శ్రీమద్భాగవత పఠన సాగిస్తూన్నారు. అక్కడ పూజారి కుంపటి వెలిగించి వంట సిద్ధం చేసుకోసాగాడు. కుంపటి ఎదుట కూచుని ఊదుతూ వున్నాడు. మధ్యమధ్యలో పురాణానికి వ్యాఖ్యానాలు ఇస్తూన్నాడు. రాత్రి పదిగంటల వరకు కబుర్లతోను, పురాణ పఠనతోను జరిగి పోయింది. సుఖద చెట్టుక్రింద ధ్యానావస్థలో నించుని వుంది. ఒక్కొక్కరుగా భక్తులందరు ఇంటి ముఖం పట్టారు. పూజారి ఒంటరిగా మిగిలి పోయాడు. ఇపుడు సుఖద వచ్చి దేవాలయం వసారా ఎదుట నిలచున్నది. అక్కడే పూజారి ఆసనాలం కృతుడై అన్నం వుడుకుతూన్న పాత్రనుండి వెల్వడుతున్న మధుర సంగీతాన్ని ఆలకించడంలో మగ్నుడై వున్నాడు. పూజారి, కాళ్లఅలికిడి విని, మెడపైకెత్తి సుఖద నించుని వుంటం చూచాడు. కోపగించుకుంటూ అన్నాడు, "నువ్వింకా ఇక్కడే వున్నావా?"

సుఖద పళ్లాన్ని నేలమీద వుంచి, ఒక చెయ్యి జాపి, ప్రార్థిస్తూ అన్నది, "స్వామీ, నేను చాలా దౌర్భాగ్యురాల్ని. నా జీవిత ఆధారం ఈ పిల్లవాడే. నన్ను దయ చూడండి. మీకు చాలా కీర్తి కల్గుతుంది." ఇలాఅంటూ సుఖద ఏడ్వ సాగింది. పూజారేమో దయకలవాడే. కాని ఇంతకు ముందెపుడు కనీ వినీ ఎరుగని, మాదిగదాన్ని దేవుని సమీపానికి పోనివ్వడం అనే మహాపాతకాన్ని అతడేలా చేయగలడు? దేవుడిలాచేస్తే తనకేశిక్ష విధిస్తాడో? ఇంతకు తనకు పిల్లలంటూ వున్నారు. ఒకవేళ భగవంతుడు క్రుద్ధుడై గ్రామాన్నంతా నాశనం చేస్తే?

పూజారి సుఖదతో అన్నాడు' "ఇంటికి వెళ్లి దేవుణ్ణి ప్రార్థించు. నీపిల్లవాడు బాగైపోతాడు. నేనిచ్చే తులసీదళాన్ని నీపిల్లవాని చేత తినిపించు, ఈ తీర్థాన్ని త్రాగించు. ఈశ్వరానుగ్రహం వుంటే అంతా సరిపడుతుంది."

సుఖద, "ఇంతకు దేవుని పాదాలమీద వ్రాలనివ్వరా? చాలా దీనురాలిని. అష్టకష్టాలు పడి పూజాద్రవ్యాన్ని ప్రోగు చేశాను. దేవుని పూజిస్తే నా పిల్లవానికి ఆరోగ్యం కల్గుతుందని నిన్న నేను కలగన్నాను. అందుకే ఇక్కడికి పరిగెత్తుకు వచ్చాను, నాదగ్గర ఒక రూపాయివుంది. దాన్ని నాదగ్గరనుండి పుచ్చుకోండి. కాని నన్ను క్షణమాత్రం భగవంతుని చరణాలమీద వ్రాల నివ్వండి."

ఈ ప్రలోభనం శాస్త్రిలవారిని ఒక క్షణం విచలితుణ్ణి చేసింది. కానిమార్క్సభ్రీ కారణంగా దైవభీతి అతని మనసులో కొంత శేషం వున్నది. పూజారి తనను తన వశంలో వుంచుకొని అన్నాడు, "ఓసి పిచ్చిదానా, దేవుడు భక్తులమనోభిప్రాయాన్ని గుర్తిస్తాడుకాని, తన పాదాలమీద వ్రాలడం

చూడను కదా? మనసులో భక్తంటూ వుండాలి. అది లేక పోతే భగవంతుని పాదాలమీద వ్రాలడం లాంటి అత్క కార్యాలు చేసినా ఏమీ లాభం వుండదు. నాదగ్గర ఒక యంత్రం వుంది. దీని వెల చాలా ఎక్కువ; కాని నీకు ఒక రూపాయికే ఇస్తాను. దాన్ని పిల్లవాడి మెడలో కట్టాలి. ఇంకేముంది? రేపటికల్లా పిల్లవాడు ఆడుకో మొదలెడతాడు."

సుఖద, 'అయితే దేవుణ్ణి సేవించ నియ్యరన్నమాట?"

"నీవు, నేను చెప్పినట్లు చేయడమే దేవుని సేవించడం. నువ్వుకూడా కాస్త ఆలోచించు. ఇంతకు ముందెప్పుడూ ఎవ్వరు చేయని పని ఈరోజు నేనుచేస్తే, గ్రామం మీద ఏదైనా ఆపద వచ్చిపడితే ఏంకావాలి? నువ్వీయంత్రం తీసుకెళ్లు. దేవుడు కోరేటట్లయితే ఈ రాత్రితోనే పిల్ల వాడి కష్టమంతా తొలగి పోతుంది. ఎవరిదో దిష్టి తగిలి నట్లుంది."

"వీడికి జ్వరం వచ్చి నప్పటినుండి నా ప్రాణాలు ప్రాణాల్లో లేవు"

"వీడికి మంచి భవిష్యత్తు వుంది. దేవుడు రక్షిస్తే నీకష్టాలన్నీ గట్టెక్కుతాయి. ఇక్కడ కెప్పుడు ఆడుకుందుకు వచ్చేవాడు. రెండు మూడు రోజులబట్టి ఇక్కడ నాకు అవు పించకపోతేను, ఏమయ్యాడా అనుకున్నాను."

సుఖద, "అయితే యంత్రాన్ని ఎలా కట్టడం స్వామి?"

పూజారి, "గుడ్డలో కట్టిస్తాను. అంతే, మెడలో కట్టేసేయి."

సుఖద దగ్గర రెండు రూపాయలుండినయి. ఒక రూపాయి ఖర్చయి పోయింది. రెండవ రూపాయి పూజారి కిచ్చింది. యంత్రం పుచ్చుకొని, మనసును సమాధానపరచు కుంటూ ఇంటికి తిరిగి వచ్చింది.

* * *

సుఖద ఇల్లు చేరుకుంది. పిల్లవాని కంఠంలో తాయత్తు కట్టింది. కాని రాత్రి జరిగేకొద్దీ ప్రకాశం జ్వరంకూడా వృద్ధి చెందుతూ వచ్చింది. మూడు గంటలు కొట్టేటప్పటికి అతని కాళ్లు చేతులు చల్లబడసాగాయి. అప్పుడు సుఖద భయపడి పోయి ఆలోచించసాగింది, "అయ్యో! నేన నవసరంగా సంకోచంలో పడి దేవుని దర్శనం చేయకుండానే తిరిగి వచ్చాను. నేను లోపలికివెళ్లి భగవంతుడి పాదాలమీద వ్రాలినప్పటికి నన్నెవరేమిచేసి ఉండేవారు? ఒక వేళ జనులు నన్నుకొట్టి తరిమి వేసేవారేనేమో? అయినా నా మనోరథం నెరవేరేది. నేను దేవుడి పాదాలను కన్నీళ్లతో తడిపివేసి, పిల్లవాడిని ఆయన చరణాల మీద నిద్రపుచ్చి ఉంటే ఆయనకు నామీద దయరాక పోయేనా? దేవుడు దయామయుడు. దీనులను రక్షిస్తాడు. నన్ను కరుణించే వాడు కాదా?"

ఇలా ఆలోచించి సుఖద చిత్తంలో అధైర్యపడ్డది. ఇపుడు ఆలస్యం చేయడానికి వ్యవధిలేదు. ఆ స్త్రీయొక్క ఆశంకిత హృదయానికిపుడు దేవుని పాదాల మీద వ్రాలి ఏడ్వడం కన్నా వేరే ఆధారము, ఆశ్రయము లేదు. దేవాలయ ద్వారాలు మూసి వేయబడి ఉంటే తాళం విరగకొట్ట నిశ్చయించింది. ఒకరు దేవుని గుడిలో ఉంచి తాళం వేయడానికి అతడు వారికేమైనా అమ్ముడు పోయాడా?

రాత్రి మూడు గంటలయింది. సుఖద ప్రకాశాన్ని కంబళితోకప్పి, చంకలోకి తీసుకొని, ఇంకొక చేతితో పళ్లాన్ని పుచ్చుకొని గుడివైపుకు నడిచింది. ఇంటినుండి బయటికి వెళ్లడంతోనే చల్లనిగాలి తాకుళ్లవల్ల ఆమె హృదయం చలించసాగింది. చలివల్ల కాళ్లు తడబడుతున్నాయి. నాల్గు వైపులా అంధకారం వ్యాపించి ఉంది. ఆలయానికి దూరం రెండు ఫర్లాంగులకు తక్కువ ఉండదు. ప్రకృతి చాలా భయంకరంగా ఉంది. హఠాత్తుగా గుడ్లగూబలు కర్కశ కంఠంతో అరవసాగాయి. లక్ష రూపాయ లిస్తామన్నా, ఈ సమయంలో ఎవరు ఇక్కడికి రావడానికి సాహసించరు; కాని పిల్లవాని మీది మమకారం అన్ని సందేహాలను అణచివేసింది. "దేవుడా! నువ్వే ఇపుడు నాకుదిక్కు" అని జపిస్తూ సుఖద ఆలయం వైపుకు నడచి పోతూంది.

గుడివాకిలి చేరుకుని సుఖద గొలుసులను ఆడించి చూసింది. తాళం వేయబడి ఉంది. వసారా నానుకుని ఉన్నగదిలో పూజారి తలుపు బిగించుకుని నిద్రిస్తూన్నాడు.

నలుదిక్కులా చీకటి వ్యాప్తమై ఉన్నది. సుఖద అరుగు క్రిందినుండి ఒక ఇటిక తీసుకొని వచ్చి బలంగా తాళాన్ని పగలగొట్ట సాగింది. ఆమె చేతుల్లో కొట్టడానికి వచ్చిన బలం ఎక్కడనుండి వచ్చిందో? రెండు మూడు దెబ్బల తోనే బీగము, ఇటుక రెండు విరిగి గడప మీద పడి పోయాయి. సుఖద ద్వారం తెరచుకొని లోనికి వెళ్లగోరు తుండగా పూజారి తలుపు తెరచుకొని, శబ్దం చేసుకుంటూ బయటకు వచ్చి "దొంగ, దొంగ" అని అరచుకుంటూ గ్రామం లోకి పరిగెత్తాడు. శీతాకాలంలో సాధారణంగా జాము రాత్రి ఉందనంగానే అందరికి నిద్ర మెళకువ వస్తుంది. పూజారి అరుపు విని చాలామంది చుట్టు పట్లనుండి లాంతర్లు పట్టుకొని బైటికివచ్చి ప్రశ్నించసాగారు.

"ఎక్కడ, ఎక్కడ, ఎటు పరిగెత్తాడు?"

పూజారి, "దేవాలయం వాకిలి తెరచి ఉంది. తాళం పగలకొట్టినట్లు శబ్దం వినిపించింది"

ఉన్నట్లుండి సుఖద వసారాలో నుండి వెలుపలికివచ్చి అరుగు మీది నుండి అన్నది, "దొంగను కాదు, నేనే. దేవుని పూజించడానికి వచ్చాను. ఇపుడే లోపలికి వెళ్లానోలేదో, ఈ అరుపులు ఆరంభమయాయి."

"ఇంకేం, సర్వ నాశనము అయింది. దేవాలయం అపవిత్రమైంది" అన్నాడు పూజారి బిగ్గరగా.

"దొంగతనంగా తాళం బద్దలుకొట్టి లోపలికి వెళ్లిన నువ్వుదొంగవు కాక దొరవులే?" అంటూ చాలామంది మండిపడి సుఖదను చావమోదారు. ఆమె ఒక చేతితో పిల్లవానిని పట్టుకొని, రెండవ చేతితో అతనిని రక్షించుకుం టూన్నది. హఠాత్తుగా ఒక బలిష్ఠమైనవ్యక్తి బలంగా ఆమెను తోసాడు. పిల్లవాడామెహస్తంలో నుండి విడివడి నేలమీద పడిపోయాడు; కాని అతడు ఏడ్వలేదు, శ్వాస విడువలేదు. సుఖద కూడా క్రింద పడి పోయింది. లేచి పిల్లవాడ్ని తీయగా అతడి ముఖం మీద ఆమె దృష్టిపడ్డది. ఆమె నోట్లోనుండి ఒక అరుపు వెల్వడ్డది. ప్రకాశం నొసట చేతితో స్పృశించి చూచింది. దేహమంతా చల్లబడి ఉంది. ఒక దీర్ఘ నిశ్వాసంవదిలి ఆమెలేచి నించున్నది. ఆమె కన్ను ల్లోనుండి అశ్రువులు రాలాయి. ఆమె ముఖం క్రోధజ్వాలతో ప్రజ్వలించింది. నయనాల్లో అగ్నివర్షం కురువసాగింది. రెండు పిడికిళ్లు బిగుసుకు పోయాయి. పండ్లు పటపటకొరు కుతూ అన్నది, "పాపాత్ములారా, నా పిల్లవాడి ప్రాణాలు తీసి తొలగించుచున్నారేం.? నన్నుకూడా వాడితో చంపే యండి. నేను దేవుణ్ణి తాకుతే ఆయన అపవిత్రుడయాడు. నన్ను కొడితే మటుకు మీ కెలాటి అపవిత్రత కల్గదు కాబోలు! ఇంకెప్పుడు దేవుణ్ణి తాకడానికిరాను. ఆయన గదికి తాళంవేసి ఆయనను జాగ్రత్త పరచుకొండి; పహారా ఉంచుకోండి. అయ్యో! మీకు దయంటూ ఉందా? ఎలాటి కఠినులు! పిల్లలనుకలిగి ఉండి, ఒక దురదృష్టవంతు రాలైన తల్లిమీద దయ కనపరచలేక పోయారు. అంతా ధర్మోద్ధారకులై కూచుంటారు. మీరందరు హంతకులు, వట్టి హంతకులు. నేను పోలీస్ స్టేషన్‌కి వెళ్లు తానేమోనని మీరు భయపడకండి. నాకు దేవుడే న్యాయమిప్పిస్తాడు. ఇపుడాయన న్యాయాలయానికే విన్న వించుకోడానికి వెళ్లుతున్నాను.

ఎవ్వరు నోరెత్త లేక పోయారు. శిలా విగ్రహాలలా అందరు శిరాలు వంచుకుని నిలబడి ఉన్నారు. ఇంతలోకే గ్రామ మంతా అక్కడ ప్రోగయింది. సుఖద మళ్లీ కుమా రుని ముఖం వైపు చూచింది. కంఠంనుండి వెల్వడ్డవి మాటలు, "నా చిట్టి తండ్రీ!" తరువాత ఆమె మూర్ఛి తురాలయింది. ప్రాణాలు లేచి పోయాయి. పిల్లవాడి కోసం తన ప్రాణాలను బలిచ్చింది.

తల్లీ! నీ జీవితం ధన్యమైనది. దేవతలలో కూడా నీలా నిష్ఠ, భక్తి, విశ్వాసం కలిగినవారు దుర్లభమనడంలో అతిశ యోక్తి లేదు.



# ఆదర్శ దంపతులు

* చల్లా సత్యేంద్ర శంకర్ *

"సరళా! సుందరరూపివైన, సరళాత్మురాలవైన నీకు యీ జీవితము విధి లిఖితమేనా? దరిద్రం నీబోటి అందాలమూర్తికి మోజుగా? అందం భగవంతుని సృష్టిలో ప్రథమ స్థానాన్నలంకరించుతుంది. ఆ ఉన్నతి దారిద్ర్యాని కంకిత మగుటాశ్చర్యముగాదా?"

"కాదు! సతీష్! కాదు! దరిద్రం జీవితాన్ని కించపరుస్తుంది. కాని ఆత్మ తన సుస్వరూపాన్ని అందులోనే తిలకించుతుంది. దరిద్రంలోనే ఆత్మ వికసిస్తుంది. పుష్పము నెంత అందమైన గ్లాసులో నుంచిననూ తన కొమ్మనున్నప్పటి సౌందర్యాన్ని పొందలేదు. పక్షి బంగారు పంజరములో స్వేచ్ఛ కనలేదు."

"అనంతమైన భాగ్యాల్లో, భౌతిక సుఖాల్లో ఆత్మ మరచిపోబడుతుంది. ఆత్మ వికాశంలేని భాగ్యాలు దరిద్రంకన్న అసహ్యాం, అన్నా!"

"చెల్లీ! నీ వనుభవించుటయేగాక దారిద్ర్యాన్ని ఆదర్శప్రాయమైనదిగా, ఆధ్యాత్మిక పరిజ్ఞానానికి అనుకూలమైనదిగా ఆదేశించుట ఆశ్చర్యజనకంగదూ!

"అవును! నీవేంచేస్తావు మూగగా అనుభవిస్తావు. అజ్ఞానంతో ఆనందించెదవు. అంతియే కాని దాని నిర్మూలనానికి నీవుగాని నీ పతిగాని పూనుకొనరుకదా! తండ్రి తన బుద్ధి మాంద్య స్థితిలో నిన్నర్పించాడు ఒక చేతకాని వాజమ్మకు. అతనేదో ఆనంద ప్రాప్తికి దీవిగా నెంచి నీవేమో ఆనందించుతూ వచ్చావు. అంతేగా నీవుచేసినది. జోగి జోగి రాసుకొంటే బూడి రాలిందనే మోట సామ్యంలాగుంది మీ యిరువురి జీవన యాత్ర.

"ఎంత వైభవంలోంచి ఎంత నీచంలోకి, ఎన్ని సౌఖ్యాల్లోంచి ఎన్ని కష్టాల్లోకి కూలబడ్డావు! నీకేమీ విచారంలేదు. కాని, సరళా! నాకు ఎంత చిన్నతనంగా వున్నదో నీకేం తెలియదు. ఎవరితో మాటాడినా ఎవరితో తిరుగుచున్నా, 'అదేమిటోయ్ నీబావ అలా పేదరికంలో బికారిలా తిరుగుతూవుంటే వూరుకొన్నావు.' అంటున్నారు.

"ఎంతసిగ్గు! తండ్రిచేసిన అపచారానికి నీవు బలి అగుటయేగాక నాకెందుకీ యపకీర్తి? చెల్లీ! ఇప్పటికైనా నీవు తెలివితెచ్చుకో. అతని పిచ్చి ఆదేశాలకు అదుపుపెట్టి, ఆ వెఱ్ఱి మొఱ్ఱి తిరుగుళ్లకి స్వస్తిచెప్పి తను యిదివరలో వదిలిపెట్టిన వుద్యోగాన్ని తిరిగి చేస్తూ సుఖాన్నుండమను.

"ఎన్నో సుఖాలు! ఎన్నో గౌరవాలు! జీవితాన్నలా జీవించుటకేగాని ఇలా దీనంగా వెళ్లబుచ్చుటకు గాదు. అతనికా చదువుంది. విజ్ఞానవంతుడు. అతనికేం లోటు? నాదా అఖండైశ్వర్యం. అచ్చటకొచ్చి వుండండి. మీకెట్టిలోటు లేకుండా చూచే పూచీనాది."

"సతీష్! నీవు చెప్పెడి దబద్ధంకాదు. అగౌరవమయినదిగాదు. కాని, అన్నా! ఒకరిపై

సాధారపడిన బ్రతుకుకన్న అనంత దరిద్రంలో పస్తు పడుకొను టుచితము. ఇంతమాత్ర మెరుగమా మేము ? అన్నీ ఎరుగుదుము. కాని నీ వనుకొనెడి జీవితాన్ని, మేమాశించే జీవితానికి మధ్య అఖాతాలున్నాయి అడ్డం. ఐశ్వర్యంలోనే లేదు గౌరవం. తనకున్నదానితో తృప్తిపొంది సుఖించి యితరుల మేలుకై పాటుపడుటకన్న ఉచితమయినది, గౌరవనీయమైనది, మానుష మయినది, పూజ్యమయినది, దైవికమయినది వేరొకటి లేదు."

"సరళా ! నీవాశించెడిది ఎండమావు మాత్రమే. నీవున్నది త్రిశంకస్వర్గమే. నీ వనుభవించేది తుచ్ఛ దారిద్ర్యమే. నీవు బ్రతికినదానికి, బ్రదుకుతున్నదానికి, బ్రదుకపోయెడిదానికి వ్యత్యాస మెరుగని అజ్ఞానివని, అమాయికవని నేతలవ లేదు.

"నీ అందానికి, నీ సౌకుమార్యానికి, నీ విద్యాసాంస్కృతికి నీవొకవున్నత కుటుంబానికి గృహలక్ష్మివయ్యెదవనుకొంటిని గాని యిలా దుర్భర దారిద్ర్యానికి ఆహుతయి యిందులోనే సుఖముందనే మూర్ఖమహిళవనుకొనలేదు. ఇదుగో ! ఆఖరుసారిగా చెప్తున్నా విను. నీకింత వరకు చెప్పిన సంగతుల నీ భర్తతో ఆలోచించి ఒక నిశ్చయానికొచ్చి వుండకపోతే యిదే నా తుదిరాక."

అని సతీష్ తన చెల్లి యింటినుంచి తన యింటికి విసురుగా వెళ్లుతున్నతరి తన బావగారైన రమేష్ త్రోవలో ఎదురుపడ్డా చూచ్చి చూడనట్లుగా వెళ్ళిపోయాడు. రమేష్ కూడ ముభావంగానే యింటికి తిరిగివచ్చాడు. ఇంటికి వచ్చీ రావటంతోనే సరళ గదిలోకి వెళ్లాడు. సరళను చూచీ చూడటంతోనే ఆమె ప్రశాంత వదనం ముకుళించుకొని హృదయం కంపించుచున్నట్లు తెలుసుకొని, దీనికి సతీషే కారణమయి వుండాలని అనుకొన్నాడు రమేష్. సరళను జేరి ఆపె తల నిమురుచు గంభీరముగా, 'సరళా ! నీ మందస్మిత ముఖాకాశమును కాళమేఘాలు మరుగుపరుస్తున్నట్లు, నీ నిర్మల హృత్సరస్సులో విషబిందువులు కలపబడినట్లు నీవు కంపిత మనస్కవైయుండ గతుబేమి ?' అని ప్రశ్నించెను. అంత సరళ తనకు తన అన్నకు జరిగిన సంభాషణంతయు తన ఆదర్శజీవికి విన్నవించుకొంది.

రమేష్ నిశ్చల గంభీర హృదయానికి దొకగడ్డు సమస్యగాదు. పరీక్ష ఎంత మాత్రమూ గాదు. అతని గత జీవిత పురాణంలో యిల్లాంటివెన్నో పుటలు వ్రాయబడ్డాయి. ఇంతకన్న మిక్కుటమైన సమస్యలు పరిష్కరింపబడ్డాయి. అతని జీవితయానం నే గమ్యస్థానం వద్ద ఆపబడాలో అతనెరుగు.

జీవితాన్ని రమేష్ రెండుగా విభజించాడు. జ్ఞానం, అజ్ఞానం. ఈ రెంటినీ మానవుడు తీవ్రంగా తీసుకొనవలసిన ముఖ్య విషయాలు. మానవుడు ఎల్లప్పుడూ పూర్ణజ్ఞాని అనిగాని, పూర్తి అజ్ఞాని అనిగాని అతను నమ్మడు. ఈ రెంటిలో ఏ ఒకటైన తన పూర్ణత్వాన్ని పొందినట్లైన మానవ జాత్యభ్యుదయ మేనాడో అరికట్టబడి వుండేది. మానవుడు తన జీవితాన్ని అజ్ఞానంలోంచి జ్ఞానంలోకి, చీకటినుంచి వెలుతురులోకి, అనిత్యం

లోంచి నిత్యంలోకి, మృత్యువునుంచి జీవితం లోకి యానించుటే ఒక మహోన్నత గాధ. ఈ సాధనం ఫలించిన మానవుడు తన జీవిత పంథాను జ్యోతిర్మయం చేయగలడు. ఈ వేదాంతాకారమే రమేష్.

సరళ చెప్పిన విషయాల్ని సావధానచిత్తుడై రమేష్ ఆలోచించెను. ఆ ఆలోచనా ఫలితం అది వట్టి బుద్బుదప్రాయమని తేల్చుకోవడం. ఆ విషయం సరళతో మొదట్లోనే చెప్పడం రమేష్ కిష్టమువలేదు. కారణం సరళ స్త్రీ. స్త్రీ సామాన్యంగా చంచల అని మనపూర్వులు నుడివారు. అయినా సరళ విషయంలో ఇది అసంబద్ధమని రమేష్ ఎరుగు. కాని ఆమె మనస్సు ఏస్థితిలోనున్నదో,—అనుకూలమో, ప్రతికూలమో—తెలుసుకొనకుండ తన నిశ్చయాన్ని తెలిపి ఆమెను కలవరపెట్ట తలవలేదు.

సరళ యీలోగా సంగతులను సంగ్రహంగా సింహావలోకనం చేస్తూంది. ఆమెలో కలతపోయి కమనీయత చంచలతపోయి, అచంచలత తమ తమ స్థానాలను తిరిగి చేరుకోవటం ఆమె ముఖంలో గమనింపబడ్డది. సరళ చంచల స్వభావి ఎప్పుడూ కాదు ఆమెకు తననిశ్చయం, తన గమ్యస్థానం కరతలామలకం. పూర్తిగా తన భర్తే దైవమని అతడేది చెప్పిన అయ్యది వేదవాక్కని మూఢంగా తలనూపే ఛాందస 'పతివ్రత'గాదు. ఆమె యెఱుగు—తను ఒక 'వ్యక్తి' నని, వ్యక్తిగతంగా సంఘంలో తనకుకూడ పాత్రానిర్వహణ వున్నదని, తన హక్కుల తానెరుగు. పాత్రాపాత్ర, ఉచితానుచిత విమర్శనా దృష్టి ఆమెలో వుంది. కాన సరళ అజ్ఞాని గాదు.

సంఘ బాధ్యతల నెరుగు. భర్త మాట యందు భక్తిగలది. (ఇది అమిత మార్గంలో లేనంతకాలం తన, తన భర్తలయొక్క జీవితాలు ఆదర్శములే! ఒకసారి యీ 'భక్తి' అనే రెండు అక్షరముల పవిత్ర కూర్పుగట్టుతెగి మూఢంగా వుపయోగింపబడ్డ అది అజ్ఞానానికెంతో దూరాన వుండదు.) ఈ సహజ పరిజ్ఞానం సరళ ప్రతి నాళంలోను జీర్ణించియుండుటచే ఆమె తన 'పతి భక్తి' అనే మాటకు దైవత్వాన్నొసగెను.

విద్యా సంస్కృతి సరళను సాంఘికంగా ఎంత ఉన్నత సోపానంపైనుంచినను మానసికంగా 'భారతనారి' మాత్రమే. ప్రతి పని, అందులోనూ భవితవ్యానికి సంబంధించిన ఏ పనిని తాను సాహసంతో తానై నిర్ణయించలేదు. కారణం ఆమె ఒక పురుషుని యిల్లాలు. తరతరాలుగా వచ్చే సాంప్రదాయానికి సరళ కూడ అనుగతవతియే! ఆమె భూత, వర్తమాన కాలానికి పైగా పెఱుగలేకపోయింది. ఆమె పూర్వాచారాల విషయమై అంత తీవ్రంగా ఆలోచించనూ లేదు. అందుచేత తన యావజ్జీవితాన్ని తన భర్త కెప్పుడో (అతడు తన ఆదర్శజీవి అని గ్రహించినపుడే) అంకిత మిచ్చింది. ఇప్పుడూ ఆమె అతని అనుగతవతియే. సరళ మౌనంగా తన పతి కళ్లల్లోకి చూచింది.

అప్పుడే రమేష్ గ్రహించాడు. సరళ తన నిశ్చయానికే ప్రాధాన్యత నిచ్చునని. అప్పుడు

రమేష్ తన గంభీర స్వరంలో ఇలా చెప్పాడు: సరళా! ఈ పేదరికం మనపై త్రోయబడినప్పుడు దుర్భరం గాని మనం అంగీకరించినపుడు అలా గాదు. నారాయణుడు దరిద్రులలోనేగదా సదా నివసించును. అదిగాక సాటి మానవు లనేకులు అజ్ఞానంలో, పేదరికంలో క్రుళ్లుతూన్నప్పుడు నీ ఐశ్వర్యముల సార్థకత ఏమిటి? గుండెలో పుండును మరచి శారీరక సొగసులకై పాటు పడుటలో అర్థమేమిటి? మురికి గుంటలమధ్య పూరికొంపకు నీ 'రే రాణి' మధుర వాసనలు, నీ పంచపక్ష పరమాన్నముల ఘుమఘుమలు ఏం సౌఖ్యం? ఏం తృప్తి? ఐశ్వర్యవంతులు తాము చేయు ప్రతి దుబారాకు తామర్థ మెరుగరు కాని నా దరిద్ర సోదరుని రక్తపుచిఠాలో ఎల్లపుడూ ఖర్చు రాయబడుతూనే యుంది. దిన దిన క్షయమయే ఆ బీదవాని శరీరంపై భాగ్యవంతుని ప్రతి అనాచారము ప్రత్యక్షమే. ఇది సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరుడవలోకించుచునే యుండెను. అందుచే ఆ భగవంతుని దయామయి దృక్కుల రెక్కల మాటున మనం మన సోదరులతో సహా రక్షణ పొందుదాం. మన పరమార్థాన్ని సాధించుదాం.



(ముందు పాఠము తరువాయి).

ఆసన్న భూతకాలము, పూర్ణభూతకాలము, సందిగ్ధ భూతకాలము—ఈ మూడు కాలముల రూపములును సామాన్య భూతకాలమునుండి ఏర్పడును కాబట్టి సామాన్య భూతకాలమునకు సంబంధించిన నియమములన్నియు వీనికిని అన్వయించును.

ఆసన్న భూతకాలము. (Present Perfect tense)

అకర్మక క్రియ వచ్చినపుడు సామాన్య భూతకాల రూపమునకు చివర కర్తననుసరించి **हूँ, है, हैं, हो** లను చేర్చిన ఆసన్న భూతకాలమగును. క్రియయొక్క లింగ, వచనములు కర్తననుసరించి యుండును.

ఉదా:—**मैं आया हूँ** నేను వచ్చియున్నాను.
**वह आयी है** ఆమె వచ్చియున్నది.
**तुम आये हो** మీరు వచ్చియున్నారు.
**ये आये हैं** వీరు వచ్చియున్నారు.

సకర్మక క్రియవచ్చినపుడు కర్మయొక్క లింగ, వచనముల ననుసరించి భూతకాలిక క్రియా రూపములను వ్రాసి, **है, है** లను చేర్చవలెను.

ఉదా:—**मैंने यह किताब पढ़ी है** నేను పుస్తకము చదివియున్నాను.
(**किताब**-స్త్రీలింగము, ఏకవచనము).
**मैंने शेर देखे हैं** నేను సింహములు చూచియున్నాను.
(**शेर** - పుంలింగము, బహువచనము).

కర్మ లోపించినను, కర్మకు ప్రత్యయము వచ్చినను, క్రియ పుంలింగ ఏకవచనమై యుండును.

ఉదా:—**तुमने सुना है** మీరు వినియున్నారు.
(కర్మ లోపించినది).
**मैंने आप को देखा है** నేను తమరిని చూచియున్నాను.
(కర్మతో '**को**' ప్రత్యయము వచ్చినది).

పూర్ణ భూతకాలము. (Past perfect tense)

అకర్మక క్రియ వచ్చినపుడు కర్త యొక్క లింగవచనముల ననుసరించి సామాన్య భూతకాలిక వ్రాసి, భూతకాలిక సహాయక క్రియలగు **था, थे, थी, थीं** లను చేర్చవలెను. (కర్త

పుంలింగ ఏకవచనమైన **था**, బహువచనమైన **थे**, స్త్రీలింగ ఏకవచనమైన **थी**, బహువచనమైన **थीं** చేర్చవలెను).

ఉదా:—**सीता हमारे घर आयी थी** సీత మా యింటికి వచ్చియుండెను.

**वे दिल्ली गये थे** వారు ఢిల్లీ వెళ్లియుండిరి.

సకర్మక క్రియవచ్చినపుడు కర్మ యొక్క లింగ వచనముల ననుసరించి **था, थे, थी, थीं** లు చేర్చవలెను.

ఉదా:—**मैंने यह कहानी पढ़ी थी** నేను ఈ కథ చదివియుంటిని.

(**कहानी** - స్త్రీలింగము, ఏకవచవము).

**क्या आपने ये गाने सुने थे?** తమరీ పాటలు విని యుంటిరా?

(**गाने** - పుంలింగము, బహువచనము).

కర్మ లోపించినను, కర్మతో ప్రత్యయము వచ్చినను క్రియ పుంలింగ, ఏక వచనమందే యుండును.

ఉదా:—**हमने सुना था** మేము విని యుంటిమి.

**मैंने तुमको पढ़ाया था** నేను నీకు చదువు చెప్పియుంటిని.

సందిగ్ధ భూతకాలము

(ఇది భూత కాలములో ఒక పని జరిగియుండునని తెలియజేయునది).

అకర్మక క్రియమైనచో కర్త యొక్క లింగ వచనముల ననుసరించి సామాన్య భూత కాలిక క్రియా రూపము వ్రాసి, **हूँगा, होगा, होंगे' होगे** లను చేర్చవలెను.

ఉదా:—**तुम गयी होंगी** మీరు వెళ్లియుందురు. (స్త్రీలింగము).

**राम आया होगा** రాముడు వచ్చియుండును.

క్రియ సకర్మకమైనచో, లింగవచనములు కర్మ ననుసరించి యుండును. అపుడు పుంలింగ ఏక వచనమందు **होगा**, బహువచనమందు **होंगे**, స్త్రీలింగ, ఏక వచనమందు **होगी**, బహు వచనమందు **होंगी** వచ్చును.

**आपने सिनेमा देखा होगा** తమరు సినిమా చూచియుందురు.

**आपने बहुत से शहर देखे होंगे** తమరు చాల పట్టణములు చూచియుందురు.

**तुमने रामायण पढ़ी होगी** నీవు రామాయణము చదివియుందువు. (**रामायण** - స్త్రీలింగము).

**उसने चिट्ठियाँ लिखी होंगी** అతడు ఉత్తరములు వ్రాసియుండును.

**दफ़्तर** ఆఫీసు.
**चूड़ियाँ** గాజులు. (స్త్రీలింగము).
**मेहमान** అతిథి, చుట్టము. (పుంలింగము).
**चित्र** బొమ్మ, పటము. (పుంలింగము).
**उपन्यास** నవల (పుంలింగము).
**आविष्कार** కనిపెట్టబడినది. (Invention).
**नसीहत** బోధన, (ఉపదేశము) (స్త్రీలింగము) ఏకవచనము).
**नसीहतें** బోధనలు. (బహువచనము).
**नटखट** తుంటరి.
**दरवाज़ा** తలుపు. (పుంలింగము).
**सूत** నూలు. (పుంలింగము).
**चरखा** రాట్నము. (పుంలింగము).
**भेजना** పంపుట.
**चित्र खींचना** బొమ్మ వ్రాయుట (చిత్రించుట).
**तोड़ डालना** విరుగగొట్టుట.
**बंद करना** మూయుట.
**खुला होना** తెరువబడియుండుట.
**(फूल) खिलना** (పువ్వు) వికసించుట.
**सूत कातना** నూలు వడకుట.

**भाई साहब दफ़्तर गये हैं।** అన్నగారు ఆఫీసుకు వెళ్లియున్నారు.
**आपने नई चूड़ियाँ बनवाई हैं?** తమరు క్రొత్త గాజులు చేయించుకొన్నారా?
**राम दो वर्ष पहले मद्रास आया था।** రాముడు రెండు సంవత్సరముల క్రితము మద్రాసు వచ్చియుండెను.
**उन्होंने आपसे यह बात कही होगी।** వారు తమతో ఈ మాట చెప్పియుండవచ్చును.
**उसने ये फल भेजे होंगे।** అతడు ఈ పండ్లు పంపియుండును.
**आज हमारे यहाँ मेहमान आये हैं।** నేడు మా యింటికి చుట్టములు వచ్చియున్నారు.
**यह चित्र किसने खींचा है?** ఈ బొమ్మ నెవరు చిత్రించియున్నారు?
**आपने यह उपन्यास कभी पढ़ा है?** తమరు ఈ నవల ఎప్పుడైన చదివియున్నారా?
**मार्कोनी ने रेडियो का आविष्कार किया है।** మార్కోని రేడియో కని పెట్టియున్నాడు.
**बापूजी ने हमें बहुत सी नसीहतें दी हैं।** గాంధీ మహాత్ముడు మనకనేక బోధనలు చేసియున్నాడు.
**उस नटखट लड़के ने खिलौना तोड़ डाला है।** ఆ తుంటరి పిల్లవాడు ఆట బొమ్మ విరుగకొట్టియున్నాడు.
**रामराव ने अपनी दूकान बंद कर दी है।** రామారావు తన దుకాణము మూసియున్నాడు.
**क्या दरवाज़ा खुला है?** తలుపు తెరచి యున్నదా?
**बाग़ में फूल खिले हैं।** తోటలో పూలు వికసించి యున్నవి.
**हमने यह सूत चरखे पर काता है।** మేము ఈ నూలు రాట్నముపై వడకి యున్నాము.



# ఒక విమర్శ

సుభద్ర (తరుణ సాహితి)

ఆంధ్ర మహిళ అక్టోబరు సంచికలో శ్రీ జె. చిరంజీవి గారు మహిళా ప్రబోధము అనుశీర్షికలో ప్రస్తుత స్త్రీలలో గల లోటుపాట్లను పేర్కొనుచు ఒక వ్యాసమును వ్రాసినారు. ఆ వ్యాసమునందు వారు ఏకారణములు చూపకయే తమ నిందా వాక్యములను సమస్త స్త్రీ లోకముపైనను ప్రయోగించి ఊరకుండుట చేత ఆవ్యాసము వ్రాయుటలో వారి అభిప్రాయమేమిటో, స్త్రీలకు వారి సలహా యేమిటో ఇంకను సువిస్తరముగా, సుస్పష్టముగా తెలియపరచమని కోరుటయే నా యీ విమర్శయొక్క యుద్దేశము.

మొదటనే 'నేడు దౌర్బల్యము స్త్రీ జాతియందు కానవచ్చుచున్నది' అని మొదలు పెట్టినారు. దౌర్బల్య కారణముగా వారు చూపినవి రెండు లోపములు. ఒకటి ఆలోచనా శక్తి నభివృద్ధి చేసికొనరు. రెండు, వ్రాయుట నలవాటు చేసికొనరు. వారి వ్యాసమంతయు యీ రెండు విషయముల పైననే నడచినది. చివరకు "నిన్ను నీవే వెనుద్రోచి కొనుచున్నావు కనుక నీవే తీవ్రకృషి జరుపుము" అని ప్రబోధించి తమవ్యాసమును ముగించినారు శ్రీ చిరంజీవిగారు.

స్త్రీ జాతికి చైతన్య మొసగి ప్రబోధ మొనర్చి మహిళాసముద్ధరణకై చేయూత నీయదలచి శ్రీ చిరంజీవిగారీ వ్యాసము మొదలిడి చివరకు వారికి తెలియకుండగనే, సకారణ నిరూపణ చేయకయే మహిళలను నిరుత్సాహపరచి, వారిని అపహాసించినారు. ఇది బహుశా వారు వ్యాసము రచించిన తర్వాతనైననూ గుర్తించి యుండవలసింది. వారొకటి చేయబూని మరొకటి చేసినారు పొరబాటున అనుకుంటా—

వారన్నట్లు స్త్రీలలో దౌర్బల్యమున్నది. 'అది ఎటువంటిది' అన్నప్పుడే అభిప్రాయాలు మారిపోతవి. సిల్కు చీరలు సింగారించుకొనే స్త్రీ, సిల్కు గురించి ఆలోచించక పోవడం ఒక దౌర్బల్య మనడం సహించలేని విషయం. స్త్రీ కాదు, పురుషుడైననూ సరే తాను పయోగించే ప్రతి వస్తువు యొక్క ఉత్పత్తి ప్రయోజనాలూ గుర్తించుచున్నాడా? ఈ విధముగా, వ్రాసేకలమును గురించీ, కాగితమును గురించీ, ఆ కాగితమును చేసే మిషనునుగురించీ, ఆ మిషను యజమానుని గురించీ, ఆ పనివాళ్ళూ, దాని మంచిచెడ్డలూ ఇల్లాగ ఒక్క కలమునుగురించే ఆలోచిస్తూ కూర్చుంటే చిరంజీవిగారి అభిలాష తీరుతుందా? అల్లా ఆలోచిస్తూంటే ఒక్కకలమన్న మాటేమిటి? ప్రపంచంలో యున్న అన్ని వస్తువులనుగురించీ ఆలోచించాలన్నమాట!

ఎందుకు? ఇంక వేరే పనిలేదా? పోనీ ఆలోచిస్తే ఏమైనా విజ్ఞానం లభిస్తుందా?...

ఆలోచన లేకుండా ఏపనీ చేయకూడదు. నిజమే! కాని ఆ ఆలోచనకీ, యీ సిల్కును గురించి ఆలోచించడానికి తేడాయుంది. మంచీ చెడ్డా ఆలోచించి ప్రతి పనిచేయాలి, కాని మనం ఉపయోగించే ప్రతి వస్తువును గురించీ, మనం చూసే ప్రతీదాన్ని గురించీ వ్యర్థంగా అర్థరహితంగా ఆలోచిచడం అవివేకమనుకుంటాను. దానికి శ్రీ చిరంజీవిగారి జవాబేమిటో?

నే నెవరిని? నా ఆశయమేమిటి అని ప్రశ్నించుకొని తదనుగుణముగా ప్రవర్తించి ఆదర్శ మహిళలుగా ఖ్యాతిగొన్న స్త్రీలు ఎందరు లేరు చిరంజీవిగారూ? వారిలో ఒక్కరూ మీకు కనిపించలేదా? వింత కోర్కెలూ, ఈర్ష్యాసూయాభావములు కృత్రిమ వేషములే సర్వ నారీలోకమునందునూ మీకు కనిపించు చున్నవా? యీ వాదనను మీ రేవిధముగా బలపరచుకొనగలరో ఆశ్చర్యముగానున్నది.

"ఒకప్పుడు పసిపిల్లలవలెను, మరొకప్పుడు చిలుకలవలెను పలుకుచుందురు స్త్రీలు" అన్నారు. మీ మనస్సులో సుహృద్భావమున్ననూ, యీ మాటలు మాత్రము సామాన్య స్త్రీనీ, విద్యావంతురాలినీ గేలిసేయుచునే యున్నవి.

## ఒక విమర్శ

"నలుగురు పురుషులు మాట్లాడుకొను నప్పుడు, స్త్రీ ఒక ప్రతిమను బోలియుండు" అను మీ వ్యాసమునే విధముగా గ్రహించవలెనో ! అర్థము లేకుండ నున్నది. ఆమె ఆ ప్రవర్తనకు కారణము ఆమె ఆలోచనా శక్తి కాదు. పురుషులతో సమానముగా సంభాషించుటకు సంఘములో నా మెకుగల స్థానము బహుస్వల్పము. చొరవగా పురుషునితో సమానముగా మాట్లాడుట కామెకు సంఘాను మతి లేదు. లోక భీతిచేతను, సహజముగ స్త్రీకి గల నెమ్మది తనము చేతను నలుగురు పురుషులలోనూ సరిసమానముగా మెలగని స్త్రీ ప్రవర్తనకు కారణము, ఆలోచన శక్తి ఆమెకు లేక పోవుటయే అనే మీవాదన ఏవిధముగా అంగీకరించ వచ్చును ?

వ్రాయుట నలవాటు చేసికొనుట స్త్రీలు చేయవలసిన రెండవ విషయము, సరే—ఇందులో స్త్రీలు వెనుక బడియుండుటకు వారి సోమరితనమే కారణమట ! ఒక్క విషయము. ఏవ్యక్తి అయినాసరే తన మనస్సులో జన్మించిన భావాన్ని పదిమందికీ తెలియ పర్చకుండా ఉండలేడు. ఇది ఒక్క పురుషునికే కాదు స్త్రీ ప్రకృతి కూడ ఇదే. ఒక భావము అంటూ కలుగకనే పోవాలికాని, భావోదయమైతే ఏసోమరితనమూ ఆ భావ ప్రకటనకు అడ్డురాదు. అందులో సోమరితనం కారణంగా ఎవరిభావాలూ మనస్సులోనే నశించి పోయినట్లు వినలేదు. ఇది అపూర్వము.

చివరకి ఒక్కమాట !

మహిళలకేదో ప్రబోధము చేయాలనే కుతూహలంతో అత్యుత్సాహభరితులై రచన మొదలిడినట్లున్నారు. రాను రాను వారు చెప్పదలచిన భావాలు ప్రస్ఫుటీ కరించలేక, స్త్రీలలో గల ఏవో కొన్ని వారూహించిన లోటుపాట్లు ఎత్తిచూపి, వ్యాసాన్ని ముగించేశారు అని అనుకుంటాను. నా ఉద్దేశం తప్పయితే, వారి భావం ఏమిటో సుస్పష్టంగా సకారణంగా తెలుపు తారని నాతోపాటు సమస్త మహిళాలోకం ఆసిస్తున్నాము—



# సాగర సంపత్తి

### శ్రీ ఆర్. సోమసుందర్

ప్రాతరారంభవేళ పారావారంలో వలనువేశాను. ఆ యగాధ వినీల మహార్ణవంనుండి అపూర్వ రూప సౌందర్య నిలసిత వింత వస్తువులను పైకెత్తాను. అందులో కొన్ని మందస్మితంవలె వెలిగినాయి ; కొన్ని అశ్రుకణాలవలె మెరసినాయి ; మరికొన్ని నవ వధూకపోలంవలె కెంపారినాయి.

దినాంతం మోతతో గుడిసెకు తరలినాను. అట నా భాగ్యలక్ష్మి పాలువోక తోటలో పువ్వు నొకటి నలుపడం తిలకించాను. ఒక్క క్షణం సందేహించి మరి నేను తెచ్చినవన్నీ ఆమె పాదాలముందు ప్రమ్మరించి మౌనముగా నిలబడినాను.

ఆమె వానిని పరకించింది. "ఏమిటీ వింత వస్తువులు ? వీని ప్రయోజనం యేమిటో నాకు తెలియదే !"—అని పలికింది.

సిగ్గు నన్నావరించింది ; తలెత్తలేక పోయాలు, "నేను వీనికై శ్రమపడలేదు ; వీనిని వెలకు కొనలేదు ; ఇవి నా ప్రియురాలికి తగిన బహుమతులు కావు"—అని తల పోశాను.

రేయంతా ఒక్కొక్కటిగా వానిని వీధికి విసరివేశాను.

వుదయం పాంథులా దారిని వెళ్ళిరి. వారా వస్తువులను గొని దూరదేశాల కేగిరి.

(గురుదేవ రవీంద్రుని తోటమాలి నుండి)



# బాధ్యులెవరు?

బరంపురం వాస్తవ్యులు, ఆంధ్ర బ్రాహ్మణ వ్యాపారి కుటుంబీకులునైన శ్రీ ఆర్. కృష్ణమూర్తిగారి కుమార్తె సుందరమ్మ ది 18-10-1950 న, తమ యింటి సమీపమున నున్న శ్రీరామ లింగేశ్వరాలయపు కోనేటిలో పడి ఆత్మహత్య గావించుకొన్నదను విషాదవార్త వారి బంధువుల ద్వారా విన్నాము.

18 ఏండ్ల యువతి—స్ఫురద్రూపి, తగుమాత్రము విద్యావతి, అవివాహిత. ఐదు సంవత్సరములుగ తండ్రి ఆమెకై వరుని వెదకుచుండియు, తమ శాఖలోని వరులు కోరిన కట్నములిచ్చి, లాంఛనములు జరుప నసమర్థుడైన కారణముచే, విఫలుడాయెను. అక్క 3 నెలల పసిబిడ్డను వదలి మొన్న జూలైలో మరణించెను తల్లి పోయినప్పటినుండి తమ్ముళను సంరక్షిస్తూ, తండ్రి యింటిని దిద్దుచుండెను.

ఈ పరిస్థితులలో, చనిపోయిన అక్క భర్తయైన తన మేనమామతో తనకు వివాహము జరిపే సంప్రదింపులు పెద్దలు ప్రారంభించారు. ఈ సంబంధమెంత మాత్రము ఇష్టము లేదనిన్నీ, ఈ విషయము పెద్దల యెదుట చెప్పలేని లజ్జచేత తను ఆత్మహత్య గావించుకొను చున్నదనియు తన సోదరునకు ఉత్తరము వ్రాసి ఆమె ఆ కోనేట పడినది.

ఇది కేవలం లజ్జచేత జరిగిన పనిగా మనము భావించ కూడదు. ఆత్మహత్యకు ప్రోద్బలించిన గొప్ప మనోవేదనను ఆమె అనుభవించి ఉండవచ్చు. ఆ మనోవేదనకు కారణము సులభముగా ఊహించ వచ్చు—ధనాభావముచేత తండ్రి తనకు వివాహముచేయ లేక కష్టపడు చున్నాడు. యుక్త వయస్కయయ్యు, వేరువిద్య, ఉద్యోగము, ఇట్టి కారణములు లేకయే, అవివాహితగా పుట్టినింట నుండుటయు వివాహ ప్రయత్నములు విఫలములగుటయు ఆమెకు ఒక విధమైన అభిమానకరంగా ఉన్నవి. అట్టి సమయంలో వచ్చిన ఒక సంబంధాన్ని తిరస్కరించి, పెద్దల మనస్సు చిన్న పుచ్చుతానే మోనన్న భయము, అవివాహితగా తనకు సంఘములో గౌరవకరమైన ప్రత్యేక స్థానమును కల్పించగల విద్య, స్వయం పోషకత్వము లేక పోవటం, ఈ కారణాలన్నీ పెనగొని, ఆసమయంలో యీమెను కేవలం వివేక శూన్యనుగా జేసినవి.

ఇట్టి దారుణ సంఘటనలకు ఒకటే పరిష్కార మార్గము తోస్తుంది. ఆ పరిష్కారానికి ప్రత్యేకంగా ఆడబిడ్డలను కన్న తల్లిదండ్రులు, సాముదాయంగా సంఘము కూడ బాధ్యత వహించాలి. అనుకూల వరుడు దొరకమి వివాహము ఆలస్యమైన కారణమునకు యువతులు అభిమాన పడి, అవమానముతో క్రుంగ నవసరములేదనే ప్రబోధము యుక్త వయస్కలగు యువతులలో జరుగాలి. అవివాహితలైనంత మాత్రమున సంఘములో తమకు గౌరవస్థానము లేదనే పిచ్చి నమ్మకాలు వారి మనస్సులనుండి తొలగిపోవాలి; వానిని సంఘపు చిట్టాలో నుంచి తుడిచివేయాలి. యుక్త వయస్కలై, అవివాహితలైన కారణముచే తల్లిదండ్రులకు ఆర్థికమైన భారము కాకుండా, సమర్థతకు తగినట్లు పిల్లలకు కూడ స్వతంత్ర జీవనాని కనువైన విద్యను మొదటి నుండియు గరపాలి. తృప్తికరంగా స్వతంత్ర జీవనాలను చేయుచున్న యువతుల నెందరినో పెద్ద పట్టణాలలో చూస్తూన్నాము. కాని చిన్న పట్టణాలలోనూ, గ్రామాల లోనూ ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లోపించుటచేత, కొందరు యువతులు ఇట్టి అవివేకపు పనులకు గడంగుట తటస్థించు చున్నది. తల్లిదండ్రులు, సంఘము కూడ, ఉచితమైన దృక్పథము కలిగేటట్టి విద్యా ప్రబోధములు చేసిననే యిట్టి అవివేకము నివారింపబడును. లేనిచో ఇట్టి విషాద సంఘటనలకు పూర్తియైన బాధ్యత వహించిన వారగుదురు.



# శ్రీ యల్లంరెడ్డి చెంచు కృష్ణమ్మగారి నిర్యాణము (గూడూరు)

గూడూరులో శ్రీ పెళ్లేటి రామి రెడ్డిగారి పేరెరుగని వారు లేరు. గూడూరులోని వారి పేర జరగు 'క్లబ్' దీనికి తార్కాణము. వీరు, కవులుగను, నాటక కర్తలుగను, పండితులుగను ప్రసిద్ధి చెందిరి. వీరి శిక్షణ క్రింద పెరిగి పెద్దదైనది వీరి కుమార్తె చెంచు కృష్ణమ్మగారు.

భర్త చెంచు రంగా రెడ్డిగారు విగత జీవులైనప్పటి నుండియు, "పరోపకారార్థ మిదం శరీర"మని ప్రజా సేవ చేయుచు, శ్రీ గాంధీ మహాత్ముని ఉప్పు సత్యాగ్రహమాది వారి కార్య క్రమములన్నిటి యందు శ్రద్ధ జూపుచు నచ్చిరి. ఖద్దరు పరిశ్రమ, గృహ పరిశ్రమలు, మద్య పాన నిషేధము మొదలగు వానికి కృషి జేయుచు వచ్చిరి. తెనుగు, సంస్కృతములందు మంచి జ్ఞానముండుటచే హిందీకూడా యభ్యసించిరి. ఇంగ్లీషు భాషకు కూడ ఏమరలేదు. పర్వ దినములయందు రేడియోద్వారా స్వకృతములగు హరి కథలను, 'సోదె'లనుచెప్పి, సభికుల నానంద పరచి తమ గాన ప్రావీణ్యమును వెల్లడించిరి. మదరాసు ఆంధ్ర మహిళా సభ సభ్యురాండ్రకు వీరి హరికథా కాలక్షేపములు సుపరిచితములే.

వీరి అధ్యక్షత క్రింద సుమారు 14 సం॥ నుండి స్త్రీల సహకార గృహ పరిశ్రమల సంఘము స్థాపింపబడి నేటికిని అది జయప్రదముగ జరుగుచున్నది. శ్రీ కస్తూరిబాయి విద్యాలయ వ్యవస్థాపకులు శ్రీ రాణా కమమ్మగారికి చేదోడువాదోడుగ నుండిరి. అధ్యాత్మికముగ వారికి శ్రీ రమణమహర్షులు, శ్రీ రామయోగి అదర్శప్రాయులు.

ఇటీవల 1 సం॥ నుండియు వీరు ఆరోగ్యము సరిలేకుండ నుండి తే 18-11-50 ది. ఉదయం 6 ఘంటలకు సునాయాసముగ జీవయాత్ర ముగించిరి. వీరి మరణమునకు విచారించు బంధుమిత్రులకు మా సానుభూతి. భగవంతుడు వీరి యాత్మకు శాంతి నొసగు గాక.

ఆంధ్ర మహిళ.

# విశాఖపట్టణం లేడీస్ క్లబ్

విశాఖపట్నం లేడీస్ క్లబ్బుయొక్క 18-వ వార్షికోత్సవము ఈ నెల తే 18-10-50 దీని శ్రీమతి ఇమ్మానేని లీలావతమ్మగారి అధ్యక్షత క్రింద జరుపబడినది.

సభకు చాలమంది సోదరీమణులు విచ్చేసి వారి కుతూహలమును తెలియచేసినారు. వందేమాతరం "గీతముతో సభ ప్రారంభింపబడి, సంఘ కార్య దర్శినులైన శ్రీమతి పాండురంగి వెంకట రమణమ్మగారిచే సంఘపు సాంవత్సరిక నివేదిక చదువబడినది. తర్వాత అధ్యక్షురాలు స్త్రీ సంఘము, వాని ఉపయోగములను గూర్చి ఉపన్యసించిరి.

ఈ సందర్భమున సంఘ గ్రంథాలయమునకుగాను శ్రీమతి గొట్టుముక్కల సీతమ్మగారు 40/రూ ఖరీదుగల బీరువా నొకటి యిచ్చినారు. శ్రీమతి అయ్యగారి సింహాద్రమ్మగారు వచన భాగవతము, రామాయణము, శివపురాణము, మొదలగు సుమారు 60/రూ విలువచేయు పుస్తకములను బహూకరించినారు.

ఇంకా చాలమంది సోదరీమణులు వారి వారికితోచిన రీతిని పుస్తకములను యిచ్చి సంఘమునకు సహాయపడినారు.

సంఘకమిటీ సభ్యురాలైన శ్రీమతి దువ్వూరి లలితాంబగారు బాలికలచే వివిధ రకములైన వినోదములను చేయించి ఆదినం ఎలక్ట్రిక్ కరెంటుకు అగు ఖర్చు తామే భరించిరి. సంఘ కార్య నిర్వాహక సభ్యురాండ్రైన శ్రీమతి దువ్వూరి లలితాంబగారు, శ్రీమతి అయ్యగారి సింహాద్రమ్మగారును సంఘాభివృద్ధికి ఎంతయో తోడ్పడుచున్నారు.

కుమారి చిన్నకోట లక్ష్మియు ఆమె సోదరియు భరత నాట్య ప్రదర్శనము చేసిరి. వారికి దంతపు పెట్టె సభవారు బహూకరించిరి. శ్రీనివాస కల్యాణమునందలి ఎఱుక చెప్పించుకొను ఘట్టము, కోలాటము, నాటకము భారతమాత నాట్య ప్రదర్శనములలో పాల్గొనిన వారందఱకు తగిన రీతిని బహుమానము లీయబడినవి. సెక్రటరీ అభివందనములతోను, జనగణమన జాతీయ గీతములతోను సభ ముగిసెను.

పాండురంగి వెంకటరమణమ్మ.
ఎనమంద్ర సూర్యకాంతమ్మ.
కార్యదర్శినులు.






# అమృతాంజనము

గాని,

" యధాయధా.... .... .... ....కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తిముల్లోకములను దెల్పఁజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!